# ప్రబుద్ధాంధ్ర

కలాభివర్ధనీపరిషత్తుపక్షమున ప్రకటింపబడు మాసపత్రిక

సంపాదకుడు :- శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

సంపుటము ౫ } రాజమహేంద్రవరము జనవరి ౧౯౩౪ { సంచిక ౧


## పునఃపూజ

ఆంధ్రసోదరసోదరీమణులకు ఈ ప్రబుద్ధాంధ్రపత్రిక చిరపరిచితం గాని కొత్తది కాదు. నా ఆరోగ్యం చెడిపోవడంవల్ల ౧౯౨౯ వ సంవత్సరంలో దీన్ని నిలుపు చేసి నా స్వగ్రామం మహేంద్రవాడ చేరుకున్నాను. ఈ యెనిమిదేళ్ళలోనూ మళ్ళీ ప్రకటించడాని కెన్నోమాట్లు ప్రయత్నించాను; గాని కొనసాగలేదు. సంవత్సరం కిందట రాజమహేంద్రవరం ప్రవేశించాను. ఇప్పుడు దీన్ని మళ్ళీ ప్రకటిస్తున్నాను.

మునపటిలాగే యిప్పుడుకూడా చందా వొక్కరూపాయే; కనక నా దేశీయులకు ఇది మరొక బరువులో చేరదు. ఇందుకు నిదర్శనంగా అనేకులు ఈ పునఃప్రయత్నం చూసి మరీమరీ ప్రోత్సహించారు. సాయంచేస్తా మని మాట యిచ్చారు. కొందరు చేశారు. ఇంకా చేసేవారి సంఖ్య హెచ్చుగానే వుంది.

వెనక చందాదార్లుగావుండిన వారుకూడా చాలా చాలా వుబలాటపడుతూ యెదురు చూస్తున్నారు.

ఈసారి యీ పత్రికలో పద్యాలు ప్రకటించ తలుచుకో లేదు. ఇప్పుడు మనకి వచనవాఙ్మయం చాలా అవసరంగా వుంది. జనసామాన్యంలో విద్య వ్యాపించా లన్నా, విజ్ఞానం వ్యాపించా లన్నా వచనవాఙ్మయమే ఆధారం. ప్రముఖులలో గూడా వచనవాఙ్మయం యెన్నో అభివృద్ధులు కలిగిస్తుంది.

ఈ పునఃప్రారంభం విని వాఙ్మయపోషకు లగు సంపన్నులు చేయూత యిచ్చారు. శక్యవాక్కు లగు గ్రంథకర్తలు సహకరించుతారు. శ్రీఅద్దేపల్లి లక్ష్మణస్వామినాయుడుగారు పూర్వాభిమానంతో తమ సరస్వతీపవరుముద్రాశాలలో ముద్రించి యివ్వడానికి పూనుకున్నారు. అందరికీ నా కృతజ్ఞత తెలుపుతున్నాను.

ఇట్లు
శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

---

## ఆశీస్సు

పత్రికా ప్రారంభమును తెలుపుచు తమ రచనలు కోరగా ఆచార్య సర్. రాధాకృష్ణయ్యగారు మా యుద్యమము నాశీర్వదించుచు ఇట్లు ప్రోత్సహించినారు.

ఆంధ్రయూనివర్సిటీ వాల్తేరు, 15-9-33

అయ్యా!

ఇప్పుడు నేను ఎక్కువ పని తొందరలో నుండినందున మీ పత్రికకు ఎట్టి వ్యాసమును వ్రాయజాలకున్నాను; కాని మీరు ప్రకటింపదలచుకొన్న పత్రికవంటి పత్రిక ఆంధ్రజాతీయపునరుజ్జీవమునకు తోడ్పడగల దని నే నంగీకరించుచున్నాను. ఈ క్రొత్తరూపమున అది విజయము బడయునుగాక యని నేను కోరుచున్నాను.

ఇట్లు
యస్. రాధాకృష్ణయ్య

# 'ప్రబుద్ధాంధ్ర'—పద్యవాఙ్మయనిషేధము

గన్నవరపు సుబ్బరామయ్యగారు

భారతి సంపాదకులు

వెనుక కొన్నియేండ్లు ప్రవర్తిల్లి 'ప్రబుద్ధాంధ్ర' ఆంధ్రుల హృదయమును చూరగొనినది. అది మరల నిపు డవతరించుచున్నది. అందు 'పద్యవ్యాసములను ప్రకటింప' మని సంపాదకు లొక నియమమును బూనిరి. ఈ నియమము పత్రికాప్రపంచమున ననిదంపూర్వము. దీనివలన విజ్ఞానవికాససాధనమగు గద్యవాఙ్మయము విస్తరిల్లుట కవకాశ మేర్పడినది. ఇట్టి విశిష్టనియమముతో పత్రికను ప్రకటింపబూనిన సంపాదకులకు ధన్యవాదములు.

పద్యములు గణయతిప్రాసబద్ధములు. వానియం దుద్దిష్టభావము కొరకు ప్రయాసముతో వెదకులాడ వలసియుండును. కావున వైజ్ఞానిక విషయముల పద్యములరూపమున వివరించుట దుష్కరము. ఒక్కచో సుకరమయ్యును నిష్ప్రయోజకము. అదియును గాక, నాటికి నాడు బహుముఖముల పెరుగుచున్న వాఙ్మయమును మునుపటివలె నీకాలమున కంఠస్థము కావించుకొనుట వట్టిమాట. అట్లుచేయుట కవకాశమును లేదు. ఇపుడు జనసామాన్యమునకు సుఖమయజీవనమునకు వలసిన విషయము లన్నిటితోను మంచిపరిచయ ముండిన జాలును; చక్కని పాండిత్య మక్కరలేదు. అన్నిటను గట్టిపాండిత్యము సంపాదింపగలుగుటయు కలలోని వార్త. ఇక నీదినములలో మానవుని నిత్యజీవితమున కావశ్యకములగు విషయములను 'అక్షరాలా' స్పష్టముగ—అనగా దృష్టికి పదములును, మనస్సునకు వానియర్థమును ఒక్కమారే—తెలుపునట్టి గ్రంథములు వెలువడవలెను. అవి సరళమగు గద్యరచనమున నుండవలెను.

వివిధదేశవాఙ్మయవిజ్ఞానముల సంబంధమువలన నిశాంతనుల అభిరుచులు మారినవి; విజ్ఞానార్జన వాంఛ అతిశయిల్లినది; సంస్కారమునెడ నే ముఖ్యము కుదిరినది. వారిదృష్టి క్రొత్తక్రొత్తపుంతల ముందున కురుకుచున్నది. తదనుకూలముగ ప్రపంచమున నన్నిభాషలయందును వివిధవిజ్ఞానవిషయములను గూర్చిన వాఙ్మయ మనంతముగ విస్తరిల్లుచు తదభిరుచులకు దోహద మొసగుచున్నది. ఆవాఙ్మయమంతయు గద్యరూపముననే యుత్పత్తి నొందుచున్నది.

అన్నిభాషలయందువలెనే తెనుగునను గద్యవాఙ్మయమునెడ నాదినుండియు నాదరము లేకపోయినది. ప్రాచీనాంధ్రగ్రంథములయందు గద్యము విరళముగ నున్నను భావార్థప్రకటనమున పద్యరచనమున కొకమెట్టు పయిననే యున్నది. మధ్యకాలమునాటి ప్రబంధాదులయందును విరళమే యయ్యును గద్యము రాతినారపాకమునబడి కొరకరానికొయ్య యయిపోయినది. ఇంతయేల? నిర్వచన గ్రంథములుగూడ కొన్ని పుట్టి గద్యరచనమునెడ నానాటి యనాదరమునకు నిదర్శనము లయినవి. పదునేడవ శతాబ్దిప్రాంతముల దక్షిణాంధ్రరాజుల ప్రాపున రెండుమూడు, భారతవిష్ణుపురాణాదిగద్య గ్రంథములు వెలసినవి. అవియయిన ననువాదములె కాని స్వతంత్రములు కావు; తుదకు నిండుగ నేని లభించినవియు కావు. శైలిమాత్రము తత్పూర్వపు గద్యము శైలికన్న కొంత సరళముగ నుండుట వానియందలి గుణవిశేషము.

దేశమున నాంగ్లవిద్య పెరుగుచున్నకొలది గద్యవాఙ్మయమునెడ నాదరము పెరుగ జొచ్చినది. అర్వాచీనులలో కీ. శే. కందుకూరు వీరేశలింగము పంతులుగారు గద్యవాఙ్మయ యుగపురుషులని ప్రసిద్ధిగాంచిరి. వారు జనసామాన్యమున కుపయోగించు

విషయములను వస్తువులుగాగొని గద్యగ్రంథములను పెక్కింటిని రచియించిరి. వాని శైలియు వాని యందలి విషయములవలె సరసము, మృదులము నయి చదువరుల మనముల నాకర్షింపజాలినది. కావున నేయది మొదలుకొని ప్రజలకు గద్యవాఙ్మయము పయి నభిరుచి మెండుకొనజొచ్చినది. పలువురు గద్యగ్రంథముల ననేకములను రచియించి గద్యవాఙ్మయమునకు క్రమముగ పుష్టిని సమకూర్చుచు వచ్చిరి. కాని వానియందు తొంబదిపాళ్లు నవలలు, కథలు, పద్యములు, పాటలు విరళముగాగల నాటకములు మొదలగునవే కాని వైజ్ఞానికగ్రంథములు కానరావు. అవియు నించుమించు భాషాగ్రంథముల కనువాదములే కాని స్వతంత్రములు కావు. వానివలన జనులకు గలుగు లాభమును చాలకొలది. రానురాను పాఠశాలల బాలురకొరకు నిస్సారములగు గద్యగ్రంథము లసంఖ్యములు పుట్టగొడుగులవలె బయలుదేరుచున్నవి. వీని యుత్పత్తికి ప్రకృత మమలునందున్న విద్యావిధానము కారణము.

గద్యవాఙ్మయము వృద్ధినొందుటకు పత్రికలు నుపకరించుచున్నవి. రచనావిధానమును, శైలిని పాడుచేయుటకును అవియే యుపకరించుచున్నవి.

శబ్దతత్త్వమును, తత్ప్రయోగౌచిత్యమును, భావార్థప్రకటనసౌకర్యములను దెలియక గణయతిప్రాసబంధముల దగిలియుండుటయే పరమావధిగ చూచుకొని పనికిమాలిన పదములను పేర్చి సులభముగ పద్యములను రచించుట నేటివారికి పరిపాటి యయినది. గద్యరచనము పద్యరచనమువలె సులభమయినది కాదు. ఉద్దిష్టార్థము హెచ్చుతగ్గులులేక స్పష్టముగ దెలియవచ్చునట్లు, ఉచితములగు పదముల నేర్చి, యౌచిత్యానురోధముగ కూర్పవలసియుండును. వాక్యములు నాతిదీర్ఘములుగను, శైలి సరళముగను ఉండవలెను. అనావశ్యకమయినను వ్యర్థపదములతో పెంచుటయు, ఆవశ్యకమయినను విషయమునే త్రుంచుటయు గద్యము ప్రయోజనమును పాడుచేయును. చక్కని గద్యరచనమున చేయితిరుగుటకు కేవలపాండిత్యము సాధనము కాదు. శబ్దార్థముల శక్తి చక్కగా తెలిసియుండవలెను; విషయపరిజ్ఞానము, మంచిఅభ్యాసము కావలెను.

నేటికాలపు పత్రికలును, గ్రంథములును సృష్టించుచున్న గద్యవాఙ్మయమున నొప్పిదమగు శైలి నున్నది యత్యల్పము. పద్యవాఙ్మయమున నంతకంటె నల్పతరము. కాని పద్యవాఙ్మయము విషయమున చింతింపబనిలేదు. పద్యవాఙ్మయము మానసికానందమును గూర్చుటకే అధికముగ నుపయోగించును. అందుకు జాలిన పూర్వగ్రంథము లనేకములు గలవు. పూర్వముగాని, నేడుగాని లేకున్నది అనవద్యమగు గద్యవాఙ్మయము. శరీరమునకు సౌఖ్యమును గూర్చు జ్ఞానమును ప్రజలకు పంచిపెట్టుటకదియే ప్రధానసాధనము. దానికి సంప్రాప్తమయిన దుర్దశకే యిపుడు చింతిలవలసియుండునది. శరీరసౌఖ్యము గుదురనపుడు మానసికానందము దేనను కలుగజాలదు.

ఇట్టియదనున 'ప్రబుద్ధాంధ్ర' యందు పద్యవాఙ్మయమును నిషేధించి, గద్యవాఙ్మయమునకే ప్రాధాన్య మొసగి తదభివృద్ధికి మార్గముదీసిన తత్సంపాదకుల నెంత యభినందించినను చాలదు. కాని పద్యవాఙ్మయనిషేధనముతోడనే వారి బాధ్యత తీరిపోవునది కాదు. గద్యరచనములయందును ఆదర్శప్రాయములగు మేలివానినే వారు ప్రకటించుచుండవలెను. అటులయిననే వారి పత్రిక 'ఛిద్రోడసికతాన్యాయము' ననుసరించి వాఙ్మయమునకు, ప్రజలకు నొకింతయైన మేలుకూర్చునది కాగలదు; తన పేరును సార్థకపరుచుకొనునదియు కాగలదు.

నూతనగుణసంపన్నమై యాంధ్రలోకమున నవతరించుచున్న 'ప్రబుద్ధాంధ్ర' కాంధ్రలోకము సహృదయతతో స్వాగతము చెప్పి తత్సంపాదకులకు విశేషముగ ప్రోత్సాహము గలిగించదగును; పత్రిక ద్వారమున స్వయమును ప్రబుద్ధము కాదగును.

---

# జాగ్రత్తపడవలసిన ఘట్టాలు

సుబ్రహ్మణ్యశాస్త్రి—సంపాదకుడు

"బారెడు పొద్దెక్కిం దప్పుడే. వూరందరూ పాచీ పనీ చేసేసుకున్నారు; గాని మా కింకా కోడే కుయ్యలేదూ"

"........................"

"మొగుడాడు నాలుగ్ఘళ్ళరాత్రివేళే లేచిపోయినా, చద్దన్నాలవేళదాకా గదిలోనుంచి యివతలికే రాకపోతే యింకెలాగా వేగడం?"

"........................"

"లేవడానికి తొందర అక్కర్లేదు; గాని లేచిన వెంటనే కాఫీ కాచుకోడానికి మాత్రం పరుగూ. ముందు కుంపట్లో నిప్పు పడేసే తరవాతి మొగం కడుక్కోవడం. ఛీ! గేదీ తాగుతుంది కుడితి"

"........................"

"రెక్కల్లో సత్తువ వుంది కదా చెయ్యక యేం చేస్తుందని దిలాసా. అత్తముండలు బతికి వుండవలసిన రోజులు కావివి"

"........................"

"వాగివాగి అదే వూరుకుంటుందని మొండితనం కూడానూ. సిగ్గూ బిడియమూ, భయమూ భక్తీ లేని వాళ్ళ నెన్నంటే మాత్రం యేం లాభమూ?"

"........................"

"రెండుఘళ్ళ పొద్దెక్కేదాకా పడుకుంటే నాకు మాత్రం సాగదా యేమిటి?.....కాని "నీకూడా సిగ్గులేదా" అని చివరికి నాకే గడ్డి పెడతారు లోకులు. మంచయినా చెడ్డయినా యజమానులకే గాని మధ్యసత్రగాయ పీనుగులకేం వుంది?"

"........................"

"వొకటీరెండూ కాదు, పదిహేడేళ్ళు వెలిగించాను కజ్జాకోరు అత్తగారి దగ్గిర కాపరం. కిక్కురుమని యెరగనెప్పుడూనూ. తూర్పు తెల్లవారుతోందనగా మొగం కడుక్కొని చీపురుకట్ట పుచ్చుకుంటే ఝాంపొద్దెక్కేదాకా వొకటే తుడుపూ. ఆకాలంలో యిలా అయితే మేం కాపరం చేశామే"

"........................"

"మనలాగే వైదీకంలో వున్నవాళ్ళ పిల్లని చూడమని యెన్ని విధాల పోరినా, యిదేవో మంచి సంప్రదాయం అని మురిసిపోయారు; గాని నా మాట విన్నారా? ఏది యెలాగయినా యీ మాల కూడేమీ యెరక్కుండా చివరికి ఆ మహారాజు బాగానే దాటారు; గాని యిద్దరివంతూ నాపాల బడింది"

"........................"

"దానిల్లు వల్లకాడుగానూ, ఈ కొంపలో గాజులమలారం దింపడం యెప్పుడేనా తగులడిందా? ఇంకో రెండు జతలు బంగారపువే యేడవరాదూ! ఏంలోటూ!"

"........................"

"రామరామా! వాకలంతా వుల్లిపాయలపొట్టే. నేను తుడవలేను బాబూ నానా పెంటలూనూ"

"........................"

"రోజూ నాచేత గోమూత్రం తాగించాలని—నన్నేడిపించే పీనుగులు పుచ్చి పురుగులోడిపోరూ? మళ్ళీజన్మలో మాలమాదిగల్లో పుట్టరూ? దేవుడు లేడూ?"

"........................"

"వాకట్లో తుక్కుంటే వాడు గింజుకుంటాడు. పోనీ నానాగడ్డీ పెరట్లో వెయ్యవద్దని బుద్ధి చెబుతాడా అవతలివాళ్ళకి?"

"........................"

"ముసిముసి నవ్వులు నవ్వుతూ—అవన్నీ దొంగవేషాలు. నాకు తెలవదూ? ఇంటికి వచ్చాటప్పటికి తిక్కుతూ తారుతూ యెదట నుంచుంటే యిక వాళ్లు తెలిస్తేనా అవాజమ్మకి?"

“..............................”

“మేం యెరగమమ్మా యీ సానిటక్కులూ. వాకట్లో మొగాడి కెదురుగా నుంచుని—ఛీ! తలుచు కుంటేనే ప్రాణం చచ్చిపోతోంది”

“..............................”

“సంసారిపీనుగులే యిలాగ నడమంత్రపు వేషాలు వేస్తే యిక భోగంవాళ్ళెందుకూ అడుక్కో వాలిగానీ”

“..............................”

“అమ్మయ్యా, రామయ్యతండ్రీ! నడుం పడి పోయిందోయి నాయనా! అరవైయేళ్ళకే ముద్ద చేసి మూలపడేస్తావా మహారాజా!”

“..............................”

“ఇదీ వొక దారే. మూడు యజ్ఞాలు చేసింది రామసోదెమ్మ. చచ్చేముందు నాలుగుమాసాలు మంచంపట్టి—అవి కిరస్తాని నీళ్ళా, అది మాల కూడా, అవి యీసడింపులా—మహాప్రభో! పగ వాళ్ళకేనా వొద్దు అలాంటిది. కిందపడేసీదాకా వొకళ్లచేత చాకిరీ చేయించుకొనే యోగంమాత్రం నాకు కలిగించకుసుమా తండ్రీ!”

౨

“పొద్దుమొహం. మంచం దిగాటప్పటికి తయారూ దిష్టిపిడతలాగ. ఇంతకంటే నల్లపిల్లి మొహంనయం”

“..............................”

“నేను చీకటితోటే లేవకపోతే తన పుట్టిం మునిగిందీ? యేచిన్నకథో యే నవలో చదువు కుంటూనో, కులాసాగా కబుర్లు చెప్పుకుంటూనో మేము రాత్రి వొంటిగంటదాకా మేలుకొంటాం గనక నాకు తెల్లవారగట్ల గాఢనిద్ర పట్టిపోతుంది. నేను పెందరాడే లేవనందుకు వారికిలేని బాధ తన కెందుకూ?”

“..............................”

“ఎవర్నో ఆడిపోసుకుంటూ కూచోడమేకనక తన కెప్పుడూ నిద్రే పట్టదు. తన కర్మం, నాకేం కళ్ళనిండా నిద్రపోకుండా యిదవడానికీ?”

“..............................”

“చాకిరీ చేసుకుంటేగాని సాగనివాళ్లూ, తన లాంటి దరిద్రగొట్టుపీనుగులూ లేస్తారు తెల్లవార కుండానూ. నా కర్మం యేం కాలిందీ?”

“..............................”

“తెల్లవారకుండా లేస్తుందని గోదావరికి వెళ్ళి స్నానం చెయ్యడమూ, రామా కృష్ణా అనుకొంటూ కూచోడమా? ఎంతసేపూ యెవర్నో దెప్పడమూ, చూసి వోర్చలేకపోవడమూ—యెప్పుడూ వంకర బుద్ధే. ఛీ! పాకీదీ బయలుదేరుతుంది చీకటితోటే చీపురు పుచ్చుకొని”

“..............................”

“మానమునా, అభిమాన మునా? బోలెడుజీతం పుచ్చుకొనే దాసీపీనుగుండగా తన కెందుకూ ఆ పుణికింతాలూ! తను చేస్తే నేనుకూడా చెయ్యక పోతానా? చెయ్యకపోతే సొరంటూలు పెట్టవచ్చు గదా—మొగం నేలబెట్టి యీడిపిస్తానుగాని వాకలి తుడుస్తానేం నేనూ?”

“..............................”

“కాఫీకోసం నేను కుంపటి అంటించాటప్ప టికి లబోలబో అని మొత్తుకుంటుంది గదా ఆదేం పుట్టుకో గాని. నేను చేసుకొంటూన్నందుకూ, పుచ్చుకుంటూన్నందుకూ గింజుకోకపోతే తనకా యోగం లేనందుకు యేడవరాదూ?”

“..............................”

“మామయ్యగా రెప్పుడేనా నోరుచేసుకు అడి గినా కాఫీ యిచ్చి యెరగదీ యిల్లాలు. యెంత సేపూ యేకారంరాసిన అటుకులో యిన్ని మొగాన కొట్టి చెంబెడు మంచినీళ్ళు తాగమనేది. సరసం యెరిగి వుంటేనా?”

“..............................”

“వోమాటు ఆ విసిరికొట్టడం చూసి నేను నోటిదగ్గర పెట్టుకోపోతూవున్న కాఫీ పట్టుకువెళ్ళి

యిచ్చాటప్పటికి పాపం బ్రహ్మానందపడుతూ పుచ్చుకొన్నారు. కాని యెంత రగడపెంచిందీ ఆవేళ? మరిచిపోతానా!"

"............................"

"నిజంగా చచ్చే సుఖపడ్డారాయన. ఆయన నవ్వుతూ మాట చెప్పవస్తే ఘుమఘుమ లాడుతూ అందుకొనే దీవిస. ఆసాడు మొఘమ్మీద నవ్వే కనపడదమ్మా అదేం పాపమోగాని"

"............................"

"మావుల్లిపాయల పులుసుకోసం గోల పెట్టవద్దని యెన్నిమాట్లేనా గడ్డిపెట్టారుమామయ్యగారు. వింటేనా? ఇంతకీ: తను వండాలా పెట్టాలా? నల్లరాయి నయం యింతకంటేను"

"............................"

"మేము నాటకాలకేనా సినిమాకేనా వెడితే కళ్లల్లో నిప్పులు పోసుకుంటుంది. వీధిభాగోతాలూ, బొమ్మలాటలూ అయితే తను పరిగెత్తవచ్చు"

"............................"

"కొడుకు విస్తట్లో కాస్తమీగడ వేస్తేనే కళ్లు చిమచిమ లాడిపోతాయి. ఇక నేను కాఫీ పుచ్చుకుంటే కళ్లల్లో కారం చల్లుకోటం ఆశ్చర్యమా?"

"............................"

"గోచీపెట్టి బట్ట కట్టుకుంటే "కోమటిపద్ధతులు మేం యెరగం బాబూ" అంటూ గుర్రాలకళ్లాలాగ మొగం ముడుచుకుంటుంది. గూడకట్టు కట్టుకుంటే "భోగం పీనుగు" లంటూ వూళ్లోవాళ్లని కూడా దీవిస్తుంది. నూర్లూ, నూటయాభైలూ పోసి కొనుక్కొన్న దక్షిణాదిచీరలూ, బనారసు చీరలూ కట్టుకొంటూ మడికచ్చా పోసుకోనా?"

"............................"

"శిఖ చుట్టుకుంటే వోర్చలేదు కదా! జారుముడి వేసుకుంటే చూడలేదు కదా! తల్లో పువ్వులు ముడుచుకుంటే గుడ్లు మిటకరించుకుంటుంది కదా! యిక యీ దెయ్యాన్ని నేను పెద్ద చేస్తానేం?"

"............................"

"కొడుకు చెయ్యమన్న కూర యెప్పుడూ చెయ్యకదా? నేను మడికట్టుకొని చద్దన్నాలపాయి నిప్పు వెయ్యనిరోజు వారికి యేకాదశేగదా?"

"............................"

"కొడుకునే అన్నివిధాల పీడించే తల్లిపిన్న కోడలికి "అత్తయ్యగా" రవుతుందా!"

"............................"

"మెడలో రుద్రాక్షతావళిం వేసుకుంటే వస్తుందా యేమిటి యెత్తుకుపోవడానికి విమానం? నన్నూ నాలాంటివాళ్లని తిట్టే తిట్లు లెక్కపెట్టడాక్కాని జపం వేసుకోడానికా యేమిటి పూసలు?"

"............................"

"ఈసాటికే నీళ్లు మరిగిపోతాయి. ఊరంకా, యేడుపుకి విరగడ అంటూ లేదు. యేపని. హాయిగా కాఫీ పుచ్చుకొని నిన్న చేసిన ఖర్చులు పద్దు రాసుకోకుండా ఈ దిక్కుమాలిన గొడవ యేమిటి నాకూ? ఇంకా రైతులికి రాసిన వుత్తరాలికి నకళ్లు కూడా రాయాలి. బాబోయ్! అప్పుడే ఆరున్నర అయిపోయింది. వచ్చేశారో వచ్చేస్తున్నారో! పొడిబట్టలు కట్టుకొని, క్రాపింగు దువ్వుకొనేటప్పటికి కాఫీకప్పు నోటి కందించేదానికి నాకీవేళ యింత బద్ధకం వచ్చిందేమిటమ్మా!

3

"ఇంత చెమట పట్టిందేం యివాళా!"

"ఫాల్గునమాసం జొరబడింది, ఆశ్చర్యమా యేమిటి? కాకపోయినా వేడివేడి కాఫీ పుచ్చుకొన్నది మొదలు తిరగడమే అయె. ఇక ఆరడానికవకాశం యేదీ?"

"చొక్కా తీసెయ్యండి విసురుతాను"

"వుంటేగానే బాగుంటుంది"

"అయితే కండువా — నేను తియ్యగూడదూ?"

"నేను తియ్యకపోతేగా?"

"చూస్తూ నుంచోనా నేను?"

"నువ్వు కండువా జాగ్రత్త చేసి వచ్చేదాకా పూసుకుంటూ కూచోనా నేను?"

"బాగానే వుంది"

"ఇంకేం మరీ?"

"........................"

"కొంచెం నింపాదిగా"

"........................"

"ఇంకా కొంచెం"

"ఏం?"

"అంతగట్టిగా విసిరితే నీకు చేతులు లాగుతాయి. పైగా నీకు చెమట పడుతుంది. నాకు నువ్వూ, నీకు నేనూ—"

"వూరుకోండీ"

"తప్పేం? అసలందం చెప్పవలసివస్తే అందు లోనే వుంది"

"ఆ—వ్వ"

"పోనీ—చూడూ. పాలమూరునుంచి రామ దీక్షితులు మామగారు వచ్చారు"

"ఏరీ?"

"బజారు పని చూసుకొని పదింటికి వస్తారు"

"భోజనం యిక్కడేనా?"

"ఆహా!"

"అయితే, వంట అయిపోయినట్లుంది. అరిటి కాయ పప్పులో వేసింది కాబోలు, బాగుం టుందా?"

"బంగాళాదుంపలు వేయించు నువ్వు"

"........................"

"ఇళ్లు మరీ"

"వాళ్లు కాస్త ఆరనిస్తారా?"

"ఆయనికి పొద్దు—అసలు కాఫీ పుచ్చుకో కుండా బయలుదేరరు గాని ఆయన—"

"ఇంకేం? కాకపోయినా పల్లెటూరివారికి పది గంట భోజనం ఆలస్యం కాదులెండి"

"ఓగడ మేమైనా వుందేమో"

"సారి. మీకే వుంచదూ మీఅమ్మ"

"దాని గుణం అది మానదు. ఏంచెయ్యం?"

"........................"

"అప్పుడే అందుకుంది చూశారా? ఈగోడ పక్కని నక్కొందండీ మీరింటోకి రావడం చూసీ. మీరూ నేనూ యింటో వుంటే పొంచుండి వింటుం దండీ. వొక్కమాటు చీవాట్లు—"

"వూరుకో. నామాట విను"

"నేనూరుకోను. నన్నలా తిడుతూవుంటే—"

"ఇప్పటిదాకా వున్న మంచంతా యేమైపో యిందీ?"

"మంచీ, మంటిగడ్డలూనూ. మంచివాళ్లకి మం చిగాని మంకు పీనుగులికేనా? ముక్కుకి మసిరాసు కొని అలాగ—అలాగ మీదకి వస్తూవుంటే—ఏం? ఎంచేతా? ఎందుకూరుకోవాలీ? నీకుందా భయం? నీకుందా సిగ్గూ?"

"అమ్మా!"

"అమ్మా బొమ్మానూ. అలా కెచ్చిపోతూవుంటే చచ్చుపెద్దమ్మలాగ వూరుకుని నాకోసం యేడుస్తా వేమిట్రా? నీసిగ్గు బుగ్గిగానూ. నువ్వు మొగపీను గువు కావుట్రా?"

"నీసిగ్గు చిమడాలి. నీబుద్ధి బూడిదకావాలి. నువ్వు ఆడదానివే? నువ్వు తల్లివే? దేవుడులాంటి కొడుకు నిలా తిట్టేమనిషి—"

"నువ్వు పెళ్ళానివే? నిక్షేపంలాంటి నాకొ డుక్కి మందులుపోసి, వాడిబుద్ధి విరిచేసి, నామాట వినకుండాచేసి—"

"నీమాట రేం వినడం లేదమ్మా నేనూ?"

"ఏం విన్నావు నాయనా? నన్నేం చెప్పనిచ్చా వు నాయనా? దాన్ని అణచగలిగేవా? దానికి భయభక్తులు చెప్పగలిగేవా?"

"నువ్వణిగేవా నేనణగడానికి? నీకు భయభక్తు లున్నాయా నాకుండడానికీ? నోరులేనిదాన్ని చేసి—"

"నీకే నోరులేకపోతా? నీకే వాయిలేకపోతా? రాకాసిలాగ అలామీద పడుతున్నావు—"

"నీకంటేనా? నీకళ్లకి నేను రాకాసిలా వున్నానా? దెయ్యపుకళ్లు. పిశాచపునోరు. ఛీ!"

"వూరుకోవూ?"

"పెళ్లాం పీనుగుని గడ్డం పట్టుకొని బతిమాలుకుంటావుట్రా సిబుదుకు—"

"పోనీ నువ్వువూరుకో అమ్మా"

"దాన్ని లొంగదీయ లేవుగాని నన్నాజ్ఞ పెట్ట వస్తావా? పెళ్లాం పీనుగమాటవిని తల్లిని లోకువ చేస్తావా?"

"నువ్వే లోకువ? నువ్వే తీసికట్టు? నీతో సరిగ్గా మొగాడైనా జవాబు చెప్పగలడా?"

"నువ్వు నంగనాచివా? నువ్వు—"

"మొగుణ్ణే యెగేసి తెగనరికేవు కొడుకు లెక్కా నీకు?"

"మొగుణ్ణి వాజమ్మనిచేసి కూచోపెట్టావు. నీకు అత్తగారు లెక్కా యిక?"

"అమ్మా! రామదీక్షితులుగారు వచ్చారు. మన యింటికి వచ్చేవేళ అయింది. నా మర్యాదా తక్కనివ్వవూ?"

"రామదీక్షితులు వస్తే రానియ్యి. నాకేం భయమా? తేరతిళ్లు తినడానికి వచ్చేవాళ్లని అత్తెపెడతానేం నేనూ?"

"తేరతిండి కోసం వస్తున్నారా ఆయనా? వూరుకుంటారేమండీ?"

"వూరుకోకపోతే వురిపెట్టుకోమను. లేకపోతే నువ్వుపెట్టు. నీకడ్డేం? నిన్నెవళ్లేం చెయ్యగలరూ? ఇదితరకే కుక్కనిచేశావు. వురిపెడితేమాత్రం నీకు సాగదూ?

"అమ్మా! నన్నేమన్నా సంతోషమే; గాని యింటికి వచ్చిన పెద్దమనిషి—"

"పెద్దమనిషా? యెలాంటి పెద్దమనిషి? నెలకి నాలుగురోజులు నెత్తిమీద కూచునే వాడు పెద్దమనిషంటే యేమిటి?"

"అయ్యో, అయ్యో! ఈ మాటలు బాబుగారు వింటే యింకేమన్నా వుందా? మర్యాదా నిలుస్తుందా? నలుగురిలోనూ తల యెత్తుకోగలమా?"

"నీకేవుంది మహామర్యాద. నీకేవుంది గౌరవం. నీకే పట్టింది యింటి పరువంతానూ"

"దానికేంగాను, నీకేపట్టింది. నిజమే. అయితే ఆపరువు తక్కించుకోడం యిలాగేనా?"

"ఇలాగేనా అంటే మరెలాగ? నేను పప్పుకూరా, చారూ చేసివుంచితే మళ్ళీ తను బంగాళా దుంపలు వేయించడానికి సిద్ధపడుతుందా! నేను కొంత వడ్డనా, అది కొంతవడ్డనానా?"

"వారియింటికి వెడితే నన్ను మనుగుడుపు పెళ్లికొడుకుని చూసినట్లు చూస్తారు. దిక్కుమాలిన పప్పుకూరా ఆయనకి వడ్డించడం?"

"పల్లెటూరివాళ్లకి అంతకంటే యెక్కువ వస్తుందేం? కాకపోయినా, రెండోమనిషి వడ్డనలోకివస్తే నా మర్యాదా యేదింకా?"

"పోనీ బంగాళా దుంపలు నువ్వు వేయిస్తావా మరీ?"

"వేయించవద్దూ మరి నీ సెలవయ్యాక? ఇవాళ కన్ను తెరిచిన పీనుగువు, నువ్వుచెబితే నామడితగులడిపోయినా సరే, నానిష్ఠ గంగలో కలిసినా సరే యిక చేతులుకట్టుకొని చెయ్యొద్దూ?"

"అదండీ యేడుపూ? మీరు చెప్పించిచస్తే యిక తన పెత్తనం యేదీ అని. చూశారా?"

"చూడ్డం యెందుకూ? చూసేం చెయ్యగలవే నువ్వూ? నీ వల్ల యేమవుతుందే?"

"యేమవుతుందా? యేం చెయ్యగలనా?—"

"వూరుకో నువ్వు. అమ్మా!"

"ఏం?"

"నీహద్దులో నువ్వుంటావా, మాటదక్కుతుంది. లేకపోతే లోకంతో పాటే. తెలిసిందా?"

"ఏమిట్రా తెలిసేదీ?"

"వీధిలో పడితే పోయేదేమీ లేదు; గాని అయినా యెందుకని చూస్తున్నాను. నువ్వు నీతాహతేమిటో, నీహాయా మెంతవరకో ఆలోచించుకోడం లేదు. నీకు తోచకపోతే యెవర్నైనా అడుగు

నువ్వు దానికి అత్తగారి నంటే నుట్టరికం లోనే నీ అత్తరికం గాని వ్యవహారంలో కాదు. నాన్న బతికి వున్నంతకాలమూ నువ్వేమన్నా చెల్లింది. నీ పెత్తనం సాగింది.

"ఇప్పుడు మాత్రం యెందుకు సాగదూ!"

"ఎందుకు సాగదూ అంటే సాగనివ్వను కనక. ఇక నువ్వే తప్పించుకోవాలి. నీమర్యాదా, మా మర్యాదా కూడా నిలవాలంటే నువ్వీ పద్ధతి కట్టిపెట్టాలి. వీధిలోకి వెళ్లి వ్యవహారం చేసుకొనే వాణ్ణి నేను. నాకష్టసుఖాలను బట్టి, నాపిలు చాళ్లను బట్టి యింటోవాళ్లు మసులుకోవాలి. నీకది యిష్టం లేకపోతే యిక నీకు వున్న గోడు గూడా నిలవదు"

"నిలవక యేం చేస్తుందీ?"

"గంగలో కలుస్తుంది. అడిగేదేమిటి?"

"నన్ను గంగలో కలుపుతావుట్రా?"

"ఇక పెద్దరాలు మానెయ్యి. ఏమంటావు? నా చెప్పుచేతల్లో వుంటావా వుండవా?"

"పెళ్లాంపీనుగు చెప్పినట్లల్లా తగులడతావుట్రా?"

"నాయింటో నా పెళ్ళానికుండే స్థానం వేరూ. నీకుండే స్థానం వేరూనూ! మీ రెవళ్ల స్థానంలో వాళ్ళుంటే నాస్థానం నాకు తప్పుతుంది. నాస్థానాన్ని నేను నిలుపుకోవాలంటే యిక మొగమాటం కట్టిపెట్టవలసి వస్తుంది."

"నన్ను మనోవర్తి పీనుగులా వుంచమంటావా?"

"నీకు చాకిరీ అక్కర్లేదు. కంగారక్కర్లేదు. పెట్టినకాడికి భోజనం చెయ్యి. రామాకృష్ణా అంటూవుండు. కావలసింది చెప్పి చేయించుకో. ఇక నీవు రాణీగారికి సాగినట్లు సాక్కపోతే—"

"నా రాణీతనం నాడే కాలిపోయింది"

"ఇంకేం మరీ! దేనికేనా హద్దుంది. ఆ సంగతి తెలుసుకోకపోతే చిక్కొస్తుంది"

"........................."

"ఏమంటావమ్మా?"

"నేను బతికి వున్నంతకాలమూ పెత్తనం నాది కాని మరొకళ్లది కాదు. నన్ను వొకళ్లేమీ చెయ్యలేరు. అయినవాళ్ళూ కానివాళ్ళూ నాయింటో పెత్తనం చేస్తూవుంటే నేను చూడలేను"

"అది బాగా నిశ్చయించుకొన్న మాటేనా?"

"ఏమయితే నీకేం?"

"నేనడిగే దానికి జవాబు చెప్పాలి"

"నేను చెప్పను. నన్ను నిలవబెట్టి అడగడానికి నీకేం అధికారం వుందీ!"

"నాసంగతి నీకు బాగా తెలుసు. నేను మాటంటే తిరగను సుమా"

"నా సంగతీ నీకు తెలుసు. అన్నమాట నేనూ తిరగనూ"

"తొందర పడకండీ"

"దూరంగా వుండు. ఏమమ్మా? అంతేనా?"

"ఆహా!"

"సరే—"

"వొద్దు సుమండీ, నన్ను చంపుకుతిన్నట్టే. నేను చచ్చినట్టు పడివుంటాను. అల్లరి చెయ్యకండి"

"ముందు చేతులు వదులు. మాట్లాడకు. ఈపూటతో వంటలు వేరూ—"

"అయ్యో, అయ్యో! నా మాట వినరూ?"

"వెళ్లి తొరగా ముడికట్టుకుంటావా లేదా?"

"అంతపట్టుబడితేయెలాగండీ! నామాటకాస్త—"

"నోరెత్తవద్దు"

"నే నేం చేతునమ్మా!"

"నే నేం చేతునమ్మా యేమిటి యింకానూ? నసాళం అంటేదాకా తిర్రపెట్టావు, యేమీ యెరగనట్లు నటిస్తున్నావు. ఎంతదానవే నీ మొగం మండా. చలితేలులాగ యెంతపని చేయించావే నీవాళ్లు మండిపోనూ. పెళ్ళాం పీనుగు మాట విని యింతపని చేస్తావుట్రా? వోరి చవలవాజమ్మా నువ్వికసంసారం చెయ్యగలవుట్రా? నా పెత్తనం తప్పించి యిక నువ్వు ముందుకు వస్తావుట్రా?"

# ప్రాచీనకాలపు జనాభాలెఖ్ఖలు

మారేమండ రామారావుగారు ఎమ్. ఏ. బి. ఇడి

ఆధునికకాలమున బదిసంవత్సరముల కొకసారి ప్రభుత్వమువారు జనాభాలెఖ్ఖలను వేయించుట యెల్లరకును విదితమే. దీనివలన రాష్ట్రమున కార్థికముగను రాజకీయముగను బెక్కులాభములు గలుగగలవు. ఈ యాచారమును బాశ్చాత్యులీదేశమున బ్రవేశపెట్టలేదనియు, భారతదేశమున బ్రాచీనకాలము నుండియు నిట్టి యాచార ముండినదనియు ననేకప్రమాణములవలన దెలియుచున్నది.

చంద్రగుప్తమౌర్యుని కాలమున మన దేశమున కేతెంచి యిచ్చటి పరిస్థితులను గమనించిన మెగాస్థనీస్ అను యవనదేశీయు డాకాలపు బ్రభుత్వవిధానమును వర్ణించుచు "...మూడవతరగతికి జెందిన యుద్యోగులు గొందరు గలరు. వీరికి వర్ణమత వివక్షత లేక జనులలో గలుగు జననమరణములను విచారించు టొక ముఖ్యకర్తవ్యము." అని వ్రాసినాడు. కౌటిల్యుని యర్థశాస్త్రమునం దీవిషయమును గూర్చి విశేషాంశములు గలవు.

నేడు జనాభాను దీయు నియోగము దాత్కాలికముగ నిర్మింపబడి యనతికాలమున, గార్యమయిన వెంటనే యుపసంహరింపబడుచున్నది. చంద్రగుప్తుని కాలమునం దిట్టి నియోగ మొకటి శాశ్వతముగ నెలకొల్పబడియుండి యెల్లకాలమును పనిచేయుచుండెడిది. మఱియొక విశేషము. ఈ నియోగము కేవలమును జనసంఖ్యనే గాక జనుల యాదాయవ్యయములను, దేశమునందలి గృహారామక్షేత్రాదికములను, రాష్ట్రీయదాయమును గూడ లెఖ్ఖించుచుండినది. సమాహర్తయనునతడీనియోగమునకు బ్రధానాధికారి. దేశమంతయు నాల్గు విభాగములుగ జేయబడెను. ఒక్కొక్క విభాగమునకు స్థానికుడను నొక యుద్యోగి యుండెను. ఇందలి గ్రామములలో నైదింటి కొక గోపుడను నధికారి యుండెను. ఈ యుద్యోగుల కార్యములను బరీక్షించుటకై ప్రదేష్టలు (Inspectors) లుండిరి. వీరందరును గాక సమాహర్త ప్రత్యక్షనియమమున గొందరు చారు లుండిరి. ఇతరోద్యోగులతో జోక్యము లేక వీరును విశేషములను గ్రహించుచుండిరి. గోపు లనెడి గ్రామాధికారులకు, గ్రామములలోని నాలుగు వర్ణముల వారి సంఖ్యను గన్గొనుట; వృత్తులనుబట్టి కర్షకులు, గోపాలకులు, వర్తకులు, పారిశ్రామికులు, నని వారిని విభజించుట; ప్రతియింటను గల స్త్రీపురుషబాలవృద్ధుల సంఖ్యను శీలమును, కుటుంబాదాయవ్యయములను లిఖించుట; పశువులను లెఖ్ఖించుట, పన్ను నిచ్చెడి భూములను, ఈయనివానిని దెలిసికొనుట; గ్రామమునుండి వసూలు చేయబడు బంగారము, సుంకములు మున్నగువాని పరిమితిని నిర్ణయించుట—మొదలగునవి కర్తవ్యములు. సమాహర్తచే నియమింపబడిన చారులు గూడ స్వతంత్రముగ నీయంశములను గూర్చి విచారించుచుండిరి. అదిగాక, వీరలు గ్రామములలో రాకపోకలు చేయువారి సంఖ్య, అందులకు గారణములు, అనుమానింపదగిన ప్రవర్తన గలవారు—మున్నగు విషయములను గూడ చూచుచుండిరి. గృహస్థులవలెను, తాపసులవలెను, చోరులవలెను మారువేషములు ధరించి వీరు తమ ధర్మమును నెరవేర్చుచుండిరి.

రాష్ట్రమునకువలె రాజధానికి గూడ నిట్టిదే యొక నియోగ ముండెడిది. అందు బ్రధానాధికారి నాగరకుడు. నగరము నాల్గుగ విభజింపబడి, యొక్కొక్క విభాగమున కొక్కొక్క స్థానికుడు నియమింపబడెను. ఈతనికి లోబడి యిరువది ముప్పది యిండ్లను గూర్చి విచారించు నధికారము గల గోపు లుండిరి. ఈ రాజధానిశాఖోద్యోగులకును రాష్ట్రీయోద్యోగులకును విధు లొక్కటిగనే

యుండినవి. గణనా సౌకర్యమునకై, సత్రములు మున్నగు ధర్మసంస్థల యధికారులు దైనందినికాగతానాగతులను గూర్చియు, గృహయజమానులు రాకపోకలు చేయు బంధువులను గూర్చియు, జనాభానియోగమువారికి తెలియజేయవలెనని శాసింపబడెను.

జనసంఖ్యనుగూర్చియేగాక ఇతర విషయములను గూడ నీనియోగమునందలి యుద్యోగులు విచారించుచుండిరి. గ్రామములయొక్క సరిహద్దులను నిర్ణయించి, మెరకపల్లములవంతున భూములను విభజించి గుర్తులను వేయుట, అడవులు, తోటలు, దేవాలయములు, యాత్రాస్థలములు, సత్రములు, నీటివసతులు, బాటలు, శ్మశానములు, గడ్డిమైదానములు మున్నగువానిని వివరించుట, వారికి గర్తవ్యములు.

ఈ జనాభా నియోగమువలన రాష్ట్రమునకు గొన్ని లాభములు గలుగుచుండినవి. ప్రజల గుణశీలములును ప్రవర్తనయు గనిపెట్టబడుటచే, రాజద్రోహాది ప్రమాణములను గమనించుట సులభమయ్యెను. ప్రజల యాస్తిని గూర్చియు, భూమిని గూర్చియు విశేషములు తెలియుటచే, పన్నులను విధించునెడ సౌకర్యము గల్గెడిది. అదియునుగాక నీనియోగము నివేదికలనుండి రాజును బరిపాలకవర్గమును, దేశముయొక్కయు ప్రజలయొక్కయు గష్టనిష్ఠురముల నెప్పటికప్పుడే తెలిసికొని యథోచితముగ బ్రవర్తింప నవకాశము లేర్పడినవి. ప్రాచీనభారతీయపరిపాలనావిధాన మిట్టి చక్కని కట్టుబాటులతో నైయుండినది.

# ఈ మాట నిజం

చింతా దీక్షితులుగారు బి. ఏ. ఎల్. టి

మొన్ననే వచ్చాడు.

నన్నయభట్టు రాజమహేంద్రవరం వచ్చాడు. ఎంతమాత్రమూ సందేహం లేదు. ఈ నాకళ్ళకి దృష్టిగుణము దోషించ లేదు. ఈ నాత్వక్కుకు స్పర్శగుణం నశించలేదు, ఈ నా చెవులకు శ్రవణశక్తి మందగించలేదు మొన్ననే వచ్చాడు నన్నయ్య భట్టు రాజమహేంద్రవరం. నే నాయన్ని చూచాను. నేనాయన్ని తాకాను. నేనాయన్ని విన్నాను. ఎంతమాత్రమూ సందేహంలేదు, ఈ మాట నిజం.

గోదావరి ఒడ్డున ఒకనాడు ఊసుపోక తిరుగుతున్నాను. గోదావరప్పుడు వరదలలో ఉంది. సాయంకాలము. గోదావరిలో తేలి కొట్టుకుపోతున్న కలపను పట్టుకొని పట్టుకొని అలిసి తెప్పలు బుజాలమీద పెట్టుకొని జాలరు లింటికి పోయారు. వరదలలో కొట్టుకుపోయే పెద్ద మ్రాకులమీదవాలి పురుగులను తింటూ, నదీగర్భం మీద సవారిచేసిన కాకులు గూళ్లకి పరుగెత్తుకు పోయాయి. భక్తితో పళ్ళూ పసుపూ కుంఖుం సాగరసహధర్మచారిణి కర్పించడానికి వచ్చినభక్తులు ఇంటిముఖము పట్టారు. విహారార్థమువచ్చి వినోదముగా గోదావరిని కొంతసేపుచూచి ప్రజలు ఇండ్లకు వెళ్ళారు. గోదావరి హోరున ప్రవహిస్తోంది. ఆ హోరువింటూ నేను గట్టున నిలబడ్డాను. వెన్నెల గోదావరిమీద పండుకొన్నది.

రాత్రి ఎంతపొద్దు పోయిందో తెలియదు. వెన్నెలతో పెనవేసుకొని ప్రవహించే గోదావరినిచూస్తూ పరధ్యానముగా ఎంతసేపు నిలబడ్డానో నేనక్కడ. తెలివితెచ్చుకొని ఇటూ అటూ చూచాను. ఎక్కడా మనుష్యులు దృగ్గోచరము కాలేదు. జంతువులైనా కానరాలేదు. మార్కండేయుని ఆలయపు

తలుపు సందులోనుంచి దీపకాంతి బయటికివచ్చి నాతోపాటు గోదావరీ వైభవాన్ని ఆనందిస్తోంది. చెట్లాకు లల్లాడడంలేదు. వాయువువీచడం లేదు. ఆకాశాన్ని మబ్బులులేవు. నీలాంబరము మీద గం ద్రుడు పడుకొన్ని నవ్వుకొంటున్నాడు. గోదావరి హోరున ప్రవహిస్తోంది.

దూరాన గోదావరి వంతెన నల్లగా కనిపిస్తోంది యాభైఆరు కాళ్ల రోకలిబండలాగ. ప్రవహించే గోదావరి పైని ఆడుకొనే చిన్ని కెరటాలకు మాణిక్యశోభ వచ్చింది. ఊరు నిశ్శబ్దముగా ఉన్నది. పగలుచూచిన గోదావరిని రాత్రికలలు గంటున్నారు ఇళ్లల్లోమనుష్యులు. నిద్రను ధిక్కరించి నేనొక్కడనే గోదావరిని చూస్తున్నాను. గోదావరి హోరున ప్రవహిస్తోంది.

ఇది నేను రాజమహేంద్రవరములో నన్నయ్యభట్టును చూచిన సమయము. మొన్న మొన్న నన్నయ్యభట్టును ఈ కళ్లతో చూచిన సమయము. నారాయణభట్టుతో కలిసి భారతాంధ్రీకరణ ముపక్రమించి కొంతవరకు సాగించిన నన్నయ్యభట్టును చూచిన సమయము.

రాజరాజనరేంద్రుడు మహావైభవముతో రాజ్యముచేసిన రాజమహేంద్రవరము తొమ్మిదిశతాబ్దులు దాటినపిమ్మట ఏలాగున ఉన్నదో చూడడానికి వచ్చాడు కాబోలు ఆ తేజోమూర్తి. పూర్వపరిచితస్థలములను చూచుకొని వచ్చినాడు కాబోలు ఆదికవి. తన్ను పోషించిన మహారాజుతో తాను విహరించిన పుణ్యస్థలములు నేడెట్లున్నవో చూడ వచ్చాడు కాబోలు ఆ బ్రాహ్మణుడు. సార్వభౌముని వైభవముతో పెనవేసుకొని విజృంభించిన తన వైభవానికి ఆకరమైన రాజధానిని దర్శింపవచ్చాడు కాబోలు ఆంధ్రకవితాపిత. మదపుటేనుగుల ఘీంకారాలతో, రణహయముల హేషలతో, రథనేముల శబ్దములతో వీరహుంకారాలతో మారుమ్రోగే ఘంటాపథములను తిరుగ చూడ మనసుపుట్టి అవతరించాడు కాబోలు ఈ దేశాభిమాని. వేదఘోషలతో, వీరఘోషలతో, పండితవాదములతో కవిగాయకులతో, కవితల గానముతో కలకలలాడే ఆ నగరరాజము నేడెట్లున్నదో చూడడానికో వచ్చినాడు కాబోలు రాజరాజ కులబ్రాహ్మణుడు. తన కాలపు స్త్రీ పురుషులవలెనే, సాంస్కృతికవారైన నేటి స్త్రీ పురుషులు కూడా, సాహసవంతులున్నూ, అభిమానవంతులున్నూ, ధర్మనిష్ఠాపరులున్నూ, దేశాభిమానులున్నూ, వైభవశాలులున్నూ అయి ఉన్నారో లేదో పరిశీలింపవచ్చి ఉంటాడు నన్నయ్యభట్టు. కోనసీమ తీసిన పాడిపంటల గానాల త్రవ్వి తెనుంగునార్థకై తాను విరచించిన భారతము ఎంతవరకూ వ్యాపించి సంస్కరించిందీ తెలుసుకోడానికి వచ్చి ఉంటాడు ఆ మహాకవి. తాను ప్రసంగించిన గౌతమి, తాను పూజించిన కోటీశ్వరుడు, తాను విహరించిన ఉద్యానములు, తాను వాదించిన సభలు, తాను మెట్టిన రాచనగరు, నేడు ఎట్టిస్థితిలో నున్నవో చూడదలచి వచ్చి ఉంటాడు వాగనుశాసనుడు. తాను పాలించిన కవిత్వము, తాను శాసించిన వాఙ్మయము ఎట్లా వృద్ధిచెంది శాఖోపశాఖలైనవో పరికింప నుత్సహించి వచ్చి ఉంటాడు ఈ కవిచక్రవర్తి.

గోదావరి హోరున ప్రవహిస్తోంది. చంద్రుణ్ణి చిన్న మేఘశకలము కప్పింది. చిరుగాలి వీచ మొదలుపెట్టింది. ఎందువల్లనో గోదావరి హోరు హెచ్చించినట్లు తోచింది, ఎందువల్లనో నేను అటుచూచాను. గోదావరీ గర్భాన్ని చీల్చుకొని ఒక తేజస్సు బయటకి వస్తూన్నట్లు కనిపించింది. ఆశ్చర్యమువేసింది. గోదావరిమీదపడ్డ వెన్నలంతా ఒకచోట పోగుపడ్డట్లయింది. ఆ తేజస్సు నన్ను సమీపించుచున్నట్లయింది. కంటిమీద రెప్పపడలేదు. చెవులు శ్రవణశక్తి అతిశయించింది. హృదయము వేగముగా కొట్టుకోవడం ప్రారంభించింది. ఆ తేజస్సు గట్టు మీదకు వచ్చింది. పరకాయించి చూచాను. నేను పొరపాటు పడలేదుకదా. తేజస్సనుకొన్నది నా సమీపాన్ని తేజస్సులాగ లేదు. ఒక పురుషరూపములాగ ఉన్నది. ఆ పురుషుడు వర్చస్వి, ఉన్నత

దేహుఁడు; విశాలవక్షుఁడు. సన్నజాజి పూలదండ లాగ యజ్ఞోపవీతం ప్రకాశిస్తోంది. ఆ పురుషుడు గోదావరివైపు తిరిగి నమస్కరించాడు. రాజమహేంద్రవరపు కోటవైపు తిరిగాడు. చేతులు జోడించాడు. అతని పెదవులనుండి వెలువడి యీ శ్లోకము వినిపించింది.

"శ్రీవాణీగిరిజాశ్చిరాయ దధతో వక్షోముఖాంగేషు యే। లోకానాం స్థితిమావహన్త్యవిహతాం స్త్రీపుంసయోగోద్భవామ్। తే వేదత్రయమూర్తయ స్త్రిపురుషాస్సంపూజితా వస్సురై। ర్భూయాసుః పురుషోత్తమాంబుజభవ శ్రీకంధరా శ్శ్రేయసే॥

శ్లోకము ముగిసింది. ఎవరు మీరని అడగాలనుకొన్నాను. ఈ సంకల్పము ప్రశ్నయై బయటకు రాకముందే ఆ పురుషుడు నన్నయ్యభట్టనే భావము నా మనస్సుకు కలిగింది. నేనడగ దలచుకొన్న ప్రశ్నకు జవాబు ప్రశ్న బయటికి రాకముందే నా హృదయానికి తాకింది.

ఆ పురుషుడు వెనుదిరిగి చూచాడు. తన వెనక రమ్మని చేతితో సంజ్ఞచేశాడు. ఆకాశాన్ని చిన్న చిన్న మేఘము లలము కొంటున్నవి. తుంపరపడుతోంది. గోదావరి హోరున ప్రవహిస్తోంది.

పురుషుడు ముందునడుస్తున్నాడు. ఆశ్చర్యము, భయము, వింత ముప్పిరిగొనగా అయన వెంట నేను నడిచి వెళ్లుతున్నాను.

పరమపదించిన మహాకవి ఒకడు సాంభౌతిక దేహముతో దర్శనమిస్తే ఎలాగ ఉంటుంది? పరమపదించిన తొమ్మిదివందల సంవత్సరములకు ఈ దర్శనమైనప్పుడో? నా సంతోషాన్ని, దాని ఛాయనే పొందుచున్న నా అపనమ్మకాన్ని, నా అదృష్టాన్ని దాని ఛాయనే పొందుచున్న నా సందేహాన్ని, ఇది స్వప్నస్థితి కాదనే నా ధైర్యాన్ని, దానిఛాయనే పొందుచున్న నా వివేచనాశక్తిని నేను వర్ణించదలచుకోలేను. మీరే ఊహించుకొండి.

ఊరంతకూ ఎత్తైన ఒక మెట్టపై నిలబడ్డాడు నన్నయ్యభట్టు. అతని వెనక నేను నిలబడ్డాను.

అతడు నాలుగువైపులా కలయచూచాడు. తన రాజమహేంద్రవరమును పరిశీలించి చూచాడు. అతని దృష్టికి గోదావరిమీద వంతెన తగిలింది. అతని భావము నా మనస్సుకు గోచరించింది. ధర్మ సంస్థాపనము కోసము శ్రీరాముడు సముద్రాన్ని బంధించాడు. ఏట్టి సత్కార్యము నపేక్షించి ఈ గోదావరి నీకాలపువారిట్లు బంధించారు? అతడు ఒకమారు కళ్లు మూసికొన్నాడు. తనకాలపు రాజమహేంద్రవరమును తలచుకొంటున్నాడు కాబోలు. తెరచే ఆకాలము నా హృదయములో ఎట్లా ప్రతిఫలిస్తుంది. ఆకాలపు తెలుగువారి అభిమానము; ఆత్మగౌరవము; ఆకాలపు గంటము యొక్క సూటి, దృఢత్వము; ఆకాలపు వాక్కు యొక్క కండ, సార్థకత్వము; ఆకాలపు సత్యము, ధర్మము— ఇవన్ని నామనస్సులో పరుగులు వారేయి. తక్షణమే ఈకాలపు తెలుగువారి చచ్చు, నిష్ప్రయోజకత్వము; ఈకాలపు ఊటకలముల డాబు, దుర్బలత్వము; ఈకాలపు వాక్కుయొక్క పేలవత్వము పిరికితనము—ఇవి గోచరించాయి. సిగ్గుపడ్డాను. ఎంత తీసికట్టులోనున్నా నేటికాలపు ఆంధ్రత్వము అంతహీనస్థితిలో లేదని చెప్పడానికి పూనుకొని నన్నయ్యభట్టు నుద్దేశించి అన్నాను. "ఆదికవీ, మీకాలమున భారతము ప్రారంభమైనది. మాకాలమున భారతము పూర్తియైనది. మీకాలమున వ్యక్తిస్వాతంత్ర్యము లేదు. నేడు అది మా సొమ్ము. మానవుని సుఖములను పెంపొందచేసే వాహనములు, కాలమును జయించే వాహనములు మాకు క్రొత్తలు......" నేను పూర్తిచెయ్యక మునుపే నన్నయ్యభట్టు నాచెయ్యిపట్టుకొని నడిపించుకుపోయాడు. నానోటికి తాళముపడ్డది. కాని నాప్రశ్నలకు అతని సమాధానమాత్రం నా హృదయానికి తట్టింది. అది ఇది. మురికికాలవలో బతికే పురుగు తలయెత్తి సూర్యుణ్ణి చూచి ధిక్కరిస్తోందా అని.

నన్నయ్యభట్టుగారి కరస్పర్శకు నాకు క్రొత్తశక్తి

వచ్చింది. భయము పోయింది. ఏవిధముగా తీసుకు వెళ్ళాడో తెలియదు. ఎక్కడికి తీసుకొనివెళ్ళాడో తెలియదు. కాని కొంతసేపైన పిమ్మట గ్రహించాను మేము భూమిమీద లేమని. భూగర్భములో ఉన్నామని. రాజరాజనరేంద్రుడి నగరు కింద భూగర్భములో ఒక విశాలమైన గదిలో మేమున్నాము. ఎక్కడినుంచి వచ్చిపడుతోందో వెన్నెలకాంతి జ్ఞాపకము చాలదు కాని గదిలో మాత్రము వెలుతురు ఉన్నది. నన్నయ్యభట్టు ఒక మూలకు నన్ను తీసుకువెళ్ళాడు. అక్కడ తాటాకుల పుస్తకాలరాసులు కనబడ్డవి. రాగిరేకుల కుప్పలు కనపడ్డవి. ఇంతకాలమూ పాడైపోకుండా ఆ తాటాకు లెట్లా నిలిచాయో! ఇంత కాలమూ చిలుముపట్టి చెడిపోకుండా ఆ రాగి రేకు లెట్లా ఏవిధముగా నున్నవో! ఇవి చూచి నప్పుడు నా కొక ప్రశ్న తోచింది. నన్నయ్యభట్టు కనిపించినప్పుడు అడగకుండా ఎట్లా ఉండడం! భారతము నిజముగా రెండు పర్వాలున్నూ మూడవ పర్వములో కొంతభాగమున్నూ మాత్రమే నా నన్నయ్యభట్టు రాస్తే? అరణ్యపర్వము వ్రాసేటప్పుడు పిచ్చిపట్టి చనిపోయినమాట వాస్తవమేనా! సారంగధరుడు రాజరాజు కుమారుడేనా! నా ప్రశ్నలకు జవాబుకాబోలు— ఒకరాగిరేకు తీసి నన్నయభట్టు నాకిచ్చినాడు. నేను దానిని జాగ్రత్తగా కండువాలోచుట్టి చంకను పెట్టినాను. లోకములోని ప్రవాదములు తప్పనిన్నీ రాగిరేకులోని విషయములు సత్యనిరూపణచేస్తవని ఊహించాను. ఆంధ్రులు అదృష్టవంతులని తలపోశాను.

అక్కడ ఎంతసేపున్నానో తెలియదు. ఎట్ట శక్తి ఆసమయమున నన్నయభట్టు నాకు ప్రసాదించాడో తెలియదు. కాని నన్నయభట్టు ప్రోత్సాహముమీద, నన్నయ్యభట్టు సహాయముతో ఆ తాళపత్రగ్రంథములలో విషయాలు తెలుసుకొన్నాను. రాగిరేకులవృత్తాంతము గ్రహించాను. ఆకాలపు తెలుగుభాషతో నాకు పరిచయములేదు. ఆకాలపు ఆచారవ్యవహారాలు నాకు తెలియవు. ఆకాలపు రాజ్యములవృత్తాంతములూ, ఆకాలపురాజుల మర్యాదలూ, ఆకాలపుప్రజల పరిస్థితులూ నాకు తెలియవు. కాని సర్వమూ నేను గ్రహించాను. నన్నయ్య నాకు ప్రసాదించిన శక్తిగాక ఇందుకింకేమి కారణముంటుంది?

ఉదయము కాబోతోందికాబోలు. రాత్రి నాలుగోజాము కాబోలు. గోదావరి హోరుగున ప్రవహిస్తోంది. ఆహోరు నాకు అస్పష్టముగా వినిపిస్తూనేఉంది.

ఎట్లా బయటికివచ్చామో తెలియదు. గోదావరి గట్టుమీద ఉన్నాము. వెన్నెల తగ్గుతోంది. చంద్రుడు అస్తమించబోతున్నాడు. గోదావరి హోరున ప్రవహిస్తోంది.

"చూడు" అన్నాడు నన్నయ్యభట్టు.

చూచాను. గోదావరిమీదికి దృష్టి నిగిడించాను. కనురెప్ప వాలనియ్యకుండా చూచాను. ఒక పెద్ద మంట కనిపించింది. బంగారపుమంట. ఆమంటలో తైక్ష్ణ్యములేదు. ఆమంటలో తీవ్రత లేదు. ఆ మంటలో చలవ ఉన్నది. ఆమంటలో సుఖము ఉన్నది.

కల్మషాన్ని దహించు మంట అది.
ప్రేమను పురిగొల్పే మంట అది.
శత్రుత్వాన్ని జయించు మంట అది.
సత్యాన్ని స్థాపించే మంట అది.
ధర్మాన్ని స్థాపించు మంట అది.

ఎందరు మహాపురుషులో ఆ మంటలో ప్రవేశిస్తున్నారు. దివ్యశరీరములు పొందుతున్నారు.

ఎందరు తల్లులో ఆమంటలో ప్రవేశిస్తున్నారు. మహాలక్ష్ములౌతున్నారు.

ఎంతటిమంట! లోకాన్నంతను ఆవరించిన దావమంట. నవనాగరికాన్ని దహించి పవిత్రము చేసే మంట అది.

ఈ మంటను బుద్ధుడు అశోకుడు ప్రజ్వలింప చేస్తున్నారు. శంకరుడు పోషిస్తున్నాడు. అక్బరు

వృద్ధిపొందిస్తున్నాడు. మహాత్ములా మంటను లోకమంతా వ్యాపింపచేస్తున్నారు.

నన్నయ్యభట్టు నాకు చెప్పదలుచుకొన్న సందేశము నా హృదయానికి తట్టింది. ఆసందేశము నన్నయ్యభట్టు విజ్ఞానానికి వారసులైన తెలుగువారి నుద్దేశించింది. ఆసందేశమిది, "కల్మషాన్ని శత్రుత్వాన్ని దహించి ప్రేమను పురిగొల్పి సంకెళ్లను సడలిచ్చే ఈమంటలో ఒక విస్ఫులింగ గౌరవను సంపాదించుకోడానికి, శాశ్వతమైన సుఖప్రదమైన జీవనానికోసము మీచిన్న బ్రతుకులు బలికాకూడదా? ఇంతటితరుణ మెన్నడువస్తుంది?"

మంట మాయమైనది. కళ్లనులుపుకొని ప్రక్కను చూచాను. నన్నయ్యభట్టులేడు. అంతటా చూచాను. ఎక్కడా లేడు. ఆవిశాలనేత్రములూ, ఆ అజానుబాహువులూ, ఆ సాత్త్వికతేజస్సూ, మనస్సులో జారిపోకుండా నిలుపుకొంటూ, చంకనున్న రాగిరేకు భద్రముగా పట్టుకొని బిక్కమొగముతో ఇంటికి వెళ్లాను. గోదావరి హోరున ప్రవహిస్తూనే ఉన్నది. జరిగిన సర్వమూ గోదావరిచూస్తూనే ఉంది. నేను చెప్పినసంగతుల యదార్థమూ గోదావరికే తెలుసును. నన్నయ్యభట్టు రాజమహేంద్రవరం వచ్చాడు. ఈ మాట నిజం."

* * * *

* * * *

* * * *

పై విషయములున్న కాగితాలు నాకు చిత్రాంగి మేడప్రక్కను దొరికినవి. వ్రాసినవారెవ్వరో తెలియదు. చివర వ్రాలులేవు. వ్రాసినవాడు తనస్వప్న వృత్తాంతమే వ్రాశాడో, స్వకపోల కల్పిత విషయమే వ్రాశాడో, యదార్థమే వ్రాశాడో తెలియదు. యదార్థమే అయితే అతడు తెలిసికొన్న కొత్తవిషయాలు అతనివద్దనున్న రాగిరేకూ ఆంధ్ర చరిత్రకు ఉపయోగకారులుకావచ్చు. ఇంతకీ అతడు చూచెడనుకొన్న వ్యక్తి నన్నయభట్టే అయితేను.

---

# శ్రీరంగరాజు చరిత్ర

### టేకుమళ్ల కామేశ్వరరావుగారు బి. ఏ. బి. ఇడి

శ్రీరంగరాజు చరిత్ర లేక సోనాభాయి పరిణయమను నవలను నరహరి గోపాలకృష్ణమసెట్టి 1872 లో ప్రకటించేడు. ఈనవల అయిదు ఉల్లాసాల గ్రంథం. డెమ్మీసైజున ౮౮ పుటల పుస్తకం. దీనికి రెండు ఉపోద్ఘాతా లున్నాయి; ఒకటి తెలుగున, ఒకటి యింగ్లీషున.

గోపాలకృష్ణమసెట్టిని గురించి మన కేమీ తెలియదు. గ్రంథంలోని ఉపోద్ఘాతాన్ని బట్టి యితను కర్నూలు నివాసస్థుడని మాత్రం తెలుస్తూంది. ఇతని జీవితచరిత్ర సేకరించడానికి నేను కొంత ప్రయత్నం చేసేను. కాని లాభించలేదు. ఇంతలో శ్రీ మున్నంగి లక్ష్మీనరసింహశర్మగారు తాము రాయలసీమ కవుల చరిత్రలు సేకరిస్తున్నామని చెప్పి ఆంధ్రపత్రికలో ప్రకటించేరు. నరహరి గోపాలకృష్ణమసెట్టి చరిత్రకూడా సేకరించవలసిందని నేను వారినికోరేను. అలాగే చేస్తామని వారు నాకు వాగ్దానం చేసేరు.

గోపాలకృష్ణమసెట్టి యింకా యేమేనా యితరపుస్తకాలు రాసేడో లేదో మనకు తెలియదు. ఈపుస్తకం మాత్రం అప్పుడు రాజప్రతినిధిగా వుండిన లార్డుమేయోకు అంకిత మిచ్చేడు. శ్రీరంగరాజు చరిత్ర "హిందువుల యాచారము తెలుపునట్టి నవీన ప్రబంధము"ని గ్రంథకర్త చెబుతున్నాడు.

ఈనవల రచనకు గల కారణం ఉపోద్ఘా

తంలో యిలా చెప్పబడింది. "పది నెలల నాడు లార్డుమేయోగారు బంగాళుల యాచారంబులు తెలుపు ప్రబంధము గానించు వానికి బహుమానంబు చేయబడునని ప్రకటనము చేసిరి. అది నేను చదిని నప్పుడు తెలుగు దేశము వారి యాచారంబులు తెలుపునట్టి ప్రబంధం బొకటి రచియించుట తెలుగు వారి కుపయుక్తం బగునని తలంచి నా నేర్పు కొలఁది దీని ప్రబంధంబు చెప్పబూనితిని." పై వాక్యాల వల్ల యీ గ్రంథరచనలో గ్రంథకర్త ఉద్దేశం సాంఘికమని తెలుస్తూంది. అంతే కాదు తెలుగులో ఆచారవ్యవహారాలు తెలిపే వచనప్రబంధం అంతకు ముందు లేదనీ యిదే మొదటిదనీ కూడా తెలుస్తూంది.

౫. వీరేశలింగకవి రాజశేఖర చరిత్రను 1878 లో ప్రకటించేడు. శ్రీరంగరాజు చరిత్ర 1872 లో ప్రకటించబడింది. అంటే రాజశేఖర చరిత్రకు ఆరేళ్లముందు శ్రీరంగరాజు చరిత్ర ప్రకటించ బడిందన్నమాట. కాని వీరేశలింగకవి తన స్వీయచరిత్ర రెండోభాగంలో ౨౩౨వ పుటలో "తెలుగులో మొదటి వచనప్రబంధమును నేనే చేసితిని" అని రాసేడు. (వచనప్రబంధమంటే యిక్కడ నవల అని అర్థం) ఈమోస్తరుగా రాయడానికి కారణం వీరేశలింగకవి శ్రీరంగరాజు చరిత్రను గురించి యెరగకపోయేనా వుండాలి. లేక యిది ప్రశస్తమయిన గ్రంథం కాదని ఉద్దేశించి దీని సంగతి చెప్పక తను రచించిన రాజశేఖర చరిత్రే మొదటి వచనప్రబంధమని చెప్పి వుండాలి.

వీరేశలింగకవికి శ్రీరంగరాజు చరిత్రను తెలియదా అన్న సంగతి మొదట చూద్దాం.

శ్రీరంగరాజు చరిత్రను నేను వీరేశలింగ గ్రంథాలయం లోంచే తీసుకు వచ్చేను. ఇది వీరేశలింగ కవి సేకరించిన గ్రంథమే కాని మరెవ్వరూ సేకరించినది కాదని గ్రంథాలయ కార్యదర్శులయిన శ్రీ అడవి శంకరరావుగారు చెబుతున్నారు. శ్రీరంగరాజు చరిత్రను వీరేశలింగకవి పూర్తిగా యెరిగి వున్నాడు అని అనడానికి యింతకంటె ప్రబలమైన కారణ మింకొకటి వుంది. అదేమంటే, శ్రీరంగ రాజు చరిత్రలోని కొంత వస్తువును వీరేశలింగకవి తన రాజశేఖర చరిత్రలో వుపయోగించేడు. శ్రీరంగ రాజు చరిత్రలోని భాగం—

"......లోకనాథు నుంచి యెండను మార్గాయాసముచే మిక్కిలి డస్సి, నీరుపట్టునఁ బిపాసచే చాటను బుచ్చుకొనియె- అది మేలను గోఁతకోయు చున్న కొందఱు మాలలు చూచి—యెవరో బహిలీక పేత నేలఁ బడిరని యుఱికి వచ్చి నీరిచ్చుటకుఁ దగినవారు కామిం జేసి మఱి యెవరి నయినను దగు కులమువారిని బిలుచుకొని వత్తమని చేతినున్న నీరియ్యకయె మరలి పోయిరి. ఆజలము జూచి పుచ్చుకొందమా యని—యతని కాసక్తి యుండియు—పాడు వర్ణాచారపు బంధములం జేసి ముట్టఁ జేతులాడక యతండు పొందిన మనోవేదన యేమని చెప్పుదు—

౨౭. ఇట్లు పరితపించుచుండఁగాఁ గొందఱు కాఁపువారు తమ తెచ్చుకొన్న సంకటియు నీరును దీసికొని యుఱికి వచ్చిరి గాని యతండు క్షత్రియుండగుట యెఱింగి నీరిచ్చుటకు వెనుకముందు చూచుచుండిరి. రాజు దప్పిచే వర్ణాచారంబులను సయితము లెక్కక నీరు తెమ్మని సైగచేసె—పుచ్చుకొమ్మని యొకండు నీటిచెంబు యియ్యఁబోయె రాకొమరుండు హస్తంబు సాఁచె నంతలో మఱి యొక కాఁపు తటుకున దుత్తను గుంజుకొని, యెన్ని పాపములు చేసితిమో, యీ పాడుకులంబున బుట్టితిమి. వీరు బ్రాహ్మణులో క్షత్రియులో వీరి కేమి నయిన శూద్రులు నీరిత్తురే ; వీరు తాపంబున కోర్వ లేక నీరు త్రావెదమని చెప్పెదరుగాని. మనము పిల్లలు గలవారము. మనకేల యీ పాపంబు—వేగఁ బోయి చల్లఁ దెమ్మని యొకరిని గ్రామంబునకు బంపె.

హా—యేపుణ్యాత్ముండు గల్పించెనో యీవర్ణాశ్రమధర్మంబులు—ప్రాణంబులు పోవుచున్న నూ—గాని

బంధంబులా పోకపోదా? అట్టి రాజొప్పకుని చిత్తం బేమిగా తల్లడిల్లుచు నున్నో యాపవిత్రాత్ముని కొకాని మొదల తెలుకదో! అబంధంబులు తెంపవలెనని యుత్సుకత్వం బయినఁ గాని—వాని దెంచుట యసాధ్యంబయ్యెఁగా! వానిఁ గల్పించిన వాని మహిమ యేమని చెప్పవచ్చు.

౨౮. ఇట్లు నిరుపట్టువిరూపముగ నున్న యతనితో జీవంబు పోరాడుచుండెఁగా వెనుకఁ జిక్కిన చెలికాఁడు వేగంబున వచ్చి శీర్షమెచ్చి ప్రాణంబులు దక్కించె—”

(శ్రీరంగరాజు చరిత్ర, పు 22, 23)

పైభాగం రాజశేఖర చరిత్రలో యీ కింది మోస్తరుగా రాయబడింది. “.....మార్గమునకు కొంచెము దూరములో దక్షిణపు దిక్కున నున్న గుంపులోనుండి “శుద్ధిచేయుటకు మజ్జిగ” యని కేకలువేయుచు కొందఱు పరుగెత్తుకొని వచ్చుచుండిరి. రాజశేఖరుడుగారు వారి ప్రేను జూచి యాసందడి యేమని యడుగఁగా. వారిలో నొక గొల్లవాఁడు ‘రాచకొమారు డొకఁడు పరిగెట్టి యారావిచెట్టు కింద పడిపోయినాఁ’డని చెప్పెను.

రాజ:—మీ రాతని గొంతుకలోఁ గొంచెము నీళ్లు పోయలేక పోయినారా?

గొల్ల:—మొట్టమొదట మేము నీళ్లియ్యఁ బోఁగా, శూద్రులము కాబట్టి మాచేతి నీళ్లు త్రాగనని యారాజు పుచ్చుకొన్నాఁడు కాఁడు. తరువాత దేహమునకు తాళలేక మాచేతి నీళ్లు త్రాగుట కొప్పుకొన్నాఁడు. కాని మా వారిలో పెద్దవాఁడు వచ్చిశూద్రుఁడు రాజునోటిలో నీళ్లుపోసిన పాపము వచ్చునని చెప్పి, నీళ్లు శుద్ధిచేయుటకై మజ్జిగ నిమిత్తము మమ్ముఁ బంపినాఁడు. మాపల్లె యిక్కడికి పావుక్రోసు దూరమున నున్నది. మీరు బ్రాహ్మణులుగాఁ గనబడుచున్నారు. మీవద్ద నేమయిన మంచితీర్థ మున్నయెడల, వేగిరము పోయి యాతని గొంతుకలో నాలుగు చుక్కలు పోసి పుణ్యము కట్టుకొండి.

ఆ మాటలు విని రాజశేఖరుడుగారు రుక్మిణి చేతిలోనున్న మంచినీళ్ళచెంబును పుచ్చుకొని, చెట్టు దగ్గఱకు పరుగెత్తిపోయి గుంపులో నుండి త్రోవ చేసికొని ముందుకు నడచి గుంపునడుమను చెట్టుని డను కటికనేలను పరుండి చేతితో నోరుచూపి నీళ్ల నిమిత్తము సైగ చేయుచున్న యొక మనుష్యుని చూచిరి. ఆ యాంకలలో నొకఁడు నీళ్ళముంతను జేతిలోఁ బట్టుకొని ‘ఈ రాజు నిష్కారణముగా జచ్చిపోవుచున్నాడు; ఏ దోషము వచ్చినను సరే నీళ్ళుపోసి బ్రతికించెద’నని చేరువకుఁ బోవుచుండెను. అప్పుడొక ముసలివాఁడెద్దము వచ్చి వాని చేయి పట్టుకొని నిలిపి. ‘ఈ వరకుఁ బూర్వజన్మములో మనమెన్నియో పాపములను జేయుట చేతనే మనకిప్పుడీ శూద్రజన్మము వచ్చినది: ఇప్పుడీ రాజును జాతిభ్రష్టునిజేసి యీ పాపము సహితము కట్టుకొనవలెనా? నా మాటవిని నీళ్లుపోయవలద’ని నివారించుచుండెను. ఇంతలో రాజుకన్నులు తేలగిల వైచి, చేయి నోటివద్ద కెత్తఁబోయి వదలించుచు క్రిందఁ బడవైచెను. అప్పుడు రాజశేఖరుడుగారు వెంటనే పోయి మంచినీళ్ళతో ముందుగా నెండు కొని పోవుచున్న పెదవులను దడుప చప్పరింప నారంభించెను. అంతట రాజశేఖరుడుగారు తనచేతి లోని యుదకముతో మొగమును దడిపి మఱికొంచెము నీరు లోపలికిఁ బోయఁగా త్రాగి కన్నులు విప్పిచూచి రెండవప్రక్కకు తిరిగి మఱికొంతసేపు నకు సేదతేఱి, ఆ రాజు తన జీవములను నిలిపినందులకై రాజశేఖరుఁడుగారికి కృతజ్ఞతతో బహు నమస్కారములు చేసి లేచి కూరుచుండెను. ఇంతలో పల్లెకుబోయిన వారు మజ్జిగయు, కొన్ని పండ్లను దీసికొనివచ్చి యిచ్చిరి. ఆ రాజు కొన్ని పండ్లను లోపలికిఁ బుచ్చుకొని మజ్జిగ త్రాగి స్వస్థపడెను.” (రాజశేఖరచరిత్ర, పు. 110. 112). రాజశేఖరచరిత్రకు మూలగ్రంథమైన ‘వేక్‌ఫీల్డ్ మతగురువు’లో పైభాగం లేదు. ఇది శ్రీరంగరాజు చరిత్రలోంచి తీసుకోబడినదే.

వీరేశలింగ కవి నవలను వచనప్రబంధమని వ్రాసేడు. అంతకుపూర్వమే గోపాలకృష్ణమసెట్టి నవలకు వచనప్రబంధమని పేరుపెట్టేడు.

గోపాలకృష్ణమసెట్టి తనకథ నాలుగువందల యేళ్లకిందట జరిగినట్టుగా రాసేడు. వీరేశలింగ కవి తనకథ రెండువందలయేళ్ల కిందట జరిగినట్టుగా రాసేడు.

నవల కళాప్రధాన గ్రంథం. నవలలో ఆచార విమర్శవుండడం సహజంకాదు. కాని గోపాల కృష్ణమసెట్టి తననవలలో ఆచారాలు విమర్శించేడు. అసలు పుస్తకమే "హిందువుల యాచారములు తెలుపునట్టి నవీనప్రబంధ" మన్నాడు. వీరేశలింగ కవి రాజశేఖరచరిత్రలో ఆచారవిమర్శ చేసేడు. గ్రంథంలో లేనటువంటి ఈ అంశాన్ని రాజశేఖరచరిత్రలో చేర్చేడు. నవలకళలో ఆచారవిమర్శను చేర్చడమనేది వీరేశలింగకవి గోపాలకృష్ణమసెట్టిని చూసి నేర్చుకున్నదనే నా ఉద్దేశం.

ఇంక రెండోసంగతి. శ్రీరంగరాజు చరిత్ర గొప్ప గ్రంథం కామకాబట్టి వీరేశలింగకవి దాని మాటయెత్తక తనురాసినదే మొట్టమొదటి నవల అని చెప్పేడు అన్న సంగతి చూద్దాం.

శ్రీరంగరాజు చరిత్ర అసమర్థరచన కాదు. గోపాలకృష్ణమసెట్టి యీ నవలలో ఆచారాలను చక్కగా విమర్శించేడు. కథాకల్పన నేర్పుగా చేసేడు. శైలిలో కొత్తమార్గం తొక్కేడు. అందుచేత యిది అల్పమైన రచనకాదు. వీరేశలింగ కవి గణించతగని గ్రంథంకాదు. ఒకవేళ శ్రీరంగరాజు చరిత్ర అసమర్థరచన అయినా అదే మొట్టమొదటి సాంఘికనవల అవడంవల్ల దాని తర్వాత రాయబడ్డ మరొకపుస్తకాన్ని మొట్టమొదటి నవల అని చెప్పగూడదు. వీరేశలింగకవి తనదే మొట్టమొదటి నవల అని చెప్పడం తప్పని చెప్పక తప్పదు.

గోపాలకృష్ణమసెట్టి తన నవలను గురించి యీమాసరుగా చెప్పుచున్నాడు. "ఇది కేవలము కల్పితంబు కథానాయకుండు—మహాకులీనుడై యుండవలయునని యీ దేశంబున మున్ను దొరతనముచేసిన విద్యానగరరాజు వంశము వారిలో శ్రీరంగరాజను పేరు గైకొంటిఁగాని యిందుచెప్పిన చరిత్రము యథార్థముగా జరిగిన కథయని యెంచఁగూడదు. ఇందుఁజెప్పిన యాచారములు మాత్రము యథార్థముగా నాచరింపఁబడునని. ఈ కథ ౪౦౦ సంవత్సరములనాఁడు జరిగినట్లుగా చెప్పఁబడియెగాని యప్పటియాచారములకు నిప్పటి యాచారములకును లేశంబుగాని భేదంబు లేమింజేసి యిందుదహరింపబడిన యాచారంబులన్ని యిపుడాచరింప బడుచున్నవని యెఱుంగునది—కేవల గద్యాత్మకములయిన తెనుఁగుప్రబంధములు—విశేషము లేమింజేసి యిది తెనుఁగువిద్యార్థులకు సయితముపయోగించునని తలఁచెద."

శ్రీరంగరాజు చరిత్ర కేవలం వచనప్రబంధమనే చెప్పవచ్చు. మనము సాధారణంగా చదివే పద్య ప్రబంధాలకీ దీనికీ వుండే భేదం ఒక్కవచనమే. ఈ వచనప్రబంధంలో ప్రబంధనియమాలన్నీ పాటించబడ్డాయి. ప్రబంధంలో వుండవలసిన యిరవైరెండు వర్ణనలు యించుమించుగా దీంట్లో కనబడుతున్నాయి.

కథాసంగ్రహం:—

మొదటి ఉల్లాసం:—విద్యానగరాన్ని ఒకరాజు పాలిస్తున్నాడు. అతనికి శారదఅనే వేశ్యవుంది. ఆ వేశ్యకు కృష్ణుడనే కొడుకు వున్నాడు. కొన్నాళ్లకు ఆ రాజుయొక్క పట్టపుదేవి కుమారుణ్ణి కంటుంది. శిశువుయొక్క భారసాలకు శారదవస్తుంది. రాజుయొక్క రాణులచేత శారద పరిభవించబడుతుంది. అందరిమీద కసితీర్చుకుంటానని శపథంచేసి వెళ్లిపోతుంది. శిశువుకు శ్రీరంగరాజని పేరు పెడతారు.

శ్రీరంగరాజు పెద్దవాడవుతాడు. కృష్ణుడుకూడా పెద్దవాడవుతాడు. ఇద్దరూ కలిసి ఒకమారు వేటకు వెళ్తారు. నౌకర్లంతా కృష్ణుణ్ణికూడా శ్రీరంగరాజుతో సమంగా గౌరవిస్తారు. అదిచూసి శ్రీరంగరాజు కోపించి కోటకువెళ్లిపోయి శారదను, కృష్ణుణ్ణి

కోటనుంచి పంపించి వెయ్యమని తండ్రితో చెప్తాడు. తండ్రి తటపటాయిస్తూవుండగా అతను రామయ్య అను చెలికాడితో కూడా దేశాంతరం వెళిపోతాడు.

రెండవ ఉల్లాసం:—ఒక పల్లెటూళ్ళో శ్రీరంగ రాజు ఒక బ్రాహ్మడితో పట్నవాసం, పల్లెటూరి నివాసం గురించి మాట్లాడతాడు. అటుతర్వాత వర్ణాశ్రమాలను గురించి ప్రసంగిస్తాడు.

మూడవ ఉల్లాసం: రాజు తనకొడుకు కోసం సేవకుల్ని వెతకపంపుతాడు. శారద కోట విడిచి వెళిపోతుంది. రాజుకు ఆకాశరామన్న వుత్తరాలు వస్తాయి.

నాలుగవ ఉల్లాసం:—శ్రీరంగరాజు సంగమేశ్వరం నుంచి వేటకు బయలుదేరుతాడు. అక్కడతనికీ రామయ్యకూ విపత్తు సంభవిస్తుంది. అటు తర్వాత వారిద్దరూ దోవతప్పిపోయి శ్రీశైలం దగ్గరవున్న చంద్రగుప్తిపేట చేరుకుంటారు. చంద్రగుప్తిలో రాజు సోనాభాయి అను ఒక లంబాడీ కన్యను చూసి ప్రేమిస్తాడు. సోనాభాయి తల్లి, రామయ్యా కూడా ఆ సంబంధం నుంచి రాజును తప్పించచూస్తారు. రాజుమట్టుకు లొంగడు. ఆ తర్వాతరాజుకు తెలుస్తుంది, సోనాభాయి నిజంగా లంబాడీకన్య కాదని రాచకన్యే అని. ఇలాగుండగా—ఇంతకుముందు సోనాభాయిని భీమానాయుడు అనేవాడు పెళ్లిచేసుకోప్రయత్నిస్తాడు. కాని సోనాభాయితల్లిఆసంబంధానికిష్టపడక తనువున్న స్థలంనుంచి చంద్రగుప్తికి వచ్చేస్తుంది. భీమానాయుడు కొండవీటిరాజుదగ్గరచేరి సోనాభాయిని వివాహంచేసుకోగోమని రాజుతో చెప్పి, జంగిను మల్లమ్మ అనేదాన్ని సోనాభాయిని వెదకపంపుతాడు. మల్లమ్మ సోనాభాయిసంగతి తెలుసుకుని భీమానాయుడి దగ్గరికి వస్తుంది. ఆతర్వాత భీమానాయుడు సోనాభాయిని యెత్తుకువస్తాడు. సోనాభాయితల్లి యీ సంగతి శ్రీరంగరాజుకు తెలియజేసి వెళ్ళిపోతుంది.

ఐదవ ఉల్లాసం:—శ్రీరంగరాజుకూడా కొండవీడు చేరుతాడు. అక్కడ అందరూ అనేకమోస్తరుగా ప్రయత్నం చేస్తారు కొండవీటిరాజు సోనాభాయిని వివాహమాడకుండా చెయ్యడానికి. చివరికి కొండవీటిరాజుతల్లి సోనాభాయిని రహస్యంగా కోటఅవతలికి పంపేస్తుంది. అప్పుడు వారంతా కలిసి విద్యానగరం వెళిపోతారు. అక్కడ సోనాభాయితల్లి సోనాభాయిచరిత్ర చెబుతుంది. రంగనాయికి (సోనాభాయి) రంగరాజుయొక్క మేనత్తకూతురే అన్నసంగతి తెలుస్తుంది. కొండవీటిరాజుకు రంగనాయికి పినతండ్రి కూతురన్న సంగతికూడా తెలుస్తుంది. శ్రీరంగరాజు రంగనాయికిని వివాహమాడతాడు. కృష్ణుడికి ఒక పరగణా యిస్తాడు. శ్రీరంగరాజు చాలాకాలం సుఖంగా రాజ్యం పరిపాలన చేస్తాడు.

ఈ కథావ్యూహంవంటి కథలు మనవిజ్ఞానంలోనూ సాంప్రదాయికవిజ్ఞానంలోనూ చాలా వున్నాయి. పాశ్చాత్య వాఙ్మయంలో యిటువంటి వ్యూహాలుకల నవలలు వున్నాయి. ఈ నవలలో సాంప్రదాయిక విజ్ఞానంలోని గంగాగౌరులపాట కొంతమట్టుకు వుపయోగించబడింది.

ఈ నవలలో మెచ్చుకోతగినది కథాకల్పన. అంతకంటే విశేషమైన సంగతి మరొకటివుంది; అదేమంటే శైలి. ఈపుస్తకం చాలాసులభశైలిలో రచించబడింది. ఆకాలంయొక్క శైలీసాంప్రదాయాలు యిందులో కనబడవు. ఇదే యీరచయిత యొక్క ప్రజ్ఞను పూర్తిగా తెలియజేస్తూంది. వచన శైలి ప్రబంధాలలోని వచనంలాగవుంది. విరతి సంజ్ఞలు యెక్కడా వాడుకచెయ్యబడలేదు.

ఈ నవలలోని వర్ణనలు రచయిత యొక్క సూక్ష్మపరిశీలనను తెలియజేస్తున్నాయి. ఈరచయిత యొక్క సాంఘిక పరిశీలనను గురించి వేరే చెప్పక్కర్లేదు. వేశ్యాజాతి, ప్రసవం, నామకరణోత్సవం, వివాహాలు, వర్ణవిభజన, గ్రహశాంతులు, శకునాలు

మొదలైనవాటిని గురించి చక్కగా విమర్శించేడు. అక్కడక్కడ రాజకీయమైనవాటినికూడా కొంత కొంత విమర్శించేడు.

శ్రీరంగరాజు చరిత్ర తెలుగులోని మొదటి సాంఘికనవల అని చెప్పవచ్చు. ప్రథమప్రయత్న మగుటచేత దీనిలో కొన్ని లోట్లు వున్నాయి. కాని రచయితయొక్క అపూర్వప్రజ్ఞ పుస్తకమంతటా విశదమౌతూనేవుంది.

---

# ఉత్తరరామచరితము*

డాక్టర్. చిలుకూరి నారాయణరావుగారు ఎమ్. ఎ., పి. ఎచ్. డి. ఎల్. టి.

భవభూతి రచించిన ఉత్తరరామచరితనాటకమును ఇంతవరకు చాలామంది తెనిగించినారు. ఇప్పుడు తిరిగి మ. రా. రా. జయంతి రామయ్యపంతులు గారున్ను తెనుగు చేసినారు. శ్రీ రామయ్యపంతులు గారిని ఆంధ్రదేశమున తెలియనివా రుండరు. వీరు ప్రెసిడెన్సీ మేజిస్ట్రేటు పని చేసి విశ్రాంతి వేతనము పుచ్చుకొంటున్నారు. లెజిస్లేటివ్ ఎసెంబ్లీలో కొంతకాలము మెంబరుగా ఉండిరి. ఆంధ్ర మద్రాసువిశ్వవిద్యాలయాలలో సెనేటు మెంబరుగాను, తెనుగుపాఠ్యపుస్తక నిర్ణాయక సభలలోను, తెనుగు పరీక్షకవర్గ సభలలోను, అధ్యక్షులుగాను ఉండిరి. ఆంధ్రసాహిత్యపరిషత్తును స్థాపించిన వారిలో వీరు ముఖ్యులు; పరిషత్తు భారమంతా నిరంతరముగా వీరే వహిస్తున్నారు. ప్రారంభవిద్య నుంచి విశ్వవిద్యాలయవిద్యవరకు విద్యార్థులకు బోధకము గ్రాంథిక భాషామూలముగానే జరుగవలెనని సభలలో తీర్మానములు చేయించిన్ని, మహజర్లు పంపించిన్ని, రాజులతోను మంత్రులతోను చెప్పిన్ని, ఎన్నో విధాల నిద్రాహారాలు లేక కష్టపడినారు. ఆంధ్రవిశ్వవిద్యాలయములో అధ్యాపకాంధ్రభాషాపండితవర్గమును ఏర్పాటుచేయడానికి నియమింపబడ్డ సభలో వీరు ఎక్స్‌పర్టు సభ్యులు. పరిషత్తు పక్షమున గొప్ప నిఘంటువు వ్రాయించవలెనని, తామున్ను ఆకోశములో పాల్గొంటూ, కృషిచేస్తున్నారు. నేటికి వీరికి ౬౦ సంవత్సరముల వయస్సయినా, గ్రాంథికభాషాదేవి సాక్షాత్కారము కోసము ఇంకా గొప్ప తపస్సు చేస్తున్నారు. కాని, ఆదేవి వీరి కిప్పటికిన్ని సాక్షాత్కరించలేదు. "వత్సా, నేను నిత్యకళ్యాణిని, నిత్యయౌవనను, అజరామరను. నన్ను కనుక్కోవలెనని ఉంటే, నీవు మాటాడుతూ ఉన్న దిక్కున నన్ను సంపూర్ణముగా కనుగొను; జీవించి ఉన్న వారి నాలుకలమీద నిత్యతాండవము చేస్తూ, అనేకవిధాల లోకాలకు ఆనందము కలుగజేస్తూ ఉంటాను. నేను గీర్వాణిని కాను; గీర్వాణి స్వర్గములో ఉన్నది; ఆమె అంశతో భూలోకములో అవతరించినాను; జీవలోకములో నన్ను శీఘ్రముగా తెలుసుకోగలవు; చెవి ఒగ్గి వింటే, కళ్లు తెరచి చూస్తే, నాస్వరూపము నీకు బోధపడుతుంది; అట్లు చేయకపోతే నీ శ్రమ అంతా వ్యర్థము" అని ఘంటాఘోషముగా పలుకుతూ ఉన్నా, శుష్కధ్యానాసక్తులకు వలె, ఈ సత్యవాణి వీరికి హృదయంగతము కాలేదు. నలభై యేండ్లు వయస్సయేసరికి మానవుల అభిప్రాయాలు స్థిరము లయిపోతవనిన్ని, అట్టి వారితో

---

* మ. రా. రా. జయంతి రామయ్యపంతులు బి. ఎ., బి. యల్., గారి ఆంధ్రానువాదము. సరస్వతీ పవర్ ముద్రాక్షరశాలలో ముద్రితము, 1931.

వాదించి వారి అభిప్రాయాలు మార్చడము సాధ్యము కాదనిన్నీ మన సత్యశాస్త్రజ్ఞు లంటారు. అంతేకు రెండింటలు వయస్సు కలిగిన వీరి వ్యావహారిక భాషా వైమనస్యము గట్టికట్టుకొనిపోయి ఉంటుంది. వీరితో వాదించడమువల్ల కార్యము లేదని తెలిసినా, ఇటూ అటూ ఊగుతూ ఉన్న ఇతరుల కయినా పనికి వస్తుం దని ఈ వ్యాసము వ్రాయడానికి పూను కొన్నాము.

శ్రీ రామయ్యపంతులుగా రింత వరకున్ను కావ్యము లేవిన్ని వ్రాయలేదు. గ్రంథాలకు పీఠిక లున్ను, పత్రికలకు వ్యాసములున్ను, అనేకములు వ్రాసినారు. ముక్తే (శ్రీ?) శ్వరశతక మొకటి వ్రాసినారు శాసనము లను కొన్నిటిని పరిశోధించి ప్రకటించినారు. వీరు ప్రయత్నించి వ్రాసిన పెద్ద గ్రంథాలలో ఈ ఆంధ్రీకృతోత్తరరామచరితనాటకము మనకు తెలిసినంతమట్టుకు మొదటిది. ఈఆంధ్రీకరణవిధానమును తా మీక్రింది రీతిగా పీఠికలో చెప్పుకొన్నారు.

"(i) ఆంధ్రభాషాసంప్రదాయము లం బాటింప నా శక్తికొలంది యత్నించినాండను" ఉపోద్ఘాతము i. ప. 5, 6.

(2) "పలుకుబడి వేఱు పదసరిపాటు వేఱు, రీతులును వేఱ యన్వయరీతి వేఱు భాష భాషకు నను మాట భావమందుం జేర్చి సంస్కృతమును దెల్లు సేయవలయు." అవతారిక, ప. ౮.

(3) "తెలుగున నెపుట్టె నీకృతి తొలుత ననెడు భావ మాత్మం దోంచెడు భంగిన్, జెలంగిన యను వాదము, సరసుల కింపౌం, గాక యున్న శోభింప దిలన్." అవతారిక, ప. ౯.

(4) "దీటుగ సంస్కృతంబునకుం దెల్గొన
రించెడు వారు మూలమున్,
దాంటక, భావమున్ రసము తప్పక వచ్చెడు
నట్లు లెంతయున్
దేటగ వేఱు మాటలను జెప్పినం బొల్పగుం
గాక యొట్టులో
మాటకు మాటం బెట్టి యొక మాడ్కి-ని
మాటిన మెత్తురే బుధుల్,
అవతారిక. ప. ౭.

ఇట్లు తా మేర్పాటు చేసుకొన్న నియమాలను శ్రీరామయ్యపంతులుగా రెంతవరకు తమ అనువాదములో పాటించినారో విచారింతము.

# I

## ఆంధ్రభాషాసంప్రదాయము

ఆంధ్రభాషాసంప్రదాయ మంటే పంతులుగారి అభిప్రాయము గ్రాంథికాంధ్రభాషాసంప్రదాయమని అనుకొంటాము. గ్రాంథిక, వ్యావహారిక భాషాసంప్రదాయములు రెండున్ను ఆంధ్రభాషాసంప్రదాయమే అంటే మాకు కొంత సంతోషమే. కాని, గ్రాంథిక, వ్యావహారిక భాషాసంప్రదాయాలు రెండున్ను ఒక్కటే రచనలో అతకవని మాప్రము మా అభిప్రాయము. వ్రాస్తే తమ పాండిత్య మంతా చూపి, సమస్తాంధ్రగ్రంథములను పరిశీలించి, గ్రాంథికసంప్రదాయమును నిర్ణయించుకొని దానిని తప్పకుండా వ్రాయవలెను. లేదా, కేవల నిత్యవ్యావహారిక భాషలో నయినా వ్రాయవలెను. సహజముగా వచ్చే వ్యవహారభాష తప్పనుకొని, గ్రాంథికసంప్రదాయము తెలియక గ్రంథరచనకు దిగేవారు (అ) కృతక రూపాల నయినా సృష్టిస్తారు; లేదా, (ఆ) వ్యవహారభాషను వ్రాసి అది గ్రాంథిక భాష అని తమ్ము మోసగించుకొని ఇతరులను కూడా మోసగిస్తారు. వ్యావహారిక భాషావిముఖులై, దానిమీద కత్తికట్టిన వారు కాబట్టి పంతులుగారు రెండు పనులనున్ను చేసినారు.

### (అ) కృతక భాష

(1) "మహాశ్వేతావృత్తాంత మిందునకు దృష్టాంతము". (ఉపోద్ఘాతము. పు. iv)

"నిప్పుట్టువు, చిట్టచివర కిందుమ కైనదా!"

(పు. 88.)

అందు, ఇందు, ఎందు, ల మీద 'ఇకా' సూత్రము ప్రకారము నగాగము రా దనిన్నీ, ప్రాతభాషలో 'అందులకు, ఇందులకు, ఎందులకు' అని రూపాలుంట వనిన్నీ, అర్వాచీనగ్రంథాల లోను వ్యవహారములోను అందుకు, ఇందుకు, ఎందుకు, అని ఉంట వనిన్నీ చిరకాలమునుంచిన్నీ మేము ఘోషిస్తూ ఉన్నా, మేము చెప్పినాము గదా అని కాబోలు ఈనాటి గ్రంథకర్తలు నగాగమమును తప్పకుండా చేస్తూ ఉంటారు. రామయ్య పంతులుగారు 'ఇందు' మీద నగాగమును చేసి 7వ పుటలో 'లేచి ముందుకు నడచి' అని ముందుకుఅని ప్రయోగించినారు. 'ముందునకు' అని వ్రాయలేదు. ఇందుకు చాలా సంతోష మయినది.

(2) "నిన్నిచటకుఁ బిలిచికొని రాలేదు"— పు. 6.

'ఇచటకు' అనే రూపము కృతకము. ఏఆధునిక మహానుభావుడు మొదట వాడినాడో కాని, రామయ్యపంతులవా రంతటి వారికి కూడా ఈ రూపము ప్రమాణ మయినది.

(3) "తోరపుఁ బూజల్ సలిపెదు నిద్దె"— పు. 10.

"పూర్ణగర్భ నిద్దె కటికనై త్రోయఁగా నెంచి నాఁడు"—పు. 26.

"నీకడకవనార్థము వచ్చి రిద్దె యవని పాలా"— పు. 26.

"కనుపట్టుచు నున్నది యిద్దె—పు. 136.

'ఇది' మీద ఎత్వము చేర్చి వస్తునిర్దేశము చేయడానికి 'ఇదె' అని కవులు వాడితే, 'ఇది' కి రూపాంతరము 'ఇద్ది' అన్నది కాబట్టి, రామయ్య పంతులుగారు దానికి కూడా ఎత్వము చేర్చి 'ఇద్దె' అని వాడినారు. వీరు పాటించిన ఆంధ్రభాషాసంప్రదాయ మిద్దే.

(4) "క్రొత్తగా సారివచ్చిన కూర్మి సతుల గలసి"—పు. 11.

'సారె' అని గ్రంథములు, వ్యవహారము. శబ్ద రత్నాకరములో 'సారె'; ఈఅర్థములో 'సారి' లేదు. పంతులుగారు వ్యుత్పత్తి నూహించి 'సారి' అనే రూపమును కల్పించి ఉంటారు. 'కోరిక' మొదలయినవి అసాధువులు, 'కోరంకి' 'కోరిక' అని ఉండవలె నని పండితులెవ్వ రైనా పొరపాటు పడి ఉంటారు.

(5) "జనకజావిరహం బిప్డు సల్పినట్టులన్"— పు. 17.

"మే ల్రతనము లట్టులన్"—పు. 31.

"కుసుమము లట్టులన్"—పు. 90.

"ఇటులనే చిరకాల ముండు ను"—పు. 158

"అట్టులన్, ఇట్టులన్" అనేవి "అట్లా, ఇట్లా" అనే వ్యావహారిక రూపాలను ఇప్పటివారు కల్పించిన కృతక రూపాలు. గ్రంథాలలో ఉంటే చూపించవచ్చును; వ్యవహారములో లేవు. 70వ పుటలో "అటులే కానిమ్ము" అని పంతులుగారే ప్రయోగించినారు. పద్యములో కుదరక 'అట్టులన్, ఇట్టులన్" అని కల్పించుకోవలసివచ్చినది.

(6) "కొలువు విడిచి నగపతి లోపలకు నరిగె"— పు. 4.

"లోపల, వలపల, దాపల," మొద లయినవి ఔపవిభక్తికము లని నిఘంటునిర్మాత లయిన పంతులుగారికి తెలియక కాదు. ఆధునికపండిత కృతకసంప్రదాయానికి వీరు కూడా లోబడవలసి వచ్చినది.

(7) "ఆర్యుని యొక్కయు రాక్షసుల యొక్కయు"—పు. 17.

దీనికి ప్రమాణప్రయోగము పురాణము శాస్త్రీల "ఆయొక్కనున్ను, ఈయొక్కనున్నున్ను" గ్రంథాలలో 'యొక్క' కనబడదు.

(8) "రామనృపచంద్రముఁడై"— కృతిసమర్పణము.

చంద్రమశ్శబ్దము తత్సమ మైనప్పుడు 'చంద్రమసుఁడు' అని కాని 'చంద్రమ' అని కాని లక్షణము ప్రకారము కావచ్చును. కాని, 'చంద్ర

ముఁడు' అని కావడానికి శాస్త్రము గాని, ప్రయోగము కాని లేదు. వ్యవహారములో తత్సమముగా దానికి రూపము లేదు.

(9) "కావ్యంపు గుణగణంబు తప్పె"—అవతారిక.

షష్ఠీసమాసములో ముపర్ణానికి పుంపులు రావచ్చునా? వస్తే, వైకల్పికముగా వస్తవా, నిత్యముగా వస్తవా? ప్రయోగాలు? 'గుణగణంపుఁదప్పె' అని ఎందుకు వ్రాయలేదు?

(10) 'మాబోఁటులు'—అవతారిక.

'మముఁబోనివారు, మముఁబోంట్లు' అని గ్రాంథిక కారకము. షష్ఠీకారకమునకు ప్రయోగమున్నదా?

(11) 'పాదపముల్ తగు నర్ఘ్య మీవుతన్... శైత్యవనానిల మల్ల సీవుతన్"—పు. 64.

'చు, చ్చు' అంతమం గుండే ధాతువు లన్నిటి మీదను ఇట్టి ఆశీరర్థరూపాలు వస్తవా? వస్తే, 'తేవుతన్, క్రోవుతన్, చావుతన్, మోవుతన్' మొదలయిన రూపాలు కూడా సాధువులు కావలెను గదా. ప్రమాణము?

(12) "ఈశైలము మాల్యవంత మను క్ష్మాధర రాజము చుమ్మి"—పు. 17.

"అవి యెల్ల మాటలు కావు చుమ్మి"—పు. 69.

"సంప్రార్థనార్థకా దీత్" అని చదువుకొన్నాము కాని 'ఇత్' అని లేదు.

'ఇతు'కు ప్రమాణ మేమో?

(13) "పగమపవిత్రుఁగాఁ దనను భావన సేయును"—పు. 88.

'తన్ను'కు రూపాంతరముగా పంతులుగారు ప్రయోగిస్తే, వారిమీద ప్రమాణబుద్ధి గలవారు 'నన్ను, నిన్ను' లకు 'నన్ను, నినను' అని ప్రయోగించవచ్చును గదా.

(14) "చిఱునలుక"—పు. 106.

'చిఱు, కుఱు, కడు, నడు, నిడు శబ్దంబుల' మొ. చిన్నయసూరి.

'చిట్టలుక' అని కావలసి ఉండె. 'చిఱు' మీద ద్విరుక్తటకారము రాకుండా ప్రయోగాలున్నవేమో!

(15) "తబలము నాకు, కట్టలుక కొక్క కబళ మౌఁగాత నిపుడు"—పు. 110.

'కావుతన్' మీద అచ్చు వస్తే మాదేశము రావడము సుప్రసిద్ధము.

'కాతన్' మీద కూడా వస్తుందా? ఉదాహరణము?

(16) "ఈవీరుని నన్ను వలెనే చూతుగు గాక"—పు. 127.

"నన్నుంబోలె" అని గ్రంథాలు. 'వలె' ప్రయోగించి నప్పు డేమి కారక ముంటుందో?

(17) "క్రొత్తది పోలె"—పు. 85.

క్రొత్తదియ పోలె. క్రొత్తదియుం బోలె, అనే రూపాలను గ్రంథాలలో చూచినాము. కేవల ప్రథమారూపముమీద కూడా 'పోలె' ను ప్రయోగించవచ్చునా?

(18) "నను జాలని వాఁడు"—పు. 115.

'నాకుఁ జాలని వాఁడు' అని మేము చూచిన కారకము. ద్వితీయా కారకము కూడా ఉంటుందా?

(19) "గ్రామము నంత నొక్కచోఁ జేర్చి"—అవతారిక vi

'అంతన్' అంటే 'అప్పుడు, ఆతరువాత' అని అర్థము. ఆరూపమును 'అంతటిని, సమస్తమును' అనే అర్థములో వాడవచ్చునా?

(20) "మఱి మఱి చెప్ప మనిరి"—పు. 6.

'మరీమరీ' అనే వ్యావహారికరూపానికి ఇది గ్రాంథికీకరణము.

(21) "విద్య మతిమాలిన దానికి నంట దేమి"—పు. 31.

'ఏమిన్ని' అనే వ్యావహారికరూపానికి వచ్చిన పాటిది.

(22) "వత్స కాంతానువృత్తిచాతుర్యము కూడ నేర్చను"—పు. 59.

“తలంచినప్పుడె వత్సలం విజయ వలయు (151). ‘వత్స’ సంస్కృతములో పుంలింగశబ్దము. అకారాంతము. ఇక్కడ మహద్వాచకము గా వాడినారు. శాస్త్రము ప్రకారము తెనుగులో దీనికి ప్రథమైకవచనరూపము ‘వత్సుడు’ కావలెను. ‘వత్స’ అనడానికి శాస్త్రము ఒప్పుకోదు. వ్యవహార రూప మంటే ఆక్షేపణే లేదు.

(23) (నా కులం) “బుస్సున కొట్టును”—పు.39. ‘బుస’ ‘బుస్స’ అని రూపాంతరము కలదా!

(24) “పగదీశిని గాన నడుగుచున్నాను” (2) “కౌన నారెండు కాంతల ముంగాక యిప్పుడు 101.— ‘కౌన’ కళియే అని ప్రభాకరశాస్త్రి గారి బసవపురాణపీఠిక. దీనినిగురించి వంశంలుగారు నిర్ధారణ చేసినారా! ఎట్లు! (సశేషము)

---

# సుస్వాగతం

కొడవటిగంటి కుటుంబరావుగారు

ఇద్దరు మిత్రవాళ్లు విద్యార్థిదశలో ఎంతో అన్యోన్యంగా ఒకటే ప్రాణంగా ఉన్నప్పటికీ—ఉన్నంత మాత్రాన—తదనంతరం కూడా అవిఘ్నంగానే ఉంటారని భావించ నవసరం లేదు. వారట్లా ఉండాలని ప్రయత్నం చెయ్యటంకూడా ఒక్కొక్కసారి విగసానికి కారణ మవుతుంది. ఇక అందులో ఒకడి కోసరం మరొకడు పన్నెండు గంటలు ప్రయాణం చేసి, మూడు రైళ్లు మారి, చివర నాలుగైదు మైళ్లూ పదిసంవత్సరాలనించీ మరమ్మత్తు అన్న మాట ఎరగని రోడ్డుమీద ఊగిసలాడే గుర్రబ్బండిలో ప్రయాణం చేసి సూర్యాస్తమయం అయేసరికి ఒక అరోగామయపు పల్లెటూరు చేరట మనే దుందే, నిద్రనష్టం, శరీరకష్టం మొదలయిన వటుంచి, తిండికైతే నేం కూలీలకైతే నేం తంతరాలకైతే నేం, ఏడురూపాయల ఎనిమిదణాల తొమ్మిది పైసలు దండుగ. సరిగా జోగారావువంటి మనిషి చెయ్యవలసిన పనే! ఒకరకం మనిషి ఏపని తలపెట్టినా చుక్కెదురవుతుంది. జోగా వారకం మనిషి.

రాజమండ్రి వచ్చేవరకూ అతనికి ప్రయాణం నల్లేరుమీద బండినడక లాగే ఉంది. తరవాత కొంతకాలం వరకూ రైలెటు పోతున్నది, ఇది ఏదేశం, మనుష్యు లెట్లా ఉంటారు, ఊళ్లెట్లా ఉంటాయి అనే ఆలోచనలు వచ్చినై. కాని ఏలూరు రాకమునుపే వాటిని గురించి ఆలోచనలు మానేశాడు. తెనాలిలో రైలు మారిన తరవాత అంతా ఒకటిగానే ఉంది. బొందెతో పరలోకానికి వెళ్లితే ఇట్లాగే ఉంటుంది కదా అనుకున్నాడు.

అనుకోకుండా, అసందర్భంగా ఒక్క ఇల్లన్నా లేని చోట అసలు ప్రయాణం పూర్తి అయింది. బండి వాడు దిగమన్నాడు. జోగారావు కిది చాలా అన్యాయంగా కనపడ్డది. ఇంకా బస్సు కూడా అక్కడే ఆగి ఉండటం చూసి కొల్లూరు మునిసిపాలిటీవాళ్లు బళ్లను ఊరికి మైలులోపలికి రానివ్వటం లేదేమో ననుకున్నాడు. అతను బండీవాడికి పక్కనున్న బయలు చూపించి “ఇదేనా కొల్లూరు?” అన్నాడు. అవు నన్నాడు బండివాడు. అయితే బండి దిగ నన్నాడు జోగారావు. దానిమీదట బండీవాడు కొంతసేపు మొహాన ఆశ్చర్యరసం ఒప్పించి, తురకం తెలుగు కలగలుపుతో స్వాగతం ఒకటి వినపడీ వినపడకుండా చెప్పి, చివరకు “మీా రవ రింటికి పోతారండీ?” అని అడిగాడు.

“డాక్టరు సుబ్రహ్మణ్యంగా రింటికి” అన్నాడు జోగారావు.

"ఏది? కొత్త డాక్టరుగారింటికా?"

"నిస్సందేహంగా"

"గోపాలంగారబ్బాయిగారు?"

"అలాగే విన్నాను నేను కూడా!" జోగారావు నిట్టూర్పు విడిచాడు.

"అంటే పొట్టి సుబ్బరమణ్యంగారు కాదంటండీ!"

"నే కాదన్నానా?"

బండివాడు తృప్తిపడి "పదం డయితే!" అన్నాడు. లక్షణం చూస్తే వాడికి తప్పింటికి పోవటం నామోషీగా కనపడ్డది.

కొల్లూరు మునిసిపాలిటీని తొందరపడి నిందించి నందుకు జోగారావు నొచ్చుకున్నాడు. బండి యాభై గజాల దూరం పోయి ఆగింది. కాని తప్పంతా జోగారావుది కాదు. కొల్లూరు నడివీధి పొలిమేరలా గుండటం కొంతవరకు కొల్లూరు తప్పనే చెప్పాలి సుంటుంది. ఒక్క నిట్టూర్పు విడిచి జోగారావు తోలుపెట్టె తీసుకుని బండి దిగాడు. అతని కష్టాలు గట్టెక్కినై. భయాలు పరారయినై.

(నిజంగా కొల్లూరుందా? ఉంటే తను పోతున్నది సరి అయిన మార్గమేనా? రైలు వాళ్లు పొరపాటు పడలేదు కద? ఇదంకో కొల్లూరు కాదు కద? బండీవాడికి దారి సరిగా తెలుసునా? అప్పుడే సాయంత్రం ఆరుగంట లయిందే? రాబోతున్న చీకట్లో తన గతే మవుతుంది—ఇది కొల్లూరు కాకపోతే? మొదలయిన భయా లన్నీ అంతరించినై. ఇది కొల్లూరు కావటమే కాకుండా ఈ కనపడుతున్న అరుగుల ఇల్లు సుబ్రహ్మణ్యం గారిది. ఇక దాని యిష్టం వచ్చి నప్పుడు రావచ్చునని జోగారావు చీకటి కనుజ్ఞ యిచ్చాడు.)

భయం పోగానే దాని స్థానంలో ఆశ్చర్యం వచ్చింది. సుబ్రహ్మణ్యం ఈసంవత్సరంలో ఏమైనా మారాడా? తన్ను చూడగానే ఏమంటాడో? తన్ను మళ్లీ త్వరగా పోనిస్తాడా? జోగారావు మొహాన ఒక విధమైన చిరునవ్వు మొలకెత్తింది.

అతను కావాలని రెండు నిమిషా లాలస్యం చేశాడు తలుపు తట్టడానికి. లోపల సుబ్రహ్మణ్యం ఏం చేస్తుంటాడు? త నిరోజు వస్తాడని అతనికి తెలుసును. బండి చప్పుడు విని గ్రహించే ఉండాలి. దొంగ! బయటికి రాడు!

చివరకు జోగారావు అరుగుల మధ్య ఉన్న రెండుమెట్లు ఎక్కి మెల్లిగా తలుపు తట్టాడు. జవాబు లేదు. మళ్లీ తట్టి చెవులు రిక్కించి విన్నాడు. చడీ చప్పుడూ లేదు. కొంచెం గట్టిగా తట్టి "సుబ్రహ్మణ్యం!" అని పిలిచాడు. లోపల ఎక్కడో కొద్ది అలికిడి. తరవాత కొద్ది సేపటికి "ఎవరు, నాయనా?"—స్త్రీ కంఠం. అతని తల్లేమో?

"సుబ్రహ్మణ్యం ఉన్నాడాండి?"

"లేడు నాయనా!" ఈ సారి మాట తలుపు వెనక నించే వచ్చింది. వెంటనే తలుపు తెరుచుకుంది. యాభై ఏళ్లు దాటిన వితంతువు మొహం బయటికి పెట్టి అతన్ని చూసి సంబోధన మార్చి, "పొద్దునే పల్లెటూరు వెళ్లాడండీ! ఈపూటే వస్తాడో, రేపే వస్తాడో?" అనుకుంటూ తలుపు మూసి వెళ్లి పోయింది.

జోగారావు మొహాన చిరునవ్వు నిశ్శేషంగా మాయమైంది. దీని అర్థమేమిటి? తను రాసిన ఉత్తరం ఏమయింది? వాల్తేరు నించి ఇచ్చిన తంతి ఏమైంది? ఈ చీకటి అప్పుడే వచ్చి పడ్డదేం?

౨

కొల్లూరు గ్రామస్థులు ఈకష్టసమయంలో జోగారావు నాదుకో లేదా అని అనుమానం రావచ్చు. ఆదుకున్నారు. ఆవితంతువు తలుపు మూసి పోయిన అయిదు నిమిషాలకు ఒక ముసలాయన నిర్మానుష్యమైన వీధివెంట పోతూ అతన్ని చూసి ఆగి "ఎవరది?" అన్నాడు. ఆమనిషి కనపడేవరకూ కొల్లూరువాళ్లు దీపాలు పెట్టిన తరవాత బయటికి రారేమో నని సందేహిస్తున్న జోగారావు

ఆఊళ్లో కనీసం ఒక్కడైనా ధైర్యస్థు డున్నందుకు సంతోషించి, ఆయన తన కేదైనా సహాయం చేస్తా డని ఒక వాక్యంలో తన గద్య చెప్పి రెండో వాక్యంలో క్లుప్తంగా తన ప్రయాణాన్ని గురించి ప్రారంభించాడు. కాని ఎందువల్లో అతను మాట్లాడటం పూర్తి కాకపూర్వమే ముసలాయన సాగిపోయినాడు. ఇంకో పడుచాయనా ఈవిధంగానే చేశాడు. జోగారావు ఇటువంటి అవమానాలు రెండు సార్లకు మించి భరించే స్వభావం కలవాడు కాడు. అందుచేత తరవాత తన్నాదుకో వచ్చిన వాళ్లతో నోటికి వచ్చిన అబద్ధాలన్నీ ఆడి సాగనంపాడు.

ఒక చెంపనించి నిస్పృహ అతని మనస్సు నావరిస్తున్నది. ఆశలో నిరాశ—కాదు, నిరాశలో ఆశను గురించి ఒక మహాకవి పాడనే పాడాడు. జోగారావు కూడా ఈ కారుమబ్బులోనించి వస్తున్న మెరుపును చూశాడు. తీరా ఇంకో గంటలో సుబ్రహ్మణ్యం రానే రావచ్చును. లేదా గుర్రబ్బండీ ఎక్కి పోతే స్టేషనూ దానిలో బెంచీ ఉండనే ఉంది రాత్రి గడపటానికి.

వీధివెంట ఒక బండి మెల్లిగా రావటం మొదలుపెట్టింది. జోగారా వాబండి కడ్డం తగిలి ఒక అరగంట ఉండి రైలుకు బండి కడతావా అని అడిగాడు. బండీవాడు రా నన్నాడు. ఆరోజుల్లో కొల్లూరు రోడ్డుమీద వేమూరు కొల్లూరు నవీన దొంగల సమాజంవాళ్లు జోరుగా పనిచేస్తున్నారు. జోగారావు నిస్పృహ పరిపూర్ణమైంది. కవిగాడు పప్పులో కాలేశా డనుకున్నాడు జోగారావు. కాని రవి గాననిచో కవి గాంచు నన్న వాళ్లు పొరపాటు పడలేదు. ఆ కటిక చీకట్లో ఆచుక్కల నల్లని కాంతిలో వీధి చివర ఒక తెల్లని ఆకారం కనిపించింది. ఆ ఆకారం మెల్లిగా సమీపించి తనకు మూడు గజాల్లో ఆగే వరకూ ఆమనిషి స్త్రీ అని జోగారావు గ్రహించలేదు. కేవలం స్త్రీ కూడా కాదు. పదమూడు పద్నాలుగేళ్ల పిల్ల!

ఆమె అతని వంక ఒక్క క్షణం చూసి మెల్లిగా గడపమె ట్లెక్కి తలుపు తెరిచి లోపలికి వెళ్లింది.

లోపల మాటలు వినపడ్డై.

"ఏమిటే అమ్మాయి! అట్లా మీది కొస్తావు? సూతకం మయిలదానివి! మడికట్టుకుని ఏడిస్తిని కదా! మీబస్తీ వేషాలూ మీరూను!"

తరవాత చిన్న గొంతు.

"అది కాదమ్మా! బయట కూర్చున్న దెవరే!"

"ఏమోనే? నే చూడ లేదు. నుం దవతలికి పోదూ, తల్లీ!"

"అందు క్కాదే ఇవాళ అన్నయ్యకు టెలిగ్రాం రాలా? ఆయ నేమో?"

"......"

"కనుక్కోనా?"

"నీ కెందుకు పోనీవే!"

కొంచెం సేపు నిశ్శబ్దం.

"కనుక్కుంటానే!"

"అట్లాగే? పోవే!"

"అయ్యో తల్లీ!"

లాంతర తీసుకొని ఆపిల్ల బయటికివచ్చింది. జోగారావు గుండె దడదడ లాడటం మొదలుపెట్టింది.

"మీ దేవూ రండీ?"

జోగారావు చెప్పాడు.

"మీరేనా టెలిగ్రాం ఇచ్చింది?"

"అవును"

"లోపలికి రండి. మీ టెలిగ్రాం వచ్చినప్పుడు మాఅన్నయ్య ఊళ్లో లేడు. ఎవరిచేతనో చదివిస్తే సరిగా చదవ లేదు. పాపం, మీరు వచ్చే సమయానికి ఊళ్లో లేకుండా వెళ్లాడు."

జోగారావు అరుగుమీదినించి పాతుకుపోయినట్టు మెల్లిగా లేచి చేతి పెట్టె తీసుకుని లోపలికి వెళ్లాడు. ఆపిల్ల దేవతలాగ రాకపోతే తన గతి ఏమై ఉండును? అతని కింకా ముళ్లమీద ఉన్నట్టే ఉంది. సుబ్రహ్మణ్యం వస్తే కాని ఆస్థితి అంతరించదు.

ఆపిల్ల లోపలికి వెళ్ళి తల్లితో చెప్పింది. ఆవిడ ఒక చెంబుతో నీళ్ళిచ్చి "కాళ్ళు కడుక్కొని చాపేసుక్కూర్చో, నాయనా!" అంది, మళ్ళీ సంబోధన మార్చి.

అతను చాప వేసుకుని కూర్చున్నాడు. ఆపిల్ల వెళ్ళి వంటఇంట్లోనే ఒదిగింది. తల్లీ కూతుళ్ళు ఏదో చిన్న గొంతుతో మాట్లాడటం మొదలుపెట్టారు. అతనికి ప్రతిమాటా వినపడుతున్నది. కొంత సేపయిన తరవాత అతనికి చిత్ర మయిన ఆలోచన వచ్చింది. అత నాపిల్లను చూసి కొద్ది నిమిషాలయిందో లేదో అప్పుడే ఆమెను గురించి ఎంత తెలుసును!

ఆమె పేరు జానకి. సుబ్రహ్మణ్యం చెల్లెలు. వితంతువు. మొగుడు పోయి అప్పుడే నాలుగేళ్ళయింది. పెళ్ళయి యెంతకాల మయిందో? తెలివి కలది. నేర్పరి. కొంత కాలం బస్తీలో పెరిగింది. "జానకి వదనంబు చంద్రబింబంబు" అనుకున్నాడు జోగారావు. అతని కకస్మాత్తుగా కవిత్వం అబ్బింది.

3

"మడి గట్టుకో, నాయనా, వంటయింది" అన్నది ముసలావిడ.

తలుపు తెరుచుకుని సుబ్రహ్మణ్యం ప్రవేశించాడు. జోగారావు కొంచెతనానికి ఉలక్కుండా పలక్కుండా కూర్చున్నాడు.

సుబ్రహ్మణ్యం స్నేహితుణ్ణి చూసి ఎక్కువ సంతోషం కనపరచ లేదు.

"ఎప్పుడొచ్చావు?" ఆ ప్రశ్నలో ఎందుకొచ్చా వన్న ధ్వని వినపడ్డది జోగారావుకు.

"ఒక గంటయింది" అన్నాడు జోగారావు. అతను స్నేహితుడి ప్రశ్నలో ఉన్న ధ్వనికి కూడా సమాధానం ఇచ్చాడు—అబద్ధం మాత్రం ఆడాడు. "బెజవాడలో మాబంధువు లున్నారు. అంత దాకా వచ్చినప్పుడు నిన్ను కూడా చూడాలనిపించింది." (జోగారావు బెజవాడలో దిగ లేదు.)

సుబ్రహ్మణ్యం మొహం కొంచెం తెరిపిచ్చింది.

"రెండు రోజు లుంటావా?" (ఎప్పుడు పోతా వని ధ్వని)

"ఉండను. రేపు సాయంకాల మయినా పోక తప్పదు."

సుబ్రహ్మణ్యం మొహం మరింత తెరిపిచ్చింది.

"అబ్బాయి! వంటయింది. లేవండి" అన్నది తల్లి లోపలినించి.

భోజనం చేస్తూ జోగారావు "నా ఉత్తరం అందిందా?" అన్నాడు.

"ఏం ఉత్తరం? అంద లేదోయి!"

"దాన్లో నే నిలా రాబోతా నని రాశాను. అందకేమో! ఈ ఊరికి ఉత్తరం చేరక పోయినా నాకాశ్చర్యంగా ఉండదు సుమీ. రైలుకు మాత్రం ఊళ్ళో లేకుండా పోయావు." సావిట్లోనించి సంభాషణ అంతా వింటున్న జానకి జోగారావును చూసి జాలిపడ్డది. జోగారావు రాసిన ఉత్తరం రావటం సుబ్రహ్మణ్యం విసుక్కోటం జానకి అప్పుడే మరవ లేదు.

భోజనా లయిన తరవాత స్నేహితు లిద్దరూ చల్లగాలికి వాకిట్లో అరుగుమీద కూర్చున్నారు. కొంత సేపు ఎవరిలోకంలో వా రున్నారు. జోగారావు లోపల తల్లీ కూతుళ్ళకు జరుగుతున్న సంభాషణ వింటున్నాడు.

"అన్నానికి రావే అమ్మాయి" అంటున్నది తల్లి.

"నీ ప్రాక్టీ సెట్లా ఉంది?" అన్నాడు సుబ్రహ్మణం.

"అలా అలా ఉంది!..."

"నాకు ఆక లవుతున్నదే!" అంటున్నది జానకి.

"నేను రమ్మంటూనే ఉంటిని గాదటే?"

"నీకేం లే! మీనాన్నగారి ప్రాక్టీ సంతా నీదేగా? నాబోటి వాడికి..." సుబ్రహ్మణ్యం.

ఇంతలో జానకి మాట చెవిన పడేటప్పటికి సుబ్రహ్మణం అంటున్నది వినటం మానేశాడు జోగారావు.

"ఎక్కడో మైలుదూరం వెళ్లి విస్తరి పారెయ్యా లమ్మా. అక్కడ పాములు—"

"మీ నాన్నగారి ప్రాక్టీ సెట్లా ఉంది?"

"బాగానే ఉంది."

"అంత ఒళ్ళు బరు వేమే!"—తల్లి.

"పాములే! పోనీ ఈ మూల పెట్టి రేప్పొద్దున—" జానకి.

"ఈ పల్లెటూళ్లో ఏం డబ్బొస్తుంది? బస్తీ చేరతాను." జోగారావు విసుక్కునే మనిషి కాదు. కాని సుబ్రహ్మణ్యం కాస్సేపు కట్టిపెడితే బాగుం డునని పించిం దతనికి.

"చాల్చాల్లే. నేర్చుకు పోతున్నావు. నేపూట ఇల్లు కడుక్కోవద్దా ఏమిటి?"—తల్లి.

"పోనీ నాకంత ఆకలిగా లేదు."—జానకి.

"అస లదీ ఉన్న సంగతి. ఆ వైద్యు డేమ్మంది సున్నాడో చరచరా ఆకలే లేదు. తింటావా? నన్ను కూర్చోమన్నావా?"

"నువ్వు కూర్చో!"

"బక్కపేగు మాడనీ!"

జోగారావు పరధ్యానంగా ఉండటం గమనిం చాడు సుబ్రహ్మణ్యం.

"చంద్రోదయం అయింది కాలవల వైపు పో దాం రావోయి. చాలా బాగుంటుంది." అన్నాడు సుబ్రహ్మణ్యం. జోగారావు మాట్లాడకుండా లే చాడు.

జోగారావుకు కొల్లూరు రావటం నిరుత్సాహ కర మైంది. అయినా దీనిలో కూడా ఒకటి రెండు విశేషాలు లేకపోలేదు. మొదటిది జానకి. రెండోది కాలవలు. అంతకు పూర్వం జోగారావు కాలవలు చూడ లేదు. కొన్ని వందల సార్లు సముద్రం మీద చంద్రోదయం చూసిన వాడికి కాలవలు ఆశ్చర్యం కలిగించటం చిత్రమే కాని అసంభవం కాదు. మొదటినించీ చదువుకున్న పట్టణవాసపు ఆడపిల్లల మధ్య తిరిగిన వాడికి పల్లెటూరి వితంతువును చూడ గానే గుండె ఎగిరి పడటం కూడా అటువంటిదే!

ఇద్దరూ ఇల్లు చేరేటప్పటికి పదకొండు గంటల యింది. జానకి ఒక మూల చాపమీద పడుకుని నిద్రపోతున్నది. అన్నం లేకుండా? పల్లెటూరివా ళ్ళెంత క్రూరంగా ఉంటారు పిల్లల విషయంలో కూడా! జానకి చాపకు ఇవతలగా మంచం వేసుకు న్నాడు సుబ్రహ్మణ్యం. అతని పక్కన జోగారావు మరో మంచంమీద పడుకున్నాడు.

జోగారావు చాలా సేపు మంచి నిద్ర పోయి నాడు కాని తెల్లవారుఝామున అతనికి కలవచ్చింది. ఆకల్లో జానకీ తనూ కలిసి చదువుకున్నారు. తనేమో అచ్చంగా జానకి మొగుడి ల్లే ఉన్న ఒక పెద్దమని షికి రెండో పెళ్లి చెయ్యాలని ప్రయత్నం చేస్తుం డగా ముసలావిడ వచ్చి "అమ్మాయి! అమ్మాయి! నేను కాలవకు పోతున్నా తలు పేసుకోవే" అం టోంది. జోగారావుకు మెళకువ వచ్చింది. అతని కళ్లు తెరిచే టప్పటికి అంతా ప్రశాంతంగా ఉంది. ముస లావిడ జానకి తన కేక విన్నదీ లేందీ కూడా గమ నించకుండా కాలవకు బయలుదేరి పోయింది. సుబ్ర హ్మణ్యం జానకీ నిద్రపోతున్నారు. జోగారావు జానకి వంక నిర్ఘాంతపోయి చూశాడు. అదేం నిద్ర! జోగారావు కళ్లకు జానకి నిద్రపోతున్న మని షల్లే లేదు. చాలా సేపు బాధపడి చివర కెట్లాగో బాధ నివారణ అయినట్టుంది. ఆఖరు నిద్రేమో? రాత్రి జానకి అన్నం తిన లేదు. శోష వచ్చిం దేమో? ఆమె వంక అతను అయిదు నిమిషాలు నిదానించి చూశాడు. ఏమీ చలనం లేదు. ఊపిరి పీలుస్తున్న లక్షణా లైనా లేవు. జోగారావు కంగారు పడ టం మొదలుపెట్టాడు. నాలుగు చుక్కలు గొం తులో నీళ్ళయినా పోస్తే—తనిప్పు డేం చెయ్యా లి? దీపం పెద్దది చేస్తే జానకిని బాగా చూడవ చ్చును కాని హెల్తురుకు సుబ్రహ్మణ్యం లేచి ప్రశ్న లువేస్తే సమాధానం చెప్పటం కష్టం. ఇంతకూ ఆ పిల్ల జీవించి ఉన్నదీ లేందీ చూడటం ఎట్లా?

జోగారావు మెల్లిగా పక్కదిగి జానకి వైపు రెం డడుగులు వేసి దబదబా తిరిగి వచ్చి పక్క

మీద గాఢనిద్రలో ఉన్నట్టు పడుకున్నాడు. అంత భయం వేసింది. ముచ్చెమటలు పోసినై. సూర్యుణ్ణి సమీపించబోయిన సంపాతి కథయింది. ఎందు కంత భయం? మూడు నిమిషా లుండి జోగారావు మళ్ళీ లేచాడు. ఎంతో కష్టంమీద జానకిని సమీ పించాడు. అతని గుండెలు కొట్టుకోటం పద్ధతి చూస్తే వాటి బతుకు నిమిషాలమీద ఉన్నట్టు కన పడ్డది. అయినా సరే! మెల్లిగా వంగి జానకి ముక్కు దగ్గిర వేలు పెట్టాడు. అమ్మయ్య! ఊపి రాడుతూనే ఉంది. ఫరవా లేదు.

“జోగారావు!”

జోగారా వదిలిపడి లేచి నిలుచుని వెనక్కు తిరిగి చూశాడు. సుబ్రహ్మణ్యం పక్కమీద శిలావిగ్రహ మల్లే లేచి కూర్చుని ఉన్నాడు.

“ఏమిటో యది!”

జోగారావు మాట్లాడ లేదు. ఏముంది మాట్లాడ టానికి? నీచెల్లెలు జీవించి ఉందో లేదో చూస్తు న్నా ననటం కన్న అనేకరెట్లు అనకపోవటమే మంచిది.

జోగారావు మౌనం సుబ్రహ్మణ్యానికి గట్టిగా మాట్లాడటాని కవకాశ మిచ్చింది. సుబ్రహ్మణ్యం మాట్లాడాడు కూడాను. ఉపన్యాసం, చదువుకున్న అజ్ఞానులతో ప్రారంభమై, ఇంట తిని ఇంటి వాసాలు లెక్కపెట్టటం దగ్గిర తారట్లాడి, బ్రహ్మాండ మైన నీతిలో కొట్టుకుని కాస్సేపు ఈదు లాడి, జోగారావు ఇష్టం వచ్చినప్పుడు వచ్చిన దారి పట్టగలందులకు పాస్‌పోర్ట్‌తో అంత మయింది.

ఈఅల్లరిలో జానకి లేచి కూర్చున్నది.

సుబ్రహ్మణ్యం వికారంగా నవ్వుతూ, “ఏమే, అమ్మాయి నిన్ని దొరగారు తాకాడా? ఎందుకంటే, దాని మంచిచెడ్డ లట్లా ఉంచి వారు మైలపడ్డందుకు స్నానం చెయ్యవలసి ఉంటుంది!” అన్నాడు.

జానకి చప్పున కథపట్టు అంటుకోలేకపోయింది. ఆమెకోసం తను పావుగంట నించీ దొంగనిద్ర పోతూ గమనించిం దంతా సుబ్రహ్మణ్యం చెప్పు కొచ్చాడు. జానకి నిర్ఘాంతపోయి నిజ మేనా అన్నట్టు జోగారావు వంక చూసింది.

సుబ్రహ్మణ్యం కోసం జోగారావు నోరు చేసుకోదలచక పోయినా జానకికోసం నిజం చెప్పేశాడు ఆమె నవ్వినా సరే నని.

“నమ్మతావా?” అన్నాడు జోగారావు చివ రకు సుబ్రహ్మణ్యంతో.

సుబ్రహ్మణ్యం ఒక్క క్షణకాలం కలవరపడి, “అయితే నువ్వు రాత్రి భోంచెయ్య లేదా?” అన్నాడు చెల్లెలితో

“చేశాను—”

చెల్లెలి కడ్డం వచ్చి సుబ్రహ్మణ్యం మాట్లాడ బోయినాడు కాని జానకి అతని కా అవకాశం ఇవ్వకుండానే జోగారావు వైపు తిరిగి, “మీమాట నేను నమ్మాను. మీరు నాకు చూపించిన దయ—జాలి--మరవను. కాని మీకిది ఉండదగిన చోటు కాదు. మాఅన్నయ్యకు మీరు రాసిన ఉత్తరం అందింది. అదీకాక నిన్న మాఅన్నయ్య ఊరికి పోవ టాని క్కూడా కారణం ఏమిలేదు, మీరు వస్తా రేమో నని భయం తప్పితే. ఆయన అవస్థ చూసి నేను మీరిట్లా ఉంటా రని—ఇంకో విధ మైన మని షేమో నని కూడా అనుకున్నాను. వెంటనే వెళ్లి పొండి!” అన్నది.

* * * *

రైలులో జోగారావు మనస్సుతో పెద్ద ఘర్షణ పెట్టుకున్నాడు.

“నా కా జానకి కావాలి” అన్నాడు జోగా రావు.

తీర్పు మనస్సు చేతులోనే ఉంది.

“ఓరి జోగులూ! మెరుపు మెరిసి పోవలిసిందే! ఆకాశాన అట్టే ఉండే మంటే ఎలా ఉంటుంది?” అన్నది మనస్సు నిర్దయగా.



# వేదికలు—పత్రికలు

### కవులు

అక్టోబరు చివరి వారమున విశాఖపట్టణమున కవితా సమితివారు జరిపిన ఆంధ్రకవుల ఛాయాచిత్రప్రదర్శనము తెరుచుచు మల్లంపల్లి సోమశేఖరశర్మగారు తమ యుపన్యాసమున కవుల నిట్లు కీర్తించినారు.

"జాతీయజీవితమున సమగ్రముగ ఆవరించువారు కవులు. కవిసృష్టి పరిపూర్ణమైనది. మీకును నాకును తెలియని రహస్యము లెన్నో కవికి తెలుసును. తూలిక చూపలేని భావభంగిమలు విన్యాసములు, కంఠము కనబరుపలేని సున్నితములైన నాదపు ఒరవులు, ఒద్దికలు కవి సృష్టియందు సహజము లయిన రంగులతో పడగెత్తి నాట్య మాడగలవు. అందువల్లనే పరమేశ్వరుని సృష్టికి పరమావధి కవి. సాహిత్యమే ప్రథమగణ్య మయిన కళ. తలచెనా కవి నీటిలో నిప్పు నూదగలడు. అగ్నిలో చందన శైత్యమును గిలకొట్టగలడు. దుఃఖవారాశిని స్వర్గధామము చేయింపగలడు. గగనకుసుమమును మణగగొట్టి దానికి తావి కల్పింపగలడు. ఈయకటావికటపు భీభత్సస్సృష్టిని మధురాతిమధుర మైనదొక పాటగా దిద్ది మురళి మ్రోయించగలడు. అణువు అణువు అతిశ్రావ్య మైన పాటలో తీయని తేటగా హత్తుకొనిపోవును. అంతటి చతురుడు, అంతటి యుద్దండుడు కవి. శాపానుగ్రహశక్తి యుక్తుడు. నిరంకుశుడు. రాజ్యభ్రష్టుని రాజ్య మెక్కించగల నేర్పుకూడ అతని కున్నది. తెనుగువా రెరుగని చరితము లా యివి?"

### ఆముక్తమాల్యద కర్త...?

నవంబరు 10వ తేదీని విశాఖపట్టణమున ఆంధ్రవిశ్వకళాపరిషత్తుయొక్క తెనుగుసంఘము పక్షమున ఆంధ్రవిశారద శ్రీ తాపీ ధర్మారావునాయుడుగారు ఆముక్తమాల్యదాకర్తృత్వమును నిర్ణయించుచు నిట్లు వాక్రుచ్చినారు.

"......ప్రతి కవికిని ఒక ప్రత్యేకశైలి యుండును. అది వానికి తక్క ఇంకొకనికి చొప్పడదు. మనుచరిత్రమున శైలి ధారాళముగను, హృద్యముగను సరళముగను పర్విడుచున్న ఆముక్తమాల్యదయందు కఠినముగ, ప్రవాహము లేక కుంటుపడుచు నుండును. కృష్ణదేవరాయలు సమూహము అను అర్థము వచ్చునప్పుడెల్ల 'కదంబము' అనియే వాడుచుండును. ఇది వీని అభిమానపదము. ఇట్టి భేదములు పద్యముల యందును, వృత్తముల యెత్తుబడి యందునుగూడ గాననగును. రాయల కందపద్యము అన్ని విధము లను ఎన్నుకొన దగినది. సరళమైన నడక, చిక్కని ఎత్తుబడి, తదనుగుణ్యమైన పదముల కూర్పు, విపులమైన వర్ణన గలిగి తరుచు సగణముతో ప్రారంభమగును. సీసముల తరువాత సాధారణముగా రాయలు ఆటవెలదినే వ్రాయుచుండును. కాని పెద్దన గీతమును వ్రాయును. మనుచరిత్రమున సీసము పాదమునకు పాదమునకు విరుగుచుండును. రాయల సీసములు ఒక పాదమునుండి వేరొక పాదమునకు పదములు వచ్చుచుండును. పెద్దన ఊహాప్రపంచమున నున్న వానినే వర్ణించిన, ప్రత్యక్షముగా చూచిన దానినే రాయలు వర్ణించును. భిన్న భిన్న అవస్థలలో, భిన్నభిన్న ప్రదేశములందు భూమి, ఆకాశము, పరిసరవస్తుసముదాయము—వీటి రంగు ఎటుల మారుచుండునో రాయలు ప్రత్యేకశ్రద్ధతో కనుగొనును. ఆముక్తమాల్యదలో ఈ వివేచనమే కనపడును. రాయలు భోగశాలి కనుక వివిధ కాలములలో వివిధభక్ష్యములను చేర్కొనెను. ప్రయాణసన్నాహవేళ ఒక వస్తువునైనను మరువక వలయు భోజనసామగ్రిని వర్ణించి చెప్పెను.

సహజముగా రాయలు సంస్కృతకవి అయియుండుటచే ఆంధ్రమున సులభముగను, సరళముగను, ధారాశుద్ధితో చెప్పలేకపోయెను. ఇట్టి కవిత్వమును పెద్దనవంటి కవిపుంగవుడు వ్రాయడు. వ్రాయ జాలడు. మనుచరిత్రమునందలి ధారాశుద్ధి గల కవిత్వమును చెప్ప నేర్చినవాడు పాండిత్య ప్రకర్షయే యెక్కువగా గన్పడు ఆముక్తమాల్యదను వ్రాయలేడు. ఇంతకన్న మిన్న యగు తార్కాణ మరియొకటి లేదు. రాయలకు సర్వతోముఖపాండిత్యమును ఉపజ్ఞయు గలవు. పండితుడైన జాత్యంధుడు మనుచరిత్రమును వ్రాయగలడు; గాని ప్రత్యక్షముగా చూచిన గాని వ్రాయజాలని వర్ణనలు ఆముక్తమాల్యదయందు గలవు. మనుచరిత్రములోని వర్ణనలు సమయసిద్ధములు. ఆముక్తమాల్యదలోనివి స్వభావసిద్ధములు. ఇన్ని మహత్తర భేదములు ఈరెండు గ్రంథములకును, ఈ యిరువురు కవులకును గన్పడుచుండగా 'కవితాప్రావీణ్యఫణీశ' అని పేరు గాంచిన వాడును సర్వకాలమును కవితాగోష్ఠినే గోరుచు అష్టదిగ్గజము లనంబరగిన మహాకవులను దన యొంట నుంచుకొనినవాడు నగు రాయలకొరకు పెద్దన ఆముక్తమాల్యదను వ్రాసెననుటకన్న మహాపరాధ మేమి గలదు? వృత్తముల యెన్నిక, పదముల కూర్పు, సాధారణముగా సీసము తరువాత ఆటవెలదియే యుండుట, ప్రత్యక్షవర్ణన, విపులపరిశీలనను, కందపద్యముల నడక మొదలగునవన్నియు ఆముక్తమాల్యద కర్త అల్లసాని పెద్దన కాడనియు, కృష్ణరాయలే అనియు నిరాఘాటముగ చాటుచున్నవి''

## కృత్యవిభాగము

నవంబరు మొదటివారమున ఏలూరిలో జరిగిన ఏడవ ఆంధ్రమహిళాసభకు సంబంధించిన ఆహ్వానసంఘమునకు ఉపాధ్యక్షురాలగు చుండూరి రత్నమ్మగారు తమ ప్రారంభోపన్యాసమున 'సంసారనిర్వహణ' మను శీర్షికలో యిట్లు చెప్పినారు.

"విద్యావిషయములో ఆసలిప్పటి విద్యాపద్ధతులు పురుషులకును నైతికముగను, ఆర్థికముగను అనర్థదాయకముగ నుండి నిరుద్యోగసమస్యను అధికము చేయుచు సేవకతకు దారి చూపుచుండ స్త్రీలను గూడ ఆదారినే నడిపించుట ఒక గొప్ప లోపము. జీవితయాత్రలో పురుషుడు నిర్వహింపవలసిన పనులు కొన్ని, స్త్రీ బాధ్యతలు కొన్ని గలవు. స్త్రీ పురుషులు ఉభయులు గృహకృత్యములలోనే యుండుటయు, లేక యివి వదలి వారు లౌక్యవ్యవహారములయందే నిమగ్ను లగుటయు సంసారనిర్వహణముల కసంభవము. ఈసమస్యనే జర్మనీదేశపు (ఛాన్సలరు) హిట్లరు ఈమధ్య పరిష్కారము చేసెను. స్త్రీలను గృహనిర్మాణమునకు రాణులుగను, స్త్రీ జనాభ్యుదయమునకు బ్రహ్మాండమగు ఒక శక్తిగను, ఏర్పాటు చేసి పురుషులను లౌక్యవ్యవహారములయందును, రాజ్యాంగనిర్మాణమునందును కర్తలుగా శాసించెను. స్త్రీలను ఉద్యోగ పదవులలో నుండి తప్పించి పురుషుల నిరుద్యోగ సమస్యను పరిష్కరించి ఆర్యసాంప్రదాయముల ననుకరించెను. అంతమాత్రమున స్త్రీ యితరవ్యవహారములలో అడుగు బెట్టగూడ దని కాదు. అవసరము వచ్చిన స్త్రీలు పూర్వభారతనారీమణులవలె సకలకార్యకలాపములలో ముందంజ వేసి తమ సహజశక్తిసామర్థ్యములను ప్రకటింపగలరు. అట్లుగాక సమానహక్కుల పేరిట గృహకృత్యములను, సంసారబాధ్యతను ఉపేక్షించి స్త్రీలు పూర్తిగా రాజ్యాంగవ్యవహారములలోను, ఆటపాటలలోను, స్వేచ్ఛావిహారములలోను, తిరుగ నేర్చిన గృహములలోను బయటను ఉభయులకు పోటీ వచ్చును. సంతానమును శరణాలయములకో, బోర్డింగులకో, హోటళ్లకో వప్పజెప్పుట, వంటయిండ్లు వంటలక్కలకు వప్పజెప్పుట, ఉదయం మిత్రగోష్ఠి, సాయంత్రం క్లబ్బులు, ఆటపాటలు, రాత్రిళ్లు సినిమాలు, నాటకాలు, సభలు మొదలగునవి యిప్పటి నాగరిక పద్ధతులు. ఇవ్వేమన ఆదర్శములుగా

చాలమంది భావించుచున్నారు. ఈ ఆదర్శములకు అలవాటు పడిన స్త్రీపురుషుల మధ్య అనురాగము దూర మగుచున్నది. పాశ్చాత్యదేశములలో స్త్రీ స్వాతంత్ర్యము పేరిట సంసారములు కూలిపోవు చున్నవి. ఈసాంప్రదాయములు మన విద్యావతు లగు కొందరు సోదరీమణుల హృదయములలో నాటుకొనుటవలన ఆదర్శగృహిణు లని అనిపించు కొనజాలకున్నారు. పాశ్చాత్యదేశములను పీడించు చున్న మహాసంకటము నేడు మన సంఘములో ప్రవేశించుచున్నది. స్త్రీల బాధ్యతి పురుషులకు, పురుషుల బాధ్యత స్త్రీలకు గల దని అందరును తెలిసికొనిన చాలును. ఒకరి కింకొకరు అపకారము చేసిన దేశము కూలిపోవును. కుటుంబములు నశించును. దేశసౌభాగ్య మడుగంటును ; గావున మన సంఘమునకు సంబంధించిన వ్యవహారములలోనే మనము నిమగ్నుల మయి మానవకల్యాణమునకును, స్త్రీజనోద్ధరణమునకును మనము కంకణము కట్టుకొని, తక్కిన లౌక్యవ్యవహారములను పురుషులకు వదలి సంఘములో పోటీ వ్యవహారములను అంతరింపజేయుట మన కర్తవ్య మని నా మనవి.''

## మారకపు రేటు

వేమవరపు రామదాసుపంతులుగారు 17—11—33 తేదీ ఆంధ్రపత్రికలో రిజర్వుబాంకీని గురించి చక్కని వివరణము లిచ్చుచు మారకపురేటును గురించి యిట్లు తెలుపుచున్నారు.

"...కొంతకాలమువరకు 1 రూపాయి పౌనులో 10 వ వంతుగా అనగా 2 షిల్లింగులకు సమానముగా నుండునట్లు నిర్ణయింపబడెను. ఈసంబంధమునే రేషియో అనియు, ఎక్స్ఛేంజి అనియు అందురు. ఈసంబంధము తరుచుగా మారుచుండుటవల్ల వర్తకమునకును, పరిశ్రమలకును చిక్కులు కలుగుటయే గాక ముడివస్తువులయొక్కయు, తయారు కాబడిన సామగ్రియొక్కయు ధరలు కూడ తరుచుగా మారు చుండును. ఒక ఉదాహరణము నిచ్చెదను. రూపాయి 2 షిల్లింగులకు సమాన మైనచో 10రూపాయలకు ఇంగ్లాండువారు మనకు 1 పౌను విలువగల సామగ్రిని అమ్మగలరు. ఒక రూపాయి 1½ షిల్లింగులకు అనగా 18 పెన్సులకు సమాన మైనచో 1 పౌను విలువగల సామానులు మనకు రు13—5—4లకు విక్రయింపగలరు. ఒక రూపాయి 1⅓ షిల్లింగులకు అనగా 16 పెన్సులకు సమాన మైనచో ఒక పౌను విలువగల సామానులు మనకు 15—0—0 లకు విక్రయింపగలరు. ఇట్లే మనము ఇంగ్లాండువారికి గాని ఇతరదేశములకు గాని 1 పౌను సామానులు విక్రయించినచో, రూపాయి 2 షిల్లింగులకు సమాన మైనచో 10 రూపాయలును, 1½ షిల్లింగులకు సమాన మైనచో 13—5—4 లును, 1⅓ షిల్లింగులకు సమాన మైనచో రు 15—0—0 లును మనకు లభించును. ఈయుదాహరణముచే రేషియో యెక్కువగా నున్నచో ఇంగ్లీషువారు వారి (తమ) సరకులను తక్కువ ధరకు అమ్మి మన ముడిపదార్థములను తక్కువ ధరకు కొనగలుగుచున్నారని తెలియగలదు. ఇంగ్లాండువారి పదార్థములు మనకు తక్కువ ధరకు దొరకుట యిండియాప్రజలకే క్షేమ మని యింగ్లీషు వారి వాదము. అట్లు వారి సరకులు తక్కువ ధరకు విక్రయించుటచే. మన పరిశ్రమల యభివృద్ధికి ఆటంకము కలిగి సర్వకాలము మనము ఇంగ్లీషు మిల్లుల మీద నాధారపడియుండవలె ననియు అందువల్ల ఎక్కువ ఎక్ఛేంజికంటె తక్కువ ఎక్ఛేంజే మనకు లాభ మనియు తక్కువ ఎక్ఛేంజి యుండినచో మన రైతులకు వారి పంటలకు ఎక్కువ ధరలు లభించి లాభకరముగ నుండు ననియు మన వాదన. మరియు ఇండియాదేశములో ఉద్యోగియులుగా నున్న బ్రిటిషువారికి ఎక్కువ ఎక్ఛేంజి లాభకరము. రూపాయి 2 షిల్లింగులుగా నున్నపుడు వారు 10 రూపాయలు ఇక్కడ బాంకిలో కట్టితే వారికి యింగ్లాండులో 1 పౌను వారి బాంకితక్కాలో జమ తగులును. రూపాయి 18 పెన్సులకు (1½ షిల్లింగుకు) సమానముగ నున్న యెడల వారు రు 13—5—4

ఇక్కడ బాంకిలో కట్టితే గాని వారికి యింగ్లాండులో 1 పౌను లభించదు. మనము కోరిన ప్రకారము రూపాయి 16 పెన్సులకే (అనగా 1 1/3 షిల్లింగులకు) సమాన మయినచో వారు 15 రూపాయలు ఇక్కడ బాంకిలో కట్టిననే గాని వారికి యింగ్లాండులో 1 పౌను వారి లెక్కకు జమ తగలదు.''

## తెనుగున తెనుగుదనము

మార్గశిర మాసపు భారతి తన మనవిమాటలతో ఇట్లు మందలించుచున్నది.

“......నాడు నాటికి తెనుగుతల్లి పారతంత్ర్యము బలకొనినది. ఆమెకు స్వరూపముననను, స్వభావముననను మార్పు కలిగినది. గుణములు, రీతులు, వృత్తులు, నడతలు సకలలక్షణములును ‘అక్షరాలా’ సంస్కృతమువే అబ్బినవి. అలంకారములు గూడ సంస్కృతమువే గతి అయినవి. సంస్కృతము చేయి తప్పిన యెడల ఆమె యునికినే సంశయింపవలసినంతవరకును వచ్చినది. సంస్కృతము దాస్యమువలన తెనుగుతల్లి ఇట్లు వీధినాటకమునందలి పాత్రగా తయారయినది......ఇది యంతయు కనియే ఆమె బ్రతుకు ‘అయోమయ’ మని కొందొక్కరు పరిహసించిరి. ‘తెనుగు కూడ ఒక్క భాష అని చదువవలసిన దేనా?’ అన్నవారును గలరు... ఆంధ్ర, అంధశబ్దములు సమానార్థకము లను కొందరు చరిత్రకారుల సిద్ధాంతము తల్పము వారియెడ చరితార్థమై యొప్పినది. వారు వాఙ్మాత్రమున స్వతంత్రులు. కార్యసాధనమున కేవలము పరతంత్రులు. ఇంకను తెనుగుతల్లిని సంస్కృతభాషాదాస్యమునుండి తప్పింపవలయు నని ఒక వంక నే కొందరో బొబ్బ లిడుచున్న యీనాడును ఆమె శరీరము నిలువున సూది మోప నేని తావు లేకుండ సంస్కృతపదార్థమునే “ఇంజెక్టు” చేయుచు మురిసిపోవుచున్నారు కొందరు తెలుగు బిడ్డలు...ఎట్లయిన నేమి? మనము తెలు గనుకొని నది తెనుగు కాక సంస్కృతప్రాయ మయి నిలిచినది. అందు తెనుగుదనము లేదు. ఆ తెనుగు నందుకొనుట కెటు చూచినను సంస్కృతము నాశ్రయ మావశ్యక మైనది... తెనుగు గతి యింతేనా? ఇది యేర్పడిన ప్రశ్న. ఆంధ్రవిశ్వకళాపరిషత్తు దీనికి కార్యరూపమున సమాధాన మీయవలసినది. తెనుగునకు ప్రాధాన్య మీయ వలసినదియు, స్వాతంత్ర్యమును గడించ వలసినదియు నగు ఆంధ్రవిశ్వకళాపరిషత్తు జన్మమెత్తి ఆరే డేడు లయినది. తెనుగున కేమి చేసినది? ఎట్టి ప్రాధాన్య మిచ్చినది? స్వాతంత్ర్యసంపాదనమున కయి ఏ పరికరములను కల్పించినది? వీనికి సమాధానము మాట యటుండు గాక, ప్రత్యేకము తెనుగు చదువుటకు గూడ దానికంటె నధికముగ సంస్కృతమును చదువవలె నని శాసించినది. నానాటికి సంస్కృతముతో సంబంధమును తగ్గించి తెనుగునకు స్వతంత్రస్థితిని సమకూర్చుటకు తగిన మార్గము నరయ వలసిన ఆంధ్రవిశ్వకళాపరిషత్తు దానికి మరింత పారతంత్ర్యమును కలిగించు నియమములను శాసించుట అనాలోచితకార్యమే; కాని సంస్కృతమయ మయి యున్న ఆంధ్రమునకు సంస్కృతసాహచర్య మనివార్యమే. సంస్కృతప్రాబల్యమును సాధ్య మైనంత వరకు తగ్గించుచు తెనుగున నూతనముగ వాఙ్మయమును సృష్టించుటయే దీనికి తరణోపాయము. స్వాతంత్ర్యప్రియులు, విద్యాధికులు నగు తెనుగువారును, తెనుగువారికొరకు పుట్టిన విశ్వకళాపరిషత్తును ఈ యుపాయమునకు రూపము నొసగ వెంటనే దీక్షతో పూనుకోవలెను”

## నిలకడమీద నిజము

వెన్నెలకంటి అప్పారావుగారు “స్థానికసంస్థల నెత్తివేయు” డను శీర్షికతో (13—12—33) ఆంధ్రపత్రికలో ఒక వ్యాసము ప్రకటించుచు స్థానిక సంస్థలకు అధికారులే అధ్యక్షు లగుట శ్రేయస్కర మని స్వానుభవముతో ఇట్లు సమర్థించుచున్నారు.

“...ఈ సంస్థల నెత్తివేయుచో దేశమునకు ఏ విధ మయిన ముప్పయినను తటస్థించు నేమో విచారింతము. విద్యాశాలల విచారణకు విద్యాశాఖవా

రుండునట్లే రోడ్ల విచారణ’’కు డి. పి. డబ్ల్యూ వారుండవచ్చును. ఆయా శాఖలవారు అన్యాయము చేయకూడదా అని విచారింతము. అనధికారాధ్యక్షులు ఎట్లు ప్రవర్తింపవలసిన దనుటను గురించి రూల్సు లేవు. గవర్నమెంటు ఉద్యోగస్థు లన్ననో అట్లు కాదు. వారికి పైఅధికారు లెందరేనియు నుందురు. వారు స్వేచ్ఛగా వర్తించుటకు వీలే యుండదు. ఎవరికైనను అక్రమము జరుగుచో అట్టివారు గౌరవోద్యోగు లగు ప్రెసిడెంట్లవలన న్యాయము పొందుటకన్న ఎట్టి దుర్మార్గుడైనను గవర్నమెంటు ఉద్యోగివలన న్యాయము పొందుట సులభము. రూల్సు ప్రకారము నడచుటకు గవర్నమెంటు ఉద్యోగిని బలవంతపెట్టగలము ; గాని అనుద్యోగిని బలవంతపెట్టజాలము. అందువలననే ప్రజ స్థానిక సంస్థల నిర్మూలమునకై ఎదురుచూచుచున్నది. కంట్రాక్టుల విషయమున, డి. పి. డబ్ల్యూ, అధికారులు లంచములు పుచ్చుకొనుచుండవచ్చును ; గాని వారు నిర్భయముగ డబ్బు పుచ్చుకొనుటకు గాని, పుచ్చుకొనిన ద్రవ్యమును ఎన్నికలయందు వినియోగించుటకు గాని వీలుండదు. అందువలననే కంట్రాక్టరుల వలన ఇంజనీయర్లు లంచము పుచ్చుకొనినను వారు ప్రజాస్వాతంత్ర్యమునకు భంగకరము లగు పనులు చేయజాలనందున ప్రస్తుతపు యేర్పాటుకన్నను రోడ్ల మరమ్మతుకు కంట్రాక్టులు డి. పి. డబ్ల్యూ, వారి పరమొనర్చుటే మే లని జనులు భావించుచున్నారు. అదియును గాక, కొలది రోజులలో రాష్ట్రిపాలనయందు పరిపూర్ణస్వాతంత్ర్యము లభింప నున్నది. అట్టితరి విద్యావిధానాది విషయములయందు వలయు మార్పులు మంత్రులే చేయగలరు. వారి యుత్తరువులు అనధికారులకన్న అధికారులే తృప్తికరముగ నెరవేర్పగల రనుటలో సందియ ముండదు. కనుక మనము సరియైన వారిని శాసనసభలకు పంపగలుగుదు మేని దేశలాభమునకు వలయు పనులన్నియు శాసనసభలయందే జరుగగలవు. ఏతావేదారయినను లంచములు పుచ్చుకొన్నట్లు గాని, అక్రమములు చేసినట్లు గాని తెలియుచో వెంటనే అట్టి వారికి తగు శిక్ష పడునట్లు మనము చేయగలుగుదుము ; కాని స్థానికసంస్థలు పోవుటకు సమ్మతింపనివారు ప్రస్తుతపు శాసనసభల నలంకరించువారే అయి యున్నారు.’’

# కవులకూ, వ్యాసకర్తలకూ విన్నపం

ప్రబుద్ధాంధ్రకు ఎవరూ పద్యాలు పంపవద్దు. ప్రస్తుతరాజకీయాలకు సంబంధించినవి వచనంలోనైనా పంపవద్దు. కథలూ, ఏకాంకనాటకాలూ, వ్యాసాలూ, విమర్శలూ, మొదలయినవి తక్కిన ఏ విషయంలోనైనా సరే వచనంలో మాత్రమే కావాలి. సాధ్యమైనంత చిన్నవిగా వుండేవే పంపవలసిం దని మనవి. కర్తలకు వారి రచన పడిన సంచిక మొదలు పన్నెండు సంచికలు పంపుకుంటాం. ఇంతే మేము చెయ్యగల సత్కారం. తరుచు రాసే వారికి ఎప్పుడూ పంపుకుంటాం. విమర్శకోసం పుస్తకాలు పంపేవారు రెండేసి ప్రతులు పంపాలి. వొకటి పత్రికాభాండాగారానికీ, వొకటి విమర్శ చేసే వారికిన్నీ.

# వ్యాఖ్యానములు

## ప్రకటనోద్దేశం

ప్రబుద్ధాంధ్రపత్రికను యథాపూర్వంగా ప్రకటించడానికి మళ్ళీ పూనుకున్నాను.

సరిగ్గా యీ సమయంలో దేశం, డబ్బు లేక చాలా యిబ్బంది పడుతూ వుండడం యెరుగుదును: కాని యీ కారణంచేత యిది మానుకోడానికి వీలు లేదు. నవనాగరికత మనల్ని చాలా ముమ్మరంగా అలుముకొని వుంది. ఏమి టేమిటో అవసరాలు బలిసిపోయి మనకి నిరాడంబరత్వాన్ని, తృప్తిని దూరం చేసేశాయి. అతిసులభ మైన మన జీవనవిధానం అమితధనసాధ్యం అయిపోయింది. అయితే: కన్ను పొడుచుకున్నా డబ్బు మాత్రం కనపడ్డం లేదు. పంటలు దిగతీసినాయి. ధరలు పడిపోయినాయి, వర్తకం మందగించిపోయింది. రకం తిరగడం లేదు. సంసారాలు ఉల్టా సీదా అయిపోతున్నాయి. దారీ తెన్నూ తోచక దేశీయులు అటమటించిపోతున్నారు.

ఇది యిలా వుండగా; సర్వతోముఖ మైన మన జాతీయవికాసానికి అత్యావశ్యక మైన ఆంధ్రరాష్ట్రం నిర్మింపబడే చిహ్నాలు చూపుమేర దూరంలో యెక్కడా కనపడ్డం లేదు. గంజా మాంధ్రభూభాగాన్ని గురించే మనం తహతహ లాడిపోతూ వుండగా, విశాఖపట్టణం హార్బరూ, ఆమండలమూ మధ్యపరగణాల స్వాధీనం అయిపోయే సూచనలు పొటమరిస్తున్నాయి. ఆంధ్రోద్యమం వుందా లేదా అన్న కొడికి వచ్చింది,

ఇంగ్లీషుమీదనుంచి యిప్పు డిప్పుడే కొంచెం కొంచెం మళ్ళుతూ వున్న భాషాప్రీతిని మన ఆంధ్రం మీద కేంద్రీకరించకుండా శుష్కరాజకీయప్రచారకులు మరొక పక్కకి లాగేస్తున్నారు. మన వాఙ్మయంలోనే నిక్షిప్తం చేసుకోవలసిన నవీనవిజ్ఞానాన్ని విద్యాధికు లై వున్న వారు యింకా పరవాఙ్మయాల నుంచే యెరువు తెచ్చుకుంటూ భావదాస్యాన్ని పెంచుకుంటున్నారు. అనేకప్రలోభనాలనుజయించి అతినిరుత్సాహకరపరిస్థితుల్లో కూడా ద్విగుణితోత్సాహంతో, నిష్కామంగా నవీనాంధ్రవాఙ్మయాన్ని నిర్మిస్తూ వున్న మెరికల్లాంటి యువకులు పైకి వచ్చే మార్గాలు లేక కొందరూ, ఋణదాతల చేతుల్లో యిరుక్కుపోయి కొందరూ నిస్తేజు లైపోతున్నారు.

నాదబ్రహ్మమును నిజమాతృవాఙ్మయశరీరంలో ప్రతిష్ఠించిన త్యాగయ్య మన ముత్తాత అయినా సాటి లేని ఆ పైతృకధనం భద్రపరుచుకో లేకపోవడం అలా వుండగా ఆంధ్రేతర్ల వామలు నోటిపాటలతో అచ్చతెనుగుసీమని ముఖరితం చేసుకుంటూ మనం కూడా రసికుల మని ధన్యవాదాలు చెప్పుకుంటున్నాం. మన చిత్రకారులు ఏ విషయంలోనూ యితర్లకి తీసిపోరు. వొక్కొక్క సందర్భంలో వారిని కిందికి లాగేస్తారు; కాని ఆంధ్రేతర్ల చిత్రపటాలతో మన గోడలు నిండిపోతున్నాయి. తమ చిత్రాలు పైకి వచ్చే మార్గాలు లేక మనవారు కుంగిపోతున్నారు.

సంఘం విధినిషేధాలు విడిచి విచ్చలవిడిగా సంచరిస్తోంది. చివరికి సనాతనధర్మవాదుల దృష్టితో చూసినా సంఘాన్ని మళ్ళీ నిర్మించవలసిన అగత్యం కనపడుతోంది. సంస్కర్తలు యురపియను సంఘాల ఆదర్శాల్లో పడి, దేశీయుల కెక్కడి కక్కడికే సభ్యత కలిగించే ప్రాథమికసంస్కరణాలను విడిచిపెట్టి, కేవలమూ వివాదాస్పదా లైన విషయాలయందే తమ పరిమితశక్తిని ధారపోస్తున్నారు.

పాడి పంటలు సమకూర్చే వ్యవసాయదారులూ ముడి వస్తువులను భోగ్యపదార్థాలుగా మార్చే పారిశ్రామికులూ, వాటిని దేశం అంతటా సరఫరా చే

వర్తకులూ, ఈతెగల వారి కందరికీ వెన్నెముక లై వుండి చెమట రూపంగా తమ రక్తాన్ని వోడ్చే కార్మికులూ డబ్బు లేకా, ఐకమత్యం లేకా, స్వాతంత్ర్యం లేకా దిగ్భ్రాంతు లైపోయి వున్నారు.

అయితే: అంత కంతకి అతితీవ్రరూపం తాలుస్తూ వున్న నేటి ఆర్థికసంకటం మన కొక గొప్ప ప్రయోజనం కలిగిస్తోంది. వాస్తవంగా యిదే మన కళ్ళు తెరిచిం దని చెప్పవచ్చు. ధరలు పెరిగి చేతికి డబ్బు పుష్కలంగా వచ్చినంత సేపూ మనకి పాశ్చాత్య వ్యామోహం పెరిగిపోతూనే వచ్చింది. ఇప్పుడో! "ధారావాహిక మైన మన సంప్రదాయం యెట్టిది? మన మిప్పు డెలాంటి స్థితిలో వున్నాము? దీనికి కారణం యేమిటి? ఇది యెలా పరిణమిస్తుంది? మన మిప్పుడు చెయ్యతగ్గ పని యేమిటి?"—ఇలాంటి జటిలసమస్య లెన్నో అడుగడుక్కీ మనకి గతి నిరోధం కలిగిస్తున్నాయి.

వీటి నన్నిటినీ పరిష్కరించి యిప్పుడు 'ఇదీదారి' అని నిర్ధారణచేసి చూపించగలవా రెవరూ? పండితులు చర్చలు చేసి నిగ్గుతేల్చవచ్చు. వక్తలు గంభీరోపన్యాసా లిచ్చి ప్రబోధం కలిగించవచ్చు. అయితే ఈ చర్చలూ, ఈగంభీరోపన్యాసాలూ స్థానికాలు; గాని సార్వత్రికాలు కావు. తాత్కాలికాలు; గాని సార్వజనీనాలు కావు. ఏకదేశికాలు; గాని సార్వజనీనాలు కావు. సావధికాలు; గాని నిరవధికాలు కావు. పైగా, పచ్చిపాలను పొంగించేవే; గాని పరిణతి కలిగించేవి కావు.

కాగా, పత్రికలే యీ నిర్దిష్టఫలాలు సాధించగల పరికరాలు. పాశ్చాత్యదేశాలలో పత్రికలు నేడు విప్లవాలను కలిగిస్తున్నాయి. శాంతిని నెలకొల్పుతున్నాయి. రాజుల్ని పదభ్రష్టుల్ని చేస్తున్నాయి. మానవమాత్రుల్ని దేశాధ్యక్షపీఠాలు యెక్కిస్తున్నాయి. నిజంగా పత్రికలకు యెంతటి శక్తివుందో అవి సోదాహరణంగా ప్రకటపరుస్తున్నాయి.

ఈసంగతులుబాగాగుర్తించి ఆదేశాలవారుపత్రికల్ని ఈశ్వరుణ్ణి కంటే హెచ్చుగా పూజిస్తున్నారు.

మన దేశంలో కూడా పత్రికలు చాలా మార్పులు తెచ్చిపెడుతున్నాయి. ప్రజలలో క్రొత్త భావాలనూ, క్రొత్తరుచులనూ, క్రొత్త వాంఛలనూ, క్రొత్త సిద్ధాంతాలనూ, క్రొత్త సంకల్పాలనూ, వ్యక్తపరుస్తున్నాయి. ఇరవై ముప్ఫయి సంవత్సరాలుగా ఆంధ్రపత్రికలు [illegible] మన సంఘంలో కలిగించిన పరిణతి ఇప్పుడు అతిస్ఫుటంగా కనపడుతూనే వుంది.

సంపాదకుడు ఎలాంటి పరిస్థితుల్లోనూ కూడా తన స్వాతంత్ర్యాన్ని అమ్ముకోకుండా నిలవగలిగితే, తన అంతరాత్మని చంపుకోకుండా వుండ గలిగితే, తన ధర్మాన్ని విడిచిపెట్టకుండా పని చెయ్యగలిగితే, తన సాధననుంచి విచ్యుతుడు కాకుండా ఆగ గలిగితే, తన ధ్యేయమునుంచి తప్పిపోకుండా నడవ గలిగితే, నిజంగా పత్రికాప్రచారం కంటే దేశసేవ లేదు. పత్రికాప్రచారంకంటే మానవసేవ లేదు. పత్రికాప్రచారంకంటే ఈశ్వరసేవ కూడా లేదు.

కనకనే ఈ క్లిష్టసమయంలో నేను ప్రబుద్ధాంధ్రను ప్రారంభిస్తున్నాను.

నాదృష్టిలో రాజకీయాలకు ప్రాధాన్యం లేదు. ఆంధ్రుడు సర్వథా ఆంధ్రుడు కాగలిగినప్పుడే రాజకీయాలలో విజయం సాధించగలడు. మున్ముందు ఆంధ్రచరిత్ర సుపరిష్కృతం అయి, ఆంధ్రశిల్పాలు ఉత్తేజితాలయి, ఆంధ్రలలితకళలు గురుపీఠం అధిష్ఠించి, ఆంధ్రపరిశ్రమలు దేశం అంతటా నిండిపోయి, ఆంధ్రవాఙ్మయం నవీనవిజ్ఞానంతో పరిపూర్ణం అయి, ఆంధ్రసంఘం నూత్నజవసత్వాలతో సంపన్నం అయి—ఇలాగ ఆంధ్రజాతి సర్వతోముఖంగా నూత్నచైతన్యవిలసితం అయితే గాని ఆంధ్రుడికి స్వస్వరూపప్రాప్తి లేదు. అప్పుడు గాని ఆంధ్రదేశం తోటి దేశాలతో సమానప్రతిపత్తిని పడయలేదు. అప్పుడు గాని ఆంధ్రుడు తన రాజకీయప్రాబల్యాన్ని ప్రదర్శించలేడు.

ఇప్పుడు ఆంధ్రుడు కలం పట్టితే యిలాంటి

విజ్ఞానం కలిగించే వాఙ్మయం నిర్మించాలి. నోరు విప్పితే యిలాంటి ఉద్రేకం పుట్టించే ఉపన్యాసం చెయ్యాలి. నడుం కట్టితే యిలాంటి ఫలితం యిచ్చే కార్యక్రమం నెరవేర్చాలి.

ప్రబుద్ధాంధ్రకు ఆంధ్రదేశమే కార్యక్షేత్రం. ఆంధ్రవికాసమే ప్రాప్యం. ఆంధ్రుడు "నే నాంధ్రుణ్ణి నాపూర్వుల రక్తమే నాశరీరంలో ప్రవహిస్తోంది. నాపూర్వుల తేజస్సే నన్ను నిలుపుతోంది. నాపూర్వుల చైతన్యమే నన్ను నడిపిస్తోంది. భరతవర్షానికి నేను ప్రవర్తకుణ్ణి. ప్రపంచకానికి నేను ఆదర్శపురుషుణ్ణి" అని చెప్పుకోగలడమే పరమావధి.

## ఆంధ్రోద్యమం

"నన్ను తెలిస్తే నిన్ను తేలుస్తా" నంటుందిట వర్తకుణ్ణి లెక్క. అలాగే "నన్ను బలపరిస్తే మిమ్మల్ని వుద్ధరిస్తా" నంటోంది మనల్ని ఆంధ్రోద్యమం. పాపం వొకప్పుడు అది అలాంటి చిన్నెలు కూడా కనపరిచింది; కాని మన అనుకరణపరాయణత దాన్ని పూర్తిగా—

మనకి ఆంధ్రోద్యమం "నే నాంధ్రుణ్ణి" అన్న అభిజ్ఞానం కలిగించింది. మన నికృష్టస్థితిని పండు వొలిచి చేతిలో పెట్టినట్లు విప్పి చూపించింది. "నేనింతగా కూలిపోయానా?" అన్న అనుతాపం కలిగించింది. "నేను మళ్లీ బాగుపడాలి" అన్న ఆవేదన కలిగించింది. "నాకు ప్రత్యేకరాష్ట్రం అవసరం" అన్న ఆశ పుట్టించింది. "దీన్ని సాధించాలి" అన్న నిశ్చయం కలిగించింది. సంశయాత్ముల్ని లాంగదీసి, యింట గెలిపించి రచ్చకెక్కించింది. నలుగురి దృష్టి మనమీదకి తిప్పింది. మనల్ని సర్కారు నోటీసులోకి తీసుకువెళ్లింది. "అవు" నని వారిచేత తల వూపించింది. "ఇదే దీక్షగా పని చెయ్యవలసిన సమయం" అని మనకి చిలక్కి చెప్పినట్లు చెప్పింది; కాని యీ స్థితిలో కాంగ్రెస్సు వెల్లువ వచ్చి అంతా తుడిచేసింది. పైగా "ఆంధ్రులు బహునాయకత్వంతో కుళ్లిపోతున్నా" రని ముద్ర కూడా వేసేసింది.

మన రాష్ట్రానికి ప్రత్యేకంగా కాంగ్రెస్సు కమిటీ యేర్పడక పూర్వం జరిగిన ఆంధ్రమహాజన సభలు చూచని ఆంధ్రుడి జన్మ వొక జన్మ కాదు. "కాంగ్రెస్సు కూడా అంత వైభవంగా జరుగుతుందా" అనిపించేవవి. వొక విధంగా కాంగ్రెస్సుకంటే మనఆంధ్రమహాసభే వుత్తమంగా వుండేది. ఏమంటే? మన వారు ఎంత కప్పెట్టుకున్నా కాంగ్రెస్సులో భిన్నజాతుల ప్రత్యేకసౌకర్య వాంఛలు అక్కడి వాతావరణాన్ని కలుషపరుస్తూనే వుంటాయి. వెనకటి ఆంధ్రమహాసభల్లో అలాంటి దేమీ వుండేది కాదు. అక్కడ అందరికీ వొకటే దృష్టి. అందరికీ వొకటే ఆవేదన. అందరికీ వొకటే ప్రాప్యం. అందరికీ వొకటే దీక్ష. అందరికీ వొకటే మార్గం. అందరికీ వొక్కటే పరమావధి. అప్పుడు ఆంధ్రరాష్ట్రప్రస్తావానికి ప్రతికూలంగా వుండే వొకరిద్దరు— అంటే న్యాపతి సుబ్బారావుపంతులు, మోచర్ల రామచంద్రరావుపంతులుగార్ల వంటివారు ఏకాకులైపోయి వురకలు వేసుకు వచ్చే జాతీయవాంఛాప్రవాహాన్ని ప్రతిఘటించి నిలవలేక పక్కపక్కకి వొత్తిగిలి వుండేవారు. ఆ సభామండపాలూ, వాటిలో నిండి వుండే ఆ ఆంధ్రతేజస్సూ చూస్తే ప్రతివాడికీ ఆంధ్రత్వం పొంగిపోయేది. ప్రతివాడికీ పూర్వవైభవం కళ్లకి కట్టినట్టు తోచి పారవశ్యం కలిగించేది.

ఆ సభలకి దక్షిణాంధ్రులు వచ్చేవారు. కర్ణాటాంధ్రులు వచ్చేవారు. నైజామాంధ్రులు వచ్చేవారు. బొంబాయి (కామాటీలు) ఆంధ్రులు వచ్చేవారు. ఇంకా యెక్కడెక్కడో వుండే ఆంధ్రులూ వచ్చేవారు. అందరూ యేదో సభకి వెడుతూ వున్నట్లూ, చర్చలు చేసి తమ తమ పంతాలు నెగ్గించుకోడానికి అస్త్రశస్త్రాలతో తయారై ముందుకి వురుకుతూ వున్నట్లూ కాక ఎక్కడెక్కడో ఎవరెవరితోటో ఏవేవో ఆటలు ఆడుకొని ఆడుకొని అలసి అలసి బిడ్డలు తల్లి అడ్డాల్లో చేరి కమ్మని

పాలు తాగి హాయిగా విశ్రమించడానికి వచ్చేటట్లు వచ్చేవారు. అందరూ యేకవేదిక మీద కూచునే వారు. అందరూ యేకబంతిని ఆరగించేవారు. అందరూ యేకవరసని శయనించి సుఖస్వప్నాలు కనేవారు. అందరు సోదరసోదరీమణు లొక్క చోట చేరినపుడు సన్నిధి చేసే తల్లి మందహాస చంద్రికల్లో తేలియాడుతూ అందరూ వొకరి స్థితి గతులు వొకరికి, వొకరి అనుభవాలు వొకరికి, వొకరి ఆవేదనలు వొకరికి చెప్పుకుంటూ, తనువులు దూర మైనా మనస్సులు కలిసే వుంటా యని, వునికి భేదించినా జాతి భిన్నం కాదనీ నిరూపిస్తూ, ఎన్నడో దూరందూరంగా విసిరేసిన సందర్భాలనూ, కొన్ని శతాబ్దాల దాకా తిరిగీ కలుసుకో నివ్వని సన్నివేశాలనూ జయించి మళ్లీ మాతృక్రోడం చేర్చిన ఆంధ్రోద్యమాన్ని చేతు లెత్తి మొక్కుతూ, కంఠా లెత్తి కీర్తిస్తూ ఆనందతాండవం చేస్తూ వుండే వారు.

అలాంటిసమయంలో ప్రొవిన్షియల్ కాంగ్రెస్సు కమిటీ ఝంఝామారుతం లాగ వచ్చిపడి నవనవ లాడుతూ వున్న ఆంధ్రోద్యమలతని నేల బెట్టి కొట్టేసింది. వాస్తవంగా యిప్పటికి గూడా అది వొక్క వరసని ప్రళయతాండవం చేస్తూనే వుంది; గాని పరప్రత్యయనేయబుద్ధి గల ఆంధ్రు డిది యేమీ తెలిసికోలేకుండా వున్నాడు.

ఇటీవల శ్రీ బొబ్బిలి రాజావారు "మనకి ప్రత్యేకరాష్ట్రం అపాయకరం" అని చెప్పాటప్పటికి కాంగ్రెస్సు వెల్లువలో సుడితిరిగిపోతూ వున్న మనవారు వులిక్కిపడి "యేమి లేమి" టంటూ శాస్త్రాలదాకా వెళ్లారు; గాని మొన్నటి మదరాసు కౌన్సిల్లో ఆంధ్రరాష్ట్రతీర్మానం యేదో విధంగా నెగ్గగానే మళ్లీ మరొక అప్రస్తుతప్రశంసలో పడిపోయారు.

మొదట్నుంచీ యీవిషయం యిలాగే రసాభాసం అయిపోతోంది. ఏమీ యెరగని దేశీయు లకి ఆశ పుట్టించి, చిన్న యెత్తున ఆందోళనం సాగించిన మన ప్రముఖులికి సరి యైన పరిణతి లేక పోవడం వల్ల కలుగుతూ వున్న చిక్కిది. ఆంధ్ర రాష్ట్రతీర్మానం యిదివరకే మదరాసు కౌన్సిల్లో రెండు మాట్లు నెగ్గి వుంది. ఇది మూడో మాటు. అయితే: ఆరెండు మాట్లూ లేని విశేషం యిప్పుడేం వొరిగిందీ? శ్రీ బొబ్బిలిరాజావారికి పలుకుబడి కల కౌన్సిల్లో మనవారు వారికి వ్యతిరేక మైన తీర్మానం నెగ్గించ గలిగారు. అంతే. కాని దీనివల్ల అధి కార్లకి సుముఖత గాని, తొందర గాని కలగలేదు. దేశీయులకి ప్రబోధంగాని, చురుకు గాని పుట్టలేదు. బొబ్బిలి రాజావారికి పోయింది కూడా యేమీ లేదు.

అమాయికాంధ్రుడా! ఇంకా యెన్నాళ్లు నీకీ అనుకరణపరాయణత? ఇంకా యెన్నాళ్లు వొకళ్ల అడుగుల్లో అడుగులు వేస్తావు? దక్షిణభారతదేశా న్నంతా ఆపోశనం పట్టిన వాడవు నువ్వు. మగధ దేశంలో సింహనాదం చేసిన వాడవు నువ్వు. మహా రాష్ట్రులకి రాజ్యతంత్రం నేర్పిన వాడవు నువ్వు. వొకళ్లు నీకు చెప్పడమా? వొకళ్లమాట విని నీ ఆత్మోద్ధరణప్రయత్నం నువ్వు మానుకోడమా? ధిక్! మేలుకో. సింహావలోకనం చేసుకో. నీ ఆంధ్రోద్యమం మళ్లీ ప్రారంభించి నీ వున్నతిని నువ్వే సాధించుకో.

## రథం మళ్లీ కదిలిందా యేమిటి?

అక్కడక్కడ కొత్త గ్రంథాలయాలు నెలకొల్ప బడుతూ వున్నట్టూ, పాతవి కూడా మళ్లీ బూజు దులుపుకుంటూ వున్నట్టూ తెలుస్తోంది. ఇదివరకి లేంది కొత్తగా వెలిసిన గ్రామపంచాయితీలు గూడా కొన్ని గ్రంథాలయాలు నెలకొల్పు తున్నాయి. పల్లెటూళ్లలో మళ్లీ నిజ మైన చైతన్యం ప్రతిఫలిస్తోంది.

ఇదంతా యేమిటి అని చూస్తే, మిత్రులు అయ్యంకి వేంకటరమణయ్యగారు విప్పారిన మొగంతో మళ్లీ దర్శనం యిస్తున్నారు.

వేంకటరమణయ్యగారంటే గ్రంథాలయోద్యమానికి భౌతికరూపం అని ప్రసిద్ధి. అయితే వారు కూడా ఆంధ్రులే కాదూ? కనకనే పది సంవత్సరాలు వెయ్యాని శిక్ష. శిక్ష అనంతరం కూడా వారికి పూర్వస్మృతి నశించకుండా వుండడం మాత్రం గొప్పమాట.

వేంకటరమణయ్యగారికి మేము ప్రశంసాపూర్వకమైన స్వాగతం యిస్తున్నాము. వారి పదవి వారికి సిద్ధంగా వుంది. దాన్ని యెవరూ ఆక్రమించుకోలేదు. అది వారికే తగినది. వారికే భుక్తం అయినది. వారికే స్వాధీనం అయినది కూడానూ.

వెంకటరమణయ్యగారు విడిచిపెట్టడం వల్ల గ్రంథాలయోద్యమం శల్యావశిష్టమైపోయింది. దాన్ని విడిచిపెట్టడంవల్ల వేంకటరమణయ్యగారు— పుష్టిగానే వున్నారు; గాని పది సంవత్సరాల జీవితం వ్యర్థం చేసుకున్నారు. నిజంగా యీపాటికి ఆంధ్రగ్రంథాలయాలు కలకల్లాడుతూ వుండేవి. వేంకటరమణయ్యగారు ప్రతీ యింటోనూ యిలువేల్పయి పూజింపబడుతూ వుండేవారు.

ఇప్పుడైనా మించిపోయింది లేదు. కొత్తగా తయారు చెయ్యడం ఆలస్యం గాని నివురు గప్పిన నిప్పుని రెచ్చగొట్టడం క్షణం. పైగా గ్రంథాలయోద్యమాన్ని దిగతీసినా కాంగ్రెస్సు, వేంకటరమణయ్యగారికి ఆంధ్రుల ముక్తి యెందులో వుందో బోధపరిచి వుంటుంది.

గ్రంథాలయోద్యమం నిర్వహించడం కూడా దేశభక్తే అని యిప్పుడు వెంకటరమణయ్యగారికి యెవరూ చెప్ప నక్కర్లేదు. గ్రంథాలయాలు చదువుకున్న వారి బుద్ధికి మారాకు పెట్టిస్తాయి. చదువుకోని వారికి విద్యాతృష్ణా, జ్ఞానాన్ని గురించి ఆవేదనా కలిగిస్తాయి. ఈ ఫలితం కలిగించడం మాటలతో కాదు. ఇది యెలా నిర్వహించాలో వేంకటరమణయ్యగారికి బాగా తెలుసు.

వెంకటరమణయ్యగారు వెనక వూరూరా గ్రంథాలయాలు ప్రతిష్ఠ చేయించడానికి పాటుపడ్డారు. ఇప్పుడు వాటికి జీర్ణోద్ధారం చేయించడానికి పాటుపడాలి. ఇది వారికి కొత్త పని. లేని చోట్ల ప్రతిష్ఠ చేయించడం వారికి తెలిసిందే.

ఆంధ్ర గ్రంథాలయోద్యమంమీద ఇతర్లు కొందరు కొరడాలు విసురుతున్నారు. వారిమీద కోప్పడితే లాభం లేదు. వారు అతిశయోక్తులు పలికి వుంటారు; గాని అసలబద్ధం కాదు. ఇంతకీ: "మీది తప్పు" అని మనం వారిని మాటలతో గాదు యెదిరించడం. చడీచప్పుడూ లేకుండా, మన దగ్గిర యే లోపం వుందో దాన్ని సవరించుకుంటే అప్పుడు వారు క్షమాపణం చెప్పుకుంటారు. లేక, వారు కూడా చడీచప్పుడూలేకుండా దిద్దుకోనేనా దిద్దుకుంటారు.

వేంకటరమణయ్యగారు మళ్లీ యెలాంటి సందర్భాల్లోనూ కూడా స్వధర్మంనుంచి విచ్యుతులు కాకుండా వుంటారని నమ్ముతున్నాం.



# పత్రికలు - గ్రంథములు

## ఆంధ్రసహకారపత్రిక

ఇది మాసపత్రిక. రెండవసంపుటము నందలి ౧, ౨, 3, ౪ సంచికలు (౧౯33 వ సంవత్సరము జూలై ఆగస్టు, సెప్టెంబరు, అక్టోబరు నెలలవి) మా కార్యస్థానము చేరినవి. ఈ పత్రిక ప్రధాన సంపాదకులు వి. వేంకటసుబ్బయ్య బి. ఏ. గారు. సహాయ సంపాదకులు జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి ఎం. ఏ. బి. ఎల్ గారు. తెనుగుకూర్పు యొక్క కార్యక్రమ మంతయు శ్రీ సత్యనారాయణమూర్తి గారివలననే నెరవేర్పబడుచున్నది. మూర్తిగారు వంగభాషనుండి డి. ఎల్. రాయిగారి ప్రఖ్యాత నాటకములను, ఇంకను పెక్కు నవలలను ఆంధ్రీకరించి (ఇవి సరస్వతీ గ్రంథమండలిలో ప్రకటింపబడియున్నవి) మన ఆంధ్రులకు చిరపరిచితులైయున్నారు. ఆంధ్రసహకారపత్రిక సహకారమునకు సంబంధించిన ప్రచురణములలో మిన్నయని చెప్పదగినదిగా నున్నది. అయితే ఈ పత్రికవలన విశేష ప్రయోజనము బడయవలసిన వారు పల్లెటూరివారు; గావున శైలి సులభముగా నుండుట అగత్యము. భావమునకు సరియైన (వాడుక) తెనుగుమాటలు దొరకనపుడే సంస్కృత పదములను వాడుచుండినచో మూర్తిగారు పల్లెటూరి వ్యవసాయదారుల నుద్ధరించుటయే గాక ఆంధ్రవాఙ్మయమునకు గూడ ఎన్నదగిన ఉన్నతి కలిగించినవా రగుదురు. సంవత్సరమునకు చందా 3-౧-0. విడిపత్రిక 0-4-0 వలయువారు మదరాసు ప్రోవిన్షియల్ కో ఆపరేటివు యూనియన్. రాయపేట, మదరాసు అని వ్రాసికొనవలయును.

## తెనుగు ప్రేమ ప్రచారక్

ఇది మాసపత్రిక. మొదటి సంపుటము ౧, ౨, 3, ౪ సంచికలు మా కార్యస్థానము చేరినవి. ఇది ఆంధ్ర సత్సంగ సంఘము వారిచే ప్రకటింపబడు చున్నది. సంపాదకులు వి. రామబ్రహ్మము బి. ఏ గారు. ఆంధ్రదేశమున రాధాస్వామి మత సిద్ధాంతములను వ్యాపింపజేయుట కిది ప్రారంభింపబడినది. ఈమత భక్తులు ఆంధ్రదేశమున 3 వేలకు మించి యున్నారు. ఈ మతము యొక్క సిద్ధాంతములు చిత్తమును సంస్కరించి దేశీయులకు నవజీవితము సంఘటింపజేయజాలునవిగా నున్నవి. స్వదేశీయవస్తువులను వాడుటకు దీక్షబూని యున్నవారు దయాల్బాగు పేరు అనుక్షణము వినుచుందురు. రాధాస్వామి మతమునకు ఆ గ్రామము రాజధాని. ఈ మతము వారే ఆ వస్తువుల నన్నిటిని తయారుచేసి దేశముయొక్క ఆర్థికసంపదను నిలుపుచున్నారు. రాధాస్వామి మతము ఇట్లు పారమార్థికముగను, భౌతికముగను గూడ దేశీయులను సంస్కరించి మహోపకారము చేయు చున్నది. మన ఆంధ్ర భాషలో ఈ పత్రికను ప్రారంభించిన సంపాదకులు రామబ్రహ్మముగారు వాస్తముగా దేశభక్తులలో నుత్తమశ్రేణికి చెంది యున్నారు. వారి సత్కార్యశూరతకు మా ప్రశంసను తెలుపుచు పత్రికకు విజయము నాకాంక్షించుచున్నాము. సంవత్సరమునకు చందా 1-4-0. విడి సంచిక 0-2-0. వలయువారు: సంపాదకుల పేర భీమవరము వ్రాసికొనవలెను.

---

## కృపాంభోనిధి

కర్త చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు. 218 పద్యములు గలవు. శ్రీరాజా రామమోహనరాయలు వారి నిర్యాణశత వార్షికోత్సవ సందర్భమున ప్రకటింపబడినది, వెల తెలియదు. గ్రంథకర్తకు రాజమంద్రి వ్రాసికొనవలెను.

# ప్రబుద్ధాంధ్ర ప్రశంసలు

౧

"తా మంపిన పత్రిక చేరినది. ప్రబుద్ధాంధ్ర చేసిన సేవ ఆంధ్రదేశానికి చిరపరిచితమే. తత్పునర్దర్శనము ఆనందసంధాయక మైనది. జీవము గల తెలుగూ, పరిణతి చెందిన వివేచనమూ, సార మెరుగని ఆంధ్రత్వమూ కల్గు మీ మేలి రచనములు ఆంధ్రజాతికి ప్రబోధమును, ఉజ్జీవమును కల్గించుచు, నూత్న చైతన్యమునకును, నవ్యశక్తికిని కారణభూతాలు కాగలవని విశ్వసించుచున్నాను. వచనరచనావిష్కారణమే నియమముగా పెట్టుకొన్న మీ పత్రిక మేలిమి బంగరు పండ్లను ఫలించు నని విశ్వసింతును"

యస్. వి. సరళాదేవి

౨

"పరిమిత ప్రయోజనము గల పద్య వాఙ్మయమును నిరాకరించి ఆంధ్రజాతీయాభివృద్ధికి తోడ్పడగలది, సామాన్యజనులకు విజ్ఞానము కలిగించుటకు ఉపకరించునదియు అగు కేవల గద్యవాఙ్మయమునే ప్రకటింపబూను కొని ప్రబుద్ధాంధ్ర పత్రికాముఖమున మీరు చేయగడంగిన ప్రయత్నము మిక్కిలి ప్రశంసాపాత్రము. ఈ మీ మొదటి సంచికయందలి వ్యాసము లన్నియు వివిధ విషయికములై ఆంధ్రుని మనస్సు నాకర్షింపగలవై యున్నవి. 'జాగ్రత్త పడవలసిన ఘట్టాలు' 'సుస్వాగతం' అను కథలు ప్రకృతిసిద్ధములును, అనుభవబద్ధములును అయి మానవహృదయమును సంస్కరింపదగియున్నవి. దీక్షితులుగారి 'ఈమాట నిజం' అను కథ రమణీయమై గద్యకవిత్వ మనిపించుచున్నది. 'శ్రీరంగరాజు చరిత్ర' 'ఉత్తరరామచరితము' అను భాషా విషయిక విమర్శవ్యాసములు ఆంధ్రవాఙ్మయ చరిత్రమునకు మిగుల ఉపకరించును. పత్రికలనుండియు, ఉపన్యాసములనుండియు ఏర్చి కూర్చిన విషయములును, వ్యాఖ్యానములును మీ పత్రికకు అలంకారములు; ఆంధ్రవిజ్ఞానమును పెంపొందించుటకును, ఆంధ్రోద్యమ వికాసమునకును మిక్కిలి ఉపయోగకరములు. ఇట్టి సర్వతోముఖ ప్రయోజనము కల వ్యాసరాజములతో మీరు వెలయించిన ప్రబుద్ధాంధ్రకు సర్వదా ఆంధ్రులు కృతజ్ఞులై యుందురుగాక. మీ పత్రికారాజము ఆంధ్రుల యాదర ప్రోత్సాహములకు భాజనమై చిరకాలము వెలయుగాక"

వఝ్ఝల వేంకటేశ్వరకవి. బి. ఏ.

౩

"మీరు కొంత కాలము విశ్రమించి యున్న ప్రబుద్ధాంధ్రను మరల మేలుకొలిపినందు కెంతయు సంతోషము. ఈకాలములో, అందును మన దేశములో దేశీయపత్రికలకుఁ బ్రోత్సాహము మిక్కిలి తక్కువ. ఇందుకు దేశీయుల యుపేక్షాభావమే కారణము. అయినను వాఙ్మయమునకును, భాషకును సేవ చేయు తలంపునఁ గష్టనష్టముల కోర్చి పత్రికానిర్వాహణమునకు సమకట్టిన మీకు దైవ మనుకూలించుగాక. ఈకాలమున చిన్నకథలు వ్రాయువా రందఱుఁ గూడ ఎట్లో నాయికా నాయకుల యనురాగము వర్ణించుటతోనే సరిపుచ్చుచున్నారు. సంఘధర్మము లెన్నో వర్ణింపవలసినవి లేకపోలేదు; కావున సంఘమునందలి యితరగుణ దోషములను విశదీకరించుచు నీతి జ్ఞానదాయక మగు రీతిని చిన్నకథలు వ్రాయుచున్నచో స్త్రీపురుష పాఠకులందఱుఁ గూడ వాని వలన నుపయోగము నందగల రని నాయాశయము. కథారచయిత లీవిషయమాలోచింతురు గాక"

మల్లాది సూర్యనారాయణశాస్త్రి
(ఆంధ్రయూనివర్సిటీ కాలేజీ పండితులు)

౪

"...మీపత్రిక ప్రథమ సంచికయు చేరినది. మీ పత్రిక నిజముగా అభిరుచికరముగా నున్నది"

తాత కృష్ణమూర్తి బి. ఏ. ఎల్. టి.

౫

"మీ 'ప్రబుద్ధాంధ్ర' పత్రిక తొలి సంచిక (జనవరి ౧౯౩౪ ది) చదివినాను. "ఇప్పుడు మనకి నవ్వన

వాఙ్మయం చాలా అవసరంగా వుంది'' అని మీరు వ్రాసిన సంగతి యెంతో నిజం. అట్టి వాఙ్మయ ప్రచురణమునకే మీపత్రికను మీరు వినియోగింప తలచుట మేలైన పని. తెనుగు జాతీయతను పెంపందించు నంశములను ప్రబోధించుచు మీ పత్రిక ఆచంద్రార్కము వెలయుగాక ''

కవికొండల వేంకటరావు (బి. ఏ. బి. ఎల్. వకీలు)

౬

"చిరవియోగానంతరమున ప్రియమిత్ర సందర్శనము లాగు "ప్రబుద్ధాంధ్ర'' పునర్దర్శనము హృదయాన్ని నిర్మలానందంతో నింపేసింది. ప్రబుద్ధాంధ్రకు నాహృదయపూర్వక సుస్వాగతము. పూర్వం లాగే ప్రబుద్ధాంధ్రకు శక్తివంచన లేకుండా సేవ చెయ్యడానికి ప్రయత్నిస్తాను. ప్రబుద్ధాంధ్రను ఆమూలాగ్రంగా చదివాను. పద్యాలను నిషేధించడం చాలా మంచి పని చేశారు. ।భావప్రకటనకు స్వేచ్ఛావకాశములు పద్యరచనములో బహు తక్కువ. ప్రధానము భావమే కాని పద్యమా గద్యమా అన్నది కాదు. అలాగని నేను పద్యరచనను కాదనడం లేదు. మహోన్నతము లైన— ఉత్కృష్టము లైన పరిమితవిషయాలకు మాత్రం కొన్నిటికి పద్యరచనయే అవసరమై వుంటుందని నేను గమనించక పోలేదు. అలాగ కాకుండా సాధారణవిషయాలను కూడా పద్యాలలో రాయడానికి ప్రయత్నించి భావాన్ని కుంటువడచేసుకుంటున్నారు చాలామంది యీరోజుల్లో. ।పత్రికాధిపతులు సంపాదకులు పద్యవ్యాసనిషేధాన్ని అములులో పెట్టడంవల్ల విలేఖకవర్గంలో ఉన్న ఈభ్రమ అచిరకాలంలోనే అంతరించి పోగల దని ఆశిస్తున్నాను. రక్తాన్ని ఉడుకెత్తించగల వీరగాథలు, హృదయాన్ని కరగించగల కరుణారసప్రధానము లగు చరిత్రలు, మహోన్నతాశయప్రస్ఫుటము లగు కథలు, మనోహరశృంగారభావపూరితము లగు ఘట్టములు వేనవేలు వచనంలో అతి సులభంగా మృదుమధురశైలిలో వ్రాయబడిన వాటిని నేను స్వయంగా చదివాను. చదవగా విన్నాను కూడాను. జాగ్రత్తగా వ్రాసిన వాట్లలో వచనమే కానియ్యండి రసపుష్టికి ఎన్నడూ లోపం రాదు. మీరిల్లా పద్యాలను నిషేధించడంలో చాలా ధైర్యమైన పనే చేశారు. మీకథ యథాప్రకారంగా ఆంధ్రబ్రాహ్మణ గృహజీవితచిత్రమును చిత్రించుటలో మీ లేఖినికి గల గల ప్రజ్ఞను చాటుతూ హృదయంగమంగా ఉంది. శ్రీ సుబ్బారామయ్యగారు పద్యవ్యాసనిషేధావసరమును చక్కగా నిరూపించినారు. ఊహాప్రపంచంలో చాలాదూరం యిదివరకే విహరించిన అనుభవశాలి దీక్షితులుగారికి— ఎల్లప్పుడూ ఉన్నతపవిత్రాశయముల వేపే దృష్టి సారిస్తూ ఉండే దీక్షితులుగారికి వాగనుశాసనుని దర్శనము దొరికిం దంటే ఆశ్చర్యపడవలసిం దేమీ లేదు. ఇన్నిటి కేం గాని నాకు వ్యక్తిపరంగా మీ కథలయం దుండే గౌరవంచేత వాటికోసం ఆతురతతో నిరీక్షించే వాణ్ణి ఇదివరకు. ఇకనించి నెల కొక కథ మాకు తప్పకుండా దొరకుతుంది కనక సంతోషము. ఆంధ్రదేశానికి శ్రీపాదవారు అనేక కారణాలచేత గణించరాని ఆస్తి అయిపోయినారు''

కాళూరి వేంకటరామారావు

౭

"సర్వవిధముల మీ పత్రిక హృదయరంజకముగా నున్నది. సర్వంకష మగు వాఙ్మయసేవకు అనువగు మూలసూత్రములతోఁ బత్రికానిర్వహణమునకు మీరు సమకట్టితిరి. అందులకుఁ దగిన యోగ్యత మీయెడలఁ గల దనుటకీ మొదటి పత్రికయే సాక్ష్య మగును. వ్యావహారిక భాషావ్యాసములు నాకుఁ జాల అభిరుచి కలిగించినవి. ఇట్టి రచన నాచే నగునా యను సంశయము నాకు మీ కథ కలిగించినది. పనితొందరలచే వచ్చు నెల పత్రికకు వ్యాస మంపఁజాలను ; గాని తరువాతి పత్రికలకుఁ దఱచుగఁ బంపఁ బ్రయత్నించెద. నాశక్తి, విశ్రాంతి సామాన్యములు. ఎట్టి వ్యాసములు నన్ను వ్రాయు

మందురు? పద్యముల నిషేధించుటచే నా లేఖినికి నిరాశ కలిగినది''

దూపాటి వేంకటరమణాచార్యులు
(శేషాద్రిరమణకవులు)

౮

"ప్రబుద్ధాంధ్రలో పద్యములు వెయ్యకపోవడమునకు కారణము వచనవాఙ్మయమును పోషించడానికే గాని పద్యవాఙ్మయమును తృణీకరించడానికి కాదని సంపాదకులు చెప్పుతున్నారు. వచనముతో పాటు పద్యములు పత్రికలలో వెయ్యడము సంప్రదాయసిద్ధముగా తెలుగులో జరుగుతూ ఉన్నది. నేడు యీ సంప్రదాయానికి విచ్ఛిత్తి కలిగించిన ప్రబుద్ధాంధ్ర సంపాదకుల పని కొందరికి నచ్చకపోవచ్చును; కాని అది ప్రశంసింప తగ్గదే అని నా అభిప్రాయము. ప్రతీకళా, ప్రతీశాస్త్రమూ ప్రత్యేకముగా వృద్ధి చెందవలె నంటే వాటివాటికి ప్రత్యేకముగా పత్రిక లుండితీరవలెను. వచనవాఙ్మయాభివృద్ధి కొరకేర్పడిన ప్రబుద్ధాంధ్ర నిజాశయమును నెరవేర్చుకో గలుగుతుం దని నమ్ముతున్నాను''

చింతా దీక్షితులు బి. ఏ. ఎల్. టి
[గవర్నమెంటు ట్రెయినింగుస్కూలు హెడ్మాష్టరు]

౯

"శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రులుగారు మళ్లా 'ప్రబుద్ధాంధ్ర' ప్రకటిస్తా రంటే సంతోషించిన వారిలో నేనొకణ్ణి. వారి పూర్వ ప్రబుద్ధాంధ్రతో నాకు పరిచయం తక్కువయినా ఉన్నంతవరకూ వారి సారస్వత వ్యవసాయం పట్ల చాలా ఆదరమూ, గౌరవమూ ఉండేవి. ఉన్నవి...ఆంధ్రులు ప్రబుద్ధులు కావడానికి చాలా మంది, చాలా విధాల తాపత్రయ పడుతున్నారు. అయితే ఎంతవరకు ప్రబుద్ధులయా రని ప్రశ్నిస్తే "ఖసూచనము" తప్పితే సమాధానం లేదు...లెక్క వేస్తే చూస్తూండగా ఇట్టే కవు లయిపోయేవారు ఆంధ్రులలో ఉన్నంతమంది ఇంకే దేశంలోనూ ఉండ రనుకుంటాను. ఏవార్తా పత్రికల్లో చూసినా, 'ఫ్లీ' మాస పత్రికల్లో చూసినా అయోమయపు పద్యాలు అనంతంగా వస్తున్నవి. వీటివల్ల ఏమి ప్రయోజనం ఉద్దేశిస్తారో ఆ కవికుమారులు.. దేశం తగినంత విజ్ఞానసమృద్ధం కావా లంటే వచనరచన తామరతంపరగా ఉండాలి. పద్యంలో భయపడుతూ, వణకుతూ, ఇరుకుగా కూర్చున్న దివ్యసందేశములు, మహాశయములు వచనంలో హాయిగా, విచ్చలవిడిగా విశాలంగా ఉండి సర్వగమ్యములుగా ఉంటవి.. ఈతత్వదృష్టితో శాస్త్రిగారు పద్యాలు తమ పత్రికలో ప్రకటించడం మానినా రనుకుంటాను. అంతే గాని పద్యాలు అనవసరం అని గాని, ఇష్టం లేక గాని ప్రకటించక పోవడం కాదిది. వీరు కూడా పద్యాలు వ్రాస్తారు. పూర్వ ప్రబుద్ధాంధ్రలో పద్యా లుండేవి. దీనికి కూడా సదాంధ్రుల సహకారం అబ్బితే దేశం ప్రబుద్ధం అవుతుం దేమో''

ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి
(స్త్రీ సనాతన విద్యాలయ పండితులు)

౧౦

"మీరు పంపిన ప్రబుద్ధాంధ్ర జనవరి సంచిక చేరినది. ఆమూలాగ్రముగ చదివినాను. మీపత్రిక ఆంధ్రవాఙ్మయమున రానున్న నూతనసృష్టిని వందివలె సూచిస్తున్నది. పద్యవాఙ్మయమును త్రోసివేసి గద్యవాఙ్మయమునే ప్రధానముగా చేసికొనిన మీ పత్రిక శపథము అపురూపమైనది. మీ పత్రిక ఆంధ్రవాఙ్మయ పునరుజ్జీవనమునకు తప్పకుండా తోడ్పడగల దని నేను విశ్వసించుచున్నాను. మీ పత్రిక జయశీలయై వర్ధిల్లుగాక''

గోపరాజు రాజన్న
('లీడరు' సహాయ సంపాదకులు)

౧౧

"మన యాంధ్రవాఙ్మయమున నెన్నదగిన గద్యకృతులు చాలఁ బరిమితముగ నున్నవి. గద్యవాఙ్మయము సర్వసులభ మగుటం జేసి దేశ ప్రబోధమునకది యెంతయు నావశ్యకము. ఇది గద్యయుగము;

గద్య సర్వతోముఖముగ నభివృద్ధి చెందవలసియున్నది!...ఇట్టి స్థితిలో శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిలుగారి పద్యబహిష్కార మాంధ్రదేశీయ పత్రికా చరిత్రమున నొక నూతనాధ్యాయమును బ్రారంభించుచున్నది యని నాయాశయము...దేశమున ధనాభావము మిక్కుటముగ నున్నది. అనేక పత్రికలు పుబ్బలోఁ బుట్టి మఖలో మాడుచున్నవి. ఇట్టి స్థితిలో ధైర్యముతోఁ బ్రబుద్ధాంధ్రను బునరుద్ధరింప సమకట్టిన శ్రీ శాస్త్రిలుగారి ధైర్యము, వాఙ్మయాభిమానము ప్రశంసార్హములు... వాఙ్మయాభిమానులు, విశేషించి స్త్రీలోకమును వారి యుద్యమమునకుఁ దోడ్పడి తమ భాషాభిమానమును వెల్లడింతురు గాక ”

విద్వాన్, బత్తుల కామాక్షమ్మ
(ఆంధ్రయువతీ సంస్కృత కళాశాల, ప్రిన్సిపాల్)

౧౨

“మహాశయా, మీ పత్రికలో పద్యములు ప్రచురింపక పోవడము చాలా విధముల మంచిదే. ప్రస్తుతము ఆంధ్రోద్ధరణమునకు ఉపయుక్తమైన విషయములను గురించి చర్చ చేయడము అత్యవసరమైన పని. అందుకు గద్య ఉపచరించేటట్టు పద్యము ఉపచరించదు. విదేశీయ గద్యరీతులలో కొత్తపుంతలు చాలా ఏర్పడి యున్నవి. అందులో మేలైనవి ఆంధ్రవాఙ్మయమున చేర్చుకొనవలసి యున్నది. ఆంధ్రగద్యశైలి ఏర్పడవలసియున్నది. ఇన్ని పనులు గద్యలో చేయవలసి యున్నది; కావున మీ ఏర్పాటు కాలాను గుణ్యముగా నున్న దని చెప్పవచ్చును ”

శ్రీపాద కామేశ్వరరావు, ఎం. ఏ. ఎల్. టి.
(ట్రెయినింగు కాలేజీ లెక్చరరు. (రిటైర్డు)

౧౩

“రాజమండ్రి కలాభివర్ధనీ పరిషత్తు పక్షమున ప్రకటింపబడు మాసపత్రిక. రాయల్ సైజు 40 పుటలు. సంవత్సరపు చందా రూపాయి. విడిసంచిక అణానగ. సంపాదకులు శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. రూపాయి పత్రికను తెనుగున శ్రీ శాస్త్రిగారే ఆద్యబ్రహ్మలు. తరువాత అట్టి రూపాయి పత్రికలు తెనుగున పదింటికి పైగా వెలసినవి. రెండు మూడు నేడును జీవించి యున్నవి. దాదాపు పది సంవత్సరములకు పూర్వము ప్రబుద్ధాంధ్ర సంపాదకుల అనారోగ్య కారణమున నిలిచిపోయినది. నిలిచి పోవుసరికి దాని చందాదారుల సంఖ్య 2700. నేడు ‘వినోదిని’ని తప్పించినచో అందఱు చందాదారులు గల మాసపత్రిక మఱియొకటి లేదు. అట్టి ప్రబుద్ధాంధ్ర పునరుద్ధరింపబడి, తెనుగు వారి అక్షయభాగ్య మన దగిన రాజమహేంద్రవరపు కీర్తిని విస్తరింపజేయ నుండుట యెంతయు సంతోషింపదగినది. రచయిత, స్వానుదారుడు ఒక్కడే అయిన సంపాదకునకు నోచి పుట్టిన తెనుగు మాసపత్రికలలో ప్రబుద్ధాంధ్ర యొకటి. జనవరి మాసమున వెలువడిన ఐదవ సంపుటపు తొలి సంచికలో ‘జాగ్రత్తపడవలసిన ఘట్టాలు’ అను సంపాదకులు వ్రాసిన సాంసారిక కథావ్యాసము గొప్ప నీతిని బోధించుచున్నది. ప్రఖ్యాతాంధ్రకథకు లగు శ్రీ చింతా దీక్షితులు గారు వ్రాసిన ‘ఈమాట నిజం’ చమత్కారముగ నున్నది. శ్రీ కొడవటిగంటి కుటుంబరావుగారి ‘సుస్వాగతం’ అను కథావ్యాసమున ప్రతి అక్షరమ్మును షాత్రిపోషణగుణసంపన్నమై తెనుగువారి స్వతంత్ర కథావ్యాసములలో అత్యున్నతస్థాన మందజాలి యున్నది. డాక్టరు, చిలుకూరి నారాయణరావుగారు, (ఎం. ఏ) జయంతి రామయ్యపంతులుగారి ఉత్తరశాప చరిత్రముపై విమర్శక వ్యాసమును, శ్రీ కేతవరపు కామేశ్వరరావు గారు, బి. ఏ., 1872 లో ప్రచురింపబడిన నరహరి గోపాలకృష్ణమ శెట్టిగారి ‘శ్రీరంగరాజ చరిత్ర’ అను నవల 1878 లో ప్రచురింపబడిన వీరేశలింగము పంతులుగారి రాజశేఖర చరిత్ర రచనకు ఎంతవరకు తోడుపడినదో చూపు పరిశోధక వ్యాసమును, శ్రీ మారేమండ రామారావుగారు

(ఎం. ఏ.) 'ప్రాచీనకాలపు జనాభా లెక్కలు' అను విజ్ఞాన వ్యాసమును రచించి ఈ సంచిక విలువను పెంచియున్నారు."

ఆంధ్రభూమి [ఫిబ్రవరి 1934]

౧౪

"ఆంధ్రులకు చిరపరిచిత యైన యీ పత్రిక పునరుద్ధరింపబడినది. మునుపటివలెనే రూపాయ చందాతో ప్రారంభ మగుటవలన ఆంధ్రుల యాదరణకు పాత్రము కాగల దనుటలో సందేహము లేదు. శ్రీ చింతా దీక్షితులుగారు, చిలుకూరి నారాయణరావుగారు, టేకుమళ్ల కామేశ్వరరావుగారు మొదలగు వారి రచనలు దీనిలో గానిపించుచున్నది. ప్రస్తుతరాజకీయవిషయములకు సంబంధించినవి తప్ప తక్కిన అన్ని విషయముల వ్యాసములును వచనములో ప్రకటింతు మని సంపాదకుల సూచన. దీని ప్రత్యేకత యేమనగా, పద్యవాఙ్మయమును నిషేధించుట. ఈ పత్రికలో పద్యములు ప్రకటింపబడవు. ఈయపూర్వశపథమును సమర్థించుచు శ్రీ సుబ్బరామయ్యగారు రెండు పుటల వ్యాసమును రచించిరి. అందలి ముఖ్యవిషయములు గమనింపదగినవి.

"ఈదినములలో మానవుని నిత్యజీవితమున కావశ్యకము లగు విషయములను 'అక్షరాలా' స్పష్టముగ—అనగా దృష్టికి పదములును, మనస్సునకు వాని యర్థమును ఒక్కమారే—తెలుపునట్టి గ్రంథములు వెలువడవలెను. అవి సరళమగు గద్యరచనమున నుండవలెను.... నేటి కాలపు పత్రికలును గ్రంథములును సృష్టించుచున్న గద్యవాఙ్మయమున నొప్పిద మగు శైలి నున్నది యత్యల్పము. పద్యవాఙ్మయమున నంతకంటె నల్పతరము; కాని పద్యవాఙ్మయము విషయమున చింతింపబని లేదు. పద్యవాఙ్మయము మానసికానందమును గూర్చుటకే అధికముగ నుపయోగించును. అందుకు జాలిన పూర్వగ్రంథము లనేకములు గలవు. పూర్వము గాని నేడు గాని లేకున్నది, అనవద్య మగు గద్యవాఙ్మయము. శరీరమునకు సౌఖ్యమును గూర్చు జ్ఞానమును ప్రజలకు పంచిపెట్టుట కదియే ప్రధాన సాధనము. దానికి సంప్రాప్త మైన దుర్దశకే యిపుడు చింతిలవలసి యుండునది. శరీరసౌఖ్యము కుదుర నపుడు మానసికానందము దేనను గలుగజాలదు"

ఈవాక్యములలో గొంత యన్యాయ మున్నట్లు గోచరించుచున్నది. మానసికానంద మొసంగుటే పద్యవాఙ్మయ ప్రయోజనము కావచ్చును; కాని అందుకు చాలిన పూర్వగ్రంథము లనేకము లున్నవా? అంతేనా? అపూర్వ మైన ఆనందవిశేషమును గూర్చు అర్వాచీన గ్రంథములు లేవా? ఆపూర్వగ్రంథములతో సంతృప్తిపడి, యికనానంద సంధాయక మగు పద్యరచనమునకు స్వస్తి చెప్పవలసినదా? ఇంకను కృషి సల్పుచో నిదివర కున్నవాని కంటె నత్యున్నతము లైన కావ్యవిశేషములు సృష్టింపబడుట కవకాశము లేదా? ఆంధ్రకవిత్వాభివృద్ధి యగు నన్న ఆశయే యిక లేదా? ఆంధ్రకవితాసౌధ మాదికాలమునందే యొక్కసారిగ నువ్వెత్తుగ లేచి యాకస మంటి నేలం గూలిపోయినదా? సంపూర్ణముగ శిథిల మైపోయినదా? ఇక దాని నుద్ధరించుట కెవ్వడును జన్మింపజాలడా? ఏమో! మాకు మాత్ర మంతటి యాశాశూన్యతకు హేతువు కనిపించుట లేదు. పోనీ ఆసంగతి యెట్లున్నను "శరీరసౌఖ్యము కుదుర నపుడు మానసికానందము దేనను గలుగజాలదు" అని మరియొక మాట యున్నది. ఇది వింత కాదా! కవిత్వ మనునదే ప్రపంచమున లేనిచో కళ యనునదే సృష్టింపబడకున్నచో ఈవాక్యము యథార్థము కావచ్చును; కాని కళ యేర్పడిన దెందులకు? సుఖసమయమునందే ఆనందమును ద్విగుణీకృత మొనర్చుటకు గాదు; కష్టసమయములయం దోదార్చి శాంతి యొసంగుటకు గూడను 'శరీరసౌఖ్యము కుదురనపుడు మానసికానందమును గలిగించు'టకే, ఆశ యను దానిని చూపించి దుఃఖోపశమనము గావించి, బ్రతుకునం దింకను ఇచ్ఛ కలిగించుటకే కళ యనునది యేర్పడినది

"And from your work will every feeling bosom such nurture in its melancholy passion" అని జర్మన్ మహాకవి గెటీ కనిపెట్టినాడు. యీట్స్‌కవితో నొక సుప్రసిద్ధవంగదేశీయుడు స్వానుభవమును బట్టి "I read Rabindranath everday, to read one line of his is to forget all the troubles of the World" అన్నాడు. దైహికము లైన కష్టము లనుభవించు వేళలలో కళోపాసనకు దిగిన బ్రహ్మానందసహోదర మగు నానందము పొంద వచ్చు నని పెద్ద లన్నారు.। ఇంతకును చెప్పవచ్చిన విషయ మిది. సుబ్బరామయ్యగారి ప్రశంస యెట్లున్నను, ప్రబుద్ధాంధ్ర వహించిన యీనియమమును గూర్చి మాకొక సందేహమున్నది. పద్యములు కథానాటికాదులు —అన్నియు కళకు సంబంధించినవే; అన్నియు మానసికానందమును ప్రధాన ఫలముగా నుద్దేశించినవే. అట్టిచో, మూడు కథలను ప్రకటించి, ఏకాంక నాటకాదులకు గూడ తావీయదలచిన యీపత్రిక పద్యములను నిషేధించుటలో గల యౌచిత్య మేమో మాకు గోచరించుట లేదు. సారస్వతమునం దివి యన్నియు సమానమైన హక్కు గల భాగములు. ఇష్ట మైనచో సారస్వతమునే సంపూర్ణముగ నిషేధించి కేవల శాస్త్రీయవిద్యా పారిశ్రామికాదిక విషయములనే ప్రకటింపదలచుట నియమ మగును; కేవల శారీరక సుఖమునే సమకూర్పగల వైజ్ఞానిక విషయములనే గ్రహించుట లెస్స యగును. అంతియ కాని కళాధిదేవత తల కత్తిరించి కాళ్లు నరికి తక్కిన యవయవములతో నాటక మాడింపవల దని ప్రార్థించుచున్నాము"

విశ్వకళ (జనవరి 1934)

౧౫

"రాజమహేంద్రవరంలో శ్రీయుత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి సంపాదకత్వమున వెలువడు మాసపత్రిక, ఇదివరలో వీరీ పత్రికను।నాలుగు వత్సరములు నిర్వహించి ఆరోగ్యము చెడిపోయి నందున 1925 లో నిలిపివేసిరి.। మరల యీ జనవరి నుండి ప్రచురించుచున్నారు. గద్యవాఙ్మయము నభివృద్ధిపరచు నుద్దేశముతో పద్యవ్యాసములను ప్రకటింపక గద్యవాఙ్మయమునకే సంపాదకులు ప్రాధాన్య మొసగుచున్నారు. దీని చందా సంవత్సరమునకు ఒక రూపాయి మాత్రమే. ఆంధ్రుల అభిమానమునకు పాత్రమై వర్ధిలుగాక యని కోరుచున్నాము.

సుబోధిని (20—1—34)

౧౬

"కొంతకాలం క్రితం నిలుపుదల చేసి మరల రాజమహేంద్రవరమునుండి పండిత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి సంపాదకత్వముననే పునరుద్ధరింపబడిన అయిదవ సంపుటము ప్రథమసంచికను వందనపురస్సరముగా నందుకొని యందలి సద్విషయములు పఠించి యమందానంద హృదయులమైతిమి. శ్రీ శాస్త్రిగారి రచనాసామర్థ్యము లోక మెరింగియుండుటచే నెక్కువగా వ్రాయ బని యుండదు. అద్భుత విమర్శనలు, వినోదమైన కథలతో ప్రతినెలారంభమున వెలువడుచున్నది"

ఆదిశైవ పత్రిక
(శ్రీముఖ మాఘము)

౧౭

"ఈ మాసపత్రికను శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు రాజమండ్రినుండి తిరిగి యీసంవత్సరములో పునః ప్రకటితమున కియ్యకొని ఐదవసంపుట ప్రథమ సంచికను వెలువడదీసి పంపిన ప్రతిని వందనములతో నందుకొంటిమి. వీరి అనారోగ్య కారణమే యింత కాలము యీపత్రికా ప్రచురణ విరమించుటకు కారణ మని తెలియుచున్నది. ఆంధ్రుల వాఙ్మయాభివృద్ధికే లక్ష్య ముంచి పత్రిక నడుప వాంఛించుచున్నటుల పత్రికాధిపతులు విన్నవించుచున్నారు. తేట తెనుగు పదములతో జనసామాన్యమునకు గ్రాహ్య మగు మాటలతో నవరసము

లోలుకు విషయసంపుటితో ఆహ్లాదము నిచ్చు కథావళితో ప్రథమసంచిక విరాజిల్లుచున్నది. శాస్త్రిగారి యుద్యమము వర్థిల్లునటుల ఆంధ్రులు ప్రోత్సహించెద రని నమ్ముచు ప్రబుద్ధాంధ్ర దీర్ఘాయుష్మంతురా లగునటుల ఆశీర్వదించుచున్నాము.

దీనబంధు (3—1—34)

౧౮

"ఈ పత్రిక తెనుగువారికి అపరిచిత మయినది కాదు. ఇదివరకు కొన్నాళ్లు నడచి కారణాంతరములచే నడుమ నాగిపోయి యిపు డిది పునరుద్ధరింపబడినది. సుప్రసిద్ధవచన రచయిత లగు శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు పత్రికా సంపాదకులు. భాషాభిమానులకు సంతోషమును కల్పించు చౌక పత్రిక"

ధర్మసాధని [25—1—34]

౧౯

"ఇది పండిత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి సంపాదకత్వమున రాజమహేంద్రవరము నుండి ప్రకటింపబడుచున్న మాసపత్రిక. 1925 వ సంవత్సరమున నిలుపు చేయబడిన యీ పత్రిక యీ నెలనుండియే పునరుద్ధరింపబడినది. శాస్త్రిగారి రచనాసామర్థ్యము లోక మెరిగినదియే. ఇది చక్కని కథలు, అద్భుత విమర్శనములు, సొంపైన సాహిత్యచర్చలతో ప్రతి నెలా రంభమున వెలువడుచుండును. ఇది ఆబాలగోపాలము చదువ దగినది"

రెడ్డిరాణి [31—12—33]



# పత్రికా స్వీకారము

౧ ఆంధ్రభూమి వేపేరి మద్రాసు

ఇది సర్వవిషయములను చర్చించు సచిత్రాంధ్ర మాసపత్రిక. సంవత్సరచందా 3-0-0. సంపాదకులు ఆంధ్ర శేషగిరిరావుగారు బి. ఏ., విద్యార్థిగా నుండినపుడే చక్కని వ్యాసములు వ్రాసి కొగలవాడని పేరు, బహుమతులు పొందిన మా మిత్రులు శేషగిరిరావుగారు ఇట్లొక మంచి రకపు మాసపత్రికకు సంపాదకు లగుట న్యాయ్యముగనే యున్నది. సహజముగనే వీరి రచనములు సరళములును, విషయగౌరవము కలవియును. గృహలక్ష్మి సంపాదకులుగా నుండి చేసిన భాషాభావాఙ్మయముల సేవ వీరి నిసర్గప్రతిభకు అనుభవవైశిత్యములను గలిగించినది. శేషగిరిరావుగారు ఇప్పటికి ఆంధ్రభూమి తొమ్మిదిసంచికలు ప్రకటించినారు. ఒక దానిలో కంటె నొకదానిలో విషయగౌరవము, నవీనత, వైచిత్ర్యము కనపడుచున్నది. వీరు తమ రచనముల యెడల శ్రద్ధవహించుటే కాక ఇంగ్లీషులోనే ఉల్లాసీదా లగుచుండిన పట్టభద్రులను కొందరిని తెనుగురచనలలోనికి దింపినారు. వాస్తవముగా ఇది ప్రశంసింపదగిన విషయము. ఆంధ్రభూమి ఆంధ్ర వాఙ్మయమునకు అమూల్యమైన ఆభరణముగా నున్నది. కేవలాంధ్రులకు అనేక నూతనవిషయములు ఆంధ్రభూమిద్వారా తెలియుచున్నవి. స్త్రీలకు గూడ ఇది చాల ఉపయోగకరముగా నున్నది. పెక్కుమంది యువతీమణులును తమ వినూత్నరచనలతో నీపత్రికను అలంకరించుచున్నారు. సంవత్సర మైన నిండకపూర్వమే ఇంత ప్రజాదరమును సంపాదించిన ఆంధ్రభూమి ముందుముందు వడయు నున్నతిని గురించి వేరుగ చెప్పనక్కరలేదు. సర్వాంగసుందర మైన ఆంధ్రభూమిపత్రికకు విజయమును గోరుచు మేము మా మిత్రుల సద్వ్యవసాయమును ప్రశంసించుచున్నాము. ఆంధ్రసోదరులు, సోదరీమణులు ఆంధ్రభూమిని గౌరవించి తాముసు గౌరవము పొందెదరు గాక.

4 గృహలక్ష్మి— ఎగ్మూరు మద్రాసు

స్త్రీల నిమిత్తము ఆంధ్రమున ప్రకటింపబడు పత్రిక యిది యొక్కటే. సంపాదకులు కే. యన్. కేసరిగారు. విద్యావతి, వినయవతి, సుగుణవతి, సౌందర్యవతి అగు కులస్త్రీవలె గృహలక్ష్మి ఆదర గౌరవములకు అర్హయై యున్నది. ఆంధ్రరమణులు చాలమంది గృహలక్ష్మి సాయమువలన ముందుకు వచ్చియున్నారు. ఇంకను పెక్కుమంది రాగలరు. స్త్రీల వ్యాసములే ఇందనేకము లుంటున్నవి. సర్వాంగసుందరమైన యీపత్రికద్వారా డాక్టరు కేసరిగారు స్త్రీలోకమునకు చేయుచున్న సేవ ఉత్తమశ్రేణికి చేరుచున్నది. సంవత్సరచందా 4—0—0. విడిసంచిక 0—6—0. గృహలక్ష్మి ఇంకను సుందరమై ఇంకను ఉన్నతి పొందుగాక యని కోరుచున్నాము.

5 ధర్మసాధని గుంటూరు

పక్షపత్రిక. సంవత్సరచందా 2—8—0. సంపాదకులు పాలపర్తి నరసింహము గారు. బ్రహ్మసమాజ ధర్మములను తెనుగువారిలో వ్యాపింపజేయుట కిది చాల పని చేయుచున్నది. తప్పకుండా చదవవలసిన తెనుగు పత్రికలలో ఇది యొకటి. ఇప్పుడు ౨౧వ సంవత్సరము నడుచుచున్నది.

6 రెడ్డిరాణి రాయవరము తూ. గోదావరి

సచిత్ర మాసపత్రిక. సంవత్సరచందా 3—0—0. సంపాదకులు మల్లిడి సత్తిరెడ్డిగారు. దేశములో చాల పలుకుబడి కల పత్రిక. ప్రఖ్యాతి పొందియుండిన మాసపత్రికలలో ఇది యొకటి.

7 విశ్వకళ గుంటూరు

మాసపత్రిక. గ్లేజు కాగితములు. డబుల్ క్రౌను సైజు. సంచికకు 16 పేజీలు గలవు. సంవత్సరచందా 1—0—0.

8 లోకలుబోర్డు కపిలేశ్వరపురం తూర్పు గోదావరి

మాసపత్రిక. సంవత్సరచందా 3—0—0. సంపాదకులు చాగంటి శేషయ్యగారు. రెండవ సంపుటము 8 సంచికలును మా కార్యస్థానము చేరినవి. లోకలుబోర్డులకు మునిసిపాలిటీలకు సంబంధించిన సకల విషయములను ఇది చక్కని సులభశైలిలో ప్రకటించుచున్నది.

9 పశుసంరక్షణ. అంగలూరు కృష్ణాజిల్లా.

ద్వైమాసికపత్రిక. సంవత్సరచందా 1—0—0 సంపాదకులు డాక్టరు యేజెళ్ల శ్రీరాములు చౌదరిగారు. చౌదరిగారు పశువైద్యమున లబ్ధప్రతిష్ఠులు. పశువైద్యమునకు సంబంధించిన గ్రంథములు అనేకములు రచించినవారు. పత్రికలో చక్కని పశువుల చిత్రపటములును ప్రకటింపబడుచున్నవి. పశుసంపద గలవారి కిది చాలా ఉపయోగకరము.

10 ఆంధ్రవిశ్వకళాపరిషత్, కళాశాల తెనుగుసంఘపత్రిక. విశాఖపట్టణము.

ఇది నాలుగు మాసముల కొకసారి ప్రకటింపబడు పత్రిక. సంవత్సరచందా 1—0—0. విడిసంచిక 0—6—0. సంపాదకులు విఖ్యాతకవులగు పింగళి లక్ష్మీకాంతముగారు. రెండవసంచిక మొదటి సంచిక మా కార్యస్థానము చేరినది. విలువగల వ్యాసాలతో చక్కగా నున్నది.

11 ఆదిశైవపత్రిక. చిలుమూరు, అనంతవరం పోష్టు, గుంటూరుజిల్లా

సంవత్సరచందా 1—8—0. సంపాదకులు చిలుమూరు పురుషోత్తమ గురుక్కులుగారు. తొమ్మిదవ సంపుటము పదవ సంచిక మా కార్యస్థానము చేరినది. ఇది శైవ సంఘాభ్యుదయము నిమిత్తము ప్రారంభింపబడినది. [illegible] దీనిని ఆదరించి ఉన్నతి పొందెదరుగాక.

# ప్రబుద్ధాంధ్ర

కలాభివర్ధనీపరిషత్తుపక్షమున ప్రకటింపబడు మాసపత్రిక

సంపాదకుడు:—శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

సంపుటము ౫ } రాజమహేంద్రవరము ఫిబ్రవరి ౧౯౩౪ { సంచిక ౨


## సిద్ధవటముకోట పతనము


మల్లంపల్లి సోమశేఖర శర్మగారు


ఎప్పుడో పాతకాలము నాటి గాథయిది. అప్పటి కింకను కుంఫిణీవారికి మన దేశము స్వాధీనము కాలేదు. మొగలాయిప్రభువులదే రాజ్యము. వారి తరఫున నైజాముల్ ముల్కు అను పేర ఒక నవాబు హైదరాబాదు రాజధానిగ దక్కను దేశమును పరిపాలించుచుండెను. ఈ హైదరాబాదు నిజాము నాడే మన యుత్తరసర్కారులందలి జమీందారీలు ఏర్పడినవి. కడప, కర్నూలు మొదలగు దక్షిణాంధ్రమండలములు నిజామునకు వశవర్తులై సామంతులుగ నుండిన నవాబుల పరిపాలనక్రింద నుండినవి. ఇట్టి నవాబులలో ఒకరికి ఆర్కాటును, మఱియొకరికి కడపయును ముఖ్యపట్టణములు. ఆర్కాటు నవాబుల రాజ్యానకు, కడప నవాబుల రాజ్యానకు సరిగా హద్దులు నిర్ణయించి చెప్పుట కష్టము. పదునెనిమిదవ శతాబ్ది మొదటి పాదములో ఆర్కాటు సుబాను సాదతుల్లాఖానుడును, కడప సుబాను అబ్దుల్ నబీఖానుడును పాలించుచుండిరి. కడపకు చేరువగ నుండినప్పటికి సిద్ధవటము, పోరుమామిళ్ల, బద్వేలు పరగణాలు ఆర్కాటు నవాబుక్రిందనే ఉండెను. ఈమూడు పరగణాలలోను ఉండే గొప్ప కోట లన్నిటిలోకి సిద్ధవటము కోట పేరెన్నిక గన్నది.

కృష్ణదేవరాయల కాలమునుంచి సిద్ధవటము సీమ ననుభవించుచు వచ్చినవారు మట్లివంశజు లయిన సూర్యవంశక్షత్రియులు. వీరు ఈసీమలో ప్రజోపయోగకరము లయిన కార్యములు కొన్ని చేసి ప్రజల యాదరము గడించినారు. విజయనగరప్రభువులతో సంబంధబాంధవములు కలిపి వీరు కొంత పేరు ప్రతిష్ఠలు సంపాదించి ప్రముఖు లయినారు. పదునేడవ శతాబ్ది ప్రారంభములో మట్లి అనంతరాజు రాజ్యమేలిన నాటికి ఇప్పటి బద్వేలు, పుల్లంపేట, సిద్ధవటము తాలూకాలు మట్లివారి క్రిందనే యుండెడివి. మట్లి అనంతరామరాజు అను అనంతరాజు తాను రచియించిన 'కకుత్స్థవిజయ' మను ప్రబంధము ద్వారా తెలుగువారికి శ్రుతపూర్వుడే. ఇతడును, ఇతని తండ్రి యెల్లమరాజును ఈవంశమున కడు ప్రసిద్ధులు. అనంతరాజు సిద్ధవటమున దేవాలయమండపాదులు కట్టించి సిద్ధవటము కోట కట్టుదిట్టపరిచెను. తరువాత కొంతకాలమువఱకు సిద్ధవటమే మట్లివారికి రాజధానిగ నుండెను.

ఇట్లుండగా హిందూరాజ్య సౌధానికి చిచ్చరపిడుగు లాగు తళికోట యుద్ధము దాపురించినది. ఆయుద్ధభూమిలో హిందువుల శౌర్యము, పరాక్రమము, సర్వము—అన్ని మణగిపోయినవి. తరువాత

దక్కను తురక నవాబులచే మీఁది చేయి యైనది. వారు విజయనగర హిందూరాజ్యమును పంచుకొనుటలో కడప, గండికోట ప్రాంతము గోల్కొండ నవాబుల వశమయినది. ౧౬౮౭ లో ఢిల్లీ మొగలాయి పాదుషా యయిన ఔరంగజేబు గోలకొండ రాజ్యమును జయించుటతో మరల ఈప్రాంత మంతయు మొగలాయి ప్రభువులకు చేపడినది. అప్పటినుండియే దీనిని హైదరాబాదు నిజామునకు సామంతు లయిన ఆర్కాటు, కడప నవాబులు పాలించుచువచ్చిరి. ఈ క్రొత్త నవాబుగిరీల యేర్పాటులో మట్లి సంస్థానికుల పరగణాలు ఆర్కాటు సుబాలో చేరిపోయినవి. ఈ నవాబులు సిద్ధవటము కోటను మఱింత కట్టుదిట్టము చేయించి ఫత్తేసింగు అను నొక మహారాష్ట్రవీరుని ఖిల్లేదారుగా నియమించినారు.

దగ్గఱలో నున్న సిద్ధవటంకోట మహారాష్ట్ర ఖిల్లేదారుని క్రింద నుండుట కిట్టనది కాదు కడప నవాబు అబ్దుల్ నబీఖానునికి.

కడపసుబా అబ్దుల్ నబీఖానుని వంశమువారికి వచ్చుట అదే క్రొత్త. నబీఖానుని పూర్వు లదివఱకు మొగలాయి సంస్థానము లందు, దక్కను నవాబుల యొద్ద భయభక్తులతో పని చేసి, తుద కెట్లయితే నేమి యీ సుబాకు నవాబుగిరి సంపాదించినారు. ఈ వంశమువారు మియానా వంశస్థులు; పఠానులు. అందువలన ప్రజ లీనవాబులను 'మియా' లని వ్యవహరింతురు. ఈ మియానాలలో కడప నేలిన మొదటి నవాబు ఈ అబ్దుల్ నబీఖానే. ఇతనికి అబ్దుల్ మహమ్మదుఖాను, అబ్దుల్ మోసింఖాను, అబ్దుల్ హలీముఖాను, అబ్దుల్ కాదర్ ఖాను, అబ్దుల్ ఫత్తేఖాను అని కొడుకు లనేకు లుండిరి. అబ్దుల్ నబీఖానునికి అబ్దుల్ మియా అని, అబ్దుల్ మోసింఖానునికి మోదీమియా అని, అబ్దుల్ హలీముఖానునికి షామ్మియా అని, ఇద్దేమియా అని వ్యవహారాంతరములు [illegible] పెద్ద కొడుకు తండ్రిమాప్పు కాన [illegible] గ్రుడ్డి [illegible] లక్షిని [illegible]

బని వ్యవహరించేవారు. మియా లయిన యీ కడప నవాబులయొద్ద కర్ణాటకము వ్యాపారి పంతుళ్లు (మాధ్వులు) వ్యవహర్తలుగ నుండిరి. మన దేశమున పగటివేషగాండ్రు వినోదమునకు ప్రదర్శించు 'పంతులు, ఫఠాణీ' వేషము ఫఠాణీ లయిన యీ కడప నవాబుల నాటి నవాబుల, పంతుళ్ల దర్బారాలను గేలి సేయుట కేర్పడినదే యైయుండవచ్చును.

కొంచె మించుమించుగ ఆకాలమున బల మున్నవానిదే రాజ్యము; ఉపాయము గలవానిదే కోట; తంత్రములు నేర్చిన వానిదే రోజు. దొంగ యెవఁడో దొర యెవఁడో, మిత్రుఁ డెవఁడో, శత్రు డెవఁడో తెలియని దినము లవి. మనుష్యునియందలి శౌర్యసాహసపరాక్రమములు రాజకీయముతో వీరవిహారము సలిపిన దినము లవి; మనుష్యులు తమ ప్రాణముల నరచేత బెట్టుకొని సంచరించిన దినము లవి. ఆరోజులే మంచివి; ఆరోజులే చెడ్డవి. అట్టి రోజులలోనే సిద్ధవటం కోటమీద కన్ను వేసినాడు అబ్దుల్ నబీఖాను. సిద్ధవటముకోట సాధించవలె నన్న అంత సుకరము కాదు. కోట కధిపతిగ నుండినవాడు మహారాష్ట్రుడు. అప్పటికే ఛత్రపతి శివాజీ మహారాజు నాయకత్వమున విజృంభించిన మహారాష్ట్రుల శౌర్యమును చవిచూచినారు తురకలు: చుఱుకు తగిలినది వారికి దాని వేడి. అందువలన మహారాష్ట్రులతో డీకొనుట యన్న ఎంతటి పఠాణీకైనను సింహముతో చెలగాటమే. మహారాష్ట్రుల అంతటి శౌర్యాగ్నిలోను హిందూహృదయ సహజము లయిన మార్దవము, ఔదార్యము, అనుకంప మొదలయిన చల్లని యుత్తమగుణములు నిగూఢముగ నున్నవని కనిపెట్టినాడు తురకబిడ్డ. ఒక చేతితో ఆనిప్పు నార్పించి వేఱొక చేతితో ఈ గుణములను బట్టుకొని మహారాష్ట్ర కిల్లేదారు కోటమీది కెక్కుదలచినాడు అబ్దుల్ నబీఖాను. కలికాలమది. తంత్రముల కేమి కొదువ? తెల్లవారి లేచి చూచే సరికి పునరావేశ్యాల [illegible] చాథాయి రూకల కోసమా, ఊళ్లు కొల్లగొట్టుట

కోసమో గుఱ్ఱపు స్వారులమీద కొనవచ్చే రోజులవి. ఇక నేమి? ఉపాయము తట్టినది అబ్దుల్ నబీఖానునికి.

తనకు మహారాష్ట్రులకు రాజకార్యము తటస్థించిన దని వేసినా డొక యెత్తు అబ్దుల్ నబీఖాను. 'నా జనానా కుపద్రవము శంకించుచున్నాను. దగ్గఱనున్న వారగుటచేత మన మొండొరులకు సాయము చేసికొనుట యుక్తము. నాకు మహారాష్ట్రులతోడి రాజకార్య మనుకూలపడునంతవఱకు నా జనానా క్షేమముగా నుండుటకు సిద్ధవటము కోటలో తావిచ్చిన చాలును. ఇదే నాకు మీరు చేయగల గొప్ప యుపకారము. రాజకార్యము కుదిరిన పిదప నా జనానాను మరల కడపకు గొనపోయెదను' అని అబ్దుల్ నబీఖాను తన మనుష్యుల ద్వారా కిల్లేదారు రాజా ఫత్తేసింగునకు కబురు పంపెను.

రాజా ఫత్తేసింగు అబ్దుల్ నబీఖాను పంపిన సమాచారము నాదరముతో వినెను; దగ్గఱ నున్న కారణమున ఒండొరుల కుపకృతి చేయవలసినదే యని యాలోచించెను; నిష్కపటహృదయముతో అబ్దుల్ నబీఖాను కోరిక కంగీకరించెను.

వెంటనే కడపనుండి నూటయేబది డోలీలు బయలుదేఱినవి. ఒక్కొక్క డోలీయందు నలుగురేసి పఠాణీలు సాయుధపాణు లయి ప్రవేశించిరి. పైని బురకాలు కప్పిరి. ఘోరాచారులతో డోలీలన్నియు సిద్ధవటమునకు వెళ్లినవి.

అబ్దుల్ నబీఖాను వెంటనే కొంత సైన్యమును చేర్చి రహస్యమార్గములగుండ సిద్ధవటమునకు పంపి కోటకు చేరువగ నుండ నియమించెను. కోటలోపల చేరిన పఠాణీలు లోపలి వారి పయి తిరుగబాటు చేసి విజృంభించిన వెంటనే కోట యవతలి వారు వారిని గలసికొని కోటను ముట్టడించి దానిని స్వాధీనము చేసికొనుట కేర్పాటులు జరగెను. అంతయు అనుకొన్న ప్రకారము జరిగిపోయెను.

ఫత్తేసింగు ఇట్టి మిత్రద్రోహమునకు సిద్ధపడియుండలేదు. కడప నవాబు ఇట్లు చేయు నని యైన తలంచి యెఱుగడు. అందువలన అతని సైన్యము లేవియు యుద్ధమునకు సిద్ధమయి యుండ లేదు. అబ్దుల్ నబీఖాను కుట్ర ఫలించినది. సిద్ధవటము కోటలో చేరిన పఠాణీలు రాణువగళ్లలో దిగిన వెంటనే బురకాలు తీసి ఆయుధపాణు లయి ఫత్తేసింగు, సేవకులను భటులను దురుమాడి సైన్యముల పయి కురికి వారిని వధించి మహోత్సవము కావించిరి; పిదప కోట బురుజుల నాక్రమించుకొని ఆవేరువను పొందియుండిన తమ సైన్యములకు తమ విజృంభణము సూచించుటకు గుండ్లు పేల్చిరి. వెంటనే వెలుపల దాగియున్న కడప సైన్యములు సిద్ధవటము కోట నిచ్చటినుండి ముట్టడించినవి. కొన్ని ఘటికల కాలములో కోటలోపలివారును వెలుపలివారును గలసి ఫత్తేసింగు సైనికులను చాలమందిని వధించి కోట స్వాధీనము చేసికొనుటయే కాక కిల్లేదారు ఫత్తేసింగును కూడ కైదీగ దీసికొని పోయిరి. అబ్దుల్ నబీఖాను కృతకృత్యు డయ్యెను; నాటనుండి సిద్ధవటముకోట మీద, కడప నవాబుల నగారా నౌబత్తులు మ్రోగినవి. అప్పటినుండి కడపనవాబుల కుటుంబమునందు సిద్ధవటము యువరాజస్థానమయినది. ఈప్రాంతమును హైదరల్లీ టిప్పుసుల్తానులు జయించునంతవఱకు సిద్ధవటము కడపవారి స్వాధీనము క్రిందనే యుండిపోయెను.



# కూతుళ్ల తల్లి

## సుబ్రహ్మణ్యశాస్త్రి—సంపాదకుడు

"చిన్నమ్మమ్మ వస్తోందే అమ్మాయి!"

"సరిగ్గా పిలిచినట్టు వచ్చావు. రావే పిన్నీ!"

"వుత్తరమా యేమిటే అదీ!"

"మరే నమ్మా!"

"ఎవరు రాశారూ?"

"రాజం అక్కయ్య రాసిం దమ్మమ్మా"

"నెల పట్టేక యిది నాలుగో వుత్తరం. రకరకాలుగా—కవిత్వం కడతారుట యెవళ్లోనూ? అలాగ—అదే రాస్తుందో మరి, అతనే రాయిస్తాడో గాని, యేం మాటలే పిన్నీ అవీ? నాకూ తుర్ని నేను మెచ్చుకోడం కాదు; గాని మొగాళ్లు కూడా రాయలే రలాగ"

"ఏం రాసిం దేమిటి?"

"ఇప్పటికి మూడుమాట్లు చదివింది యక్కమ్మ. ఇంకా నాకు సరదా తీరలేదు—"

"అమ్మమ్మోయ్! మాచిన్నక్కా, మాచిన్న బావా, మాచిన్నత్తా బజారుకి వెళ్లారుట యెం చక్క! మాఅక్క యెంతో మంచి జామారు చూసిందిట. కదుటే పెద్దక్కా?

"చెల్లీ, నువ్విలా రా. చిన్నపిల్లలు వింటూ కూచోవాలి, మాట్లాడకూడదు"

"మరి నాకు కొత్త గౌను కుట్టించ మంటావా పండుక్కి అమ్మని?"

"నేను కుట్టిస్తా నిలా రా జాని!"

"వోయ్, వోయ్! నాకు చిన్నమ్మమ్మ కొత్త గౌను కుట్టి—స్తుం—దిట. ఇక మాట్లాణ్ణు. ఏం అమ్మమ్మా?"

"అలా కూచోవాలి మాట్లాడకుండానూ. ఏం?"

"ఊఁ ఇక నువ్వు చెప్పవే అమ్మా"

"సత్యవతిత్రికి తన మొగుణ్ణి పిలవడం మానేస్తామేమో—ఇక దాని అసుర్దా యేమని చెప్పను? అయినా యేం వస్తుందో చూద్దాం మని జవాబు రాయనిచ్చారు కాను నేను. ఇది చివరి వుత్తరం. ఏమిటేమిటో—నేను చెప్పలేనే పిన్నీ!"

"నన్ను వూరిస్తున్నావు నువ్వు"

"దాని మాట యెరుగుదువు కదా చిన్నప్పణ్ణుంచీని? అపైన వయస్సుతో కూడా నెరజాణతనం—"

"పైగా మొగుడు ప్లీడరు కూడా అయె"

"అవు నవును. అదోటి కూడానూ. ఏదీ పిన్ని వింటుంది మళ్లీ చదువు యక్కా!"

"నాకూ కూడా వొకమాటు వినిపించవే మనవరాలా! నువ్వు మాట్లాడకుండా వినే? ఏం జానీ?"

"ఇవాళే కుట్టించాలి పరికిణీ. ఏం మరి?"

"అలాగే"

"విన వమ్మా, అమ్మమ్మా! "అమ్మకి దణ్ణాలు. నాన్నగారికి నా నమస్కారాలు చెప్పవలసింది. అక్కయ్యకి కూడా చెప్పవలసింది. తమ్ముడూ, చెల్లాయీ కులాసాగా వున్నా రని తలుస్తాను"

"నామాట కూడా రాసింది చిన్నక్కయ్య. అవునా అమ్మమ్మా?"

"మరే నమ్మా?"

"ఇక్కడికి లాంఛనా లయినాయి. ఇక గొడవ మొదలు. బాగా విను. చదవ్వే అమ్మాయీ!"

"నాలుగు వుత్తరాలు రాశాను. వొక దానికీ జవాబు లేదు. నేను మీకు కోపం తెప్పించి వుంటాను. లేకపోతే యిలా జరగదు—"

"విన్నావా? దీని పే రేమిటమ్మా? దీనితో యేలా గమ్మా వేగడం?"

"నిజమే"

"పెద్ద పండుగు ఇక ఆరు రోజులే వుంది. అంటే ఆవేళా, ఇవాళా, కాక మధ్యని నాలుగు దినాలే వున్నాయి—"

"అయితే యేమిటో?"

"మాకు రాయడం యెందుకే పిచ్చి అమ్మాటా? మాకు మాత్రం లెక్క తెలవదుటే?"

"నాన్నగారింకా రాలేదేం అని అడగడం అది"

"జవాబేనా రాయకపోతే యేం చేస్తుం దమ్మమ్మా అది మరీ?"

"మరి మీ ఆయన యెప్పుడు వస్తాడే?"

"మా అమ్మ నడుగు"

"నాకేం తెలుస్తుందే పిచ్చి?"

"వుత్తరం రాయించావా?"

"అలా అడుగు నిలవతీసి"

"అడిగితే మాత్రం నాకేం భయమా? నువ్వు న్యాయం చెప్పవే పిచ్చి! రాజా ఇక్కడ లేను కనక దాన్ని, దాంతో పాటు దాని మొగణ్ణి మేం పిలవాలి. తానిక్కడ వున్నప్పుడు తన మొగణ్ణి మే మెందుకు పిలవాలీ? రమ్మని తాను వుత్తరం రాస్తే, అతగాడు వస్తే మేము పప్పూ పణ్ణమూ పెట్టి, మాతాహతుని బట్టి యిద్దరికీ పచ్చం చల బట్టలు పెడతాం, అంతేనా పిచ్చి?"

"నీ పుట్టింటికి రమ్మని పిలవడానికి నీకేం అధికారం వుందంటే నే నేం చెప్పగలనమ్మా అమ్మమ్మా?"

"అదీ నిజమేనే పాపం"

"నువ్వు దాని మాట అడుతున్నావు. నే నెక్కువా అ దెక్కువా నీకు?"

"నువ్వే యెక్కువ. కాని—"

"ఇక కాని యెందుకూ?"

"చెప్పనియ్యి, మధ్యని అడ్డు వస్తావే?"

"నీకూ నాకూ కూడా యిష్టమయిందే కనక అదీ యెక్కువే"

"ఏం, ఏం? అమ్మమ్మ, నిజం చెప్పింది. ఇక నాన్నగారితో చెప్పి వుత్తరం రాయిస్తావా మరీ?"

"నువ్వే చెప్పరాదూ మీనాన్నతోటీ?"

"మాకావుటే అమ్మమ్మా మరీ?"

"దగ్గిరుండి నేను రాయిస్తాను గాని, ఆ వుత్తరం యేమిటో చదువమ్మా నువ్వు"

"ఈయేటి పండుక్కి మమ్మల్ని తీసుకు వెళ్ళడానికి యిష్టం లేకపోతే మానెయ్యవచ్చు; కాని—"

"ఇక కాని యేమిటో మరి?"

"అదే వాక్యం. ఇంకా విను. చదవ్వే"

"నిన్న నేనూ, మీ అల్లుడుగారూ, మా అత్తగారూ బజారుకి వెళ్ళాం. మా మరిది అత్తగారికీ, మామగారికీ, మరదలికీ బట్టలు కొనడం కోసం వెళ్ళాం. నన్ను మా అత్తగారు బలవంతపెట్టి తీసుకు వెళ్ళారు"

"పిలవగానే యెందుకు వెళ్ళకూడదో?"

"కాకపోయినా లక్ష పనులు చేసుకుంటారు వాళ్ళు. అవన్నీ మాకు రాయడం యెందుకే?"

"అవు నవును. అదీ నిజమే"

"వర్తకుడు నాలుగు చాపులూ, అయిదు చీరలూ, మూడు తానులూ ముందు పడేశాడు. అందులో వొక జామారు మద్దులు మూట కడుతోంది"

"అయితే?"

"మీ అల్లుడుగారు దాన్ని విడిచిపెట్ట లేక పోయారు"

"బోధపడుతోందా?"

"హు, హు, హు"

"మమ్మల్ని కొనమను"

"మరే, మరే"

"అది చూసి మా అత్తగారు "నువ్విప్పుడు కొనుక్కో నక్కర లేదోయ్! మీ అత్తారు పండుక్కి యీ మాత్రం జామారూ పెట్టరా యేమిటి?" అన్నారు"

"పెడతాం, మాంతాం: ఆవిడ కెందుకే అదీ?"

"మీనాన్నగారితోటీ, మీఅమ్మతోటీ చెప్పవే నువ్వు" అన్నారు మా అత్తగారు"

"ఇక్కడ మా యిష్టం వచ్చింది కొంటాం. ఈపురమాయిం పేమిటే మాకూ?"

"పండుక్కి మీ రలాగా పెడతారు. సందేహం లేదు. అయినా అలాంటి జామారు ఈవూళ్లో దొరకవద్దూ?"

"దొరుకుతుందే అనుకో. అయినా అతగాడికూడా తాను కోరిందే పెట్టాలన్న పట్టుబం దేమిటమ్మా మాకూ?"

"అదీ నిజమే"

"నువ్వుకూడా అలా అంటా వేమిటమ్మమ్మా? అల్లుళ్లకి పెట్టే బట్టలు కూతుళ్లకి, కళ్లకి నచ్చొద్దటమ్మా?"

"అవునేవ్! కూతుళ్లకి మంచిమంచి చీరలిచ్చి అల్లుళ్లకి యే మడిబట్టలో యిస్తే కూతుళ్లు చిన్నబుచ్చుకోరుటే?"

"నువ్వూ వాళ్లలోనే కూడుతున్నావు"

"న్యాయం చెప్పవలసివస్తే కూడదాయేమిటమ్మా మరి?"

"నువ్వు మరీని! చెల్లాయి మొగుడికి మంచి చాపు పెడితే నీమొగుడికూడా అలాంటిది పెట్టక తప్పదు గదా అని దాని మాటలు బలపరుస్తున్నావు నువ్వు. ఇలా అయితే మేం అల్లుళ్లని పిలవనే పిలవం యీయేడు"

"పోనీ, మానుకో. మాకోసం పిలుస్తావా యేమిటమ్మా?"

"నువ్వు మంచి చాపులు పెట్టకపోతే మానె గాని పండుగల్లో వాళ్లని విడదీస్తావా యేమిటే అమ్మాయీ?"

"మహా బాగా అడిగావు. మరి అమ్మమ్మ కేం చెబుతావో చెప్పు"

"………………………"

"మాట్లాడవేం? నవ్వుకుని పూరుకుంటావేం?"

"తరవాత చెబుతుంది లే అమ్మా! ఏదీ; వృత్తరం చదువు"

"దేని కేనా సియ్యట్టం. అమాద సొన్నగా రున్నారు. మీ రీయేడు మమ్మల్ని తీసుకు వెళ్లా అని తలుచుకోకపోతే యిబ్బంది లేదు——"

"అలా అయితే ఆమాట యిన్నిమాట్లు రాయడం యెందుకూ మరి?"

"నే ననేదీ అదేనే. ఇది "తీసుకు వెడితే గాని వొప్పుకో" నంటూ ధరణా కూచోవడం అంటావా, కాదంటావా?"

"సందేహ మేం యింకానూ?"

"ఈయేడు మమ్మల్ని తీసుకు వెళ్లడానికి వీలు లేకపోతే ఆమాటేనా రాస్తే——"

"రాయరు మీరు. తనేం నష్టం దేమిటి?"

"వినవమ్మా తల్లీ!"

"నా డబ్బు పెట్టే నేనేనా కొని మీరు ఇప్పించిన ట్లిస్తా నిక్కడ"

"అ! ఎంత వొడుపూ!

"మే మతగాణ్ణి తీసుకురాకపోయినా జామారు ఖరీదు మాత్రం మాకు తప్పదుట, చూశావా?"

"వొశావ్! ఇది గోకేస్తుంది సుమా మిమ్మల్ని. సంవత్సరానికి రెండు వంద లేనా మూటకట్టి వొక చోట దాచాలి దీనికోసం"

"అ! రమ్మన్నారు తిమ్మన్న బంతికి. తతిమ్మా వాళ్లో మరీ దానికే అంత పెడతేనూ? ఇలాగ వున్న దంతా ఆడపిల్లలికి పెట్టేసి మొగపిల్లాణ్ణి పాడు చేసుకోమూ?"

"మాకు పెడితే తమ్ముణ్ణి పాడుచెయ్యడంటమ్మా అమ్మమ్మా?"

"కాకపోయినా, మాయి టికి మేం తీసుకువస్తే పెడతాం గాని యిదేం ముదుపులే ఓస్సి?"

"నిజమే, ఇది కొత్తపద్ధతి"

"ఇంటలో వున్న రహస్యం కనిపెట్ట లేకపోయావు నువ్వు. కూతుళ్లని మాత్రం పండుక్కి తీసుకు వచ్చి తోచిదో తోచినకాడికి పెట్టడం వుంది లోకంలోను. కూతుళ్లకి పెడితే అల్లుళ్లకి కూడా పెట్టాలని నిర్బంధం లేదు యే శాస్త్రంలోనూను. కాని అల్లుళ్లకి పెట్టి కూతుళ్లకి మానుకో రెవరూను"

"మరే నేవ్! ఎంత యెత్తు వేసిందే రాజు!"

"పెద్దది యెలా నవ్వుతుంటోందో చూశావా? అంతా గూడు పుఠాణీ——"

“అలాగే మరీ. వాళ్లు పట్టుకు వెళ్లేతగ్గవాళ్లు కారూ!”

“అయితే: అంత తొందర యెందుకో తెలుసా?...చదవ్వే రుక్కూ!”

“ఆలస్యం చేస్తే ఆచాపు మరెవళ్లేనా పట్టుకుపోవచ్చు. అందుకోసం యింతగా రాస్తున్నాను”

“శా—బా—సూ”

“అలా అయితే అతగాడు కొనుక్కోవాలి. తన కెందుకే ఆపురపురా!”

“పోనీ, అమాటే రాయించరాదూ నువ్వు చెల్లాయికీ?”

“మాకేం? నేను రాయిస్తే గాని వాళ్లు ఏమీ కొనుక్కోరా యేమిటి? ఏమే పిన్ని?”

“అవును; గాని—అయినా యిదలాంటిది కాను; గాని—”

“ఇంతకీ ఖరీ దెంతో విన్నావా?”

“అది కూడా రాసింది!”

“ఏం చెప్పకోనే? చదువు రుక్కూ!”

“వర్తకుడు దాని ఖరీదు యిరవై రూపాయలు చెప్పాడు. పదహారు రూపాయల కిస్తే మనకి లాభం. పద్ధెనిమిది కిచ్చినా బాగానే వుంటుంది. అది సరికొత్త రకం కనక వర్తకుడు అడిగినంతా యిచ్చినా నష్టం వుండదు.”

“డబ్బు పెట్టుకుని వాళ్లు పైగా వుంటే యెంతకి కొన్నా నష్టం వుండదు.”

“మా బాగా చెప్పావు. ఏదో సామెత చెప్పినట్లు—”

“కానైతే ఖరీదు ఎక్కువే; గాని అజామారు ఎంతో మెరిసిపోతోంది.”

“అంత మెరిసిపోయే జామారు కొనడానికి మాకు శక్తి లేదు సుమా.”

“ఆ! తప్పతుం ధనుకుంటున్నావు కామోలు పాపం”

“కాకపోతే: యే గోరంచుల చాపులో కొందా మనుకుంటున్నావా యేమిటమ్మా? వల్ల కాదు”

“దీనివరస చూశావుటే పిన్ని?”

“పుట్టింటి ఆశ అలా వుంటుంది. ఇప్పటికూడా తెచ్చుకుంటున్నావు కాదా యేమిటి నువ్వు తమ్ముల తో పోరి?”

“మా బాగా అడిగావమ్మా?”

“.........................”

“మీ అల్లుడుగారు బిళ్లకచ్చలు పోసి కట్టుకుంటారు: కనక మరీ బాగుంటుం దది”

“అతగాడు అది కట్టుకుని యెదట నుంచున్నట్టు తోపిస్తోంది చూశావా!”

“కొనమ్మా, కొను. పిల్లల ముచ్చటలు తీర్చకపోతే యిక పండుగు చేసుకున్న అందం వుండదమ్మా”

“మాంతానూ? మానగలనా వీళ్ల వరస చెబుతున్నాను గాని”

“ఎక్కడ నేర్చుకుందే యివంతానూ!”

“స్వయంగా పుట్టుకు రావాలి; గాని నేర్చుకుంటే వచ్చేవిటమ్మా యివి? ఇంతకీ అలాంటిది వొక్క చాపే వుంటే యెలాగా మరీ? ఇద్దరికీ వొక్క రకం పెట్టక పోతే—”

“పోనీ, రెండోది సేలంచాపు కొనూ”

“చూశావా పిన్ని? అది యిర్వై రూపాయలతో సరిపెడుతోంది గాని యిది యాభై దాకా దేకించింది”

“కనక తొరగా కొనిపించెయ్యి అలాంటివి రెండు చాపులూను”

“పొద్దుటి బండికి వెడతారు మీ అల్లుడు”

“మంచిదే. ఇంట్లో కూచోలేక యిట్టే వచ్చి నందుకు మంచి మాటలే చెవిని పడ్డాయి. మరి పోతా. ఇంకా పిండికూడా విసురుకోవాలి”

“కాస్సేపు కూచోవే మాతల్లీ!”

“కూచోనమ్మా! మా వాడి భావమరిది వచ్చాడు పండుక్కి పిలవడానికి. కాస్త కాఫీ యేనా చేసి యివ్వకపోతే బాగుంటుందా? అదిగో, మాధు

కొడుతోంది. బాబోయ్ నా కొడు కేం కంగారు పడుతున్నాడో యేమిటో ?"

"ఇదిగో......రేపు వస్తావు కాదూ సావకాశం గానూ ?"

"........................."

"ఏమిటీ అంటోంది అమ్మమ్మా?......నీ కేనా వినపడిందా?"

"ఏదో 'భోజనం వేళాక" అంటోంది. రాత్రో రేపు మధ్యాహ్నమో మరి"

"చిన్నమ్మమ్మ నాకు పరికిణీ కొనిపెట్టింది కాదు చూశావులే అమ్మా ?"

"బుల్లిమామయ్యతో చెప్పు వెళ్లి"



# ఆంధ్రులు-ఆంధ్రము

భావరాజు వేంకటకృష్ణారావుగారు బి. ఏ., బి. ఎల్

ఆంధ్రుడు ఊరకే, ఆంధ్రుడ నని గర్వించడము, మురిసిపోవడము తప్ప, తా నెందులకు గర్వించవలెనో తెలుసుకొనడు. ఆంధ్రునకు తన దేశము యొక్క రూపము ఎట్లున్నదో, సీమ యెక్కడో, శీతోష్ణస్థితులు ఎట్టివో ఏమీ తెలియవు. పాఠశాలలో చెప్పరు. పాఠశాల విడిచిపెట్టిన తరువాత ఆంధ్రుడు తెలుసుకొనడు. తెలుసుకొనడానికి ప్రయత్నమైన చేయడు. 'పాశ్చాత్యుల నెవరినైనా కనబడినపుడు అడిగితే వారి దేశము గురించి అన్ని సంగతులు చక్కగా ఉత్సాహంతో, గర్వంతో చెబుతాడు. అంత దూరం పోనక్కరలేదు. మన భరతఖండంలో మహారాష్ట్రుణ్ణి గాని గుజరాతీని గాని బీహారీని గాని, బంగాళీని గాని, అడిగితే అతడు అన్ని సంగతులు చెప్పగలడు. వాళ్ల దేశాభిమానము, దేశారాధన ఒక్కటే! దేశారాధనకై మాతృదేశ రూపాన్ని వారు గ్రహించి చిత్రించుకుంటారు. అచిత్రించుకోవడం కాగితంమీదే కాదు. హృదయఫలకంమీద కూడా చిత్రించుకుని ఆరాధిస్తారు. ఆంధ్రులకు ఆంధ్రదేశ స్వరూపమే తెలియదు. మిగిలిన వాటి ప్రసక్తి యెందుకు ?

ఆంధ్రులు దేశారాధన చేయరు. దేశమంటే వారికి మనుష్యు లని గాని మట్టి అని గాని భావం మనసులో యేర్పడ లేదు. దేశానికి స్వరూపము ఏర్పరచి—దేశపటమును చిత్రించి అందు మాతృస్వరూపమును కల్పన చేసి ఆరాధించడం ఆంధ్రులకు తోచలేదు. ఆంధ్రులు కేవలము నిర్గుణోపాసకులు గారు, రూపకల్పనయందు వారి కిష్టము లేదనుటకు. ఆంధ్రులు నిస్సంశయముగా సగుణోపాసకులు. సౌందర్యతృష్ణ కలవారు. భరతఖండ పటమును చూచి అందు ఆంధ్రదేశమును ధ్యానం చేసి చూస్తే శిల్పి యైన ఆంధ్రునకు—కళోపాసకు డైన ఆంధ్రునకు ఆంధ్రదేశము శుక్లాష్టమినాటి చంద్రాకృతిగా మనోహరముగా కనుపట్టి ఆకర్షించును. జీవవాహినులు మహానదులు గోదావరి, కృష్ణ, తుంగభద్రానదులు ముత్యాల కంఠమాల ముప్పేటవలె ప్రకాశిస్తూ ఒయ్యారముగా పడమటి దిక్కునుండి తూర్పునకు ప్రవహించుచుండును. దేశమును రెండు పాయలుగా జేసి ఒక భాగమున విశాలమైన పీఠభూమిని మరియొక భాగమున సస్యశ్యామలమై ఏటవాలుగనున్న కేదారక్షేత్రమును ప్రదర్శించు పర్వతశ్రేణి ఒక్కొక్క ప్రాంతమున ఒక్కొక్క పేరున పిలువబడుచు ఉత్తరమునుండి దక్షిణముగా పోవును. మనోజ్ఞమైన ఈ దివ్యరూపమును సుందరాకృతిగా జూడగల భాగ్యశాలికి ఆంధ్రు

నను గర్వము గాక మరేమి? ఆంధ్రదేశము భరత ఖండములో గల అన్ని రాష్ట్రములకంటె ఎక్కువ అదృష్టశాలి. ఇక్కడ శీతోష్ణస్థితి సర్వదా సర్వ ఋతువులలోను సుఖకరమై రమణీయమై యుండును. ప్రకృతి అప్రయత్నముగానే ఆంధ్రునకు అన్నియు సుభిక్షముగా నిచ్చును. భాగ్యవంతురాలైన ఆంధ్ర గర్భమున బుట్టిన ఆంధ్రుడు శ్రీమంతులగు బాలికా బాలురను ఉండు లక్షణములనే గలిగి ప్రకాశించుచున్నాడు. ఇన్ని మాట లేల? ఆంధ్రదేశమున పంటకాపు యేటి కేడాదియు భూమిని వ్యవసాయము చేయడు. సుమారు ఆరు నెలల కంటె నెక్కువ పాటుపడడు. మిగిలిన కాల మాతడు సోమరియై వ్యర్థము చేయును. ఆతడు కష్టపడ నక్కరలేదు. తల్లి ఆంధ్రభూమి ఇచ్చినది పదిలపఱచుకొన్న జాలును. అదియును చేయడు.

ఆంధ్రుడు తన పూర్వులు గొప్పవారని అప్పుడప్పుడు వారిని స్మరించి వివశుడగుచుండును. వివశుడైన నేమి ఫలము? పూర్వు లిచ్చిన భాగధేయమును యథావిధిగా జాగ్రత్తపెట్టుకొని తన సంతతికి ఇచ్చుటకై ప్రయత్నించుట లేదు. మాగన్ను పెట్టి నిద్ర పోవుచున్నాడు. తన సొత్తు నితరు లపహరించుకొని పోవుచున్నా రని తెలుసుకొనియు నిద్రలోనే యిది కల యని భావించుకుంటున్నాడు. ప్రసిద్ధమైన అమరావతిస్తూపము—లోకములో అతి సుందరమైన అమరావతిస్తూపము ఆంధ్రునిదే. అయితే ఏమి ప్రయోజనము? పోయినది పోగా మిగిలిన దానిని శిల్పముతో ప్రకాశించు శిలలను ఆప్రాంతమునకు ఈప్రాంతమునకు పట్టుకొనిపోతూ వుంటే—చివరకు ఏమయినా సరే వలదని అయినా పెదవి కదల్చడు. అమరావతి అయింది, జగ్గయ్యపేట మొదలయినవి యెన్నో అయినవి, చివరకు జగత్ప్రఖ్యాతి గాంచిన శ్రీపర్వతస్వామియొక్క ప్రాసాదములోనివి నాగార్జునకొండ శిల్పములు పైకి పట్టుకొని పోతూ ఉంటే మాటలాడక ఊరుకుంటాడు. శిథిలమై ప్రాణావశిష్టమైన అమరావతి శ్రీపర్వతప్రాసాదములు బ్రతికి చెడిన ఆంధ్రమహాసామ్రాజ్యమును తలపునకు తెస్తూ ఉన్నవి. ఆంధ్రుడు వాటిని స్మరించనైనా స్మరించడు. పంచారామములు, విజయవాడ, రాజమహేంద్రవరము, పావనమైన వేంగీ పిఠాపురక్షేత్రములు చాళుక్యసామ్రాజ్య ఛాయలను మనసునకు ఒక విధముగా తోపింపచేస్తూ ఉన్నవి. ఒక వంక పాడైన పెనుగోటగోడల దీర్ఘనిద్రలు పోవుచున్నది కాకతి ప్రాభవము. ఒకవైపు తుంగభద్ర కెరటాల రొదలో కలిసిపోవుచున్నది విజయనగరసామ్రాజ్యవైభవము గోడు. వీటిని ఆంధ్రుడు వినుట లేదు, కనుట లేదు, తలచుట లేదు. పూర్వులవలన తనను సంక్రమించిన భాగధేయమును ఆంధ్రుడు పాడుచేసుకున్నాడు—"తెలివి ఒకింతయును లేక తృప్తుడై కరిభంగి గర్వితమతియై" వ్యవహరిస్తూ ఉన్నాడు.

ఆంధ్రుడు పూర్వం జరిగిన దానిని తెలుసుకోవడం లేదు. ముందు చేయవలసిన కర్తవ్యాన్ని ఆలోచించుకొనడం లేదు. తాను ముందడుగు ఎందులో వేస్తున్నాడో గమనించడం లేదు. ముందు వెనుకలు అరయకుండానే పరుగు లెత్తుతున్నాడు. చివరకు త్రోవ తెన్నులు గానక ఎచ్చటనో కూలి అలసట చెంది పరవశుడై పోవును. ఆపారవశ్యములో పూర్వవృత్తాంతమును పూర్తిగా మరచిపోవును. జ్ఞప్తికి సైతము తెచ్చుకొనడు. అట్టి పని అతనికి సిగ్గుచేటు. తన దేశస్థితిని ఆతడు ఒక్కసారి అయినా తలచుకొనడం లేదు. ఒకవేళ తలుచుకున్ననాడు సానుకూలం అయ్యే తరుణంలో స్వలాభపరుడై ఉన్న ఆశయములను సంపూర్ణముగా జారవిడిచి వేయుచున్నాడు. అట్టి అవినీతికి జంకడు. సిగ్గైన చెందడు. అతనికి దేశాభిమానము కలదా అని తోచును. ఆ ఉన్న దేశాభిమానమే శ్రీమంతుడై పుట్టడంచేత త్రాగుబోతు పేలాపనవలె మైకము తగ్గిన తరువాత మటుమాయమై నిశ్శబ్దములో కలిసిపోవును. భరతఖండములో ప్రతీదానికీ

మేముకూడా వున్నా మని ముందుకు వచ్చి ప్రగల్భాలు కొట్టి ఆడంబర జీవితంతో సంతోషం చెందే వారిలో ఆంధ్రుడే అగ్రగణ్యుడు. అంతే కాదు. అట్టివాడు అత డొక్కడే. అతని శౌర్య శూరత్వము మాటలయందే. చేతలయందు శూన్యము. తన సంగతి పర్యాలోచన చేసుకొనడు, తప్పు చేసినా నని గ్రహింపడు. గ్రహించినా దురభిమాన పూరితుడై వప్పుకోడు.

ఆంధ్రులు పూర్వము కౌరవుల వంటివారు. తిక్కనసోమయాజి తన జాతిని మనసులో బెట్టుకొనే కాబోలు కౌరవుల నుద్దేశిస్తూ "వా రొకళ్లొకళ్ల మాటలం బోయెడు వారు గారు. కావున వారి నంత యనం బని లేదు" అని ముద్దుగా మందలించి విడిచినాడు. మనకు వేషమునందు సయితము ఐక్యభావము లేదు. భాషయందు ఐక్యము మొదలే లేదు. వేషభాషలయందు ఎకభావము కుదురనప్పుడు జాతీయత యందు ఎట్లు అలవడును? తన పూర్వస్థితి, యిప్పటి స్థితి తెలిసిన నాడు కదా ఐకమత్యం కోసము ఉర్రూత లూగడం?

దేశం ఏలాగున ఉన్నదో మన భాష కూడా ఆలాగే ఉన్న దని వేరే చెప్ప నక్కర లేదు. దేశానికి పట్టిన దౌర్భాగ్యమే తెలుగునకు కూడా పట్టి యేడిపించుతూ ఉన్నది. ఆసంగతి గ్రహించకుండా ఆంధ్రుడు నిలుగుతున్నాడు. ఆంధ్రులలో తెలుగు వ్రాయను చదువనూ నేర్చినవారు ఎంతమంది లేరు? కాని రెండు కోట్లు ముప్ఫయి లక్షల ఆంధ్రులకు ఒక్క దినపత్రిక భరించడం వెక్కసంగా ఉన్నది. భారతి, గృహలక్ష్మి, ప్రబుద్ధాంధ్ర వంటి ఉత్తమ పత్రికలకు పట్టుమని చదివేవాళ్లు పదిరెట్లు ఎక్కువ మంది వున్నా పోషించే చందాదార్లు రెండువేలకు మించి లేరు. ఆదరణతో కూడి వున్నది అభివృద్ధి!

తెలుగుభాష నానాటికి చిక్కి శల్యమైపోతూ ఉన్నది. ఆంధ్రంలో కథ, నవల, పద్యము, పదం రాయడానికి తప్ప మిగిలిన వాటికి తగిన భాష లేదు. ఇంతవఱకు ఇతరాభరణాలతో ఆంధ్రసారస్వతలక్ష్మి యీవలకు రాలేదు. చివరకు ఒక్క ప్రహసనం కావాలంటే యింగ్లీషు మాటలతో మిళితం చేస్తేనే గాని ఆంధ్రునికి చమత్కారం తోచటం లేదు. హాస్యం పుట్టి నవ్వు రావటం లేదు. ఇంక ఆంధ్రుడు రాజనీతి, ఆర్థిక విషయము, భూగోళశాస్త్రము, పదార్థవిజ్ఞానశాస్త్రము, రసాయనశాస్త్రము, ధర్మశాస్త్రము, అలంకారశాస్త్రము, యింకా యిలాంటి సకలశాస్త్రాలు తెలుసుకోవాలంటే యింగ్లీషు చదివి తెలుసుకోవలసినదే కదా! పైన చెప్పిన శాస్త్రాల వంటివి ఆంధ్రంలో వ్రాయాలని పూనుకుంటే యింతవరకు మన ఔదాసీన్యం వల్ల తగిన భాషయే ఏర్పడ లేదు! పట్టు మని పది వాక్యాలలో ఒకడు తన భావాన్ని స్పష్టముగా, సంగ్రహముగా, సూటిగా చెప్పుటకు తగిన పదములు ఆంధ్రభాషలో కనబడటం లేదు. లేవంటే లేవని కాదు. మనకున్న గనులలో దిగి రత్నాలు ఏరి తెచ్చుకొని ఆభరణాలు చేయించుకోవచ్చును. కాని ఆపరిశ్రమకు శ్రద్ధ యేది? పూర్వగ్రంథాలు చదవకుండా జీవచ్ఛవమై మనకోసం ఎదురుచూస్తూ ఉన్న—మనకు ఎలా అలవడుతుంది? ఒక భావమును వ్యక్తీకరించడానికి తెలుగులోనే పదములున్నపుడు వాటి వంక చూడకుండానే, అక్కడ సిగ్గులేకుండా యింగ్లీషు పదమో లేకపోతే బంగాళీ పదమో లేకపోతే హిందీపదమో తెచ్చి వాడుతాడు. అంతటితో తెచ్చుకున్న దాన్ని అయినా నిలబెట్టుకోడు. మరునాడే విడిచిపెడుతాడు. ఆంధ్రుడికి శిక్షణ అవసరము లేదు; దీక్ష కిట్టదు. అభ్యాసము అవసరము లేదు. అందుచేత నేటికి మన ఆంధ్రమునకు సన్యాసి జుండ్లకి జుట్టుదగ్గరనుంచి అంతా ఎరువే అన్న స్థితి తటస్థ మయింది.

ప్రత్యేకాంధ్రరాష్ట్ర నిర్మాణమును సాగించుకోవాలని తెలివితక్కువ ఆంధ్రుడు, చేతగాని ఆంధ్రుడు, మాత్సర్యపూరితుడైన ఆంధ్రుడు, తన భాష నెట్లా ఉద్ధరించగలడు? ఆంధ్రునకు తెలివి యున్నంత పరిశ్రమ లేదు. ఉత్సాహ మున్నంత

దీక్ష లేదు. కోరిక ఉన్నంత కార్యవాదము లేదు. అంతయు సగము సగమే!

ఇట్టి విపరీతపరిస్థితుల్లో అమాయకుడై ముందు వెనుకలు చూడకుండా తన మాతృభాషను ఉద్ధరించడానికి రెక్కలు చాలని ఆంధ్రుడు హిందీ భాషను వ్యాపింపజేయుటకు అర్రులు చాస్తున్నాడు. నిజంగా ఆంధ్రుడు పరమమూర్ఖుడై వ్యవహరిస్తున్నాడు. హిందీభాషాప్రచారమునకై చేసే ప్రయత్నంలో, పడే శ్రమలో చూపే ఆందోళనలో ఒక వీసం ఆంధ్రోద్యమునకై ఆంధ్రరాష్ట్రనిర్మాణానికై ఆంధ్రభాషోద్ధరణకై శ్రమపడితే ఆంధ్రుడి యిల్లు, వాకిలి, దేశము, భాష అవిచ్ఛిన్నంగా బాగుపడుతవి. ఆంధ్రునికి యిపుడు యింగ్లీషుభాషాదాస్యము హెచ్చుగా నున్నది. దీనిలోనుంచి తేలకుండానే హిందీభాషకు కూడా బానిసగా కట్టుబడుతున్నాడు. ఈరెండుభాషలకు చేసే దాస్యము కంఠాన్ని చుట్టి ఊపిరాడకుండా చేయకముందే మాతృభాషాసేవ చేయుట కర్తవ్యము. హిందీభాష యెన్నటికైనా రాష్ట్రభాష రాజకీయభాష కావచ్చును. కాని ఆంధ్రుడు ఆంధ్రాన్ని సంపూర్ణంగా త్యజించి హిందీనే మాతృభాష చేసుకుంటాడని తోచదు. ఎప్పటికైనా యెన్నిబాధలు పడ్డా ఆంధ్రుడు తన నిత్యవ్యవహారములు ఆంధ్రములోనే జరిగించుకోవాలి. ఇంటిలో ఆలుబిడ్డలతో అక్కచెల్లెండ్రతో బంధువులతో వీధిలో నలుగురితో, రచ్చలో అందరితో తెలుగులోనే మాట్లాడుకోవాలి. అది మాత్రం తప్పదు. దైవం రక్షించి రేపో యెల్లుండో మనకు భాషాప్రయుక్తరాష్ట్రం వస్తే, ఆ ఆంధ్ర రాష్ట్రంలో అన్ని రాజకీయవ్యవహారాలు ఆంధ్రంలోనే జరుగవలసి వుంటుంది; గాని హిందీలో కాదు. అరవవారు తమ అరవం కన్నడిగలు తమ కన్నడం మహారాష్ట్రులు తమ మహారాష్ట్రం, గుజరాతీలు తమ గుజరాతీ మంట గలిపికొని అంతా హిందీభాషలో మునిగిపోరు. అలా మునిగిపోయిన నాడు ఆయా జాతులకే కాదు సకల భారత భూమికీ కూడా దుర్గతియే పట్టును. అపుడు మన నాగరికత స్వాతంత్ర్యము, జాతీయత నశించి క్రొత్త సంకెళ్లు క్రొత్త దాస్యము మనలను జుట్టుకొనును. ఇతరజాతులకు అట్టి దుర్గతి పట్టని నాడు మన ఆంధ్రమున కేల అట్టి దుర్భరస్థితి సంభవింపజేయవలయును?

ఆంధ్రుడు ఇకనైనా తన ప్రమత్తతను విడనాడుకోవలయును. అవివేకముగా ప్రవర్తించినందులకు పశ్చాత్తప్తుడు కావలయును. కర్తవ్యమును చక్కగా నాలోచించుకొని దీక్షతో కార్యరంగమున ప్రవేశించవలయును. ఏమహావేశమును అర్థించి తన పూర్వులు అప్రతిమానమైన యశస్సును గడించిరో, అఖండ సామ్రాజ్యములను నిర్మించిరో ఏనాగరికతను తమ సంతతికి సంక్రమింపజేసిరో ఆమహావేశమును మరల అర్థించి ఆంధ్రులు ఉచ్ఛదశ నందుటకై ఎడతెగనికృషి సలుపుదురు గాక. ఆంధ్రులకు మేధాశక్తి యున్నది; బాహుబల మున్నది. ఐశ్వర్య మున్నది. ఉత్సాహ మున్నది. మంత్రశక్తి యున్నది. ప్రభుశక్తి మాత్రము లోటు. ఆంధ్రులు దక్షుడైన నాయకుని ఎరిగి అనుసరింపవలయును. ఆంధ్రులు ముందుగా తమ యింటిని చక్కబెట్టుకొని తరువాత పొరుగిండ్లు దిద్దుటకై పోదగును. తమ తెలుగుపలుకు తీయదనము తనివిదీర గ్రోలి పిమ్మట అన్యభాషామృతము చవిచూడ బోవలయును. ఇంట గెలిచి కదా రచ్చ గెలువవలయును? ఇంటిని, భాషను వల్లకాడుగ చేసి ఎదుటగా నున్న జలాశయములను విడిచిపెట్టి, మృగతృష్ణలందు దాహము తీర్చుకొనుటకై ఆంధ్రులు పరుగెత్తుచున్నారు. ఆంధ్రులు ఒకసారి వెనుకకు దిరిగి సింహావలోకనము చేసికొని ముందు అడుగు వేయదగును. లేకున్న మహాపద మనలను ఆక్రమించుకొనును. చరిత్ర చదివిన వారికి ఇది క్రొత్త విషయము గాదు.

# బిందెడు నీళ్లు

జనమంచి కామేశ్వరరావు గారు

"అమ్మాయి! ఉషా! మంచినీళ్ళయిపోయాయి, నాతల్లివికదూ! చెరువుకెళ్ళి బిందెడు నీళ్లుతే అమ్మా" అందామెతల్లి.

తల్లి కూతుర్ని చూచి నిస్పృహతో,

"అయ్యో! నాబంగారుతల్లి రేపీపాటికప్పుడే ఎక్కడుంటుందో గదా!" అని నిట్టూర్చింది.

సహజంగా హిందూస్త్రీకి ఉండవలసిన సాధుత్వంతో ఉషలేచి తీనెమీది యిత్తడిబిందె ఎత్తుకుంది. అదివట్టిదైనా బరువుగానేవుంది. బిందెమూతి చేతులోకి జార్చుకుంది. నడుముమీదికి దాని బరువంతా అన్చుకుంది. భావిజీవితంలో చంకనేసుకుని పిల్లన్ని ఎల్లా ఎత్తుకుంటుందో జ్ఞాపకం చేస్తోంది, ఉష ఆబిందెను మోయడం చూస్తూంటే. తలను పావడలేదు. పాదాలకు రక్షలులేవు. అల్లాగే ఒంటిగా కాలిబాట నంటి నడుస్తూ చెరువువైపు వెళ్తోంది. ఆ చెరువు నీళ్లు వాన నీళ్ళయినా నిర్మలినంగా, కలుపు రొడ్డ లేమీ పెరక్కుండా, వున్నాయి. సన్నగా చీమ గంగాయాత్ర చేస్తున్నట్టే ఉష, వెన్నువేసి పసిమిరంగు హొయలుతో తులుకుతూన్న వరిచేలను దాటుతూ, వెండిజువ్వల్లా మెరుస్తూన్న జనుము చేలను దాటి, మధ్యమధ్యను వాలిన కొంగల మల్లే కదలాడు రెల్లుదుబ్బులుదాటి, కాస్తభయంకరంగా చిట్టడవిలా ఉన్న ప్రదేశమంతా గమించి చెరువు చేరుకుంది. యౌవనోన్మిషిత రాగంతో, మట్టియల చప్పుడు మెల్లగా అనాలోచితంగా రాగాంకితంచేస్తూ మీటుకుంటూ కదలుచున్న ఉష దివ్యమంగళ రూపాన్ని చూసి, ఊగులాడే ఆకుపచ్చని చేలు తలవాల్చినట్టుగా వొంగిపోయినాయి. ఆమె ఆచేలనైనా చూడలేదు. అవి తన తండ్రిగారి పొలాల్లోని సౌందర్య ప్రభలనైనా జ్ఞప్తిలేదు.

అది ప్రశాంత సాయంసమయం. ఆక్రింద విశాల ప్రదేశంలో కోతకువచ్చిన పంటకారు. పైన నీలిమాకాశం క్రుంకు సూర్యుని వింతరంగులను మేన పూసుకుంది.

ఉష నిశ్చలంగా నిల్చుంది. దోరధాన్యపు పొట్లలను కొట్టుకొని పోవాలనే పక్షులలో వుండే చలనమేనా ఆమెలో లేదు. కాని ఆమె ఎగయు చూపులలోనూ, కలలను పొదివిన ఫాలంలోనూ ఎదో ప్రపంచాలు కనలిపోయే విషాదజ్వాల తిరుగుళ్లు పడుతోంది. పాపం! శిరోవేదనతో బాధపడుతోంది. హృదయం ఎదో బాధతో దద్దరిల్లిపోతోంది.

ఉష కన్నెరికం వదిలి పెద్దమనిషయి మూడేళ్ళయింది. రేపటినుండి ఆమె "అమ్మాయిలేనం" అంత మాతుంది. ఇంకామె నిజాలకు భార్య కాబోతోంది. రేపే అత్తారింటికి ప్రయాణం.

ఆమె కిప్పుడు ఒకటే ఆలోచన,—ఎదో భార్యనవాలి కాబోలు. అడకువతో మెలుగుతూండాలి కాబోలు—అనేమీ కాదు.

భర్తను గురించి మసిమసి తలపోతలా? అవీ ఏమీ కావు. అల్లా ఆలోచిస్తూ నిమీలితనేత్రయై నిల్చుండగా గుంపులు గుంపులుగా ఎవరో ఎరగని బంధుజనం ఆమెకు కనబడ్డారు. వాళ్లందరిలోనూ ఎల్లా మసలగలను అనే ఆమె జిజ్ఞాస. ఆమె మనస్సునూరికే కలత పెడుతోన్నది మరేదీ కాదు, యిదే. ఎల్లాగ యివన్నీ—ఈ తెలిసిన వాటి నన్నిటినీ వదలుకుని—ఒంటరిగా తమోనిలయమైన అశిశిరగృహరహఃప్రదేశాల్లో జీవితం గడపగలను అనే—

నిర్మలంగా వున్న ఆనీళ్లలో కనబడుతూన్న తన నీడను "అబ్బా! ఎల్లా నేను అమ్మనీ, నాన్ననీ, మామ్మనీ, అన్నయ్యను, బుల్లిచెల్లినీ వదలిపోగలను బాబూ!" అంటూ పలకరించింది.

"ఇంక నాపాపురాలను ఎవరు చూసేవారు? ఆదూడముండ మెడ గోకుతూ ఆడించే దెవరింక?

అసలు యింక ఆవు పాలెల్లా యిస్తుంది ఆ పాలు పిదికే వేళకు నేను దాని దగ్గర లేకపోతే?

దూరాన రాగిదైన రంగుతో పడమరదిశ పులుముకుపోయింది. పంటకారు ఆకు పచ్చదనం, సముద్రంలా అంతు లేకుండా సాకిపోయింది. కలకత్తాలోని ఫ్యాక్టరీ చిమ్నీపొగ ఎక్కడో సిరా మరకలాగ ఆకాశంమీద దూరాన పొడచూపుతోంది. ఈదృశ్యం మరికొన్ని బాధానిలీనభావాలను రేపింది.

ఉష ఎప్పుడూ కలకత్తా వెళ్లలేదు. ఆమె చిరుత జీవితంలో చేసిన ప్రయాణాలన్నీ పొరుగునున్న పల్లెటూళ్ల పశువుల పాకలవరకే. యింకా మహాఅయితే దోనెమీద వరదకాలంలో కొస్దూరాన్నున్న సంతలకూ, బజార్లకూ వెళ్లేది. కలకత్తా అంటే ఆమె వెర్రిఊహాపోహలకొక మహాద్భుతాలన్నీ జరిగే ప్రస్థానపురమని అనుకుంటూంటుంది. అన్నింటిలోనూ అత్యద్భుతమైన దేముంటే అది, ఆ "గారడీ గృహం"—మ్యూజియానికి ఆ పల్లెటూరి జనం అదీ పెట్టింది పేరు. కలకత్తా వెళ్లే ఆపల్లెటూరిప్రజకందరికీ అదొక పెద్ద తీర్థస్థలం. ఇంక దాన్నొకసారి చూసొచ్చి వారు చెప్పుకునేవి అవి వింతలే కావు. అవి విశేషాలే కావు. వాటికింక అంతూ పొంతూ వుండదు.

"అసలు ముందు తాతగారు నన్నక్కడికి తీసుకెళ్తారనుకునే దాన్ని. సరే ఆయన వెళ్లిపోయారు. తరువాత నాన్నగారు. బాగా డబ్బున్నప్పుడు ఆయన్ని తీసుకెళ్లమన్నాను. సరే యిప్పుడాయన పనంతా అయింది. నాపెళ్లితోటి ఆయన లాగసానులో పడ్డారు. భొత్తిగా ఢీలా అయిపోయినారు. పోనీ, మామయ్యఅంటే అతగాడు పట్నంలోకి ఎన్నాళ్లో అయింది పనిలోకివెళ్లి మళ్లీరాలేదు.

సరే యిప్పుడింకేమీ లాభంలేదు. నన్నెవ్వరింక తీసుకెళ్లేవారు? అత్తారిల్లు ఎంతోదూరం. సరే! అక్కడ నాయందంత ఆపేక్షచూపి "గారడీ గృహాని"కి తీసుకెళ్లే వారెవరున్నారు నాకు? పాపిడిమీదికి కొంగుతీసుకొని మొహానికి ముసుగేసుకొని కిమ్మనకుండా యింట్లో కూర్చోవాలి. అంతే! పంజరంలో పిట్టలా వుండవలిసిందే. ఆదే రాశాడు నాకు. అంతే తప్పదు" ఆమె ముందుకు వంగి, యిత్తడిబిందె నీళ్లల్లో ముంచింది. నీటి బుడగలూ, చిరు కెరటాలూ నీళ్లల్లోని ఆమె నిర్మల మూర్తిని చెరిపేశాయి. బిందె బరువుగా ఆమె చిరుతస్నిగ్ధహృదయం మల్లేనే పైకివచ్చింది.

"ఊహు! ఊహు! నే నెప్పటికీ చూడలేను ఆ "గారడీగృహం" నాకింకేమీ సరదాలుండవు. నాకుబాగా తెలుసును. యింకనాకేమీ వుండవు" ఇల్లా అనుకుంటూంటే ఆమె అంతటి అందమైన నేత్రాల్లోనూ గిర్రున నీళ్లు తిరిగాయి.

దొడ దొడ నీళ్లుకారాయి. పొంగిపోయి ఆబిందువులు బిందెమూతికి తగిలి చిటిలిపోయినాయి ఆమె దానివైపు వంగినప్పుడు—,

ఆసాయంకాలం ఉష యింటివారంతా రాత్రి భోజనాలదగ్గర ఆమెతెచ్చిన మంచినీరే పుచ్చుకున్నారు. కాని వారే మెరుగుదురు, ఆనీళ్లలో ఆమె కన్నీటిజాలులుకూడా జారి కలిసినాయని? ఆనీటికి ఆమెకన్నీటివల్ల ఒకమోస్తరు ఉప్పదనం వచ్చిందనీని ?

అంతే. అంతా భోజనానికి కూర్చున్నారు. ఉష కూడా ఒకమూల కిమ్మనకుండా కూర్చున్నది మాయరేపు వస్తోందికదా!—అని.



శ్రీమతి అర్క్వుహార్ట్ (Mrs. Urquhart) వ్రాసిన ఇంగ్లీషు కథ కనువాదం.

# పద్యము - గద్యము

పూడిపెద్ది వేంకటరమణయ్య గారు

ఆంధ్రమున గల వెనుకటిరచనలలో మూడువంతుల ముప్పాతిక అన్నియును పద్యపు టల్లికలలోనే యున్నవి. అందు కథాభాగములును వర్ణనాంశములును గూడ పద్యరూపమునే దాల్చుచు వచ్చినవి. కొన్నిట వర్ణనాంశములు గద్యరూపమున నక్కడక్కడ కదముద్రొక్కినవి. పద్యమున కనువగు భాగముల గద్యము గద్యమున కనువగు భాగముల మాటల బెంచిన బూటకపుపద్దియములునుగూడ గలవు. ఇప్పుడు పద్దెమేది గద్యమేదియను సమయము వచ్చినది. పద్యనిర్వచనము కావలసియున్నది. కొలదికాలముక్రిందటివరకు ఛందోబద్ధమై రెండుగాని నాల్గుగాని, మెండుగగాని, చేసిన పాదరచనము పద్యముగా తలపోయబడినది. (పద్యమనను లయప్రాణమై గేయమువలె గానమున కనువయిన నిర్మాణముతో ప్రాసమైత్రి మున్నగు నారోహణావరోహణస్థానసూచనలతో లక్షణము లేర్పడినవి. ఇవి రానురాను భావసౌకుమార్యమునకు చోటిచ్చి తాము బంధవిముక్తి నొందుచున్నవి. భావమనునది హృదయవికారము. ఇది బాహ్యేంద్రియసంచలన సంబంధమున నంతరంగమున గలుగు మార్పు. ఈ మార్పును సూచించు వాక్యోచ్చారణ భావరచన. దాని నవస్థాభేదమున కనువయిన గళనినాదమున బాదివిపై కూయుట పద్యరచన. గానసంబంధము లేక వెలిబుచ్చు నూహల రచనము గద్యము.) ఈసందర్భమున కవి హృదయము గూర్చి యించుక చెప్పవలసి యున్నది.

(కవి హృదయము మైనమువంటిది. అది రక్తనాళసంచలనమున కరగి యెప్పటికప్పుడు తన పరిసరపరిస్థితుల కనువగు పోతంబడి యేదోయాకృతి దాల్చి కవికిమాత్రము ప్రదర్శిత మగును. అలలిత రూపప్రదర్శనముననే గీతరచనమయినది. అగు పగీతముతోడి వికారమే కవిహృదయము. అక్షరరూపమున, రాగరూపమున, శిల్పరూపమున కవిభావనాచకము లగు నిబాహ్యరచనములు తోల్లింటి కవిహృదయచ్ఛాయారూపములు ప్రతిబింబములు గాని కవిహృదయములు గావు.) (ఈ ప్రతిబింబనిర్మాణము మూర్తరగులయినది. గద్యవిధానము, పద్యవిధానము గేయవిధానము.)

వీనివలన నెప్పటి కెవరికి తోచినట్లువారు వారి వారి యూహల సూచించుటనో చెప్పుటనో వచ్చిరి. (పద్యరచన గానరూపమున లయతో వస్తువిలాసమునే చూపి శ్రోతలను దనుపట్లు వర్ణించును. గద్యరచన మట్లుగాక వస్తువును సేర్కొని తల్లక్షణముల సువ్యక్తముగ పూసగ్రుచ్చినట్లు చెప్పివేయును.) ఈయూయవస్థల ననుసరించి పద్యగద్యరచన సాగవలెనని కొందరి యభిప్రాయము. (ఇటీవలివారి యూహ యదికాదు. వాక్యములు పొడవయినవయినను, పొట్టివైనను, పదములు సాధువులయినను అసాధువులయినను, రచనము సరళమయినను కాకున్నను—అది ఛందోబద్ధమూ లేక స్వేచ్ఛాప్రవాహమూ యను వితర్కరమే లేక భావగర్భితమయిన హృదయవికారప్రదర్శనము చేయుటయే పద్యరచన మనియు తక్కంగల సూటిగ చెప్పు శుష్కవాక్యములు, గ్రుప్పడులో నెట్లున్నను గద్యమే యనియు కొందరనుచున్నారు.

అట్లగుటవలన పద్యగద్యము గద్యపద్యము నని రెండువిధానము లేర్పడినవి. రచయిత తన వర్ణనాంశము నేవిధానమున వర్ణించినను సరే దానిని పద్యముగా గాని, గద్యముగా గాని శ్రోతలు, పాఠకులు నిర్ణయింపవలసినదే. అందులకే కావ్యము భావప్రధానమయినది. అనగా భావతత్త్వప్రధానమయినది. ఈ తత్త్వమునుబట్టి పద్యగద్యవిభేద మేర్పడుచున్నది.)

వస్తు వొక్కటేయయినను బాహ్యేంద్రియప్రవృత్తినిబట్టి తద్విషయికమయిన యాంతరంగికవికారము గలుగుచున్నది. ఈ వికారము మనస్సును

స్వాధీనముచేసికొనుటా లేక మనస్సునకు స్వాధీనమా? అది రచనలవలన గాక యనుభవమువలన తెలియునది. [రచనమాత్రము మనస్సునకు స్వాధీనమయిన భావమునే చిత్రింపగలదు.] అట్లగుటవలన మనస్సును స్వాధీనముచేసికొన్న భావము లంతరంగముతో గూడ నంతరింపవలసినదేనా? ఈ యనుభవవైపరీత్యము నెట్లు వెలిబుచ్చుట? అట్టియవసరములలో కవి హృదయతత్త్వము చూచాయగ సూచనగ తలపుపాలిమేరయయిన తెలుపురచనలు వలదా? కావలయును. వానినే యిప్పుడు భావకావ్యము లనుచున్నారు. ఈ రచన నెరుగవలెనన్న పాఠకుడు ఈతనేర్చికొనువానివలె నీ రచనాపాఠమున మున్ముందుగ మునిగిపోయి పిమ్మట కాలుసేతు లాడింపవలెను. వట్టిపెదవి కదలికవలన, అర్థగ్రహణమువలన పాఠకున కిందలి కవిహృదయము హృద్గోచరము కానేరదు. ఆత డిందిద నేర్చికొన్నచో నీ రచనాప్రవాహమును దాటి యేదోతీరమును చేరగలడు. అట్లయ్యేనేని ఆ భావకావ్యమున గల కవి వానికి దృగ్గోచరించును. ఇట్టి కావ్యపఠనము వలన పాఠకునకు హృదయవికాసమే గాక హృదయసౌమ్యతగూడ పొనుపడగలదు. ఇం దొక్కవిశేషాంశము గలదు. కవి కావలె నని భీష్మించికొని భావకవి కాజాలడు. [ప్రకృతీంద్రియముల సంఘర్షణమున రేగు భావలేశము దీని కాధారము. ఇదిలేనిది భావకవిత్వము కాదు!]

ఇదియటుండ మనసాధీనమయిన భావరచనమును కవిత్వమె. ఇందు పాఠకునికి మారుగ కవియే రెక్కలుగట్టికొని, తనవస్తువునకు తగినచోటునవాలి, కవి దృష్టితో దానిని పరిశీలించి, ప్రకృతిని సృష్టించికొని, ఇంద్రియముల నానాళముల రేపి, హృదయవికారము గల్పించికొని భావప్రసూనముల విరిసి పరిమళించుచున్నాడు. ఇట్టి సంపాదితావస్థనుగూడ సహజావస్థగ చేసికొని భావగీతరచనమునకు కొందరు గడంగుదురు. ఇది యతుకుడుపని వలెనే కొంతు కుపడియుండును.!

## ఇక గద్యవిషయము

[ఒకటో రెండో ఎన్నో కొన్నిమాటలకూర్పులో వస్తువును యథార్థముగ నిరూపించుట గద్యరచనము. ఈ యథార్థనిరూపణమున రచయిత ప్రసక్తి లేదు. ఇచట వస్తువే ముఖ్యమయినది. రచయిత తన పాండిత్యమును వెలిపుచ్చికొనుటకు, పదముల నేరికొని నియమముల నిలిపికొని తీగయల్లికపని నెంతేని యిందు చూపవచ్చును. దీనివలన నీతడు కవి కాజాలడు. రచయితమాత్ర మగును.]

ఇట్లగుటవలన నేమయినది? పద్యగద్యవిభేదము భావప్రదర్శనవిధానమున నున్నదిగాని పదముల కూర్పులోగాని, బంధుకట్లలోగాని లేదు. తెగిన యసంపూర్ణవాక్యమే యొక్కప్పుడు పద్యమై పాఠకుని హృదయవీథిని దూసికొనిపోవును. దీర్ఘసమాసములతో తీర్చికట్టిన పలుకుల దండయె యొక్కప్పుడు హృదయాంచలముల నంటి వసివాడిపోవుచున్నది. దీనికి రచయిత పేరుపెట్ట పని లేదు. పాఠకుడే పద్యగద్యనిర్ణయము చేసికొనవలెను. ఈ నిర్ణయమును పాఠకసామర్థ్యమునుబట్టి తారతమ్యములం బడును.

కాబట్టి మనము పద్యగద్యవిభేదముల రచనను బట్టి నిర్ణయించుకొనవలసినదే గాని లేనిపోని వాదప్రతివాదములవలన ప్రయోజనములేదు.

వెనుకటిది రచనాకాలము. ఇప్పటిది భావకాలము. భావము స్వేచ్ఛాప్రచారము గలదియగుట దానిరెక్కల బలమే యిప్పుడు మనము తెలిసికొని నిర్ణయింపవలసినది.

ఈ కాలమే మిక్కిలి సున్నితమయి కానవచ్చుచున్నది. ఇప్పటి రచన లీపరస్పరవిభేదమును పాటింపకపోవుటయే గోసుచున్నవి. కాలక్రమమున నింకేదయిన స్థిరమయిన రచనావిభేద మేర్పడిన నగుగాక. ఆంధ్రలోకముమాత్ర మీనవీనభావజీవనమున వన్నెయు వాసియు గాంచుగాకయని నాకోరిక.

# కన్నెగులాబీలు

మల్లాది రామకృష్ణశాస్త్రి గారు

కమ్ముకుని వికసించిన గులాబీపూలు, ఎవరన్నా కోసుకుంటా రేమో నని, ఎత్తుగా ఉన్న గోడ మీదుగా కొమ్మ లెవరికీ అందవు. యౌవనపు ముమ్మరంతో చూసిన వారిని సొమ్మసిల్ల చేసే ఆకొమ్మ కూడా ఎంద రెన్ని విధముల ఉవ్విళ్లూరినా ఎవరికీ అందదు.

వెన్నెల రాత్రుల్లో చంద్రశాలాసవిధసీమను తరంగిత మయే గీతికారసవాహిని కోసం చాలా మంది కాచుకుని ఉంటారు. హాయిగా పాట విని ఆనవమోహిని పొరబాటున నైనా కనబడుతుం దేమో నని ఎత్తిన తలలు వంచకుండా చూసి చూసి. భగ్నహృదయాలతో తిరిగి పోతూంటారు. కాని, ఆ అమ్మాయితో స్నేహం...దర్శనం...

... ... ... ...

సుందరం మద్రాసు ఎందుకు వచ్చాడో అతనికే తెలియదు. బయలుదేరినది అసలు ఎక్కడికో తెలియదు; కాని చల్లగాలికి బీచివద్దకు జేరుకున్న తరువాత నైనా, రేడియో ఆవలంబనాన బొంగురు గొంతుతో అరవపాట వినబడే దాకా తాను చివరకు అక్కడ తేలా ననే విమర్శనే లేదు. చిత్రశోభలు లేని సామాన్య సాంసారికజీవనం అతనికి నచ్చలేదు. కాంచనసమృద్ధి కలిగినా, కాంతాసమ్మితత్వము కలలో నైనా అనుభవించని యోగంచేత అర్థం చేసుకోలేని ఆవేదనతో సంతోషం తెప్పించుకోవా అని...దాన్ని వెదుక్కుంటూ, దోవ తెలియకుండా తిరుగుతున్నాడు.

పట్నం కూడా పాతపడిపోయింది నాలుగు రోజుల్లోనే అతనికి. ఏమి తోచదు. కాలం గడపడానికి మార్గాలు కనిపించడం లేదు. స్నేహితుల మాట ఎత్తడంతోనే ఎక్కడ లేని విసువూ వచ్చేది. ఏదైనా రచించడానికి యత్నం చేసినా...మరల చదువుకునే టప్పటికి రసవిహీనంగా, జీవకళ కొరవడినట్టుగా తోచి నిస్పృహతో వ్రాసిన వాటిని చించివేసేవాడు,

తోటివా రందరూ ఎందుకు...ఎలా, సంతోషంగా ఉండగలరో అతనికి అర్థ మయేది కాదు. తనకు ఏమి కావలెనో, దేన్ని అన్వేషించుతున్నాడో, తెలియదు. ఎదుగున్నవాళ్లు ఈవిపరీతపు ఆవేదనను ప్రవర్తనను చూసి, కవికి అలవడే లక్షణాలలో అది ఒకటి అనుకుని, లక్ష్యపెట్టకుండా ఊరుకునేవారు.

క్రమంగా ఎవరి సాహచర్యాన్ని ఇచ్ఛగింపకుండా, ఒంటరిగా షికారు బయలుదేరడం మొదలుపెట్టాడు:—కాని ఏమీ లాభం కనిపించడం లేదు. పార్థసారథి దర్శనంకోసం శుక్రవారంనాడు తయారయే తమిళాంగనాపద్మవ్యూహాన్ని బలవంతాన భేదించుకుంటూ వెళ్లే అవసరాల్లో నైనా అల్లుకుపోయిన అంత అందమూ కూడా అతన్ని లాలసుని చేసేది కాదు. వాలు చూపులూ, చిరునగవులూ, లక్ష్యపెట్టడం అలవాటయింది కాదు.

... ... ... ...

మంచు తెరలు ఇంకా కమ్ముకుని ఉండటంచేత. ఎండ బాగా పురి విప్పలేదు.

సుందరం మైలాపూరులో ఆ—వీధినే నడిచి వెళుతున్నాడు. అక్కడికి...ఆమేడ ప్రాంతాలకి వచ్చేటప్పటికి కొంచెం నెమ్మదిగా అడుగు వేశాడు:—సమీపించి, ఆ చక్కదనాన్ని చూస్తూ సాఫుగా ఆగిపోయినాడు.

కనపడ్డవి హిమానీసంస్పర్శచేత రసార్ద్రములైన గులాబీపూలు.

అవి పలుకరించినట్లుగా అయింది అతనికి. ప్రహరీవద్దకు వెళ్లాడు. బరువుగా ఉండటంచేత కొమ్మలు అందుబాటులోనే ఉన్నవి. పూలని—చూసి—సంతోషిస్తూ నిలువబడినాడు.

పూల దొంతరల మీదుగా— మేడమీద ఆ అమ్మాయి...కనబడ్డది.

అదృష్టితోనే ఆ పిల్ల వంక చూసి, అక్కడ నిలువకుండా నడచిపోయినాడు.

మరునాడు...ఆవేళకే...అక్కడికి వచ్చి, గులాబీల చిరునగవును గమనించాడు. ఊరుకోలేక, వాటిని కోమలంగా స్పృశించి, పరవశుడైనాడు. ఆ అమ్మాయి అందుబాటుగానే కనబడ్డది. కాని, చేయి చెప్పిన మాట వినలేదు. ముందుకు సాగలేదు.

నవోదయముతో కోరికలు విజృంభించినవి. తనవి—తనకోసమే వికసించినవి తనకు కావాలి అనుకున్నాడు; పూసిన పూలన్నీ...మొగ్గలను మాత్రము కనికరించి విడిచాడు.

కనబడకుండానే ఆ అమ్మాయి తోటలో నుంచి తీయని గొంతుతో 'ఎవరు ఆలా కొమ్మలు లాగేది ?' అని కసరి అడిగింది.

అతడు ఆనవాలు పట్టి పులకితుడైనాడు. జవాబు ఏమీ చెప్పకముందే... ఏమిచెప్పాలో తెలియక ముందే... ఆ అమ్మాయి కనిపించింది. గ్రీన్‌హౌస్ తిన్నెమీద నిలుచుని ఉన్నది. మొగం మాత్రము అగుపడుతూన్నది.

'ఎవరు...నీ...మీరు ?'

సుందరం కొంచెం తటపటాయించి,

'నే...ను' అన్నాడు:

ఆ అమ్మాయి, చిరునగవుతో చూసి...చూస్తూ ఊరుకున్నది...

'పూలు...కోసుకోవచ్చునా ?' అని అతడు సిగ్గుపడుతూ ప్రశ్నించాడు.

నవ్వుతూ...అతని వంక చూస్తూనే

"మొగ్గలు...కూడా కావాలి సుంటే..." అని తనలో తాను నవ్వుకున్నది ఆమె.

సుందరం అమాయికంగా నవ్వుతూ గోడ మీదికి...ఎగువకు...చేజాపి

'ఇవి...మీరు...తీసుకోండి'— అని కోసిన పూలను అందీయబోయినాడు:

ఆమె వద్దని సైగతో బదులు చెప్పింది: చిన్నబోయి తరువాత కథ ఏలా నడపాలో తెలియక చూస్తూ నిలువబడిపోయినాడు. ఏమీ మాటాడలేదు ఆ అమ్మాయి. రోషంతో, అభిమానంతో వెనుదిరిగి నాలుగు అడుగులు వేసి...ఇక మనసు పట్టలేక మళ్లా అక్కడికే తిరిగి వచ్చాడు.

ఇంకా ఆలాగే నిలువబడి ఉన్నది. అతని రాక చూసి బహుళాకారసంభరితమైన అపాంగవీక్షణకటాక్షముతో దిగిపోయింది.

'తెన్నెల వస్తేనే కాని...జాజులు...వికసించవు...' అని ఆ అమ్మాయి పలుకులే విస్పష్టముగా వినపడ్డాయి:

... ... ...

ఆ రోజంతా ఏలా గడిచిపోయిందో సుందరానికే తెలియదు. చంద్రుడికన్న తాను ముందుగా బయలుదేరడానికి పంతము పట్టినట్లు సహనమనే మాటే లేక పోయింది. కాని, మామ రాకతో కాని మనసులోని కోరికలు తీర్చేందుకు మాకుమారుడు కూడా ఆయత్తుడు కాడు గాదూ ?

ఎవరినీ లక్ష్యం సేయనట్లు యథాయకిని రాచబాటను నిర్భయముగా తోటలో ప్రవేశించాడు సుందరం. ఎవరిని కన్నారగి రా నవసరము లేని ఖైఖరితో ఆమె సమీపించింది.

ఎవరు ముందు కౌగలించుకున్నారో, ఎంతసేపలా ఉండిపోయినారో...ఎవరికీ తెలియదు; కాని ఆ అనుభవానందముద్రలో రేకలుగా విడిపోతూ, గులాబీ లన్నీ సన్నజాజుల సైదోడున అవాఙ్మధుర ధోరణిలో అబ్బ! అనిన ట్లయింది. విడని కౌగిలిని, విడువజాలని హృదయంతో, విడిపించుకుంటూ, ఆ అమ్మాయి కూడా 'అబ్బ' అన్నది. అంత చక్కగా అనగలిగిన పెదవులను అతడు సత్కరించాడు.

"నేను...నీతో...మాటాడను" అన్నది కొంచెం ఓసల్లి ఆ అమ్మాయి,

సుందరం మరీ దగ్గరగా కదలి 'పోనీలే...' అన్నాడు. చిన్నపిల్లల మారాం లాగా...'నా... పూలన్నీ...' అని ఆభంగిమం నిలుపలేక నవ్వేసింది.

'మరి...ఎందుకు మాటాడావు?' ఇద్దరూ ఒకరిని చూసి ఒకరు...ఒకమారే కలసి నవ్వుకున్నారు;

తమ చెలిమి నభిలషించలేదని కలువరిస్తూన్న జాజులతో తన నెచ్చెలి వేణిని అలంకరించాడు. ఎంతో వెదికి మారుమూలల ఆకుల మాటున అణిగి మణగి సిగ్గుపడుతూన్న ఒకటిరెండు అరవిచ్చిన గులాబీల జన్మ కూడా సార్థకం చేశాడు.

కాని ఆప్రణయసమ్మోహనంలో ఎంతకాలము అవి రేకలు విడకుండా నిలువగలవని చందమామ సర్వజ్ఞుడులాగా నవ్వుతూన్నాడు.

... ... ... ...

వెన్నెల పక్షపాతం వహించిన దోషాన సన్నగిలిపోయే రోజులు వచ్చినవి. మంచు చినుకులలో ముత్తెపు తళుకు మాసిపోయిన తరువాత విరికన్నెలకు కూడా తొలిప్రాయము విరిసిపోయినది. గులాబీలకు మొదటి పరువము లేదు.

సుందరం రచనల్లో నవచైతన్యధుని పరవళ్లు కొడుతూన్నది. కావ్యాత్మ అతని ఆలోచనలన్నీ సొంతం చేసుకుని మనసు జోలికి మరి వేనిని రానీయడం లేదు.

మరచిపో లేదు...లేదు; కాని మల్లా, ఆ అమ్మాయికోసం కలువరించి అలసత్వం దరిజేరడం లేదు. ఆ సంతోష మంతా సంతోషముగానే ఆగిపోయింది...

ఆమె గీతికాలాపాల్లో మును మొలవని రసాంకురములు తలచూపుతున్నవి; కాని అతని చెలిమికి నిలుకడ తీసుకుని వచ్చే కవళికలు లేవు. తళుక్కుమని మెరసి నిలువకుండా మాయ మయ్యే చిన్నెలు లేవు. అందరికీ ఆప్యాయనంగా కనబడుతుంది; కాని ఆశ లూరించదు.

ఒకరి నొకరు విడువ మనుకుంటూనే విడజాలకుండానే—విడిపోయినారు.

... ... ... ...

గులాబీలు వృంతాల్ని వీడకుండానే వయస్సు కొనసాగించుకుని విడివిడిగా రేకలుగా రాలిపడుతూ జీవనసంధ్యను సమీచీనముగా చేసుకుంటున్న అనుభవాల్లో అప్పుడప్పుడు తాత్కాలిక విభ్రమాన్ని ప్రవర్తిలజేస్తూంటాయి. అవి కూడా ఎప్పటి లాగనే అందవు. అందుకోనీయవు. అలా ఉండిపోవాలిసిందే.



# బిడ్డల శిక్షణ

ఏకుమళ్ల కామేశ్వరరావు గారు బి. ఏ; బి. ఇడి

బిడ్డల శిక్షణ, లేక బిడ్డల్ని పెంచే విధం అనే పుస్తకాన్ని గుడిపాటి వెంకటచలంగారు రాసేరు.

పిల్లల్ని పెంచే విధం మీద ఇంగ్లీషులో అనేక పుస్తకాలున్నాయి. కాని తెలుగుభాషలో వెంకటచలంగారు ఇది ప్రకటించే వరకూ పేరు కొక్క పుస్తక మేనా వున్నట్టు కనపడదు. ఇంగ్లీషులో అనేకవిషయాలను గురించి అనేకపుస్తకాలున్నాయి. కాని వాటివల్ల మన కేమీ లాభం లేదు. రాజుగారి కోటలో ధనం వుందంటే యెంతలాభమో ఇంగ్లీషులో పుస్తకాలున్నాయన్నా మన

కంటే లాభం. మన దేశపు ప్రజలకు లాభదాయికంగా వుండా లంటే విజ్ఞాన మంతా దేశభాషలోనే వుండాలి.

వెంకటచలంగారు యెంతో శ్రమపడి అనేక ఇంగ్లీషుపుస్తకాలు పరిశీలించీ, తమ అనుభవాలను చేర్చి బిడ్డలను పెంచే విధానం గురించి తెలుగులో రాసేరు.

ఇతరనాగరిక దేశాలన్నీ—ముఖ్యంగా పాశ్చాత్య దేశాలు పెద్దవాళ్ల విషయంలో కంటే పిల్లల విషయంలో యెక్కువగా శ్రద్ధ తీసుకుంటున్నాయి. కారణ మేమి టంటే? ముందుముందు ప్రపంచం యింతకంటే సౌఖ్యవంతంగానూ, జ్ఞానవంతంగానూ వుండా లంటే ముందుముందు ప్రపంచజాతులుగా అయే టటువంటి పిల్లలిని గురించి యెక్కువ శ్రద్ధ తీసుకోవాలి. అందువల్లే పాశ్చాత్యదేశాలూ, ఒకటి రెండు ప్రాచ్యదేశాలూ పిల్లలిని గురించి ఎక్కువ శ్రద్ధ తీసుకుంటున్నాయి. * మన దేశం సంగతో! వేరే చెప్ప నక్కర్లేదు. ఎదుగు కనపడక పోయినా తరుగు పూరాగా కనపడుతూంది. అనేకవిధాల అజ్ఞానం, అవిద్య నిండి వుండడంవల్ల దేశస్థితి అధోగతిగా వుంది. ఇప్పటి ప్రజలలో ధైర్యం, శౌర్యం గౌరవం, స్వాతంత్ర్యప్రియత్వం, త్యాగం మొదలైన గుణాలు బొత్తిగా తక్కువగా వుండడానికి కారణం చిన్ననాడు తలిదండ్రులు చేసిన చెడ్డ తరిఫీదే. ఈ జాతిలో ధైర్యం, శౌర్యం, గౌరవం, స్వాతంత్ర్య ప్రియత్వం, త్యాగం మొదలైన గుణాలు ముందుముందైనా పూర్తిగా కలగా లంటే యిప్పటి పిల్లలకు మనం పొందిన తరిఫీదు గాక మరొక మోస్తరు తరిఫీదు యివ్వాలి. ఈ జాతి యెప్పటికి యిదే మోస్తరుగా వుండకూడదు కదా? తక్కిన జాతులతో యిది కూడా సమాన మైన స్థితినే పొందాలి కదా? అయితే ఈ కొత్త స్థితి రావా లంటే దేశప్రజలలోనే కొన్ని కొన్ని మార్పులు రావలసి వుంది. 'మాకు యింతకంటే మంచి స్థితి యైనా అక్కర్లేదు' 'ఇప్పటి స్థితి కన్నా మంచి స్థితి భూలోకంలోనే లేదు' అనే భావాలు మనసులలోంచి తొలగిపోవాలి. పూర్వాచారత్వం. సంఘానికి భయపడడం మొదలైనవి నశించిపోవాలి. ఈ విషయాలను గురించి బిడ్డల శిక్షణలో పదేపదే చెప్పబడింది. ఈ మోస్తరుగా మనుష్యు లెప్పుడు పూర్తిగా మారుతా రంటే? సంఘంలో వుండే టటువంటి లోటుపాట్లు బాగా తెలిసినప్పుడే. బిడ్డలను పెంచే విధానం గురించి పుస్తకం చదవండి అంటే అనేకమందికి విచిత్రంగా కనపడుతుంది. మన పెద్దలు బిడ్డలు పెంచే విధానం గురించి యేయే పుస్తకాలు చదివేరు మనని పెంచడానికి! అని ఆశ్చర్యంగా అడుగుతారు. బిడ్డలను పెంచే విధానం గురించి మన పెద్దలు యేమీ పుస్తకాలు చదవకపోడం చేతే మన జాతి పైన చెప్పబడిన స్థితిలో వుంది. కనుక మన జాతి మంచి స్థితికి రావాలంటే మనం కొత్త పద్ధతులు నేర్చుకొని పిల్లలను పెంచాలి.

బిడ్డలను పెంచే విధానం గురించి ముఖ్యంగా స్త్రీలు యెక్కువగా నేర్చుకోవలసి వుంది. తల్లుల తరిఫీదు మీదే ముఖ్యంగా పిల్లల బాగోగులు ఆధారపడి వున్నాయి. కాని యిప్పటి స్త్రీజాతినిగురించి వేరే చెప్పక్కర్లేదు. అజ్ఞాననిధులుగా వున్నటువంటి యిప్పటి స్త్రీలు యెంతో విద్య, జ్ఞానం నేర్చుగుంటే కాని పిల్లలికి సరియైన శిక్షణ యియ్యలేరు. ఈ పుస్తకాన్ని స్త్రీలు విశేషశ్రద్ధతో చదివి లాభం పొందుతా రని తలుస్తున్నాను.

పిల్లలిని బాగుచెయ్యా లంటే ఆపని చిన్నప్పుడే జరగాలి. "మనుష్యస్వభావాన్ని అభివృద్ధి పరచేందుకు బాల్య మొక్కటే తగిన వయస్సు. అప్పుడు గనక బిడ్డను తగిన శిక్షణలో వుంచితే ఆబిడ్డ పెద్దదైనప్పుడు, యిప్పుడు ప్రజలకి వుండే మూఢత్వమూ,

* 1933 డిసెంబరు 'భారతి'లోని నార్ల వెంకటేశ్వరరావుగారి 'నేటిరష్యా' అనే వ్యాసం చదివితే రష్యా విషయమై కొంత తెలుస్తుంది. ...వే. కా.

భయమూ, కలిగివుండక, ఉన్నతూరా లవుతుంది. ఆనైసర్గిక స్వభావౌన్నత్యాన్ని బిడ్డలకు యివ్వగలిగితే, యింక చట్టాల వల్లా సంస్కారంవల్లా, బోధనవల్లా కలిగించడానికి ప్రయత్నించే మార్పులు యేశ్రమా లేకండానే ప్రజలలో తటస్థిస్తాయి.'' (పుట 4.) "బిడ్డను కవీశ్వరులగాలూ, శూరురాలూ, ఆరోగ్యవంతురాలూ, నీతివంతురాలూ, చేసే శక్తి పెద్దవారిలో కొంతవర కన్నా వుంది. ఆశక్తి వున్నా లేకపోయినా బిడ్డమాత్రం దుర్మార్గురాలూ, అవివేకీ నిష్ప్రయోజకురాలూ ఐతే ఆతప్పిదం చాలా వరకు తలిదండ్రులది.'' (పుట 46.)

ఈబిడ్డల శిక్షణ ముఖ్యంగా ఆరుప్రకరణాల కింద విభజించబడింది; తలిదండ్రులు, శరీరం, శిక్ష, బిడ్డా—ప్రపంచమూ, ధర్మమూ—నీతీ, విద్య అనేవి. ఆయాప్రకరణాలకింద తెలియవలసిన సంగతు లన్నీ చెప్పబడ్డాయి. తల్లిదండ్రులు యెందు చేత పిల్లల్ని గురించి యెక్కువ శ్రద్ధ తీసుగోవాలో, తల్లిదండ్రులు పరిశీలించ వలసిన సంగతు లేమిటో, తలిదండ్రులలో రావలసిన మార్పేమిటో మొదటి ప్రకరణంలో చెప్పబడింది. బిడ్డల శరీరం విషయమై తీసుకోవలసిన జాగ్రత్త అంటే బిడ్డలయొక్క భోజనం, నిద్ర బట్టలు, శుభ్రం, వ్యాయామం, యేడుపు, అలవాట్లు కింద లైన వాటిని గురించి రెండో ప్రకరణంలో చెప్పబడింది. బిడ్డలకు చేసే అలవాట్లలోనే బిడ్డల క్షేమం విశేషంగా వుంది. అంచేత అలవాట్లను గురించి అనేక అంశాలు పుస్తకంలో చెప్పబడ్డాయి "మనుష్యజీవితం అలవాట్ల సమూహం'' (పుట 48) "శ్రమపడి బిడ్డలకు మంచి గుణాలే అలవాటు చేసి, దుర్గుణాల్ని నివారించి, నేర్చుకునే దుర్గుణాల్ని పోగొట్టగల శక్తి తమలో వుం దని పెద్దవారు నమ్మాలి. పుట్టేప్పుడే పూర్వజన్మకర్మ ప్రకారం యేవో గుణాలతో పుడతారు. వాటిని మార్చడం యీశ్వరుడి తరం కా దనే కర్మవేదాంతం వాదించినా, దాని ప్రకారం నడుచుకునే మార్గాల్ని చూడబోము, అట్లానే నమ్మితే యీపుస్తకం చదవనూ అక్కర్లేదు బిడ్డల యెడల శ్రద్ధ తీసుకోనూ అక్కర్లేదు. బిడ్డల్ని బాగుచేస్తామనుకుని వారిని కొట్టేప్పుడూ తిట్టేప్పుడూ ఆవేదాంతాన్ని మర్చిపోతూనే వున్నాము. కర్మసిద్ధాంతంలోనైనా మనిషికి జరిగే కష్టసుఖాలు శాసింపబడతాయన్నారు గాని, అతని గుణాలు నిర్ణయింపబడతాయన లేదు. సుఖదుఃఖాలు పూర్వజన్మకర్మ ప్రకారం కలిగినా వాటిని అనుభవించే పద్ధతీ, వాటివల్ల పాఠాల్ని నేర్చుకుని బాగుపడడమూ, వాటివల్ల నాశనము కావడమూ, మనిషి గుణాల మీదా, స్వభావంమీదా ఆధారపడి వుంటుంది. అలవాట్ల ద్వారా ఆగుణాల్ని పెద్దవాళ్లు చాలావరకు బిడ్డలో యేర్పరచగలరు.'' (పుటలు 44, 45) "పెద్దవాళ్లు నేర్పినా నేర్పకపోయినా పుట్టిన నిమిషాన్నించీ పిల్లకి అలవాట్లేర్పడుతూనే వుంటాయి. మంచి వాటిని ప్రవేశపెట్టక పోతే చెడ్డవి అలవాటవుతాయి.'' (పుట 48)

మూడవ ప్రకరణం శిక్ష. ఈప్రకరణం చాలా ముఖ్యమైనది. ఇప్పటి వరకూ దేశంలో యీప్రకరణంలో చెప్పబడ్డ సంగతులకి వ్యతిరేకంగా జరుగుతూంది. బిడ్డల శరీరమూ, మనస్సూ కూడా చెడిపోకుండా వుండా లంటే యీప్రకరణంలో చెప్పబడ్డ ప్రతి అక్షరం తలిదండ్రులు పాటించవలసిందే. ఇదివరకు తలిదండ్రులు కని విని యెరగని అనేక సంగతులు యీ ప్రకరణంలో చెప్పబడ్డాయి.

నాలుగవ ప్రకరణం 'బిడ్డా—ప్రపంచమూ' దీనిలో ఆటా—పనీ, తక్కిన పిల్లలు, పెద్దవాళ్లు, సేవా—ఆర్జనా మొదలైన వాటిని గురించి తెలుపబడింది. పెద్దవాళ్లు పిల్లలకు ముఖ్యంగా నేర్పవలసిన సంగతి, "కాని బిడ్డ తన నడవడిని లోకాభిప్రాయంమీద ఆధారపెట్టుకోకుండా వుండడం నేర్పాలి. లోకాన్ని ప్రేమించాలి గాని, లోకం తప్పుమార్గంలో వుందని విశ్వసించినప్పుడు, నిర్లక్ష్యంగా, తిరగబడాలి. తన అంతరాత్మకి తోచినట్టు చేసితీరాలి. యెవరేమన్నా సరే, వాళ్ళ

కష్టాలను, నిర్లక్ష్యంగా సంతోషంతో, ధైర్యంతో భరించాలి. కాని ముఖ్యవిషయాల్లో తరిగిబడ్డా సాధారణ విషయాల్లో లోకంతో స్నేహంగా వుండడానికే ప్రయత్నం చెయ్యాలి.'' (పుట 86) "...బిడ్డ ప్రవర్తన యితరుల అభిప్రాయం మీద ఆధారపరుచుకోడం నేర్పడం చాలా తప్పు. ఆ అలవాటువల్లనే యీకాలపు ప్రజలు, స్వంతఅభిప్రాయా లనేవే లేక నీతికీ దుర్నీతికీ విచక్షణను ఎరగనే యెరగక, తక్కినవారు మంచి దనే దాన్ని తాము అనుసరిస్తో, అంతరాత్మల్ని చంపుకుని తిరుగుతున్నారు. బిడ్డ అట్లాంటి అవస్థలో పడకండా కాపాడడం తలిదండ్రుల విధి. తనకు మంచి దని తోచడం చాతనే తన స్వబుద్ధిని వుపయోగించి తన నడవడిని నిర్ధారణ చేసుకోవాలి బిడ్డ.'' పుట 102.

అయిదో ప్రకరణం భయమూ. నీతీ; దీంట్లో భయమూ, నీతీ. వ్యక్తిత్వం—స్వార్థం, అబద్ధం—సానుభూతీ మొదలైన అంశాలను గురించి తెలుపబడింది. పిల్లలను చిన్నప్పుడు పెట్టేన భయాలు యెంత మట్టుకు అనర్థం తెస్తాయో చూడండి. "ఈచిన్నప్పటి, భయాలే లోకంలోని యీమూర్ఖానికీ, బానిసత్వానికీ క్రూరత్వానికీ కారణం. కనక భయాలను నిర్మూలం చెయ్య కలిగితే ప్రపంచం యింత కన్న చాలా ఆరోగ్యవంత మవుతుంది. ప్రజల స్వభావాలు యింతకన్న చాలా ఔన్నత్యాన్ని పొందుతాయి.'' పుట 96. పిల్లలకు నేర్పవలసిన ఆదర్శాలను గురించి, "లోకంలో ఆచరణలో వున్న వాటి కన్న వున్నతాదర్శాలను బోధిస్తే పిల్ల వ్యర్థరాలు కావొచ్చు. కాని లోకంలోని సాధారణ శుష్కజీవనులవలె నిరర్థకంగా బతికి డబ్బు సంపాయించి కీర్తి పొందడంతో సంతుష్టి పడడం కంటే, యీగొప్ప ఆదర్శాలతో అపజయం పొందడమే ఉత్తమం.'' (పుట 106., అని చెప్పబడింది.

ఆరవ ప్రకరణం విద్య. దీంట్లో బడి, కథలు, కళలు సృష్టిజ్ఞానం గురించి తెలపబడింది. సృష్టిజ్ఞానం గురించి అనేకమంది శాస్త్రజ్ఞులు యేకగ్రీవంగా చెప్పిన సంగతులే చెప్పబడ్డాయి.

పైమోస్తరుగా పుస్తకంలోని అంశాలున్నాయి. ఈ అంశాలన్ని సంపూర్ణంగా తెలిసివుంటే గాని బిడ్డలిని యిప్పటికంటె బుద్ధిమంతులుగానూ ప్రయోజకులుగానూ, ఈశ్వర ప్రియులుగానూ చెయ్యలేము.

రంధ్రాన్వేషణ పరులకి యీపుస్తకంలో కొన్ని వ్యతిరేకాంశాలు—అంటే, మొదట మంచి దని చెప్పినదే తర్వాత చెట్ట దని చెప్పడం—వున్నట్టు కనపడుతుంది. కాని సూక్ష్మంగా పరిశీలించి చూస్తే అలాంటివి కనపడవు.

ఈ పుస్తకం శైలిని గురించి కొంచెం చెప్పవలసి వుంది. శైలి వ్యావహారికం. చాలా సులభం. బహురసవంతం. కాని అక్కడక్కడ నామట్టుకు కొన్ని చిన్న లోపాలు కనపడుతున్నాయి. వాటిని గురించి కాస్త చెప్తాను. వ్యావహారిక భాష అయినా పూర్తిగా ద్యోతకం గానూ, గౌరవదాయికంగానూ వుండా లంటే మనం చిన్నచిన్న నియమాలను పాటించక తప్పదు. ఈ చిన్న నియమాలనుకూడా పాటించకపోతే భాష దారీతెన్నూ లేని అరణ్యం అయిపోతుంది. ఈ కింది మాటలు చూడండి. 'పూర్ణారోగ్యం, విస్తీర్ణం, సంస్థ, నిర్ణయం, మాతృదేవతలు, ఋషులు, అవస్థ, సంస్కృతి, దుఃఖాలు, స్థితి, అజీర్ణం, పరిస్థితులు మొదలైన మాటలు తప్పుగా రాయడంవల్ల లాభం కంటే నష్టమే యెక్కువగా వుం దని అభిప్రాయపడుతున్నాను. వాక్యం మొదట యీ మోస్తరుగా రాయబడ్డాయి. 'యిష్టం, వురుమూ, యీ శిక్షణ, వోదార్పులు, యేపిల్లలు, యీ సమస్యలు'' వాక్యం మొదట అచ్చుతో ప్రారంభించబడవలసిన యీమాటలు హల్లుతో ప్రారంభించబడ్డాయి. వాక్యం మొదట యిట్టిమాటలు అచ్చుతో వుండాలి అన్న స్వల్పనియమం పాటించకపోడంవల్ల భాష అలవికాని దయిపోతుం దని అనుకొంటున్నాను.

పుస్తకంలో కొన్ని యింగ్లీషు ముక్కలు అనవసరంగా ప్రయోగించబడ్డాయి. వీటికి తెలుగు వుండనే వుంది. స్త్రీలు చదవవలసిన పుస్తకంలో అనవసరంగా యింగ్లీషు మాటలు ఉండకూడ దనుకుంటున్నాను. ఏదైనా యీ మాటలు అట్టే లేవు. 'ప్రిన్సిపిల్సు, టెంపరమెంట్, ఎట్మాస్ఫియర్, ఇన్‌స్టింక్ట్సు, ప్రపోర్షనేట్, ఎన్కరేజ్, ఎప్రిసియేషన్''

ప్రకటనకర్తల అశ్రద్ధవల్ల ఈ పుస్తకంలో అచ్చుతప్పులు ఎక్కువగా ఉన్నాయి.

ఈ పుస్తకం స్త్రీపురుషు లంతా చదివి తాము బాగుపడి, పిల్లలను బాగుచేసి జాతిని బాగుపరచవలసివుంది. ఈ పుస్తకం ప్రతి ఆంధ్రవ్యక్తీ చదివి దేశాన్ని బాగుచేస్తారని నమ్ముతున్నాను. *



## రావుసాహేబు, మహోపాధ్యాయ,
# గిడుగు వెంకటరామమూర్తిపంతులుగారికి
## విజయపట్ట ప్రదానం

బాగా జ్ఞాపకం వుంది.

కవిశేఖర (ఇప్పుడు) వడ్డాది సుబ్బారాయుడుగారు వొకప్పుడు కొన్ని పద్యాలు చదివారు. అది 1913 వ సంవత్సరం ఏప్రిలు నెల. రాజమహేంద్రవరంలో ఆంధ్రసాహిత్య పరిషద్వార్షిక సమావేశం జరిగింది. అప్పట్లో ఆంధ్రసాహిత్య పరిషత్తు ఆంధ్రభాషా వాఙ్మయాల వికాసం సాధించడానికి పుట్టిందనీ, సాధిస్తుందనీ, ''పరికరా లన్నీ అమరేయి కనక అవు''నని అందరూ భావిస్తూ వుండేవారు. ఆసమావేశానికి అనేక పండితులూ, కవులూ, భాషాభిమానులూ, వాఙ్మయ ప్రియులూ దూరదేశాలనుంచి కూడా ఆప్యాయనంగా వచ్చారు. గిడుగు రామమూర్తిపంతులుగారు కూడా తమ శిష్యబృందంతో వచ్చారు; కాని వారికి తమ వ్యావహారిక భాషావాదం వినిపించడానికి యెవరూ అవకాశం యివ్వలేదు. పైగా కొందరు పండితులు రామమూర్తిపంతులుగారూ, జయంతి రామయ్యపంతులుగారూ వాది ప్రతివాదులని రూపిస్తూ రామమూర్తిపంతులుగారు వోడిపోయారనీ, తిరస్కృతులైపోయారనీ-ఇంకా-ఇంకా-అన్నారు. అప్పుడు వసురాయడుగారు చదివిన పద్యాల్లో వొకదానిలో యిప్పు డవసరమైన భాగం యిది.

''గిడుగు రామమూర్తి నుడుగు నిల్వక పోయె
నొగి జయంతి రామయ్యోక్తి గెలిచె''

వసురాయకవిగారి కెప్పుడూ సభాసదుల భాషాజ్ఞానంమీదా, రసికతమీదా విశ్వాసం వుండదు. అందుచేత వారు తమ పద్యాలు ఏసభలో చదివినా విధిగా అర్థం కూడా చెబుతూ వుంటారు. అప్పుడు కూడా అలాగే సెల విచ్చారు.

''కామ వుండేది గొడుగు. కామ లేనిది గిడుగు. గిడుగు గాలికి యెగిరిపోతుంది. రామమూర్తి పంతులుగారి వాదం గిడుగులాగ ఎగిరిపోయింది జయంతి అనగా జయశీలము. రామయ్యపంతులుగారి వాదం జయశీలం కనక అది గెలిచింది''

అప్పుడు ఈ స్వారస్యం చాలా కరతాళాలు పొందింది.

ఇది యిరవై యేళ్ల నాటి మాట. హేళన చేస్తూ, పెదవులు విరుస్తూ, కేవిడీలు కొడుతూ గ్రాంథిక

* ఈ గ్రంథం వెల 0-8-0. కావలసినవారు కళాభివర్ధని పరిషత్తు, రాజమండ్రి అని వ్రాయవలెను.

మూర్తిలో ఆ విశ్వమూర్తి అవతరించిన స్థలం. వెనకటి జన్మాలల్లో చేసిన పుణ్యం కొద్దీ ఈజన్మలో ఇన్ని నాళ్లకు ఆంధ్రపండితుణ్ణి అనే పేరు పెట్టుకొన్నందుకు కలలో కూడా ఇట్టి భాగ్యం లభిస్తుం దని అనుకోని నాకు శ్రీరామమూర్తిపంతులు గారికి కమెమొరేషన్‌వాల్యూం సమర్పించే మహాభాగ్యం కల్గింది.”

“రాజకవిలైకభూషణుడు రాజనరేంద్రుడి కాలంలో గాని, తెలుగువల్లభుండ, తెలంగొకండ అని చెప్పుకో గల్గిన రాయల కాలంలో గాని ప్రభుపీఠాలు, పండితపూజలు మహావైభవంతో జరిపి వున్నా యనుకొన్నా. జనసామాన్యానికి అందుబాటులో వుండేటట్టు విజ్ఞానాన్ని వ్యాపింపజేస్తానని కంకణం కట్టుకొని దాన్ని సార్థకం చెయ్యగలిగిన మహాసత్త్వుని ప్రజ్ఞానిధిని పండితుని కృతజ్ఞతతో సత్కరించేందుకై ముక్కోటి మతభేదాలు గల మనముక్కోటి ఆంధ్రులూ ఏకగ్రీవంగా సిద్ధపడడ మనేది నాడు వుందా అని ఆశంకిస్తున్నాను.”

“ఆంధ్రదేశంలో ప్రజ్ఞాప్రభావనిధు లను పండితులను గానీ, ప్రభువులను గానీ నేటికీ కొరత లేదు: అనంతసత్వసంపన్ను లయిన అన్నలూ, తమ్ములూ అనేకు లున్నారు. వారు పూనుకొంటె ఇట్టి మహోత్సవాలు అనేకం నిర్వహిస్తారు నిస్సందేహంగా. అయినా అవి వారి ప్రజ్ఞావిభవాలను వెల్లడిస్తాయే కాని ఆంధ్రజనసామాన్యపు హృదయానందాన్ని, కృతజ్ఞతాపారవశ్యాన్నీ వెల్లడింప లేవేమో అని నా ఊహ.”

“రామమూర్తిపంతులుగారి అమూల్యమైన జీవితకాలంలో ఇది డెబ్బయి వకటో యేడు. అయినా సింహగర్జనంతో సారస్వతక్షేత్రానికి వురికే వారి మూర్తిని చూస్తే “వృద్ధా శ్శిష్యా గురు ర్యువా” అనిపిస్తుంది. పంతులుగారు వ్యావహారికాంధ్రానికి యుగపురుషులు. అంటే వారి సృష్టి అనుకోరాదు. ఇది తెనుగుతల్లి అనాదైన లీలా విభవం. పంతులుగారున్నూ ఆతల్లియొక్క రూపాల్లో చేరినవారే. అయినా ఆయన ఆతల్లికి వక అర్వాచ్యవిభవం కల్పింపకలిగినారు. కాబట్టే ఆయన్ను యుగపురుషు డన్నాను.”

“వ్యావహారికాంధ్రం ఆయన చేతుల్లో వప్పగింపబడింది మొగటకొని నేటిదాకా ఈ రెండు ప్రస్థానాల్లోనూ దాని రూపురేఖలకై మనలో కొందరు చూపిన ప్రతిపత్తికి ఏమీ లోపం లేదు. కావలసినంత. ప్రాతికూల్యప్రవాహం ఉరవడించే కొద్దీ అతిజాగ్రత్తతో నావ నడిపి ఒడ్డుకు చేర్చిన కర్ణధారుడు రామమూర్తిపంతులు. కాబట్టే జనసామాన్యకోటిలోని మనం అందరం ఆయనకు కృతజ్ఞత వెల్లడించుకొనేందుకు ఈ ఉత్సవం ఏర్పాటు చేశారు. ఉద్యానప్రతిష్ఠ సప్తసంతానాల్లో వకటి. పంతులుగారి నిరంతరకృషివల్ల ఏర్పడ్డ వ్యావహారికాంధ్రోద్యానం శాశ్వత మైంది. కాపు పట్టింది. బీదా సాదా భేదం లేకుండా పండితుల దగ్గర్నుంచి పామరుల వరకూ ఆకర్షించి హాయినీ, సొయినీ, ఆనందాన్ని యిస్తున్నది. అజరామరం అయింది కాబట్టే వారి యీ డెబ్బయ్యో జన్మదినోత్సవంలో వారి తోటలో పూచినట్టీ, పండినట్టీ పుష్పాలనూ, ఫలాలనూ వారికే యీ కమెమొరేషన్ వాల్యూములు రూపంగా కృతజ్ఞతతో సమర్పిస్తున్నాము. ఈ కాన్కలో పంతులుగారి భాషావ్యవసాయాన్ని పాండిత్యప్రకర్షనూ మెచ్చుకుంటూ స్వదేశస్థులూ విదేశస్థులూ అయిన విబుధులు వ్రాసిన ఆంగ్లాంధ్రవ్యాసావళి వకటి. రెండోది భాషాతత్త్వప్రదర్శనపూర్వకంగా ఆంధ్రభాషాపరిణామాన్ని నిరూపించే స్వకీయవ్యాసావళి. మూడోది వారి వాదాన్ని నిరూపించే శబ్దాలను నిర్దుష్టము లని బుజువుపరిచే లక్ష్యగ్రంథం. పేరు బాలకవిశరణ్యం. నాలుగోది ఆంధ్రపండితభిషక్కుల భాషాభేషజం. అయిదోది ప్రాచీనకాలపు వచనరచన తెలిపే గద్యచింతామణి అనేది.

“ఆంధ్రాంగ్లవ్యాసావళిలో ముఖ్యాలు— స్టెన్‌కోనోగారు వ్రాసిన ముండాభాషలు అనే వ్యాసం,

సీతాపతిపంతుల పరేన్ భాషను గురించిన వ్యాసం, ఎల్. వి. రామస్వామి అయ్యంగారి ద్రావిడిక్ గైడ్సు మున్నగునవి. ఇవి అచ్చం ఆంధ్రపండితులుగా వున్నవారికి ఎంతో విజ్ఞానాన్ని కలిగిస్తవి. డాక్టరు, నేలటూరి వేంకటరమణయ్యగారి చారిత్రికవ్యాసం అమోఘపరిశోధన వెల్లడిస్తున్నది. పాశ్చాత్యపండితులు నేటి అభినవాంధ్రపండితుల పరిశ్రమనూ, ఉత్సాహమునూ ప్రశంసించిన వ్యాసాలున్నవి. ఆంధ్రవ్యాసాలలో పండితులూ పామరులూ కూడా గమనింపదగ్గవి అనేకం వున్నవి. అందులో శ్రీకోరాడ రామకృష్ణయ్యగారి "ఆంధ్రభాషాపదములు—వాటి నిష్పత్తిక్రమము" అనే వ్యాసమూ, డాక్టరు చిలుకూరి నారాయణరావు పంతులుగారి "మాత్రాఛందస్సులు" అనే అమోఘమైన వ్యాసమూ, శ్రీ శివశంకరశాస్త్రిగారి "పదకర్తలు" అనే వ్యాసమూ, వేమల సత్యనారాయణశాస్త్రిలుగారి హాస్యం వ్యాసమూ, "మాతృభాష—పరభాష" అనే వెంకటరత్నంగారి వ్యాసమూ వివిధవిషయపరిశోధనలను వెల్లడిస్తున్నవి. చింతా దీక్షితులుగారి 'లీలాసుందరి' అనే బాలానందం నిజంగా బాలానందమే. భమిడిపాటివారి "అన్నీ తగాదాలే" అనే వ్యాసం, తెలికిచర్ల కృష్ణమూర్తిగారి "అణువులు—వాటి పరిమాణము" అనే వ్యాసం, విస్సా అప్పారావు పంతులుగారి "చెవి చేయు పని" అనేదీ చాలా ఉత్తమవ్యాసాలు. రాళ్లభండివారూ, చిలుకూరి వారూ జాయింటుగా వ్రాసిన "తూర్పుగాంగరాజులను గురించిన ఆరు క్రొత్త శాసనములు" అనేదీ, సోమశేఖరశర్మగారు వ్రాసిన "పొట్లదుర్తి మాలెపాడుశాసనవ్యాసం" అనేది అద్భుతములగు అనేక చారిత్రకాంశములనూ, తత్కర్తల విజ్ఞానమునూ చాటుతున్నవి. రెండోదీ, మూడోదీ, నాల్గోదీ శ్రీరామమూర్తిపంతులుగారి గ్రంథాలే."

"మొత్తం యీ అయిదు గ్రంథాలనూ ఆంధ్రదేశీయులందరూ కలిసి అచ్చువేయించినారు. వాటిని ఈసభలో శ్రీరామమూర్తిపంతులుగారికి అర్పించే పనిని సభవారు నాకు ఏర్పరచినందున విశ్వేశ్వరునికి విశ్వగతమైన వస్తువులనే అర్పించిన రీతిగా సభవారి అనుమతితో వారు ప్రోదిచేసిన వ్యావహారికాంధ్రం అనే ఉద్యానంలోని ఈదివ్యము లయిన గ్రంథరూపమైన పుష్పాలనూ, పండ్లనూ వారికే సమర్పిస్తున్నాను. శ్రీరామమూర్తి పంతులుగారు వీనిని స్వీకరించి ఆశీర్వదింతురుగాక."

తరవాత డాక్టరు చిలుకూరి నారాయణరావు పంతులుగారు తాము క్రొత్తగా రచియించి ఈసందర్భంలో ప్రకటించడానికే అచ్చువేయించిన అంబ-లేక_మొండిశిఖండి అనునాటకాన్ని వొక రంగం చదివి సభ్యులకు వినిపించి శ్రీరామమూర్తిపంతులుగారికి అంకితం చేశారు.

పిమ్మట రామమూర్తిపంతులుగారు వయస్సును బట్టి వృద్ధు లయినా సింగపుకొదమలాగ లేచి మేఘగంభీరగర్జనలతో యిలా సెలవిచ్చారు.

"ఏవిషయమైనా మంచిదో చెడ్డదో నిర్ణయించుకొనే భారము మనిషిమీద ఉంటుంది. ఒకరికి మంచిదని తోచింది వేరొకరికి మంచిది కాకపోవచ్చు. కాని మనస్సాక్షిగా తనకు మంచిదని తోచింది తానాచరించడము తన విధి. నేను నాకు మంచిదని తోచిన విషయమును గురించి పరిశ్రమచేసి అందలి సత్యము గ్రహించి వెల్లడిస్తాను. బాల్యము నుంచీ ఇట్టి నియమమునే నేను పెట్టుకున్నాను. ఆ నియమము ప్రకారమే నడుచుకొంటున్నాను. ఇక నావాదన సంగతి.

లోకమంతా వకటి. తక్కిన భాగాలతో సంబంధం లేనిదే అది ఉండదు. ఒక వేలు యింకో వేలుతో కూడితేనే గాని ఏ పనీ చెయ్యలేదు. విశ్వము అంగి. తక్కినవి అంగములు. శరీరము అంగి. అవయవములు అంగములు.

* * *

వివాహము ఒక institution దానిలో system

ఉంటుంది. దేవతార్చన కూడా అట్టిదే. వివాహములో మాటలూ దేవతార్చనలో మాటలూ వాటితో సంబంధం ఉన్నవారికి తెలుస్తవి.

యజ్ఞము కూడా ఒక (System.) కాని దాని నెవరూ చెయ్యడంలేదు. ఆమాటల కిప్పుడు అర్థము తెలియదు. యజ్ అనే ధాతువునుండి 500 మాటలు పుట్టినవి. ఇప్పుడు వాటి అర్థమేమి తెలుస్తుంది? సత్యనారాయణ వ్రతమునకు సంబంధించిన మాటలిప్పుడు తెలుస్తవి. system కీ తదంగములకూ పరస్పర సంబంధం ఉంటుంది.

భాష కూడా అట్టిదే. "భగవంతుడు మనుష్యునకు వాక్కు ప్రసాదించాడు" అని షెల్లీకవి అన్నాడు.

ఆరేండ్ల బాలుడికి అతని లోకజ్ఞానముతో సమానమైన భాష అతని కుంటుంది. అదే మాతృభాష; జీవద్భాష.

* * *

పూర్వము కాలమును తెలియ జేయడానికి గడియలు వాడుక చేసే వారు.

ఇప్పుడు గంటలు వాడుక చేస్తున్నారు. కాలము ఒక (System) దీనికీ అంగములకూ పరస్పర సంబంధం లేనిదే అర్థం కాదు.

నన్నయ్య ఈ గోదావరిలోనే స్నానం చేసి సంధ్య వార్చేవాడు. నన్నయ "నేడు, ఎల్లి" అనే సందర్భములో మనము "ఈవాళ, రేపు" అంటున్నాము. నన్నయ కాలములో "రేపు" అనగా "మాపు" కాని దన్న మాట.

ఈ system లో వ్యత్యాసం కలిగింది.

నన్నయ్య కాలాన "సాని" అనగా "తల్లి" అని అర్థము. ఈ కాలములో "తల్లి"ని "సాని" అనరు. ఇప్పుడు "సానెలు" ఏ అర్థములో వాడుతున్నామో అప్పుడు "లంజియలు" ఆ అర్థములో వాడేవారు.

నన్నయ కాలమునాటి ఉద్యోగాలు నేడు లేవు. నేడున్నవి అప్పుడు లేవు. ఇన్‌స్పెక్టరు, కలక్టరు, ఓవర్సీయర్, హెడ్మాస్టర్ మొదలైన పదములు ఈ కాలపువి. ఇప్పుడు అర్థమౌతవి. నన్నయ కాలము నాటి పదములు ఇప్పుడర్థముకావు. ఎక్కువ పరిశ్రమ చేస్తే కొన్ని అర్థమౌతవేమో.

* * *

భారతంలో శబ్దములన్నీ దేశభాషతో సంబంధం కలవి గనక సార్థకములు.

* * *

డ్రాయింగు వేసినప్పుడు background ఉయ్యాలి. అది లేనిదే చిత్రానికి అర్థం లేదు.

ఒక చిత్రములో గోపురము ఎత్తు తెలియజేయవలసి వచ్చినప్పుడు ఒక చెట్టుతో సంబంధం ఏర్పరచాలి. ఒక బెలూన్ (balloon) ఎంత ఎత్తు వెళ్ళిందో తెలపడానికి ఒక విధమైన మేఘములతో సంబంధం ఏర్పాటు చేసి చిత్రించిన చిత్ర మొకటి ఒక ఫ్రెంచిపత్రికలో నేను చూచాను.

* * *

నన్నయ కాలమునాటి దేశభాషలో ఒక నూరో వంతైనా మిగలలేదు. అంతా కొట్టుకుపోయింది. నన్నయకాలంలో అప్పటి వారి కర్థమయ్యే పదాలు మన కిప్పుడు కావు. వేదకాలమునాటి పదముల కర్థము గాక వేదపండితులు వాటిని గురించి యద్వా యద్వా అంటూ ఉంటారు.

భారతభాషలో మాటలకు శబ్దరత్నాకరంలో అర్థము వ్రాయవలసి వచ్చినప్పుడు చింత్యము, అస్పష్టము ఇత్యాదిగా వ్రాసినాడు తద్గ్రంథకర్త.

నన్నయ కాలంలో ఏపదము ఎట్లా ఉండేదో తెలుసుకోవడం కష్టము.

నన్నయగారి తాటాకుల ప్రతి ఇప్పుడు దొరకదు. దానినుండి వ్రాసిన ప్రతులలో ఆ ప్రతుల ప్రతులలో మన కాలమున దొరుకుతవి. అవి ఏవలో లేఖకులు వ్రాసుకొన్నవి. వారు మాతృకనుండి సరిగా వ్రాశారా అంటే—అది దైవాయత్తం. "నడుచు, నడచు"—ఇందేది సరియైన రూపమో నిర్ణయించడ

మెట్లా ? యతిస్థానంలో చూపగలిగితే తెలుస్తుంది లేకుంటే తెలియదు.

"సొలయు, సొలము"—ఇందేది సరియైనదో తెలుసుకోడానికి ప్రాసస్థానంలో చూడాలి. లేకుంటే తెలియదు. అది వైవాయత్తం. శకటరేఫల విషయమూ అంతే.

నన్నయ కాలమునాటి భాష శిలాక్షరములలో నందంపూడి శాసనరూపమున ఉన్నది. దానిని బట్టి నాటి దేశభాషస్వరూపం కొంత తెలుస్తుంది. జయంతి రామయ్య పంతులుగారు దాని కర్థము చెప్పలేక పోయారు ఆనాటి భాషాస్వరూపం తెలియక పోవడంవల్ల. చరిత్ర తెలుసుకోవడంకోసమే భాష. నన్నయ కాలమునాటి భాష మళ్లీ ప్రయోగించడానికి కాదు. నన్నయ భారతమును అచ్చువేసినపుడు పరిష్కర్తలు రూపాలు మార్చారు. రెండు స్వర పర్వాలలో భాషా ఇదమిత్థము చెప్పడానికి వీలులేదు.

* * *

కవిత్వము ఒక కళ. కళకు దేశభాషలో ఉన్న అన్ని శబ్దాలూ అవసరము లేదు.

భాష వనమువంటిది. భాషలో ఎవరికి కావలసిన మాటలు వారు తీసుకొంటారు. నన్నయ కాలము నాటి దేశభాషంతా నన్నయ భారతములో ఉన్నదని చెప్పడానికి వీలులేదు. తెలుక్కు మారుగా సంస్కృతం వేసినచోట్ల తెలుగే వేస్తే నన్నయ భాష ఇంకా తెలిసిఉండేది. ఒకమాట. "అట్టిడు" అనే పదము ప్రథమావిభక్తి. దానికి ద్వితీయావిభక్తి ఏమిటి? నన్నయ వాడలేదు కాబట్టి మనకు తెలియదు. "కురియు"—దీనికి ప్రేరణార్థకము "కురిసిరి." నేడు "కురియించు" అనే పదమునకు మారుగా గ్రాంథికులు "కురిపించు" అని వ్రాస్తున్నారు. ప్రాచీనభాష తెలియక వ్యావహారిక పదములను వాడి దానిని గ్రాంథికమని లోకులను భ్రమింపజేస్తున్నారు. తిక్కనాదుల విషయములో కూడా ఇట్లే చూచుకోండి.

గ్రాంథికభాష అతుకులబొంత. స్పెన్సరు అనే ఆంగ్లకవి ఫెయిరీక్వీన్ అనే కావ్యము యిట్టి భాషలో వ్రాస్తే పండితులు అది ఏభాషా కాదన్నారు. అట్లాగే గ్రాంథికభాష ఏభాషా కాదు. ప్రాచీన భాషా కాదు, దేశభాషా కాదు. అందరు కవుల భాషలూ కలయిక. తెలుగులక్షణం పట్టి దెబ్బలాట వ్యవహారం. సంస్కృతం ఇట్లా ఉండదు. పతంజలి ఎంత చెప్పితే అంత.

* * *

గ్రాంథికభాషకు లక్షణం లేదు. "చేతురు కోతురు" ఇత్యాదులు చిన్నయ్యసూరి తప్పన్నాడు. గ్రాంథికు లంతా ఈ పదాలు వాడుతున్నారు. "ఉన్నాను" అనే మాట చిన్నయసూరి వప్పుకొన్నాడు. నన్నయ, తిక్కన, శ్రీనాథుడు, జక్కన వరకూ ఎవరూ ఈ రూపము వాడనే లేదు. జయంతి రామయ్యగారు "ఉన్నాను ఉన్నారు" అనే ప్రయోగములు చేశారు. చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి గ్రంథాలలో ఈ ప్రయోగాలు కావలసినన్ని ఉన్నవి. వ్యవహారభాషనే వ్రాసి ఉన్నట్లయితే వారి రామచంద్రవిజయం ప్రమాణగ్రంథమయ్యేది.

* * *

గురజాడ అప్పారావూ, పి. టి. శ్రీనివాస అయ్యంగారూ నేనూ ఈ వాదన లేవదీస్తే అప్పుడు మమ్మల్నందరూ దూషించేవారు.

The three tailors of the Tanning street అన్నారు మమ్మల్నప్పుడు.

* * *

వీరేశలింగంగారు బ్రతికున్నకాలంలో వారు నాతో భాషవిషయమై స్వేచ్ఛగా వాదించారు. నా వాదనలో సత్యం ఆయన అంగీకరించారు.

నన్నయ మొదలు వీరేశలింగంగారివరకూ భాష మారలేదని చిలకమర్తి లక్ష్మీనరసింహంగారన్నారు. వీరు వ్రాసిన భాష నన్నయ భాష కావలసివస్తే రెండువేల తప్పులు సవరించవలసి ఉంటుంది.

వడ్డాది సుబ్బారాయుడుగారు మహాజాగ్రత్తగా వ్రాసే కవి. వారు "అగుపడు" అనే పదం వాడారు. "అగుపడు" అనే పదము తప్పనిన్నీ, "అగ్గపడు" "ఆగపడు" అనే రూపములు సరియైనవనిన్నీ, "అగపడు" అనే పదమునకు అర్థము "స్వాధీనమగు," "చిక్కు" అనిన్నీ నేను వారికి చెప్పాను. వేదం వేంకటరాయశాస్త్రిగారు "జ్ఞాపర్చు" "జ్ఞాపించు" అనే వింత కృతక రూపాలు వాడారు. నేను చెప్పినమీదట వసురాయకవిగారు దిద్దుకొన్నారు. ఇందును గురించి వ్యాకరణములో సూత్రము లేదు కాబట్టి కవులు తమకు తోచిన రూపములు వాడారు. వావిలాల శివావధానులుగారు "అందరికి" అనే పదము మొదట వాడి తరవాత ఎవరో పండితులు తప్పన్నారని కాబోలు దానిని "అందరకు" అనే కృతక రూపముగా దిద్దారు.

గ్రాంధికభాష యిలా ఉన్నది.

అరవై సంవత్సరముల వయస్సు వచ్చినవారికి కూడా ఈభాష రాకుండా ఉంది. అకారమధ్యమో, ఇకారమధ్యమో, ఉకారమధ్యమో తెలియదు కొన్ని పదముల విషయమున ఈ పండితులకు. ఇం కెందుకు ఈ భాష!

గ్రాంధికభాషను పండితు లుంచుకోనిండి. మీరు దేశభాష వాడండి.

* * *

నా చిన్నతనంలో తీర్పులు తెలుగున వ్రాసేవారు. పండితుల అభిప్రాయాలు తీసుకొనేవారు. వాటికి ఫట్వాలు అని పేరు. ఈ ఫట్వాలూ తీర్పులూ వ్యావహారిక భాషలోనే ఉన్నవి. వచనగ్రంథములలో వ్యవహారభాషనే సంప్రదాయసిద్ధముగా వాడేవారని నా గద్యచింతామణి అనే గ్రంథములో అనేక గ్రంథములనుండి ఉదాహరణలతో నిర్ధారణ చేశాను.

నన్నయ తిక్కనలు తమ గ్రంథాలలో శుద్ధదేశభాషనే వాడారు.

నాకు ఎన్నో సన్మానపత్రాలు సమర్పించి నాకు లేని యోగ్యత మీరు ఆరోపించారు. నా కింత గౌరవ మిక్కడ జరుగుతుందని నేననుకోలేదు. మీకు నాయందు గల దయవల్ల నాయందు లేని గుణములు నాకు ఆరోపించారు.

* * *

ఈవాదము నాకు నచ్చింది. దేశభాషపై ఉన్న నిరోధం తొలగించడం మన కర్తవ్యము. స్వభాషలో మాట్లాడ్డానికి ధైర్యం లేకపోవడం ఏల? Gag చేశారు కాబట్టి. ఈ నిరోధం తొలగిస్తే స్వేచ్ఛ కలుగుతుంది. గవర్నమెంటుకంటె ఎక్కువగా పండితులు Liberty of speech (వాక్స్వాతంత్ర్యము) తీసివేశారు. మనకు వాక్స్వాతంత్ర్యము లేదు. గ్రామ్యత్వం తొలగించమంటున్నాను నేను. పండితులూ కవులూ శిష్టులూ వాడేభాష తప్పనడం అవివేకం. ఎలమంచిలి సభలో మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయశాస్త్రిగారు శిష్టవ్యవహారమందున్న భాష గ్రామ్య మనరాదని తీర్మానించారు. అపభ్రంశ మనే మాటఉన్నది. గ్రామ్యం అనే మాట లేనేలేదు. గ్రామ్య మనేది పారిభాషిక పదము. వ్యుత్పత్తి నిరూపిస్తుందిగాని ప్రయోగము తప్పని సూచించదు. దేశభాష అపరిమిత ప్రయోజనముకలది. వ్యవహారములో లేని భాషలు పరిమిత ప్రయోజనముకలవి. పాణిని, పతంజలి కాత్యాయని వ్యవహారభ్రష్ట పదములు వాడరాదని అనుశాసించారు.

గురజాడ అప్పారావూ నేనూ బాల్యమునుండే విద్యాభ్యాసము చేశాము. చిన్నతనంలో మేమంతా కలిసి నలనాటకం ఆడాము. అప్పారావు కన్యాశుల్కం వ్రాయడాని కిదో కారణం

ఇంగ్లీషు ప్రైమరీ పరీక్ష ప్యాసయి మన దేశము ఏ పోలీసు సూపరెంటు ఉద్యోగము చెయ్యడానికో ఇంగ్లీషు వాడు వస్తాడు. అతడు మాట్లాడే ఇంగ్లీషు చక్కని ఇంగ్లీషు అంటారు. యమ్మే ప్యాసుచేసిన విద్యార్థికుడు మాట్లాడే తెలుగు తెలుగు కాదం

టారు మన పండితులు. పండితులు వ్యవహార భాషలోనే బోధిస్తారు. మేము వ్రాస్తే తప్పంటారు. సత్యం తెలిసేవరకూ తిడతారు.

ఈ ఊళ్లో వెనక సభ చేసినప్పుడు నామాట ఎవరూ వినలేదు. అప్పుడు కొవ్వూరిలో సభజరిగింది. ఆసభలో పోలవరం జమీందారుగారూ, దివాకర్ల తిరుపతిశాస్త్రిగారూ నావాద మంగీకరించారు. వీరేశలింగంగారూ నావాద మంగీకరించారు.

ఇరవై సంవత్సరాలకు క్రితము వ్యవహారభాష బోధించ వచ్చునని తీర్మానిస్తే పనికిరాదని 20,000 మంది వ్రాళ్లతో రెండువందల టిల్లి గ్రాములతో గవర్నమెంటు వారికి మహజరు పంపించినారు. అప్పటికది ఆగిపోయింది.

ఇప్పుడు ఏమి చేయవలెనో మీకు తెలుసును. రెండుకోట్లమంది సొమ్ము దేశ భాష. హక్కు కాపాడగలవారు మీరు.

శివశంకర శాస్త్రిగారు నాచెయ్యిచూచి ఇంకా పదకొండు సంవత్సరాలు బ్రతికి ఉంటావని సాముద్రికం చెప్పినారు. నేను జీవించి ఉంటే నేను పూనుకొన్న నిఘంటు కార్యము పూర్తిచేస్తాను. శబ్దరత్నాకరములో 2000 తప్పులున్నవి. నేనన్నమాటే కాదిది. మానవిల్లి రామకృష్ణకవిగారూ సూర్యరాయ నిఘంటుకారులూ కూడా ఈమాటే అన్నారు. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు అనేక వందల మాటలు శబ్దరత్నాకరములోకి ఎక్కలేదని చెప్పినారు.

వ్యాకరణమూ నిఘంటువూ—ఇవి record వంటివి. ఇవి ప్రమాణము కావు. శిష్టవ్యవహారమే ప్రమాణము.

వైయాకరణులూ, నైఘంటికులూ శిష్టపదములు వేసుకోకుంటే వారిదే తప్పు.

వాక్కు ఆత్మను ప్రకాశింపచేసేది. లోకానికి సూర్యునివల్ల ప్రకాశము కలుగుతోంది. సూర్యుడు లేనప్పుడు చంద్రుని ప్రకాశ ముంటుంది. చంద్రుడు లేనప్పుడు నక్షత్రములు ప్రకాశిస్తవి. నక్షత్రములూ లేనప్పుడు, అగ్ని. అగ్ని లేనప్పుడు వాక్కు.

ఆత్మను ప్రకాశింపచేస్తుంది వాక్కు.

"శబ్దబ్రహ్మాత్మనే శివాయ నమః"

పంతులుగారు ఉపన్యాసం చేసినంతసేపూ స్త్రీపురుషు లందరూ—సభ అంతా నిస్తరంగసముద్రం లాగ గాంభీర్యం వహించింది.

మనవాళ్లు పదిమంది యెక్కడ కూడినా గుసగుసల్లో పడిపోతా రని వొక నింద వుంది; కాని నేను దాని కంగీకరించను. సభ్యుల ప్రవర్తన ఉపన్యాసకుని వాఙ్మాధుర్యాన్నిబట్టీ, ఉపన్యాసవిషయాన్ని పట్టీ మారుతూ వుంటుంది. రామమూర్తి పంతులుగారి వంటి వక్తలు మనలో అరుదుగా వున్నారు. వా రెక్కడ యెప్పుడు ఉపన్యాసం చేసినా సభ్యులు గాంభీర్యముద్రనే వహిస్తారు. ఆనాటి సభలో కుమారకవిసింహులుకూడా చాలా మంది వుండడంచేత సభ అంతా గాంభీర్యాన్నేగాక ఔదార్యాన్ని కూడా ప్రకటించింది.

గోదావరితల్లి యిదంతా చూసింది. ఇదంతా వింది. ఆదికవీ, ఆదివాగనుశాసనుడూ అయిన నన్నయ్యభట్టారకుని లీలావిలాసా లన్నీ చూసి ఉప్పొంగిన మహానుభావురా లామె. ఆదివ్యపురుషుని, పరమ పవిత్రమైనిక జీవితాన్ని మన కిప్పటికీ అస్పష్ట కలకల నినాదంతో వినిపిస్తూ వున్న వాత్సల్యవతి ఆమె. రాజరాజనరేంద్రుని నిండుకొలువై కవితా వినోదాలతో ఘూర్ణిల్లిపోయిన రాజమహేంద్రవరంలో యిప్పటికీ, ఎప్పటికీ కూడా కవితావిలాసాలూ, వాఙ్మయప్రీతీ ప్రోదిచేసే అమృతపయస్విని. ఆమె. ఆమె రామమూర్తిపంతులుగారి మహత్తు గ్రహించింది. వారు నన్నయభట్టారకుని పదవిలో నిలిచివుండడం గుర్తించింది. సమగ్రమైన ఆంధ్రజాతి ఈ ఆధునిక వాగనుశాసనుడికి పాదపూజ చేస్తూ మళ్లీ తన భవిష్యమున్నతికి పునాది వేసుకుంటూ వుండడం గ్రహించింది. ఆమెకి పులకలు పెట్టాయి. హృదయం ఉప్పొంగిపోయింది. ఆనందమూ పారవశ్యమూ తలమునక లైపోయాయి.

నామాటమీద మీకు నమ్మకం లేకపోతే ఆమె జీవనంలో కొత్తపొంగూ, ఆమె నడకలో కొత్త భంగిమా, ఆమె కలకలనవ్వులో కొత్త మాధుర్యమూ కలిగాయో లేదో వెళ్లిచూడండి.

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి



# వేదికలు — పత్రికలు

## "మనకిప్పు డెలాంటి నాటకాలు కావాలి?"

డిసెంబరు చివరివారంలో మద్రాసులో జరిగిన మూడో ఆంధ్రనాటకకళాపరిషత్సమావేశానికి అధ్యక్షత వహించిన శ్రీ. టి. రాఘవాచారిగారు ఈ విషయం యిలా సెల విచ్చారు.

"...ఇపుడు నాటకరంగములందు పాడబడుచున్న సంగీతము శిరోవేదనమును కలిగించుటకు మాత్రమే ఉపయోగించుచున్నది. నాటకములలో సంగీత ముండగూడ దని నేను చెప్పుట లేదు. సంగీతముతో గూడిన నాటకములను మనము ప్రదర్శించి అందువలన ప్రేక్షకుల కానందము కలిగింపగలుగుదుము. కావున నిపుడు రంగస్థలములలో మనము వినుచున్న సంగీతము నాటకముల కెంత మాత్రమును పనికిరాదు. ఇపుడు ప్రేక్షకులు గూడ పూర్తిగా సంగీతవ్యామోహమునకు దాసు లగుటచే మన నాటకములు పాటకచేరీలుగను, హరికథా కాలక్షేపములుగను మారిపోయినవి. ప్రదర్శింపబడవలసిన నాటకముల సంగతిని ప్రేక్షకులు పూర్తిగా మరిచిపోయి, నటులు రంగస్థలమున కూర్చుండి తాము కోరిన పాటల నన్నిటిని పాడవలె నని నిర్బంధించునట్టి దుస్థితి గూడ నిపుడు తటస్థించినది. ఇంతకంటె అవమానకర మగు విషయము మరేదియు నుండదు. ఆంధ్రనాటకరంగ మింతటి నీచస్థితికి రాగల దని నేనెన్నడును తలచి యుండలేదు. ఆంధ్రనాటకములు అధమాధమము లగు యక్షగానముల స్థితికి వచ్చినవి. దీనికి గల కారణమందరికిని దెలిసినదే. ఇదివరకే పరిషత్తువారు రెండు వార్షికసభలను జరిపిరి. ఇది మూడవది. ఆంధ్రనాటకరంగమునకు సంప్రాప్తమైన ఈదుస్థితిని తొలగించుటకు మీ రేమి చేసితి రని విజ్ఞానధను లగు మిమ్ములను నే నడుగుచున్నాను. ఇందులకు మీరే బాధ్యులు. విద్యాధికులారా! యువజనులారా! విద్యార్థులారా! ఆంధ్రుల ఉదార మగు నాట్యకళను హత మొనరించుచున్న యీ క్రూర పిశాచమును మారణహోమము గావించుట యను ఘనతమ మగు కార్యభారమును మీరు వహింపవలెను. ముందుగా ప్రాతనాటకములను మూల బెట్టి సరియైన పద్ధతిని క్రొత్తనాటకములను వ్రాయించవలెను. యువకులలో గ్రంథకర్తలును కవులును నడుములు కట్టి మన కళాప్రకాశమును మందీకృత మొనరించుచున్న మూఢవిశ్వాసములను సంప్రదాయములను తుడిచివేయవలెను. విశ్వామిత్రుడు నూతనసృష్టి చేయగలుగుటకు సహాయభూతమైన నిర్భయత్వమును రసాయనమును తనివిదీర మీరాస్వాదింపవలెను. తనతో పాటు శునకమును గూడ సురపురికి గొంపోవలె నని దేవేంద్రుని నిర్బంధించిన యుధిష్ఠిరునకు గలిగిన జీవకారుణ్యమును మీ రలవరుచుకొనవలెను. ఇట్టి జీవకారుణ్యమే అధునికులలో తుకారాము, తన చెంత నున్న ఒక్క రొట్టెముక్కను హరించిన కుక్కకు ఘృతమును గూడ ఒసంగునట్లు చేసినది. నూరు మంది భార్యలుండినను చాలక నూటయొకటవ భార్యను పెండ్లియాడ గోరునట్టి పురుషాధములను దమ నాటకములలో నాయకులనుగా జేయనట్టి కవులును గ్రంథకర్తలును నాకు కావలెను. కణ్వాశ్రమమున నమ్మించి పెండ్లియాడి మరిచిపోయిన దుష్యంతుని వంటి భర్తలను పాదప్రహారములచే బహిష్కరించు శకుంతలలను, వితంతుశరణాలయములను సమర్థించునట్టి సావిత్రులను నాయికలనుగా నొనరించు కవులు నాకు కావలెను. ప్రాచీనకాలమునందువలె మరల నాటకరంగమును విద్యాలయముగా చేయగలిగిన కవులు కావలెను. మానవునకును మానవునకును, మానవునకును సృష్టికర్తకును గల సంబంధమును బాగుగా బోధింపగల

విద్యాలయముగా రంగస్థలమును మార్చునట్టి కవులు కావలెను. జీవిత మెటు లున్నదియును, ఎటుల నుండవలసినదియును రంగస్థలమునందు స్పష్టపరుపబడవలెను. పౌరాణిక నాటకములను ప్రదర్శింపదగిన కాలము గడచినది. సుబ్రహ్మణ్యునకు పెండ్లియైన నేమి కాకున్న నేమి? సత్యభామకు రుక్మిణి పై సవతిమాత్సర్య ముండిన నేమి లేకున్న నేమి? ప్రజల నిత్యజీవితమునకు సంబంధించిన విషయములను ప్రదర్శించు టవసరమును ప్రయోజనకరము నగును; గాని పురాణగాథలను ప్రదర్శించుట నిరుపయోగము. మన నిత్యజీవితమునకు సంబంధించిన సమస్యలు వేలకొలదిగా నున్నవి. మనము కని విని యెరుంగని విషయములను ప్రదర్శించుట మాని మన మనుదినమును కనుచు వినుచుండు విషయములనే ప్రదర్శించుచుండవలెను. మన ప్రాచీనజ్ఞానమును, జాతీయధీశక్తిని, విశ్వమానవజీవితమునకు సంబంధించిన సమస్యలను గ్రహించి పరిష్కరింపబూనిన కార్యనిరతిని నాటకములు వెల్లడింపగలిగి యుండవలెను. వ్యక్తిజీవనమునందు గల ప్రబలశక్తులను గూడ వెల్లడించుచుండవలెను. శ్రీరామచంద్రుడు తన భార్యను హరించిన రాక్షసుని హతమొనరించె నని మనము భావించుటకంటె అతడు తన దేశమునందలి ప్రజల మేలుగోరి పరిపాలనకు సంబంధించిన సమస్యలను పరిష్కరించిన రీతిని గూర్చి మనము భావించుటవలననే అధిక మగు ప్రయోజనము కలుగగలదు. మానవోత్తముల జీవితమే సామాన్యప్రజలకు మత మగుచున్న దని తెలుపబడెను. మనుజుడు కార్యసిద్ధిని, విజయమును, సమగ్రతను బడయుటకు చేయునట్టి ప్రయత్నములలో మొదట కలుగునట్టి సంఘర్షణములు పరాజయములు మున్నగువాటి నెదుర్కొనుట కతడు చూపిన పట్టుదలను పరికించుటయే మిక్కిలి ఆకర్షకముగా నుండగల దని నేను తలచుచున్నాను. మనుష్యునియందు గల దైవత్వమును ప్రకటించుటయే విద్యయొక్క ముఖ్యప్రయోజనము. కళల వలనను, ముఖ్యముగా నాటకప్రదర్శనముల వలనను ఆప్రయోజనము సిద్ధింపగలదు''

## విశ్వరూప సందర్శనము

రావుసాహేబు, మహోపాధ్యాయ, శ్రీ గిడుగు వేంకటరామమూర్తి పంతులు గారికి డబ్బయ్యో పుట్టిన రోజు మహోత్సవంలో వారి మిత్రులూ, అభిమానులూ, శిష్యులూ సమర్పించిన వివిధవిషయిక వ్యాససంగ్రహంలో "శ్రీరామమూర్తికి తొలి జోహారు'' అనే శీర్షికతో వొక వ్యాసం ప్రకటిస్తూ శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు అందులో శ్రీ పంతులుగారి నిలా వర్ణించారు.

"పూలచెండు పడునది శ్రీరామమూర్తి భాషాసేవ మీదనా, శ్రీరామమూర్తిమీదనా?'' అని కాదా తొలి ప్రశ్న? ఒక విధ మైన భాషాసేవయం దీతడు ఒంటరియై యున్నట్లే తక్కిన గుణములందు గూడ నీత డించుమించుగ నొంటరియై యున్నాడు. సాహసము, ఇచ్ఛాశక్తి, దృఢనిశ్చయము, స్వాతంత్ర్యేచ్ఛ, నిరంతర పరిశ్రమ మున్నగు మహాపురుష లక్షణములు కలిసి శ్రీరామమూర్తి అయినవి. ఈత డేగురువు నొద్దను విద్య నభ్యసించలేదు. తనంత దాను చదివి తుదికొమ్మ నెక్కెను. తన భాషాసంస్కరణోద్యమము పెంపొందుటకై నిస్సహాయుడై ఆంధ్రమందును, ఆంగ్లమందును ఈతడు కొంతకాలము పత్రికలు నడిపెను. తొలుత నీతడు సింహనాద మొనరించినపుడు ఆంధ్ర పండితులు గదలు చేబూనిరి. మత సంస్కరణమునకు కందుకూరి పంతులు తొడరినపుడు తోచిన కన్నెఱ్ఱలును వెక్కిరింతలును మూతి విఱుపులును, చేతిదూపులును ఈతనిని గూడ మార్కొనినవి. మార్కొనినపుడు పర్లాకిమిడి రాముడు భార్గవ రాము డాయెను. "హతోస్మి'' యనుట గాని నీరు నవులుట గాని యీతని ప్రకృతికి విరుద్ధము. ఈమహారథుని ప్రోల పలువురు పండితప్రకాండులు జయద్రథు లైరి. రాము బాణము ప్రోల ఖరదూష

ణులు నిలువజాలరైరి. పిడివాదము లీతని వాదమును మార్కొని తుత్తునియలై నేల రాలినవి. శ్రీరామమూర్తి ఆయుధము విజ్ఞానము. ఈవిజ్ఞానమున తళ్కొత్తునవి నిరపాయమైన వజ్రపు మెఱపులు కావు: ప్రతిపక్షిని పీడని వెసూవియస్ జ్వాలలు. సభాంగణమున నీతని యెదుటనిలిచిన పండితుడు ఆంధ్రమండలమున లేడు. ఎదుటివాడెంతదుండగీడయినను ఒక మాఱు చెంపపెట్టు పెట్టినట్లును, వేరొకమారు ముక్కునకు సూటిగా గ్రుద్దినట్లును, ఇంకొకతూరి చింతబరిక చేబూని మీది కురికినట్లును, మరొక్కప్పుడు కత్తిపట్టి చిత్తు చేసినట్లును ఈతడు వాదించును. ఈతని పండ్ల పటపటయందు వాడియైన తర్క మున్నది. ఈతని తీక్ష్ణదృక్కులందు మిరుమిట్లు గొలుపు సారస్వత మున్నది. ఈతని బల్లెంపుటుక్తులయందు కోసైన మీమాంస యున్నది. ఈతని పిడికిలియందు బలమైన ఆత్మవిశ్వాస మున్నది. సభాంగణములందితని యంతరంగమందలి శక్తి ఈతని నీడై చేసిపైచును. ఈతని బ్రహ్మాస్త్రమెట్టు ఎదుటివాని డాలు. చెళ్లపిళ్లకవి నిశితవ్యంగ్య మీడాలు నంటి నిరపాయముగ నెన్నిమాఱులో సభలయందు నిలువగలిగినది. ఈతని చూచి అడలనివారు చెవియొద్ద నీతని "డ్రమ్" చూచి తోక ముడుచుకొని పరారి యగుదురు. సహవాసఫలమున నీతని చెవియంత్రము కూడ చేతనశక్తి నందెను. "నీది తప్పు" అని కొమ్ములు తిరిగిన విద్వాంసులను నిలువం బెట్టి నూబకు బెత్తెడు చూచిన ట్లీతడు పలుమారులు వాకొనెను. "నీదే తప్పు" అని మరల తెరలో గాదు ఎదుట పలికి ఈతని ముందీవఱలో నెవ్వరును నిలువలేదు. ఈతని వాదనయొక్క పోటును, వాక్కుయొక్క ధాటీయును ఎన్నో శల్యాలను చింపి మూటగట్టి మూల నుంచెను. ఎన్నియో కుండలములను అట్టిటు లాడించినవి. గంటలకొలది చదువుట యెట్లితని కలవాటో గంటల కొలది ఉపన్యసించుట ఈతని కట్లే అభ్యాసము. ఈతని చదువుల గదిలో ప్రవేశించి చూతుడు. ప్రపంచము యొక్క యెన్సైక్లోపీడియాలు — ఎన్సైక్లోపీడియాను మించిన ఎన్సైక్లోపీడియాలు అందుండును. ఈతడుత్తరములను గూడ కంఠస్థ మొనరించును. కామా, ఫుల్‌స్టాపుల నైన ఈతడు కదల్పక ఉండడు. తాను వ్రాయు ముఖ్యలేఖలకు నకలు ఫైలు నుంచుకొనును. రాయసంవారి కీతడు ఒకప్పుడు వ్రాసిన ఉత్తరముయొక్క కాపీ నేడును ఈతని షెల్ఫులో నున్నది. ఈతని యుత్తరపుటుత్తులకు గూడ సూది మొన లుండును. ఈతని చదువు ఈతని యింటి వాసములను పెండెములను పట్టి యున్నది. ఈతని దొడ్డిలోని అవుకూడ ఫైలాలజీ సూత్రములతో అంబా అనును. శ్రీరామమూర్తి వంటి భీమకర్ములు ఆంధ్రులందు మిక్కిలి తక్కువగా నున్నారు"

## గురజాడ వాల్మీకి

(రాజమండ్రీలో జరిగిన ఆధునికాంధ్ర కవి పండిత సభలో (౨౯-౧౨-౩౩) గురజాడ అప్పారావు గారి కవిత్వాన్ని గురించి మాట్లాడుతూ ఉభయ భాషా ప్రవీణ ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రిగారు ఇలా చెప్పారు.

తమస ఒడ్డున తాతపాముని జేవురించిన ముఖం నుండి నిజమైన కవిత్వం పుట్టిపడ్డది. Electric shock వంటి అనుభవాఘట్టనం ఏసహృదయుణ్ణి కొట్టి వివశుణ్ణి చేస్తుందో అతని హృదయాన్ని చీల్చుకొని కవిత్వం ఎగసిపడుతుంది. దానికి తగిన భాషా సహకారం దొరికితే అదే స్వాదయోగ్యమయిన కావ్యం అవుతుంది. ఆ కావ్యంలోని ప్రతీ మాటా పఠితను పట్టుకుని అంతరింద్రియాలలో మారుమ్రోగుతుంది.

కామ మోహిత మయిన క్రౌంచద్వంద్వంలో కలిగిన విషమపరిణామం పాపం ఆతపస్విలో అపుకో లేని దురంత వేదనను రేపింది. ఆ ఆవేశంలో వివశుడై నిషాదుణ్ణి చావ మని శపించాడు. ఆ ఆశే

కమే సంస్కృత వాఙ్మయమునకు మేలుబంతి, మొదటి కాణాచి, మహాకావ్యబీజం అయింది.

ముక్కుపచ్చలారని బాలికల దుస్థితిని, విరుచుకొని పడ్డ జీవనభారంతో పుడమి కంటా అంటుకొనిపోయిన అనాథలనూ చూచి వలవల వాపోయి మొరకు మానవుల మీద గుడ్లెర్రజేసినాడు అప్పారావు. ఆ ఎరుపు మంటలో నుంచే కన్యాశుల్కం ధామ్మని పేలింది. ఆధ్వనితో ఆంధ్రదేశం దద్దరిల్లింది. ఈదెబ్బ దేశానికే కాకుండా ఇనపగొలుసులతో కట్టిన తెలుగు సారస్వతంమీద కూడా పడి లింకులను వదులు చేసింది. ఒక్కసారి అందరూ ఆదిక్కుకే చూశారు. అప్పారాయ కవీంద్రుని చేతులలో ముత్యాల సరాలు తళతళ మెరసినవి. ఇవే నవ్యాంధ్ర వాఙ్మయమునకు తలకట్టులు, మేలుబంతులు, విజ్ఞాన కోశములు.

ఈయనతో నవ్యసారస్వతయుగం ప్రారంభమయినది. భిన్నభిన్న ప్రవృత్తులతో పెరిగిపోయిన ప్రబంధవాఙ్మయమునకు నూతనాదర్శములతో తలెత్తిన ఆధునిక కావ్యములకు ఈయన కవిత్వము సీమాచిహ్నము. ఈయన కావ్య వ్యవసాయము చాల క్రొత్త. పెట్టినది కొంచెమయినా తెనుగు పొలాల బంగారపు పంట పండుచున్నది. ఈయన పోకడ చాలా స్వతంత్రమయినది. మొగమాటం లేకుండా అనవలసిన మాట ఘాటుగా అనేస్తాడు. ఈయన హృదయాంతరంలో "లోకమందలి మంచి చెడ్డలు లోకు లెరుగుదురా" అనే ప్రశ్న గిర్రున తిరిగి తిరిగి ఆవిష్టుణ్ణి చేసింది. ఈ Inspiration తోటే కావ్యమంతా ఉట్టిపడింది.

కావ్యమును సున్నితముగా ఎత్తుకొని అక్కడక్కడ అమృతం చిలికిస్తూ నడిపించడంలో అప్పారాయకవి అద్వితీయుడు. పద్యాల్లో చిన్నకథలను తీర్చి చిత్రించడానికి ఈయనే ప్రారంభమంగళదినం తెనుగు సారస్వతానికి. అతీర్పులో కావ్యానికి ఉండవలసిన జీవకళలు, మెరుగువలు, పువ్వులకు మల్లె విరిసికొంటాయి.

ఇంద్రధనస్సువలె ఈమహాకవి సూక్తులు రకరకముల మెరుపులతో మనోజ్ఞముగా ఉంటవి. చూడండి!

"ప్రేలు మబ్బుల అంచు లంటను రగిలె రత్నరుచుల్" అనే మాటలోని వర్ణనానైపుణ్యమూ,

"తాటి వనమున ఆగి చంద్రుడు తాను చెవియొగ్గెన్" అను దానిలోని నూతనోక్తి చాతుర్యమూ,

"మంచి చెడ్డలు మనుజులందున ఎంచి చూడగ రెండె కులములు" అనే మాటలోని మహౌదార్యమూ,

"కత్తి చంపును, మాట వాతలు మాన వేనాడున్" అను దానిలోని తత్వానుభవ కథనమూ ఏ సామాన్యకవికి సాధ్య మవుతుంది?

రాజా రామమోహన రాయలు, వీరేశలింగ విజ్ఞుడు దిక్కులు పిక్కటిల్లే టట్లు కేకపెట్టి చెప్పిన మహాసందేశం గడుసు అప్పారాయకవి ఘాటుగా త్రిమాత్రిలో ముద్రించినాడు— "మనిషి చేసిన రాయి రప్పకి మహిమ కలదని సాగి మొక్కుతు మనుషు లుంటే రాయి రప్పల కన్న కనిష్టం"

అప్పారాయ కవీంద్రుడు రససిద్ధుడు. ఏపాత్రను సృష్టించినా అమరుణ్ణి చేసి వదులుతాడు. ఈయన కలము ఇంద్రజాలపింఛిక. కథను చూపుతుంది కాని చెప్పదు. ఈయన Patent హాస్యం ఎవ్వరికీ సాధ్యమయినది కాదు. ఈయనలో ఇంకో విశేషం. హాస్యం కోసమని ఎట్టి కృతకమయిన వ్రాతా వ్రాయడు. ఒక రచన ముఖ్యముగా సాగుతూ ఉంటే పక్కనుంచి హాస్యం పరిమళిస్తుంది. వేయేల? అసాధారణుడు, నవీనాంధ్ర సారస్వతమునకు శ్రీరాములు చుట్టిన ఆదికవి, అభినవయువకులకు స్వాతంత్ర్యపు టూర్పు పోసిన పరమేష్ఠి" )

## మంత్రోపదేశము

రాజమహేంద్రవరంలో డిసెంబరు 28 తేదీని కూడిన రెండో అభినవాంధ్రకవి పండితసమ్మేళనానికి అధ్య

క్షత వహించిన ఆచార్య, రాయప్రోలు సుబ్బారావుకవిగారు నవకవులకు ఇలా ఉపదేశించారు.

‘అభినవవాఙ్మయమునందు అపభ్రంశము నేయన్వేషించు పండితులను విడువుఁడు. మార్పున కులికిపడు మహనీయుల నుపేక్షింపుఁడు. మార్పు జగల్లక్షణముగానే తోఁచుచున్నది. గృహనిర్మాణము మాఱినది. వేషములు మాఱినవి. పాకములు, రుచులు మాఱినవి. బుద్ధులు మాఱినవి. పఠనపాఠన విధానములు మాఱినవి. జీవితాశయములు మాఱినవి. ఇఁక సాహిత్యము మాఱకుండునా? మాఱకుండఁ గలదా?

వాఙ్మయమునందుఁ దారతమ్యచర్చ తేలని ప్రశ్న. కాళిదాసమహాకవి వాఙ్మయము సర్వాంగసుందరముగ నున్నది. దాని నతిక్రమించిన రచన యింతవఱకును రాలేదు. కాని మిగిలిన కవులు మానివేసిరా? అస్తమించిన సూర్యచంద్రులు తిరిగి ఉదయించుచునే యున్నారు. విడిచిన రాసులలోనికి నక్షత్రములు తిరిగి వచ్చుచునే యున్నవి. ఏఁటేటి కాయేడు తొలకరించుచునే యున్నది. ఎండిన తటాకములు మరల నిండుచునే యున్నవి. ఏళ్లలోని ప్రాతనీరు పెళ్లగా క్రొత్తనీరు తటాయించుచున్నది. క్రొత్తబియ్యములో తీపి యెక్కువ. జున్నుపాలలో జిడ్డు లెస్స. క్రొత్తావకాయలో రుచికాంతులు ప్రాతదానిలో లేవు. కావున క్రొత్తయే లేదనుట ఉత్తవితండవాదము.

తెనుఁగుతోటలో నిపుడొక క్రొత్తపూత పూచుచున్నది. దాని కింత యలజడి యేల? సజీవవనస్పతులు ఋతువు రాగానే పల్లవింపక మానవు. అట్లే సజీవసాహిత్యములును.

ఇది యొక ప్రబలమైన ప్రఘూర్ణసమయము. దేశకాలపాత్ర పరిజ్ఞానము అపారముగా విస్తరించినది. అన్యదేశ జనసంపర్కమధికమైనది. భిన్నభాషా నాగరకములకు సంగమస్థానములు పెక్కులైనవి. అనేక విజ్ఞానవికాసములకు అన్యోన్యసాహచర్యము కుదిరినది. దేశాంతరవస్తుదర్శనమునకు వాణిజ్యము రహదారులు వేసినది. ఈ సంఘర్షణమందు పాదులు కదులును; రంగులు మారును. ఈమార్పే భావకవనమందలి స్వరభేదమునకుఁ గారణము; రూపకల్పనకు లక్ష్యము: రచనకు రీతి.

అప్రుతైన కవిసోదరుల కొక విజ్ఞప్తి. జీవితము క్లిష్టసమస్యలలో నుక్కిరిబిక్కిరి యగుచున్నది. శాస్త్రవిజ్ఞానము మానవసుఖలాలస కెంత యుపకరించెనో దుఃఖభీభత్సమునకును అంతకంటె నధికముగా సహకరించినది. జాతులు అర్థదూషితములైనవి. ఆత్మవిశ్వాసము పరత్రాసమునకు తావిచ్చినది. మతములు మాత్సర్యమునకు మార్గములు తీసినవి. ధర్మసూత్రములు ధనసంచయ రభసమునందు తెగిపోయినవి. బుద్ధికౌశల్యములను యంత్రము లాపోశనము పట్టినవి. ఈ మహాకల్లోలమందు, ఈ విభ్రాంతిలో చైతన్యదీప మాఱిపోకుండ నిలుపవలెను; కర్మయోగము కూలిపోకుండ కాపాడవలెను; విజ్ఞానవీణాతంత్రులు తెగనీయక రక్షింపవలెను. ప్రాణులను పాంచాలికలగా మాఱనీకుఁడు. ఈ మహోద్ధరణము ఆనందోపాసన వలననే సాధ్యము. మీరు ఆనందపుత్రులు. సౌందర్యమన్నను, రసమన్నను, ఆనందమన్నను మనకు ఏకావరణ జన్యములే. మీరు ఆనందగీతములే పాడుఁడు. ఆనందసూత్రములనే అల్లుఁడు. ఆనందమూర్తినే చిత్రింపుఁడు. స్వచ్ఛందముగా పాడుఁడు. సుఖముగా నల్లుఁడు. సర్వతోముఖముగా చిత్రింపుఁడు’’

## ఇప్పటికీ అనాఘ్రాతమే

పాటిబండ మాధవశర్మగారు ఈనెల భారతిలో “ప్రబంధయుగము” అనే శీర్షికతో ఒకవ్యాసం ప్రకటిస్తూ నవకవులకు ఉపాదేయమైన వస్తువు నిలా నిరూపిస్తున్నారు.

“శ్రీకృష్ణదేవరాయలు దేశదేశములను జయించినాఁడు. ఆంధ్రదేశమును సుభిక్షముగా నేలించినాఁడు. రాజకీయముగను, సాంఘికముగను దేశమునకు కీర్తి

కల్లోలములు లేవు. ఓడిపోయిన రాజుల కూఁతుం డ్రకు జయలక్ష్మీ వేషము వైచి క్రీడించిన రాయలు రసిక ప్రభువు. 'యథా రాజా తథా ప్రజా' అని రాజుతో పాటు సామంతులు, మంత్రులు, ప్రజలు అందఱును కేవలము విలాసప్రియులై యుం డిరి. ఆనాటి విజయనగరములోని వారవనితా జనమే దీనికి ప్రబలసాక్ష్యము. ఇట్టి తరుణమున నుద్భవించిన రచనావిశేషము ప్రబంధము. పురాణ కవిత్వపు నీతులతో విసివిన ప్రజలు కవితాపద్ధతిలో మార్పునకై తహతహపడిరి. ఈతృష్ణకు ఫలితముగా పెద్దన్న గారి మనుచరిత్ర పుట్టినది.

(ఇట్లు విలాసార్థము పుట్టిన రచనావిశేష మగుటయు, రాజులు, కవులు, ప్రజలు భోగపరాయణు లగుటయుఁ గారణములుగా ప్రబంధము శృంగార రసప్రధాన మైనది. పెద్దన్న ప్రబంధమునందు శృంగారము అంగి యగుటకు కేవలము కాలమహత్త్వమే కారణ మైనను రానురా నది యొక మార్గాచారమై ప్రబంధము లన్నియు శృంగారరస ప్రధానములే యగుట తటస్థించినది. ఈశృంగారము గూడ రానురాను సభ్యతను విడిచి మోటుదేరినది.)

(వేదఋషులు యోగసమాధిలో ఆనంద స్వరూపమగు బ్రహ్మమును దర్శించి కవిత్వము చెప్పిరి. అట్టి ఋషుల వాక్యములు ప్రేరేచి పురాణకవులు కవిత్వము చెప్పిరి; కాని ప్రబంధకవికి పద్యము రావలయు నన్నచో "నిరుప హతిస్థలంబు, రమణీ ప్రియదూతిక తెచ్చి యిచ్చు కప్పురవిడెము, ఆత్మ కింపయిన భోజనము, ఉయ్యెల మంచము" నుండ వలయును.) ఇంత వ్యయమున కోర్చి రాయలవంటి రసిక ప్రభువు పోషించుట చేతనే పెద్దన్నవంటి కవి మనుచరిత్ర వంటి గ్రంథమును వ్రాసినాఁడు. రాయలు రసతృష్ణతో కవులను పోషించినాడు. కనుకనే నాఁటి కావ్యములును రసమహితములు గనే యున్నవి. తరువాత ఆస్థానములకు వారకాంతలు, కొజ్జాలు అలంకారము లైనట్లే కవులును అలంకారము లైనారు. వారి గ్రంథములును అట్టివయైనవి.

(నేఁటి కవికి తన స్థితియే కావ్యరచనకు ప్రేరకమగుచున్నది. అనగా నీతని యభిరుచి,ఆవేశము ఆత్మాశ్రయములే ; కాని పరప్రేరితములుకావు.)

(ప్రబంధములు కేవలము బుద్ధిప్రేరితములు— అనఁగా మెదడునుండి పుట్టినవి. మానవహృదయముతో వాని కంతగా సంబంధము లేదు. ఇవి పఠితకు బుద్ధిగ్రాహ్యములే. హృదయమును తాకు శక్తి ప్రబంధములకు లేదు. అనగాఁ ప్రబంధములోని పాత్రములతో పఠితకు సహానుభూతి కలుగుట లేదు. మఱియు నలంకారములలోఁ జాల భాగము ఊహాప్రేరితములు. అట్టి యలంకార ప్రధానము లగు ప్రబంధములు పఠితకు ఊహాగ్రాహ్యములే యగుచున్నవి. ఉత్ప్రేక్షాద్యలంకారములు, శ్లేషాదిపద బంధ చాతుర్యములు, యమకాది శబ్దాలంకారములు ప్రబంధమునకు ముఖ్యలక్షణములు. ఇవి న్నియు కవిత్వమునకు బాహ్యరూపమే ; కాని రానురాను ఇవి తప్ప కవిత్వమే లేదను స్థితి వచ్చినది.

పురాణములలోని వస్తుప్రధానత్వమును వదలించుకొనుటలో ప్రబంధములు కొంత యభివృద్ధి గాంచినట్లే తోచినను ప్రకృతిని వ్యాఖ్యానము చేయుటలోఁ గొంత కొఱవడిన వనియే చెప్పవలయును.

వేదములు భగవంతునకు మానవునకుఁ గల సంబంధమును నిర్ణయించినవి. పురాణములు మానవునకు మానవునకుఁ గల సంబంధమును బోధించినవి. ప్రబంధములు ప్రకృతిని వర్ణించినవి ; గాని ప్రకృతికిని మానవునకును గల సంబంధమును నిర్ణయింపఁజాలక పోయినవి. ఈ యుత్కృష్ట విషయము అధునాతన కవిత్వమున కింకను మిగిలియే యున్నది" )



# వ్యాఖ్యానములు

## అభినవాంధ్రకవిపండితసమ్మేళనం

"నేటి కుమారకవిసింహుల కర్తవ్యం యేమిటి ?"

ఇది వొక విలక్షణమైన ప్రశ్న. లోకసామాన్యం కాదు. ఇతర్లకి దీనితో పని లేదు. ఇతర్లకిది తోచనే తోచదు. సృష్టిస్థితి సంహారాలకి అధికారులైన కవులకే యిది అన్వయిస్తుంది. ఇది కవులకే తోస్తుంది. విశ్వమోహనగానం ఆలాపించే కవిచక్రవర్తుల హృదయవిపంచీలోల తంత్రుల్లోనే యీ మంజులనాదం ఉత్పత్తిల్లుతుంది. ఏమంటే ? కవే విశ్వానికి ఉపదేష్ట. మార్గదర్శి. మేలుకొలుపులు పాడే వంది. నవశక్తి సంఘటించే అమృతహస్తుడు.

కవికి ప్రబోధం చెయ్యతగ్గ ప్రాణి ప్రపంచంలో యింతవరకూ పుట్టలేదు.

అయితే: చాలా కాలం కిందటే తెనుగుకవి తన కర్తవ్యాన్ని మరిచిపోయాడు. తన తాహతు విస్మరించాడు. తన పదవి కోలుపోయాడు. తన శక్తిని, తన సత్తాని దుర్వినియోగపరుచుకున్నాడు. తన ప్రాప్యంనుంచి విచ్యుతుడైపోయాడు పర్వతశిఖరంమీదనుంచి అమాంతంగా లోయలో కూలిపోయాడు.

కారణం? ప్రధానమైనది దేశీయుల దౌర్భాగ్యం. దేశీయుల అభిరుచులు అసభ్యమార్గాలు పట్టాయి. హైందవప్రభువులు కవిత్వాన్ని తమ తుచ్ఛసుఖాభిలాషకి ఉద్రేకం పుట్టించే మత్తుపదార్థంగా వుపయోగించుకున్నారు. కవి సువర్ణముగ్ధుడై తన శీలాన్ని అమ్ముకుని లోకాన్ని శాసించే తన ప్రభుశక్తిని బురదలో పూరతొక్కుకున్నాడు.

జాతి మరింత అడుగున పడిపోయింది. ఇంతే కాదు. ఈ స్థితి మనకి చిరకాలం అనుభూతమయి పోయింది.

ఈస్థితిలో మనకి ఆంగ్లసంపర్కం కలిగింది. మంత్రించినట్టు జాతి కళ్లు తెరిచింది. సర్వతోముఖమైన ఆంగ్లసంపర్కంవల్ల కొన్ని కష్టాలూ, కొన్ని నష్టాలూ కలిగినా దేశానికి అపారమైన ప్రబోధం కలిగింది. మన స్థితీ, మన గతీ, మన మతీ బోధపడ్డాయి.

కవికి కశాఘాతం తగిలింది.

"నాబతుకు ఇంతేనా ?" అని జాతికి ఆవేదన కలిగింది.

తన యింటో కూచుని ఆంగ్లవాఙ్మయం చదువుకునే ఆంధ్రుడు మారాడు. ఇది యిలా వుండగా, ఆంగ్లేయపత్రికలు వచ్చి ప్రపంచాన్నంతా చక్కగా విప్పి చెప్పాయి. సినిమాలు వచ్చి పాశ్చాత్యుల ప్రవృత్తీ, పదవీ, స్థితీ, ఉత్సాహమూ, శౌర్యమూ ధైర్యమూ, సాహసమూ, ఆశలూ, అభిరుచులూ, అనుభవాలూ, ఆంధ్రుడికి తన యింటోనే చూపించాయి. ఆపైని ఆంధ్రుడు ఖండాంతరయాత్ర చేసి ప్రపంచంయొక్క వర్తమానపరిస్థితులు అవగాహనం చేసుకున్నాడు.

దీనితో ఆ ఆవేదన మరింత పెరిగిపోయింది.

ఈ ఆవేదన తెనుగుకవికి ఉద్రేకం కలిగించింది.

అతను సంఘమూ, దేశమూ తన అమృతవాక్కుకోసం యెదురుచూస్తూ వుండడం గ్రహించాడు. రుద్ధమైపోయి వున్న అతని కంఠం ముక్తమయింది.

ఇంకేమీ ?

శ్రుతి కలిసింది. స్థాయి కుదిరింది. అయితే యేమిటి గానం చెయ్యడం? జనసామాన్యం యొక్క భాషలో యిదే "నేటి కుమారకవిసింహుల కర్తవ్యం యేమిటి ?"

ఈ ఆశంకతోటే అభినవాంధ్రకవిపండితులు మొన్నటి డిసెంబరు 28వ తేదీని రాజమహేంద్ర

వరంలో రెండో సారి సమావేశం అయినారు. ఆచార్య, రాయప్రోలు సుబ్బారావుకవి కులపతియై అపూర్వఫణితిలో మంత్రోపదేశం చేశారు.

ఏకఫలాపేక్షతో, ఏకదీక్షతో, ఏకవేదికమీద ఆసీనులై వున్న కవికుమారుల ముఖ బింబాలనుంచి వెల్లివిరిసిన దివ్యతేజస్సువల్ల ఆకాశమూ దిక్కూలూ ధగద్ధగితాలైపోయినాయి.

కాని—

కాని—

వచ్చిన పని—కూడిన కారణం—తేల్చుకోవలసిన ప్రశ్న అందరూ మరిచేపోయారు.

## అశ్రుబిందువులు

ఈనెల 16వ తేదీ రాత్రి చల్లా శేషగిరిరావుగారు పరమపదించారు. ఆంధ్రపత్రిక కిది వొక పెద్దదెబ్బ. ఆంధ్రసంపాదకలోకానికి తీరని లోటు. శేషగిరిరావుగారి కుటుంబానికి కడుపుకోత. మిత్రవర్గానికి పిడుగుపాటు.

ఆంధ్రపాఠకుల్లో శేషగిరిరావుగారి అకాలమృతికి వగవనివారు లేరు.

ఆంధ్రపత్రిక జాతి కంతకీ ఏకైకదినపత్రిక. అధిపతి నాగేశ్వరరావుగారు చేతి కెముక లేని త్యాగి. సంపాదకులు శేషగిరిరావుగారు పట్టభద్రులు. కొన్నాళ్లు న్యాయవాది. ఉత్తమశ్రేణికి చెందిన దేశభక్తులు. దేశంయొక్క అవసరాలు కూడా అనంతాలు. సన్నివేశాలన్నీ చక్కగా కుదిరాయి. కాని అకాలమృత్యువు శేషగిరిరావుగారిని కబళించివేసింది.

పదహారు సంవత్సరాలు వొకరి చేతికింద ఏక టాకీని పనిచెయ్యడం అంటే మాటలు కాదు. అందులోనూ వందలమీద వున్న అనుచరులతోటీ, సహచరులతోటీ కలిసిమెలిసి, పొరపొచ్చాలు లేకుండా వుండడం నిజంగా అసాధ్యమైన విషయం. కాని శేషగిరిరావుగారు ఏ విషయంలోనూ వేలు పెట్టి చూపించుకోలేదు.

శేషగిరిరావుగారు ఆంధ్రపత్రికను నమ్మారు. ఆంధ్రపత్రికను పూజించారు. ఆంధ్రపత్రికలో లీనమైపోయారు. తద్వారా వారు పరమేశ్వరునిలో మిళితం అయిపోయారు.

అయినా కళ్లలోనుంచి అశ్రుబిందువులు రాలుతున్నాయి. మానవహృదయం మోహాన్ని చూసి తృప్తిపడలేదు. ఇలాంటి ఆఘాతాలు తగిలినప్పుడు అది కరగకుండా, ద్రవించకుండా వుండలేదు.

ఈ దుఃఖసమయంలో మేము శేషగిరిరావుగారి కుటుంబానికి మా సానుభూతిని విన్నవించుకొంటున్నాము.

## ఆంధ్రగ్రంథాలయ మహాసభ

పదహారో ఆంధ్రగ్రంథాలయసభ కాకినాడలో వేమవరపు రామదాసుపంతులుగారి యాజమాన్యం కింద జరిగింది. ఈ మాటు కార్యక్రమంలో కొంత మార్పు కనపడింది. పెద్దపెద్ద సంఘాలేర్పడ్డాయి. పని యెలా జరుగుతుంతో చూడవలసి వుంది.

యువకులు మళ్ళీ గ్రంథాలయోద్యమంలో ప్రవేశించడం సంతోషింపతగ్గ విషయం. ఈ అసహాయస్థితిలో మనం సంఘపరంగా చెయ్యవలసిన పని అపారంగా వుంది. జనసామాన్యంలో విద్యా, విజ్ఞానమూ వ్యాపించకుండా యెన్నిరెలాంటి అభూతకల్పనలు చేసినా ప్రయోజనం వుండదు. అమాయకులైన ఆంధ్రులు ఉద్రేకం కలిగిస్తే అగ్గిలోనేనా వురుకుతారు; కాని ఆ సాహసానికీ, ధైర్యానికీ పునాదిగా సదసద్విచారశక్తి వుంటే గాని త్యాగం అంతా బూడిదలో పోసిన పన్నీరయిపోతుంది.

పల్లెటూళ్ళలో నవీనవిజ్ఞానం వ్యాపింపచెయ్యాలంటే గ్రంథాలయాలకు గల అవకాశాలు మరే సంస్థలకూ లేవు. గ్రంథాలయనిర్వాహకు లీ విషయం గమనించి, తమ ధర్మాలనుగూడా గుర్తించి మసులుకోవలసి వుంది.

కాని రామదాసుపంతుగారి వుపన్యాసం శాసనసభలో వున్న గ్రంథాలయాలబిల్లు విమర్శించడం

తోనే సరిపోయింది. సమర్థులైన పంతులుగారు ఈ యొక్క విషయానికే యింత ప్రాముఖ్యం యివ్వడంలో ఔచిత్యం లేదు. ప్రజలు చూపవలసిన పురుషకారం అపరిమితంగా వుంది. గ్రంథాలయ నిర్వాహకులు నెరవేర్చవలసిన కార్యక్రమంకూడా సముద్రం అంత వుంది. ప్రభుత్వపక్షంగా గ్రంథాలయాలను కలిగే పుష్టి చాలా తక్కువ. గ్రంథాలయనిర్వాహకులకు అలసత పోయి ఏకాగ్రతా, ఏక దీక్షా కలిగేటట్టు వారు ప్రోత్సాహపరుస్తారని నిరీక్షించినవారికి ఆశాభంగమైనది.

అయ్యంకి వేంకటరమణయ్యగారికి మా ప్రశంసలు విన్నవిస్తున్నాము. గ్రంథాలయోద్యమంలోనే వారికి జీవితసాఫల్యం వుంది. మధ్యమధ్య పక్కలకి తప్పుకున్నారా?—ఎందుకూ పదేపదే చెప్పడం?

## కొత్త అధ్యాయం

రెండో వాగనుశాసనులైన రావుసాహెబు గిడుగు వేంకటరామమూర్తి పంతులుగారికి సమగ్రమైన ఆంధ్రజాతి తనతాహతుకు చాలనిదైనా సన్మానం చెయ్యడంతో ఆంధ్రవాఙ్మయచరిత్రలో వొక కొత్త అధ్యాయం ప్రారంభమయింది. తెనుగుభాషవిషయంలో తమ రక్తం అంతా ధారపోసిన ఆధునికాంధ్రులు కైలాసవాసి కందుకూరి వీరేశలింగం పంతులుగారూ, బ్రహ్మశ్రీ గిడుగు రామమూర్తిపంతులుగారూ—ఈ ఇద్దరే కనపడుతున్నారు. అయితే వీరేశలింగంపంతులుగారిని మనం సత్కరించలేకపోయాం. ఇప్పుడు రామమూర్తిపంతులుగారినైనా సత్కరించడం మనం మన విధులను గుర్తించుకుంటున్నామనడానికి గొప్ప చిహ్నంగా వుంది.

రామమూర్తిపంతులుగారి పదవి యిప్పట్లో యెవరూ సాధించుకోలేనిది. భాషయొక్క పుట్టుపూర్వోత్తరాలన్నీ అంత క్షుణ్ణంగా తెలిసినవారెవరూ లేరు; కాని వారు వృద్ధులైనారు. మొన్ననే డబ్బయి వొకటో సంవత్సరం ఆరంభమయింది. వారీ వయస్సులో కూడా షష్టిగడియలూ భాషాసేవ చేస్తూ వుండడం నిజంగా మనం గర్వించతగ్గవిషయం. మంచివయస్సులో వుండికూడా మనం వారు చూపుతూవున్న శ్రద్ధాసక్తుల్లో లక్షాంశమైనా చూపలేకుండా వుండడం మనం సిగ్గుపడవలసిన విషయం కూడానూ.

ఏతావతా: రామమూర్తిపంతులుగారే చెయ్యవలసిన పనులు రెండు మూడు ఉన్నాయి. వారిచేత అవి చేయించుకోలేకపోయామా, తరవాత మనం దిక్కులు చూడవలసిందే. సమగ్రమైన నిఘంటువూ, ఇప్పటిమట్టుకు సమగ్రమైన వ్యాకరణమూ—ఈ రెండుపనులూ చెయ్యడానికి వారికి తప్ప మరెవ్వరికీ అర్హత లేదు.

నిజానికి మనం బీదవాళ్లమే; కాని మన డబ్బు ఖండాంతరాలతో బాటు ఇతరప్రాంతాలకు కూడా చాలా వెళ్లిపోతోంది. మన డబ్బు మన ప్రత్యేకోన్నతిసాధనాలకేమీ వినియోగపడడం లేదు. ఈ విషయంలో మనలాగ యితరెవరూ మనకేసి చూడరు. కనక వెంటనే శ్రద్ధపట్టి తగినంత ధనం కూడబెట్టి రామమూర్తిపంతులుగారి విజ్ఞానానికి మనం గ్రంథరూపం కలిగించుకోవడం చాలా అవసరం.

రామమూర్తి పంతులుగారికి మా వినయవిధేయతలను విన్నవించుకొంటున్నాము. మా లేఖినికి స్వాతంత్ర్యమూ, నిరాఘాట ప్రచారమూ కలిగించిన మహానుభావులు వారు. మరిన్ని కృతకభాషలో పడి కూరుకుపోవలసిన మెరికల్లాంటి అనేకాంధ్రయువకులకు ఆధునికాంధ్ర వాఙ్మయక్షేత్రంలో అనన్యసామాన్యమైన పదవులను కలిగించినవారు వారు. వాస్తవంగా వారి ప్రతిభ వాఙ్మయనిర్మాతలను తయారు చెయ్యడంలోనే వినియోగపడింది.

రామమూర్తి పంతులుగారు నన్నయ్య తిక్కన సోమయాజులుగార్లతో సమానమైన పండితులు. భాషకి అంత సేవ చేశారు. తమ జీవితాన్ని అంతగానూ సార్థకపరుచుకున్నారు. భాషని శాసించే యోగ్యత అప్పుడు ఆ ఆదికవుల కిద్దరికే వుంది.

ఇప్పుడు ఈ రామమూర్తి పంతులుగారి కొక్కరికే వుంది.

శివశంకర శాస్త్రిగారు, రామమూర్తి పంతులుగారు యింకా పదకొండు సంవత్సరాలు నిరాఘాటంగా భాషాపరిపాలనం చేస్తారని చెప్పారు. మన అలసత యెదట పదకొండేళ్లు పదకొండు మాసాలను పోలవు. అయినా మాకు చాలా ధైర్యం కలుగుతోంది. రామమూర్తి పంతులుగారి చల్లని చూపు ఇంకా చాలా రోజులు యువకవులకు నవశక్తి సంఘటిస్తూ వుంటుంది.

## భోగమా? ఇప్పుడా?

"కవిత్వం వల్ల కలిగే ప్రయోజనం యేమిటి?"

దీనికి జవాబు దేశమూ, జాతీ, భాషా వీటి స్థితిని పట్టి వుంటుంది. రసగంగాధరమో, సాహిత్యదర్పణమో, ప్రతాపరుద్రీయమో విప్పి "యిదిగో మన పెద్దలిలా చెప్పా" రంటే ప్రయోజనం లేదు. ఆమహాగ్రంథాలు పుట్టినప్పుడున్న దేశస్థితి వేరు. ఇప్పటి స్థితి వేరు.

స్త్రీ సుకుమారురాలే. సుఖమూ, ఆనందమూ కావాలంటే పురుషుడికి స్త్రీ సహకారం కావలసిందే? కాని ఆమె యెప్పుడూ ప్రియురాలై అంతఃపురంలోనే వుండిపోడానికి వీలు లేదు. ఆమె తల్లి అయి బిడ్డల జీవితాలు సంస్కరించాలి; క్షమావతి అయి గృహకృత్యాలు నిర్వహించాలి. తంత్రజ్ఞురాలయి సంసారంలో వచ్చిన వడిదుడుకులు దిద్దాలి. శక్తిస్వరూపిణియై భగ్నాశుడైన పురుషుడికి నవశక్తి కలిగించి మళ్లీ కార్యరంగంలోకి వురికించాలి. కాళికామూర్తి అయి ఖడ్గం చేతపట్టి యుద్ధరంగంలోకి దూకాలి. ఇంకా యిలాంటి మహాకార్యా లెన్నో నిర్వహించాలి.

ఇలాంటి విధులతో పాటు ఆమె విలాసవతిగా వుండవలసిన ఘట్టాలు కూడా చాలానే వున్నాయి.

కవిత్వం కూడా స్త్రీ వంటిదే.

ఆంధ్రకవిత్వచరిత్రలో కూడా ఇలాంటి భిన్న సన్నివేశా లున్నాయి. కడుపులో చల్ల కదలని స్థితిలో నన్నయ్య ధర్మనిర్వచనానికి పూనుకున్నాడు. అంతఃకలహాలు ప్రారంభమైన స్థితిలో తిక్కన్న రాజ్యతంత్రాన్ని నిర్వహించాడు. మన శౌర్యం శాత్రవదావాగ్నిని చల్లార్చి విజయపరంపరలను చేకూర్చినప్పుడు శ్రీనాథుడు, పెద్దన్న, తిమ్మన్న, సూరన్న మొదలైనవారు లీలావిలాసాలు ప్రదర్శించారు.

అంతే.

మన కవిత్వం సద్వినియోగం అయిందంత వరకే.

తరవాత మనవాళ్లు పతితులైపోయారు. కవిత్వాన్ని దుర్వినియోగం చేసి జీవచ్ఛవాలు అయిపోయారు. రానురాను కవిత్వంయొక్క శక్తినీ, ప్రయోజనాన్నీ కూడా మరిచిపోయి తిట్లలోకి దింపేశారు.

మనం యిప్పుడు తెరపిమరపుల మధ్య వున్నాము. కళ్లు విప్పాము; కాని మైకం యింకా వదలలేదు.

కవిత్వం యీ మైకాన్ని వదలగొట్టగలదు. మళ్లీ మన రక్తాన్ని వుడుకెత్తించగలదు. మనకి మళ్లీ ప్రశంసింపతగ్గ సభ్యత చేకూర్చగలదు. ఆంధ్రుడంటే భారతదేశంలో—పూర్వ పశ్చిమగోళాల్లో ఉన్నతాసనాన్ని సిద్ధంచేసి వుంచగలదు.

అంటే?

భారం అంతా యిప్పుడు ఆంధ్రకవిది. ఆంధ్రకవికి ఇనప్పెట్టెలు తెరుచుకుని కూచోవలసిన కాలం కాదిది. చందనచర్చకోసం ఎదురొమ్ము విరుచుకోవలసిన రోజులు కావివి. పుష్పహారాలకోసం మెడ వంచవలసిన దినాలు కావివి. శాలువులకోసం బుజాలు ఎగరవెయ్యవలసిన సమయం కాదిది. విలాసినీ విభ్రమాలు తలుచుకుని కులుకుతూ కూచోవలసిన సందర్భం కాదిది. ఇసకతిప్పలమీద కూచుని కోకిలగానాలు వినిపించవలసిన వేళ కాదిది.

ఆంధ్రకవి యిప్పుడు తన రక్తమాంసాలు వోడ్చి ఘంటాపథాన్ని నిర్మించాలి.

స్వస్వరూపజ్ఞానం కలిగించి. గమ్యస్థానం నిర్దేశించి, ప్రాప్యాన్ని బోధించి జాతి నంతని ఆఘంటాపథం మీద నడిపించాలి.

ఏం చేస్తే, ఎలా చేస్తే, ఎంత చేస్తే ఈ ఉత్కృష్ట ఫలం లభిస్తుందో అది, అలాగ, అంతవరకూ చెయ్యాలి.

ఈజ్ఞానం కలగనంతసేపూ—ఈ పని చెయ్యనంత వరకూ ఆంధ్రకవికి ప్రశంస దాకా యెందుకూ? గతి కూడా లేదు.

## ఆంధ్రుని స్వదేశీ

స్వదేశీ అంటే ఆంధ్రుడు ఎగిరి గంతు వేస్తాడు. పాటలు పాడతాడు. ఉపన్యాసాలు చేస్తాడు. పత్రికలు ప్రకటిస్తాడు. ప్రదర్శనాలు ఏర్పాటు చేస్తాడు. కొంటాడు. వాడు కుంటాడు.

అంతే.

అంతటితో ఆంధ్రుడు తనకి తానే ధన్యవాదాలు చెప్పుకుంటాడు. మురిసిపోతాడు.

కాని దేశీయపరిశ్రమలు వొక్క ఆంధ్రదేశంలోనే అడుగంటిపోలేదు. విదేశాలనుంచి వచ్చే దిగుమతులవల్ల వొక్క ఆంధ్రదేశం మట్టుకే నష్టపడడం లేదు. ఈ విషయంలో హిందూదేశం అంతా వొక్క విధంగానే అటమటించిపోతోంది. అన్ని ప్రాంతాలవారూ వొక్క మోస్తరుగానే యిబ్బంది పడుతున్నారు.

అయితే యితర ప్రాంతాలవారు పరిశ్రమలు సొంతంగా సాగించుకొంటున్నారు. వాట్లని ప్రోత్సహించుకొంటున్నారు. ఆంధ్రుడలా కాదు. తాను పరిశ్రమలు సాగించడం లేదు. కాని ఇతర ప్రాంతాలవారి వస్తువులతో తన యిల్లూ వాకిలీ నింపేసుకుంటున్నాడు.

ఇప్పటిదాకా ఆంధ్రుడి ప్రవృత్తి యిలాగే వుండిపోయింది.

కాని యిప్పు డిప్పుడు ఆంధ్రుడు కళ్లు తెరుస్తున్నాడు. చిన్నచిన్న పరిశ్రమలు ప్రారంభించాడు. తప్పటడుగులు వేస్తున్నాడు.

ఈచిన్న పరిశ్రమల్లో రాజమహేంద్రవరంలోని అజంతాకంపెనీవారు ప్రారంభించిన కొమ్ము దువ్వెనల పరిశ్రమ ఆశాజనకంగా వుంది.

అజంతా కంపెనీవారు తయారు చేయిస్తూవున్న దువ్వెనలకు వాడే కొమ్ము ఆంధ్రదేశంలో దొరికిందే. పనివాళ్లు ఆంధ్రులే. పెట్టుబడి ఆంధ్రులదే. లాభం అంటూ వస్తే అది కూడా ఆంధ్రులే అనుభవిస్తారు.

ఈవిధంగా ఆజంతాకంపెనీవారి కొమ్ము దువ్వెనలు సర్వవిధాలా అచ్చతెనుగువి. ఆంధ్రులకు ఇంతకంటే నికరమైన తెనుగు సరుకు ప్రస్తుతం మరివొకటి లేదు.

తల దువ్వుకొనే దువ్వెనలు ఖండాంతరాలనుంచే కాదు, ఇతర ప్రాంతాలనుంచి తెప్పించుకోడం కూడా మనకి సిగ్గుచేటు. ఇలాంటి చిన్న విషయాలు కూడా మనం మరిచిపోతే వాస్తవంగా మనకంటే ఆత్మగౌరవహీనులు మరివొకరుండరు.

అజంతాకంపెనీవారి కొమ్ముదువ్వెనలు తెనుగు సరుకు కావడంచేత మాత్రమే మేము ప్రశంసించడం లేదు. మన్నిక, చౌక, పనితనము, చక్కదనము ఆపైని తెనుగు తనము, ఇన్నీ కలిసిన వస్తువు లవి. వాస్తవంగా ఆంధ్రుడి పనివానితనానికి అవి బలమైన సాక్ష్యం చెబుతున్నాయి.

మా తెనుగుసోదరులు, మనవారు ఇంకా ఇలాంటివి చిన్నవీ పెద్దవీ కూడా పరిశ్రమలు వెంటనే ప్రారంభించేటట్టు ప్రోత్సాహం చూపకోరుతున్నాము.

౨౦

“వెనుక నాలు గేడుల పాటు (నాలుగు సంపుటములు) ప్రకటితమయి ౧౯౨౮వ సంవత్సరమున ఆగిపోయిన ‘ప్రబుద్ధాంధ్ర’ (అయిదవ సంపుటము తొలి సంచిక) కడచిన జనవరి నెలలో మరల వెలువడినది. ఈపత్రిక కప్పుడును ఇప్పుడును సంపాదకులు శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు జగ మెరిగిన బ్రాహ్మణులు; ‘సాతంత్ర్యాన్ని అమ్ముకొనని’, ‘అంతరాత్మను చంపుకొనని’, ‘స్వధర్మాన్ని విడిచిపెట్టని’, ‘సాధనమునుండి విముక్తుడు కాని’, ‘ప్రాప్యమునుండి తప్పిపోవని’ సంపాదకుడు కాదగిన లక్షణములు కలవారు. వివేకము, ప్రతిభ, ధైర్యము వీరి కుగ్గుపెట్టినవి. పలుకుబడి బాగును, కూరుపు నేరుపును, కల అందమును, అర్థము సామర్థ్యమును చవిగొనినది వీరి లేఖిని. ఇట్టి సంపాదకుని సంపాదకత్వమున “ఆంధ్రవికాసమే ప్రాప్యం”గా గల ప్రబుద్ధాంధ్ర తన “కార్యక్షేత్ర” మగు “నాంధ్రదేశమున” కెంత యైన మేలు నొనరింపవచ్చు నని తలచుట పొరపాటు కాదు”

“ఈసారి యీపత్రికలో” వీరు “పద్యాలు ప్రకటించ తలుచుకోలేదు” “ఇపుడు” “జనసామాన్యంలో” “విద్య” “విజ్ఞానం” “వ్యాపించు”టకు “చాలా అవసరం”గా ఉన్న “వచన వాఙ్మయం” ప్రకటింపబూనినారు. ఇది చాల మంచి పని”

“అక్షరాస్య మగు నభినవాంధ్రలోకమున ననేకులు పద్యముల నల్లుచున్నారు. వానిలో భావములు, పోకడలు సంస్కృతము ఇంగ్లీషు, బెంగాలీ, హిందీ వాఙ్మయములను తిరిప మెత్తి దొంగిలి తెచ్చుకొనినవి. పదములు సంస్కృతసముద్రపు టంచుల నేరికొనిన గుల్లలు. (ఈ విషయమున యిప్పటివారిలో పెక్కురకంటె వెనుకటివారే మే లనిపించుచున్నారు) వానిలో తెనుగుదనము సున్న. కొన్నిటికి రూపములు మొదలు కొనలేరుపడని మొండెములు. అందు కవిత్వము కొనరాదు; ‘కల’ కల్ల, నేడు పుట్టగొడుగుల వలె పుట్టుచున్న పద్యములలో నూట తొంబది తొమ్మిదిటి గతి యిట్టు లున్నది. ఆంధ్రకవితాలత కవి వేరు పురుగులు. వానిని ప్రకటింపకుండుటయే వాఙ్మయమునకు మహోపకారము”

“గణయతిప్రాసముల దగులబడిన చెత్తపదముల ప్రోవులే ‘కల’ యనియు, వానిని ప్రకటింపక పోవుటచే నది రూపుమాసి పోవు ననియు దురపిల్లువారు కలయొక్క స్వరూపమునే యెరుగనివారు. మానవుని సుఖమయజీవితమున కుపయోగించు విజ్ఞానమంతయు కలామయమే. సంస్కారానుగుణముగ దాని స్వరూపమును తత్త్వమును ధీమంతులు తెలియగలుగుదురు”

“ఈ సంచికకు వ్యాసములు వ్రాసిన వారిలో ఆనేకులు తెనుగు సారస్వత ప్రపంచమున పేరు మోసిన పెద్దలు. వ్యాసములలో ‘శ్రీరంగరాజు చరిత్ర’ అనునది వీరేశలింగముపంతులుగారి గుట్టును బయటపెట్టునది. శకపురుషుడుగ నారాధింపబడుచున్న పంతులుగారే గ్రంథాపహారదోషమునకు పాలయిరి! ఆంధ్రజాతిని వెన్నంటిన గుణ మది!!! మొట్టమొదటి నవల వీరేశలింగముగారిదే యని నమ్మియున్న యాంధ్రలోకమునకు తత్పూర్వమే ముద్రిత మయిన ‘శ్రీరంగరాజు చరిత’ మను నీనవల చరిత్ర మొక నూతన విషయము. ‘ఉత్తరరామ చరితము’ వెక్కిరింపు విమర్శనము. దీని విషయము మూలానువాదముల తారతమ్యము కాదు; అనువాద గ్రంథము భాష. అనువాదకులు గ్రాంథికాంధ్రమునకు పట్టుగంబము; విమర్శకులు గొడ్డలిపెట్టు. ఇద్దరు పెద్దరికము పేరిమికి మరియు వారే. ఇక విమర్శ సొగసు ఊహాతీతము కాదు. అనువాదకుల గ్రాంథికాంధ్రము సౌష్ఠవము జారిన దని వెక్కిరించిన విమర్శకుల వ్యావహారాంధ్రము సయితము ఒక తీరు, ఒక తెన్ను లేక తన సౌష్ఠవమును జార్చుకొన్నది. ఇది ‘సశేషము’ వ్యాసము. ఇంత చిన్న

పత్రికలలో ఇట్టి వ్యాసములను, అపయి 'సశేషము' లను ప్రకటించుట ఉచితము కాదు. 'ఈమాట నిజం' అను వ్యాసము భావగర్భముగా నున్నది. ఇది బుద్ధికి పనిని గల్పించును. ఇందు నేటి పద్యముల ననేక సహస్రముల కలికమున కయిన దొరకని 'కల' ఎక్కువ కలదు, తెలిసికోగలవారుండి చో. "జాగ్రత్తపడవలసిన ఘట్టాలు" 'ఇవి మూడు' ఇట్టి 'ఘట్టాలు' ఆంధ్రుల నిత్యజీవితమున ననేకములు. ఎన్ని సంచికల కయిన తిండి పెట్టగలవి. ఇదియు కలకు నెలవు. మరియు నీ పత్రికకు తక్కిన విషయముల గూడ మంచి పత్రిక కుండవలసిన లక్షణము లమరియున్నవి. సంపాదకుల వ్యాఖ్యానములు నూటిగ, సమదృష్టితో నడిచినవి. పత్రికా 'ప్రకటనోద్దేశాలు' సంపాదకులు చక్కగా విచారించినారు. ఈయెత్తుననే క్రమముగ సాగుచు నీ "ప్రబుద్ధాంధ్ర" నిక్కముగ ప్రబుద్ధాంధ్ర కావలెను"

"ఈకరవుకాలమున పత్రికను ప్రారంభించుట ఎంతవారి కయినను సాహసకార్యము. సాలు చందా ఒక రూపాయియే యగుటను జనసామాన్యమునకు దీని యందుబాటు సుకరము. కావున ఎల్లరును దీనిని పోషించుచు లాభమును పొందదగుదురు"

భారతి (ఫిబ్రవరి ౧౯౩౪)

౨౧

"ప్రబుద్ధాంధ్ర ఆంధ్రమాసపత్రికలలో మంచి పేరుగల పత్రికయై యుండెను ; కాని సంపాదకుల అనారోగ్యమువల్ల గత ఎనిమిదేండ్లనుండి ఆగిపోయి యుండెను. ఇప్పుడు తిరిగి ప్రారంభ మైన దని, తెలిసికొనుటకు మిగుల సంతోషించుచున్నాము. ఇప్పుడు విడవసంపుటము యొక్క మొదటి సంచిక (1934 జనవరి) మా కార్యాలయము నలంకరించినది. ప్రబుద్ధాంధ్ర నిరంతరాయముగా కొనసాగుగాక. ఈ పత్రికయందు భాషాచారిత్రిక విషయములు, అధునిక సాంప్రదాయముల ననుసరించి వ్రాయబడు చిన్న కథలు, వివిధవిషయములగూర్చిన వ్యాఖ్యాన సంపుటి మొదలగునవి కూర్పబడినవి. పత్రికయందలి రచనలు చిత్తాకర్షణముగా నున్న వనుటకు సందేహము లేదు. ఆంధ్రోద్యమమును గూర్చియు, ఆంధ్రగ్రంథాలయోద్యమమును గూర్చియు సంపాదకుల రచనలు ఉత్సాహజనకములుగా నున్నవి. ఈపత్రికయందు పద్యముల ప్రకటనమును, వివాదాస్పదము లగు రాజకీయ సమస్యలను నిషేధించుట యెంతయు సమంజసముగా నున్నది. సమస్తాంధ్రుల యభివృద్ధిని గోరు ప్రబుద్ధాంధ్ర ఈ నిజాము రాజ్యములోని 70 లక్షల ఆంధ్రుల యభివృద్ధిని గూడ గమనించుగాక యని కోరుచున్నాము"

గోల్కొండ పత్రిక (29—1—1934)

౨౨

"ఎనిమిది యేండ్ల యుడాటమునకు పిదప ప్రబుద్ధాంధ్రపత్రిక యీనాటి కైనను మరల వెలుగు మొగము చూడగలిగినందులకు మిక్కిలి సంతసించుచున్నాము. జగ మెరిగిన బ్రాహ్మణు లగు శాస్త్రిగారి సంపాదకీయగరిమను నిచట పేర్కొన నవసరముండదు. ఈనూతనప్రారంభమునందు సంపాదకులు పద్యవాఙ్మయమును శాశ్వతముగా త్రోసిరాజు జేసి గద్యవాఙ్మయమునకే ప్రాధాన్య మొసగ ప్రతినపట్టిరి. అపరిపుష్ట మగు ఆవాఙ్మయభాగమును సర్వాంగసుందరము గావింప బూనుకొనుట యుక్తముగానే యున్నది. కాని వీరు రాజకీయములు గద్యరూపమున గూడ ప్రకటింప నొల్లమని స్పష్టపరిచిరి. భారతదేశము, తద్భాగ మగు నాంధ్రదేశమును నేడు రాజకీయాగ్నిపరీక్షలో మిడుకుచుండ వాని సంబంధము ఎంత వల దన్నను సమకాలికభావనలలో, వాఙ్మయములో నుండక తప్పదు. ప్రాచీనవాఙ్మయము నందన్ని దేశములలోను నిట్టి సంఘటనము కలిగియే తీరినది. వ్యాఖ్యానములలో ప్రకటనోద్దేశము, ఆంధ్రోద్యమము అను వానిలో గల కొన్ని ప్రక్కదెబ్బలు రాజకీయవాసనల గుమాయించుచునే యున్నవి. నేటి క్లిష్టపరిస్థితులలో నివి రాజకీయములు, నివి రాజకీయేతరము లని నిర్ణయింపదగి

లేవు. సంపాదకులు తలచినట్లు ఆంధ్రుడు సర్వథా ఆంధ్రుడు కావలయు నన్న నాతడు రాజకీయముల గూడ నారితేరవలయును. అవి ప్రత్యక్షరాజకీయములతో నీపత్రిక నొక వార్తాపత్రిక జేయుట మా మతమును కాదు. ఆంధ్రజాతిని సర్వతోముఖ మైన నూతనచైతన్యముతో నుజ్జ్వలితము చేయదలచినచో ప్రాచీనుల రక్తతేజస్సులతో నాంధ్రుడు పూరించి భరతవర్షమునకు ప్రవర్తకుడు కావలసియున్నచో నేటి వాఙ్మయమున ఛాయారూపమున నైన రాజకీయములు వాసించి తీరు ననియే మా యూహ. శాస్త్రిగా రెంతవరకీ పరీక్షకు—"

"మా కార్యాలయము నలంకరించిన అయిదవ సంపుటము తొలి సంచిక చాల మనోహరముగ నున్నది. ప్రాతజనాభా లెఖ్ఖలు, పద్యవాఙ్మయనిషేధము లను వ్యాసములు ప్రోత్సాహకరములుగా నున్నవి. సంపాదకుల జాగ్రత్తపడవలసిన ఘట్టాలు ముద్దు లొలుకుచున్నవి. చిలుకూరివారి ఉత్తరరామచరిత్ర విమర్శనము వాఙ్మయజిజ్ఞాసువులకు మిక్కిలి యుపకారి. చింతా దీక్షితులు, కొడవటిగంటి కుటుంబరావుగార్లు మొద లగు కథకుల వ్యాసములు ప్రబుద్ధాంధ్రకు పెట్టని నగలు. చిరకాలమునకు నేడు ముద్దు నడలతో నరుదెంచిన చిరంజీవి ప్రబుద్ధాంధ్రకు నీ నూతనరూపమున నఖండవిజయము గల్గుగాత మని ఆచార్య సర్. రాధాకృష్ణుని యమోఘ వాక్యములతోనే యాశీర్వదించుచున్నాము"

ప్రజామిత్ర (౧౪—౨—౧౯౩౪)

౨౩

"ఆంధ్రులకు పరిచితమై కొంత కాలము క్రిందట నిలిచిపోయిన యీ "ప్రబుద్ధాంధ్ర" పునఃప్రచార మారంభింపగల్గినందుకు సంతసించుచున్నాము. సంతతభాషాసేవారతు డగు సంపాదకుని పట్టుదలయే ఇప్పటి కాల పరిస్థితులలో సయితము దీనిని ఆంధ్ర మహాజనసమర్పణమునకు తయారుచేసినది. అయినను ఈ సారి కూడ ప్రబుద్ధాంధ్ర దేశమున పరిపూర్ణాదరణమును బడయగల దనుటకు ఈ "ప్రథమసంచిక" లోని పునఃపూజ" యందు తెలుపబడిన సహాయ వాగ్దానములే సూచన లగుచున్నవి. ఇక ముందు పద్యవాఙ్మయము ప్రకటింపబడ దను నియమ మొకటి పత్రికయొక్క క్రొత్తవిశేషము. అందలి వ్యాసరాజములలో సంపాదకుని "జాగ్రత్తపడవలసిన ఘట్టాలు" శ్రీ చింతా దీక్షితులుగారి "ఈమాట నిజం" ప్రత్యేకప్రశంసకు పాత్రములు. కొడవటి గంటి కుటుంబరావుగారి "సుస్వాగతం" చక్కని చిన్న కథ. ఇవి గాక "శ్రీ రంగరాజుచరిత్ర" "ఉత్తర రామచరితము" లను సారస్వతవిమర్శనాదికము లగు రచనలు గలవు. సంపాదకవ్యాఖ్యానముల యొక్క ఖండితోద్బోధనములకు ప్రబుద్ధాంధ్ర ప్రథమమునుండియు పేరుపడియే యున్నది. ఆంధ్రమహాజనము లెల్లరు ప్రబుద్ధాంధ్ర నాదరింతు రని విశ్వసించుచున్నాము.

సమదర్శిని (౭ ఫిబ్రవరి ౧౯౩౪)

౨౪

"తమరు దయతోఁ బంపిన ప్రబుద్ధాంధ్ర పత్రికలు చదివితిని. తమరు పూర్వము ప్రబుద్ధాంధ్ర ప్రకటించినపుడు సంస్కృతమునను, ఆంధ్రమునను గూడ రచించిన వ్యాసరాజముల భాషాశైలియు, రచనా చమత్కృతియు బండితులకు మనోహరము లయి యాంధ్రలోకమునకుఁ గొంత ప్రయోజనము కలిగించిన వని యొప్పుకొనక తప్పదు. ప్రకృతము తమరు ప్రకటించు పత్రిక పండితపామరసామాన్యముగా ప్రబోధము కలిగించు సార్వజనోపయోగకరము గాఁగలదు"

"పత్రికలలోని వ్యాసములు భావప్రధానములు, రసప్రధానములును గావలయును. అందలి భాష సుబోధ మైనపుడే యందలి భావము హృదయమునకు దట్టును; గాని దురవగాహము, కృత్రిమము నైన యపుడు మనమున భావ మంటదు. రసానుభవమున కవకాశమే గలుగదు"

"తమ రా తత్త్వము గ్రహించి యాంధ్రజనమున అక్షరజ్ఞానము కలవారి కెల్ల సుబోధ మగునట్లు

వాడుకభాషలో వ్యాసములు రచించి ప్రకటించుట ఆంధ్రజనసామాన్యమునకు ప్రబోధము గలిగించి మహోపకారము చేయుట. అది యెంతయు ప్రశంసనీయము. వాడుకభాషలో వ్యాసములు రచించుట అందఱు ననుకొనుచున్నంత సులభము గాదు. ప్రత్యయములు మాత్రము వాడుకలో నున్న రీతిని జేర్చి గ్రాంధికభాషను మించునట్లు కొందరు వ్యాసములు రచించుట గలరు. అట్లు గాక వాడుకలో నున్న రీతిని గ్రహించి పదౌచిత్యము, భావౌచిత్యము పాటించి రచించిన మీ వ్యాసములు భాషకు సరి యగు నలంకారములు అని చెప్పుటకు సందేహ మేమియు లేదు.''

"ఆర్థికవిషయమున నిబ్బంది గల యీ కాలమున ధనవంతుల సహాయము లేకున్నను లోకారాధనమే ప్రధానలక్ష్యముగా జేసికొని పత్రికను నడుపఁబూనిన తమకుఁ దగిన తోడ్పాటు చూపవలయునని ప్రబుద్ధాంధ్రయే ప్రబోధింపగలదు. ప్రజలకుఁ బ్రబోధము గలిగిన సాధ్యము గాని దేమి యుండును?''

"ప్రబోధప్రధాను లగు తమకు భగవంతుడు సర్వవిధములను కార్యసిద్ధిని గావించు గాక''

"మీ పత్రికలో పద్యములు ప్రకటింపకుండుట యొక విశేషము. రసవంత మగు వాక్యమే కావ్యము గాని యితరము గాదు. అది పద్య మైన నేమి గద్య మైన నేమి? సార్వజనీనోపయోగము లక్ష్యముగా గైకొనిన పత్రికకు సర్వజనసుబోధక మగు వచన మందే లక్ష్య ముండుట కార్యసాధకునకు లక్షణము''

"ప్రకృతకాలమున యుపయుక్తముగ సాంఘిక విషయములు ప్రధానముగా జేర్చుట యెంతయో యుపయోగకరము''

"వాడుకభాషయందే గాక గ్రాంథికభాషయందు రచించిన వ్యాసములు గూడ ప్రకటించుట తమ సర్వసమదృష్టిని ప్రకటించుటయే గాక ఆంధ్రలోకమునకుఁ బ్రబోధము గలిగించుటయే ప్రధానలక్ష్యమని చాటుచున్నది''

శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రి

౨౨

"ప్రబుద్ధాంధ్ర—రాజమహేంద్రవరము కలాభివర్ధనిపరిషత్తువారిచే ప్రకటింపబడు చక్కని తెలుగు మాసపత్రిక. మనోహరాంధ్రసాంఘికకథారచనానిపుణుడును, మధురశయ్యావిలాసియు నగు శ్రీయుత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు దీని సంపాదకులు. వీరు కాని, వీరి పత్రిక కాని ఆంధ్రులకు నూతనపరిచితులు కావు. కొన్ని సంవత్సరముల క్రిందట నాలుగు సంపుటములను ప్రకటించి ఆంధ్రులకు క్రొత్తక్రొత్త సాహిత్యపాకములను చవి జూపించినారు శ్రీ శాస్త్రిగారు. బహుజనసమ్మత మైన "నిరుద్ధ'' వ్యావహారిక శైలికి శ్రీ శాస్త్రిగారి రచనలు పరవడు లని చెప్పగోరుచున్నాము. నేడు పునఃప్రారంభ మగుచున్న వీరి యత్నమున కికమీద నెట్టి యంతరాయమును కలుగకుండవలె నని మా గృహలక్ష్మి యాశీర్వదించుచున్నది. మా కార్యాలయమునకు వచ్చిన జనవరి ఫిబ్రవరి మాసపత్రికలోని కథలును, వ్యాసములును ఒకటి కొకటి యీడుతీయకున్నవి. సంపాదకీయములు ఆంధ్రులకు ప్రబోధదాయకంబులై పత్రిక నన్వర్థనామధేయగా నొనర్చుచున్నవి. కాంగ్రెస్సుపైని కాని అఖిలభారత జాతీయతపైని కాని, హిందీపైని కాని కారము నూరకుండనే యాంధ్ర ప్రబోధమును సాగించుటకు కూడ మిగుల వీలు గలదు. ఇట్టి ప్రశస్తపత్రికకు సంవత్సరమున కొక్క రూపాయి కారుచౌక యగు చందా. ఆంధ్రులు వేనవేలుగా చందాదారులుగా చేరి దీనిని నిలువబెట్టుదు రని నమ్ముచున్నాము''

గృహలక్ష్మి (మార్చి ౧౯౩౮)

౨౩

"ఇది మాసపత్రిక. రాజమండ్రీనుండి వెలువడుచున్నది. బ్రహ్మశ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

గారు సంపాదకులు. నూతన విషయములు జనసామాన్యమునకు తెలియు లాగున వ్యవహారిక భాషలో పేరుపొందిన పెక్కుపండితులు ఈ పత్రికలో వ్రాయుచున్నారు. ఇది ఆంధ్రజాతీయ పునరుజ్జీవనమునకు తప్పక తోడ్పడగల దని మేము దృఢముగ నమ్ముచున్నారము. ఆంధ్రవికాసము ముఖ్యాదర్శముగ నిడుకొని ఆంధ్రుని ఆదర్శపురుషునిగ జేయ సమకట్టుకొనిన ఈ పత్రిక కడుంగడు శ్లాఘనీయము. సంపాదకు లగు శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిలుగారిని ఎరుగని వారు మన ఆంధ్రదేశము లో లేరు. ఇది వరకే ప్రబుద్ధాంధ్ర మన దేశములో విశేషసేవ చేసి యున్నది. శ్రీ శాస్త్రిగారు అనారోగ్యస్థితిలో నుండిన కారణముచేత కొంతకాలము ప్రబుద్ధాంధ్ర ప్రకటింపబడలేదు. భగవంతుని దయచేత ప్రబుద్ధాంధ్రయొక్క దర్శనభాగ్యము తిరిగి మనకు గలిగినది. వీరి పునఃపూజ అచిరకాలములో ఫలించుగాక.'' తెలుగు ప్రేమ ప్రచారక్ (ఫిబ్రవరి 1934)

౨౬

''ఆర్యా ? తమ పత్రికయొక్క జనవరి సంచికను చదివితిని. అందువలన నాకు విశేషానందము కలిగినది. అందలి కథలును, విమర్శనములును, వ్యాసములును—నవి యివి యన నేల? తుదకు నితరపత్రికలనుండి యుద్ఘాటించిన వ్యాసఖండములును కూడ నత్యంతము హృదయంగమములుగ నున్నవి. విషయబాహుళ్యమున మాత్రమే కాక రచనానైపుణ్యమున గూడ నింత ప్రశంసనీయమై యున్న తమ పత్రికకు చందా రూపాయి మాత్రమే యగుట చూడ నిది యచిరకాలములోనే యాంధ్రపత్రికారాజావళిలో నద్వితీయాదరణమును బొందగలదా యను నాశ నాకు గలిగినది. తాము కోరినట్లు నేసి పత్రికకు వ్యాసములు వ్రాయుచుండవలె ననియే సంకల్పించితిని. అవకాశము గైకొని ప్రథమవ్యాసము పంపెదను. నా యభినందనములు గ్రహింపుడు'' జటావల్లభుల పురుషోత్తమ్
ప్రిన్సిపల్, సంస్కృత కాలేజీ కొవ్వూరు.

౨౭

''ఇది మాసపత్రిక:—ఐదవ సంపుటమునందలి మొదటి సంచిక (౧౯౩౪ వ సంవత్సరము జనవరి పత్రిక)ను కృతజ్ఞతాపూర్వక వందనములతో అందుకొంటిమి. దీని సంపాదకులు శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. శ్రీ శాస్త్రిగారి రచనలను ఆంధ్రులీవరలో చవిచూచియే యున్నారు—భాషాసేవయందు వీరు కావించు పరిశ్రమ ప్రశంసనీయమైనది. తమ పత్రికను నేడు పునరుద్ధరించి దేశసేవకు వీరు నడుము గట్టిరి. ''ప్రబుద్ధాంధ్ర'' యందు వీరు వాడుకమాటలనే ఉపయోగించుచున్నారు. చిరకాలము ఆంధ్రదేశములో నిలిచియున్న శైలి సాంప్రదాయమును శ్రీ శాస్త్రిగారు మెడపట్టి నులిమివైచిరి. తాము ముందంజ వేసి తోడి ఆంధ్రులను ముందుల కురుకు డని హెచ్చరించుచున్నారు. ఆంధ్రసారస్వతమునుండి వెలియైన వాడుకమాటలను ఉద్ధరించుటకై బద్ధకంకణులైన వీరికి మా ధన్యవాదములు. ప్రజాసేవయే పరమావధిగా నెంచిన వీరు వాడుకమాటలనే అవలంబించుట సంతోషకరము. వ్రాయను, చదువను నేర్చినవారు మన సీమలో మిగుల తక్కువగా నున్నారు. కొంత డొక్కశుద్ధి గలవారు నిత్యము తాము వాడుచున్న మాటలనే బోధపరచుకొనగలరు. వీరిని ఉద్ధరించవలె నన్న వీరికి తెలియని భాషను వీరి మ్రోల యేకరువు పెట్టిన యెడల ఏమో వెఱ్ఱిమొఱ్ఱి వాగుడని యెంచి నిలిచిన బురదలోనే నిలిచియుండ నూహింతురు; గాని సమున్నత జ్ఞానశిఖరమును చెరవలె నని వీరు ఉద్దేశింపరు. పామరుల తోడిదే నేటి లోక మని గుర్తించిన విజ్ఞానులలో నొక్కరైన శ్రీశాస్త్రిగారు పద్యములను త్రోసిరాజని వాడుకమాటలకు గురుపీఠ మిచ్చిరి. భాషకు స్వాతంత్ర్యము అవసరము; కాని స్వేచ్ఛ యను పేరున విచ్చలవిడియైన గంతులాట కొంత నేడు తెలుగుసీమయందు బొడగట్టుచున్నది. సారస్వతహృదయము గంభీరమైనది. సారస్వతవదనము సౌందర్యోపేత మైనది.

సహజమైన మాటలను ఏఱిచి ముక్కలు చేయుచు అవి వాడుకమాట లని చెప్పు మహాశయులు తెలుగుసీమయందు పెక్కండ్రు ఉన్నారు. కూడని ఊహలను క్రిందగూల్చి ప్రజాసేవ చేయుతఱి భాషయందలి కళాకౌశల్యమును తేటపరచుట తమ కర్తవ్య మని కళాభివర్ధని పరిషత్తువారు గుర్తించినట్లు చక్కని జాతీయములతో నిండిన శ్రీశాస్త్రిగారి శైలి ధ్రువ మొనరించుచున్నది. ఈ పత్రిక దిన దినాభివృద్ధి గాంచుగాక యని ఆశపడుచుంటిమి. పత్రిక యెల్లరకును అందుబాటై ఉండుటకై సంపాదకులు ఒక్క రూపాయ మాత్రమే చందాగా నేర్పరిచిరి ”

ఆంధ్రసహకార పత్రిక (జనవరి ౧౯౩౪)

—౨౦—

“రాజమహేంద్రపురకలాభివర్ధని పరిషత్తువారిచే ప్రకటిత మగు మాసపత్రిక. ఏతత్పత్రికాసంపాదకులు సుప్రసిద్ధ ఆంధ్రవ్యాసరచయిత లగు శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. సంపాదకులు ప్రత్యేకముగ గద్యవ్యాసములనే ప్రచురింపసమకట్టుటలో కొంత న్యాయమును ధర్మమును గూడ నున్నట్లు గోచరించుచున్నది.”

“ఏవాఙ్మయమునందైనను ప్రప్రథమమున గేయములును, తరువాత మానవుని హృదయకమలము వికసింపదొడంగిన కాలదిని పద్యములును, క్రమముగా విజ్ఞానసముపార్జనము సేయ, బుద్ధివికాసము గలిగినపుడు గద్యవాఙ్మయమును వృద్ధిపొందును. ఏ దేశమునందైనను ఇదియే క్రమపరిణామము; కాని మన ఆంధ్రభాషలో నొక్క విశేషము మాత్రము గలదు. పద్యవాఙ్మయముతో బాటు గద్యవాఙ్మయముగూడ కొంచెముగానైనను ప్రథమము నుండియు గలదు. పద్యమునకు గల ప్రాధాన్యము గద్యకు లేకున్నను వాఙ్మయమున తొలినుండియు దీనికి స్థానము మాత్రము లేకపోలేదు”

“కాని వాఙ్మయములో క్రమముగా రాదగిన మార్పు ఈ శతాబ్దిని చూపట్టినది. పద్యములపై నెక్కువ మక్కువ గలవారు గూడ గద్యరచనల నాదరింపనారంభించిరి. ఇట్టి భేదము క్రమముగా ప్రాచీనులలో గూడ గల దనుట కొక నిదర్శనము—ఒక తత్త్వమును ప్రబోధింపవలయు నన్న, మనసునకు హత్తునట్లుగా చెప్పుట కుపయోగకరము లగు సాధనములలో నాటకమున కగ్రస్థానము గలదు. ఇట్టి నాటకరచనలో మేటి యగు Shakespeareల రచించిన ౩౭ నాటకములలో ప్రథమమున రచించిన ౧౧ నాటకములును పద్యమయము లే. నాటకమంతయు పద్యపాదములతోడనే నడచును. (Blank Verse); కాని రానురాను గద్య, పద్య స్థానము నాక్రమించుటచే అంత మందలి ౧౪ నాటకములును గద్యప్రాధాన్యములుగనే వ్రాయబడెను”

“ఈపరిణామము ఎప్పటికైనను తప్పదు. సర్వజనసమాదరణీయ మగునది గద్యయే యని యెఱింగి కావలయు శ్రీ వీరేశలింగం పంతులుగారు ఎక్కువగా గద్యనే వ్రాసిరి”

“ఇం దేమాత్రము న్యాయము లేదనియు, ‘అనవద్య మగు గద్యవాఙ్మయము’న, ‘పద్యములు’ గూడ నున్న హృద్యముగా నుండుననియు కొందరు తలంపవచ్చును; కాని యిది యొక మతము. ఏ యొక్కటియు సర్వజన సమ్మతము కాజాలదు కదా? అట్లే యైనచో ఇన్ని దేవుళ్లేల—ఇన్ని మతము లేల—ఇన్ని గీత లేల—ఇన్ని వ్యాఖ్య లేల? ఇంతకును ‘మహాఋషీణాం మతయ శ్చ భిన్నాః”

“శ్రీ సుబ్బరామయ్యగారు వ్రాసినట్లు—“మానవుని నిత్యజీవితమున కావశ్యకము లగు విషయముల దెలుపునట్టి గ్రంథములు వెలువడవలయును. అవి సరళము లగు గద్యరచనమున నుండవలయును” ఇట్టి రచనలను ప్రోత్సహింప సమకట్టిన శ్రీ శాస్త్రిగారు మాననీయులు ”

ఆంధ్రవిశ్వ కళాపరిషత్ కళాశాల
తెనుఁగు సంఘ పత్రిక.
(సంక్రాంతి సంచిక జనవరి ౧౯౩౪)

౩౦

"తమరు పంపిన ప్రబుద్ధాంధ్ర ఫిబ్రవరి సంచిక చేరినది. నవీనాశయములతో పునర్జన్మించిన 'ప్రబుద్ధాంధ్ర' జన్మప్రవృత్తిని గుర్తించినట్లు స్పష్టమగుచున్నది. కథారచనలో అందెవేసిన చేయి, మీ సంపాదకత్వమున 'ప్రబుద్ధాంధ్ర' ఆంధ్రులకు అత్యంతము సేవ చేయగల దని నమ్ముచున్నాను. ప్రబుద్ధాంధ్ర చిరకాలము వర్ధిల్లు నని యాశించుచున్నాను"

పాటిబండ మాధవశర్మ

౩౧

"రాజమహేంద్రవరంనుండి కళాభివర్ధనీ పరిషత్పక్షమున గద్యరూపంతో వెలువడుతూన్న మాసపత్రిక. సంపాదకులు ఆంధ్రలోకానికి చిర పరిచితులైన శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. విజ్ఞానవికాసాన్ని పెంపొందించే వచనవాఙ్మయాన్ని మాత్రమే సత్కరించడానికి నడుము కట్టుకొన్న యీ క్రొత్తపత్రిక అచిరకాలంలోనే ఆంధ్రభాష కొక నూత్నతేజన్నూ, చైతన్యవికాసమూ కలిగిస్తా దని మా విశ్వాసము. ఉద్రేకము లైన ఉన్నతరచనలతో విరాజిల్లుతూన్న యీ తొలి సంచికకు మా స్వాగతం చెబుతూ శ్రీశాస్త్రిగారి యుద్యమానికి విజయము నాకాంక్షిస్తున్నాం"

శశి (ఫిబ్రవరి ౧౯౩౪)

౩౨

"ప్రబుద్ధాంధ్ర:— మాసపత్రిక. సంపాదకులు శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. ఆంధ్రదేశమున వీరిని దెలియని వా రుండరు. విషయము లన్నియు వచనముననే వ్రాయబడియున్నవి. భావప్రకటనమునకు వచనము తోడ్పడునట్లు పద్యము తోడ్పడదు. అందున వాడుకభాష—వచనమునకే ప్రాధాన్య మీయబడినది. కావున ఆంధ్రవచనశైలి కూడా అరితేరుతుంది. "ఆంధ్రులు— ఆంధ్రము" అను వ్యాసము ఆంధ్రవాఙ్మయచరిత్రకును, ఆంధ్రోద్యమమునకు సాయపడుచున్నది. "ఆంధ్రుడు ఇక నైనా తన ప్రమత్తతను విడనాడుకోవలయును. అవివేకముగా ప్రవర్తించినందులకు పశ్చాత్తప్తుడు కావలెను" పత్రిక దినదినాభివృద్ధిని గాంచునని కోరుదుము"

సరస్వతి.

౩౩

"ప్రబుద్ధాంధ్ర శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి సంపాదకత్వము క్రింద రాజమహేంద్రవరమునుండి వెలువడుతున్న మాసపత్రిక సం॥ చందా ఒక రూపాయి 48 పేజీలతో వెలువడుతున్న ఈపత్రికలో మల్లంపల్లివారు, భావరాజువారు మల్లాదివారు, ఔకుమళ్లవారు, జనమంచివారు, చింతావారు మున్నగు పత్రికాలోకమునకు పరిచితులైన వారంతా రసవంతమైన వ్యాసాలు కథలు వ్రాస్తున్నారు. "వేదికలు—పత్రికలు" "వ్యాఖ్యానములు" అనే శీర్షికలక్రింద ప్రకటింపబడిన విషయములు ఆకర్షవంతగా వున్నయి. శాస్త్రిగారి ప్రయత్నానికి ఆంధ్రులు చేయూత నియ్యాలి.

చిత్రగుప్త (1 వ మార్చి, 1934)

౩౪

"ఉభయభాషావిజ్ఞానము గల శ్రీసుబ్రహ్మణ్యశాస్త్రిగారు ప్రబుద్ధాంధ్రపత్రికను బునరుద్ధరించుటలో నాశ్చర్యమేమియు లేదు. వారు సమర్థులు. పత్రికను జక్కగా నడిపింపగలరు. శిష్టసమ్మత మగు శైలినే యవలంబించి యాంధ్రుల నాకర్షింపగల రని నా నమ్మకము. పద్యములకుం దావీయలే దని నేను విచారింపను. వర్తమానమున రసవంత మగు వచనమునకై యనేకు లుత్సాహపడుచుండుటను వారు గ్రహించి రనుకొనెదను. కవులును ధనవంతులును వారికి సాహాయ్య మొనరింపవలసియున్నది. భగవంతుడు వారి యుద్యమము నాశీర్వదించును గాక"

క్రొవ్విడి శేషవేంకటకాశీపతి

౩౫

"ప్రబుద్ధాంధ్ర:—రాజమండ్రి కళాభివర్ధనీపరి

షత్తు పక్షమున, సుప్రసిద్ధవచనరచయిత లగు పండిత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి సంపాదకత్వమున మునుపటివలెనే ఒక రూపాయి చందాతో ఆంధ్రులకు చిరపరిచితమైన యీమాసపత్రిక పునరుద్ధరింపబడినది. ఇప్పుడు మనకు చాల అవసరముగానున్న వచనవాఙ్మయము నభివృద్ధిపరుచు నుద్దేశముతో సంపాదకులు ఈసారి ఈపత్రికలో పద్యములను ప్రకటింపక, చక్కని సులభశైలిలో గద్యవ్యాసములను తేటతెనుగుపదములతో వినోదమైన, నీతిదాయకమైన కథలను, చక్కని విమర్శనలను ప్రకటించుచున్నారు''

లోకబంధు (ఫిబ్రవరి ౧౯౩౪)

౩౬

"చక్కని సాహిత్యముతో నిండి యున్నది. ఇంత స్వల్పమూల్యమున నిట్టి సర్వాంగసుందర పత్రిక లభించుట వరప్రసాద మనదగియున్నది''

రెడ్డి. (౩-౨-౧౯౩౪)

౩౭

"ప్రబుద్ధాంధ్ర రెండవ సంచిక చాలా ముచ్చటగా వుంది. ఆంధ్రసోదరసోదరీమణు లంతా ఈపత్రికను ప్రోత్సహిస్తా రని నానమ్మకం''

నరహరిశెట్టి శేషగిరిరావు

---

# స్వీకారము

పత్రికలు

సమదర్శిని
ప్రజామిత్ర
గోల్కొండపత్రిక
చిత్రగుప్త
వినోదిని
సరస్వతి
శశి
త్రిలింగ
రెడ్డి
హిందూసుందరి
ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక
Vizagpatam Medical College Magazine
భారతీపత్రిక
కృష్ణాపత్రిక
సుబోధిని
కల్యాణి

గ్రంథములు

జాతకనారాయణీయము
రామప్రియ
ప్రేమతత్త్వము
ఆంధ్రభాషానుశాసనము
భాగవతావతరణము
చంద్రహారము
భూగృహము
పల్లెటూరిపడుచులు

వీటిని ముందుసంచికలో విమర్శింతుము.

# ప్రబుద్ధాంధ్ర

కలాభివర్ధనీపరిషత్తుపక్షమున ప్రకటింపబడు మాసపత్రిక

సంపాదకుడు:—శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

సంపుటము ౫ } రాజమహేంద్రవరము మార్చి ౧౯౩౪ { సంచిక ౩


## "అపి దళతి వజ్రస్య హృదయమ్"

సుబ్రహ్మణ్యశాస్త్రి—సంపాదకుడు

"బాగా ఆలోచించుకోండి"

"నాకే కాని నీ కక్కర లేదా యేమిటి ఆలోచన?"

"................"

"................"

"కాని కాలం వచ్చి పడింది. మూడేళ్లయి సమర్తాడిన కోడల్ని పుట్టింట అట్టేపెట్టేసి వూరుకోడం—అపవాదు పుట్టిందంటే మాపుకోలేము సుమండీ"

"తల్లికీ, తండ్రికీ లేని బాధ మనకేం?"

"మనం మాత్రం తల్లిదండ్రులం కామూ యివతలా?"

"అయితే?"

"మన కోడలు—"

"కార్యం అయి మన యింటికి వచ్చేదాకా కోడ లంటే యేమన్న మాట? ఇప్పుడు మన కేమీ పూచీ లేదు. చల్లగా వూరుకో"

"వద్దు సుమండీ! తనువులు శాశ్వతాలు కావు"

"నిజమే"

"మాట కలకాలం వుండిపోతుంది"

"అదీ నిజమే"

"......ఇంకేం చెప్పగల నమ్మా నేనూ?"

"నువ్వు చెప్పగలగడానికి సరి దంటూ వుండనిస్తే కాదు టయ్యా నేనూ?"

"................"

"వూరికే దోడదోడ మాట్లాడగానే సరా? లాపాయం టుండాలి—"

"ఇంకా చెప్పుకోవాలి తగుదు నమ్మా అని"

"ఏం లోటు వచ్చింది?"

"నలుగురూ యేమనుకుంటున్నారో?"

"అనాథ లాగ నేను వియ్యాలవారికి లొంగిపోతే అప్పు డేమనుకుంటారో?"

"ఇ దెక్కడి అభిమాన మండీ?"

"బజార్లో దొరికే రకం కాదిది"

"దొరికినా అక్కర్లేదూ"

"................"

"పోనీ నోళ్లల్లో పడండి"

"నువ్వే పడేశావు నన్నిదివరకేను"

"చూశారా?"

"విన్నావా?"

"................"

"మాట్లాడవేం?"

"రెండో కొడుకు పెళ్లాంతో కాపరం చేసుకుంటూ వుండడమూ, పెద్దకొడుకు అన్నీ వుండీ కూడా ఘోటక బ్రహ్మచారిలాగ—"

"వాళ్లకి మాత్రం లేదూ ఆలోటూ? రెండో కూతురు అక్షణంగా కాపరం చేసుకుంటూ వుండ డమూ, పెద్దకూతురు మొగుడు విడిచిపెట్టేసిన దాని లాగ—"

"చాల్లెండి నేర్చుకు పోయారు"

"లాక్షన స్త్రాలు నీ కేం తెలుసునూ? భారత భాగవతాలికి అర్థం కూడా చెబుతావు మళ్లీనీ. కాని వోనమాలు రాని వియ్యపురాలు నయం నీకంటేను"

"ఏమిటో అనయం?"

"అలా అడిగావు, బాగుంది. విను మరి. ఈ పట్టుదల అంతా రాజమ్మ దంటున్నారు కాని సుందరప్ప దనడం లేదు యెవరూను"

"అయితే?"

"వాడు నిర్భయంగానే తల యెత్తుకు తిరుగు తున్నాడు వీధిలోను"

"తిరిగితే?"

"ఆడది యింటోనే వుండిపోయాది కనక వీధిలో యెవ ళ్లే మనుకున్నా లెక్క లేదు. మొగాడు నలుగురిలోకీ వెడతాడు కనక భారం అంతా ఆడది తనమీద వేసుకుంటే—"

"బాగుంది ఆలోచన. మంచి మాటే! ఇప్ప టికే ఆడాళ్లంతా నన్ను పీకేస్తున్నారు"

"రాజమ్మ నెవరూ యేమీ అనరేం?"

"మీరు వింటున్నారా?"

"అంటే మరి మన కిచ్చేది యిచ్చెయ్యదేం?"

"మొండి కెత్తినవాళ్ల నెవ ళ్లేం చెయ్య గలరూ?"

"నువ్వూ బండ కెత్తు"

"అడుక్కు తిన్న ట్టుంటుంది"

"................"

"అయితే నా మాట వినరూ?"

"నువ్వు చెప్పిం దేదీ?"

"మనకి కట్నాలూ వద్దు, కానుకలూ వద్దు. అబ్బాయి పెద్ద చదువులు చదివాడు. నెలకి నూరు రూపాయలు తెచ్చుకుంటున్నాడు. మన దేవా వోహో అన్న సంసారం కాని మరోటి కాదు. ఏం లోటూ? వొకళ్లు పెట్టలేదని, పొయ్యలేదనీ మనకి బెంగెందుకూ?"

"................"

"................"

"తేల్చెయ్యి తొరగాను"

"మన కేమీ వొద్దు. పిల్లని తీసుకువచ్చి కార్యం చేసేసి యిద్దర్నీ చెన్నాపట్టం పంపెయ్యండి"

"ఏడిసిన ట్టుంది నీ సలహా"

"................"

"ఇక మొత్తుకోడం వొక్కటే తరవాయి"

"................"

"మొగుణ్ణి వీధిలో పెట్టిన పీనుగువు, నిన్ను సలహా అడగడం యేమిటి కాకపోతేను?"

"ఇక పరువుకీ, ప్రతిష్ఠకీ నీళ్లు వొదులుకున్న ట్టే?"

"పట్టుదల నెగ్గించుకోలేకపోతే యిక పరు వంటే యేమిటి, ప్రతిష్ఠ అంటే యేమిటి?"

"వియ్యపురాలితో సమం అవుతారా?",

"తీసిపొమ్మంటావా?"

"ఇంకా యిద్దరు మొగపిల్లలికీ, యిద్దరు ఆడ పిల్లలికీ పెళ్లిళ్లూ పేరంటాలూ చెసుకోవాలికూడాను. ఇలా అయితే వాళ్లకి మంచి సమ్మంధాలు తేగల మా?"

"ఇప్పు డీ కట్నపు భూమి వొదులుకుని తెల్ల మొఖం వేస్తే తరవాత మూడోవాడికీ, నాలుగో వాడికీ కట్నాలు తేగలమా?"

"ముందు పుచ్చుకునే తర్లి వెడదాం"

"ఇవ్వడం అంటూ వుంటేనా?"

"వులకం!"

"................"

"కాకపోయినా, వీధిలోకి వెళ్ళే మొగ మనిషికి పట్టూ విడుపూ వుంటాయి. ఆడదానికంటే కని కిష్టం అయితే యిం కేమిటీ చెయ్యడం?"

"................"

"మాట్లాడక నన్నేం వుద్ధరిస్తారా యేమిటి?"

"................."

"మీకు తగిన వియ్యపురాలు దొరికింది. అనుభవించండి"

"................."

"నాదగ్గిర కోతలు కొయ్యడం కాదు ప్రయోజకత్వం"

"................."

"ఆ యాభై సెంట్ల భూమీ వియ్యాలవారి దగ్గిర్నుంచి పుచ్చుకో గలిగితే— ఈకళ్లకీ రెప్పలు దూరం కావు"

"................."

"తల్లి వెంకితనానికి అక్కడ అదెంత యేడుస్తోందో, మీ పట్టుదలకి యిక్కడ అబ్బాయి యేం రుసరుస లాడుతున్నాడో—నాకేం?"

"................."

"మీ యిష్టం వచ్చినట్టు చేసుకోండి. ఇక యీ వూసెత్తితే ఛీ అనండి నన్ను"

"రక్షించావు. మాటిమాటికీ యిక నన్ను వేపుకు తినక ఆమాటమీద వుండు"

౨

"పోనీ అదలా వుంచు. వియ్యపురాలికీ ఆడపడుచులికీ యివ్వవలసిన లాంఛనాల బాపతు మూడు వందల నలభై యెనిమిది రూపాయలూ యిచ్చేస్తే వాళ్లు యివాళ పిల్లని తీసుకుపోతారు. దీని కేం చెబుతావురా?"

"అదీ వొక దారే"

"అదేం దారండీ గోదారీ? దీక్షితు లన్నయ్యా! ఈపురమాయిం పెవరి దయ్యా?"

"ఎవరి దయితే నీ కెందుకూ?"

"ఇక చెప్పనక్కర్లేదు. తెలిసే పోయింది. వియ్యపురా లెంత యెత్తు యెత్తిందో చూశారుటండీ? ఈవంక పన్ని ముందు తనకీ, తన కూతుళ్లకీ రావలసింది మెల్లిగా లాక్కుంటుంది. తరవాత పిల్లని తీసుకు వెళ్ళి కొడుకు నుసికొలుపుతుంది. ఇక పిల్లా, మనల్నీ మూడు చెరువుల నీళ్లు తాగిస్తాడా అబ్బాయి! అబ్బో! ఎంత నెరజాణ అయింది వదినా?"

"పాపం ఆవిడ నాతో మాట్లాడనే లేదు యేమీని"

"ఆవిడ నీతో ఎందుకు మాట్లాడాలీ? నేనా యేమిటి వచ్చి దేమిటో పోయీ దేమిటో ఆలోచించుకోకుండా వడవడ వాగడానికి? మొగుడికి పాఠం చెప్పింది. యేమీ యెరగనట్టు తను అంతఃపురంలో కూచుంది బూబమ్మ లాగ"

"జానకమ్మ నేమన్నా పాపం చుట్టుకుంటుంది"

"అలాగటండీ? పెత్తాత మనమరా లయినందుకు బాగానే వూసుకు వచ్చారు పాపం; అయితే, మీకే గాని ఆవిడకి లేదిలాంటి అభిమానం యెప్పుడూనూ; పోని గాని, దీక్షితు లన్నయ్యా! లాంఛనాల సొమ్మిచ్చేస్తే యివాళ పిల్లని తీసుకుపోతారన్నావు గదా? అంటే యే మన్నమాటయ్యా?"

"దాన్లో తెలవం దేం వుందీ?"

"తరవాయి మా టేమిటీ! కొంచెం చెబుదూ"

"అంటే?"

"రాకపోకలూ—"

"నేను వూచీ పడలేను"

"అయితే వల్లకాదు"

"ఇలా అట్టేపెట్టుకుంటావా?"

"ఎటు చూసినా చిక్కే వచ్చిం దయ్యా నాకూ. ఇక్కడ పిల్ల గోల పట్టలేకుండా వున్నాను. అక్కడ వారు పట్టు విడవకుండా వున్నారు. తప్పెవరిదో తెలుసుకోకుండా వూళ్లో అమ్మలక్కలందరూ నన్నాడిపోసుకుంటున్నారు చాటునా మాటునానూ"

"నువ్వు మాత్రం పట్టు విడిచిపెట్టావా?"

"వారి కిస్తా మన్నది యివ్వ మన్నామటయ్యా?"

“ఏమిస్తా నన్నావు, యే మిచ్చావు? ఇచ్చేస్తే యీ తగువు లెందుకూ?”

“యకరమే కాదూ—”

“నీ మొగుడు యకరం నర యిస్తా నన్నాట్ట. ఏమిరా, యిస్తా నన్నావా లేదా?”

“అన్నమాట నిజమే”

“ఆయన మాట లెక్కేమి టయ్యా అంటే మాత్రం? ఆయన కేం తెలుసునూ? వాళ్లెంత అడిగితే అంతా యివ్వవలసిందే?”

“మొదటి తప్పు మీదీ, తరవాతి తప్పు వాళ్లదీనీ. ఉభయులూ పేచీలకే సిద్ధపడ్డారు”

“మే మేం సిద్ధపడ్డామూ? ఇచ్చెయ్యడానికిప్పటికీ సిద్ధమే కాదూ?”

“చిన్న కూతురి కెక్కువ యిచ్చి పెద్ద కూతురికి తక్కువ యివ్వడం యేం సబబూ?”

„వాళ్లు వొప్పుకో లేదు టయ్యా మొదటూ?”

“అస లేం జరిగిందిరా? బాగా చెప్పు నీ పెళ్లాం మొదటూ”

“పెద్ద పిల్లకి యకరం భూమి యిస్తా నన్నాను. వియ్యపురాలి కో నూటపదహార్లూ, ఆడపడుచుల కిద్దరికీ చెరో నూటపదహార్లూ—”

“వందవంద కంటే యెక్కువ యివ్వడానికి వల్లకా దంటే పై పదహార్లు మీ బావ పెట్టారు. యాభై రూపాయలు—మాటలా?”

“వాణ్ణి పూర్తిగా చెప్పనియ్యి”

“దానికి వాళ్లంగీకరించారు; కాని తరవాత చిన్నపిల్లకి యకరంనర యివ్వవలసివచ్చింది. దాంతో పేచీ వచ్చింది”

“ఎప్పుడు వచ్చిందీ?”

“పెళ్లి వారం వుం దనగానూ”

“వస్తే?”

“మాక్కూడా అలా యిస్తే కాని వల్లకా దని జోగన్న కబు రంపాడు. అందుకు మా మామగారు మాట్టాడకుండా వొప్పుకోమన్నారు”

“వొప్పుకున్నావు”

“అవును”

“తరవాతా?”

“తరవాత మా మామగారు యకరమే రాయించి పరమరహస్యంగా రిజస్ట్రీ చేయించారు. మూడుముళ్ళూ పడ్డ తరవాత కట్నం చదివినప్పుడు వాడదేమి టన్నాడు. అంటే, మొదట అంతే వొప్పన్నమన్నారు మా మామగారు”

“అంటే?”

“ఇం కేం వుందీ? పెళ్లివారు వొక్క పూటయినా భోజనాలికి రాలేదు. పెళ్ళికొడుకు కూడాయే వొకటి రెండు మాట్లో తప్ప మా యింటో భోజనం చెయ్యలేదు. అగ్నిహోత్రాలూ, జరగవలసిన తంతూ మాత్రం—నుశ్వారగండా యేమిటి అదంతాను?”

“వొక వూరేగింపా, వొక నలుగులా, వొక బంతులాడింపా, వొక సదస్యమా—యేం ముచ్చట్లు తీరాయి అన్నయ్యా మాకూ? చిన్నపిల్లకి అన్నీ జరుగుతూ వుంటే పెద్దపిల్ల యింటో యేడుస్తూ—”

“అంత అల్లరి కేనా వొప్పుకున్నావు; గాని అన్న యాభై సెంట్లూ యివ్వలిచ్చావు కాదు నువ్వు. నీదీ శక్తి అంటేను”

“యాభై కాదు, వొక్క సెంటివ్వనివ్వను. నాకు పిసాళం యెత్తుక వచ్చిం దంటే అలాంఛనాల సొమ్ము కూడా యెగబెట్టిస్తాను. నాపిల్ల నాకు పెద్దకొడుకు కనుకుంటాను”

“కాని ఆపెద్దకొడుక్కి పెళ్ళాన్ని మాత్రం తెచ్చిపెట్టవు. కదూ?”

“పెట్టి పుట్టందే యెలా వస్తాయి సుఖాలూ, అందాలూనూ? చిన్నపిల్ల యేణ్ణర్థంనుంచి చిలకలాగ కాపరం చేసుకుంటోంది. పెద్దదాని కర్మం కాకపోతే యిదేమిటీ!,,

“ఇంతకీ మీరు మెట్టు దిగకపోతే నీ కూతురికే చిక్కూ, మీకే అప్రతిష్ఠ”

“వాళ్లెందుకు దిగరూ?”

"దిగారు కారూ? లాంఛనాల సొమ్మిస్తే పిల్లని తీసుకుపోడానికి సిద్ధంగా వుంటేనే వాళ్లు?"

"రాకపోక లుండవని నువ్వే చెబుతూ మళ్ళీ దిగారు దిగారంటా వేమిటయ్యా?"

"మీ కంటే దిగారు"

"పెళ్ళిలో ముచ్చట్లూ లేవు, పల్లకీమూ లేవు, యిప్పుడేనా లేవండా—"

,,అంటే?,,

"నలుగురూ బిలబిల్లాడుతూ రావడమూ, సలక్షణంగా కార్యం చేసుకోడమూ, పిల్లని పంపుతూ వుండడమూ, అల్లుడువస్తూ వెడుతూ వుండడమూ—"

"ఇక అవేమీ జాంతేనై. కార్యానిక్కూడా యిక్కడికి రారు. పిల్ల నేనా కట్టుగుడ్డలతో పంపెయ్యాలి. ఏమీ—పసుపూ కుంకుమా—"

"అలా వొక్కనాటికి జరగదు. నా పిల్ల నా యింటోనే వుంటుంది. కన్నవాళ్లం పోషించలేమా యేమిటి దాన్ని?"

"................."

"ఇలాంటి రాయబారం యెలా తెచ్చావన్నయ్యా నువ్వూ?"

"ఏమంటావురా?"

"ఆయ న్నడిగే దేమిటయ్యా? ఆయ నేం చెప్పగలరూ? చుట్ట కాలుస్తూ, కోరాకిల్లీ నములుతుంటూ చీట్లాటలో కూచోడమే; గాని వొక్క దమ్మిడీ తేలేరు. ఇస్తా నసరూ ఆయనా? ఆయన లెక్కేమిటీ? వా ళ్లడిగిందల్లా అడిగినంతా యిచ్చి మొగపిల్లల్ని పాడుచేసుకోమా?"

"అయితే యిక నేను వెళ్లిపోతాను. ఇంక రెండు నిమిషాలు గడువు. ఈ లోపుగా నేను వెళ్లి అపుచెయ్యకపోతే నీ అల్లుడు వెళ్ళిపోతాడు. జట్కాలో సామాను వేయించుకొని యెక్కడానికి సిద్ధంగా వున్నాడు వాడు. మీరు రాజీకి అంగీకరిస్తే వారంరోజు లుండి, కార్యం చేసుకుని మీ పిల్లని కూడా తీసుకుపోతాడు"

"అంత చెప్పుల్లో కాళ్లుంచుకొని మాట్లాడితే తేలేదెట్లా యిదీ?"

"రాజీపడ్డా పిల్లని వూళ్లో వుంచదూ? అయితే పొమ్మను. చెన్నాపట్టం వెళ్ళినా సరే శిఖాకోళం వెళ్ళినా సరే యింకా"

"................."

"అబ్బో! ఇలాంటి యెత్తు వేశారూ వియ్యాలవారూ? మహా బాగుంది. ఇక ఆ యాభైసెంట్లే కాదు. లాంఛనాల బాపతు పైపదహార్లుకూడా యివ్వనివ్వను"

"అస లంతా యివ్వనివ్వకపోతే మాత్రం యేమీ?"

"అయితే మాడో మేలు. సొమ్ము చేదా యేమిటి మాకు?"

"పిల్లల సుఖం చేదు; గాని సొమ్ము చేదు కాదు మీకు"

"ఇంచేతే నిన్ను చూస్తే నాకు—ఏమనుకున్నావ్?"

"ఏం?"

"వాళ్లు తిన్ననైన వాళ్ళా?"

"అక్కడ నే నెంత దెబ్బలాడి వచ్చానో యెరుగుదువా నువ్వు?"

"................."

"పెత్తనాలకా యేమిటే బయలుదేరావూ?"

"కాదే?"

"మ రెక్కడికీ?"

"................."

"మాట్లాడ వేమే?"

"ఎందుకే?"

"పో, పో. పిన్నిగారింటికి మాత్రం రోజూ యెందుకూ?"

"పోతున్నాను"

"................."

"................."

"పోవేం?"

"పోతూంటేనే?"

"................"

"వీధిలో జట్కా ఆగినట్టుం డేది దన్నయ్యా?"

"చుట్టాలో స్నేహితులో మరి"

"వెళ్ళి చూడండీ యెవరోనూ?"

"గుమ్మంలోకి వచ్చినవారు లోపలికి రారా యేమిటి?"

"................"

"యెవర్రా?"

"చె—ప్పా"

"................"

"నీ అల్లుడే కోయ్!"

"లోపలికి పోవే. వెళ్లి పోవే. పోవేమే?"

"................"

"నీ కెవరు కావాలి? మీ అమ్మా నేనా?"

"మీరే"

"అయితే నాతో వచ్చేసెయ్యి"

"పదండి"

"................"

"ఎక్కడికే?— ఎక్కడికే?— నీయిల్లు వల్ల కాదు — వెనక్కి మళ్లుతావా మళ్ళవే?"

"................"

"చూస్తా రేమండీ! బందిపోటు దొంగలాగ పట్టపగలు వచ్చి పిల్ల నలా లాక్కుపోతూ వుంటే నిర్ఘాంతపడి అలా వూరుకుంటా రేమండీ?"

"................"

"బెల్లం కొట్టిన రాయిలాగ మాట్లాడ రేమండీ"

"అయ్యో, అయ్యో! బండి కదిలింది వెళ్ళి పోతోంది. మేఘాలమీద యెగిరిపోతోంది. నువ్వే నా అడ్డుకున్నావు కాదేమి టన్నయ్యా?"

"మొగుణ్ణీ పెళ్లాన్నీ విడతియ్య మంటావా?"

"నిన్ననడం యెందుకూ నా వస్తువు మంచి దైతేనూ? ఎక్కడ యేడ్చిపోతుందో అని వెయ్యి విధాల—అందర్నీ వొక యెత్తునా దాన్ని వొక యెత్తునా చూస్తూ వుంటే యెంతపని చేసిందీ విశ్వాసఘాతుకురాలు!"

"................"

"ఇందుకే ఆడాళ్లకి పెట్టడం అంటే నాకు తల నొప్పి"

"చిన్నదానికి పెట్టడం మానేశావా?"

"అది యిలాగే చేసిందా?"

"మీరుమాత్రం దాన్ని యిలాగే చూశారా?"

"పోవయ్యా నేర్చుకున్నావు మాటలూ? ఇక దాన్ని నా యింటికి రానిస్తానా యెప్పుడేనా?"

"వుండగలవా?"

"శరా పట్టా నంటే నా సంగతి నీకు తెలవదు. చూస్తూ వుండు దాని మొఖు మేనా చూస్తా నేమో యింక"

"ఈకభుర్ల కేం లే? మళ్లీ ఈరోజుల్లో నువ్వు చెన్నపట్నం బయలుదేరకపోతే నా చెవి తెగ్గోయించుకుంటాను"

"ఎందు కమ్మా?"

"కూతురికి పురుడు పొయ్యడానికి"

"ఖాల్లేకయ్యా"

"అలాగే నమ్మా? ఇప్పు డలాగే వుంటుంది. "ఏమయ్యా, అన్నయ్యా! మీ బావకి తీరుబడి లేకపోతే నువ్వేనా కాస్త సాయం కాగూడదు టయ్యా? పిల్ల యెంత కష్టపడుతోందో నయ్యా చేసుకోలేకా. ఎనిమిదో నెల వెళ్లవచ్చిం దయ్యా పాపం! రావయ్యా! నన్నక్కడ దింపేసి— క్షణం వుండవద్దయ్యా అక్కడ నువ్వూ. ఆరాత్రి మెయిలుకే వచ్చెస్తువు గా నయ్యా" అని అప్పుడు నన్ను చేతులూ కాళ్లూ పట్టుకు బతిమాలకపోతే—"

"అంత చేలపీనుగు ననుకున్నావు టయ్యా నన్నూ?"

"ఆకాశా న్నుంచి వూడిపడ్డావా యేమిటి నువ్వు మాత్రం?

"ఇం కెందుకూ? అయిం దేదో అయిపోయింది,

ముందు సంగతి ముందు చూసుకుందాం. ఇప్పటి కింతటితో వూరుకోండి గప్చిప్పుగా”

“మిమ్మల్ని చూస్తే వొళ్లు మండిపోతోందినాకు. మళ్లీ మాట్లాడా రంటే మాట దక్కదు. ఇప్పుడా వేళాకోళాలూ, వెక్కిరింతలూనూ?”

“వోరే బావా, నువ్వవతలికి పోరా కాస్సేపు”

“బతికించావు”

3

“చెల్లీ!”

“ఎం—ను—క—న్న—య్యా?”

“అదేమి టమ్మా? శుభ మల్లే కూతురు తన మొగుడితో వెళ్లడం యేమిటి, నువ్వు కళ్లల్లో నీళ్లు పెట్టుకోడం యేమిటి? తప్పు, తప్పు, వూరుకో, వూరుకో”

“ఎం—త—ప—ని—జ—రి—గిం—ద—య్యా?”

“ఎప్పుడేది యెలా జరుగుతుందో మన కేం తెలుసుం దమ్మా?...అయినా యిదేనా బాగానే వుంది. నీ తప్పు నీ కూతురు దిద్దేసింది”

“కనిపెట్టలేకపోయా నయ్యా దాని తపనా! యెంత యిదీ కాకపోతే కార్యం కాకుండా మొగుడితో లేచిపోతుంది టయ్యా అయిన యింటి పడుచూ?”

“నిజమే”

“ఎంత బలగం వుందయ్యా దానికీ? గుమ్మానికి తోరణం కట్టుకున్నా మంటే వందమందికి తక్కువ వసారుటయ్యా నాయింటికి చుట్టాలూ? అలాంటిది యెవళ్లూ రాకుండా—చివరికి తల్లిపీను గేనా దగ్గర లేకుండా—యెంత వుసూరు మంటుందో నోయ్ వెర్రిపిల్లా!”

“.................”

“వొక తలంటు లేకుండా, వొక కాళ్లు కడగడం లేకుండా—కొసకి మంగళహారతేనా లేకుండా అయ్యో! ఇంటికి పెద్దాడబడుచోయి తండ్రీ!”

„అవును మరి. నిజమే; కాని దాటిపోయాక యేం చేస్తామూ?”

“ఇహ నే నుండలే నోయ్! నన్ను కూడా చెన్నాపట్టం తీసుకువెళ్లవూ? వూరుకుంటా వేమయ్యా”

“సంవత్సరాని కొక్కాని కలగ దనుకున్న తొందర నీ కివాళే—ఈక్షణంలోనే కలుగుతోంది!”

“ఇంకా “కలుగుతోం” దేమిటి కలిగిం దయ్యా! నాతండ్రివి కాదూ? తీసుకు వెళ్లవూ?”

“నే నో మాట చెబుతాను వింటావా?”

“ఏమి టన్నయ్యా అదీ?”

“నీకు కోపం వద్దు”

“ఇంకెక్కడి కోప మయ్యా కడుపు తరుక్కుపోతూ వుంటేనూ?”

“కాని, యిప్పుడు వెడితే నువ్వు లోకువైపోతావు”

“ఆపిల్ల యెప్పుడు పుట్టిందో అప్పుడే లోకువైపోయాను. యిప్పుడు వచ్చిన విశేషం యేమిటయ్యా?”

“నిజంగా?”

“పుండు మీద కారం చల్లుతావా అన్నయ్యా?”

“నే నలాంటి వాణ్ణే?”

“కాదు, కాదు. నిన్నెరగనూ నేనూ? దిక్కుమాలిన కర్మం తిక్క వస్తే తిప్పుకో లే నయ్యా. నేనూ! అందుకు తగిన శాస్తి చేశా డయ్యా దేవుడూ”

“.................”

“మాటాడ వేమయ్యా?”

“నా కేమీ తోచడం లే దమ్మా”

“నీకు తోచకపోతే నేను చెబుతాను వినవయ్యా”

“విని యేమిటి చెయ్యడం? నీ అల్లుడు వెనక్కి రాడు. నీ కూతుర్ని కూడా రానివ్వడు. అసలతను రానివ్వడం మాట యెందుకూ, అదే రాదూ”

“వాళ్లు రావడం యెందు కయ్యా? మనమే వెడదాం అక్కడికి”

“వెడితే మాట్లాడకపోతే—”

“నాకూతు రలాంటిది కాదోయ్!”

"వాడు?"

"పాపం మాట లెందుకూ? అత నేనా చాలా వోపిక కలవాడు; కాని తొందర మనిషి కాడు"

"నవ్వు వస్తోంది నాకు"

"ఏం?"

"ఇప్పుడే కాదు టమ్మా బందిపోటుదొంగ న్నావు?"

"వొళ్లు తెలవనప్పు డన్నా నామాట. ఇప్పుడు మణిపూస అని తోస్తోంది. కాకపోతే నా కూతుర్ని విడిచిపెట్టేసి మరోక పిల్లని—పిల్లలు దొరకరు టయ్యా అతగాడికి? కురూపా, చదువు లేనివాడా, చేతగానివాడా?"

"అలాంటివాడికి యెంత ఆయాసం కలిగించావో యిప్పుడేనా తెలుస్తోందా?"

"..................."

"ఇక నే నక్కస్సు పట్టలేను. వున్నమాట వున్న ట్టనేస్తాను"

"అనే సెయ్యి"

"ఇక్కడ నువ్వూ అక్కడ జోగన్నా చేశా రిదంతాను"

"వియ్యపురాలు—"

"దా న్నన్న వాళ్లు పురుగు లోడి—"

"ఏం?"

"కట్నం కోసం పట్టు పట్టవద్దని, తనూ, పిల్లలూ లాంఛనాలు వొదులుకుంటా మని అపవాదలు పుడితే తీసేసుకో లే మని, కార్యం చేసేసి కోడల్ని తీసుకు రమ్మని శతవిధాల పోరుతోం దది రోజానూ; కాని జోగన్నే—"

"నిజం గాను టయ్యా?"

"చివరికి కొడుక్కి యీ వుపాయం చెప్పింది కూడా అదే అనుకుంటాను నేను"

"చూశావా? ఇంత కంటే దారి కనపడ లేదా యిల్లాలికి పాపం; కాని అవి ణ్ణెంతలేసి మాట లన్నానయ్యా నేనూ?"

"దాన్ని పూసుకువచ్చా డని యిందాకా నీ మొగుణ్ణి కూడా యీసడించావు—"

"ఎంత పాపానికి వొడికట్టానయ్యా నేనూ? ఇ దెలా పోతుం దయ్యా?"

"నువ్వే ఆలోచించు"

"వదిన కాళ్లమీద పడితే?"

"అ దొక దారి"

"మరో దా రెందుకూ యింకా? ఆవిడికి పెద్ద కొడుకూ నాకు పెద్దకూతురునూ. ఇద్దరూ దిక్కు లేనివాళ్లలాగ యెక్కడో చెన్నాపట్టంలో—"

"వాళ్లు కూడా యేదో పాపం చేసుకున్నా రేమో వెనకటి జన్మలో?"

"మాకడుపుల్లో పుట్టడమే వాళ్లు చేసుకున్న పాపం. అన్నయ్యా! ఇక నేను నిలవలేను. నా నరాలు పట్టు తప్పిపోతున్నాయి. ముందు నన్ను తీసుకువెళ్లి జానకమ్మ వదిన కాళ్లమీద పడెయ్యవయ్యా"

"..................."

"నాకు లేకుండా చేసుకోవడమే కాకుండా ఆవిడక్కూడా యీముచ్చట లేకుండా చేశాను నేను. పద వయ్యా బతిమాలి ఆవిణ్ణీ పిల్లల్నీ కూడా తీసుకు వెడదామూ"

"ఈలోపునే—రేపు రాసిన ముహూర్తంవుంది. నీకూతురుకీ అల్లుడికీ తారాబలం కుదిరిం దేమో కూడానూ"

"అయ్యో, అయ్యో ఏం తొందర పడతారో యేమిటో?"

"వా డలాగ తొందరపడే వాడు కాడు. నీ కూతురే యే మేనా—"

"నన్ను సూదులతో పొడవక తంతి కొట్టెయ్యవయ్యా వెళ్లి. నాతండ్రివి కాదూ? నా నాయనవు కాదూ?"

"వెడతాను లే"

"ముందు వెళ్లాలి. అయితే మనం యెప్పుడూ వెళ్లడం?"

"నీకూతురూ అల్లుడూ వొంటిగంట పాసెంజరులో వెడుతున్నారు; మన మంతా రాత్రి మెయి

లుకి వెడదాం. వాళ్లు పదిన్నరకి గాని చెన్నపట్నం వెళ్లలేరు. మనం యెనిమిదిన్నరకే వెడతాం. వెంటనే నేను బజారుకి వెళ్లి గంపెడు పూలదండలు తెస్తాను. రైలు దిగాటప్పటికి యెదురుగా వెళ్లి నీ కూతురుకీ అల్లుడికీ మెడ తిరక్కుండా అంతా తలో దండా వేద్దాం''

"ఏడుస్తూ వున్న దాన్ని నవ్విస్తావోయ్ నువ్వూ''

"అయితే మంచిదే కాదూ?''

"మనం అలా చేస్తే నా వెర్రితల్లి యెంత సిగ్గుపడుతుందో పాపం!''

"అది సిగ్గున్న మనిషే అయితే పట్టపగలు లేచిపోతుంది టమ్మా?''

,,మేనగోడల్ని నువ్వేమన్నా అనతగ్గవాడవే. నువ్వు చేసే వుపకారానికి—.''

"ఇంతకీ వారుకూడా రావాలి కదా?''

"మావదిన వస్తుం దయ్యా! ఆవిడ అలాంటి పెంకి మనిషి కాదు పాపం! కాళ్లమీద పడి నేను బతిమాలుకుంటాను కాదూ? తతిమ్మా యేర్పాటంతా నువ్వు చేస్తూ తొరగానూ''

"అన్నకాడికి యిచ్చెయ్యకుండా వాళ్లు—''

"ఇంకెందుకూ? యకరంనర భూమీ, మూడు వందల నలభై యెనిమిది రూపాయలూ, వాటికైన ఫాయిదా—''

"అదిగదీ మాట''

"నాకు తెలవ దనుకున్నావా యేమి టయ్యా మంచీ చెడ్డానూ?''

"తీరా అంతా సిద్ధమైనాక మీ నాన్న—''

"వూరికే పేరు మట్టుకి మా నాన్నది; కాని—''

"ఇదంతా నువ్వే చేస్తా?''

"దెప్పిపొడుస్తావా అన్నయ్యా?''

"లే దమ్మా లేదు, వూరికే తెలుసుకోడానికి—''

,,తరవాత చెబుతా కాదూ అదంతానూ? ఇదిగో నేను వెళ్లి మా వదిన్ని బతిమాలుకుంటున్నాను. మీబావతో చెప్పి ప్రయాణం సిద్ధం చేయించు నువ్వు. పాలికాపుని రాయబారం పంపి జట్కాలు తెప్పించమను ముందు''

,,సంచున్న పళంగా యింత యెత్తు యెత్తితే యింత డబ్బు తేగలనా అంటాడేమో బావ?''

,,నిన్న రాత్రే నయ్యా వొక రయితు తెచ్చి పదిహేను వందల యెనభై రూపాయలు గుమ్మరించాడు వాకట్లోనూ. అవన్నీ కర్చుపెట్టేస్తా నిప్పుడు. వెళ్లేది చెన్నాపట్నం కనక అక్కడ ముద్దినుసు వస్తువులూ దొరుకుతాయి యించక్క—''

,,....................''

,,నవ్వు వస్తోందా అన్నయ్యా?''

,,లే దమ్మా లేదు''

,,నవ్వితే నవ్వావు; గాని, యిదంతా చేసిపెడితివా మళ్లీ జన్మలో నీ కడుపున పుడతాను''

,,ఇప్పుడు మాత్రం నాకు నువ్వు తక్కువ దానవా యేమిటి?''

,,అవు నవును. నీ కలాంటి దయ వుంది కనక నే నా కిప్పు డిలాంటి సాయం చేస్తున్నావు నువ్వు''

,,ఇదీ వొక దయలోనే లెక్కా?''

,,అదంతా తరవాత మాట్లాడుకుందాం. పండుగ పేరు చెప్పి రావడంచేత సమయానికి మా పిల్లలూ, వారి పిల్లలూ కూడా యిక్కడే వున్నారు కంగారు అక్కర్లేకుండానూ. ఇదిగో! సుందరమ్మ వొదిన్నీ పిల్లల్నీ కూడా తీసుకురాకపోతే నేను వొప్పుకోను సుమా''

,,....................''

,మాట్లాడ—తీసుకు వస్తా నన వేమయ్యా మరీ?''

,,నీది వెర్రీ కాదు, వేషమూ కాదూ''

,,అదంతా నాకు తెలవదు—.''

,,ఇదంతా తలుచుకుంటే యెంత ఖర్చవుతుందో—''

,,సముద్రం వస్తే వెనక్కి తీస్తామటయ్యా? ఇంతకీ:వుభయఖర్చులూ నేనే పెట్టుకుంటానుసుమా,,

,,అయినా, వాళ్లు కూడా యెందు కమ్మా యిప్పుడూ?,,

,,పెళ్లి ముచ్చట్లూ, శోభనపు ముచ్చట్లూ వొక్క మాటే తీరాలి కాదు టయ్యా మరీ?,,

ఉభయభాషా—సాహిత్యవిద్యా—ప్రవీణ బులుసు వేంకటరమణయ్యగారు

దేశభాషలు అభివృద్ధి పొందాలంటే నవ్యత అనేది ఉండి తీరాలని యిప్పటి చాలామంది నమ్మకం. నవ్యత అనే దానికి గిరాకీ జాస్తీ అయి, చెలామణీ యెక్కువగా అవడం సర్వత్రా కనబడుతూనే ఉంది. ఒక భాషావిషయంలోనే కాదు, మన జీవితానికి—నాగరకతకీ సంబంధించిన ప్రతి విషయానను నవ్యత యొక్క బావుటా ఎగురుతూనే ఉంది. అప్పుడు పుట్టిన బిడ్డలగాయితూ అరున్నొకటో పది దాటిన వారి వరకూ—అందరికీ దాని మీదే కోరిక—వేలంవెఱ్రి. కొత్త వింతా పాత రోతానూ. నవ్యత గారిలా ఏకచ్ఛత్రాధిపత్యంగా రాజ్యమేలుతూ వున్నందున—అది లేకపోయినా, దాని పేరెత్తిన మాత్రాన—అట్టి వారిదే సభాతాంబూలం. ఏదేనా పదార్థం తనలో నవ్యత ఉన్నట్టు నటిస్తే చాలు బ్రహ్మరథం పట్టేస్తుంది లోకం, అసలు పదార్థంలో పస వున్నా లేకపోయినా అడ్వర్టైజుమెంట్ల డాబు చూసి టోపీలో పడ్డట్టు.

ఈ నవ్యత—అనగా క్రొత్తదనం—అనేది వేషాల్లోకీ భాషల్లోకీ ప్రవేశించి క్రమక్రమంగా వాఙ్మయంలోకి—అంటే గ్రంథాలకి కూడా ఎక్కడం ప్రారంభించింది. అలా ప్రారంభించి నలుగురి కళ్లల్లోనూ దుమ్ముగొట్టి నన్నయాదుల గ్రంథాలకి నామంపెట్టేసి నాయుడుబావ పదాలకి ప్రాముఖ్యం యిప్పించింది. పది పేజీల గ్రంథానికి వకరూపాయి ఖరీదు పెట్టినా నవ్యత ఉన్నాదనుకోనబడే పుస్తకానికి చెలామణీ వుంది. ఎంత చవగ్గా అమ్మినా ప్రాచీనకవుల గ్రంథాల్ని కొనక "మాకు ఉత్తనే యిచ్చినా వొద్దోయి దేవుడా!" అంటూ ప్రజ మొఱ్రపెడుతుంది.

మంచి చెడ్డలకీ క్రొత్త పాతలకీ యేమీ సంబంధం లేదు. పాతవన్నీ మంచివనిన్నీ కొత్తవన్నీ చెడ్డవనిన్నీ తలంచడం పొరపాటు. కొత్తలోనే భాషాతత్త్వమంతా యిమిడివున్నదనిన్నీ పాత వాఙ్మయమంతా పనికిమాలిన చెత్త అన్నిన్నీ, శుద్ధాబద్ధమనిన్నీ అనుకోవడం అంతకన్నా మరీ తప్పు.

"తెలుగు మొదట్నుంచీ సంస్కృతం అనేటటువంటి ఒక డెడ్ లాంగ్వేజి నాధారం చేసుకుని దాని పాదసేవ చేస్తూ జీవితం నిలుపుకుంది. అంచేత దాన్లోలాగే దీన్లో కూడా భావప్రాధాన్యం లేని కవిత్వమూ, కవి స్వేచ్ఛాగానానికి ప్రతిబంధకాలయిన నియమాలూ దాపరించి భాష పాడయిపోయింది స్వయంవ్యక్తిత్వం లేకా" అంటూ ఒకాయన ఉపన్యసిస్తాడు

"కవిత్వంవల్ల అందరికీ రసం కలగాలి, గాని కథ యెవడికి కావాలి? మన ప్రాచీనా కావ్యాల్లో కథాప్రాధాన్యం తప్ప భావప్రాధాన్యం యేదీ? ఒకవేళ కొన్ని గ్రంథాల్లో కథ తక్కువై వర్ణన లెక్కువగా వున్నా అవన్నీ అతిశయోక్తులే గాని భావానికి ఉపయోగించేవి కావు. మన ప్రాచీనులు సర్వత్రా కోతలు కోశారే గాని—అందులో స్వభావం కనపడదు. అంచేత నవ్యకవిత్వంలో భావానికి ప్రాధాన్యం యివ్వబడి సహృదయులకి ఆనందం కలిగించడంలో యేమీ అభ్యంతరం లేదు" అంటూ యింకొక పెద్దమనిషి చెప్తాడు.

"కవి అన్నవాడు నాయకుడిలో లీనమయిపోయి తన జీవితాన్ని నాయకుడి జీవితంలో మేళవించి స్పష్టంగా ప్రతిబింబింపచెయ్యాలి. లేకపోతే అది కవిత్వమేమిటి? అంటూ మరొకాయన లెక్చరిస్తాడు.

"మనవాళ్ల దృష్టంతా రాజులూ, రాజ్యాలూ, ఉద్యానాలూ యేనుగులూ, గుఱ్రాలూ మొదలైన వాటిమీదనే పోయింది. గ్రంథాల్లో కూడా—సంఘంలో మల్లే, తక్కువ జాతుల వారినీ, బీదవారినీ, అడుక్కి తొక్కేసి అన్యాయం చేశారు. ఆ

లోచించి చూస్తే వాళ్ళ జీవితాలే ఆదర్శప్రాయాలు. ఆనందపడయాలి. ధన్యాలున్నా, నవ్యకవితలో నిష్పక్షపాతంగా, వాళ్లకి చేయడిన అన్యాయాన్ని పూర్తిగా నాశనం చేయడానికి సంకల్పించాము'' అంటూ ఒక మహానుభావుడు వ్రాస్తున్నాడు.

“ఆడా మొగా భేదం లేకుండా చిన్నా పెద్దా భేదం లేకుండా ఎక్కువ తక్కువ భేదం లేకుండా అందరికీ సరిసమాన మయిన హక్కు యివ్వడమే మా అభిప్రాయం. విశ్వప్రేమ మా ఉదారాశయాల్లో ముఖ్యం. జగత్తంతా ప్రేమమయ మైపోవాలి'' అంటూ యింకో ఆయన వాదన.

“అన్ని విధాలా సంస్కృతాన్నే పట్టుకు దేవులాడి ఆ ఛందస్సులే అప్పు తెచ్చుకొని పద్యాలు వ్రాస్తే తెలుగు ప్రత్యేకతా, జాతీయతా తెల్లవారి నట్లే. అందేత యిప్పుడు తెలుక్కి కొంత విశ్వామిత్రసృష్టి అవసరం వచ్చింది గనక ముత్యాల సరాలూ, స్వేచ్ఛాగానములూ, గేయాలూ వ్రాసి విశాలహృదయం గల కవి స్వేచ్ఛగా ప్రకృతిని గానం చేయడానికి అవకాశాలు కల్పిస్తున్నా'' మంటూ ఒక వాఙ్మయోద్ధారకధురంధరుడి అభిప్రాయం.

ఇలాగ ఒక మూలనుంచి కొత్త గోదావరి వచ్చినట్టు కొత్త వాఙ్మయం పొంగి వస్తూ వుంటే దాన్ని అడ్డడానికి ప్రయత్నం చేసే భాషోద్ధారకులు కొందరు “నలుగురూ మాట్లాడుతున్న వ్యవహారభాషలో పుస్తకాలు రాస్తే వాఙ్మయం కుక్క ముట్టుకుపోతుంది. అందేత వ్యాకరణశుద్ధ మైన భాషలోనే పుస్తకాలు వ్రాయించి అచ్చొత్తించి లెదరు బైండు కట్టించి బీర్వాలలో పేర్చా'' లంటూ భీష్మించుకు ఒక మూల కూచున్నారు.

బాగా ఆలోచిస్తే, ఫలానావారి వాదన బాగుంది. ఫలానావారిది బాగు లేదు. అంటూ యిదమిత్థ మని నిశ్చయించడానికి వీలు లేకపోయినా, కొంతవర కేనా ఉన్న సంగతిని బయలుపెట్టడానికి వీలుంది.

అది డెడ్ లాంగ్వేజి కానిండి, మరేమన్నా కానిండి, సంస్కృత మే తెలుక్కి చాలా వరకూ గతి అయిం దన్న మాట ఒప్పుకోవలసే వస్తుంది. అమూల్య మైన పుస్తకా లన్నీ సంస్కృతంలోనే వున్నాయి. భావం—రసం ప్రధానం కాని కవిత్వాన్ని సంస్కృతం వారిలో పూర్వీకులు కూడా వప్పుకోనే వొప్పుకోరు. “కథలకోసం కాదు కావ్యాలు రాయడం, రసం కోసమే గాని—'' అంటూ కావ్యతత్వాన్ని వివరించే ఆలంకారికు లందరూ ఘోష పెడుతూనే వున్నారు. సంస్కృతంలోని యీ తత్వాన్ని గ్రహించలేక చాలామంది సంస్కృతాన్ని అనుసరించడం చేతనే తెలుగు పాడైపోయిం దని అర్థం లేని ఆర్భాటం చేస్తారు.

సంస్కృతంలాంటి ఉదారవాఙ్మయాన్ని ఆదర్శంగా ఉంచుకుని కూడా తెలుగువారు ఆమోస్తరుగా భావ—రసప్రధానంగా గ్రంథాలు రచింపక పోవడం తెలుగువాళ్ల లోపమే గాని మరొకటి కాదు. తెలుగుకవులు తాము ఆశ్రయించుకున్నవాడిని బట్టి—అతగాడి వంశాలూ తమ వంశాలూ అతిశయోక్తులతో నింపి చాటభారతం లాగ గ్రంథాల కెక్కిస్తారు. యిల్లాంటివి సంస్కృతంలో చాల అరుదు. ఇంచుమించుగా పుస్తకాలని అంకితం-యిచ్చే పద్ధతి కూడా తెలుగులోనే పుట్టిం దని చెప్పవచ్చు. కాళిదాసాదిమహాకవు లెవ్వరూ అంకితాలూ, అతిశయాలూ షష్ఠ్యంతాలూ—సప్తమ్యంతాలు పెట్టి రెండేసి మూడేసి సర్గలు రాసేసి రాజుల్ని యెత్తిపారెయ్య లేదు.

తెలుగుయొక్క ప్రత్యేకత్వం కోసం దేవులాడే యిప్పటి రకం వారీ వారు కూడా ,,భావం ప్రధానంగా గలవి'' అని అనుకోనబడే తమ కావ్యాల్లో నాలుగు పాదాలకీ ఒక్కటే సంస్కృతసమాసం పెట్టి చివర తెలుగుప్రత్యయాలు తగిలించే వారు చాలామంది వున్నారు. ఇం తెందుకూ? తెలుగుని అభివృద్ధిపరచడానికి పుట్టిన విశ్వవిద్యాలయంకూడా తన పేరు ,,ఆంధ్రవిశ్వకళాపరిషత్'' అని చాటు

కుంటూ, అలాగే ముద్రలు వేసుకుంటూ తనకి గల పారతంత్ర్యాన్నీ, సంస్కృతానుసారిత్వాన్నీ మూడు మూర్తులా వ్యక్తం చేస్తోనే వుంది. "ఆంధ్ర విశ్వకళాపరిషత్తు" అని వుంటే "త్తు" అనే దేనా తెలుగని అనుకోడానికి వీలుంది కాని అట్లా గైనా లేదు గా మరిక్కడ!—

మన ప్రాచీనతెలుగు ప్రబంధాల్లో కథాభాగం చాలా తక్కువగా నున్నూ వర్ణనాభాగమే చాలా యెక్కువగా నున్నూ ఉన్నా దన్న సంగతి అందరికీ తెలుసును. యిప్పటి భావకవులు—కవికుమారులు మొదలైనవారి గ్రంథాల్లో కథాభాగం శూన్యమై అయోమయ మైన భావానికి ప్రధాన్యం ఉన్నా దని అనుకొంటున్నారు కాదూ కొందరు? అంచేత కథకి ప్రాధాన్యం అక్కరనే లేదు. ప్రాచీనుల తాలూకు ఆ గ్రంథాల్లోని వర్ణనలు ఏ మాదిరిగా నైనా రసానికి గాని భావానికి గాని కారణ మౌతా యంటారా కా దంటారా? భావప్రధాన కావ్యంలో కథ సుతరామూ ఉండనే కూడ దని కామోసు కొందరి అభిప్రాయం. యిప్పటి వాళ్ళ నవీనఖండకావ్యాల్లో కూడా కవి ఎల్లాటివారినో నాయికానాయకుల్ని కల్పించి ఏ తుప్పల దగ్గరో యేయేటి దగ్గరో కలిపి—(వాళ్ళని కాకపోయినా వాళ్ళ చూపుల నైనా కలిపి) కొంత దాకా ఆటాడిస్తారు. కాని ఊరికే ఆమాత్ర మేనా లేకుండా భావం అనేది గజ్జ కట్టుకొని గంతు లెయ్యదు గదా?

మన పూర్వీకులు రాసిన కవిత్వంలో అతిశయోక్తులు చాలా ఉన్నాయి. యిప్పటి వాళ్ల కవిత్వంలో స్వభావమే గాని అతిశయంగా చెప్పి పాఠకుడికి వినుగు కలిగించడం లేనే లేదంటూ అనుకోవడం పట్టి పొరపాటు. | కొంతవరకూ అతిశయం లేందీ కవిత్వమే లేదు. కావ్యానికి సొగసుదనం యిచ్చేది అలంకార మనీ, అతిశయోక్తే మొదటి అలంకార మనీ అందరూ వప్పుకున్నారు. | నవకవిత్వంలో కూడా "ఆవిడ ముఖం సౌందర్యం వొలుకుతున్నా" దన్నప్పుడు—స్వభావ మైనవర్ణనలో మాత్రం అతిశయం ఉం దంటారా! లేదంటారా?

ఇప్పట్లో చాలామట్టుకు నవీనఖండకావ్యాలు శృంగారరసం ప్రధానంగా గ్రహించినవే. నాయకుడు నాయిక సౌందర్యానికి ముగ్ధుడై రసపిపాసి అయిపోయి ఆభావోద్రేకంవల్ల తన్మయు డైపోయి కన్నీళ్లు బాగా కారుస్తాడు. ఇక కవి ఆనాయకుడిలో లీన మైపోయి—అంటే కవి తన్నే నాయకుడిలా స్పష్టపరుచుకొని అపార మైన ఆనందాన్ని అనుభవిస్తాడు. అంచేత నాయకుడికి మల్లే కవి కూడా శృంగారరసపిచ్చి యెక్కువ అవుతుంది. తన మాటలు ఇతరులికి అర్థ మవసండి...కాకపోసండి. తనకి ఆనందం గలిగితే చాల్ను. తన భావతరంగాలు తన హృదయంలో తళుకుతళుకు మని అంటే చాల్ను. ఇల్లాంటి పాత్రలీనత్వం ప్రాచీన కావ్యాల్లో లేదంటూ ఆక్షేపణ. కేవలం కవి ఒక్కడి ఆనందానికే అయితే అతగాడు తను ఒక్కడూ గాలిమేడలు కట్టుకొని ఆనందించకూడదూ! కలం కాగితం పుచ్చుకొని కాలం వృథా చెయ్యడం యెందు కంటాను. మరోసంగతి. శృంగారం యెక్కువగా ప్రాచీనప్రబంధాల్లో వర్ణింపబడ్డా దని అంటూంటారే—కేవలం యిప్పటి వారు ఆరసం మినహాయించి గ్రంథాలే రాయరే, అది మహా బాగుంది కామోసు. వెనకటికో పెద్దమనిషి పెంటకుప్పలో దొర్లాడుతూ వెంకన్నగాడి వెర్రి యెల్లా ఉందిరా అంటూ ఇంకో వాణ్ణి పరామర్శించినట్టు.

ఇల్లాంటి కవిత్వా లన్నీ వాఙ్మయానికి పురోభివృద్ధికి మూల మంటూ కొందరి యువకుల ఆశయం. ఇల్లాంటి వాట్లో నే జీవితాదాదర్శం ప్రతిబింబిస్తూ ఉంటుందిట. ఇప్పుడు కొందరు నెలల పిల్లలు కూడా కవయిత్రులూ, కవీశ్వరుళ్ళూ అయిపోయి పత్రికలకి ఎక్కుతున్నారు—జీవితాదర్శం అనుభవపూర్వకంగా ప్రతిబింబింప చెయ్యడానికి ఇలాంటివి అనుగుణాలా?—పోనిండి—అపసిబిడ్డలు—వాళ్లకి మాట

లు రాకపోతేనేం లెండి—లోకానికి హితోపదేశం చెయ్యడం మాత్రం మంచిది కాదూ ?

ఒక చిత్రం, ఈమధ్య ఒహాయన ఒకభావ కథ కాబోలు, రాస్తూ మంచి వస్తువులు పాడుచేసిన పసిపిల్లాడ్ని తల్లి మందలించె సందర్భంలో "నాన్నా ! మంచి వస్నీ యిలా పాడుచేస్తే ప్రకృతి శ్మశానమయం అయిపోదూ'' అంటూ తత్త్వోప దేశాన్ని దబాయించేడు. ఆతత్వాన్ని ఆపసిబిడ్డ అవలీలగా గ్రహించి "అమ్మా ! చమించాలి. తెలియక చేచాను'' అంటూ క్షమార్పణ చేశాడు. ఆపిల్లాడికి అట్టి తత్త్వం బోధపడ్డానికి ఆశ్చర్య పడాలో, ఆనందించాలో తెలీడం లేదు.

ఆడాళ్లకి మొగాళ్లతో గూడా సరిసమానమైన హక్కులు యిచ్చి వాఙ్మయతత్వాన్ని సాంఘిక తత్వంతో మేళగించి నవ్యతలో ఒక అడుగు ముందు వెయ్యాలని కొందరి సిద్ధాంతం. భావకథకులు కొందరు ఈసూత్రానికి ఉదాహరణ లిస్తూనే వస్తున్నారు. ఒహ పదిహేడు పద్దెనిమి దేళ్ల అమ్మాయి ఒక్కర్తె ఒహ ఊర్నుంచి మరోహ ఊరికి ప్రయాణమై తన్ను స్టేషనులో కలుసుకోవలసిం దని తన కిష్టుడైన—పరిచితుడైన స్నేహితుడికి ఉత్తరం రాస్తూ, అతడ్ని అట్లాగే కలుసుకుని, రాత్రి తొమ్మిదిగంటలప్పుడు అతగాడితో చెట్టాపట్టాలు వేసుకుని, బీచి యిసకతిప్పల్లో ఎదురుగుండా, అతనికి తగులూ కూర్చుని (అంటే తన ఉత్తమ ధర్మానికి యేమీ లోటు రాకుండా ప్రవర్తిస్తూ అన్నమాట) ముచ్చట లాడుతూ కూర్చుంది. ఆఖరికి ఆస్నేహితుడు కొంచెం ప్రణయం రకంవారీగా మాట్లాడగా, ఆవిడ అతగాడియందు పశుత్వాన్ని ఆరోపిస్తూ తన సతీత్వాన్ని ప్రకటిస్తుంది, వెనకటి కొహాయన అతిథికి విస్తట్లో వడ్డించి, అతడు పరిషేచనం చెయ్యబోతూ వున్నప్పుడు "ఎవడ్రా నిన్ను రమ్మన్నది తిండికి'' అంటూ అన్నట్టు. యిల్లాంటి వాటినిపట్టి చూస్తే యాతావతా యేమిటి తేలుం దంటే—ఒకావిడ యితరుడితో గూడా గది ప్రవేశించి తలుపులు బిడాయించుకుని తెల్లార్లూ ఉండి ఉదయం తన పాతివ్రత్యమహిమని ప్రజల్లో ప్రకటించుకోవచ్చు నన్నమాట, ఇల్లాంటి స్వేచ్ఛే గదూ ఆడదాని క్కావా లంటూ అందరమూ ఘోషించేది ?

ఇప్పటి కవికుమారుల దృష్టి చాలావరకూ రాజుల్నీ, రాజ్యాల్నీ విడిచిపెట్టి సామాన్యులు, బీదలు, వారి జీవితాలు మొదలైన వాటి మీదికి మళ్లింది. అల్లాంటి బీదవార్ల జీవితతత్త్వాన్ని నిర్ణయిస్తూ యీమధ్య నొకాయన ఒక కథలో ఒక మహోదయామయురాలు ఒక బీదముష్టిపిల్లవాడికి కొంచెం చను విచ్చి, క్రమక్రమంగా వాడు చిన్నచిన్న మాటలచేత తన్ను స్వాధీనం చేసికోగా తన మొగుడి మాట లక్ష్యపెట్టక వాడి మూలాన్ని తనకీ, ఘరకీ కూడా హాని తెచ్చుకున్నట్టు వర్ణించాడు. అది స్వాభావికంగా ఉందని ఆయన అభిప్రాయం కాబోలు. కాని అందులో సంగతంతా స్వభావానికి విరుద్ధంగానే వుంది. రసం ప్రధానంగా ఉంటే పెద్దవాడి చరిత్రే బాగుంటుంది—తక్కువవాడిది బాగుండదు—లేక తక్కువవాడి చరిత్రే బాగుంటుంది. రాజులు మొదలైన వాళ్లని గొప్పగా వర్ణించడం విరుద్ధం అనడానికి ఏమీ వీలు లేదు.

అంచేతే, నవీనులు కొత్త ఛందస్సు ఆశ్రయించి నంతమాత్రాన కవిత్వంలో నవ్యత కలగదు. రసం చిప్పిలుతూ వున్నప్పుడు ఏఛంద స్సయినా బాధ లేదు. అది ప్రధానం కాకపోతే ఎన్ని ముత్యాల సరాలూ పగడాల సరాలూ కూర్చినా ప్రయోజనం లేదు.

గ్రాంథికభాషలోనే వాఙ్మయం అంతా ఉండి తీరాలని మడికట్టుకొని కూచోవడం కూడా అంత సరసంగా లేదు. మొదట్నుంచీ తెలుగులో పద్య కవిత్వమే ప్రారంభమైంది—సంస్కృతంలోలాగ. పద్యకవిత్వానికి కావలసివచ్చింది కట్టుబాటు. మాట్లాడుకుంటున్న భాషలో పద్యాలు రాస్తే బా

గుండ వన్న సంగతి అందరూ అంగీకరిస్తారు. స్వేచ్ఛని చంపుకోవడంచేత—కట్టుగాట్లకి లొంగ వలసిన అవసరం కలగడంచేత—అనవసరపదాలు పద్యకవిత్వంలో తమ ప్రాభవం చూపించాయి.

మన పూర్వీకులైన లాక్షణికులు పద్యభాగాన్ని వ్యాకరణసంస్కృతమైనభాషలోనీ, గద్యభాగాన్ని వాడుకభాషలోనీ వ్రాస్తూ వచ్చారు. గద్యం వ్యవహారభాషలో ఉండొచ్చునని వాళ్ల మతం. అంచేతనూ, పాత్రోచితమైన భాషనే వాడడం ఉచితం కొబట్టిన్నీ వ్యవహారభాషను నిరసించడం కూడని పని. అంధరికీ గ్రాంధికం వాడా లంటే ఒహ దానీది (గొప్ప పండితుల యింట్లోది లెండి) బిచ్చగాడితో "ఇచ్చో బిచ్చం బిమ్మువా రెవ్వరున్ లేరు, పోరా!" అని వెనక ఒహ చోట పలికినట్లు పలకడం సభ్యం కాదనుకుంటాను.

ఇదివరలో కొందరు పండితులు పలికినట్లు మన వాఙ్మయాన్నుద్ధరించడానికి పద్యంకంటె గద్యమే ఎక్కువ అవసరమైనది. వెనకటి వాళ్లు రాసిన పద్యగ్రంధాలు చాలినన్ని ఉన్నాయి మనకి. భారతభాగవతాదులకంటె రసవంతంగా పద్యాలు రాస్తున్నా మని కొందర నుకోవడం ఉత్త మాట. అంచేత మనపూర్వీకులు యేవిషయంలో ప్రయత్నం చెయ్యడం మానివేశారో అందులో అంటే_గద్యలో బాగా పరిశ్రమ చేసి గ్రాంధికంలో గాని వ్యవహారభాషలో గాని, ఏవిషయానికి ఏది సరిపడి—సొగసుగా ఉంటుందో ఆలోచించి పుస్తకాలు గాని, వ్యాసాలు గాని రాసే బాగుంటుంది. సామాన్యంగా కథలూ, నాటకాలూ, కొన్ని రకాల విమర్శనలూ వ్యవహారభాషలో రాస్తేనే మే లని తోస్తుంది. ఈపై సంగతుల్ని కవులు, పండితులు బాగా ఆలోచించాలి; గాని ఏదో కవిత్వం చేస్తున్నాం, ఏవో పుస్తకాలు అచ్చుపడి అమ్ముడయి పోతున్నా యని ఆత్మతృప్తిని పొందడంవల్ల ప్రయోజనం లేదు.



# సబ్బుబిళ్లలు

భారతుల పున్నయ్యశాస్త్రిగారు

"ఇదిగో"

"ఆఁ"

"చూచారా?"

"ఏమిటది?"

"చూపిస్తుంటే కనబడటం లేదూ?"

"కనబడుతూనే వున్నది"

"మరి యేమి టంటా రేం చూస్తూనే?"

"నే చూస్తుంటే మటుకూ నీవు చెప్పకూడదా యేమిటి?"

"అయిపోవచ్చింది."

"సబ్బుబిళ్లేనా?"

"ఆఁ"

"సరే దాని కిప్పణ్ణుంచి..."

"మరి మీతో ఏదైనా మూడు నెలలు ముందుగా చెబితేనేగా..."

"అందుకనా?"

"ఆఁ"

"సరేలే"

౨

"ఎక్కడికి?"

"బజారుకు"

“ఎందుకు?”

“సిగిరెట్లకోసం”

“సబ్బు కూడా పట్టుకరండి”

“ఉండంగానే హాతం చెయ్యకు.”

“అవసరానికి తెచ్చే మామూలు లేనుగా మనకు?”

“తెస్తారులే”

“సబ్బు తీసుకరావద్దు”

“ఏం? ఏం వచ్చింది యింతట్లోకే? అంటివిని గా?”

“ఏమని?”

“తెస్తానని”

“ఆహాఁ! ఏదో ఒకటి నేర్చి వుండ మన్నారు.”

“.................”

“తెస్తారులే. అని కసరుకోలే?”

“ఇంత కోప మైతే యెలాగా కాపరం?”

3

“నిత్యం చెబుతూనే వున్నా”

“నే మటుకూ తెస్తా నంటం లేదూ?”

“సరే. యింకా ఏం? ఐనట్లే పని”

“ఇంకా యేమిటి? తెస్తా నంటూంటే చెపట మెందుకు?”

“రోజూ తెనూనే వుంటారా యేమిటి?”

“ఒకనాడు తెస్తే రెండోనాడు ఆడుగుతావా ఏం?”

,,తేకుండా మాటలు మాత్రం కోటలు ధూకించండి”

,,ఇదిగో, మీఅన్నయ్య గోడలు ధూకుతాట్టే. నిజ మేనా?”

,,సిగ్గు లేకపోతే సరి. మీతమ్ముడు ధూకాడుగా మొన్న చాలదూ?”

,,మీ అమ్మకు ఉత్తరం రాశావా?”

,,కార్డు తెచ్చి యిస్తేనా యివ్వండా?”

,,ఇవాళ్ల తేనా?”

,,తెచ్చేవా రడగడ మెందుకు?”

,,...................”

,,ఏవో కబుర్లు చెప్పి సబ్బుమాత్రం తేవడం మానెయ్యండి”

౪

,,చూశారా? నాలుగు రోజులు కన్న రాదు”

,,నీవు రో జంటే అది వారం రోజులు వొస్తుంది”

,,అంటారు గాని ఇంత చిన్న సబ్బుతో అస లెవ్వరూ తోముకోరు”

,,నీవు కొబట్టి పాదుపు చేస్తున్నావు”

,,నిజంగాను”

,,సబ్బుబిళ్లలు మానెయ్య మంటున్నారు స్వదేశం వారు”

,,పోనీయండి. సిగిరెట్లు మాత్రం కాల్చనిస్తే బ్రతుకుతాం”

“అవ్వీ వద్దన్నారు”

,,పోనీ స్వదేశపు సబ్బులే తీసుకరండి”

,,అసలు మానెయ్య మంటూంటేనే?”

,,అబ్బ! ఏమి దేశభక్తి కారిపోతూన్నది?,,

,,కాక మరేమిటి నాశనమౌతుంటే దేశం సబ్బులతోటీ ఆడవాళ్లతోటీని”

,,అట్లాగేం?”

,,మరి యేమి టనుకున్నావ్?”

,,నామాట మటుకు మరిచిపోవద్దు”

౫

,,జ్ఞాపకం వుందా?”

,,మరచిపోతానా?”

,,ఏం తెస్తారు?”

,,పౌట్ రోసు తేనా?”

,,వాడిందేగా?”

,,పియర్సు తేనా?”

,,విదేశాలు గా?”

,,లక్సు”

,,విదేశం. పైగా సున్నపువాసన గూడానూ,,

,,మరేదో పురమాయించండి రాణిగారు,,

,,మైసూరుసబ్బులు బాగుంటాయిగా? పట్టుక రండి,,

,,తెచ్చిన తరువాత రాణీగారికి నచ్చకపోతే యేలాగ?,,

,,నాలు గైదు రకాలు పట్టుకరండి చూచి తీసు కుంటాను,,

,,ఐతే సబ్బుల లిస్టు తెచ్చి యిస్తాను చదువు కోని మంచిది పురమాయించు,,

,,చివరకి సబ్బూ వుండదు. లిస్టూ వుండదు. ఇదొక తంతు,,

,,ఎబ్బే? లిస్టు సాయంత్రానికి తెస్తే సరిగా?,,

,,చూడక బోతాం,,

౬

,,తెచ్చారూ?,,

,,ఏమిటి? సబ్బుబిళ్లేనా?,,

,,అదుగో?,,

,,ఏమిటి?,,

,,లిస్టు తెస్తా మన్నారు గాదూ?,,

,,అరె...మరచిపోయా,,

,,చాల్లెదురూ. నే చెప్పలేదూ తంతని?,,

,,లే లే లే. నిజంగానే మరచిపోయాను,,

,,నాకు లిస్టూ వద్దు గిస్టూ వద్దు సబ్బు పట్టుక రండి,,

,,ఇవాళ్లే తెచ్చి యిస్తే సరిగా లిస్టు?,,

,,వద్దంటినిగా,,

,,అంత కోప మైతే యెలాగా?,,

,,కోప మేమిటి నాకు లిస్టు వద్దు,,

,,ఐతే సబ్బు బిళ్లే తేనా?,,

,,సాయంత్రానికి తప్పకుండా తీసుకరండి,,

,,సాయంత్రం గాదు రేపు,,

,,సరే. ఇహను మీయిష్టం,,

,,అదేమిటి?,,

౭

,,తేలేనుగా?,,

,,తెద్దా మనుకుంటూంటే............,,

,,మరి యివాళ్ల లేదు,,

,,రేపు తప్పదు. ఒక్కనాటికి ముంచుకోని పోలేదు లే,,

,,ఎన్నాళ్లనుంచి చెబుతున్నాను?,,

,,నిజమేలే. మరి జ్ఞాపకం............,,

,,ఏమంటే ఏం తీసుకోనిరానికాడికి?,,

,,మరిచిపోయా నని చెప్పాను గాదూ?,,

,,ఒకనాడా రెన్నాళ్లా?,,

,,ఏం చెప్పనూ?,,

,,నే నంటే అంతే లేదురూ?,,

,,నీ వేమిటి ఎవ రైనా అంతే జ్ఞాపకం లేక పోతే,,

,,మీ యిష్టం. తెస్తే తెండి లేకపోతే లేదు. ఇహను మాత్రం చెప్పను,,

,,ఎందు కంత కోపం?,,

,,కోపమూ లేదూ గీపమూ లేదు,,

,,మరిచేపోయినందు కూడా మాతి బిగించు కుంటే యెలాగా?,,

౮

,,ఇదిగో కానిని మంచినీ ళ్లెత్తుకురా?,,

,,....................,,

,,ఈగ్లాసు ఎక్కడిదే? మందేనా?,,

,,....................,,

,,గోదావరి వేనా యీ నీళ్లు? అప్పుడే యెప్పుడు తెచ్చా?,,

,,....................,,

,,అబ్బాయి ఏడి?,,

,,....................,,

,,వంట ఐందా?,,

,,....................,,

,,ఈచీర మీ అమ్మ పండక్కు పెట్టిందికాదూ?,,

,,తాకవాకండి,,

,,ఏం?,,

,,ఎందుకూ తాకడం?,,

,,...................,,

,,కోపం వచ్చిందా యేమిటి సబ్బు తేలేదని?,,

,,...................,,

,,పిచ్చిపిల్లా! ఇంత మాత్రానికే కన్నీళ్లా?,,

,,ఎన్నాళ్లనుంచి చెబుతున్నాను?,,

,,తేలే దనే నీ నమ్మకం! నీ ట్రంకులో చూచుకో ఎన్ని సబ్బు లున్నాయో?,,

,,...................,,

,,నవ్వు ఆపుకోకూడదు,,

,,చాల్లేదురూ?,,

,,...................,,

,,చిలిపి చేష్టలు పోలే పెద్దవా రైనాను,,



# గంగాధరుఁడు

## శ్రీ శేషాద్రి రమణ కవులు

కాకతీయ సామ్రాజ్యధూర్వహు లగు మంత్రి సత్తముల జీవిత చరిత్రము చాలవఱకు మరుగుపడి యున్నది. ఈమధ్య మేము గడించిన నగునూరు శాసనమువలన గంగాధరుఁ డను మంత్రివర్యుని గూర్చిన విశేషము లు గొన్ని తెలిసినవి. ఇవి చరిత్ర జిజ్ఞాసువుల కత్యంతోపయోగము లను తలంపుతో ప్రచురించుచున్నారము.

ప్రకృతశాసనము నిజాము రాజ్యము నందలి కరీమునగిరమునకు ఆరుమైళ్లు దూరమునఁగల నగునూరులోని జీర్ణాలయము చెంతఁ బ్రాఁతి పడి యుండఁగా నొక రాజకీయోద్యోగి కరీమునగరమునకుఁ దెప్పించి తన కార్యస్థానమునఁ బ్రాతించినాఁడు. తెలుపువన్నె గల సాధారణ శిలపయి నాలుగువైపుల నిది వ్రాయఁబడినది. పడమటివైపు చెక్కి లేచిపోవుటచే 36, 37, 38, 39, 40 పంక్తులలోఁ గొంతయంశము లోపించుటచే విషయసమన్వయమునకుఁ గొంత యిబ్బంది కలిగినది. శాసన మంతయు నింకొకమాఱు ప్రచురింపనెంచి ముఖ్యాంశముల మాత్రము దృష్టాంత సమన్వితముగాఁ బ్రచురించుచున్నారము.

శాసనపద్యకవిత ధారాళముగను మనోజ్ఞధారా శోభితముగను నిరుష్టముగనుండి తిక్కననాటి యాంధ్రకవితను జ్ఞాపకమునకుఁ దెచ్చుచున్నది. శాసనకవి పేరులేదు. రసవత్తరమగు ప్రథమ పద్యమిది.

శ్రీరామాధిపుఁ డింద్రనీల నిభ శా • రీరుండు దారుండు గౌ
రీరామాధిపుఁ డుజ్జ్వల స్ఫటిక శా • రీరుండు ధీరుండు భా
షారామాధిపుఁ డబ్జకేసర లస • చ్ఛాయా శరీరుండు నుం
గారుణ్యంబున మాకు నీవుత సదా • కాలంబు గామ్యార్థముల్.

### చరిత్రాంశములు

వేంగిదేశమున చెల్లకియను పురవరంబు గలదు. అచట ఆత్రేయగోత్రులు పలువురు గలరు. అందుఁ గొమ్మనార్యుఁడు జనించెను. ఆయనకు నారాయణుఁడను తనయుఁడు జనించెను. నారాయణుని భార్య ఐతమాంబ. ఈదంపతులకు గోవిందుఁడు జనించెను. ఈయనభార్య తురకమాంబ. ఈదంప

తులకు మన కథానాయకుఁడగు గంగాధరుఁడు జనించెను.

గంగాధరుఁడు విష్ణు భక్తుఁడు. సకల కళావిధిజ్ఞుఁడు. ఈయన కాకతి ప్రోలరాజు పిలుపున వేంగి దేశమునుండి ఓరుగంటి సామ్రాజ్యమునకు వచ్చి నగరకార్య నిర్వాహకుఁడుగఁ జిరకాలము పనిచేసెను. ప్రోలభూపాలుని యనంతరము గంగాధరుఁడు కాకతీయ రుద్రదేవునికడ నమాత్యుఁడై నియోగవృత్తులు, అందలము, శ్వేతచ్ఛత్రము, వస్తుస్వాస్థ్యములు బడసి దేవబ్రాహ్మణ ప్రీతికరములగు కార్యములు పెక్కు లొనరించినాఁడు. ఇంతియగాక, రుద్రదేవుని యనుగ్రహమున డోండండు అను నగ్రహారములు విద్వాంసులగు బ్రాహ్మణులకు ధారాపూర్వకముగ నొసంగెను. మఱియుఁ దానొసంగిన యగ్రహార గ్రామమున త్రికూటరూపమగు శివాలయము తటాకము పుష్పవాటికలు ప్రతిష్ఠించెను.

రుద్రదేవుని యనుగ్రహాతిశయమున గంగాధరుఁడు అనుమకొండలో ధ్రువేశ్వరము చెంతఁ బ్రసన్న కేశవాలయమును బ్రతిష్ఠించెను. పున్నేశ్వరాలయముచెంత శివాలయ మొకటి నెలకొల్పెను. అందే త్రిమూర్తుల యాలయము, గంగాచెయ చెఱువుచెంత కేశవాలయము నెలకొల్పి సమీపమున బ్రాహ్మణుల సంధ్యాదిక్రియలకొక యాశ్రయము గట్టించెను.

సుప్రసిద్ధమగు హిడింబక్షేత్రమునం దిదివఱకే పెక్కు దేవళములు ప్రతిష్ఠింపఁబడియుండ నచట విష్ణుప్రతిష్ఠయు, బట్టశాల యను క్షేత్రమునందు "జినోహరి" యను వాక్యానుసారముగ హరి బుద్ధస్వరూపుఁ డను భావనతోడ బుద్ధప్రతిష్ఠ యొనరించెను. ఉత్తమతీర్థమగు సంవర్తకేశ్వరము నందు శివాలయము నిల్పెను. కాకతీయరుద్రదేవుని యనుగ్రహంబున రుద్రేశ్వరసమీపమునఁ ద్రిమూర్త్యాలయమును నెలకొల్పెను. మంత్రకూటమునం దొక విశాలతరమగు నీశ్వరాలయమును బ్రతిష్ఠించెను.

నగునూరులో ఇరువదినాలుగు మూర్తులతోఁగూడి యున్న అచ్యుతుని బ్రతిష్ఠించి యట మహత్తరము లగు ఆలయములను గట్టించెను. సప్తసంతానములతో బాటుగ గంగాధరుఁడు కృతకృత్యత నొందెను.

ఈశాసనమును గంగాధరుఁడు శా॥ శ ౧౦౯౨ వికృతి సంవత్సర మాఘశుద్ధ పంచమి బుధవారము నాఁడు (క్రీ. శ. 1170) ప్రతిష్ఠించెను.

ఈ శాసనమునందు ప్రోలభూపాలుఁడు, ఘోరతరాజిలోలుఁడు, అతి అకుటిలచిత్తుఁడు అని ప్రశంసింపఁబడినాఁడు. ఈప్రశంస తగియేయున్నది. ప్రోలభూపాలుని జీవితమంతయు సామ్రాజ్యస్థాపనము నకుఁ దీక్షకృషి చేయుటతోఁ గడిచినది. అవి యన్నియు గంగాధరుఁడు స్వయముగా నెఱింగినవే గాన మొక్కవోని ప్రోలుని ధీరమునకు మెచ్చి ఘోరతరాజిలోలుఁ డను విశేషణము జేర్చినాఁడు. ప్రోలరాజు కాలమున గంగాధరుని రాజకీయపరిజ్ఞానము ప్రఖ్యాతమయ్యెను. అతని మరణానంతరము రుద్రదేవుఁడు రాజ్యమునకు వచ్చుటయు గంగాధరుఁడు మంత్రియగుటయు నొకకాలమునందె జరిగియుండనోపు. ప్రోలభూవల్లభుని మరణమును గూర్చిన కథ యెంత సత్యమో నిరూపింప వీలులేకున్నను ప్రోలుని పరోక్షమున గంగాధరుఁడు మంత్రియగుటకుఁ గొంత కారణమేదేని యుండ వచ్చును. గంగాధరుని ఇతరశాసనములా యంశమును బలపఱచునేమో వెదకవలసి యున్నది. రుద్రదేవుఁడు కాకతీయులలో మిగులఁ బ్రతాపవంతుఁడు. ఆంధ్రవాఙ్మయాభిమాని. ఈయనను తృతీయావిభక్తి విశేషణములతో గంగాధరుఁ డీక్రిందివిధముగాఁ బ్రశంసించినాఁడు.

శ్రీకాంతాకాంతుచే నా
శ్రితవిబుధ జనాభిస్థిర ప్రాజ్యరాజ్య
శ్రీకాంతాకాంతుచే వి
స్ఫురిత నిజభుజ నిస్త్రింశ నీతాన్యరాజ
శ్రీకాంతాకాంతుచే దిక్
క్షితి గగన సమాశ్లిష్ట విస్పష్టకీర్తి

శ్రీ కాంతాకాంతుచే నూ
ర్జిత మృగరాజీ మృగారాతిచేతన్.

చం॥ పరనరపాలమౌళి మణి భాస్వరదీపితతా ని
తాంత వి
స్ఫురిత పదాబ్జుచే, నహిత భూతలనాథ వరూ
ధినీ సరో
వర మథనప్రభూత మదవద్విరదాధిపుచే, వి
రోధి భూ
ధరశిఖరప్రభిన్న విదిత త్రిదశేంద్రనిశాత
హేతిచేన్.

కం॥ సురకరిపతి మృగపతిహరి
సురసతి ధవల సరసిరుహ శుక్తి సదృక్
సురుచిరవిశద యశో భా
సురనిధిచే సుకవితరణి సురనిధిచేతన్.

కం॥ శరనిధి పరీతధాత్రీ
పరిపాలితదక్షిణప్రభాసి [త] భుజవి
స్ఫురు చేత నవ్యకుండా
పురనాథుం డైన రుద్రభూపతిచేతన్.

ఈ విశేషణములు రుద్రదేవుని పరాక్రమజీవితమునను రాజధాని శాసనకాలమున అనుమకొండలో నుండె ననుటను ఆనాటి శాసనకవితారచనము గ్రంథకవితకుఁ దీసిపోవ దనుటను జాలును. అనుమకొండలోని రుద్రదేవుని యాలయశాసనముకీ శాసనము ఎనిమిది సంవత్సరముల కావల నెలకొల్పఁబడినది కాననే గంగాధరుఁడు గావించిన రుద్రేశ్వరమునందలి ప్రతిష్ఠాదికములు సమన్వయింపవీలైనది

లఘువిమర్శనము

గంగాధరుఁడు నియోగిబ్రాహ్మణుఁడు. ఈయన ప్రోలరాజు కాలమున నగరాధికారిగను రుద్రదేవునికాలమున మంత్రిగనుండెననుటచే రుద్రదేవునికంటె వయస్సుదాటిన వాఁడని చెప్పవచ్చును. ఆకాలమున జైనమతము మంచి విజృంభణముగ నుండెను. వైదికమతమువారు జైనుఁడు బుద్ధుఁడు నొకఁడె యనియు జినోహం' యను సూక్తి ననుసరించి జైనపూజ చేయవచ్చునని యుఁ దలంచినటులఁ గానఁబడుచున్నది. తరువాతికాలమున గణపతిదేవుఁడు శైవవిద్వాంసుల కాశ్రయమిచ్చిన కొలఁది జైనుల కవలంబనము తొలంగి వారి మతము దుస్థితికి వచ్చినదని తోఁచుచున్నది. రుద్రదేవుని కాలమున వైదికమతమువారు జైన బౌద్ధులయెడ సాదరభావముతో వర్తించిరనుటకుఁ గాకతీయ సామ్రాజ్యనిర్వాహకుఁ డగు గంగాధరుని శాసనములోని జినప్రతిష్ఠ చాలును.

గంగాధరుఁడు మతిప్రభాతియందు సురగురువనియు సకలకలావిధిజ్ఞుఁడనియుఁ బ్రశంసింపఁబడుటెకాక కృతిగూడ నందినటులఁ జెప్పఁబడినది. ఆంధ్రుల దురదృష్టవశమున ఆగ్రంథరాజ మింతవఱకు వెలువడలేదు. ఎందైనఁగలదో కాలగర్భమునందు జీర్ణమయ్యెనో తెలియకున్నది.

అనుమకొండలోని గంగాధరుని ప్రతిష్ఠలన్నియు దాదాపుగ నశించినటులె తలంపవచ్చును. గంగాచెయుచెఱువు ప్రసన్నేశ్వరాలయము ఎచటనున్నది తెలియదు. శాసనములోఁ బేర్కొనఁబడిన మంత్రకూటము గోదావరితీరమున నిజాము రాజ్యములోఁ గల మంథెనయె. సంవర్తకేశ్వరము బహుశః మానుకోటకుఁ జెంతగల సంకిసగానోఁపు. అంబుధివేష్టితావనికి నాభరణం బగు హిడింబక్షేత్రమున గంగాధరుఁ డాలయప్రతిష్ఠ లొనరించెనఁట. అట శివాలయము లంతకుమున్నె కలవఁట. ఈ హిడింబక్షేత్రము మెట్టుగుట్టయను పేరుతో ఖాజిపేట రైలుస్టేషనునకు మైలుదూరములోనున్నది. ప్రతాపరుద్రీయము ప్రతాపచరిత్రము స్థానికవృత్తాంతము లీయంశమును స్థిరపఱచుచున్నవి. ఇవిగల యాలయములలోను నగునూరులోగల యాలయములందును గంగాధర ప్రతిష్ఠితక్షేత్రముల గుర్తింపఁ గల యవకాశములు నశించినందులకు వగవవలసియున్నది.

గంగాధరుఁడు నగునూరిలో చతుర్వింశతిమూర్తి

యుక్తమగు విష్ణువిగ్రహమును బ్రతిష్ఠించినటుల నీ క్రింది పద్యమునఁ గలదు.

"ఉ. శంశిత భక్తియుక్తి ననిశంబు నిజాంధ్రులు గొ
ల్చు నబ్జభూ
వంశము శోభిలన్ బ్రజల వాంఛిత పుణ్యఫల
ప్రదున్ సురా
ర్యంశజ దర్పహారు ?—నచ్యుతునిన్ నగునూర నేఁ
జతు
ర్వింశతిమూర్తి యుక్తముగ విశ్వమయాత్ముఁ
బ్రతిష్ఠ సేసితిన్."

ఇరువదినాలుగు తీర్థంకరులతోఁ గూడిన జైన విగ్రహమె యిందు విష్ణువిగ్రహముగఁ బేర్కొనఁబడినది. లేకున్నఁ జతుర్వింశతి యవతార సహితమగు విష్ణుప్రతిష్ఠయే పురాణానుసారముగఁజేయ వీలగును? నగునూరులోని యొక జీర్ణాలయముచెంత చతుర్వింశతి తీర్థంకర సహితమగు జైనవిగ్రహము గోచరించినది. జినోహారి యనుటయు బుద్ధుఁడు జినుఁడు విష్ణునిమూర్త్యంతరము లనుటఁ బట్టి చూడ నగునూరిలోఁ గావించిన చతుర్వింశతి రూపవిష్ణుప్రతిష్ఠ జైనప్రతిష్ఠ యే.

ప్రకృత శాసనమునందు రుద్రదేవునకు "సుకవితరణిసురనిధి" యను విశేషణముపయోగింపఁబడినది. ఇంతకుమున్నఁ గనుగొనఁబడిన యితని విద్యాభూషణ బిరుదమును సుకవితరణి సురనిధియను విశేషణము బలపఱచుటేకాక యీ నరపాలుఁడు కవితాభిమానియని తెలియఁజేయును. వేంగిరాజ్యము రాజనీతి విదులకు నెలవు. చాళుక్య సామ్రాజ్యమున నెందఱెందఱో రాజనీతి విదులు ప్రతిష్ఠగడించి సామ్రాజ్య నిర్వహణ చాకచక్యము గనుబఱుచుటచే రాజకీయ కార్యనిర్వాహకుల నటనుండి పిలిపించుకొను నాచారము కాకతీయులలోఁ దఱుచుగా నున్నటులఁ గొన్ని శాసనములవలనఁ దెలియుచున్నది.

శాసన లిపివ్రాఁతగనుండి కాకతి రుద్రదేవుని శాసన లిపికంటె విలక్షణముగనుండి యాంధ్ర లిపికిఁగల ప్రత్యేక వ్యక్తిత్వము సూచించుచున్నది. శాసనము మొదటివైపు ౨౫ పంక్తులు రెండవవైపు ౨౨ పంక్తులు మూఁడవవైపు ౨౩ పంక్తులు నాలుగవవైపు ౨౦ పంక్తులుగ వ్రాయఁబడినది. పాదాంతమునందలి నకారపొల్లునకు సువర్ణము, అర్ధానుస్వారమునకుఁ బూర్ణానుస్వారము, యకారమునకు వలపలగిలక యిచ్చు చోద్విత్వము ఋత్వముగల తావుల గుడిక్రావడి, లోనగు సామాన్య వాఙ్మయ విశేషములే యీ శాసనమునందును బాటింపఁబడినవి. మొత్తముమీఁద శాసన పద్యసంఖ్య 31. పద్యాదిని కందమును కందయనియుఁ జంపక మాలికాదుల వృత్తయనియుఁ బేర్కొనెను. వచనమునకుఁ బేరులేదు. పురుషోత్తమ యనుటకు బురుషోత్తమయని, లోలేక్షణియని యు రూపములిందుఁ జెప్పఁబడినవి. మొత్తముమీఁద శాసనము నిర్దుష్టమగు గ్రాంధిక భాషలో సమర్థుఁడగు ప్రబంధ కవిచే వ్రాయింపఁబడెనని తోఁచును.

శాసనము నందలి పద్యములను బ్రకృత కాలమున వ్రాయఁబడు విధముగ సంస్కరించి యిందు లిఖించితిమి. శాసనకాలమగు పండ్రెండవ శతాబ్దమున మహావైభవోపేతముగను, మనోహర శిల్ప సంవృతములుగను నలరారిన నగునూరు, అనుమకొండ, సంకిస, మంతెన, హిడింబాశ్రమము (మెట్టుగుట్ట) దేవళములు నేఁడు శిథిల శిలావృతములై పరిశోధదృష్టికి మాత్రము పూర్వస్వరూపము గోచరింపఁ జేయుచున్నవి.

ఆంధ్రుల చరిత్రమునఁ గాకతీయుల చరిత్రములోఁ బ్రోలరాజు రుద్రదేవుల కాలమునందును బండ్రెండవ శతాబ్దమునాటి యాంధ్రభాషా పోషకుల పట్టికయందును గంగాధరుని చరిత్రము లభించి నంతవఱకేని జేర్చినచో భవిష్యత్పరిశోధనమున నింకఁ గొన్ని విశేషములు లభింపవచ్చును.



# సౌందర్యోపాసిని

సహదేవ సూర్యప్రకాశరావు గారు

నాకు పిచ్చివాళ్లంటే చాలా సరదా. వాళ్లు ఎప్పుడూ వింత స్వప్నలోకంలో, స్వయంగా సృష్టించుకొన్న ఊహాప్రపంచకంలో నివసిస్తారు. వాళ్లు అలా ఉండకపోతే వాళ్ల జీవితం మహాదుర్భరంగా ఉంటుంది.

వాళ్ల పిచ్చే వాళ్లకి ప్రాణరక్ష......కాని అకస్మాత్తుగా ఎప్పుడో ఒకప్పుడు వాళ్లు సుస్థితిలోనికి రావచ్చును. వాళ్లు తమ ఉన్మత్తావస్థకు కారణం తెలిసికొని పునః ఉన్మత్తులైపోవచ్చు. లేదా మరణించిపోవచ్చు.

మానవసహజస్వభావాలకి, సంఘాన్ని చక్కట్లు దిద్దే శాసనాలకి వారు విదూరులు. వారికి దుర్ఘటమయ్యే కార్యమేదీ లేదు. వారు తలచుకున్నంత మాత్రాన మహీశులైపోతారు. మహానుభావులైపోతారు. మహాదేవులైపోతారు. వారు నిత్యయౌవనుల క్రిందే; నిత్యబలీయుల క్రిందే; నిత్యసుందరుల క్రిందే ఉండగలరు. వారు సతతం అనిత్యవాతావరణంలో మెలగుతూ ఉండడంచేత వారెప్పుడూ ఆనందరసాధిష్ఠానదేవతలే! ఒకదానికొకటి సంబంధబాంధవ్యము లేని, ఎక్కడ పుట్టి ఎక్కడ గిట్టుతవో తెలియరాని భావనాపథాలకు నిలయమైన వారి మనస్సులను పరిశీలించడమంటే నాకు అపరిమితానందం. ఆచూడడం ఎలాగ ఉంటుందంటే? భీషణగర్జనలతో పొంగులు వారుతూ ప్రవహించే ఒక నదీమతల్లి జన్మస్థానాన్ని అవలోకించినట్లే ఉంటుంది.

౨

ఒక రోజున పిచ్చి ఆస్పత్రిని చూడడానికి వెళ్లాను. నాకు అక్కడి విశేషాలు చూపిస్తున్న వైద్యుడు "మీ కిప్పుడొక యపూర్వ విషయం చూపించబోతున్నాను" అన్నాడు.

డాక్టరు ఒక గది తలుపు తెరచినాడు. తెరచి అగది అంతర్భాగాన్ని చూపించినాడు. అక్కడ నలభై ఏళ్లు దాటిన సౌందర్యరాశిని చూచినాను. ఆమె ఒక కుర్చీలో కూర్చుని చేతిలో నున్న అద్దములో తన విలాససంపత్తిని చూచుకుంటున్నది. ఆవిడ మమ్మల్ని చూచిన తక్షణమే చటాలున లేచి గది చివరభాగానికి పోయి అవగుంఠనంతో మొగమెల్ల ఆచ్ఛాదనం చేసికొని మాచెంతకు వచ్చినది.

"ఇప్పుడు ఎలా గున్నది మీకు" అన్నాడు డాక్టరు.

ఆమె ఒక దీర్ఘనిశ్వాసము విడిచిపుచ్చి "ఏమని చెప్పను? నా అవస్థ చాలా విషమంగా ఉంది. దినదినానికి అవి పెచ్చుపెరుగుతున్నవి" అన్నది.

ఆమె తలుస్తున్నట్లు ఆమె అవస్థ విషమంగా లేదని ఆమెచేతనే ఒప్పించుదామని డాక్టరు మృదులస్వరంతో "మీరు దురభిప్రాయపడుతున్నారు" అన్నాడు.

ఆమె ఇంకా దరిదాపునకు వచ్చి "నిజమే, నిజమే. ఈయుదయాన్ని పది ఎక్కువ కనిపించాయి. ఎడమ చెక్కిలిమీద మూడు, కుడిచెక్కిలిమీద నాలుగు, ఫాలభాగాన్ని ఒకటి...దుర్భరము. ఈస్థితిలో ఉండగా నన్ను ఎవ్వరిని చూడడానికి అంగీకరించను. అంగీకరించను — కన్నకుమారుణ్ణి సహితము" అని కుర్చీలో కుంచుకొనిపోయి వెక్కివెక్కి రోదింపసాగింది. డాక్టరు కూడా ఆమె ప్రక్కనున్న కుర్చీలో కూర్చుని ఆదరణపూర్వకంగా "అయితే సరే...చూడనీయండి...కొంచెం మందు రాస్తే తగ్గిపోతవి క్షణములో" అన్నాడు.

చూపించనని ఆమె ఔదల పంకించింది. ముసుగుతీయడానికిప్రయత్నించినాడు కాని డాక్టరు, ఆమె భల్లూకపుపట్టు పట్టడంచేత వీలులేకపోయింది. ఆమెను శాంతిపరచుదామని ప్రయత్నించి డాక్టరు "ఎందుకు అలా బాధపడతారు. మీకు వచ్చిన

మచ్చల నన్నిటిని నే నెలా మాసిపోవేస్తున్నానో మీకు తెలియును గా—ఎవ్వరు మీకు మచ్చలు వచ్చి నట్లే తెలిసికోలేరు. మీకు చూపించకపోతే నేను బాగుచేయడ మెలాగు? నేను బాగుచేయలేను...” అన్నాడు డాక్టరు.

ఆమె లోలోన గొణిగికొన్నది.

“మీకు చూపించడానికి నా కీషణ్మాత్రమయినా అభ్యంతరము లేదు...కాని మీతో వచ్చిన వారిని నే నెరగను...” అని నెమ్మదిగా అన్నది.

“అదా మీ సందేహము. అందుకు మీ రెంత మాత్రం సందేహించవద్దు...ఆయన కూడా డాక్టరు గారే. ఈవిషయాల్లో సిద్ధహస్తుడు” అని డాక్టరు చెప్పి నమ్మించిన మీదట ఆమె ముసుగు సడలించినది. ఆమె ఉద్రేకపూరితయై భీతావహ అవడానికి నాకు కారణాలు గోచరించలేదు. మా పరిశీలనను తప్పించుకుంటు ఆమె మొగము వాంచికొన్నది. ఆమె వదనంమీద ఒక గుర్తు గాని, ఒక చుక్క గాని అథవా ఒక చిన్న గీత గాని లేదు. ఆమె ఊర్ధ్వముఖియై నాతో “మా అబ్బాయికి వచ్చిన జబ్బులో నేను పరిచర్యలు చేయడంచేత నా కీ భయంకర మయిన వ్యాధి తటస్థించి...విశేష సపర్యలు చేసి వానిని బ్రదికించుకొన్నాను...కాని నా కీ రోగం వచ్చి పడింది. సాధారణంగా లోకం లో వనితలు దేనిని మహాభాగ్యంగా చూచుకుం టారో దాన్ని నా కన్నకుమారుని కోసం—అతని ప్రాణరక్షణ కోసం త్యజించాను...నా ధర్మాన్ని నేను ఆచరించడం చేత నాహృదయం ప్రశాంతంగా ఉంది. అయినా ఈ నారకయాతనను అనుభవించక తప్పదు” అన్నది.

ఇంతలో డాక్టరు మందులో ముంచిన బ్రషును తీసి “ఇది సరిచేయనీయండి” అన్నాడు.

ఆమె తన కపోలాన్ని పైకి ఎత్తింది. డాక్టరు ఆ బ్రషును పుచ్చుకొని లేని మచ్చలమీద అద్దినాడు. ఫాలభాగాన్ని కపోలభాగాన్ని కూడా అమందంతో అద్దుతూ “ఇప్పుడు చూడండి—ఒక్క మచ్చయినా లేదు. ఒక్కటీ” అన్నాడు డాక్టరు.

ఆమె అద్దంలో మొగం చాలా సేపు చూచుకొని అనంతబాధ నిర్వృత్తి అయినట్లొక దీర్ఘ నిశ్వాసం విడిచిపుచ్చింది.

“నిజమే. ఒక్క మచ్చా లేదు. లేదు నిజమే. మీకు చాలా కృతజ్ఞురాలను” అన్నది.

డాక్టరు లేచాడు. మేమామెవద్ద సెలవు పుచ్చుకొని బయటకు వచ్చాము.

3

ఆమె గదితలుపు మూసి డాక్టరు “ఆ దురదృష్టవతి ఆత్మకథ చెప్పుతాను విను” అన్నాడు.

ఆమె ఒకప్పుడు స్ఫురద్రూపి. ఆమెకు జీవితం సుఖస్వప్నంగా ఉండేది. ఎన్ని నాళ్లు గడచినా జీవితం మీద ఏహ్యభావం గాని విరక్తి గాని కలగ లేదు. ఆమె సౌందర్యపిపాసువు. సౌందర్యం కోసమే ఆవిడ జీవిస్తున్నది. సౌందర్యార్చనయే ఆవిడకు జీవితపరమావధి. ఎప్పుడు ఏనిముసం ఆమె శరీరం సడలిపోతుందో ఏమో అనే భావన హృదయాన్ని కలగించడంచేత నిరంతరం శరీరపోషణలో నిమగ్న అయ్యేది.

ఇలా ఉండగా ఆమె భర్త పరమపదించాడు. ఆమె వైధవ్యజీవితం నెరపవలసివచ్చింది. ఆమెకు ఒక్క గాని ఒక్క కొడుకు కావడంచేత ఎంతో మురిపెంగా ఎంతో అపరూపంగా పెంచుకునేది. ఎంతో శ్రద్ధగా చదువు చెప్పించుకొనేది.

ఆ అబ్బాయి పెరిగి పెద్దవడం ఆమెకు అశనిపాత మయినట్లయింది. తన కుమారునికి యౌవనాంకుర మవడం తన వార్ధకదశకు నాంది అయిందని గ్రహించుకొన్నది. కాలానికి రెక్కలుంటవి. దాని పురోగమనాన్ని ఎవరూ నిగ్రహించలేరు. ఆనాటినుండి ఆమె భీతావహ యైపోయింది. నిరంతరం పరితాపంతో కొట్టుకొనిపోయేది. ఆనాటినుండి ఒక చేతి అద్దాన్ని సర్వదా దగ్గర ఉంచుకునేది. ఆమె లలాటభాగాన్ని వనితాసౌందర్య

వినాశకము లైన ముడుతలు పడుతున్న వేమో అని పదేపదే పరిశీలిస్తూ ఉండేది. సౌందర్యాపోషణ కరా లగు వస్తువులను ఎన్నిటినో ఆమె భద్రపఱచేది. నానా దేశాలనుండి వచ్చే విలాసద్రవ్యాలతో ఆమె గది శోభస్కరంగా ఉండేది. మానవులు జీవి తాన్ని ఎలా వంచింపమాస్తారో అలా ఆమె ప్రకృతిని వంచింప చూసేది.

ఆమెకు ముప్పది అయిదేండ్లు ఉంటవి. అప్పుడు ఆమె కొడుకు జబ్బుపడ్డాడు. మొట్టమొదట అతని రోగకారణం గుర్తించడం కష్ట మయింది. రోగిని ఆస్పత్రికి తీసికొని వెళ్లారు. ఆమె ప్రతి ఉదయం ప్రతి సాయంకాలం చక్కగా దిద్ది తీర్చికొని జబ్బుగా ఉన్న కొడుకుని చూడడానికి ఆస్పత్రికి వేళ్లేది. వెళ్లి ద్వారము దగ్గరే నిలిచి నవ్వుతూ "అబ్బాయి! ఎలా గున్నది. కులాసాగా ఉన్నావా" అనేది.

జ్వరంతో బాధ పడుతున్నా ఆపిల్లవాడు "కొంచెం నిమ్మళంగానే ఉంది అమ్మా" అనేవాడు. మళ్లీ ఇంకోసారి వచ్చి "అబ్బాయి! డాక్టరు ఏ మన్నాడు" అని తొందర తొందరగా అడిగేది.

ఒకనాడు ఆమె మామూలుగా సింగారించుకొని ఆస్పత్రికి వెళ్లింది. అక్కడి వారు "అమ్మా! నీకొడుక్కి స్ఫోటకం వచ్చింది" అన్నారు. ఆ మాట విని కెవ్వున కేక వేసింది. చరాచరా ఆగది విడిచి వెళ్లిపోయింది.

అమరునాడు దాసి నిద్రలేపడానికి వచ్చింది. ఆగది నిండా మందు చల్లబడి ఉంది. రాత్రి తెల్లవార్లూ కంటికి కూర్కు లేకపోవడంచేత ఆమె పాలిపోయి ఉంది. వడవడ వడకిపోతూ ఉంది.

దానిని చూచి "అబ్బాయికి ఎలా ఉంది" అని ప్రశ్నించింది. "బాబుగారికి సుతలాం బాగా లేదు" అని జబా బిచ్చింది దాసి. మధ్యాహ్నం లేచి సరిగ్గా భోజనం చేయకుండగానే వైద్యుని వద్దకు వెళ్లి స్ఫోటకం రాకుండా కాపాడుకోవడానికి మందులు అడిగి తెచ్చుకున్నది.

అమర్నాడు కూడా ఆమె కుమారునికి నిమ్మళించలేదు. ఆమె గదివిడిచి ఒక్క నిమిషం బయటకు రాలేదు. రోజూరో జెల్ల ఆమె మాటలుగలతో గడిపిం దని దాసి చెప్పింది పది రోజులు గడిచాయి. కాని ఆమె బయటకు రాలేదు.

పదకొండో రోజున కొడుకు ట్యూటరు ఆమెను చూడడానికి వచ్చి లోపలికి కబురు పంపాడు. ఆమె లోపలికి దయచేయ మన్నది. కుర్చీ చూపించి కూర్చోమన్నది. అతడు కూర్చోడానికి నిరాకరించి "అమ్మా! మీ అబ్బాయి చాలా దుబావస్థలో ఉన్నాడు. మిమ్మలిని చూడా లని తపిస్తున్నాడు" అని చెప్పినాడు.

"అయ్యో దేవుడా!" అని వెక్కి వెక్కి ఏడుస్తూ మంచంమీద కుంచుకునిపోయింది.

"డాక్టరు ఏమీ ఆశ ఉన్నట్టు చెప్పడం లేదు. మీ అబ్బాయి మీకోసం అంగలారుస్తూ మీ రెప్పుడు వస్తారా అని నిరీక్షిస్తున్నాడు" అని చెప్పి ప్రత్యుత్తరాన్ని ఆసించక ఆయన వెళ్లిపోయినాడు.

రెండు గంట లయిన తర్వాత రోగి తన అంత్య దశ దగ్గరిల్లిన దని ఎరిగి తల్లికోసం పలవించాడు. ట్యూటరు మళ్లీ తల్లి దగ్గరకు వచ్చాడు. అత డా గది విడిచి వెళ్లే టప్పటికి ఆమె ఏ అవస్థలో ఉన్నదో ఇప్పటికీ ఆమె ఆ అవస్థలోనే ఉన్నది. వెక్కి వెక్కి ఏడ్వడం కూడా మాన లేదు.

"అబ్బా! నేను...నాకు చాల భయముగా ఉంది. నేను రాలేను.........అన్నది. ట్యూటరు ఆమెను శాంతింపచేయడానికి చాలా ప్రయత్నించాడు. ఆమెను రోగి దగ్గరకు బలవంతముగా నైన తీసికొనివెళ్లడానికి ప్రయత్నించాడు. కాని ఏమీ లాభం లేకపోయింది. ఆమె రోదనధ్వనులు మాత్రము విశేషించిపోయినవి. కాని ఏమీ ప్రయోజనము లేకపోయింది.

డాక్టరు కూడా వచ్చాడు. ఆమెను బలవంతముగా కుమారుని దగ్గరకు తీసికొని వెళ్లా లని భావించాడు. ఆమె ద్వారమువద్దకు వచ్చి ద్వార

మును పట్టుకొని వ్రేలాడింది. తరువాత ఆమె డాక్టరు పాదాల మీద పడి తనని క్షమించా లని తాను చాలా పిరికిదాన నని, తన కుమారుణ్ణి తాను అత్యంతంగా ప్రేమిస్తున్నా నని, అతడు తప్పక జీవించు నని అతడే తన జీవనైక సారమని...... ఎంతో జాలిగా ప్రాధేయపడింది.

౪

ఆమె కొడుక్కి అంత్యకాలము ఆసన్న మయింది. మరణబాధ పడుతున్నాడు. చావు తెలివి రావడం వల్ల తన తల్లి మనస్సును గ్రహించుకున్నాడు. అన్ని సంగతులు బోధపరచుకున్నాడు.

“మా అమ్మ నన్ను చూడడానికి ఇష్టం లేక పోతే దూరంగా కిటికీకి అవతలగా నైన నిలబడ మనండి. నే నామెవద్ద నుంచి కళ్లతో సెలవు పుచ్చుకుంటాను” అని గొణుగుకున్నాడు. డాక్టరు మళ్లీ ఆమె దగ్గరకు వచ్చి “నీ కిప్పు డేమీ అపాయం కలగదు. ఎందు కంటే నీ వాతనికి చాలా దూరంలో ఉంటావు. కిటికీకి అవతలగా నిలబడు” అన్నాడు.

ఆమె అందుకు అంగీకరించింది. చేతితో స్మెల్లింగుసాల్టు సీసా పట్టుకుని బయలుదేరింది. కొంగ మంతా కప్పేసుకుంది.

“నాకు ధైర్యం చాలదు. నాకు చాలా సిగ్గుగా ఉంది. భయంగా ఉంది” అని ఆమె గొణుగు కొంటూనే ఉంది. ఆమెను బలవంతంగా నిర్ణీతస్థలానికి తీసికొని వెళ్లారు. ఆమె అక్కడనుంచి ఒక్క అడుగు అయినా ముందు వేయలేదు. దారి బోయే వాళ్లు వినేటట్టుగా మూల్గ సాగింది. ఆమె కొడుకు కిటికీకేసి తల తిప్పాడు. మూసికొని పోతున్న కన్నుల నెత్తి పవిత్రమయిన తల్లిని—అందాలరాసి అయిన తల్లిని—అంత్యకాలంలో తుదిసారి చూచాడు.

అతడు అలా చాలా కాలం చూచాడు. అర్ధరాత్రి వరకు ఆగోడవైపు తల త్రిప్పుకొని కన్నులు మూసికొన్నాడు. ఆత డొక్క పలుకయినా పలకలేదు.

మరునాటి యుదయాన్ని ఆ అమాయికుడు మరణించాడు.

ఆమె ఉన్మత్త యైపోయినది.

( ఇది ఒక ఫ్రెంచికథకు తర్జుమా )



# ఉత్తర రామ చరితము

డాక్టర్. చిలుకూరి నారాయణరావుగారు ఎం, ఏ., పిఎచ్, డి., ఎల్. టి.

(మొదటి సంచిక తరవాయి)

## అరవ తెనుగు

“నీరసమైన కావ్యమును నిండ రసావహమౌను (విమర్శకుల స్నేహము కల్మిని)-అవతారిక.

“ఈ దినము నిండ శుభావహమయ్యె”—పు. 28. అరవవారు ‘రొంబా చందోషం’ అన్నట్టు.

## కేవలశాస్త్రంపుఁ గంపు.

(1) “వచ్చితి నిపుడు వాల్మీకి వలన నుండి”—పు. 29.

‘హిమగిరి వలన నుండి గంగవొడమెం”—చిన్నసూరి.

(2) “ఓ జననిరో!...ఓ తల్లిరో!”

(3) “దుగిణుఁడు”—పు. 131 ఇది ద్రుహిణశబ్దభవముగా అచ్చ తెలుగు కావ్యాలలో వాడేమాట.

## అచ్చ తెనుగు కావ్యాలవాసన.

(1) దూషణాఖ్యుండు నలఖరుండు మూఁడు తలలవాఁడు”—పు. 38.

త్రిశిరుఁడు అనే సంజ్ఞావాచక శబ్దానికి తెనుగు,

(2) "నా కూఁతును బరిశోధించుట కగ్ని యెవఁడు?"—పు. 89.

"అతనికిఁ బ్రీతి యెక్కువ యీ రాజు కూఁతునందు"—పు. 92.

చిన్నయసూరి లక్షణానికి సరిపోయినా, అరవము చదువుకొన్న వారికి 'కూతు' అంటే అశ్లీలార్థము స్ఫురిస్తుంది. అరవములో 'కూతు' అంటే 'యోని' అని అర్థము. వ్యవహారములో కూతును, కూతునందు అనే రూపాలులేవు కూతురిని, కూతురియందు అని ప్రయోగాలు తప్పలు తిప్పలుగా ఉండగా చిన్నయ్య పరమప్రమాణము కావడమువల్ల ఈ అనర్థము వచ్చినది.

## సంధులు.

ఎచట నుండిట వచ్చెనో (52); ఏలినాతనిన్ (అవతారిక.)—ఈ సంధులు పంతులుగారి కిష్టమయితే మాకు సంతోషమే. కాని, 'గులగులనుచు' (45) అని సంధిచేస్తే చెవికసహ్యముగా ఉంటుంది.

## వచనదోషము.

"ఎవరురా సేవకుఁడు (27); మాన్పు వారు సరసులె కాదే (అవతారిక); వదినెగా రడుగుచున్నది. (11); పూనె మా యన్నగారు (12); జనకసుత నాకుఁ గూఁతురే యనెడువారు మహారాజెప్పుడును (91); దేవర యిట్టి నిశ్చయ మెట్లు చేసితిరో గదా (23).

## లింగదోషము.

"సల్లకి వృక్షపంక్తులన్ (సల్లకీ), 41;

## పురుష వ్యత్యయము.

(1) "దేవర యిట్టి నిశ్చయ మెట్లు చేసితిరో గదా"—(23)

ప్రథమపురుష కర్తకు మధ్యమ పురుషక్రియ, 'వాడు వచ్చినావు' వలె.

(2) (మీరు) "ఏమని పిలిచిరి యింతకు మున్దు?"—(109) మధ్యమ పురుషకర్తకు ప్రథమ పురుషక్రియ, 'నీవు వచ్చినాడు' వలె.

## గ్రాంథిక సంఖ్యాపరిజ్ఞానము.

'పదియు నాలుగు వేలును బసుగురు మఱి నలుసురును'—(38)—'పదియు నాలుగు వేవ్వురు' అని ఉండవలెనేమో!

## అరసున్నలు.

(1) సిద్ధములైన అరసున్నలు తెలియక పోవడము : 'ఏంగుచనో' అని లక్షణ ముదాహరించి, సార్థానుస్వారముగా 'ఏఁగు'కు ప్రయోగాలిచ్చి చూపినా, మేము చూపించినాము గదా అని పంతులుగారు అరసున్న ఉంచడము మాని ఉంటారు. చూ. అవతారిక v, 3, 92 102; 'ఏఁటికి'లో అరసున్న ఉండవలసినా విడిచిపెట్టినారు (110).

(1) 'పరగు'లో అరసున్న లేదయ్యా అని మొరపెట్టుతూ ఉన్నా పంతులుగారికి తమ పట్టుపదలే తమది. చూ. 40, 42, 88.

(2) సాధ్యములైన అరసున్నల తబ్బిబ్బులు : ద్రుతము మీద అరసున్న వస్తుందా, ద్రుతము లోపించి నప్పుడు వస్తుందా అని పంతులుగారు చాలా తికమకలు పడ్డారు. మొదట వ్రాసినప్పుడున్ను, పుస్తకమంతా అచ్చయి నంతవరకున్ను కూడా ద్రుతము మీద అరసున్న తగిలించినారు. దిద్దుకొన్న అరసున్నలు ఏ మును గురువులము 6. 8 స్థిరవర్ణములకు ముందు అరసున్న ఉండదని మొదట మరచిపోయినారు. 'రామభద్రుకినిఁ గూడ"—6;—అదిగోఁ జూడు (12);—భయఁపడి (83)—మువర్ణము లోపించింది కాబట్టి ఇచ్చట అరసున్న ఉండవలెనని భ్రమపడ్డారు;—దిద్దుకొన్నారు కారా అంటారేమో! పరిచితము కాని దాని నొకరి నడిగో, పరిశోధన చేసో దిద్దుకోవాలి. డబ్బైభయేళ్లు వచ్చినా, ఇంత కృషి చేసిన వారయినా ఈ స్వల్పవిషయాలలో కూడా పంతులుగారికి సందేహాలు విడలేదే. బడిపిల్లలు, జ్ఞానతృష్ణ గలిగిన పామరులు, వీరిమాటయేమిటి? కడవరకున్ను అరసున్నలు నేర్చుకొంటూ ఉండడమేనా? దేశములో విద్యావ్యాప్తి ఇం

ముమూలముగా అవుతుందా? ఇన్నిచోట్ల పంతులుగారు కష్టపడి దిద్దుకొని 29 వ పుటలో 'నిన్ను నేనెవరినిఁగా నెఱుంగవలయును' అనిన్ని, 22 వ పుటలో 'లోకప్రీతినిఁ గాదే' అనిన్ని ప్రమత్తము మీఁది అరసున్నను తీసివేయకుండా ఉంచినారే! 43 వ పుటలో 'అలుంగు'=(ఖడ్గము)లో అరసున్న ఉంచినారు, దీనికి ప్రయోగము? శబ్దరత్నాకరములో ఉన్నది గనుకనా? అచ్చట ప్రయోగమివ్వలేదు. పంతులుగారైనా యిస్తే నేర్చుకొంటాము. 112 వ పుటలో "మెఱుపుఁ దమము సుగ్రంబుగాఁ బెరసినట్లు" అని వ్రాసినారు. 'బెరయు' ధాతువు పరుషాది యని పంతులుగారి భ్రమ.

ఈ రీతిగా మాకు గ్రాంథిక భాషలో అనేక సందేహాలున్నవి. అడుగడుగుకు మా పని తడవుకొనడమే. చూడండి, ఒక్క ఉదాహరణము: 'మెఱుపు' అనవలెనా? 'మెఱపు' అనవలెనా? ఎంతో చిన్నవిషయము. కలిపికొట్రా కస్తూరిరంగా అనే వారిలో చేరితే సందేహానికే అవకాశము లేదు. కాని, మామనస్సొప్పుకోదు. పంతులుగారు 'మెఱుపు' అని ప్రయోగించినారు. శబ్దరత్నాకరములో 'మెఱపు' ఉన్నదిగాని మెఱుపు లేదు. శ. ర. లో ఇచ్చిన ప్రయోగమువల్ల సందేహము తీరదు. ఏమిచేయడము."

## మాముద్దుల వ్యవహారము.

పంతులుగారు పరిషద్వస్త్రాచ్ఛాదితులయినా వారున్ను మావంటివారే. వారు మాత్రము రసికులు కారా? లౌక్యములో ఆరితేరినవారు లోకవ్యవహారము నెట్లు తప్పించుకోగలరు? వారు మావలెనే నవ్వుతారు, మావలెనే ప్రశ్నిస్తారు, మావలెనే సందేహిస్తారు, దేశకాలపాత్రముల ననుసరించి సంభాషిస్తారు, మావలెనే కోపము, సంతోషము, హర్షము, అంతా మావలెనే. మడికట్టుకొన్నప్పుడు మాత్రము యథాశక్తి జపము, అంతే. ఆభేషజము మాత్ర మెందుకుఅని మాప్రశ్న. ఎవరేమనుకొన్నా, పంతులుగారు మా వ్యావహారికభాషా పోషకులే. కాకపోతే చూడండి వ్యావహారికభాషకు ఆధారముగా ఎన్ని ప్రయోగాలు చేసినారో!

1. "నాయికా నాయకులలో ఒకరు మరణింపఁగా వారు తిరిగి వచ్చువఱకు రెండవవారు పొందు దుఃఖము కరుణమనఁజెల్లదు." (ఉపో. iii)

"నాయికా నాయకులలో నొకరు లోకాంతరగతులై తిరిగి లభింపఁదగిన వారగుచుండ వారికై రెండవవారు దుఃఖించినచో." (ఉపో. iv)

పైవాటిలో ఒకరు, వారు, అనేవి ఉభయలింగాలుగా వ్యవహారములో ఏర్పడ్డ ఏకవచనాలు. గౌరవార్థములో బహువచనాలని చెప్ప వీలులేదు.

2. "ప్రత్యాశారూపకమైన రతి లేనిదే కరుణ విప్రలంభము పుట్టనేరదు." ఉపో. v.

2. అట్టి తలంపేమాత్రమున్న నతఁడు రాముఁడే కాకపోవలసివచ్చును. ఉపో. vi.

4. 'విదూరస్థా' యనుద్దుపలోఁ బడవలయుగాని సీత మఱియొక పద్దులోఁ బడుట కవకాశము లేదు గదా. ఉపో. vii, viii.

5. మాటకు మాటపెట్టి యొక మాడ్కిని మాటిన మెత్తురేబుధుల్, అవ. 2. అత్తగార్లకు (5) వియ్యంకులు (10); కుదుపు (18) ఈ అర్థములో శ. ర. కారుడివ్వలేదు; ఇది యర్థవాదములే (22); బొత్తిగా (56);

అకస్మాత్తుగా (56), పిల్లలు (మనుష్య శిశువులు) 30, 60, 98; పెళ్లి (ఇది కొందరు గ్రాంథిక వాదుల మతములో గ్రామ్యము) 35, 45, 46, 47, 50, 87, 95, 157; అట్టెయున్న (అట్టేఉండు, అట్టేపెట్టు మొ. వలె) 81; ఐనట్లా లేనట్లా 88; నాప్రియసఖియునైన కౌసల్యా? (86); కురుపు (87); తన్నిమిత్తమైయే (87): శాస్తి (100); మూసుకొనియె (72); ఈమె కాదూ? (73); చాట (77); తట్టెమదికి (107); ఇడుములు సైతము (49); వినికిడి (52); పైని (17); గిరులు మాత్రము (44); ఈమెంద లగు (65); మాయు మొనరించు (66); ఐతిగాదు

(67); అం 65, 89; ఊం హూం, 82, 97; నన్ను వేఁపుచున్న దానవు (71); నాతపంబు ఫలమే [అవధారణము], 37, తొడిమ (50); నామీఁద నే యీ కనుబొమల ముడిపెట్టుట? (122); ఈమె యేనా యీ కౌసల్య? (91); అంటించు (92); కావి పంచెయున్ (94); ఇడిగో (109); ఎంతకాల మేడిపింపను? (78); సమితపడుము (78, 80, 87); చూడను జూచినాఁడను తెలియను తెలిసినది (103); మాటుంగనున్న (114); విఱుగుడు (114); కురిపించు (124, 156); గట్టిగా కౌఁగిలింపు (127); ఏమీ! రఘునాథుఁడే; (129); వినియోగపడియెఁ గదర (134)- దీనికి ప్రమాణము మా (1) చెల్మోహనరంగా పాట; (2) గదరాసుమతీ. చెవులు (137)— ఇది అప్పకవి ప్రకారము గ్రామ్యము;

## పాదపూరణాలు.

తలఁపన్ (8); లలిన్ (12); చూడఁగ (19); పరఁగ (40, 42, 88); ఇచ్చుచో (118).

## వాక్యాన్వయము.

ఇచ్చట రతి యనఁగాఁ బునస్సమాగమాభిలాష రూపకము. (ఉపో. v.)

అధ్యయన హేతువులగుచు గడ్డము లు నరసిన యీ తపోధనులకు (81).

## శ్రుతిదుర్భగములు.

బాలసిక, ఈ పెద్ద (20); నాకూఁతును పరిశోధించుటకు (89); ఈ రాజు కూఁతునందు (92).

## ప్రాసగణాదులకోసము కకర్తుర్తులు.

"పలుకు బడివేఱు పదపాటి వేఱు, రీతులును వేఱ యన్వయరీతివేఱు" (అవ. 2)

"రుదితముచ్ఛ్వాస ఫలదంబ యదియు మేల"— 67; రాముండు లేఁడన్న వార్త లేద" (68)— పైవాటిలో అవధారణమునకు ప్రయోజనము కనబడదు.

"సురతసుకాళి" (119), "సంపరిశుద్ధ" (86), పద్మగంధ లసితవారి...అవక్రకాండ లసిత పద్మపత్రము" (60), "క్ష్మాకాంతా తనయ నైన (7), దండకాఖ్యవనవీధి, కౌశికాఖ్యమౌని, భూరిదరీదరస్థలుల బుస్సలు కొట్టుచు నిద్రవోవుసీ, భూరిఫణీంద్ర దేహముల (39).

పూర్తిగాను (119), అరయఁగాను (153)— మొదలయినవి.

## తెనుగు సంప్రదాయము.

"పుసువుల్ మేయంగ (కౌసులు), 36,—పశువులు పచ్చిగడ్డి, పురుగులను తింటవిగాని మేయవు; మేత మేసవి.

"అనంటె యీకసుల్"—62, ఈరము అనే మాట మాండలికము; ఇది యిప్పటికిన్ని మారా యలసీమలో వాడుకలో ఉన్నది. లతలగుంపు ఈరమని ఇచ్చటి వాడుక. ఇతర ప్రాంతాలలో ఇది వాడుకలో ఉన్నట్లు కనబడదు. చెట్ల యీరము లని ప్రయోగించకూడ దేమో.

## తెనుగులోని సంస్కృతసంప్రదాయము.

ఈ విషయమై భేదాభిప్రాయా లుండవచ్చును. సంస్కృత నిఘంటువులలోని యే పదాలనైనా తీసుకొని; వాటిని వ్యస్తముగానో సమస్తముగానో, వ్యాకరణావిరుద్ధముగా ఉంచేచాలును తెనుగులో వాడుకో వచ్చునని, కొందరి అభిప్రాయము. మేము మా అభిప్రాయముతో ఏకీభవింపలేము. అట్లే ఒక మాటకు మరి ఒకటి పర్యాయపదము గదా అని నిఘంటువుల నాధారముగా చేసుకొని వాడకూడదు. తెనుగులో కొన్ని సంస్కృతశబ్దాలు కొన్ని సంస్కృతసమాసాలు మాత్రమే కవులు వాడుకొన్నారు. అది ఒక సంప్రదాయముగా ఏర్పడినది. దానికి విరుద్ధముగా ఇప్పటివారు ప్రయోగిస్తే, ఆ ప్రయోగము నిఘంటు వ్యాకరణాలకు విరుద్ధము కాకున్నా అనౌచిత్యదోషానికి పాలవుతుందని మా అభిప్రాయము. అట్టివి కొన్ని— 'అస్మదాది సహితలు' (80), గంభీరమాంసల సనితము (52), త్రసహరిణాక్షి, (భీత) 66; జ్యాఘోష

రణితాస్త్రము (ఘోషము రణితము కానేరదు), పుత్రభాండము (101), కర్మములధాని (అంగారధాని, గోపాలధాని, రాజధాని, అగ్నిధాని, క్షురధాని, రజ్జుధాని, మొదలయిన ధానులున్నవిగాని, కర్మములధాని ఉంటుందా?) 120; అహో! 100, 108, 110 సంస్కృతములోని అవ్యయాలను అదే రీతిగా తెనుగులో వాడవచ్చునా? 'అహో' కుమాకాక్షేపణము లేదుగాని, 'హంత' నేనెంత క్రూరుడను (90)' అనే ప్రయోగము మాత్రము తెనుగు మర్యాద ననుసరించినది కాదు.

కవితాధార

ఉత్పల, చంపకమాలలు, శార్దూలమత్తేభవిక్రీడితములు, వ్రాసేటప్పుడు పంతులుగారికి కొంతధార కుదిరినది, కాని, కందములు, తేటగీతములు, ఆటవెలదులు, ధారాశుద్ధిగా వ్రాయడము అలవాటు కాలేదు. అందుచేత చాలా పద్యాలు కుంటుగా నడుస్తున్నవి. కొన్ని ఉదాహరణాలు—

క. ఉత్తరరామచరితముఁ బ్రయోగింతుమిదే (1)
గీ. శాంతయను కన్యఁబడసి దశరథవిభుఁడు) (2)
గీ. వనితల యొషలను గవుల వాక్కులందు (3)
గీ. జనకుఁడు మఱలి మిథిలకుఁ జనియెనిపుడె (4)
గీ. యాగము వలన మేమిట నాగినాము (7)
గీ. కలసి మనమున్న యాదినములు చనెఁగట. (11)
గీ. బృందము నివరియన్నంబుఁ బ్రీతితోడ (14)
క. ఏకార్యమయిన నొనర్తు రెప్పుడు సుజనుల్ (22)
గీ. వచ్చితి నిపుడు వాల్మీకి వలననుండి (29)
క. అలరులకంటె న్మృదువులు నై యుండు మహా (84)
గీ. సుజనులవలని చావును శుభకరంబ (87)
గీ. అల్ల దక్షిణపునగము అశ్వ సుమ్ము (46)
ఆ. వె. అతిగభీరమగుట నగపడదు పయికి
కుతకుతమనుచు నుడుకు పుటపాకముగతి
గురుతరమగు రాము కరుణరసము. (47) [(50)
గీ. శారదతపనుఁడు కేతకీగర్భందళముఁబోలె
ఆ. వె. ఇప్పుడు నవి విడువ వీథలంబు (62)
మొదలయినవి.

అతికి గత్రము చాలును. ఫుటఫుటకును ఇట్టి కుంటు పాదములు దొరలినవి. గణాలు కుదుర్చుకొనడానికి పంతులుగారు చాలా శ్రమపడి ఉంటారు. వచనము వ్రాస్తే బాగుండునే!

పంతులుగారు మిక్కిలి చిన్న విషయాలలోనే క్రిందా మీదా పడినారు. చూడండి. 'వసిష్ట' అనవలెనా 'వసిష్ఠ' అనవలెనా అని సందేహము. 'ష్ట' రూపాలను కొన్నిటిని తప్పొప్పుల పట్టికలో చేర్చి 'ష్ఠ' గా దిద్దుకోమన్నారు. కాని, కొన్ని చోట్ల దిద్దక విడిచినారు. (82, 152); 'షష్ట' (ఉపో. ix) అని వ్రాసినారు. 'షష్ఠి' అని దిద్ద మరచినారు. ఈ పొరబాటుకు కారణము 'షష్టి=అరవై; షష్ఠి=ఆఱోతిథి; షష్ఠ=ఆఱో; అని వేర్వేరుగా ఉన్నవని గుర్తింపక పోవడమే. ఈ సందేహాలు నావంటి సాధారణుల కందరికీ కలుగుతవి. పంతులుగా రంతటివారికి కూడా కలిగినవి. 'సురచిరాకారుఁడు' (128) అని ప్రయోగించినారు. అరవవారినుంచి నేర్చుకొన్న తెనుగుపిల్లలు 'వరవీణామృదుపాణి, వనరుహలోచనరాణి, సురచిరబంభరవేణి' అని పాడుతారు. అట్లే చాలామంది పండితులు కూడా అనడము వ్రాయడము కలదు.

విమర్శించడానికి దొరకి దొరకి ఈ ఉత్తరరామచరిత నాటకమా మీకు దొరికింది? దీనిమీద వినియోగించిన కాలము మరేదయినా మంచి పనిమీద వినియోగిస్తే బాగుండునే అని నా స్నేహితులు కొందరు నన్ను మందలించినారు. కాని, అనేక ప్రయోజనాలు ఏకదేశములో లభించడముచేత ఈ అవకాశమును వదలుకొనడానికి నామనస్సొప్పలేదు. 1. లోకములో అనేకులు గ్రాంథికవాదుల మని చెప్పుకొని, వ్యావహారిక వాదులను బహిరంగముగాను చాటుగాను మాటతో నిందిస్తూ, చేతితో అపకారము చేస్తూ ఉన్నవారున్నా, వారి అనుయాయులై, వారి అగ్రహానికి ఎక్కుడ పాత్రుల

పోతామో అని దిగులుపొందేవారున్నూ, ఎన్నో గ్రంథాలు వ్రాస్తున్నారు. సాధారణముగా ఇట్టి అన్ని గ్రంథాలలోను గ్రాంథికభాషామర్యాదల నతిక్రమించడము, వ్యావహారికభాషను విచ్చలవిడిగా, అప్రయత్నముగా ఉపయోగిస్తూ ఉండడము జరుగుతున్నది. అట్టివారు చేస్తూఉన్న దోషాలన్ని ఈ ఆంధ్రీకృతోత్తర రామచరితములో గుమిగూడి మూర్తీభవించినవి. దీనిని పట్టుకొంటే ప్రతిగ్రంథమును వేర్వేరుగా విమర్శింపవలసిన పని పడదు. (2) గ్రాంథికవాదులలో పంతులుగారు అగ్రేసరులు. ఇదిగాక, మరెవ్వరయినా అయితే 'చిత్తము, చిత్తము, పొరపాటు కలిగినదండి, దిద్దుకొంటాము; 'ప్రమాదోధీమతామపి' అని ఉన్నదిగదా అండి. మేము కూడా మనుష్యులమే. తప్పులు కలుగకుండా ఉంటవా' అని తప్పించుకొంటారు. కాని, పంతులుగారికి నిద్రలో కూడా గ్రాంథివాదుల మీద కత్తులు నూరుతూ ఉన్నట్టే కలవరింత. ఈ విషయములో శ్రీవారికి గల పట్టుదల మరేవిషయములోనయినా ఉంటే, దేశానికెంతో మేలుకలిగి ఉండేది. మొన్నమొన్న ఆంధ్రయూనివర్సిటీ కమీషనులో తెనుగుకు ఎక్స్పర్టు సభ్యులుగా ఒక కాలేజికి పోయి, ఒకానొక పండితునితో "ఏమండీ, ఇక్కడికి పర్లాకిమిడి గాలి ఏమయినా సోకిందా" అని అడిగినారట. పర్లాకిమిడి కొండ గాలివల్ల శరీరానికి మంచి బలము కలుగుతుందని పంతులుగారికి తెలియదు. కొండగాలి తీవ్రమైన స్వాతంత్ర్యబుద్ధిని, సాహసమును, ధైర్యమును వృద్ధిచేస్తుందని చరిత్ర చదువుకొన్న వారికి తెలుసును. స్వతంత్రబుద్ధిని కోరి చంపుకొన్నవారు, ఇతరుల స్వాతంత్ర్యమునకు కూడా నిరోధము కలిగించవలెనని ఉబలాటపడతారు. పరిషన్నిఘంటు నిర్మాణము మందగించడానికి కూడా పంతులుగారి వ్యావహారిక భాషాద్వేషమే కారణమని వినికిడి. (3) మొదటిలో వ్యావహారిక భాషావాదానికి నిష్కారణముగా అడ్డుతగిలి, లోకమును భ్రమపెట్టి, దేశాభివృద్ధికి పంతులుగారు తీరరాని అపకారము చేసినారు. అప్పుడూ, ఇప్పుడూ కూడా ఆంధ్రవిశ్వవిద్యాలయములో తమకుగల పదవిని దుర్వినియోగము చేస్తూ అనేకవిధాల భాషకు అపకారము కలుగజేసి, చేస్తున్నారు. ఆంధ్రవిశ్వకళాపరిషత్తులో ఉభయభాషాప్రవీణ పరీక్షాప్రణాళికను తగలబెట్టినది వీరే. ఆవిషయమున వీరు చేసిన కృషి వల్ల తెనుగుభాషకు ప్రాధాన్యము సంపూర్ణముగా తొలగిపోయినది విద్యాభివృద్ధి విషయములో వీరు చేసిన ఘనకార్యమిది. (4) ఆంధ్రవిశ్వవిద్యాలయ కమిషనులో ఎక్స్పర్టు సభ్యులుగా వేసుకొంటే, వీరు తమ రిపోర్టులో తెనుగు బాగా వ్రాయడానికి ముఖ్యోపాయము అరసున్నలను, బండిఱాలను సరిగా వాడడము నేర్చుకొనడమే అని ఒక్కమాటతో తీర్పు చెప్పినారు ఈ ఉపాయమును మొదటినుంచీ అందరు పండితులున్ను ఉపదేశిస్తున్నదే. అందుకోసమే కళాశాలలో తెనుగు అభివృద్ధికి రాకుండా ఉండడము.

## కవులకూ, వ్యాసకర్తలకూ విన్నపం

ప్రబుద్ధాంధ్రకు ఎవరూ పద్యాలు పంపవద్దు. ఆంధ్రోద్యమమూ, చరిత్రా, సంఘాచారాలూ, మతాలూ వగైరాలను గురించిన వ్యాసాలూ, ఏకాంకనాటకాలూ, కథలూ విమర్శలూ మొదలయినవి వచనంలోనే కావాలి. ప్రకటించని రచనలు పోస్టుబిళ్లలు పంపినగాని తిరిగి పంపబడవు. కర్తలకు వారి రచన పడిన సంచిక మొదలు ౧౨ సంచికలు పంపుతాము. తరుచు రాసేవారికి ఎప్పుడూ పంపుతాము. ఇంతే మేము చెయ్యగల సత్కారం.

ఇట్లు వ్యవస్థాపకుడు.

# వ్యాఖ్యానములు

## సంధానకరణి

ప్రబుద్ధాంధ్రను ప్రశంసించినట్టే ప్రశంసించి (౨౯—౧—౧౯౩౮) గోల్కొండ పత్రిక చివరికి యిలాగ వొక పెద్ద భారం మోపింది.

“సమస్తాంధ్రుల యభివృద్ధిని గోరు ప్రబుద్ధాంధ్ర పత్రిక యీ నిజాము రాజ్యములోని ౭౦ లక్షల ఆంధ్రుల యభివృద్ధిని గూడ గమనించుగాక యని కోరుచున్నాము”

గోల్కొండ వొకప్పుడు దక్షిణాపథంలో అపారప్రాభవం అనుభవించిన గొప్ప రాజ్యం. అనేక శత్రురాజులను చెరపట్టీ, పారదోలీ, సంహరించీ— పరభయంకర మైన మహోన్నతదుర్గం. ఆంధ్రదేశానికి చాలాకాలం రాజధానిగా వుండిన మహానగరం. దక్షిణాపథ చరిత్రలో విశేషభాగం ఆక్రమించిన ఘట్టం.

గోల్కొండ అనగానే అనేక సుఖమయస్వప్నాలు కలుగుతాయి. అనేక సన్నివేశాలు జ్ఞాపకం వస్తాయి. మనస్సు ఏమిటో గుబగుబలాడి పోతుంది.

ఆపేరిట వెలసిన యీ పత్రిక యిప్పుడు నిజామాంధ్ర భూభాగానికి శోధనజ్యోతిగా వుంది. పెన్నిధిగానూ వుంది.

అలాంటి వొక గొప్ప పత్రిక ప్రబుద్ధాంధ్రవంటి చిన్నపత్రికమీద యిలాంటి భారం మోపిందంటే అక్కడి ఆంధ్రుల ఆవేదన యేవిధంగా ముప్పిరిగొంటోందో చెప్పకుండానే తెలుస్తోంది.

అయితే;

నిజాము రాజ్యంలో ఆంధ్రులు డబ్భయి లక్షల మంది వుంటే వుండవచ్చు. అది చాలా పెద్ద సంఖ్యే కావచ్చు. వారూ, మనమూ వొకరి కొకరం సరిహద్దులోనే వుండవచ్చు; కాని వారికీ మనకీ సమ్మంధం యేమిటీ?

వారిదీ మనదీ సంప్రదాయం వొకటే అంటే నిజమే. భాష వొకటే అంటే సత్యమే. జాతి కూడా వొకటే అంటే అదిన్నీ వాస్తవమే; కాని యేదో వొక ప్రతికూలశక్తి వారినీ మననీ చెరో వేపుకీ జబ్బలు పట్టుకు లాగేస్తోంది.

మనని విడిచిపెడితే వారికి ఆంధ్రత్వం లేదు. అలాగే వారిని విడిచిపెడితే మనకిన్నీ ఆంధ్రత్వం లేదు; కాని వారికీ మనకీ యిప్పు డనుబంధం యేమీ కనపడ్డం లేదు. వారు యీ వేపుకి వచ్చారంటే యేదో కాకతాళీయం. మనం ఆవేపుకి వెళ్లామంటే కూడా యేదో మార్గవశం.

సంప్రదాయాలూ, భాషా, జాతీ వేరయినా అరవలకీ మనకీ వున్నంత కలయిక అయినా వారికీ మనకీ వున్నట్టు లేదు.

కాని చరిత్ర విప్పండి. ఇప్పుడు నిజామాంధ్ర భూభాగం అనిపించుకుంటూవున్న ఆప్రదేశం ఆంధ్రదేశానికంతటికీ వొకప్పుడు గుండెకాయ. ఇప్పుడు ప్రత్యేకజాతిగా కనపడుతూ వున్న ఆడబ్భయి లక్షల ఆంధ్రులూ, వొకప్పుడు జగజ్జ్యోతి అనిపించుకున్న మహాసామ్రాజ్యాన్ని నిర్మించి, పాలించి, దేవేంద్రవైభవం అనుభవించిన మహాపురుషుల సంతతివారు.

కొన్ని శతాబ్దుల కాలం అఖిలాంధ్రజాతి యొక్క చైతన్యం అంతా అక్కడ కేంద్రీకరించి వుండింది.

ఇప్పటికీ ఆంధ్రజాతి చరిత్రలోని వొక గొప్ప అధ్యాయం నివురుగప్పిన నిప్పులాగ అక్కడ నిక్షిప్తమై వుంది.

తెలుసుకోగలిగితే యిప్పు డిక్కడా, అక్కడా కూడా యేదో విధంగా —వైశాఖమాసపు వెలయేటిలాగ ముందుకి సాగగలుగుతూ వున్న ఆంధ్ర

జీవనవాహినికి జన్మస్థానమూ, సంగమస్థానమూ వొక్కటే గాని రెండు కాదు.

కాని వారికీ మనకీ ప్రభుత్వాలు వే రయినాయి. భౌతికసంబంధం శాశ్వతంగా తెగిపోయింది.

అయితే మాత్రం?

సంప్రదాయాన్ని యెవరు చీల్చగలరూ?

రక్తసంబంధాన్ని యెవరు భేదించగలరూ?

జాతిని యెవరు విడగొట్టగలరూ?

ధిక్ !

ఎక్కడి మాట యిది? ఎక్కడి స్వప్నప్రలాపం యిది?

అంతా అడవిని గాసిన వెన్నెల. బూడిదలో పోసిన పన్నీరు.

ఇప్పుడు వారి ఆశ లటూ, మన ఆశ లిటూనూ. వారి మొగం అటూ, మన మొగం యిటూనూ. అక్షరాలా వారు వేరూ, మనం వేరూనూ.

అయితే యింతేనా?

నిరవధిక మైన ఆంధ్రత్వం అంతా వొక్కటి కాలేదూ?

అక్కడి ప్రభువుని వారూ, ఇక్కడి ప్రభువుని మనమూ కొలుచుకుంటూనే సమయం వస్తే తోవ వొక్కటే అని అనిపించుకోలేమూ?

నిరాశ అక్కర్లేదు.

ఎక్కడా అసు అల్లాడకుండా, రెండో కంటి వాడికి తెలవకుండా ఎక్కడెక్కడ చెదిరిచెదిరి వున్న ఆంధ్రజాతీ వొక్కటి అయిపోడానికి తగిన సాధనం వుంది.

వొకప్పుడు భరతవర్షాకాశం అంతటా జిగిజిగ్గా మెరిసిన ఆంధ్రతేజస్సుని మళ్లీ తళుకుతళుకు మని పించే నికషం వుంది.

అదే ఆంధ్రోద్యమం.

ఆంధ్రోద్యమానికి ఏ ప్రభుత్వంతోటీ సమ్మంధం లేదు. ఏ ప్రభుత్వంతోటీ సంఘర్షణ లేదు.

ఆంధ్రోద్యమం ఆంధ్రరక్తాన్ని మొదట శుద్ధి చేసి, తరవాత వుడుకెత్తిస్తుంది. ఆంధ్ర సంప్రదాయాన్ని మున్ముందు సంస్కరించి పిమ్మట పురియెక్కిస్తుంది. ఆంధ్రజాతిని ప్రథమంలో మళ్లీ నిర్మించి అనంతరం గద్దె యెక్కిస్తుంది.

ఆంధ్రహృదయాని కది సూదంటురాయి.

ఆంధ్రజీవనాని కది సంధానకరణి.

ఆంధ్రులు నిజాము రాజ్యంలో వుండవచ్చు. మైసూరురాజ్యంలో వుండవచ్చు. తమిళదేశంలో, బొంబాయిలో, మధ్యపరగణాలలో, బర్మాలో, చివరికి ఆఫ్రికాఖండంలో—ఎక్కిమోల మధ్య కూడా వుండవచ్చు; కాని ఆంధ్రోద్యమం వారి అందరిదృష్టి వొక్కచోట కేంద్రీకరిస్తుంది. వారి నందర్నీ వొక్క సూత్రాన్ని బంధిస్తుంది.

ఆంధ్రోద్యమం మహిమ అలాంటిది.

వొకప్పు డది తన ప్రభావం చూపించింది. ఎక్కడెక్కడ వున్న ఆంధ్రుల్నీ వొక్క కంచందగ్గిరికి, వొక్క మంచంమీదికి చేర్చసాగింది.

ఖండఖండాలై చెదిరిచెదిరి వున్న ఆంధ్రప్రకాశాన్నంతటినీ వొక్క తేజఃపుంజంతో అతకసాగింది.

ఓహో! ఎలాంటి సన్నివేశం అదీ! అప్పుడే ప్రారంభ మైన ఆ ఆంధ్రైక్యం ఎంత సురభిళమై ఎంత మధురమై, ఎంత తేజస్వంతమై ఎంత ఆశాజనకంగా వుండేదీ?

కాని అదంతా మనమే చెరుపుకున్నాం.

మన చేతులారా మనం లేస్తూలేస్తూ వున్న ఆ దివ్యసౌధాన్ని నేలమట్టం చేసేసుకున్నాం.

సుడిగుండాలతో నిండి వున్న కాంగ్రెస్సు వెల్లువలో పడి మనం యెక్కడెక్కడికో కొట్టుకు పోయాం.

ఇరుగుపొరుగువారు—తోటివారు తాము తాముగానే వుంటూ, కాంగ్రెస్సుని యథోచితంగా మాత్రమే అనుసరిస్తూ వుండడం చూస్తూనే కూడా మనం సర్వనాశం తెచ్చిపెట్టుకున్నాం.

అయినా ఆంధ్రోద్యమం యింకా స్మృతిపథం దాటిపోలేదు.

ఆంధ్రజాతియొక్క పునరున్నతిసాధనం యింకా విస్పష్టం కాలేదు.

ఇంకా నిరాశపడనక్కరలేదు.

కాని ఆంధ్రుడు వొక్కమాటు నిలిచి, కండ్ల మసకలు తుడుచుకొని, తా నిప్పు డెక్కడ ఏ స్థితిలో వున్నాడో నిదానంగా చూసుకుంటే చాలు.

## "దుడుంగుమంటే గేలం"

అప్పుడు మనవాళ్లు రాయలసీమవారిని ఆంధ్ర విశ్వవిద్యాలయంలోనుంచి "పోతే పోండి. ప్రార్థిస్తారా యేమిటి?" అన్నారు. ఇప్పుడు "అయ్యో! మీరు లేకపోతే యెలాగా? విధిగా వచ్చితీరాలి" అంటున్నారు.

అప్పుడా నిర్లక్ష్యాని కేమి కారణమో? ఇప్పుడీ బేలతనాని కేమి హేతువో?

అప్పుడు మనవాళ్లు ఏ అరవవారి వోటుబలంతో విశ్వవిద్యాలయాన్ని విశాఖపట్నానికి గెంటుకు వచ్చారో ఆ అరవవారి సాయాన్నే రాయలసీమ యువకులు ఇప్పుడు పొందితే "ఎబ్బె! తప్పుతప్పు. జాతికి అప్రతిష్ఠ కాదూ?" అంటూ పెదవులు విరుస్తున్నారు.

ఇలాంటి వన్ని చూసే రాయలసీమవారు సర్కారులమీద అనుమానపడితే — కాదంటే మాత్రం యేమి లాభమూ?

ఇంతకీ:

రాయలసీమవారు ఆంధ్రవిశ్వవిద్యాలయంలోకి రాకపోతేనూ, మద్రాసు విశ్వవిద్యాలయంలో వుండిపోతేనూ వచ్చే ఆపత్తేమిటీ?

అప్పుడు మనవాళ్లు రాయలసీమవారిని తోసేస్తే కలిగే నిజమైన ఫలితం యేమిటో తెలవకుండానే "గెలిచాం" అనుకున్నారు. రాయలసీమవారు కూడా మద్రాసు విశ్వవిద్యాలయంలో వుండిపోతే వచ్చే లాభం యేమిటో వూహించుకోకుండానే "సర్కారులవారికి బదులు తీర్చాం" మనుకున్నారు.

కాని వుద్దేశాలేమైనా, ప్రయత్నాలెలాంటివైనా జరిగింది మాత్రం చాలా మంచి పని.

ఏమంటే?

అరవవారిలో కొందరు అణ్ణామలైవిశ్వవిద్యాలయంలో చేరారు. కొందరు మద్రాసు విశ్వవిద్యాలయంలో వుండిపోయారు. అలాగే కొంద రాంధ్రులు ఆంధ్రవిశ్వవిద్యాలయంలో చేరితే తతిమ్మావారు మద్రాసు విశ్వవిద్యాలయంలో యెందుకు వుండిపోగూడదూ?

మద్రాసు విశ్వవిద్యాలయంలో పదకొండు జిల్లాల ఆంధ్రుల కాయకష్టమూ వుంది. దాన్ని అరవవారి కొక్కరికే భుక్తపరచడం యేం వివేకమూ?

మద్రాసు ఆంధ్రదేశంలోది; కాని అరవదేశంలోది కాదు. ఆంధ్రనగరం; కాని అరవనగరం కాదు. అది ఇంగ్లీషువారికి ఆంధ్రరాజు ఇచ్చింది; కాని అరవరాజు ఇచ్చింది కాదు. అక్కడి ఐశ్వర్యంలో, వర్తకంలో ఆంధ్రుల పాలెక్కువగా వుంది; గాని అరవవారిది కాదు.

ఇలాంటి స్థితిలో మన కక్కడ పలుకుబడి లేకపోయినందుకే మరపిల్లవలసివుండగా మద్రాసు విశ్వవిద్యాలయాన్ని పూర్తిగా అరవవారిపరం చెయ్యడం యేం తెలివి?

సర్ రాధాకృష్ణయ్యగారు రాయలసీమవారే. వారు జగత్పండితులే. మహానుభావులే. వారు ఆంధ్రజాతికి భూషణమే. వారు ఆంధ్రైక్యం కోసమే ప్రయత్నిస్తూ వుండడం వాస్తవమే; కాని వారైనా యీ సంగతి ఆలోచించవద్దూ?

ఇవాళ ఓఢ్రులికి యేమీ ఆధిక్యం లేకపోయినా వారు గంజాంమండలంలోనుంచి చాలా ఆంధ్రభూభాగాన్ని కొట్టుకుపోతూ వుంటే మనం తెల్లమొగాలు వేసుక్కూచున్నాం. ఇప్పుడు మద్రాసువిశ్వవిద్యాలయాన్ని అరవవారి చేతుల్లో మనం స్వయంగానే పెట్టి — ఆంధ్రరాష్ట్రం యేర్పడమే వస్తే అప్పుడు మద్రాసును గురించి, తత్ప్రాంతాన్ని

గురించీ మనం యేమి చెయ్యాలి? ఏమి చెయ్యగలం?

కనక—తొందరపడడం మంచిది కాదు. ఇప్పుడు రాయలసీమవారు ఆంధ్రవిశ్వవిద్యాలయంలో చేరకపోవడం ఉత్తరోత్తరా మనకి లాభకరమే గాని అపాయకరం కాదు. శాసనసభలో బిఉరీవేసి మెజారిటీ సంపాదించి వారి నాంధ్రవిశ్వవిద్యాలయంలోకి తీసుకురావడం పొరుగువారితో మనం వ్యవహరించవలసి వచ్చినప్పుడు తప్పకుండా వుండవలసిన బలాన్ని కుంగదీసుకోడం గాని మరొకటి కాదు.

అయితే: ఇప్పుడు రాయలసీమవారూ మనమూ నిజానికి ఎడమొగం, పెడమొగంగా వున్నాము. దీనికి కారణాలు ఇక్కడ అతితెలివీ, అక్కడ అమాయకత్వమూనూ. ఇక్కడ "ఎప్పటి కెయ్యది ప్రస్తుత" మనే నీతీ అక్కడ అనుమానమూనూ.

వాస్తవంగా ఈవైమనస్యాలు జాతికి వేరుగులు. ఇవి మన ప్రతిభకి కళంకం కలిగిస్తున్నాయి. మన పతనానికి దారి తీస్తున్నాయి.

ఇవి పోవాలి. నిజమే.

సర్కారులవారూ, రాయలసీమవారూ ఆంధ్రులైపోవాలి. వాస్తవమే.

అయితే దీనికి సాధనం ఆంధ్రవిశ్వవిద్యాలయం కాదు. ఆంధ్రోద్యమం.

మన మెప్పుడు దుడుంగుమంటే గేలం వెయ్యకుండా దూరదృష్టితో వ్యవహరిస్తామో, యెప్పుడు నిర్వికారబుద్ధితో ఆంధ్రమహాసభని మళ్లీ సమకూర్చుకుంటామో అప్పుడు మనం వొకటయిపోతాము. ఆంధ్రజాతి అంటే అప్పుడు ఇరుగుపొరుగుల వారికి భయమూ భక్తీ కూడా పుడతాయి.

## ఎలాంటివారికి రాష్ట్రం సిద్ధిస్తోంది?

రావుసాహేబు గిడుగు వేంకటరామమూర్తిపంతులు గారు ఇలా చెబుతున్నారు.

"ఓఢ్రులు పర్వతవాసులు. వీరెప్పుడూ సముద్ర తీరాల్లో నివసించి యెరగరు. ఎప్పుడూ వొకచోట కలిసిగాని, వొక ప్రభుత్వంలో గాని వున్న జాతి వారు కూడా కారు. అసలు వీరొకచోటే వుండేవారు కారు. "ఒడ్డర" అనే మాటకి తిరిగేవా రనే అర్థం. సైమనుకమిషను కూడా వీరిని చెదిరి చెదిరి వుండేవా రనే చెప్పింది. రాష్ట్రానికి పట్నాలవసర మని వీరిప్పుడు బరంపురం, ఛత్రపురం మొదలైన పట్నా లడుగుతున్నారు; గాని అసల్లో వీరికి పట్నాలు లేవు. బరంపురం తెనుగు దేవాంగులు కట్టింది. ఓఢ్రరాజులు కూడా పట్నాలు కట్టించలేదు. కటకం, బాలసూరు, పూరీ ఈ జిల్లాలు మాత్రమే అసలు ఓఢ్రదేశం. పర్లాకిమిడిలో కాలేజీ వుందంటే అది పెయిలరుగారి ప్రసాదం. రసూలుకొండ అంత పట్నం అయిందంటే రస్సెలుగారే దానికి కారణభూతులు. ఓఢ్రులు పరమఅనాగరికులు. మిధునపురంలో వున్న ఓఢ్రులు బంగాళీల సహవాసంవల్ల నాగరికులైనారు. వారు ఓఢ్రులకు ప్రత్యేకరాష్ట్రం అక్కరలే దనేశారు. గంజాం ఓఢ్రులు తెనుగువారి సంపర్కంవల్ల కటకు ఓఢ్రులకంటె వేయింతలు బుద్ధిమంతులైనారు. మిధునపురఓఢ్రుల లాగే వీరుకూడా ఈదరిద్ర, అనాగరిక, ఓఢ్రరాష్ట్రం అక్కర్లే దని అనవలసింది"

సంఖ్యలోనైనా ఓఢ్రులు మనలో సగం. అలాంటివారికి ప్రత్యేకరాష్ట్రం వస్తోం దంటేనూ, పైగా అన్నివిధాలా వారి కంటే అర్హులమై వున్న మనకి రాలే దంటేనూ ఏమిటి అర్థం?

దొరతనంమీద ఆరోపణలు చేయడంలో ఔచిత్యం కనపడదు. మద్రాసురాష్ట్రాన్ని విడతియ్యకపోయినందువల్ల వారికి పరిపాలనలో ఏమీ ఆటంకాలు కలగడం లేదు. అయితేమాత్రం పాలితుల సౌకర్యాలు గమనించవద్దా అంటే మన విషయం మన మేనా చూచుకున్నప్పుడు గదా ఈ ఆక్షేపణ చెయ్యడానికి మన కధికారం? ఖిలాఫత్తుమీద

వుండినంత శ్రద్ధ మనకి ఆంధ్రోద్యమంమీద లేకపోయింది. బార్డోలీమీద వుండినంత పూనిక మనికి ఆంధ్రరాష్ట్రంమీద లేకపోయింది. ప్రకృతపు అస్పృశ్యతానివారణోద్యమంలో వున్న ఆసక్తిలో సహస్రాంశ మేనా మద్రాసురాష్ట్రంలో మనజాతి అనుభవిస్తూ వున్న అస్పృశ్యతను గురించి మనకి లేదాయె. పైగా ఓఢ్రుల్లో జమీందార్లూ, నాయకులూ, సంపాదకులూ — అందరూ వొక తాటి మీద నిలిచి గంజాం, విశాఖపట్టణం జిల్లాలలోనుంచి విశేషాంధ్రభూభాగాన్ని కొట్టుకుపోవడానికి కుమ్మక్కు చేసుకుంటూవుంటే ఆవిషయంలో ఆజిల్లాలఆంధ్రులు ప్రత్యేకసభలు చేసీ, ప్రత్యేక ప్రతిఘటనలు చేసీ తంటాలుపడవలసి వచ్చింది; గాని అఖిలాంధ్రమహాజనులకి చీమ కుట్టినట్టేనా లేకపోయె. అనేకవిషయాలను గురించి ఆంధ్రమహాసభాస్థాయి సంఘాన్ని సమకూర్చాలని కార్యదర్శి యెన్నిమాట్లు వాయిదాలు వేసినా మన కాంగ్రెస్సు అంధభక్తి దాన్ని జరగనివ్వడం లేదాయె. ఇలాంటి పరిస్థితుల్లో మనకి రాష్ట్రం యెలా వస్తుంది? మద్రాసుకౌన్సిల్లో తీర్మానం నెగ్గించడం వొక్కటేనా యిందుకు మార్గం? అదేనా బొబ్బిలిరాజావారిని ప్రతిఘటించడానిక్కాని నిజంగా రాష్ట్రంమీద శ్రద్ధ వుండా?

ఓఢ్రులు తమకి ప్రత్యేకరాష్ట్రం సంపాదించుకోడానికి మాత్రమే ప్రయత్నించడం లేదు. ఆంధ్రప్రదేశాలను కలుపుకోడానికి వారు ప్రస్థానం చేస్తున్నారు. వారి ప్రయత్నం సఫలం కాబోయేటట్టుంది. మనం ఆంధ్రరాష్ట్రం తెచ్చుకోలేకపోతే పోయాము; మన ప్రదేశాల నేనా మనం రక్షించుకోవద్దూ? ప్రతికూలప్రయత్నాలు జాతిపరంగా సాగేటప్పుడు ప్రతిఘటనప్రయత్నాలు గూడా అలాగే జరగనక్కర్లేదూ?

మన వారి ప్రవృత్తి నేమనాలో తోచడం లేదు. దానికి వొకరి అడుగులలో అడుగులు వెయ్యడం— వొకరి ననుసరించిపోవడం తప్ప స్వతంత్రత వున్నట్టు లేదు. శుష్కరాజకీయాందోళనం వచ్చాక ఈ స్థితి మరింత విషమించింది. రాతుకొద్దీ గుర్రం అన్నారు పెద్దలు. మన యీ ఔదాసీన్యం చూసి ఓఢ్రులు మరింత విజృంభిస్తే ఆశ్చర్యం యేమిటి?



# వేదికలు — పత్రికలు

## రాత బాగుండాలి

కైలాసవాసి చల్లా శేషగిరిరావుగారి జ్ఞాపకార్థం మిత్రులు ఏర్పరచ తలుచుకున్న వక్తృత్వ, వ్యాస లేఖకత్వ పరీక్షలను సమర్థిస్తూ చేతిరాతని గురించి శ్రీ పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు ఫిబ్రవరి 1 వ తేదీ ఆంధ్రపత్రికలో యిలా రాస్తున్నారు.

| 'లిపి' యరువదినాలుగు కళలలో నొకటి. లిపిజ్ఞానము, లేఖనము, ప్రాచీన విద్యలలో ముఖ్యమైనవి. 'పాణిన్యాచార్యులు — కాదు. 'శాకటాయనుడు' కూడ లిపి విశేషముల గూర్చి చెప్పియున్నాడు. చాణక్యుడు తన యర్థశాస్త్రమున లేఖన, లేఖకోద్యోగుల పరీక్షలగూర్చి సూచించియు

న్నాడు. 'మను' యాజ్ఞవల్క్యాదులు లేఖనముల గూర్చి చెప్పియున్నారు. చాణక్యాది రాజులు శాసన లేఖకులకు దానమిచ్చిన దానములలో భాగముల బంచిపెట్టి యున్నారు. ఆంధ్రుల లిపి 'గౌతమీ పుత్రశాతకర్ణి, నుండి క్రమముగా నెట్లభివృద్ధి నొందినదియు శాసనశోధకులకు విదితమే. మహామ్మదీయ ప్రభువులు, హైందవ ప్రభువులు గ్రంథ లేఖకులకు, పసదనంబు లొసగియున్నారు. ప్రాచీనులు తాళపత్రములపైనేగాక భూర్జపత్రములపై, శ్రీతాళ పత్రములపై, ప్రాచీనములగు కాగితములపై తమ లిపికళను వృద్ధిపరచిరి. మహాకవులు తమ గ్రంథములను లిఖించినవారి పేరులు తమ గ్రంథములలో ఖ్యాతపరచిరి. ఆ లేఖకులు నేటి ముద్రాక్షరములను మరపించునట్లు వ్రాసియున్నారు. వైదికపు పెండ్లికుమారుని బరీక్షించుటలో 'జందెములు' వడకుటయు, లౌకికపు పెండ్లికుమారుని బరీక్షించుటలో దస్తూరీపరీక్షయు పదునెనిమిదవ శతాబ్దమధ్యమువరకు నాంధ్రదేశమున సాంప్రదాయ సిద్ధముగా నుండెడివి. ఇంతయేల 1905 సం॥రము వఱకు 'మెట్రిక్యులేషన్' పరీక్ష కాగానే దస్తూరీ పరీక్షను గవర్నమెంటువారే చేయుచుండిరి. ఆ పరీక్షయందు ఉత్తీర్ణులైనవారికే గవర్నమెంటు నౌకరీ దొరకుచుండెడిది. మన పరిశ్రమలు, మనకళలు పాశ్చాత్య యంత్రసాధనములు వచ్చినపిమ్మట నెట్లో తరచుగా నశించినవో, 'ముద్రాక్షరములు, టైపు' యంత్రములు వృద్ధినొందుటచే లిపికళయు బూర్తిగ నశించుచున్నది. స్కూళ్లయందు 'కాపీ వ్రాయించుట' వ్రాయుట నామమాత్రమైనది. పాఠశాలలోని కాపీలు వ్రాయించుటలోని యనాదరణమే ఇందుకు ముఖ్యకారణము. పూర్వము లేఖకోద్యోగిగా నుండువాడు తనదస్తూరీని యోగ్యతా పత్రముతో సమానము చేసికొనుచుండువాడు. ఇప్పటి లేఖకోద్యోగమునకు 'టైప్ మిషను' నాకున్నదని దరఖాస్తులో వ్రాసికొనుచున్నాడు. రెండేండ్లనాడు, 'పి. సి. రాయిగారు మద్రాసున నుపన్యసించుచు నేటి బి. యేలు—లేఖకోద్యోగమునకు—యిరువది రూప్యములకు—అని టైపుమిషనుపై నెట్లు వ్రేళ్లుకొట్టుదురో అట్లభినయించి సభికులను నవ్వించినారు. ప్రతి పత్రికలోను 'విలేఖకులకు హెచ్చరిక' అను శీర్షికతో స్పష్టముగా నక్షరము లుండవలెననియే వ్రాయబడుచుండును. కాన శేషగిరిరావుగారి స్మారకచిహ్నమగు వ్యాసపరీక్షలో 'లిపి' పరీక్షగూడ నొకయంశముగా జేర్చిన మంచిదని నా యభిప్రాయము."

## గ్రంథపాండిత్యము

శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యపంతులుగారు ఫిబ్రవరి ౧౭ వ తేదీని పెదపాలెంలో జరిగిన గుంటూరు మండల గ్రంథాలయమహాసభకి అధ్యక్షత వహించి చదువు రాని వారికి జ్ఞానం కలిగించవలసిన ఆవశ్యకాన్ని గురించి తమ ప్రారంభోపన్యాసంలో యిలా సెల విచ్చారు.

"అయితే మనమేమో "ఉప్పు లేక ముప్పందుము తాగినా" మని తలంపవద్దు. చేసినపని స్వల్పము. చేయవలసినపని హిమాలయ పర్వతమంత గలదు. అసలు గ్రంథాలయోద్యమముయొక్క స్వరూపస్వభావము లెవ్వి? దానియొక్క ఉపయోగ మెవ్వరికి? సర్వజనులకు విజ్ఞానవ్యాప్తిని గలుగజేసి, వారి జీవయాత్ర పవిత్రవంతముగను పురుషార్థసాధకముగను చేయుటయే ఈ యుద్యమముయొక్క పరమార్థము. ఇట్టి మహత్తరమైన ఆదర్శము గలిగియున్న గ్రంథాలయముయొక్క ఉపయోగమును జను లందరును పొందునటులు జూడవలయును.

దురదృష్టవశముచేత మనదేశమందున్న జనసంఖ్యయందు నూటికి తొంబదికంటె ఎక్కువమంది నిరక్షరకుక్షులు. ఇట్టివారికి గ్రంథాలయము లేమి జేయును? గ్రంథములు చదువుకొనగలిగిన జనులకు వానిని అందిచ్చుటతోడనే గ్రంథాలయముల ధర్మము నిర్వర్తింపబడినదా? లేదు. గ్రంథములను చదువుకొనలేని వారికిగూడ విజ్ఞానవ్యాప్తిని గలుగజేయుటయే

గ్రంథాలయముల కర్తవ్యము. అందుచేతనే ఒక గ్రంథాలయముయొక్క గొప్పతనము అందుండు గ్రంథముల సంఖ్యనుబట్టి గాక, ఆ గ్రంథాలయము నందలి గ్రంథములను ఎంతమంది ఉపయోగించుచున్నారు; ఆ గ్రంథాలయము ఎంతమందికి విజ్ఞాన వ్యాప్తిని కలుగజేయుచున్నది. అను విషయములను బట్టి నిర్ణయింపవలసి యుండును. గ్రంథములను, పత్రికలను చదువుటమూలముననే గాక, కంటితో చూచుటవలనను, చెవితో వినుటవలనను గూడ చదువురాని జనులకు జ్ఞానవ్యాప్తిని గావించవచ్చును. మనదేశమున ప్రాచీన కాలమునుండియు శ్రుత పాండిత్యముయొక్క మహత్తు బాగుగా వ్యాపించి యున్నది. ఆ కాలముననే గాక పాశ్చాత్య నాగరికత వ్యాపించిన ఈ కాలమున గూడ, శ్రుతిమూలకముగ జ్ఞానమును వ్యాపింపజేయవలసిన ఆవశ్యకము ఆవంతయైన తగ్గలేదు. ఇట్టి స్థితి మిక్కిలి శోచనీయమే యైనను మనకు గత్యంతరములేదు. ఎందుచేత ననగా, నూటికి తొంబదికంటె ఎక్కువమందికి జ్ఞానమును వ్యాపింపజేయుటకు మార్గ మది యొక్కటేను.

పల్లెటూరునం దుండని, బస్తీయం దుండని, కొండయం దుండని, గుట్టయం దుండని, అడవియం దుండని బయలు ప్రదేశమం దుండని—పురుషులైనను సరే, స్త్రీలైనను సరే, పిల్లలైనను, పెద్దలైనను—మానవు లందరికి ఎవరికి తగినట్లు వారికి జ్ఞానవ్యాప్తి కలుగుటకు తగిన సావకాశ ముండవలయును’’

## గొడవలు పెంచవద్దు

కొత్తగా ఏర్పడే జిల్లాబోర్డులకు అధ్యక్షులను ఎన్నుకోమనడం కంటే నామినేటు చెయ్యడం మంచిదని సమర్థిస్తూ సమదర్శిని ఇలా రాస్తోంది.

“తాలూకాబోర్డులను రద్దుసేయుటకయి, యిపుడు, శాసననిర్మాణసభలో జర్చింపబడుచున్న సవరణచట్టపు (లోకల్ బోర్డ్సు అక్టు) వివరములు, ఈసరికి, పాఠకులు, క్షుణ్ణముగ తెలిసికొనియుందురని యెంచవచ్చును. దొరతనమువారు కొన్ని జిల్లాబోర్డులను రెండేసిగ చీల్చి, యాజిల్లాలలో రెండేసి లోకల్ బోర్డులను నిర్మింతురు. రెండు బోర్డులేర్పడినచోట ఒక బోర్డునకు, ఇపుడున్న జిల్లాబోర్డు ప్రెసిడెంటే ప్రెసిడెంటుగ నుండును. రెండవ క్రొత్త లోకల్ బోర్డునకు క్రొత్తగ ఏర్పడు లోకల్ బోర్డు సభ్యులు తమలో నొకరిని—తమ బోర్డున కధ్యక్షునిగ నెన్నుకొనవచ్చునని సవరణ చట్టములో ప్రతిపాదింపబడి యున్నది. క్రొత్తగ నేర్పడు లోకల్ బోర్డులకు జెందు నామినేటెడ్ మెంబర్ల సంఖ్య (మైనారిటీసంఘములు. నిమ్నజాతులసంఘములు—మహమ్మదీయ—క్రైస్తవసంఘములు మున్నగువాని ప్రాతినిధ్యముకొఱకు దొరతనముచే నామినేటు సేయబడు బోర్డుమెంబర్లు) తగ్గియుండినయెడల కొఱవడిన మెంబర్లను దొరతనమే నామినేటుచేయును.

క్రొత్తగ నేర్పడు బోర్డులు తమ ప్రెసిడెంట్లను ఎన్నుకొనవలసి వచ్చినయెడల—ప్రెసిడెంట్ల ఎన్నికల నిమిత్తము తలచూపు ఆర్భాటములు వృథా వ్యయ ప్రయాసలు అన్నియు ప్రారంభమగును. వర్తమానార్థికస్థితియం దట్టి వృథా వ్యయప్రయాసల కీ క్రొత్తబోర్డుల మెంబర్లను లోబరచుటకంటె—నీ క్రొత్తబోర్డులకు దొరతనమువారే ప్రెసిడెంట్లను నామినేటు సేయుట యుచితమని యొక యభిప్రాయము మిక్కిలి సహేతుకముగ బయలువెడలినది. లోకల్ బోర్డులయొక్క జనరల్ ఎన్నికలు కొన్నిమాసములలో (అనగా ఈనవంబరో—డిసెంబరో) జరగవలసి యున్నదని తెలియుచున్నది.

ఈ కొలది మాసముల కాలమునకయి యెన్నికల యార్భాటములతో ప్రజల నావేశపెట్టుట మంచిపని కాదు. 1936 లో క్రొత్త శాసనసభల యెన్నికలు జరుగవచ్చునని తలంపబడుచున్నది

గదా. ఆ యార్భాటములకు, వృథా వ్యయప్రయాసలకు మితియుండదు గదా. ఎన్ని విధముల యోచించి చూచినను, క్రొత్త లోకలుబోర్డులకు, దొరతనమే నామినేటు సేయుట సవ్యమయియుండుననియు, ప్రజాలాభకరమయి యుండుననియు చెప్పగలము, "జస్టిస్" పార్టీవారు క్రొత్తలోకలు బోర్డులకు నామినేటెడ్ ప్రెసిడెంట్ల నేర్పాటు చేయించుటకే యుద్యమింప దీర్మానించుట కొంతయు సంతసము కలుగుచున్నది. శాసన నిర్మాణ సభ్యులందరు ఈ యభిప్రాయము నామోదించి సవరణచట్టములో ప్రతిపాదింపబడి యున్న యెన్నికల యధికారమును తొలగించి నామినేటెడ్ ప్రెసిడెంట్లను వేయింప సవరణచట్టమును సవరింపింప హెచ్చరించుచున్నారము."

# ప్రకీర్ణకములు

## అభినవాంధ్రకవిపండితసభపై విమర్శలు

విమర్శలకు గురియైన "అభినవాంధ్రకవిపండితసభ" లోకదృష్టి నాకర్షించుచున్న దన్న మాట. అది కొంత మేలే.

ప్రబుద్ధాంధ్రపత్రిక కర్తవ్యమును మరచిపోయినారని ఈసభను గూర్చి విమర్శించింది. భారతీపత్రిక కూడ తచ్ఛాయనే విమర్శనాదృష్టి సారించింది.

అయితే ఈసభ కర్తవ్యమేమిటిగా సభవారెంచు కున్నారు. ఆకర్తవ్యమేనా ఈపత్రికాధిపతులు చూచించి చెప్పుచుంట? ఈసభ వారి కర్తవ్యమేమో వీరు మొదట బరంపురములో జరిపిన సభను బట్టిన్ని, అప్పుడు వారు తీర్మానించుకొన్న తీర్మానాల బట్టిన్ని మనము ఊహించుకోవచ్చు. అభినవాంధ్రకవులనూ పండితులనూ ఒకచోట చేర్చడమున్నూ, వారివారి రచనలను వెల్లడి చేయడమున్నూ ఇదివరలో జరిగిన పని. రెండవ సమావేశములోకూడా అపనే జరిగినది. దీనివల్ల లాభమున్నదా అంటే ఉన్నదనే చెప్పవలెను. నేటి సారస్వతస్వరూపము ఎట్టి విధముగా పరిణమిస్తున్నదో తెలిసికొనుట కిది సహాయముగా ఉండును. ఇదిగాక మొదటి సభలోవలెనే ఈసభలోనున్నూ కడపటి దినమున కొన్ని తీర్మానాలు సభవారు చేసుకొన్నారు. అవి దరిమిలాను ఆంధ్రపత్రికలో ప్రకటింపబడ్డవి.

ఈపత్రికాధిపతుల కర్తవ్యమేమిటో? నేటి సారస్వత విమర్శ అయినట్లయితే అట్టి విమర్శ ఈ సభలో జరిగింది—భాషావిమర్శ—రామమూర్తి పంతులుగారు; బాలసారస్వత విమర్శ సీతాపతిగారు; ఏకాంకరూపక విమర్శ—గణపతి సాహిత్యశిరోమణిగారూ, కావ్యవిమర్శ—దిగుమర్తి రామారావుగారూ, ఇట్టివి చాలా జరిగినవి.

కవుల కృతుల వినిపించడమయితే—అవి కావలసినన్ని జరిగినవి—కవికొండల వెంకట్రావుగారు, వేమల సత్యనారాయణశాస్త్రి, నాళం కృష్ణారావుగారు, సూర్యప్రకాశరావుగారు, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు వగైరా చాలామంది ఉన్నారు.

ఉపన్యాసము లివ్వడమయితే—అవి అధికముగా జరిగినవి.

తీర్మానాలు అంగీకరించడమైతే అవిన్నీ జరిగినట్లు ఆంధ్రపత్రిక సాక్షి.

మరి వీరు చూచించిన కర్తవ్యము పైవాటి యందున్నట్లే గదా?

ఇట్టి కథలు ఉండవలెను, ఇట్టి నాటకము లుండవలెను ఇట్టి విమర్శ లుండవలెను—అని ఒకవేళ ఇట్టి తీర్మానాలు చేస్తే ఈ సభవారి మాట వినేవా రెవరు. ఆంధ్రసాహిత్యపరిషత్తువారి మాట ఎవరైనా వింటున్నారా? కవి తన శక్తి, ఉత్సాహము, ప్రతిభలను అనుసరించి తనకు మంచి

దని తోచిన కావ్యము రచిస్తాడు. అందు మంచి ఉంటే లోకు లామోదిస్తారు. కాని ఇట్టి కావ్యములే కవులు రచించవలసి ఉంటుందని ఎవరు వారిని శాశించగలరు.

కవులు తమ కృతులూ, తమ తండ్రుల తాతల కృతులూ చదివినారని యింకో ఆక్షేపణ. ఎందుకు చదవకూడదు? పత్రికలలో పడ్డవని మాత్ర మెందుకు చదవకూడదు? పత్రికలలో పడ్డంతమాత్రమున వాటి నందరూ చదువుతున్నారా? శిష్టుల అభిరుచులను ప్రమాణముగా అంగీకరిస్తే కావ్యముల మంచిచెడ్డలను నిర్ణయించేటందుకు యిట్టి సభలలో వాటిని చదవవలసి ఉంటుంది.

ఆంధ్రభూమి పత్రికలో ఒక సుప్రసిద్ధ స్త్రీని గురించి కటువుగా విమర్శించారు. ఈసభల విశిష్టత ఏమిటంటే పురుషులే కాకుండా స్త్రీలు కూడా పాల్గొనడము. అట్టి స్త్రీలు పండితలో కారో, కవయిత్రులో కారో ఎవరు నిర్ణయించేది? ఈ పురుషులపట్ల నిర్ణయించే దెవరు? ఒక స్త్రీయే కాదు చాలామంది స్త్రీలు ఈ సభలలో పాల్గొన్నారు. ఇది ఆంధ్రులు గర్వించవలసిన విషయము. సారస్వతసభలలో స్త్రీలు పురుషులతో పాటు సారస్వతచర్చలు చేయుటం ఆంధ్రాభ్యుదయానికి చిహ్నము. అట్టి స్థితిలో "ఈదేశ బాంధవి భాషా బాంధవి ఎప్పుడైనది. ఈ పూర్వసువాసిని అభినవాంధ్ర కవయిత్రి కూడ ఎప్పుడైనది" అని ఆంధ్రభూమివంటి పత్రికలు తృణీకారభావముతో తూలనాడడము మిక్కిలి విచారించవలసిన విషయము. సారస్వత సేవ చేస్తున్న స్త్రీ లెందరో మన ఆంధ్రదేశములో ఉన్నారు. వీరు కూడ యిట్టి సారస్వతసభలలో పాల్గొనేటట్లు పత్రికలు ప్రోత్సహించవలసి ఉంటుంది.

ఇట్టి సభలు జరగడానికి ముందుగానే సభలు జరుగుతవని పత్రికలలో ప్రకటనలు పడతవి కాబట్టి అప్పుడే యిట్టి సభల కర్తవ్య మెట్టిదిగా ఉంటే బాగుంటుందో పత్రికలు సూచించడము మంచిది. ఇట్టి సూచనలను సభలు అంగీకరించకపోతే పత్రికలు సకారణముగా విమర్శించవచ్చును. అంత్య నిష్ఠూరం కంటె ఆది నిష్ఠూరం మంచిది.

చింతా దీక్షితులు, 2-3-34

(ప్రబుద్ధాంధ్ర విమర్శనం మరివొక మాటు చదవవలసిందని శ్రీ దీక్షితులు గారిని కోరుతున్నాము. సంపాదకుడు)

## కొన్ని సంశయాలు

కొంత కాలం కిందట—నాలుగో ఫారం అయిదో ఫారం చదివేటప్పుడు—వాడుక భాషను చులకనగా చూసేవాణ్ణి. నేను తరవాత కాలేజిలో ప్రవేశించినప్పుడు భారతి మొదలైన మాసపత్రికల్లో వాడుకభాషలో రాయబడ్డవి చాలా అందమైన వ్యాసాలు చదివాను. నామనసు గ్రాంధికభాషకూ వాడుకభాషకూ మధ్య ఊగుతూన్న సమయంలో గిడుగు రామమూర్తి పంతులుగారు మాహోస్టలుకు దయచెయ్యటం కాలేజీలో ఉపన్యాసం ఇవ్వటం జరిగినై. అప్పుడే వారు "అట్టిడు" అనే పదానికి ద్వితీయావిభక్తికి బహువచనం ఎవరైనా చెప్పగలిగితే తను ప్రయత్నం మానేసి గ్రాంధికభాషా సేవ చేస్తా నని ఛాలెంజి చేశారు. ఆరోజునించీ నాకు గ్రాంధికభాషమీద అభిమానం పోయింది. కాని అప్పటినించి ఇప్పటివరకూ ఒక సంశయం ఉండనే ఉంది.

ఆ దేమిటంటే—అందరికీ ఉపకరించే తెలుగేది?

తూర్పున "అలా" అంటారు. మా వైపున "అట్లా" అంటాం. మేం "ఏమిటి" అంటాం. ఒంగోలు వైపున "ఏంది" అంటారు. ఇటువంటి భేదాలు ఉండితీరాలి. వాటిల్లో ఒక విధమైన మాధుర్యం లేకపోలేదు ఇన్ని లక్షల ఆంధ్రులకూ పనికివచ్చే భాష ఒకటి ఉండాలా వద్దా? ఇది శాస్త్రసమ్మతమైన ఇంగ్లీషూ, ఇది వాడుకభాషా

అని ఉంది. ఇది శాస్త్రసమ్మతమైన తెలుగు, ఇది వాడుకభాష అంటూ ఏది? శాస్త్ర మేది? పోనీ తెలుగులో నిఘంటువు ఒకటి వచ్చి ఇది స్టాండర్డు తెలుగు మాట, ఇది వాడుకపదం అని చెప్పే వరకూ కాస్త అటూ ఇటూగా వాడుకభాషే రాద్దా మనుకున్నాను.

అందువల్లనే భమిడిపాటి కామేశ్వరరావుగారూ, గుడిపాటి వెంకటాచలంగారూ, కవికొండల వెంకటరావుగారూ (వీరు రాసినట్టే మాట్లాడతా రని నాకు నమ్మకం లేదు. మాట్లాడతా రని తెలిస్తే మాత్రం నేను చాలా ఆశ్చర్యపడతాను.) వారివారి భాషల్లో రాస్తుంటే చదివి సంతోషిస్తున్నాను.

ఫిబ్రవరిలో "బిడ్డల శిక్షణ" తలపేర ప్రచురింపబడ్డ చేకుమళ్ల కామేశ్వరరావుగారి వ్యాసంలో చివర భాగం చూస్తే నేనింకా పెరటిదారినే ఉన్నట్టు కనిపిస్తుంది!

శైలి. ఎవరు మాట్లాడే భాష వారు రాయటాని కుపయోగిస్తున్నా రని నా ఉద్దేశం. "పూర్నారోగ్యం, విస్తీర్నం, సంస్త," మొదలైనవాటిల్లో ణావత్తూ, పొట్టలో చుక్క థావత్తూ వెంకటాచలంగారు సరిగా పాటించక పోవటం వారి శైలిలో లోపంగా కామేశ్వరరావుగా రభిప్రాయపడ్డారు. మరి వెంకటాచలంగారు "పూర్ణారోగ్యం, సంస్థ" అనరు నోటివెంట. అనకపోయినా వారి నెవరూ అటకాయించటం లేదు. పొట్టలో చుక్క థావత్తులు కాశీలో వదిలేసి వచ్చినవాణ్ణి నే నొకణ్ణున్నాను. అనేకమందిమి వాడుకభాషలో రాయనిచ్చిన తరవాత దాస్యవిముక్తి లభించినట్టు ఫీ లవుతున్నాం. కామేశ్వరరావుగారు చెప్పేది చూస్తే అటువంటి విముక్తి మాకింకా లభించినట్టు కనపడదు.

వాక్యారంభంలో అచ్చులు. "యిష్టం, వురుమూ, యీశిక్షణ," మొదలైనవి వాక్యం మొదట వచ్చినప్పుడు అచ్చుగానే ఉంటే బాగుంటుం దని కామేశ్వరరావుగారి అభిప్రాయం. "ఉండాలి" అనే మాటను "వుండాలి" అని కామేశ్వరరావుగారు రాస్తునే ఉన్నారు. ఉ॥ "...యిట్టి మాటలు అచ్చుతో వుండాలి..." ("వు" అచ్చు పొరపా టయితే నేను జవాబుదారీ కాదు.) "తో" అనే ప్రత్యయం "తోన్" కానంతవరకూ "ఉండాలి" అనే మాట "తో" తరవాత వచ్చినా వాక్యారంభంలో వచ్చినా ఒకటే.

తెలుగు మధ్య ఇంగ్లీషు కాలక్రమాన బండీరాలు అరసున్నాలు, అదేమి టిదేమిటి? మొత్తం మొత్తంగా గ్రాంథికభాషనే విసర్జించిన వారిలో కూడా అనేకమంది సంస్కృతపదాలు దొర్లితే గమనించరు కాని ఇంగ్లీషుముక్క దొర్లినట్లాయనా గుర్రుమంటారు. సంస్కృతపండితులు సంస్కృతం మనస్ఫూర్తిగా (సరి యయిన తెలుగు మాట ఉన్నా) వాడవచ్చును కాని తప్పని సరిగా ఇంగ్లీషు చదివిన వాడు ఒక్క ఇంగ్లీషు ముక్క రాయ రాదు! కామేశ్వరరావుగారు ఈవిషయం అంత పట్టుదలగా ఉండ లేదు. పుస్తకం ఆడవారి కోసం రాయబడ్డది కదా ఇంగ్లీ షెందు కన్నట్టు చెప్పారు. "ప్రిన్సిపిల్సు, కొంపరిమెంట్" మొదలయిన మాటల జాబితాలో ఒక్క ముక్కను కూడా నాకు తెలుగు తెలీదు. శంకరనారాయణ డిక్షనరీ చూస్తే తెలుగు తెలుస్తుం దేమో కాని ఆమాటలు ప్రతిరోజూ ఉపయోగించనివి కావటం చేత తర్జుమాకన్న ఇంగ్లీషుముక్కే రాయ బుద్ధవుతుంది.

కామేశ్వరరావుగారియందు నే నేవిధమైనతప్పు ఆరోపించబోవటం లేదు. వారు భాషను గురించి ఈ మూడు విషయాలూ బయటపెట్టారు. ఈవిధంగానే మరొకరు మరికొన్ని కట్టుబాట్లు కోరవచ్చును. ఈ విషయాల్లో ఒకరు చెప్పవలసిందీ మిగిలినవారు వినవలిసిందీ కాని గత్యంతరం లేదు. కట్టుబాట్లు వద్దనటానికీ వీల్లేదు; మనిషి కొక తెలుగై ఊరుకుంటుంది—ఇప్పుడు కానే అయింది. అటువంటప్పుడు చేయదలుచుకున్న కట్టుబాట్లన్నీ ఒక

గ్రంథంలో రాసి పబ్లిషు చేస్తే అందరం కొనుక్కుంటాం. నామటుకు నాకు ఇంగ్లీషుమాటలకు సరి యయిన తెలుగు రాదని చెప్పుకోటం నామర్దా లేదు. ఉన్నదే ఒక ఇంగ్లీషు—తెలుగు డిక్షనరీ. అది సరయినదని నమ్మకం లేదు. సంస్కృతం చదువుకో లేదు. నామర్దా ఏదన్నా ఉంటే చక్కని తెలుగు మాని ఇంగ్లీషు చదువుకోటంలోనే ఉండాలి. కాని అదీ అనటానికి వీల్లేదు. తెలుగులో కృషి చెయ్యాలంటే ఆపని కాలేజీలో జరగదు (ఆంధ్రా యూనివర్సిటీలో కూడా!) ఇంగ్లీషులిటరేచరు చదివే విద్యార్థులు ఎం. ఏ. కు పొయ్యేవరకూ చాసరు గాని అంతకు పూర్వపు రాతగాళ్ల రాతలు గాని చదవనక్కర్లేదు. తెలుగు సారస్వతం చూడబోతే నన్నయభట్టారకుడితో ప్రారంభమై పెద్దనదగ్గిరో ఆప్రాంత్యాలో ఆగిపోయినట్టు కనిపిస్తుంది. ఈ కాలపు తెలుగు రాస్తే సున్నా పెడతారు పరీక్షల్లో. ఇక వాడుకభాషలో రాసేవాళ్ల గతి ఏమిటి? తాత్కాలికంగా ఒక సారి చదివి ఆనందించి అవతల పారేసే కథలు (వాటిల్లో ఒక మొగుడూ, ఇద్దరు పెళ్లాలూ ఉంటే ఒకత్తె చస్తుంది. అంతా బాగుంటారు) ఏదో భాషలో రాస్తారు. ఇబ్బంది లేదు. అదంతా లైట్ లిటరేచర్. రేపు నేను చుక్కల మీద ఒక వ్యాసం రాయా లనుకుంటాను. వ్యావహారికభాష అనే పదం ఆధారం చేసుకుని చూస్తూ చూస్తూ కోస్తుభాష ఎట్లా ఉపయోగించను? చాతయిన దేదో మాట్లాడేదే ఉపయోగిస్తే ఎవరి ఇష్టం వచ్చిన తప్పులు వారు పడితే నే నేం కావాలి?

కాబట్టి రాయగల ప్రముఖులను ప్రబుద్ధాంధ్రలో వ్యాసాలు రాసి, భాషకు అవసరమైన కట్టుబాట్లన్నీ చేసి, ప్రతిగాలికీ ఎగిరిపోకుండా అవయవాలు స్వేచ్ఛగా కదిలించడానికి వీలు లేకుండా వుండకుండా తగిన ఏర్పాటు చేసి తెలుగుభాషను కూడా స్టాండర్డైజు చేసి పుణ్యం కట్టుకోమని ప్రార్థిస్తున్నాను.

కొడవటిగంటి కుటుంబరావు



# ప్రబుద్ధాంధ్ర

కలాభివర్ధనీపరిషత్తుపక్షమున ప్రకటింపబడు మాసపత్రిక

సంపాదకుడు:—శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

సంపుటము ౫ } రాజమహేంద్రవరము ఏప్రిల్ ౧౯౩౪ { సంచిక ౪

## తెనుగుపత్రికల సంపాదకులకు



తొమ్మిదేళ్ల కిందట రాజమహేంద్రవరమునందు ప్రాచీనాంధ్రభాషాభిమానులు కొందరు వర్తమానాంధ్రమును అణచివేయడమునకు ఆయుధాలు ఝుళిపించినప్పుడు, ప్రబుద్ధాంధ్ర, సుజనరంజని అడ్డుపడి దానికి చాలా సాయము చేసినవి. ఆ పత్రికలు పిమ్మట అంతరించినందున దానికి తగిన పట్టుగొమ్మ లేకపోయినది. ఇప్పుడు ప్రబుద్ధాంధ్ర మళ్లీ పొడచూపడము వర్తమానాంధ్రభాషాభిమానులకు మిక్కిలి సంతోషకరముగా ఉన్నది. ఈ మధ్యకాలమందు అభినవాంధ్రభారతికి ఆశ్రయము లేక తిరుగుతూ ఉండడము చూచి, కనికరించి, ఆంధ్రపత్రిక, కృష్ణాపత్రిక, భారతి, గృహలక్ష్మి మొదలయిన పత్రికల సంపాదకులు కొందరు, ఔదార్యవంతులు, మునుపటికన్న ఎక్కువగా తమ పత్రికలలో, వెలివాడనే అయినా, స్థలమిచ్చి దానిని ఆదరిస్తూవచ్చినారు. అందుకు అభినవాంధ్రభారతీభక్తులు కృతజ్ఞత కలిగి ఉన్నారు; గాని, కొందరు సనాతనధర్మావలంబులు హరిజనులు అంటరానివాళ్లు అని సిద్ధాంతము చేసి తమ భూతదయ ప్రకటించుటకు వీధిలో అరుగు పక్కను వాళ్ళను నిలబెట్టి, తమకు మైల అంటకుండా ఎడముగా ఉండి, వడుగు కాని పిల్లలచేత పట్టెడన్నము వాళ్ల ఒడిలో ఎత్తివేయించినట్టుగా, ఈ పత్రికల సంపాదకులు తమ వ్యాసములుండే గడిలోనికి అభినవాంధ్రభారతిని రానియ్యకపోవడము చూచి, ప్రాచీనాంధ్రభారతిని ఆరాధించడమువల్ల ఎక్కువ పుణ్యము దొరుకుతుందన్న భ్రమ లోకులకు కలుగుతున్నదని చింతిస్తున్నారు. శిష్టులు ఏది ఆచరిస్తున్నారో అదే ఆచరించుటకు ప్రయత్నిస్తారు ఇతరులు కూడాను; సాధ్యాసాధ్యములూ, హితాహితములూ విచారించరు. నన్నయాదుల ప్రాచీనాంధ్రము వ్యవహారభ్రష్టమయినందున, అది నేడు వాడుట ప్రాచీనాంధ్రభాషాపాండిత్యము సంపాదించిన వారికైనా దుష్కరము. ఈ కాలమందు పిల్లలకూ, పామరులకూ విద్యలు బోధించుటకు సాధనముగా ఇప్పటి శిష్టవ్యవహారమందున్న భాష వాడవలసినది; పత్రికాసంపాదకులు కూడా అట్లే చేయవలసినది. అందుకు విరుద్ధముగా శిష్టులు ఆచరించడముచేత, దేశభాష వికాసము పొందకుండా సంభాషణకే ఉపచరిస్తున్నది. వాస్తవమైన దేశభాష శిష్టవ్యవహారమందున్నదే. అనాదిగా బ్రహ్మముఖమునుండి వెల్వడి బ్రహ్మ పుట్టించిన మనుష్యుల నోటిలో ప్రవేశించి, ఒక తరమువారి నోటినుండి ఇంకొక తరమువారి నోటిలో చొచ్చి, ఎడతెగకుండా దేశకాలోచితములైన మార్పులు పొంది మన నోటిలో నేడున్న వాగ్దేవి ఒక్కర్తే; రూపము మార్చుకొంటూ ఉంటుంది

ఏ రూపము సాక్షాత్కారము చేసుకోవడము లోకుల కందరికీ సాధ్యము?—నేడు శిష్టవ్యవహార మందున్నదా? నన్నయాదుల వ్యవహార మందుండేదా?

ప్రబుద్ధాంధ్ర వంటి అభినవాంధ్రభారతీభజన మందిరములు అక్కడక్కడ ఇప్పుడు భక్తులు ప్రతిష్ఠిస్తూ ఉన్నారు. స్వభాషాభిమానమున్నూ స్వదేశాభిమానమున్నూ ఆంధ్రదేశమందంతటా ఆంధ్రులందరిలో వ్యాపించి నెలకొనుటకు ఈ పత్రికలు చిన్నవయినా అనుకూలసాధనములుగా ఉపచరిస్తున్నవి. అయినా, ప్రతికూల మయిన సంస్థలు ఇంకా ప్రబలముగా ఉన్నవి. ఆంధ్రసాహిత్యపరిషత్తువారు "మాలనీ గనుగొన్న యుత్తమద్విజుని క్రియను" అభినవాంధ్రభారతి మొగము కనబడితే మొగము ముడుచుకొని సచేలస్నానము చేసి, మైల పోగొట్టుకొంటారట! అయితే, "ఆ అమ్మవారు సదా వారి నోటను విహరిస్తూ ఉంటుందే! నాలిక తెగ్గోసుకొన్నా వదలదే!" అంటే "నోటికి అంటు లేదు; కంటికే అంటు" అంటారు! సనాతనధర్మపరాయణులవంటి సనాతనాంధ్రభాషాభిమానులకు ఈ పరిషత్తువారి పత్రిక ప్రధానాశ్రయము; అక్కడ అభినవాంధ్రభారతి సంపర్కమేమీ ఉండదు; మైల పడకుండా అంతా 'మడి' గానే ఉంటుందట. కాగితము మీదికి ఆంధ్రభారతిని ఆవాహనము చేసి, ఆరాధించడము యజ్ఞకర్మ వంటిదట; అప్పుడు అపశబ్దము వాడరాదట. "బ్రాహ్మణేన న మ్లేచ్ఛితవై నాపభాషితవై; మ్లేచ్ఛోహ వా ఏష యదపశబ్దః" అని పతంజలి అన్నాడు గనుక, నన్నయాదులు ఆరాధించిన ప్రాచీనాంధ్రభారతినే మనమున్నూ గాగితముమీద ఆరాధింపవలెనట. వారారాధించే భారతికి గ్రాంధికాంధ్రభారతి అని పేరు పెట్టినారు; వారి నోట నుండేది "గ్రామ్య" భాషట; అశుద్ధభాషట; అంటరానిదట; చెప్పరానిదట! ఇదీ ఆంధ్రసాహిత్యపరిషత్తువారి సిద్ధాంతము! అభినవాంధ్రభారతీదేవిని ఆరాధించేవారు నరకములో పడతారు గనుక చిన్న బడులలోను, పెద్ద బడులలోను ఎక్కడా, ఎవ్వరూ అభినవాంధ్రభారతిని ఆరాధించకుండా పరిషత్తువారు కట్టుదిట్టములు చేయించి కృతకృత్యులయినారు.

ఇకను, బడులలో పిల్లలచేత చదివించవలసిన పుస్తకములు ఎంచడమునకు గవర్నమెంటు విద్యాశాఖాధికార్లూ, విశ్వవిద్యాలయాధికార్లూ ఏర్పర్చిన పరిషత్తులవారున్నారు. వారు ఆంధ్రసాహిత్యపరిషత్తువారి మతమునే అవలంబించి, పుస్తకాలలో అభినవాంధ్రభారతి సంపర్కము లేకుండా చేస్తున్నారు.

ఆంధ్రగ్రంథాలయములు అనేకగ్రామములలో ఉన్నవి. వీటిలో కూడా ప్రాచీనాంధ్రభారతినే వ్యవహర్తలు అధికముగా ఆరాధించినా అభినవాంధ్రభారతిని వెలిపెట్ట లేదు; గ్రామదేవతగానో, క్షుద్రదేవతగానో భావించి ఒక మూల ఒక చిన్న గూటిలో ఆమెను ఉంచినారు.

ఇప్పుడు ఆంధ్రభారతిని ఆరాధించే గొప్ప సంస్థలలో గొప్పవి ఆంధ్రపత్రిక, కృష్ణాపత్రిక, భారతి, గృహలక్ష్మి మొదలయిన ఆంధ్రదినపత్రికలు, ఆంధ్రవారపత్రికలు, ఆంధ్రమాసపత్రికలు! వీటి సంపాదకుల ప్రధానోద్దేశము ఆంధ్రులను అందరినీ ఉద్ధరించడము. బంగాళీవారు, మరాటీవారు, అరవవారు మొదలయిన ఇతరజాతులవారితో సరిసమానముగా ఆంధ్రులు అభివృద్ధి పొందేటట్టు చేయడమే ఈ పత్రికాసంపాదకులకు విహితధర్మము. ఈ ధర్మము సాధించడమునకు పండితపామరసామాన్యమైన శిష్టవ్యవహారస్థభాషలోనే సంపాదకులు తమ వ్యాసములున్నూ వ్యాఖ్యలున్నూ వ్రాసి ప్రకటించవలెను. ప్రజాస్వామికపరిపాలనము ఏర్పడ్డ దేశములలో, ప్రజల పత్రికలలోని సంపాదకీయవ్యాసములు, ప్రజలతో ముఖాముఖీ మాట్లాడినట్టే సంపాదకులు రచిస్తారు; అట్టి వ్యాసములలో సంపాదకుల భాషాపాండిత్యము ప్రకటించడము హాస్యా

స్పద మనీ, వ్యర్థప్రయాస మనీ, నింద్యమనీ, ప్రఖ్యాతపత్రికాధిపతుల అభిప్రాయము.

ఇంగ్లండు, ఫ్రాన్సు, జర్మనీ, రష్యా, తుర్క్యా, చీనా, జపాను మొదలయిన దేశములలోని వార్తాపత్రికల సంపాదకులు తమ వాడుక భాషలోనే తమ వ్యాసములు రచిస్తున్నారని ఆంధ్రపత్రిక, కృష్ణాపత్రికల సంపాదకులకు తెలుసు ననుకొంటాను; తెలిసిన్నీ ఆంధ్రసాహిత్యపరిషత్ పత్రికాసంపాదకుల వలెనే వారున్ను తమ వాడుకభాషను బహిష్కరించి, వ్యవహారభ్రష్టము లయిన ప్రాచీనాంధ్రశబ్దములు ఎందుకు తమ వ్యాసములలో వాడుతున్నారో నాకు బోధపడదు. ఆంధ్రసాహిత్యపరిషత్తువారు నేటి శిష్టవ్యవహారమం దున్న భాష 'గ్రామ్య' మని నిషేధించి, తమ పత్రికలో ఎక్కడా అది కనబడకుండా కట్టుదిట్టములు ఏర్పర్చినారు, వారి సిద్ధాంతమును అనుసరించి వారు ఆచరిస్తున్నారు. ఆంధ్రపత్రికలోను, కృష్ణాపత్రికలోను, "స్వకీయవిలేఖకులు" "ఉపవిలేఖకులు" మొదలయినవారు వ్రాసే వ్యాసములూ, జాబులూ వ్యాఖ్యలూ వార్తలే కాక, కథలున్ను, నాటకములున్ను తరుచుగా వాడుక భాషలో రచించినవి కనబడుతున్నవి గనుక, ఆంధ్రసాహిత్యపరిషత్తువారివలె వీరు వాడుకభాషను, బహిష్కరించినా రని అనలేము; వార్తాపత్రికలలో వాడవలసిన "దేశభాష"ను గురించి తమ అభిప్రాయము స్పష్టముగా వీరు ఇదివరకు తెలియజెప్పలేదు; వీరి సంపాదకీయవ్యాసములలోని భాషకున్ను, వీరి "స్వకీయవిలేఖకులు" మొదలయిన వారి జాబులలోని వాడుక భాషకున్ను గల వ్యత్యాసము 'శైలి' లోని భేదమువల్ల ఏర్పడ్డది కాదు; వైదికభాషకున్ను, పాణిన్యాదులు అనుశాసనము చేసిన లౌకికభాషకున్ను గల వ్యత్యాసము వంటిది. మొదటిది ధ్యానదేవుని మారాటీ, చండీదాసు బంగాళీ, నారసింగు గుజరాతీ భాషల వంటిది; రెండవది తంజే మరాటీ, రవీంద్రనాథుని బంగాళీ, గాంధీమహాత్ముని గుజరాతీ భాషల వంటిది. పత్రికాసంపాదకులు ఆంధ్రుల కందరికీ తెలిసేటందుకు గదా తమ అభిప్రాయములు వ్యాసములుగా రచించి పెద్ద అక్షరములతో మొదటి పుటలో మొదటి గడిలో ముద్రించి ప్రకటిస్తారు? ఈ సంపాదకీయవ్యాసములు పత్రికలలో ప్రధానాంగముల వంటివి. వాటి ప్రాభవము వల్లనే పత్రికలకు దేశమందు ప్రఖ్యాతిన్ని, రాజ్యవ్యవహారమందు పలుకుబడిన్ని గౌరవమున్ను కలుగుతవి. పరిపాలకులను గజగజలాడించి, ఒక్కొక్కప్పుడు వారిని స్థానభ్రష్టులుగా చేయగల ప్రభావము ప్రజాస్వామికపరిపాలనము గల దేశములలో వార్తాపత్రికలకు ఉంటుంది. అట్టి ప్రభావము ఆంధ్రపత్రికలు సంపాదించవలె నంటే, పత్రికాధిపతులు ఎంతటి భాషాపాండిత్యము గలవా రయినా తమ పాండిత్యము తమ తోడి పండితులతో గోష్ఠి సలిపినప్పుడే ఉపయోగించవలెను గాని, తమ తోడి పౌరులతో కలిసి వ్యవహరించే టప్పుడు ప్రకటించకూడదు; లోకవ్యవహారము నిర్వహించడమునకు నేడు వాడుకలో ఉన్న సుపరిచిత మయిన దేశభాషలోనే పత్రికాసంపాదకులు ప్రజలకు తెలియజెప్పవలసిన విషయములన్ని వ్రాయవలెను. దేశోద్ధారకులు సభలలో నోటను చెప్పిన విషయములు చెవులతో వినేవారికి తెలిసినట్లు, ఆ విషయములే సంపాదకీయవ్యాసములలో ప్రకటించినప్పుడు ఆ వ్యాసములు కంటితో చూచి చదివే వారికి గాని, చదివించి వినేవారికి గాని అవిలంబముగాను, స్పష్టముగాను తెలియవు గదా. అందువల్ల గ్రాంథికాంధ్రములో వ్యాసములు రచించే వారికీ వాటిని చదివే వారికీ వ్యర్థప్రయాసము కలుగుతున్న దని ఒప్పుకోక తప్పదు. సహజ మయిన వాగ్రూపముతో నోట నుండి పైకి వచ్చే మనోభావములు ఆరూపముతో ఉన్నప్పుడే అందరికీ సుబోధము లవుతవి. కాగి

తమ మీద ఆ భావములు ప్రకటించినప్పుడు లేఖకులు 'గ్రాంధికీకరణము' చేయడముచేత దుర్బోధము లవుతున్నవి. ఆలాగున రచించిన వ్యాసములు చదివేవారున్ను, చదివించి వినేవారున్ను ఎంతో కొంత ప్రయత్నము చేయనిదే వాటి అర్థము తెలుసుకోలేరు. శబ్దమున్ను అర్థమున్ను ఒక దాని నొకటి ఆశ్రయించుకొని ఉంటవి గనుక, సుపరిచితమైన శబ్దము ద్వారానే అర్థము స్ఫురిస్తుంది. వ్యాసములలో సుపరిచితములు కాని శబ్దము లున్నప్పుడు, వాటి పర్యాయపదములు సుపరిచితము లయినవి చట్టున స్ఫురించకపోతే, చదివేవారికీ వినేవారికీ వాటి అర్థము తెలియదు. ఒకొక్కప్పుడు అపరిచితమైన శబ్దము ఒక వాక్యమం దుంటే, ఆ వాక్యమంతా దుర్బోధ మవుతుంది; అంతే కాదు, దాని మీది వాక్యములకూ, దాని కింది వాక్యములకూ దానికి గల సంబంధము తెలియక వ్యాసకర్త చెప్పదలచుకొన్న విషయము వినే వారికే కాక, చదివే వారికి కూడా బోధపడకపోవడము సంభవిస్తున్నదని నేను బాగా ఎరుగుదును.

సుపరిచితమైన దేశవ్యవహారము గురించి రచించినది (వ్యాసము గాని, జాబు గాని, పుస్తకము గాని) ఏదయినా దేశస్థులు చదివేటప్పుడు, ప్రత్యక్షరము కూడ బలుకుతూ శబ్దములూ, వాక్యములూ విడివిడిగా చదవరు; ఆలాగున చదవడము చదువు అనిపించుకోదు. చదువు నేర్చిన వారు కాగితము మీది బంతులు కలయజూచి వాక్యములూ వాటి అర్థమూ వాటిలో ఇమిడి ఉన్న మనోభావాలూ కూడా అవిలంబముగా గ్రహిస్తారు. పైకి వినబడేటట్టు చదవడముకన్న తమలో తాము చదువుకోవడము మరీ త్వరితము. (ఇంగ్లీషు నేర్చినవారు మనవారు కూడ కొందరు) ఇంగ్లీషువార్తాపత్రికలు ఎంత సులువుగాను ఎంత శీఘ్రముగాను చదువుతారో చూడండి, అనేక వాక్యములు కలయజూచి అవిలంబముగా అర్థము గ్రహిస్తారు. ఇంగ్లీషునవలలు చదివేటప్పుడు, ఇంగ్లీషువారు (స్త్రీలు గాని, పురుషులు గాని) గంటకు నూరుపుటలు చొప్పున పత్రములు తిప్పుతూ ఒక్క ఊపున ఒక్క బిగిని పుస్తకము కడవరకూ చూచి, కింద పడవేస్తారు. వార్తాపత్రికలు కూడా ఆలాగుననే ఒకొక్క గడి ఒక్కసారి కలయజూచి ఇంగ్లీషువారు విసిరి పారవేస్తారు. రాజ్యవ్యవహారము నిర్వహించేవారు, వాణిజ్యవ్యాపారాలు చక్కబెట్టేవారు, న్యాయమూర్తులు, పత్రికాసంపాదకులు, పత్రికావిమర్శకులు, శాసననిర్మాతలు మొదలయిన వారు ప్రతిదినమూ దినపత్రికలే అనేకము చదవవలసి ఉంటుందే, పండితులూ, పామరులూ (కూలివాళ్లు కూడా) వార్తాపత్రికలు చూడకుండా ఉండరే; అవి సుపరిచితమయిన వ్యావహారికభాషలో రచితమయి ఉండకుంటే, అట్టిపని సాధ్య మవునా? 'దేశభాష' అనే దానిలో వైవిధ్య మున్నా సంఘములోని శిష్టుల వ్యవహారము దేశస్థులకు సుపరిచితమే; పామరుల కైనా అపరిచితము కాదు. సంఘములో ఒకరు సామాన్యమైన దేశభాష ద్వారా నోటను చెప్పినది మరి ఒకరు చెవితో విని చట్టున గ్రహించినట్టే, కాగితము మీద వ్రాసి తెలియజేసినదికూడా కంటితో చూచి గ్రహిస్తారు. మాతృభాషాభ్యాసము బడులలో పడిన వారికి అది అలవా టవుతుంది. సామాన్యసంభాషణలో 'నోటిలో మాట నోటిలో ఉండగానే' వాక్యము పూర్తి కాకముందే, ఒకరి మనోభావము ఒకరు గ్రహించి, సంభాషణోద్దేశము జనులు నెరవేర్చుకోవడము ఏలాగున సాధ్య మవుతున్నదో ఆలాగుననే వార్తాపత్రికలు గాని, కథలు గాని, నవలలు గాని మామూలు జాబులు గాని ప్రతి శబ్దమూ, ప్రతివాక్యమూ సావధానముగా చూడనక్కర లేకుండానే, చదవడము సాధ్య మవుతుంది కాగితము మీద నున్న దంతా కన్ను కలయజూస్తుంది. మనస్సు దాని భావం గ్రహిస్తుంది. కంటికి గాని, మనస్సుకు గాని ఆయాస ముండదు. వాటి పని ప్రయత్నపూర్వకము గాదు.

ఇంగ్లీషువారు ఇంగ్లీషువార్తాపత్రికలు చదివినట్లు ఆంధ్రపత్రిక, కృష్ణాపత్రిక మొదలయిన వార్తాపత్రికలలోని సంపాదకీయవ్యాసములున్ను, గ్రాంథికాంధ్రమున రచించిన ఇతరవ్యాసములున్ను, జాబులున్ను తెలుగువారు చదవలేరు. ఈ విషయము అనేకసార్లు పరీక్షించి చూచినాను. ఇంగ్లీషు నేర్చిన తెలుగువారయినా ఇంగ్లీషువార్తాపత్రికలు చదివినట్లు సులువుగా తెలుగువార్తాపత్రికలు చదవలేరు. ఇందుకు కారణము తెలుగు అక్షరములు చదవడము వారికి అలవాటు లేకపోవడము కాదు; గ్రాంథికాంధ్రము సుపరిచితము కాకపోవడము.

తెలుగు పత్రిక లన్నీ తెలుగుదేశమందున్న తెలుగువారి కందరికీ తెలియవలసిన విషయములు తెలియచేసి, వారిని ఉద్ధరించడమునకు పుట్టినవి; గాని పండితుల కోసము పుట్టలేదు. పత్రికాసంపాదకులు ప్రాచీనాంధ్రభాషాపాండిత్యము గలవారయినా వారి పాండిత్యము వార్తాపత్రికలలో ప్రకటించడము వ్యర్థప్రయాసము. ప్రజాస్వామికపరిపాలనము ఏర్పడ్డ దేశములలో ప్రఖ్యాతి పొందిన వార్తాపత్రికల సంపాదకులు అట్టి పాండిత్యప్రకటనము పట్టి దంభ మని నిందించినారు; వాస్తవ మయిన పాండిత్యము తక్కువయిన కొలదీ పండితమ్మన్యులు వ్రాతలో దంభము అధికముగా ప్రకటిస్తా రని ఆక్షేపించినారు. తెలుగువారిలో నూటికి పదిమందైనా సంతకము చేయగలవారు లేనప్పుడు, వార్తాపత్రికలలోని సంపాదకీయవ్యాసములు చదవగలవారు ఎంద రుంటారు? పత్రికలలోని వార్తలు వినడమునకు తెలుగుదేశమందు ప్రజలకు అభిలాష ఈ పది యేళ్లలో ఎక్కువయినది. పట్టణములలోనే కాక, పల్లెలలో కూడా పురాణము చదివించి విన్నట్టు ప్రజలు ఆంధ్రపత్రిక చదివించి వినడము నేను స్వయం చూచి సంతోషించినాను. అయితే వారి శ్రమకు అనురూప మయిన ఫలము కలుగలేదు. భాష సుపరిచితము కానప్పుడు ఉత్సాహభంగము అనివార్యము గదా? సంపాదకీయవ్యాసములు పరధ్యానముగా కొందరు వినడము నే నెరుగుదును. కృష్ణాజిల్లాలోని పల్లెటూళ్ళలో కృష్ణాపత్రిక చదవగలవారందరూ చదువుకొంటూ రనిన్ని, చదవలేనివారు అనేకులు చదివించి వింటూ రనిన్ని నాకు తెలుసును. కాశీలోను, అలహాబాదులోను హిందీ దినపత్రికలు బజారులో చిల్లరదుకాణదార్లు కూడా కొని చదవడము నేను చూచినాను; అట్లే కలకత్తాలో బంగాళీదినపత్రికలు; లండనులోను, పారిసులోను, న్యూయార్కులోను, బెర్లినులోను, మాస్కోలోను, దినపత్రికల ప్రతులు అనేకలక్షలు ప్రతిదినము చిన్నపిల్లలు వీధులలో అమ్ముతా రట! కొన్ని దినపత్రికలు రోజుకు రెండు కూర్పులుగా అచ్చుపడతవట. ప్రజలు గ్రంథాలయాలలోను, విలాసగృహములలోను, పత్రికాపఠనమందిరములలోను, దినపత్రికలు వారపత్రికలు, మాసపత్రికలు ప్రజాసేవ చేసే అనేకసంఘముల వారు ప్రకటించే కరపత్రములూ చదువుకొనేవారికి దమ్మిడీ అయినా ఖర్చు లేకుండా దొరుకుతవి. ప్రజలు చదువుకొనే టందుకు ప్రకటించిన పత్రికలు గాని, కరపత్రములు గాని, పుస్తకములు గాని కేవలవ్యావహారికభాషలోనే రచితమయి ఉంటవి.

తెలుగుదేశమందు గ్రంథాలయములు ప్రజలకు ఉపచరించేటట్టు చేయడమునకు అనేకులు అనేకమయిన ఉపాయములు ఉపదేశించినారు. ఆంధ్రపత్రికాసంపాదకులు ఈ సంవత్సరము జనవరి నెల తేది 22 సంచికలో ప్రధానవ్యాసమందు చేసిన ఉపదేశము నా బుద్ధికి అందరూ కొనియాడ దగినదిగా తోచినది. "గ్రంథములు వ్యావహారికభాషలో అనగా మామూలు మాటలలో సులభశైలిని వ్రాయబడవలెను. గ్రంథాలయములలో వార్తాపత్రికలు గూడ నుండవలెను. ఈ గ్రంథములను, పత్రికలను ప్రజలు ఉచితముగా బడయగలుగుచుండవలెను. ప్రతిగ్రామమునందును గ్రంథాలయము ప్రజలకు కూడలి స్థా

నముగా నుండవలెను. స్త్రీలును, పురుషులునుగూడ వీటిని పూర్తిగా నుపయోగించుకొనుటకు తగిన సౌకర్యము లుండవలెను. వీటిని ప్రజలు ఉపయోగించుటకు గట్టి ప్రచారము జరుగవలెను. ప్రజల నధికముగా నాకర్షింపగల యేర్పాటు లన్నియును జరుగవలెను." ఇది అమూల్య మయిన ఉపదేశము. "గ్రంథములు వ్యావహారిక భాషలో అనగా మామూలు, మాటలలో సులభశైలిని వ్రాయబడవలెను" అనే వాక్యము పెద్దఅక్షరములతో పలకమీద వ్రాయించి, అందరికీ కనబడేటట్టు, ప్రతిగ్రంథాలయము ద్వారము మీదను ఉంచవలసినది.

దేశభాషాభిమానము తోడిదే దేశాభిమానము ఏ కులమువారైనా, ఏమతమువారైనా, ఏదర్జావారైనా తెలుగు మాతృభాషగా గలవారందరూ ఒక్క సంఘము వారనిన్ని, సంఘములోని వారందరూ అభివృద్ధి పొందితేనే కాని, సంఘము అభివృద్ధిపొందదనిన్ని, ఎవరు వెనుకబడ్డా సంఘమునకు నష్టమే అనిన్ని, ఎవరు త్రికరణశుద్ధిగా భావిస్తారో వారే దేశాభిమానము గలవారని చెప్పవలెను. వ్యావహారికభాషను పెద్దలు తృణీకరించి, వ్యవహారభ్రష్టమైన భాషను కొనియాడడమువల్ల ప్రజలకు 'దేశభాష' యెడల ఉండవలసిన గౌరవభావమూ, అనురాగమూ, అభిమానమూ కలుగవు. ప్రాచీనాంధ్రము రానివారు వాడుకభాష గ్రామ్య మనుకొని, తమ్ము తామే లాఘవపర్చుకొంటూరు. స్వాభిమానము లేనివారికి స్వాతంత్ర్యవాంఛ పుట్టదు; గ్రాంథికాంధ్రము కష్టపడి నేర్చుకొన్నవారూ, ఇంగ్లీషు నేర్చుకొన్నవారూ అవి నేరనివారి కన్న తాము గొప్పవారయినట్టు ఈ కాలమందు భావించడము ఎరుగుదుము గదా. ఇట్టి అంతరములు సంఘములో ఉన్నంతకాలము "పౌరసౌఖ్యము" ఏర్పడదు; పౌరసఖ్యము లేనిదే దేశోద్ధారకుల ప్రయత్నములు కొనసాగవు. ఇట్టి అవస్థలో మన సంఘమున్నప్పుడు, ఆంధ్రపత్రికాసంపాదకులు చేసిన హితోపదేశము, మీదను నేను ఉదాహరించినది, పుస్తకాలు రచించే వారే కాక పత్రికాధిపతులు కూడా అవలంబించవలెను. ఆ ఉపదేశము చేసిన ఆంధ్రపత్రికాసంపాదకులే మార్గదర్శకు లయితే, తక్కిన పత్రికలవారికి ఆ ఉపదేశము చొప్పున ఆచరించడము సుకర మవుతుంది. ఏ నాడు ఆంధ్రపత్రికలోను కృష్ణాపత్రికలోను సంపాదకీయవ్యాసములు యథోచిత మయిన వ్యావహారికభాషలో రచితమవుతవో, ఆనాడు తెలుగువారికి పండితపామరసామాన్యమైన దేశభాష కలదన్న మాట ప్రస్ఫుటముగా ప్రకటిత మవుతుంది; ప్రజాస్వామిక పరిపాలనను నిర్వహించడమునకు తగినవారుగా తెలుగువారిని తర్ఫీయత్ చేసే సంస్థలు స్థాపిత మవుతవి. అన్ని విద్యలూ తెలుగువారికి నేర్పడమునకు తెలుగే తగిన సాధన మని అందరూ అంగీకరిస్తారు. అభినవాంధ్రభారతిని ఆంధ్రసారస్వతపీఠము మీద కూర్చుండబెట్టి ఆ దేవికి పట్టాభిషేకము చేసే గౌరవము ఆంధ్రపత్రికాధిపతులు పొందుదురు గాక అని కోరుతున్నాను.

తెలుగు పత్రికలలో ఆంధ్రపత్రిక అగ్రస్థానము పొంది ఉన్నది; తెలుగువారిని ఉద్ధరించడమునకు దీక్ష పట్టినది. పత్రికాధిపతులు నిర్భీకులు; తమకు ఉచిత మని తోచిన మార్గమున నడవగలవారు; ఔదార్యవంతులు; సత్యమేవ జయతి అనే సిద్ధాంతమందు పరమవిశ్వాసము గలవారు. మీద నేను ఉదాహరించిన సంపాదకీయవ్యాసములో వారు చేసిన హితోపదేశము భాషాతత్త్వవేత్తల సిద్ధాంతమునకు అనుగుణముగానే ఉన్నది. మన పూర్వుల సంప్రదాయమునకు విరుద్ధము కాదు. (చూ. గద్యచింతామణి). బుద్ధదేవుడు, యేసుక్రీస్తు మొదలగు మహాత్ములు వ్యావహారిక భాషలోనే ప్రజలకు ధర్మము ఉపదేశించవలెనని శిష్యులకు విధించినారు. పండితపామరసామాన్యమైన వ్యావహారికభాష

విద్యాబోధకూ గ్రంథరచనకూ రాజ్యవ్యవహారనిర్వహణమునకూ సాధనముగా ఏ దేశమునందు ఏర్పడినదో ఆదేశమే ఔన్నత్యము పొందిన దని చరిత్ర ఘోషిస్తున్నది. వ్యవహారభ్రష్ట మయిన భాషలను పండితులకు విడిచిపెట్టి, వ్యవహారస్థభాషల ద్వారా లోకవ్యవహార మంతా నిర్వహించడము ఆచార మయినందున, ఇంగ్లాండులో ఇంగ్లీషువారున్ను, ఫ్రాన్సులో ఫ్రెంచివారున్ను ప్రజాస్వామిక పరిపాలనమునకు ముందుగా అర్హు లయినారు. వారి ఆచారమును తక్కిన జాతులవారు అవలంబించి, తెలివితేటలు సంపాదించుకొని వృద్ధి పొంది స్వతంత్రులవుతున్నారు. మనకాలమందే రష్యాదేశమున ప్రజాస్వామికపరిపాలనము నిర్విఘ్నముగా సాగుటకుగాను ప్రజలకు వాడుక భాషలోనే చదువు నేర్పి, వారు సులువుగా చదివి గ్రహించే టట్టు పుస్తకములూ, పత్రికలూ, ఆ భాషలోనే రచించి ప్రభుత్వమువారు వారికి అందజేస్తున్నారు. ప్రాచీనాచారములు పట్టుకొని పాకులాడే వారిలో మొట్టమొదటివా రని అందరూ చీనాదేశపువారిని మొన్న మొన్నటి వరకూ పేర్కొనేవారు; అట్టి చీనావారు కూడా ఇప్పుడు తమ వాడుకభాష విద్యాబోధకూ గ్రంథరచనకూ తగిన సాధనముగా చేసుకొన్నారు; ఒక్క తరములోనే, మనము చూస్తూ ఉండగానే, నిరక్షరాస్యత చీనాలో నిర్మూలము కావచ్చినది. ఈ విషయమును గురించి ఆంధ్రపత్రికలో శ్రీ. అయ్యదేవర కాళేశ్వరరావు గారు కొంచెము కాలము కిందట నాలు గయిదు వ్యాసములు వ్రాసి ప్రకటించినారు. జపానుదేశము వారి మాట వేరే చెప్పనక్కర లేదు; వారి వాడుక భాషతో కూడా, వారి సామ్రాజ్యమూ, వారి వాణిజ్యమూ, వారి ఐశ్వర్యమూ విజృంభించినవి; అధునాతనప్రపంచమందు జపాను అత్యున్నతి వహించి ఉన్నది.

అయ్యా! ఇంచుమించుగా ఇరవై ఏళ్ళ కిందటను నేనున్ను నా మిత్రుడు శ్రీ. కే. గురజాడ అప్పారావున్ను వ్యావహారికభాషాభ్యాసము బడులలో నెలకొల్పవలసిన దని వాదించినప్పుడు, రెండుకోట్ల మంది తెలుగువారికి ప్రతినిధులుగా ఈలాగున వాదించడమునకు మా ఇద్దరికీ అధికారము లేదని ఆంధ్రసాహిత్యపరిషత్తువారు హేళన చేస్తూ ఆక్షేపించినారు. ఆ ఆక్షేపమును ఖండిస్తూ దేశములో ఉన్న నిరక్షరాస్యు లందరున్ను, గ్రాంధికాంధ్రభాష రానివా రందరున్ను మా ఇద్దరితో ఏకీభవించిన వారే అని శ్రీవింజమూరి రంగాచార్యులవారు పత్రికలలో వ్రాసినారు. పిమ్మట శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణపంతులుగారి నవల 'మాలపల్లె' అనేది విమర్శిస్తూ వాడుకభాషలో గ్రంథాలు రచించవచ్చునా కూడదా అనే కాలముగతించిన దనిన్ని వాడుకభాషలో వార్తాపత్రికలే ప్రకటితము అవుతున్న వనిన్ని ఆచార్యులవారే తెలియజేసినారు. ఇప్పుడు, వ్యావహారికభాషయొక్క ఆవశ్యకత, దాని ప్రయోజనము తెలుసుకొని దానియందు అభిమానము, అభినివేశము గలిగి ఉన్న వారు వేలకొలదిగా కనబడుతున్నారు. 'సారస్వతపరిషత్తు' 'కళాపరిషత్తు,' 'సారస్వతసమితి', 'సాహితీసమితి', 'కవిమండలి' మొద లయిన పేళ్ళతో అనేకసంస్థలు దేశమందు వెలసి ఉన్నవి. వీటిలోని సభ్యులు యథోచితముగా అభినవాంధ్రరచన అభ్యసిస్తున్నారు. వారు రచిస్తూ ఉన్న గద్యకావ్యములూ, పద్యకావ్యములూ సహృదయుల మెప్పు పొందక పోవడము లేదు. ఆంధ్రసాహిత్యపరిషత్తువలె ఈ భాషను వెలివేసిన సంస్థ నాకెక్కడనూ కనబడలేదు. ఈపరిషత్తువారు తప్ప తక్కినవా రందరూ వ్యావహారిక భాష దేశభాషగా నెలకొనవలసిన దనే అభిప్రాయము కలిగి ఉన్నా రనే నమ్మవచ్చును. ఆంధ్రపత్రికాసంపాదకులకు ఉద్దేశించి నేనీ జాబులో చేసిన ప్రార్థన అభినవాంధ్రభాషాభిమానుల మతమునకు విరుద్ధము కాదు. ప్రబుద్ధాంధ్రపత్రిక అభినవాంధ్రభాషాసేవాసదన మనిన్ని, తత్సంపాదకులు

ప్రధానాచార్యులనిన్ని భావించి, వారి ద్వారా నా విజ్ఞాపన ఆంధ్రపత్రికాసంపాదకులకు వినయపూర్వకముగా సమర్పిస్తున్నాను. వారు దానిని అభినవాంధ్రభారతీదేవి లోకహితార్థము పంపిన సందేశముగా భావించి, గౌరవించేటట్టు మా ఆచార్యులు ప్రబోధింతురుగాక !

ఇట్లు అభినవాంధ్రభారతీ దాసానుదాసుడు,
గిడుగు వేంకటరామమూర్తి

పర్లాకిమిడి 6—3—34

(ఆంధ్రపత్రికల సంపాదకు లందరూ యీ సందేశంలో వున్న పరమార్థాన్ని గ్రహించి, తమ రచనలు జనసామాన్యం చక్కగా బోధపరుచుకొని బాగుపడడానికి వాడుకభాషలోనే ప్రకటిస్తా రని నమ్ముతున్నాం. (ప్రబుద్ధాంధ్ర సంపాదకుడు)



# ?

మల్లాది రామకృష్ణశాస్త్రిగారు

కలా నిజమా? కవుల కల్పనలలోనివా వాస్తవంగా ఈలాటి ఘోరాలు జరుగుతాయా? విధికి అంత ఓర్వలేనితనం ఎందుకో ?

*　　　*　　　*

మామూలు కన్న కొంచెం ఆలస్యంగా నిద్ర లేచాడు. బద్ధకం తీరేదాకా పక్క దిగకుండానే రాత్రి మొదలుపెట్టిన నవలను ఆఖరు చేశాడు: అద్దం దగ్గర నిలుచుని క్రాప్ సరిచేసుకుని తన అందాన్ని చూసి మురుస్తూ...ముసిముసినవ్వుతో చిత్రమూర్తిగా ఉన్నా, నవకాలు చిందిస్తూ ఉన్న హైమ ఫొటోగ్రాఫును చాలాసేపు సాకూతంగా వీక్షించాడు..."ఎన్నాళ్లయింది పెళ్లి—ఎప్పుడు వస్తుందో? ఈ ఆడుపడుచుల మోరాయింపులకు అంతు ఉంటేనా? పుట్టింట్లో విందులు కుడుస్తూ కూర్చుంటే 'ఇయం గేహే లక్ష్మీ' అని నమ్ముకుని ఆసపడుతూండే వాళ్ల పని మరి ఇంతేనా? చెపుతూంటాను, కథ వ్రాసిపెట్ట మంటే ఏవో సాకులు చెప్పి తప్పించుకునే అలసత్వం అంతా ఎక్కడికి పోయింది? ఎక్జిబిషన్ కోసం వాళ్ల అమ్మ ఏవో కుడుతూంటే తను కూడా అది అయిపోయేదాకా అక్కడే ఉండాలేం?...నడుము వాల్చకుండా రోజూ పొద్దస్తమానమూ కూచుంటున్నా మంటే నా కేమన్నా ఒలికిందా ఇక్కడ?...నా జేబురుమాళ్లకు పోగులు తీసి అంచులు కుట్టిపెడతా నని ఇక్కడికి ఎన్ని వాయిదా లయినాయి? ప్రైజు వస్తుందిట. నే నున్నాను చాలదూ?...వాళ్ల నాన్న చవుకగా ఐదువందలకి దొరికా నని కొని ఇచ్చాడుకా? అబ్బ ఈ పెళ్లా లన్న వాళ్లు ఎప్పుడూ ఇంతే..."

మెట్లు దిగి వస్తున్నాడు. అంతలో ఆగిపోయి కల కంటున్నానా, అని భ్రాంతితో వికసితనయనాలతో చూసినాడు. నిజమే. హైమ—కటకటాలను ఆనుకుని నిలుచుని ఉన్నది.

మెట్లు లెక్కపెట్టుకుంటూ దిక్కులు చూస్తూ తాపీగా దిగే అలవాటు అనిమిషాన మాయమై పోయింది. ఒక్క చెంగున ఆమె దగ్గరకు దూకేశాడు వరదరాజు-హైమ అతని ఆవేగాన్ని గమనించి కొంచెం వైదొలగింది.

"నిజమేనా?"

"ఏమిటి?" అని హైమ అమాయికంగా చూస్తూ ఏమీ తెలియని దాని లాగా అడిగింది.

"నిజంగా...నీవు-నీవేనా కనబడుతూంది?"

హైమ నవ్వింది.

"నిద్ర లేవగానే ఎవరి మొగము-నా ముఖమే కాదూ చూసుకుంది? మంచిదే నన్న మాట—"

"ఇప్పుడేనా నిద్ర లేవడం?"

"కాదు చాలాసే పయింది;" కాని

"ఇంత సేపటి దాకా ఏం చేస్తూన్నారూ మరి క్రిందికి రాకుండా?"

"కల గంటూన్నాను. తమ దర్శనభాగ్యం ఇంత త్వరగా ఈలా తలవని తలపుగా—"

"చాల్లెండి మరీ నేర్చుకుంటున్నారు..."

"నేర్పడానికి నీవు దగ్గర లేందేనా?"

"అన్ని ఉత్తరాలు వ్రాయకపోతే మీరు రాలేక పోయినారూ? సెలవరోజున వస్తే మన ఇద్దరం కలిసి వచ్చేసేవాళ్లం కాదూ?"

"నేను వస్తే...మరి రాణీగారికి తీరా దయవసుందో రాదో—అసలు దర్శనమే కర వౌతుందేమో నని భయపడ్డాను"

"ఈ తలాయింపుల కేం లెండి? బయలుదేర డానికి బదక మనరాదూ?"

"పోని దయ తలచి నీవే రావా అని—"

"అవును. ఈ మొగవాళ్ల మతమే ఇది. ఎవరి కోసం వస్తుంది అని దిలాసా. పంపించి, తిరిగి ఇంగ మైనా చూడరమ్మా. ఈజాతి లక్షణమే ఇది"

వరద, మారు మాట చెప్పకుండా లోపలికి వెళ్లిపోయినాడు. స్నానాదికములు పూర్తిచేసుకుని వచ్చి హాల్లో కూర్చున్నాడు. హైమ వేషం మార్చే సుకుని సరిగపని చేసిన రాజ్‌పుటానా సిల్కు చీర కట్టుకుని వచ్చి అతని సరసను నిలుచున్నది.

"మోహిని లాగా ఉన్నావు..."

హైమ చిరునగవుతో అతని ముంగురులు సరి చేస్తూ "నాకు తెలుసు లెండి మీ యెత్తు. అమృత దానం—కాఫీ...కోసం ఇన్ని వగలా?"

కాఫీ కప్పుల్లో పోసింది. అతడు చూసి ఊరు కున్నాడు.

"తాగండి"

వరద, పసిపిల్లవాడి లాగా మారాం చేస్తూ బుంగమూతితో "భోజ్యేషు మాతా..." అని హైమవంక చూసి నవ్వాడు. ప్రేమ వెల్లివిరుస్తూ ఉన్న చూపులతో ఆమె కాఫీ అతని నోటికి అందించింది. అవకాశాన్ని పురస్కరించుకుని అతడు హైమను దగ్గరకు లాక్కున్నాడు.

"ఊ ఊఁ-ఉండండి—చూడండి మరి, చీరంతా కాఫీ తొణికింది...ఇంతే మీరు ఎప్పుడూను..."

"పోనీలే. నాకేగా ఫైను? చెల్లారాం షాపును మళ్లా ఒకమారు తాము పవిత్రం చెయ్యాలిసిన అవసరం కలిగిం దన్న మాట. ధన్యుణ్ణి..."

"ఈమారే. లేత ఊదాలో కొనండి. ఎంబ్రాయిడరీలో చక్కని సన్న అంచులవి వస్తున్నాయి..."

"జో హుకుం"

హైమ అతని బుగ్గలు సాగదీస్తూ "అంత నవ్వుగా ఉందేం? చెపుతా నుండండి మీపని. నాసంగతి అసలు మీరు—"

"మళ్లా దేవిగారు పుట్టింటికి ప్రయాణం—"

"అఁ! అదేపని!...మీరుకావాలిస్తే వెళ్లండి... అత్తవారి యింటికి..."

కాఫీ తాగడం అయింది. వరద, కుర్చీలోనుంచి లేచాడు. సిగరెట్టు ముట్టించవలెనని అపేక్షపడి, మళ్లా మానివేసి, నిలుచుని, హైమ భుజములమీద

చేతులు వేసి, ఆమె చక్కదనాన్ని చూస్తూ "నీకు కోపం వస్తే తాళుకోలేను బాబూ! నాకు భయం వేసుకొస్తుంది. నీవు మీవాళ్ల యింటికి ప్రయాణం కట్టావా అంటే—"

హైమ అతన్ని కౌగలించుకుని సిగ్గుతో—విలాసంతో—గాద్గదికంతో—"మిమ్మల్ని...విడిచి ఉండలేను...నేను అడిగినా, మావాళ్లు యింటికి పంపకండి" అని దీనంగా చూసింది.

అతడు, "ఆఁ! అంతా నిజమే" అని ఎకసక్కెము చేసినట్లు నటించాడు.

హైమ, చెంపమీద చిన్న దెబ్బ యిచ్చి లోపలికి పారిపోయింది. వరద, సూట్ వేసుకుని కారులో కాలేజీకి వెళ్లిపోయినాడు.

* * *

వికసించినవి జాజి
విరులు నీ వేణిలో
ప్రకటించినది వలపు
సుకుమారతనువల్లి...ఇక నేలనే చెలీ!
నన లెత్తినవి భావ
నానవ్యమాధురిని
నవనవోదయజీవ
నాలసవిలాసాలు......
ఆళికుమారీగీతి
కా లాలితమ్ములై
అలయించినవి మల్లి
కామందహాసాలు...

వెన్నెల లేని లోపం తీర్చడానికి "తెలుగు దీపాలు" తంటాలు పడుతున్నాయి. హైమ, డ్రెసింగ్ టేబిల్ దగ్గర నిలుచుని తలలో పూలదండ సరిజేసుకుంటూన్నది. "మొగవాళ్లు ఎంతకైనా తగుదురు. ఎంత నిబ్బరం! నాకోసం ఎంత ఉబలాటపడుతున్నా—తపిస్తూన్నా—ఎదుటపడేటప్పటికి ఎందుకో అంత అభిమానం అడ్డొ అనిపించలేక పోయినానుగా ఆయనచేత? నానోటి వెంటే చెప్పించారు. కాని, ఇంటికి రానీ, భోజనం అయిన తరువాత నిద్రపోతాను. ఊహుఁ...! సినిమాకు వెళ్దామని పట్టుపడతాను. నాకసి తీరా—ఏం—నన్ను విడిచి ఉండలేననే అనకూడదేం?"

చీకటి పడింది బాగా. కారు చప్పుడౌతుందేమోనని హైమ చెవి ఒగ్గి ఏం ధ్వని అయినా వింటూంది. "అబ్బ ఇవాళ కూడా ఆలస్యమేనా? రెండు నెలలకీ—ఈరాత్రి ఇంకెంత సేపటికి వస్తారో? ఇదిగో ఈ కొత్త పుస్తకాల దొంతరన్ని మళ్లా వచ్చిపడ్డాయి. మా అమ్మే! ఏదవనిసా ననుకుంటున్నారు కాబోలు. అన్నీ దాచేయాలి. ఎప్పుడూ చదువేనా?...ఈ సిల్కుషర్టులు ఎప్పుడు కుట్టించుకున్నారో! బాగున్నాయి. ఇవాళ ఇదే తొడుక్కోమంటా. మా నాన్న పెట్టిన పంచలమీదికి ఇవి చాలా చక్కగా ఉంటాయి. ఆ!...ఇదిగో అసలు సంగతే మరచిపోయినానేం? చాలాఁ ఈ సిగరెట్లన్నీ? కాల్చి పొగ నామీదికి ఊదుతారు బాబోయ్!...అవి ఉన్నంతసేపూ నేనైనా కనబడుతానా? సొరుగులో పెట్టి తాళం వేశేస్తా. ఎప్పుడన్నా ముచ్చటగా నేనిచ్చినప్పుడు కాని ఎప్పుడూ అగ్నిహోత్రా లేనా?"

ఇంకా కొంచెం పొద్దుపోయింది. మామూలు వేళ కూడ దాటిపోతూంది...

"రావాలిసిందే నే ఈపాటికి? ఎక్కడ—ఇంతసేపు ఏం చేస్తున్నారో? అదా సంగతి? పెందరాడే వచ్చేస్తే నాకోసం పరిగెత్తుకని వచ్చారని ఉడికిలిస్తానని—ఎక్కడో తిరుగుతూ ఉండాలి... ఏం? అంత నమ్మకం? అబ్బ! ఈలాగైతే నేనుండలేను. రేపణ్ణుంచీ కారు వెళ్లేటప్పుడు నేను కూడా బయలుదేరుతా. అక్కడనుంచి అలాగే షికార్లు కొట్టి ఇంటికి చేరుకోవచ్చును. అంతే ఇకనుంచి అపనే చేయాలి."

ఫోను మ్రోగింది.

హైమ, వినికూడా విసువుతో ఊరుకుంది; కాని అవతలవాళ్లు వదలిపెట్టలేదు. రింగ్ చేస్తూనే ఉన్నారు.

..."ఎవరో బాబూ! వేళకు సరిగా సిద్ధమైనారు. ఎవ రన్నా పిలిచారంటే ఈ మన ఇల్లూ వాకిలీ వదిలి పరుగెత్తుతారు. ఈవేళే—ఈ రాత్రే ఏమంత పని ముంచుకుపోతూందో! నేను పలకను. ఎంతసేపలా పిలుస్తారో చూస్తాను కామా?"

ఆగిపోయింది.

'...అమ్మయ్య!...గండం గడిచింది...—...ఎనిమిది దాటుతూంది. ఇంకా రాలే దేమో? ఈ పాటికి వస్తూండాలి. రాని, పని పట్టిస్తా. మరీ బొత్తిగా భయం లేక చెడిపోతున్నారు. చక్కగా అలంకరించుకుని ఎప్పుడు వస్తారో అని ఎదురుచూస్తూంటే తమ చిత్తం వచ్చినప్పుడు దయచేస్తారేం?'

మళ్ళా. ఫోను.

అవతలవాళ్ళను మనసుతోనే మ్రింగేసే కోపంతో హైము రిసీవర్‌ను అందుకుని పరధ్యానంగా—

'హలో', అన్నది.

'జనరల్—హాస్పిటల్'

'ఆహాఁ'

'డాక్టర్ రామునిమెనన్ మాట్లాడుతూన్నది. ప్రొఫెసర్ వరదరాజాను'—ప్రాణాపాయ—'

'ఏమిటి—ఏమిటి—?'

'కారు ట్రాముతో కొట్టుకున్నది...'

'ఆఁ! ఆఁ! ఎలా ఉన్నారు. చెప్పండి. ఎలా—ఉన్నా—రు—'

'స్పృహ లేదు. వారి స్నేహితు—భార్యను రమ్మనండి...'



# ఇపుడు మనకు ప్రత్యేకాంధ్రరాష్ట్రనిర్మాణం అవసరమా?

భావరాజు వేంకటకృష్ణరావుగారు బి. ఏ. బి. ఎల్.

"ఇపుడు మనకు ప్రత్యేకాంధ్రరాష్ట్రనిర్మాణం అవసరమా?" అన్న ప్రశ్న ఆంధ్రుల మనసులో మాటిమాటికీ రేకెత్తుతూ ఒకనాడు గడ్డకట్టిన ఉత్సాహమును సెటికెంటె పల్చన చేయుచు ఉన్నది. ఉత్తరసర్కారులవారు ప్రత్యేకాంధ్రరాష్ట్రం నిర్మాణ మయితే చాలా లాభాలు ఉన్నాయి అని ఐక్యకంఠంతో ఘోషిస్తు ఉన్నారు. 'ప్రత్యేకాంధ్రరాష్ట్రం' 'మంచిదే,' 'కాని' 'అయితే' అంటూ నీళ్లు నములుతూ రాయలసీమాంధ్రులు శంకిస్తున్నారు ఆ అనుమానాస్పద మైన మాట మునుపటి సంగతి. ఇపుడు ధైర్యం చిక్కబట్టి మనసులో లేని పోని అనుమానములు, అసూయలు కల్పించుకొని వైమనస్యంతో ఇపుడు అనావశ్యకం అని చెప్పుతున్నారు "అనవసరం" అని నోటితో మొగమోటము విడచి అనలేకుండా పోయినా "ఇపుడు మాకు అక్కర లేదు; మీతో మేము కలవజాలము" అని చెప్పడానికి సాహసించి ఉన్నారు. బాగా ఆలోచిస్తే యిదీ ఒక మేలే! అన్నదమ్ములు ఇరువురిలో, ఒకడు నాకది కావలె నంటూ యుంటే, రెండవవాడు 'అది నాకు పనిలేదు' అని పెడమొగం పెట్టి కక్ష సాధిస్తూ యున్నట్లు భావించడం, ఎంతటి మనస్థితో ఎట్టి కష్టకాలమో ఉభయులయొక్క శ్రేయస్సు కోరేవాంకి ఊహించుకొనడానికి సయితము చాలా దుస్సహంగా ఉంటుంది. ఈ యుభయులకు నిజంగా ఏకీభావమే మనము వాంఛించే టట్లయితే వారిద్దరు మొదట ఏకాభిప్రాయానికి రావాలి. ఉత్తరసర్కారుల ఆంధ్రులు కూడా దత్తమండలవాసుల వలె "మాకు అక్కరలేదు ప్రత్యేకాంధ్రరాష్ట్రనిర్మాణం" అని నిశ్చయం చేసుకోవాలి. నిష్కల్మషహృదయంతో మనసు మల్లించుకొని చెప్పాలి;

తమ ఉద్యమానికి స్వస్తి చెప్పాలి. లేదా దత్తమండలవాసులు పరిస్థితులు సమగ్రంగా బోధపరచుకొని సహృదయతతో ప్రత్యేకాంధ్రరాష్ట్రం మనకు నిశ్చయంగా అవసర మని, పూర్వాంధ్రసీమవాసులతో చేయి చేయి కలిపి దీక్షగా పని చేయాలి.

ప్రస్తుతపరిస్థితు లన్నింటిని ఆలోచిస్తే యీ సమస్య యింతలో తేమల్చబడుతుం దని తోచదు. అంతేకాదు; ఇప్పు డున్న పరిస్థితులు ఇంకా కొంత కాలము ఈలాగే ఉంటే ప్రత్యేకాంధ్రరాష్ట్రనిర్మాణం కొన్ని దశల దాకా ఆంధ్రులకు అవసరం కాదేమో అని స్పష్టంగా మనసుకు తట్టుతుంది. ఇప్పుడాంధ్రభూమిని ఆవరించి ఉన్న సమస్యలు చాలు ఆంధ్రజాతిని వళ్లు తెలియకుండా, కర్తవ్యము తోచకుండా, అన్యకార్యాంతరనిమగ్నను చేసి మృతజీవిగా చేయడానికి, గడియ గడియకు మతి పెడదారిని బట్టి త్రుళ్లింత లాడే యీ విపరీతకాలములో 'ఆంధ్రులకు ప్రత్యేకరాష్ట్రనిర్మాణం అవశ్యకమా' ఇపుడు, అన్న ప్రశ్న ఎందుకు కలగవలెనో తెలియకున్న ది.

రాయలసీమవాసులకు ఉత్తరసర్కారుల ఆంధ్రులంటే హృదయంలో నిష్కల్మష మైన ప్రేమ లేదు. ప్రేమ వరకు అక్కర లేదు. అసలు మొదట సౌమనస్యమే లేదు. అన్నిటికంటె ముందుగా రాయలసీమవాసుల హృదయక్షేత్రంలో అవిశ్వాసము అసూయ, అనుమానము మొదలయిన విషఅంకురములు మొలకలెత్తి ప్రేళ్లుబారి మ్రానుకట్టుకొని ఉన్నవి. అన్నదమ్ముల కిద్దరికీ అయిష్టము కుదిరిన తరువాత వేరుపడి యుండుట మంచిది గాని కలిసి యుండుట మేలు గాదు. కలిసి యుండ ప్రయత్నించడం కూడ ఉభయభ్రష్టత్వ కారణంగా పరిణమిస్తుంది. దానివలన వా రిరువురు శత్రువులకు లోకువై పోవుదురు. అంతటితో అది ఆగదు. ఈ పాడు ప్రపంచములో పగ వృద్ధిపొందించువారలే గాని పగ అణగించువారు కానబడరు. మనలో మనకు ఇపు డేర్పడిఉన్న వైమనస్యము పురస్కరించుకొని మనశత్రువులు కుటుంబకలహం సృష్టిస్తున్నారు. అది అగ్నిజ్వాలవలె సప్తజిహ్వాలతో మింటికెగిసి పోతూ వున్నది. దానిని ఆర్పగల పుణ్యశ్లోకుడు, దక్షుడు ఇంకా పుట్టలేదు. భావికాలం ఎలా ఉంటుందో!

రాయలసీమవాసులపై పూర్వాంధ్రసీమవారికి స్నేహము ప్రేమ ఉన్నదా అని ప్రశ్నను వేయవచ్చును. నిజ మైన ప్రేమ కలదో లేదో రాయలసీమవారివలె చేతలయందును కనబరచవలెను గాని నోటి మాటలతో ఎంత నొక్కి చెప్పితే నేమున్నది. ఉత్తరసర్కారుల ఆంధ్రులు, 'మాకు రాయలసీమవాసులంటే ప్రేమ గలదు' అని యెంత చెప్పినా నమ్మని దుస్థితిలో రాయలసీమవా రున్నప్పుడు ఇవతలవారు గొంతుక చించుకొని ఘోషిస్తే మాత్రం కలిగే మహాప్రయోజన మేమి? గ్రుడ్డివానికి అద్దమెవడు చూపగలడు? చెవిటివాని చెంత శంఖం పూరిస్తే యేమి ప్రయోజనము?

మొదట ఆంధ్రోద్యమం పూర్వాంధ్రసీమలో ఉద్భవించింది. నెల్లూరిమండలవాసులకు ఆంధ్రోద్యమతత్త్వం తల కెక్కేటప్పటికి మిగిలినఉత్తరసర్కారువాసులకు తలప్రాణం తోకకు వచ్చింది. కాని విశ్వప్రయత్నం చేసినా ఆంధ్రోద్యమమూలతత్త్వము రాయలసీమవాసులకు బోధపడినట్లు లేదు. పాతికేండ్లు తలక్రిందుపడి తపస్సు చేసినా రాయలసీమ సోదరులకు దీని నిజం తలకెక్కించలేకపోయినారంటే తప్పు, తెలివిహీనత చేతకానితనము, అన్నీ ఉత్తరసర్కారుల ఆంధ్రులవే అని అనక తప్పదు. కాని పాషాణ మయినా కరగికరగి చదునవును గాని లోహము, వజ్రసన్నిభము అయిన వస్తువులు చలింపవు. ఉత్తరసర్కారులవారు ఏ యుద్యమం తలపెట్టినా అది ఏదో జెట్టో, పామో, విషమో అని మొదటినుంచి భయ, శంకలతో పరిశీలించి, అడుగడుక్కి అనుమానపడే అలవాటు రాయలసీమవాసులకు పరిపాటి అయింది. ఈ భయము, శంక,

అసూయ మొదలయినవి రాయలసీమవారికి చిఱుతప్రాయమునాడే ఉగ్గుపాలతో పెట్టినట్లున్నవి. అవి వారిని వదలిపెట్టేటట్టు కనుపించడం లేదు. ఉత్తరసర్కారుల ఆంధ్రులు ఎంత తన్నుకు చచ్చినా ప్రయోజనం ఉండబోదు అని భయం వేస్తున్నది. చివరకు మన గతి యింతే కాబోలు! ఈ మాట నిస్పృహచెంది చెప్పేది కాదు సుమండీ. నిశ్చలంగా కూర్చుని నిశ్చలచిత్తములో బుద్ధిని ఏకాగ్రం చేసుకొని నిశితంగా ఆలోచించుకొని తేల్చిన సారాంశ మిది.

భరతఖండంలో ఏ జాతులవారికైనా ప్రత్యేక రాష్ట్రం అవసరము కావచ్చును గాని ఆంధ్రులకు మాత్రం అవసరము కాదని నిస్సంశయముగా చెప్ప సాహసిస్తాను. ఆంధ్రులు దక్షిణాపథమంతా పాకి ఉన్నారు. అటు పడమట బొంబాయి రాజధానిలో నున్నారు; ఉత్తరాన మధ్యపరగణాలలో ఉన్నారు. దక్షిణాన అరవదేశంలో ఉన్నారు. మైసూరులో ఉన్నారు. ఇటు త్రిలింగాణములో నున్నారు. అటు రాయసీమలో ఉన్నారు. ఒక ఉత్తరసర్కారుల వారు తప్ప మిగిలిన వారు ఎవ్వరూ ఆంధ్రుల మని అనుకొని గర్విస్తూ యున్నట్లు కనిపించడం లేదు. మధ్యపరగణాలలోని ఆంధ్రులున్న స్వల్పభాగం ప్రత్యేకాంధ్రరాష్ట్రంలోనికి రావడానికి వీలుంటే ఉండవచ్చును గాని నైజాం ఆంధ్రభాగము మైసూరు ఆంధ్రభాగము మాత్రం రాజాలవు. దక్షిణాదికి పూర్వం వలసపోయి అరవదేశంలో మేము కూడా తెలుగువారమున్నామని చెప్పుకుంటూ ఉన్న ఆంధ్రులు తెలుగు భూమిలోనికి మరల వలస రాజాలరు. ఒక వేళ ఆంధ్రరాష్ట్రం నిర్మాణం కావడమే తటస్థిస్తే ఒక పెద్ద ఖండం అన్యరాజ్యంలోనే ఉండిపోతుంది. ఇప్పటిసంగతి ఆలోచిస్తే ముగ్గురు సోదరులలో ఒకడు దత్తుడైపోయినాడు. ఇంకొకడు బుద్ధిపూర్వకముగా వేరుపడతా నంటాడు. పెద్దవాడు ఇక ఐకమత్యం కలిగి సమిష్టిగా ఉండాలంటే వినే దెవరు! ప్రత్యేకఆంధ్రరాష్ట్రం నిర్మాణం అవడం ఎలాగ?

పూర్వపు ఆంధ్రులు యశోమకరంధర శుభశీలురు. వారి సుచరిత్రము తేజస్సు ప్రచండప్రతాపము, ప్రజ్ఞ శక్తిసామర్థ్యములు అభినివేశము. ఉత్సాహము మొదలయినవి బ్రహ్మాండమంతా నిండి పదిహేనుశతాబ్దములు మహావిభవముతో వెలిగి చివరకు దక్షిణదేశంలో తంజావూరు మధురానగర రాజ్యములలో మిణుమిణుకు మంటూ అస్తమించిపోయినవి. ఆంధ్రుల సుగుణసంపత్తిని చూచి ఆశ్చర్యము, భయము సంభ్రమము పొందిన అరవవారు దాక్షిణాత్యులు వాటిని, ఆంధ్రుల వెలుగు చల్లారిన వెంటనే అలవరచుకొన్నారు; ఉత్కృష్టులయి అభివృద్ధికి వచ్చినారు. కాని తెలుగువారు తమ జాతియొక్క శక్తి సామర్థ్యములను సుగుణసంపత్తిని పూర్తిగా మరచిపోయి బ్రతికి చెడ్డవారి దుర్గతిలో మునిగియున్నారు. మనము అరవదేశమునకు సంక్రమింపజేసిన సుగుణసంపత్తిని నాగరికతను తెలివితెచ్చుకొని మరల సంపాదించుకోవలయును. అంతవఱకు మనము అరవలతో సంబంధము వదలుకోరాదు. అంతవఱకు మనము వారితో పాటు కలసి చెన్నరాజధానియందే యుండుట శ్రేయస్కరము. సత్సహవాసము విడిచిపెట్టితే మంచి అలవాట్లు అలవడవు.

పైన వ్రాసిన దానికి రెండుమూడు ఉదాహరణము లిస్తాను. ఆంధ్రులలో అసలు ప్రజ్ఞ కలదా అన్న సంశయము గల వృద్ధమతులకు ప్రత్యుత్తర మిది. జాతీయోద్యమము బంగాలీలు తలపెట్టిన తరువాత ముందు అందుకున్నది ఆంధ్రులు. వంగ రాష్ట్రము ఒక్కటిగా నుండవలెను గాని చీలదీయరాదని ఆందోళనము చెలరేగినపుడు వంగదేశీయులకు సానుభూతి జూపి సాహసముతో చేదోడు వాదోడు అయి దేశాభిమానము ప్రకటించినది ఆంధ్రులు. రాజాంగప్రశక్తి ఆంధ్రుల రక్తనాళా

లలో అంతరించిపోయిన దని కొందరు మహారాష్ట్రులు దురభిమానముతో అక్కడక్కడ చాటుతూ వచ్చినా చివరకు వారికంటె హోంరూలు ఉద్యమంలో ముందుగా అంజవేసింది ఆంధ్రులు, సహాయనిరాకరణోద్యమము తుపానువలె వీచిన నాడు దానిలో మిళితమై చిందులు త్రొక్కినది ఆంధ్రులు. చీరాలపట్టణాన ఆంధ్రుల ఉత్సాహ ప్రభుమంత్రశక్తులు ఎంత పని చేయగలవో ఆనాడు చేసి నిరూపించిన గోపాలకృష్ణయ్య మన ఆంధ్ర రత్నము. అతని కృత్యములు భారతీయుల కందరకూ అచ్చెరువు కలిగించినవి. మాంటిఫర్డు రాజ్యాంగసంస్కారణములు అమలులోనికి వచ్చినపుడు తమ రాజనీతిని వెల్లడించి, తమ పూర్వుల ప్రజ్ఞలను తలపునకు దెచ్చుకొని ద్వంద్వప్రభుత్వ విధానాన్ని జయప్రదంగా నడిపిరని చెన్నపురి రాజధానికి అద్వితీయమైన యశస్సు ప్రశంసగడించినది ఆంధ్రులు. రాజ్యాధికారం కైవసం చేసుకున్నప్పుడు దురాశాపరులై తమకు రొట్టె యితరులకు ముక్క అన్నట్లు అరవజాతివలె చేయక విశాల హృదయంతో ఔదార్యంతో చెన్నరాజధాని నంతా ఒక్క ఉమ్మడిని అభివృద్ధికి తీసుకొని రావడమునకు పూనుకొన్నది ఆంధ్రులు.

ఒక విధంగా ఆనాడే ఆంధ్రుల రేఖ బయలు పడింది. ఆంధ్రులకు ప్రత్యేకవ్యక్తిత్వం ఏర్పడింది. పూర్వం మన ఆంధ్రులను కూడా మద్రాసీలనే అంటూ ఉండేవారు. నేటికీ ఉత్తరహిందూస్థానీలు మద్రాసీ అంటే ఒక విధమైన నైచ్యభావం ప్రకటిస్తారు. ఆంధ్రులు చెన్నరాజధాని దాటి వెళ్లితే ఇప్పటికీ మద్రాసీల కిందనే పరిగణింపబడుతున్నారు. కాని ఆంధ్రులు తమకు ఆత్మవికాసం కలిగిన నాటనుండి మద్రాసీ లని పిలిపించుకోవడం లేదు. వారు తమ్ము మద్రాసీ లని పిలుస్తే రోషం తెచ్చుకుని స్వాభిమానం పెంచుకొని వినయంగా, గర్వంగా, "మేము మద్రాసీలము కాము ఆంధ్రులము" అని జవాబిస్తున్నారు. ఇట్టి స్వాభిమానం ఏర్పడిన నాడు ఆంధ్రులకు ప్రత్యేకవిశ్వకళాపరిషత్తు స్థాపింపబడింది. చెన్నపట్టణమందున్నటువంటి పెద్ద జనరలుహాస్పిటలు వంటిది దానికి పోటీగా విశాఖపట్నంలో వెలిసింది. దానితో పాటు మేలయిన మెడికలుకాలేజీ యొకటి సంప్రాప్తమయింది. ఇది అంతా ఆంధ్రుల దేశాభిమానం స్వాభిమానం పాలు పొంగినట్లు పొంగడం చేత కలిగిన ఫలము. ఆనాడు ఆంధ్రులలో రాయలసీమ ఉత్తరసర్కారులు అను భేదభావములు ఏర్పడి ఉండలేదు.

నేడు కూడా మన చెన్నరాజధానియొక్క రాజ్యాంగమునందు ఆంధ్రునిదే నాయకత్వము. ఆంధ్రులు రాజసము ప్రధానముగా గల శక్తిసంపన్నులు. నాయకత్వము వహించడానికి ఆంధ్రుడే సర్వవిధములా సమర్థుడు. సమర్థతకు తోడుగా ఆంధ్రులకు సచ్చరిత్రము, ఔదార్యము మొదలయినవి ఉంటున్నవి. కాంగ్రెసు రంగమునందు గాని, ఖాదీ పరిశ్రమాభివృద్ధియందుగాని, హిందీప్రచారణోత్సాహమునందు గాని ఆంధ్రులు ఏమాత్రం కూడా వెనుకబడి ఉండలేదు. కొందరింటె ముందంజ వేస్తున్నారు కొంచెం ముందు అడుగు వేస్తున్నామని అనుకుంటున్నవారితో సమానమవడానికి కాలు సాచుటకు ప్రయత్నిస్తున్నారు.

కాన ఆంధ్రుల ప్రతిభ, ప్రజాసామర్థ్యములు దీక్ష ఇవన్ని బహుముఖములుగా నిష్ప్రయోజనంగా ప్రవహించిపోవడం కంటే యేకముఖమై యేకలక్ష్యంతో కార్యసిద్ధికై వినియోగింపబడడం అన్ని విధములచేతను కోరదగినది. పూర్వజన్మసంస్కారము ఇంకా ఆంధ్రులకు కలగలేదు. ఆసంస్కారం కలిగిననాడు ఆంధ్రప్రతిభ సానబెట్టిన జాతిరత్నమువలె దేదీప్యమానముగా ప్రకాశిస్తుంది. ఇంకా కొంత అనుభవం కలిగితేగాని ఆంధ్రజాతికి పూర్వజన్మసంస్కారం కలుగదు. ఆంధ్రజాతి తన పూర్వ

పుస్తకములన్నింటిని పూర్తిగా అలంకరచుకొనడానికి యింకా కొంతకాలము చెన్నపురిరాజధానియందే యుండడం శ్రేయస్కరము. తనకిపుడేది లోపమో దానిని ఆంధ్రజాతి సంపాదించుకోవలసియున్నది. ఆంధ్రుల హృదయవిపంచి శిథిల మైపోయింది. దానికిపుడు పూర్వపు తీగెలు లేవు. ఇపుడు కట్టుతూ ఉన్న క్రొత్తతీగెలు సయితము కోలోచిత మైన నూత్నదివ్యరాగాన్ని ఆలాపించడంలేదు. ఆంధ్రుల సంగీతము అరవదేశములో కాలువిరిగి దిక్కుమాలి కూలిపోయి పడివుంది. ఆ యార్తికి ఉపశమనం కలుగజేసి, లేవదీసి తారుణ్యామిచ్చి ఆమెను ఆంధ్రదేశానికి మళ్లీతీసుకొనిరావలసిన బాధ్యత ఆంధ్రులయం దున్నది. అరవజాతికి మన సంగీత మలవడ్డది ; గాని అది సుస్వరబద్ధ మైన మధురగానం గాదు, అందు సాహిత్యము సున్న. అది సుందర మైన పట్టి కొయ్యబొమ్మ. కొయ్యబొమ్మలు మెచ్చుకోలేని మన ఆంధ్రజాతి మరల కోమలినే తెచ్చుకోవలయును. త్యాగయ్యగారు పరమపదించి యించుమించుగా నూరు నూటయేభయి యేండ్లయింది. మళ్లీ ఆ పుణ్యమూర్తి తరువాత యిప్పటికీ ఆంధ్రులలో వినతగిన సుస్వరసంయుక్త మైన మధుర గానము వినిపింప గల దక్షుడెవ్వడూ ఆంధ్రభూమిని ఇంకా జన్మించలేదు. పూర్వచరిత్రకజ్ఞానం పూర్తిగా కలుగకపోవడంచేత ఆంధ్రులు శుష్క మైన అనుకరణాలతో కాల్లీడ్చుకుంటూ వస్తున్నారు. ఇది అభివృద్ధిని సూచించునది కాదు. ఆంధ్రగాయకులు నేడు పాడివినిపిస్తూ యున్నది శుద్ధకర్ణాటకం గాదు, శుద్ధహిందూస్తానిఖతున్ను కాదు. ఇది కొంచెం యిది కొంచెం అవకతవకగా కలిసి రసాభాసపాకంలో కుదిరిన సంకర సంప్రదాయము. శుద్ధ మై జాతీయసంప్రదాయసిద్ధ మై, మన జాతికి ఉత్తేజ మిచ్చే సంగీతకళను దాక్షిణాత్యులతో కలిసిమెలిసి యుండి గ్రహించి అలవరచుకొని మన దేశానికి తీసుకొని వచ్చి నిలపాలి. దాని కింకా తీరని పని చాలా ఉన్నది. దాని మాట అటుంచండి. అంతకంటే సుస్పష్ట మైన విషయ మైనది ఇంకొకటి ఉన్నది. మన సారస్వతలక్ష్మి—మన నాగరికతాచిహ్నము దిక్కుమాలి తంజావూరునందు మూలబడి కుందుచున్నది. శ్రీరామునికై పరితపించుచు అశోకవనంలో ఉన్న సీతామహాలక్ష్మిలాగ, ఆ ప్రసిద్ధ తంజాపుస్తకభాండాగారమును సేకరించిన పుణ్యశ్లోకుడు, మహామతి, యశస్కాయు డైన రఘునాథభూపాలుడు. చెన్నపట్నం ఆంధ్రరాష్ట్రం ఏర్పడినపుడు అందులోనికి వచ్చినా రాకపోయినా ఆంధ్రుల కంత విచార ముండబోదు. ఎందుకంటె ఆమహాపట్నం కట్టుటకు అంత ప్రసిద్ధికి వచ్చుటకు ఆంధ్రులు తోడ్పడినా, అటువంటి మరియొక పట్నాన్ని, లేదా అంతకంటె ఎక్కువ భాగ్యవంత మైన దాన్ని రమ్యతర మైన దాన్ని యింకొకచోట నిర్మించుకొనడానికి ఆంధ్రులకు శక్తిసామర్థ్యాలు కలవు. అటువంటి మహాపట్నం ఒకటి నిర్మాణం కావడానికి అపుడే ఒకమూల పునాదులు వేయబడినవి. కాని నేటి ఆంధ్రుల నీచదశను, చరిత్రను చూచి విలపిస్తూ శోకమూర్తియై తంజావూరునందు నిలచిపోయిన పుస్తకభాండాగారలక్ష్మిని, మన ఆంధ్రభూపాలు డుత్సాహముతో కూడబెట్టిన దానిని ఆంధ్రులు తమ దేశమునకు తర్లించుకొని రాగలరా? ఈవిషయము యొక్కటి తలుచుకొన్నప్పుడు ఆంధ్రు డన్న వాడి హృదయం ఆవేదనలో కరగి నీరై, కనుకొలకులనుండి స్రవిస్తూ ఉంటుంది. అరవవారు ఆభాండాగారము నంతా మనకు ఈయకున్న యీయకుందురు గాక ; కాని మన ఆంధ్రగ్రంథము లయినా,—పోని వాటికి ప్రతు లయినా వ్రాసుకోనిచ్చి మన దేశానికి తెచ్చుకోనీయకుండ ఆపజాలరు కదా? ఆపని చేయించే భారం మన రాజ్యాంగం నడిపిస్తూ యున్న నాయకు డైన రాజశేఖరుని చేతిలో ఉన్నది. ఇట్టివి మనము చెన్న రాజ

ధానిలోనుండి విడిపోవక పూర్వము సంపాదించు కోవలసినవి ఎన్నో ఉన్నవి. వాటి నన్నింటిని విసుగు పుట్టేటట్లు ఇక్కడ వివరించజాలము. మిగిలినవాటి అన్నిటి కంటె ముఖ్యమైనది మన ఆంధ్రజాతి విస్మరించిన తన పూర్వులయొక్క సచ్చారిత్రము, సుగుణసంపత్తి; వీటిని నిర్వచనం చేయడం అవసరం. బుద్ధిశాలురైన ఆంధ్రులు వాటిని సులభముగా గ్రహింపగలరు. మన పూర్వ స్థితిని జ్ఞప్తికి దెచ్చుకొని ఆనాడు మనజాతిని ఆర్ధించిన మహావేశమును నేడు మనము అలవరచుకో వలసియున్నది. కాబట్టి ఆంధ్రులు ఇంకా కొంత కాలము చెన్నపురిరాజధానియందే యుండుట లెస్స అని తోచుచున్నది. ఇంకెంతో ముఖ్యమయిన సమస్యలు తీరవలసి యుండగా తొందరపడి యిప్పుడే ఆరవలతో వేరుపడడానికి ప్రయత్నం చేయడం కూడా యెందులకు? ఏం లాభం మనకు వెనువెంటనే ఒలిక డానికి సిద్ధమై యున్నట్లు?

ఈపరిస్థితు లన్నీ యిలాగున ఉండగా రాయల సీమవాసులు ఉత్తరసర్కారులవారు ఏంచేసినా, ఏమాట అడినా, ఏం తలపెట్టినా వాటి నన్నింటిని అవిశ్వాసంతోనే, అనుమానంతోనే పరిశీలిస్తున్నారు. ఉత్తరసర్కారులవారి యెడల దత్తమండల వాసులు యింతటి వైమనస్యం పెంచుకొని శంకతో, అసూయతో మెలగుతూ ఉండడం అవశ్యకమా, ధర్మమా అని అనిపిస్తూ ఉంటుంది. దత్తమండల వాసుల చర్యలు గమనిస్తూ ఉన్న పూర్వాంధ్రసీమ వాసులకు తీరని సంతాపము కలుగుచున్నది. దత్త మండలవాసుల మనసులో అసూయ, అవిశ్వాసం, మాత్సర్యం పెరుగుచూ ఉన్నన్నాళ్లు,ఉత్తరసర్కారులవారికి వారికి పొత్తు కుదురజాలదు. ఈరెండు కక్షలవారి విధం పరీక్షించినపుడు కురుపాండవుల కథ జ్ఞప్తికి వస్తుంది: రాయలసీమవాసులు మాటి మాటికి ఉత్తరసర్కారులవారు మోసగాండ్రని, వంచకు లనీ ఎత్తిపొడుస్తూ ఉంటారు. తమ సోద రుల మోసమును గ్రహించగల దత్తమండలవాసుల అమాయకత్వము నిర్మలచిత్తవృత్తి ఉత్తరసర్కారులవా రొకసారి పరీక్షచేయవలసి ఉంటుంది. తన చిత్తవృత్తిని బట్టి పరుల మనసును నిర్ణయించుకునే అలవాటు అసలు మానవునికి నైజగుణము. తాను లోభి అయితే ఎదురుగువాడూ లోభియే అని భావించి మాట్లాడుతాడు. తాను దుష్టుడైతే ఎదుటివాడూ దుష్టుడే అని శంకతో భయంతో వాడితో వ్యవహారం ప్రారంభిస్తాడు. ఉత్తరసర్కారులవారు బెజవాడలో ఉండిన ఆంధ్రవిశ్వకళా పరిషత్తును మోసముచేసి విశాఖపట్నం లాగుకొని పోయి దత్తమండలవాసులకు తీరని ఒక మహాప కారం చేసినారని ఒకవాదం ఉన్నది. కాని ఆనాడు రాయలసీమనాయకులు చూపిన రాజనీతి, చాకచక్యం మాత్రం సక్రమమైనవి, ధర్మసమ్మతమైనవి కావోలు. గురువిందగింజవలె రాయలసీమ వారు తాము చేసిన తెలుసు గ్రహించకున్నాగు— పోనియ్యండి దాని కేమి? జరిగిన దేదో జరిగింది. ఇలాగున జరగడం దైవాయత్తమే అని భావించు కొని శాంతి చెందాలి. ఈవిషమసమస్యలో రాయల సీమవాసులకన్న నిజంగా రాజమహేంద్రవరానికే ఎక్కువ గొప్ప అపకారం జరిగింది. జరిగిపోయిన దానిని గురించి వైషమ్యాలు పెంచుకుంటే పురోభివృద్ధి కలగడం ఏలాగు? చేసినది పొరబాటు అయినా, కాకపోయినా, శాంతికోసం, సంతప్త హృదయంతో ఉత్తరసర్కారులవారు జరిగినది పొరబాటే అని అనుకున్నారు. ఈలాగున జరిగి యుండ కూడ దనుకున్నారు. మళ్లీ రాయలసీమ వారిని ఆంధ్రవిశ్వకళాపరిషత్తులోనికి రావలసిన దని స్నేహపూర్వకంగా, మనస్ఫూర్తిగా కోరుతూ పంపిన ఆహ్వానమును రాయలసీమవారు మాత్రం దురాగ్రహంతో నిరాకరించినారు. కారణం అందరికీ తెలిసిందే! కురుపాండవయుద్ధమునకు పూర్వము ఉభయపక్షములవారికి రాయబారం

నడిపిన శ్రీకృష్ణభగవానునివలె పొత్తు కుదుర్చుటకై శాంతికొరకై రాయలసీమవారితో రాధాకృష్ణపండితుడు నీతిసమ్మతముగా నిండు ప్రేమతో రాయబారం నడిపినాడు. కురుపాండవసంతతికి సంఘటిల్లిన వినాశహేతుకర మైన సంక్షోభము మనకు మాత్రం దైవం సంఘటిల్లచేయకుండును గాక! రాధాకృష్ణపండితుని ప్రయత్నము, శ్రీమహాభారతమున రాయబారఘట్టము నంను తోలినాడు విదురినితో సంభాషిస్తూ శ్రీకృష్ణు డన్న మాటలను అప్రయత్నంగా తలపునకు తెస్తూ యున్నది.

'చుట్టములలోన నొప్పమి పుట్టినప్పు
డడ్డపడి వారితోడఁ గొట్లాడి యైనఁ
దాని యుడుపంగఁ జొరకున్నవాని క్రూర
కర్ముఁ డని చెప్పుదురు కర్మకౌండవిదులు.'

కావున ఏవిధంగా నైనా యీ రెండు పక్షముల వారికి శాంతి సమకూర్చుతా నని విశ్వప్రయత్నం చేసిన సర్ రాధాకృష్ణపండితు డంతవాని ధర్మార్థసహితము లైన మాటలు అనుమానగ్రస్తు లయిన దత్తమండలవాసులకు హితవు కాకపోయెను. ఆంధ్రవిశ్వకళాపరిషత్కులపతి జగద్విఖ్యాతయశోమూర్తి, శుభ్రచంద్రుడు, పండితుడు విశేషించి చిత్తూరుమండలవాసి అగు డాక్టర్ సర్ రాధాకృష్ణమహాశయు నంతటివానిని ఉత్తరసర్కారులవాడని, పక్షపాతంతో చెబుతున్నా డని శంకించి తమకు హిత మైన దానిని, వంచన లేక చెప్పిన దానిని, దత్తమండలవాసులు వినకపోయారు. మీదు మిక్కిలి వంచకు లని ఉత్తరసర్కారులవారిని నిందపాలు చేస్తున్నారు. హేమకేదారఖండములు దేవమాతృకలు గల పావన మైన భాగ్యభూమి యీ పూర్వాంధ్రదేశభాగము. జీవవాహిను లయిన మహానదులు ప్రవహించి యీమహాంధ్రభాగమును సర్వసమగ్రసస్యాఢ్యనుగా చేస్తూ ఉన్నవి. శ్రమ పెట్టకరయే అడిగిన మాత్రాన ఫలము సమృద్ధిగా నొసగే జనని దివ్యభూమి యిది. ఇట్టి మెత్తని మట్టిపై పుట్టి పెరిగిన పూర్వాంధ్రసీమల ప్రజలు జన్మభూమివలె మెత్తని మనసు గలవారు, ఉదార హృదయులు, ఉత్సాహవంతులు, కల్లకపటము లెరుగనివారు. వంచన సేయుటకు ఒల్లనివారు. అధర్మప్రవృద్ధి, దుశ్చరిత్రము, దుష్ప్రవర్తనము వారు త్రాగే పుణ్యనదీఅమృతతోయము లందే లేవు. వారు పీల్చు గాలియందే కానబడవు. రాయలసీమాంధ్రులవలె వారు కర్కశ మైన పాషాణభూముల యందు పుట్టి పెరిగినవారు గారు. బోడికొండల నడుమన నిస్సారము లయిన లోయప్రాంతములలో నీటిచుక్కలు నిలువని ఎఱ్ఱమట్టి నేలపై పుట్టి పెరిగిన రాయలసీమవారికి తమ జనని మాతృభూమి యందే విశ్వాసము లేదు. రక్తమాంసములు ధార వోసిన గాని ఆభూదేవి జీవనాధారం చూపించదు. పోసి అనుకున్న దానిలో సగం ఫల మైనా ఒసగదు. అట్టి గట్టి నేలపై ఊసరక్షేత్రములపై పుట్టి పెరిగిన దత్తమండలవాసుల మానసములు పాషాణసన్నిభము లయి శంకతో, అసూయతో, మాత్సర్యముతో, వక్రబుద్ధితో నిండియుంటవి. అందులో ఆశ్చర్యం ఏ మున్నది? వారు తమ విపరీతచిత్తవృత్తిని బట్టే యితరుల చిత్తవృత్తిని నిర్ణయించుకొంటారు. తాము వ్యవసాయం చేసే జన్మభూమినే రాయలసీమవాసులు విశ్వసించనపుడు ఉత్తరసర్కారులలో ఉన్న తమ ఆంధ్రసోదరులను ఏలాగున విశ్వసించగలరు? ఈవిషప్రవృత్తి దత్తమండలవాసులకు నైజగుణము. ఇది వారు త్రాగే నాపరాళ్లు, పలకరాళ్లపై ప్రవహించే నీటియందే యున్నది. పీల్చే గాలియందే యున్నది.

పూజ్యు డైన సర్ రాధాకృష్ణుని హితవాక్యములను బ్రతుకు తెరువు ఎరుగని దత్తమండలాంధ్రులు గ్రహించలేకపోయినారు. అంతటితో ఊరుకోలేక తాము ఆంధ్రవిశ్వకళాపరిషత్తులో మరల కలియ రాకపోతే ఉత్తరసర్కారులతో పొత్తు గూడకపోతే పూర్వాంధ్రసీమవాసులకు, ఆంధ్ర

విశ్వకళాపరిషత్తునకు, ఏదో ఒక మహాపకారం సంభవిస్తుం దని, ఒక లోటు కలుగుతుం దని యెంతో భ్రమపడ్డారు. ఇది ప్రత్యేకాంధ్రరాష్ట్రం నిర్మాణం కావడమునకు ఎత్తిన పన్నాగ మని శంకించారు. ప్రత్యేకాంధ్రరాష్ట్రం ఉత్తరసర్కారుల వారికి ఒక్కరికే మేలు గూర్చదు. ఆంధ్రు లన్నవా రందరికీ లాభకారి అవుతుంది. అయినా ఉత్తరసర్కారులవారికి ఏదో నష్టం సంభవింపగల దని పేరాసతో రాయలసీమవాసులు, సర్కారుల వారితో పొత్తు వాంఛింప మని నిరాకరించి తా మేదో ఒక ఘనకార్యం జరిగించా మని తెలివి తక్కువ గర్వంతో పొంగిపోతూ ఉన్నారు. తమ కృత్యంలో ఎంత తెలివిహీనత కలదో యోచించుకో లేకుండా ఉన్నారు. దత్తమండలములు ఆంధ్ర విశ్వకళాపరిషత్తులోనికి వస్తే కలిగే లాభాలు వారు గ్రహించుకోలేకపోయారు. ఈ విశ్వవిద్యాలయం వల్ల కలిగే భాగ్యం అన్నదమ్ములు ఇరువురు సమంగా పంచుకొని అనుభవించవచ్చు నని తలచి స్నేహముతో, సద్భావముతో, ధార్మికబుద్ధితో ఆవిశ్వకళాపరిషత్తువారు దత్తమండలము వారిని పిలుపనంపించారు; గాని మరియొక దురుద్దేశముతో కాదు. రంధ్రాన్వేషణమే పరమార్థముగా నెంచుకొని అసూయాగ్రస్తు లయిన దత్తమండలనాయకులు లేని పోని శంకలలో బడి వ్యాకులత నొందుతున్నారు. ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారు తిరుపతి దేవస్థానం నుంచి వచ్చే ఆదాయానికి దురాశపడడం లేదు. ఆ ఆంధ్రదేవుని సొమ్మునకు ఆంధ్రు లందరు హక్కుదారులే ఆమాటకు వస్తే. అది ఒక్క దత్తమండలములవారిది మాత్రం కాదు. తిరుపతిలో విశ్వవిద్యాలయం వస్తే రావచ్చును. దానిని రాయలసీమవారే అనుభవించవచ్చును. దానికి ఉత్తరసర్కారుల వారు అడ్డుపెట్టరు; కాని తమ కాణాచి నంతా అపహరించుటకు ఉత్తరసర్కారులవారు పన్నిన పన్నాగ మని ఆలోచించే దత్తమండలముల వారి కుట్ర యింతవఱకు ఉన్న దని ఉత్తర సర్కారులవారు గ్రహించలేకపోయినారు. దత్తమండలముల వారి చిత్తవృత్తి యెట్లున్నా ముందుముందు తిరుపతివిశ్వకళాపరిషత్తు ఏర్పడినా ఏర్పడకపోయినా, సుహృద్భావముతోనే ప్రేమతోనే దత్తమండలముల వారిని ఆంధ్రవిశ్వకళాపరిషత్తులోనికి రావలసిన దని పిలుపనంపారు. కాని రాయలసీమవారు "మీతోడి పొత్తు మాకు అవసరము లేదు. మేము మీదరికి రాము" అనడం చూస్తే "శ్రీ రామో కోలాడ్డిన వారి విధాన" ఉన్నది. తిరుపతి వేంకటేశ్వరుని సొమ్ము లేక పోయినా ఆదేవుని దివ్యానుగ్రహంవల్ల ఆంధ్రవిశ్వకళాపరిషత్తు భాగ్యవంతురాలై, కులపతి, పుణ్యశ్లోకుడు అగు సర్ రాధాకృష్ణపండితుని చేతులలో అల్లారు ముద్దుగా పెరుగుతూ ఉన్నది. దినదినాభివృద్ధి గాంచుతూ ఉన్నది. ఇప్పుడు దాని కున్న లోపము లేదు. దాని ప్రసిద్ధి యితరవిశ్వవిద్యాలయముల దీటునకు ఏమాత్రం తీసిపోదు. కొన్ని సందర్భములలో ఆంధ్రవిశ్వకళాపరిషత్తు ఇతర ప్రాంతముల వాటికంటె ముందంజ వేస్తూ ఉన్నది. ఇంతటి గొప్ప సంస్థయొక్క భాగధేయము దత్తమండలములవారికి వెక్కస మైతే కానిండు పూర్వాంధ్రసీమజనులే అనుభవించెదరు. ఉత్తర సర్కారుల వారితోపాటు మీరుకూడా యీ మహాభాగ్యమును వీరికి పంచి యిమ్మన మని రాయలసీమవారికి రాయబార మంపలేదు. దత్తమండలవాసుల బెదరింపులు విని పూర్వాంధ్రసీమ ప్రజలు తమ భవిష్యత్తును గురించి శంకింప నగత్యం లేదు. ఏనాడు రాయలసీమవారు పశ్చాత్తప్తులయి తమకు కూడా ఆంధ్రవిశ్వకళాపరిషత్తే ఏడుగడ యని తెలుసుకొని, ఉత్తరసర్కారులవారితోడి పొత్తును ఆశ్రయిస్తారో ఆనాడే వారికి స్వాగతం ఇచ్చి ఆదరంతో, స్నేహపురస్సరంగా ఉత్తరసర్కారుల వారు తమ భాగధేయమును పంచి యిస్తారు. ఆనా

డే రాగలదు ప్రత్యేకాంధ్రరాష్ట్రము. అంతవఱకు ఆతురత పడ నక్కఱ లేదు. అంతవఱకు రాయలసీమవారి మాట తలపెట్టకుండా ఊరకుని కాలచక్రము చూపించే చిత్రాలు తిలకిస్తూ పూర్వాంధ్రసీమల ప్రజ లుంటారు. తమ్ముల రాకకై ఎదుళ్లు చూస్తూ ఆదరముతో హృదయద్వారం ఎప్పటికీ తెరచి ఉంచగలరు పూర్వాంధ్రసీమల వారు.

ఇన్ని చెప్పిన తరువాత, ఇంకో విషయం కూడా చెప్పక తప్పదు. ఉత్తరసర్కారుల వారు కూడా కొన్ని విషయములందు ధర్మం తప్పి నడుస్తున్నారు. అది వప్పుకొని సిగ్గుపడాలి. ఇట్టి అధర్మప్రవృత్తి యెంతకాలం దాకా మనవాళ్లని పట్టుకొని పిశాచం లాగున ఏడిపిస్తూ ఉంటుందో అంతవఱకు ఆంధ్రులకు ఏమీ మోక్షం లేదు. ప్రత్యేకాంధ్రరాష్ట్రం కావాలని పెద్ద గొంతుకతో ఘోషించే పూర్వాంధ్రసీమల వారికి గంజాం విశాఖపట్నం మండలవాసుల ఘోష చెవి సోకకుండా ఉండడం చాల దుఃఖకర మైన విషయము. సుమారు నూటికి అరవై, డెభ్భయి పాళ్లు తెలుగువారు ఎక్కువగా ఉన్న ఆంధ్రసీమలను అన్యాయంగా ఓఢ్రజమీందారులు పట్టుపట్టి తమ నూతనఒరిస్సారాష్ట్రంలోనికి బలవంతంగా ఈడ్చుకొనిపోవ నుంకిస్తూంటే దానిని ప్రతిఘటించడానికి గంజాంమండల ఆంధ్రులు చేస్తూ ఉన్న ఆందోళనకు మాటవరుస కైనా చేయూత, సహాయ్యమూ చేయకుండా తమ సంగతి కా దన్నట్లు ఊరకున్నారు గోదావరీ, కృష్ణా, గుంటూరు నెల్లూరు జిల్లాలలోనిఆంధ్రనాయకులు—. ఈ ఆంధ్రదేశంలో పౌరుషము శౌర్యశూరత్వము, చచ్చి జీర్ణ మైపోయినవా? తోటి ఆంధ్రుడి కష్టము తనదిగాభావించని యీగోదావరి, కృష్ణాగుంటూరు నెల్లూరు ఆంధ్రుల ఆంధ్రోద్యమ ఉబలాటము నిజముగా ప్రేళ్లుబారి యున్నదా, లేక పైపైనుంచి యెగిరిపోవు గాలిదుమారము వంటిదా? నిజంగా యీ ఆంధ్రోద్యమము నిర్మల మైనది, జను లందరూ ఏకగ్రీవంగా వాంఛించేది అయిన ట్లయితే గంజాం విశాఖపట్టణమండలములవారి ఆంధ్రోద్యమమునకు యితరజిల్లాల వారు సహాయకారులు కావలసినదే. కాని యీ బూటకపు దేశాభిమానంతో ఉప్పొంగిపోయే ఆంధ్రుడికి—కాంగ్రెసు వెల్లువలో మునిగిపోయిన ఆంధ్రుడికి నిజ మైన దేశాభిమానం లేదు. అది కలిగేవఱకు ప్రత్యేకాంధ్రరాష్ట్రం రాజాలదు. నిజ మైన దేశాభిమానం కలగడానికి యింకా ఆంధ్రులు చెన్నపురిరాజధానిలోనే ఉండి కొన్ని క్రొత్తసంగతులు మంచి విషయములు నేర్చుకోవాలి; అవలంబించాలి.



# విరాగి

కొల్లూరు ధర్మారావుకవిగారు బి. ఏ

బంధుదర్శనానికై వెళ్ళిన ఒక కుగ్రామంనుండి తిరిగి వస్తున్నాను. మార్గశిరమాసం. వేకువ వెన్నెట్లో బైలుదేరి కాలినడకను ఆరుమైళ్ళ దూరంలో వున్న ఒక చిన్న రైలుస్టేషనుకు ప్రయాణం సాగిస్తున్నాను. సస్యసమృద్ధ మైన భూదేవి నిండుచూలాలు వలె నిద్రిస్తూంది. పచ్చికమీద తాపినట్లున్న మంచుముత్యాలు నాకాలిజోడుతో విరజిమ్మను పోతున్నాయి. ప్రకృతి సౌందర్యాన్ని పాడుచేస్తూన్న పాతకుణ్ణని కాబోలు చెవిలో యిల్లు కట్టుకుని యీదురుగాలి ఘోషిస్తూంది.

కాని రైలు నిమిత్తమై పోయే నా నడకకు ఒకటే తొందర. కీ యివ్వడం మరిచిపోయిన రిస్టువాచీతో పాటు కాలమే స్తంభించిపోయినట్లుంది. టైము తెలియకుండా వుంది. అయిదున్నర కాకుండా స్టేషను చేరాలి.

కొంత సేపటికి దూరదేశంలో ఆప్తబంధువుల్లాగు రైలుపట్టాలు కనపడ్డవి. కొంత మనస్సు కుదుటబడ్డది. ఇకను వాటిబట్టి నడచిపోతే స్టేషను సులువుగా చేరొచ్చు. దట్టంగా ఆవరించి వున్న మంచులో ఒకటే సూటిగా కనుచూపుమేరకు బాకుల్లా దూసుకుపోతున్నాయి రైలుపట్టాలు. ఎంత నడచినా నడక తరుగనట్లుంది. దూరముగా రక్తపు చుక్క యెదుట కనపడగానే స్టేషను సిగ్నలుకదా అని ధైర్యం తోచింది. మరి పావుగంటకు స్టేషను చేరుకున్నాను. దీపం లేదు. నిర్మానుష్యంగా వుంది. టిక్కెట్ల కిటికీ కూడా మూసివేయబడి వుంది. లోపల యెలుక కొరుకుతూన్నట్టు డెమ్మీ చప్పుడును, ఒక మనిషి గుర్రును తప్ప మరేమీ శబ్దం లేదు. చేతి నున్న "ఆంధ్రరత్న" ఖద్దరు సంచి తల క్రింద పెట్టుగుని కన్ను మూతా మని బెంచీకోసం నాలుగువంకలా పరికిస్తూంటే ఒక మూలనుంచి,

"ఏవూరు ?"

"మాది విజయనగరం."

సిగరెట్టు అలవాటు లేని లోపం యీ నాటికి కనిపించింది. గుడ్డి గుడ్డి వెలుగు. ఈ చీకటిలో, నిశ్శబ్దంలో నన్ను ప్రశ్నించిన కంఠధ్వని యెవరో అని నిదానించి చూసేను.

సుమారు నలభై అయిదేళ్లుంటాయి. సన్యాసి ముఖవర్చస్సులో బ్రహ్మతేజం వొలుకుతూంది. అంతవిశాలవక్షంలో వున్న హృదయం కష్టసుఖాలన్నిటికీ యెలాగు కరడుగట్టిందో అనిపించింది.

"స్వామీ! తమ రెక్కడనుంచి వస్తున్నారు ?"

"రాయపురంలో యెక్కేను, ఈ ప్రాంతంలో దిగిపోయేను. ఇక్కడనుంచి మీవూరే వస్తున్నాను. అక్కడ పాలగుమ్మవారిల్లు మీ రెరుగుదురా ?"

"కస్బాలోనా ?"

"కాదు. మహారాణీపేటలో."

"తెలియదు."

గణగణ మని గంట మోగింది, రైలు సైటయినట్లు. గూడు కిటికీ తలుపులు తెరిచి, మాయిద్దరి మొగాల్కీ రెండు టిక్కెట్లు కొట్టి బుకింగుమస్తా మళ్ళీ తలుపులు మూసేసేడు, కళ్లు నులుముకుంటూ.

* * * *

రైలులో యెకదొమ్మి. ఇంత కుమ్ముకుంటూనైనా ప్రయాణం చెయ్యవలసిన అగత్యం యీ బండిలో ప్రతి మనిషికీ వుంది కాబోలు...ఈసన్యాసి పూర్వాశ్రమం యేమిటో...యేం మాట్లాడుదా మన్నా, కొంప పిండి చేస్తూన్నంత రొద యీ రైలు.

"ఆర్యులారెయ్, మన దేశంలో అనేకమంది," అంటూ ఒక మీసాలవా డుపన్యాసం యెత్తుకున్నాడు. అన్నిజాడ్యాలూ కుదిర్చే ఘుటిక అసలు వెల అణా అయినప్పటికీ మాబండిలో కూర్చున్న వాళ్ల మీద వున్న ప్రత్యేకాభిమానం కొద్దీ ఒక పైసాకే యివ్వడాని కేర్పాటు చేసేడు. పిల్లలు లేని ఒక యిల్లాలు "పూచీ పడితే కావా" లని చెప్పి ఒక గుటిక పుచ్చుకుని పైటచెంగున కట్టుకుంది. ఓ ముసలమ్మ బుగ్గమీద వేలుంచుకొని "యేపుట్టలో యేపామో" అంటూ తల పంకించినది.

* * * *

"స్వామీ, మీరు మాగృహపావనం, చెయ్యాలి యీపూట" అని రైలు దిగుతూనే సన్యాసిని ఆహ్వానించేను. ఒక మూల జట్కావాడు, నాచేతులో సంచి బలవంతంగా లాగేస్తూన్నాడు.

"అయ్యా. ఈ రైలు చుట్టరికాలు మీరు పాటించినందుకు సంతోషం. నాతో మీరు పాలగుమ్మవారింటికి మాత్రం రావాలి."

"అవశ్యం"

జట్కా మా యింటివద్ద దిగేం. సన్యాసి కళ్లలో పూర్వాశ్రమస్మృతులు ద్యోతకమైనట్లయింది.

"ఈ యిల్లేనా మీది?"

"ఊఁ."

"జగన్నాథాని కేమవుతారు మీరూ?"

"మా నాన్నగారే."

"వారిని చూడాలి వకసారి. ఆయనా నేనూ బాల్యస్నేహితులం."

"వారు గతించి ఆరేళ్లయింది!"

సన్యాసి ముఖం వెలవెలబోయింది.

"ఈ తీనెమీద కూర్చోవచ్చునా?"

"లోపలికి దయచెయ్యండి."

"చిన్ననాటి మాతీనె."

నాకు మరి ఉండబట్టింది కాదు.

"స్వామీ, తమ పూర్వాశ్రమవృత్తాంతం..."

సన్యాసికి నాతనుపే లేదు. ఒక పావుగంట తీనెమీద నిలువుగన్నులతో బయిలు పరికిస్తూ కూచున్నాడు.

"సరే. వస్తారా మా...పాలగుమ్మవారింటికెడదాం!"

* * * *

"అమ్మా!"

"ఎవరూ!" అని పెరట్లోంచి కాబోలు.

"ఒకసారి తలుపు తీస్తారా?

నేనూ సన్యాసీ బైట పదిమినిట్లు నిల్చున్నాం. సుమారిరవై యేళ్ల అమ్మాయి వచ్చి తలుపు తీసింది. సావిట్లో చాప వేసి "కూర్చోండి" అంది.

ఎందుకు వచ్చేమో నాకు తెలీదు. సన్యాసి చతికిలపడ్డాడు. అమ్మాయి నిశ్చేరపోయి అర్థం కానట్లు చూస్తూంది. సన్యాసి మాట్లాడడం ఆరంభించే సరికి నాకు వాక కట్టింది.

"ఈ యిల్లు మీస్వంత మేనా?"

"మాదే. అంటే మాపుట్టిల్లిది. ఇక్కడనే వుంటున్నాం."

"పాలగుమ్మవారి పిల్ల వమ్మా?"

"అవును."

"మీ......" సన్యాసి గుటక లేసేడు. ఆ అమ్మాయి మీద లగ్నమై వున్న కళ్లు వీధివేపు తిప్పుకొని, దండపీఠం మీద ఆనుకున్న బుజం చాటునకు మొగం వంచి,

"మీ తలిదండ్రులిక్కడే వున్నారా?"

"మా అమ్మ నేపుట్టగానే పురుట్లోనే పోయింది. మా నాన్న అప్పుడు బొంబాయిలో వుండేవా రట; ఆయన మరి దేశం రాకుండానే హరిద్వారం వెళిపోయేరుట. నాలుగేళ్ల కిందట మా పెద్దతగారు కాశీనుంచి వచ్చి ఆయన కూడా గతించినట్లు చెప్పేరు. మా మావయ్యే నాకు పెళ్లి జేసేడు."

సన్యాసి కళ్లు రెండు నడబావు లయేయి. గ్రిరున నీళ్లు తిరిగిపోయేయి. గుండె బరు వంతా గుటుక్కున మ్రింగి, కలవరపాటు నణగద్రొక్కుతూన్న కంఠంతో "కూర్చో అమ్మా—నిలబడి వున్నావు" అన్నాడు.

బట్ట వియ్యాలలోంచి పిలు పొచ్చిం దని, ఆ అమ్మాయి వెళ్లి శిశువును చంకపెట్టుకొచ్చింది. ఏడాది వెళ్లింది, కుర్రాడు.

"అమ్మా! తాత" అన్నాడు.

"తప్పమ్మా"

ఒక గగుర్పాటు సన్యాసిని భూకంపంవలె వణికించింది. తటాలున లేచి, "అమ్మా, తలుపు వేసుకో" అని చెప్పి దారిబట్టేడు. అతని దృష్టిల్లోంచి వెలువడ్డ మూగ ఆశీస్సు ఆమాతాశిశువుల శిరస్సులు ముద్దాడింది!

* * * *

ఈస్మృతినాటకంలో నాపాత్ర యేమో నాకే బోధపడటం లేదు.



# ఆంధ్రులకర్తవ్యం

మారేమండ రామారావుగారు, ఎం. ఏ., బి. యిడి

ఆంధ్రు లారంభించని వుద్యమాలే లేవు. అయితే జయప్రదంగా కొనవరకూ సాగించబడినవిమాత్రం చాలాతక్కువ. ఏమైనా ఒక కొత్తపని ఆరంభించబడిందంటే ఆంధ్రుడికి ఉద్రేకం కలుగుతుంది. అంతటినుంచీ ఆ వుద్యమమే జీవితపరమావధి అనుకొని దానిమీద తనశక్తినంతా వినియోగిస్తాడు ఆంధ్రుడు. ఈ లోగా మరొకటి వస్తే దాన్లోకిమారుతాడు తానిదివరకు చేస్తూన్నపనిని వదలిపెట్టి. ఈ చాంచల్యానికి ప్రతిఫలం ఒకపనీ పూర్తికాకపోవడమే. ఈయీ వుద్యమాలు బయలుదేరతీసిన యితరులు క్రమాభివృద్ధిపొందుతూంటే, మనం ఒక్కొక్కపనినే మరచిపోతున్నాం. ఇందువల్ల ఎన్నో నష్టాలు కలుగుతున్నాయి.

ఆంధ్రు డంటే ఎవరో, అతని కుండే గౌరవమేమిటో, ఇతరరాష్ట్రీయులతో సరిపోల్చిచూస్తే అతనికుండేస్థాన మేమిటో తెలియనిరోజుల్లో కొమర్రాజు లక్ష్మణరావుగారూ, చిలుకూరి వీరభద్రరావుగారూ ఆంధ్రుని చరిత్రను నిర్మించి, ఆంధ్రునికి ఆత్మజ్ఞానమూ, ఆత్మవిశ్వాసమూ కలుగచేశారు. ఇది సుమారు ఇరవై యేళ్ల నాటి మాట. ఇంతలో గ్రంథాలయోద్యమం, భాషావివాదం, అసహాయోద్యమం బయల్దేరాయి. అంతవరకూ మేజాబల్లమీద వుండి నిత్యపారాయణార్హ మైన ఆంధ్రుల చరిత్రని మూలకి విసిరేసి, నడుముకట్టి యీ కొత్తవుద్యమాల్లోకి దూకేశాడాంధ్రుడు. ఆత్మచరిత్రవిచారాని కంతటితో ఫుల్‌స్టాపు పెట్టేశాడు. ప్రజాసామాన్యంతో బాటు పరిశోధకులు కూడా ఇతరరంగాలకి వలసపోయారు. ఏ ఒక్కపరిశోధకమండలో యీ చారిత్రకోద్యమాన్ని పట్టుకు తంటాలు పడుతూన్నా బాహుళ్యంమీద దానిపైన అభిమానం, అభిరుచీ పోయినాయి. అందువల్ల ఇరవైయేళ్ళనాడున్న చోటే వున్నాం మనం.

ఈ లోగా ఇతరప్రాంతాల్లో ఎంతో అభివృద్ధి జరిగింది. ప్రతివారూ తమ తమ రాష్ట్రీముల చరిత్రని పరిశోధించి దేశభాషల్లోనూ, ఇంగ్లీషులోనూ కూడా చక్కని గ్రంథాలు రాసుకున్నారు. అందువల్ల ఆ చరిత్రలు వ్యాప్తి చెంది, హిందూదేశచరిత్రలో యథాయోగ్యము లయిన స్థానాలని అలంకరించాయి. ఇక మనమో? ఆంధ్రదేశచరిత్రను తెలిపే గ్రంథాలే తక్కువ. ఉన్నవైనా తెలుగులో వున్నాయి. ఇవి ఇతరులకి అగమ్యాలు. అందువల్ల హిందూదేశచరిత్రలో ఆంధ్రదేశపు ప్రశంసే కనబడకుండా పోయింది. క్రమంగా ఆంధ్రులని గురించి రెండు ముఖ్యాభిప్రాయా లేర్పడ్డాయి యితరుల్లో. దాక్షిణాత్యులు "ఆంధ్రులకి ప్రత్యేకచరిత్ర లేనేలేదు. ఉన్నా అది సమగ్రంకాదు. ఎక్కడో ఒక నాలుగేళ్ళు తప్ప మొదటి నుంచి తుదవరకూ ఆంధ్రులు పారతంత్ర్యంలోనే వుండేవారు" అని అంటున్నారు. ఔత్తరాహులుమాత్రం కొంచెం ఉదాసీనంగా "మీకేమి చరిత్ర వుందో మాకు తెలియదు. మాయిల్లే మేము దిద్దుకోలేకుండా వున్నాము. మీ యిల్లెక్కడ చక్కబెట్టగలం? అంచేత మీ కుండే చరిత్రని మీరే రాసి మా కందచేస్తే సంతోషిస్తాం" అని అంటున్నారు. ఈ విధంగా ఒకరు మనకి చరిత్రే లే దంటున్నారు. ఇంకొకరు ఉంటే అది యేది? అని అడుగుతున్నారు.

ఈమధ్య ఇంకొక వింత జరిగినది. కాశీప్రసాద్‌జయస్వాల్ అనే సుప్రసిద్ధ పరిశోధకపండితుడు 'క్రీ. శ. 150_350. నాటి హిందూదేశచరిత్రము' అని ఒక పుస్తకం రాశాడు. అందులో ఉత్తరదేశచరిత్రంతో తృప్తి పొందక ఆయన ఆంధ్రదేశచరిత్రంలో కూడా వేలుపెట్టి, పల్లవులు వాకాటకులలో ఒకశాఖవా రనీ, శాలంకాయ

నులు మాగధులు లనీ వారిద్దరూ కూడా ఉత్తరం నుంచి వచ్చి వుంటా రనీ అభిప్రాయం కలగచేసి కొన్ని తల్లక్రిందులు సిద్ధాంతాలు చేశాడు. ఈమహాశయుడే మొన్న డిశెంబరు నెలలో బరోడాలో జరిగిన Oriental Conference కు అధ్యక్షుడుగా వుండి మరి యొక విపరీతపు ఉద్యమాన్ని సూచించాడు. భారతీయులే భారతదేశముయొక్క చరిత్రను రచించడం అత్యవసర మని చెపుతూ, ఈయన ఆవిషయమై ఒక ప్రణాళిక సూచించాడు. అందులో యీ ఉద్యమానికి తోడ్పడి భావి హిందూదేశచరిత్రలో భాగాలని రచించడానికి తగిన వారిని పేర్కొన్నాడు. అందులో ఆంధ్రుల పేరెక్కడా లేదు. అంతా ఇతరరాష్ట్రాల వారే. ఇదివరకే వా రంతా చరిత్రను తమలో తాము విభజించు కొని రచన కూడా ప్రారంభించా రని దర్యాప్తువల్ల తెలిసింది. ఇట్లా ఆంధ్రుల్ని వదలివేయటంలో వారి వుద్దేశ్యం తాము రచింపబోయే హిందూదేశచరిత్రలో ఆంధ్రదేశచరిత్రం అవసరం లే దనో, లేక ఆంధ్రులలో పరిశోధకులు లేకపోవడం వల్ల తామే వారి చరిత్ర వ్రాయవలె ననుటో తెలియదు. ఇక వీరు రాయగల ఆంధ్రదేశ చరిత్రం యొక్క రుజుత్వానికీ ప్రాశస్త్యానికీ జయస్వాల్ గారే తార్కాణము. ఇలాటి గ్రంథమే ముందు కళాశాలల్లో పఠనీయగ్రంథ మవుతుంది. అప్పుడు ఆంధ్రయువకులు, ఇంకొకరు తమర్ని గురించి తల క్రిందులుగా వ్రాసిన తమ చరిత్రను తప్పనిసరిగా నేర్చుకోవలసిన దౌర్భాగ్యం పట్టగలదు. ఇదిగాక Oriental conference లో జరిగిన విషయము, ఆంధ్రుల ఆత్మగౌరవానికీ, పటుత్వానికీ కూడా భంగకరంగా వుంది. ఈ అవమానాన్ని గురించి మన పూర్వులు మన కొసంగిన చరిత్ర యొక్క మహత్వాన్ని పురస్కరించుకొని, మనము మన ఆంధ్రత్వాన్ని తిరిగీ సార్థకం చేసుకోవలసిన అవసరం వచ్చింది.

ఈ మహాకార్యం నిర్వర్తించడానికి కొన్ని సులభమార్గా లున్నాయి. వాటిలో క్రిందివి ముఖ్యమైనవి.

(1) ఇంతవరకూ ఆంధ్రపండితులూ, ఇతరరాష్ట్రాలవారూ, పాశ్చాత్యులూ ఆంధ్రదేశచరిత్రాన్ని గురించి వ్రాసిన గ్రంథాలనీ వ్యాసాలనీ సమకూర్చడం.

(2) ఆంధ్రపరిశోధకు లందరూ సమావేశమై సమగ్రమైన చరిత్రను రచించడానికి కావలసిన ఉపకరణాలని చర్చించి, ఒక ప్రణాళికను ఏర్పరచటం.

(3) ఒక్కొక విభాగాన్ని ప్రత్యేకకృషి చేసిన ఒక్కొకరు తీసికొని, ఆచరిత్రను వారు వారు రచించడం.

(4) ఇలా యేర్పడిన చరిత్రను మరియొక సమావేశంలో పండితు లంతా కలసి చర్చించి, దాన్ని తెలుగులోనూ, ఇంగ్లీషులోనూ ప్రకటించడం.

(5) ఆంధ్రదేశంలో అంతటా చరిత్రాత్మకాలైన ఉపన్యాసాలు, ప్రదర్శనాలు ఏర్పాటు చేసి ప్రజలలో ఉద్రేకాన్ని చరిత్రయం దభిమానాన్ని కలిగించటం.

ఈపని జరిగించడం ఆంధ్రులకి పిల్లలాటవంటిదే. ఆంధ్రులలో సరియైన ఉద్రేకం కలిగిం దంటే మళ్ళీ సంవత్సరాదినాటికి ఆంధ్రుల చరిత్ర రెండవ రూపంతో ఆంధ్రదేశంలో విలాసనాట్యం చెయ్యగలదు. ధనంకొరకై ఏమీ జంక నక్కర లేదు. ఏ అఖిలభారతోద్యమం చూసినా ఆంధ్రుల విరాళాలే ఎక్కువగా కనబడతాయి. సరియైన అభిరుచి దేశంలో కలిగితే, ఆ ధనప్రవాహాల్ని యీ ఉద్యమంలోకి సులభంగా మళ్ళించ వచ్చును. అదిగాక ఆంధ్రదేశంలో విద్యాప్రియులు దేశాభిమానులు అయిన ధనికులు, జమీందార్లు అనేకులున్నారు. వారికి యీ ఉద్యమంలో అభిరుచి కలిగిస్తే వారు ఒక్క ఆంధ్రుల చరిత్రనే కాదు పదింటిని కూడా

సానుకూలం చేస్తారు. కార్యక్రమం లోకి దిగితే సహాయం చెయ్యటానికి, పన్నెండేళ్ళనుంచి యీ కార్యాన్ని నిర్వహిస్తూన్న ఆంధ్రేతిహాసపరిశోధక మండలి ఉన్నది. గనుక, దేశంలో సరియైన ఉద్రేకాభిమానాలు కలిగించి, సమగ్రమైన ఆంధ్రదేశచరిత్రాన్ని రచించి తమయొక్క - ఆంధ్రదేశముయొక్క - కీర్తిగౌరవాల్ని కాపాడుకోవలసిన బాధ్యత ఆంధ్రు లందరి పైనా, విశేషించి నేటి చరిత్రపరిశోధకుల పైనా వుంది. ఆంధ్రులు వెంటనే మేలుకొని, యీమహాకార్యాన్ని జయప్రదంగా నిర్వహించవలె నని నేను మనవి చేస్తున్నాను.



# ధర్మపత్ని

ఆచంట సత్యవతమ్మగారు

మండువేసవికాలము. గ్రీష్మఋతు వగుటచే నీచెవిగా .డ్పు చెవికి గొట్టుచుండెను. గ్రీష్మాతపమున కాహుతి కాని ప్రాణికోటి లోకమున లేదు. పదిగంట లగుసరికే పశుపక్ష్యాదులు గూడ నెండకు తాళజాలక తల్లడిల్లుచుండెను. కాని వంట మొదలగు గృహకృత్యముల భారము వహించు గృహిణీలోకమునకు మాత్రము విశ్రాంతి లేదు. పంచాగ్నిమధ్యము తప్పదు. కచేరీలకు సెలవు. బడులకు సెలవు. ధనాఢ్యులు నీలగిరి మొదలగు హిమప్రాంతములకేగి చల్లబడుచుండిరి. బీదలు ధనాభావముచే తాళవృంతములనే ఆశ్రయించుచుండిరి. కాని స్త్రీలకేసి చూచేవారు లేరు సరి కదా ఉదయాస్తమయములు పొయిదగ్గర మ్రగ్గి చేసిన వంటలకు వంకపెట్టుచు మరింత ఉడికించుచుండిరి.

ఇట్టి దినములలో లండనులో నైదేండ్లుగా ఐ.సి.ఎస్. చదువుచున్న తన కుమారుడు వచ్చుచున్నాడన్న ఆనందముతో కామేశ్వరమ్మ అతిశ్రమపడుచు మిఠాయి, జిలేబి, రవలడ్డు మొదలగు ఫలాహారములు సిద్ధపరచుచుండెను. బిడ్డయందలి ప్రేమ గ్రీష్మమును కనబడనీకుండెను.

ఆమె కోడలిని పంపవలసినదని ముందుగనే వియ్యాలవారికి కార్డు వ్రాయించెను. ఐదుసంవత్సరములుగా మగని ముఖమునకై చంద్రకాంతికి వేచు చకోర మట్లు వేచియున్న జానకి మామగారివద్ద నుంచి వచ్చిన జాబు చూడగనే ముఖ మింత చేసికొని తలిదండ్రులను ప్రోత్సహించి సమస్తపరికరములతో నన్నగారు తీసికొనిరా రాజమండ్రి వచ్చి చేరెను. కామేశ్వరమ్మ అందరి అత్తల వంటిది కాదు. మంచి మనిషి. కోడలి సుగుణములు గ్రహించి, ఆదరించు సుగుణవతి. ఆప్యాయముగా కోడలి నాదరించి ఆమె యన్నను రెండు దినము లాపుకొని మర్యాద జేసి నూతనవస్త్రబహుమానపురస్సరముగా బహూకరించి పంపించెను. పిదప అత్తగారికి విశ్రాంతి కలుగజేసి సమస్తగృహకృత్యము జానకి పరమోత్సాహముతో జేసివైచుచుండెను.

ఆనందగావు వచ్చే రోజు వచ్చెను. ఉదయము తొమ్మిది గంటలకే మెయిలు. ఇంట్లో జానకి కామేశ్వరమ్మగార్ల ఆనంద మమితముగా నుండెను. ఉల్లగడ్డ ఉల్లిపాయ మసాలతో నొకకూర. ముఖ్యం కాయ కూర. కొబ్బరి కోరు పెరుగు పచ్చడి. పప్పు. తెల్ల అప్పడములు, వడియములు, పులుసు మిరియాల పొడి చారు మొదలగు పదార్థములతో వంట సిద్ధమైనది. శేమియాపులిహోర (చిత్రాన్నము) సొజ్జప్పములు తన కొడుకు కిష్ట మని చేయించెను. ఇండ్లన్ని

కడిగి ముగ్గులు పెట్టిరి. పెళ్లివారియిల్లులాగ అలంకరించిరి. సముద్రయానపు వెలి యీకాలములో లేవు గనుక వెళ్లనివారికే వెలి. వారి ముఖ్యబంధువులను కుమారుని పంక్తి కాహ్వానించిరి.

అసలింత పెద్ద యెత్తులే యిష్టము లేదు శ్రీరాములునకు. తన ఆదాయమున కనుగుణ్య మగు విద్యయే చాలు నని ఆతని తలంపు. ఆతనికీ ఆనందమొక్కడే కాని, మరి కుమారులు లేరు. బాల్యమాదిగా ఆనందరావున కతిసులభముగా విద్య వచ్చుచుండెను. ఒక్క క్లాసైన ఫెయిలై యెరుగడు. అందుచే నింటిపట్టున రాజమండ్రిలో నెంతవఱకున్నతవిద్య యున్నదో అంత పర్యంతము చదువు చెప్పించి ఉద్యోగములో ప్రవేశపెట్టించెద నని తండ్రి తలంపు. అటు కాదు. ఒక్కగా నొక్క కొమారుని పెద్ద చదువు చదివించి ఏకలక్టరీయో చేస్తూ నౌకర్లు చాకర్లతో చేతులు కట్టుకొని క్రింది యుద్యోగస్తులు నిలిచి దాసోహ మనుచుండ తన కుమారుని ధర్మన్యాయములు కనవలె నని తల్లి పట్టు. అబ్బాయి కసలే పట్టు. తండ్రి నెదిరించి లండను వెళ్లవలె నని అతను గట్టి పట్టు పట్టలేడు. మనసునందలి కోర్కె చుళ్ళించుకోలేడు. అట్టివారి కండబాటు పాలిచ్చి పెంచిన తల్లియున్నూ తాళిబంధరూపమున తన పాల బడిన భార్యయున్నూ కదా? వీరిద్దరి చెవులు గుసగుసలతో కొటికి తనకగు ఖర్చులకు కొంత సొమ్ము దాచినాడు. పెళ్ళినాడు పెట్టిన నగలు భార్యవి తీసి అమ్మినాడు. తల్లి తన మగనితో జగడమాడియో, ప్రార్థించియో తన మెడలిమీది రెండువేల రూపాయల ఆభరణము లమ్మి కొడుకు దోసిట పోసెను. భార్య నగల తాలూకు రెండువేలు, మొత్తము నాల్గువేలు తీసుకున్నాడు. తండ్రి నెట్లో వేడి యొప్పించుకున్నాడు. “లండనుకు జే” యని వెళ్ళినాడు. నాల్గువేలెన్నాళ్ళు వచ్చునా మహాపట్నములో? అందులో విద్యయే ప్రధానముగా గల్గిన వారెట్లో కాలము వెళ్లబుచ్చుదురు కాని మన ఆనందరావువంటి షోకేళాపురుషుల కా ఆవరణ పదిరెట్లు ధనవ్యయము చేయించును. చదువులోను శ్రద్ధయే. సాహాస్యమందుటలోను శ్రద్ధయే.

ఇంక టెలిగ్రామములకు మొదలు. తీరా అబ్బాయిని పంపాము. పొరుగూరిలో అందులో విదేశములో వాడెట్టి పాట్లు పడుచుండెనో యన్న దిగులుచేత నైతే నేమి భార్య పోరువలన నైతే నేమి శ్రీరాములు కుమారునికి ధనము ప్రవహింపజేయుచుండెను. నిల్వసొమ్ము గాక యీ యైదు సంవత్సరములకు భూములు యిల్లు తనఖాలు పెట్టి మరిపదివేలు పోసెను. అప్పటికే ఆయన మనస్సు చివుకు తాటాకు ననుకరించెను. ఆస్తి అంతయు హరహస్తగత మాయెనే యన్న బెంగతో తిండి సరిగ తినక, చిరాకుపరాకులతో కాల మెట్లో గడుపుచుండెను. ఆడదాని కిదంతయు నక్కరలేదు. ఇంత తగలేసిన కొడుకు ఉద్యోగము చేసి అప్పంత దీర్చి త్రిప్పి తలకెత్తుతా డనే కామేశ్వరమ్మ నమ్మకము. ఈపైరీతి నుపన్యసించుచు మగని నోదార్చుచుండెనాయమాయిక సాధ్వి. “చూచెదము కదా అబ్బాయి ఆదరణ? ఈకన్నుల కీరెప్పలు దూరము కావులే” అంటూ జవాబు చెప్పెడివాడు శ్రీరాములు అనుభవశాలియు ప్రపంచపరిజ్ఞాతయు గనుక.

ఐదేండ్లు ఈ తీరున గడచెను. పుత్రప్రేమచేత శ్రీరాములు పెద్ద స్టేషనికి, స్నేహితులతో, కారు తీసుకు వెళ్ళినాడు.

ఇంతలో మెయిలు వచ్చి ఆగింది. ఫస్టుక్లాసు బండిలోనుండి, దొరగార్లు దిగుచున్నారు. మామూలు, యింటరుక్లాసు వెదుకుచున్నాడు శ్రీరాములు. ఇంతలో దొరగారొకరు వచ్చి తండ్రిప్రక్క నిలబడిన సూటు ధరించిన స్నేహితుని పట్టుకున్నారు. అతడు కుమారుని ఆనవాలు పట్టలేక, ఎవరో యెరిగున్నదే యూరేషియనో, మాట్లాడుచుండెనని తలచి, పుత్రాగమనముకై వేచియుండెను. ఇట్టి స్థితిలో “కారెక్కవోయి, ఆనందా” యను స్నేహితుని వాక్యములతో స్మృతి గల్గి శ్రీరాములు

దొరగారిదెస పరికింప తన కుమారరత్నమే. సూటు, బూటు, హ్యాటుతో అసలే ఎఱ్ఱనివాడేమో అచ్చముగా పాశ్చాత్యునివలె తయారైనాడాతడు. పంచెధరించిన తండ్రితో భాషింప నామర్దా కాబోలు, ముక్తసరిగా మాటాడి కారెక్కెను. తండ్రి కప్పుడే తల తిరిగింది. కుమారుని వెంట నిడుకొని యెట్లో యింటికి ఘటము జేరవేసెను.

హిందూమర్యాదలు వేరు. యూరపియులవి వేరు. ఐదేండ్ల ప్రవాసములో అక్కడి నడవడిక లిట్టే పట్టుకుని యిప్పటి మన యువకులు పుట్టి యిరువదేండ్లుగా పెరిగిన హిందూధర్మముల నిట్టే మరచుటెంతటి యవివేకమో గ్రహింపుడు. ఆనందు డీ తరగతి మహానుభావుడైనాడు.

అనాడెట్లో ఎదురుగా వచ్చిన తల్లికి బంధువులకు అతిముక్తసరిగా విధిలేక జవాబులు చెప్పి, భుజించి లేచెను. కాని అందరు వింతగా మూగుట, తల్లి పల్లెటూరిదానిలాగ పదేపదే పరదేశవార్త లడుగుట భార్య తొంగిచూపులు తండ్రి ఆచారవ్యవహారములు తల్లిమడి, నేలమీద విస్తరిలో వడ్డించిన పదార్థములు చేతితో కలిపికొని తినుట ఘోరకృత్యములుగా నాతనికి దోచుచుండెను. హిందూసుందరి, భార్య యింపుగా చూపట్టుట లేదు. ఆనగ లేమిటి? ఆ బిగింపు సిగ యేమిటి? ఆకుంకుమ బొట్టెందుకు? ఆ నల్లని మసేమిటి కళ్ళకు? ఆసిగ్గెందుకు? ఆనందరావంటూ రేమిటి? అతడు టేబిలు, కుర్చీ, పింగాణీ పాత్రలు తెచ్చుకున్నాడు. తండ్రి పంక్తికి భోజనమునకు వచ్చుట లేదు. విసుగెక్కువైనది. ముఖము చిట్లింపు హెచ్చినది. తల్లితో ప్రేమగా మాట్లాడుట లేదు. భార్యను పలుకరించుట లేదు. ఆ వేళ కింత తన గదిలో బల్లపైని ఆహారము తినుట, వీధిలో షికార్లు బలిసినవి.

ఇంక చేయున దేమని ముఖాముఖములు చూచుకున్నారు తల్లిదండ్రులు. "నీకు కావలసిందే. చేతులు కాలాయి, ఆకులుపట్టుకుంటే కార్యమే మని, కామేశ్వరమ్మను, కసిరినాడు శ్రీరాములు. అంతగా తను ప్రేమించినకుమారుడు, ఒక్కకన్న కొడుకు భవిష్యత్తును నమ్మి యావదాస్తియు, వ్యయపరపించిన తన యవివేకమునకు కన్నీరు గార్చి, తన విద్యకై తండ్రి నడుగుటకు భయపడి, నక్కవినయములుగా తన్ను ప్రార్థించుచున్న ఆనందుని వెనుకటి స్థితికిని, అతిదిట్టరియై నిర్దయాత్ముడై, తలిదండ్రులవంక జూడక, నిరాకరించుచున్న యిప్పటి ఆనందుని అవతారమునకు మనసులో, నామె శాపాయుధములు పరపుచుండెను. కాని, ఏమిచేయగలదు? "అడ్డాలనాడే బిడ్డలు కాని గడ్డాలొచ్చాక బిడ్డలా" అన్న సామెత ఉత్తదా? ఇక ఆనందునివలన సుఖపడుద మనెడి ఆశ సున్నయైనది. ఇక జానకి మనోవ్యధకు పారమే లేదు.

ఇంతలో ధగలు మంద మగుటచే, తణఖా ఆస్తితో అప్పు తీరదేమో యన్న భయమున అప్పులవారు శ్రీరాములుపై వ్యాజ్యము వేసి, డిక్రీలుపొంది ఇల్లు పొలములు వేలము వేయించి తమ సొమ్ము రాబట్టుకొనిరి. వారు ఉండ యిల్లు, పండ మంచము లేకుండ బికారులైరి. కాని, ఆనందరావున కీ పరివర్తనము చీమ కుట్టినట్లైన లేదు. తనవల్లనే వీరి కింత దశ వచ్చిన దన్న సంగతే గ్రాహ్యము లేదు. ఇంతలో, డిప్యూటీకలక్టరుపదవి ఆనందరావునకు లభించెను. లభించుట తడవుగా సమస్తముధారపోసిన తలిదండ్రులకు జెప్పక, భార్యనైన తీసికొనక తన మూటముల్లె సర్దుకొని వెళ్ళిపోయెను. ఈ చర్యతో తలిదండ్రుల హృదయములు బ్రద్దలయ్యెను. జానకి మనోవ్యధతో క్రుంగిపోయెను.

నిలుచుటకు నీడ లేక, శ్రీరాములు, భార్యా, కోడలి సహితముగా బంధువు లింట తల దాచుకొనిరి. తెప్పలుగ చెరువు నిండిన గప్పలు పదివేలు జేరు" నన్నట్లు, ధన మున్నప్పు డతిథులుగా వచ్చి తినిన బంధువు లీదశలో నాదరించెదరా? కొన్నాళ్లు, యూరుకొని, వారు మా యింట్లో శుభకార్యము గాన యిల్లు ఖాళీ చేయమని చల్లగా జెప్పిరి.

జానకిని, పుట్టినింటికి పొమ్మని బతిమాలిరి; కాని, ఆగుణవతి "ఎట్టి సాధ్వులకును పుట్టిన యింటికన్న, పెద్దకాల మునికి తగదు తగ దన్న" కణ్వమహర్షి వాక్యములు తలచి వప్ప దయ్యెను.

"ఐదేడు లిదివరకే మీ యండ నుండక పుట్టింట బడి యుంటిని. మరల నే మని పోగలను? అందులో ఇట్టి హైన్యదశయందు, పుత్రునిచే పరిభవింపబడి దీనత నున్న మాన్యులగు అత్తమామల వదలిపోవుట నాకు ధర్మమా? ఆదియునుం గాక పతి సేవకు నోచ నైతిని. పూజ్యు లగు పెద్దల సేవ కూడ నాకు లేకుం డచేయుట మీకు న్యాయమా? యని వేడికొని కష్టములలో వారి ననునయించుచు; మహారాజు పుత్రిక యయ్యు, రాజ్యహీను లగు అత్తమామల సేవించి అరణ్యక్లేశము లనుభవించిన సావిత్రివలె వారి నెడబాయకుండెను.

కష్టపడినవారు సుఖపడుట సులభము కాని సుఖపడి కష్ట మనుభవింప దుస్సహము. స్వయంకృతాపరాధమునకే విలపించుచుండిన కామేశ్వరమ్మ ననవరతము శ్రీరాములు, మన దశ నివిధముగా మార్చిన దానవు నీనే యని దెప్పని గడియ లేదు. దీని కామె సహింపలేక కొడుకున్న అమలాపురముజేరి, కరుణముగా విలపించి యడిగిన మంచి దని, తన నమ్మకము మగనికి చెప్పెను. "అంత కింతైనది. ఇంత కెంతగునో? సర్వము వాడి కాహుతి జేసి సన్యాసుల మైతిమి చాలక వానిని యాచించి అవమానము కూడా పొందాలా" యని త్రాచుపాములా కలవవచ్చెను. "నియ్యిష్ట మెట్లనో ఏదు మంచిగా వచ్చిన సరే సరి, అవమానము పడివస్తివా, నీ కిక్కడ తావు లే దని ఖండితముగా చెప్పెను.

కొడుకు కదా యని తలచి ఎట్లనో అమలాపురము జేరి, ఆనందరావు బహదూరుగా యున్న బంగళా ప్రవేశించి, అక్కడ నున్న నౌకర్ల ద్వారా "మీ తల్లిగారు మాటాడ వచ్చినా" రని కబురు చేయగా "యిప్పు డెవరితోడను మాట్లాడుటకు వలనుపడదు. ఆఫీసు కాగితములు చూచుకొనుచున్నా" రని జవాబుపచ్చెను. దానితో కామేశ్వరమ్మ కాగ్రహము జనించి, "వీడి కింత పొగరా? తన చదువునకై న న్నెంతగా వేడెను? అప్పటి దీనాలాపముల కింత పొగరా? నాకు వీని అజ్ఞ యేల" నని బిరబిర మేడపై కేగి, డ్రస్సు వేసికొని తల్లి వచ్చిన దన్న నెపమున, నెచ్చటికో బోనున్న కుమారుని యెదుట నిలచి "ఆనందా! ఎంతటి వాడ వైతివి" అని పుత్రప్రేమచే బోరున నేడ్చెను. ఈ రీతి తల్లి బీదరాలై, పెద్ద హోదాలో నున్న తన యెదుట విలపించుటసహ్యమై ఏమి? మంచిచెడ్డ తెలియక ప్రవర్తిసున్నావు. నౌకర్ల యెదుట నా "ఆనందా? అనెదవు? ఎల్లకాలము ఆనందు డేనా? కలక్టరీపదవిలో ఘనీభవించిన నన్ను యెట్లుగా పిలువవలెనో, తెలియదా? తక్షణము నాయెదుటనుండి పొమ్మ, అనెను.

"మూర్ఖుడా? కచేరిలో కలక్టరవు కాని, తల్లి వద్ద కలక్టరువా? నీ కెంతహోదా అబ్బినను నాకు బిడ్డవే కదా? తెలియకుండా మాట్లాడెద వేమి? రెక్కలు వచ్చేవరకు నాయండ కావలిసి వచ్చెనా? నీకొఱకై సర్వ మర్పించి నీకెగురుటకు రెక్కలు కల్పించిన తలిదండ్రుము లనాథులు లైరా? దీనావస్థలో తలిదండ్రులను వదలి, వారి నాకటి పాలు జేసి, నీవు సుఖపడ జూచి తివి యా పుత్ర ధర్మము. తిన తిండియు, కట్ట వస్త్రము లేకుండ మేమిట్లుగా నగుట నీకొఱకే కదా? ఇట్టి మా దశ నరయక వర్తించిన నీ కీలోకముననే కాదు. నరకమందు కూడ చోటు లేక అథోగతిపా లగుట కించుకయు సందేహము కలదా? ఓరీ, పితృద్రోహీ! కులాంతకా, "మాతృదేవో భవ" యన్న వడుగునాటి మాట మరచితివా? ఘాతుకమృగ మైన తల్లిని చూడగనే ఆనందమున చెంగున గంతువైచి తల్లి చెంగట నిలచునే? మానవాకారరాక్షసుడవై నీవు చదివిన చదువునందలి సార మింతయా? ధర్మపత్నిని క్షోభపెట్టిన ఘాతుకా, నన్ను పొమ్మనెదవా? నిన్నింతవాడిని చేసిన దెవరి సొమ్ము? నీ పూర్వచరి

త్రను దలచికొనుము. డబ్బుకై యెట్టి దీనాలాపములాడితివో? మారిపై నాచేత జనకునకు చెప్పించి ఉద్యోగార్హత నొందజేసిన తలిదండ్రుల ఋణ మెట్లుగా దీర్చుకొనగలవు? "మాతాపితల నాదరించని మనుజు డేల? మా యుసురు నీకు తగిలిన జయ మందెదవా? పుత్రరూపశత్రువా? నేనిదే పోవుచుంటిని. ఈ జన్మమున నీకిక తల్లి లే"దని పెదదు చెడ కేకలు వైచుచు ఆమె బిరబిర మెట్లు దిగి వెడలిపోయెను. ఆనందుని యెడద చింతాకంతైన చలించదాయెను.

ఆట జానకి అత్తగారు కుమారుని చూడ నేగి రానందున నాలుగైదు దినములు జూచి, మామగారన్నంత పని జరిగి తీరినది. అవమానపడి నా వద్దకు రావలదనుటచే నా సాధ్వి యెట కేగెనో, లేక, ఆత్మహత్య గావించుకొనెనో యని విచారించి మామగారిని వేడికొని, ఆయన సహితముగా అమలాపురము జేరి దర్యాప్తు జేయగా అచ్చటి నా కర్ణంతయు జెప్పిరి. ఆమె యెవరో కాని మతి చలించి "నమ్మకు డయ్యా! పుత్రరూపశత్రుల నంటూ" కేకలు వైచుచు అమలాపురపు వీధుల రెండురోజులు తిరిగిందికాని మరల నామె జాడలేదనిరి. వారు చెప్పిన యానవాళ్లను బట్టి శ్రీరాములు, తన పత్నియే అవమానభరంబున పిచ్చిదై యెచ్చటికో బోయియుండు నని తలచి కోడలి నొక స్నేహితుల గృహమున నుంచి తన భార్య నన్వేషింప నేగెను.

ఇక ఆనందుని స్థితి నవలోకింతము. కాల మెల్ల నొక్క రీతినే నడచునా? ఋతువులలో శిశిరము వస్తే అకురాలి చెట్లు మోడుపడును. గ్రీష్మాతపమునకు నదుల నీరింకి తిప్పలు బయలుపడును. మనుజుని అహమిక, మదము గర్వమునడగించుటకు అనారోగ్యము దరిద్రము సాధనములు. తల్లి నవమానించిన వారము తిరుగకుండనే డిప్రషన్ రోజులలో నుద్యోగియులను దీసివేతలో మన ఆనందుడుండెను. అయినది అయ్యగారి ఎగిసిపాటని ఉద్యోగము వాపసుతో అధికారగర్వము తారుమారై పూర్వపు చిన్ననాటి విద్యార్థి జీవితమందలి దృశ్యము స్మృతిపథంబున తాండవించుచుండెను. మాతృప్రేమ మార్తిభవించి మానసవీధిని సంచరించుచుండెను.

ధనమదాంధత యణగుటతో పాటు, తన కనుసన్నల దాసోహ మని సంచరించు సేవకులును, అనుగ్రహము సంపాదించు తలంపున వెన్వెంట తిరుగు క్రింది ఉద్యోగియులును కూడ నెడమై ఏకాకిత్వము సంభవించెను. అన్యాయపు తీర్పుల వలని బాధ నొందువారి దీనముఖములు మనోవీధిని పొడగట్టి బాధించుచుండెను. మాతృనాళ్ల ముచ్చట వలని గర్వమున్ను తనయందే ప్రాణము లుంచికొని, తన భావి యౌన్నత్యమునకై, సర్వసంగపరిత్యాగులై పంచల నాలైన పూజ్యులగు తలిదండ్రుల నిరాకరించిన దుష్టత్వమునకు ఫలముగా మనోవ్యాధి యంకురించి క్రమముగా ముదురుచు పట్టెను. దాహశాంతికి నీర మందించుటకైన నా యన్నవా రెవరును లేరు. తన చిన్ననాడు సన్నిపాతజ్వరపీడితుడై యున్నప్పు డతిప్రేమతో నిద్రాహారము లెరుగక తన సేవయందే నిమగ్నయై యున్న తల్లి యీసమయమున జ్ఞప్తికి వచ్చె, తన యధికారఠీవిలో, దీనాతిదీనముగా "ఆనందా! యని దుఃఖసూచకస్వరమున పలుకరించిన తల్లిని కఠినభాషణంబుల నొప్పించి పారద్రోలిన మదాంధున కింత కావలసినదే యని, పశ్చాత్తాపహృదయుడై యేడ్చెను.

జానకి, అత్తమామల జాడ నెన్నాళ్లకును గానక వారి వీరి వలన తన మగ డున్న యిల్లు విచారించుకొని, చూడ నేగెను. ఆదరించిన సరియే లేనియెడల తన దారి దైవ మెరుగు నన్న ధీరత్వమున ఆనందుని గృహమున కేగి చూడగా నేమని నుడువగలము? ఆతడు చిక్కి శల్యమై, ఏకాకిగా మంచమున బడి దీనుడై పలవరించుచుండెను. ఇట్టి దృశ్య మవలోకించునప్పటికి, జానకి ప్రాణములు నిలువున నెగిరిపోవు నట్లయ్యెను. అంత హోదా యే

మారెనో యీస్థితి యెట్లు వచ్చెనో ఆమెకు తెలియక తల్లడిల్లుచు మాటాడుటకైన శక్తి లేని తన పతిని జేరి సమస్తోపచారములు చేయుచు తన నగ లమ్మగా మిగిలిన చిల్లరవస్తువు లమ్మివైచి, మంచి వైద్యుని రావించి, మందిప్పించుచు, పథ్యపానం బులు సకాలంబున నిచ్చుచు క్రమముగా రోగవిము క్తిని జేసెను. ఇంతటి పరిచర్య చేయుచు తన్నతి భక్తిశ్రద్ధలతో కొలుచుచు, భాగ్యదారిద్ర్యములందు కూడ సమానభక్తివిశ్వాసము లుంచి సేవించు నది తనధర్మపత్నియగుట యెఱిగి, ఆనందుడు జానకి రెండు కరములు బట్టుకొని బతిమాలునట్లుగా జూచెను. రెండు వేడి కన్నీటిచుక్కలామె కరములపై బడెను.

జానకి వణకుచున్న కరములతో ఆనందుని నయనముల దుడిచి, పూర్వచరిత్ర తలపవలసిన దని వేడికొని, శరీరము బలపడువరకు నే విచారములకు హృదయమున తావీయవల దని బతిమాలి, తాను జీవించియున్నంతవరకే కొఱత గలుగజాల దని నుడివి, ధర్మపత్నీత్వము సార్థక మగునట్లు ఉపచరించుచు ఆనందుని, యథారోగ్యవంతునిగా నొనర్చెను.

అతడు తన భార్యవలన తలిదండ్రుల వృత్తాంత మెరిగి, వారికై విచారించుచు అనేకపట్టణగ్రామంబుల వెదకించెను; గాని లాభ మిసుమంతయు లేకపోయెను. కొన్నాళ్లకొక స్నేహితుని ద్వారా కాశియందలి బైరాగిమఠమున నొకాయన కలిసెననియు, గృహకల్లోలములచే సంపూర్ణవిరక్తుడై నందున, చివరి దశ, విశ్వేశ్వరసేవచే కృతార్థత నొందింప దృఢనిశ్చయుడై నెతి నని యొకరితో వచింప వింటి ననియు స్నేహితుడు పలుక నాతడే తన తండ్రి యని నిర్ధారణ చేసికొని, క్షమార్పణ వేడి తీసికొనరా కాశి కేగెను; కాని, తండ్రి పట్టువలగా మరల గృహమధ్యమున నుండ నని "పుత్రులు శత్రులు గాక మిత్రులే" యనియు, అట్టి శత్రుమధ్యమున నుండ నని నిరాకరించెను. మాతృదేవత జాడ మరి లేదు ఇక చేయునది లేక ధర్మపత్నీద్వితీయుడై స్వస్థలము చేరి ఆనందు డధికారము మరలిరా, సుఖముగను ఆనందముగను జీవించుచుండెను.



# వేదికలు - పత్రికలు

## 'బతికే వుంది'

అవధానిశిరోమణి, పండిత, కాశీ కృష్ణాచార్యుల వారు తమకు ౬—౩—౩౭ తేదీని నిడదవోలుపౌరులు స్వాగతసత్కారాలు చేసినపుడు సంస్కృతభాష యొక్క సజీవస్థితినిగురించి యిలా సెల విచ్చారు.

"ఇపుడు చాలమంది సంస్కృతభాష నిర్జీవభాష యని పలుకుచుందురు. నిజము చూచినచో మన దేశమున సజీవభాష సంస్కృత మొక్కటి తప్ప మరేదియును లేదు. అనాదికాలమునుండియు సంస్కృతమే తక్కిన అన్నిభాషలకును మూలాధారముగా నున్నది. సంస్కృతభాషపై నాధారపడని భాష మరేదియు లేదు. హిందీ, మహారాష్ట్రము, కన్నడము, తెలుగు, ఉత్కళము, మున్నగు దేశభాష లన్నియును సంస్కృతపదములతోనే నిండి యున్నవి. ఆర్యభాషల కన్నిటికిని ప్రాణభిక్షను బెట్టునది సంస్కృతమే. ఆభాషలలో నున్న సంస్కృతపదములను దీసివేసినచో నవి అంతరించిపోవుట నిశ్చయము; కావున సంస్కృత మొక్కటియే

సజీవమగు మాతృభాష. అది స్వతంత్రము. తక్కిన వన్నియు దానిపై నాధారపడినవే. ప్రాచీనకాలపు ఆర్యులు దేవికానదీతీరమున నివసించుచుండిరి. అచట సంస్కృతము, లేక దేవభాషయే వాడుక భాషగా నుండెనని మహాభారతమునం దున్నది. ఆర్యభాషలు కావనబడునట్టి యితరభాషలలో గూడ సంస్కృతపదముల లక్షణము గోచరించుచునే యుండును. తగిన గురువు లభించినచో సంస్కృతభాషను మిక్కిలి సులభముగానే అభ్యసింపగలుగుదుము. ౫, ౬ ఏండ్ల బాలురకును, బాలికలకును గూడ సంస్కృతభాషయం దాసక్తి కలిగించుటకు తగిన విధానమును నేను చాల విద్యాలయములలో చూపించియుంటిని; గాన దీనిని సామాన్యమగు తెలివితేటలు గలవారు గ్రహింపజాలరనుట వట్టి దుర్భ్రమ. యజ్ఞస్థలములలో తప్ప తక్కినస్థలములలో సంస్కృతభాషను వాడుటకు కఠిననిర్బంధము లవసరము లేదని మహాభాష్యము మున్నగు ప్రామాణికవ్యాకరణగ్రంథములలో స్పష్టముగా తెలుపబడెను. సంస్కృతము మొదట వాడుకభాషగానే యుండెను. తరువాతనే అది గ్రాంథికభాష యైనదను విషయమును ప్రజలు కాలక్రమమున మరచిపోవుటచే మధ్యకాలముననే కఠిననిర్బంధము లేర్పరుపబడెను. మన దేశీయు లందరును ఇపుడు జర్మనీదేశమువారిని చూచి యైన సంస్కృతముయొక్క విమలయశస్సునకు భంగము కలుగకుండ కాపాడెదరుగాక యని నమ్మెదను"

## పర్లాకిమిడి ౨, ౪ భాగాలు

పర్లాకిమిడితాలూకాలోని ౨, ౪ భాగాలైనా ఒరిస్సారాష్ట్రంలో కలపకపోతే వొప్పుకోమని బెదిరిస్తూ వున్న ఓఢ్రుల వాదాన్ని శ్రీ గండికోట సత్యనారాయణమూర్తి ఎం. ఏ., గారు (౧౨-౩-౩౪ తేదీ) ఆంధ్రపత్రికలో యిలా ఖండిస్తున్నారు.

"...........చరిత్రాత్మక, ఆర్థిక, పరిపాలనా విషయిక, జాత్యాధారవిషయిక, భాషావిషయిక సందర్భములను గమనించినచో పర్లాకిమిడితాలూకాలోని ఏ భాగమును గూడ ఒరిస్సాలో కలుపగూడదని విశదము కాగలదు. ఈ తాలూకా ఒరిస్సాలో అంతర్గతమైన భాగముగా నెన్నడును లేదు. శాసనములం బట్టి విమర్శించినచో ఈతాలూకాకు ఓఢ్రులకన్న తెలుగువారే ప్రాచీను లని తెలియగలదు. దేశపు టాదిమనివాసులలో చేరినవారగు సవరలు తెలుగువారికన్న ముందే ఈతాలూకా నాక్రమించియుండిరి. సవరభాష కీతాలూకాలో తెలుగుభాష సంపర్కమే యెక్కువ. ఈతాలూకాయం దుండు సవరలు చాలమంది కాపుసవరలు. ఓఢ్రభాష బొత్తిగా మాట్లాడలేని సవర లనేకులున్నారు. పర్లాకిమిడి లేని ఒరిస్సారాష్ట్రము శిరస్సు లేని మొండెమని ఉత్కళసోదరులు చెప్పెడి మాటలు అలంకారయుక్తముగా కానవచ్చుచున్నను అవి వాస్తవముగా అర్థము లేని మాటల ప్రోగు. ఏమన? ఏయుగమునందు గాని ఒరిస్సాకు పర్లాకిమిడి శిరోమాణిక్యమువలె నుండుట గాని, పర్లాకిమిడి పురాతనపురాజులు ఒరిస్సారాజులకు సామంతరాజులుగా వ్యవహరించుట గాని లేదు. జాతినిబట్టి చూచినచో ౧౯౩౧ వ సంవత్సరపు జనాభాప్రకారము ఈ తాలూకాయం దున్న ౨౯౩౩౧౯ జనులలో ౧౫౬౦౫౯ మంది తెలుగువారున్ను, ౬౭౫౨౨ రు మాత్రము ఓఢ్రులున్ను కలరు. ౧౦౦ కి ౫౩ రు తెలుగువారున్ను, ౨౩ రు మాత్రము ఓఢ్రులున్ను ఉన్నారు. శేషించిన ౨౪ రున్ను సవరలు మొదలైనవారు గాని ఓఢ్రు లెంతమాత్రము కారు. భాషనుబట్టి చూచినచో తెనుగు మాతృభాషగా గలవారు ౧, ౯౩, ౪౭౫ రు. ఓఢ్రము మాతృభాషగా గలవారు ౬౦, ౩౨౦ మంది మాత్రమే. అనగా ఈ తాలూకాలో ౧౦౦ కి ౬౫ రికి తెనుగు మాతృభాష. ౨౧ మందికి మాత్రమే ఓఢ్రము మాతృభాష. ౩౫౨౦౦ మంది మాత్రమే ఓఢ్రభాష యితరభాషగా మాట్లాడువారు. ౪౫, ౩౪౩

మందికి తెలుగు రెండవ భాష. ఈ తాలూకాయందున్న (?) గ్రామములలో ౬ గ్రామములలో మాత్రము నూటికి నూరుగురు ఓఢ్రు లున్నారు. అయితే వీరి జనసంఖ్య ౧౦౦౦ కి తగ్గియే యున్నది. ౫౧ గ్రామములలో నూటికి నూర్గురు సవర లున్నారు. ౩౫౦ గ్రామములలో నూటికి నూరుగురో లేక ౯౦ మందియో తెలుగువా రున్నారు. తాలూకాయందలి అత్యధికసంఖ్యాకు లగు జమీందారీ రైతులున్ను, ఇనాందార్లున్ను తెలుగువారే. చెన్నపురి సెన్ససు సూపరెంటెండెంటుగారి విభజనము ప్రకారము ఈ తాలూకా రెండవభాగములో నూటికి సుమారు ౭౦ మంది తెలుగువారున్ను, ౨౦ మంది ఓఢ్రులున్ను, ౫౧ మంది సవరలున్ను ఉన్నారు. ఆవిభజనము ప్రకారము తాలూకా నాల్గవభాగములో నూటికి ౬౧ మంది తెలుగువారున్ను, ౩౫ గురు ఓఢ్రులున్ను, ౪ మాత్రము సవరలు మొద లయినవారున్ను కలరు. ఈ నాల్గవభాగములో పర్లాకిమిడిపట్టణమున్ను సుమారు ౧౩౦ గ్రామములున్ను కలవు. ఈ ౯ వ భాగపు జనసంఖ్య సుమారు ౭౩౦౦౦. జనాభా లెక్కలప్రకారము విశద మగు మీది వివరణముల వలన ఈ తాలూకాయున్ను, ముఖ్యముగా ఇప్పుడు ఓఢ్రులు ఒరిస్సాలో కలుపు డని కోరుచున్న తాలూకాయందలి రెండవ, నాల్గవభాగములున్ను కేవలము తెలుగు ప్రాబల్యము కల వని విశద మగుచున్నది. ఈభాగములలోని జనాభాలో చాల తప్పులున్నట్లున్ను, తెలుగువారిక్రింద నమోదుకాబడవలసిన ఆసాములున్ను గ్రామములున్ను ఓఢ్రులక్రింద నమోదైనట్లున్ను తెలియవచ్చుచున్నది. ఈజనాభావిషయమై యాంటీయొమాల్గమేషనుసొసైటీవారి ప్రత్యేకకమిటీవా రిప్పుడు చేయుచున్న విమర్శనము పూర్తి కాగానే గవర్నమెంటు లెక్కలలోని తప్పులున్ను, ఉత్కళసోదరుల అసందర్భపు వాదనలున్ను వివరణప్రణాళికలతో గవర్నమెంటువారి పరిశీలనార్థము ప్రచురింపబడును. ౧౯౩౧ వ సంవత్సరపు జనాభా లెక్కలమీద నాధారపడినను ఈ తాలూకాయున్ను అందలి ౨ వ ౪ వ భాగములున్ను కేవలము తెలుగుప్రాబల్యము కల వని తేటపడెడు మానును. ఇట్టి తెలుగుమయమగు తాలూకాయం దేభాగము ఒరిస్సాలోకలిపినను తెలుగువారి ఆచారవ్యవహారములకున్ను, భాషకున్ను, సారస్వతమునకున్ను, ప్రత్యేకవ్యక్తిత్వమునకున్ను తీరని కష్టనష్టములు వాటిల్లును. ఓఢ్రుల శ్రేయస్సునకే ఉద్దేశింపబడిన భావి ఉత్కళరాష్ట్రపరిపాలనసభలో తెలుగువారికి పలుకుబడి కుదురదు. జాతిని బట్టి వైషమ్యభావములు కలిగియున్నట్టియు, రాజకీయముగా వెనుకబడియున్నట్టియు, ఆర్థికముగా నిలుచుటకే శక్తి లేనట్టియు ఓఢ్రుల పరిపాలనకు నాగరికత గల తెలుగువా రెన్నడును లోబడియుండనొల్లరు. ఎక్కువ పరిపాలన సౌకర్యముల నొసగు చెన్నపురి ప్రభుత్వమును వదలి, జాస్తిపన్నులను భరించెడు శక్తి లేనట్టియు, వరదల వలనను, కాటకములవలనను ఇంచుమించుగా ప్రతి సంవత్సరము ఆదాయముకన్న వ్యయమే అధికరించునట్టియు, కేంద్రప్రభుత్వమువారి సాంవత్సరికధనసాహాయ్యము లేకుండ రాజ్యాంగవ్యవహారచక్రమును నడిపించుటకే అవకాశము లేనట్టియు ఒరిస్సాప్రభుత్వమునకు లోబడి ఈ తాలూకా తెలుగువారు కష్టముల పా లవుటకు ఒప్పుకొనరు. మిడ్నాపూరు ఓఢ్రులే ఒరిస్సాసమ్మేళనమును బహిరంగముగా నిరాకరించియుండ ఈ తాలూకా తెలుగువారు రాజావారి కోరికప్రకారము ఒరిస్సాసమ్మేళనమును వాంఛించుచున్నా రనెడు వాదము వ్యర్థవాదము. ఈ వాదమందలి రహస్యము గవర్నమెంటువారికి అనేకవిధముల తాలూకా తెలుగువారు విశదపరిచియుండిరి. ఈ తాలూకాయందలి కొన్ని భాగముల నైన ఒరిస్సాలో కలుపకపోయినయెడల భావిఒరిస్సారాజ్యాంగక్రమము నడిపించమని ఉత్కళసోదరులు బెదిరించిన మాత్రమున యుక్తాన్వేషణ చేయకుండ గవర్నమెంటువారు ఈ తాలూకా తెలుగువారిని అధోగతిపాలు చేసెదరా?

ఉత్కళులకు ప్రత్యేకవ్యక్తివిజృంభణము కావలసినప్పుడు ఆంధ్రులకు మాత్రము ప్రత్యేకవ్యక్తిత్వవిజృంభణము అక్కరలేదా? ఓఢ్రులు ప్రత్యేకోత్కళరాష్ట్రనిర్మాణమును కోరుచున్నట్లే ఆంధ్రులుకూడ ప్రత్యేకాంధ్రరాష్ట్రనిర్మాణమును వాంఛించుచున్నారు. కేవలము తెలుగుప్రాంతములను ఒరిస్సాలో చేర్చినచో ఆంధ్రులు మాత్రము ఆందోళనము చెయరా? ఆంధ్రులోక మీసంగతి గమనింపవలెను"

## వేశ్యలు పనికిరారా?

కృష్ణాపత్రిక చెసిన "కాలేజీగరల్" నాటక విమర్శను పురస్కరించుకుని "నైతికజీవనానికీ, కళాకౌశలానికీ సంబంధం యేమిటీ!" అని నిక్కచ్చిగా అడుగుతూ (౧౦-౩-౧౯౩౭) కృష్ణాపత్రికలో శ్రీ పింగళి నాగేంద్రరావుగారిలా రాస్తున్నారు.

"పాత్రయొక్క విశిష్టభావాభినయాన్ని రసవంతంగా, సముచితంగా నిర్వహించి ప్రదర్శించే నటుని యొక్క గాని, నటియొక్క గాని 'అభినయ-తాహతు' కున్నూ, వారి సామాన్యజీవన విధానానికిన్నీ కళావిషయికంగా ఎట్టి సంబంధము ఉండదు. ప్రదర్శనం సజీవంగా, ప్రభావవంతంగా ఉన్నంత కాలం ప్రేక్షకుల దృక్పథాన ఆవిశిష్టభావాభినయాన్వేషణమే ప్రతిఫలిస్తుంది. అక్కడినుంచి నైతికఛాందసాలు తోక ఝాడించాలిసిందే. ఆనటులు రంగంమీద ఉన్న ఆకాసేపు అది అభినయ కార్యం. కావ్యకర్త, కడుపుకక్కర్తికి కనపడ్డ వాళ్లకి కపాలమోక్షాలిప్పించేవాడని రామాయణ ప్రభావం కుంటువడుతుందా? ఆసమయానికి అతడు సృష్టికర్త. మహాయోగి. కాలం అరికట్టింది కనక, పగలు బానిసగ పడి ఉంటాడు; కాని బానిసన్నత్త రాత్రి రాజువేషం వేయడానికి అడ్డురాదు. అసలే నటన. నటనాకౌశలం ఉంటే కావ్యానికి వ్యాఖ్యానాల్ని మార్చవొచ్చు. రామదాసునాటకానికి నాటకగౌరవమే చింతనీయం. దాన్ని కీ. శే. కందాడై శ్రీనివాసయ్యంగారు కట్టిన రోజుల్లో అది తానీషానాటకంగా చూపించేది. ప్రేక్షకుల మోజంతా ఆ నిషామీద ఉండేది గనుక. శ్రీ రాఘవాచారిగారి ఆరాలోకి వచ్చిం తరువాత భద్రాద్రిరామదాసు భక్తితన్మయత్వం అంతా తాండవరూపం తాల్చడంతోటే దాన్నే రామదాసునాటకంగా చూస్తున్నాం. ఇద్దరూ రసాభినయచణులైన నటులవడంచేత ఎవరు రంగమునకు వెలసిన మొగ్గావైపు. మరి గోల్కొండనవాబు దర్జాల్ని, విలాసాన్ని, భోగలాలసతనూ దొరసామయ్యంగారికి గాని, రామదాసు పారవశ్యముద్రను 'రాఘవు'కి గాని అంటగట్టలేం గదా? జీవితానికి సంబంధించిన నీతి అవినీతులు అభినయవేళ అక్కరకురావు. పుష్కరానికి ఓమాటు ఓబరామర్గు (Oberamergue) లో క్రీస్తునాటకమును (The Morcle Play) పాత్రములనన్నిటిని ఆయాప్రవృత్తులు గల మనుష్యులనే యేరికోరి తెచ్చి పాత్రధారణ చేయించి ప్రదర్శిస్తూ ఉంటారు. కళోపాసకులు కూడ దాన్ని ఒక ఉత్సవంగా పరిగణించి చోద్యం చూడ్డానికి వెళతారే కాని రససిద్ధిని అభిలషించి వెళ్లరు; కాని (Matheson Long) ఆవేషమును వేసినప్పుడు ప్రేక్షకులు కళాభిలాషులై తిలకించేవారు. నందనారు నాటకంలో నరసింహాంగారు రంగానికి వస్తే నవ్వుకుంటూ నమస్కారము చేశారు; గాని నటనానైపుణికి పరవశులై పోయారా? ప్రచారనాటకాలకి కూడా అభినయకౌశలం గల నటులే అవసరమౌతారు. వారి కళాప్రతిభచేతనే రంగముమీద ఏది గాని చలామణీ ఔతుంది. కళాకుశలు లెప్పుడూ రసజగత్తులో విహరిస్తూ ఉంటారు. మనం లక్ష్యం చేసే నీతులకు నియమాలకు వాళ్లు అందరు. మనం చలాయిస్తున్న పాతివ్రత్యపద్ధతులు మతనీతులు వాళ్లకి హితవుగా ఉండవు. ఈ ఛాందసావరణంలోంచి తప్పించుకుంటేచాలు అప్పలి ఆవ

రణ ఎట్లాంటిదైనా సరే అనుకుంటారు. అందుకనే " In short, the artist can be a Prostitute, a Pander, and a flatterer more easily, as far as external pressure goes, than a faithful servant of the community, much less the founder of a school or the father of a church " అని బెర్నార్డ్‌షా అన్నాడు. అనుభవంలో కూడా స్టేజిమీద, ఫిలుములలోనూ సీత, సావిత్రి మొదలైన పతివ్రతల కథలు వేశ్యలు వేషం కట్టి అభినయిస్తుంటే విటంతువులు, విభూతిశాస్త్రులూ అందరూ ఆనందిస్తూనే ఉన్నారు. పేషణానుకూపరూవంటి పాశ్చాత్యవనితలు కాళీ మొదలైన వేషాలు వేస్తే చేతులు జోడించి చెంపలేసుకుని మొక్కి మరీ వెళ్లారు. వేశ్యలైనా అభినయసామర్థ్యం గలవారైతే మన్ననార్హులే. రంగం మీద కులస్త్రీలైనా ఆసామర్థ్యం లేకపోతే పనికిరాక గర్హ్యం. కన్యాశుల్కంలో మధురవాణి "వేశ్యలంటే అంత చులకనా అండీ పంతులు గారూ" అన్నట్లు, వేశ్యలు కళాధురీణలై రంగం మీదికి వచ్చేటప్పుడు 'థియేటర్ మర్యాదలు' వెనుకటివలె ఉండవు"

## శస్త్రచికిత్స

శ్రీ బొబ్బిలి రాజావారి చాకచక్యాన్ని మెచ్చుకుంటూ తాలూకాబోర్డుల నిర్మూలనాన్ని (౪-౩-౩౪) రంధ్రాన్వేషి యిలా సమర్థిస్తోంది.

"ప్రజాస్వామ్యం కుళ్లేశవం అని ముసోలిని అనటంలో ఘనతరసత్యం వున్నది. బహునాయకత్వం అన్ని అందాలా అనర్థకం. గత ఐరోపాసంగ్రామానంతరం ప్రజాస్వామ్యవికృత రూపం బయటపడి, నిరంకుశమైన, ప్రజానురంజకమైన ఏకవ్యక్తిపాలనమే మేలను సిద్ధాంతము బయలుదేరి చాలాదేశాలలో నెరవేర్పబడుతున్నది. నిన్న అస్తమించిన మన తాలూకాబోర్డులు క్షుద్రసంస్థలైనా— స్వపాలన మనే మిషతో పెద్దసంస్థల కన్నను, అధికార దుర్వినియోగాలకు నెలవై మంచికన్న చెడ్డనే ఎక్కువగా కలుగచేస్తుండినవి.

ఇవి స్పర్థలను పెంచటం అటుండనిచ్చి, జోహుకుం అనే ఒక బానిసజాతిని సృష్టించి-బోర్డుల నిర్మించిన రిప్పన్ ప్రభువుగారి ఆశయాలకు భిన్నంగా స్వపరిపాలను దుష్పరిపాలనగా మార్చినవి. యుగయుగాలనుండి భారతభూమిలో రాజ్యాంగానికి ప్రాతిపదికమైన గ్రామసంస్థను పగులగొట్టి గ్రామాన్ని నిరసం చేసివేసినవి. ఇదీగాక జిల్లా బోర్డు వున్నంతవరకు వీటి వునికికే అవసరంలేదు.

ఇంతవరకు ఇది ఉదారాశయులైన ప్రజల వాదమై వుండింది. నేడు తాలూకాబోర్డు పాలన ప్రభుత్వ తీవ్రవిమర్శనలకు పాలై భారతీయులు స్వపాలనానికి అనర్హులనే చర్చిల్ వాదానికి సహాయభూతం కావటం అవమానకరం. ఈమధ్య ప్రభుత్వం ప్రతిష్ఠానికి స్వపరిపాలన సంస్థకు ఒక ఉద్యోగిని నియమించిందంటే ఆసంస్థలపై మోజుగలిగిన వాళ్లు అవమానపడాల్సిన విషయం. ఇప్పటికైన గవర్నమెంటు మొగమాటపడకుండా తనధర్మాన్ని నెరవేర్చినందులకు అభినందించాల.

ఇప్పటివరకు ఏమంత్రికి యింతటి ధైర్యంగాని, సత్పాలనా నిరతిగాని లేదంటే అతిశయోక్తి కాజాలదేమో! గర్భోద్దేశం ఏమైతేనేం యువకుడు-తానను కొన్నది ఎట్టిపరిస్థితులలోనైన జంకక చేసే దిట్టడు- బొబ్బిలి రాజాగారు తాలూకాబోర్డుల నిర్మూలించి చిరవాంఛను నెరవేర్చినారు. వీరి మేలు జాతీయభారతం మరువజాలదు. వేరొకరు ముందు అధికారంలోకివచ్చి అనుచరుల ప్రీత్యర్థం బోర్డుల పునర్జన్మ ఎత్తించకుంటే దేశానికిమేలు! ఇంతవరకు ప్రభుత్వాన్ని పదేపదే కొనియాడాల్సిందే"!

# వ్యాఖ్యానములు

## పత్రికలభాష

"తెనుగు పత్రికలలో సంపాదకీయాలెలాంటి భాషలో వుండాలి?" అంటూ యిదివరకెవరూ యిది వొక పెద్ద సమస్యగా ఆలోచించి నిర్ధారణ చెయ్యలేదు. కానైతే తెనుగు భాషలో పత్రికలు ప్రారంభమై యాభై సంవత్సరాలకంటే యెక్కువ కాలమే అయింది. అప్పణ్ణుంచీ సంపాదకులు ఎవరిశక్తి ననుసరించి వారు, ఎవరికి నచ్చిన శైలిలో వారు వ్యాసాలు రాసి దేశసేవ చేస్తున్నారు. నిజానికి, భాషావిషయం నిర్ధారణ కాకపోయినా, సంపాదకులు, పండితులకోసం గ్రంథాలు రాయతగ్గ భాషలోనే తమ రచనలు ప్రకటిస్తున్నా యీ పత్రికల ప్రచారంవల్ల ప్రజలలో విజ్ఞానం బాగానే వ్యాపిస్తోంది. అయితే; సంపాదకులు, పండితభాషలో కాక దేశంలో వాడుకలో వున్న భాషలోనే తమ వ్యాఖ్యానాలు రాస్తూ వుంటే విజ్ఞానం యింకా శీఘ్రంగానూ, యింకా యెక్కువగానూ వ్యాపించదూ?

ఇవాళ యిది వొక గొప్ప సమస్యగా పొడచూపింది. ఈ సంచికలోనే ప్రకటించబడ్డ రావుసాహెబు శ్రీ గిడుగు వేంకటరామమూర్తిపంతులుగారి దివ్యసందేశం దీన్ని తెనుగు పత్రికల సంపాదకుల యెదట వుంచుతోంది.

ఇప్పుడు మన తెనుగువారిలో సంపాదకులే కాదు, యెవరూ కూడా సమష్టిబాధ్యత వహించి నడవడం లేదు. ఇప్పటికున్నూడా తెనుగు రచయితల్లో గ్రాంథికవ్యావహారికభాషావివాదం యింకా తీవ్రంగానే జరుగుతూ వుండడం మాకు తెలుసు. కొన్ని కొన్ని సన్నివేశాలను పురస్కరించుకుని, అంతరాత్మ యేం చెబుతూ వున్నా దాన్ని లెక్ఖ చెయ్యక కొందరుకొంత దాకా మారుదారిలోనే వుండడం కూడా మేం యెరుగుదుం. అయితే ఆలోచించడం వేరూ, ఆమోదించడం వేరూనూ. అలాగే ఆమోదించడం వేరూ, అవలంబించడం వేరూనూ.

నిజానికి పత్రికలు ప్రజల కందరికీ వుద్దేశించబడ్డవి; కాని యే కొద్దిమంది పండితుల కోసమో కాదు. జనసామాన్యంలో వున్న అజ్ఞానాన్ని తరిమి వేసి, స్వతంత్రభావాలను రెచ్చగొట్టి, ప్రజాశక్తి నంతటినీ యేకముఖం చేసి దేశోన్నతిని సాధించడానికి: గాని పండితులు రెడ్డికం వేసుకున్నుచుని వినోదంగానూ, మడికట్టుకున్నుచుని మోక్షం కోసమూ చదువుకోడానికి కాదు. అయినప్పుడు పత్రికల సంపాదకీయాలు పండితభాషలో వుంటే యేం లాభమూ?

మంచీ చెడ్డా, లాభమూ నష్టమూ చట్టున నిర్ధారణ చేసుకోడం అందరికీ సాధ్యం కాదు. వొకరు బోధించడం, కొందరు వినడం అనేది జనసామాన్యంలో అంతటా సాధ్యపడదు. పత్రికల ప్రయోజనం అలాంటిది కాదు. రమారమీ వొక అణా పెడితే పత్రిక వస్తుంది. నడుస్తూ నడుస్తూ, పని చేస్తూ చేస్తూ, చివరికి భోజనం చేస్తూ చేస్తూ కూడా పత్రిక విప్పితే లోకం యే స్థితిలో వుందో తెలిసిపోతుంది. ఏం చేస్తే యెలా అవుతుందో, యెవరికేది మంచిదో, యెప్పుడేది అవసరమో బోధపడిపోతుంది. ఇలాంటి పత్రికలు విచారణ చేస్తే గాని బోధపడని భాషలో వుంటే యేం లాభమూ?

మనలో చదువుకున్నవారి సంఖ్య నూటికి పది కూడా లేదు. ఆ చదువేనా ప్రైమరీతో ముగిసిపోయిందే యెక్కువ. కొందరి విషయంలోనైనా యింకో మెట్టు పైకి వెళ్ళి వుంటే ఆ వెళ్లడం యింగ్లీషులో గాని తెనుగులో కాదు. కాగా చదువు

వచ్చిన మనవారిలో భాషాపరిచయం తక్కువ. ఎక్కువగా వున్నా పత్రికలు ప్రపంచజ్ఞానాన్ని కలిగించేవి; గాని పాఠ్యగ్రంథాలు కావు. అదలా వుండగా మేడితోక పట్టుకుని ఎరక సాగిస్తూనే రైతు పత్రిక విప్పవలసి వుంటుంది. దుకాణంమీద కూచుని భోజనపదార్థాలు తూచి యిస్తూనే వర్తకుడు పత్రిక చదవవలసి వుంటుంది. గోచిపాత పెట్టుకుని చెమట వోడిస్తూనే కార్మికుడు పత్రిక చూడవలసివుంటుంది. కక్షిదారు చెప్పేది వింటూనే—అతనికి, కోర్టులో చెప్పవలసిన సంగతులు పాఠం చెబుతూనే న్యాయవాది పత్రిక తిరగవెయ్యవలసివుంటుంది. ఇలాగ యింకా చాలా తరగతుల వారు ఏదో పనిలో మునిగివుండే పత్రికలు చదవ్వలసివుంటుంది. అలాంటప్పుడు పత్రికలు, అప్రయత్నంగా బోధపడే వాడుకభాషలో కాక, వొక పక్క వ్యాకరణమూ, వొక పక్క నిఘంటువూ, పైగా వొక పక్క పండితుణ్ణీ వుంచుకుంటే గాని కొరకబడని భాషలో వుంటే యేం లాభమూ?

పాశ్చాత్యదేశాలవారంతా యిప్పుడు భౌతికవిజ్ఞానశిఖరంమీద వుండి ప్రపంచకాన్నంతటినీ ఆడిస్తూన్నారు. ప్రాచ్యదేశాలవారిలో చీనావారికంటె నల్లమందుభాయీలు కూడా యిప్పుడు ముందుకు వెళ్లిపోతున్నారు; కాని మనం ముందుకు సాగలేకపోతున్నాం. ఈ స్తబ్ధత వెంటనే వదిలిపోతేగాని మనం అడుగున అణిగిపోతాం. ఇప్పుడు మహాపండితుడైన బ్రాహ్మణుడు మొదలుకుని కుటుంబవ్యవహారాలు సరిపెట్టుకోడానికి చాలిన యే కొద్ది మాటలు మాత్రమో బోధపరుచుకోగల నిమ్నజాతీయుని దాకా అందరూ అచిరకాలంలో—నిమిషాలమీద విజ్ఞానవంతులు కావాలి. తమ స్థితి బోధపరుచుకుని, ఆవేదన పొంది, ఆవేశం కలిగి, అందరికంటే యెక్కువ స్థానంలో వుండడానికి కాకపోయినా, నలుగురితో పాటు సమంగా వుండడానికేనా "జై జగన్నాథా!" అంటూ ముందు నరకాలి; గాని గోళ్లు మీటుకుంటూ, మీనమేషాలు లెక్కపెట్టుకుంటూ పడివుండడానికి వల్లకాదు. మనకి యీ స్థితి రావాలంటే—యీ ఆవేదనా, యీ ఆవేశమూ కలగాలంటే అది పత్రికలవల్లనే సాధ్యమవుతాయి; గాని ఇతరసాధనాలవల్ల కాదు. అలాంటి పత్రికలు, "సామాన్య సంభాషణలో 'నోటిలో మాట నోటిలో ఉండగానే', వాక్యము పూర్తి కాకమునుపే, ఒకరి మనోభావము ఒకరు గ్రహించి సంభాషణోద్దేశము జనులు నెరవేర్చుకోవడము ఏలాగున సాధ్యమవుతున్నదో ఆలాగుననే" ఉపయోగించాలంటే వాడుక భాషలోనే ప్రకటింపబడితే గాని యేం లాభమూ?

మనలో యిప్పుడు జాతియొక్క సర్వతోముఖవికాసం కోసం పాటుపడే వారిలో పత్రికాసంపాదకులకు సాటి అయినవారు మరొక తరగతివారు లేరు. రాత్రింబగళ్లు నిద్రాహారాలు మాని తల చించుకుంటూ, చేతికి వచ్చిన ప్రతీ దమ్మిడీ గుడ్డిగవ్వ లాగ వెచ్చించి సంసారం గుల్ల చేసుకుంటూ, సుఖాన్ని, ఆరోగ్యాన్ని, ధనాన్ని, సంసారాన్ని—చివరికి జీవితాన్ని కూడా మానవసేవకోసం సంతోషంతో త్యాగం చేసే పత్రికాసంపాదకులకంటే ఉత్తమశ్రేణికి చెందినవారు మరొకరు లేరు. అలాంటి పత్రికాసంపాదకులు అత్యవసరమైన యీ విషయం ఆలోచించకుండా, తొందరలోనూ, యెక్కువగానూ జీవితసాఫల్యం కలిగించే యీ భాషావిషయం నిర్ధారణ చేసుకోకుండా పత్రికలు నడపడం యేం లాభమూ?

ఇప్పుడు మన పాఠశాలల్లోనూ, కాలేజీలలోనూ మన బాలికలకీ, బాలురకీ సకలవిషయాలూ యింగ్లీషులో బోధించబడుతున్నాయి. అది మన భవిష్యత్పౌరుల కాలాన్ని హ్రస్వం చేస్తోందనీ, మెదటిని కరిగించివేస్తోందనీ, విజ్ఞానాన్ని సముకూర్చవలసిన గ్రహణశక్తిని దుర్వ్యయం చేస్తోందనీ, యౌవనరక్తాన్నంతటినీ అక్రమమార్గంలో నిరు

చేసేస్తాం నని, గొప్పగొప్ప ఫలాలు సాధించవలసిన జవసత్వాలను ధ్వంసం చేసి నవీనయుస్సులో ముసలితనాన్ని మీదబెట్టి యద్దతాం దని —జాతినంతటినీ నిర్వీర్యం చేసేస్తాం దని మనం అందరమూ అసమ్మతి తెలుపుతున్నాం. ఆగ్రహాన్ని ప్రకటిస్తున్నాం. నిందిస్తున్నాం. ఖండిస్తున్నాం. ప్రతీకారం చెయ్యాలని వూహిస్తున్నాం. ఇందులో పత్రికా సంపాదకుల చెయ్యి యెక్కువగా వుంది. అలాంటి సంపాదకులు ప్రజలకందరికీ అంతుబాటులో లేని భాషలో తమ వ్యాఖ్యానాలు రాసి ప్రకటించటం యేం ధర్మమూ?

వాస్తవంగా రామమూర్తిపంతులుగారు వినిపించిన యీ దివ్యసందేశం కోట్లు వెలచేస్తుంది. పైగా యిది తెనుగు పత్రికల విజయానికి కీలకంగా వుంది.

అత్యవసర మైన యీ విషయం యిప్పటికే పరిష్కరించబడి వుండవలసింది. అయినా యిప్పుడేనా దీన్ని గురించి శ్రద్ధ చెయ్యడం చాలా అవసరం.

ఇప్పటి తెనుగు పత్రికల సంపాదకుల పరమావధి మానవసేవ గాని ధనార్జన కాదు; కనక వారంతా పంతులుగారి సందేశాన్ని మననం చేసుకుంటూ, అనుసరిస్తూ కృతకృత్యు లవుతా రని నమ్ముతున్నాం.

## సింహనాదం

ఇప్పుడు వచ్చిన ఆపత్తిదీ.

ఒక పెద్ద తెనుగు గడ్డని విరుచుకుపోవడానికి ఓఢ్రులు దృఢదీక్ష వహించి వున్నారు.

ఒక్క గంజామాంధ్రులకు తప్ప తతిమ్మా పది జిల్లాలవారికీ యిది చీమ కుట్టినట్లైనా తోచడం లేదు.

ఇలాంటి స్థితిలో వేంకటగిరి కుమారరాజాగారూ కిర్లంపూడి జమీందారుగారూ డాక్టరు సుబ్బరాయనుగారితోటీ మరి కొందరితోటీ కలిసి గవర్నరుగారి దగ్గిరికి రాయబారం వెళ్ళి „పర్లాకిమిడి తాలూకాలో కొంతభాగం ఒరిస్సారాష్ట్రంలో కలపవచ్చు’’ నని సిఫారసు చేసి చక్కావచ్చారు.

ఇంకేమిటీ చెయ్యడం? ఆంధ్రరాష్ట్రం ఏర్పడకపోతే పోయింది. యిప్పుడున్నంత పట్టు కేనా మన మంతా కలిసివుండడం పడుతుందా పట్టదా?

వెనక దొరతనంవారు బంగాళాదేశాన్ని విడదీశా రంటే బంగాళీలకి రెండు రాష్ట్రా లేర్పడ్డాయి; గాని యిప్పుడు మనకు వచ్చిన విభజన అలాంటిది కాదు. ఇది శాశ్వతంగా, బలవంతంగా కొన్ని లక్షల ఆంధ్రులు దత్తుపోవడమే.

వెనక యెప్పుడో మనవాళ్లు సామ్రాజ్యాలు నిర్మించారుట. దక్షిణదేశం అంతా యేలేరుట. తుదకి మగధదేశం కూడా జయించారుట; కాని యిప్పుడు మనం వున్నంత అపస్మారస్థితిలో మరెవరూ యెప్పుడూ వుండరు.

ఇల్లాంటి పరిస్థితుల్లో మనం రాజకీయాందోళనంలో మునిగిపోయి వున్నామంటే యేమేనా అర్థం వుందా?

నీట ముంచడాని కేనా, పాల ముంచడాని కేనా మనకి సమర్థు డైన నాయకు డేడీ? మనకి జాతీయాభిమానం యేదీ? ఆత్మగౌరవం యేదీ?

బంగాళీలను నిలువుగా చీల్చేశా రని కర్జను ప్రభువుమీద కారాలూ మిరియాలూ నూరిన ఆంధ్రుల మేనా మనం?

ఖిలాఫత్తుకు అక్రమం చేసిం దని బ్రిటిషు ప్రభుత్వాన్ని నిందించిన ఆంధ్రుల మేనా మనం?

బార్డోలీ రైతులు కోరి తెచ్చుకున్న ఆపత్తుకు ప్రతీకారం చెయ్యడానికి కైదుకొట్లు నింపేసిన ఆంధ్రుల మేనా మనం?

లేకపోతే, గంజామాంధ్ర భూభాగాన్ని ఒరిస్సాలో కలపడానికి వల్లకా దని తీవ్ర మైన ఆందోళనం సాగిస్తూ వున్న వారు మన ఆంధ్రులు కారా?

* * * *

పర్లాకిమిడిరాజాగారికి మహాలంగా రాయబారం వెళ్ళిన మన రాజులు మాత్రం యేమాలోచించారూ?

పర్లాకిమిడిరాజాగారు తమకు తోటి సభ్యులా? సహచరునికి సాయం చెయ్యడం తమకి ధర్మమా?

అయితే ఆంధ్రులు తమ కేమవుతారు? ఆంధ్ర దేశంతో తమ కెలాంటి అనుబంధం వుంది?

తమ తోటి సభ్యుల జాతికి చెందిన ప్రదేశాన్ని ఆక్రమించడానికి ప్రయత్నించడం తప్పని, ద్రోహమని, అసభ్య మని ఆ పర్లాకిమిడిరాజాగా రాలోచించరేం? కొంచె మేనా జంకరేం?

వారు తా మెలాగేనా ఒరిస్సారాష్ట్రంలో చేరా లని చూస్తూన్నట్టే తమ తమ జాతివారి నెలాగేనా తమతోటే వుంచుకోవా లని చూడరేం?

* * * *

ఎలాంటి జాతికి ఎలాంటి గాట్లు వచ్చాయీ! ఎలాంటి ప్రతిభ యెంత మందగించి యెంత కలుషితం అయిపోయిందీ?

ఇప్పుడు మనం ఓఢ్రులతో డీకొనగలమా లేమా అనే విషయం వేరు. వారిని ప్రతిఘటించడమూ మానడమూ అనే విషయం కూడా వేరే,

"మనం యెవళ్ళం? ఆంధ్రదేశం అంటే యెక్కణ్ణుంచి యెక్కడికి? ఆంధ్రు లంటే యెవ రెవరు?"

మన మిప్పు డీప్రాతిపదికదగ్గిరికి పోవాలి. తరాలకి తరాలు, శతాబ్దులికి శతాబ్దులు అఖండవైభవం అనుభవించిన మన పూర్వుల అభిమానమూ పట్టుదలా, ధైర్యసాహసాలూ యెలాంటివో తెలుసుని మనం వాట్ల నిప్పుడు ఆవాహన చేసుకోవాలి.

తరుణ ఆంధ్రమా! మేలుకో. ఇరుగు పొరుగుల వారు నిన్ను చూసి నవ్వుతున్నారు. నిన్ను భావదాస్యంలో ముంచేస్తున్నారు. నిన్ను తమ ఉన్నతిసాధానికి సోపానపరంపరగా ఉపయోగించుకుంటూన్నారు. లే. నీ ఆభిజాత్యాన్ని ప్రకటించుకో. నీ సంప్రదాయాన్ని వెల్లడించుకో. ఆంధ్రు డంటే కొదమసింగ మని బోధపడేటట్టు సింహనాదం చెయ్యి.

## ఆత్మబలం యెరగని సలహా

౧౯౩౩ జూన్ ౨౨వ తేదీని బెజవాడలో వొక బాల్యవివాహం జరిగింది. వధువు యెనిమి దేళ్ళ పసిబిడ్డ. వరుడు పదిహేనేళ్ళ పిల్లాడు. ఈ సందర్భంలో వొక పెద్దమనిషి కేసు పెట్టడమూ, కృష్ణాజిల్లా మాజస్ట్రేటు వియ్యంకుల కిద్దరికీ యేడేసి వందలూ, వియ్యపురాళ్ళ కిద్దరికీ నూరేసీ, పురోహితుల కిద్దరికీ మూడేసి వందలూ మొత్తం ౨౨ వందల రూపాయల జరిమానా విధించడమూ సక్రమంగా జరిగిపోయాయి.

దీనిమీద వ్యాఖ్యానం చేస్తూ (౨౫-౩-౩౪) ధర్మసాధని యిలా అంది.

"........ఈ జరిమానాలు మొదట కనిపించినను వివాహవిషయమున వధూవరుల కుండదగు స్వయంనిర్ణయాధికారమును పాటింపక అభమశుభ మెరుగని పసిపిల్లలపై సంసారభారమును మోపిన మహా నేరమునుబట్టి చూచిన నవి యెంత మాత్రమును యెక్కువ యనిపింపవు. బాల్యవివాహనిరోధశాసన మున్నను అది నేడు దాదాపుగ నామమాత్రమే యై యున్నది కొద్ది జరిమానాలకు జనులు లక్ష్యపెట్టుట లేదు. బందరు జిల్లా మాజస్ట్రేటు మార్గము ననుసరించి యితరమాజస్ట్రేటులు గూడ హెచ్చు జరిమానాలను విధించినచో బాల్యవివాహముల సంఖ్య త్వరగా తగ్గిపోగలదు"

నిజంగా, యిలాంటి బాల్యవివాహాలను మేమే సందర్భంలోనూ అంగీకరించలేము. అలాగే సనాతనధర్మవాదుల అనేకకృత్యాలను సమర్థించడాని క్కూడా మేము సాహసించలేము; కాని యీ వ్యాఖ్యానంలో ధర్మసాధని చూపించిన తర్కం మాత్రం చాలా అసభ్యంగా వుంది.

హిందూ సంఘంలో బాల్య వివాహాచారం వొక్కటే గాదు, మాన్పించవలసిన దురాచారాలింకా అనేకా లున్నాయి. వాటి నన్నిటిని సంస్క-

రించి జాతిని మళ్లీ నిర్మిస్తే గాని మనకి స్థిర మైన మోక్షం లేదు. అయితే ఈ పునర్నిర్మాణం సాంఘికంగా జరగవలసిందే; కాని శాసనాల ఆధారం వల్ల జరగరాదు. ఏమంటే? ఇప్పటి శాసనసభ్యులలో అనేకులకు సాంఘికశాసనాలను సభలో ప్రవేశపెట్టడానికి గాని, సమర్థించడానికి గాని చివరికి వోటు చెయ్యడానికి గాని అర్హత లేదు. అందుచేతనే యీ బాల్యవివాహనిరోధశాసనం జల్లెడ లాగ ఛిద్రబహుళమై, ఇటు సంస్కారపక్షంవారికీ, అటు సనాతనధర్మపరాయణులకూ గూడా అసంతృప్తికరమై, తనకి తానే అగౌరవకరంగా తయారయింది. ఇట్టి శాసనాలను ప్రజలమీద ప్రయోగించడం చాలా అపాయకర మైన విషయం.

ప్రౌఢావివాహాలను వ్యాప్తిలోకి తేవడమే ధర్మసాధని వుద్దేశ మని మాకు తెలుసు. ఈవుద్దేశం చాలా న్యాయధర్మసమ్మత మని, తెనుగు దేశంలో గార్హస్థ్యం ప్రేమభరితమై వుండా లన్నా, ధర్మసమ్మతమై వుండా లన్నా, సర్వవిధాలా బలిష్ఠ మైన భవిష్యత్పౌరజాతిని నిర్మించడానికి తోడ్పాటు కలదై వుండా లన్నా యుక్తవయస్సు వచ్చిన వధూవరుల యిష్టం మీదే వివాహాలు జరిగే ఆచారం ప్రారంభం కావా లని మేము చెప్పగలం. కాని ప్రజలలో బాల్యవివాహాచారాన్ని తగ్గించడానికి యిలాగ సహింపరాని జరిమానాలను విధించవలసిం దని అధికారులను ప్రోత్సహించడం బాధ్యత యెరిగిన సలహాలలో చేరదు.

కఠినకారాగారశిక్షలు విధించీ, భరింపరాని జరిమానాలను విధించీ సర్కారు, మన కిప్పటిస్థితిలో వినాశకర మైన శాసనోల్లంఘనోద్యమాన్ని అణచివెయ్యగలిగినట్లే యిలాగ బరువైన జరిమానాలను విధించి బాల్యవివాహాచారాన్ని గూడా అణచివెయ్యవచ్చు; కాని దీనివల్ల సంఘంలో కల్లోలాలు పుడతాయి. కక్షలు పెరుగుతాయి. సనాతనధర్మపరాయణులకు నోరు లేదు గాని సంఖ్య అధికంగానే వుంది. వారంతా సరియైన కట్టుబాటుతో ప్రచారం సాగించా రంటే రాజకీయంగా యేపక్షానికి చెందినా శాసనసభలో మెజారిటీ సంపాదించి యిలాంటి శాసనాలను రద్దు చేయించగలరు. కొత్త వాటికి ప్రవేశం లేకుండా చెయ్యగలరు. ఇంతకీ: సంస్కారపక్షంవారిలో గూడా వొక దాకీ తెన్నూ లేదు. ఆత్మవిశ్వాసం లేదు. దృఢదీక్ష లేదు. ఏకాగ్రత లేదు. తరఫీయతు కూడా యేమీ లేదు. సౌమ్యపద్ధతులను ప్రయోగించి అపజయం దాకా రాలేదుమూ. సారింపులో తమ శక్తి నంతా వినియోగించి కూడా చూడ లేదు. వారు ప్రజలలో యేవిధ మైన ప్రచారమూ సరిగా చెయ్యలేదు. ఈ స్థితిలో మొట్టమొదటే వారిలాంటి శాసనాలను నిర్మించి తొందర తొందరగా తీవ్రప్రవృత్తితో ప్రయోగించవలసిం దని సలహా చెప్పడం శోచనీయంగా వుంది.

అనేకసన్నివేశాలను పురస్కరించుకుని ఇవాళ మన సంఘం అంతా గజగజలాడిపోయివుంది. ఏశాసనమూ లేకుండానే అమానుషా లైన చాలా కట్టుబాట్లు సడలిపోతున్నాయి. వితంతువివాహాలు సామాన్యా లయిపోయాయి. సముద్రయానం అలవాటయిపోయింది. రజస్వలావివాహాలూ, శాఖాంతరవివాహాలూ, వర్ణాంతరవివాహాలూ—మతాంతరవివాహాలూ గూడా జరుగుతూ చెల్లిపోతున్నాయి ఇంకా యెన్నో మంచి మంచి ఆచారాలు జరుగుతున్నాయి. ఇలాగ సంఘం అంతా సంస్కరణపరాయణులకు అనుకూలంగా వుంది. ఈసందర్భంలో వారు తగిన దీక్షతో, దృఢ మైన పట్టుదలతో ప్రచారం ప్రారంభించా రంటే ఆశ్చర్యకరా లయిన ఫలితాలు కలుగుతాయి. ఇపుడు సంస్కర్తలు చెయ్యవలసిన పని అభిమానంతోటీ, అనుకంపతోటీ, ప్రేమతోటీ, ఓపికతోటీ ఉపదేశమూ, బోధా చెయ్యడం గాని ఆత్మబలం యెరగని యిలాంటి సలహాలు కావు.



## ఆంధ్రులు— హిందీ

ఈ ఫిబ్రవరి ప్రబుద్ధాంధ్ర పత్రికలో "ఆంధ్రులు ఆంధ్రము" అను వ్యాసమున శ్రీ భా. వెం. కృష్ణారావుగారు ఆంధ్రోద్యమము అందు ముఖ్యముగా ఆంధ్రభాషాభివృద్ధి విషయమున మనవారు అశ్రద్ధ వహించుచున్న సంగతి వివరించి, ఇకముందైనను ప్రమత్తతను విడనాడి కార్యశూరులు కావలెనని చక్కగా నుద్బోధించిరి. కాని యీ సందర్భమున ఆంధ్రుడు హిందీభాషను వ్యాపింపజేయ యత్నించుట నిజముగా పరమమూర్ఖ మగుచున్నా దనియు ఇంగ్లీషువలె హిందీకిని బానిస యగుచున్నా డని వ్రాసి, హిందీప్రచారముచే ఆంధ్రభాషాభివృద్ధికి హాని కలుగుచున్నట్టు లభిప్రాయమును దెల్పిరి. మనవారు ఆంధ్రభాషాజ్ఞానమునకై కృషి చేయక కేవలము హిందీప్రచారమునకే ప్రయత్నించుచో అందుచే స్వభాషకు నష్టము కలుగుట నిజమే; కాని హిందీప్రచారకుల భావ మది కాదు. మన స్వభాష లందు కృషి చేసుకొనుచునే వీలైనంత వరకు హిందీని జాతీయభాషగా వ్యాపింపజేయవలె ననియే హిందీప్రచారకుల యుద్దేశ్యము. దేశాభిమానులు, తమ తమ ప్రాంతమం దభిమానమును, ప్రాంతాభిమానులు దేశాభిమానమును విడనాడ నవసరము లేదు. ఇట్లే జాతీయభాషాభిమానమును, స్వభాషాభిమానమునకు భంగకరము కాగూడదు. సామాన్యభాష యనగ మన ప్రాంతీయభాషను నశింపజేయున దను భావము తప్పు. ఇతరరాష్ట్రముల వారితో కలిసి వ్యవహరించుటకును, వ్యాపారాదుల యభివృద్ధికిని, జాతీయతాభివృద్ధికిని సామాన్యభాష ఆవసరము. యూరోపుఖండమున స్వతంత్రరాజ్యపు ప్రజలు కూడ సామాన్యభాషావశ్యకతను గమనించి ఇంగ్లీషు జర్మను మొదలగు వారిలో చాలామంది జనులు ఫ్రెంచిభాషను నేర్చుకొనిరి. అందుచేతనే సామాన్యభాష యనుటకు "Lingua Franca" అని వాడుక వచ్చినది. అట్టి స్థితిలో ఏకదేశీయులమగు మనలో సామాన్యభాష లేకుండుట అనేక అనర్థములకు కారణముగా నున్నది. మఱియు వాఙ్మయజ్ఞానాభివృద్ధికి గూడ సామాన్యభాష అవసరము. మన దేశభాష లగు బంగాళీ, హిందీ, మరాఠీ గుజరాతీ, అరవము మొద లగు వానిలో అనేక ఉద్గ్రంథములును పత్రికావ్యాసములును మన దేశీయులచే వ్రాయబడుచున్నవి. వానిలో చాల కొద్దిగ మాత్రమే ఇంగ్లీషుభాషలోనికి తర్జుమా యగుచున్నవి. మన దేశీయుల ఉద్గ్రంథము లుయిటీవల సామాన్యభాష యగు హిందీలోని కనువదింపబడుచున్నవి. ఇప్పుడు స్వభాషకు తోడు హిందీ కూడ నేర్చుకొని మన దేశభాష లన్నిటిలోని మంచి గ్రంథముల సారమును గ్రోలగలుగుదుము. మఱియు వీలైనంత వరకు హిందీలోని ఉద్గ్రంథములను పత్రికావ్యాసములను మన స్వభాషలోని కనువదించి స్వభాషావాఙ్మయమును గూడ వృద్ధిచేసుకొనవచ్చును. హిందీప్రచార మారంభించిన తరువాత హిందీలో నుండి కొన్ని మంచి గ్రంథము లాంధ్రీకరింపబడినవి. జాతీయభావవ్యాప్తి మొదలగు కారణములచే హిందీవాఙ్మయ మిటీవల నతివేగముగా వృద్ధిగాంచుచున్నది. అందువలన ముందు హిందీవాఙ్మయసహాయమున మన వాఙ్మయమును వృద్ధి నొందవచ్చును. మన ఆంధ్రములోని గ్రంథములకును పత్రికలకును తగు ద్రవ్యసహాయమును లేఖకసహాయమును లేకపోవుటకు మనలోని ద్రవ్యాధికులకును విద్యాధికులకును దేశీయవాఙ్మయమునం దభిరుచి లేక ఈ ఆర్థికదుస్థితిలో గూడ కేవలవినోదములతో కాలక్షేప మగుటయే ముఖ్యకారణము. హిందీ అభిమానులు సాధారణముగా ఆంధ్రమందును అభిమానము కలిగియే యున్నారు. వారిలో చాలమంది ఆస్తిపరులు కారు. ముఖ్యముగా శ్రీమంతులును ఆంగ్లవిద్యాధికులును సాధారణముగా వాఙ్మయమునకు ప్రోత్సాహ మొసగకున్నారు. ఆంధ్రసాహిత్యాభిమానులలో గూడ చాలమంది గ్రాంథిక వ్యావహారిక శైలిని గూర్చి యతివాదవివాదములలోను "నన్న

య వైదికియా నియోగియా" మొదలగు ప్రస్తుతోపకారులు కాని విషయములలో కేవలవినోదకవలలోను చాల వరకు తమ శక్తులను వృథపఱచుచున్నారు. భాషాభివృద్ధికి లేఖకులును పాఠకులును విశాలహృదయులు సంఘోపకారిభావపూరితులుగ నుండుట యావశ్యకము. లేనిచో వాఙ్మయమునకు నిజమగు అభివృద్ధి లేకపోవుటయే గాక అట్టి గ్రంథములకు పత్రికలకు జనాదరము కూడ తగ్గుట సహజము. పాఠకులకు సద్విషయములందభిరుచి గల్గించుటకు గూడ లేఖకులు వీలైనంత వఱకు యత్నించవలెను. ఈ సంగతి చాలమంది గమనింపకపోవుటచేతనే వాఙ్మయము సంకుచితమగుచున్నది. ఇంగ్లీషునకు వలె హిందీకిని ఆంధ్రులు బానిసలగుచున్నారనియు, ఇది ముందు మన ఊపిరాడకుండ జేయుననియు కూడ శ్రీకృష్ణారావుగారు తమ వ్యాసమున సూచించిరి. ఈసందర్భమున ఇంగ్లీషునకును హిందీకిని గల భేదము గమనించుట అవసరము. ఇంగ్లీషు పరభాష. ప్రస్తుతమున్న రాజకీయపరాధీనత తప్పినచో ఇంగ్లీషుతో మన దేశపు జనసామాన్యమునకు జోక్యముండదు. ఇంగ్లీషువారి నాగరకత మనదానికి వ్యతిరిక్తము. మఱియు దాని అక్షర, శబ్ద, వాక్యముల రచనాదులే గాక ఆభాషయందలి భావముల పద్ధతి కూడ మన ఆంధ్రభాషపద్ధతికి కేవలము వ్యతిరిక్తము. కాని మన దేశభాషలకు చాల వఱకు పరస్పరసంబంధము కలదు. హిందీ యిదివరలోనే కోట్లకొలది మన దేశీయులకు స్వభాషయగుటయే గాక చాలవఱకు ఇతరప్రాంతీయులకు గూడ తెలిసిన భాష. హిందీ, హిందూస్థానీ తెలిసిన మార్వారీలు, బొందిలీలు, మహమ్మదీయులు మొదలగు వారు మన ఆంధ్రదేశమునందు గూడ ఇదివరకే చాలకాలమునుండి వ్యాపించి యున్నారు. మఱియు ఆంధ్రదేశము చిరకాలము మహమ్మదీయ పరిపాలన క్రింద నుండుటచేతను, ఇప్పటికిని నిజాం రాజ్యమందలి షుమారు 80 లక్షలమంది ఆంధ్రులు హిందూస్థానీనే అన్ని లౌకికవ్యవహారములకును తప్పక వాడుచు, స్వభాష యగు ఆంధ్రమున గూడ చాలవఱకు హిందూస్థానీపదములనే వాడుచుండుటచేతను, వారితో వీడని సంపర్కము గల మన వాడుకభాషలో కూడ అర్జీ అసల్, కసరత్, కిమత్, కిరాణా, కిస్తీ, ఖాతా, ఖులాసా, గస్తీ, గల్లీ, చందా, చంచా, మామూల్, జరూరు మొదలగు వందలకొలది హిందీ హిందూస్థానీ పదములు ఇదివరకే ఆంధ్రపదములుగా వాడబడుచున్నవి. మఱియు ఆంధ్రము ప్రథమమున ద్రావిడకుటుంబపు దైనను, మన వాఙ్మయప్రారంభమునుండియు సంస్కృతభాషామూలముగను ఆర్యనాగరకతద్వారాను వృద్ధినొందుటచేతను అరవవారిలో వలె గాక ఆంధ్రులలో ఆర్యరక్తమధికముగ నుండుటచేతను సంస్కృతప్రాకృతపరిణామ రూపమును ఆర్యావర్తీయుల ముఖ్యభాషయు నగు హిందీకిని ఆంధ్రమునకును శబ్దజాలపు వాడుకలోను భాషావిషయమునను వాఙ్మయవిషయమునను చాల సామీప్యము కలదు. మఱియు ఆర్యావర్తము వారికి మనకు ఒకే నాగరకత యగుటచే ఇంగ్లీషు సంపర్కము వలన కలుగు భావదాస్యము హిందీసంపర్కమువలన కలుగదు. మఱియు ఇంగ్లీషువలె గాక హిందీ నేర్చుకొనుటకు విశేషవ్యయప్రయాసలు అక్కఱ లేదు. అందుచే దానిని స్త్రీలును పల్లెటూళ్లలోని జనులును సులభముగ నేర్చుకొనుచున్నారు. అమెరికాసంయుక్తదేశము, స్విట్జర్లండు, రష్యా మొదలగు కొన్ని దేశములలో గూడ మన దేశమందువలెనే ఆయాభాగములందు వేరువేరు ప్రాంతీయభాషలు వాడుకలో నున్నవి. వాటికిని ప్రత్యేకవాఙ్మయములున్నవి. అయినను జాతీయసౌకర్యముల నిమిత్తమై ప్రాంతీయభాషల వారు తమ స్వభాషలను తమ ప్రత్యేకవాఙ్మయమును విడనాడకయే సామాన్యభాషను నేర్చుకొని అందలి వాఙ్మయపు లాభమును గూడ పొందుచున్నారు. మన దేశపరిస్థితిని బట్టి మనమును అట్లే జరిగించుట యుక్తముగా కనపడుచున్నది.

కొమాండూరి శఠకోపాచార్యులు,

# ప్రబుద్ధాంధ్ర

కలాభివర్ధనీపరిషత్తుపక్షమున ప్రకటింపబడు మాసపత్రిక

సంపాదకుడు:—శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

సంపుటము ౫ } రాజమహేంద్రపురము మెయి ౧౯౩౪ { సంచిక ౫


## మొదటి దాడి


సుబ్రహ్మణ్యశాస్త్రి—సంపాదకుడు




"నువ్వింత పిరికిపంద వైపోతా వనుకో లేదు నే నెప్పుడూను"

"..................."

"సిగ్గు లేదూ?"

"అ దెలా వుంటుందో యెరుగుదువా నువ్వు?"

"మాటలు నేర్చావు"

"..................."

"స్కూలు ఫైనల్లో తప్పిపోయినప్పుడు చదువు మానేస్తే నా కీయేడుపు లేకపోవును. బి. ఏ. అని పించుకునీ కూడా యింత అమ్మమ్మ వైపోయినందుకు నేను విచారిస్తున్నాను"

"క్షమించు"

"ఆమాట తీసెయ్యి నాదగ్గిర......నిన్నేం చేసినా నాకసి తీరదు"

"..................."

"జోన్ ఆఫ్ ఆర్కు లాగా, మిస్ నైటింగేలు లాగా జీవితం సఫలపరుచుకోవా లని ఉవిళ్లూరే దానవు. "మళ్లీ పెళ్లో అంటూ యేడుస్తా" వని నన్ను కోసుకు తినేసేదానవు. ఇప్పుడీ వాలకం యేమిటీ?"

"..................."

"పెళ్లిమీదికి పోతోందా యేమిటి చూపు?"

"ఈవయస్సులో ఆకోరిక పుట్టడం తప్పా?"

"ఛీ! బుద్ధి లేని పీనుగా!......మళ్లీ మొగాడి చేతికి జుట్టందిస్తావుటే?"

"మొగాళ్లు నాకు చేసిన అపకారం యేమిటీ?"

"వెధవముండని చెయ్యలేదూ?"

"తరవాత ఆచేత్తోటే బి. ఏ. దాకా చదువు చెప్పించలేదూ?"

"వెధవరికం తప్పిందా?"

"పెళ్లి కాని మా మూడో చెల్లికీ నాకూ భేదం యేమిటీ?"

"దానికుండే గౌరవం నీ కెందుకు వస్తుందీ?"

"..................."

"క్రోరచూపులు చూస్తే నా కేం భయ మనుకున్నావా?"

"బి. ఏ. అయినవాళ్లకందరికీ ఆత్మగౌరవం అంటే యేమిటో తెలుస్తుం దనీ, తప్పకుండా వుంటుం దనీ అనుకుంటున్నాను నేను. నా వూహ తప్పే"

"పెద్దపెద్ద మాటలు విడిచిపెడుతున్నావు"

"ఆవిషయంలో నీతో నాకు పేచీ లేదు"

"అబ్బో............"

"................"

"చివరి కే మంటావూ? మాత నిన్నూ నన్నూ పిలుస్తోంది"

"వినపడుతోంది—కొంచెం—కొంచెం"

"కొంచెం కొంచెమా?"

"అవును. అంతే"

"హృదయం అంటూ వుంటే ఆ కొంచెమే చాలు"

"................"

"మరి రావేం?"

"................"

"మాట్లాడ వేమే?"

"................"

"ని న్నే మనాలో నాకు తోచడం లేదు"

"వూరుకోరాదూ?"

"నిన్ను విడిచిపెడతా ననుకున్నావు కామోసు పాపం"

"................"

"జెయి లంటే భయమా?"

"జెయిలుకి వెళ్లడమే ప్రధానమా?"

"అది దేశాభిమానానికి యేకమాత్ర మైన గురు"

"రాజకీయంలో దిగితే అంతే కావచ్చు"

"ఇప్పుడు రాజకీయం తప్ప మరో సమస్యే లేదు మనకి"

"నే నలా అనుకోడం లేదు"

"నువ్వెంతటిదానవు? నీ తెక్కేమిటి? నీ అభిప్రాయానికి విలువ కూడానా?"

"................"

"మహా మహా వాళ్లంతా యీ ప్రవాహంలో పడి కొట్టుకుపోతున్నారు. నీ తాహ తెంత నీ హాయా మెంత?"

"నీ ధోరణే నీదీ, అలాగే నా రుచే నాదీ అనుకోరాదూ?"

"నీకు రుచంటూ కూడా వొక టేడిసిందా?"

"................"

"ఇక నేను నింపాదిగా మాట్లాడలేను. వస్తావా రావా? అగ్నిహోత్రంలో వురుకుతావా, వురకవా?"

"నే నురికే అగ్నిహోత్రం వేరు"

"పొయిదగ్గిర పడి యేడవడమూ, పశువులాగ పిల్లల్ని—"

"నోరు సమాళించుకో. నువ్వెవరితో మాట్లాడుతున్నావో తెలిసే—"

"ఇప్పటికి వస్తోంది కామోసు పౌరుషం"

"వొక మూల మొగాళ్లని తిడుతూ మళ్లీ పౌరుషమో అంటూ యేడుస్తావేం?"

"................"

"................"

"నీతో మాట్లాడడం తప్పే నాది"

"తరవాతి మాట కూడా అనేసెయ్యి"

"అసలు నీమొగం చూడ్డమే మొదటి తప్పు"

పళ్లు కొరుకుతూ యిలా అని సుభద్ర తారాజువ్వలాగ లేచింది. చీడీలు దిగేటప్పుడు రంగూన్ స్లిప్పర్లు బెసికిపోగా తూలి ముందుకి పడ్డంత అవస్థ అయింది; కాని ఆమె చాలా ప్రయత్నంమీద ఆపుకొని కోపానికి వుడుకుమోత్తనం జోడించగా తోకతొక్కిన ఆడతాచులాగ రోజుకుంటూ చక్కాపోయింది.

౨

జానకమ్మ, సాయంత్రం ఆరు గంటల వేళ డాబామీద పచారు చేస్తూ, అప్పుడే తల అంటుకొని వుండడంవల్ల యింకా తడిగానే వున్న జుట్టు ఆరదీసుకుంటూ "ఏమిటీ చెయ్యడం?" అని ఆలోచించుకుంటూ వుండగా సుభద్ర వచ్చి, యిలాగ తర్జనభర్జన చేసి, మనస్సు కలిచేసి వెళ్లిపోయింది.

కానైతే జానకమ్మ చాలా గంభీరురాలే; అయినా పక్కా పావు గంట దాకా ఆమె మనస్సు స్తిమితపడ లేదు. ఈలోపుగా చీకటి

పడింది. దీపం లేదు. పైగా తల్లి రెండు మూడు మాట్లు పిలిచింది; కాని ఆమె యివ్వేమీ గమనించ లేదు. "ఏమిటి చెయ్యడం?" ఇది వొక్కటే ఆమెకి ఆలోచన.

ఇప్పుడు రాజకీయంలో పని చేసే వారికి గల పలుకుబడి ఆమెకి తెలుసు. పైగా పినతండ్రి కూతు రైన సుభద్ర మూడు మాసాల శిక్ష కూడా అనుభ వించి రావడంవల్ల స్వర్గంలోనుంచి దిగివచ్చిన దేవ కన్యలాగ ఎక్కడికి వెళ్లినా చాలా గౌరవం పొందుతోంది. చివరికి వాలంటీర్లు గూడా మహారథి కులుగానే చెలామణీ అయిపోతున్నారు రాజకీయం లోకి దిగితే తనకిగూడా అలాగే అసాధారణాలైన ఆదరగౌరవాలు లభిస్తాయి; కాని యీ స్థితిలో కేవల రాజకీయ ప్రచారంవల్ల జాతికి దేశానికి మోక్షం కలుగుతుం దని ఆమెకి నమ్మకం లేదు. ఎన్నో వర్ణాలు, వొక్కొక్క వర్ణంలో యెన్నో శాఖలు, మళ్లీ ఆవొక్కొక్క శాఖలో యెన్నెన్నో తెగలు—వాటిలో కాలం యీడ్చుకొని పోయిన ట్లల్లా పోయే వాళ్లు కొందరు, సనాతన ధర్మవా దులు కొందరు, సంస్కార పరాయణులు కొందరు, వారిలో బ్రహ్మసామాజికులు, ఆర్యసామాజికులు— హైందవుని నెత్తిమీద ఎన్ని వెంట్రుకలో హైంద వులలో అన్ని భేదాలు, అన్ని స్వార్థదృష్టులు— ఇలాంటి స్థితిలో సంఘపునర్నిర్మాణాన్ని నిర్లక్ష్యం చేసి రాజకీయంలో తాండవం చెయ్యడంలో ఆమెకి సబబేమీ కనపడలేదు. ఆమెకి మొదణ్ణుంచీ సంఘసంస్కారం అంటే అభిమానం. ఆంగ్లవాఙ్మ యపరిచయమూ, కాలేజీలో పాశ్చాత్య స్త్రీల తోటీ, కన్యలతోటీ కలిగిన సాహచర్యమూ ఆమెకి రుచిని హెచ్చుచేశాయి. పైగా తొమ్మిదో యేట వితంతు వయిపోయి నిర్భాగ్యురాలుగా తలంప బడుతూ వుండడం కూడా ఆమె కీ దృష్టిని బలపరి చింది.

ఈదృష్టే ఆమెని వుద్యోగం కోసం కూడా ఆశ పడనివ్వలేదు. "మళ్లీ పెళ్లి చేసుకోడమో మాన డమో యే మేనా నిశ్చయించుకున్నావా?" అని తల్లి యే డెనిమిదిమాట్లడిగింది; కాని యీ దృష్టి వల్లనే జానకి "అప్పుడే తొందరేం?" అంటూ కాలం గడుపుకొని వస్తోంది.

అయితే సంఘసంస్కారంలో యెందుకు ప్రవే శించకూడదూ అంటే యేమిటి చెయ్యడం? "సంఘ: అంతా వొక్క మోస్తరుగానే యెగుడు దిగుడుగా వుంది. ఎక్కడా హెచ్చుతగ్గులు లేవు. వొక దారీ తెన్నూ లేదు. ఇందులో యెక్కడ దిద్దుబాటు మొదలు పెడితే యెక్కువ పని జరుగు తుందీ?" ఇదీ ఆమెకి ప్రశ్న. వొక్క సంవత్సరం నుంచీ—అంటే బి. ఏ. అయినప్పణ్ణుంచీ ఆలో చిస్తూనే వుంది; కాని ఆమె కేమీ పాలుపోలేదు. ఆమె గంటలకొద్దీ యోచిస్తుంది. ఎన్నో ప్రణాళి కలు పన్నుతుంది. ఎంతో వోపికతో కష్టసుఖాలు బేరీజు వేస్తుంది. మేలులో కీడెంచుతుంది. కీడులో మే లెంచుతుంది; కాని చివరికి "యిదీ పని. ఇదీ దారి" అని తేలదు. చేసిన యోచనా, పన్నిన కల్పనా—అన్నీ చిందర వందర అయిపోతాయి.

రోజూ రోజూ ఆమె కిదే అనుభవం.

దీనిమీద ఆమె యిలా నిశ్చయం చేసుకుంది.

"నాకు ఈశ్వరప్రేరణ అయింది; కాని యింకా తపస్సు చాలదు. నిశ్చయజ్ఞానం కలగడానికింకా మననం చెయ్యాలి. ఈశ్వరప్రేరణ స్ఫుటంగా అయిం దంటే యీ సంకల్పవికల్పా లుండవు. ఈసాధ్యాసాధ్య విచారమూ, యీకర్తవ్యాకర్త వ్యసందేహాలూ వుండవు. ఆస్థితి వచ్చిం దంటే ముందుకి వురకడం తప్ప మరేమీ వుండదు. వాళ్లనీ వాళ్లని చూసి "అయ్యో! ముందుకి వెళ్లిపోతు న్నారే" అని కంగారుపడితే లాభం లేదు"

ఇప్పుడు కూడా ఆమె సరిగా "యేమిటీ చెయ్యడం?" అని మననం చేసుకుంటూ వుండగా "జానీ!" అంటూ వొక యువకుడు పైకి వచ్చాడు. చేతిలో హరీకేన్‌లాంత రుంది. మొగమ్మీద ఆత్రం తొణికిసలాడిపోతోంది.

"ఎందుకురా బావా?"

"ఇప్పుడు సివంతు వచ్చింది. వున్న పాళంగా నువ్వు లేచి రావాలి"

"ఇదిగో సిద్ధం"

"దబ్బన్న మామగారి సుందరికి పెళ్లి"

"ఎవరూ చెప్పుకోలేదే?"

"అంతా రహస్యం—"

"పెళ్లికొడు కెవరు?"

"వేంకట సోమయాజులు తాత"

"ఏమిటీ?"

"దబ్బన్నమామ యాజులు తాతకి రెండువే లివ్వాలి. తాత ఆనోటిచ్చేశా డని పుకారు"

"సుందరిని అమ్మే డన్నమాట"

"అక్షరాలానూ, కాని అచ్చమ్మత్త కిది సుత రామూ యిష్టం లేదు. కూతుళ్ళు కూడా వొప్పుకో లేదు. సుందరి కంటికీ మంటికీ యేకధారగా ఏడు స్తోందిట. కాని కొడుకులు చిన్నవాళ్లు కావడంచేత నిలవతీసి అడిగేవాళ్ళు లేక దబ్బన్నమామ బండ కత్తాడు."

"పెళ్ళి యెక్కడా?"

"మనవూళ్ళోనే—గుళ్ళో—అదిగో బాజాలు వినపడ్డం లేదూ?"

"..................."

"అరగంటలో మూడు ముళ్ళూ పడిపోతాయి"

"అయితే పద. మూడు ముళ్ళూ పడిపోతా యేం? అబ్బా! ఏం లోకువగా వుంది ఆడాళ్ళ బతు కూ? ఈరోజుల్లో కూడా యింకా నరమాంసవిక్ర య మేనా? అందులోనూ షష్టిపూర్తి అయినవా డికా?........?

"నువ్విక్కడ ఆవేశం పొంది కూచుంటే—"

"ఇదిగో మేడ దిగేశాను"

ముందు జానకీ, లాంతరక్కడ వుంచేసి తర వాత యువకుడూ మేఘాల మీద యెగిరిపోయారు.

3

"దబ్బన్నా! నువ్వు "బహూ వృత్తమ" మైన ఘనంటి కర్మ చేశావు. మన అగ్రహారంలో యాజు లికి వున్నంత కర్మశ్రద్ధ యింకెవ్వరికీ లేదు. నువ్వు ఆతగాడికి సంఘటించిన ఆయోక్కయిది వుందే లోటు? అది తీర్చేశావు. "దశ పూర్వేషాం, దశా పరేషాం" అన్న సంకల్పం సివిషయంలో అర్థవత్తు అయింది"

"ఇంకా సందేహమా? వయస్సు తక్కువయి నా దబ్బన్న చాలా దీర్ఘాలోచన చేశాడు. "కర్తా కారయితా" కదూ? యాజులు అగ్నిహోత్రాలు నిలిపిన దబ్బన్నకి అశ్వమేధయాగఫలం లభించడా నికి యత్నించి త్తయినా అభ్యంతరం వుందిపోయి చయనులూ?"

"నింపాదిగా పృచ్ఛ చేస్తున్నావా నువ్వు? అస లు వాడి తాత సర్వతోముఖం చేసినవాడు కాదు షోయ్? ఆఫలం యావద్విష్టమూ వంశం పొడుగునా కనబడక యే మయిపోతుం దనుకున్నా వోయ్?"

"పైగా యాజులు అకారం సమీపిస్తూ వున్న వాడు; గాని "లాకాయి లూకాయిగాడు" కాడు. ఇహమూ, పరమూ గూడా—ఏ మంఘావు రా రామశాస్త్రీ?"

"తమరు సెల విచ్చింది అక్షరాలా—విన్నా రూ? వేదమూర్తులు అన్యథా సెలవిస్తారా మహాను భావా!"

"పైగా పిల్లా పీచూ—ఆవొక్క వితంతుపు త్రికా నున్న సంసారం అంతా చక్కబెడుతూ వుంటే నూత్నవధువుతో యాజులు—ఏం లోట య్యా సుబ్బావధాని?"

"చిత్తం, చిత్తం. ఆవొక్క వితంతుపుత్రికా గూడా నలభై దాటింది కనక దబ్బన్న కూతుర్ని— చిత్తగించారూ? చిలకని తయారుచేసినట్లు—మహా బాగా వుంది కాదూ అంతానూ?"

"అయ్యా! చయనులుగారూ! అవధానులుగా రూ! శాస్త్రులుగారూ! సుముహూర్తం సమీపిస్తోం దంటున్నారు సిద్ధాంతిగారు, సెల వయితే—"

“అవిగాలా వున్నాలేన్నీ? ఏదీ తెర బాగా పట్టుకున్నారూ? మరి కానిస్తూ దీక్షితులూ!”

జానకమ్మా, యువకుడూ వెళ్ళేటప్పటికి స్థితి యిలా వుంది. పెళ్ళికూతురు బుట్టలో కూచుని కుమిలిపోతూనే వుంది. లచ్చమ్మకూడా మధ్యమధ్య కళ్లు తుడుచుకుంటోంది. తతిమ్మా స్త్రీలు కూడా యేమంత వుత్సాహంగా లేరు. పెద్దలంతా వాగుడుతూ వున్నా దబ్బన్న కూడా కత్తి వేస్తే రక్తం లేకుండా కన్నంలో పట్టుబడ్డ దొంగలాగ ధైర్యం చేసి మొగమెత్తి చూడలేకుండా వున్నాడు.

పెద్దలు సెలవివ్వడంతోటే పురోహితుడు “అందరికీ అక్షింతలివ్వరా” అని శిష్యుడికి చెప్పి మంత్రాలు ప్రారంభించాడు.

ఇదంతా చూశాటప్పటికి జానకమ్మకి రక్తం వుడుకెత్తిపోయింది. శరసంధానం చేసిన ధనుస్సులా వున్న ఆమె కనుబొమ్మలు చూసి యువకుడు కూడా చకితుడయిపోయాడు.

“నువ్విప్పుడు చేస్తూ వున్న పనేమిటయ్యా యాజులు తాతా?”

“తరవాత మాట్లాడుకుందాం”

“ఆడాళ్లందరిలాగే నువ్వు కూడా చూస్తూ కూచోరాదుటే జానకీ?”

“అలాగటయ్యా చయనులు తాతయ్యా? నేను కూడా తెల్లపోయి కూచుంటే మీరంతా సుందరి మెడకి వురితాడు బిగిద్దామనుకుంటున్నారేం? ఈ పాటికి దిగండి గుర్రం. యాజులుతాతా! ఇది తరవాత మాట్లాడుకోవలసిన విషయం కాదు. ఇప్పుడే జవాబు చెప్పాలి నాకు”

“నాకా అవసరం లేదు.

“అయితే వున్నప్పుడే చెబుదువు గాని లే. తొందర లేదు. దబ్బన్న బాబూ! సుందరి నేం చెయ్య తలచుకున్నా వయ్యా నువ్వూ?”

ఇది విని “అమ్మయ్యా! బతికాను” అని లచ్చమ్మ తెప్పిరిల్లింది. జలసిక్తమైన గ్రీష్మలత లాగ సుందరి ఆశాభరితురాలై తల యెత్తి చూసింది. స్త్రీలంతా స్త్రీశక్తి అంటే యేమిటో మొకటి మాటు చూడగలిగారు. అరచచ్చి పడివున్న వాడిలాగ దబ్బన్న మాట్లాడలేకపోయాడు.

“మాట్లాడవేమయ్యా?”

“అంతా—సిద్ధ—మయి—పోయింది. ఇప్పుడింకేం చెయ్య—డానికి అవకాశం లేదు”

“జ్ఞానం వుంటే అంతా అవకాశమే. సుందరికి పెళ్ళి చెయ్యవలసిన పూచీ నీకు హెచ్చుగానే వుంది; కాని శవానికి అంటదీసి కట్టిపెట్టడానికి అధికారం లేదు”

“........ ........”

“బాగా ఆలోచించుకో”

“................”

“నీకు తోచకపోతే బుద్ధి కలవాళ్ళని సలహా అడుగు”

“................”

“వూరుకుంటే పనికి రాదు. ఈనాటకం అంతా యీపాటికి కట్టిపెట్టాలి. ఏమంటావ్?”

“మానడానికి వీల్లేదు. నువ్వు దూరంగా వుండు”

“నువ్వా నేనా దూరంగా వుండవలసింది? తొందరపడకు. ఏమమ్మా పిన్నీ! నీకెలా చేతులు వచ్చాయమ్మా చూస్తూ చూస్తూ పిల్ల గొంతు కొయ్యడానికి?”

“వొక్క మోస్తరుగా రాసిరంపాన బెడుతూ వుంటే నన్నేం చెయ్యమంటావు కూతురా?”

“అయితే నువ్వివతలికి వస్తావా రావా?”

“ఇంకేమయినా సరే; నువ్వు నా కోసరా దొరికావు గదా!”

ఇలా అంటూ కాళ్ళు కడుగు చెంబు అక్కడ విడిచిపెట్టేసి లచ్చమ్మ జానకమ్మ దగ్గిరికి వచ్చి నుంచుంది.

ఇదంతా చూసి అందరూ మాట్లాడలేకపోయారు; కాని దబ్బన్నమాత్రం అతికష్టంమీద నాలిక స్వాధీనం చేసుకొని “ఇలా వస్తావా రావా!”

అని వురిమాడు. దానికి "నేను రా" నంటూ లచ్చమ్మ ఝూంకారంగా జవాబు చెప్పి జానకమ్మకి యింకా దగ్గిరిగా వెళ్లింది.

"ముండిపీనుగా? ని న్నేం చేస్తానో వోపిక పట్టు. నువ్వు రాకపోతే ఆగిపోతుం దనుకున్నావు కాబోలు. నీ రవిక నామెళ్లో వేసుకొని—"

"సెబాస్! నీవంశప్రతిష్ఠ నిలిపావురా దబ్బన్నా!"

"అలాగ టయ్యా సుబ్బావధానులు ముత్తాతయ్యా? నిలపమూ మరీ దబ్బన్నబాబు మీ రంతా వెనక్కాల తాళం వేస్తూ వుంటేనూ?......పిన్ని రవిక మెళ్లో పెట్టుకొని కన్యాదానం చేస్తా వేం బాబూ నువ్వు?"

"వోక్ష దెబ్బని"

"అలా అయితే నువ్వుకూడా లేచి రా సుందరీ"

ఈ ఆజ్ఞ యింకా పూర్తి కాకుండానే నూత్నావేశంతో సుందరి బియ్యబ్బుట్టలో నుంచి దిగింది. అది చూసి యాజులు "ఆ, ఆ" అంటూ చేతులు చాపాడు; గాని యేడుపూ, రోషమూ కలిసిన విలక్షణస్వరంతో "ముసిలిపీనుగా" అని యీసడించి తిట్టి సుందరి వొక్క అంగలో ఆడాళ్లలో పడి జానకమ్మని కౌగలించుకుంది.

శిష్టు లంతా మొగమొగాలు చూసుకున్నారు. యాజులు దబ్బన్న కేసి చూడగా అతగాడు మొగం వంచుకున్నాడు. స్త్రీ లంతా నవశక్తి ఆవహించిన వారిలాగ గంభీరముద్ర వహించారు.

ఇటు కన్నెత్తి చూడగా జానకమ్మ వొకచేత్తో మార్కండేయుణ్ణి బుజ్జగిస్తూ, వొక చేత్తో శూలం యెత్తి యముడిమీద విసరబోతూ వున్న కాలాగ్ని రుద్రుడు లాగ భయంకరంగా—నిప్పులు కక్కుతూ చూస్తూ నుంచుంది.

౪

భజంత్రీల మంగళవాద్యాలతోటీ, పురోహితుని మంత్రపఠనంతోటీ, శిష్టుల ఛకారపకారాలతోటీ, స్త్రీల సన్నాయినొక్కులతోటీ మహాకోలాహాలంగా వుండవలసిన పెళ్ళిపందిరి చీమ రాలితే చిటుక్కుమనేటంత నిశ్శబ్దం అయిపోయింది.

పది నిమిషా లిలా గడిచాక నడుం విరిగిన నల్లతాచులాగ లేవలేక లేవలేక లేచి దబ్బన్న గుడిశనక్కాలకి పోయి కూలబడ్డాడు. తరవాత పరాభవఖిన్నుడై పెళ్ళితాత * గూడా వుత్తరద్వారంలో నుంచి బైటికి వెళ్ళి చెరువుగట్టుమీద తులసికోట దగ్గిర చదికిలబడ్డాడు.

ఆతరవాత పురుషులు కొందరు యాజులు దగ్గిరకీ, కొందరు దబ్బన్న దగ్గిరకీ వెళ్లి చుట్టూమూగారు.

యాజులు చయనుల్ని దగ్గిర కూచో మని "యేమంఘా" వన్నాడు.

"గట్టి చిక్కే వచ్చింది"

"ఆడదానికి లొంగిపోవలసిందే?"

"అది ఆడది షోయ్?"

"క్షముండ యెక్కడ దాపరించిం దోయి నా ప్రాణాలకీ? సిద్ధాన్నం—మళ్ళీ ఆరు మాసాల్లో పెళ్ళామనీ, యిల్లనీ—అంతా యెంత తల్లకిందులై పోయిందీ?"

"..................."

"ఎంత దారుణానికి వొడికట్టిందో చూశావా?"

"ఇంగ్లీషోయ్, ఇంగ్లీషు. అసలు ఆవిద్యలోనే వుంది ఆదారుణం. పైగా ఆడపీనుగులు కూడా బి. ఏ. లయిపోయాక యిక మనకి గతి యెక్కడయ్యా?"

"పుట్టగతు లుంఛాయా దీనికీ దీనబ్బకీనీ?"

"మహేంద్రసోమయాజుల మూటెత్తెను. వాడు పింఛన్ పుచ్చుకున్న డిపిటీ కలెక్టరూ. వాడు తలుచుకున్నా డంటే—"

"చంపావు. శారదాబిల్లు కూడా పైకెక్కుదీస్తాడో యేమిటో ఆ అప్రాచ్యుడు"

"వివాహం కానిదే మన కేం భయమూ?"

* వయస్సు మళ్ళిన వాణ్ణి 'పెళ్ళికొడుకు' అనడానికి వ్యావహారికాంధ్రభాషావ్యాకరణంలో అనుజ్ఞ లేదు.

"................"

"................"

"దబ్బన్న యే మంఛాడో?"

"నడుం విరిగిపోయింది"

"లాభం లే దంఛావా?"

"మొత్తానికి కష్టమే"

"వూరుకో మంఛావా?"

"వోపిక పట్టడమే నా సలహా"

"అయితే నా నోటు నాకు పారెయ్యి మను"

"అది నిజ మేనా?"

"అసలు పదమూడు వందలు. ఫాయిదా అయిదు వందల చిల్లర. మొత్తం రమారమీ రెండు సంచులు—"

"నాతో చెబితే దీ నబ్బ సమ్మంధం లేకపోదునా?

"వచ్చింది యిం తయింది గదా?"

"................"

"వొక మాటు వెళ్లిరా"

"రెండు రోజులు ఆగలేవూ?"

"ఇక వాడివల్ల కాదు. ఆ దిక్కుమాలిన పిల్ల నా కక్కరలేదు కూడానూ?"

"................"

"కానైతే నలుగురిలోనూ మాట పడిపోతుం దని భయపడేనా పెళ్లానికి నచ్చచెప్పుకో లేకపోతాడా అని ఆశగానే వుంది; కాని—"

"ఈసంగతి యిప్పుడే వెల్లడి అయితే జానకి మరింత పురెక్కుతుం దేమో?"

" అయ్యో "

ఈసమయంలో కంఠం సవరించుకుంటూ సుబ్బావధాని వచ్చి పక్కని కూచున్నాడు.

"ఏ మంఛాడు?"

"ఆడాళ్ల చిక్కు వొదిలించుకో గలిగితే తన అభ్యంతరం యేమీ లేదుష"

" ఏమిటీ?"

"రెండో మాట లేదు"

"వొకమాటిలా తీసుకురా గలవా?"

"కుపాక్కి కూడా అంద డిక వాడు"

౫

పురుషు లిలా కిందా మీదా యి దవుతూ వుండగా అక్కడ స్త్రీ లంతా జానకిని చుట్టవేశారు. "సిమూలాన సుందరి కి గండం తప్పిందే జానకీ" అంది వెంకటసుబ్బమ్మ. "మనం యిలా యెదురుకుంటూాంటే యీ మొగాళ్లేం చెయ్యగలరే?" అంది లక్ష్మీనరసమ్మ కళ్లు తిప్పుకుంటూనూ. "కాకపోయినా మన వూరు మరీ చెడిపోయిందే. మే మమ్మా మహామహా చదివేశా మని అవధాన్లవారూ శాస్త్రిలవారూ, సోమయాజులవారూ నానా మాలకూడా—యాక్కరాట! డోకొస్తోందర్రా తలుచుకుంటేనూ" అంది కామశాస్త్రిగారి పార్వతమ్మ "రెండువేల రూపాయలనోటు మీద పారేశారుషే సోమయాజులుగారూ దబ్బన్న చేతులు విరిచీ! ఆయన కిప్పుడు పెళ్లేమిటర్రా విపరీపు బుద్ధి కాకపోతేనూ? మంచో చెడ్డో యేదో వుండనే వుంది కదా అబోగందానితోటే ఆకాసకాలమూ గడిపేస్తే—" అని నీలన్నగారి సీతామహాలక్ష్మి అంటూ వుండగా చావలాంబ అడ్డు వచ్చి "యిప్పటి కిదీ కాస నయమే. వుంచుకున్న దాని మేళం తీసుకువచ్చారు కారు తాతగారు. అందుకు సంతోషించండి" అంది. దానిమీద అందరూ పకపకా నవ్వారు. ఆనవ్వులతో గుడి ఆవరణ అంతా గుమ్మయిపోయింది.

అప్పుడు పెళ్లితాత కూతురు రామలక్ష్మి సిగ్గుపడుతూ విచారిస్తూ ముందుకు వచ్చి "యిప్పుడీ పెళ్ళేమిటి నాన్నా?" అని నే ననేకవిధాల యేడ్చాను. కష్టసుఖా లన్నీ విప్పి చెప్పాను. ఎంత చెప్పినా ససేమిరా అంటే నే నేం చెయ్యనర్రా? ఇది మానేసి పోనీ పిల్లాణ్ణి పెంచుకో మన్నాను. ముందిది అయితే గాని అ దెలాగని నన్ను కొట్టినంత పని చేశాడు మానాన్న. "అయితే మీకర్మం" అని నేను చచ్చినట్టు పడివున్నాను. ఇంత

రగడ యెందుకు పెంగాలీ కర్మం కాకపోతేనూ?'' అంది కళ్లల్లో నీళ్లు పెట్టుకుని. అప్పుడు జానకి అందుకుని యిలా వుపన్యసించింది.

"రామలక్ష్మి మాటలు విన్నారా మీ రంతానూ? కాని మొగాళ్లం మన కేమని వీళ్లకి మహా అంద్రబ్బ ప్రబలిపోయింది. దీని కంతా కారణం మనమే. మనం భీష్మించుకున్కుంటే వీ శ్శేం చెయ్యగలరూ? మన శక్తి మనం మరిచిపోయాం. మన అధికారం మనం వొదులుకున్నాం. మనకి మనమే చేతులారా బానిసలై పోయాం. ఆడదాని బతుకు మొగాడి కాలికింద వుంది యిప్పుడు. ఇతరదేశాల్లో ఆడది మొగాడితో సమంగా బతుకుతోంది. మన తెలివితక్కువకి యీ వుదాహరణం చాలదూ? పైగా రామలక్ష్మి వెర్రిబాగులతనం చూడండి. తండ్రి నది యీ పెళ్ళి మానేసి పిల్లాణ్ణి పెంచుకో మందిట. కడుపున పుట్టిన తానుండగా యెక్కణ్ణుంచో వొక అంటుమొక్కని తీసుకురావడం యేమి? సీమలో కొడుకులు లేని తండ్రి చచ్చిపోతే ఆస్తి అంతా కూతుళ్లకి వెడుతుంది. యాజులు తాత లక్షరూపాయల సంసారి. అతని తరవాత యెక్కణ్ణుంచో వచ్చినవాడాస్తమ్మ అనుభవించడమూ, కడుపున పుట్టిన రామలక్ష్మి వాణ్ణి ఆశ్రయించి, వాడి పెళ్ళాం యీసడింపులు పడుతూ శవంలాగ బతకడమూనా?......మనలో యిలాంటివి చాలా వున్నాయి. అవన్నీ మీకు రోజూ బోధపరుస్తాను. నేను మన ఆడాళ్ల బాగు కోసమే నాజీవితం అంతా గడపాలని నిశ్చయించుకున్నాను. నేను వుద్యోగం చెయ్యను. మా అమ్మా, మా నాన్నగారూ ఇష్టమైతే పెళ్ళాడమంటూనే వున్నారు; గాని యిందుకోసం నేను పెళ్లి మానుకున్నాను. మన వూళ్లో మన ఆడాళ్లంతా యెంతెంత యమయాతన అనుభవిస్తున్నారో మీ రంతా యెరుగుదురు. అదంతా పోగొడతాను నేను. మీరంతా నాకు సాయం అయితే మీరే సుఖపడతారు''

ఇది విని అందరూ "అవునర్రా'' అంటే "అవునర్రా'' అన్నారు. నరసింహ చయనులుగారి మూడో పెళ్ళాం వెంకటరత్నమ్మ "మేమంతా రేపు మీ యింటికి వస్తాం, మంచీ చెడ్డా చెప్పమ్మా'' అనగా వెంకటశాస్త్రిగారి రెండో పెళ్లాం కృష్ణవేణి "రేపే అన్నమాటేమిటి? పని లేని పుణికింతాలు కల్పించుకుని శ్లేష్మంలో పడ్డ యీగలాగ కొట్టుకోడమే కాదూ యిళ్లల్లోనూ? రోజూ వెడదాం. మాకు సంగతు లన్నీ చెబుతూ వుండవే కోడలా'' అంటూ జానకి చెయ్యిపట్టుకుంది.

"అయితే మరీ మంచిది. మీకందరికీ నేను చదువుతూడా చెబుతాను. మధ్యాహ్నం రెండుమొదలు అయిదింటి దాకా యెవళ్లకీ పను లుండవు. మొగాళ్ళేం అడ్డుపెట్టినా మీరంతా మాయింటికి రావాలి'' అని జానకి వారికి ప్రోత్సాహం చేసింది.

అప్పుడులచ్చమ్మ జానకి రెండుచేతులూ పట్టుకుని "నువ్వీరాత్రి మాయింటో వుండవుటే కూతురా'' అని ప్రాధేయపడింది. సుందరి కూడా "రావుటే అక్కయ్యా?'' అని జాలిగా అడిగింది. దాని మీద జానకి అతిప్రేమతో సుందరి కణతలమీద మెటికలు విరిచి "మరి నేను చెప్పిన ట్లా వింటావా యెప్పుడూనూ?'' అని అడుగుతూ గభీమని చంకబెట్టుకుని ముందుకి అడుగు వేసింది.

# విభ్రమము

శ్రీ జమ్మలమడక మాధవరామశర్మగారు

రూపకములు పరస్పర మభినయాత్మత నభిన్నము లైనను నాయకభేదమున భిన్నము లగుచున్న వని "వస్తు నేతా రస స్తేషాం భేదకః" యని దశరూపకము పల్కుచున్నది. నాయకుఁడు శృంగారి యయిన నవశ్యముగ నాయికాప్రతిపాదన ముండును. యువతీవిషయికచర్యలు గ్రంథమున స్థానము గైకొనినపుడు లలితము లగు వారల గుణముల స్వభావములఁ జెప్పక తప్పదు. అందువలననే యాలంకారికులు తమ గ్రంథము లందు నాయికానిరూపణావసరమున దత్తద్భేదముల బరిగణించి వారి మాన్మథదశలను జెప్పి స్వాభావికహావభావాదులను, వికృతిజన్యభావాదులను నిరూపించుట యాచారముగ నున్నది.

విభ్రమ మనునది శృంగారభావములం దన్యతమము. దీని వికృతిజన్యత లక్షణమువలననే వ్యక్తమగుచున్నది. ధనంజయుడు "విభ్రమ స్త్వరయా కాలే భూషాస్థానవిపర్యయః" అని దాని లక్షణమును జెప్పుచున్నాడు. నాయిక యలంకరణాభిలాషిణియై శీఘ్రముగ నలంకరించుకొనుచున్నప్పుడు మన మన్యాసక్త మగుట భూషలకు స్థానవిపర్యయము గలుగునేని విభ్రమ మని లక్షణాభిప్రాయము. భూషలకు స్థానవిపర్యయము విభ్రమమె యగును; కాని యావిపర్యయ మన నెట్టిదో విచారణీయాంశము. ఇది యౌచితీసహిత మని మనము భ్రమనొందక సుదీర్ఘముగ నాలోచించితి మేని విభ్రమ తత్త్వమును గ్రహింపజాలుదుము. పరమముగ్ధ యగు యువతియు కళ్ళు మూసికొని యైనను మన మన్యాసక్త మగుట నవశ యైనను గడియమును జేతికి గంకణమును గాలికి ధరింపదు. ఉంగరమును మెట్టెగ జేయదు. కంఠెను మొలకు ధరింపదు. వలయమును మెడలో ధరింపదు. ఇవి లోకప్రకృతి యని సర్వలోకవిదితము. స్త్రీలు పరవశ లయినపుడు భూషావ్యత్యయము జరుగ దన సాహసింపను. కాని యది యౌచితీవిశిష్టముగ లోకసంభావ్యముగ నుండు నని మనవి. తొందర యగుటవలన నొకరివి వేరొకరు ధరింపవచ్చును. వామమంజీర మవామము కావచ్చును. దక్షిణకర్ణపూర మదక్షిణకర్ణపూరము కావచ్చును. ముక్కుల పుడకలు వ్యత్యస్తములు కావచ్చును. కజ్జలధారణాదులందు శలాకావిపర్యాసము గలుగవచ్చును. ఉత్తరీయపరిధానీయవ్యత్యయము సంభవింపవచ్చును; గాని మన యాలంకారికులు కొందఱు వర్ణించినటుల కాదని యావర్ణనలు ప్రకృతివిరుద్ధము లని లోకాసంభావ్యము లని యౌచితీరహితము లగుట నవిశ్వసనీయము లని హాస్యాస్పదము లగు నని నాయూహ. ఇట్టివర్ణనము సామాజికహృదయోద్వేగజనక మగును గాన వైరస్యాపాదక మయి వారి చిత్తవృత్తిని జర్వణోన్ముఖి మొనర్పలేదు. ఒక్కొక్కచో ననౌచిత్యము రసోద్బోధనసమర్థము రసపోషకము కావచ్చును; గాని ప్రకృతము చర్చింపబడు విభ్రమానౌచిత్య మెట్టి పోషణమును జేయలేదు. ప్రతినాయకాదిగతముగ ననౌచిత్యము ఘటింపబడినపు డది ప్రకృతరసప్రాతీపకము కాకపోవుట "బ్రహ్మన్నధ్యయనస్య నైష సమయ స్తూష్ణీం బహిః స్థీయతామ్" ఇత్యాదులందు దృష్టచరము. సజాతీయగతముగ ననౌచిత్యఘటనము ప్రకృతరసప్రతికూలము కాకపోదు. ఈవిభ్రమవర్ణన మనునది సజాతీయప్రతిష్ఠము. ఇందలి యనౌచిత్య ముద్వేగకరము. అలంకారములకు గుణములకు నుచితస్థానవిన్యసనమున నౌచితీవైశిష్ట్యముననే శోభ గల్గు నని లేకున్న నవి యాశబ్దవ్యవహార్యములు కాజాలవని క్షేమేంద్రుడు తన మహదాశయమును

"ఉచితస్థానవిన్యాసా దలంకృతి రలంకృతిః
ఔచిత్యా దచ్యుతా నిత్యంభవ న్త్యేవ గుణాగుణాః"

"అలంకృతి రుచిరస్థానవిన్యాసా దలంకర్తుం క్షమా భవతి. అన్యథా త్వలంకృతివ్యపదేశ మేవ నలభతే; తద్వ దౌచిత్యా దపరిచ్యుతా గుణాగుణతా మాసాదయన్తి. అన్యథా పున రగుణా ఏవ" అను గ్రన్థమువలన వ్యక్తము చేయుచున్నాడు. అనౌచిత్య ప్రతిభానమును గల్గు సామాజికోపహాసమునకు బర్యాప్తము కాగల్గుటయె విభ్రమకృత్య మని "ఉపహాసితు మేష ఇష్టః" యను రసమీమాంసయందలి జడ్యుపసామక గంగారామోక్తి నూతగా గొని పల్కిన "విభ్రమాయ నమో నమః" విభ్రమ ప్రయోజన మంతియు కాదని తత్త్వజ్ఞు లెరుంగుదురు. అలంకారికులు తమ గ్రన్థములందు విభ్రమము నేరీతి వర్ణించిరో, యెంతటి యౌచిత్య మం దున్నదో యందలి ఘటన రసపోషక మగుచున్నదో లేదో సహృదయులు ప్రజ్ఞాదృష్టితో జూడవలయును. అప్పారాయయశశ్చంద్రోదయమున (ఆణివిళ్ల వేంకటశాస్త్రిగారు దీనికర్తలు) విభ్రమలక్షణము.

"విభ్రమ స్త్వరయా కాలే భూషాస్థానవిపర్యయః" అనియే యున్నది.

దీని యుదాహరణము.

నిశమ్య కేళీశ రణప్రయాణం
అళీముఖా త్సమ్మదనిర్భరాంగీ।
కాంచీగుణం కంఠతలే న్యధత్త
బబంధ హారం జఘనే నృసింహ॥

అని యున్నది.

పర్వతజఘన ధరించు కాంచీవలయ మెంత యుండునో. కంబుకంఠమున నుండు హార మెంత వలయమును గలిగియుండునో యాభూషలు విపర్యయసహము లగునేమో సహృదయు లాలోచింత్రు గాత.

(2) హేమచంద్రుడు కావ్యానుశాసనమున "వాగంగభూషణానాం వ్యత్యాసో విభ్రమః" అను విభ్రమలక్షణమాత్రమునకు "వచనేఽన్యథా వక్తవ్యేఽన్యథా భాషణం హస్తే నాదాతవ్యే పాదే నాదానం రసనాయాః కంఠే న్యాసః" అను వృత్తినిగూఢ విస్పష్టముగ వ్రాసి

"ఏకాని కాంచి త్వరితచందనాంకే
కాంచీకలాపం స్తనభారపృష్ఠే।
ప్రియం ప్రతి ప్రేషితచక్షురన్యా
నితంబబింబే చ బబంధ హారమ్"

అని మూడవ భేదమునే యుదాహరించెను. వెనుకటి యుదాహరణమువలెనె యిదియు నున్నది. భూషావిపర్యయమార్గమును గూడ నితడు వృత్తిలో జూపినాడు. 3 విద్యానాథుడు భూషల విపర్యయమనె విభ్రమలక్షణముగ చెప్పి "శ్రుత్వా సఖీముఖా ద్దివసో విగత ఇతి సంభ్రమేణ వధూః హస్తయో ర్నూపురే చరణయోః కరోతి వలయాని" అని యుదాహరణమును వ్రాసినాడు. ఇచట నూపురవలయములకు సమానవలయత్వ ముండవచ్చునను నూహతో గవి వ్రాసియుండవచ్చును. కాని వలయములు చరణముల కెట్లు సరిపడునో సహృదయు లాలోచింపవలయును. (4) సాహిత్యరత్నాకరమున

"రామాసంగవ్యసనరభస
స్వాంతయా కాంతయా సీత్
పాణౌ హారో ఝడితి ఘటితః
కంకణం కంఠనాళే
కాంచీమాత్రం కచపరిసరే
కాంచనస్రజ్ నితంబే
లాక్షాలక్ష్మీ ర్నయనపలినే
కజ్జలం పాదపద్మే—"

అను నుదాహరణ మున్నది. ఈయది బాగుగ గుదిరిన దని కవి తలచి యుండును. ఇదివరలో వ్రాసిన పద్యములందు నాయిక లొనరించిన చేష్టలను నావర్ణనలను నేదో విధముగ (కష్టముగ సమర్థించుకొని) సంగీకరించినను నీపద్యమునం దెట్లు సమర్థింప నగు? కంకణము కంఠనాళమున నెట్లు పట్టును? కరమున హారము సంగత మగునా?

వెంటనే జారి యాభరణము ధృత మయిన దని యనుకొనుటకు గూడ నవకాశము లేకుండ పడి పోకుండునా? కంకణములే కృశకరమున జారినవని.

యామి న యామీ తి ధవే
వదతి పురస్తాత్ క్షణేన తన్వంగ్యాః
దలితాని పురో వలయా
న్యపరాణి పున స్తథైవ గళితాని.

మొదలగు పద్యములు చెప్పుచున్నవే. లత్తుక కండ్లకా? కాటుక పాదములకా? మూడు కాటుక భరణుల కాటుక యయిన నొక పాదమునకు జాలదే ఎట్లామగువ సరిపుచ్చుకొనినదో?

సాహిత్య దర్పణము నిర్ణయసాగర యంత్రము ద్రితగ్రన్థమున.

త్వరయా హర్ష రాగాదేః దయితాగమనాదిషు।
అస్థానే విభ్రమాదీనాం విన్యాసో విభ్రమోమతః

అని లక్షణమును.

కృత్వా యాంతం బహిః కాంత
మసమాప్య విభూషయా।
ఫాలేంజనం దృశో ర్లాక్షా
కపోలే తిలకః కృతః॥

అని రత్నాకరో దాహరణ సమృశో దాహరణ మును గలదు. ఇట్లాలంకారికుల గ్రన్థములనే కాక గొన్ని కావ్యములందును నౌచితి లేని యుదాహర ణములు గన్పించుచున్నవి. మాఘుని కావ్యము 13 సర్గలోని.

రభసేన హారపద దత్తకాంచయః
ప్రతిమూర్ధజం నిహితకర్ణ పూరకాః।
పరివర్తితాం బరయుగా స్సమాపతన్
వలయా, కృతశ్రవణ పూరకాః స్త్రియః॥

శ్రవణ పూరకములు వలయాకరణము నొందునా? యని సహృదయు లాలోచింపవలయును. ఆంధ్రా లంకారిక గ్రంథములందును నిట్టి లక్ష్యములు కన్పడుచున్నవి. అనంతామాత్యుని రసాభరణమున. "సంభ్రమమున దొడిగెన్ గరముల నందె యలంగాళ్ల గరవలయములన్." అని ఉదాహరణము గలదు దీని యుపపత్తి యెట్లో విచారింపవలసిన భారము పాఠక భ్రాతలపై నున్నది. కవుల గ్రంధ ములందును నిట్టివి గలవు.

"అన్నులమిన్న యొూరు వసు
ధాధిపనందను జూడగోరి వా
ల్గన్నుల గుంకుమంబు నొస
లన్నకజ్జలమున్ ధరించి లో
నెన్న గరాని తత్తరము
హెచ్చగ నచ్చగ రాజపద్ధతిన్
గ్రన్నగ వచ్చె దాని గని
గామిను లందరు నవ్వి రొక్కటన్"

(రసికజన మనోభిరామము 1—18—89)

బిరబిరి యొూర్తు మురియపు
పేరు వలగ్నమునన్ ఘటించి కే
లుంతపు చన్నుదోయి నొన
గూర్చి రయంబున జూడ వచ్చె.

(మనుచరిత్ర 6—14)

కవు లందరు నిట్టి పద్యములనే రచించి రన సాహసింపను.

రమ్య తరములు నుపపన్నము లగు నుదాహరణ ముల నాలంకారికులు గూడ రచించిరి. భాను దత్తుడు రసతరంగిణిలో.

త్యక్తే కేళివిధౌ నిజాంశుకధియా
పీతాంబర స్యాంశుకం
పద్మాయాః పరిధాయ సద్మశయనాత్
ప్రాతః ప్రయాంత్యా బహిః
ఆదాతుం వసనాంచలం చపలయన్
కోపం దృశా దర్శయన్
వాచా కౌతుక మాచరన్ స్మితసుధా
స్నిగ్ధో హరిః పాతు నః॥

అని యుదాహరించెను. ఇచట వస్త్ర వ్యత్యయము జరిగినది. ఇం దనౌచిత్యము ప్రతిభాసమగుట లేదు. మాఘునిపై యుదాహరణమున గూడ

"పరివ్రత్తాం బరయుగాః" యనునది యెంతయు రమ్యతరము.

నరస భూపాలీయగత మగు.

అదన నృసింహభూమిరమ
ణాగ్రణి వచ్చిన సంభ్రమంబుతో
సుదతి నభోవలగ్నమున
జుక్కలపేరిటి కంఠమాలయున్
బాదలు కుచాచలంబుల స
ముజ్జ్వలమేఖలయున్ ధరింపగా
నది క్రమ మయ్యె దొయ్యలికి
నక్రమ మయ్యె విలాసశేఖరిన్.

అను పద్యమున రెండు భూషణములకు సమానవలయత్వ మంగీకరించి సమర్థింపదలచి నపుడు కృశమధ్యమున గంఠమాలయు గుచాంచలముల మేఖలయు నుంట నంతగా నుపపత్తిహీనము గాదు. అయినను హారమును గటిపై ధరించుట ఎట్లు పొసగునా యని సంశయము. ఒడ్డాణము వలె దీని తగిలించుటకు దగినట్లుగా జుక్కలపేరిట కంఠమాల లప్పటిలో నిర్మింపబడెనను నిశ్చయము మన కున్నపుడు నభోవలగ్నముల నట్టె వాని ధరించుటలో సందియ ముండదు. తీసి తగిలించుటకు తగియుండుటలు వానికి లేనపుడు మాయీ యాక్షేపము ప్రసక్త మగును. "ముత్తియపుపేరు వలగ్నమునన్ ఘటించి" యను వసుచరిత్ర పద్యఖండమునకు వ్యాఖ్యాత యభిప్రాయాను గుణముగ "ముత్యాల హారము నడుమున దోపుకొని" యను నర్థము నే యొప్పికొందు మేని ప్రసక్తాక్షేపము పరాస్తమగును. ఈ విభ్రమోదాహరణములందు దరచుగ ప్రాచీను లుట్టంకించిన యభిప్రాయము నె నవీనులు వాడుచున్నారు. ఇందు ప్రదర్శించిన యుదాహరణము లందే "హారమును గటిపై ధరించుట, మేఖలను మెడలో ధరించుట, లాక్షాద్రవ్యమును నేత్రముల బెట్టికొనుట, కాటుకను పాదముల బెట్టుకొనుట, వలయములను గాళ్ల ధరించుట కడియముల (అందియల) కరములకు దగిలించుట" యను నవి సాధారణముగ నన్నిటియందును గానవచ్చుచున్నవి. ధర్మసూరి, విశ్వనాధ, మాఘ, భానుదత్త, కూచిమంచి తిమ్మకవుల పద్యములందు బూర్వపు వర్ణన లున్నను గొంత నూతనత గన్పించుచున్నది. ప్రభువు పట్టణమున బ్రవేశించునపుడు స్త్రీ లలంకరింప దలచుట, యాయలంకరణ కృత్యమున వ్యత్యయము జరుగుట ఇదియే అన్నిటియందును గల సందర్భము. భానుదత్తుని పద్యమున నూతనతాభివ్యక్తి యున్నది. విభ్రమవర్ణన మాచారముగ బెట్టుకొని కవులు వర్ణించినట్టుగ దోచుచున్నది. ఆలంకారికులు లక్షణకర్తలగుట వారు పై యుదాహరణముల దీసికొని యుందురు. ఉచిత ప్రతిభాన ముండగా ననుపపన్నత్వశంక యుత్పన్నము కాదని విభ్రమతాహానిని దలపరాదు. ఔచితీ సహిత పద్యభావచర్వణాసమకాలమున భూషణములకు స్థానవ్యత్యస్తత్వాకృతమగు జమత్కారము సామాజికపు టెద నుత్పన్నము కాకమానదు. ఔచిత్యము ప్రతిభాసమగుచు నుండునట్లుగా భూషావ్యత్యస్తత్వ మున్నచోట విభ్రమత్వభంగము లేదు. ఇచట నొకటి యాలోచింపదగిన విషయము. భూషణవిపర్యయము భ్రాంతిచే జరుగును. భ్రాంతి సాదృశ్యమూలక మని సర్వప్రతిపన్నము. సమానాకారత్వ పరిమాణతాదు లున్నపుడే సదృశజ్ఞాన ముత్పన్న మగును. కథితోదాహరణములందు సాదృశ్యమూలక భ్రాంతి యేయే యాభరణములందు గలుగుట కవకాశము గలదో భావుకసోదరులు భావింపవలయును.

క్షేమేంద్రుడు విభ్రమోదాహరణములం దుచితత్వభంగము నుపలక్షించియే.

"కంఠే మేఖలయా నితంబఫలకే
తారేణ హారేణ వా
పాణౌ నూపురబంధనేన చరణే
కేయూరపాశేన వా।
శౌర్యేణ ప్రణతే రిపౌ కరుణయా

నాయాంతికే హాస్యతాం
ఔచిత్యేన వినా రుచిం ప్రపనుతే
నాలంకృతి ర్నో గుణః ॥

అను శ్లోకము నుదాహరించినాడు.

భాషాస్థాన విపర్యయత్వమే విభ్రమలక్షణ మనుట యపర్యాప్తము. హేమచంద్ర భానుదత్తాదులు చెప్పినట్లు వచన విపర్యయము, అంగ విపర్యయము (హస్తే నాదాతవ్యే పాదే నాదానం) అను నట్లు కూడ విభ్రమమే యనుట యుక్తము. ఇందువలన గోత్రస్ఖలనము విభ్రమ గృహీతము కాగలదు. రసమీమాంసకర్తయు దన ఛాయాటీకలో "అన్యదీయ నామగ్రహణ ప్రసంగే న్యదీయ నామగ్రహణం విభ్రమకః" అనుచున్నాడు. దీనికి,

పద్మే త్వన్నయనే స్మరామి సతతం
భావో భవ త్కుంతలే
నీలే ముహ్యతి కిం కరోమి మహితైః
క్రీతో స్మి తే విభ్రమైః ।
ఇత్యుత్స్వప్నవచో నిశమ్య సరుషా
నిర్భర్త్సితో రాధయా
కృష్ణ స్తత్పర మేవ తద్వ్యపదిశన్
క్రీడావిటః పాతు వః ॥

అనునది యుదాహరణము కాగలదు. అంగవ్యత్యయరూప విభ్రమమున కుదాహరణ మన్వేషింప నగును. కవులు రసజీవితభూత మగు నౌచిత్యము చ్యుతము కాకుండునట్లు రచనల జేయుట రసస్ఫురణహేతు వగును. అనౌచిత్యము కూడ రసపోషక మగు నని తలంచి యంతట యుక్తాయుక్త విచారణ లేక ననౌచిత్యమును ఘటింపవలయు ననుట మహానర్థదాయకము. ఔచిత్యభంగమునవే మహాకవులకు గూడ నాలోచనాశూన్యత్వము కల్పిత మయినది. వ్యంగ్యసర్వస్వభవన మని తలంపబడు "భ్రమ ధార్మిక విస్రబ్ధః" అను కారికలో ననౌచిత్యము నుట్టంకించి మహిముఁడు దూషించినాడు. కావున సహృదయులు ఈ వ్రాతల జూచి వెంటనే యాపగారాని యుద్వేగమును బొందక తత్పరిశీలన మొనర్చుచు,

("తస్మా ద్యత్నేన కర్తవ్యం
కావ్యం రసనిరంతరమ్ ।
అన్యథా శాస్త్రవిద్గోష్ఠ్యాం
తత్స్యా ముద్వేగకారకమ్ ॥

అను శృంగారతిలక కర్త వాక్యమును దమ సుహృదయమును భావన చేయుచు లోక కల్యాణమును బరానందమును గూర్ప బ్రయత్నించుట యుచితము. శ్రేయము.)



# తగినశిక్ష

## శ్రీ శేషాద్రి రమణకవులు

భరతఖండమునఁ గల యితరప్రదేశముల కంటె మహారాష్ట్రదేశము భక్తపూజనమున నగ్రగణ్యము. నిజానందస్వామి మహోత్సవము ప్రతిసంవత్సరము కఱ్హాడులో మహావైభవముగ జరుగును. త్యాగధనుఁడు శివాజీచక్రవర్తి తన బొక్కసమునుండి వలసినంత ధన మా యుత్సవ వ్యయములకుఁ బంపుచుండును. ఉత్సవదినములలో నిజానందస్వామి సమాధిచెంత గల శిలామండపము లన్నియు జనాకీర్ణములై యుండును. ఒకచోట భజనములు, ఇంకొకచో హరికీర్తనము, ఒక యెడ ఉపన్యాసములు

ఇంకొకయెడఁ బురాణకాలక్షేపములు ఎచటఁజూచిన భక్తిరసప్రవాహమున భక్తు లోలలాడుచుందురు. అవతారపురుషుఁ డగు నిజానందుని లీలల స్మరించుచు ఆమహానుభావుని దివ్యచరిత్రామృతము గ్రోలుచు భక్తులు కర్హాడనగరము నామహోత్సవదినములలో భూలోకస్వర్గముగఁ దలంతురు.

ఒక్కొక్కతఱి శివాజిచక్రవర్తియు నుత్సవమును సందర్శింప సముచితపరివారముతోఁ బాదచారియై నిజానందుని సమాధికడకు వచ్చి సామాన్యజనునివలె వర్తించును. ప్రత్యేకపరిచయము గలవారు దక్క సామాన్యులు శివాజిని గుర్తింపఁజాలరు. నిరాడంబరుఁడును భక్తిరసమగ్నుఁడు నగు భక్తులలో నాఁడు శివాజి యొక భక్తుఁడు. ఒక గాయకుఁడు. ఒక ధర్మోపన్యాసకుఁడు. ఒక వేదాంతి. ఇంతేయేల? ఒక సామాన్యభిక్షుకుఁడని గూడఁ జెప్పవచ్చును.

నిజానందుని సమాధి కర్హాడనగరమునకుఁ గొంత దూరమునఁ గలదు. చెంగట నలుకెలంకుల విశాలమగు శాద్వలముగలదు. దాని కన్నివైపులఁ బటకుటీరములు నిర్మింపఁబడెను. నడుమ నొక వేదిక వైచి దానిపయి నొక విచిత్రమగు తివాచి పఱచి నిజానందుని చిత్రపటము నటనుంచిరి. ఆ వేదికచుట్టును మూగియున్న ప్రజలసంఖ్య గణనాతీతము. ఆ వేదికపయి నొక మహాత్ముఁడాసీనుఁడై భజనగావించుచుండెను. ప్రజలందఱు తన్మయులై భజన గావించిరి. అనంతరము నృత్యము గావించెను. ప్రజలందఱు నృత్యము గావించిరి. తరువాత కక్షపాల లోనుండి యొక లిఖితగ్రంథమును దీసి మనోహరస్వరముతో గాన మొనరించి సభ్యుల నుద్దేశించి చెప్పఁదొడంగెను. నాఁటి ప్రసంగమున నావక్త నోటినుండి పరిశుద్ధమగు గ్రాంథిక మహారాష్ట్రభాషలో జీవన్ముక్తుఁడు, నవవిధభక్తులు, ఆత్మనివేదనము, సాధుసందర్శనము మున్నగు నపూర్వవిషయములు బయలు వెడలెను. ఆసమావేశమునఁ బాల్గొన్న యితరదేశస్థులను విషయ మవగతమగుటకై వక్త తన యభిప్రాయమును కర్ణాటాంధ్రభాషలలోఁ గూడ సంగ్రహరూపముగ నుపన్యసించెను.

ఆపరమ భక్తుఁడెవఁడు? ఆజీవన్ముక్తుఁడెవఁడు? ఆ లోకోద్ధారకుఁ డెవఁడు? వాక్కులలో నమృతము, ముఖమున నిష్కళంక మగు ప్రేమరసము, అవయవములలో నిండు జవ్వనము నిండారు నాయోగి స్వస్తిపలికి నాటి యుపన్యాసము ముగించి యొందేని చనెను. జనసమూహములో నున్న ముప్పది మంది బాలసన్న్యాసులు జయ జయ, మహావీర, జయజయ సమర్థరామదాస, జయజయ యనుచు జయనినాదములతో వెంట నేగిరి. సింహభల్లూకవ్యాఘ్రాది క్రూరమృగశరణ్యమగు నొక పర్వతరాజమునకే యోగి బృందము జేరి యనంతర మదృశ్యులైరి. సభ్యులందఱు తమ ముందు ధర్మోపన్యాస మొసంగిన మహాత్ముఁడు శ్రీసమర్థ రామదాసస్వామి యనియు నాఁటియుత్సవమునకు శివాజిచక్రవర్తి రానికతన నాయన యరుదెంచి ప్రజలఁ బవిత్రులగావించెనని సంతసించిరి. ఏ మహాత్ముని దివ్యబోధనమునకై శివాజి సామ్రాజ్యమును వదలి నెలల తరఁబడి యడవులఁదిరిగి సందర్శించి ధన్యుఁడయ్యెనో ఎవఁడవతారపురుషుఁడని యశేషజనులచేఁ బ్రశంసింపఁబడుచుండెనో ఆ లోకోత్తరమూర్తి రామదాసస్వామి యుత్స్వాగతులకు దర్శనభాగ్యము సమకూర్చి నాటి నిజానందమహోత్సవమునకుఁ జీవము గల్గించెను.

౨

రామదాసస్వామి యింత దనుక నిచట నుపన్యసించి యంతర్హితుఁడయ్యెనను వార్తవిని సాధువులు సంతులు, సన్న్యాసులు భక్తులు మహాత్ముని వెదక నలుకెలంకుల బయలుదేరిరి. శివాజిని సందర్శింప సజ్జనగడమునకుఁ బోవుచుండ నోపునని కొందఱు నగరబహిఃప్రదేశమున కేగిరి. కొందఱు కొండగుహాలు మఠములు గాలించిరి. కొందఱు సాధు

నిలయములం బరిశీలించిరి. లోకోద్ధారకుఁడగు రామదాసస్వామి యునికియే యొకరికిం దెలియలేదు. ఆయన యెచట విశ్రమించెనో భిక్ష యెచట స్వీకరించెనో యీ యర్ధరాత్రము నెందు జేరెనో యని ప్రజలు చెట్టుకొకరు గుట్టకొకరై వెదకఁజొచ్చిరి. ఎచటఁజూచిన రామదాసస్వామి దివ్యనామస్మరణమె! ఎటఁ గాంచిన రామదాసస్వామి నన్వేషించు యోగి సముదాయమె లెక్కకు మిక్కుటమయ్యెను. ఈ నేల యీనినటులున్న యోగి బృందములో రామదాసస్వామి యెవఁడై యుండునో యెవరు నిర్ణయింపఁగలరు. నిజానందమను యుత్సవమంతతో నాగి యది రామదాసస్వామి యన్వేషణగా మారిపోయెను.

మిట్టమధ్యాహ్న మాయెను. రామదాసస్వామి కొఱకు వెదకి వేసారిన యోగిగణము గ్రామములకుఁ జేరుచుండెను. కొందఱు ముందుగా సజ్జనగడమునకుఁ బోతిమేని శివాజీని దర్శింపనేగు రామదాసస్వామిని జూడనగునని త్రోవయనక డొంకయనక రాజమందిరము నభిముఖముగా నడుచుచుండిరి. ఈ యలజడి యంతయు జూచుచు శిష్యులకుఁ బరమార్థ రహస్యముల నుపదేశించుచు నొక యోగి చెంతగల సెలయేట స్నానాదికృత్యములఁ గావించుకొని యొక్క జొన్నచేని మధ్యగల కాలిబాటను బోవుచుండెను. అపరిపక్వ బుద్ధులగు శిష్యులకు గురూపదేశమునకంటె జొన్నచేనే యుత్సాహకరముగ నుండెను.

శిష్యులందఱు గురుని సమీపించి “ఇప్పటికిం బదిగడియలకంటెం బ్రొద్దెక్కువ యెక్కినది. ఎండ తీవ్రతరముగఁ గాయుచున్నది. ఉపవాసలోలురగు తమ సంగతి మేము తెలుపఁజాలము గాని మాకు మాత్రము కాళ్లు తడబడుచున్నవి. దుస్సరమగు క్షుద్బాధచే నవయవములు శక్తిహీనము లగుచున్నవి. ఈచేనిలోనికిం బోయి జొన్నకంకులఁ దినుట కాజ్ఞ యిండు. లేకున్న బ్రదుకఁజాలమని బ్రతిమాలుకొనిరి. గురుని హృదయము కఱిగిపోయెను. బాలురు సుకుమారులు నగు శిష్యులు తీవ్రతరోపవాసములచేఁ గృశించుచున్నారు. సజ్జనగడమునకేగి శివాజీ నృపుని ధర్మసత్రమున విందారగించు వఱకుఁ బ్రొద్దు తిరుగును. అంతవఱకు వీరలాగఁజాలరు. సజ్జనగడము ఇంక నెంతలేదనినను దూరము ప్రయాణము, పోనిమ్ము. కంకులఁ దినుమని యానతిత్తునా! ఈ క్షేత్రపాలు ధనము అన్యాయముగ నేను హరించినట్లగును. కర్తవ్యమెద్ది! అంతవఱకు వచ్చిన క్షేత్రస్వామిని దృష్టిపఱుపలేక పోవుదునా? యని యోగిశిష్యులకు బదులు చెప్పక చేనుకట్టపయిఁ గల ఱాతిపయిఁ గూర్చుండి జపము చేసికొనుచుండెను.

జొన్నచేను మంచి ఊఁచబియ్యపుఁ దరుణమున నుండెను సారవంతమగు క్షేత్రమగుటచేఁ గంకికి దోసెఁడుగింజలు రాలు నటులుండెను. ముప్పది శిష్యులు చేను నలుగెలంకులఁ దిరిగి పరువమగు కంకుల మోపుదెచ్చి యొక సమప్రదేశమునఁ గూర్చుండి గింజలుదీసిరి. భిక్షాపాత్రములలో నూచబియ్యము పోసికొని సంతోషముగా నందఱు నములుచుండిరి. యోగీశ్వరుఁడీ శిష్యులచర్యల పయి లక్ష్యముంచక సమాధిమగ్నుఁడై యుండెను. పొలముకాపు చేనిలోనికి వచ్చుసరికి శిష్యులు ఊచబియ్యము నములుట, చెంత కంకులు రాసిగనుంట, యీక్రియ యంతయు నడుపుచున్న పడుచుసన్యాసి శిలపయి కూర్చుండి జపము గావించుట గోచరించెను. సన్న్యాసుల త్యాగజీవితము, యోగీంద్రుని నిశ్చలస్థైర్యము నెఱుంగని యాకాపు చేతనున్న కఱ్ఱ విసరుచు బాలసన్యాసుల వెంటబడి దొంగలారా! నిలువుఁడు. మీచర్మము లొలిచెదను. మిమ్ము చేనికి బలిపెట్టెదను. పాఱిపోకుఁడని వెంటఁబడెను. శిష్యులందఱు చకితులై తలకొక దిక్కునఁ జెదరి పాఱిరి. కాపువాఁడు సన్యాసుల భిక్షాపాత్రములు పగులఁగొట్టి క్రోధముతీఱక ఒకసన్న్యాసినైనఁ గసి దీఱఁ గొట్టనైతినే యని చేను నలువైపులఁ దిరుగసాగెను.

మంచె చెంతఁగల నిలువుటాతిపయి గూర్చుండి సమాధినిష్ఠలోనున్న యోగీంద్రుని సమీపించి కాపు చాలసేపు పరుషభాషలాడెను. ప్రత్యుత్తరము రాలేదు. వీడె దొంగసన్యాసి. శిష్యులచేఁ జేనుదోయించి కొంగజపము జేయుచున్నాఁడు. వీనిని శిక్షించినఁగాని ఈ త్రోవను నడచు బాటసారులకు బుద్ధిరాదు. అని చేతిలోని కఱ్ఱతో యోగిచంద్రునియొడలెల్ల నెత్తురుక్రమ్మ కదుములుగట్టునటులఁగొట్టి కాపు వెనుకకుమఱలెను. దూరమునకుఁ బరుగిడినశిష్యులు వెనుదిరిగి తమదేశికుని నకారణముగాఁ గాపువాఁడు కొట్టినందులకు మిగుల వగచి ఒంటరిగానున్న నితని పొగరణఁపవలయునని కాపును గొట్టబోయిరి. యోగీశ్వరుఁడిది యంతయుఁజూచి శిష్యులనందఱఁ జేరఁబిల్చి బిడ్డలారా! క్రోధమునకు మీ పవిత్రహృదయములలోఁ దావొసంగకుఁడు. కొలఁదికాలములోఁ బశ్చాత్తాపతప్తుఁడై కాపువాఁడు తగుశిక్ష నొందకపోఁడు. వెనుకకుఁ దిరుగుఁడు. నేఁటి యీవిపరీతకథ మీ రెవరికి నెఱింగింపకుఁడు. గతమునకుఁ జింతింపకుఁడు అనుచు సజ్జనగడమునకుఁ బ్రయాణమయ్యెను.

ఒడలెల్ల రక్తముక్రమ్ముటచే యోగి నడచుటకశక్తుఁడయ్యెను. తూలితూలి పడుచుండెను. శిష్యుల యవలంబనముతో నెటులో గడియ కొక యడుగిడుచు భాధాలక్షణముల మొగమునఁ దోపనీక శరీరమును గాషాయముతోఁ గప్పుకొని యోగీశ్వరుఁడు శిష్యసహితముగ సజ్జనగడము చేరెను.

3

రామదాసస్వామి తీర్థయాత్రలకు జనోద్ధరణమునకుఁ బోయి చాలకాలమయ్యెను. శివాజిచక్రవర్తి గురువర్యుని వెదకుటకుఁ బరివారమును బంపెను. తాను స్వయముగ వెదకుటకు బయలుదేరెను. ఎటనుండెనో యెన్నఁడువచ్చునో తెలియదు. నాఁడు గూఢచారులు రామదాసస్వామి కర్హాడునుండి సజ్జనగడమునకు బయలుదేరెనని శివాజీ కెఱింగించిరి. శివాజి యానందమునకు మేరలేదు. గురువర్యుని సందర్శనభాగ్యము చిరకాలము పరితపించ నాఁడు లభింపనున్నది. ఎంతధన్యుఁడు. శివాజి యెంతధన్యతముఁడు.

శివాజి సపరివారముగా గురువర్యునెదుర్కొని కొనవచ్చుటకుఁ బురబహిర్భాగమునకుఁ జేరుసరికిఁ బరస్పర సమ్మేళనము జరిగెను. శివాజి నయనములనుండి యానందరసము ప్రవహించెను. ఒడలు పులకించెను. కంఠము గాద్గద్యము వహించెను. సువర్ణపాత్రములోఁ దెచ్చి గురువర్యుని పాదములు గడిగి యుత్తరీయముతోఁ దడియొత్తి శివాజి గురువర్యుని యడుగుజాడల ననుసరించి నడచుచుండెను. ప్రేమరసదృష్టితో శివాజినిజూచి మీఁదఁ జేయివైచి రామదాసస్వామి యిట్లు మధురస్వరమునఁ బలికెను.

“శివబాబా—ఒక భిక్షుకునికి గుప్పెడుగింజల గంజి బోయుటకింత యాడంబరము ప్రకటించుకొనవలయునా?”

“గురుదేవా? ఈ సామ్రాజ్యము నీది. నీ ప్రధానభటుఁడ నేను. వీరందఱు మీ పాదసేవకులు ఈరాజ్యమె భిక్షుకరాజ్యము. ఇందాడంబరమేమున్నది.”

“ఈ తేప దక్షిణభారతమును సమగ్రముగా దర్శింపఁ గలిగితిని. లోకవృత్త మెంతయో కనుగొంటిని”

“స్వామీ! మీ కసాధ్య మేమున్నది? నా ప్రార్థన మిది. మీకు నలుబదియేండ్లు దాటుచున్నవి. ఉపవాసవశమున మీ యొడలిలో రక్తమాంసములు తగ్గినవి. మొగమంతయు వాడిపోయినది. నడచునపుడు మాటలాడునపుడు ఏదో యశక్తత గోచరించుచున్నది. స్వామీ! ఈదీనుని కటాక్షించుచుఁ దాము నా జీవితశేషమువఱకైన సజ్జనగడమున వసింపరాదా?”

“శివబాబా! లుప్తమైన ధర్మమునుబునరుద్ధరించుట నా యాశ్రమధర్మము. నీ ధర్మము నీవు సక్ర

మముగా నిర్వర్తించుచున్నటుల నేనుమాత్రము నిర్వర్తింపవలదా? ఉండెకలసిన తపఃఫలమున నీయొద్దకాక యింక నే నెచట నుందును?"

ప్రసంగ మింకను జరుగుచునే యుండెను. రామదాసస్వామియు శివాజియు అభ్యంతరమందిరమున కేగిరి. శిష్యులందఱును భిక్షుకశాలకు వెడలిరి. ఏకాంతగృహమున శివాజియు రామదాసస్వామియుఁ గొంతసేపు మాటలాడుకొనిరి. ప్రజలసందడి తగ్గెను. నాఁడు బడలికగానున్నదని స్వామి శివాజి నిర్బంధముచే రెండు మూఁడు ఉద్ధరిణెల ఆవుపాలు త్రాగివిశ్రమించెను. శివాజికిఁ జాల యాందోళన కలిగెను. నేటి పరిచయమా గురుదేవునితో! బడలిక యేమి? మొగమేల వాడినది. మాటలలో నాయాసమేల? ఆ నిట్టూర్పులేమి? శిరోబాధకూడ నుండనోపు. ఎందులకుండెను. ఎన్నఁడైన వేళకు ఆహారమా? సంవత్సరమున కొకమారైన అభ్యంగస్నానమా? నాగురుదేవునకు స్వయముగ అభ్యంగస్నానము జేయించి బడలిక తొలగించెద నని శివాజి తలంచెను. పరివారజనము శివాజియాజ్ఞ వినుటయే తడవుగ స్నానమందిరమున నుచితవస్తువుల సమకూర్చిరి. శివాజి గురువర్యుని బలవంతపఱచి తన చనువునంతయు నుపయోగించి స్నానమందిరమునకుఁ గొనిపోయి తలయంటెను. తైలము ఒడలి నిండ రాయుటకై కాషాయవస్త్రము విప్పఁగా దేహమంతయు రక్తసిక్తముగ నుండెను. ఒకటి రెండు చోటులఁ జర్మముపగిలి రక్తము కాఱుచుండెను. ప్రతి భాగమునఁ గదుములు గట్టెను. లోకోద్ధారకుఁడు గురుదేవుఁడు నగు రామదాసస్వామికి శివాజికంఠమున జీవముండఁగనే యింత యపచారము కలుగవలెనా? స్వామీ! నీదేహమున నిట్లు దండఘాతముగావించిన పాపి యెవఁడు. స్వామీ! లోకపాలకుఁడవు. అవతారమూర్తివి యగు నిన్ను ఈస్థితిలోఁగాంచినజన్మ మీశివాజికింక నెందులకు? ఈయపచారము నేఁడు జరిగినదే? నారాజ్యపరిసరమున జరిగినదే? నా పౌరుఁడొనరించినదే? స్వామీ ద్రోహి నెఱింగింతురా? ప్రాణత్యాగము జేసికొందునురా! యని శివాజి సమర్థుని పాదము లొత్తుచుఁ బ్రార్థించెను.

సమర్థుఁడు చిఱునగవుతో శివాజిని జూచి శివబాబా! భక్తుఁడొకఁడు గురుపూజ యీవిధముగ నొనరించినాఁడు. ఇందు నీవాందోళన పడఁబనిలేదు. ప్రపంచాతీతులకు దూషణభూషణ తిరస్కారములు సమానములు. అని శివాజి నోదార్చెను. శివాజి వెంటనే భిక్షుకాలయమునకేగి శిష్యులను బ్రశ్నింపఁ జరిగిన సంగతియంతయుఁ బూసగ్రుచ్చినటులఁ దెలిపిరి. ఉగ్రమూర్తియై శివాజి భటులఁ జూచి రేఁపు తెల్లవాఱుసరికి నా గురుదేవుని శిక్షించిన క్షేత్రపాలకుని రాజసభకుఁ గొనిరండని యాజ్ఞాపించి గురుసేవ కరిగెను. శివాజి శిష్యుల వలన జరిగినసంగతి గ్రహించియుండుననియు రేపు దురదృష్టవంతుఁడగు రైతు శిక్షాపాత్రుఁడగుననియు స్వామి యూహించి యాప్రసంగము శివాజితలపునకు రానీక యభ్యంగక్రియలతో దినశేషము ముగింపజేసెను.

శివాజికా రాత్రి నిదురలేదు. తన గురుమూర్తికింత శ్రమ కలిగినందుల కాతఁడు తెల్లవారులు బరితపించుచు నిట్టూర్పులతోఁ బ్రభాతమంగళగీతములు జతచేసి శయ్యవదలెను. స్వామి నిర్విచారముగ నిద్రాసుఖము ననుభవించి తెల్లవారఁగనే శివాజిని జూచి శివబాబా! దీర్ఘజాగరణము గావించితివి కాఁబోలు. ప్రతిక్రియాకాంక్ష రాజులకలఁచునుసుమా? యని నవ్వుచుఁ బలికి కాల్యకృత్యపరులకై వెడలిపోయెను.

౪

రత్నఖచితమగు సువర్ణసింహాసనము చెంత కాషాయపతాకము నిలువఁబెట్టబడెను. ఆ రత్నపీఠముపయి కాషాయవస్త్రము బఱచి యందుఁ గౌపీనధారియగు సమర్థరామదాసస్వామి యుపవిష్టుఁడయ్యెను. చెంత నొక సువర్ణాసనముపయి రాజలాంఛనములతో శివాజి యాసీనుఁడయ్యెను. ప్రకృతి

వరము తమతమ తావులలో నధివసించిరి. అప్పటికి జాము ప్రొద్దెక్కియుండునేమో! రాజభటులా కాపువాని గొనివచ్చి రాజునెదుట నిలువఁబెట్టిరి. శివాజి వానిని జూడఁగనె న్యాయాధిపతులతో "ఈపాపి నా గురుమూర్తిని గొట్టినాఁడు. తగినశిక్ష విధింపుఁడు" అని పల్కెను. కాపు గడగడ వడఁకుచుఁ గన్నీరుగార్చుచుఁ దడబడునడుగులతో రామదాసస్వామి పాదములపయి వ్రాలి స్వామీ! క్షమింపుఁడు గడ్డిగఱచితిని. నాబుద్ధినశించినది. ప్రాణదానము గావింపుఁడని కంటికి మింటికి నేకధారగ నేడ్చుచుఁ గూలఁబడెను.

ధర్మశాస్త్రజ్ఞులు శిక్షాస్మృతిలోని శ్లోకములుదాహరించి రాజునకుఁ దభియోగఫలితము జేర్చిరి. శివాజి ప్రధానదండనాధికారికై వార్తనంపెను. కాపువాని ప్రాణములు నిలుపునఁబోయినవి. రామదాసస్వామి తన పాదములపయిగల కాపును లేవనెత్తి ఒడలిపయినున్న కాషాయవస్త్రముతోఁ దుడిచి కర్షకా! నీ క్షేత్రములు ద్విగుణముగా ఫలించుగాక. నీగృహము ధనధాన్యసమృద్ధిగా నలరారుగాక యని దీవించెను. అనంతరము సమర్థుఁడు శివాజిని జూచి రాజేంద్రా! అపరాధము చేసినది నావిషయమున — కానఁ దప్పునకుఁ దగిన శిక్ష విధింపవలసినది నేను. నాయాజ్ఞ నిర్వహింపవలసినవాఁడవు నీవు. అది నీ వంగీకరింతువా? యనెను. శివాజి, స్వామినిజూచి గురుదేవా! మీయాజ్ఞకు భిన్నము జరుగునా? మీరొసంగిన శిక్ష మీ కనులముందె యాచరింపబడును" అని పల్కెను.

శివాజి చేతులుకట్టుకొని గురుదేవుని యాజ్ఞకొఱకు నిరీక్షించుచుండెను. రామదాసస్వామి రైతుని నోదార్చి శివాజీబాబా! ఏక్షేత్రమునందు నన్నురైతు కొట్టినాఁడో ఆక్షేత్రమునంతయు రైతునకుఁ బుత్రపౌత్ర పరంపరగ ననుభవించునటుల మాన్యక్షేత్రముగా వ్రాసియిమ్ము. ఇదియే వీనికిఁ దగిన శిక్షయని పలికెను.

జయజయ శ్రీ సమర్థ రామదాస.

"కం॥ సురసాలము ఫలపుష్పో
త్కరమునుబరహేతుకముగ దానము సేయున్
నఱకెడువానికినైతము
దొరకించునుగాదె ఫలము తులసీదాసా."



# ప్రత్యేకాంధ్రరాష్ట్రము

కొమాండూరి శఠకోపాచార్యులుగారు ఎం. ఏ., బి. ఎల్

ఇటీవల ప్రత్యేకాంధ్రరాష్ట్రనిర్మాణమును గూర్చి తిరిగి చర్చయు ప్రయత్నమును జరుగుచున్నవి. భాషాప్రయుక్తరాష్ట్రనిర్మాణసూత్రము ఆంధ్రోద్యమమూలముననే ప్రాముఖ్యమునకు వచ్చినను మనవారి కన్న ఓఢ్రులకే ముందుగా ప్రత్యేకరాష్ట్రము నిర్మించుటకు ప్రభుత్వము పూనుకున్నందున ఆసందర్భమున ఆంధ్రదేశపు ఉత్తరసరిహద్దును గూర్చియు తన్మూలముగ మన రాష్ట్రసందర్భమును గూర్చియు చలనము కలిగినది. భాషను బట్టి రాష్ట్రము నిర్మించునప్పుడు సరిహద్దుప్రాంతము ద్విభాషాయుతముగ నుండుటచే అచ్చట తగాదాలు వచ్చుట సహజము. బిహారు ప్రత్యేకరాష్ట్రముగ జేయబడిన 1911 వ సంవత్సరం నుండియు వంగీయులధికముగా నుండు సింహభూమి జిల్లా మొదలగునవి బీహారులో చేర్చినందులకు అందులకుభయప్రాంతములవారు తగాదాపడుచున్నారు.

సరిహద్దువిభజన వ్యవహారములలో నెవరికిని పూర్తిగా తృప్తికర మగుట దుస్సాధ్యము. అందుచే గంజాంజిల్లాలోని కొందరాంధ్రులు ఓఢ్రరాష్ట్రములో జేరిపోవుట తప్పదు. కాని ఆంధ్రజనభూయిష్ట మగు ప్రాంతము లయినను ఆంధ్రప్రాంతముననే వుండునట్లు ప్రయత్నము చేయవలసియుండును. అధికారులు శ్రీమంతు లగు జమీందారుల సలహాలు మాత్రమే వినుట ప్రజాసామాన్యపు కేకలు వారి చెవులలోనికి జొరకుండుట పరిపాటి అయినది. అందుచే యీసమస్యాపరిష్కారము కేవలము జనసామాన్యపు అభిప్రాయముపయి ఆధారపడునట్లు కనబడదు. నూతనరాష్ట్రము నిర్మించునప్పుడు దాని ఆదాయము సమృద్ధిగా నుండుట ఆవసరము. అందుకై వీలైనంతవరకు హెచ్చు భూమిని ఆరాష్ట్రపు సరిహద్దులోనికి చేర్చుచుందురు. ఓఢ్రరాష్ట్రము వలెనే ప్రత్యేకాంధ్రరాష్ట్రము గూడ ఇప్పుడే నిర్మించుచో గంజాంమండలమందలి కొంత ముఖ్యభాగము ఆంధ్రరాష్ట్రమునందే వుంచుట న్యాయము అవశ్యకము అని ప్రభుత్వమునకు బోధపడును. అందుచే ఆంధ్రరాష్ట్రమును వెంటనే ఏర్పాటుచేయుము అని కొందరు కోరుచున్నారు. కాని కొందరు సందేహము చెప్పుచున్నారు. ఈ యేప్రియలు నెల ప్రబుద్ధాంధ్రలో "ఇప్పుడు మనకు ప్రత్యేకాంధ్రరాష్ట్రనిర్మాణం ఆవసరమా" అను శీర్షికతో ప్రచురింపబడిన వ్యాసమున ప్రస్తుతము కొంతకాలమువరకు మనము చెన్నరాష్ట్రములో కలసియే యుండుట మంచి దని ప్రత్యేకరాష్ట్రము మన కిప్పుడు వాంఛనీయము కాదని తుదకు తేల్చబడినది. ఇందుకు వారు తెల్పిన మొదటి కారణము, 'ఆంధ్రుల సంగీతము అరవదేశములో కూలిపోయి' పడివున్నందున యీలోగా ఆమెను ఆంధ్రదేశమునకు 'శుద్ధస్థితి'లో తెచ్చుకొనవలె నని; రెండవ కారణము తంజావూరు లైబ్రెరీలోని ఆంధ్రగ్రంథములకు మనము ప్రతులను వ్రాసి తెచ్చుకొనవలె నని; కాని మనకు ప్రత్యేకరాష్ట్రము ఏర్పడినంత మాత్రమున గాయకులు గాని లేఖకులు గాని ఒక రాష్ట్రమునుండి రెండవ రాష్ట్రములోనికి వెళ్ళి వెనుకటివలెనే పనులు చూచుకొనుటకు యెట్టి ఆటంకమును కలుగదు. రెండు రాష్ట్రములును ఒక రాజ్యముననే వుండును. బొంబాయి పూనా మొదలగు సలఘులవలెనే మన రాకపోకలకు గాని ఆదర మునకు గాని ఆటంకము వుండదు. ఆంధ్రరాష్ట్రము వచ్చిన తరువాత కూడ అనేక కార్యములకై దక్షిణ దేశమున కొందరాంధ్రు లుండకమానరు. మరియు ఆంధ్రదేశమున సుమారు మూడులక్షలమంది మాత్రమే వలసవచ్చిన (domiciled) దాక్షిణాత్యులు కలరు గాని ద్రావిడదేశమున ముప్పది లక్షల ఆంధ్రులు చెంగల్పట్టు మొదలు కన్యాకుమారి వద్దనున్న శుచీంద్ర గ్రామమువరకును వ్యాపించి వలసగా నున్నారు. ఆంధ్రరాష్ట్రము యేర్పడినను వీరిని మన దేశమునకు పంపివేయుట యసంభవము. నిరుద్యోగసమస్య తీవ్రముగా నున్న యీరోజులలో వారి నందరిని ఇక్కడకు తెచ్చుకొనుట మనకును సుఖకరము కాదు. అన్నిటికన్న ముఖ్యమైనది ఆంధ్రులు విస్మరించిన తమ పూర్వుల సచ్చారిత్రము సుగుణసంపత్తి తిరిగి అలవరచుకొనుటకై చెన్నరాష్ట్రముననే మన ముండవలె నని వ్రాయుచు తిరిగి ఆంధ్రులకు ప్రజ్ఞ సామర్థ్యము ఔదార్యము నాయకత్వము—వీటికి లోటు లే దని శ్రీకృష్ణారావుగారే యావ్యాసమున వ్రాసిరి. ఆశక్తి సంపదను యితర విధముల వినియోగించుచున్నా మని అట్లుగాక మన ప్రత్యేకోపయోగమునకై వినియోగించవలెనని వారు తెల్పిరి. అందుకు రాష్ట్రనిర్మాణము నిల్పించుటకన్న వెంటనే రాష్ట్రనిర్మాణము చేయుటయే యావశ్యకము. ప్రత్యేకరాష్ట్రనిర్మాణము కాగానే మన శక్తిని ముందుగా మన కార్యములకే వినియోగింతుము. ప్రస్తుతద్వంద్వప్రభుత్వమును జయప్రదముగ నడిపించి మద్రాసు రాజ్యాధికారము తమ చేత నుంచుకొని రని కృష్ణారావుగారు చెప్పిన యాంగ్లాధికారులు తమ యాంధ్రప్రాంతమునకు స్థిర మగు

నుపకారమేమియు నింతవరకును చేయలేరైరి. కొంద రున్నతోద్యోగు లగుట వారికి మాత్రమే లాభకర మగుచున్నది కాని వారు ప్రజాసామాన్యమున కుపకారము చేయగల్గుట లేదు. ప్రత్యేక రాష్ట్రమును నిలిపియుంచుటకు నిజ మగు కారణము పశ్చిమాంధ్రులు ఆంధ్రరాష్ట్రమునకు ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు విముఖులుగా నున్నా రని వారిని కూడా మినహాయించుచో మిగిలిన వుత్తరసర్కారులు మాత్రము ప్రత్యేకరాష్ట్రముగా నేర్పడుటకు వీలుండదు. అను నిరాశచే పశ్చిమాంధ్రుల బుద్ధి మారువరకు ప్రస్తుతము మనకు రాష్ట్ర మవసరము లేదని నిజభావము వారివ్యాసమున గోచరించుచున్నది. పశ్చిమాంధ్రుల సద్భావము పోవుటకు కారణములు తెలుసుకొనుట యావశ్యకము. విశ్వవిద్యాలయ కార్యస్థానము బెజవాడనుండి విశాఖపట్టణమునకు మార్చుట పశ్చిమాంధ్రుల విముఖతకు కారణ మని శ్రీకృష్ణారావుగారా వ్యాసముననే వ్రాసిరి. పశ్చిమాంధ్రులలోను నెల్లూరివారిలోను చాలామందికి బెజవాడకన్న మద్రాసే అనేకవిధముల ఎక్కువ సదుపాయముగ నున్నను బెజవాడ కార్యస్థానముగా నుండుచో ఆంధ్రవిశ్వవిద్యాలయమునను రాష్ట్రమునను ఉంచుట కంగీకారమే యనియు అంతకన్న దూరముగ విశాఖపట్టణమున పెట్టుటచే ఇంకను రెండువందల మైళ్లపైగా దూరమగుటచేత తమ కెంతమాత్రము వీలుండ దని పశ్చిమాంధ్రులు తెలుపుచున్నారు. ఇందు అసత్య మేమియు కనబడదు. పశ్చిమాంధ్రజిల్లాలలోనే కార్యస్థాన ముండవలె నని వా రనుటలేదు. బెజవాడ వున్న కృష్ణాజిల్లాకు దక్షిణ పశ్చిమము లందు ఆరు ఆంధ్రజిల్లాలును వుత్తరమున మూడు నాలుగు జిల్లాలు మాత్రమును ఉండు ననియు బెజవాడ తక్కిన నగరములకన్న వేగముగ వృద్ధి యగుచున్న దనియు వ్యాపారాభివృద్ధి కల దనియు మంచి రైల్వేసౌకర్యములు కల దనియు బెజవాడ ఆంధ్రజిల్లా లన్నిటికిని నిజాం ఆంధ్రులకును గూడ మధ్యగనుండి సదుపాయముగ నుండు నని పశ్చిమాంధ్రులు తెలుపుచున్నారు. పశ్చిమాంధ్రప్రదేశము ఊషరక్షేత్రము రాతినేల యని తమ వ్యాసమున వ్రాసిన శ్రీకృష్ణారావుగారికి పశ్చిమాంధ్రులు మనకన్న గూడ చాలా బీదస్థితిలో నున్నందున వారి యభివృద్ధికి మనము సహాయము చేయుట మన ధర్మ మని తెలిసియే యున్నది. ఆంధ్రు లందరు ఏకాభిప్రాయు లైనచో కార్యస్థానము విశాఖపట్టణమునుండి తిరిగి మార్చుట దుస్సాధ్యము కాదు. కార్యస్థాన మనుకూలముగా నుండుచో పశ్చిమాంధ్రులు విముఖులుగా నుండరు. పశ్చిమాంధ్రు లాంధ్రోద్యమమునకే విముఖు లని తలచుట పొరపాటు. పశ్చిమాంధ్రుల మొర విని వారిని సంతృప్తుల జేయుటచేతనే ఐకమత్యము కార్యసాధనము కలుగును. శ్రీకృష్ణారావుగారు తమ వ్యాసమున అనుమానము, అసూయ, మాత్సర్యము పశ్చిమాంధ్రుల నావహించియున్న వని అవి వారి కుగ్గుపాలతో వచ్చిన సహజగుణములని మొదలగు సంగతులు నిందాపూరితముగ పలుతావుల వ్రాయుట యెంతయు విచారకరము. విద్వాంసులు యిట్లు వ్రాయుచుండుటచే సోదరసంఘముల మధ్య మరింత విముఖత విరోధభావము హెచ్చు అయి ఆంధ్రోద్యమమునకును ఆంధ్రజాతికిని అందుచే చాల అపకారము కలుగుచున్నది. ఒక సంఘము నంతను అసూయామాత్సర్యాదిపరు లని నిందించుట యెన్నటికిని మంచిది కాదు. మన సోదరసంఘము నట్లనుట మరియు హానికరము. మరియు శ్రీకృష్ణారావుగారు కాంగ్రెసువలన ఆంధ్రోద్యమమునకు హాని కలుగుచున్న దని సూచించు "కాంగ్రెసు వెల్లువలో మునిగిపోయిన ఆంధ్రునికి నిజమైన దేశాభిమానం లేదు" అని కూడ రాజకీయవిషయములకు తావొసగని ప్రబుద్ధాంధ్రలో వ్రాయుట యెంతయు శోచనీయము. కాంగ్రెసు దేశభాషలందే సభాకార్యముల జరిగించుచుండుటయు ప్రజలలో దేశభాషలం దాసక్తిని కలిగించుటయు భాషాప్రయుక్తరాష్ట్ర

పద్ధతిని ముందుగా నంగీకరించుటయే గాక కాంగ్రెసు ప్రాంతీయభాగముల భాషాప్రయుక్తములుగానే యేర్పఱచుకొనుటయు కాంగ్రెసు ఆంధ్రోద్యమమునకు సహకారియే అనుటకు నిదర్శనములు.

(ఈసంచికలో యిలాంటిదే యింకో వ్యాసం ప్రకటించబడింది. ఇలాగ సర్కారులవారే యిద్దరు విద్వాంసులు శ్రీకృష్ణారావుపంతులుగారికి జవాబు చెప్పడం బాగానే వుంది. అందులోనూ రాయలసీమవారు మనయెడల అసూయాగ్రస్తులై వుండడానికి మన నడవడికే కారణమని శతకోపాచార్యులుగారు వొప్పుకోడం మరీ బాగుంది. అయితే యింత మాత్రాన రాయలసీమవారికి సంతృప్తి, అది కలగనంత సేపూ ఆంధ్రవికాసమూ సాధ్యపడవు.

కృష్ణారావుపంతులుగారు రాయలసీమవారిని యేమిటేమిటో విశేషణాలతో నిందించారంటే దానికి బాధ్యులు వారే; అయితే. రాయలసీమవారిని మేమలా భావించడం లేదు. రాయలసీమ అంటే ఆంధ్రదేశానికి గుండెకాయ. అది నేడు నీటివనరులు లేకా ఐశ్వర్యం లేకా నికృష్టస్థితిలో వుండడంటె ఆంధ్రజాతికి తీవ్రమైన గుండెజబ్బు వుందన్నమాట. సర్కారుల మెత్తని మట్టిలో విశిష్టత వుంటే మరి ఆజబ్బు కుదర్చడానికి ప్రయత్నించదేం?

నిజం చెప్పవలసివస్తే అసలు జబ్బు సర్కారులలోనే వుంది. హద్దు లేని అహమిక, ముందూ వెనకా తెలవని దుడుకుతనం, ప్రతిఘటనలు వస్తే గభుక్కున చప్పబడిపోవడం, తన సంగతి విడిచిపెట్టి పరాయివాడి వెనక్కాల పరిగెత్తడం, వచ్చిన గాలికల్లా యెగిరిపోవడం,—వొకటేమిటి యిలాంటి లోపాలనేకాలు సర్కారులలోనే వున్నాయి. "రాయలసీమవారు అసూయాగ్రస్తులై వున్నారు కనక ఆంధ్రరాష్ట్రం యిప్పుడు మనకి వద్దు" సరే. బాగానే వుంది. అయితే అవైపువ ఒడ్రులు పెద్ద తెనుగుగడ్డని సాయంపట్టేస్తున్నారే? ఏదీ సర్కారులవారి ప్రతిఘటనం?

ఇంతకీ: కృష్ణారావుగారి వ్యాసంవల్ల రాయలసీమవారికి మనమీద కొత్తగా కలిగే ద్వేషం యేమీ లేదు. అది యిదివరకే కావలసినంత వుంది. వారి కక్షనలు యెన్ని వచ్చిపడ్డా సముద్రానికి వుల్బణం కలగదు. కాని ఆంధ్రరాష్ట్రం కావాలనే సర్కారులవారికి రాయలసీమవారిని కూడెగట్టుకోవాలనే జ్ఞానం లేదు. ఈసంచికలో మేము ప్రకటించిన కృష్ణారావుగారి వ్యాసం రాయలసీమవారి ద్వేషాన్ని పెంపుచేస్తుందనుకోడం కంటే సర్కారుల ప్రముఖులకు కర్తవ్యపాలనం విషయంలో కశాఘాతంగా వుపచరిస్తుందని అనుకోవడం మంచిది.

ఇంకొక్క సంగతి. ఎలాంటి హేమాహేమీలు వచ్చి బుజ్జగించినా రాయలసీమవారు ఆంధ్రవిశ్వకళాపరిషత్తు విశాఖపట్టణంలో వుండిపోడానికి అంగీకరించకుండా వుంటారనే మేము నమ్ముతున్నాం. శాశ్వతాలూ మహోన్నతాలూ అయిన యిలాంటి సంస్థల విషయంలో స్థానికాభిమానం చాలా అపాయకరమైనది. ఇవాళ విశాపట్టణం ఆంధ్రవిశ్వకళాపరిషత్తుకు ప్రధానస్థానంగా వుండడానికి చల్లగా వుండడమూ, హార్బరు వుండడమూ ముఖ్యకారణా లయితే రేపొద్దున్న ఆంధ్రరాష్ట్ర ప్రధానస్థలం కావడానికి మాత్రం అవి కారణాలు కాకపోతాయా? ఏమయినా ఈవిషయంలో రాయలసీమవారి పట్టుదల ముందుముందు ఆంధ్రదేశానికంతటికీ లాభకరంగా వుంటుంది. పైగా శతకోపాచార్యులుగారు గూడా ఆంధ్రవిశ్వకళాపరిషత్తును బెజవాడకు మార్చాలనే చెబుతున్నారు. ఇది చాలా దూరదృష్టిని సూచిస్తోంది. దీన్ని మనం నెరవేర్చగలిగితే ఆక్షణంలో ఆంధ్రరాష్ట్రం నిర్మింపబడిందన్నమాట. సంపాదకుడు)

# ఆవు బేరం

వజ్ఝల వేంకటేశ్వరకవిగారు బి. ఏ

"నేను మొదట్నుంచీ వద్దంటూనే ఉన్నాను. అయితే నామాట కానిచ్చేరూ? ఒకటేపోరు ఇంట్లో అందరూనూ! నా ప్రాణాలు పీకేశేరు కదూ ఆవును కొనేదాకా! ఒకటా రెండా? ముప్ఫైరూపాయలు చేజేతులా నాచేత ఇప్పించేశేరు. ఎలాగైతేం కొన్నాం ఆవుని! అనుభవించండి పాడి!" అంటూ ఇంట్లో అందరి మీదా ఉగ్రుడై పోతున్నాడు మా అన్నయ్య. కోపం వచ్చిందంటే అతని ధాటికి ఎవరూ ఆగలేరు. కాని అతనిది ప్రథమకోపం. తాటాకు మంటలాగ అప్పుడే చల్లారిపోతుంది. జవాబు చెప్పడం మానవప్రకృతి సహజం కాబట్టి మా వదినె గారు ఊరుకోలేదు.

"అయితే యెందు కందరి మీదా అలా కేకలేస్తారూ? మీరు ఆవుని చూడడ మేమిటి, కొనొక్కొని యింటికి తేవడ మేమిటి, మమ్మల్ని అనడ మేమిటి?"

"ఒసే ఊరుకుందూ! పిల్లడికి తులం బంగారం కొని ఒత్తులు చేయిస్తా నంటే విన్నా? ఒకటే పోరెట్టేవు ఆవో ఆవో అని, పాలూ పెరుగూ అనుభవించవచ్చునని. కష్టపడి మిగిల్చిన 30 రూపాయలూ బూడిదలో పోయించేవు!"

"నాయనా! దాన్నెందు కంటావు?" అని అందుకుంది మా అమ్మ.

"ఆవు నంటే కొనమన్నాం గాని యిలాంటి ఆవంటే మేం మాత్రం ఇష్టపడతామూ? పెద్దవరస ఆవు, పూటకు రెండు శేర్లపాలు నిరాఘాటంగా యిస్తుంది అంటూ నువ్వూ రుద్రాభట్లుగారూ పొగిడితే మేం కొనమన్నాం. ఆ మాత్రం ఆవుని కొన్నప్పుడు నువ్వు చూచుకోవద్దూ?"

"ఊరుకుందూ అమ్మా! దాన్ని వెనకేసు కొస్తున్నావు! అంతా వొక్కలాటి వెధవలే! నేను ఏజన్మలోనైనా ఆవుని కొన్నానా? చూశానా? ఆవు బేరం చెయ్యడానికి మీరు నన్ను పంపడమేమిటి లేకపోతే? ఆరుద్రాభట్లు గారికే తెలియకుంటే నాకేం తెలుస్తుంది?"

"నాయనా! అయితే ముక్కుకు కన్నం పొడిచి తాడుదూర్చి మూతికి కట్టేడుగదా, అదినువ్వు చూడకపోయేవా? ఆసంగతి మాతో చెబితే మేం వెంటనే చెబుదుము, అది పొడుపులగొడ్డూ, తోపుల గొడ్డూ, కొనవద్దని. నీలో తప్పు పెట్టుకొని మమ్మల్నెందుకూ అనడం?"

"మహాప్రభో, నాకు స్కూలుకెళ్ళి పాఠం చెప్పడం తప్ప మరేమీ తెలియదని మొదటే మనవిచేసుకుంటే మళ్ళీ నాది తప్పంటా వేమిటి! నాకు ఆవు నాడెంలో అనుభవం లేదని నీకు చెప్పలేదూ? పొదుగు గుల్లగా ఉందో లేదో పాలు ఎన్నిస్తుందో చూడమన్నావు. అవి సరిగ్గా చూశేను. అనుకూలంగా ఉన్నాయి. ముక్కులో తాడుంటే వొద్దని చెప్పలేకపోయేవా? పోనీ నాకు జ్ఞానం లేకపోతే ఆరుద్రాభట్లు చెప్పొద్దూ!"

అంటూ మా అన్నయ్య పళ్లు కొరుకుతూ విజృంభించేడు. నేను ఈ ఘర్షణ అంతా వింటూ పక్కమీద పడుక్కుని (నాకు రెండు రోజుల్నుంచీ జ్వరం) నాలో నేను నవ్వుకుంటున్నాను. నేను వెళ్లి ఉంటే కొంత జాగ్రత్తగా పరిశీలించి ఉందునేమో! "పెద్ద సైన్సు మాస్టరుగదా, ఈపాటి పరిశీలన లేక పోయిందా, మా అన్నయ్యకి; ఆవుకి ముక్కులో తాడూ, మూతినిండా కట్లూ ఏమిటి? అని తోచలేదా?" అని మనస్సులో అనుకున్నాను. పైకి అనలేదు సుమండీ! అంటే వుందామరి? అగ్గిమీద గుగ్గిలం జల్లినట్లు కాదూ?

మా అన్నయ్య కోపానికీ, ఆవుని కొనడానికీ, మా అమ్మా వాళ్లూ కొంచెం నవ్వడం ప్రారంభించేరు. దానిమీద అతనికోపం మరింత మండింది.

"నా చేత డబ్బు తగలెట్టించి తిరిగీ నవ్వుకూడానూ సిగ్గులేని మొగాలికి! వీధులో అందరికీ ఆవు

లుంటే మన కెందుకున్నాడదూ? మేష్టర్లందరికీ ఆవులుంటే మనకెందుకు లేకపోవాలి? మొదట్నుంచీ యిలాగేకదూ విముఖత్వం చూపేనన్ను ఆవు బేరంలోకి దింపేరు? నెల్లాళ్లయింది ఒకటే గోల! "ఆవు" అన్నపదం నాచెవిలో ప్రతిధ్వనించని క్షణంలేదు! పోతేపోవు గాక నెలకు పదిహేను రూపాయలు! కడుపులో చల్ల కదలకుండా అగోడుది రోజూ రెండుశేర్లపాలూ ఇచ్చి పోతూవుండేది. నెలకూ యింత ఖర్చేమిటి? ఈ కరువుకాలంలో పాడికి చెయ్యాలని ఒకమూల మాతమ్ముడు! ఆవుకి నెలకీ ఎంతబాగా మేపు పెట్టినా ఎనిమిది రూపాయలకు మించదుకదా, నాలుగైదు నెల్లలో ఆవుసొమ్ము వచ్చేస్తుంది. పైగా ఇంటినిండా పాలూ, పెరుగూ నెయ్యీ, ఆవు మిగులు, ఇలాగే కిమ్మతులు చెప్పి నచ్చజెప్పేరు. వాళ్లమాటలు విని నేనూ బాగుంది అనుకున్నాను. అప్పటికీ అద్దిళ్లలో మారుతూ వుండే మనకు ఆవుని కట్టుగోడానికి సాల యేదీ అనికూడా అడ్డు చెప్పేను. ఏం లాభం? ఆరుద్రాభట్లు ఊరుకున్నాడూ? సాల యిస్తా నన్నాడు. కనబడ్డప్పుడల్లా ఒకటేబోధ: నామాట విని ఆవుని కొనండి. పెద్దజీతగాళ్ళు మీలాటివాళ్లు వెనక తీస్తారేమిటండీ? మీరేం ఆవుకి మేత పెట్టలేరా? పైగా మీకు ఆవుని పెంచడం అనేది మహాపుణ్యం. ఆలోచించుకొండి!—అని. ఇందరు మంది పట్టుపడితే ఒక్కణ్ణే నేనేమిచెయ్యగలను? వాళ్లు చెప్పినవన్నీ నాకు రైటుగా తోచేయి. ఆవు కొనడానికి నిశ్చయించేను. ఇంతట్లో ఆవులు ప్రపంచకంలో ఎక్కడా లేనట్లు నాపాలిటి శనిలాగ "భేషైన ఆవు. ఆలోచిస్తే మించిపోతుంది" అంటూ మా అమ్మ వార్త తెచ్చింది. రుద్రాభట్లుగారు ఆవునిచూచి బాగుందన్నారు. కడవరికి ఆ వెధవ పొడుపుల గొడ్డుని అందరూ కలిసి నాచేత కొనిపించేరు. వాళ్ళకేం పోవాలి? డబ్బు ఖర్చుపెట్టింది. నేనూ!" అంటూ లెక్చరు ఆరంభించేడు మా అన్నయ్య.

"ఆవుని కొన్నప్పుడు నాయనా ఒంటిమీద ఒకమారు చెయ్యేనా వేసి చూశేవుకావా?" అంది మా అమ్మ ఊరుకోక.

"ఊరుకుందూ అమ్మా! ఇప్పు డన్నీ అడుగుతావు! అప్పుడేమైంది నీ బుద్ధి? ఆరుద్రాభట్లు మాత్రం ఆవు వొంటిమీద చెయ్యి వేశాడా యేమిటి? ఆవుకు రెండుగజాలమేరలో ఇద్దరం నిల్చున్నాం. ఆవుని ఒక యిరుకుసందులో కట్టేడు కదలలేకుండా! ఎదురుగా సాలరాట. ఒకమనిషి వాడు మూతి తాళ్లు పట్టుకుంటే ఇంకొకడు కాళ్లకి బంధంవేసి బ్రహ్మాండంమీద తీశేడు శేరుపాలు. నాదృష్టి వెధవపాలమీదనే ఉంది కాని ఇవన్నీ అప్పుడు పరిశీలించలేదు. ఒకొక్కటే ఇపుడు బోధపడుతున్నాది వాడు చేసిన దగా. శేరుపాలకీ మనమిష్టపడ్డాంగదూ? తిండి బాగా పెడితే శేరున్నరా, రెండుశేర్లూ కూడా యిస్తుందనుకున్నాం. ఏమైతేనేం? మోసం జరిగింది. నావి కదా రూపాయలు పోయేయి? మీకేంబాధ?"

"నాయనా! మాకు మాత్రం అక్కర్లేదూ? నీదైతే మాదికాదూ? ఏదో కొంచెం కొత్తవాళ్లవడంచేత బెదురుతుందంటే ఆవుకు కాబోలు అనుకున్నాంగాని ముక్కుతాళ్ల పొడుపుల గొడ్డనీ, ఇంత పెంకెజంతువనీ కల్లోనైనా మే మూహించలేదు. పోనీ ఇంటికి తెచ్చేక మావాళ్లకి చూపించి డబ్బిస్తా ననలేకపోయేవా?"

"అమ్మా! యెందు కింకా నన్ను ప్రశ్నలు వెయ్యడం? డబ్బిస్తేనేకాని ఆవుని తోలుకురా నన్నాడు ఆగాడిదకొడుకు. రుద్రాభట్లు సలహా పుచ్చుకుని డబ్బిచ్చేశేను. ఏదో గతజలసేతుబంధనం. అట్టే పెంచక ఊరుకుంటే మేలు"

ఈవిధంగా ఆవునికొన్న మరునాటి సాయంత్రం మాయింట్లో సంభాషణ సాగింది. తొలినాడు ఆవుని రెండుపూట్లా చూడడం, సాయంత్రం యింటికి తోలించుకురావడం, మర్నాడుదయం పాలు తీసే

టప్పటి పాట్లు అనుభవించడం, అయిన మీదట జరిగిన ప్రసంగం అది. సాయంకాలం ఆరుగంట లైంది.

“అమ్మా!” అని పిలుపు. పాలవాడొచ్చి పాలు తియ్యడానికి పిలుస్తున్నాడు.

“ఇంక ఉందిగా బాబూ అవుతో యుద్ధం. దిక్కుమాలినగోల రూపాయలు నష్టించడం గాకుండా. పైగా అవుకి చాకిరీ. రెండుపూట్లా పాలు తీసేటప్పుడు ఘోరమైన క్షోభ. ఇంతా చేస్తే పాలిస్తుందో యివ్వదో అని బెంగ. ఎందుకొచ్చిన బాధరా దేవుడా!” అంటూ విసుక్కుంటూ లేచేడు మా అన్నయ్య. పాలు తియ్యడం అనే తమాషా చూడడానికి అందరూ బైలుదేరేరు. ఆవేళ జ్వరం తగ్గడం వల్ల నేనూ లేచేను. అందరం సాల చేరుకున్నాం. సాల కొంచెం పురాతనమైనది. ఒక రాటకి అవు కట్టబడివుంది. మేం వెళ్లేసరికి సింహంలాగ బుర్ర యెత్తి చూడడం మొదలెట్టింది. పాములాగ బుస్సుమంది. పెయ్యని వదిలేరు. పాలవాడు ఎలాగైతేనేం మెల్లిగా దగ్గిరికెళ్లేడు. ఒకడు ధైర్యంచేసి ముక్కుతాడు రెండు చేతుల్లోకి పట్టుకున్నాడు. అవు బుర్ర తిప్పుతునే వుంది. పాలవాడు కాళ్లకి బంధం వేదామని తాడు విసిరేసరికి ఢేడీమని తన్ని ఒక్కమాటు బుర్ర తిప్పి రాటచుట్టూ గిరగిరా తిరగడం ప్రారంభించింది. పాలవాడు వెనక్కి పడ్డాడు. రెండో వాడి చేతుల్లో ముక్కుతాడు టఫీమని తెగింది. ఇద్దరూ తప్పించుకుని పైకి వచ్చేసేరు. కొంతసేపటికి అవు నిల్చుంది. పెయ్యి పాలు కుడుస్తూంది. మళ్ళీ పాలు తియ్యడానికి ప్రయత్నం. మేం మాత్రం దూరంగా నిల్చుని ప్రేక్షకులమై నాటకాన్ని చూస్తున్నాం. ఈసారి ఏమైందనుకున్నారు? ముక్కుతాడు తెగి స్వేచ్ఛ లాగైంది కాబోలు తిరిగి తిరిగి అవు ఒక్క యెగురు ఎగిరింది. దాంతో కూడా రాట మొదటికి విరిగింది, దభీమని సాల కూలి పడింది. అవూ పాలవాడూ లోపల చిక్కడ్డారు. ఎలాగైతేనేం పాలవాడు అలిసిపోయి, ప్రాణాలు బిగబట్టుకుని పైకి ఊడిపడ్డాడు. యజ్ఞం చేసినంత అయింది. రెండోపూట పాలు తీయడం ఈవిధంగా జరిగింది. సొమ్ము నష్టం; పాలా శూన్యం; యథాప్రకారం పాలు కొనడం తప్పింది కాదు. అవు నిప్పుడేం చెయ్యడం? పోషించకపోతే తిండి లేక చస్తుంది. పుణ్యానికి బదులు గోహత్యాపాపం ఒడిగట్టుకోవాలి.

“ఎవడికేనా బ్రాహ్మడికి నీనేత దానం యిప్పించేస్తే ఈ అవు వదిలిపోతుంది” అన్నాడు మా అన్నయ్య అమ్మతో. అయితే అవుసంగతి విన్నవాడయితే ఎవడు దానం మాత్రం పడతాడు?

కాబట్టి పాఠకులు ఒక సంగతి గమనించాలి. సాధ్యమైనంతవరకూ అవుని కొనకుండా కాలక్షేపం చెయ్యడం ఉత్తమం. అంతగా కొనడం తప్పకపోతే జాగ్రత్తగా పరిశీలించి ముక్కులో తాడులేని అవుని చూచి కొనుక్కోవాలి. లేకపోతే మాలాగే బాధపడవలసొస్తుంది.

---

## కవులకూ, వ్యాసకర్తలకూ విన్నపం

ప్రబుద్ధాంధ్రకు ఎవరూ పద్యాలు పంపవద్దు. ఆంధ్రోద్యమమూ, చరిత్రా, సంఘాచారాలూ, మతాలూ వగైరాలను గురించిన వ్యాసాలూ, ఏకాంకనాటకాలూ, కథలూ విమర్శలూ మొదలయినవి వచనంలోనే కావాలి. ప్రకటించని రచనలు పోస్టుబిళ్లలు పంపినగాని తిరిగి పంపబడవు. కర్తలకు వారి రచన పడిన సంచిక మొదలు ౧౨ సంచికలు పంపుతాము. తరుచు రాసేవారికి ఎప్పుడూ పంపుతాము. ఇంతే మేము చెయ్యగల సత్కారం.

ఇట్లు వ్యవస్థాపకుడు.

# శ్రీ వ్యాసరాజస్వామి జీవితము

మారేమండ రామారావుగారు ఎం. ఏ., బి. ఇడి.

ఈతడు ద్వైతమతగురువులలో నగ్రగణ్యుడు. ఈతనిజీవితము కేవలమును ద్వైతమత చరిత్రమునకే గాక విజయనగరసామ్రాజ్యచరిత్రమునకును, దక్షిణహిందూదేశ మతవాఙ్మయచరిత్రమునకు గూడ మిగుల ముఖ్యమైనది. 15 వ శతాబ్ది యుత్తరార్ధము మొదలు 16 వ శతాబ్ది ప్రథమ పాదాంత్యము వరకును గల దక్షిణదేశచరిత్రమునందలి కొన్నిఘట్టముల నవగాహన మొనర్చుకొనుట కీవ్యాసరాజస్వామి జీవితము విశేషముగ దోడ్పడుచున్నది.

ఈమహాపురుషుని జీవితమును దెలిసికొనుటకు సోమనాథుడను కవిచే రచింపబడిన "వ్యాసయోగిచరితం" అను సంస్కృతకావ్యము ముఖ్యసాధనము. ఇదిగాక వ్యాసవిజయం, బ్రహ్మణ్యతీర్థవిజయం, అను సంస్కృతగ్రంథములును, న్యూనిజ్ అను పోర్చుగీసుచరిత్రకారుని వ్రాతలును, పెక్కుశాసనములును గూడ వ్యాసరాజస్వామిజీవితమును దెలిసికొనుట కుపయోగించుచున్నవి. ఇందు సోమనాథకవి వ్యాసరాజస్వామికి శిష్యుడై, విజయనగరములో ఆయనవద్దనే పెక్కుసంవత్సరము లుండి ఆయనజీవితచరిత్రము నొకకావ్యముగా రచించిసమర్పించి ఆయనచే మిక్కిలి గౌరవింపబడెను. అటులే వ్యాసవిజయమును రచించిన శ్రీనివాసతీర్థులును వ్యాసరాజస్వామికి మేనల్లుడును శిష్యుడునై యుండెను.

ఈయతివర్యుని తల్లిదండ్రులను గూర్చియు, జననమును గూర్చియు అభిప్రాయభేదములు గలవు. స్తోత్రమహోదధిలోని యొకశ్లోకమునుండి యీయన రామాచార్యులను నతనికి బ్రహ్మణ్యతీర్థస్వామి కృప వలన ప్రభవసంవత్సర వైశాఖశుద్ధ సప్తమి ఆదివారమునాడు జన్మించెనని తెలియుచున్నది. ఈకాలము క్రీ. శ. 1447 సంవత్సరము ఏప్రిల్ 22 తేదీకి సరియగుచున్నది. సోమనాథకవి గ్రంథములో వ్యాసరాజస్వామితండ్రి కాశ్యపగోత్రుడైన బల్లాణసుమతియనియు నతనికి మొదటిభార్యయందు సంతానము కలుగకుండుటచే అక్కాంబికయను నామెను పెండ్లాడెననియు నామెవలన భీమక్కయనుకూతురును మఱియు యతిరాజ అను పుత్రులను బడసెననియు చెప్పబడియున్నది. వ్యాసవిజయమున మాత్రము పైబల్లాణసుమతి చనిపోగా బ్రహ్మణ్యతీర్థస్వామి యతనిని బ్రతికించెననియు వారిలో యతిరాజు మొదటివాడనియు గలదు. పిమ్మట నతనితండ్రి యతిరాజును బ్రహ్మణ్యతీర్థుల కిచ్చివేసెదనని వాగ్దానము చేసెనట. ఈబాలునికి 16వ సంవత్సరమువచ్చినపిమ్మట నతనిని పూర్వము చేసిన వాగ్దానముప్రకారము తమవద్దకు బంపుడని బ్రహ్మణ్యతీర్థులు శిష్యులనుబంపిరి. అంతట యతిరాజు తల్లిదండ్రులు అతనిని వెంటబెట్టుకొని మఠమునకేగి యాబాలుని గురువునకు సమర్పించిరి. అచ్చట నతడు విద్యాభ్యాసము చేయుచు విశేషమగు ప్రతిభను, అద్వితీయమగు వైరాగ్యమును కనబఱచెను. దీనినిచూచి గురువు తనయనంతరము పీఠమునకు రాదగినవాడు ఈ శిష్యుడేయనియు, నాతనిపాండిత్య ప్రతిభచే ద్వైతమతము ప్రబలగలదనియు నూహించుకొని, యతనికి ఆశ్రమము నొసంగెను. క్రీ. శ. 1467 లో బ్రహ్మణ్యతీర్థులు మరణింపగా యతిరాజు వ్యాసతీర్థులను పేరుతో పీఠాధిపత్యమునకు వచ్చెను.

ఇప్పటి కీయనకు వయస్సు 20 సంవత్సరములే యైనను నీయన విజ్ఞానమును పాండిత్యమును అద్వితీయములై యుండినవి. త్వరలోనే ఈస్వాములవారు దేశాటనమునకు బయలుదేఱిరి. క్రీ. శ. 1467 లో వీరు కాంచీపురమున నెందఱినో ప్రతిపక్షులను వాదములలో నోడించిరి. అటుపై నితరస్థలములలో వీరు సంచారము చేయుచుండగా వీరి విద్యాగురువులగు శ్రీపాద రాయలవారిని విజయనగరరాజగు సాళువనరసింహుడు తన సింహాసనమున గూర్చుండబెట్టి తనభక్తిని వెల్లడించెను,

క్రీ. శ. 1471–74 నడుమ వ్యాసరాజస్వామి ఉత్తర హిందూదేశమున సంచరించెను. ఇంతకుపూర్వమే బంగాళాదేశమున జయధ్వజాచార్యుడు ద్వైతమతమును వ్యాపింపజేసెను. అందువలన వ్యాసరాజస్వామికెందరో శిష్యులాప్రాంతమున పూజలొనర్చిరి. అట్టివారిలో నొకబ్రాహ్మణుడు స్వాములవారిచే సన్యాసమును స్వీకరించెను. 1475 లో వ్యాసరాజస్వామి ముల్‌బాగల్ అనుగ్రామమునకు జేరిరి. శ్రీపాద రాయలను యతి యచ్చట నెందరికో విద్యోపదేశము జేయుచుండెను. ఇట గొంతకాలము గడచినపిమ్మట శ్రీపాదరాయలు "నీవు మహాకార్యముల నెన్నిటినో చేయవలసియున్నది. సాళువనరసింహుడు చంద్రగిరిపట్టణమున నున్నాడు. అతడు నిన్ను మిక్కిలి సన్మానింపగలడు. గాన నీవు తిరుపతికి పొమ్మని యాజ్ఞాపించెను. అంతట 1476 లో వ్యాసరాజస్వామి తిరుపతికి పోయెను. కొంత కాలమునకు పిమ్మట నచటి వేంకటేశ్వరాలయములోని యర్చకులందరును కుట్రచేసి దేవునియాభరణములను దొంగిలించిరి. ఈవార్త రాజగు నరసింహ రాయలకు దెలిసి యతడు ధర్మశాస్త్రము ననుసరించి యాదేవస్వాపహర్తలకు మరణదండనను విధించెను. కాని యందుమూలమున దేవుని నిత్యపూజాదికములకు చిక్కువచ్చెను. అంతట రాయలు తిరుమలపై తపస్సుచేసికొనుచుండి, యప్పటికే విశేష విఖ్యాతిగాంచిన వ్యాసరాజస్వామివద్దకేతెంచి తన్ననుగ్రహించి దేవకార్యమునకు విఘ్నముగాకుండజేయుమని భక్తిపూర్వకముగ ప్రార్థించెను. స్వామియు గుర్వాజ్ఞనుదలంచుకొని యందుల కంగీకరించెను. అంతటినుండియు నిస్వామి పండ్రెండు సంవత్సరముల కాల మీస్థలముననే యుండి శ్రీమధ్వాచార్యులవారు నిర్ణయించిన తంత్రసారము ననుసరించి దేవుని పూజావిధానమును నిర్వర్తించుచుండిరి. పూర్వము శిక్షింపబడిన యర్చకులలో నొకని భార్య భర్త మరణించునాటికి గర్భవతిగ నుండి పిమ్మట నొకపుత్రుని గనెను. అతనికి పండ్రెండవ సంవత్సరము వచ్చినపిమ్మట వ్యాసరాజస్వామి యతనిని తిరిగి యర్చకత్వమున నెలకొల్పి తిరుపతినివీడి తిరిగి సంచారమునకై యేగెను.

ఈలోగా విజయనగరరాజ్యమున నందెన్నియో మార్పులు గల్గినవి. సాళువవంశజులను బారదోలి తుళువ వీరనరసింహరాయలు సింహాసనమునకు వచ్చెను. అప్పటికి వ్యాసరాజస్వామి పాండితీవిభవమును, తపశ్శక్తియు దేశమంతటను వ్యాపించినవి. క్రీ. శ. 1498 లో రాయలు తనమంత్రులను బంపి స్వామిని తనరాజధానికేతెంచి తన్ననుగ్రహింప బ్రార్థించెను. వ్యాసరాజస్వామియు నందుల కంగీకరించెను. ఆయతివర్యు డింకను గొంతదూరమున నుండగనే రాయలు మంత్రిసామంతులతోను, పరివారముతోను, సైన్యముతోడను యెదురేగి, యతని నేనుగుపై నెక్కించి పాదచారియై యనుసరించి విజయనగరమును బ్రవేశింపజేసెను. పిమ్మట వ్యాసరాజస్వామి నొకహర్మ్యమున విడియజేసి భక్తిపూర్వకముగ బూజించి, యాతనిని తనరాజ్యమునకు "రక్షామణి" (Guardian Saint) గా బ్రతిష్ఠించెను. అంతటినుండియు రాయలు వ్యాసరాజస్వామిమందిరముననే సాయంకాలము తనదర్బారును జేయుచు నాస్వామి యుపదేశముల ననుసరించి రాజకీయకార్యములను నిర్వహించుచుండెను. అంతటితో దృప్తినందక నరసింహరాయ లీస్వామిని విజయనగరసింహాసనమున గూర్చొనజేసి సర్వవిషయముల నాయనకు నివేదించుచుండెను. అనేకప్రాంతములనుండి విద్వాంసులు వేనవేలుగ విజయనగరమున కేతెంచుచుండిరి. వీరిలో నెందరో వ్యాసరాజస్వామితో వేదాంతవాదములను గావించిరి. అట్టివారిలో కళింగదేశము నుండివచ్చిన బసవభట్టను నతడు ముఖ్యుడు. కొన్నిరోజులు వాదించి యీ పండితాగ్రణి యోడిపోయినను, వ్యాసరాజస్వామి యతని నెక్కుడుగ గౌరవించెను. ఇతరు లనేకు లీయతివర్యునివద్ద విద్యనభ్యసించుచుండిరి. ఇట్లు విద్యానగర విద్యాపీఠమున శ్రీవ్యాసయోగీంద్రుడు కులపతిగ నుండెను.

కృష్ణదేవరాయలు సింహాసనమునకు వచ్చిన పిమ్మట వ్యాసరాజస్వామి కీర్తిగౌరవము లింకను పెంపొందినవి. రాయలనాటి ప్రతిరాజకీయకార్యమునందును వ్యాసతీర్థుల పలుకుబడి కన్పించుచున్నది. రాయల పురోభివృద్ధికై స్వామి తుంగభద్రాతీరమున యంత్రోద్ధారక హనుమత్ప్రతిష్ఠను జేసెను. హంపీక్షేత్రమున కోదండరామస్వామి యాలయమునకు సమీపమున నొక చిన్నగుట్టపై నున్న యీ యాలయము నేటికిని గాంచనగుచున్నది. కృష్ణరాయలు వ్యాసరాజస్వామిని తన 'కులదేవత' గ బరిగణించి తన సర్వస్వము నాయన యారాధనకై వినియోగించుచుండెను. క్రీ. శ. 1514 లో రాయ లుదయగిరి విజయమునకై యనుజ్ఞ నడుగగా నా యతివర్యు డచటి కృష్ణవిగ్రహమును దెచ్చి యిమ్మని గోరెను. విజయలక్ష్మీసహాయుడై మరలివచ్చి రాయలు కృష్ణవిగ్రహమును దెచ్చి గురువర్యునకు సమర్పించి, యొక సుందరమగు దేవాయతనమును నిర్మించెను. స్వామియే స్వయముగ నా విగ్రహము నందు బ్రతిష్ఠించి నిత్యపూజాదికములకై యేర్పాటొనర్చెను. ఇదియే నేడు హంపీ శిథిలములలో గాంచనగు "కృష్ణస్వామిదేవళము" మరుసటి సంవత్సరము కొండవీడు మున్నగు స్థలములను జయించిన తర్వాత గూడ రాయలు వ్యాసరాజస్వామి కెన్నియో దానములను జేసెను.

క్రీ. శ. 1520 లో ముఖ్యమగు కార్యమొకటి జరిగినది. అప్పటికి దక్షిణదేశమున వ్యాసయోగీంద్రునితో వాదింపగల పండితులు లేరైరి. ఆతని యాజ్ఞ ననుసరించి నిర్వహింపబడిన ప్రతిరాజకీయకార్యమును సఫలమగుచుండెను. రాయలకు రానైయున్న యాపదల నెన్నిటినో యీ యతివర్యుడు తన తపోమహిమచే నివారించెను. రాయచూరు దుర్గమును వశపరచుకొని మహమ్మదీయులను కృష్ణాతుంగభద్రా మధ్యదేశమునుండి పారదోలవలెనని రాయలు ప్రయత్నములు సలుపుచుండెను. ఈమహాకార్యమును సాధించుటకై కులదేవతానుగ్రహ మవసరమని రాయలు తలంచెను. ఒక శుభదినమున మంత్రి పరివార సైన్యసామంతసమేతుడై మఠమున కేతెంచి, రాయలు వ్యాసరాజస్వామిని గజారూఢుని జేసి మహోత్సాహముతో నగరమంతయు నూరేగించి, తన సౌధమునకు తీసికొనిపోయి, బంగారు సింహాసనమున గూర్చొనజేసెను. అంత ననేకమంది పండితులును, రాజకీయోద్యోగులును, సామంతులును, సైనికులును స్వామికి సాష్టాంగనమస్కారముల నొనర్చిరి. పిమ్మట బ్రాహ్మణులు వేదమంత్రముల నుద్ఘోషించిరి. తట్టలతో రత్నములను దెప్పించి, చూపరు లెల్లరును జయజయధ్వానములను జేయుచుండ, నొక బంగారు గిన్నెను గైకొని, యానందబాష్పములతో రత్నరాజములను రాయలు వ్యాసరాజస్వామి కభిషేకము చేసెను. నగరమునందలి జను లాబాలగోపాలము నచటనే యుండిరి. పిమ్మట ప్రశాంతవదనుడై స్వామి యచటివారి నెల్ల నాశీర్వదించి, తన కభిషేకము చేయబడిన రత్నములను జనులకు బంచిపెట్ట నాజ్ఞాపించెను. దాని ననుసరించి రాయలు సామంతులకును, హిందూ మహమ్మదీయ సైనికులకు నా రత్నములను బంచియిచ్చెను. పిమ్మట గురుదేవుని యాశీర్వచనమునంది రాయలు రాయచూరు దండయాత్రకు దరలెను.

కృష్ణరాయల కాలమున జరిగిన మరియొక విశేషము కుహూయోగము. ఎప్పుడైనను అమావాస్యనాడు దినాంత్యభాగమున త్యాజ్యసమయమున చంద్రుడు గన్పింపకుండు సమయమున రవి కుజ శని రాహువులు లగ్నమునగాని, అష్టమవ్యయములగాని గలసినయెడల కుహూయోగమని యు, నట్టి లగ్నము గల రాజు మరణించు ననియు జ్యోతిషశాస్త్రమున గలదు. కృష్ణరాయ లది కుంభలగ్నము. పైన చెప్పబడిన గ్రహసంయోగము 1519—24 సంవత్సరములలో గాంచనయ్యెను. 1520 లో రాయచూరు యుద్ధమయిన వెంటనే పైయోగము తటస్థమయ్యెను. దానివలన రాయలకు గల్గు దుష్ఫలితమును

వ్యాసరాజస్వామి నివారించెను. వ్యాసయోగి చరిత్రమును రచించిన సోమనాథకవి యీ విషయమై నిట్లు వర్ణించి యున్నాడు. కుహూయోగ మారంభించిన వెంటనే వ్యాసరాజస్వామి విజయనగర రత్నసింహాసనమున గూర్చొని రాయలచే సామ్రాజ్యమును, ధనకనకవస్తువాహనాదు లన్నిటిని ధారాపూర్వకముగ బరిగ్రహించెను. కొలువుకూటమునం దుండిన మంత్రిసామంతాది సభ్యు లెల్లరును చకితులై యీ దృశ్యమును జూచుచుండగనే యొక మూలనుండి పెద్ద సర్ప మొకటి సింహాసనమువద్ద కేతెంచి యట్లే దానిపై నున్న యతివర్యుని గాంచి వెనుకకు బోయి తన పడగ నాతనికి ఛత్రమువలె బట్టెను. కుహూయోగము సమాప్తమైన వెంటనే యాసర్పము నిష్క్రమించెను. అంతట వ్యాసరాజస్వామి సామ్రాజ్యమును తిరిగి గైకొనుమని రాయల నడుగగా నతడు దత్తపరిగ్రహము చేయనని బదులు పల్కెను. కొంత వాదము జరిగిన పిమ్మట గురువు నాజ్ఞ నుల్లంఘింపజాలక కృష్ణరాయలు తన గురువర్యుని ప్రతినిధిగ రాజ్యభారమును వహించుట కంగీకరించెను. దీనితో వ్యాసరాజస్వామి మహాత్త్వము విశ్వవిఖ్యాతి నందెను.

కొంతకాలమునకు బిమ్మట కృష్ణరాయని యొక పుత్రుడగు దిరుమలరాయడు మరణించెను. అంత రాయలు దేశాటనమునకై వెడలెను. రాజధానిలో రాయల తమ్ముడగు నచ్యుతదేవరాయలు నల్లుడగు రామరాయలును విజృంభించిరి. రామరాయలకు బ్రాహ్మణమతద్వేష ముండినది. ఈపరిస్థితులనుగాంచి 1524 లో వ్యాసరాజస్వామి తాను నిర్మించిన వ్యాససముద్రమను గ్రామమునకు వెడలి మరి మూడేండ్లకు విజయనగరమున కేతెంచెను.

అచ్యుతదేవరాయల కాలమునగూడ వ్యాసరాజస్వామికి పూర్వపు బలుకుబడియు, నాయన యెడ రాయలకు భక్తిగౌరవములు నుండినవి. 1532 లో నీస్వామి విఠలదేవాలయమున యోగానందనృసింహస్వామిని బ్రతిష్ఠించెను. ఈకాలముననే రాయలకు ద్రవ్యావసరము గలుగ స్వామి శిష్యులలో నగ్రగణ్యుడగు వాదిరాజస్వామి యొక గుప్తనిధిని రాయలకు జూపించెను.

కర్ణాటకభక్తాగ్రగణ్యులును వ్యాసరాజస్వామి శిష్యపరంపరలోనివారు నగు శ్రీపురందర దాసులచే రచింపబడిన యొక కీర్తనలోని "విళంబిసంవత్సర దల్లి విజయనగరదల్లి ఫాల్గుణ బహుళ చతుర్థి సిరవారి" యను భాగము వ్యాసరాజస్వామి సిద్ధినందిన కాలమును తెలుపుచున్నది. ఆకాలము క్రీ. శ. 1539 వ సంవత్సరము మార్చి నెల 8 వ తేదీకి సరియగును. హంపీక్షేత్రమునకు మూడు మైళ్ళలో దుంగభద్రలోని 'నవబృందావన' మను ద్వీపములో నీ యతివర్యుని బృందావన మున్నది.

వ్యాసరాజస్వామి యొక యద్భుత వ్యక్తి. బాల్యముననే సన్యసించి పరమహంసాశ్రమమున నుండిన నిష్కామి యయ్యు, విద్యారణ్యస్వామి వలెనే హిందూమతోజ్జీవనమునకు కంకణము గట్టుకొనిన మహానుభావు డీ యతివర్యుడు. అయిదుపురుషాంతరముల విజయనగర పాలకులచే నితడు సామ్రాజ్యరక్షామణిగను, కులదేవతగను బూజింపబడెను. విద్యాధికారిగ నుండి యీ పండితాగ్రణి విజయనగరము నొక విద్యాపీఠము నొనర్చి, పండితులెందరికో వృత్తుల గల్పించెను. ఈయన యాలోచన ననుసరించియే రాజులు వ్యవహరించిరి. అనేక సమయములలో నీయన హిందూరాజ్యరక్షణార్థమై మహమ్మదీయులకు దాత్కాలికముగ లాభమును గల్గించెను. ఇందులకు బ్రతిఫలముగ నొకప్పుడు బిజాపురసుల్తానగు యుసఫ్ ఆదిల్షా యొక యొంటెను పచ్చని ధ్వజము నీస్వామి కర్పించెను. ఈ పతాకము నేటికిని వ్యాసరాజ మఠమున గలదు. దేశాంతరమునుండి వచ్చి రాయల యనుగ్రహము సంపాదింప దలచిన పోర్చుగీసు రాయబారులు వ్యాసరాజస్వామి నాశ్రయించి కృతకృత్యు లగుచుండిరని "ద్వీపాంతర భూపాలకసంప్రేషిత ప్రధానపురుషైః రసకృత్సమర్ప్యమాణాని బహు

విధోపహారపూజనానిచ" యను వ్యాసయోగి చరితము నందలి గద్యభాగమునుండి తెలియుచున్నది. "The King of Bisnaga is a Brahmin. Everyday he hears the preaching of a learned Brahmin wbo never married nor ever touched a woman" అను న్యూనిజ్ వ్రాతగూడ యీ స్వామికిగల కీర్తిని దెల్పుచున్నది.

ద్వైతమతమునకు వ్యాసరాజస్వామి చేసినసేవ నిరుపమము. ఈయన మూలముననే విజయనగర సామ్రాజ్యమున నీ మతమునకు విశేషముగ వ్యాప్తి గలిగినది. ఈయనచే రచింపబడిన "తాత్పర్యచంద్రిక న్యాయామృతము, తర్కతాండవము" నను వేదాంతగ్రంథములు నేటికిని పండితలోకమున నగ్రస్థానము నలంకరించియున్నవి వీరవైష్ణవులు జనోపయోగార్థమై పాటలను, పదములను, ద్విపదలను రచించినటులే యీ స్వామిగూడ ద్వైతమతసిద్ధాంతమును పామరజనోపయోగార్థమై కీర్తనారూపమున బోధించెను. ఈ కీర్తనలు నేటికిని కర్ణాటమున ప్రతివారినోటను వినవచ్చుచున్నవి. వీనిని పాడుచు హరిభజన చేయువారును, స్వతంత్రరచనల జేయువా రెందరో దాసులు బయల్వెడలిరి. ఈ పద్ధతికి "దాసకూట" మని పేరు.

వ్యాసరాజస్వామి యీ సంగ్రహ చరిత్రము వారి శిష్యుడగు సోమనాథుడు రచించిన "వ్యాసయోగి చరితము" ననుసరించి వ్రాయబడినది. ఇందుల కుపకరించు విశేషాంశములను దెల్పు శాసనాదికము లెన్నియో గలవు. చరిత్ర జిజ్ఞాసువు లీ మహాపురుషుని జీవితమును బరిశోధించి సమగ్రముగ రచింతురుగాక!



# ఆంధ్రరాష్ట్రనిర్మాణావశ్యకము

ప్ర. పార్థసారథిగారు బి. ఏ. బి. కామ్. ఎల్. ఎల్. బి (Bom)

శ్రీ భావరాజు వేంకటకృష్ణారావుగారు ఏప్రిలు నెల ప్రబుద్ధాంధ్రసంచికలో "ఇపుడు మనకు ప్రత్యేకాంధ్రరాష్ట్రనిర్మాణం అవసరమా" అనే శీర్షిక క్రింద స్వాభిమానపూరితమైన వ్యాసం ఒకటి ప్రకటించినారు. ఆవ్యాసంలో వారి మూలాభిప్రాయం ఆంధ్రు లందరు సంఘీభావము కలిగి ఏకమనస్కులై కలిసికట్టుతనంతో ఉండి, "యశోధురంధర శీలురై తమ సుచరిత్రము ప్రచండప్రతాపము ప్రజ్ఞ శక్తిసామర్థ్యములు అభినివేశము ఉత్సాహము మొదలైనవి బ్రహ్మాండమంతా నింపి 15 శతాబ్దములు మహావిభవముతో వెలిగి చివరకు దక్షిణదేశంలో తంజావూరు మధురానగరరాజ్యములలో మిణుకు మిణుకుమంటూ అస్తమించిపోయిన పూర్వపుఆంధ్రుల" యశశ్చంద్రికను తిరిగి పునరుద్ధరించవలెనని. ఈ ఆశయం మహోత్కృష్టమైనది. మన ఆధిక్యము యితరులకు తెలియవలె నన్నా, మన మాట నలుగురిలో నెగ్గవలె నన్నా, మనలో మనం ఐకమత్యం కలిగి యుండవలె. మన వ్యక్తిత్వాన్ని మనం స్థాపించుకోవలె నన్న అందుకు అడ్డంకు లన్ని తప్పించి అవసరమైన సదుపాయము లన్ని సమకూర్చే ప్రత్యేకరాష్ట్రం చాలా అవసరమే. అయితే మనం నలుగురు కలిసి ఏదైనా పని చేయవలసిఉంటే, అందులో ఒకరి నొకరు తిట్టుకొనుచు, ఒకరి నొకరు ధిక్కరించుకొనుచు కబుర్లతో కాలక్షేపం చేయ

టం వల్ల పని సాగదు. పైపెచ్చు "త్వం శుంఠా త్వం శుంఠా" అని ఒకరితో నొకరు కలహించ టంవల్ల ఏసదాశయంతో అయితే యీపనికి పూను కొన్నారో, తొందరమాటలవల్ల అనవసరమైన దూషణవల్ల పరస్పరవైషమ్యాన్ని పెంపొందించి, ఆ ఐకమత్యానికి ఇదివరకేమన్నా అవకాశం ఉంటే దానికి కూడా అంతరాయం కలిగిస్తూన్నారు.

శ్రీరావుగారి వ్యాసంలో ముప్పాతిక మూడు పాళ్ళంతా దత్తమండలవాసులపై తనకు గల స్పర్థను, ఏహ్యతను, దుస్సహమైన కఠినపదాలతో వెల్లడిచేసారు. "రాయలసీమవాసుల హృదయక్షేత్రంలో అవిశ్వాసము, అసూయ, అనుమానము మొదలైన విషఅంకురాలు మొలకలెత్తి వ్రేళ్లుబారి ప్రాతుకట్టుకొని ఉన్నవి......పాషాణమైన కరగి చను నవును గాని లోహము వజ్రసన్నిభమైన వస్తువులు చలింపవు...ఉత్తరసర్కారులవారు ఏ ఉద్యమం తలపెట్టినా అది యేదో జిత్తో, పామో, విషమో అని మొదటినుంచి భయం శంకలతో పరిశీలించి అడుగడుక్కూ అనుమానపడే అలవాటు రాయలసీమవారికి పరిపాటి అయింది......దత్తమండలవాసుల మనసులో అసూయ అవిశ్వాసం మాత్సర్యం పెరుగుచున్నాళ్లు ఉత్తరసర్కారువారికి వారికి పొత్తు కుదురజాలదు......ఊసరక్షేత్రముల పై పుట్టి పెరిగిన దత్తమండలవాసుల మానసములు పాషాణసన్నిభములై శంకతో, అసూయతో మాత్సర్యముతో వక్రబుద్ధితో నిండి యుంటవి...ఈ విషమప్రవృత్తి దత్తమండలవాసులకు నైజగుణము. రంధ్రాన్వేషణమే పరమార్థముగా నెంచుకొని అసూయాగ్రస్తులైన దత్తమండలనాయకులు లేనిపోని శంకలలో బడి వ్యాకులత నొందుచున్నారు. దత్తమండలమువారి కుట్ర యింతవఱకు ఉన్నదని సర్కారులవారు గ్రహించలేకపోయినారు" మొదలైన నిందావాక్యాలతో అతిపరుషంగా ఉద్రేకౌద్ధిక్యంతో తాము చెస్తున్న పని తెలుసుకోకుండా, భాషలో ఎన్ని కఠినోక్తు లున్నవో అన్నిటిని అతి తీక్షణంగాను విరివిగాను ప్రయోగించి దత్తమండలవాసులని అనరాని మాట లన్నారు.

"ప్రేమ చిత్తవృత్తిని బట్టి పరుల మనసును నిర్ణయించుకొనుట మానవుని నైజగుణము" అని శ్రీరావుగారే తమ వ్యాసమందు వ్రాసియున్నారు. పై జూపిన శ్రీరావుగారి నిందావాక్యము లన్నియు గూడ ఆసూత్రముపై ఆధారపడి వ్రాయబడిన వని నమ్మవలసిన దేనా?

ఇట్టి వ్రాతలు పరస్పరస్పర్థలను పెంచుటకు దోహదము చేయుచు, ఆంధ్రజాత్యైక్యమునకు అంతకంతకు ఆటంకమును కలిగించుచున్నవి. సంఘీభావమెన్నడు తిట్లవలనను హేళనమువలనను కుదురదు. ఐకమత్యము కావలెనన్నచో, పరస్పరసహాయము, అన్యోన్యము కావలె. అందుకు ముఖ్యసాధనములు ఇచ్చిపుచ్చుకొను పద్ధతి. వారికి వలయు సదుపాయముల తాము గూర్చవలె. తమకు వలయు సదుపాయముల వారు గూర్చవలె. సదుపాయము లన్నియు మాకు, ఇబ్బందు లన్నియు మీకు అను స్వలాభపద్ధతి ఎంతమాత్రము పనికిరాదు. విశ్వవిద్యాలయమున దత్తమండలమువారు కలియలేదని ఘోషించిన ఏమి ప్రయోజనము! వారు "బ్రతుకుతెరు వెరుగని" వా రన్న ఏమి ప్రయోజనము? ఆంధ్రసీమ కంతకు నొకమూల నెచ్చటో సరిహద్దుప్రాంతమున (గంజాంజిల్లా కూడ ఓఢ్రరాష్ట్రములో జేర్పబడుచో విశాఖపట్టణము జిల్లాయే ఉత్తరసరిహద్దగును) విశ్వవిద్యాలయమును తత్సంబంధ మగు కళాశాలలను బెట్టి 7, 8 జిల్లాలు దాటి రమ్మని దత్తమండలవాసుల నాహ్వానించుట ఇసుమంతయు సమంజసముగ లేదు. ఇట్లంత దూరము వచ్చుటకు దమ కష్టముల దెలుపుచు సమీపమం దున్న మరియొక విశ్వవిద్యాలయమునకు వారేగుచుండ వారి నీరీతి నిందించుట అంతకన్న తప్పు. ఆంధ్రవిశ్వకళాపరిషత్తు ఒక్క విశాఖపట్టణము, రాజమండ్రి వారి సొత్తు కాదు. అది ఆంధ్రసీమ కంతటికిని సంబంధించిన సంస్థ.

అది అన్ని జిల్లాలవారికి అందుబాటులో నుపయోగ కరముగ నుండవలె. స్వాభిమానపూరితము లగు సంకుచిత భావములతో మాపట్టణ మనాదినుండి విద్యాస్థాన మని కాని మాపట్టణ మెన్నడో గొప్ప రేవుపట్టణము కాబోవు నని కాని, మాపట్టణము చారిత్రకప్రసిద్ధ మైన దని కాని మొదలగు కారణ ములచే అట్టి సర్వరాష్ట్రోపయుక్త మగు సంస్థను తమ పట్టణములందే యుండుటకుల యత్నించుట తగదు. సర్వజనోపయోగకరముగ నుండెనప్పుడా సంస్థ ప్రయోజనమే పోవును. నేటి ఆంధ్రవిశ్వకళా పరిషత్తు మొత్తము మీద ఉత్తరసర్కారుల విశ్వకళా పరిషత్తు" గా తేలినది. బెజవాడలో విశ్వవిద్యాల యమేర్పాటై యుండెడిచో, అన్ని జిల్లాలకును సరి యగు కేంద్రస్థానమగుట నుండి ఎవరికిని సంకోచమున కవకాశ మేర్పడెడిది కాదు. ఇట్టి సమస్యల పరి ష్కారింపవలసి వచ్చినపుడు ప్రతివాడును సంకుచిత భావముల విడనాడి, విశాలబుద్ధితో నాలోచించి, తన పట్టణముపై గల యభిమానము, తన పేటపై గల యభిమానము వదలి, ఔదార్యముతో సర్వో పయుక్తముగ మెలగవలె. నేటి రాష్ట్రాభిమానము (Provincial feeling) నానాటికి జిల్లా అభి మానముగను, జిల్లా అభిమానము పట్టణాభిమానము గను, పట్టణాభిమానము పేట అభిమానముగను మారి, సంకుచితభావము వృద్ధిజెంది, జాత్యైక్యము నకును, రాష్ట్రైక్యమునకును అడ్డు తగులుచున్నది. ఈ సంకుచితభావములు మాని, విశాలహృదయం ఏర్పడితేనే గాని జాత్యౌన్నత్యం కలగదు.

శ్రీరావుగారు దత్తమండలవాసులు చేరకపోతే ఆంధ్రవిశ్వవిద్యాలయాని కేమీ లోటు రాలే దని వ్రాసినారు. ఆంధ్రరాష్ట్రనిర్మాణసమస్యలో కూడా శ్రీరావుగారి అభిప్రాయ మిదేనా? అది చాలా పొరబాటు. ఆంధ్రదేశంలో సగం మంది దానిలో చేరకపోయిన తరువాత అది ఆంధ్రవిశ్వకళాపరిషత్తు ఎట్లా అవుతుంది? ఒక్క విశాఖపట్టణం, ఉభయ గోదావరీ, కృష్ణా, గుంటూరు జిల్లాలు మాత్రమే ఆంధ్రదేశం కాదు గదా! ఆంధ్రప్రతిష్ఠకు, ఆంధ్ర వాఙ్మయపోషణకు మూలాధారమై ౫, ౬ శతాబ్ద ములు ఆంధ్రజీవనాన్ని పెంపొందించిన శ్రీకృష్ణ దేవరాయప్రభృతులు, రెడ్డిరాజులు, శ్రీరావుగారి పూర్వ ఆంధ్రజిల్లాలవారు కారు. ఈనాడు కూడా ఆంధ్రప్రతిష్ఠ అంతరించకుండా అక్కడక్కడ మిణుకుమిణుకు మంటున్న దంటే అందుకు పునా దులు వేసినవారు. మధ్యయుగాలలో మహమ్మ దీయుల దాడినుండి ఆంధ్రకళను, ఆంధ్రవాఙ్మ యాన్ని, ఆంధ్రజీవనాన్ని రక్షించి, పూర్వ ఆంధ్ర జిల్లాలో అంతా నికృష్టమైయుండగా దేశమునకు బాసటయై నిలచినది దత్తమండలవాసులు. వారిని విసర్జించి మా అంతట మేమే ఆంధ్రయు నేర్పాటు చేసుకొనెద మనుట చాల పొరబాటు. విశ్వవిద్యా లయము ఆంధ్రు లందరి నొక్కదరి జేర్చుటకు చాల సహాయకారి యగు సాధనము. దాని నన్ని జిల్లాలవారికిని సదుపాయముగ నున్న కేంద్రస్థాన మగు బెజవాడలోనే యుండనిచ్చినచో ఆంధ్ర రాష్ట్రనిర్మాణవిషయమున చాల కాలము క్రిందటనే కట్టుదిట్టము లగు యేర్పాటులు జరిగియుండెడివి. విశ్వవిద్యాలయము విషయముననే, ఇట్టి సంకుచి తాభిమానముతో ఏమూలకో ఈడ్చుకొనిపోయిన ఉత్తరసర్కారుమహనీయులు, రాష్ట్రకేంద్రస్థాన మును గూడ నట్టి మారుమూల కీడ్చెద రని భయము జెందుట కవకాశము లేకపోలేదు. అందుచే దత్త మండలవాసులు సంశయించుటయం దాశ్చర్యము లేదు. దత్తమండలవాసులు మాత్రము విశ్వవిద్యాల యమును, కళాశాలలను, ఏఅనంతపురమునందో తెచ్చిపెట్టవలె నని మనవలె కోరుట లేదే! అట్లు విశ్వవిద్యాలయకేంద్రస్థానమును రాష్ట్రకేంద్రస్థాన మును ఏకడపలోనో కర్నూలులోనో ఏర్పరచుచో పూర్వాంధ్రులు విముఖులు కాకుందురా? అప్పుడు మనము (పూర్వాంధ్రులు) అసూయాపూరితుల మని, మాత్సర్యపూరితుల మని పశ్చిమాంధ్రు లన్నచో మన కెట్లుండును? వారు మాత్రము మనవంటివారు

కారా? వారు కోరునది నలుగురకు అందుబాటులో నుండునటుల ఏర్పాటు చేయవలసిన దనియే కదా!

ఆంధ్రరాష్ట్ర మేర్పడవలె నన్న ప్రథమమున విశ్వవిద్యాలయమును బెజవాడకు మార్చి, అన్ని జిల్లాల వారికిని సరియగు ఏర్పాటుల జేయుటకు సిద్ధముగ నున్న సంగతి సూచింపవలె. బెజవాడ, ఆంధ్రదేశములో నితరపట్టణము లన్నిటికంటె అతి శీఘ్రముగ నభివృద్ధి జెందుచున్నది. 1891 మొదలు 1931 వరకు జనాభా లెఖ్ఖల వివరముల బట్టి జూచి నచో మిగిలిన పట్టణము లన్నియు తాబేటి నడక సాగించుచుండ బెజవాడ ఎంత స్వల్పకాలమున ఎంత ఉన్నతస్థితికి వచ్చుచున్నదో తెలియగలదు. బెజవాడలో, విశాఖపట్టణము రాజమహేంద్రవరం మొదలగు పట్టణములలోవలె ప్రభుత్వము వారి జిల్లా కేంద్రకార్యాలయములు (District Head quorters) గాని, కళాశాలలు గాని లేవు. సామాన్యముగ నట్టి కార్యాలయము లన్నియు నుండెడి చోట్లు ప్రాముఖ్యమునకు వచ్చుటయు, జనాభా నానాటికి వృద్ధి జెందుటయు సహజము. ఈ అభివృద్ధిని బట్టి చూచినచో అత్యల్పకాలముననే బెజవాడ ఆంధ్రరాష్ట్రమున అన్నిపట్టణములకంటె పెద్దది కాకమానదు. ఇప్పటికే ఆంధ్ర ప్రాంతమందలి మునిస్పాలిటీ లన్నిటిలోను బెజవాడకు మిగిలిన వాటి కన్న రాబడి చాల యెక్కువగ నుండుట ఆ నగరాభివృద్ధి సూచించుచున్నది. బెజవాడ కీవలి వైపున కృష్ణా, ఉభయగోదావరి, విశాఖపట్టణము జిల్లా లుండ, ఆవలివైపున నింత కన్న అధికముగ గుంటూరు, నెల్లూరు, కడప, కర్నూలు, అనంతపురం, బళ్లారి జిల్లా లున్నవి. ఇది గాక నైజాం రాష్ట్రములోని స్వభాష కెట్టి పోషణయు లేని 80 లక్షలకు పైబడిన తెలుగువారికి, అవసర మైనచో దాక్షిణాత్య, మైసూరు ఆంధ్రులకు గూడ అందుబాటులో నుండి వారికి విజ్ఞానోపదేశమునకు సహాయకారి యగును. అందుచే సర్వవిధముల విశ్వవిద్యాలయకేంద్రస్థానమునకు బెజవాడ మిగిలిన పట్టణములకంటె ఎంతయు తగియున్నది. బెజవాడకును విశాఖపట్టణమునకును గల తారతమ్యము ఈ క్రింది వివరాలవలన తెలియగలదు.

| ఎచటినుండి | బెజవాడకు | | | | విశాఖపట్టణమునకు | | | | మద్రాసుకు | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | మైళ్ళదూరము | రైలుఛార్జి | | | మైళ్ళదూరము | రైలుఛార్జి | | | మైళ్ళదూరము | రైలుఛార్జి | | |
| | | రూ. | అ. | పై. | | రూ. | అ. | పై. | | రూ. | అ. | పై. |
| అనంతపురం | 323 | 6 | 11 | | 540 | 10 | 10 | | 319 | 6 | 10 | |
| బళ్లారి | 310 | 6 | 7 | | 527 | 10 | 6 | | 306 | 6 | 6 | |
| కడప | 393 | 7 | 15 | | 610 | 11 | 14 | | 162 | 3 | 8 | |
| గుంతకల్ | 280 | 5 | 14 | | 497 | 9 | 13 | | 276 | 5 | 13 | |
| నెల్లూరు | 160 | 3 | 7 | | 376 | 7 | 10 | | ·109 | 2 | 6 | |
| విశాఖపట్టణము | 217 | 4 | 10 | | | | | | | | | |

కడప, కర్నూలు, అనంతపురం, నెల్లూరు మొదలగు పట్టణములకు మద్రాసు బెజవాడ కన్న సమీపమైనా, రాష్ట్రాభిమానంచేత వారంతా బెజవాడకే వస్తా మన్నారు; విశ్వవిద్యాలయం అక్కడ ఉంటే బెజవాడ కూడా దాటి యింకా 217 మైళ్లు వాళ్లని రమ్మన మనటంలో సబబు లేదు. అన్ని జిల్లాలవారికి సరియగు కేంద్రస్థాన మేర్పడుచో దత్తమండలవాసులు ఉత్తరసర్కారువారితో చెయి కలిపి రాష్ట్రాభాభివృద్ధికి భాగ్యోదయమునకు తమ సర్వశక్తుల వినియోగించుటకు వెనుదీయరు. విశాఖపట్టణమున అధికధనము వెచ్చించి నిర్మించిన భవనముల నేమి చేయవలె నని కొందర డుగవచ్చును.

సాంకేతికకళాశాల మున్నగు కొన్ని కళాశాలలచ్చటనే యుంచవలెను. విశ్వకళాపరిషత్తు కార్యాలయము మరికొన్ని ఇతరకళాశాలలను బెజవాడకు మార్పు చేయవలె. ఉత్తరసర్కారులవారు దత్తమండలములవారి కష్టసుఖములందు బాల్గొనుటకు వెనుదీయ రని, తా మెండోరులకు విభేదములు లేవని తమ ప్రవర్తనవలన తెలియజేయవలె. "మాకు రాయలసీమవారు లంటే ప్రేమ గలదు. అని ఎంత నొక్కి చెప్పితే నేమున్నది? నిజమైన ప్రేమ యున్నదో లేదో చేతలయందు కనబరచవలె" శ్రీరావుగారే చెప్పినట్లు.

అంతియే కాని, తప్పు మనయొద్ద నుంచుకొని వారి కన్నివిధముల ఇబ్బందులు కలిగించి ఆంధ్ర విశ్వకళాపరిషత్తునుండి తొలగిపోవలసినంతటి మనోవ్యథను కలిగించుటయే గాక మీదుమిక్కిలి వారి నిషిద్ధముగ శ్రీరావుగారికంటె విజ్ఞానులు కూడ తూలనాడి అవమానపరచుట మన ఉత్తరసర్కారులవారి ఇంగితజ్ఞానశూన్యతను సంకుచిత హృదయమును బ్రకటించుచున్నది. కాలు జారిన తీసుకొనవచ్చును గాని, మాట జారిన తీసుకొనలేము. మంచి మాటలచేతను, సౌహార్దముచేతను దత్తమండలము వారి హృదయముల నాకర్షింపవలె కాని, చీవాట్లచేతను, వెక్కిరింతలచేతను గాదు. ఏదో విధివశమున డెల్టాభూమి యగు గోదావరి జిల్లాలో మనము జన్మించి యిట నుండుట యేర్పడినంత మాత్రమున మనము "మెత్తని మట్టిపై పుట్టి పెరిగినందున మెత్తని మనసు గలవార మనియు, ఉదారవంతులము. ఉత్సాహవంతులము, కల్లకపటము లెరుగనివార మనియు, దత్తమండలప్రజలు కర్కశమైన పాషాణభూములందు పుట్టి పెరిగి బోడికొండల మధ్య నిస్సారములైన లోయప్రాంతములలో నీటిచుక్క నిలువని ఎఱ్ఱమట్టి ఊసర క్షేత్రములపై పుట్టి పెరిగినవారగుటచే వారి మానసములు పాషాణసన్నిభము లయి శంకతో అసూయతో మాత్సర్యముతో వక్రబుద్ధితో నిండి యుండు" ననియు మొదలగు విపరీతభావములు శ్రీరావుగారికంటె మహనీయుల లేఖినినుండి వెలువడుట మిక్కిలి శోచనీయము. అంతేగాక తమ ప్రశస్తిని వారు వ్రాసుకొనినందున ఒక ప్రశ్న మాత్ర మడుగవలసి యున్నది. "హేమకేదారఖండములు దేవమాతృకలు గలిగి పావనమైన......జీవవాహిను లైన మహానదులు ప్రవహించి సర్వసమగ్ర సస్యసాధ్యముగా......శ్రమ పెట్టకయే అడిగిన మాత్రాన ఫలము సమృద్ధిగ నొసగే జనని యగు మెత్తని మట్టిపై పుట్టి పెరుగుటకు" మన స్వప్రయోజకత్వమేమైన కారణమా? తోటి సోదరులు శ్రీరావుగారు వ్రాసినట్లు "బోడికొండల నడుమ నిస్సారము లయిన లోయ ప్రాంతములలో నీరు చుక్కలు నిలువని ఎఱ్ఱమట్టినేలపై రక్తమాంసములు ధారబోసిన గాని జీవనాధారం" దొరకని దుర్భరస్థితిలో నుండుట జూచి, వారి కష్టముల నివారించుటకు గాని, వారికి జలాధారములు మొదలగువసతుల నేర్పరచుటకు గాని ఇంతవరకు అధికారంలో ఉన్న "ద్వంద్వప్రభుత్వవిధానాన్ని జయప్రదంగా నడిపి రని చెన్నరాజధాని కద్వితీయమైన యశస్సు, ప్రశంసగడించిన ఆంధ్రులే"మైనా చేసారా? మన సోదరుల దౌర్భాగ్యము మనది కాదా? వారి కష్టసుఖములు మనవి కావా? స్వతంత్రరాష్ట్రమే ఉంటే ఇంతకాలంవరకు మన దత్తమండలసోదరుల కట్టి ఇబ్బందులు, అట్టి ఇబ్బందుల గూర్చి శ్రీరావుగారి వెక్కిరింతల వంటి పారుషమాటలు పడవలసిన దౌర్భాగ్యదశ యుండెడిదికాదు.

"మాంటుఫర్డు రిఫారములు అమలులోనికి వచ్చినది మొదలు ద్వంద్వప్రభుత్వాన్ని జయప్రదంగా సాగించి మద్రాసురాజధానికి పేరు ప్రతిష్ఠలు తెప్పించింది ఆంధ్రులే" అయినా "చెన్నరాజధాని రాజ్యాంగమందు నేడు కూడా ఆంధ్రుడిదే నాయకత్వమైనా ఇంతవరకు అట్టి అధికారులవల్ల తమ బంధుగు లెవరికో నాలుగు ఉద్యోగములు దొరక

టము తప్ప ఆంధ్రదేశం మొత్తాని కంతా తుంగభద్రాప్రాజెక్టువంటి ఒక పెద్ద ఉపకార మైనా జరిగిం దని వేలుపంచి చెప్పలేము.'' అయినా శ్రీరావుగారు "భరతఖండంలో ఏజాతులకైనా ప్రత్యేక రాష్ట్రం అవసరం కావచ్చును కాని ఆంధ్రులకు మాత్రం అవసరం కా దని నిశ్చయంగా చెప్పసాహసిస్తా'' మన్నారు. పైపెచ్చు "ఆంధ్రుజాతి జీవ పూర్వపు శక్తులన్నింటిని పూర్తిగా అలవరచుకోవటానికి ఇంకా కొంతకాలం చెన్నపురిరాజధాని యందే యుండడం శ్రేయస్కరం,'' అంటూ దీనికి రెండు కారణాలు చెప్పారు. ఒకటి, "ఆంధ్రుల సంగీతము అరవదేశములో కాలువిరిగి దిక్కుమాలి కూలిపోయి పడివుంది. ఆ తత్వ్వ కుపశమనం కలుగజేసి తారుణ్యా మిచ్చి ఆమెను ఆంధ్రదేశానికి మరల తీసుకొనిరావలసిన బాధ్యత ఆంధ్రులయందున్నది.' రెండవది "మన సారస్వతలక్ష్మి—మన నాగరికతాచిహ్నము దిక్కుమాలి తంజావూరునందు కుందుచున్నది. దీనిని ఆంధ్రులు తమ దేశంలోనికి తర్లించుకొని రాగలరా?......మన ఆంధ్రగ్రంథము లయినా వాటికి ప్రతులైనా వ్రాసుకొనిచ్చి తెచ్చుకోవలె. ఇట్టివి మనము చెన్నరాజధానిలోనుండి విడిపోవకపూర్వము సంపాదించుకోవలసినవి ఎన్నో ఉన్నవి.'' ప్రత్యేకరాష్ట్రనిర్మాణానికి యీపై చెప్పబడిన రెండు అభ్యంతరాలకీ ఏమాత్రం సంబంధం ఉన్నదో చదువరులే యూహింతురుగాక. పుస్తకముల ప్రతులు వ్రాసి తెప్పించుకోవడానికైనా మనవారి నందరిని దాక్షిణాత్యుల కన్న గొప్ప గాయకశిఖామణులుగా తయారుచేయడానికైనా మరే యితరకార్యం చేయడానికైనా మనకు స్వతంత్రరాష్ట్ర ముంటే ఉండే శక్తిసామర్థ్యాలు మరొకరి పంచ నొదిగియున్నప్పు డుండవు. కష్టంఒకరిది అనుభవం మరొకరిది అవుతున్నది ప్రస్తుతం. శ్రీరావుగారే తమ వ్యాసంలో మరొకచోట "రాజ్యాధికారం కైవసం చేసుకొన్నప్పుడు దురాశాపరుడై తమకు రొట్టె యితరులకు ముక్క అన్నట్లు అరవజాతి వలె'' అని వ్రాసిఉన్నారే? అన్ని అసందర్భాలు తెలిసి ఉండి కూడా "మద్రాసీ అని పిలిపించుకోవడం కూడా'' యిష్టం లేనప్పటికి, "యిప్పుడే అరవలతో పేరుపడడానికి ప్రయత్నం చేయడం కూడా యెందు కని'' ప్రశ్నించే శ్రీరావుగారి పరస్పరవిరుద్ధ మైన మాటలలో ఇందు కైనా దూరదృష్టి పూర్వాపరాలోచన ఉన్నదా అని సందేహం.

ఇంతే కాకుండా శ్రీరావుగారు "ఆంధ్రులు దక్షిణాపథ మంతా పాకి ఉన్నారు. అటు పడమట బొంబాయిరాజధానిలో నున్నారు. ఉత్తరాన మధ్యపరగణాలలో ఉన్నారు. దక్షిణాన అరవదేశంలో ఉన్నారు. మైసూరులో ఉన్నారు, ......ఒక ఉత్తరసర్కారులవారు తప్ప మిగిలినవా రెవ్వరూ ఆంధ్రుల మనుకొని గర్విస్తున్నట్లు కనపించడం లేదు......నైజాం ఆంధ్రభాగం మైసూరు ఆంధ్రభాగం ప్రత్యేకాంధ్రరాష్ట్రంలోకి రాజాలవు. దక్షిణాదికి పూర్వం వలసబోయి మేము కూడా తెలుగువార మన్నా మని చెప్పుకుంటున్న ఆంధ్రులు తెలుగుభూమిలోనికి మరల వలస రాజాలరు. ఒకవేళ ఆంధ్రరాష్ట్ర నిర్మాణం కావడమే తటస్థిస్తే ఒక పెద్ద ఖండం అన్యరాజ్యంలోనే ఉండిపోతుంది.'' అంటూ యేమోమో వ్రాసినారు. ప్రత్యేకరాష్ట్రం నిర్మాణం కాగానే, అనేక తరముల క్రిందటనే వలసపోయి అక్కడ మడిమాన్యముల సంపాదించి నివసించుచున్నవారు, ఎక్కడో నాలుగు డబ్బులు తెచ్చుకొని బ్రతుకుతున్నవాళ్లంతా పరుగెత్తుచు ప్రత్యేకరాష్ట్రంలోకి వచ్చివేయవలె ననే సూచన విచిత్రంగా ఉంది. అమ్మ పెట్టదు. అడుక్కొని తిననియ్యదనే విధంగాఉంది. మన ప్రాంతములలో తగు వసతి జీవనాధారం లేకుండుటచేత నే కదా, మనవా రితరప్రాంతముల కేగిభుక్తి గడించుకొనుచుండిరి. ఇక్కడ ఉన్నవారికే తిండిలేక మాడుచుండ, ఎక్కడనో సుఖము

గా జపించువారిని గూడ వారి ఆచారముల నెల్ల విడిచి, తిరిగి వచ్చి ఇచ్చే కుదుట గూడులేక కృశింపచేయుట భావ్యము కాదు. ఆంధ్రు డెట నున్నను ఆంధ్రుడే యగును కాని మరొకడు కాడు. శ్రీరావుగారు బెరంపురములో, ఎలూరులో కాని బొంబాయి కలకత్తా ఖర్గపురము మొదలగు ఆంధ్రులున్న ప్రతిచోటను ఆంధ్రసంఘములు, ఆంధ్రసంస్థలు, ఆంధ్రక్లబ్బులు, నెలకొల్పబడి, ఆంధ్ర మన్నతమ సర్వస్వము వినియోగించునంతటి అభిమానమును రాష్ట్రేతరాంధ్రులు చూపుచున్నారు. అట్టి రాష్ట్రేతరాంధ్రులకు గూడ దగు సదుపాయముల నొసగుటకు గాని విజ్ఞానోన్నతికి గాని తోడ్పడుటకు మనకు తగు స్వాతంత్ర్యము సామర్థ్యము ప్రత్యేకరాష్ట్ర ముండిననే కాని లభింపదు. ఆంధ్రుడే రాష్ట్రములోనో గొప్ప పదవిలో నున్నాడంటే ఆప్రతిష్ట యావదాంధ్రదేశానికి చెందినది కాని ఒక వ్యక్తికి చెందినది కాదు. శ్రీకాతా రామమోహన శాస్త్రి చిత్తరువుల కచ్చెరు వంది అమెరికావారు బహూకరించినా రన్న ఆప్రతిభ ఆంధ్రకళ యంతటిది. ఆంధ్రదేశ మంతటిది. తన కళకు తగు సన్మానము గల ఏ అహమ్మదాబాదులోనో గౌరవముగా జీవనము గడుపుచున్న రామమోహనశాస్త్రిని ప్రత్యేకాంధ్రరాష్ట్రం రాగానే యిక్కడకు తిరిగి వచ్చివేయ మంటే యేమైనా అర్థం ఉందా? ఆప్రకారం కూపస్థమండూకాలు లాగ బయటకు పోకుండా యింట్లోనే కూచుంటుంటే ఆంధ్రుల గొప్ప ఆంధ్రుల ప్రతిష్ఠ బయటివారి కెల్లా తెలియడము?

శ్రీరావుగారు ఆంధ్రరాష్ట్రనిర్మాణం ప్రస్తుతం అవసరం లేదనేందుకు చెప్పే కారణాలలో ఒకటీ సరి అయినది కాదు. సాధ్యమైనంత త్వరలో తమ పరస్పరవైషమ్యాలనిమరచి ఆంధ్రులంతా ఒక్కుమ్మడిగా ఆంధ్రరాష్ట్రనిర్మాణానికి నడుము కట్టుకొని, ప్రత్యేకరాష్ట్రం నిర్మించుకొని, ఆంధ్రకళ, ఆంధ్ర జీవనము, ఆంధ్రసారస్వతము, ఆంధ్రప్రతిష్ఠ, ఆంధ్ర యశఃకాంత తిరిగి తలయెత్తుకొని వర్ధిల్లు నిర్భీతిగ, నిరాటంకముగ తన వెలుగుకిరణాలని వెదజల్లుతూ సంచరించునటుల చేయవలసిన బాధ్యత అందరిపైనా ఉంది. ఆంధ్రసోదరుడా! మేలుకొనుము. పరస్పరదూషణములు నిరుపయోగములు. వాక్కలహములు వ్యర్థములు. ఐకమత్యము కలిగి అన్యోన్యసహాయమున జాత్యభ్యుదయమునకు దోడ్పడుము.



# రామాయణప్రక్షిప్తభాగవిచారణ

మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు

బ్రహ్మాండపురాణాదులు రామాయణగ్రంథసంఖ్య నూఱుకోట్లు ఏబదికోట్లు పదికోట్లు కోటిగా దేవగంధర్వాదిలోకములందు వ్యాపించినదని విపరీతముగా వర్ణించియు, మానవలోకమందు విస్తరించినది యిరువది నాలుగువేల గ్రంథమేయని నిర్ణయించినవి. దీని కాండాంతగద్యలు నిట్లే చెప్పుచున్నవి. గాయత్రీమంత్రములోని యిరువది నాలుగక్షరము లొక్కొకటి యొక్కొక్క వేయిగ్రంథము మొదలు గ్రమముగానున్న వని గాయత్రీరామాయణము నిరూపించినది. వీటినిబట్టి రామాయణ మాఱుకాండములలోని గ్రంథమిరువది నాలుగువేలని ప్రసిద్ధి వచ్చినది. కాని బాలకాండము నాల్గవసర్గలోని

యీశ్లోకము—"చతుర్వింశత్సహస్రాణి శ్లోకానా ముక్తవానృషిః, తథాసర్గశతాన్ పఞ్చ షట్కాణ్డాని తథోత్తరమ్" కృత్వాపితన్మహాప్రాజ్ఞస్సభవిష్యంసహోత్తరమ్"

అని చెప్పిన దానినిబట్టి ౨౪ వేల శ్లోకములు, ౫ వందలసర్గలు, ఆఱుకాండములలోనివా, లేక యేడుకాండెలలోనివా యని కొందఱికి సంశయము కలుగవచ్చునని నేను గణింపఁగా వచ్చిన మొత్తములివి—

1 షట్కాండసర్గలు ౫౩౮, అందలి శ్లోకములు సుమారు ౨౦౮౦౦, అధికపాఠశ్లోకములు సుమారు ౫౦౦, ఉత్తరకాండసర్గలు ౧౧౧, శ్లోకములు సుమారు ౪౫౦౦, అధికపాఠసర్గలు ౧౩, శ్లోకములు సుమారు ౧౨౨౪.

చూచితిరా? ఎట్లుచూచినా, పూర్వోక్తశ్లోకమిచ్చిన మొత్తములకును పైమొత్తములకును సరిపడదు. అందుచే శ్లోకమిచ్చిన లెక్కలాఱుకాండముల నుద్దేశించినవే కాని, ఏడుకాండముల నాశ్రయించినవి కావనుట నిజము. అయితే, పైశ్లోకమునకును, అందలి సర్గశ్లోకసంఖ్యల భేదమునకును గతి యేమి? ఇందు కూహయేగతి. ఈ లెక్కలుచూపిన వారస్యాలుగాని వాల్మీకికాఁడు. తరువాత నెవరో సర్గశ్లోకసంఖ్యలు గణించు నాఁటికిది పైలెక్కలకు సరిపడియుండును. పిదప మఱియొక కాలమునకు ౩౮ సర్గలు పెరుగుటయు నింకొక కాలమునకు సుమారు మూఁడువేల శ్లోకములు తఱుఁగుటయు సంభవించి యుండునని యూహింపవలసి యున్నది. ఇందుకు షట్కాండములలోని యధికపాఠము లోకనిదర్శనము. కావున నాఱుకాండములలోని తెలియని లుప్తభాగముల మాటయేమైనను, తెలియుచున్న యధికపాఠములు ప్రక్షిప్తములనుట స్పష్టము. మఱియుఁ గుండలీకృతములై ముద్రితపుస్తకములఁ గనవచ్చు శ్లోకములే కాక బాలకాండము మొదటి సర్గలోఁ గుండలీకృతములు కాని కొన్నిభాగములు కూడ నట్టివేయనియు. యుత్తరకాండమంతయుఁ గూడ వాల్మీకి కృతము కాదనియు విశ్వసింపవలసి యున్నది. ఇపుడీ మూఁడువిషయములు నిశ్చయింపనించుక యత్నింతము.

కైకేయి రామప్రవాసాది వృత్తాంతము చెప్పిన పిదప భరతుఁడు దుఃఖితుఁడై పలికిన మాటలతో సర్గయారంభమైనది. అట్లగుట సహజము సముచితమునై యుండఁగా ముద్రితపుస్తకములలోఁ బది శ్లోకము లెక్కువగాఁ జేరినవి. అవి కుండలీకృతములై తమప్రక్షిప్తత్వము వెల్లడించుచునే యున్నవి.

బాలకాండము మొదటిసర్గలో సకలసద్గుణపూర్ణుఁడగు మహావీరుఁడెవఁడన్న వాల్మీకి ప్రశ్నకు శ్రీరాముఁడట్టివాఁడని నారదుఁడు సమాధానమిచ్చుచు, దశరథుఁడు రాము నియువరాజును జేయనెంచుట మొదలుగా రావణవధానంతరము రాముఁడు వచ్చి రాజయ్యె నన్నంతవఱకుఁ గల రామచరితములోని విషయముల పట్టికయిచ్చి నట్లున్నది. రెండవ సర్గలో, క్రౌంచపక్షి కథాదులు వర్ణింపఁబడినవి. ఈరెండు సర్గలు రామాయణమునకుఁ బునాదులై సర్వవిధముల గ్రంథావతారికలై యొప్పుచున్నవి. మఱియు ద్వితీయసర్గాంతమందలి "రఘువరచరితం మునిప్రణీత" మిత్యాదిశ్లోకమునకుఁ బంచమసర్గారంభమందలి "సర్వాపూర్వామియంయేషా" మిత్యాది శ్లోకము చక్కఁగా నతుకుచున్నది. ఇట్లుండగా మూఁడవసర్గయంతయు మరల భంగ్యంతరముగా విషయసూచికయై కథకడ్డమయినది. అట్లే షట్కాండశ్లోకసంఖ్యాదులతోడి నాల్గవసర్గయు సందర్భోచితముగాక కథ కడ్డమైనది. ఈరెంటియందును, ఉత్తరకాండము సందర్భము కలిగించు కొన్నిమాటలుండుట చూడఁగా, ఉత్తరకాండము వెలసిన పిదప

1 ఏప్రతినిబట్టి చూచినా, శ్లోకసంఖ్య ఒకటి రెండు వందల తేడాలో సరిపడును.

దానికనుకూలముగా నివి తరువాతచేర్చినవని తెలియుచున్నది. కావున నుత్తరకాండము మాట యొకించుకచూతము.

'ప్రాప్తరాజ్యస్య రామస్య' ఇత్యాదిశ్లోకముతో నుత్తరకాండ మారంభమగును. అందు, ఋషులాగస్త్య రామసుతితోను హనుమదాది వీరులవృత్తాంతములతోను ౪౦ సర్గలు గడచినవి. తరువాత సీతావిసర్జనకథా బీజమంకురించినది. దానికి ౧౨ సర్గలు పట్టినవి. అంత నృగనిమ్యాదుల కథలతోఁ గొన్ని సర్గలు గతించినవి. ఇట్లు ౫౯ సర్గలు వెళ్ళినతరువాత, కుశలవ జన్మవృత్తముదయించినది. తరువాత మరల నేవో కథలు. పిదప ౯౯ వ సర్గనుండి భవిష్యదుత్తరకథ. వీని నడుమ నధికపాఠసర్గలు. ఈ విధముగాఁ బూర్వ రామాయణకథావచనముతో నెట్టి పోలికయులేని డొంకతిరుగుడు రచనయు, అందలి కవిత్వమున కీడుగాని సాధారణకవితయు, అందలి మాధుర్యములో నావగింజంతైన లేని వర్ణనలును గలిగిన యుత్తరకాండము వాల్మీకి మహర్షి కృతము కాదని రెండును బఠించినవారికిఁ దెలియనిదికాదు. కాని, కొందఱు, చిరకాలముగా వచ్చు పురాణప్రసిద్ధికి విరుద్ధముగాఁ జెప్ప జడియుచు నుత్తరకాండము వాల్మీకి కృతమే యని చెప్పుటకలరు. కాని యది సరికాదు. కావున రామాయణ మహాభారతములు దేశమున బాగా వ్యాపించిన పిదప వానిం జదివిన యొకవిద్వాంసుఁడు భారతకథతోఁ గృష్ణద్వైపాయనునకుఁ గల్పింపఁబడిన సంబంధముంబోలె, రామకథతో వాల్మీకికి సంబంధము కలిగించుటకై యుత్తరకాండకథ కల్పించియుండుననియు పూర్వ రామాయణము నుత్తరరామాయణమును జదివిన తరువాతి పండితుఁడొకఁడు, ఉత్తరకాండ కథాప్రసక్తి కలుగునట్లు బాలకాండయందుఁ దృతీయచతుర్థసర్గలు కల్పించి చేర్చియుండుననియు నమ్మవచ్చును. ఈవిశ్వాసము నక్కఱమాలిన విషయసూచికతోడి తృతీయసర్గ తుదిశ్లోకములును, అసంగతముగా నున్న చతుర్థసర్గోపక్రమోపసంహారములును బలపఱుచును గావున దీనినిగూర్చి యింతకంటె వ్రాయఁబనిలేదు. కాని కొందఱాంగ్లవిమర్శకులు తలంచినట్లు బాలకాండమంతయుఁ బ్రక్షిప్తమనుట మాత్రము శక్యముకాదు.



# 'కొన్ని సంశయాలకు' జవాబు

ప్రబుద్ధాంధ్ర ౫వ సంపుటం ౨వ సంచికలో నేను శ్రీ గుడిపాటి వెంకటచలంగారు ప్రకటించిన 'బిడ్డలశిక్షణ' పుస్తకం మీద విమర్శచేశాను. అవిమర్శలో శ్రీ వెంకటచలంగారి శైలినిగురించికూడా కొంత విమర్శించేను. ఈశైలి విమర్శకు కొడవటిగంటి కుటుంబరావుగారు ప్రతివిమర్శ రాశారు. అవసర మవడంచేత ఆ ప్రతివిమర్శకు చిన్నజవాబు రాస్తున్నాను.

(౧) వెంకటచలంగారి శైలిలో ఈకిందిమాటలు నేను ఆక్షేపించేను. పూర్ణారోగ్యం, విస్తీర్ణం, సంస్త, నిర్నయం, మాత్రుదేవతలు, రుషులు, అవస్త, సక్రుతుముఖ్యాలు, స్తితి, అజీర్నం మొదలైనవి. ఈమాటలలో వర్ణక్రమం పాటించకపోవడం తప్పన్నాను. పై మాటలలో కుటుంబరావుగారు ప్రత్యేకంగా థావతుకు తావతు ప్రయోగించడం గురించే తమ అభిప్రాయం చెప్పేరు. ఎంచేతంటే వారు కూడా ఆమాటలు అలాగే రాస్తారుకాబట్టి. తక్కిన వాటిని గురించి, ఎవరు ఎలా ఉచ్చరిస్తే అలా రాయవచ్చు అన్నారు. అలాగు అన్నారన్నమాటేగాని వారికైనా అలాగ రాయడం యెక్కువ యిష్టంకాదు.

వారి యీ కిందివాక్యాలు చూడండి. 'కట్టుబొట్లు పద్దనటానికి వీల్లేదు; మనిషి కొక తెలుగే వుండ కుంటుంది.......భాషకు అవసరమైన కట్టుబొట్లన్నిచేసి, ప్రతిగాలికీ యెగిరిపోకుండ అవయవాలు స్వేచ్ఛగా కదిలించడానికి వీలులేకుండా వుండకుండా తగిన యేర్పాటుచేసి తెలుగుభాషను కూడా స్టాండెర్డైజ్‌చేసి పుణ్యం కట్టుకోవాలి' అని కుటుంబరావుగారు రాసేరు. మనం మాట్లాడేటట్లు మనం రాయలేము. కనుక మాట్లాడేటట్లు రాయడమన్నది అసాధ్యమైనపని. భాషకు అనవసరమైన మార్పులు చేసుకుంటే మనమే నష్టపోతాం. వెంకటచలంగారు చేసినమార్పులు అనవసరమని తలుస్తున్నాను.

(2) అచ్చుతో ప్రారంభించే టటువంటి మాటలు వాక్యాదిని వచ్చినప్పుడు అచ్చుగానే వుంటాయి. అవే వాక్యంమధ్యవస్తే ఆఅచ్చులే మరొకరూపం పొందవచ్చు. వాక్యాదినే శ్రీవెంకటచలంగారు 'యిష్టం, వురుము, యీమధ్య' మొదలైనవి ఉపయోగించేరు. ఇది తప్పు. నేను వాక్యంమధ్య 'వుండాలి' అని రాసేను. దాన్ని కుటుంబరావుగారు ఆక్షేపించేరు. వాక్యంమధ్య అన్ని అచ్చులే అయితే వుచ్చరించడం కష్టం. ఆయా సందర్భాలనుబట్టి మారుస్తాం.

(3) 'బిడ్డలశిక్షణ'లో కొన్ని ఇంగ్లీషుమాటలు అనవసరంగా వాడబడ్డాయి. వాటికి తెలుగు వుండనేవుంది. ప్రిన్సిపుల్సు అనేమాటకు నియమాలనీ, టెంపర్‌మెంటు అనేమాటకు తత్వమని అంటున్నాము. ఆయా సందర్భాలనుబట్టి పై రెండిటికీ మరికొన్ని మాటలుకూడా ఉపయోగించవచ్చు. కుటుంబరావుగారు రాసిన యీ చిన్నవిమర్శలో అనవసరంగా ఇంగ్లీషుముక్కలు, డిక్షనరీ, ఛాలెంజి, పబ్లిషు, ఇంగ్లీషులిటరేచరు' మొదలైనవి ఉపయోగించేరు. వీటి కన్నిటికీ తెలుగు వుండనేవుంది.

జేకుమళ్ల కామేశ్వరరావు.

### గ్రాంథికంబునుండి వ్యావహారికంలోకి

"ఈమధ్యనుండి మీరు సంపాదకీయంబులు గ్రామ్యంబున వ్రాయుచుండుటకు గారణంబేమి?"

"ప్రబుద్ధాంధ్రలోని గిడుగు రామమూర్తిపంతులుగారి వ్యాసం మాలో మార్పు కలిగించింది. అప్పటినుంచి సంపాదకీయాలు గ్రామ్యంలోనే వ్రాయాలని శపథం చేసికొన్నాం"

ప్రజామిత్ర (౧౫-౪-౩౪)



## వ్యాఖ్యానములు

### చచ్చినా సరేట

"నాట్యకళ సంసారులు అవలంబింపదగినది కాదని సిద్ధాంతీకరించిన యెడల అట్టి నాట్యకళనైనను నాశనము చేసి వేశ్యల నుద్ధరించుట పరమ కర్తవ్యము"

కళావంతుల తొమ్మిదో మహాసభని గురించిన సంపాదకీయంలో (౨౧-౩-౧౯౩౪) కృష్ణాపత్రిక అన్న మాట యిది.

కాలం మారిం దంటే వొప్పుకుంటాం. రుచులు మారా యన్నా సమ్మతిస్తాం. కులధర్మాలు మారిపోతున్నా యన్నా అంగీకరిస్తాం. చివరికి దృక్పథమే మారిపోయిం దంటే గూడా మాభాగే

అంటాం: కాని "కళ చచ్చినా సరే" అంటే మాత్రం "యేమిటీ!" అనవలిసివస్తుంది.

ఐహికజీవితం యాతనాబంధురం: కాని సౌఖ్యభూయిష్ఠం కాదు. అయినా మానవుడు "యింకా యింకా బతికివుండా" లని వుబలాటపడుతూవుండడం కళామాధుర్యానికి చొక్కి కాని మరొకందువల్ల కాదు.

భగవంతుడి సృష్టి అంతా కళాభరితం అన్నంత మాత్రాన చాలదు. కళకోసమే సృష్టి.

మానవజీవితానికి కళే ప్రాణం. నాగరికతకి కళే నిగ్గు.

కళ లేదా, విజ్ఞానం లేదు. సభ్యత లేదు. జీవితం వ్యర్థం.

దారిద్ర్యం అంటే ఐహికజీవితంలో కళని అనుభవించడానికి అవకాశం లేకపోవడం. పాపం అంటే పరలోకంలో కళానుభవానికి వీల్లు లేకపోవడం.

సత్యం కళకి సంబంధించిన ధర్మమాత్రం. ధర్మం కళకి అతివ్యాప్తీ, అవ్యాప్తీ, మిథ్యావ్యాప్తీ కలగనివ్వని కొలబద్ద. సభ్యత కళయొక్క సమ్యగ్వినియోగం.

కళ మానసికవ్యవస్థలకి అందేది కాదు. అది సూటిగా హృదయంమీద అంకితం అయేది. కాగా కళ అక్కరలేదంటే అక్కడ హృదయం లేదన్నమాట.

ప్రపంచకంలో అనేక జాతు లున్నాయి. అన్ని జాతులవారూ యీనాట్యకళని శిరసా వహిస్తున్నారు. నాట్యం లేని రోజు వారికి దుర్దినం.

పాశ్చాత్యదేశాలలో వొకడి పెళ్ళాన్ని యింకొకడు గట్టిగా కౌగిలించుకోడానికి కూడా సంఘధర్మా లంగీకరిస్తున్నాయి; గాని నాట్యకళని విడిచిపెట్టడానికి వొప్పుకోవడం లేదు.

ఇక్కడ వేశ్య లుండాలా అక్కరలేదా అని కాదు ప్రశ్న. నాట్యకళ మాట యేమిటి?

అయితే, నాట్యకళ సంసారస్త్రీలకి వుపాదేయం కాదేమో అని కృష్ణాపత్రికే సందేహిస్తోంది. మరి వేశ్యలు లేకపోతే యెలాగా?

పాశ్చాత్యదేశాలలో వేశ్యాకులం లేదు కనక మన దేశంలో కూడా వుండకూడదు. సరే. అయితే పాశ్చాత్యులు యీకళని సంసారుల్లోనే వ్యాపింపచేసుకున్నారే! మనం మాత్రం అలా యెందుకు చేసుకోకూడదూ?

వున్న దల్లా యేమి టంటే?

జర్జరిత మైపోయివున్న మన సంఘాన్ని దిద్దుకోడంలో నేడు చిత్తాకర్షకాలై వున్న పాశ్చాత్య సంఘాలను యెదట మాత్రమే వుంచుకునివుంటే మన కీచిక్కులు రాకపోవును. మన సంస్కర్తలకు అవి వరవళ్లయిపోయాయి. దానితో యిక్కడ అసాధ్య సమస్య లేర్పడ్డాయి.

"అబ్బే! వేశ్యాకులం యేమిటి?" అని వారాక్షేపిస్తే మనవారు "ఛా, ఛా! దిద్దేసుకోవా" లనుకున్నారు; గాని యిది తెచ్చిపెట్టుకున్న వుద్దేశం కావడం వల్ల నాట్యకళాసమస్యని విడదీసుకోలేక పోతున్నారు.

ఇక వీరికి సులభంగా కనపడ్డ దల్లా నాట్యకళని చంపుకోవడం. అయితే, తీరా దీన్ని సమూలంగా నాశనం చేసేసుకున్నాక అప్పుడు మళ్లీ పాశ్చాత్యులేమని ఆక్షేపిస్తారో?

ఏతావతా: మన దేశంలో వేశ్యాకులం వుండాలా అక్కరలేదా అంటే ఆవిషయంలో మాకేటూ పట్టుదల లేదు. వేశ్యలు పెళ్ళిళ్ళు చేసుకుంటే అది వారి యిష్టం. మా కేమీ ఆక్షేపణ లేదు.

ఈసందర్భంలో వారితో మా కేమీ ప్రసక్తి లేదు.

మే మడిగేది సంస్కర్తలను.

నాట్యకళకి దారి చూపించండి.

పోనీ, మనలో గూడా స్త్రీపురుష సంబంధాలు పాశ్చాత్యసంఘాలలో వున్నట్లు ఏర్పరుచుకుందామా?

## బోధపడిందా ?

మొన్నటి ౨౧ వ తేదీని బరంపురంలో సమావేశమైన ఓఢ్రయువజనుల రెండో సమావేశానికి ఎస్. సత్యమూర్తిగారు అధ్యక్షత వహించారు.

సత్యమూర్తిగారిని మాటలపోగుగా మాత్రమే మనం యిదివర కెరుగుదుం; కాని ఆయన యిప్పుడు పక్కా రాజనీతివిశారదు డని వెల్లడి అయింది.

ఆయన వెళ్ళింది ఓఢ్రయువజనుల సమావేశానికి అధ్యక్షత వహించడానికి. వెళ్ళి చేసింది ఓఢ్రులకు ఆంధ్రభూభాగాన్ని ఆక్రమించుకో మని సలహా. కటకం సమావేశపు తీర్మానాలకు తగ్గిపోవద్దని తీవ్రమైన ఉద్బోధనం.

శ్వేతపత్రంలో సూచించబడ్డ సరిహద్దులతో ఓఢ్రరాష్ట్రం లాభకరం కాదనీ, అందులో చేర్చని జయపురం, పర్లాకిమిడి పట్టణం, తత్సంస్థానం, మాళువాలు, మందసా, టెక్కలి, జలంత్రా, బుడారిసింగి, సింగుభూము, ఫుల్ జార్ మొదలగు స్థలములన్నియు ఓఢ్రరాష్ట్రమున కలిపితీరవలె ననీ వారు తీర్మానం నెగ్గించారు. ఈతీర్మానం వారే ప్రతిపాదించారు కూడానూ.

౨౧ వ తేదీ ఆంధ్రపత్రిక లాగ పాపం సత్యమూర్తిగారు మన కనుకూలంగానే ఓఢ్రులకు నచ్చచెప్పా రనుకోడం చాలా పొరపాటు. మూర్తిగారికి మన యెడల యెప్పుడూ కూడా సచ్చింత లేదు. వారి ఆంధ్రద్వేషం ఇదివర కనేకసందర్భాలలో వెల్లడి అయే వుంది.

ఆద్వేషానికి కారణమూ వుంది. ఆంధ్రమండలాలు ఎప్పటి దాకా ప్రత్యేకరాష్ట్రంగావిడిపోవో అప్పటిదాకా అరవదేశంలో ఎన్నో పెద్దపనులు సులభంగా చేయించుకోవచ్చు. విడిపోతే అరవదేశపు ఆదాయం తన ప్రభుత్వవ్యయాలకు కటాకటీగా సరిపోతుంది. ఎన్నదగిన పనులు యిప్పటిలాగ ఒక దాని తరవాత ఒకటి చేయించుకోడానికి వీ లుండదు.

పైగా అటు ఉత్కళులు లిప్పుడు ఒక విధంగా మనకి ప్రత్యర్థు లయి వున్నారు. ఇటు తమిళులు కూడా అందుకు పక్కాహంగు చేస్తే మన పని అడకత్తెరలోపడ్డ పక్కాగతిగా కిమ్మనకుండా చెయ్యవచ్చు. ఇదే గాక, అక్కడ—ఉత్కళసీమ దగ్గిర మనం తెల్లమొగం వేస్తే ఎప్పటి కేనా మనకి ఆంధ్రరాష్ట్రం వచ్చే యెడల తమిళసీమ దగ్గిర తాము నిర్లక్ష్యంగా మన న్నాదరించవచ్చు. ఓఢ్రుల దురాక్రమణం అడ్డుకోలేని మనం తమిళుల ఆటంకాలు మాత్రం తప్పించుకో గలుగుతాము కనకనా?

తన ప్రత్యర్థికి అవతలి సరహద్దులో వుండేవారితో స్నేహం చెయ్యా మని రాజనీతిలో సామాన్యసూత్రం. సత్యమూర్తిగారు దీన్నిప్పుడు లెస్సగా అనుసరించారు.

ఓఢ్రయువకులు తమ సమావేశానికి సత్యమూర్తిగారిని అధ్యక్షులుగా ఆహ్వానించడంలో కూడా చాలా అర్థం వుంది. ఏమంటే? స్వరాజ్యపక్షం పేరితో కాంగ్రెస్సువారు మళ్ళీ శాసనసభలో ప్రవేశించబోతున్నారు. ఇదివరకి మదాసుశాసనసభలో ఆంధ్రరాష్ట్ర ప్రస్తావం రెండుమాట్లు నెగ్గివుంది. ఇప్పుడు సత్యమూర్తిగారిని ఈవిధంగా కట్టుకుంటే వచ్చే యెన్నికలలో వారు యెలాగా నెగ్గుతారు గనక అప్పుడు వారి సాయంతో ఈతీర్మానాన్ని సులభంగా తిరగతోడెయ్యడవచ్చు. లేదా వారి మంత్రాంగంతో జయపురం, పర్లాకిమిడి వగైరా ప్రదేశాలను సులభంగా ఓఢ్రరాష్ట్రంలో కలుపుకోవచ్చు.

నిజమే. మన కంటే ఇతర్లంతా రాజ్యతంత్రవిశారదులే. అరవవారిని సాంబారుమూర్తు లని ఎగతాళి చెయ్యడం తప్ప మన కేనీతీ తెలవదు. గుజరాతీల వెనకాలా, హిందూస్థానీల వెనకాలా బుర్ర వంచుకు వెళ్ళ మంటే—అడిగారూ?



౩౮

"తమరు దయతో పంపిస్తూన్న 'ప్రబుద్ధాంధ్ర' తొలి మూడుసంచికలు అందుకున్నాను. కేవలగద్య రచనలకే తావివ్వడం సమంజసంగాను, ఆంధ్రభాషాపురోభివృద్ధికొరకంగానూ వున్నది. భాషాదేవికి కథలు గూర్చిన "పూలదండ" కంఠాభరణంగా యిచ్చినది మీరే మొట్టమొదట. మీ కలం మళ్ళీ ప్రబుద్ధాంధ్రలో కనిపించేసరికి పాతస్నేహితుణ్ణి చాలా కాలానికి చూచినట్లయింది. "ఆంధ్రమహాసభను మళ్ళీ నాలుగు పాదాల మీద నిలబెట్టే బాధ్యత "ప్రబుద్ధాంధ్ర"ది. ఆకార్యసాధనకు కావలసిన ఆరోగ్యము, ఆయుర్దాయము "ప్రబుద్ధాంధ్ర"కు కలగాలని ప్రార్థించాలి మనం"

కొల్లూరు ధర్మారావుకవి బి. ఏ.,
(ఆంధ్రగీర్వాణసాహిత్యపరిషత్తు)

౩౯

"జీవము కలిగిన భాషతో సునిశితమైన భావాన్ని ప్రకటించే ఆంధ్రవిలేఖక వర్గములో శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు పెట్టింది పేరు. అటు గ్రాంథికభాషలోనూ, యిటు వ్యావహారిక భాషలోనూ శాస్త్రిగారి కలం మనోహరంగా నృత్యం చేస్తూ వుంది. సారస్వతసేవ చెయ్యాలనే సంకల్పంతో శాస్త్రిగారు పది సంవత్సరాలకు పూర్వము ప్రబుద్ధాంధ్ర అనే పక్షపత్రికను సాగించారు. సంస్కృతాంధ్రభాషలలో శక్తివంచన లేకుండా ఒక సంవత్సరము పని చేశారు. ప్రజాదరణం తక్కువగా ఉండడంచేత పత్రికను మాసపత్రిక చేసి కొంత కాలము నడిపారు. చందా తక్కువగా ఒక్క రూపాయి చేసి కొంత కాలము పని చేశారు. అనారోగ్యమువల్లనో, ప్రజాదరణ తక్కువచేతనో పత్రికను ఈమధ్య కొంతకాలము నిలిపివేశారు. "మిగడతరకలను భారతి" కందిస్తూ కొంతకాలము సారస్వతార్చన సాగించారు. తిరిగి జనవరినుండి పత్రికను శాస్త్రిగారు బయలుదేరదీశారు. పద్యవాఙ్మయాన్ని ప్రకటించక గద్యానికి మాత్రమే తావిచ్చి పత్రికను నడపటానికి శాస్త్రిగారు పూనుకున్నారు. శాస్త్రిగారి ఆంధ్రత్వాభిమానములో శతాంశమైనా ఆంధ్రులు కనపరిస్తే ప్రబుద్ధాంధ్ర ఆంధ్రులకు చేసే సేవ అద్వితీయమని ఘంటాపథంగా చెప్పవచ్చును"

పద్మశాలి. (ఫిబ్రవరి ౧౯౩౪)

౪౦

"ప్రబుద్ధాంధ్ర—మార్చిసంచిక. "తెలుగువారి దేశభాషాభిమానం" అను వ్యాసమును చదివితీరవలయును. నవీనఖండకావ్యములు శృంగారరసమునే ప్రధానముగా గ్రహించినవి. కావ్యమునకు భావమును రసమును ప్రధానము గాని క్రొత్త ఛందస్సు కాదు. గ్రాంథికభాష గద్య కుపయోగించినట్లు పద్యమున కుపయోగింపదేమో యను సందేహము గలుగుచున్నది. శ్రీశేషాద్రిరమణకవుల "గంగాధరుడు" అను మంత్రివర్యుని చరిత్రము చరిత్రజిజ్ఞాసువుల కత్యంతోపయోగము. ఆంధ్రుల చరిత్రమును కాకతీయుల చరిత్రము నామంత్రివర్యుని చరిత్రముతో కలిసియున్నవి. వ్యాఖ్యానాలలో చెప్పినట్లు రాయలసీమవారికి సర్కారుల ఆంధ్రులకూ వైమనస్యాలు జాతికి వేరుపురుగులు. ఇవి మన ప్రతిభకి కళంకం కలిగిస్తున్నాయి. సర్కారులవారూ రాయలసీమవారూ ఆంధ్రులైపోవాలి. వాస్తవమే. కాని "దీనికి సాధనం ఆంధ్రవిశ్వవిద్యాలయం కాదు, ఆంధ్రోద్యమం" అన్నారు. ఆంధ్రవిశ్వవిద్యాలయం ఆంధ్రోద్యమానికి సాధన మని మా మనవి. వేదికలు వ్యాసకర్త లందరూ చదివి అందలి విషయములను గ్రహించవలయును"

సరస్వతి (౧ వ సంపుటం, ౨౩ వ సంచిక)

౪౧

"రాజమండ్రి కలాభివర్ధనపరిషత్తుపక్షమున శ్రీయుత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి సంపాదకత్వమున వెలువడుచున్న ప్రబుద్ధాంధ్ర యను మాసపత్రిక మా కార్యాలయ మలంకరించినది. ఆంధ్రదేశమున విజ్ఞానమును పెంపొందించగల వచనవాఙ్మయమును సంస్కరించుట కీపత్రిక పాటుపడుచున్నది. ఇందు ప్రచురింపబడు వ్యాసము లన్నియు నాంధ్రమండలమున పేర్వాసిన మహాపండితవిరచితములై రసభరితములై మనోరంజకములై పాఠకులను మరల మరల పఠింపజేయుచున్నవి. సర్వజన సమాదరణీయ మగు నీపత్రిక ఆంధ్రదేశమున ప్రతివ్యక్తియు తప్పక ఆదరింపదగియున్నది.

హిందూసుందరి (మార్చి ౧౯౩౪)

౪౨

"పత్రిక దినదినాభివృద్ధి చెందుగాక యని కోరుచున్నాను"

దంతుర్తి శాంతయ్య

౪౩

"పత్రికసకాలమునకు వెలువడుచున్నందుకు సంతోషము. అంతయు భాషావిషయికవ్యాసములే యున్నవి. గ్రామపునర్నిర్మాణవిషయమును కూడ చెప్పింపవేడెదను"

నరసింహదేవర సత్యనారాయణ

౪౪

"తమ జాబు చేరింది. ప్రబుద్ధాంధ్రను మళ్ళీ ప్రారంభించా రని తెలుసుకోవడంవల్ల బ్రహ్మానందం పొందాను. శ్రీపాదవారి లేఖినీజలయంత్రం నుండి వెలువడే కథాధారల్లో ఆంధ్రదేశం మొదటి నుంచీ మునక లిడుతూనే వుంది. అయితే దురదృష్టంచేత అందుకు అంతరాయం కలిగింది. ఇప్పుడు మళ్లీ దైవికంగా తమ లేఖినీయంత్రం పని సాగించడం మొదలెట్టింది. ఇది తెలుగుపెద్దలు చేసుకున్న పుణ్యవిశేషమే కాని యింకోటి కాదు. అనేకవిధాల అనర్థదాయకంగా వుండే పద్యకవిత్వానికి మీ పత్రికలో తావియ్యకపోవడం మంచిదే. ఈ సాహసానికి—కాదు. ఈ పుణ్యకార్యానికి మీరు అభినందనీయులు"

బైరెడ్డి రంగారెడ్డి

---

# స్వీకారము

## ౧౨ గోల్కొండపత్రిక రెండోసంవత్సరాదిసంచిక

ఇది మా కార్యస్థాన మలంకరించింది. పత్రికను ప్రకటించడంలో కంటే యీ సంచికను ప్రకటించడంలో సంపాదకుల శ్రద్ధ యెక్కువగా కనపడుతోంది. ఇంకా కొంచెం శ్రద్ధ చేస్తే యిది యింకా చాలా బాగుండి వుండును. ఇందులో ౨౭ విషయా లున్నాయి, వాటిలో ౯ పద్యవ్యాసాలు. వాటివిషయంలో సంపాదకులు మోగమాటపడినట్లు తోస్తుంది. అవి సంచిక విలవని తగ్గించాయి; గాని వున్నది వున్నట్టేనా వుంచలేదు... వచనవ్యాసాలలో ౧ బూర్గుల రామకృష్ణారావు బి. ఏ. ఎల్. ఎల్. బి. గారి నిజామురాష్ట్రరాజ్యాంగచరిత్ర ౨ వారిదే మన ప్రస్తుతరాజ్యాంగవిధానము, ౩ శ్రీమతి ఎల్లాప్రగడ సీతాకుమారి గారి స్త్రీలు—ఆర్థికస్వాతంత్ర్యము, ౪ ఎల్. శంకరనారాయణరావు ఎం. ఏ. ఎల్. ఎల్. బి. గారి లలితకళలు, ౫ సురవరము ప్రతాపరెడ్డిగారి టపాచరిత్ర, ౬ ఇ. రామచంద్రరావుగారి ప్రజారక్షణము ౭ శ్రీమతి లోకనంది సత్యవతీబాయిగారి ప్రస్తుత

విద్యావిధానము, ౭ వి. ఆర్. అవధానిగారి ౧౫౦ వ శతాబ్దమునాటి కబుర్లు, ౯. ఇల్లిందల సీతారామారావు బి. ఏ. ఎం. ఎస్సీగారి నిజాముష్ట్రము జనపరిగణననివేదిక, ౧౦ శ్రీమతి కనపర్తి వరలక్ష్మమ్మగారి భారతమహిళోద్యమము అమూల్యవ్యాసాలు. ఆదిరాజు వీరభద్రరావుగారి శ్రావణి అనేకథ క్రొత్త భావాలను రేపెడుతోంది; గాని ఆవేశం చాలదు. ముడుంబ వేంకటరాఘవాచార్యులు బి. ఏ. బి ఇడీగారి ఆధునికభావకవిత్వతత్త్వంలో ఎత్తుగడ బాగానే వుంది; గాని నిర్వాహణం కుంటుపడిపోయింది. పైగా శైలిని గురించి ఆచార్యులుగారు తొందర పాటు కనపరిచారు...సంపాదకుల ప్రయాస సార్థకం అయింది. ఏమంటే ఈసంచికలో నిజామురాష్ట్రము చక్కగా ప్రతిఫలిస్తోంది. గొప్పవారి చిత్రపటములు సంచిక విలవ హెచ్చించాయి. సంచిక ౭౮ పేజీలదే అయినా ఆధునికవాఙ్మయానికి మంచి భూషణంగా వుందని మేము భావిస్తున్నాము. ఇది గోల్కొండపత్రిక చందాదాలకు ఉచితం. ఆంధ్రు అందరూ గోల్కొండపత్రిక నాదరించి సంపాదకులకు ప్రోత్సాహము కలిగింపకోరుతున్నాము.

౧౩ భాగవతావతరణము :

నోరి నరసింహశాస్త్రిగారు రచయిత. సాహితీ సమితికి చెందినవారు.

సభాపతి శివశంకరశాస్త్రి ప్రోదిలో పెరిగిన వనవాటిలో నవ్యత వాసించినది. నిజమే. కాని అది పలువోకల వోయినది. ప్రతిభావంత మైన నవ్యత మనోజ్ఞమే యగును. కావ్యము రెండు విధములు: దృశ్యము, శ్రవ్యము. దృశ్యపక్కిక సంస్కృత సారస్వతమున మెరుగులు దిద్దుకొన్నది. బహుళముగా తెలుగున నాడునాటికి మెరుగుగా తరుగుగా చిందరవందర అయినది.

వాఙ్మయా నరసఖ్యమున ఒక విధముగా తెలుగు క్రొత్తదనమే నేర్చుకొన్నది. అయినా. పద్య నాటికలు తెనుగు కనులకు క్రొత్తవి. శివశంకర శాస్త్రిగారి పద్మావతీచరణ చారణచక్రవర్తి పద్య నాటిక. దీనికి ముందును వీరివి యిట్టివి కలవు. బహుశః యిట్టి రచనకు వీరే ఆద్యు లేమో. శివశంకరుని పద్యనాటికలు తత్రాపి—చక్రవర్తి సుపరిణతము. పాత్రవిన్యాసములో వస్తుసంఘటనలో రూపకత్వము చిందులు ద్రొక్కినది.

నరసింహశాస్త్రిగారి భాగవతావతరణము గూడ పద్యనాటిక. భాగవతము అవతరించుట యిందలి వస్తువు. దీనికి రూప మిచ్చుటలో కావ్యత్వము కనిపింపదు. దృశ్యకావ్యము శ్రవ్యకావ్యముకంటె విశిష్ట మయిన దను విషయము రూపక కర్తలు మరువరానిది. దీనికి ఫలితముగా ద్రష్టలకు కాక, పఠితలకు సుగమత్వము ప్రయత్నదానీయము. ఇందు కొంత వరకు శ్రవ్యకావ్యపక్కిక నడచినది. రూపకత్వము యెడనెడ లేతలేతగా గోచరించును. ప్రౌఢత్వ మున్నది. రచనాసౌష్టవ మున్నది. ఈ రెండును రూపకత్వమునో శ్రవ్యత్వమునో అధిగమించిన ప్రాప్యత కరబదరసమానము.

"నాటకాంతమ్ కవిత్వమ్" కా.

ఇందు "వైశంపుఁడు" వంటివి ప్రౌఢప్రయోగము లున్నవి. ఇవి సమూలము లయ్యె నేని సంతోషము.

'హనుమచ్ఛాస్త్రి'



# ప్రబుద్ధాంధ్ర

కళాభివర్ధనీపరిషత్తుపక్షమున ప్రకటింపబడు మాసపత్రిక

సంపాదకుడు :—శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

సంపుటము ౫ } రాజమహేంద్రవరము జూన్ ౧౯౩౮ { సంచిక ౬


## ఆంధ్రులకు ఎంతవరకు సంస్కృతం కావాలి?

ఉభయభాషాప్రవీణ ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రిగారు



ఈ ప్రశ్న చాలా విషమ మయినది.

మనము ఉగ్గూ, పాలూ, ఎవరిదగ్గర తాగినాము? ఏతల్లి ఒడిలో పెరిగినాము? అని ప్రశ్నించుకుని వెనక్కి తిరిగి చూస్తే ముసలి అవ్వ గీర్వాణి కనిపిస్తుంది.

మనం కన్నులు తెరిచి మనసారస్వతాకాశమును కలయజూస్తే అంతటా సంస్కృతముద్రలు కొనవస్తాయి. "తల్లి సమస్తభాషలకు దైవతభాష" అంటే నిజమే అనుకున్నాం. వైకృత మని స్వతంత్ర మయిన మన మాతృభాషకు పేరు పెట్టుకున్నాం. అన్వయపద్ధతీ, పదస్వభావమూ, విభక్తివిన్యాసమూ చూసిన కొద్దీ ప్రకృతి, వికృతిభావము సందేహగ్రస్తమే అయింది. ఆశ్చర్యమే వేసింది. కాగా ఇన్నాళ్లు మన్ని పెంచిన ఆమె మనకు ధాత్రి అవుతుందికాబోలు. అయితే మన తెనుగు 'పరభృతా?' అవును కనుకనే "దేశభాషలందు తెనుగు లెస్స"

దేశభాషాకావ్యములు చదివితే "రౌరవం నరకం వ్రజే" తనేటంత వెర్రిభక్తి కుదిరింది ఒకప్పుడు సంస్కృతంమీద మనవారికి. ఆ అనుశాసనకు 'నమోవాకం' చెయ్యడం ఎవ్వరికీ అవజ్ఞాకరం అనిపించలేదు. అందరూ నిష్ఠతో దానినే భజించారు.

నన్నపార్యుడు విచక్షణుడు. రాజరాజు 'కుమక్కు'తో అనుశాసనకు ఎదురు తిరిగి "రసప్రలుబ్ధధియః—లోకే బహుమన్యంతే వైకృతకావ్యాని చాన్య దపహాయ" అని దేవదత్తం పూరించాడు. తన భారత భాగంమీద, తన అనుశాసనమీద చెయ్యి తిరిగినంతవరకు స్వాతంత్ర్యం ముద్రించాడు. కాని......అసమగ్రమే.

కొద్దిగానో గొప్పగానో మనకూ భాష ఉన్నది. మనకూ వాఙ్మయం ఉన్నది. విద్వాంసులూ, గ్రంథకర్తలూ ఉన్నారు. కాని ఒకరి లక్ష్యమునకూ, ఇంకొకరి ఆదర్శమునకూ సమన్వయం లేదు. నన్నయ స్వాతంత్ర్యకాంక్షను, అథర్వణుడు కాని అహోబలుడు గాని అర్థం చేసికొని ఉండరు. వారి కాలంలోనే నన్నయ ఉంటే తేటతెనుగుభాషలోనే ఆభాషకు వ్యాకరణం ఉండడం సమంజసం అన్న విషయం తప్పక గ్రహించి ఉండును. పందొమ్మిదవ శతాబ్దివరకూ తేటతెనుగులో సరి

యయిన కట్టుబాటుతో (సంస్కృతవాసన ఉన్న దనే కట్టుండి) వ్యాకరణం పుట్టడానికి వీలు లేక పోయిందని ఏ ఆంధ్రేతరుడు విన్నా ఎంత నవ్వు కుంటాడో అనిపిస్తుంది. అసలు ఆంధ్రవ్యాకరణ చరిత్రే చిత్ర మయినది. వ్యాకరణం అనగానే మునిత్రయం కావలసివచ్చింది. పాణిన్యాచార్యునిపదవి నన్నపార్యుని కిచ్చి ఖాళీ పడిన కాత్యాయనపతంజలిపీఠములను, అధర్వణాహోబలులు ఆక్రమించారు.

ప్రౌఢప్రాయంగా ఉన్న సంస్కృతభాషకు తదనుశాసకులు నాలుగు ప్రక్కలా గట్లు వెయ్యడంలో అర్థం ఉన్నది. అక్కడికే కొట్టిన ప్రతి గండికీ అడ్డు వేసుకుని ఫరవా లేదు అంటూ వచ్చారు వారూను.

మహాప్రవాహరూపంగా ప్రవహించే దేశభాషలను చలనం లేని భాషలవలె నాలుగు గిరులు గీసి వాటిమధ్య నిలబెట్టి ,కదలితే చూడు' అని కట్టెర్ర చెయ్యడం వివేకదూర మయిన పని. "శాస్త్రప్రయోగవచసో శ్శాస్త్రం బలవదుచ్యతే। అనిష్పన్నే పదే తేన ప్రయోగాశ్రయణం మతమ్॥" అనే అనుశాసనను భజించి అహోబలాదులు "అసాధురేవ—కాగతి రితి న విద్మః," అయ్యది యవిచారమూలకంబు ఇయ్యది నిరాకరణంబు అని సంస్కృతాన్ని చూసి......వాతలు పెట్టుకోవడం హాస్యాస్పద మయిన విషయం. సంస్కృతవ్యాకరణం ముందు_ వాఙ్మయం తరవాత. అనుశాసన కుదురుతుంది. అన్నట్టూ చెల్లుతుంది. మనకు వాఙ్మయం ముందు వ్యాకరణం తరవాత (చింతామణి అసమగ్రం గనక) కనుక సత్త్వవిప్రయుక్తము లన్నీ ఉసాదేయములే అవుతాయి. ఆకాశం మీద ఉన్న నక్షత్రములను బట్టి పంచాంగములు ఉండడం సబబు. ఈ తాత్త్వికాంశమును గుర్తించిన తెనుగులక్షణకర్తలు అరుదు. సంస్కృతీయసంధులు, త్ర్వర్థకారసంధులూ, షష్టీసమాగమాభావమూ అఖండయతులూ, రలయతులూ, రేఫశకటరేఫమైత్రీ. అన్నీ సత్త్వవిప్రయుక్తము లయినవే ఉన్నవి. కాని ఏమయినా ఇవి ప్రయోగించితే తప్పు. ఇదంతా సంస్కృతరీతిని అర్థంచేసుకోకపోతే వచ్చిన ముప్పు.

మన వాఙ్మయమున సాహిత్యమీమాంసాగ్రంథములు ప్రతాపరుద్రీయమునకు తెనిగింపు లయిన పెద్దన కావ్యాలంకారచూడామణి, భట్రాజు కావ్యాలంకారసంగ్రహమును. కావ్యాలంకార సంగ్రహం వంటి గ్రంథం వ్రాసి వాఙ్మయాన్ని కలత పెట్టడం కంటె వేరే పని చూసుకుంటె బాగుండును. ఇందలి రూఢిమూలాభిద, సారోపలక్షణ, అజహల్లక్షణ, ధ్వనిప్రసక్తి చూస్తే అడివి ముళ్లూను. మూలగ్రంథమె సందేహం తీర్చాలి. లక్షను మీరిన ధ్వనులూ, తెలుగునకు పనికిరాని దోషములు, ప్రయోగమునకు రాని అలంకారములూ కావ్యాలంకారసంగ్రహంలో ఉన్నవి. ఇదంతా తెనుగు దృష్టి లేకుండా చేసిన పొరపాటు. ప్రతాపరుద్రీయసిద్ధాంతములు నిరస్తములై దాని తరవాత ఎన్నో నవ్యసిద్ధాంతములు పుట్టినవి. ఇటీవల తెలుగులో కావ్యాదర్శము, కావ్యాలంకారసూత్రవృత్తి, కావ్యమీమాంస, పుట్టినవి. ఇవి మరింత పురాణపక్కనే తెలుపుతవి కాని నవ్యరీతులను చూపలేవు. ,ఆంధ్రధ్వని' పుట్టినది కాని ,ఆలోకం' లేదు. చేతికి దొరికిన సంస్కృతగ్రంథం తెనిగించి ఆంధ్ర సారస్వతానికి వేసి కట్టడం వాపు కాని బలుపు కాదు. తన వాఙ్మయమును చూసుకుని, దానివిశిష్టలక్షణములను గుర్తించి దానికి సరి యయిన సంస్కృతగ్రంథం తెనిగించినా సరే, అరబ్బీగ్రంథం తెనిగించినా సరే, ఒప్పుకుంటాం. పదకొండవ శతాబ్ది మొదలు, పందొమ్మిదవ శతాబ్ది వరకూ ప్రవృద్ధ మయిన ఆంధ్రవాఙ్మయమును చదివి దాని గుణదోషములు కనిపెట్టి, అందచందములూ, ఔన్నత్యమూ, గుర్తించిన మహానుభావు డున్నాడా? ఉంటే అవిజ్ఞానమూర్తి ఒక సాహిత్యదీపం వెలి

గిస్తే ఆతెలుగులో ఆయన మహోపకృతికి కృతజ్ఞుల మవుతూ ఆంధ్రమాతను ఆరాధిస్తాం. నన్నయలోని, తిక్కనలోని, సోమనాథునిలోని, శ్రీనాథునిలోని, పోతనాదులలోని విశిష్టగుణదోషములను చెప్పే గ్రంథం ఆవశ్యం మనకు కావలెను. ఈప్రధాన లక్ష్యముతో రచింపబడే గ్రంథమునకు మహోన్నతము లయిన సంస్కృతసాహిత్యమీమాంసలు సహకారపడతవి గాని గుడ్డిగా సంస్కృతసామగ్రిని తెనుగుదేశానికి దిగుమతీ చేసి లాభం లేదు.

ఒకప్పుడు రాజరాజు సాయిస్తేనేం, కవిరాజు అభినివిష్టు డయితేనేం పంచమవేదం తెనుగు పొలిమేరల్లో అడుగుపెట్టి "అయం ముహూర్త స్సుముహూర్తో ఽస్తు"అన్నది. "విశ్వశ్రేయః కావ్యం" అని కవిరాజుకలం శ్రీవాణీగిరిజాధిపులకు సంస్కృతపు గొంతుతోనే నమస్కరించి సన్నద్ధ మయింది. భారతసంహితను సంస్కృతహిమశిఖరములనుంచి సకలకష్టాలూ పడి తెనుగు భూములకు దించి విశ్వశ్రేయస్కర మయిన కావ్యత్వమును అంతర్వాహినిగా అందులో కలిపి ఇదిమహాపుణ్యక్షేత్రం, అందరూ ఇందులో అవగాహించి జీవన్ముక్తులు కండి అని ప్రబోధించి నన్నప పరలోకములకు వేంచేసినాడు. నన్నపార్యుని ఉన్నతలక్ష్యమును గుర్తించినవాడు తిక్కయజ్వ. నన్నయలోనుంచి ఒక దివ్యసందేశమును అతడు విన్నాడు "సంస్కృతసారస్వతమును గుడ్డిగా భజించకండి. అది మహాసముద్రం. ఏమాత్రం ఏమరుపాటుగా ఉన్నా మిమ్మల్ని కబళిస్తుంది. దానితో స్వతంత్రత నశిస్తుంది." అని ఆతని చెవులలో గింగురు మంది. వెంటనే హృదయంలో స్వాతంత్ర్యోద్రేకమే పొంగువారింది.

స్వాతంత్ర్యకాంక్షే పరుగు లెత్తింది.

తత్ఫలితముగా భారతోత్తరసంహితను, అతడు తెలుగు ప్రాణమే పోసి, తెలుగు తొడవులే తొడిగాడు. కొత్తరూపం ఇచ్చి దీనికి సంస్కృత మేనామాలం అనిపించాడు...అంతే—

ఆంధ్రప్రముఖులు ఇంక పలువోకల పోయినారు. కావ్యములు తెనిగించినారు. కతలు పన్నినారు. ఏమైనా పదహారవ శతాబ్దివరకూ తెనుగు సారస్వతమునకు సంస్కృతమును విడిచిన నూతనోజ్జీవనం రాలేదు. పెద్దనార్యుని నూతన "సుధాపథాల"లో నడిచిన తెలుగురాణి 'అహం' అన కలిగింది. పదిహేడవ శతాబ్దిలోని సముఖమువారి వచనకావ్యము స్వతంత్రమే; కాని సంస్కృతవాసన జాస్తీ. సంస్కృతపు 'మడతపేచీ' అన్వయాలూ, గోలాంగూలవర్ణనలూ మన వచనవాఙ్మయం మీదకు కూడా ప్రాకి వారి వచనవాఙ్మయం లాగనే, తక్కువగాను వికృతంగాను చేసినవి.

తెలుగులో నాటకములు లేని లోపం కంటె సంస్కృతనాటకములు తెలిగించిన అనర్థమే ఎక్కువ.

ఇరువదవ శతాబ్దిలో ఆధునికకవు లున్నారు. వీరిలో సంస్కృతం ఎరిగిన వారు నూటికి పదిమంది. విశేషసంస్కృతజ్ఞానం కలిగిన ఆదికవులు చెడినట్టే అసలు సంస్కృతం ఎరగని ఈ అంతకవులూ పనికిరానివా రయారు.

మనము బాగా ఆలోచించి చూస్తే సంస్కృతము మనకు గొప్ప ఉపకారమే చేసింది. కనుక దానికి కృతజ్ఞత చూపుతూ దాసులము కాకుండా చూసుకోవడం ఒప్పు.

తేలిన సారాంశ మేమి టంటె—

మనం వ్యాకరణాన్ని అనసరించవలసిన ఆవసరం లేదు. స్వతంత్ర మయిన ప్రౌఢవ్యాకరణము వంటి ప్రయోగశరణము లయిన వ్యాకరణములు మనకు కావలెను. సీతారామాచార్యులుగారు చూడని ప్రయోగములు, క్రొత్తప్రయోగములూ ఉన్నవి. వాని కంతటికి ఒక వృద్ధవ్యాకరణము వ్రాసుకోవలెను. సాహిత్యసమీక్షలో సంస్కృత వాఙ్మయం బహువికాసము పొందినది. కనుక మన విశిష్టలక్షణములను ఏమరకుండా రసగంగా

ధరము వంటి ఉద్గ్రంథములను తెనిగించుకోవలెను. కవిభావనైకశరణ్యము లగు కావ్యములను వాఙ్మయాంతరములనుండి తేవడం నిరుపయోగము. దీని వలన స్వతశ్శక్తి నశించి విడిపించుకోలేని దాస్యభావం ఏర్పడుతుంది. చవి చూడ దలచితే ఒకటి రెండు తెనిగించి చాలు. కనుక సంస్కృతకావ్యములను తెనిగించ నక్కర లేదు. అయితే ఒకటి రెండు మంచి నాటకములను సంస్కృతంలోనుంచి ప్రసన్న మయిన వ్యావహారికాంధ్రవచనములో ఎవరయినా చూపవలసి ఉన్నది. సంస్కృతపురాణ వాఙ్మయం విజ్ఞానపూర్ణము. కొన్ని వందల ఏళ్లు తలచింపుకొని కనిపెట్టవలసిన విషయములూ, రసస్నిగ్ధము లయిన సన్నివేశములూ అందులో ఉన్నవి. ఆగ్నేయపురాణం కాళిదాసు కుమారసంభవమునకు దారి చూపిన దంటే దాని ఉన్నతి గుర్తించవచ్చు. గరుడపురాణములో ఎన్నో గొప్ప విషయములు ఉన్నవి. ముఖ్య మయిన పురాణములను మంచి తెనుగులో వ్రాసుకోవడం మనకు చాలా అవసర మయిన పని. సంస్కృతతర్కశాస్త్రమూ, మీమాంసా, గణితమూ, ధర్మసూత్రములు, ఉపనిషత్తులు, వేదమూ, పూర్తిగా మనకు స్వాధీనం కావాలి. విజ్ఞానభాజనము లైన సంస్కృతగ్రంథములను ఇంగ్లీషువారు వారి భాషలోకి పరివర్తించుకుని చాలా రోజు లయినది. సంస్కృతపరిసరములయం దున్న మనకంటె వారికి సంస్కృతవాఙ్మయములోని, గొప్పవిషయములూ, రహస్యములూ, బాగా తెలుసు. ఒక జాతి ఉచ్ఛస్థితికి రావా లంటే తగినంత విజ్ఞానసమృద్ధ మయిన వాఙ్మయం దానికి ఉండాలి. ఈ లక్ష్యమును కావ్యము తిన్నగా అందుకో లేదు. పరంపరగా సాధించుతుంది. 'పరివర్థయి విజ్ఞానాం' అన్నా రనే కట్టండి. అది కేవలం ప్రశంసామాత్రసారమే.

ఏతావతా—విజ్ఞానమును పెంపొందించే గ్రంథాలే మనకు సంస్కృతవాఙ్మయంనుండి కావాలి. మన జాతికీ, మన వాఙ్మయమునకు నిర్బంధము చేసి మన వ్యక్తిత్వమును, విశిష్టతను అరికట్టే నియమాలూ గ్రంథాలూ మనకు అక్కరలేదు.

(సాహిత్యమందరమునుండి)



# ఛాయాదేవి

కొవ్వలి లక్ష్మీనరసింహారావుగారు

మొదటిదృశ్యం

[స్థానం—మగధదేశపు రాజమహల్—సమయం పగలు ౧౨ గంటలు]

(చెలికత్తె అయిన కుమారితో ఛాయ)

కుమారి—ఛాయా! నువ్వూ, మహారాజూ, ఏరోజుకోసం పరితపించారో, ఆరోజు వచ్చింది. బజారు ముస్తాబు చేసేరు. వీధులన్నీ అలంకరించబడ్డాయి. రాజదర్బారుకూడా—

ఛాయ—ఎన్నో రోజులు ప్రతీక్షించాక ఇప్పటికి వచ్చిం దారోజు. ఈదినం మహారాజు సంతోషానికి హద్దు లేదు. ఆయన ఈఉదయం నన్ను కలుసుకొన్నప్పుడు, ప్రపంచకంలో ఉండే ఆనందం అంతా ఆయనకు లభించిం దని నేను గ్రహించాను. చెలీ! నీతో ఏమని చెప్పను? ఆయన నన్నెంతో గాఢంగా ప్రేమిస్తున్నారు. ఈనాడు ఆయన తన హృదయాన్ని ప్రకటించినప్పుడు నాశిరస్సు సిగ్గుచేత భూమిలోకి వంగిపోయిందంటే నమ్ము.

కుమారి—కాని, ఇప్పుడీ విషయమంతా ఎందుకు ఛాయా?

ఛాయ—క్షణకాలం ఆయన స్థితి నాలోచించి. తరువాత నావైపు ఒక్కసారి చూడు కుమారీ! వారు నేడు భారతదేశపు చక్రవర్తులు. వారి ప్రతి మాటా శాసనం—ప్రతి సంజ్ఞా ప్రబలమైన ఆజ్ఞ. నేనో—ఒక చిన్న 'పర్వతరాజు' పుత్రికను. ఆయనకూ నాకూ పోలి కెక్కడ చెప్పు.

కుమారి—ఛాయా! నీవీవిషయంలో పొరపడుతున్నావు.

ఛాయ—కాని, వారు నన్ను గాఢంగా ప్రేమిస్తున్నారు. వారెల్లప్పుడూ నన్నే కోరుతున్నారు కూడా. నేను లేనిది వారు బ్రతుకలేరు.

కుమారి—ప్రేమవాహిని కూడా ఒక్కొక్కప్పుడు ఎండిపోతూ ఉంటుంది సుమా.

ఛాయ—ప్రపంచకంలో ఉండే ప్రియతమమైన వస్తువుల్లో కెల్లా నువ్వు ప్రియతమురాల వనీ, నీకోసం పరిపాలించే భారతవర్షాన్ని కూడా అవసర మయితే విడిచిపెట్టడానికి కూడా సంసిద్ధంగా ఉన్నా ననీ ఆయన చెప్పారు.

కుమారి—ఎందుకు కాకూడదు? నువ్వు రెండు మూడు సార్లు ఆయన ప్రాణాలను రక్షించావు.

ఛాయ—అందుకోసం వారు నన్ను ప్రేమించారా? సఖీ! నువ్వు మహారాజును ఎరుగవు. వారి ప్రవృత్తి నీకు తెలియదు. నువ్వు ఆయన శీలాన్ని—ప్రేమనూ—ఉదారభావాన్ని—అవమానపరిచావు. నేను ఆయన ప్రాణాల్ని రక్షిస్తే మాత్రం అది ఉపకార మవుతుందా?

కుమారి—కాదు మరీ? నాఉద్దేశప్రకార మంతే.

ఛాయ—నీఉద్దేశ్యం సరైంది కాదు. సేవకుడు తన యజమాని ప్రాణాలను రక్షిస్తే అది ఉపకార మవుతుందా? తన నాయకుని మీదికి దుమికే శత్రుగణాలను ఎదుర్కొంటే వాడు వాని కుపకారం చేసినవా డవుతాడా? కాదు. అది అతనికి కర్తవ్యం—మనుష్యత్వమూను. వారు భారతవర్షం కోసం ప్రాణాలను సహితం లెక్కచేయకుండా శత్రువుల నెదుర్కొనే సమయంలో నేను వారికి కొద్ది సహాయం చేస్తే అది వారికి ఉపకారం చెయ్యడమా? నేను భారతదేశపు గడ్డలో పుట్టాను—ఆదేశపు అన్నాన్నే తిన్నాను—ఆనీరు త్రాగి—ఆగాలినే పీల్చాను.

కుమారి—నువ్వు చేసిం దంతా ధర్మం కోసమే. కాని దాన్ని మహారాజు మరచిపోతా డని నే ననుకోను.

ఛాయ—మరచిపోరు—మరచిపోలేరు—మరచిపోకూడదు. కాని, వారు నన్ను ప్రేమించడానికి అదే కారణ మని నే ననుకోను. రేపు ఇంకో స్త్రీ ఎవ రయినా ఆయనకు తన ప్రాణాలను అర్పించడానికి సిద్ధపడితే, ఆయన ఆమెను ప్రేమిస్తా రని నువ్వు అనుకొంటావా? కుమారీ! పురుషుల హృదయాలు అంత చవుక అయినవి కావు సుమా!

కుమారి—అయితే, ఆయన నిన్నెందుకు ప్రేమిస్తున్నారు?

ఛాయ—"ఛాయ నన్నే పూజచేస్తూం"దనీ, "నన్ను తప్ప ఇతరుల నెవ్వరిని కన్నెత్తి అయినా చూడ"దనీ, అపుణ్యమూర్తి పూర్తిగా నమ్మాడు. ప్రేమపూరిత మైన ఆయన హృదయం ఆనమ్మకం మీద నే ఆధారపడి ఉంది. లేకపోతే నాలాటి స్త్రీలు......ఆహా! ఆయనకు నేనంటే ఎంత దయ! వారు నిజంగా దేవతలే. ఆదేవతాస్వరూపాన్నే నేను ఆరాధిస్తున్నాను—

(ప్రవేశం—చంద్రగుప్తుడు)

చంద్ర—ఎవరిని ఆరాధిస్తున్నావు ఛాయా?

ఛాయ—(మాటాడక తలవంచుకొని సిగ్గుపడుతుంది)

చంద్ర—నే నిక్కడకు రావడం నీకు ఇష్టం లేదనుకొంటాను. ఈమాత్రానికే అంత సిగ్గా! బాగుంది— అవుతే ఇదిగో వెళ్లిపోతున్నాను. (వెళ్లిపోబోతాడు)

ఛాయ—లేదు మహారాజా లేదు—నే—

చంద్ర—నాకన్నీ తెలుసునులే— ఇలాగువరా—ఇవైపు చూడు. (ఛాయ చంద్రగుప్తుని దగ

రగా వచ్చి, అతడు చూపించిన రాజవీధివైపు చూసి)

ఛాయ—ప్రతినాగరికుడును తన పరిపూర్ణశక్తిని వినియోగిస్తున్నట్లు తోస్తుంది.

చంద్ర—ఎందుకు వినియోగించరు? ఈనాడు వారి ప్రభువు యొక్క వివాహదినం.

ఛాయ—(విచారంతో) కాని—మహారాజా—

చంద్ర—(ఆతురతతో) ఎందుకు ఛాయా? నీ కంఠం అలా శోకరుద్ధం అయిపోయిం దేమి? నీ ముఖకాంతి వాడిం దెందుకు? కళ్లనుంచి ఏమిటి ఛాయా? ఇటువంటి సుఖప్రదమైన సమయంలో ఎందుకు విచారిస్తావు?

ఛాయ—(కన్నీరు తుడుచుకొంటూ) మహారాజా—నేను—

చంద్ర—చెప్పు ఛాయా! చెప్పు. నీరుద్ధకంఠమూ—వాడిపోయిన ముఖము నాహృదయాన్ని చెదరగొడుతున్నాయి చెప్పు మరి. ఊఁ!

ఛాయ—మహారాజా! నేను ఈ ప్రేమవల్ల పూర్తిగా దీనురాల నైపోయాను—(ఒక్కసారి చంద్రగుప్తుని వైపు చూచి తలవంచును)

చంద్ర—(వ్యాకులస్వరంతో)అంటే?—ఛాయా!

ఛాయ—మహారాజా! నేను పేదరాలను. మీకు తగనిదానను—అయినా మీరు నన్నింతగా ప్రేమిస్తున్నారు. ఈ పవిత్రమైన మీప్రేమ ఎప్పటికీ ఇలాగునే ఉంటుందా? ఈ మీప్రేమదృష్టి ఎప్పుడైనా ఇంకొకవైపు ప్రసరిస్తే—(కళ్లనుంచి కారే నీటిబిందువులను కొనగోళ్ల మీటుతుంది)

చంద్ర—(తొందరగా) ఛాయా! అనవసరమైన ఈ విచారాన్ని నీహృదయంలోనుంచి త్వరగా వేరుచెయ్యి. ఛాయా! నువ్వు నాప్రేమను పరీక్షిస్తున్నావా? అందుకు నేను సంసిద్ధుడనే.

ఛాయ—(ఆతురతతో) లేదు ప్రభూ!—లేదు—నావిచారానికి అర్థం అది కాదు.

చంద్ర—మన యిద్దర జీవితాలకూ కూడా సుఖప్రదమైన ఈనాడు నువ్వు ఎందుకు అనవసరంగా నీ హృదయాన్ని క్షోభింపజేస్తావు ఛాయా? సర్వశక్తిసంపన్నుడు—భారతదేశపు చక్రవర్తి—అయిన చంద్రగుప్తుడు నేడు నీయెదుట నిలచి ప్రేమను—కేవలము ప్రేమభిక్షను మాత్రం వేడుకొంటున్నాడు. మాణిక్యఖచితకిరీటము—రత్నసింహాసనము—బిరుదులు సర్వరాజ్యములును నీదగ్గర సూర్యుని ముందు నక్షత్రాలు.

ఛాయ—(ఉత్సాహముతో) బాగుంది మహారాజా—బాగుంది. ఇటువంటి పవిత్రమైన మీ ప్రేమ తప్ప ఈ లోకంలో నేను కోరదగిన దింకే ముంది?

చంద్ర—దేవుని ఎదుట నాప్రేమను నీ అధీనం చేస్తున్నాను ఛాయా!

ఛాయ—ఎప్పుడూనా?

చంద్ర—ఆ! దైవసాక్షిగా ఎప్పుడూను.

ఛాయ—(చంద్రగుప్తుని కళ్లలోకిచూసి) అయితే, ఈకళ్లు ఎప్పుడూ ఇలాగునే ప్రేమజ్యోతులై వెలుగుతూ ఉంటాయా?

చంద్ర—తప్పకుండా.

ఛాయ—అయితే నాకంటె అదృష్టవతు లింక ఎవరుంటారు?

చంద్ర—ఉన్నారు ఛాయా!

ఛాయ—ఎవరు?

చంద్ర—నేను—నాప్రియమైన ఛాయా! నేనే! కొన్ని గంటలలోనే నువ్వు నాదానవైపోతావు. అప్పుడు ఏప్రపంచశక్తి కూడా మనలను వేరుచెయ్యలేదు.

ఛాయ—భగవంతుడు మనలను వేరుచెయ్యగలడు స్వామీ! ఆదుస్సహమైన కాలం త్వరలోనే వసుం దేమో! అందుకే నాహృదయం ఇంతగా క్షోభించిపోతూంది ప్రభూ!

చంద్ర—అటువంటి తలంపులు దరికి రానీకు ఛాయా! రాచకార్యాలు నన్ను తొందరపెడుతున్నాయి, మరి యిక వెళ్లనా? కాళ్లు ఆడడం లేదు. ఏం చెయ్యను చెప్పు.

ఛాయ—వెళ్లండి మహారాజా—వెళ్లండి.

చంద్ర—(వెళ్లిపోబోతూ) నువ్వు 'మహారాజా!' అని పిలవడం నాకు బాగు లేదు ఛాయా!

ఛాయ—ఎలా పిలు స్తే బాగుంటుంది?

చంద్ర—ఆర్య స్త్రీ లందరూ తమ భర్తలను ఎలాగున పిలుస్తారో అలాగున—

ఛాయ—అంటే—

చంద్ర—ఆవిషయం నీకు కొద్ది సేపటిలోనె తెలుసుందిలే.

ఛాయ—అయితే అప్పుడే ఆపేరుతో పిలుస్తాను. (నలువైపులా చూసి) కుమారి ఏదీ? (నిష్క్రమించును.)

చంద్ర—(తనలో) ఈ ప్రేమమూర్తి ప్రేమను తప్ప ఇంక దేనిని కోరదు. పాపం! నన్ను మనసారా ప్రేమిస్తూంది. నాఅదృష్టాని కింకేమిలోటు? (చంద్రగుప్తుడు నిష్క్రమిస్తాడు.)

(ప్రవేశం: ఛాయా, కుమారీని)

ఛాయ—(నలువైపులా చూసి) వెళ్లిపోయారా? ఏమో—ఎక్కడయినా ఉన్నా రేమో.

కుమారి—పిలుతునా?

ఛాయ—ఎవరిని? నువ్వెవరినిగురించి మాటాడుతున్నావు? నీమాటలు నేను కొంచమైనా వినలేదు. వేరే విషయాన్ని గురించి ఆలోచిస్తున్నాను. ఆవిషయం నీకు తెలుసునా?

కుమారి—(నవ్వుతూ) బాగా తెలుసును. నువ్వు మహారాజు విషయమే ఆలోచిస్తున్నావు.

ఛాయ—అమ్మో! ఎంత చమత్కారివే! (ఆమె ముఖంలో విచారం కనపడతుంది. కుమారి ఆమె వైపు చూస్తూ ఉంటుంది.

ఛాయ—(ఉలికపడి) కుమారీ!

కుమారి—మహా రాణీ!

ఛాయ—వద్దు కుమారీ—వద్దు—అప్పుడే అంత పేరుతో పిలవకు—తెలిసిందా?—ఇస్—నువ్వు ఏమిటి అంటున్నావు? నన్ను ఎవరు కలసికొన గోరుతున్నారు?

కుమారి—వాచాలుడు నీతో ఒక్కగంట మాట్లాడడానికి బయట వేచియున్నాడు.

ఛాయ—ఒక్క గంటేనా? (ఆలోచించి) సరే పిలు. (కుమారి వెళ్లును)

ఛాయ—(తనలో) ఇత నిప్పుడు రావడం ఎందుకోసం? అతనికి నావల్ల ఏమి కావలసి ఉంది? పాపం! ఆ అభాగ్యుడు ఇంకా నాకోసం—

(కుమారితో వాచాలుడు ప్రవేశం)

వాచా—(ఛాయవైపు చూసి) ఛాయా!—నన్ను క్షమించు—మరి—

ఛాయ—స్వాగతం! రండి. క్షేమమా?

వాచా—భగవంతుడి దయవల్ల—

ఛాయ—మీ శుభాగమనానికి కారణం?

వాచా—దేవీ! నువ్వూ నేనూ అనేక సంవత్సరాలనుంచి ఒకే చోట గడిపాము. చిన్నప్పుడు ఇద్దరమూ ఒకే చోట ఆడుకొనేవాళ్లం. జ్ఞాపకం ఉందా? నేను నిన్ను ప్రేమిస్తూ ఉన్నట్లు కూడా ఒకప్పుడు నీతో చెప్పాను—మరి—

ఛాయ—ఆప్రేమ అనే శబ్దాన్ని నీముఖతా ఎప్పుడూ విన నని అప్పుడే చెప్పాను కదూ?

వాచా—అప్పటినుంచీ నీఆజ్ఞను పాటించాను కదా?

ఛాయ—మళ్లీ తిరిగి ఇప్పుడు మాత్రం ఎందుకు—

వాచా—అందుకే క్షమింపు మని కోరుతున్నాను. నీదగ్గరనుంచి కడసారి శలవు పొందడానికి వచ్చాను. ఈ అభాగ్యుని ముఖం ఇంక ఎప్పుడూ నీకు కనపడదు లే. తొలిసారి నేను నీముఖం చూసినప్పుడు నాప్రేమ ఇలాగున శిథిలం అయిపోతుం దని అనుకోలేదు.

ఛాయ—అదంతా ఇప్పు డెందుకు?

వాచా—మోడువారిపోయిన నాహృదయం ఎప్పటికైనా మళ్లీ చిగురుస్తుందేమో అని ఇప్పటి దాకా నిరీక్షించాను. ఆనిరీక్షణకు కూడా ఇంకా క్కడా తావు లేకుండా పోతూంది.

ఛాయ—నేను నిన్ను సోదరభావంతోనే మొదటినుంచీ ప్రేమిస్తున్నాను. ఆసోదరప్రేమ ఎప్పటికీ అలాగే ఉంటుంది. నాహృదయం ఇంకొకరి అధీనం. ఒక స్త్రీయొక్క ఇటువంటి సుఖప్రదమైన వివాహసమయంలో ఇల్లాంటి వ్యాకులప్రసంగాలు తెచ్చి, కష్టపెట్టడం తప్పని నీకు తెలీదూ?

వాచా—కాని—పరిపూర్ణత చెందిన నాహృదయాన్ని నేను ప్రేమించిన స్త్రీకి ఆఖరుసారి విప్పి చూపిద్దామని వచ్చాను. నాలో ఉండే జీవశక్తి క్రమంగా క్షీణించిపోతూంది. నేను జీవించు నంత కాలమూ నాసర్వశక్తులతోనూ నిన్ను ప్రేమించుకొంటూనే ఉంటాను. దాని నెవరూ అడ్డుపెట్టలేరు— కాని ఇంక ఎప్పుడూ నాప్రేమ విషయం తెచ్చి నిన్ను విచారపెట్టను. ఎప్పుడయినా వాచాలుడు చచ్చిపోయాడని నువ్వు వింటే, ఒక్క వేడి నిట్టూర్పు నయినా విడుస్తావని నేనను కొంటాను. అనుజ్ఞ నియ్యి— ఇక శలవు.

(వాచాలుడు నిష్క్రమిస్తాడు)

కుమారి—(ఛాయ వైపు తిరిగి) ఎటువంటి వీరుడు! ఎటువంటి సదాచారుడు! పాపం! అతన్ని చూస్తే నాకు జాలి కలుగుతూంది.

ఛాయ—(నిట్టూర్పు విడిచి) కుమారీ!

కుమారి—ఏమి మహారాణీ!

ఛాయ—మహారాజుగా రెక్కడున్నారో చూడు.

కుమారి—ఇప్పుడాయనతో ఏమి పని?

ఛాయ—ఆయనతో ఒక్క విషయం మాట్లాడాలి. వెంటనే తీసుకొని రా.

కుమారి—మంచిది (నిష్క్రమిస్తుంది)

(ఛాయాదేవి ఆకాశంవైపుచూసి నిట్టూర్పులు విడుస్తూ ఉంటుంది.)

రెండో దృశ్యం

(రాజమహాలులో రెండో గది—సమయం: పగలు రెండు గంటలు—చంద్రగుప్తుడు వాచాలుడు చెరో కుర్చీమీదా కూర్చొని ఉంటారు.)

వాచా—(విచారముతో) మహారాజా! నేనీనాడు మగధదేశాన్ని విడిచిపెట్టి వెళ్లిపోతున్నాను. మీఆజ్ఞకై వచ్చాను.

చంద్ర—వాచాలా! నీముఖం అంత విచారసూచకంగా కనపడుతూం దెందుకు? నీ విచారకారణాన్ని చెపితే, దాన్ని పోగొట్టడానికి ప్రయత్నం చేస్తాను చెప్పు,

వాచా—(ఊరకుండును)

చంద్ర—మాట్లాడ వేం వాచాలా?

వాచా—మాట్లాడకుండా ఉంటేనే మంచిది. నేను మాట్లాడితే మీకు కూడా విచారం కలుగుతుంది.

చంద్ర—ఫరవా లేదు. చక్రవర్తి నైన నేను నిన్ను ఆజ్ఞాపిస్తున్నాను. నీ విచార కారణాన్ని చెప్పు.

వాచా—(ఆశతో) నిజంగా మీరు నావిచారాన్ని పోగొడతారా ప్రభూ?

చంద్ర—అది చంద్రగుప్తుడి శక్తికి మించనిదవుతే—

(ఒక సేవకుడు ప్రవేశం)

సేవ—రాజగురువు లయిన చాణక్యులవారు వచ్చారు. (వాచాలచంద్రగుప్తులు చాణక్యుని కెదురేగి తీసికొని వచ్చి ఉచితాసనాశీనుణ్ణి చేస్తారు. సేవకుడు నిష్క్రమిస్తాడు.)

చాణ—చంద్రగుప్తా! ఈనాడు నీవివాహం కాదూ?

చంద్ర—అవును గురుదేవా!

చాణ—నువ్వు నాశిష్యుడ వేనా?

చంద్ర—(ఉలికిపడి) చిత్తము.

చాణ—నేను చెప్పినట్లు చేస్తావా?

చంద్ర—ఆ! చేస్తాను.

చాణ—దైవసాక్షిగా—

చంద్ర—ఆ! దైవసాక్షిగా.

చాణ—అది నీఇచ్ఛావిరుద్ధమయితే

చంద్ర—అవు గాక!

చాణ—అయితే విను. ఇది నీకు పరీక్షాసమయం.

చంద్ర—(కంగారుతో) ఏమిటి గురుదేవా ?

చాణ—ఛాయాదేవిని నీవు పెండ్లాడరాదు.

చంద్ర—(తొట్రుపాటుతో) గురూత్తమా !

చాణ—ఇది చాణక్యుని యాజ్ఞ.

చంద్ర—అయితే—

చాణ—నీశ్రేయస్సును కోరి నేనిలా చెపుతున్నాను. ఛాయతో నీకు వివాహం పనికిరాదు.

చంద్ర—ఏమి ?

చాణ—రాజగురువు నీప్రశ్నల కన్నిటికి సమాధానం చెప్పడానికి బాధ్యుడు కాడు.

చంద్ర—క్షమించండి.

చాణ—చంద్రగుప్తా !

చంద్ర—గురుదేవా !

చాణ—నువ్వు చక్రవర్తివి. నీదేశానికి—నీజాతికి నీమీద అధికారం ఉంది.

చంద్ర—అవును.

చాణ—ఛాయ ఒక సామాన్యపురాజు కూతురు

చంద్ర—అయితే—

చాణ—ఆవివాహం భారతవర్షానికి ఎటువంటి ఔన్నత్యాన్నీ తేలేదు.

చంద్ర—కాని—గురుదేవా ! నాహృదయం—

చాణ—భారతవర్ష ఔన్నత్యం నీత్యాగాన్ని కోరుతూంది. ఒక్కసారి వెలుపలకు వెళ్లి చూడు. ప్రజలు నిన్ను ఎలాగున నిందిస్తున్నారో తెలుస్తుంది. అది నీకు ఇష్టమేనా ?

చంద్ర—గురుదేవా ! కేవలనిందామాత్రం అయితే, అది నాప్రేమవాహినిలోని తుంపర.

చాణ—మరి భారతదేశమో ? వల్లకాదు చంద్రగుప్తా ! ఛాయతో నీకు పెళ్లి వల్లకాదు.

చంద్ర—ఛాయవంటి ప్రేమమూర్తితో ఇంకేదీ సాటి కాదుస్వామీ—ఛాయ ప్రేమజ్యోతి—ఆమెది పవిత్రప్రేమ—

చాణ—చంద్రగుప్తా ! అయితే ఈపెళ్లి మానవూ ?

చంద్ర—మానలేను గురుదేవా !

చాణ—మానవా ?

చంద్ర—ఆ పవిత్రప్రేమమూర్తి జీవితాన్ని వ్యర్థం చేస్తారా గురుదేవా! ఆమెతో పెళ్లి నా ప్రబలప్రతిజ్ఞ. ఆమె నన్ను తన ప్రాణంకన్నా కూడా అధికంగా ప్రేమిస్తూంది. ఇప్పుడు నేను ఆమెతో ఏమని చెప్పాలి ? (నిట్టూర్పు విడచి) అయ్యో! ఈవిషయం ఆమెకు తెలుస్తే, ఆమె హృదయం తుత్తునియలై పోతుంది కాని ఇంకేమయినా ఉందా ? ఆమె కప్పుడు మానుషత్వంమీద నే అసహ్యం పుడుతుంది—పురుషజాతి నామె వెయ్యివిధాల శపించక మానుతుందా ?

చాణ—చంద్రగుప్తా! అయితే నువ్వు నా ఆజ్ఞను పాటింపవా ?

చంద్ర—దేవా! నాకా శక్తి లేదు.

చాణ—చంద్రగుప్తా ! నేను నిన్నింతవరకూ తెలుసుకోలేకపోయాను. ఇప్పటివరకూ నీభుజబలం వల్ల ఆర్జించిన యశాన్ని ఒక్క అబల చేతులో పెడుతున్నావా? ఈ పెళ్లి వద్దని, నీదేశం వెయ్యి విధాల ఘోషపెడుతూంది. చివరకు ఈ వివాహ పరిణామం, నీసర్వరాజ్యవిధ్వంసానికీ మూలం అవుతుంది సుమా! బాగా ఆలోచించుకో. చంద్రగుప్తా! ఆలోచించు. నీభావిసంతానంచేత నువ్వు గర్హింపబడతావు. అది నీకు సమ్మతమేనా ?

చంద్ర—నేనేం చెయ్యగలను గురుదేవా ? ఈ పరీక్ష చాలా కఠిన మైనది.

చాణ—వత్సా! నీదేశం వైపు ఒక్కసారి సింహావలోకనం చెయ్యి.

చంద్ర—అందువల్ల లాభం?

చాణ—అది నే నెరుగుదును. వత్సా! నేను చెప్పినట్లు చెయ్యి. నీకు శుభ మవుతుంది—ఇంక ఎదురాడకు.

చంద్ర—మంచిది—కాని—గురు—

చాణ—ఇప్పుడు నువ్వు చంద్రగుప్తుడు చెప్ప వలసిన మాట చెప్పావు. ఇకలే—నాతోరా—(వాచాలుని వైపు చూసి) వాచాలా!

వాచా—(తలవంచుకొని) గురుదేవా!

చాణ—నువ్వు ఛాయదగ్గరకు వెళ్లి, ఈ వివాహం జరగ దని చెప్పు—ఇది చంద్రగుప్తుని దృఢ నిశ్చయ మని చెప్పు—

వాచా—మంచిది.

చాణ—చంద్రగుప్తా! నువ్వు చెయ్యబోయే ఈ ఘనకార్యాన్ని నీప్రజలు వేనోళ్ళ కొనియాడుతారు.

(చంద్రగుప్తుడు చాణక్యునితో తలవంచుకొని పిచ్చివానిలాగ వెళ్ళిపోతాడు.)

వాచా—(తనలో) ఈదుర్భరసందేశాన్ని ఛాయకు ఎలాగ తెలియపరచడం? అయినా నాకర్తవ్యాన్ని నెరవేర్చి, నాదారిని నేను పోతాను అరణ్యాలపడి. (నిష్క్రమిస్తాడు.)

మూడో దృశ్యం

(ఛాయాదేవి విచారముతో ఒక సోఫాపై కూర్చొనియుండగా కుమారి ప్రవేశం)

ఛాయ—(ఆతురతతో లేచి) కుమారీ! మహారాజును కలసికొన్నావా? ఎప్పుడు వస్తారు? ఏమి చేస్తున్నారు? ఆయన ఏమన్నారు? త్వరగా చెప్పు.

కుమారి—మహారాజు ఇప్పుడు చాణక్యుని దగ్గర ఉన్నారు.

ఛాయ—ఏమి చేస్తున్నారు?

కుమారి—ఆయన కళ్ళనుంచి వేడివేడి నీటి బిందువులు జలజల రాలుతూన్నాయి.

ఛాయ—ఊ!

కుమారి—చాణక్యుడు ఆయన మాటల నెంతమాత్రము వినడం లేదు.

ఛాయ—(విచారంతో) నిజమేనా కుమారీ!

కుమారి—నిజమే. మహారాజు పిచ్చివానివలె అయిపోయారు.

ఛాయ—కాదు కుమారీ! కాదు—అది కూడ మోసమే. పురుషులు మోసగించడంలో చాలా నిపుణులు. ఆయన నన్ను మోసం చేశారు అనడానికి ఏమీ సందేహం లేదు. ఇంతవరకూ జరిగిన వివాహప్రయత్నానికి ఇంతలోకే సర్వవినాశనమూ నా?—కుమారీ!

కుమారి—దేవీ! శాంతించు. నీహృదయానికి తీరని క్షోభ కలిగింది.

ఛాయ—(నిట్టూర్పు విడచి) కుమారీ—ఇలా రా!

కుమారి—(ఛాయకు దగ్గరగా వస్తుంది.)

ఛాయ—కుమారీ! ఈ వస్త్రాలంకారాలను నీ చేతులతోనే ధరింపజేసావు కదూ?

కుమారి—ఇలాగున జరుగుతుం దని నాకేమి తెలుసును దేవీ?—మరి—

ఛాయ—వీటి నన్నిటిని మళ్ళీ నీచేతులతోనే తీసెయ్యి.

కుమారి—(మాట్లాడదు)

ఛాయ—నీవల్ల కాదూ? పోనీలే! నేనే తీసేసుకొంటాను. (సర్వాలంకారాలను తీసివేసి, ఒక పాతచీర ధరిస్తుంది)

కుమారి—ఏమిటి ఛాయా? ఏమిటిది!

ఛాయ—మహారాజు వస్తున్నారా?

కుమారి—అవును—అటు చూడు—

ఛాయ—ఆయనను నేను కలుసుకో నని చెప్పు. (వడివడిగా నడచి వెళ్ళిపోతుంది. కుమారి ఛాయ విడిచిన వస్త్రాలంకారాలను మూటకడుతూ ఉంటుంది—అప్పుడు చంద్రగుప్తుడు చిన్నపోయిన ముఖంతో ప్రవేశం)

చంద్ర—కుమారీ! ఛాయ ఎక్కడ? ఆమె నొక్కసారి తీసుకొని రా.

కుమారి—(తలవంచుకొని వెళ్లును.)

చంద్ర—(తనలో) ఆఖరికి ఆసమయం వచ్చింది. ఇప్పుడు ఛాయతో నేనేమని చెప్పాలి? ఒక అమాయకపు బాలికయొక్క ఆశయాలను—కోరికలను—నాచేతులారా నాశనం చేస్తున్నాను. అమూల్యమైన ఆప్రేమలత నాపదఘట్టనంచేత నలిగిపోతూంది. ఇది వీరత్వం కాదు—కేవలం అత్యాచారమే. ఆ ప్రశాంత తేజోమయముఖపద్మంనుంచి కన్నీరు కా

ల్వాలై పోరడం నేనిప్పుడు చూడాలి. (చాణక్యుని ఉద్దేశించి) ఓగురుదేవా! క్షమించుడు. ఈ యగ్ని పరీక్షకు నేను తాళలేను. (అటూ, యిటూ, పచారు చేస్తూ, ఛాయాదేవిచే విడువబడిన వస్త్రాలంకారాలను చూసి) పాపం! ఆమె హృదయం ఎంత క్షోభించక పోతే ఇంత పని చేస్తుందా? వాచాలుని వల్ల ఆకస్మికసందేశం విన్నప్పుడు ఆ అమాయకురాలు నన్ను ఎన్ని విధాల దూరిందో కదా! కాని ఇందులో నాదోషం అణుమాత్ర మయినా లేదు.

(కుమారితో ఛాయ ప్రవేశం)

ఛాయ—(చంద్రగుప్తుని చూచి) మహారాజా! మీరు వాచాలునిచేత పంపిన సందేశము నిజ మైన దేనా?

చంద్ర—నాదీనావస్థను చూసి, కొంచెం జాలి వహించు ఛాయా! నావంటి నిర్భాగ్యుడీ భారత వర్షంలో ఇంకెక్కడా ఉండడు.

ఛాయ—అదంతా నే నడగలేను— వాచాలుని చేత పంపిన సందేశము యథార్థము అవునా? కాదా?

చంద్ర—నువ్విలాగు నాపై కోపదృష్టి బరిపితే నేను మాట్లాడలేను ఛాయా! ఇదివరకు అనేక చిక్కుపరిస్థితుల్లో నువ్వు నాకర్తవ్యాన్ని సూచించావు. ఇప్పుడు కూడా ఆ వీరత్వమే అవలంబించి నాకర్తవ్యం నెరవేరేటట్లు చెయ్యి ఛాయా! అబ్బా! ఈమార్గం ఎంతకంటకంగా ఉంది!

ఛాయ—(నిట్టూర్పు విడచి) మహారాజా!

చంద్ర—దేవీ!

ఛాయ—మీరు— నన్ను.........

చంద్ర—దేశం— దేవీ! ప్రజలు—

ఛాయ—(కళ్లనుంచి కారే నీటిని తుడుచు కొంటూ) దేశమా! ప్రభూ! దేశ మేమంటూంది?

చంద్ర—మన వివాహం అనుచిత మని.

ఛాయ—ఏం?

చంద్ర—ఇప్పుడు దేశానికి కొంత శక్తి అవశ్యకమై ఉంది—

ఛాయ—అంటే—

చంద్ర—నువ్వు సాధారణపు రాజకుమార్తెవు.

ఛాయ—ఊఁ?

చంద్ర—నువ్వు—ఒక—

ఛాయ—(ఉద్రేకంతో) నేను ఒక సాధారణ పర్వతరాజుకుమార్తె నయినంతమాత్రాన్ని నాపై దోషారోపణమా? నాశీలానికి ఏమి కళంకము? నేను కారుచీకటికంటే నల్లగా ఉన్నానని, నాహృదయం కూడా పాపభూయిష్టమై అపవిత్ర మని తలుస్తున్నారా? మీకు శక్తి ఉంటే నాహృదయాన్ని చీల్చి చూడండి దాని పవిత్రత మీకు తెలుస్తుంది—శరీరాన్ని కోసి చూడండి ప్రతిరక్తనాళంలోనూ పవిత్రప్రేమ ప్రవహించడం మీరు చూస్తారు—

చంద్ర—అవును ఛాయా! కాని, ఈవివాహం వల్ల సామ్రాజ్యం ఏవిధంగానూ వృద్ధిపొందదు.

ఛాయ—(ఈర్ష్యతో) అయితే రాజ్యం విస్తీర్ణం అయ్యేటందుకు ఏమి ఆలోచించారు?

చంద్ర—ఇది గురుదేవుని యాజ్ఞ—

ఛాయ—ఏ మని?

చంద్ర—శల్యూకస్— కూతురు...

ఛాయ—అవును. ఆమె చాలా అందమయినది. అర్థబలం, అంగబలం కూడా ఉందామెకు. మరి నేనో! (విలపిస్తూ) ఒక సాధారణపు రాజు కూతుర్ని. సరె, మీకోరికకు నేను అడ్డురాను. ఆసౌందర్యరాశితో సుఖించేటప్పుడు ఎప్పుడైనా నన్ను మీహృదయంలో స్మరించండి— ఇదిగో వెళ్లి పోతాను— కడసారి అనుజ్ఞ నియ్యండి. (చంద్రగుప్తుని కంఠానికి తన చేతులను బెనవైచి విలపిస్తూ ఉండగా చాణక్యుడు కోపంతో ప్రవేశిస్తాడు— ఛాయా చంద్రగుప్తులు లేచి దూరంగా తొలుగుతారు.)

చాణ—(కోపంతో) ఏమి చంద్రగుప్తా! నీప్రజలు నిన్ను వేనోళ్ల నిందిస్తూ ఉంటే, నువ్వింకా

ఈఛాయా ప్రేమవల్లరిలో పడి కొట్టుకొంటున్నావా? (ఛాయవైపుతిరిగి) ఛాయా! నువ్వింకా చంద్రగుప్తుని విడిచిపెట్టవా?

(ఛాయ వెళ్లిపోవును. కుమారి వెనకాల వెళ్లును)

చంద్ర—(వణకుతూ) గురుదేవా?

చాణ—మారుమాటాడకు—రా—

(తెరలో_మహారాజా_ఛాయ-విషము_రక్షించండి)

చంద్ర—చాణ—(ఒకేసారి) ఏమది?

(కుమారి,ఛాయను మెల్లగా నడిపిస్తూ ప్రవేశం)

కుమారి—మహారాజా! ఛాయాదేవి విషమును మ్రింగినది.

చంద్ర—(పడిపోతూన్న ఛాయను పట్టుకొని) అయ్యో! ఎంత పని చేశావు ఛాయా! కుమారీ! రాజవైద్యుని పిలు.

ఛాయ—(కష్టంతో) వైద్యుడు నాకేమీ చెయ్యలేడు—రాజా! నాతుది దినం నేడే—నేను—నాకర్తవ్యాన్ని నెరవేర్చుకొన్నాను— మీరు మీ కర్తవ్యాన్ని—నెర—వేర్చు—కొం—డి. (పడిపోతుంది).

చంద్ర—(ఛాయముఖంమీద ముఖంపెట్టి విలపిస్తూ) ఛాయా! ఛాయా!

చాణ—చంద్రగుప్తా! నువ్వు ఎవరికోసం విలపిస్తున్నావో—వారింక ఈలోకంలో లేరు.

చంద్ర—(విలపిస్తూ) గురుదేవా! ఛాయ ఇక లేదూ! నిర్మలాకాశంలో కోటిసూర్యప్రభగా వెలిగిన తార పాతాళంలోనికి క్రుంగిపోయింది—ఒక మధురగానతరంగం ఈయనంతవాయువులో లీనమైపోయింది— నవవికసితసుకుమారపుష్పం దుమ్ములో కలిసిపోయింది— అయ్యో! పవిత్రప్రేమమూర్తి ప్రాణవాయువు లీయనంతమైన ప్రకృతిలో విలీనమైపోయాయి— గురుదేవా! ఇన్నిటికీ నేనే— నేనే కారణం— ఛాయా! ఛాయా!

(ఛాయమీద చంద్రగుప్తుడు మూర్ఛిల్లిపడిపోతాడు)

తెరపడుతుంది



# హరిజనులజాతి

కొమాండూరి శఠగోపాచార్యులుగారు, ఎం.ఏ., బి.ఎల్

మన దేశమున ప్రస్తుతము పంచము లను పేర నొక ప్రత్యేకజాతి నంతను,అస్పృశ్యులనుగాఎంచుచున్నాము. హరిజను లని యిటీవల పిలువబడు యీజాతివారు మన ఆంధ్రదేశమున మాలమాదిగ లనియు, తమిళప్రాంతమున పరయ అనియు కన్నడప్రాంతమున ,హొలియ' అనియు మళయాళప్రాంతమున ,పులయ' అనియు బంగాళా మొద లగు ఉత్తర ప్రాంతములందు ,నామశూద్ర' ,డోం' ,చమార్' మెహాతర్' మొదలగు పేర్లతోను పిలువబడుచు భారతదేశ మంతటను వ్యాపించియున్నారు. వీరి సంఖ్య సుమారు ఆరుకోట్లు—అనగా హిందువు లందరిలో 1/4 వంతుకు పైగా నున్నారు. తిర్యగ్జంతువులు కూడ మన యిండ్లలోనికి దేవాలయములలోనికి వచ్చుచుండగా మానవకోటిలోని యీహిందూనివ్నజాతిని బహిష్కరించి అస్పృశ్యులుగా నెంచుట మానవధర్మమునకు వ్యతిరేక మని యెంచి వారల అస్పృశ్యతను నివారణ చేయుటకు గాంధీజీ మొదలగు కొందరు మహానీయులు ప్రయత్నించుచున్నారు. కొందరు తీవ్రసనాతనసాయకు లిందుకు వ్యతిరేకముగా ప్రచారము చేయుచున్నారు. ఈసందర్భమున ఈ అస్పృశ్యు లనబడువారు హిందువులేనా? హిందువులే అయితే అందులో వీరిది

ప్రత్యేకమగు పంచమజాతియా అను ప్రశ్న చర్చకు వచ్చుచున్నది.

వీరి జాతి స్క్రింద పరిశీలింతము. ఇటీవల మన ప్రాంతమున వీరిని ఆది ఆంధ్రు లని, తమిళదేశమున అదిద్రావిడు లని పిల్చుట, వీరు మన ఆదిహిందువు లని చెప్పుట కలుగుచున్నది. పూర్వకాలమున మన దేశమందు ఆర్యులు ద్రావిడులు అను రెండు జాతులవా రుండినట్లును వీరందరు బహుశః అన్య దేశములనుండి హిమాలయముల ద్వారా మన దేశమునకు వచ్చి యుందు రనియు చారిత్రికవిద్వాంసులు చాలామంది తలచుచున్నారు. అప్పటికే భారతదేశమున నొక జాతి జనులు వసించుచుండినట్లు స్పష్ట మగు నిదర్శనములు కలవు. వీరినే చారిత్రికులు తురేనియను లని కొలేరియను లని చెప్పుచున్నారు. ఆర్యవాఙ్మయములో అత్యంత ప్రాచీన మగు ఋగ్వేదములో కూడ 'దాస' 'దస్యు' అను అనార్యజాతివారు ఆర్యులతో యుద్ధము చేసినట్లును ఆర్యులలోనే పరస్పర యుద్ధము కలిగినప్పు డందులో నొక కక్షవారీ 'దాస' జాతుల సహాయము కలిగి రెండవజాతితో యుద్ధము చేయుచుండినట్లును వర్ణింపబడినది. తరువాత రామాయణమునను ఆర్యులు కాక వానరులు రాక్షసులు అను రెండు ప్రత్యేకజాతు లుండినట్లు చెప్పబడినది. వీరిలో వానరులు ద్రావిడజాతి అనియు రాక్షసజాతి ఆదిమజాతి యనియు తలచుటకు చాల యవకాశ మున్నది. రాక్షసు లప్పటికి నిశాచరులు, క్రవ్యాదులు, (పచ్చిమాంసము తినువారు), నరాశనులు (మనుష్యులనే తినువారు Cannibals) అగుటచేతను మన దేశపు కొండలలోను, మహాటవులలోను మారుమూల లన్ని గురెరిగిన మాయావు లగుటచేతను రాక్షసు లన్న ఆర్యుల కెక్కువ భయమును క్రోధమును కలిగియుండుట సహజము. కాని శ్రీరాములు రావణుని జంపి లంకావిజయము నందిన మీదట భారతదేశము ఏకచ్ఛత్రాధిపత్యమునకు వచ్చెను. అనగా భారతదేశ మేకసామ్రాజ్యములోనికి వచ్చి ఏకజాతి కలిగినది. వానరరాజగు సుగ్రీవుడును రాక్షసజాతిరాజగు విభీషణుడును శ్రీరామ పట్టాభిషేకమున సామంతరాజులుగా వచ్చియుండుట యిందుకు చిహ్న మయ్యెను.

దైవీప్రకృతికిని ఆసురిప్రకృతికిని జరుగు నిరంతర యుద్ధములో ఆసురిప్రకృతి కొంతకాల ముచ్ఛదశలో నున్నను చివరకు దైవీప్రకృతికే జయము కలుగు నను ఆధ్యాత్మికరహస్యము నే గాక యుగపురుషు లగు శ్రీరాములవారి రాజ్యకాలమున దక్షిణహిందూదేశీయులును లంకాప్రజలును కూడ ఏకరాజ్యములోనికి వచ్చి భారతజాతి యను ఏకజాతి యేర్పడిన దను చారిత్రికసిద్ధాంతమునుగూడ రామాయణమువలన మనము గ్రహింపవచ్చును. (దస్యులు ,రాక్షసులు' అను జాతి అసలు అనార్యజాతి కాదనియు ఆర్యజాతిలోనే అనాగరికులుగా నుండునల్లరంగు గల ఒక శాఖవా రనియు శ్రీ అవినాశచంద్రదాసుగారు Rigvdic India అను తమ గ్రంథమున తెలిపిరి; కాని యీసూచనను చారిత్రికపరిశోధకులలో చాలమంది అంగీకరించలేదు. అసురజాతి రాక్షసజాతి ఒక్క జాతియే అని తలచుచున్నారు. కాని అది సరికాదని వేదములవలన స్పష్టపడుచున్నది. అమరసింహుని నిఘంటువులో గూడ అసురుల పర్యాయపదము లొక చోటను రాక్షసుల పర్యాయపదములు వేరుగా మరియొక సందర్భమునను వ్రాయబడి యీరెండును వేరు జాతులుగా ఎంచబడినవి).

,రక్షో'జాతి కూడ పూర్వము యక్షులు గంధర్వులు కిన్నరులు సిద్ధులు వంటివారే అని అమరసింహుని ,విద్యాధరోఽప్సరోయక్ష రక్షోగంధర్వకిన్నరాః । పిశాచో గుహ్యకస్సిద్ధో భూతోఽమీ దేవయోనయః॥ అను శ్లోకమువలన సూచన యగుచున్నది. తరువాత మహాభారతకాలమునకు క్రమ

ముగా యీ ఆదిమజాతివారు ఆర్యద్రావిడులతో సంబంధములు చేసుకొనుచుండినట్లు హిడింబి చరిత్ర మొదలగు వానివలన గ్రహింపవచ్చును. నిశాచర, క్రవ్యాద, నరాశనాది స్వభావములు కాలక్రమమున వదలిపోయి ఆర్యనాగరికతయే ఆదిమజాతిలోను వ్యాపించినందున ఆర్యద్రావిడులును ఆదిమజాతివారును కలిసి హిందూజాతిగా యేర్పడినట్లు స్పష్టమగుచున్నది. ఇటీవల కొందరు తీవ్రసనాతనాయకులు అస్పృశ్యతను సమర్థించు సందర్భమున హరిజనులు హిందువులు కారని సూచించిరి.1 కాని మాలలు మొదలగు యీనిమ్న జాతివారందరు హిందూ ఆచారములనే అవలంబించియున్నారు. మనవలెనే వీళ్లును రాముడు, కృష్ణుడు, మొదలగు హిందూచారిత్రిక నామములు కలిగి వివాహములు ఉత్తరక్రియలు మొదలగు పనులు హిందూపురోహితులద్వారానే చేయించుకొనుచున్నారు. వీరును హిందూదేవతల నారాధించుచున్నారు. వీరు చేయు గ్రామదేవతారాధనయందు చాకళ్లు మొదలగు మిగతా హిందూజాతులు కూడ పాల్గొనుచున్నారు. వెలమవారు మొదలగు కొందరు తమ వివాహములందు వీరి నాహ్వానించి వీరిని మన్నించు ఆచారము కలదు. మరియు వివాహము దత్తత, వారసత్వము సమిష్టికుటుంబపద్ధతి మొదలగు అన్నివిషయములను వీరు హిందూధర్మశాస్త్ర ప్రకారమే చేసుకొనుచున్నారు. అందుచే యిప్పటికిని తక్కిన హిందువులకువలెనే హరిజనులకు కూడా హిందూలాయే మన కోర్టులలో అమలు చేయబడుచున్నది. మన కోర్టు లన్నిటిలో గూడ వీరు హిందువులుగానే పరిగణింపబడుచున్నారు.2 యూరపియనులుకూడా హిందూమతములో చేరినచో వారిని కూడ హిందువులుగానే ఎంచవలెను.3 నూరుసంవత్సరముల క్రిందట హిందువులలో చేరిన ఆదిమజాతి వారిని హిందువులుగానే ఎంచవలె నని ఒక కేసులో ప్రీవీకౌన్సిలువారు తీర్పు చేసిరి.4 అయితే వీరు హిందువులే కాని వీరిది ప్రత్యేకపంచమజాతి అని వీరు శూద్రజాతిలో చేర రని కొందరు అత్రసనాతనీయు లనుచున్నారు. కాని యిందుకు ప్రాచీన శాస్త్రములం దాధారము కనబడదు. అన్నిటికన్న ప్రాచీన మగు ఋగ్వేదసంహితలో 10 వ. మండలములోని పురుషసూక్త మనబడు 13 వ. ఋక్కులో మాత్రమే బ్రాహ్మణాదులు ఎత్తి చెప్పబడిరి. ఇందు జాతివిభజన సూచింపబడిన దని కొందరి యభిప్రాయము. ఇది విరాట్పురుషవర్ణన సందర్భము5 కాని యిచ్చట కూడ బ్రాహ్మణక్షత్రియ

1 గురువాయూరిలో వర్ణాశ్రమ స్వరాజ్యసభయందు ఆహ్వానసంఘాధ్యక్షులుగా దివాన్‌బహద్దరు టి. ఆర్. రామచంద్రఅయ్యర్‌గారిట్లే యుపన్యసించిరి. తరువాత మద్రాసులో జరిగిన సనాతనధర్మ పరిషత్తులో అధ్యక్షులుగా శ్రీ. వి. వి. శ్రీనివాసఅయ్యంగారు (ఇదివరలో హైకోర్టుజడ్జిగా నుండినవారు) అస్పృశ్యతానివారణ కోరు గాంధీగారు ధర్మశాస్త్రములకు వ్యతిరేకులైరని అందుచేత గాంధీగారును హిందువులు కారనిసెలవిచ్చిరి.

2 ఇం. లా. రి. 31 కలకత్తా 11 (ప్రీవీకౌన్సిలు) తీర్పు చూడుడు.

3 33 మద్రాసు 342 (చమారుల కేసు)

4 2 పాట్నా 230 = 18 లావీక్లీ 597 P. C. 44 మద్రాసు 740 = 15 లావీక్లీ 521 P. C.

5 బ్రాహ్మణోఽస్య ముఖ మాసీత్ । బాహూ రాజన్యః కృతః । ఊరూ తదస్య యద్వైశ్యః, పద్భ్యాగ్ం శూద్రోఽజాయత ॥

వైశ్యశూద్రులే చెప్పబడిరి కాని పంచమజాతిని దేనిని సూచింపలేదు. యజుర్వేదమునందును యిట్లే చెప్పబడినది. భగవద్గీతలో కూడ నాలుగువర్ణములే చెప్పబడినవి.[1] మహాభారతమందును విష్ణుపురాణమందును[2] నాలుగు వర్ణములే ఉదహరింపబడినవి. మనుస్మృతిలోను నాలుగు వర్ణములే చెప్పబడి "వర్ణో నాస్తి తు పంచమః" అనగా పంచమవర్ణమని వేరే లేదని కూడా స్పష్టము చేయబడినది. పంచమజాతి యని ప్రత్యేకజాతి రామాయణ భారతాదులందు గూడ ఉదహరింపబడినట్లు కనపడదు. అట్టి స్థితిలో హరిజనులు ప్రత్యేక మగు పంచమజాతి యనియు అనర్హులనియు ఆకారణమున వారి నస్పృశ్యులనుగా యెంచవలె నని వారిని శూద్రజాతిలో అంతర్భాగముగాను స్పృశ్యులుగాను ఎంచకూడ దనియు చెప్పు వాదమున సారము కనబడదు. ప్రస్తుతపు కోర్టులలో గూడ యీ విషయ మనేకసందర్భములలో చర్చకు వచ్చినది. క్రైస్తవులు హిందువులలో జేరినచో వారు శూద్రులుగ ఎంచబడుదు రని 33 మద్రాసు 342 లో తీర్పు చేయబడినది. మెనా రెండా అను ఒక ఆస్ట్రియా దేశపు దొరసాని హిందూమతములో జేరి సులోచన అను పేరు పెట్టుకొని మెరార్జి అను ఒక భాటియాను (వైశ్యకులస్థుని) వివాహ మాడెను. ఆవివాహము చెల్లు నని 52 మద్రాసు 160 లో తీర్పు చేయబడినది. 'డోం' కులపు హరిజన స్త్రీని ఒక కాయస్థజాతి హిందువు వివాహము చేసుకొనెను. ఒక మజహాబీ చమారు స్త్రీని జాట్ జాతి పురుషు డొకడు పెండ్లి చేసుకొనెను. ఈ స్త్రీలను అస్పృశ్యజాతి వారినిగా ఎంచుచున్నను వారు లాప్రకారం శూద్రజాతిలోనే చేరుదు రని ఆకేసులలో తీర్పుచేయబడినది.[3] ఇటీవల పూంగవనమ్మాళ్ అను ఒక ఆదిద్రావిడ స్త్రీని మాణిక్యం అను నాయుడు కులస్థుడు పెండ్లి చేసుకొనిన మీదట ఆవివాహము శాస్త్రసమ్మతమా కాదా అని మద్రాసు హైకోర్టులో చర్చకు వచ్చెను. హిందూలా ప్రకారం భిన్నజాతి స్త్రీపురుషుల మధ్య వివాహము సివిల్ మారేజి ఆక్టుప్రకారం రిజస్టరు కానిచో చెల్లదు.[4] ఈవివాహము రిజస్టరు కాకుండా మామూలు కులాచారప్రకారం జరిగినది. అందువల్ల ఆది ద్రావిడులు శూద్రజాతిలో వారా లేక వేరే పంచమజాతి అగునా అనే సంగతి ప్రత్యక్షముగా తీర్పుకావలసి వచ్చినది.[5] ఈపూంగవనమ్మాళ్ అస్పృశ్యురాలు అవర్ణురాలు అగుటచే శూద్రజాతి కాదని మాణిక్యం తరపున చేసిన వాదమును త్రోసివేసి హిందువులలో నాలుగు జాతులే కలవనియు ఆదిద్రావిడులు మొదలగు నిమ్నజాతు లన్నియు శూద్రజాతిలోనే చేరినవనియు అందువలన ఆపెళ్లి శాస్త్రసమ్మతమైనదీ లాప్రకారం చెల్లు ననీ మద్రాసు హైకోర్టువారు ఈసంవత్సరమే తీర్పుజేసిరి. అందుచే ప్రాచీనధర్మశాస్త్రప్రకారమున్ను ప్రస్తుతపు కోర్టుల తీర్పుల

---

1 చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః।తస్య కర్తార మపి మాం విద్ధ్యకర్తార మవ్యయం॥
భగవద్గీత 4 అ. 13 శ్లో.

2 అరణ్యపర్వ అ. 149 శ్లో 18.
అయా జాతుల గుణభేదములు చెప్పు సందర్భమున గూడ గీతలో నాలుగుజాతులే చెప్పబడినది,
అ. శ్లో. 17 బ్రాహ్మణక్షత్రియవిశాం శూద్రాణాం చ పరంతపగీత అ. 18 శ్లో. 41-44.

3 51 కలకత్తా 488 10 లాహోర్ 372

4 48 అలహాబాదు 670

5 39 లావీక్లీ 439=ఆలిండియా రిపోర్టరు 1934 మద్రాసు 116 చూడుడు.

ప్రకారము కూడ హరిజనులు హిందువు లగుటయే గాక వారు ప్రత్యేకజాతి కారనియు శూద్రజాతి కులములలో చేరియున్నా రనియు తేలుచున్నది.

మరియు హూణులు మ్లేచ్ఛులు మొదలగు అన్య జాతీయులను స్పృశింపకూడ దని కొన్ని మధ్యకాలపు శాస్త్రగ్రంథములలో కలదు; కాని దేశకాల సందర్భమును బట్టి ఆప్రకార మాచరణ జరుగుట లేదు. అట్లుజరుగుట యిప్పుడు సాధ్యమును కాదు. వారికన్న హిందూజాతీయులే అగు హరిజనులను నికృష్టులనుగా ఎంచుటకు శాస్త్రధర్మము కనబడదు. అందుచే హరిజనుల అస్పృశ్యతకు ఆచారమే కారణ మని యెంచవలసియున్నది.



# వర్కింగుకమిటీ

కౌశికుడు

స్థలం పాండురంగవిఠల్ మఠం. హాల్లో వొక మూల బట్టకప్పిన మృతకళేబరం వుంటుంది. హాలుమధ్య కొండయ్య స్తంభానికి చేరబడి కళ్లు మూసుకుని కూచుని వుంటాడు. సుమారు ఉదయం యెనిమిది గంట అయి వుంటుంది. అలాంటప్పుడు ధుమధుమ లాడుతూ తిక్కయ్య వస్తాడు.

కొండయ్య—బావాజీగారు సిద్ధి పొందారు. సమయానికి నే నొక్కణ్ణే వుండిపోయాను.

తిక్కయ్య—అయితే?......ఎవ డిచ్చాడు నీకీ అధికారం?

కొండయ్య—ఏ మధికారం?

తిక్కయ్య—ఎవ డిచ్చా డన్నాను. ఇంకా యే మధికారం అని నింపాదిగా అడుగుతున్నావూ?

కొండయ్య—నే నిప్పుడే అధికారమూ చెలాయించలేదే?

తిక్కయ్య—పైగా—నోరు ముయ్యి. ఎవ డిచ్చాడు నీకీ భరవసా? నోరు పెగలదేం?

కొండయ్య—ఏమిటోయి నీ ధోరణీ?

తిక్కయ్య—ఎవ డిచ్చా డంటున్నాను. టముకు వేయిస్తావూ?......ప్రజాప్రభుత్వం వచ్చి మీద పడిపోయే రోజు లివి. వొక్కడి మాట చెల్లడానికి వల్లకాదు. చెల్లదు. నేను చెల్లనివ్వను కూడానూ. తెలుసా? టముకువేయిస్తావూ? ఎన్ని వేల గుండెలున్నాయి నీకు?

కొండయ్య—ఇందులో—

తిక్కయ్య—ముందు నాకు సమాధానం చెప్పుకోవాలి. ఏ మనుకున్నావ్?

కొండయ్య—నువ్వనే దేమిటో నా కేమీ బోధపడలేదు.

తిక్కయ్య—నే నే మన్నా సరే. నా మాటే చెల్లాలి. చెల్లితీరాలి. రెండు సంవత్సరాలు శ్రీకృష్ణ జన్మస్థానంలో కూచుని వుగ్రతపస్సు చేసిన మాట నాది. కనీసం కద్దరేనా కట్టని నువ్వు అందర్నీ కాదని ముందుకు వస్తావేం? దిగూ గర్రం.

కొండయ్య—సంగతేమిటో చెప్ప మంటే వుపన్యాసం పేలగొడతా వేమిటోయ్?

తిక్కయ్య—వుపన్యాసం పేలగొడతానా నీ మీద అవిశ్వాసతీర్మానం లేవగొడతానా? టముకు వేయిస్తావూ?

కొండయ్య—ఎందు కలా కోప్పడతావూ? మంచీ చెడ్డా—

తిక్కయ్య—కట్టిపెట్టు వేషాలు. మళ్లీ మిలవాదుల ప్రభ వెలిగిద్దా మనుకున్నావేం పాపం! సిగ్గు సిగ్గు! ముందు క్షమాపణ కోరుకో.

కొండయ్య—ఏం తప్పు—

తిక్కయ్య—చెల్లకాదు. వూళ్లో యింతమంది వుండగా—హేమాహేమీలు— నేను— నువ్వెవడవంట?

కొండయ్య—వుంటే?

తిక్కయ్య—ఎవరితోటీ చెప్పకుండా—

కొండయ్య—ఏమిటీ చెప్పడం?

తిక్కయ్య—ఎవరూ రాకుండా—

కొండయ్య—రావడానికే కాదూ టముకు వేయించానూ?

తిక్కయ్య—ఎవ డిచ్చాడు టముకు వేయించడానికి నీ కధికారం? అది చెల్లదు. గ్రామనౌకర్ని నేను తీసుకువచ్చేశాను. వాడి కివ్వవలసిన కూలి నువ్వొకడవే యిచ్చుకోవాలి.

కొండయ్య—మరింతాలూకు సొమ్ము—

తిక్కయ్య—నీతాత సంపాదించాడా యేమిటది?......ముందు వర్కింగుకమిటీ యేర్పడాలి. ఏం చెయ్యడానికేనా ఆకమిటీ నిశ్చయించాలి.

కొండయ్య—దీనికి కమిటీ యేమిటోయ్?

తిక్కయ్య—తీసెయ్యి. బావాజీగారు నీకొక్కడికే గురు వనుకున్నావా యేమిటి? ముందు బావాజీగారి శవాన్ని కమిటీ కప్పగించాలి. అప్పుడుగాని—

కొండయ్య—అంతా దారుణంగా వుంది.

తిక్కయ్య—నోరెత్తద్దు.

కొండయ్య—అయితే నీయిష్టం వచ్చినట్టు చేసుకో. నా కెందుకూ యీ గొడవా? (తప్పించుకుని వెళ్లిపోబోతాడు)

తిక్కయ్య—ఎక్కడికి? (గుమ్మాని కడ్డంగా నుంచుని) కదలడానికి వల్లకాదు. శవాన్ని యెవరి కప్పగించావోయి పప్పూ?

కొండయ్య—నువ్వున్నావు కాదూ?

తిక్కయ్య—నా కిదొక్కటే పనా!

కొండయ్య—నాకు మాత్రం?

తిక్కయ్య—బావాజీగారు తమ శరీరాన్ని నీ కప్పగించారు. నువ్వు కమిటీకి—

కొండయ్య—నే నింకా దంతధావన మేనా చేసుకోలేదుకదా—

తిక్కయ్య—శవాన్ని కమిటీ వప్పగించుకునీదాకా పూచీ నిదీ. తెలిసిందా? చచ్చినట్టుకూచో. బావాజీగారికి జెయ్యి! (వెళ్లిపోతాడు)

కొండయ్య—ఇదేమిటి యీ దారుణం? మతి వుందా లేదా యితనికి?...కాని యేం జరుగుతుందో చూద్దాం. (ఆలోచించి) కమిటీ యేర్పడుతుందా? దానికి అసిస్టెంటుసెక్రటరీ షిప్పేనా కొట్టెయ్యాలి మనం. ఇదీ వొకందుకు బాగానే వుంది. (మళ్లీ ఆలోచించి) ఇతగాడు చూడవచ్చాడా యేమిటి? దొడ్డిదారిని వెళ్లి శంకరయ్యరు హోటల్లో కసిన్ని కాఫీనీళ్లు తాగేసి వచ్చేస్తాను.

(వెళ్లిపోతాడు)

రెండోరంగం

స్థలం వొక వీధి. ముందు సుబ్బయ్య, తరవాత శంకరయ్య నడుస్తూ వుంటారు. తొమ్మిదయి వుంటుంది.

శంకరయ్య—బావా! నీవోటు నా కివ్వాలి.

సుబ్బయ్య—నువ్వే నన్నెన్నుకోవాలి.

శంకరయ్య—నావంటివాళ్ల గొప్పతనం నువ్వు కనిపెట్టవలసిన సమయం యిది. అనేకమాట్లు నేను శ్రీకృష్ణజన్మస్థానానికి వెళ్లడానికి సిద్ధపడ్డవాణ్ణి.

సుబ్బయ్య—వందలకొద్దీ అనేకమాట్లు చందాలిచ్చినవాణ్ణి నేను.

శంకరయ్య—అలా కాదు.

సుబ్బయ్య—ఇలాగా కాదు.

శంకరయ్య—వోటంటే యేమిటో నీకు తెలవదు. నామాట విను.

సుబ్బయ్య—నీకు తెలిస్తే అదేమిటో చెప్పు చూస్తాను.

శంకరయ్య—నాతో నువ్వు వాదిస్తా వనుకో లేదు.

సుబ్బయ్య—ముందు నువ్వే మొదలుపెడతా వనుకో లేదు నేను.

శంకరయ్య—కొంచెం యోచించు.

సుబ్బయ్య—బాగా నిదానించు.

శంకరయ్య—నువ్వు చిన్నవాడవు—

సుబ్బయ్య—భారం అంతా చిన్నవాళ్లమీదే వుం దన్నారు గాంధీగారు.

శంకరయ్య—నిజమే. చిన్నవాళ్లు పెద్దవాళ్లు చెప్పినట్లు పని చెయ్యా లని దాని కర్థం.

సుబ్బయ్య—పెద్దవాళ్లకి శ్రమ కలిగించకూడ దని దాని భావం. దేశం అంతా గాంధీగారిని ప్రె సిడెంటుగా ఎన్నుకుంటే వారు దాన్ని నెహ్రూ గారి కిచ్చేశారు మరిచిపోయావా యేమిటి?

శంకరయ్య—వోరి నీయిల్లు బంగారం—

సుబ్బయ్య—వోరి నీతస్సా—

శంకరయ్య—సరే మరిచిపోకు.

సుబ్బయ్య—డైరీలో యెక్కించుకో నువ్వు.

(వెళ్లిపోతారు.)

మూడోరంగం

స్థలం మరో వీధి. తిక్కయ్యా రామయ్యా నడు స్తూ వుంటారు.

రామయ్య—ప్రతీదానికీ పుత్రయ్యని నువ్వు వెంటబెట్టుకువెళ్లడం యేమీ బాగా లేదు. నీకు చాలా అపకీర్తి వస్తోంది.

తిక్కయ్య—వాడు లేకపోతే నేను వొప్పు కోను. మాయిద్దరికీ వొకటే ప్రాణం.

రామయ్య—అయితే అమాట నాకెందుకు గాని—ఈమాటు బావాజీగారు టచ్చిపోయిన కమి టీకి నన్ను నువ్వు ప్రెసిడెంటుగా ప్రతిపాదించాలి.

తిక్కయ్య—అదేమిటి?

రామయ్య—రూల్సన్నీ తెలిసినవాణ్ణి నేను. అనేకమాట్లు నాకు అదృష్టం తప్పిపోయింది. ఇప్పు డేనా నువ్వు కొంచెం ఆలోచించాలి.

తిక్కయ్య—మరి నామాట?

రామయ్య—మరొకప్పుడు నువ్వు నిలుస్తువు గాని.

తిక్కయ్య—నువ్వే వుండరాదూ అప్పటిదా కానూ?

రామయ్య—నిన్నింతవాణ్ణి చేసినవాణ్ణి నేను. జ్ఞాపకం వుందా!

తిక్కయ్య—నువ్వు నాకు చేసిం దేమిటి!

రామయ్య—అలా అంటా వేం? ఏవొకమో షన్ డబ్బు లేదుకుంటూ వుండేవాడికి వ్యవహారం అంతా నేర్పి—

తిక్కయ్య—నువ్వు కాకపోతే మరొకడు నేర్పుతాడు. నీ నొష్టనే పొడిచిందా యేమిటి పొద్దు? కాకపోయినా నా కేమీ చేతకా దనీ, అంతా నువ్వే నేర్పా వనీ చెబుతున్నావుట అంత టానూ. జాగ్రత్త. ఏమనుకున్నావో నీ మట్టుకు.

రామయ్య—అబద్ధమా?

తిక్కయ్య—అమాటకి వస్తే నీ కేం తెలుసు నాకు చెప్పడానికి? ప్రతీదానికీ సిఫార్సు విం టూ వుంటే యిలా లోకువ కట్టావా? కబడ్దార్!

రామయ్య—ఇందులో లోకువ యేం వుందీ? అంతా సత్యం—

తిక్కయ్య—చాలించు నీ పాండిత్యం ఇక నావెంట రాకు. దూరంగా వుండు. ఓహో!

(వెళ్లిపోతాడు)

రామయ్య—ముదిరింది. ఇక పడగొట్టాలి వీణ్ణి. అడుగు ముందుకు పడనివ్వను.

నాలుగో రంగం

స్థలం మఠందొడ్డిలో చింతచెట్టుకింద. రామయ్య శంకరయ్య, కొండయ్య, సముద్రయ్య ఆలోచన లో వుంటారు.

శంకరయ్యా—ప్రతీదానికీ తిక్కయ్య ప్రెసిడెంటూ, పుత్రయ్య కోశాధికారీని. మనం వచ్చుపెద్దమ్మల మైపోతున్నాం.

కొండయ్యా—ఇంకా అవుతున్నా మేమిటి, అయేపోయాం. చివరికి నాకు అసిస్టెంటు సెక్రటరీ పనేనా వచ్చింది కాదు చూశారా?

రామయ్యా—నేను తయారు చేశా నయ్యా వీణ్ణి. నా చేతులారా పెంచాను వీడికి గర్వం. వీడికి కళ్లు నెత్తిమీదికి వచ్చేదాకా నేను తెలుసుకోలేక పోయాను. చివరికి నాకే పంగనామాలు పెట్టాడు.

సముద్రయ్యా—నీ మేనమామ కొడుక్కి అపకారం చేసినప్పుడు నే నెంత చెప్పినా విన్నావా?

కొండయ్యా—అదంతా యిప్పు డెందుకూ? ముందు సంగతి యోచించండి.

రామయ్యా—సంగతి కల్లా యేం వుందీ? మాట్లాడితే నేను డెల్లాకు వేస్తాను. మీరు నా వెనకాల భళిభళీ అంటూ వుండాలి.

సముద్రయ్యా—మాకు కూడా నేర్పి మాచేత కూడా కొన్ని వేయించా లవి. లేకపోతే—

రామయ్యా—మనకి పని కావాలా, పేరా?... పోనీ...నేర్పుతాను. ఇప్పుడు టైమేదీ! ఇప్పటికి కానివ్వండి. తిక్కయ్య నోరెత్తితే మనం అడ్డు చెప్పాలి. చెప్పి నెగ్గించుకోవాలి. ఇది అయిపోయాక రోజూ మీకు ఇలాంటి సంగతు లన్నీ నేర్పేస్తాను. మన క్లబ్బుకి నేను ప్రెసిడెంటుగా వుంటాను కదా?...ఏమంటారు?

కొండయ్యా—నేను వైస్‌ప్రెసిడెంటుని.

శంకరయ్యా—నేను శక్రటరీని.

సముద్రయ్యా—నేను ట్రెజరరుని.

రామయ్యా—సంతోషం,

కొండయ్యా—వొప్పుకున్నాను.

శంకరయ్యా—నా వోటిచ్చేశాను.

సముద్రయ్యా—ఏక్సెప్టెడ్.

రామయ్యా—ఇక మన నలుగురిదీ వొకటే మాట. అవునా?

శంకరయ్యా—అవును.

కొండయ్యా—వో.

సముద్రయ్యా—భేషుగ్గా.

రామయ్యా—మరి లేవండి,...ఇంకోటి. పుత్రయ్య యెంత డబ్బు వసూలు చేశాడో అది ముందు చెప్పించాలి. ఏమంటారు?

కొండయ్యా—తప్పకుండానూ.

శంకరయ్యా—ఇక వాడికి దమ్మిడీ ముట్టనివ్వకూడదు. వాడిలాంటి డబ్బుతోటే కుటుంబపోషణ చేసుకుంటున్నాడు.

సముద్రయ్యా—నేను మన క్లబ్బుకి ట్రెజరరుని. ఆప్రశ్న నేను వేస్తాను. ఏం?

రామయ్యా—సరే.

శంకరయ్యా—శక్రటకి కాదూ అది అడగవలసినవాడూ?

కొండయ్యా—అసలు ప్రెసిడెంటు కనుక్కోవాలి. అయితే పెద్దమనిషితరహాకోసం అతను వూరుకుంటే వైస్‌ప్రెసిడెంటుది ఆఅధికారం. నేనూ వూరుకుంటా నిప్పుడు మీకోసం. తరవాతి అధికారం శక్రటరీది. ఏమంటే? క్లబ్బు వ్యవహారం అంతా నడిపేవాడు శక్రటరీ. అయితే సొమ్ముతో పని కనక ట్రెజరరు అడిగితేనే బాగుంటుంది. ఏమంటావు రామయ్యా?

రామయ్యా—నువ్వు బాగానే చెప్పావు. సంగతి వొకొక్కటే తెలుస్తోంది సిమానూ.

కొండయ్యా—హిందూ వూరికనే తెప్పిస్తున్నా ననుకున్నావా యేమిటి నేను. ఈమధ్య చదివి అర్థం చెప్పేవాడు ఎవడూ దొరక్కుండా వున్నాడు. లేకపోతే యీ రూల్సన్నీ యీపాటికి తెలుసుకోక పోదునా?

రామయ్యా—ఇక మనం ఆలస్యం చెయ్యకూడదు. (గడియారం తీసి చూసి) ఈపాటికి పదకొండు గంటలు కాదూ?

శంకరయ్యా—(తానూ గడియారం తీసి) సరా, ముప్పావు కూడా అయి వుంటుంది.

రామయ్య—మరి లేవండి,...నాకు చాలా నీరసంగా వుంది. మీలో యెవరేనా శంకరయ్యరు హోటలికి వెళ్లి వొక కప్పు కాఫీ తెచ్చిపెట్టాలి.

శంకరయ్య—శక్రటరీ ఆపని చెయ్యవచ్చునా?

సముద్రయ్య—ట్రెజరరు తెప్పించాలి గాని స్వయంగా తేవచ్చునా?

రామయ్య—ప్రెసిడెంటు ముండాకొడుక్కి చెయ్యడాని కందరికీ బాధ్యత వుంది. ఇంతకీ యిప్పుడు మనం తిక్కయ్యని పడగొట్టాలి. నాకు నీరసంగా వుంటే యెలాగా?

కొండయ్య—పోనీ నేను తీసుకువస్తాను. ప్రెసిడెంటుకీ, వైస్‌ప్రెసిడెంటుకీ తేడా యేమీ లేదు కదా? (వెడతాడు.)

రామయ్య—భేష్! పూచీ అంటే అదీ. మరి పదండి.

శంకరయ్య—ఇకముందు నేనూ పూచీగానే వుంటాను.

సముద్రయ్య—నీతరవాత నేనూ వుంటాను పూచీగా. అందరూ వెళ్లిపోతారు.

అయిదో రంగం

స్థలం మఠంలో వొక గది. మెంబర్లు అంటే తిక్కయ్య (ప్రెసిడెంటు) తుప్పయ్య (వైస్‌ప్రెసిడెంటు) యల్లయ్య (శెక్రటరీ) పుత్రయ్య (ట్రెజరరు) ఇది వొక పక్షం) రామయ్య, కొండయ్య, శంకరయ్య, సముద్రయ్య, (ఇది వొక పక్షం) అడివయ్య, వనమయ్య (తరుమతటస్థులు) కూచుని వుంటారు.

తిక్కయ్య—అనుచరులారా! మీ రంతా నన్ను బావాజీగారి కమిటీకి ప్రెసిడెంటుగా ఎన్నుకొన్నందుకు గ్రామస్థు లంతా చాలా సంతోషిస్తున్నారు. ఈ గ్రామంలో యింతకు నాకంటే తగినవాడు లేనందుకు నేను గర్వపడుతున్నాను. (చప్పట్లు కొడుతూ) మీరు కూడా చప్పట్లు కొట్టండి.

(కొందరు కొడతారు.)

సముద్రయ్య—సొమ్మెంత వసూ లయిందో ట్రెజరరు ముందు చెప్పాలి. నా తీర్మానం యిదీ.

శంకరయ్య—నేను దాన్ని బలపరుస్తున్నాను.

పుత్రయ్య—మీకు చెప్పవలసిన అవసరం నాకు లేదు.

కొండయ్య—చెప్పించి తీరతాం నీచేత.

తుప్పయ్య—పుత్రయ్యకి నేను వోటిచ్చాను. మీరు మాట్లాడగూడ దింక.

తిక్కయ్య—మనం రూల్సుప్రకారం వెళ్లాలి, ముందు పెట్టవలసిన తీర్మానం అది కాదు.

రామయ్య—తప్పకుండా అదే ముందు పెట్ట తగది.

తిక్కయ్య—(తనలో) వీడు అడ్డంగా వస్తున్నాడా యేమిటి? (ఆలోచించి) ఇలా చెప్పి చూద్దాం. (ప్రకాశంగా) పుత్రయ్య తిరిగి తిరిగి వచ్చాడు. చాలాడబ్బు వసూలు చేసుకువచ్చాడు. అందుకు మనం కృతజ్ఞత తెలపాలి. ఇంతకీ వాడు చాలా నీరసంగా వున్నాడు. కాఫీ తాగుదా మంటే అయ్యరు అయిపోయిం దని చెప్పాడు. కనక వాడికి నీరసం తగ్గాక నేను ఆసంగతి చెప్పిస్తాను. ముందు పని కానివ్వండి.

రామయ్య—(తనవారికి రహస్యంగా) ఇప్పటికి వూరుకోండి.

సముద్రయ్య—నా తీర్మానాన్ని ఆఖరుకి అట్టే పెట్టుకున్నాను.

తిక్కయ్య—యల్లయ్యా! నీతీర్మానం చదవ్వోయి!

యల్లయ్య—బావాజీగారు వొంటినిండా వీభూది పూసుకునేవారు కనక శివుడి గుడి వెనకాల సమాధి చెయ్యాలి.

తిప్పయ్య—నే నొప్పుకున్నాను.

శంకరయ్య—బావాజీగారు మాట్లాడితే హరిహరీ అంటూ వుండేవారు కనక విష్ణుమూర్తి గుడిదగ్గర దహనం చెయ్యాలి. ఇది నాతీర్మానం.

కొండయ్య—దీన్ని నేను బలపరిచాను.

యల్లయ్య—నే నొప్పుకోను. నాతీర్మానమే నెగ్గాలి.

శంకరయ్య—నాతీర్మానమే ప్యాసు కావాలి.

తిక్కయ్య—యల్లయ్య సబబుగా చెప్పాడు. శంకరయ్యా! నీతీర్మానం నువ్వు తీసేసుకోవాలి.

రామయ్య—శంకరయ్య తీర్మానం రూల్సుప్రకారం వుంది. యల్లయ్యే తన తీర్మానం తీసేసుకోవాలి.

సముద్రయ్య—అదిగదీ. మా ప్రెసిడెంటే నీకు కొస్తంత రూల్సు చెప్పాడు. రామయ్యమాటకి అడ్డు చెప్పకు.

తిక్కయ్య—నాకు దేవుడు చెప్పాడుగాని మరెవ్వరు చెప్పలేరు. రామయ్యకి నాకంటే యెక్కువ తెలుసునా యేమిటి?

రామయ్య—నీకే యెక్కువ తెలిస్తే వ్యవహారం నడిపించుకు వెళ్లు చూస్తాను

తిక్కయ్య—వొక్కదెబ్బని...... నేను యల్లయ్య తీర్మానాన్ని వోటుకు పెడుతున్నాను.

(రామయ్య, కొండయ్య, శంకరయ్య అడివయ్య సముద్రయ్య పక్షంగా వోటువేస్తారు)

సముద్రయ్య—నేనే గెలిచాను. నాకే వొక వోటు యెక్కువ వచ్చింది.

తిక్కయ్య—నా కేష్టింగువోటు యల్లయ్య కిచ్చాను.

రామయ్య—ఇద్దరికీ సమంగా వోట్లువచ్చాయి.

తిక్కయ్య—వనమయ్యా! నువ్వు వూరుకున్నా వేం?

వనమయ్య—నేను బావాజీగారిని గోదావరిలో ముంచెయ్యాలని తీర్మానం పెడుతున్నాను.

తిక్కయ్య—(కొంచెంసేపుచూసి) నీ తీర్మానాన్ని యెవరూ బలపరచలేదు. కనక అది పోయింది.

వనమయ్య—అయితే నావోటు యెవరికీ యివ్వను.

తిక్కయ్య—అయితే యిప్పుడు రెండుపక్షాలకీ వోట్లు సమానంగా వచ్చాయి కనక నేను ఇప్పుడు లాటరీ వెయ్యాలని ప్రపోజు చేస్తున్నాను.

రామయ్య—నేను వల్లకాదని ప్రొటెస్టు చేస్తున్నాను.

తిక్కయ్య—అయితే లాటరీ వెయ్యడమా మానడమా; దీనికి వోట్లివ్వండి.

యల్లయ్య, తుప్పయ్య, పుత్రయ్య, తిక్కయ్య పక్షం వోటు చేస్తారు. కొండయ్య, శంకరయ్య సముద్రయ్య,రామయ్య పక్షంగావోటుచేస్తారు.

రామయ్య—ఇది కూడా సమానం అయింది.

తిక్కయ్య—నా కేస్టింగు వోటు—

రామయ్య—తీర్మానం పెట్టినవాడవు నువ్వే కనక యిక నీకు కేస్టింగు వోటు లేదు.

తిక్కయ్య—వుంది. నేను ఇచ్చేశాను. నాతీర్మానమే నెగ్గింది.

అడివయ్య—అయితే నావోటు రామయ్య కిచ్చాను.

తిక్కయ్య—ఇంతసేపటిదాకా యేం చేస్తున్నావూ? నీ వోటు చెల్లదు.

వనమయ్య—మమ్మల్నడిగావా నువ్వు? నావోటు కూడా రామయ్య కిచ్చాను.

తిక్కయ్య—మన కిప్పుడు పని ప్రధానం. అప్పుడే పన్నెండు గంట లయింది. కనక మీరంతా నా ఆజ్ఞప్రకారం నడుస్తా రని నమ్ముతున్నాను.

కొండయ్య—వల్లకాదు. నీ ఆజ్ఞేమిటి మాకు?

తిక్కయ్య—అయితే యిది యిలా అట్టే పెట్టి మరోపని చూద్దాం.

రామయ్య—అయితే యిప్పటికి పొద్దుపోయింది. కనక భోజనాలు చేసివద్దాం.

తిక్కయ్య—(స్వగతం) ఇదీ బాగానే వుంది. ఈలోపుగా అడివయ్యనో, వనమయ్యనో తిప్పేసుకోవచ్చు. రామయ్య చేస్తున్నా డిదంతా. వాడిక్కూడా ఏదో టాకీ వెయ్యవచ్చు. (ప్రకాశంగా) అలా చేద్దాం.

అంతా బాగుందంటే బాగుంది అంటూ వెళ్లిపోతారు.

ఆరోరంగం

స్థలం గ్రామచావడి మున్సబూ వొక నౌకరూనూ.

మున్సబు—శవం వెళ్లిందా లేదా?

నౌకరు—యింకా మఠంలోనే వుందండి. వాళ్లకి తగువులు తీరలేదుటండి.

మున్సబు—అప్పుడే రెండయింది. వూరంతా గోలపెడుతున్నారు. కొందరు వంటలు కూడా చేసుకోలేదు. కనక శవాన్ని ఆపడానికి వీలులేదు. ఈబకీరు పుచ్చుకుని నువ్వు రాజమండ్రీ వెళ్లి పోలీసువారికిచ్చిరా.

నౌకరు—చిత్తమండి.

ఇద్దరూ వెళ్లిపోతారు.

ఏడోరంగం

స్థలం మఠంలో వసారాగది. మళ్లీ కమిటీ అంతా కూచుని వుంటారు.

తిక్కయ్య—అప్పుడే నాలుగయింది. శవాన్ని అట్టేపెట్టడానికి యిక వీలు లేదు. కనక మీరంతా నామాట విని తీరాలి.

పుత్రయ్య—ఇప్పుడధికారం అంతా తిక్కయ్యది. కనక మీ రేమీ చెయ్యలేరు.

రామయ్య—చూస్తాం కాదూ.

యల్లయ్య— అయ్యా మనమంతా వొక వూళ్లో వాళ్లం. బావాజీగారి శిష్యులం. కనక మనలో మనం తగువులాడుకోడం ధర్మం కాదు. ఇప్పటికే పొద్దుగూకుతోంది. మనకి ఈవిషయంలో రాజీ అయినా ఈ చలికాలంలో రాత్రి శవాన్ని ముట్టుకుని స్నానాలు చెయ్యడం కష్టం. కనక ఈ సభని రేపు పొద్దున్నకి వాయిదా వెయ్యవలసిందని నేను తీర్మానం పెడుతున్నాను. మీరంతా అంగీకరించాలి.

రామయ్యపక్షంవాళ్లు సరే అంటారు. తిక్కయ్యపక్షంవాళ్లు బాగుంది అంటారు. తిక్కయ్య మఠానికి తాళాలు వేసేసి బయటికి వస్తాడు.

తిక్కయ్య—మళ్లీ రేపు పొద్దున్న యెనిమిది గంటలకి మీటింగు. (యల్లయ్యని దూరంగా పిలిచి) ఇదంతా రామయ్య చేస్తున్నాడు. యెలాగో బిత్తిరీ చేసి రంగసాన్ని తగిలిస్తివా వాడు మనకి లొంగిపోతాడు.

యల్లయ్య—అది బాగుంది, మూడునిమిషాలలో ఆపని చేసేస్తాను.

(ఇద్దరూ వెళ్లిపోతారు)

రామయ్య—(తనవారిని చేందీసి) ఏం? ఇంకేం చేస్తాడూ? మీరు తిరిగిపోగూడదు. తెలిసిందా?

అందరూ సరే అంటే సరే అనుకుంటూ వెళ్లిపోతారు)

తుప్పయ్య—(స్వగతం) మున్సబు బకీరు రాశాడని తెలిసింది. యెకాయెకీని నేను బెజవాడ వెళ్లిపోతాను. (వెళ్లిపోతాడు)

పుత్రయ్య—(స్వగతం) బావాజీగారిని సమాధి చెయ్యడానికి పాతిక రూపాయలు చాలు. తతిమ్మా యాభయ్యీ సిలాచలానికి రెండు నెల్ల జీతం—సెబాస్! తిన్నగా రాజమండ్రి వెళ్లిపోతాను.

(వెళ్లిపోతాడు)

ఎనిమిదో రంగం

స్థలం మఠం. పోలీసులూ, మున్సబూ, నౌకర్లూ అరస్థానాలలో వుంటారు. తుప్పయ్య, పుత్రయ్యా తతిమ్మా వర్కింగుకమిటీ మెంబర్లంతా అరెస్టు చెయ్యబడి వొకపక్కని నిలవబెట్టబడివుంటారు.

ఇనస్పెక్టరు-- మున్సబుగారూ! తుప్పయ్యనీ, పుత్రయ్యనీ కూడా అరెస్టు చేసి తీరాలి. పుత్రయ్య సానియింటో తప్పకుండా దొరుకుతాడు. వీళ్లనందర్నీ మేము స్టేషనుకి తీసుకు పోతాం. మీరూ హెడ్ కానిస్టేబులూ దగ్గిరవుండి శవాన్ని సమాధి చేయించి తెల్లవారేటప్పటికి మాకు రిపోర్టు అందచెయ్యాలి. తెలిసిందా?

మున్సబు—చిత్తం.

తిక్కయ్య—అయ్యా! ఇనస్పెక్టరు గారూ! శవం వర్కింగుకమిటీ స్వాధీనంలో వుంది, కమిటీ యేదో విధంగా తీర్మానించకుండా శవాన్ని కదపడానికి మీ కేం అధికారం వుంది?

ఇనస్పెక్టరు—అదంతా స్టేషనులో చెబుతా గామా?

తిక్కయ్య—సరే కానివ్వండి. ఈపట్ట అంతా మున్సబు చేశాడు. తాలూకాబోర్డు ఎలెక్షనులు దగ్గిరికి వస్తున్నాయి లెండి. అప్పుడు మున్సబుకి వొక్కవోటేనా రానిస్తా నేమో చూద్దురుగాని. ఇనస్పెక్టరు—పదపద.

(తెర)

---

# కొత్త పాత కవిత్వాలు

దువ్వూరి సూర్యనారాయణమూర్తిగారు

"గుణదోషౌబుధా గృహ్ణన్ ఇందుక్ష్వేళా వివేశ్వరః
శిరసా శ్లాఘతే పూర్వం పరం కంఠే నియచ్ఛతి"

అన్నట్లు ఓగ్రంథాన్ని గాని ఓవాఙ్మయవిషయాన్ని గాని ఓసాంఘికవిషయాన్ని గాని నిష్పాక్షికంగా విమర్శించవలసివస్తే అందులో గుణదోషాల్ని రెండింటిని తీసుకొంటూ గుణాలనే చాటుతూ దోషాలని మనస్సులో పెట్టుకుని వూరుకోవడమే పండితలక్షణం. అయితే నిష్పాక్షికానికి అర్థం ఏమిటని అంటే కుండ బద్దలుకొట్టినట్లు మొహంమీదే చెప్ప మని గాను. మొహమాటాలు మోమోటాలూ వదులుకొని దోషైకదృక్కుతో రంధ్రాలనే యేరి ఆవిష్కరించ మని కాదు. కొంత కాలాని కైనా ఎవరి తప్పు వార్కే దిద్దుకో మంటుంది. కనక "నొప్పించక తా నొవ్వక తప్పించుక తిరుగువాడు ధన్యు"డనే రకంలోకి వస్తే లోకానికి విరుద్ధంగా వుండ దని నా వుద్దేశం. ఒకరి ఆశయాల్ని ఒకరి నియమాల్ని ఒకరి రుచుల్ని పట్టి లోకం అంతా అల్లాగే నడవా లంటే అది అస్వాభావికంగా వుంటుంది. "లోకో భిన్నరుచిః" కాదు మరి!

ప్రబుద్ధాంధ్రలో పడ్డ "తెలుగువారిదేశ భాషాభిమానం" అనేవ్యాసం రెండుమూడు సార్లు చదివేను. అది వ్రాసినవారు బులుసు వెంకటరమణయ్యగారు. వీరు నాకు చిరపరిచితులు. స్నేహకోటిలోవారూ అవడంచేతనున్ను, వారి ఊహల్లో నాకు అభిప్రాయభేదా లుండడంబట్టిన్ని దానిమీద మామిత్రులతో కొన్ని విషయాలు చెప్పదలచుకొన్నాను. లోకానికి మాత్రం కాదు సుమండీ! ఎంచేత నంటే ఎవడి స్వేచ్ఛకి ఎవరు శాసకులు. మాటవరసకి మనం అనుకోవలసిన మాటలు గాని యివన్నీ ని—

ఓదాన్ని పూర్తిగా నిరసిస్తున్నా మంటే ఆబాపతు పుస్తకా లన్నీ బాగా చదవాలి. వాటిల్లో భావాల పొందిక మనస్సుకి అందచేసుకోవాలి. అప్పుడు పూర్వానుభూతాల రుచి ఈకొత్తరుచికన్న వెకటూ తియ్యనా అనేది ఆలోచించుకోవాలి. అప్పుడు ఈవిషయాల్లో పాతవి బాగున్నాయి, ఈ విషయాలు కొత్తలో బాగున్నాయి అని నిరూపించాలి. అంతే గాని ఎవడో పుల్లాయి రానే డని ఒకథ మరో యెల్లాయి రానే డని మరో ఘుట్టం చచ్చువి ఏరి వాటిని పట్టి వాఙ్మయానికి కవులకీ బలాదూ రెట్టడం అదో మోస్తరు దాంపత్యం లా వుంటుంది.

ముఖ్యంగా ఈపాతక్రొత్తకవిత్వాల్లో మార్పు దేశకాలపాత్రాల్ని, మనవంటి వాళ్ల రుచిభేదాన్ని అనుసరించి బయల్దేరుతోంది. అందుచేతే అందుల్లో కొన్ని విషయాలు విరుద్ధా లయినా మామిత్రుల వుపన్యాసంలోని నాల్గవ పేరా మొదలు తొమ్మిదో పేరా వరకున్న కొన్ని సంగతులు నిజాలే. పరిచయం మనకి తక్కువవడంచేత మన కవి ఆసంఘనా లవచ్చు.

అసలు వీరి మొదటి విసురు. "ఉదారాదర్శంగా సంస్కృతాన్ని గ్రహించి దాన్లోలాగ రసప్రధానగ్రంథాలు తెనుగులో లేకపోవడం లోటే" అనే దానిమీద పడింది. కొన్ని విషయాల్లో ఈ మాట నిజమే గాని అంతకన్న రసప్రధాన మైన గ్రంథాలు తెనుగులో ఉన్నా యని అనాలి. పాండిత్యప్రకర్షే కనపరుచుకోవాలి. కవిత్వం అంటే అదే అనే దృష్టితో సంస్కృతం వాళ్ళూ వాళ్లని అనుసరిస్తూ తెనుగువాళ్ళూ కూడా పడడం చేత రసదృష్టి తగ్గి కథాప్రధానంలోను శబ్దాడంబరాల్లోను విచిత్రయమకబంధాల్లోనూ పడి కాఠిన్యానికి తావిచ్చేరు.

ఇహ తెనుగువాళ్లు ఆశ్రితుల వంశాలు అతిశయోక్తులతో నింపకపోతే యెల్లాగ? వీరు రాయడం గూడా కొంత స్వలాభాపేక్షతోనే. ఏపోతన మహాశయుడో తక్క మిగిలిన మహాత్ము లంతా పెళ్ళాంపిల్లల్ని పోషించుకోడానికే కవిత్వాన్ని చిల్లరక్రింద మార్చుకుని వాడుకొనేవారు. నాటి నించి నేటికి ఏ వుద్యోగంకోసమో ప్రయత్నిస్తున్నామంటే ప్రసిడెంటుగారి మీద "నీకళ్ళు చిన్నవి నీముక్కు పెద్దది ఉద్యోగమిప్పించ వోయి దేవ!" అని "నాకు డబ్బియవోయ్ నళిననేత్ర! అని గాని పొగడడం చాలామందికి అలవాటు. అల్లాటివి పుస్తకాల్లో వుంటేనేగాని కృతిభర్తలకి తృప్తి కలగదు చూడండి. ఇహ ప్రతాపరుద్రీయం లాటి గ్రంథాల్లో లాగ ప్రతీ పద్యంలోనూ గూడా వర్ణించకపోవడం తెనుగుప్రబంధాల్లో ఓసుగుణమే.

ఇహ "అతిశయాలు అంకితాలు షష్ఠ్యంతాలు కాళిదాసాదికవులలో లే"వని" అన్నారు. అబ్బో. దాక్షిణ్యం కాళిదాసు గారు ఈవిషయంలో. అసలు షష్ఠ్యంతా లంటూ వుంటే దాన్లోనే అతిశయాలు అంకితాలు గర్భితంగా వుంటాయి. రఘువంశం మొదటి సర్గలో—

"సోహ మాజన్మశుద్ధానా మాఫలోదయకర్మణాం
ఆసముద్రక్షితీశానా మానాకరథవర్త్మనాం"
యథావిధిహుతాగ్నీనాం యథాకామార్చితార్థినాం
శైశవేభ్యస్తవిద్యానాం యౌవనే విషయైషిణాం
వార్ధకే మునివృత్తీనాం యోగే నాంతే తనుత్యజాం"

ఇల్లాగే ఇంకాను. మచ్చు ఇది—ఇల్లాటివే మన తెలుగువారికి తెన్ను చూపించేయి తప్పకుండాను. అన్ని నిజాలు కాకపోబట్టి మామిత్రుల వ్యాసంలో ఐదో పేరాలో చెప్పినట్లు కోతలు పరమకోతలూ కూడా పైషష్ఠ్యంతాలలో వున్నాయంటాను. ఇహ సప్తమ్యంతాలు మాత్రం ఎక్కడా లేవు. షష్ఠ్యంతా లైనా కాళిదాసుగారు ఐదంటే మన తెనుగువారు మరో నాలుగు రాసి స్వతంత్రించేరు. ఎత్తిపొడవ్వడం ఎవ్వరికీ తప్పలేదు. ఈ విషయాలు మాత్రం ఆధునికకృతులలో ఎక్కువలేదు.

"ప్రత్యేకత్వం కోసం దేవులాడుతున్న ఇప్పటి రకంవారీలచే భావం ప్రధానంగా" అని వ్రాసిన దాన్లో నాలుగుపాదాలూ ఒకే అనర్థసంస్కృత సమాసంగా వున్న ఆధునికకృతులలో పద్యాలని తీసి మామిత్రులు చూపిస్తే పేరున్నవాట్లలోంచి వాట్లలో భావం ఉన్నదీ లేనిదీ కొంత తంటాలుపడి తెలుసుకొని ఐనా చెప్ప సాహసిస్తాము. అప్పటికీ "నళినాలీకమృణాలనాలలతికానవ్య ప్రణాళీమిలల్లల నాలాపకథాసుధానురసలీలాలోలచేతస్క" లాంటిసమాసా లుంటే మేము మాత్రం తప్పకుండా నిరర్థకపదాలు చాలా వున్నా యని వప్పుకోమూ? అంతేగాని పూర్తిగా భావం లేదనిమాత్రం అనడానికి సాహసం చాలదు. ఎందుచేత నంటే "నహి సర్వ

స్సర్వం జానాతి" కనుక. అల్లాటి దీర్ఘ సమాసాలున్నా అచ్చతెనుగే బాగా నేటి వాఙ్మయంలో వుందని చెప్పడానికి వెనకడుగు పడదు. [ అయోమయ మైన భావానికే ప్రాధాన్యం అధునికు లిచ్చేరంటే ఆ అయోమయం మనబుద్ధిలోది కాదు గదా! అని కొంత ఊహ ఉండాలి. తప్పదు. ఆతరవాత అడిగి తెలుసుకోవడం ముఖ్యం— ]

[ ఇంక అతిశయోక్తుల విషయం మాట్లాడితే మామిత్రుల సృష్టి ఆధునిక కావ్యాలలో విసుగు కలిగించేలా వుందని ఫలితంగా చెప్పేరు. కావ్యానికి సొగసు తెచ్చేదే యీ అలంకారంట. ఇది పాతలోనే వుండడం చాలా పొరపాటుట, అసలు అతిశయోక్తిని రెండు రకాలుగా విభాగిద్దాం. వ్యక్తిగతం ఒకటీ, ప్రకృతిగతం రెండూను, ఈ రెంట్లోనూ పాతలో పాడైనచోట్లున్నాయి. అందమైన ఘట్టా లున్నాయి.

డబ్బే ప్రధానంగా కవిత్వమకాణాలు పెట్టడం చేత ఏగట్టులంక వేసునే రాజుగార్నో తీసుకొని లేనిపోని ఉత్ప్రేక్షలు అతిశయోక్తులుకల్పించి ఆబండి తోలే రాజుగారికి శరీరంమీద ఎల్లాగో ధీరోదాత్త లక్షణం పూసి అలంకారపుస్తకాలకి అడ్డు లేకుండా కావ్యప్రశస్తి చెడకుండా, రాయడం ప్రాచీనులలో కొందరి ఆచారం. వేనుకి సిరెట్టుగునేటప్పుడు అడ్డొచ్చిన పదిమంది పంచమసోదర్లని పడతన్నిన వెలంధోరగా రైనా వారు మహాఘోరసంగ్రామాలు చేసిన చక్రవర్తిశిఖామణులు. వారి కొంపలు పర్ణశాల లైనా అని చేసే పని "లిఖంతి విధుమండల" మే. తిండితిప్ప ల్లేక చావడానికి సిద్ధంగా వున్న రెండేనుగులు మూడు కంచరగుఱ్ఱాలు వుంటే చాలు ఇహ వాటి మదధారలతో కొత్తగా కాలవ విడిచిపెట్టినప్పుడు భూమి అంతా తడిసినట్లు తడిసి అంబలైపోయి ఆబాడి మార్గస్థులని దించుకుపోయేలా చెయ్యడమే.

జీతం నాతం లేని పదిమంది నౌకర్లు పనిపాటలు చేయడానికి కొంపలో వుంటే వాళ్లే మహాసైన్యాలయిపోయి వాళ్ల నడకలకి రేగిన బూడిది సూర్యచంద్రమండలాల్ని కప్పడమే. ఏమష్టి కాడికేనా గుప్పెడు బియ్యం పెడితే యాచకశబ్దం లేకుండా ఇహ ఆయన భూమి నుద్ధరించే రాజే. వారు పరుండేది మామిడిపరు పైనా అది బంగారుందే వారు తినేది అన్న మైనా సువర్ణద్రావకమే. లేకపోతే డబ్బెల్లా వస్తుంది బాబూ!

ఇంక ప్రకృతిగతాతిశయోక్తులని చూస్తే పైవాటిని మించిపోవలసిందే. మేఘవిషయం చెప్పేదు గాదు? ఇల్లాగే తోటలు వర్ణించా లంటే ప్రపంచకంలో మహారణ్యాల్లోను దేశాంతరాల్లోను గాని బతకని "సరళకుటూలతాలహరిచందనచంపకనారికేళకేసరకదలీలవంగపనసక్రముకార్జునకేతకీలతాగురుఘనసార" తుమ్మ వెలగ బూరుగ మఱ్ఱి జిల్లేడు మొదలైన అద్భుతమైన తుక్కు— ఆతోటలో నాటవలసిందే. ఇవి ఆనాటివారికి రుచించినట్లు మన ఇప్పటి వారికి రుచింపవు. వీళ్ల కెంతసేపూ ప్రేమతో పెంచుకొన్న సంపెంగ పొదలు, ఊల్ల మీద పెంచుకొన్నట్టి మల్లెతీగలు బిళ్లగన్నేరు వకుళ కేతకి శేరాణి గులాబి చేమంతి మొదలైన అందమైన మొక్కలే పాతుగని సంతోషిస్తారు. ఇల్లా అన్నానని చెప్పి ఇల్లాటివి ప్రాచీనాల్లో లేవనడంకాదు. కాళిదాసు పువ్వులతోటలు కమ్మగా వుంటాయి. విజయవిలాసాన్నైనా తారాశశాంకవిజయాన్నైనా తీసుకుని ఇహప్రబంధాలన్ని ఇదే రకం అని తిట్టడం చాలా తప్పమాట. మొత్తం సకటు మీద మాట వ్యక్తిగతంగా కూడా భావకవుల అతిశయోక్తులు మానవత్వాన్ని అతిక్రమించవు. అల్లా రాయకపోయినందువల్ల వీరికిబ్బందులు లేవు. వీరిపుస్తకాలు స్నేహధనమును గాని ప్రేమధనాన్ని గాని ఫలంగా అపేక్షిస్తాయి కనక ఒహర్ని "ఏతా వా నస్య మహిమా" అనడం గాని, కోపంవచ్చిన

మహాత్ములపై పచ్చిబూతులు తిడుతూ శతకాలు దస్కాలు రాయడం గాని వీరికి అనవసరం. ఒక వేళ సంప్రాప్తించినా యేదైనవ్యక్తి తన జీవితంలో మెరసిన రెండు మూడు నిజమైన సంగతుల్ని సహజంగా చెప్పకలె గాని అభూతకల్పన లుండవు ఆయన గుణాల్ని వర్ణించలేక శేషుడు పరిగెత్తడు బృహస్పతి తలూంచుగోవడం గాని షణ్ముఖు డసన్ముఖు డవడం గాని చతుర్ముఖుడు దుర్ముఖు డవడం గాని వుండదు. చంద్రుడు గుంపిన అప్పలరాజు గారి కీర్తి లశాకుసుమం కాదు. సూర్యుడు తాతరాజుగారి తేజఃపుంజం కాదు. ఇంకా కీర్తులు బయలుదేరి వసిబ్బాస్ల కోటికలాంటి నల్లవస్తువుల్ని తెలుపు చేయలేవు. ఇల్లాంటిది పెద్దల వాసన. అయితే యివన్నీ తప్పు లని గాదు నామాట. ఆకాలాని కవ్విరుచించెయి. రెండు పుంజీల వందల సంవత్సరాల నించి "పాడిందే పాటరా" అన్నట్లు ఆభావాలే ప్రతిదాల్లో చదువుతోంటే వెకటించరా? రెండు రోజులు వరసగా ఇంటోది పెసరపప్పు పచ్చడి చేస్తే నే రోజూ వెధవ పచ్చడేనా? అని చావ తిడతామే? కొత్త వింత పాత రోతా అని మనవాళ్లు ఊరికే అన్నారూ? ఎన్నాళ్లు ఆచిరుగుగుడ్డలు కట్టుకోవడం? ఓగుడ్డలో నేనా మానం కాపాడేటంత జాగా వుంటేనా? బట్టబయలు.

మరిన్ని రసవిషయం ఎత్తేరు. ఎత్తి అధునికకవిత్వాన్ని తిట్టే వా రనే మాటలే మామిత్రులు కూడా అన్నారు. ఆపేరా చివర "శృంగారం ప్రాచీనులలో ఎక్కువ వుం దంటారు. ఇప్పటివారు ఆరసం తప్ప మరోదాన్ని కావ్యాలలో వర్ణించరే! ఇది మహా బాగుంది కామోసు" అని అన్నారు. ఏం? ఎందుకు బాగుండదు? ప్రాచీనశృంగారం అధునికశృంగారం ఓలాగే వుంటుందా? నిజంగా ఈవిషయం పుస్తకాలలోంచి ఎత్తి వ్రాస్తే ప్రాచీనులలో ఆడదీ మొగాడు అందుకే పుట్టినట్లున్నది. అందులో ఆడదాని వర్ణన వస్తే చాలు ఆమె తల్లిలాటి దేవతైనా సరే కచమచజఘునవర్ణలతో కాళ్లదగ్గరనుంచి వెంట్రుకలదాకా నో తిరగమరగేశో వర్ణించేయ వలిసిందే! అక్కర్లేనిలోను శాహుమూలటచలతోను పెనుగబ్బిచనుదిబ్బలతోను క్రింగన వాగు గుబ్బలతోను త్రాచుపాము లాంటి నూగారుతోను ఇసకతిప్పలతోను రంభలతోను అపర్తాలతోను నిండిపోవలిసిందే. ఈక్రమం ఎవ్వడు తప్పినా ఇహ వాడికావ్యం అధమాధమకృ తన్నమాటే. అక్కడికిగాని అపూర్ణశృంగారరసంలో స్త్రీ తాండవించదు. పూర్వం రాసేవాళ్లు పురుషులే గనక తమ రహస్యాసానాలని వర్ణించుకోలేదు. అరుదుగా వున్న అప్పటి కవయిత్రులుకూడా కవిరాక్షసులకి జడిసో మరేమో పాపం వారికిసల్లే వీరు తెగించలేదు. తెగించి రాయడం ప్రారంభిస్తే ఆపశృంగారం మొగశృంగారం కలిసి బ్రహ్మానిష్పత్తి కలగవలసిందే మరి. ఇల్లాటిది గదా పెద్దల ప్రబంధమార్గం—

అధునికులది ఇంతకన్న చాలా నాజూకని తప్పక వప్పుకోవాలి. ఎంత సత్యమో అంతే రాస్తారు. అతి ఐతే రసాభాస జుగుప్స తప్ప మరే ముంది? ఇంక శృంగారమే తీసుకుందికి కారణం ఏమి టంటే? ఇది రసరాట్టు గాదు మరి? అదీగాక అన్నిరసాలకంటె దీంతో మనుష్యుల కున్న సంబంధం ఎక్కువ. దానిలోవున్న హాయి మరోదానిలో లేదు కనక దీనిలో నైనా కశ్మలం తీసి పారేసి సత్యమైన శృంగారాన్ని రాయడంలో తప్పేమిటి?

"కవి తన్నే నాయకుడిలాగ స్పష్టపరచుగుంటాడు. నాయకుడికి లాగ కవి క్కూడా శృంగారరసపిచ్చి యెక్కు వవుతుంది" నిజమే. అల్లా కవి ఎప్పుడు నాయకుల్లో లీనమయ్యేడో అప్పుడే తద్దతవీరం గాని శృంగారం గాని విషాదం గాని ఫోర్సుగా కవిత్వంలోకి కలంగుండా జారడం. మైలరాళ్లు పాతుకుంటూ రాసే ఛందోబద్దం మాటలన్నీ కవిత్వం కాదు కపిత్వాం గాని. దీనికి తార్కాణం ఏమిటంటే? శృంగారరసపిచ్చికి కాళిదాసుగార్ని శోకరసపిచ్చికి భవభూతిగార్ని గాని తెనుగులో ఈతణ్ణి మించిన కంకంటి పాపరాజు

గార్ని గాని దైన్యంలో పోతన్న గారి "లావొక్కింతయు లేదు" గాని ఓమాటు తలుచుకుంటే "అపి గ్రావారోదిత్యపి దళతి వజ్రస్యహృదయం" ఇల్లాగే క్రోధంలో వేణీసంహారంలో భీమన్న గారి "మథ్నామి కౌరవశతం" ఇల్లాటివి భావిస్తే తన్మయత్వం లేని కవిత్వం తంపటదాలికే లా కనిపిస్తుంది. ఇల్లాటి వాటినే బొమ్మకట్టు కవిత్వా లంటారు. ఏభావం పద్యంలో రాస్తే ఆబొమ్మ కళ్లకి కట్టాలి. అప్పుడు కవి తన్మయు డవడం ఒక విధమైన పొంగు తెచ్చుకోవడం అవసరం. ప్రాచీనకావ్యాలలో లేశాలు గాను విరళం గాను వున్న దాన్ని మజ్జిగ మీద వెన్నపూసలాగ నివిరి పోగేసి అక్కడక్కడ ఇల్లాటి ఘట్టాలు తగులుతే వచ్చే సంతోషాన్ని ప్రారంభించింది మొదలు అనుభవింపచేద్దా మని ఏ విషయం చెప్పేటప్పుడు తద్గతభావాలతో ఐక్యమైపోయి రాయబడే కవిత్వం నేటిది. ఈతన్మయత్వం ప్రాచీనాల్లో అసలే లే దనడం అధునికాలని ఆక్షేపించి నట్లే. ఇల్లాటి మాట అదీ యిదీ చదవని అర్ధనారీశ్వరులది—

"ఇల్లాటి కవిత్వా లన్నీ వాఙ్మయానికి పురోభివృద్ధికే మూల మంటూ కొందరి యువకుల ఆశయం" అవును. కాకిపిల్ల కాకికి ముద్దు. పుట్టిన పిల్ల లంతా డిప్టీ కలక్టర్లు, డిఐంవోలు అవుతా రనే తండ్రి పెంచుతాడా? ఏవడ్లగింజో గొంతుకలలో వేసి పుర్గయా చేయకూడదు? తుప్పూ ధూళీ పట్టి బూజుకట్టిపోయిన పదరత్నాలనీ భావమణులనీ వృత్తముత్యాలనీ తీసి మెరుగెట్టేడు. పాతలో యివి నూటికీ కోటికీ గాని దొరకవు. కష్టపడ్డాడు ఏర్చి కూర్చేడు వాఙ్మయోపకారం అయితే ఔగాక. అంతే గాని వాఙ్మయాన్ని పాడుచెయ్యలేదు గదా? ఓపిసరేనా ఉపకారం చెయ్యదా?

"ఇప్పుడు కొంతమంది నెలపిల్లలు కూడా కవయిత్రలు కవీశ్వరుళ్లూ అయిపోయి పత్రికల కెక్కుతున్నారు" తమకా కడుపుబ్బు ఎందుకు మిత్రమా! దినదినము మన సంఘంలో జ్ఞానజ్యోతి అభివృద్ధి అవుతోం దని సంతోషించవోయ్. కవిత్వం రాస్తే నేనే రాయా లని బొడ్డుకోసి నువ్వే పేరెట్టుగున్నావా? బాగుండవచ్చు బాగుండకపోవచ్చు. ఇది రంకూ బొంకూ కాదు గదూ? సమృద్ధిగా పత్రికలున్నాయి. వేసే ఎడిటర్సుని మేం ఎరుగుదుం. మాకు బంధువులే వారు. "ఆన నవగ రాగ మటీశ యిల్లుచు నుండు" నాయనా విచారించకోయ్. తిట్టుకోయ్! అని నాకో మిత్రుఁ డిచ్చిన సలహా. "న ధర్మవృద్ధేషువయః సమీక్ష్యతే" కనక ఏపుట్టలో ఏపాముందో?

"ఒక చిత్రం ఈమధ్య"

తల్లి:—నాన్నా! మంచి వన్ని యిలా పాడిచేస్తే ప్రకృతి శ్మశానం ఐపోదూ?

బాలుడు:—అమ్మా! చమించాలి. ఎరగక చేసేను—

విసుగ్గా తల్లి రుసరుసలాడుతూ వొచ్చి కొడుకుమీద ప్రేమతో చేష్టాకోపం మాటలోకి దింపి ఊతంగా "నాన్నా మంచి వన్ని పాడుచేస్తే" అనే సరికే పాడుచేసే వస్తువు అక్కడ పారేసి ఉలికిపడి దిగ్గున లేచి పిల్లవాడు పైమాట అనడం స్వభావికమే. అప్పుడా పిల్లాడికి ప్రకృతి శ్మశానం సంగతి తెలియనక్కర్లేదు. ఎంచేత నంటే చేసేది తప్పు పనిగా? ఆపని చేస్తూ ఏసందునించి అమ్మొస్తుందో అని కనిపెడుతూనే ఉంటాడు అసలు. ఇల్లాగే పిల్లలు మనం మాట్లాడే మాటల కన్నింటికి అర్థం గ్రహిస్తారు. చూడండి. కృష్ణుడు నాలుగేళ్ల పిల్లాడే. "నాన్నా! మన ఇంట్లో బోషాణం దగ్గర పుస్తకం పెట్టుగునే వ్యాసపీట మీద నాపెద్ద లావు పుస్తకం భాగవతం ఉంది. ఇల్లా పట్రా" అంటే పైమాటలలో పిల్లాడు గ్రహించేది పుస్తకం పెట్టుగునే పీట పెద్ద లావు పుస్తకంను. అవ్వే కళ్లకి కడతాయి ముందు. పట్రమ్మనే చెయ్యాపులో గ్రహించి దాన్ని తెచ్చి అన్న కిస్తాడు. అంతే కాని ఆపీట వ్యాసపీటో వసిష్ఠపీటో ఆపుస్తకం భాగోతమో తోలుబొమ్మలాటో వాడి కేం తెలుస్తుంది? అల్లాటి

మాటల్ని గాని పనుల్ని గాని చూస్తే మామిత్రులు రాసినట్లు ఆశ్చర్యం పడాలి. ఆనంద పడాలి అంతేనే గాని విచారించడం అనావసరం. ప్రకరణం అది గాదు కనక—

ఇంకొ మాట చూపించాలంటే చాలా వుంది. కొత్త కవులలో గాని, వారి గ్రంథాలలో గాని "సరసాగ్రేసరకూచిమంచికుల భాస్వద్వార్ధిరాకేశ శిన్ సిరకీర్తిన్ బహుశాస్త్రలక్షణమహాధీమంతుం డన్" అని గాని "ఇదిశ్లేషయమకచక్రక రీత్యనేక బిరుదాంకితచతుర్విధకవితాధురీణ" అని గాని చేసుగునే స్వకుచమర్దనలు ఉండవు. ఏదేనా రాయడానికి ప్రారంభిస్తే దాని కంటె ముందు ప్రతీ ప్రబంధకర్తల కలలలోనూ వాళ్లతాతలో ముత్తాతలో కనపడి రాయమని చెప్పడం ఒక అలవాటు. ఇది ముందే భారతకవులకో నిజంగానో కాదో జరిగి ఉంటుంది. ఇహ శతాంధన్యాయంగా అందరూ అంతే. ఇల్లాటి కలత నిద్దర్లు ఇప్పటి వారికి లేనేలేవు.

మొత్తంమీద మంచి చెడ్డలు విమర్శిస్తే రెండింటలోనూ వున్నాయి. అభిమానం గల దాన్ని ఎత్తేసి రెండోదాన్ని తిట్టడం విమర్శకలక్షణం గాదు. ప్రపంచం అంతా మారేటప్పుడు కవిత్వం కూడా మారాలిసిందే. ఐతే కొత్తదారి తయారు చేస్తున్నప్పుడు చెత్త చాలా వొస్తుంది. దాన్ని ఎల్లాగో సహించడం మంచిది. తండ్రి చెప్పినట్లు కొడుకులే వినని కాలంలో నే చెప్పినట్లే మీ రందరూ వినాలంటే వినివా రంటారా? వింటే చివరకి స్వారాజ్యం లా తయారౌతుంది లోకం. కనక సాధ్యమైనంతలో మంచినే తీసుగోండి. చెడ్డ చదవకండి. రాస్తున్నా రని తిట్టకండి. కొసకి నిగ్గే నిలుస్తుంది. పూర్వగ్రంథాలినీ తిట్టొద్దు. ఇప్పటివాటినీ తిట్టొద్దు. కొత్త కవిత్వంలో కొత్త లేదనడం లోటే. ఈ కొత్తచ్ఛాయలు ప్రాచీనులలో అక్కడక్కడ లేవండం లోటె. చూడండి—

"జలకము లార్చి పొందుజల
జచ్ఛదపాళిక గప్పి తమ్మిసం
కుల తెలిదేనె లుగ్గలిడి
క్రౌంచదరగల్ కదలించు కల్వతో
పెలల కుమారు కూతురు ఘ
టించి భజించు నవేలలాము కో
మలకుచ దాసతాళి కుల
మంజురవంబున పాటపాడుమన్"

"తనసం గౌగిలి యీ వొకప్పుడును నా
థా ఏకరస్పర్శనం
బున గిల్గింతలె యంచు పద్మిని కరాం
భోజంబున న్మందమం
దనటద్వాయుచలద్దళాంగుళులు గ
న్పట్టంగ నవ్వేలురా
యని రారా యని బిల్చె నా దగె ద్విరే
ఫాద్యంతదీర్ఘధ్వనుల్"

అని వ్రాసేరు. ప్రాచీనులలోని గంపలకొలంది పద్యాలలో ఈపైలాటివి అన్ని విషయాలలోనూ భేదాన్ని చూపిస్తూన్నాయి—

"త ఏవ పదవిన్యాసా స ఏవార్థ విభూతయః
తథాపి నవ్యం భవతి కావ్యం గ్రథనకౌశలాత్"

అన్నట్లు కూర్పునేర్పు చేతను, హృదయపరిపక్వముల చేతను, దివ్యానుభూతులతోనూ, ప్రతిభావిశేషంతోనూ, నిర్మించిన కవిత్వశిల్పం గుండెకు తాకుతుంది. అల్లాటి దాన్ని విన్నప్పుడే సహృదయుడు కంట నీరొట్టడమో, వేడిరక్తం ఉప్పొంగి రౌద్రమూర్తి అవడమో, కరుణామూర్తి అవడమో తటస్థిస్తుంది—

యత్సంరభః కృతివిరచనే
సత్కవీనా మభేద్యో
యచ్చైకాగ్ర్యం సముచిత పదా
న్వేషణే చిత్తవృత్తేః
లభ్యం తచ్చే దపి కవయతా
మంతత స్త్రీణ్యహాని
స్యాదేవం కిం సరసకవితా
రాజ్యదుర్భిక్షరోగః

అని ఓమహాత్ముండు చాలా విచారించేడు-



# అస్పృశ్యత

ఉభయ భాషా ప్రవీణ భువనగిరి లక్ష్మీకాంతమ్మగారు

ఒకమాలెత, భుజంమీద బిందెతో ఒక బ్రాహ్మణి.

బ్రాహ్మణి—ఎవరే! ఎవరే నువ్వూ అంత రాసుకోస్తున్నావూ?

మాలెత—ఏ మమ్మోయి! నోరు మూసుకో. లేకుంటే వూసులు బాగా రానెయ్యి. ఏ మనుకొన్నావ్?

బ్రాహ్మణి—నే నే మన్నానే నిన్నూ? ఎవరు ను వ్వన్నాను. తప్పా? బ్రాహ్మలం వస్తూవుంటే కాస్తంత తప్పుకోవద్దూ? ఇంత దొళ్లదోవా?

మాలెత—ఎల్ల వమ్మా ఈ' గుంజాకోకా. ఏమే. యేమే యేంటీ! ఎవళ్లనుకున్నావ్?

బ్రాహ్మణి—ఏమే అంటేనే తప్పొచ్చిందా? మాచెత ఏమండీ, అనిపించుకోవడం మీకు మంచిది కాదు సుమీ.

మాలెత—ఏంటీ! మాకూ మీకూ తేడా యేంటమ్మా?

బ్రాహ్మణి—మీకూ మాకూ తేడా లేనే లేదంటావూ?

మాలెత—ఏం వుం దేంటి?

బ్రాహ్మణి—మీకు ఆచారవ్యవహారాలూ, శుచీ, శుభ్రమూ వున్నాయిటే? యివి తేడా కాదూ?

మాలెత—మీరూ మానుకుంటున్నారుగా? కాదంటే మావాళ్లూ మిమ్మల్ని చూసి నేర్చుకుంటూనే వున్నారుగా? ఇంక తేడా యేదీ?

బ్రాహ్మణి—మీరు కల్లు తాగుతారు.

మాలెత—మీవాళ్లూ తాగుతున్నారు, గెపితి చేసుకో.

బ్రాహ్మణి—మీరు పందిని తింటారు.

మాలెత—మీరు మేకల్ని తిండం లేదూ యెగ్గల్లోనూ?

బ్రాహ్మణి—మీరుగొడ్లు అమ్మకు బతుకుతారు,

మాలెత—మీరు బిడ్డల్నమ్మకు బతుకుతారు.

బ్రాహ్మణి—ఆఁ, ఆఁ, ఏం దుండగం? కళ్లూ కాళ్లూమున్నొద్దుకుటేయింకాయింకా మీదికివస్తావూ?

మాలెత—అస్తమానం నీళ్లలో నాస్తూ వుంటే నీ కళ్లూ కళ్లేవన్నకుండా పోతాయి.

బ్రాహ్మణి—ఎదిరిస్తావా? ఎదిరిస్తావుటే? నీకు తిండి దొరకొద్దూ? ఇంతటితో సరా?

మాలెత—నా కే మమ్మోయ్! నీకే తిండి దొరక్కుండా పోతుంది. పాలా లమ్ముకుంటావు. కూలికెళ్లలేవు. పనిచేతకాదు. కైత్తవులికి గాని వుద్దోగాలు లేవు. నువ్వే తిండి దొరక్క మాడి సత్తావు.

బ్రాహ్మణి—ఏమిటే?...ఏమిటే? నీ మొండితనం? సిగ్గూ బిడియమూ విడిచిపెట్టావా యేమిటే?

మాలెత—నీకా నాకా సిగ్గు లేకపోతా? మీవోళ్లంతా మా మంచాలమీద కూకుని, మావోళ్లతో సావాసం చేసి, ఇళ్లలోకీ, గుళ్లలోకీ, చబల్లోకీ, నూతులకాడికీ బతిమాలి మావోళ్లని తీసుగెల్తూ వుంటే, కల్చి బోనాలు సేత్తూ వుంటే, నువ్విప్పుడు "అచుగుంటా" "అచుగుంటా" అని మొరుగుతున్నావు. సిగ్గులేని వోళ్లెవరమ్మోయ్?

బ్రాహ్మణి—అయితే, అమ్మో! పెద్దా, పిన్నా కులమూ, మర్యాదా, అంటూ లేనుటే! మా పాలాలలో పని చేసుకు బతికేవాళ్లు గదా మీ కింత తుళ్లిపాటు తగునా?

మాలెత—డబ్బున్న వోళ్లే గొప్పోళ్లు. వాళ్లకే మరేద. అన్నికులాల వోళ్లనీ దేముడే పుట్టించాడు. ఎనకెప్పుడో మీకు మేము సాకిరీ సేస్తే యిప్పుడు మీరు మీయీయాముల తుసత్తం లేదటమ్మా?

బ్రాహ్మణి—ఇంతేనా? దేశ మంతా యిల్లా మండిపోవలసిందే యింకా?

మాలెత—వొక దేశపోళ్లం. మీలాగే మేమూ సీమూ నెత్తురూ వున్న వోళ్లం. మనుసులం. మమ్మల్నిలా తరిమికొట్టినల్లాళ్లూ మండిపో కే మాద్ది?

కొడవటిగంటి కుటుంబరావుగారు

అనేకమంది మాట్లాడేటప్పుడు ముందూ వెనకా చూసుకుండా మాట్లాడతారు; అనేకమంది ఆవిధంగానే రాస్తారు. వీరికి దేన్ని గురించీ దీర్ఘంగా ఆలోచించటం అలవాటు ఉండదు. చేతకానూ కాదు. తాగిన వాడి శరీరం దానికి చెందిన చైతన్యం వాడి వశంలో లేనట్టు, వారి మనస్సులూ ఆలోచనలూ వారి కట్టుబాటులో ఉండవు. ఆటువంటి వారి అభిప్రాయాలను బులుసు వేంకటరమణయ్యగారు "తెలుగువారి దేశభాషాభిమానం" అనే వ్యాసంలో చక్కగా ఖండించారు. వారు కొత్త పాత వాఙ్మయాలను గురించి మూడో పేరాతోనే ఆపక చర్చించుకుపోయినట్లయితే ఆవ్యాసం మరో విధంగా పరిణమించేదని నా అభిప్రాయం.

వేంకటరమణయ్యగారు సెలవిచ్చినట్టు కొత్త పాతలకూ మంచిచెడ్డలకూ సంబంధం లేదు. ఆ రెంటిలోనూ ఈరెండూ ఉన్నై. కాని చెడుకు మంచి ఎట్లాగో పాతకు కొత్త అట్లాగని వారు గమనించలేదు. మిగతా వ్యాసం అది రుజువు చెయ్యటానికి వినియోగిస్తాం.

ప్రకృతిలోనే పాతవి నశించి అవి నశించే లోపల కొత్తవాటి అంకురాలు ఏర్పడటం ఉంటున్నది. ప్రతివస్తువూ పాతపడుతుంది. వాఙ్మయం కూడా అంతే. శాశ్వత వాఙ్మయం (books for all time) అనే మాట అక్షరాలా నిజం కాదు. షేక్స్పియరు పుస్తకాలకు చావు లేదనటం కార్లైల్ మొదలయిన వాళ్ల ఛాందసం.

వాఙ్మయంలోకి అప్పుడప్పుడూ అమూల్యమైన గ్రంథాలు రాకపోవు. వాటిమీద మనకు గల అభిమానంచేత మనం వాటిని వదిలిపెట్టకపోవచ్చును ఎంత కాలానికీ—మహాప్రస్థానానికి అర్జునుడు గాండీవం చంకపెట్టుకు పోయినట్టు—ఒక యిల్లాలు పెళ్ళికి పిల్లిని చంకపెట్టుకు పోయినట్టు. కాని తెలివి గలవాడు ఏపుస్తకం పని ఎప్పుడైపోయిందీ తెలుసుకోగలిగి ఉండాలి. రిఫ్రెష్‌మెంట్ రూములో వేసి వచ్చిన పదిహేనురూపాయల భోజనమైనా సరే ఇరవై నాలుగు గంటల్లో విసర్జించవలసిందే జీర్ణమయినకొలాలమీద అభిమానం కలవాడైతే. అంటే ఇన్ని రోజులకో కొత్త పుస్తకం చొప్పున కావలిసి వస్తుందా అని ఎవరైనా అడగవచ్చును. శరీరం ఎంత సున్నితంగా ప్రిసిషన్‌తో పనిచేస్తున్నదో మనసు కూడా అంత సున్నితంగా పనిచేస్తే అటువంటిది జరగవచ్చును.

"అబద్ధం ఆడకూడదు" "దొంగతనం చేయరాదు" అన్న ముక్కలకూడా మార్పు రావాలి. ఒకప్పుడు అబద్ధం ఆడకూడదనే నీతి చెప్పి హరిశ్చంద్రోపాఖ్యానం ఉదాహరణగా చెబితే అద్భుతమైన పని జరగవచ్చును. ఇప్పటికూడా ఈపని చేసే నీతికథామంజరులు లేకపోలేదు. కాని ఎప్పటికైనా క్లాసులో కుర్రవాడు లేచి, "అయ్యా, హరిశ్చంద్రుడు అబద్ధం ఆడలేదేమో కాని అతని ప్రవర్తన చాలా అఘోరించినట్టున్నది. అందులో ఒక్క రవ్వ సత్యం లేదు. ఆ స్థితిలో మేము ఏం చెయ్యాలి? నక్షత్రకుడి గుడ్లు తోడాలా? బాకీ లేదు పొమ్మనాలా? లేక ఏపరమేశ్వరుడో అడ్డుపడకపోతాడా అని పెళ్ళాం గొంతు కొయ్యాలా!" అని అడిగితే ఏంచేస్తారు? వాణ్ణి రెండు గంటలసేపు బెంచి ఎక్కిస్తారా? లేక పాతపడ్డ హరిశ్చంద్రోపాఖ్యానం అవతల పారేసి, "అబ్బాయీ, నిజం ఎందుకు చెప్పాలంటే, నిజం చెప్పటానికి భయపడటం నామర్దా కనక! నిజం చెప్పి ఎవరికి చెయ్యలేని ఉపకారం అబద్ధంతో చెయ్యగలిగితే అవశ్యం అబద్ధం ఆడు!" అని చెబుతారా?...ఈపద్ధతి కూడా ఎప్పటికీ పనికొస్తుందనుకో బోకండి! దానికీ మార్పు రావాలి.

అమూల్యమైన పుస్తకాలన్నీ సంస్కృతంలోనే ఉన్నవన్నారు వేంకటరమణయ్యగారు. ఇంగ్లీషులోనూ ఫ్రెంచిలోనూ రష్యనులోనూ ఇంకా అనేక భాషల్లో కూడా ఉన్నవి. నాముత్తాత యొక్క గొప్పతనం నాకెంత ఉపకరిస్తుందో సంస్కృతంలో ఉన్న గొప్పతనం తెలుగుకంత ఉపకారం చేస్తుంది. నాముత్తాత నాకెట్లా బంధువో సంస్కృతం తెలుగుకు అంతే చుట్టం. సంస్కృత పదాలు తీసుకుని భయంకరంగా మార్చి తజ్జలన్నారు. మృత్యువు అనే మాటను మిత్తిగా మార్చినవారు ఎంతకైనా సమర్థులే. ఏభాష చదివినవాడికాభాషలో రాయాలని ఉత్సాహం ఉంటటం సహజం. సంస్కృతం చదువుకున్న పండితులు జాస్తిగా తెలుగులో సంస్కృతం వాడారు. ఒక్క సంవత్సరం పైమిస్తే ఇరవైవేల ఇంగ్లీషు మాటలనో వాటి తద్భవాలనో తెలుగులోకి తెస్తాను!

నేటి వాఙ్మయం యొక్క నమూనాలకింద రెండో మూడో చాతకాని వారు రాసిన కథలూ, కేవలం పదిమందీ చదివి అవతల పారేసే నిమిత్తం రాసిన కథలూ తీసుకోవటంలో వేంకటరమణయ్యగారు పొరపాటు చేశారు. అచ్చుపడ్డదల్లా వాఙ్మయమే అయితే మాఊళ్ళోనే అచ్చయిన కంపెనీ నోటీసులతో ఒక గ్రంథాలయమౌతుంది.

ఈవ్యాసం పొడిగించి లాభం లేదు. నా అభిప్రాయం ఏమిటంటే? గురజాడ అప్పారావు కంటె గొప్పవాడు అంతకన్న హృద్యంగా రాసేవాడు కాడు. అంతకన్న ఒక అడుగు ముందుకు వెళ్ళినవాడు. ఈముందుకు వెళ్ళటం ఏమిటని అడగవచ్చు. ప్రస్తుతం సత్యాన్వేషణ అములులో ఉంది. ప్రతిదాన్ని గురించీ నిజం తెలుసుకోగోరుతున్నారు. ప్రతి రచయితా ఆపనిమీదే ఉండాలి. ఏదో రూపంలో ఆపని చెయ్యాలి ప్రతివాడూ. (ఆలెక్కప్రకారం కూడా పద్యవాఙ్మయంతో మనకు పని లేదు.)

ఇట్లా పోగా పోగా సత్యాన్ని చేరుకుంటామనేది పొరపాటు. సత్యం తీక్ష్ణమైనది. అందరూ దాన్ని తేరి చూడలేరు. సూర్యుణ్ణి సమీపించిన సంపాతి మోస్తరుగా అవుతుంది మన గతి. అందుచేత మనం జటాయువల్లే త్వరలోనే మేలుకుని వెనక్కు తిరిగి పరిగెత్తుకొస్తాము. అప్పుడు గొప్పవాడు సత్యాన్ని కప్పిపెట్టేవాడు. మన రొమాన్సులకూ, కావ్యాలకూ, పద్యాలకూ భలే పైరం!

ఈసందర్భంలోనే ఇంకో పని జరిగితే చాలా బాగుండును. ప్రతివ్యాసం వాఙ్మయానికి బొజ్జ పెంచుమన్నదనీ, ప్రతి రాతగాడూ సారస్వతసేవకుడనీ ఒక దురభిప్రాయం ఎక్కడ పడితే అక్కడ కనపడుతున్నది. ఒక చెంప మడిగట్టుకున్న వాళ్ళనూ చూస్తే అరసున్నాలు సరిగా ఉంటే కాని తాకేట్టు లేరు. మరోచెంప ఒక్కొక్క పత్రికాసంపాదకుల అహంకారం చూస్తే "డు, ము, వు, లు ప్రథమావిభక్తి అవునా? కాదా?" అనే దానిమీద నాలుగు పేజీలు రాసి అవునని తేలిస్తే కాని సాహిత్యం కాదు. ఏదో విధంగా తాత్కాలికవాఙ్మయాన్ని శాశ్వతవాఙ్మయాన్ని విడదీసే ఏర్పాటు జరిగితే బాగుండును.

---

## "హిందీవల్ల తెనుక్కి జరుగుతూవున్న అపకారం"

ఈవిషయాన్ని గురించి మాకు లేఖలు కావాలి. ఒక పావుటావు ఒక వేపుకంటే యెక్కువ వుండ కూడదు. హిందీ ప్రచారకులను హద్దులో వుంచడం మాత్రమే మా వుద్దేశం—

సంపాదకుడు

# వ్యాఖ్యానములు

## అనీ మాట

"అస్పృశ్యులను దేవాలయాలలోకి తీసుకు వెళ్లాలంటే కొత్తవాటిని నిర్మించడం యుక్తమైన పని; గాని శాసనాల కమ్మకమ్మితో బలాత్కారంగా పాతవాటిలో ప్రవేశపెట్టడం నీతి గాదు. దేవాలయాల విశిష్టపవిత్రతనూ, బ్రాహ్మణగౌరవాన్నీ రక్షించుకోడమే బ్రాహ్మణధర్మ మని భావించే హిందువులు, దేవాలయాలకు సంబదించిన తమ ప్రత్యేకాధికారాలను తమకి తామై వొదులు కోవడం కోరతగ్గది; కాని శాసనాలను నిర్మించి వారిని అలా చేసేటట్టు నిర్బంధించడం ధర్మం కాదు."

అసెంబ్లీలో వున్న రంగయ్యరుగారి బిల్లును గురించి హోముసెక్రటరీగారికి రాస్తూ, పంజాబు నందలి బ్రహ్మసమాజకార్యదర్శి అన్న మాట లివి.

పరమతసహనానికి యింత చక్కని వుదాహరణ మరొకటి దొరకదు.

ఈదేశంలో వర్ణాశ్రమధర్మాలు ఇవాళ యేర్పడలేదు. శాస్త్రసిద్ధమైనా కాకపోయినా అస్పృశ్యత కూడా నేటిది కాదు. ఇంతవరకూ పూజాపురస్కారాలు పొందుతూ వున్న దేవాలయా లన్నీ చాతుర్వర్ణ్యంవారికి తరతమమైన ప్రవేశాధికారం యేర్పరిచి నిర్మించబడ్డవి.

"అస్పృశ్యులుగూడా మనవంటి హిందువులే. వారికి కూడా మన కుండే సర్వాధికారాలూ వుండా"లంటే యిది కాలాన్ని బట్టీ, ఉదారనీతిని బట్టీ ధర్మసమ్మతమైనదే. అయితే చిరసంచితమైన సంప్రదాయమే మంచి దని భావించే వారి మీద దీనిని రుద్దడానికి యెవరికీ అధికారం లేదు. "అస్పృశ్యత వుండితీరాలి, మతపావిత్ర్యానికి అది అక్షరాలా అగత్యం" అని నమ్మేవారు తమ విశ్వాసాన్ని సంస్కారవాదుల మీద అమలుజరుపడాని కెలా వీలు లేదో అలాగే యిదీని. అయితే సంస్కారవాదులకు వొక సవ్యమార్గం వుంది. అస్పృశ్యులకు ప్రవేశాధికారం యిచ్చే పద్ధతిని తప్ప ఇక ముందెవరూ ఆలయాలను నిర్మించగూడదు" అని వారు ప్రచారం చెయ్యవచ్చు. ఈ సిద్ధాంతానికి బలం కలిగేటట్టు వారు శాసనం నిర్మించుకోవచ్చు. అది నిక్కచ్చిగా అమలుజరుపబడేటట్టు శ్రద్ధతీసుకోవచ్చు. అంతే.

సనాతనధర్మవాదులను తమ పట్టుదల వదలుకొనేటట్టుగూడా సౌమ్యమార్గంలో వారు ప్రయత్నాలు చెయ్యవచ్చు; గాని వూరికి వొక్క సనాతనధర్మవాది అయినా వున్నంతకాలమూ దేవాలయాలను గురించి ప్రయత్నాలు చెయ్యడానికి వారికి అధికారం లేదు.

ఈసందర్భంలో మా ఆంధ్రబ్రహ్మసమాజమిత్రులు గమనించ తగ్గ విషయం వొకటుంది. పంజాబు బ్రహ్మసమాజ కార్యదర్శి లేఖ ఈకింది మాటతో పూర్తి చెయ్యబడ్డది.

"బ్రహ్మసమాజసిద్ధాంతాల ననుసరించి ప్రజల మతధర్మా లన్నీ మారితేనే తప్ప సత్యమైన దేశాభ్యుదయం కలదు"

త్రికరణశుద్ధి గల మతాభిమానానికీ, హృదయపూర్వకమైన దేశాభిమానానికీ నిదర్శన మిది. అయితే ఆంధ్రబ్రహ్మసమాజికులు కొందరు అస్పృశ్యులను దేవాలయాలలో ప్రవేశపెట్టడానికి కాంగ్రెస్సువారు చేసే ప్రచారంలో పాలుపుచ్చుకుంటూ వుండడం మాకు తెలుసు. దీనివల్ల సనాతనధర్మవాదులను జయిస్తే జయించవచ్చు; గాని వారు తమ

మతానికి అపచారం చేసినవా రవుతున్నారు. క్రైస్తవమిషనరీలలాగ అస్పృశ్యులను ఉద్ధరించడానికి వారి కనేకమార్గా లున్నాయి. వర్ణాశ్రమధర్మాలతోబాటు విగ్రహారాధన గూడా వారి దృక్పథంలో మూఢవిశ్వాసమే. దురాచారమే. అయినప్పుడు వారు అస్పృశ్యులను ఆలయాలమీదకి తెచ్చి గొట్టడంలో యేమి నీతి వున్నదీ!

## గాంధిగారు - అస్పృశ్యత

ఇవాళ గాంధిగారు పంచముల అస్పృశ్యత పోగొట్టడానికి తీవ్రప్రయత్నాలు చేస్తున్నారు.

వెళ్లిన చోట్లల్లా సభలు చెయ్యడం. వాటిలో సవర్ణులతో పాటు అస్పృశ్యులను కూడా కూర్చో బెట్టించడం. సవర్ణులకు నీతి బోధించడం. సభలలో నగలూ, సొమ్మూ వసూలు చెయ్యడం. మాలమాదిగల గూడేలకు వెళ్లి చూసి హితబోధ చెయ్యడం—ఇదీ వారి కార్యక్రమం.

ఈమధ్య వారు రైళ్లూ మోటార్లూ వుపయోగించడం మానేసి కాలినడక ప్రారంభించారు. వొకటి రెండుమాట్లు పరిగెత్తారు కూడాను.

అయితే, ఈకార్యక్రమం మాలమాదిగల అస్పృశ్యతను పోగొట్టడంలో యేమాత్రం వుపకరిస్తుందీ?

ఇప్పుడు వసూలు చేస్తూ వున్న సొమ్ము ఎలా ఖర్చుపెడతారో, అదెలా పని చేస్తుందో తెలుసుకోవాలంటే కొంచెం వోపిక పట్టి చూడాలి; కాని మతవిశ్వాసం మార్చడానికి డబ్బు మంచి సాధన మని మేము నమ్మలేము.

మన దేశంలో వొక పెద్ద అసౌకర్యం యేర్పడిపోయింది. అది యేమి టంటే! మనలో విద్య తక్కువ. ఏదో వొక విధమైన శిక్షణ కూడా లేదు; కాగా ప్రజలు తామే మంచి దని నమ్మింది సాహసించి ఆచరణలో పెట్టలేరు. చెడ్డ దని తెలుసుకొన్నది చొరవచేసి విడిచిపెట్టలేరు.

ఈసన్నివేశం మన ప్రయత్నాల నన్నిటిని బూడిదలో పోసిన పన్నీటిని చేసేస్తోంది.

ఇలాంటి స్థితిలో గాంధిగారు రైలులో—నడిచే కావచ్చు, వచ్చి వొక గంట బోధించి వెళ్లిపోతే యేం పని జరుగుతుందీ? వారు ఉన్నంతసేపూ జనులు సభలలో అస్పృశ్యులతో కలిసి కూర్చోవచ్చు. తరవాత వొకటి రెండువారాలవరకూ వారి ఉపదేశాన్ని మననం చేసుకుంటూ వుండవచ్చు. కాని తరవాత మామూలు ధోరణే. యెప్పటి అదే. డబ్బు యివ్వడం లేదా అంటే ఇచ్చేశాక పూచీ వదిలిపోయినట్టే కాదూ?

బుద్ధుడూ శంకరాచార్యుడూ మొదలైన పూర్వాచార్యులు తమ సిద్ధాంతాలు వ్యాపింపచెయ్యడానికి ఇలా చెయ్యలేదు. వారు కొంతకాలం వొకచోట స్థిరంగా వుండేవారు. తమ దైవికశక్తివల్ల అప్రాంతాలవారిని తమ వలయంలోకి ఆకర్షించుకొనేవారు. వారికి స్థిరదీక్ష కలిగిన తరవాత అక్కడ వొక పీఠమూ, దానిమీద తమ ప్రతినిధిని నిలిపి మరోచోటికి వెళ్లిపొయ్యేవారు.

దీనితో పని చేసిన చోట ఫలం ప్రత్యక్షమవడమే కాకుండా స్థిరంగా వుండిపోయేది.

ప్రజల సంప్రదాయాలు మార్చడానికి యింతకంటె మంచి మార్గం మరివొకటి లేదు. అయితే గాంధిగారికి వొకచోట కూర్చోడానికి వల్లకాదు. వారు అవతల కాంగ్రెస్సుని నడిపించాలి. రాజకార్యాలు చక్కబెట్టాలి. రాటం సంగతి చూసుకోవాలి. పైగా ప్రచారకులను నిలవబెట్టివుంచడానికి డబ్బు వసూలు చెయ్యాలి.

అస్పృశ్యతానివారణం వారికి ప్రధానమే కావచ్చు; గాని అది వొకటే ప్రధానం కాదు. దేనికదే "వ్రతానా ముత్తమం వ్రతమ్."

మరొకటి లో తేమి టంటే? మొదణ్ణుంచీ యీ అస్పృశ్యతానిర్మూలనంమీద వారికి అభిమానం వుందంటే అది సత్యమే; కాని ప్రధానమంత్రి

గారి సాంఘికపరిష్కారం మరొకలా వుంటే దీన్ని గురించి వారిప్పటి శ్రద్ధ వహించి వుండరు. పైగా ఆపరిష్కారంలో యిప్పుడు మార్పు కలిగినా వారి కార్యక్రమం మారిపోతుంది. ఏమీ సందేహంలేదు.

ఇంతులో యింకో అసందర్భం కూడా వుంది.

అస్పృశ్యులు తమకి దేవాలయాలలో ప్రవేశించే అధికారం కావా లని పాకులాడ్డం లేదు. గాంధిగారు కూడా సొంతానికి దేవాలయంలోకి వెళ్లరు; కాని వారు దేశంలో వున్న దేవాలయా లన్నీ అస్పృశ్యులకు ప్రవేశం యివ్వా లంటున్నారు. గాంధిగారి తుమ్ములోగూడా బ్రహ్మాండ మైన వేదాంతార్థం వుం దని వ్యాఖ్యానం చేసేవారు "ఇది ముఖ్యావశ్యకం" అని అంటే ఆశ్చర్యపడ నక్కరలేదు; కాని యిది అనవసరప్రస్తావన. ధర్మబాహ్యం కూడాను.

వారి నడతనే వారు సింహావలోకనం చేసుకుంటే చాలు. ఏమంటే?

స్వరాజ్యం రావా లంటే వారు అందరూ కద్దరు కట్టాలన్నారు. కొందరు కడుతున్నారు. తతిమ్మావారిచేత కట్టించాలి. అయితే వా రందుకోసం నిర్బంధానికి పూనుకున్నారా? శాసనప్రయత్నం చేస్తున్నారా? అస్పృశ్యత అమానుషమే. పైగా మానవత్వానికి భంగకరమే; ఈవిషయంలో సనాతనులు ఇంత ప్రాతికూల్యం వహించడం యీ కాలంలో మంచిది కాదు; కాని వారిని బలాత్కారంగా అడగదొక్కడం సంస్కారపక్షానికి బలకరం కాదు. పైగా ప్రతికూలం కూడా కావచ్చు.

ఇంతకీ: అస్పృశ్యత యీదేశంలో చిరసంచితమైన సంప్రదాయం. ఈక్షణంలో కావలసిన స్వరాజ్యం వంటి వుత్కృష్టఫలాలకోసం దీన్ని నుంచుని వుండగా రూపుమాపా లంటె సాగే పని కాదు. తరవాత "నేను చెప్పినట్టు వినలేదు కనక మీకు స్వరాజ్యం రాలేదు" అని ప్రజలమీదే నింద వెయ్యడానికి తప్ప ఈతొందరపాటు మరొకందుకు వుపకరించదు. వెనక డిసెంబరు ౩౧ వొకటి చల్లచల్లగా గడిచిపోయివుంది. ఇప్పుడు అగష్టు ౧వ తేదీగూడా అలాగే దాటిపోతుంది. సందేహంలేదు. అయితే అస్పృశ్యత యెంత తొరగా పోతే జాతి అంత తొరగా బాగుపడుతుంది. ఇది మట్టుకు నిజం.

## ఇతశ్చ—తతశ్చ

గ్రహించగలవారికి పాట్నాసమావేశం వొక అఖండసత్యాన్ని పండు వొలిచి చేతిలో పెట్టినట్టు విశదం చేసింది.

తగిలేవే తప్పేకే యెరక్కుండా శబ్దజాలం కురిసేసే సత్యమూర్తిగారు యెగిరి గంతు వెయ్యవచ్చు. మన తెలుగువారిలో వొడ్డూ పొడుగూ గల కొందరు పెద్దమనుష్యులకు వుత్సవవిగ్రహా లయే అదృష్టం మళ్లీ పట్టవచ్చు. కాని కాంగ్రెస్సు పడిపోయింది. పూర్తిగా తల్లకిందు లైపోయింది.

నిజానికి కాంగ్రెస్సుయొక్క ఈదశావిపర్యయం అనుకంపాజనకంగానే వుంది; గాని యీపరిస్థితు లింతవరకూ కలక్కపోవడం ఆశ్చర్యకరమే. గాంధిగారి నియంతృత్వం దేశంయొక్క వర్తమానస్థితికి అనుగుణ మయింది కాదు. అది సాహసించి కోడెతాచు తోక తొక్కింది. అంతే; కాని ఆ తాచు తిరగబడి కాటు వేస్తే తప్పించుకోలేక పోయింది.

గాంధిగారు అనేకవేలమంది యువకుల జీవితాల మీద ప్రళయతాండవం చేశారు. దీనివల్ల అనేక కుటుంబాల భావినిర్వహణం నిర్మూలం అయిపోయింది. శాసనోల్లంఘనం స్వయంగా విరమించక యెలాగా తప్పేందు కాదు; కాని యీవిరమించడం దొరతనంవారు చెప్పినప్పుడే చేసే యీ మాటయినా అనేకులకు జెయిలుబాధలు వెంటవెంటనే తప్పిపోయి వుండేవి. "గాంధిగారు సహాకారం అంటే పాకులాడతారు" అనే మాటలో

అర్థం కనపడి వుండేది. ఇప్పుడలా కాలేదు. ఏమీ కాలేదు.

శాసనసభాప్రవేశసిద్ధాంతంమీద కాంగ్రెస్సు ముద్రని వెనక దాసుకొ్రహాలు వేయించుకోడానికీ, యిప్పుడు అన్నాగిదేశాయీలు వేయించుకోడానికీ చాలా వార వుంది. అప్పుడు వాదద్దమూ కాంగ్రెస్సులో వొక విప్లవం లేవదీశారు. దేశం అంతా గగ్గోలు పెట్టేశారు. లెక్కా పత్రం లేకుండా డబ్బు విరజిమ్మేశారు. చివరికి తమ అసమానతార్కిక శక్తివల్ల విజయం పొందారు. ఇప్పుడు వీరలా కాదు. కాంగ్రెస్సువారి పద్ధతిలో శాసలసభలకి వెళ్లడం దొరతనానికీ దేశానికీ గూడా లాభకరం గా దని స్పష్టపడిపోయింది. పైగా ఈ విషయంలో వీ రేమీ ప్రచారం చెయ్యలేదు. మళ్లీ స్వరాజ్యపక్షం యేర్పడడం అవసరం అని యెక్కడో వొక సన్నాయి నొక్కు వినపడింది. వెంటనే రాంచీలో సభ అన్నారు. గాంధిగారు అంగీకరించి దస్కత్తు చేశా రన్నారు. పాట్నాలో ఢంకా మీద దెబ్బకొట్టి నెగ్గించన్నారు. అప్పుడే సత్యమూర్తిప్రభృతులు అసెంబ్లీలో కూమన్నంత వుబలాటపడిపోతున్నారు.

పైగా అప్పటికీ యిప్పటికీ భేదం యేమి టంటే? అప్పుడు శాసనసభాప్రవేశంవల్ల తటస్థించే మంచి చెడ్డలికి ఉత్తరవాదులు పూర్తిగా స్వరాజ్యపక్షం వారు. ఇప్పుడు కాంగ్రెస్సే ఆభారం నెత్తిమీద వేసుకుంది.

ఏం? అప్పటి కంటే యిప్పుడు శాసనసభలలో వున్న విశేషం యేమిటీ! అప్పటి మాంటుఫర్డుసంస్కరణాలే యిప్పుడూ నిలిచివున్నాయి. అద్వంద్వప్రభుత్వమే యిప్పుడూ అమలులో వుంది. అప్పటి సంప్రదాయాలే యిప్పుడూ వున్నాయి. ఏమీ మారలేదు. కాంగ్రెస్సే పల్టీలు కొట్టింది.

పోనీ—అప్పుడు చెయ్యలేని పని యిప్పుడు వీరేం చేస్తారు! ఇప్పుడు శాసనసభలలో అనవసరాలధికంగా వున్నారంటే కాంగ్రెస్సువారిలో అంతకంటే అనవసరాలున్నారు. ఇప్పుడు కఠినశాసనాలు తయారవుతున్నాయి కనక అడ్డుపడా లంటారా? వాటికి వీరి శాసనోల్లంఘనమే కారణం. వాటిని తిరగతోడేస్తా మంటారా? శాసనోల్లంఘనవాసన నివారణలేకమేనా వున్నంత కాలమూ అవి చెక్కుచెదరకుండా అలాగే వుంటాయి.

ఇక శ్వేతపత్రాన్ని తిరస్కరిస్తా మనే మాట వొకటి వుంది. వాస్తవంగా యిది అర్థం లేని మాట. శ్వేతపత్రం అసెంబ్లీహద్దులలోది కాదు. పైగా దొరతనంవారు ముందే మేలుకొని వీరు కల్పించబోయే చిక్కుల కన్నింటికీ పరిహారాలు ఏర్పరుచుకునే శ్వేతపత్రప్రతిపాదనాలను శాసనంలో ధ్రువపరుస్తారు. అలా అయితే వీరు "మేము దాన్ని అంగీకరించ" మంటూరా? మాంటుఫర్డు సంస్కరణశాసనవిషయంలో వీరు చేసిం దేమిటి?

ఏతావతా: కాంగ్రెస్సువారు శాసనసభలను బహిష్కరించడం తప్పని యిన్నాళ్లకు పూర్తిగా గ్రహించారు; గాని అక్కడి కార్యక్రమాన్ని సుఖసుఖాల జరగనివ్వరుట. అయితే దీనివల్ల ప్రభుత్వానికి కంటే దేశానికే యెక్కువ అపాయం వుంది.

ఇటు కాంగ్రెస్సువారి శాసనోల్లంఘనమూ దేశాన్ని క్షోభపెట్టింది. అటు శాసనసభాప్రవేశమూ కలతపెడుతుంది. దృక్పథం మారేదాకా కాంగ్రెస్సు ఏం చేసినా యిది తప్పదు.

౧౮ నౌకాభంగము :

కృతికర్త కజ్ఝుల వేంకటేశ్వరకవిగారు, బి. ఏ. క్రౌనుసైజు ౧౧+౧౭౬=౧౮౭ పుటలు. ముచ్చటయినఅచ్చు. మంచికాగితము. వెలపండ్రెండణాలు. వలయువారు కృతికర్తగారికి జయపురము విశాఖపట్టణము జిల్లా అని వ్రాయవలెను.

ఇది యేడు ప్రకరణముల పరిమితిగల పద్యరూపమగు నవల. దీనికి మూలమొక యాంగ్ల గ్రంథము. మూలమున కాంధ్రీకరణము లిది వఱకే చాల వెలువడినవి. కవిగారు "ఆంగ్ల కావ్యము నందలి కథను హైందవ సంప్రదాయ బద్ధముఁ గావించి స్వతంత్ర కల్పనలు సేర్చి పద్య కావ్యముగా రచించి యున్నారు. ఇందు మేఘుని దౌత్యము మొదలగు స్వతంత్ర కల్పనలు, వర్ణనలు, నెంతయు హృద్యములు.

వేంకటేశ్వరకవిగారు యువకులు. అయినను కవితలో వయసు మీఱిన యనుభవమును, సొబగును అలవఱచుకొని ఆంధ్ర దేశము నంతటను పేరు మ్రోసి యున్నారు. వీరి కవితలో నవీన రీతులు ప్రాచీన మార్గములు కూడ మేళవింపఁ బడుచుండును, ప్రాచీన నియమములకు లొంగి భావ నవ్యత కొఱకుఁ బాటుపడు యువకకవులలో వీరొకరు. వీరి యాశయములు వీరి కవిత యందును సువ్యక్తములు. "నౌకాభంగ" మంతయు నవీన మార్గమునను, కృతి సమర్పణము మాత్రము ప్రాచీన పద్ధతిని రచింపఁబడి యున్నది. కృతి సమర్పణమునఁ బ్రాచీన కవిత్వపు పోకడ లెక్కువగఁ గలవు. దీనింబట్టి కవి గారికిఁ గల ప్రబంధ రచనా పాటవమును విశద మగుచున్నది.

ఈ గ్రంథమున శైలి మృదు మధురము; నిర్దుష్టము. "దోషైకదృష్టి" తోఁ జూచినను, "స్పష్టించి" అను పదము ఒక్కటి తక్క వేరెద్దియు నిందు వ్యాకరణ విరుద్ధమగు పద మగపడ లేదు. కవిత చక్కఁగ సాగినది. కవి గ్రంథరచనమునఁ దీసికొనిన కథ హృద్యమైనది. సర్వజనాకర్షకమైనది. కవిగా రొనరించిన స్వతంత్ర కల్పనలును ఆయా సందర్భములకు బాగుగ అనువయి కథకు వన్నెఁ గూర్చుచున్నవి,

కావ్యమున కానందము పరమావధి. ఆయానంద మీ కావ్య పాఠకులకుఁ గలిగి తీరును. మఱియు నిందు జన సామాన్యము గ్రహింపఁదగిన నీతులనేకములు కలవు. పండిత— పామర జనరంజకమగు నీ చిన్ని కావ్యమును ఆంధ్ర సోదరులెల్ల పఠింతురు, ఇట్టి గ్రంథములను రచింప గ్రంథకర్తను ప్రోత్సహించుట ఎంతయు నుచితము.

బులుసు వేంకటరమణయ్య

౧౯ చంద్రహారము :

రాజమండ్రి వాణీగ్రంథమాల వారి మూడో పుస్తకము. కర్త: అరవ వెంకటస్వామిగారు. వెల నాలుగణాలు. 1. సంక్రాంతిబహుమతి, 2. శాపం, 3. ప్రేమకి చిన్నతన మేమిటి?, 4. ఈరమ్మ, 5. చంద్రహారము 6. శూర్పణఖ, 7. సరళామోహనులు. అని ఏడు కథ లిందున్నవి. ఇందులో ఒక్క ,చంద్రహారము' తప్ప మిగిలిన వన్ని గ్రంథకర్త స్వకల్పితాలట.

ప్రతికథలోనూ కథావస్తువు ఆకర్షణీయంగా ఉంది. ఆంధ్రుల నిరాడంబరనిత్యజీవితచర్య సహజంగా ప్రతిబింబిస్తూంది. సంభాషణలు ఆహ్లాదకరంగా ఉన్నవి. ఘట్టములు (Situations) రెండు మూడు చోట్ల మాత్రం సాధారణజీవిత ప్రవృత్తికి వ్యతిరేకములై కొంచెం అసహజంగా ఉన్నాయి. కథకుడు గోదావరీప్రాంతపు డగు యువకుడు. తరుచుగా మెలిగినై, నడిచినై, వ్యర్థమైనై, పోయినై' ఇలాంటి అన్యప్రాంతీయములను వాడి శైలి కొంచెం కుంటుపరుచుకున్నాడు. "హాశ్చర్యపోయింది సౌభ్రాత్రాన్ని, అస్పృశ్యభావం, ఎక్కున్నుంచి, మెల్లో లేదు" మొదలైన తప్పు సమాసములును వర్ణక్రమము (Spelling) లో తప్పులును ఉన్నాయి. మొత్తముమీద కథలు ప్రతివారూ చదివి ఆనందించతగినవి మాత్రము అవును.



కా. వేం. రా.

# ప్రబుద్ధాంధ్ర

కళాభివర్ధనీపరిషత్తుపక్షమున ప్రకటింపబడు మాసపత్రిక

సంపాదకుడు:—శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

సంపుటము ౫ } రాజమహేంద్రవరము జూలై ౧౯౩౮ { సంచిక ౭

## హిందీవెల్లువ

సుబ్రహ్మణ్యశాస్త్రి:—సంపాదకుడు



ఇది యిప్పుడు తెనుగుదేశాన్ని ముంచెత్తేస్తోంది. అసలు దక్షిణదేశం మొత్తంమీదే దీని దురాక్రమణ యెక్కువగా వుంది; గాని తెనుగుదేశంలో చాలా యెక్కువ. హిందీపరీక్షలికి వెళ్ళే తెనుగువారి సంఖ్యలో తతిమ్మా అందరి సాముదాయికసంఖ్యా సగమేనా వుండదు. కలగాపులగపు పట్నాలమీద మాత్రమే పడి వూరుకుంటే దీన్ని లెక్కచేయవలసిన అవసరం అంతగా లేకపోవును. కాని జాతీయమైన తెనుగుభాషకి స్థానాలైన పల్లెటూళ్ళమీద కూడా యిది ప్రళయతాండవం చేస్తోంది. ప్రైమరీ కూడా పూర్తి కాని పల్లెటూరివారనేకులు హిందీలో పెద్దపెద్ద పరీక్షలిచ్చి పట్టాలు సంపాదించుకుని వున్నారు. తెనుగులో నాలుగు బంతులేనా ఉక్తలేఖనం సరిగా రాయలేని పల్లెపడుచులు కూడా హిందీపట్టభద్రురాళ్ళయి తెనుగుభాషకీ వాఙ్మయానికీ తీరని నష్టం కలిగిస్తున్నారు. ఇంతవరకూ ఆధునికాంధ్రయువతులు తెలుగుభాషలో పాండిత్యం సంపాదించనందుకూ, తెనుగులో గ్రంథాలు రచించి జానుతెనుగు నుద్ధరించనందుకూ విచారిస్తూ వుండగా వారిప్పుడు హిందీవ్యామోహంలో పడి తమ ఆంధ్రత్వాన్ని చంపుకుంటున్నారు. హిందీపుస్తకాలు కొనడంలోనూ, హిందీపత్రికలు తెప్పించడంలోనూ మొత్తానికి తెనుగువారు చూపుతూ వున్న వుత్సాహం హిందూస్థానీలకు గూడా వుండదేమో అనిపిస్తోంది. ఈవుపద్రవం చాలనట్టు ఆంధ్రపత్రిక తెనుగురచనలకే చాలని స్థలంలో హిందీవ్యాసాలను ప్రకటిస్తూ అదిరేమనిపించుకుంటుందో మరి—దాన్ని అపారంగా ప్రకటిస్తోంది.

హిందూస్థానీలు తమ మాతృభాషను దక్షిణభారతీయులమీద వేసి రుద్దుతున్నారంటే అది వారి అత్యాశకు మాత్రమే నిదర్శనంగా వుండివుండును; కాని హిందీ అంటే మనవారు చూపిస్తూ వున్న భక్తికే పట్టపగ్గాలులేకుండా వున్నాయి. వార్తాపత్రికలు తిరగవేస్తే తెనుగుదేశంలో అయిదారు హిందీప్రేమీమండలు లేనా ప్రారంభం కాని రోజు కనబడదు. హిందీప్రచారకులు హిందీని తప్పకుండా—విధిగా నేర్చుకోవాలని మనవారికి పదిపన్నెండుచోట్లనైనా బోధ చెయ్యని రోజు లేదు. ఇది యింతటితో ఆగినా కొంత మేలే అనుకోవచ్చు;

కాని యీ ప్రచారకులు హిందీలోపడి కొట్టుకుపోతూ తెనుగుమీద ఔదాసీన్యమూ, నిరాదరణా, నిర్లక్ష్యమూ కనపరుస్తూ వాటిని హిందీని అభ్యసించేవారికి కూడా మప్పుతున్నారు. డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్యగా రంతటివారే మొన్నటి మెయి నెలలో వొకనాడు

"కాకపోయినా యిప్పుడు తెనుగుపత్రికలు విపరీతంగా పెరిగిపోతున్నాయి"

"మరే పత్రికలు కావాలండి మనకి?"

"హిందీపత్రికలు"

అని ఝూంకారంగా చెప్పినప్పుడు ఇక సామాన్యప్రచారకుల సంగతి చెప్పడాని కేం వుంది?

ఇంతకీ హిందీని సామాన్యభాషగా స్వీకరించాలంటే, దేశంలో ప్రస్తుతం యీ సామాన్యభాష యొక్క ప్రసక్తి యెంతవరకు? సామాన్యభాష అనగానే దానికి చాలా స్థలాల్లో ప్రవేశం వుండదనీ, సామాన్యవిషయాల్లోనే దాని అవసరం అని స్పష్టపడుతోంది. దేశీయుల నిత్యజీవితంలో దానికి స్థానం లేదు. అంచేత దేశీయుల మాతృభాషకి కంటే దానికి నిమ్నపదవే గాని ఉచ్చపదవి యెంత మాత్రమూ లేదు. ఆకాస్త సామాన్యభాషావసరం వున్నవారైనా వేయింటి కొకరేనా వుంటారో వుండరో. అలాంటి భాషకి యింతప్రచారమూ, యింత కుమ్మక్కూ యెందుకూ?

ఎంత కుగ్రామంలో—తెనుగు తప్ప మరే భాషా చెవికి కూడా తట్టని యెంత పల్లెలో నేనా సరే సభ జరిగిందంటే అక్కడ అధమపక్షం దైవప్రార్థన అయినా హిందీలో చెయ్యడం, ఎలాంటి సంస్థకి వార్షికోత్సవం జరిగినా అందులో వొక హిందీనాటకమో, చివరి కందులో వొక భాగమో ఆడడం, ప్రతీసభలోనూ హిందీలో గూడా కొందరు మాట్లాడడం, వొక గ్రంథాలయం వుందంటే అందులో తెనుగు గ్రంథాల స్థానాన్ని హిందీగ్రంథాల కివ్వడం, హిందీపుస్తకాలను డబ్బిచ్చి కొని తెనుగుపుస్తకాలను ఉచితంగా యివ్వమని ప్రకటనకర్తలను పీడించడం, తెనుగుభాషను బోధించడానికి తగినంత మంది పండితు లున్నా లేకపోయినా ప్రతీపాఠశాలలోనూ హిందీబోధకుణ్ణి ఏర్పరచడం, తెనుగుపండితులకికంటే హిందీప్రచారకులకు పెద్ద జీతా లివ్వడం, ప్రైమరీస్కూళ్లలో గూడా హిందీని ప్రవేశపెట్టడం,—ఇదంతా సామాన్యభాష అయిన హిందీకి తెనుగుదేశంలో జరగవలసిన మర్యాదేనా?

వాస్తవంగా హిందీని ప్రోత్సహిస్తూ వున్న ఆంధ్రప్రముఖులు ఈసంగతు లేమేనా యోచించారా? గాంధీగారు హిందీ నేర్చుకోమన్నా రంటే వారికేం అనక? తెను గెలా పోతే వారి కేమి?

అనేకప్రాంతీయభాషలు కల హిందూదేశంలో సామాన్యభాషయొక్క అవశ్యకం కలిగిందంటే దానంతట అదే అవగతం అవుతుంది ప్రజలకి. అప్పుడు దేనికి ఆపదవి రావడానికి అవకాశా లున్నాయో దానికే వస్తుంది. ఎవరెవరు ఆభాషతో పనిగలవా రంటారో వారంతట వారే దాన్ని నేర్చుకుంటారు. నేర్చుకుని తీరతారు. అప్పుడు అలాంటి వారికి సౌకర్యాలు కలిగించడమే ప్రముఖుల పని గాని యిలాగ ఆత్మహత్య చేసుకోవలసిన అవసరం యేం వుంటుంది?

ప్రభుత్వంవారు ఇంగ్లీషుభాషకి అలాంటి పదవి కలిగించా లని అధికారరీత్యా ప్రయత్నాలు చేస్తున్నారు; కనక దేశీయమైన హిందీకి యిలాంటి ప్రోత్సాహం చెయ్యడం అవసరం అంటారా? ఇది చాలా దుర్బలవాదం. ఏమంటే? మనం సకలవ్యవహారాలూ ఇంగ్లీషులోనే నెరవేర్చుకోవా లని దొరతనంవారు మనల్ని నిర్బంధపెట్టడం లేదు. ఇంగ్లీషు మన జనసామాన్యాని కేలాగా అందుబాటు కాదు. మన యునివర్సిటీల విద్యావిధానంలో వున్న కౌశన్యాన్ని చూస్తే దొరతనంవారికి అలాంటి వుద్దేశం వుందని చెప్పడాని క్కూడా అవకాశాలు. కన

పడేవు. వున్నా మరోభాషని ఏర్పరుచుకోడానికి మనకి అధికారమూ, అవకాశాలూ లేకపోలేదు. మనం యెన్ని తికమకలు పడి హిందీని నెత్తిమీద పెట్టుకున్నా ఇంగ్లీషుకి ఇప్పుడు భుక్తం అవుతూ వున్న పదవి రాజ్యాంగవిధానంలో మార్పు సూచింపబడితే గాని హిందీకి రాదు. అంతవరకూ యీ హిందీవల్ల మన నెత్తి కాకెక్కే బరువే తప్ప మరో ప్రయోజనం కలగదు.

ఇలాంటి సంగతు లెన్నో ఆలోచించుకోవలసి వుండగా మనవారు ఇలాగ అక్రమ—వక్ర—ప్రయత్నాలు చెయ్యడం యెందుకో బోధపడదు. ఏం చేస్తున్నారూ అంటే చూడండి.

౧

మనవారు హిందీపాఠశాలల్లో హిందీ తప్ప మరే యితరభాషా మాట్లాడగూడదుట.

"సోదరులారా! ఈ హిందీకుటీరము వంకు యెవరును యెప్పుడును హిందీయే తప్ప మరి యే యితర భాషయు మాట్లాడగూడదు. అట్లు మాట్లాడవలసినప్పుడు లోపల కాక అరుగుమీద మాట్లాడునట్లుగా యీ కుటీరమువారు కోరుచున్నారు.

ఇట్లు
హిందీకుటీరము, సోదరులు.

ఈ హిందీకుటీరము (రామచంద్రపురం తాలూకా) వెదురుపాక గ్రామంలోది. ఇప్పుడు వుందో లేదో చెప్పలేను. ౩—౧౨—౨౯ తేదీని ఆ గ్రామం వెళ్ళినపుడు ఈ ఆజ్ఞాఫలకం చూడడం తటస్థించింది. అప్పు డక్కడ శ్రీమాన్ కొమాండూరి గోవిందరాజాచార్యులుగారు హిందీప్రచారకులుగా వుండేవారు.

౨

తెనుగుదేశంలో హిందీప్రచారం చేస్తున్నవారి వుద్దేశం మన తెనుగువారు హిందీ నేర్చుకోడం మట్టుకే గాదు. మనవారు తెనుగును విడిచిపెట్టేసి హిందీనే వ్యావహారికభాషగా స్వీకరించాలిట. చూడండి.

"తణుకు, నవం ౨౧:—తణుకులో హిందీభాషాభిమానులు సభ చేసిరి. పేసపాటి సుబ్బారావుగారు ఉపన్యసించిరి. దక్షిణదేశములోనివారు హిందీభాషను కేవలము గ్రాంథికముగా వాడుచున్నారే; గాని వ్యావహారిక భాషగ నలవరచుకొనుట లేదని చెప్పుచున్నారు. డిశంబరు ౧౧వ తేదీని తణుకులో హిందీసాహిత్య సమ్మేళనము........."

ఇది ఫ్రీప్రెస్సు వారి ౨౮-౧౧-౩౭ తేదీ ఆంధ్రపత్రికలో పన్నెండో పేజీ ఆరో కాలంలో పడింది.

౪౮ గంటల లామెంబరు

ఇలాగ యీ హిందీప్రచారకులు, దాక్షిణాత్యులు తమతమ మాతృభాషలను విడిచిపెట్టేసి, మరిచిపోయి హిందీలోనే సర్వవ్యవహారాలూ జరుపుకొనేటట్టు చెయ్యడానికి చాలా కృషి చేస్తున్నారు. ఇందుకోసం వుపన్యాసాలు చేస్తున్నారు. పత్రికలు ప్రచురిస్తున్నారు. పాఠాలు చెబుతున్నారు. దేశభాషలు జాతీయతకి అడ్డువస్తున్నా యని నిరసిస్తున్నారు. వీరి వుద్దేశం యిదే అనడానికి సాక్ష్యం కావలస్తే ౪౮ గంటల లామెంబరు టి. ఆర్. వేంకటరామశాస్త్రిగా రేం చెప్పారో వినండి.

"మద్రాస్, మే ౧౧:—...........అధ్యక్షులు (శాస్త్రిగారు) చెన్నపురి పౌరుల పక్షమున యాత్రికులకు స్వాగత మొసగుచు ఉత్తరదేశసంచారమున వార లొనర్చిన ప్రచారమును నుతించిరి. భారతవర్షమున రాష్ట్రభాష కాగలిగిన భాష యేదని యుండినచో అయ్యది హిందీభాషయే యనిరి. పల్లెలందును, గ్రామసీమలలోను సామాన్యజను లెల్లరును హిందీభాష నభ్యసించి, హిందీయందే సర్వవ్యవహారములను జరుపుకొనుటయు, కోర్టులు మొదలగువానియందు రాజకీయభాషగా నేర్పడుటయు యిరువది ముప్పది సంవత్సరములలోగా జరుగగల దని తాము విశ్వసింపజాల మనియు, కాని ఎన్నటి కేని స్వపరిపాలనమునం దైనను సా

మాన్యభాషగ వ్యవహరింపబడుటకు హిందీభాషకే అవకాశము కల దనియు పలికిరి.”

౧౧-౫-౩౮ ఆంధ్రపత్రిక. అయిదో పేజీ. మూడో కాలం.

3

భారతదేశభాష లన్నిటిలోనూ హిందీ చాలా పెద్ద దని—అంటే విశేషవ్యాప్తి కల దని, అంచేత భారతదేశంలో సామాన్యభాష కావడానికి దానికే అర్హత వుం దని—ఇదొక వాదం. అయితే దీల్లో కొంత నిజం లేకపోలేదు; కాని అంత మాత్రాన మనలో ప్రతీవాడూ దాన్ని నెత్తెంచుకుని వూరేగవలసిన పని లేదు. ప్రతీదేశంలోనూ కూడా సామాన్యభాషయొక్క వ్యాప్తి చాలా స్వల్పంగా వుంటుం దని, దాని అవసరం వుండేవారు చాలా చాలా కొద్దిమంది వుంటా రనీ పైని తెలిపివున్నాను. దాని అవసరం వుండేవా రేనా తమను జన్మజన్మాల నుంచీ పోషించుకుంటూ వస్తూ వున్న మాతృభాష వేరే వుం దనీ, తమ అభ్యుదయమూ, ముక్తీ దాని లోనే వున్నా యనీ, ప్రపంచకంలో యేభాషే నా తమకు దాని తరవాతిదే అనీ, దాని సరసని నుంచో డాని కేనా వాటి కర్హత లే దనీ, దానికంటే పర భాషని అధికంగా పూజించడం మాతృద్రోహ మనీ భావించడమూ, సామాన్యభాష అవసరం వచ్చినప్పుడు మాత్రమే దాన్ని స్మరించడమూ—ఇది సభ్యదేశాలలోనూ, సభ్యజాతులలోనూ వుండే మర్యాద. ఇది యిలా వుండగా నిత్యానుభవంలో వుండడంవల్ల మాతృభాషలో వుండే మాధుర్యమూ జాతీయతా, శబ్దశక్తీ, పదప్రయోజనమూ, సారస్యమూ అప్రయత్నంగా తెలిసినంతవరకేనా, పర భాషలో యెంత కృషి చేసినా యెలాంటివాడికీ కూడా కొంతవరకేనా బోధపడవు. ఇలాంటి స్థితిలో ఇవాళే మొదలుపెట్టి రెండు పుంజీల మాటలు—గాంధిగారు చెప్పడంవల్ల హిందీ నేర్చుకుని పారవశ్యం పొంది వోహోహో అని దాన్ని ఆకాశానికి యెత్తివెయ్యడం తనకి సొంత భాష వొకటి వున్న పెద్దమనిషి చెయ్యవలసిన పని కాదు.

చూడండి, నాటకాలకు హిందీతప్ప మరోభాష పనికిరాదుట.

“చెన్నపురిలోను తదితరప్రదేశము లందును, హిందీభాషలో నాటకము లాడబడుచుండుట మిగుల ప్రోత్సాహకరము. ఇట్టి యేర్పాటులు హిందీభాషావ్యాప్తికి విశేషముగ తోడ్పడగలవు. దక్షిణహిందీప్రచారసభవారు గతశనివారమునాడు చెన్నపురిలో విక్టోరియాపురమందిరమున ప్రదర్శించిన వీర్ అభిమన్యునాటకము నటనాకౌశల్యమును ప్రదర్శించుటయ కాక అధ్యక్షత వహించిన రా. బ. సంబంధమొదలిగారు తెలిపినటుల నాటకప్రదర్శనమునకు హిందీభాష ఉపయోగపడునంత బాగుగ మరియొక భాష యుపయోగింప దను సత్యమును పరిస్ఫుటము గావించెను.”

ఇది ఆంధ్రపత్రిక సంపాదకీయం. ౧౬-౮-౩౩ తేదీ ఆంధ్రపత్రికలో ఆరో పేజీ, ఆరో కాలంలో స్ఫుటంగా ముద్రించబడింది.

హిందీ విశేషవ్యాప్తి కలదే కావచ్చు; కాని హిందూదేశభాషలో దానికి ఉత్తమపదవి లేదు. తెనుగు హిందూదేశభాషల్లో మూడో దైనా మధుర మైన దని ప్రఖ్యాతి పొందింది. అనేకభాషల అంతు తెలుసుకున్న శ్రీకృష్ణరాయడు “దేశభాష లందు తెలుగు లెస్స” అన్నాడు. దీన్ని ఆత్మస్తుతి కింద జమకట్టినా ప్రపంచంలో వున్న భాషల నన్నిటినీ పరిశీలించిన పాశ్చాత్యులు తెనుగును “Italian of the East” అన్నారు. ఇలాంటి సందర్భంలో, ఆ తెనుగు మాతృభాషగా (బాధ్యత కూడా) గల పెద్దమనిషి మనకి ఏకైకదినపత్రిక అయిన ఆంధ్రపత్రికలో—అందులోనూ సంపాదకీయంలో యిలాంటి భావం ప్రకటించడం కంటే ఆత్మహత్య వేరేం వుంది? నిజంగా మన తెనుగు

లో కాబట్టి యిలాంటి రాత చెల్లిపోయింది: కాని మరో భాషలో అయితే యెంత రగడ పెరిగి వుండునో ? ౪

హిందీప్రచారం చేస్తూ వున్న మనవారి వుద్దేశాలిలా వుండగా ఈప్రచారకులను అదుపు ఆజ్ఞలలో వుంచడానికి యిక్కడికి వచ్చి పనిచేస్తూవున్న హిందూస్థానీలు దక్షిణదేశభాషలను చంపేసి హిందీనే యిక్కడ స్థాపించడానికి ప్రయత్నిస్తున్నారు. ఈవిషయంలో ఇంగ్లీషుకీ హిందీకీ చాలా భేదం వుంది. దొరతనంవారికి దేశభాషలవిషయంలో యిలాంటి వుద్దేశం కనపడదు. వారు ఇంగ్లీషుకి ప్రాముఖ్యం యిచ్చారంటే వారి వుద్దేశం యేమయినా చాలాకాలం నుంచి అది పనికిరాదని మనం ఆక్షేపిస్తున్నాం. అయినా హిందూదేశభాషలు ఇప్పటి అభివృద్ధి పొందడానికి కారణం దొరతనమూ, అంతకంటే అధికంగా ఆంగ్లభాషానూ. అయినా ఇంగ్లీషు మనకి భావదాస్యం కలిగించిం దని దేవుళ్లాడుతూనే వున్నాం; కాని హిందీని ప్రజలే నెత్తి కెక్కించుకుంటున్నారు కనక యిదే సందని హిందూస్థానీలు దక్షిణదేశభాషల పీకలు నులిమివెయ్యడానికి ప్రయత్నిస్తున్నారు. మనవారు కూడా దానికి చాలా తోడ్పడుతున్నారు. ఈ నివేదిక చూడండి.

"బెజవాడ. అగస్టు ౨౮ :—పై సభవారి సభ ౮-౮-౩౩ వుదయం జరిగిన తరువాత సాయంత్రం సబ్జక్టుకమిటీ జరిగి ౮ తీర్మానములు జరిగెను. తిర్గి ౯-౮-౩౩ తేదీ వుదయం ౮ గంటలకు శ్రీ భ్రమరాంబామల్లేశ్వరగ్రంథాలయభవనమునందు శ్రీమతి దుర్గాబాయమ్మగారి అధ్యక్షతను సమావేశమయి యీక్రింది తీర్మానములు చేయబడెను. వుపన్యాసము లన్నియు హిందీలోనే జరిగెను. మొదట కీర్తిశేషు లగు సేన్‌గుప్తాగారి మరణమునకు విచారమును తెల్పుచు వారి ఆత్మకు శాంతి కలుగుగాక యని కోరుచూ తీర్మానించిరి. ప్రతిచోటను హిందీప్రేమమండలీలు యేర్పరచి దానిద్వారా హిందీప్రచారము విరివిగా జేయించవలెననియు. హిందీ పుస్తక భాండాగారములు ప్రతి చోటను నిర్మించవలె ననియు, జిల్లాబోర్డులు మునిసిపాలిటీలు వారి పాలనలో వున్న విద్యాలయములయందు హిందీని నేర్పుచున్నందులకు వారి నభినందించిన తీర్మానమున్ను, దత్తమండలములలో హిందీప్రచారము బాగా సాగించవలె ననియు, ఒక స్త్రీ ప్రచారకురాలిని బెజవాడ పరిసరము లకు నియమించవలె ననియున్ను. ఆంధ్రరాష్ట్రమునకు ప్రత్యేకహిందీశాఖను దక్షిణభారత హిందీప్రచారక సమితినుంచి విడదీయవలె ననియు, అందుకు గాను ఒక మీటింగు ప్రత్యేకముగ పిలువవలె ననియు, దానికి కన్వీనర్లుగా కార్యదర్శు లగు బాలచంద్రఆప్టే, పీసపాటి వెంకటసుబ్బారావుగార్లను యేర్పాటు చేసిరి. మరియొక తీర్మానము. యిప్పుడు ప్రచారములో వున్న హిందీవ్యాపకము తృప్తికరముగా లేదనియు, దానిని మార్చి వృత్తివిద్యలుగా యేర్పరచి అన్నివృత్తులకు వాటివాటికి తగినట్లు హిందీ విద్యావ్యాపకము చేయవలె నని బాలచంద్రఆప్టే గారు తెచ్చిన తీర్మానమును శ్రీయుత దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు యీతీర్మానమువల్ల యేమీ వుపయోగము లేదనియు, హిందీ తప్ప రెండవ భాష లేకుండా యుండే యెడల సంతోషించు వారలలో నే నొకడ ననియు, ప్రస్తుతం మన స్వభాష యగు తెనుగే సరిగా రాని మనకు యీతీర్మానం ప్రకారం విద్య నభ్యసింపజేయ ప్రస్తుతము వీలు లేదనియు, దీనికి కొంత కాలము పోతేనే గాని వీలు లే దనియు అందువల్ల యీ తీర్మానం నిరుపయోగ మయిన దనియు, ఆచరణ లేని తీర్మానములు చేయుట మంచిది కా దనియు శెల విచ్చిన మీదట వుపపాదకులచే తీర్మానము వుపసంహరించు కొనబడెను"

ఇది ఆంధ్రపత్రిక ప్రత్యేకవిలేఖరి నివేదిక. ఇది ౫—౫—33 తేదీని ఆపత్రికలో నాలుగో పేజీ, మొదటి కాలంలో పడింది.

ఇందులో వుదహరించబడ్డ ప్రతీ తీర్మానమూ మన తెనుగుభాషకి గొడ్డలిపెట్టుగా వున్నాయి. సరే, యిక బాలచంద్ర ఆప్టేగారి తీర్మానము సర్వాపహరణమే పడుతోంది. అయితే దక్షిణదేశ భాషలను సంహరించి వెయ్యడానికే యీ తెనుగు గడ్డకి వచ్చిన ఆప్టేగారికి అంతకంటే మంచి వుద్దేశాలు పుట్టకపోవడంలో ఆశ్చర్యం లేదు; కాని మన నాగేశ్వరరావుపంతులుగారి మాట యేం చెప్పుకోమూ? ఆంధ్రుడైనవాడు—తత్రాపి ఐశ్వర్యవంతుడైన పెద్దమనిషి ఆంధ్రభాషా వాఙ్మయాల విషయంలో పూనవలసిన —పూనితీరవలసిన బాధ్యతలన్నిటినీ యిచ్ఛాపూర్వకంగా స్వీకరించినవారు పంతులుగారు. ఇవాళ పంతులుగారు ఆంధ్రపత్రికను నిలిపివేస్తే ఆంధ్రదేశం అంధకారబంధురం అయిపోతుంది. భారతిని నిలిపివేస్తే అధునికాంధ్రవాఙ్మయ నిర్మాతలనేకులు నిరాశోపహతులైపోతారు. ఆంధ్ర గ్రంథమాలను విరమిస్తే గొప్పగ్రంథాలనేకాలు అంధకారంలోనే వుండిపోతాయి. ఆంధ్రవిజ్ఞాన సర్వస్వాన్ని కట్టిపెట్టేస్తే ఆంధ్రవిజ్ఞానం —ఇప్పుడిప్పుడే కొంచెకొంచెం రెక్కతగలుగుతూ వున్న ఆంధ్రవిజ్ఞానం కొండలోయలో కప్పడిపోతుంది. పంతులుగారు చేతిని ముడుచుకుంటే జాతికి ఇంకా యింకా అనేకనష్టాలూ వుపద్రవాలూ సంభవిస్తాయి. అయితే ఈపత్రికలవల్లా, యీగ్రంథమాలవల్లా, యీసర్వస్వంవల్లా, యీ ఆంధ్రజాతివల్లా వారు కష్టపడుతున్నారు; గాని సుఖపడడం లేదు. నష్టం పొందుతున్నారు; గాని లాభం తినడం లేదు. అయినా వారు యీ కష్టంలోనే సౌఖ్యాన్ని, యీనష్టంలోనే ఆనందాన్ని, మే లెరగని యీజాతిని జూసే పారవశ్యాన్ని పొందుతున్నారు. ఆంధ్రజాతి అంటే, ఆంధ్రదేశం అంటే, ఆంధ్రభాషావాఙ్మయా లంటే ఇలాగ అపూర్వ—అసమాన—అనంత—ఉద్రేకంతో స్వహస్త పరవాస్తాలతో నవీనసృష్టి చేస్తూ వున్న నాగేశ్వరరావు పంతులుగారు “ దేశ మంతయు హిందీ తప్ప రెండవభాష లేకుండా యుండే యెడల సంతోషించువారలలో నే నొకడ ” నని హిందీకి అక్రమమైన ఉల్బణం కలిగించే సభలో ఘంటాఘోషంగా చెప్పడం కంటే వాస్తవంగా విచారకరమైన సంగతి మరొకటి లేదు. పంతులుగారు నిజంగా ఆంధ్రోద్బోధన ప్రయత్నాలలో నిష్ఫలు లయిపోయారా? నిర్వేదం పొందారా? ఆంధ్రభాషలో వారికి జీవం కనపడలేదా? యుగయుగాలనుంచి అనేకక్లిష్టపరిస్థితులను తప్పించుకొని తన అమృతమూర్తిని మహాపర్వతశిఖరంమీద ప్రదర్శించగలుగుతూ వున్న తెనుగంటే యీ వైముఖ్యం వారికెందుకు కలిగింది?

మనకి స్వస్వరూపజ్ఞానం లేకపోవడంవల్ల కలిగే చిక్కులివన్నీని. ఇతర్ల అడుగుల్లో అడుగులు వేసేదురలవాటువల్ల వస్తూవున్న వుపద్రవా లివన్నీని. గాంధిగారు భారతీయుల కందరికీ యిప్పుడు సామాన్యభాష వొకటి అవసరం అన్నారు. అది హిందీయే అన్నారు. అందరూ అది నేర్చుకోవాలన్నారు. ఈదివ్యబోధమీద కాంగ్రెస్సు ముద్ర వేయించారు. ఇక యిది అందరిమీదా—ప్రత్యేకంగా మన తెనుగుదేశంమీద విరుచుకుపడిపోయింది.

౫

కాని ఆంధ్రజాతిని పరీక్షించి చూడండి. హిందీని నేర్చుకోకపోతే అది నశించిపోదు. బుద్ధిబలం వుంటే, మౌలికత్వం వుంటే ఆంధ్రజాతి యిప్పుడు ఈపునరున్నతి ప్రయత్నంలో తన వంతు పని చెయ్యలేకపోలేదు. కాని హిందీ మన బుద్ధికి వేరుపురుగవుతోంది. మన మౌలికత్వాన్ని భ్రష్టం చేసేస్తోంది. ఇదివరకు మనలో ఆంగ్లమానసపుత్రులు మాత్రమే వుండేవారు. ఇప్పుడు హిందీమానసపుత్రులు దేశం నిండిపోతున్నారు. చూడండి.

"పొందుర్రు. జూన్ ౧౯ ది ౧౧-౬-౧౯౩౮ సం॥రం తారీఖున పగలు ౧ ఘంటకు శ్రీరామ సుబ్బారాజేంద్ర గ్రంథాలయ భవనమునందు దక్షిణభారత హిందీప్రచారక ఆంధ్రశాఖామంత్రి శ్రీ పీసపాటి వెంకటసుబ్బారావుగారి అధ్యక్షతను బహిరంగసభ జరుపబడెను............తదనంతరం అధ్యక్షులు హిందీభాషావశ్యకతను గురించి తెలుగు హిందీ భాషలయందు అనర్గళ ధారాప్రవాహమున ఉపన్యసించుచు హిందీ మన ప్రాచీనభాష యనియు పూర్వకాలమున వాల్మీకాది మహాఋషులు శ్రీరామ శ్రీకృష్ణులు మాటలాడు భాష హిందీయే అనుటకు అనేక నిదర్శనము లున్నవనియు నాటినుండి నేటి వరకు అయోధ్య గోకులబృందావనమందు వసించు ప్రజ అందరు హిందీయే మాతృభాష యనియు ఆంధ్రు లందరికి పవిత్రస్థలములగు అయోధ్య ప్రయాగ కాశీ గయ మొదలగు పుణ్యక్షేత్రములును గంగ యమున సరస్వతి మొదలుగాగల నదీజలంబులును దర్శించి జలకమాడి తరింప నుద్దేశ్యము గలవా రందరు హిందీభాష రాని కారణమున అచ్చటి ప్రజల భావములను తెలిసికొన గుతూహల ముండియు తెలిసికొనజాలక నిరాశ జెందుచున్నారనియు దేశీయ మహాజనసభావేదికపై చర్చించు ప్రతి విషయము ఇకముందు హిందీలోనే జరుపబడును గాన తప్పక హిందీ నేర్చుకొనుట చాల అవసరమనియు హిందీ నేర్చుకొనుట కగునంత తక్కువ వ్యయముల ను స్వయంకృషివల్లను మరే యితరభాష నేర్చుకొనజాల మనియు నిదియును గాక హిందీ రానివా రెవరును నేను హిందువునని గాని భరతఖండవాసుడ నని గాని చెప్పుకొనుటకు హక్కు లేదనియు మొదలుగాగల అనేక ఉపమాన ఉపమేయములతో మృదుమధుర శైలిని సభవా రందరు ఆనందవారిధి మునుంగునట్లు సుమారు ౨ ఘంటలసే ప్రపన్యసించుటయేగాక"—ఆంధ్ర పత్రిక (౨౦-౬-౩౮) మూడో పేజీ, నాలుగో కాలం.

దీన్ని వేలకొద్దీ తెనుగువారు చూచి వుంటారు. ఇది చదివినప్పుడు వారి మానసికప్రవృత్తు లెలా పని చేశాయో నేను చెప్పలేను; గాని సుబ్బారావు గారి ధైర్యసాహసాల అంతు తెలుసుకోవడం అసాధారణ విషయంగా కనపడుతోంది. వాస్తవంగా ఆంధ్రు డైనవాడు ఇలా చెప్పడానికి అసాధారణ పరిస్థితు లేవో యేర్పడివుండాలి. దీన్ని బట్టి చూస్తే హిందీ. ఆంధ్రుల్లో యెటువంటి భావాలను, యేలాంటి సంకల్పాలను, యెంతటి త్రిలోకవిజయిత్వయోగ్యతను కలిగిస్తోందో బోధపడగలదు.

ఇంకేం కావాలీ? హిందీవల్ల ఆంధ్రభాషకి, ఆంధ్రజాతికి యెంత అపకారం—ద్రోహం కలుగుతోందో వేరే చెప్పడం యెందుకూ? ఆంధ్రప్రముఖు లేం చేస్తున్నారూ? సామాన్యభాష అనే పేర హిందీని నెత్తి కెక్కించుకుని మనం ఆత్మహత్య చేసుకోవలసిందేనా? ప్రపంచకంలో యెక్కడేనా సామాన్యభాషకోసం యింత హైరా నైపో యీ తెగ వుందా? ఇలాంటి తెగవల్ల యేమేనా పని కొనసాగుతుందా? ఇలాంటి తెగకు సామాన్యభాషయొక్క ఆవశ్యకం యేమేనా వుంటుందా?

ఇంతకీ: హిందీవిషయంలో యింకో చిక్కు కని పెట్టుకుని వుంది. మాహమ్మదీయులు మనదేశానికి హిందీని సామాన్యభాషగా అంగీకరించడం లేదు. వారు వుర్దూ కావా లంటున్నారు. పైగా సామాన్యభాషకి లిపి దేవనాగరి కాక పార్శీ కావా లని కూడా అంటున్నారు. ఇలాగ యీ తగువు యింకా పరిష్కారం కాలేదు. ఇది సులభంగా—అంటే మాటలతో తేలేది కూడా కాదు. ఇలాంటి స్థితిలో మన తెనుగువారు యీ హిందీవ్యామోహంలో పడి దేవుళ్లాడడం యేం వివేకమూ? మన భాష యింకా నవీనావసరాలకు తగినట్లు సంస్కరించబడలేదు. నవీనవిజ్ఞానమూ, నవీనసభ్యతా కలిగించే వాఙ్మయం కూడా మనకి ఇంకా తయారు కాలేదు. మన కివి అవసరం కాని హిందీ యెంతమాత్రమూ కాదు. మన వాఙ్మయాన్ని సర్వాంగసుందరంగా దిద్దుకోనంతసేపు మనం హిందీని ఎంత నేర్చుకుంటున్నామో జాతీయతకి అంతదూర మైపోతాము. నలుగురిలోనూ అంత హాస్యాస్పదులం కూడా అయిపోతాం. కనక తెనుగువారు దూరాలోచన చేసి హిందీని హద్దులో వుంచ గోరుతున్నాను.



# పంతులు: ఉద్యోగం

మొసలి వేంకటసుబ్రహ్మణ్యశర్మగారు బి. ఏ., బి. యిడి



ఆయన ఒక ఉద్యోగి కొంతకాలము క్రిందట. ఇప్పుడు కూడా ఉద్యోగం లేకపోలేదు. ఆపాదమస్తకం ఉద్యోగివాసనలు బయలువెడలుతున్నవి. ఉద్యోగమునందు అరితేఱి బట్టతలయింది ఆయన తల. ఆజ్ఞలిచ్చిన పనిలో కొంత పాల్గొని, ఆజ్ఞాగ్నిని సూచించే నిశ్వాసాల వేడికి తెల్లవారినవి ఆయన మీసాలు. అదే కారణంవల్ల అలిసి, వడలి విశ్రాంతి తీసుకుంటున్నవి ఆయన దవడలు. ఉద్యోగపు వాంఛ తీరింది కాబోలు సెలవు పుచ్చుకున్నవి ఆయన పండ్లు.

ఇంకా ఉద్యోగమే. ఇంకా ఉద్యోగపు వాంఛ తీరలేదు ఆయన మిగిలిన దేహానికి. అది విసుగు లేకుండా ఉద్యోగపు చిహ్నాలు ధరిస్తుంది. కోటు గాని, కోటుపై వల్లెవాటు గాని, ధోవతి మడుపుల చాటున మేజోళ్లుగాని అన్నిటినీ మించిన తలగుడ్డ గాని లేకపోవడం భరించలేదా ఉద్యోగవాంఛ. నియమవిపరీతం గాకుండా ముఖక్షౌరము, బట్టతలపైన తలగుడ్డలను అపరిమితంగా ప్రేమించింది అది. ఇహ ఆయన ఉద్యోగగౌరవానికేమి లోటు?

ఆయన పూర్వచరిత్ర, ఉద్యోగపు వెలుగు నీడలలో దాగుకొన్నది. ఆయన పూర్వీకుల చరిత్ర కాలపు జాడలలో నలిగి నలిగి ఇగిరిపోయింది. ఆయన వంశచరిత్ర ఆయన ఉద్యోగపు కాంతుల చేత తఱుమబడి మారుమూలల్లో నక్కి దాగుడుమూత లాడుతున్నది.

ఆయన ధనవంతుడు. ధనదేవత ఉద్యోగాన్నే ఆశ్రయించిందారోజుల్లో. ఇహ ఆయన్ను వరించడంలో ఆశ్చర్యము ఏమిటీ?

కాని ఒక సందేహం అక్కడక్కడ ఆపట్నంలో తొంగి చూస్తున్నది. "ఆయన ధనాన్ని ఆర్జించాడా? ధనం ఆయన్ను ఆర్జించిందా?" ఈప్రశ్నమీద భేదాభిప్రాయాలు చాలా ఉన్నవి. ధనమే ధనాన్ని ఆర్జించింది అని, ఆయనే ధనాన్ని ఆర్జించాడనీ, కాదు ఆయన అదృష్టదేవత ఆర్జించిందా ధనమనీ, ధనమక్కడనే ఉన్నది, ఆయన త్రోవన పోతూ నాది అన్నాడు, కొన్నాళ్లు ఆయనదే ననీ, ఆధనమునకు ఆయన ధర్మాధికారి అనీ, ధనమే ఆయన్ను ఆర్జించిందనీ, ఆర్జించడమే కాదు ఆయన్ని సేవకుడిగా చేసుకుందనీ పలువిధములైన అభిప్రాయాలు రహస్యంగా ప్రచారం అవుతున్నవి. ఒక్కటీ బయలు పడలేదు. ఇందులో ఏది గెలిచేదీ చెప్పడం కష్టము.

దానిమీద మరియొక ప్రశ్న. ఉద్యోగం చేస్తున్నది ఆయనా? ధనమా? అని. ఈప్రశ్నకు సమాధానం మొదటి దానిమీద ఆధారపడి ఉన్నదనే కారణంవల్ల త్రోశివేశారు.

కాని ప్రశ్న నిలిచే ఉంది.

పక్షులు గూళ్లలో కూర్చొని ధనమా రాజ్యం చేయడం? అని ధ్వనిచేస్తున్నాయి. మీప్రపంచమే మీకా? మనుష్యలోకంలో ధనం రాజ్యం చేస్తున్న సంగతి మీకేం తెలుసునని గాలులు ఊదుతున్నవి. ఆశ్చర్యపడుతున్నవి పక్షులు.

ఆయనే ఒక ధనం. పట్నంలో ఉండే ధర్మసంస్థలన్నీ ఆయన్ను పొందినవి. అందువల్ల దేవుడికి దగ్గర అయినవి. దేవుడే ఆయన్ను పొంది ధనవంతుడైనాడని—ఆయన ముఖతహా కాకపోయినా—వినబడుతున్నది.

ఆయన లేని సంస్థ లేదు. ప్రతిదాన్ని ఆయన పోషిస్తున్నాడు. ధనం తృణంగా ఉపయోగిస్తున్నాడు. కొంతమంది మానవులు—ఎప్పుడూ భగవంతుడి ముందు కూడా సాగిలపడని కొందరు మానవులు ఆయన పాదాల దగ్గర సాగిలపడు

కున్నారు. భగవంతుడు—మనకు కనపడే సృష్టిలో భగవంతుడు సహితం—సాగిలపడే అందర్నీ ఏక దృష్టితో చూస్తాడు. ఈపురుషుడో చిత్రచిత్ర మైన చూపులతో చూస్తున్నాడు. భగవంతుడి కన్న గొప్ప!

ఆయన దాతృత్వము మూలమూలలకు పరుగెత్తుతున్నదని ప్రతిసంస్థను ఆయన పోషించడాన్ని బట్టే తెలుస్తున్నది. ఆయన ప్రతి మంచి వస్తువును తన దాన్ని చేసుకున్నాడు.

మహానుభావు డని కొందరు హారతు లిచ్చారు. కొందరు పాటలు పాడారు. కొద్దిమంది భక్తియుతులై తన్మయత్వంలో నిశ్చేష్టులై చూశారు. ఈజగత్తును మించే టటువంటి గొంతుకలో "అన్నిటిని ఆయన కొన్నాడు. దాతృత్వం కాదు ఉద్యోగ వాంఛ. దానం కాదు క్రయం" అని వెలుగు రాచిన స్వరపు వదంతి ఒకటి బయలుదేరింది. అందరూ విన్నారు. ఎవరు అన్నారని సమాధానం చెప్పడం? అవదంతికి సమాధానమే లేకపోయింది.

ఆయన స్వగృహంలోనూ ఉద్యోగమే చేస్తాడు. బహుశా ఆయనకు చావు కూడా ఉద్యోగపు విధులలో ఒకటే నని గట్టి పుకారు. నమ్మక మైన స్థానంనుంచి వచ్చిన కబురు. ఉద్యోగపు విధి కాకపోతే ఆయన చావనే చావ డని చెప్పుకుంటారు. నిజం పరీక్షించడము ఎవరికి చేత నవుతుంది?

భార్యా దగ్గరా ఉద్యోగమే చేయడం. అక్కడ సేవకత్వం. ఆయన దైవభక్తుడు గూడానూ. రుద్రాక్షమాలలు ఆయన తేజస్సు వల్ల గొప్పదనం సంపాదించుకోవడానికి ఆయనకు తమ్ము దామే సమర్పించుకున్నవి. తనకు పూజ్యార్హత సంపాదించుకోవడానికే విభూతి ధూళి ఆయన నొసటిని అలంకరించింది. దేవతార్చనలో గంటలు గూడా తమంతట తామే మ్రోగుతున్నవి.

ఆయన సంధ్యావందనమే చేయ డని కిట్టని వాళ్లు అంటారు.. వాళ్లు చాలా అన్నారు. కీర్తి సంపాదించే వాడికీ ధనం సంపాదించే వాడికీ అందరూ విరోధులే మరి అనరూ?

ఇవన్నీ తంతా విరోధులు కావడానికి తగిన కారణమో? ప్రజల అనుమానమే నని. కీర్తి, ధనం సంపాదించే ఉద్యోగిలో ఉండే అహంకారం అని ఎవరూ విస్పష్టంగా అనలేరు. అన లేరు. ఎవరైనా రహస్యంగా అన్నా రేమో అవాను ఆయన కీర్తి నినాదాలలో లీన మయి అంతర్హిత మయింది. అనుక నే దాగున్న ఆయన చరిత్ర, పూర్వీకుల చరిత్రలు కూడాను కూడా తమ వెంత జేర్చుకొని జోకొట్టినవి.

ఆయన పేరితో ఆపట్టణవాసుల కెవరికీ అవసరం లేదు. పేరు పెట్టి పిలిచేవా రెవరి? అందరికీ ఆయన పంతులుగారే. పంతులుగా రంటే అందరికీ తెలుసు. ఫలాని వెంకయ్య అంటే అతన్ని ఎరిగి ఉన్నవాళ్లందరికీ ఆవెంకయ్య రూపం మనస్సులో ఎట్లా స్ఫురిస్తుందో అలాగే పంతులుగా రంటే ఈవ్యక్తి రూపం ప్రతివాడికి ఆపట్ణంలో తట్టుతుంది. 'పంతులు' నాణెము బాగా చెలామణీ అవుతున్నది.

ఎవరి కేనా వృద్ధులకు—ఉద్యోగి కన్న—అనగా పంతులు కన్న వృద్ధులకు తెలుసు నేమో ఆయన పేరు. అయినా ఎన్నాళ్లని జ్ఞాపక ముంటుంది?

౨

పంతులుగారే వృద్ధుడు ఆయన అనుకున్నా ఆమాట అనుకోకపోయినా. ఇంకా ఎన్నాళ్లో జీవించి ఉద్యోగం చేయాలె నని ఆయన తలంపు. అందు కని తాను చిన్నవాడే నని తనకు నమ్మించాడు.

ఆయన దగ్గర పని చేసే మాధవశాస్త్రి మరీ వృద్ధుడు. పంతులుగారి తాతను ఎరుగు నట. ఆయన తండ్రి సమకాలికుడు. పంతులుకన్న షుమారు పాతికేండ్లు పెద్ద.

ఆయన చేసే పని గుమస్తాగిరి. దాన్ని ఉద్యోగం అనడానికి వీలులేదు. ఉద్యోగలక్షణాలు దాని కేవీ లేవు. అతిఅహంకారము అతికోపము, అతి బిరుసుమాటలు, అతిధనమదాంధత్వము, అతిఅధికారదుర్నయం అన్నీ ఉంటేనే ఉద్యోగలక్షణాలు సంపూర్ణంగా ఉన్నట్టు. అవి చెలాయించే ఉద్యోగ మయితేనే ఉద్యోగం. మరి మాధవశాస్త్రి చేసే పని గుమస్తాగిరీ అనండి, నౌకరీ అనండి ఏ దయినా సరే.

ఉద్యోగ మనేది ఆయన కెట్లా అవుతుంది? ఉద్యోగం చదువుకున్న వాడికి. చదువుకోవడానికి డబ్బయినా ఉండాలే లేక అడుక్కోవడ మైనా చేతకావలె. అవి రెండూ లేని మాధవశాస్త్రి కేమి ఉద్యోగం?

ఆయన చాలా బీదవాడు. ఉద్యోగాన్ని ఆశ్రయించిన ధనం ఆయన కేలా లభిస్తుంది? తన యజమాని లాగా ధనం ఆర్జించడం చేతగాదు. పుట్టినప్పటినుండీ ఇంతవరకు అన్నవస్త్రాలకు చాలీ చాలకుండా జీవనం చేస్తున్నాడు. ఇచ్చిన జీతం చాలకపోతే పై ఆర్జన నేర్చుకోవలె; యజమాని నైనా సరే మోసం చేయాలె. లేకపోతే మాకున్నది, మాకున్నది అనే వారి కందరికీ డబ్బెక్కడినుంచి వచ్చినట్లు?

జీవితారంభం నించీ ఈ పెండెకట్లే అయితే, ఈ రుద్రాక్షమాలలే అయితే ఈ సహస్రనామార్చనలే అయితే, ఈ ముక్కుమూసుకోవడాలే అయితే, ఈ మడికట్టుకోవడాలే అయితే అందరిలాగానే ఉండేవా రీధనవంతు లంతా.

మాధవశాస్త్రికి పిచ్చి పాపం! నమ్మకం అంటాడు. నమ్మిన స్వామిని ద్రోహం చేయడట. లాభం లేదు. అటువంటి మానవుడు ఈ కలియుగంలో పుట్టడానికే హక్కు లేదు. జీవించడానికి చెప్పాలెనా?

మాధవశాస్త్రిని విభూతి తనంత తానే అలంకరించడం లేదు. రుద్రాక్షమాలలు ఆత్మార్పణం చేసుకోలేదు. దేవతార్చనలో గంటలు తమంత మ్రోగడం లేదు. అన్నీ ఆయనే స్వయంగా చేస్తాడు. అన్ని పూజలూ వేళ తప్పకుండా చేస్తాడు. ఆయన సంధ్యావందనం చేయ దని వదంతి లేదు. కొంత మంది ప్రజలు ఆయన్ను—బీదవా డయినా—గొప్ప వాడే నంటారు. ధైర్యంగా ఆయన్ను, ఆయన గొప్పదనాన్ని మెచ్చుకున్నవాళ్లు లేరు.

తన జీతానికి అవసర మయిన దానికంటె ఎక్కువగానే పని చేస్తాడు శాస్త్రి. ఆయన రక్తమాంసాలు ఈయజమాని సేవలోనే జీర్ణించినయి. ఇంటి పని, రాబడి వ్యవహారము, వ్యవసాయపు పని పిల్లల చదువు పని, పను లన్నీ ఆయన పనే. తలచుకుంటే కుబేరుడు కావచ్చు కూడానూ. కుబేరుడితోనూ, అంతకన్న గొప్పవా డైన తన యజమానితోనూ పోటీపడడం యిష్టం లేదు పిచ్చి శాస్త్రికి.

రక్తమాంసాలు ధారపోసి చాకిరీ చేస్తున్నాడని ఎవరికీ జాలి లేదు. జీత మిస్తున్నాం చేస్తున్నాడని యజమాని అభిప్రాయం. జీత మెక్కువేమో నని యజమానురాలి అభిప్రాయం.

ఉదయం యజమాని గృహానికి రాగానే చిన్నవా డని అయినా విచారించకుండా యజమానికి నమస్కారం చేస్తాడు. అటువైపు చూడనే చూడడు పంతులుగారు. చూచినా చక్షురింద్రియజ్ఞానం ఉన్నవాడిలాగా కనపడడు. చేతులారా పోగొట్టుకొన్నవాడి కెవరేం చేస్తారు.

యజమాని యాజమాన్యం సర్వకాలసర్వావస్థలయందు వ్యక్త మవుతూండడం వల్ల నయితే నేమి, గుమస్తాకు తాను సేవకుడ ననే మాట ఎప్పటికి అప్పుడు జ్ఞాపకం వస్తూండడంవల్ల నైతే నేమి, మాధవశాస్త్రికి పంతులుగారి సమ్ముఖాన అమితవినయం. పంతులు తీక్ష్ణ మైన చూపులకు తోడు శూలం లాంటి మాటలు విసురుతాడు. "ఈపని కాలేదే మని" యజమాని ప్రశ్న. "చిత్తం ప్రొద్దున పొలానికి వెళ్లాను; ఈపూట......" అని

శాస్త్రి జవాబు. యజమాని కండ్లెఱ్ఱజేసి "ఏమి పను లయ్యా! ఒకపని పూటపూటల్లా చేయాలె. ముసలివాడివి పని చెయ్యలేకపోతే చాలించుకోరాదూ? చిన్నవాళ్ళెవళ్లైనా దివ్యంగా చేస్తారు." అని.

ఈలాంటి మాటలతో మాధవశాస్త్రి చెవులు చిల్లులు పడినవి. మెచ్చుకోబడని గుమాస్తాగిరి మాని వేద్దామంటే అయన స్వాధీనంలో లేదు. అడుక్కొని తినడానికైనా ఓపిక చాలదాయనకు.

ఆనాడు రావడం ఆలస్యమయింది పంతులుగారింటికి. పంతులుగారి భార్య చూసింది. "గుఱ్ఱం గుడ్డిదైనా దాణాకు తక్కువ లేదు. నెల అయ్యేసరికి జీతం కావాలె. ప్రతిరోజూ రావడమాలస్యం. పని కాదు." అని కేక వేసింది. శాస్త్రిగారు తల వంచుకున్నారు. మగవాడైనా కన్నీటిచుక్కలు ఆగలేదు. కొనగోటితో చిమ్మివేశాడు. పంతులుగారు వచ్చి మళ్ళీ ఆరంభించాడు. దేనికి మాట్లాడలేదు శాస్త్రిగారు.

ఆరోజున పని ఏమీ సాగలేదు. తలచుకున్నప్పుడల్లా కళ్ళవెంట నీళ్ళు కారేవి. దానికి ప్రత్యేకకారణం కూడా ఉన్నది. ఏకపుత్రుడికి వారం రోజులనుంచీ జ్వరం. ఆరోజున కొంచెం ఎక్కువైంది. అందువల్లనే ఆరోజు ఆలస్యమయింది రావడం. దానికి తోడు యజమాని, యజమానురాలి క్రూరత్వము. వృద్ధుడు హృదయవేదన పడ్డాడు.

రెండు రోజులకు శాస్త్రిగారి కుమారుడికి జబ్బు చాలా విషమించింది. మందు పోయించడానికైనా శాస్త్రిగారి దగ్గర రాగిదమ్మిడీ కనపడలేదు. ఆయన కేమీ తోచక పంతులుగారి వద్దకు వెళ్ళి తాను పనిచేసున్న నెల జీతమైనా యివ్వమని అడిగాడు. నెల సాంతంగా పని చేయంది డబ్బివ్వడానికి వీలు లేదని పంతులు సెలవు. ముందుగా ఇస్తే వడ్డీ నష్టం కదూ!

శాస్త్రిగారి కుమారుడు ఏమీ మందు లేకుండానే మరణించాడు ధనం లేనిది జీవించడానికి హక్కు లేదు గనుక.

శాస్త్రిగారు జీవించీ మరణించిన వాడితో సమానమైనారు. మనిషి అస్తావిస్తం క్రింద పడ్డాడు. ఆయన కడుపు తరుక్కొని పోయింది. పోయీ చేసేది?

నాలుగు రోజులకు కబురు శాస్త్రిగారు క్రమంగా పనిలోకి వస్తారా? రారా? అని, రాకపోతే అంతటితోనే పని చాలించుకోవలసింది అని. ఈ మాట విని మరీ కూలిపోయినాడు. నీరసించిపోయినాడు. వరుసగా నాలుగు రోజులు భోజనమే చేయలేదు. గోరుచుట్టు మీద రోకటి పోటు.

ఇది మంచిది కాదని ఆపంతులుగారికా పట్టణంలో ఎవరు చెప్పగలరు? అందరూ ఆయన పాడిన పాటకు తాళం వేసే వాళ్లే. ఆపట్టణంలో ఉన్న ప్రతిసంస్థకూ ఆయనే అధికారి కావడంవల్ల ఈవిధంగా శ్రమపడేవాళ్ళకు లెక్క లేదు. అయినా ఎవరూ ఇది తప్పని అనలేరు. అన్న మరుసటి క్షణం ఆసంస్థకు అయన చేసే సహాయానికి దేవిడ మన్నా చెబుతాడని భయం.

తప్పని చెప్పగలవాళ్ళెవళ్లైనా ఉన్నా వాళ్ళకు ఆయన దగ్గిరికి రాపలసిన అవసరం లేదు. ఆయన దుర్నయాలు ఆటంకం లేకుండా సాగుతున్నవి. కాని ఆయనంత గొప్పవాడు, మంచివాడు, ఋషి ఆపట్నంలోనే లేడు.

శాస్త్రి మంచం పట్టాడు. స్మృతి తప్పిపోయింది. నాలుగు రోజులనుంచీ ధారకం లేదు.

ఇంట్లో ముసాలి వృద్ధ శాస్త్రి భార్య. ఆమె ఒక్క కొడుకు పోయి పదిహేను రోజు లయినా కాలేదు. ముసలాయనకు ప్రాణం మీదికి వచ్చింది. చిట్టుడుకునీళ్లు పోయడానికైనా ఇంట్లో బియ్యపు గింజలు లేవు. పంతులుగారింటికి వీరని, వారిని బ్రతిమాలుకుని కబురు చేసింది. అందరూ పంతులుగారు డబ్బు ఇప్పుడు లేదన్నారని కబురే. చేసినంత వరకైనా డబ్బివ్వమని ఆమె తుదిమారు కబురు చేసింది. నెలాఖరు కావలె నన్నాడు ఉద్యోగి.

నెలాఖరువరకు ఉండి జీతము పుచ్చుకునే ప్రాప్తం లేదు శాస్త్రికి. పరమపదించాడు. శాస్త్రిగారి భార్యా రోదనం భూమ్యాకాశాలు ప్రతిధ్వనించింది. డబ్బు లేమివల్ల కొడుకు, భర్త ఇద్దరూ చనిపోయినారు. ఇవ్వవలసిన కొద్ది కూడా సమయానికివ్వక, కనికరం లేకుండా ప్రవర్తించాడు పంతులు. ఆమె కడుపు భగ్గు మన్నది. "నే నేడ్చినట్లే వాళ్లు కూడా తిండికి లేక ఎప్పుడు ఏడుస్తారో" అని అందరితోటి అని ఏడ్చింది. ఏడ్చి ఏడ్చి ఆవిడ నేల కొరిగింది. ఆ ఇద్దరూ పడ్చోటే మట్టి అయినారు. ఇద్దరికీ ప్రకృతి కర్మాంతగాలు చేసింది. వర్షం ధర్మోదకాలు వదిలింది కాలం మంత్రాలు చదివింది.

ఆఇల్లాలు చనిపోతూ అన్న మాటను చాలామంది సంతోషించారు. ఎల్లకాలం ఒక మాదిరిగా ఉంటుందా? ఈకాలానికి ఆవిడమాట నిజం కాకూడదూ?

3

అకస్మాత్తుగా అర్బత్తునాటుకంపెని దివాలా తీస్తుం దని ఎవ్వరూ కలగన లేదు. ఏదో విధంగా న్యాయమో, అన్యాయమో డబ్బు పోగుచేయడం అర్బత్తునాటుకంపెనిలో వడ్డీకి వెయ్యడము.

అందులో వడ్డీకి వేసిన వారి అందరి జాతకం ఒకే విధంగా ఉండాలె. లేదా అందరిదీ అన్యాయార్జిత మైన విత్తం కావాలె.

ఒకరోజు తెల్లవారే సరికి అర్బత్తునాటుకంపెని దివాలా తీసిం దని వార్త. ఆదివాలాలో కొస్తో, కూస్తో నష్టపడని మానవుడు లేడు.

పంతులుగారి యావదాస్తి అర్బత్తునాటు దేవుడికి దక్షిణ సహితంగా సమర్పణ మయింది. గుళ్లో దేవుడికి కొబ్బరికాయ నివేదిస్తే సగభాగం ప్రసాదరూపకంగా మనకు చేరుతుంది. అర్బత్తునాటుదేవుడు ఆమాత్రం ప్రసాద మయినా ఇవ్వదలచలే.

ధనం ఆవిధంగా నాశనం కాగా మిగిలిన చిల్లర ఆస్తి చిల్లర అప్పులకు సరిపోయి సెట్ట మిగిలాడు.

సంస్థలన్నీ ఆయనకు క్రొత్త వయినవి. సంస్థలను కొనడానికి తగినంత ధనం ఆయనదగ్గర లేదు. పూర్వంలాగా ఆయన్ను కీర్తించే వారు లేరు. హారతు లివ్వడానికి కర్పూరం వెలిగించినా ఆరిపోతున్నది

ఆయన పోషించని మాత్రాన సంస్థలు నాశనమూ కాలేదు. వాటి త్రోవన అవి ఉండనే ఉన్నవి. ఏసంస్థా ఇప్పుడు పంతులుకు వంగి నమస్కారం చేయడం లేదు.

ఆయన దైవభక్తి మిథ్య అనే వదంతి తిరిగి బయటికి వచ్చింది. ఇప్పుడు దాన్ని కాదన్నవాళ్లు లేరు. కిట్టిన వాళ్లూ ఆయన సంధ్యావందనం చేయడన్నారు.

ఆయన అహంకారానికీ, ఉద్యోగవాంఛకీ తగిన తావు లేక ఆయన్నే ఆక్రమించుకుని తిని వేసినవి. ఆయన జీవచ్ఛవ మైనాడు.

విభూతి ధూళి తనంత తానే రాలింది. దేవతార్చన గంటలు తమంతట ఆగినవి. రుద్రాక్షమాలలు తెగి నేలకు రాలినవి. ఆయన తిరిగి వానిని ధరించ లేదు. వాటి అవసరం ఆయనకు కనపడలేదు.

ఆయన పేరు అందరికీ జ్ఞాపకం వచ్చింది. పంతుల్లా శివయ్య అయినాడు. ఉపపదం గూడా లేకుండా ఆయన ఇప్పుడు శివయ్యమాత్రం. పంతులంటే ఆయన రూపం ఎవరికీ జ్ఞాపకం రాదు. "పంతులు" నామం మరెవరినో వరించింది.

ఆయన ఉద్యోగం పోయింది. ఇంట్లోనూ ఉద్యోగం లేదు. అహంకారం, తలబిరుసు ఇత్యాది ఉద్యోగలక్షణాలు సెలవు పుచ్చుకున్నవి. ఆయన దేహానికి గూడా ఉద్యోగవాంఛ తగ్గింది. ఆయన కోటూ, వల్లెవాటుపంచా భోజనానికి ఉపయోగించినవి.

ఆయన ధనాన్ని ఆర్జించాడా? ధనం ఆయన్ను ఆర్జించిందా? అనే ప్రశ్న మళ్లీ బయలుపడ్డది. "ఆయన్నే ధనం ఆర్జించింది. పైగా ఆయనమీద రాజ్యం చేసింది." "త్రోవన పోతూ ఈధనం నా

దన్నాడు. కొంతకాలం, ఆయనదే!'' అన్న ఆశీర్వాదాలు గెలిచినట్టుగా ప్రకటిత మైంది. తరువాత ప్రశ్న—ధనమా రాజ్యం చేయడం? ఆయనా? అనే ప్రశ్న—కూడా నిర్ధారణ మయింది. ఆనాలుగు వాళ్ళూ ధనమే రాజ్యం చేసిం దన్నారు.

— పంతులు—ప్రస్తుతం శివయ్య—ఉద్యోగపు కాంతులు అస్తమించినవి. ఆయన పూర్వచరిత్ర బయట పడ్డది. పూర్వీకుల చరిత్ర అందరూ చెప్పుకుంటున్నారు. వంశచరిత్ర కూడా తెలిసింది. శివయ్య తండ్రి గుమస్తాగిరి చేసి యజమానిని మోసం చేశాడు. ఆధనంతోనే కొడుక్కు ప్లీడరీ చెప్పించాడు. శివయ్య తాత ముష్టెత్తుకుని జీవనం చేశాడు. ఆవంశం గ్రామ పాచికపు పురోహితవంశం. ఈసంగతులు చెప్పుకోవడానికి ఎవరూ భయపడటం లేదు. ఆయన చివరకు అడుక్కొని తింటూంటే "పూర్వీకుల ఉద్యోగమే ఈయనకు సరి. మధ్య వచ్చిన సిరి నిలుస్తుంది!'' అన్నారు.

శివయ్య చనిపోయింది ఉద్యోగపు విధి అని కాదు. చివరరోజులలో ముష్టికూడా దొరకలేదు. తిండి లేక మలమల మాడి శోష వచ్చి చనిపోయినాడు.

ఆ ఇల్లాలి శాపం అలాంటిది కాబోలు.

పక్షులు చెట్లమీద కూర్చుని ధనం రాజ్యం చేయడమా! అని ధ్వని చేసినవి. "కొన్నాళ్ళు రాజ్యం చేసిన దిలే. ఎక్కువ రోజులు నిలవక పోతేనేం'' అని తిరిగి గాలులు ఊదినవి. పక్షులు కిలకిల నవ్వుతూ ఎగిరి పోయినవి.



# పాత్రాభినయము

## వసంతమూర్తి

నాటకము దృశ్యకావ్యము, అనగా ప్రేక్షకులు చూడవలసినది. శ్రవ్యకావ్యములలో ప్రేక్షకుల చూపు ప్రసక్తి లేదు. అంతవరకూ ఎందుకు ప్రేక్షకుల ప్రసక్తే లేదు. దృశ్యకావ్యాలలో అంతా ప్రేక్షకుల నుద్దేశించినదే. మహాకవి షేక్స్పియరు తన కాలమునాటి ఆంగ్లనాటక రంగానికి అనుకూలించే టట్లు రచించా డట నాటకా లన్నిని. సంస్కృతాలంకారికులు, భోజనము, రక్తపాతము మొదలైన చర్యలు కొన్ని రంగముమీద చూపకూడ దని నిషేధించారు. కాబట్టి నాటకము మొదటినుంచీ, అన్ని దేశాలలోనూ కూడా కేవలము ప్రేక్షకుల దృష్టిని మాత్రమే గణించింది కాని నటుల సౌకర్యాలని గురించి ఆలోచించి యుండనే లేదు.

నాటకరచన ఒక కళ. నాటక ప్రదర్శనము వేరొక కళ. తాను రచించే నాటకము (కథ) సత్యమైన రీతిని మనసుకు పట్టేటట్లు రచయిత నాటకము రచిస్తాడు. ఈనాటకము కథ మన కన్నులకి కట్టేటట్లుండడానికి సూత్రధారుడు నాటకము ప్రదర్శిస్తాడు. రచయిత సామగ్రి, పాత్రములు, ఘటనలు, చరిత్రలు; ప్రదర్శకుని సామగ్రి, రంగము, తెరలు దుస్తులు, నటులు. ప్రదర్శకుని యాజ్ఞను తలను ధరించి ఆతడు చెప్పిన చొప్పున 'తుచ' తప్పకుండా ప్రవర్తించడమే నటుని విధి. సినిమా (డైరెక్టరు) సూత్రధారుల పని గమనిస్తే ఈవిషయము బాగా బోధపడుతుంది. కథ నంతటిని ఏవిధముగా, ఏయే ప్రదేశములలో ప్రదర్శించవలసి యుంటుందో ముందు (సెనేరియో) ప్రదర్శకుల తర్జుమా వ్రాస్తారు. నటులూ, సామగ్రి, కలిసి ఒక పర్వతసీమకి కదలిపోతా రనుకోండి. కథ మొత్తముమీద పర్వతసీమలో తీయవలసిన ఘట్టా లన్నీ ఈ ఒక్క సమయములోనే ఫోటో తీసేస్తారు.

వేరొక సారి కాసారదృశ్యాలు. మనోహర ప్రాసాదసంబంధములు నటింపజేసి ఫోటో తీస్తారు. చివరికి కథకి సరిపోయే విధముగా వీటి నన్నిటిని అతికించి ఫిల్ము తయారుచేస్తారు. కొండమీద నుంచి దూకడము, శరీరాల్ని పాతిపెట్టడము, మొదలైన అసాధ్యవిషయాలు ఛాయాగ్రాహక యంత్రము వంచించియో, మరే చిత్రము చేసియో జరిగినట్లు చూపిస్తారు. సినిమా సూత్రధారి తన తెలివితేటలవల్ల దుస్సాధ్యాల్ని సుసాధ్యాలుగా మార్చుకుంటాడు.

నాటక ప్రదర్శనములో సూత్రధారుడి పని కూడా యింతే. కాని రంగము వైశాల్యము తక్కువ కాబట్టి కష్టా లెక్కువ. నటు లందరూ సూత్రధారి నిర్దేశాలను శిరసా వహించి పాలించాలి.

ఈ ఊహాలు మనస్సులో పెట్టుకుని, నటుడు తాను ధరించే పాత్రములో లీనమైపోవాలా అక్కరనే లేదా? అనే ప్రశ్నకి జవాబాలోచింతాము. నటుడు తాను ధరించే భూమికలో లీనమై నటించాలనే అభిప్రాయము చాలమంది కున్నది. ఈయభిప్రాయము ననుసరించి నట్లయితే జరిగే పని ఆలోచింతాము. ప్రతినటుడూ తన శక్తి ననుసరించి తన పాత్రములో లీనమౌతా డనుకుందాము. వ్యక్తుల శక్తులకు తారతమ్య ముంటుంది. కాబట్టి పలువురు నటులు తాము ధరించే పాత్రములలో 'లీనమై' ప్రదర్శించిన నాటకములో—ప్రహ్లాద అనుకోండి, ఒక హిరణ్యకశిపుడే మనకి కనబడి లీలావతి, ఆపాత్రధారియొక్క ప్రత్యేకాభినయకౌశలము హిరణ్యకశిప పాత్రధారి శక్తికి తగ్గిన పక్షమునందు కనబడకపోవచ్చును కదా? అలాగే ఒక పాత్రధారి హెచ్చు లీనమై మరో పాత్రధారి అంత కాలేకపోడమువల్ల—ఐక్యత ఉండదు "రామదాసు బాగా చేశాడురా! రోషనారా ఏమిటి అద్భుతముగా నుంది కాని శివాజీ—చింతామణి టక్కులు బాగా చేశింది కాని, బిల్వమంగళుడు 'అమ్మమ్మ'రా" అనే మాటలు బయలుదేరడాని కిదే కారణము. ఏపాత్రధారి యిష్టము వచ్చినట్లా పాత్రధారి నటించితే నాటకము అతుకులబొంత అయిపోతుంది.

అం. అలా ఎందు కనుకోవాలి? ప్రతీపాత్రధారీ బాగానే తానూహించినంతవరకు పాత్రములో లీనమై పోగలడే అనుకోకూడదా అంటారు పాఠకులు. సరే. అప్పుడు నాటకంలో ఏమి కనబడుతుంది? రామారావూహించిన కృష్ణుడు, భీమారావూహించిన అర్జునుడు, ధర్మారావూహించిన ధర్మరాజు గోచరిస్తారు. నాటకం గయోపాఖ్యానం కాక ఏదో గమ్మత్తు కథ అయిపోతుంది. రచయిత ప్రేక్షకులకి అన్యాపదేశముగా బోధించ నెంచే సదాదర్శము మరుగుపడిపోతుంది.

కళాకారుడు తన భావాలు పరులకి కలిగించడానికి రచన చేస్తాడు. ప్రతినటుడూ కూడా, తన పాత్రములో లీనము కావాలంటే, ప్రతినటుడూ కళాకారు డౌతాడు. ప్రేక్షకులకు నాటకదర్శనానంతరము కలుగవలసిన బృహద్భావము ప్రతినటుడికీ కళాకారిత్వ మిస్తే మలిన మైపోతుంది. నాటక మంతా కలిసి కళ అవుతుంది కాని రంగము రంగమూ కళ కాదు. అటువంటప్పుడు నాటక మంతా మొత్తముమీద చేయగలిగే రసానుభవమే ప్రధానము గాని, ఒక పాత్రము జనింపజేసే సంచారీభావములు లెక్కలోకి రావు.

నాటక మంతా కలిసి కళ అయినప్పుడు నాటకప్రదర్శనము మొత్తము మీద కళ అవుతుంది. రచయిత ఉద్దేశించిన సదాదర్శబోధనకి అనుకూల వాతావరణము నూహించి ప్రదర్శించే సూత్రధారుడు కళాకారు డౌతాడు. చింతామణి పాత్రధారి మంచి చీరలు తెచ్చుకోలేనంత మాత్రమున, చిత్ర పాత్రధారి ఎల్లాగో నాలుగు జతలు నగలు సంపాదించిన కారణమువల్ల వచ్చే విపరీత తారతమ్యము సూత్రధారి శాసనమువల్ల నశించిపోతుంది. ఏరంగము ఎట్లు ప్రదర్శించాలో ఏనటుడు ఏస్థలములో ఏరీతిగా నిలువబడి ఎట్లు నటించితే ప్రేక్ష

గల కెలాగు కనబడుతుందో ఆలోచిస్తాడు సూత్రధారుడు. రంగ మంచా ప్రవేశము మొదలు నిష్క్రమణమువరకూ సూత్రధారుడి ఆదేశమునే అనుసరించాలి. సూత్రధారుడు కోరే నటనకి తోడ్పడడానికి ఎంతపాటి ఆవేశము కావాలో ఆ ఆవేశానికి సరిపోయేటంత వరకే నటుడు పాత్రములో లీనము కావచ్చును. భరతముని స్వర్గములో ప్రదర్శించే నాటకములో విక్రముడు ఊర్వశి. ప్రేమదృష్టుల నెక్కువగా సారించుకొన్నారు. సూత్రధారు డైన భరతముని కోపించి శపించాడు రసాభాస మైం దని. అవసరము కన్న ఎక్కువగా వారు ప్రేమలో లీన మైనారు. ఈసమాధి సాధనము కాని సాధించవలసిన పరమార్థముకాదు. సాధించవలసిన పరమార్థము ప్రేక్షకులకు రసానుభవము. ఆపనికి గాను నటుడు పాత్రమునందు లీనము కానక్కరలేదు. నిష్క్రమించిన తరువాత కూడా వెక్కివెక్కి ఏడువరాదు రత్నాంగి పాత్రధారి. అనగా అతడు నిజముగా ఏడువరాదు. ఏడ్చినట్లు ప్రేక్షకులను నమ్మించితే చాలు. పొడుము పీల్చటం అలవాటు లేనివాడు పొడుము పీల్చి కన్నీరు రప్పించుకున్నా సరే. ముఖ్యముగా కావలసినది కన్నీరు. అది ఎట్లు జనించినా సరే.

లీనము కాకుండా నటుడు సూత్రధారి కేవా సంతుష్టి చేయలే డని కొందరనవచ్చును. ఇది అందరిపట్లా నిజము కాదు. నిజ మైనా ఒక నటుడు సూత్రధారునికి కావలసిన అభినయము సమకూర్చడానికి ఆవేశింపజేసుకోవాలి గాని అంతకంటె హెచ్చుకూడదు. నాటక ప్రదర్శనములో నటుడు కళాకారి కాడు. నటుడు కేవలము సాధనమే. అతడు కాక, మాట్లాడగల జంత్రపుబొమ్మ ఉన్నా కూడా సూత్రధారుని కళాకారిత్వానికి భంగము రాదు. సూత్రధారునితో పని లేకుండా పలుపాత్రములు ధరించి ఆడే పలువురు నటులకంటె యజమాని యిష్టము వచ్చినట్లు చేతు లూపే తోలుబొమ్మలు ఎక్కువ సహాయకారులు కళాప్రదర్శనానికి.



# భావకవిత్వము

కవికొండల వేంకటరావుగారు, బి. ఏ., బి. ఎల్

భావకవిత్వ మంటే పలువురు పలుతెఱంగులుగా అర్థం చేసుకొంటున్నారు. చివరకు ఏకవి కైనా నలుగురు మఱదండ్రు వుంటే ఆమఱదండ్రు ఆకవి కవిత్వాన్ని భావకవిత్వం అనడం దగ్గఱకు వచ్చింది. అలాగ్గా హేళన చేదామా అంటే ఏపదాని కైనా వుంటాయి ఆమాత్రం విఱుపులూ ఆమాత్రం అపార్థాలూ. 'రసికుడు' అంటే విరసోక్తిగా అర్థం చేసికొనే వా ళ్లెంతమంది లేరు? God the good అని ఇంగ్లీషులో అంటే అవెనుక గాడిదగుడ్డు అని తెలుగులో వెక్కిరించే మహానుభావులు ఎంతమంది లేరు? కాబట్టి అలాంటి పరాసికాలన్నీ ముందు మఱచిపోవాలి మనోవాక్కాయశుద్ధిగా 'భావకవిత్వం' అనే దేమిటో తెలుసుకోవా లనే మానిసి.

'సృష్టిసౌందర్యము' 'వీరధర్మము' లాంటి పదమే 'భావకవిత్వము' అన్నా గాని అని నా యుద్దేశ్యము. 'సృష్టిసౌందర్యము' అంటే సృష్టిచే ప్రతిపాదింపబడే అందము అన్నమాట. 'వీరధర్మము' అంటే వీరుడు నిర్వర్తించే విధి అన్నమాట. అలాగే 'భావకవిత్వము' అన్నా, అని అనుకోవాలి. భావము యొక్క కవితాస్వభావము భావకవిత్వము.

ఇది ఎట్లు అమలులోనికి వచ్చిందీ అంటే పాశ్చాత్యుల సుఖమా నని నా యూహ. సృష్టిసౌందర్యము తీసికోండి. సృష్టి ఎప్పుడూ ఓలాగే దాని పని అది చేస్తూవుంది. కాని దానియొక్క అందం ఒకానొకడు గ్రహించినప్పుడు ఆసృష్టి దృశ్యము బహు సుందరంగా వుంది అంటున్నాడు. అప్పుడు వానికారహస్యము గోచరించింది అన్నమాట. అలాగునే కవు లెప్పుడూ వ్రాస్తూనే యున్నారు. భావా లెప్పుడూ అక్కడ వుంటూనే యున్నాయి. కాని యిప్పుడు కొందఱు పాఠకులు కేవలం పదముల కూర్పునందలి కవితాతత్వమునే కాక భావము నందలి కవిత్వమును జూఱగొనుట ప్రారంభించి పైకి చెప్పడంచేత ఈభావకవిత్వం అనే పదము వ్యవహారంలోనికి వచ్చిం దని నేననుకొంటాను.

భాష వేఱు భావము వేఱు అని అనవచ్చును. ఏమా అంటే ఒక మాట వేస్తే భావము వెల్లడింపు అయ్యేటట్టు ఇంకో మాట వేస్తే అంత యూతము అంత నియతీ కుదురదు. కాని భావమూ కవిత్వమూ వేఱెట్లా అని మీ రనుకోవచ్చు.

ప్రతీ ధర్మమూ తాను వ్యక్తిరూపం దాల్చేటప్పుడు రెండు విధాలుగా వుండక తప్పదు. ఒకటి పంచేంద్రియాల్లో ఓదానికైనా గోచరించే బాహ్య స్వరూపమున్నూ, రెండోది ఆత్మకు తట్టే అంతరంగికస్వరూపమున్నూ అయి యుంటవి. ఉదాహరణకు మళ్లీ వెనకటి వానినే యోచించి చూతాము.

మానవధర్మమును వ్యక్తిరూపం ఆపాదించి దృష్టించుకోబోతే అగపించే కన్నుముక్కు వక్షస్థలము ఇత్యాదుల శరీరసౌందర్యమే కాకుండా ఏదో ఆత్మస్వరూపము ఆశరీరం అందంగా వుండి అందులో నివసిస్తూ జీవకళ వెలిగ్రక్కుతూ వున్నట్టు తోచదూ? చిఱుతవాని బోసి నోరు, ముసలివాని పండ్లూడిన యిదీ రెండూ బాహిరమునకు బోసితనమే చూపిస్తూ వున్నా గాని చిఱుతవాని యంతఃకరణము గుండా గోచరించే అమాయకత్వము అనే ఆత్మగుణము అబాహిరరూపంలో అందం ఒలికిస్తూ వుంది. రెండో చోట అది నిరర్థక మనిపిస్తూంది.

ఆదేరీతిగా కవిత్వ మనే ధర్మం పైకి శ్రవణయోగ్యం కావడం తోనే అది రెండు రూపాలు తాలుస్తూవుంది. ఒకటి బాహ్యేంద్రియ గోచరమైన పలుకుబడి స్వరూపమున్నూ రెండు అంతర్వాహినిగ హృదయమును నగ్ధము గావించు భావస్వరూపమున్నూ తాలుస్తూ వుంది.

కాబట్టి కొందఱు బాహ్య స్వరూపమును దిలకించి అందలి కవిత్వమునే చూఱగొనువార లైరి. వారు, శరీరసౌందర్యమునకు మాత్రమే యుప్పొంగు కించిత్ కళోపాసకులవలె పరిమితజ్ఞులై భాషాకవిత్వము ననుభవించుచున్నారు. కొందఱు బాహ్యస్వరూపము అయిన పలుకుబడికి వెనుక నున్న భావములోని కవిత్వమును గొల్లకొని ఆత్మసౌందర్యమున నుప్పొంగు సమగ్రకళోపాసకులవలె అపరిమితజ్ఞులై భావకవిత్వము ననుభవించుచున్నారు.

రూపమునందు ఆత్మసౌందర్యము ఎట్లు శాశ్వతానందమును ఒడగూర్చుచున్నదో కవిత్వమునందు భావకవిత్వము అట్లు శాశ్వతానంద మిచ్చుచున్నది. బోసినోరు సర్వదా హాస్యాస్పదమే అది విడదీసి బాహ్యరూపమాత్రముగా బరిగణించు వార మేని. అదే యొకచోట ఉపకరణమాత్రమై అమాయకత్వము అనే దైవగుణము వెల్లడించు నప్పుడు ఎక్కడలేని వాత్సల్యమునూ పుట్టిస్తోంది. అలాగే విడివిడిగా ఉచ్చారణకు అసాధువు లని, అశాస్త్రీయము లని శిష్టవ్యవహారములు కావని అనుకొనే ముక్కలు వాటి వెనుక భావకవిత్వము అనే గుణము కలిగివుంటే అవి మనకు వేదవాక్కులుగా అయిపోతూ ఆభావమును మనస్థగతము గావిస్తున్నాయి.

కాబట్టి వితర్కమూ, వితండవాదమూ, జిజ్ఞాసా ఇవన్నీ లోతుగా ఆలోచించి చూస్తే భాషను బట్టి భావాన్ని బట్టి లేవు. అసలు వెల్లడించిన వాక్కులో

వెల్లడించిన భావములో కవిత్వము ఉన్నదా లేదా అనే మెట్టుమీద ఆధారపడియున్నవి.

అందుకే కొందఱు భావము భాష విడిచిపెట్టి "నేటి కాలపు కవిత్వం" అని "నవ్యసాహిత్యము" అని "ఆధునికకవిత" అని యిలాంటి సమాసపద ములు వాడుతున్నారు. ఆసమాసపదములయొక్క ఔత్వము ఎక్కడుంది? అసలు కవిత్వమందు ఉన్న ది. అది వుంటే అన్నీవుంటాయి.

కాబట్టి భావకవీ భాషాకవి అనే ముక్కలు విడిచిపెట్టి అసలు వ్రాయసగాడు కవియా అని విచారించండి. కవి అందరికీ గోచరిస్తాడు. కవిని గ్రహించలేని మనిషి మనిషే గాడు.

("భావకవిత్వం అంటే యేమిటి?" అసలు ప్రశ్న యిదీ. నిజానికి యీ మాట ప్రచారంలోకి వచ్చి చాలా రోజులే అయింది: గాని యింతవర కూ యిది సిసలైన శబ్దమే అని ధ్రువపడలేదు. దీన్ని గురించిన జిజ్ఞాస యింకా పుట్టింది పుట్టినట్టే వుంది. ఇప్పుడు వేంకటరావుగారీవిషయం యెత్తుకుంటే యిది తేలిపోవచ్చునను కున్నాం; గాని ఆశాభంగం కలిగింది......"పద్యకావ్యం," "గద్యకావ్యం" అనే మాటలు చిరకాలంనుంచి వాడుకలో వున్నాయి. "పద్యకవిత్వం" "గద్యకవిత్వం" "పదకవిత్వం" అనే మాటలు కూడా అలాంటివే; కాని అగమ్యాలుగా వున్నాయని యింతవరకూ వీటి నెవరూ ఆక్షేపించలేదు ఏమంటే? ఈమా టలు చక్కగా విగ్రహం చేసి చూపించవచ్చు. అర్థం సరిపుచ్చి వివరంగా బోధించవచ్చు; కాని "భావకవిత్వం" అనే యీ మాట కీ రెండూ కుద రడం లేదు. ఇంతవరకూ యెవరూ కుదర్చలేకపో యారు. వేంకటరావుగారున్నూ ప్రయత్నించారు; గాని అతికలేదు......"భావముయొక్క కవితా స్వభావము భావకవిత్వ" మన్నారు వేంకటరావు గారు. ఇది చాలా సాహసమైన నిర్వచనం. దీన్ని పండితులెవరూ అంగీకరించరు. ఈ అర్థవివరణ పద్ధతి సంస్కృతమర్యాదలకి అతీతంగా వుంది.... ...పోని విగ్రహం సరిగా వుందా లేదా అనే చర్చ విడిచిపెట్టేసి వేంకటరావుగారి భావాన్ని గురించి ఆలోచిద్దాం. భావంయొక్క కవితాస్వభావమే భావకవిత్వం అయితే యిక కవిత్వం అంటే యే మిటి? భావం లేకుండా అసలు కవిత్వం వుం టుందా? ఛందోబద్ధమైనంత మాత్రాన—లేక— చక్కగా కూర్చబడినంత మాత్రాన మాటలు పోగు కవిత్వం అనిపించుకుంటుందా? నన్నయ్య, తిక్క న్న, శ్రీనాథుడు, పోతన్న, సోమన్న, సూరన్న, పెద్దన్న మొదలైనవారి పుస్తకాల్లో వున్నది మాత్రం భావంయొక్క కవితాస్వభావం కాదూ? ......లలితకళల కన్నిటికీ భావమే ప్రధానం. అది లేంది కళే గాదు. గాయకుడు, ఆరోహణావ రోహణాలతో సప్తస్వరాలనూ ప్రసరించి ఆలా పన చేస్తాడు. అయితే అందులో భావం వుంటేనే అది రాగం అనిపించుకుంటుంది. వొక స్థపతి, నల్ల రాతిని చెక్కి—లేక—యేదేనా లోహం కరి గించి పోసి స్ఫుటమైన వొక ఆకారాన్ని కల్పి స్తాడు. అదిన్నీ భావం వుంటేనే శిల్పం అనిపించు కుంటుంది. వొక ముచ్చి, కుంచె పుచ్చుకుని అను కైన వస్తువుమీద రంగులతో గీతలు గీసి రూపక ల్పన చేస్తాడు. అది కూడా భావంతో కూడి వుం టేనే చిత్రం అనిపించుకుంటుంది. అలాగే వశ్య వాక్కు అయిన వొక రచయిత చక్కని మాట లతో వొక పద్యం గాని, గద్యం గాని కూరు స్తాడు. అయితే అదిన్నీ భావబంధురం అయినప్పు డే కవిత్వం అనిపించుకుంటుంది.........ఇలాగ భావంయొక్క కవితాస్వభావమే కవిత్వం అని పించుకుంటూ వున్నప్పుడు ఇక దాన్ని భావకవి త్వం అనడంలో యేం ఔచిత్యం వుంది? భావా న్ని ఛందోబద్ధం చెయ్యడంలో, లేక జటిలమైన వచనంలో కూర్చడంలో పూర్వుల అభిరుచి కంటేనూ, పద్ధతి కంటేనూ నవీనుల—అందులోనూ

యీ తెగవారి అభిరుచీ, పద్ధతీ చాలా భేదంగా వుంటే వుండవచ్చు. అలా అయితే వీరు తమ కవిత్వానికి చేర్చుకునే విశేషణం అభిన్నతను పరిచయం చేసేదిగా మాత్రమే వుండాలి; గాని యిలాగ అతకని పేరు పెట్టి అర్థం చెప్పడంలో సర్వాపోశనం పడితే యెలాగా?......ఇంతకీ: "భావం," "కవిత్వం" అని పొందిక లేని యీ రెండు శబ్దాలనూ మేకుబందీ చేసి దేశంమీద విడిచిపెట్టినవారు గాడిచర్ల హరిసర్వోత్తమరావు పంతులుగారుట. ఈనవీనకవిత్వం చేసేవారిలో శిరోమణి ప్రొఫెసరు రాయప్రోలు సుబ్బారావుగారు రాజమహేంద్రవరంలో జరిగిన రెండో ఆధునికాంధ్రకవిపండిత సభలో యీవిషయం సెలవిచ్చారు. వారీపదం వాడవద్దని చాలా దూరం—ఆక్షేపించారుట గాని పంతులుగారు వినలేదుట. అప్పట్లో పంతులుగారు ఆంధ్రపత్రికకు ప్రధానసంపాదకులుగా వుండేవారు కనక వారందులో దీన్ని యథేచ్ఛగా వాడడమూ, తద్వారా యిది దేశంలో మూలమూలలా వ్యాపించడమూ జరిగిపోయింది. సుబ్బారావుగారి వంటి పండితుడు, కవి, సరసుడు బాధ్యతగల పెద్దమనిషి శతవిధాల పోరి చెప్పినప్పుడు వినకపోవడం పంతులుగారిది—అది యిప్పుడెందుకు లెండి. అయితే నవీనకవులేనా దీన్ని కొంచెం పరిశీలించవలసింది; కాని వారు ఏదో వొకశబ్దం దొరికిందొరకడం తోటే గట్టిమని పట్టుకుని వాడెయ్యడం మొదలుపెట్టారు. అయితే సర్వోత్తమరావు పంతులుగారు ఆంధ్రపత్రికకు ప్రధానసంపాదకులైనంత మాత్రాన వారేలాంటి శబ్దాన్ని సృష్టించినా అది చెల్లిపోవలసిందేనా? ఇదీగాక: సరియైన కవిత్వాన్ని మేము రచిస్తున్నామని వొక పెద్ద బాధ్యతని మీద వేసుకున్న నవీనకవులు మొగమాటపడి యీ అపభ్రంశరూపాన్ని స్వీకరించవలసిందేనా?... ......ఈశబ్దాన్ని సాధించాలంటే యెలాగా కుదరదు. విడిచిపెట్టెయ్యడం సరసమైన పని. అలవాటయిపోయింది కనక—ఎందుకులెండి అంటారా? అయితే నిర్వచనాలు చెయ్యకుండా వుండడం మంచిది. సంపాదకుడు)



# హిందీవల్ల తెనుక్కి జరుగుతూ వున్న అపకారం

(ఈవిషయమై జూన్ సంచికలో మేము చేసిన ప్రకటన ననుసరించి కొందరు యువకులు లేఖలు రాశారు. వాటిలో కొన్ని యిక్కడ ప్రకటిస్తున్నాము, తతిమ్మావి కూడా క్రమంగా ప్రకటిస్తాము. తెనుగు జాతిలో హద్దు లేకుండా వ్యాపించ తగింది వొక్క తెనుగు మాత్రమే. తతిమ్మా వాటి కన్నింటికీ విచ్చుకత్తుల పారా లున్నాయి. ఆహద్దు మీరిన వాటిని వాటి స్థానాలలోకి నెట్టడమే మా పని. తెనుగు రాని తెనుగు వ్యక్తి హిందీ నేర్చుకోవడమూ, ఎవ రేనా సరే వీధిగుమ్మంలో వుండవలసిన హిందీని ఇంటోకి—తెనుగు స్థానంలోకి తీసుకురావడమూ, హిందీలోనే ముక్తి వుందని చెప్పడమూ, లేక రాయడమూ, లేక అనుకోడమూ— ఇవి మాతృద్రోహంలో చేరతాయి. మాదేశీయులకు ఈపాపాలకు పాల్పడవద్దని మనవి చెయ్యడం కోసమే మే మీలేఖలు ప్రకటిస్తున్నాం. కనక లేఖకులు గూడా ఔచిత్యం పాటించి మరీ రాయవలసి వుంది. హిందీప్రచారకులు కాసారంలో నాచులాగ తెనుగుదేశం అంతటా కమ్మి వున్నారు. వారు చేస్తూ వున్న ఆంధ్రాతిక్రమణమూ, అభూతకల్పనలూ వున్నవి వున్నట్టు రాసి మాకు పంపవలసిం దని మేము తెనుగు యువతులనూ, యువకులనూ కోరుతున్నాం. వృద్ధులు కూడా

రాయవచ్చు, అభ్యంతరం లేదు. ఈలేఖలలో పత్రికల సంపాదకీయాలు కూడా రెండున్నాయి. వాటిని ప్రకటించిన పత్రికలు ఆంధ్రభూమి, చంద్రికాను. హిందీవల్లన తెనుగుభాషా వాఙ్మయాలమీద యిసక మేటలు వేస్తూవుండడం మంచి సమయంలో గమనించిన యీపత్రికల సంపాదకులకు మా ధన్యవాదాలు చెప్పుకొంటున్నాము. సంపాదకుడు)

౧

కాంగ్రెసు ఆదేశాలు అన్నిటితో పాటు హిందీ ప్రాముఖ్యం ఒకటి మన నెత్తిన పడింది. కేంద్రప్రభుత్వవ్యవహారములు ఐకకంఠ్యంగా నడపడానికి ఈమహౌషధి అనావృతంగా పనిచేస్తుందని ప్రచారకభిషక్కులు బల్లగుద్దుతున్నారు. యిప్పుడీ—కాదనం

భారతదేశంలో బహుళంగా హిందీ గాని—దాని దగ్గర భాష గాని వాడుతున్నారు. కనక మనమూ అదే అభ్యసించి సాముదాయక వ్యవహారాలు చక్కబెట్టుకుందాం అంటేనూ వద్దనం. కాని—

ఆంధ్రులలోని ఆంధ్రత్వం. ద్రావిడులలోని ద్రవిడత్వం దిగద్రావి హిందీకి ఎగబడతాం అంటే అబ్బే అంటాం— ఆత్మోపఘాతం అంటాం.

మహాత్ముడు ఆత్మకథ చెబుతూ "భరతవర్షము న నున్న తవిద్యాప్రణాళికలో మాతృభాషయు, ఉపరి హిందీ, సంస్కృత, ఫారశీ, అరబ్బీ, ఇంగ్లీ భాషలును పాఠ్యములుగా జేయఁగిన వని నాయాశయము"

అన్న మాట లేనా హిందీప్రచారకులు వినిపించుకుంటే ఎంత బాగుండును!

ఈహిందీ ఆరాటంలో తెనుగువారిలోని రవంత తెలుగుతనమున్నూ రాలిపోతున్నది. ఆదిని సంస్కృతం మధ్యను ఆంగ్లం, తలయెత్తకుండా చేసిన తెనుగు ఇప్పటికైనా "బతుకుజీవుడా" అనుకోకుండా హిందీ ఇనపపాదం కింద పడింది.

అభిమానపూరితంగా ఆదికవి 'అస్య దపహాయ' అంటే ఆనాడు, అంధహృదయంతో అభినవాంధ్రుడు "అస్మ దపహాయ" అంటున్నాడు ఈనాడు.

'హంత' హనుమచ్ఛాస్త్రి

౨

"హిందీవల్ల తెనుగుభాషకి జరుగుచున్న అపకారం" గురించి వ్రాయుమన్నారు సంపాదకులు. ఒక భాష అభివృద్ధి అయిందంటే మరోభాష క్షీణించిందన్నమాటే. ముద్దుపళని, మొల్ల, వెంకమ్మ, మొదలైనవా రేముగ్గురో తప్ప, ఆంధ్రస్త్రీలలో కావ్యప్రణేత్రలు లేనే లేరు. నేటికి జాతీయోద్యమం ధర్మమా యని స్త్రీలలో కొంత ఉత్సాహము కలుగుతోంది. మూడువంతులు స్త్రీల యీ నూతనశక్తి ఇప్పుడు హిందీవైపు తిరిగింది. సారస్వతాభిలాష గల సోదరీమణులు పెద తల్లికి గాక తమ్మకన్న తెనుగుతల్లికి సేవజేసినట్లయితే, తెనుగుభాషకి నూతనాలంకారములు లభించడమే గాక తెలుగువారికి స్త్రీహృదయము కొంత బోధపడగలదు. హిందీభాషావిజృంభణమువల్ల తెనుగు స్త్రీ కల్పనాశక్తి మరి కొంత కాలం మరుగుపడిపోతోంది,

శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

3

హిందూదేశంలో నూటికి తొంభైముగ్గురికి ఓనమా లేనా రావు. మాతృభాషలో మాట్లాడడమే కాని రాయడం, చదవడం చేతకావు. అటువంటి సందర్భంలో నిరుడు గాంధీమహాత్ముడు మన తెలుగుదేశంలో ఒకరికి ఒక సందేశం పంపాడు, తెలుగుదేశంలో ప్రతి క్షుగ్రామంలోనూ, ప్రతి వ్యక్తీ హిందీ నేర్చుకోవాలని, అంతవరకు హిందీప్రచారం మానకూడదని. ప్రజలు అసలు చదువంటే యెరగని స్థితిలో ప్రతీ వ్యక్తీ హిందీ నేర్చుకోవా లంటే అర్థమేమిటి? మాతృభాషను మానేసి ఇక ముందు హిందీయే నేర్చుకోవా లనా?

ఏజ్ఞాన మైనా మాతృభాషలోనే కలగాలి కాని మరొక భాషలో కలిగితే మన కేమీ లాభం లేదని దేశనాయకులు గ్రహించారు. గడచిన నూరేళ్లనుంచీ విద్య ఇంగ్లీషుభాషలో వున్నందువల్ల మన ప్రజకు కలిగిన లాభం శూన్య మని తెలుసుగొని యిక ముందు మాతృభాషలోనే విద్య నేర్పా లని దేశ నాయకులు అన్నారు. ఆపని విశ్వవిద్యాలయాలు కూడా మొదలెడుతున్నాయి. నెమ్మదిగా దేశంలో ఇంగ్లీషు దాస్యం వదుల్చుకొంటున్నాం. ఇంగ్లీషు దాస్యం వదుల్చుగోడం హిందీదాస్యం తెచ్చిపెట్టు కోడం కోసమా?

గాంధీమహాత్ముని మాటలకు నిజంగా మన మేమీ భయపడ నవసరం లేదు. ఎందుచే తంటే? మన తెలుగువారి స్వభావం మన మెరుగుదుము. తెలుగు వారికి కార్యోత్సాహమే గాని కార్యదీక్ష లే దని లోక మంతా యెరుగును. అందుచేత హిందీ మన తెలుగుదేశంలో వ్యాపించిపోతుం దని మనం జడియక్కర్లేదు. ఏదైనా యీహిందీప్రచారంవల్ల తాత్కాలికంగా నేనా తెలుగుకి కొంత నష్టం కలుగుతుంది. ఈమాత్రం నష్ట మేనా మన కెందుకు కలగా అని యీ కొత్త ప్రచారం.

ఇప్పటి తెలుగుభాషయొక్క స్థితి చూద్దాం. హిందూదేశంలో తక్కిన భాషలకీ దీనికీ పోలిక యెక్కడా కనపడదు. మనము హేళన చేసే అరవ భాష కంటే మన భాష యెంతో హీనస్థితిలో వుంది. మన భాషలోని పత్రికలకు కొన్ని వందల చందాదారు లుండడమే అబ్బురం. హిందూదేశంలో యితరభాషలలోని పత్రికలకో, చందాదారుల సంఖ్య వేల మీదే. తెలుగుదేశంలో పత్రికా ప్రచారం సంగతి యిలా గుంది. ఇంక పుస్తకాల విషయం—మన గ్రంథకర్తలు రాసిన పుస్తకాలకు తిరిగి అచ్చుఖర్చు లేనా రావడ మంటూ వుండదు, వారి పుస్తకాలు వారి యిళ్లలోనే చదలపాలు కావలసిందే కాని. తెలుగువారి విద్యాభిమాన మిది. అరవ హోటేళ్లమీద వుండే భక్తిశ్రద్ధలు తెలుగు వారికి చదువుమీద వున్నట్టు కనపడదు. ఇటువంటి పరిస్థితులలో హిందీ నేర్చుకోవ మంటే మాతృభాష కొంత కాలం వర కేనా మొదలంటా పోగొట్టుకోవ మన్న మాటే. ఇప్పటి కప్పిడే చూడండి హిందీ తమాషా — తెలుగుదేశంలో 'మాధురి' పత్రిక్కి వున్నంత మంది చందాదారులు 'భారతి' కి లేరు—సిగ్గు పడవలసిన విషయ మిది, చెప్పుగోవలసివచ్చింది కూడా. క్రమేపీ హిందీ పరీక్షల కేంద్రాలు ఎక్కువ అవుతున్నాయి— ఈ హిందీపరీక్షల నిచ్చినవాళ్లలో చాలా మందికి తెలుగంటే నిరసన. హిందీ ప్రతి స్త్రీ నేర్చుకోవా లని, హిందీలోనే పురుషులు వుపన్యాసా లియ్యా లని, హిందీ వాడుకభాషగా యేర్పడా లని, హిందీ ఒక్కటే నాటకరచనకు సరిపోయిన భాష అని మొదలైన పిచ్చిపిచ్చి రాతలన్నీ ఆంధ్రపత్రికలో పడుతున్నాయి. మాతృభాషాభక్తిహీనా లైన యీ రాతలకు ఆంధ్రపత్రిక తన సొంత వ్యాఖ్య అయినా లేకుండా ప్రచురించినందుకు మనం యెంత విచారించాలో. ఇంక ముందు ఆంధ్రపత్రిక యిటువంటి రాతలను జాగ్రత్తతో ప్రకటించవలసిం దని ప్రార్థిస్తున్నాను, హిందీప్రచారాన్ని హద్దుపద్దుల్లో వుంచి మాతృభాషకు ఉపకారం చెయ్యవలసి వుంది కాబట్టి.

అయితే హిందీ మనకు అసలే అక్కర్లేదా అంటే ఆవిషయమై కొంత చెప్తాను. హిందీ రాష్ట్రభాష కాబట్టి కొంత అవసర ముంది. ఎటువంటి వారికి అవసర ముంది? కాంగ్రెసు సమావేశాల్లో చర్చల్లో పాల్గొనేవారికి—ఈసమావేశాల్లో అయినా ఉత్తరదేశస్థులు ఉర్దూలో కనక మాట్లాడడం మొదలెడితే మనవాళ్లంతా కొంత సేపు తెల్లమొహాలు వేసుగు కూచుని ఆతర్వాత దిక్కులు చూస్తూ కూచోవలసిందే. ఇతరప్రాంతాలవాళ్లెవరైనా మన తెలుగుదేశంలోకి వచ్చి

హిందీలో మాట్లాడితే వాళ్ల ఉపన్యాసాలను మన వాళ్లకి అనువాదం చెయ్యడానికి హిందీపాండిత్యం నూకరిద్దరికి ఉంటే చాలు. అంతేగాని ఓనమాలు రాని ప్రతివాడికీ హిందీ యెందుకూ? గాంధీమహాత్ముని యొక్క తక్కిన అభిప్రాయాలతో మనం యేకీభవించవచ్చు గాని యీ అభిప్రాయంతో మట్టుకు యేకీభవించి ఆత్మనాశనం చేసుకోకూడదు. ఈవిషయంలో ఆయనికి వ్యతిరేకప్రచారం దేశమంతటా చేసి మాతృభాషాభక్తి లేనిదీ దేశభక్తి అంటూ లేనే లేదని చెప్పవలసివుంది.

మనం యిప్పట్లోనే తొందరపడి మాతృభాషకు హిందీవల్ల కలిగే రవ్వంత అపకారమూ కూడా కలగకుండా చేసుకోవాలి.

తెలుగుదేశ స్థితి చూడండి. ౨౭—౫—౩౮ ఆంధ్ర పత్రిక సంపాదకీయవ్యాసంలో "మహానందిలో జరిగిన యార్యవైశ్యమహిళాసభయందు శ్రీమతి లక్ష్మీకాంతమ్మకుమారిగారు ప్రసంగించుచు రాయలసీమయందు స్త్రీలు విద్యావిషయములందు వెనుకబడి యున్నారనియు, హిందీ మాట యేల తెనుగు కూడ నేర్చుకోవలసినదిగా ప్రచారము చేయవలసిన అవసర మున్నదనియు హెచ్చరించిరి" అని రాసి వుంది. చూశారా తెలుగు దేశస్థితి. తెలుగుదేశంలో తెలుగు నేర్చుకో మనే ప్రచారం చెయ్యవలసి వుంది. ఇంక హిందీ మాట చెప్పేదేమిటి! కాబట్టి హిందీ ప్రచారం కట్టిపెట్టి తెలుగుదేశంలో తెలుగు నేర్చుకో మని దేశభక్తులు ప్రచారం చేస్తారుగాక!

తా. జ. పైలేఖ రాసిన తర్వాత కొన్నాళ్లకి నేను పాతతెలుగుపత్రికలు వెతుకుతూ వుండగా 'తెలుగుదేశవాఙ్మయపత్రిక' ఒకటో సంపుటం ఎనిమిదో సంచికలో (౧౯౨౨ వ సం॥) 'ఆంధ్రజాతికి జాతీయభాష ఆంధ్రభాష గాని హిందీభాష కాదు' అనే వ్యాసం చూశాను. ఈవ్యాసం మన 'తెలుగు-హిందీ' అంశాన్ని గురించే రాయబడింది. అందరూ తెలుసుగోవలసిన చక్కని వ్యాసం. అందుచేత దీనిని తమపత్రికలో ప్రకటించ మని 'ప్రబుద్ధాంధ్ర' సంపాదకులను కోరుతున్నాను.

వేమవరపు కామేశ్వరరావు

౪

"ఆంధ్రుల హిందీభాషాభిమానము:—మితిమీరి వెగటు పుట్టించు స్థితికి వచ్చినది. ఆంధ్రనాయకుడు నోరు విప్పితే హిందీని అభ్యసింపు మని ఉపోద్ఘాత. ఆంధ్రవ్యాసకర్త కలము పట్టితే హిందీ రాష్ట్రభాష యని పేర్కొనుట. హిందీభాషలో కాలముల కొలది వ్యాసములు ప్రచురించుటకు గూడ కొన్ని తెనుగుపత్రికలు నేడు విశేషశ్రద్ధను జూపుచుండుట కేవలాంధ్రాభిమానులకు విచారము కలిగింపకమానదు. మదరాసునుండి ప్రచురింపబడు హిందీప్రచారక్ పత్రికకు ఆంధ్రదేశములో ఉన్నంతమంది చందాదారు లైనను యే ఒక్క ఆంధ్ర మాసపత్రికకును ఆ ఆంధ్రదేశముననే లేరని చెప్పుట సత్యదూర మనిపించుకొనదని మా నమ్మకము. ఇట్లు తన దైన దానిని తలయెత్తి చూడకపోవుట, తన్నులాడినను తనది కాని దానికై ఇంత మోజుపడుట ఆంధ్రుడు స్వధర్మము నేమరుచున్నా డనుటకు చక్కని నిదర్శనము కాగలదు. బెంగాలీవాడు గాని, మహారాష్ట్రుడు కాని, తుదకు సాంబారుస్వామి అని మనము ఆక్షేపించు అరవవాడు కాని హిందీ అనిన నేటి ఆంధ్రు డట్లు పడి ప్రాకులాడు మన్నట్లు కానము. తన భాషనుగూడ మరచిపోవజాలు ఆవేశముతో ఆంధ్రుడు హిందీని సేవించుచున్నాడు. హిందీపుస్తకములు, హిందీమాసపత్రికలు కొనుటకు ఆంధ్రులు వెచ్చించుచున్న ధనము ఆంధ్రపుస్తకములు, ఆంధ్రమాసపత్రికలు కొనుటకు వెచ్చించుచో మన గ్రంథకర్తల స్థితియు, పత్రికాధిలేఖరుల స్థితియు నేడు ఉన్నంతటి శోచనీయస్థితిలో ఉండకుండును. పత్రికలు తెప్పింప కేటాయించుకొన్న ధనముతో మూడు నాలుగు హిందీ మాసపత్రికలకు అర్డరిచ్చి

ఇక తెలుగు పత్రికలను తమ గ్రంథాలయములకు ఉచితముగ తెప్పించుకొను ప్రయత్నమున ఉత్తరములమీద ఉత్తరములు వ్రాయుటకు గాక కాలమును తపాలాబిళ్లలను వ్యయము చేయుటకు జంకని గ్రంథాలయపాలకులు ఒక సారి తమ మూలమున ఆంధ్రసారస్వతమునకు లాభము లేకపోగా విశేషమైన కష్టము, నష్టము గలుగుచుండుటను గమనించుట లెస్స. ఆంధ్రుని హిందీభాషాభిమానము ఆతనికి భారతరాజ్యాంగమున కలుగవలసినంత పలుకుబడిని కలిగింపకపోగా ఆంధ్రసారస్వతాభివృద్ధికి ఒక గొప్ప అడ్డంకిగా నున్నది విధము చెడుచున్నది; ఫలమును కలుగుట లేదు. ఆంధ్రు డీస్థితిని ఇక నైన తొలగింపకుండుట వివేక మనిపించుకొనునా!"

ఆంధ్రభూమి (జూన్)

"ప్రస్తుతము మన యాంధ్రులకు గోంగూర పుల్లకూర రుచి యైపోయినది. మనవారు మన దేశభాషాభిమానమును విడిచి తెనుగుతల్లిని గౌరవించుట మాని, హిందీభాషాభ్యాసమున మునిగియున్నారు—దాని వలన తెనుగు భాష యభివృద్ధిని పొందుటకు తీరని కొరత కలుగుచున్నది"

"హిందీభాష యభ్యసించుట తప్పని మాయభిప్రాయము గాదు. హిందీ హిందూస్థాన మంతటికి రాష్ట్రభాష యగుట కర్హమైయున్నది; కాని యాంధ్రమును విడిచిపెట్టి మాత్రము హిందీ నభ్యసించుట యుచితము కాదు. తెనుగుభాష హిందూదేశమున గల భాషలలో ద్వితీయ స్థానము నలంకరించి యున్నది. తెనుగు హిందూదేశమునందలి ఆంగ్లేయుల మన్ననలకే గాక ఖండాంతరుల మన్ననలకు గూడ మిక్కిలి పాత్రమై యున్నది. అది మిక్కిలి మధుర మగు భాష. విశేషించి యాంధ్రు లందరకిని కన్నతల్లి"

"కావున దేశభాషాభిమాను లగు నాంధ్రు లెల్లరును హిందిభాష యెడల బూను శ్రద్ధలో సగమైనను ఆంధ్రభాషపట్ల జూపిన భాషకును వాఙ్మయమునకును వన్నెయు వాసియు జేకూరగలవు"

చంద్రిక (జూన్)

---

# భారతదేశపు నాణెములు

మారేమండ రామారావుగారు ఎం. ఏ. బి. ఇడి

శాసనములు, వాఙ్మయము, కట్టడములు, సమకాలికుల వ్రాతలు, స్థానిక గాథలు, నాణెములు మున్నగునవి చరిత్రమును రచించుట కుపకరించు ముఖ్యాధారములు. ఇందు నాణెములు సాధారణముగ నితరాధారములనుండి తెలియ నగు నంశములను బలపరచునవే యైనను, భారతదేశచరిత్రమును దెల్పునెడ మాత్రము కొన్నికొన్ని సందర్భములలో ప్రత్యేక ప్రాముఖ్యము గలవిగ నున్నవి. వీనినుండి తెలియ నగు విషయము లెన్నియో మరి యే యితరాధారములనుండియు తెలియుట లేదు. కాన నీనాణెముల ప్రత్యేకోపయోగ మీవ్యాసమున సంగ్రహముగ జర్చింపబడును.

౧. రాజకీయ చరిత్రము:—క్రీ.పూ. ౨౫౦ నుండి క్రీ. శ. ౩౦౦ వరకును మనదేశమునందలి పశ్చిమోత్తర ప్రాంతమును బాక్ట్రియనులు, సిథియనులు, పార్థియనులు, కుషానులు నను తెగలవారు పరిపాలించిరి. బాక్ట్రియనులను గూర్చి కొందరు విదేశీయుల వ్రాతలు గొన్నివిషయములను దెల్పుచున్నను, వారు ౩౦ గురు రాజు లనియు, వారి వంశక్రమమును, కేవలమును నాణెములనుండియే తెలియుచున్నది. వారికి సమకాలికులుగ నుండిన సిథియనుల చరితము నట్టిదే. అట్లులే కుషాన్ రాజులలో కనిష్కునికి బూర్వ ముండిన యిర్వురు కాడ్ ఫైసిస్‌ల వృత్తాంతమునకును నాణెములే

ముఖ్యాధారములు. కతియవార్ మాల్వాలపై నధికారము జేసిన పశ్చిమక్షాత్రపుల నామములు. వంశక్రమము, కాలములును గూడ నాణెముల వలననే స్పష్టము లగుచున్నవి. ఇక్ష్వాకువంశమువార లేవంశీయులను జయించిరో, ఎవరి కెవరు సామంతులో, ఏయే రాజ్యము లెంతవరకును వ్యాపించినవో తెలిసికొనుటకు భారతదేశపు ప్రాచీననాణెములు మిక్కిలి తోడ్పడుచున్నవి.

౨. పరిపాలనా విధానము:—పూర్వకాలమున మనదేశమునందుండిన పరిపాలనావిధానమును తెలిసికొనుటకు గూడ నాణెము లుపకరించుచున్నవి. మహాభారతమునందలి శాంతిపర్వము నుండియు, కౌటిల్యుని యర్థశాస్త్రమునుండియు, కొన్ని శాసనములనుండియు పూర్వము సాంఘికప్రభుత్వము లుండెడి దనియు నందు గణముల పరిపాలన మొకవిధ మనియు తెలియుచున్నది. ఈపరిపాలనా విధానము పాశ్చాత్యుల Oligarchy కి సరి యగును. ఇందు స్వార్థపరులగు కొలదిమంది మాత్రము పాలనము సాగింతురు. ఈ విషయమును నాణెములు స్థిరపరచుచున్నవి. మాలవ, యౌధేయ, వృష్ణి గణముల నాణెము లింతవరకును బరిశోధకులకు దొరకినవి. అటులే పట్టణములలో నైగమములనియు, పల్లెలపై జానపదము లనియు రెండు విధముల ప్రజాస్వామిక ప్రభుత్వములు సాగుచుండినవి. పంజాబులో దొరకిన కొన్ని నాణెములపై నొక వైపు "నెగమా" యనియు రెండవ వైపు "డోజక" "తాలిమత" "అటకటక" మున్నగు నామములును గలవు. వానినుండి ఈరెండవ వైపున నుండు నామములు పట్టణముల వనియు నివి యన్నియు నైగమము లనియు నూహింపదగును. ఇందువలన ప్రాచీన గ్రీసుదేశములో వలెనే భారతదేశమున గూడ స్వతంత్రములును, ప్రజాస్వామికములు నగు పట్టణములు (Autonomous and Democratic city-states) గల వని తెలియుచున్నది. అటులే మరికొన్ని ప్రాచీననాణెములు "రాజన్య జనపదము" ను "శిబిజనపదము" ను పేర్కొని యప్పటి రాష్ట్రీయ ప్రజాస్వామిక ప్రభుత్వములను దెల్పుచున్నవి. ( Provincial Democracies)

౩. ప్రజల చరిత్రము:—ప్రాచీనకాలమున మనదేశ మేయే విధముల విభజింపబడి యేయే భాగ మేయే రాజులచేతను, ప్రభుత్వములచేతను పాలింపబడినది యను సమస్యను గూడ నాణెములు చక్కని యుత్తరము నీయగలవు. మహాభారతమునను పాణిని సూత్రములందును యౌధేయగణముయొక్క ప్రశంస గలదు. ఈ యౌధేయులు క్రీ. శ. ౧౫౦. లో రుద్రదాము డను శకరాజును, ౩౫౦. లో సముద్రగుప్తునికిని ప్రత్యర్థులుగ నుండిరని శాసనములు దెలుపుచున్నవి. వీరి నివాసమును గన్గొనుటకు నాణెములే మూలాధారములు. అవి పంజాబునందలి తూర్పుభాగమునను, సట్లెజ్ యమునానదుల మధ్యను దొరకినవి. వీనిని బట్టి నేడు జోహియా—బార్ అని పిలువబడు సట్లెజ్నదీతీరమున స్థిరపడిన జోహియా లనువారు ప్రాచీనయౌధేయుల సంతతివా రని కన్నింగ్‌హాం పండితునిచే నిర్ణయింపబడినది. మఱియొక యుదాహరణము మాలవగణము. నేడు మాల్వా యని పిలుబడు దేశమునకు మాలవు లను తెగవారట స్థిరపడిన పిమ్మటనే వచ్చినది. అలెగ్జాండరు కాలమున నీమాలవులు "మల్లోయ్" అను పేరుతో పంజాబులో నుండిరి. దీనిని బట్టి మొదట పంజాబులో నివసించుచుండిన యీమాలవులు తర్వాత మధ్యదేశమునకు వచ్చి రని తెలియుచున్నది. నాణెము లీయూహను బలపరచి వీరు మాల్వాకు వచ్చుటకు పూర్వ మెటనుండిరో దెలుపుచున్నవి. రాజపుత్రస్థానములోని జయపుర రాజ్యములో మాలవగణముయొక్క నాణెములు విశేషముగ లభించినవి. అయ్యవి క్రీ. పూ ౧౫౦ నుండి ౨౫౦ వరకును గల కాలమునకు జెందినవి. దానిని బట్టి మాలవు లీకాలమునందు రాజపుత్రస్థానమునం దుండి రని

స్పష్టమగుచున్నది. అప్పుడు మధ్యదేశమున క్రీ. శ. ౧౦౦ లో పాలించిన ఉషవదత్తునికి మాలవులతో యుద్ధ మెటుల సంభవించెనను చారిత్రిక సమస్య నిర్ణయింప వలనుపడుచున్నది. పతంజలి తన మహాభాష్యమున నెవ డైనను తాను స్వయముగా చూచిన భూతకాలమందలి యొక విషయమును జెప్పవలసిన రీతికి "అరుణత్ యవనః సాకేతం" (యవనుడు సాకేతనగరము నడగించెను) "అరుణత్ యవనో మధ్యమికాం" యవనుడు మధ్యమికానగరము నడ్డగించెను) అని రెం డుదాహరణముల నిచ్చియున్నాడు. ఇందలి మధ్యమికానగర మెద్ది యను సమస్యను పరిష్కరించుటకు నాణెములు మాత్రమే తోడ్పడుచున్నవి. శిబిగణముయొక్క నాణెముల నుండి మధ్యమికా యను నది వారినగర మనియు, వారు గొంతకాలము రాజపుతానాలోని చితోర్ ఘుర్ జిల్లాలో నుండి రనియు దెలియుచున్నది. వీనిని బట్టి డాక్టరు భండార్కరుపండితునిచే చితోర్ ఘుర్ కు దగ్గిర నున్న ప్రాచీనదుర్గశిథిలములు గల నగరీ యను పట్టణమే మధ్యమికా నగర మని నిర్ణయింపబడినది.

౪ మతము:—నాణెములు మతచరిత్రమునకు గూడ మిక్కిలి యుపకరించుచున్నది. వీనినుండి తాత్కాలికమతపరిణామము గోచర మగుచున్నది. ఈసందర్భమున బశ్చిమోత్తరమునుండి భారతదేశముపై దండెత్తి వచ్చిన విదేశీయు లీదేశమున స్థిరపడి హిందూమతము నవలంబించి హిందూసంఘమున గలసిపోవుట ముఖ్యముగ జేర్కొన దగిన యంశము. ఈవిషయమున నాణెము లమూల్యము లగు వింతలను వెలిబుచ్చుచున్నవి. పార్థియనురాజగు గాండోఫారిస్ నాణెములపై నొక వైపున త్రిశూలధారి యగు శివుని విగ్రహము గలదు. ఇదే చిత్రమును నందివ్యాఘ్రచర్మములును కుషాన్ రాజులలో రెండవవా డగు వీమాకాడ్ ఫైసెస్ నాణెములపైనను గలవు. దీనినుండి విదేశీయు లగు రాజులు బ్రాహ్మణమతానుయాయులై శివభక్తులుగ నుండి నటుల స్పష్ట మగుచున్నది. కనిష్కహువిష్కుల కాలమున నొక విధ మగు పరివర్తనము జరిగినది. వారి నాణెములపై కొలది మంది గ్రీసుదేవతలను విశేషముగ పర్షియను దైవములను, కొంతమంది హిందూదేవతలను గాంచనగును. ఈవిధమున కనిష్కచక్రవర్తి కాలమునం దప్పటి మతములలోని దేవత లందరు నారాధింపబడుచుండిరను ముఖ్యాంశము మనకు నాణెముల మూలముననే తెలియుచున్నది. ఇదే విధమున నాచక్రవర్తి నాణెములపై నుండు బుద్ధుని బొమ్మ కూడ మతచరిత్రమునకు మిగుల ముఖ్యమైనది. నిశ్చయముగ కాలనిర్ణయ మొనర్ప దగిన బుద్ధవిగ్రహములలో నిదియే మొదటిది. మానవరూపమున గౌతమబుద్ధుని జిత్రించుట కిదియే మొదటి పర్యాయము. ఇంతకు బూర్వపు శిల్పములలో బుద్ధు డొక సాంకేతికముచే నిరూపింపబడుచుండెను. శివునితో పాటు హువిష్కుని కాలమునుండి నంది, స్కందుడు, కుమారస్వామి, విశాఖుడు, మహాసేనుడు మున్నగు వారు గూడ నారాధింపబడుచుండు నటుల నాణెములనుండి తెలియుచున్నది. ఈరాజులు హిందూమతమునే గాక హిందూనామములను సహితము బరిగ్రహించినటుల నాణెములు తెల్పుచున్నవి. కుషాన్ రాజులలో నైదవ వా డగు వాసుదేవు డిందుల కొక యుదాహరణము. క్రీ. శ. ౨ వ శతాబ్దములో సురాష్ట్రమాలవదేశముల నేలిన చష్టనవంశీయు లగు రాజులు ౨౭ గురిలో నిరువది యైదుగురికి హిందూనామములే యుండినటుల వారి నాణెములు దెలుపుచున్నవి. మతాచారములను గూర్చి కూడ నాణెముల వలన గొన్ని సంగతులు తెలియుచున్నవి. ఇందు శివుని యారాధనలో జరిగిన పరివర్తనములు ముఖ్యములు. నేడు సామాన్యముగ నాదైవము లింగరూపముననే యారాధింపబడుచున్నాడు. గుప్తయుగారంభమున నీయాచార మాచరణములోనికి వచ్చినది. దక్షిణ

హిందూదేశములోని గుడిమల్లం అను చోట లింగమొక్క చిత్రము గన్గొనబడినది. అది క్రీ. శ. ౨వ శతాబ్దము నాటిది. ఇందు లింగమునకు ముందు వైపు శివుని విగ్రహము వ్రాయబడియున్నది. దీని వలన ౨వ శతాబ్దము నాటి కింకను మానవరూపమున శివుని ఆరాధించుట పోయి తచ్చిహ్నముగ లింగము మాత్రమే విజృంభించలే దని తెలియుచున్నది. ౨౩౬ నాటి యొక శాసనము లింగముక్రింద చెక్కబడి భగవాన్ మహాదేవః యని పేర్కొనుచున్నది. ఈకాలమునకు లింగమునకును శివునికిని ఐక్యము స్థిరమై లింగము శివునికి కేవలచిహ్నముగ బరిణమించియుండును. ఇదివరలో వర్ణింపబడిన సిథియను, కుషాన్ రాజుల నాణెములపై నుండు శివుని మానవాకృతి శివారాధనము నందలి ప్రాచీనతమస్థితిని దెల్పుచున్నది. క్రీ.పూ. ౨వ శతాబ్దము నందుండిన పతంజలి కాలమున గూడ నారాధనమునకై శివుని రూపమే చేయబడుచుండెడి దని యాతని మహాభాష్యమువలన తెలియుచున్నది. అనగా శివారాధనలో మొట్టమొదట శివుని యాకృతియు ఔస్త్రంబ మూర్తియు లింగమును గలసియు, కడకు లింగము మాత్రమును సాధనములుగ నుండిన వని పై చర్చవలన తెలియుచున్నవి. మఱియు నీనాణెములపై స్కంద, కుమార, విశాఖ, మహాసేన యను శైవదేవతలు ప్రత్యేకముగ చిత్రింపబడుచున్నారు. పతంజలికూడ వీరిని ప్రత్యేకముగ వివరించియున్నాడు. అమరకోశమున పైనలుగు దేవతలకు నొక్కొక్క శ్లోకపాదమున నితరనామము లీయబడినవి. ఆధునికులు శ్లోకమున గల ౧౭ నామములును కుమారస్వామివని యెంచుచున్నారు; కాని నాణెములను బట్టి యీయూహ సరియైనది కాదనియు, నమరశ్లోకమున నొక్కొక్క పాద మొక్కొక్క దేవతను గూర్చి తెల్పుననియు చెప్పవలసియున్నది.

ఇట్లు నాణెములు భారతదేశవైభవపరిజ్ఞానమును దెలిసికొనుట కమూల్యము లగు సాధనములు. రాజకీయ ప్రభుత్వ మతాచారచరిత్రములను చారిత్రక భూగోళమును దెలియుటకు నవి ముఖ్యాధారములు.

# తగిన శాస్తి

కొవ్వలి లక్ష్మీనరసింహారావుగారు

ఎన్నో రోజుల్నుంచి నాహృదయంలో చిత్రించుకొంటూన్న ఆఅమ్మాయిని తప్ప ఇంకెవళ్లనూ పెళ్లి చేసుకోనని వచ్చిన సంబంధాల నన్నిటిని వెళ్లగొట్టాను. చందమామలాంటి ముఖం—నొక్కునొక్కుల జుట్టు—నవ్వితే సొట్టలు పడే నునుపైన లేతచెక్కిలు—నల్లటి కళ్లు—కళ్లకంటే నలుపై, ఉంగరాలు తిరిగిన ముంగురులు—ఉండి, మరీ పొడుగూ కాకుండా, మరీ లావు మరీ సన్నమూ కాకుండా ఉండి నవ్వితే విలాసం ఒలికిపోయే అమ్మాయిని చేసుకోవా లని నాఊహ.

అటువంటి వాళ్లు పుస్తకాల్లో తప్ప ఇంకెక్కడా కనపడ రని ఎందరు చెప్పినా నేను ఒప్పుకోలేదు. అటువంటి అమ్మాయి దొరికినప్పుడే చేసుకుందా మని ఊరుకొన్నాను. 'వెఱ్ఱివెంగళాయి గొంతెలమ్మ కోరికలు పెట్టుకుని వచ్చిన సంబంధాల నన్నిటిని వెళ్లగొడుతున్నాడు' అని మావాళ్లందరూ నన్ను నిందిస్తూనే ఉండేవారు. అందరూ అంటున్నా రని ఎవళ్లనో ఒకళ్లను చేసుకొని తృప్తి పడడ మెలాగు? నేననుకొన్న అన్ని లక్షణాలు కలిగిన అమ్మాయి దొరికిన నాడే నాజీవితంలో

నిజమైన మాధుర్యం ఉంటుంది; సంసారంలో సుఖం ఉంటుంది.

నేను చక్కనివాణ్ణి కాకపోతే మాత్రం నాకు చక్కటి పిల్ల దొరకకూడ దని ఎక్కడయినా ఉందా యేమిటి? అయినా నాఅందంలో ఏమి లోటుంది రంగు నలుపన్న మాట కాని? కాకపోతే పొట్టి. దేము డిచ్చిన స్ఫోటకపు మచ్చలకు మన మేమి చేస్తాము? మసూచికంలో చెయ్యి వెనక్కు లాక్కొనిపోయిన సంగతి ఎంతో పరీక్షగా చూస్తేనే కాని తెలియదు కదా! కోతివెధవలు, కాలేజీ కుర్రాళ్లు 'పొట్టగుమ్మటం' అని అంటే మాత్రం నాకు ఏమి లోటు? నాకున్న ఆస్తీ, చదువూ ఇంకెవళ్లకుం దేమిటి? ఇంతకూ, నేను అనుకొంటూన్న అమ్మాయి దొరకాలి, అప్పుడు నా అదృష్టం బయటపడాలి.

నాకు రోజూ అదే దారి, కాలేజీనుంచి ఇంటికి— ఇంటినుంచి కాలేజీకీని. నేను అనుదినం ఆమార్గాన్నే వస్తూ పోతూ ఉండేవాణ్ణి. అదొక చిన్న సందు. ఒకనాటి సాయంకాలం ఆసందులో ఒక యింటి అరుగుమీద నిలుచున్న అమ్మాయిని చూడగానే నాశరీరంలో ఏదో విద్యుచ్ఛక్తి ప్రవహించినట్లయింది. నా అభిరుచిని కనిపెట్టి భగవంతుడు ఆఅమ్మాయిని సృష్టించి ఉండాలి. లేకపోతే అటువంటి సౌందర్య మెక్కడుంటుంది? ఏమైతే నేం? నాకోరిక ఫలోన్ముఖ మయింది కాబోలు. సరీగా నేననుకొన్న ఆచందమామ ముఖం — నొక్కు నొక్కుల పెద్ద జుట్టు—నల్లటి కళ్లు—ఇన్నెందుకు? నేకోరిన వన్నీ ఆఅమ్మాయిలోనే ఉన్నాయి. కొంచెం దూరాన్నుంచి చూసి దగ్గర కొచ్చేటప్పటికి ఆఅమ్మాయి మెరుపులా మెరిసి, ఇట్టే లోపలకు వెళ్లిపోయింది. ఆఅమ్మాయి నడచినప్పుడు నిజంగా విలాసం ఒలికిం దంటే నమ్మండి. వెనుదిరిగినప్పుడు చూసిన ఆవాలుజడ నన్ను తినేసినంత పని చేసింది. సరే, ఇంక ఆఅమ్మాయి ఎవరితాలూకో, ఆ యిల్లెవరిదో తెలిసికోవాలి. ఆఅమ్మాయి కింతకు ముందే పెళ్లి అయివుంటే నాగతి ఏమి కావాలి? కాకపోతే మాత్రం నన్ను పెళ్లాడుతుం దన్న మాటేమిటి? అబ్బే! అయి ఉండదు...ఆ! పదహారేళ్లుంటాయి. ఇంతవరకూ కాకుండా ఉంటుందా?... ఇలాగున ఏమేమో ఆలోచించుకొంటూ యింటికి వెళ్లిపోయాను. ఆవేళ నాకు పరమానంద మయిపోయింది. మళ్లీ ఆ అమ్మాయి నెప్పుడు చూద్దామా అని. ఆమె వివాహం సంగతి నెలా తెలుసుకొందామా అని, నాహృదయం తహతహలాడిపోయింది.

ఇంతలో దేము డల్లే ఆఅమ్మాయి ఇంటి కెదురుగా ఉన్న నాస్నేహితుడు మాయింటి కొచ్చాడు. ఆ అమ్మాయి సంగతిని వాణ్ణి నేను రహస్యంగా అడిగాను. ఆయింటిలో ఉన్న శంకరంగారికి ఆ అమ్మాయి మనుమరా లనిన్నీ గుంటూరునుంచి నిన్ననే వచ్చిం దనిన్నీ ఆమె కింకా పెళ్లి కాలే దనిన్నీ చెప్పి నాసంతోషాన్ని రెట్టింపు చేసాడు.

రోజూ నేను వచ్చేవేళకు ఆఅమ్మాయి వాళ్ల యింటి కిటికీదగ్గర నిలుచుండేది. తన నల్లని కళ్లల్లోనుంచి వలపుచూపుల్ని నామీద కురిపించేసేది. ఒకొక్కప్పుడు ఆఎర్రని కెంపులాంటి పెదవుల మీద చిరునవ్వు కూడా ఎందుకో చిందులాడేది. అలా నవ్వినప్పుడల్లా ఆమె చెక్కులమీద పడే గుంటలను నేను తదేకదృష్టితో చూసేవాణ్ణి. ఇంటి దగ్గర ఉన్నంతసేపూ ఎప్పుడు కాలేజికి వెడదామా అని, కాలేజీలో ఉన్నంతసేపూ ఎప్పు డింటికి వెడదామా అని, ఉండేది కాని ఇంకే పనీ తోచేది కాదు నాకు. ఇంతకూ ఆఅమ్మాయిని చూడాలనే! ఇలాగు కొన్ని రోజులు గడచాయి. రోజురోజుకూ ఆఅమ్మాయిలో క్రొత్త అందం కనుపించేది నాకు.

ఓనాడు నేను మామూలుగా ఆమార్గాన్ని వస్తున్నాను. ఆఅమ్మాయి కనుపించలేదు. నాగుండెలు వేగంగా కొట్టుకోవడం మొదలుపెట్టాయి. ఆ

గుమ్మంలో నిలుచున్న ఎవరో ఒకాయన 'అబ్బాయీ! మాట' అని నన్ను పిలిచాడు. దానితో నా అదటు మరీ ఎక్కువయింది. ఎప్పుడూ లేని భయం కలిగింది. నిర్ఘాంతపోయి. చెదరిపోయిన హృదయంతో ఆ గుమ్మంముందు అలాగే నిలిచిపోయాను. ఆయన మళ్లీ 'లోపలకు రా!' అన్నారు. నాకు తెలియకుండానే నా కాళ్లు నన్ను గుమ్మం ఎక్కించి లోపలకు తీసుకొని వెళ్లాయి. ఆ క్రొత్త మనిషి కూర్చోమని నాకో కుర్చీని చూపెట్టాడు.

'నాయనా! ఎవరబ్బాయివి?' అని నేను కూర్చున్నాక అడిగాడు. నేను ఎలాగో ధైర్యం తెచ్చుకొని ఈ వెనకాల వీధిలో ఉన్న వెంకటేశ్వర్లు గారి అబ్బాయిని' అని సమాధానం చెప్పాను.

'నిన్ను గురించి వాకియాప్తు చేసి నేను సర్వం తెలిసికొన్నాను. నువ్వు అనుదినం చూసే అమ్మాయి నా కుమార్తె. ఆమె నిన్ను హృదయపూర్వకంగా ప్రేమించింది. ఇష్టమయితే రేపే వివాహం జరగాలి. కాలయాపన చెయ్యడానికి వీలు లేనటువంటి పరిస్థితులు వచ్చాయి. కట్నం కానుకలు ఇచ్చుకోలేని పరిస్థితులు మావి.' అని అన్నాడాయన. ఆయన చెప్పే ఒక్కొక్క మాటా వింటూంటే నా హృదయంలో ఒక్కొక్క సంతోషతరంగం పొంగి ప్రవహించిపోయింది. రెండు నిమిషాలు ఆలోచించాను. సిరిరా మోకాలు ఒడ్డేవా రెవరుంటారు? ఎన్నో నాళ్ళనుంచి కళ్ళు కాయలు కాసేటట్టు వెతుక్కుంటూ ఉన్న సౌందర్యమూర్తి నేడు దైవవశాత్తూ లభించినది. కాని కట్నం లేని ఈసంబంధాన్ని నాన్నగారు ఒప్పుకోరని నాకు బాగా తెలుసు. అందుచేత రెండో కంటివాడికి తెలియకుండా యీపని జరిగించి, ఆ అపురూపతేజోరాశితో శాశ్వతసుఖం అనుభవించడానికి నిశ్చయించుకొన్నాను. ఈసంగతి నేను ఆయనతో చెప్పి వివాహం అతిరహస్యంగా జరిగిపోవాలన్నాను.

ఆమరునాడే మా వూరికి నాలుగు మైళ్ళ దూరంలో ఉన్న గోపాలస్వామి ఆలయంలో నేను కోరుకొన్న పిల్లకూ నాకూ పెళ్ళి జరిగిపోయింది. పిల్ల తరపువాళ్లు మాత్రం కొద్దిమంది వచ్చారు. నా తరపున ఒక్క స్నేహితుడే. నా తలిదండ్రులకూ—ఇతర బంధువులకూ ఈ పెళ్ళి సంగతి అసలు తెలియనే తెలియదు. మూడుముళ్ళూ పడ్డాక చెబుదామని నా యూహ. అయిదువేల రూపాయిలు నష్టం చేసినందుకు నాన్నగారు తిట్టకమానరు. అయినా పాలకోసం రాయి మొయ్యాలి అన్నారు కనుక జీవితానందం కోసం ఏబంధువులను లక్ష్యంచెయ్యకుండా స్వతంత్రించి ఈపనిచేసాను. కనుచూపుమేరలో ఉన్న ఆనంద మహాసముద్రాన్ని తలుచుకొన్నప్పుడు నాకింకేమీ కనబడలేదు. అది రజస్వలా వివాహము కనక పెళ్ళినాడే యథావిధిగా పునఃసంధానం చెయ్యడానికి ఏర్పాటు లన్నీ చేసారు. నా జీవిత పరమావధిని నేను చేరగలిగినందుకు ఉప్పొంగిపోయాను. నావంటి అదృష్టవంతుడింకొకడు ఉండడని భావించి మురిసిపోయాను.

కాని ఆ అత్యున్నత ఆనందసౌధాన్నుంచి ఒక్కసారి అధోలోకంలోకి క్రుంగిపోయాను. ఇంతకుముందు నేను పెళ్ళిచేసికోనని తిరస్కరించిన బాలిక లందరూ నవ్వుతూ కేరింతాలు కొడుతూ నన్ను వెక్కిరిస్తూ ఉన్నట్లు నాకళ్ళకు ఇప్పుడు కూడా కనిపిస్తూంది. నాకు తగిన 'శాస్తి' అయిందనుకు బంధువు లందరూ సంతోషించారు.

ఆశ్చర్యం! పునఃసంధానపు రాత్రివరకూ ఆపిల్ల మూగదైనట్లు నాకు తెలియనే తెలియలేదు. ఇంకేముంది?

# చంటిపిల్లలు చనిపోవడం

శ్రీ కృత్తివాస తీర్థులుగారు

కుమారుడు చనిపోవడంతోనే ఒక గ్రీకు వేదాంతి దుఃఖపడినాడు. ఎవరేనా దుఃఖించి లాభం ఏమున్నదని ప్రశ్నిస్తే 'నేను అందుకోసమే ఏడుస్తా'నని ప్రత్యుత్తరం ఇచ్చాడు. వేదాంతులు గతంకోసం కన్నీరు కార్చరని మనము అనుకొంటాము. కాని వారి నేత్రాల్లో కూడా దుఃఖపు పూట పూరుతూనే వుంటుంది. అల్లా దుఃఖపడకుండా వుండడం కొన్ని సమయాల్లో అవివేకాన్ని ప్రకటిస్తుంది. దుఃఖం అనుభూతమైన కష్టాలకు విస్మృతి కలిగిస్తుంది. ప్రథమంలో ఆదుఃఖం అతీతం కావచ్చును; అయితే అది క్రమంగా ఎండి బీటలు వారిన హృదయ కేదారానికి వర్షపాతం లాగ వరిస్తుంది; హృదయాగ్నిని చల్లార్చి వేస్తుంది, మనస్సుకు శాంతి ఘటిస్తుంది.

కొన్ని దుఃఖాలు మట్టుకు భరించడం చాలా కష్టం. అలాంటి సమయాలలో మనశక్తిని వినియోగించి దుఃఖప్రవాహ వేగాన్ని నిరోధించాలి; దుఃఖాన్ని స్మృతికి తెచ్చుకోకుండా వుండడానికి ప్రయత్నించాలి; అయితే కొన్ని దుఃఖాలు మనస్సుకు క్రమంగా శాంతినిస్తాయి. మొదటి సారి పుట్టిన దుఃఖాన్ని అణచి వేసుకోమని చెప్పే బూటకపు వేదాంతానికి వేదాంతమే చెయ్యాలి. గడచిపోయిన దానికి వగచి లాభము లేదని చెప్పేవారి సానుభూతివల్ల ప్రయోజనం సున్న. ఆ స్వల్పమైన దుఃఖాల స్వరూపం శాంతమైనది; వ్యాజమైన సానుభూతికన్న గంభీరంకన్న, ఉత్సాహంకన్న అవి ఎన్నోరెట్లు మంచివి. ఇల్లాంటివే చంటిపిల్లలు చనిపోవడంకూడా. చంటిపిల్లవాడు పోయాక వెంటనే మనం చాలా దుఃఖపడతాము. జననీజనకులు ఆ ప్రథమ సంతాపాన్ని ఎంతమాత్రమూ అరికట్టుకోలేరు. అందులో తల్లి బొత్తిగా పుత్ర దుఃఖాన్ని సహించలేదు. వారు నెమ్మది మీద ఆదుఃఖం తగ్గిపోయాక తదితర పిల్లల్ని చూసుకొంటూ దుఃఖం దిగమింగుకోవడం లేక ఉపశమించుకోవడమో చేస్తారు. ప్రథమ సంతాపం పడకపోవడమంటే వాళ్ళ హృదయాలు కఠినములై ఉండాలి, లేక అతి గంభీరాలై ఉండాలి, అదీకాక పోతే వాళ్ళు సామాన్య మానవులు కాకపోవచ్చును. మానవ స్వభావానికి పరితాపం సహజం; అయితే ఈసామాన్య సూత్రమునకు భిన్నంకూడా వుండవచ్చును.

చంటిపిల్లలు చనిపోయాక జనించిన ప్రథమ సంతాపం మహావేగంతో జలపాతంలాగ ప్రవహించి, క్రమంగా శాంతంగా ప్రవహించే సమతలంలోవున్న కాలువలాగ వర్తిస్తుంది. మనకు ఎంత ఆర్ద్రహృదయుడైన మిత్రుడు చనిపోయినా ఆజన్మాంతం వకటేతీరున దుఃఖం తీవ్రరూపం దాల్చి వుండదు. కాలం అనేది చెదపురుగులాంటిది; అది దుఃఖాన్ని క్రమంగా తినేస్తుంది. కాబట్టి కాలానికీ దుఃఖానికీ పరస్పరం విరోధము. కాలంగడిచిన కొద్దీ దుఃఖం క్రమంగా తగ్గిపోతూవుంటుంది. చనిపోయాక చంటివాళ్లు మనస్మృతి పథంలో విహారం చేస్తోవుంటారు. వారి విషయాలన్నీ మనకు తలపుకు వస్తూవుంటాయి. వారినిగురించిన స్మరణకాలం గడిచినకొద్దీ మనకు హాయిని కలిగిస్తుంది. మనభావనా సౌధాల్లో వాళ్లు వుంటూనేవుంటారు. నేనిప్పుడీ వ్యాసం రాస్తున్నప్పుడు కిటికీఎదుట కూర్చొన్నాను. కిటికీలోంచి తొంగిచూస్తే, నన్ను తనప్రాణసమంగా ప్రేమించిన యువతి భస్మసాత్కృతమై పోయినతర్వాత ఆదివ్యరేణువుల సముదాయం కనిపిస్తూవుంటుంది. ఆమెపేరట చిన్ని అందమైన స్మృతిచిహ్నంగా స్తూపంలాటిద్ది ఒకటి నిర్మించుకొన్నా. దానిచుట్టూ విశాలములైన సస్యక్షేత్రాలు మనోహరంగా ఉన్నాయి. చిరుగాలికి ఆకులూ, కంకులూ అల్లల్లాడుతూ స్తూపానికి వింజామరలు

చేస్తున్నట్టున్నాయి. మేఘశకలాలు సూర్యరశ్మిని కొంతవారిస్తూ, కొంతవిడిచిపెడుతూ ప్రయాణిస్తున్నాయి. వసంతవాయువు కమ్మని సువాసనలు కొల్లగొట్టి, నన్ను ప్రేమించిన యువతి దగ్గరనుంచి సందేశాన్ని తెస్తోంది. అక్కడ ఆస్థూపం వుండడం మూలాన ప్రకృతికి ఎంతో నవకం వచ్చింది. ఆవసంతకాలపు లేతగాలి తరగలను ఆలాలిత్యం, ఆసౌకుమార్యం, ఆ ఆనందం ఎక్కడినుంచి వచ్చింది? ఆపశ్చిమదెస సంజకాంతుల్లో తళుకు ఎల్లావచ్చింది? ప్రకృతికి అంత సౌకుమార్యం ఎక్కణ్ణించివచ్చింది? వాటి అన్నింటికీ ఆస్థూపం కారణం—ఆమెనుగూర్చిన తలపులునాకు బాధాకరాలు కావు. అయ్యో అలా కూడా అనకూడదు. నాకు ఆనందం సౌఖ్యం ఆమె చింతనమువల్లనే—ఆమె ఈఐహికరంగం నుంచి నిష్క్రమించినా, హృదయం మాత్రం వుండనే వున్నది. స్థూపంమీదనుంచి వచ్చిన గాలులను ప్రశ్నిస్తోవుంటా ఆమెవిషయం. ఆమె పెదవి మీద చిరునవ్వు మొలకలు, ఆముఖంలో లావణ్యం. ఆనేత్రాల్లో అమృతం ఆహృదయంలో నవనీతం, ఆమనోజ్ఞత్వం, ఆకోమలత్వం—అన్నీ—అవన్నీ—ఒక్కటీ కూడా మిగలకుండా, అన్నీ నాచిత్రఫలకంలో ప్రతిబింబిస్తూ వుంటాయి! అయితే నేను జ్ఞాపకం వున్నానా?—ఆమెను. వుండకేమి! ఆమె భౌతికమైన క్షణభంగురమైన దేహాన్ని వదలినా, హృదయం మాత్రం నావద్ద వదిలిపోయింది. నాభావనలో ఆమెనిత్యం, అక్షయం, పవిత్రం, పవిత్రతరం, పవిత్రతమం—! నాభావనలో ఆమెశాశ్వతం. జననిజనకుల భావములలో చంటిపిల్లాడు చనిపోయినా శాశ్వతమే.

ప్రతీవారు ఓచంటిపిల్లవాణ్ణి పోగొట్టుకోమనడం లేదు, మిగతావాళ్లను చూసుకొంటూ ఆనందించడానికి. అలా పోగొట్టుకోవడానికేనా మన తరం కాదుకదూ? చంటిబిడ్డలు ఎవ్వళ్లూ చనిపోకుండానే వుంటే. అంతా జీవిస్తూనే వుంటే వారంతా పెద్దవారవుతారు. చిన్న పిల్లవాడు, చిన్న పిల్ల భవిష్యత్తుల్లో పురుషుడూ స్త్రీ అవుతారుకదా. అయితే చనిపోయిన చంటిబిడ్డ మన భావాల్లో పెద్దవాడవుతాడా పెద్దదవుతుందా? కాదు మన భావనలో వాళ్ళు ఎప్పుడూ చిన్నతనంలోనే వుంటారు. మన తలపుల్లో వాళ్లు నిత్యం మెరుగుతో వుంటారు. మనం వాళ్లను మరచిపోలేము. అందువల్ల చంటిపిల్లలు మరణించినా మనకు శాశ్వతంగానే వుంటారు. మృత్యుదేవత ఒక చేతితో కఠినత్వాన్ని మరొక చేతితో కారుణ్యాన్ని బిడ్డమీద వెదజల్లింది. మృత్యువు చంటిబిడ్డ భౌతికరూపాన్ని క్రూరంగా హరించింది. ఆమె చంటిబిడ్డను మన భావాల్లో నిత్యం ఉండేలాగ చేస్తుంది. అందుచేత ఆమె కారుణ్యం కూడా కనిపిస్తుంది మనకు. ఆమె అక్షయమైన చంటిబిడ్డ ప్రతిబింబం మనకు చూపిస్తుంది. ఆ అమాయికత్వం, ఆ వెన్నలాంటి హృదయం, ఆ ముద్దులు కురిపించే తియ్యని పలుకులు—మరిచిపోలేము.

ఆ అమాయికత్వమే ఆ వెన్నవంటి హృదయమే ఉంటే మనం ఎల్లా వుంటాము! అప్పుడు మనం పూజ్యులం. స్వర్గధామంలో ప్రసన్నులు, అమాయికులు, ఆర్ద్రహృదయాలు మాత్రమే ఉంటాయి. అక్కడన్నీ స్నిగ్ధహృదయాలే. అంతా చంటిపిల్లలే. మనకు కూడా చంటిపిల్లలలాగా ఆ అమాయికత్వం ప్రసన్నత్వం వుంటే స్వర్గసౌఖ్యాన్ని అనుభవించవచ్చు. మొదటనుంచీ మంచినే గ్రహిస్తూ, మొదటినుంచీ మోసమనేది, కపటమనేది ఎరుగకుండా వుంటే మనల్ని భగవంతుడు స్వర్గధామంలోకి చేర్చుకోడా?



# మా ఊళ్లో గాలిపటాలు

పూడిపెద్ది వేంకటరమణయ్యగారు

అన్నివృత్తులవాళ్లకూ ఉగాదినాడూ అంతకు తొలినాడూ కూడా ఆటవిడుపేను. ఈ గ్రామంలో ఆనాడు పెద్దలకూ చిన్నలకూ కూడా ఆటవిడుపేను. ఆటవిడుపంటే ఆటను విడిచిపెట్టం కాదు. ఉన్నపనులన్నీ ఆటనిమిత్తం విడిచిపెట్టం. ఆనాడిక్కడి యీయాట అదో చిత్రమయిన ఆట. ఆరోజు ఉదయాన్నే నిద్రనుండి లేచిన దగ్గరనుండీ ఊరంతా సందడే! అందరి చేతులలోనూ రంగుల కాగితాలూ, వెదురు పుల్లలూ, తుమ్మబంకచిప్పలూ, దారపుటుండలూ, ఎవరి యరుగుమీద చూచినా ఈ నాలుగు వస్తువులే! ఇది రేఖలతో వన్నెలతో చేసే చిత్రరచన కాదు. ఇది ఉలితో మలచే శిల్పం కాదు. వన్నెలకాగితాల చిత్రరచన. ఇందు చిత్రలేఖనం శిల్పం రెండూ కలసిపోయినాయేమో అనిపిస్తుంది. ఇందులోనూ కళాప్రజ్ఞ చూపగలవారుంటారు. వారి నాశ్రయించి తిరిగేవారెందరో ఉంటారు. ఆ కలకలా, ఆ సందడీ, ఆ రంగుపటాల జిలజిలా, చూడడానికి చాలా అందంగానూ అపురూపంగానూ ఉంటుంది. ఈ రచనలో భేదాలు—గ్రద్ద, మొండిగ్రద్ద—పతంగి, రింగులపడగ, గందరపగడ (గంధర్వపటమయియుంటుంది.) వీ రుపయోగించే దారాలకు వేర్వేరు పేరు లున్నాయి. వడి, వజావడి, మైనంవడి, అంబటి వడి మున్నగునవి.

వెదురుపుల్లలు వంచి దారాలు కట్టేవాళ్ళూ రంగులకాగితాలు కొలకు తగినట్టు కత్తిరించి అంటించేవాళ్ళూ, దారాలకు పూత లెక్కించేవాళ్ళూ తోకలకయి ప్రాతబద్దలముక్కలు పెట్టేవాళ్లూ, పంటి కఱ్ఱలకు దారాలు చుట్టేవాళ్ళూ వీళ్లతో నిండి ఉంటాయి వీథులన్నీని.

వీనిలో పందెముల పలుకులు:—దూరపుపందెం, పోట్లాటపందెం, పగడపెత్తనం, పనివానితనం, ఈ పందాలూ పైపందేలూ, రోషాలూ, చాకచక్యాలూ ఇవి కొంతసేపు సాగుతాయి.

ఇది యేనాటి సాంప్రదాయమో ఎవరిని చూచి నేర్చుకొన్నదో గాని, చిరకాలంనుండీ ఈయూళ్లో ఈ యాచారం సాగివస్తూందట. ఈచుట్టుప్రక్కల గ్రామాల్లోనయినా ఇది ఇంత ప్రబలంగా లేదు. ఈ జిల్లాలో కూడా చాలాచోట్ల యీ ఆచారం తెలియదు. ఈ యూరికి సుమారు నలుబది మైళ్ల దూరమున నున్న పట్టణాల్లో కూడా ఇలాటి ఆచారం ఉందని తెలియదు.

పగలు పదిగంటలవేళ కప్పుడే ఆకాశాన అక్కడక్కడ ఇంద్రచాపపు తునుకలలాగు, రంగులు తేరిన చుక్కల్లాగు, వన్నెల పులుగు రెక్కల్లాగు నింగికోకబుటాల్లాగు, మబ్బుతోట చివురుల్లాగు, తేలి, పొడిచి, సాగి మెరసి విరిసి చూడడాని కందంగా ఉంటుంది మిన్నంతానూ; కొన్నియెడల గాలిని మూసిన చప్పుడు, కొన్నిచోట్ల పట్లీలు కొట్టిన సడి, కొన్ని తావుల చితారు మీటిన రవం, కొన్నిట శ్రుతిలాటి ఝుంకారం, ఈ చప్పుళ్లతో పగడ లెగురవేసేవారి సందళ్లతో, చూపరుల మెప్పులతో, ఊరు కలకలలాడుతూ గలగలలాడుతూ ఉంటుంది. తోక తెగిన గాలిపటాలూ, తొట్రుపడిన గాలిపటాలూ, పలిటీలు గొట్టి చెట్లకొమ్మల చిక్కుపడ్డ గాలిపటాలూ, వడి తెగి పరగడలు తొక్కిన గాలిపటాలూ, తపతపమను తలలెత్తేవీ, రెక్క చాచేవీ, పచారుచేసేవీ, పైకెగసికూర్కేవీ. అక్కడక్కడ మూసే చంద్రకిరణాల్లాగు, ఎడపదడప జారే వానచినుకుల చాలులలాగు, మిన్నేట విరిగి పడలే రవికిరణాల్లాగు; గాలిప్రేళ్లలో తునిసిన వీణతీవల్లాగు మింటికి మంట్లికి పన్నిన సూత్రాలయి మిలమిలలాడే దారాలు.

జౌను; ఆ గాలిపటాలు వియచ్చరులై వీణానాదం చేస్తున్నాయి, అప్సరలై ఆడుతున్నాయి. సురలై సుమవృష్టి కురుస్తున్నాయి. ఖగాలై యెగిరిపోతున్నాయి, గగనారవిందాలై వినువాక విరుస్తున్నాయి.

వసంతారంభము. శిశిరాంతమున చేవదేరు వృక్షాలు, మంచుబరువు డించి నిట్టూర్చే గాలి తరగలు.

నింగి, వసంతమును ప్రదర్శించు సినిమా తెర అయింది. నేలవసంతము నటించు రంగస్థల మయింది. పులుగుల శోభ, పుష్పాల శోభ! అది చైత్రమాస మయింది.

మాయూరి ప్రజ లానా డాకాశాన్ని చిత్రించేరు. గాలికి జిలుగురెక్కలు కట్టేరు. ఉగాది కొప్పులో పూలు ముడిచేరు. ఊరంతటా కోలాట పంటుపం తీర్చేరు.

ఆమరునాటి ఛీఃత్సవపు శోభ మరింత బాగుంది. ఆకురాలిన చెట్లు చితుగుల పూలయి విరిసేయి చినిగిపోయిన గాలిపటాలు. తంత్రులమీద మూర్తీభవించిన వసంతవార్తలయినాయి చిక్కుపడ్డ గాలిపటాలు. గాలిపటం చిక్కుకొనని చెట్టే లేదు— తీగె లేదు.

ఆచార మెలా ఆరంభమయినా ఉగాదినాడీ ఉత్సవం సాగించడం చాలా ఆనందంగానూ సార్థకంగానూ ఉంది. (రాజాంలో)



# బిరుదులు

గౌతముడు

ఇప్పుడు కావలసినవే అవి. బిరుదు అక్కర్లేని వాళ్లెవళ్ళూ లేరు. ఏమార్గంగా రానీండి. ఏమి కానీండి ఏదో ఒకబిరుదంటూ సంపాదించి పెట్టుకుంటేచాల్ను. వెనకటి కో పెద్దమనిషి ఓయెత్తెత్తాడు. వాళ్ళ వీధి తుడిచే ఆసామీ వీధి వాళ్ళు ఎన్నిమార్లు చెప్పినా బాగా తుడవక, మునిసిపాలిటీతో పోర్రిట్టు చేసినా లక్ష్యపెట్టక, పోటూ వచ్చాడు. అసలు వాడొహ రౌడీ కూడాను. ఇదంతా కనిపెట్టి ఆపెద్దమనిషి నలుగుర్నీ కూడదీసి వాళ్ళచెవి గిల్లి "మన వీధితుడిచే మండాపి యెర్రన్నకి "మార్జనపరమేశ్వర" అంటూ బిరుదిస్తే బాగా వుంటుందన్నాడు. ఓహో అంటే ఓహో అని అందరూ యేకగ్రీవంగా తీర్మానం ఆమోదించారు. పత్రికలకిరాశారు. పటాటోపాలూ అట్టహాసాలూ చేశారు. వెనకటి యెర్రన్న ప్రబంధ పరమేశ్వరుడైనాడు. మన మండాపి యెర్రన్న మార్జన పరమేశ్వరుడైనాడు. ఆమర్నాటినుంచీ ఆవీధికొల్లాముందు అద్దాలు తీసికట్టు. అల్లాంటి బిరుదు కలిగినందుకు ఆయెర్రన్న కృతజ్ఞతాసూచకంగా ఒక అల్పాహార విందుకూడా జరిగించినట్లు వినికిడి.

"రంగగార్దభ" బిరుదం వహించాక, రా. చ. ల. వి. రావుగారు తమ ప్రావీణ్యాన్ని బాగా వ్యక్తము చేసి నాటకమాడి, ఆవచ్చిన ధనమంతా భూకంప సహాయ నిమిత్తం వైస్రాయి నిధికి పంపియున్నారు. బిరుదుల మహాత్యం అలాంటిది. కొందరుపైకి బిరుదుల వ్యామోహం యేమీ లేనట్లు నటించినా, ఎవరైనా అయాచితంగా ప్రసాదిస్తే తిగుల్చుకోడానికి అభ్యంతరం లేదనే అభిప్రాయాన్ని కళ్ళలో సూచిస్తూ అలాటి వాళ్ళకోసం దిక్కులు చూస్తూ ఉంటారు.

ప్రభుత్వంవారు సగౌరవంగా ప్రసాదించేవి కొన్ని, యూనివర్సిటీలు పరీక్షలు చేసి అనుగ్రహిం

చేవి కొన్ని, నలుగురూ యేర్పడి యిచ్చేవి కొన్ని, డబ్బిచ్చి కొనుక్కునేవి కొన్ని, ఏరకం వారికి ఆరకంవారీ, అన్ని చోట్లా తయారు.

అసలు యింగ్లీషు పొడిఅక్షరాల బిరుదులలో యేమీ చిక్కులేదు. చిక్కంతా స్వదేశీ బిరుదాలకే వచ్చింది. ఒక్క బిరుదాల విషయంలో నేకాదు. అసలు స్వదేశీ అంటేనే ఉంది చిక్కంతాను. అందులోనూ తెలుగువాళ్ళ స్వదేశీలో యీ చిక్కులకి తెయితక్కలాటలే. ఏమిటా చిక్కంటారా! అది చాలా గట్టిచిక్కు. పండితులూ పామరులూ అనే భేదం యేమీలేకుండా అందరూ అచిక్కులో తగిలి ఉన్నవారే. మన దేశంలో వుండుకున్న అనేక రకాల విశ్వకళా పరిషత్తులూ, కళాపరిషత్తులూ, లాపరిషత్తులూ పరిషత్తులూ అన్నీ కూడా ఆచిక్కుకు గురి అయినవే. ఆఖరికి గవర్నమెంటువారు ఇచ్చే వాటికూడా యీ గాలి కొంచం తగిలింది.

మన తెనుగువాళ్లు ధరించే స్వదేశీ బిరుదాల్లో మూడు వంతుల మున్ప్రాతిక యిలాటివే. అవి పైవాళ్ళు బిరుదధారుల్ని సంబోధించడానికి వీలవుతున్నాయికాని బిరుదుధారులు సరదా తీరేటట్టుగా తమ పేరు ముందు ఎక్కించడానికి వీలుగా లేవు మహా మహోపాధ్యాయ, మహోపాధ్యాయ విద్యాప్రవీణ—ఉభయభాషాప్రవీణ పండిత, విద్యాభూషణ మొదలైనవియీ రకంవారీలోవే. ఒకర్ని ఇంకోవారు సంబోధించేటప్పుడే పైవి కుదురుతాయి. పేర్ల ముందు తగిలించుకోవాలంటే తెలుగు ప్రత్యయాలు చేరిస్తే గానివీల్లేదు. అంటే మహోపాధ్యాయుడు, మొదలగు రీతులుగా అవి ఉండాలన్న మాట. పోనిండి! ఇదిసమస్త పదం అవుతుంది అంటారా! అంతకంటే వీలులేదు. అలాయితే బిరుదూ, ఇంటిపేరూ, పేరూకూడా ఏకాండీ పదం అయిపోయి అందరికీ కొరకరాని కొయ్య అయిపోతుంది. అల్లాగ ఏకాండీ పదంగా యెవ్వరం వుచ్చరించిడం కూడా లేదు. ఆఖరికి తేలిందేమిటంటే మన బిరుదుల్లో చాలామట్టుకు ప్రత్యయాలతో యెంతమాత్రం సంబంధం లేని ప్రాతికదికలని——

పోనిండి—అన్ని ప్రాతిపదికలగానే కనిపిస్తూ వుండుకుంటున్నవి గనక, బిరుదుల విషయంలో మాత్రం సమాసం రాకపోయినా ప్రత్యయం లోపిస్తుందనిన్నీ, యిట్టి సత్తాల్లో మాత్రం సంధిరాదనిన్నీ కొత్తగా విశ్వామిత్రంచేసి పాణిన్ని బాగా పట్టీలుకొట్టిద్దామా అంటూ ఒక ఊహతోచింది. అలాఅనడానికి మాత్రం—అన్ని బిరుదులూ అలా ప్రాదిపదికలై ఒకేమార్గం తొక్కి ఉంటేగా?

ఇకారాంతంగా ఉండే బిరుదులన్నీ అంటే కావ్యమహోదధి, శిరోమణి, అష్టావధాని, శతావధాని. మొదలయినవన్నీ ప్రాతిపదికలు కావనే అనుకొంటూ ఉన్నాము. మీదిపద్దులో కొన్ని—అంటే శిరోమణ్యాంతంగా ఉండే బిరుదులు ప్రాతిపదికలేఅంటూ పట్టుపట్టి కూర్చున్నా, "అవధాని" పదాలుమాత్రం అట్టివికావు. అవి ప్రాతిపదికలే అయితే "అవధానిన్" అని ఉండాలనివస్తుంది. అవితత్సమాలు, ప్రత్యయంవచ్చికూడా నశించింది.

ఇంకా మరోవిశేషం. ప్రత్యయం చెయ్యకుండా ప్రాతిపదికల్ని ఉపయోగించడం మహాతప్పు. సంస్కృతంలో యెక్కడా అలాకనిపించటం లేదు.

"విశ్వదాత" లాటివి తత్సమాలైన ప్రత్యయాంతాలు. "మహాత్మగాంధీ" లాటి చోట్ల "మహాత్మా" అనేది, మద్రాసు విశ్వవిద్యాలయంవారూ, ఇత్యాదులూ అనుగ్రహిస్తూవున్న "విద్వాన్" లాటి సంస్కృతబిరుదు.

"విద్వాన్" లాటి బిరుదులుకొన్ని విద్యార్థులు పరీక్షయిచ్చేది తెలుగయినా విద్యాలయాలవారు ముడిపెడుతూన్నారు అసలు ఆ కాలేజీలో చెప్పేది తెలుగైనా "సంస్కృతకాలేజీ" అంటూ పేరుపెట్టుకుంటున్నట్లు. పైవిషయాల్ని బాగా

గురించామంటే మనవాళ్లుబాగా ఆలోచించి వీటిని ఉపయోగంలోకి తెచ్చినట్టులేదని తోస్తుంది.

ఇదంతా మనకి ఒకాళ్ని అనుకరించడంవల్ల వచ్చినఫలం. యింగ్లీషులో సామాన్యంగా మన స్వదేశీపదాలన్నీ, ప్రాతిపదికలోను, రూపంలోను కూడా అణుమాత్రమూ భేదంలేకుండానే వుంటూ వస్తున్నాయి. "రాముడు" అనేదాన్ని మనం యింగ్లీషులో "రామా" అంటూ వ్రాస్తున్నాం. కాబట్టి మీది రీతిబిరుదులు యింగ్లీషులో రాసేకొంత సమన్వయం కుదరొచ్చుగాని తెలుగులో కుదరదు.

ఉత్తర హిందూదేశ భాషల్లోకూడా యింగ్లీషు రీతిగానే అసలుప్రాతిపదిక్కీ రూపానికీ యేమీ వ్యత్యాసంలేదు. అంచేత ఆదేశస్థులు తమ పేర్ల ముందు మీది బిరుదాలు ధరించినా అన్వయసరళి అర్థం యెంతమాత్రమూ చెడదు. ఆభాషల పంథా వేరు, మనభాష పంథా వేరు. వాళ్లలా చేస్తున్నారుగదా అంటూ మనంకూడా అర్థంతెలీకుండా వాళ్లని వెంబడిస్తే—మనకి మిగిలేది నవ్వులాటే.

ఫలితం యేమిటంటే—మన తెలుగువాళ్లు ఉపయోగిస్తున్న బిరుదులు దారీతెన్నూలేక, కొన్ని కేవలం ప్రాతిపదికలూ, మరికొన్ని తత్సమాలూ, కొన్ని కేవలం సంస్కృత ప్రథమా విభక్తులూఅయి, ఒకదానితో ఇంకోదానికి సంబంధంలేని కచట తపల్లాంటివని—.

ఇంగ్లీషువి అలా ఉంటున్నాయా! చూడండి. "బేచిలర్ ఆఫ్ ఆర్ట్సు, మాస్టర్ ఆఫ్ ఆర్ట్సు, డాక్టర్ ఆఫ్ ఫిలాసఫీ, డాక్టర్ ఆఫ్ లెటర్సు. డాక్టర్ ఆఫ్ సైన్సు" అని బిరుదులు తోకలు తెగిఉన్నాయా! మనం మాత్రం చేసుకున్న ప్రారబ్ధం ఏమిటి?

మన పూర్వీకులు యిట్టి చిక్కేమీ పడలేదు. అప్పుడు బిరుదులపైని ఎవరికీ మోజు ఉన్నట్టులేదు. బిరుదులు వుంటేనేగాని పిల్లేదుఅన్న శాసనం లేదు.

గ్రంథాల్ని రచించినవాళ్ల గద్యల్లోనూ, వంది మాగధులు మహారాజుల్ని పొగిడే స్తుతులలోనూ బిరుదాలు వున్నట్టు కనిపిస్తుంది. అలా అయినప్పటికీన్నీ గద్యల్లో ఉన్నవి సమాసాలమధ్యని ఉన్నందుననున్నూ, వైతాళికులు పఠించేవి సంబోధనలు ఆవడంచేతనున్నూ యేమీచిక్కులులేవు. పైచోట్ల ప్రత్యయాలకి లోపంవస్తూంటుందని అందరికీ తెలుసునుగదా!

ఈబిరుదులశకం ప్రారంభం అయినది మొదలు నేటిదాకా అందరూ, వాటినిధరించే వారేగాని, మనంవాట్ని తగినరీతిని గౌరవించి వాడుతున్నామా! తోకతెంచేసి వాడుతున్నామా! అని ఆలోచించడానికి ఎవ్వరూ సిద్ధపడలేదు. నిజం అనుకోండి— వేళాకోళం అనుకోండి.

# ప్రశంసలు

౪౫

"పేరులో గూడా భావం గర్భితం చేసుకున్న ప్రబుద్ధాంధ్రకు ధన్యవాదా లివ్వాలనే అభిప్రాయం కలిగింది. కవితారీతుల్లో స్వాతంత్ర్యం కనపర్చటానికి అవకాశం నేటికి కలిగింది. మానాన్నగారు "ఆంధ్రత్వం ఇప్పుడు ప్రబుద్ధమైనట్లు రా! అబ్బాయీ!, ఈవిధానమే ప్రస్తుతకాలంలో అవసరం" అని అన్నారు. నవ్యగద్య సారస్వతానికి నూతనలాలిత్యం ప్రబుద్ధాంధ్ర సంపాదించా లని అనిపిస్తున్నాం. శ్రీపాదుల సమరసాకారమైన ఉత్సాహం ఆంధ్రమండలికి ఉత్తేజాన్ని అనుగ్రహిస్తోంది" జమ్మలమడక మాధవరామశర్మ.

౪౬

"ప్రబుద్ధాంధ్ర ఆంధ్రసారస్వతమున నూత్న పథంబులు ద్రొక్కుచున్నది. పద్యములలోని కవిత క్రొత్తనడకల బోవుచున్న సమయమున దాని అంత్యదశ రానున్న దని యూహించి, గద్యరచనకే తమ పత్రికారాజమున ప్రాముఖ్య మీయ సాహసించినందులకు శాస్త్రిగారెంతయూ అభినందనీయులు. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి నెఱుంగని ఆంధ్రు లుండరని నాయూహ. వారి కార్యమెంతయు కొనియాడదగినది. పత్రిక చిరస్థాయిగా నుండునట్లు భగవాను డనుగ్రహించుగాక!

షం. వెంకటేశ్వరప్రసాద్.

# వ్యాఖ్యానములు

## ఒక్కొక్క అనుభవం కలిగినప్పుడు

ఏలూరు నగరీయసంఘానికి జవాబు చెబుతూ మన లా మెంబరు సర్. కూర్మా వేంకటరెడ్డినాయుడు గారు తెనుగు జిల్లాలను విడదీసి ప్రత్యేకరాష్ట్రంగా నిర్మిస్తే మనకే నష్టం అన్నారు.

"నే నిదివరకి ఆంధ్రరాష్ట్రం కావా లన్నాను; కాని యీమధ్య నాకు కలిగిన అనుభవంవల్ల—అనగా వాయవ్యపు సరిహద్దు రాష్ట్రం, సింధురాష్ట్రం, ఓఢ్రరాష్ట్రం—వీటి విషయం గమనించగా ఆంధ్ర రాష్ట్రనిర్మాణం మనకి నష్టం కలిగిస్తుం దని తేలింది. ఇలా నిర్మొగమాటంగా చెప్పినందుకు నన్ను క్షమించాలి. పైని చెప్పిన రాష్ట్రాల కోసం కేంద్ర ప్రభుత్వం కోట్లకొద్దీ డబ్బు ఖర్చుపెడుతోంది. మనకి త్వరలోనే గొప్ప సంస్కరణాలు రానున్నాయి. ఈసమయంలో మనం ప్రత్యేకరాష్ట్రం కోరడం కంటే తమిళులు, కన్నడులు, మళయాళీలు—వీరితో కలిసి వాటి నమలులో పెట్టడానికి ప్రయత్నించడం మంచిది" ఇదీ నాయడుగారి వాదం.

కాని—మనకి ప్రత్యేకరాష్ట్రం నష్టం కలిగిస్తుం దనే సిద్ధాంతానికీ యీ హేతువాదానికీ అతుకు కలవడం లేదు. ఏమంటే? తెనుగు జిల్లాలను విడదీసి వొకరాష్ట్రంగా నిర్మిస్తే అది పై రాష్ట్రాల లాంటి నెలతక్కువబిడ్డ అవుతుం దని యిప్పటిదాకా యెవరూ చెప్పలేదు. మద్రాసు పరగణాలో వున్న భాషాభాగా లన్నిటిలోనూ తెనుగు మాగాణమే యెక్కువ రాబడి కలది. అది ప్రత్యేకరాష్ట్రం కావడం అంటూ వుంటే తన కాళ్లమీదే నిరాఘాటంగా నిలవగలదు. పైగా తమిళులవల్ల మనకి కొంత సొమ్ము మదరా కూడా రావలసివుంటుంది కనక ప్రారంభవ్యయాలవిషయంలో కూడా మన మేమంత చిక్కుపడనక్కరలేదు. తెనుగు జిల్లాలకి యిలాంటి తాహతు వుండడంచేతనే మనం ప్రత్యేక రాష్ట్రం కోరుతున్నాం; గాని ఓఢ్రులలాగ కేంద్ర ప్రభుత్వాన్ని యెప్పుడూ దేవురిస్తూ చూచోడానికి కాదు.

కొద్దివో, గొప్పవో కొత్త సంస్కరణాలు రాబోతూ వుండడం నిజమే. అయితే వాటిని మనం ప్రత్యేకంగా మాత్రం యెందు కమలులో పెట్టగూడదూ? తమిళులు, కన్నడులు, మళయాళీలు—వీరితో కలిసే సంస్కరణాల సందర్భంలో మనకి వొరిగే దేమిటీ? అందరూ కలిసి వుంటే మదరాసు పరగణా పెద్దది కనక ప్రాతినిధ్యం యెక్కువ వుంటుం దనే పక్షంలో—అదంతా తెనుగు జిల్లాలకే భుక్తపడుతుందా? పైగా "తమిళులు, కన్నడులు, మళయాళీలు, ఆంధ్రులు—వీ రందరితోటీ కలిసి మనం కొత్త సంస్కరణాలను అమలుపరచా లని ఓఢ్రు లనుకోడం లేదేం?

ఈసందర్భంలో "ఇదివరకు ఆంధ్రరాష్ట్రం కోసమూ, ఆంధ్రవిశ్వవిద్యాలయం కోసమూ తీవ్రంగా కృషి చేసిన వాళ్లలో నే నొకణ్ణి. ఆంధ్రవిశ్వవిద్యాలయం విషయంలో మన కోరిక ఫలించింది. అది మన వికాసానికి తోడ్పడగలుగుతుం దని నమ్ముతున్నా" నంటూ నాయడుగా రింకో మాట చెప్పారు.

మదరాసు విశ్వవిద్యాలయానికి దూరంగా వున్నా రనే కారణంతో మదరాసు పరగణాలో వొక కొసని వున్న వారికి అందుబాటులో వుండడానికి ఏర్పడింది కాదు ఆంధ్రవిశ్వవిద్యాలయం. ఇవాళ నేతిబీరకాయ లాగే వున్నా అది ప్రత్యేకంగా "తెనుగు జాతి" యొక్క పునర్వికాసాన్ని సాధించడం కోసమే పుట్టింది. అలాంటి ప్రత్యేక సంస్థ మన వికాసానికి తోడ్పడుతుం దని వొప్పుకున్నారు నాయడుగారు. అయితే ప్రత్యేకాంధ్ర

రాష్ట్రం విషయంలో మాత్రం యీ సూత్రం యెందుకు చెల్లదూ?

ఎలా చూసినా, పక్కా 'తెలగాబిడ్డ' అయిన నాయడుగారి హేతువాదంలో వారి హృదయం ప్రతిఫలించడం లేదు.

ఇంతకీ: మాట అంటే యుక్తి కనపడాలి. వాదం చేస్తే 'కామోసు' అనిపించుకోవాలి. ఈ రెండూ లేకుండా పదస్థులైనవారేమన్నా దాని కడ్డుండదు: గాని లోటు కనబడుతూనే వుంటుంది.

## ఏలూరి సనాతనధర్మసభ

ఇది ౨౫-౫-౧౯౩౪ తేదీని జరిగింది. బ్రహ్మశ్రీ జయంతి రామయ్యపంతులుగారు యాజమాన్యం వహించి కార్యక్రమం నిర్వర్తించారు.

పంతులుగారి ప్రారంభోపన్యాసం అచ్చులో ౨౬ పుట లుంది; కాని అది సనాతనధర్మానికి ఉత్తేజకంగా గాని, సనాతనధర్మవాదులకు ఉద్బోధకంగా గాని, చివరికి సంస్కారవాదులకు వెన్ను తట్టగలదిగా గాని లేదు. రచన కూడా వారి వైదుష్యానికీ, సంతతభాషాపరిశ్రమకీ అనుగుణంగా లేదు. ఏవో వదులు వదులుగా, బులబులాగ్గా—చరచరా సాగిపోయింది. అంతే.

ఒక సనాతనధర్మవాది అనేకమంది సనాతనధర్మవాదుల యెదట విలుప్తప్రాయమై వున్న సనాతనధర్మాన్ని పొగడడంలో యేమీ అర్థం లేదు. ఇదీ కాక అంతటితో తృప్తిపడి వూరుకోవలసిన రోజులు కూడా కావివి. ఏమంటే? దేశంలో యిప్పుడు ప్రచండమైన ధర్మవిప్లవం జరుగుతోంది. ఏది యెలా మారుతుందో, యేది యేమయిపోతుందో లేశమాత్రమూ బోధపడడం లేదు. హైందవధర్మం యొక్క ప్రాతిపదిక అయినా నిలుస్తుందో నిలవదో చెప్పడానికవకాశాలు కనపడడంలేదు. ఎటు చూసినా అంతా గమడగొయ్యిగానూ అల్లకల్లోలంగానూ వుంది. రోజూ స్థితి విషమిస్తోంది; కాని వున్న పాళంగా నైనా వుండడం లేదు.

అంటే వొక ప్రచండశక్తి యిప్పుడీ నూత్నావేశాన్ని యెదురుకోవలసివుంది. ఏళ్ళు గడిచింది కావడంవల్లనూ, సంఖ్యాధిక్యాన్ని పట్టీ, అన్ని తెగల సంస్కారవాదులకూ ప్రతిస్పర్థి కావడంచేతనూ, ఇందుకు సనాతనధర్మపక్షానికే అర్హత వుంది. పూచీ కూడా వుంది.

నిజమే అయితే యేమిటీ చెయ్యడం? ఇప్పుడు సనాతనధర్మవాది నెదురుకుంటూ వున్న సమస్య యిదీ.

“సనాతనధర్మం గొప్పది. శాశ్వతమైనది” అంటే లాభం లేదు. సంస్కారవాదులకు దానిలో దోషాలు కనపడుతున్నాయి. ఆధర్మానికి ఆచరణలో చోటున్నట్లు కనపడడం లేదు. పుస్తకాలలో వున్న సనాతనధర్మానికీ, సనాతనధర్మవాదుల మని చెప్పుకునే వారి నడవడిలో వున్న ధర్మానికీ సంబంధమేం కాదు, పోలిక కూడా లేదు. కాని సనాతనధర్మవాదులు సంస్కారపక్షంవారిని దూషిస్తున్నారు. ఇది మానవసహజమైనా యింతమాత్రాన సనాతనధర్మాన్ని గౌరవించినట్టూ, ప్రేమించినట్టూ, అభిమానించినట్టూ, పూజించినట్టూ, ఆచరించినట్టూ కాదు. “వేదశాస్త్రాలు ఏం చెబుతున్నాయి? మన ప్రవర్తన యెలా వుంది?” అని సనాతనధర్మవాదులు ఆత్మపరీక్ష చేసుకోవాలి. ఖిలమై పోతూ వున్న ధర్మాన్ని మళ్ళీ ఉద్ధరించాలంటే తూచాలు తప్పకుండా దాన్ని అవలంబించే వారివల్లనే ఆపని సాగుతుంది. ఊరికే కబుర్లు చెప్పేవారివల్ల ఏమీ కాదు.

నిజం చెప్పవలసివస్తే సనాతనధర్మవాదులలో ఉన్నంత దోషం సంస్కారవాదులలో కనపడదు. సంస్కారవాదులకు దానిమీద విశ్వాసం లేదు. అంచేత వారిని దాన్ననుసరించి విమర్శించడానికి వీలు లేదు. సనాతనధర్మవాదులు దాన్ని అభిమానిస్తున్నారు. దాన్ని ఆచరణలో పెట్టా లంటున్నారు. దాన్ని మరిచిపోతూ వుండడంవల్లనే దేశం చెడిపోతోందంటున్నారు. కనక దాన్ని అనుసరించవలసిన పూచీ వారికే వుంది.

ఈదృష్టితో చూస్తే నేడు సనాతనధర్మవాదులు పంక్తిబాహ్యులుగా కనపడుతున్నారు. ఎనిమిదేళ్లు రాకుండానే వారు చాలామంది ఆడపిల్లలికి పెళ్ళిళ్ళు చేసేస్తున్నారు. మొగపిల్లలికి వడుగు చెయ్యడానికి అనవసరంగా యుక్తకాలాన్ని గడిపేస్తున్నారు. నిశ్చింతగానూ, నిర్లజ్జంగానూ వరశుల్కాలు పుచ్చుకుంటున్నారు. కొందరు విశంతువుల విషయంలో సహించడానికి వీలు లేని నిర్ణయాలు చేస్తున్నారు. లంచాలు పుచ్చుకుని అకృత్యాలను కప్పిపెడుతున్నారు. తీరికూచుని సంధ్యావందనం విషయంలో కాలాతిక్రమణం చేస్తున్నారు. అగ్నిహోత్రాలను మరిచిపోయారు. వేదవిక్రయం చేస్తున్నారు. తమ కొడుకులను బుద్ధిపూర్వకంగా హూణవిద్యలో ప్రవేశపెడుతున్నారు. కేవలం డబ్బుకోసం అప్రాచ్యులతో సంబంధాలు చేస్తున్నారు. వడ్డీవ్యాపారాలు, కూటసాక్ష్యాలు, కొంపతీతలు, సనాతనధర్మవాదులలో కూడా తక్కువగా లేవు. పైగా వారిలో అనేకులు సాగివుండీ కూడా హూణులతోనూ మ్లేచ్ఛులతోనూ, పగల సమానమూ రాసుకుంటూ తిరగవలసిన ఉద్యోగాలు చేస్తున్నారు. అగమ్యగమనాలు, అభక్ష్యభక్షణాలు, అపేయపానాలు, అభోజ్యభోజనాలు—ఇవి సనాతనధర్మవాదులలో పుష్కలంగా వున్నాయి. వారిజీవితాలలో దయాసత్యశౌచాలను విడిచిపెడుతూ వున్న ఘట్టాలనేకాలుంటున్నాయి. "ఇవి తప్పులు. దిద్దుకోవా" లనే జ్ఞానం కూడా వారిలో అనేకులకు లేదు. ఇలాంటి దోషాలను, సహించరాని యీశాస్త్రాతిక్రమణాలను ఎప్పుడు కావలిస్తే అప్పుడు, ఎక్కడ కావలిస్తే అక్కడ, ఎవరికి కావలిస్తే వారికి ఎన్ని కావాలంటే అన్ని సంస్కారవాదులు చూపించగలరు. రుజువు చెయ్యగలరు.

సనాతనవాదులు ముందీ దోషాలు దిద్దికోవాలి. వర్ణాశ్రమ ధర్మాలను వారు తమ నడతలో చూపించాలి. అప్పుడు గాని వారు ఏంచెప్పడానికీ ఏం చెయ్యడానికీ, సంస్కారవాదులను దూషించడానికీ అర్హులు కారు.

పైగా ఇప్పుడు సనాతనధర్మాన్ని అమలులో పెట్టాలంటే యెలాగ? మన ప్రభువులు విజాతీయులు. వారు మన మతధర్మాల పొంతకి రారు. రావడం వస్తే దిద్దడం వుద్దేశంతోనే వుంటారు. కాగా మన ధర్మానికి రాజావలంబం పోయింది. ఇది యిలా వుండగా హూణవిద్యతో మన దేశీయుల దృక్పథం పూర్తిగా మారిపోయింది. స్మృతులను విప్పి చెప్పే యీ ప్రకారం నడవాలంటే యెవరూ వినరు. ఇటీవల మనుస్మృతిని తగలబెట్టాలని కూడా వొక ఆవేశం బయలుదేరింది. అన్నికులాలవారూ ఎచ్చుతక్కువల నంగీకరించడం లేదు. పంచములుగూడా తిరగబడ్డారు, బ్రాహ్మణుల ఆచార్యత్వాన్ని యెవరూ అంగీకరించడం లేదు. ఇలాగ సనాతనధర్మాన్ని మనవారి మీద విధించడానికి ఏమీ అవకాశాలు కనపడడం లేదు. అసలు విధించే యోగ్యత కలవారే కనపడరు.

మొత్తానికి కిందినుంచి పైకి, యీ వేపునుంచి ఆవేపుకి సనాతన ధర్మవాదులలోనే సంస్కారం ఆవశ్యకంగా కనపడుతోంది; కాని దిద్దుబాటంటే మాత్రం వారిలో యెవరూ నిలబడరు. చెట్టొకపిట్టగా చెదిరిపోతారు.

ఇంత కార్యం ముందు జరగవలసి వుండగా దీన్ని స్మరించకుండా రామయ్యపంతులుగారి వంటి కేవలలౌక్యుల యాజమాన్యం కింద సభలు చేసి, భగవద్గీతా శ్లోకాలు నాలుగు ఏకరువు పెట్టి, శారదాశాసనాదులను రద్దు చేయించాలని, అసెంబ్లీని ఆక్రమించాలని—ఇలాంటి తీర్మానాలు చేస్తే ఏం లాభమూ?

సనాతనధర్మంలో సత్యం వుంది. మానవత్వం లోనుంచి దేవత్వంలోకి మార్చే మహిమ వుంది. సకలమతాలవారికీ—ప్రపంచకాని కంతటికీ సందేశం యివ్వగల సత్తా వుంది. నిజమే; కాని వాటి

మీద భరించరాని కళ్లు చాలా పేరుకుని వుంది. ముందు శస్త్రచికిత్స జరగాలి. ఆకళ్లంతా తొలగించివెయ్యాలి. అప్పుడు గాని అది మన దేశీయులకు ఆకర్షకం కాదు. పూజ్యం కాదు. సేవ్యం కాదు. ప్రాప్యం కాదు.

వెనకటికి అనేకమార్లు యీపని జరుగుతూనే వచ్చింది. మన గ్రంథాలన్నీ ఆపరిణామాన్ని ప్రదర్శిస్తూనే వున్నాయి.

ఇప్పుడేనా ప్రాతిపదికకు భంగం కలిగించని సంస్కారం జరిగించుకుంటేనే అది తక్కుతుంది. లేకపోతే ప్రపంచం అంతటా ఉత్తరంగితం అవుతూవున్న మహాప్రవాహంలో అది బుడుంగు మని మునిగిపోతుంది.

ఇప్పుడంత పని చెయ్యడానికి ఎవరికీ అధికారం లేదంటారా? అట్టి అధికారి యెవరూ లేరంటారా? అయితే మీయిష్టంవచ్చినంత ప్రచారం చేసుకోండి. ఏమీ లాభం లేదు. మీలో వున్న ప్రలోభనాలు మిమ్మల్ని వెక్కిరిస్తూనే వుంటాయి. మీలో వున్న దోషాలు మిమ్మల్ని దిగతీస్తూనే వుంటాయి.

## కాంగ్రెసాంధ్రుడు

జూన్ మాసపు ఆంధ్రభూమి యిలా అడుగుతోంది.

"కాంగ్రెస్సు నడిపిన సత్యాగ్రహ, సహాయనిరాకరణోద్యమములందు పాల్గొని విశేషత్యాగమును చేయుటలో ఆంధ్రులు భారతదేశమందలి ఏరాష్ట్రము వారికిని తీసిపోవలేదు. కాని ఇప్పుడు ఆంధ్రునకు కాంగ్రెస్సులో ఏ మయిన పలుకుబడి కలదా? మొన్న జరిగిన రాంచి సభలోగాని, నిన్న జరిగిన పాట్నా సభలోగాని ఆంధ్రుడు తానొనర్చిన త్యాగమునకు సరిపోవు పలుకుబడిని పొంది వినియోగించినాడా? సత్యమూర్తి రాజగోపాలాచారినామములే పలుసారులు వినిపించినవి; గాని ఒక్క ఆంధ్రనాయకుని నామ మైన ఆమ్రేడితము కాలేదు. కాంగ్రెస్సులో పలుకుబడి సంపాదింప ఆంధ్రునకు కాంక్ష లేదా? శక్తి లేదా?"

కాంగ్రెస్సు పుట్టి యాభై సంవత్సరా లయింది. ఏవోకటి రెండు సంవత్సరాలలో తప్ప ప్రతీ యేడూ కాంగ్రెస్సు సమావేశం జరుగుతూనే వుంది. హిందూదేశంలో వున్న అన్ని పరగణాలవారూ, అన్ని జాతులవారూ, అన్ని భాషలవారూ, అధ్యక్షగౌరవం పొందారు. చివరికి సీమనుంచిన్నీ అధ్యక్షులు వచ్చారు. కొందరు రెండేసి మూడేసి మార్లు ఈ గౌరవం పొందారు; కాని వొక్క ఆంధ్రుడేనా యింతవరకూ అధ్యక్ష పదవి పొందలేదు. రాకరాక వచ్చిన కార్యదర్శిపదవి సైతం వొక్క సంవత్సరంలో యెగిరిపోయింది.

అసలు కాంగ్రెస్సు సమావేశాన్నే ఆంధ్రదేశంలో జరగనివ్వ నని మోతీలాల్ నెహ్రూగారు వ్రతం పట్టారు వొకప్పుడు.

ఏం? "కాంగ్రెస్సులో పలుకుబడి సంపాదింప ఆంధ్రునకు కాంక్ష లేదా? శక్తి లేదా?" ఆంధ్రుడు త్యాగం చెయ్యలేదా? గాంధిగారి పాదాలే గతి అని నమ్మి వుండలేదా?

విశాలమైన భారతదేశంలో కాంగ్రెస్సుని చూసుకుని, కాంగ్రెస్సుని నమ్మి, కాంగ్రెస్సే సర్వమూ అని భ్రాంతిపడి ఆంధ్రు డొక్కడే తన స్వకీయ జాతీయోద్యమాన్ని వూబిలో వూరదొక్కుకున్నాడు. ఆంధ్రు డొక్కడే నవనవ లాడుతూ నన్నే చూసుకోమని విజృంభిస్తూ వున్న తన గ్రంథాలయోద్యమాన్ని చంపుకున్నాడు. ఆంధ్రు డొక్కడే తన భాషని, తన వాఙ్మయాన్ని దిగతుడిచివేసుకున్నాడు. ఆంధ్రు డొక్కడే స్వరూపనాశం అయినాడు.

కాని ఇంత చేసినా ఆంధ్రుడు కాంగ్రెస్సు వలయంలో నాయకుడు కాడు. సలహాదారయినా కాడు. స్వతంత్రుడు కూడా కాడు. కేవలమూ అనుచరుడు, భృత్యుడు. అంతే.

ఈస్థితిలో కాంగ్రెస్సులో ఆంధ్రుడికి గౌరవం యెలా వుంటుంది? అధ్యక్షపదవి యెలా వస్తుంది?

ప్రముఖులలో స్థానం యెలా లభిస్తుందీ? కనకనే అధ్యక్షపదవి రాకపోవడమే కాదు పార్లమెంటరీ బోర్డులో నేనా సభ్యత రాలేదు. తెనుగుదేశం మీద రాజగోపాలాచారిగారు సర్వాధికారులైనారు.

ఇలాంటిది ఆంధ్రుడికి పరమావధి సంపూర్ణ స్వరాజ్యం. ధిక్ !

పోనీ, ఆంధ్రుని సత్తా యింత మాత్రమే కాబోలు నేమో అంటే అలా కాదు ఏమంటే? లిబరల్ పక్షంలో ఆంధ్రుడు సమున్నత శిఖరంమీద వున్నాడు. జస్టిసుపక్షంలో ఆంధ్రుడు సర్వాధికారిగా వున్నాడు. ఆయుర్వేదోద్యమంలో కూడా ఆంధ్రుడికి అత్యున్నతపదవి లభించింది. చివరికి కార్మికపక్షంలో గూడా ఆంధ్రుడు ప్రధాన నాయకుడు.

చివరికి తేలిం దేమిటీ? కాంగ్రెస్సులో వున్న ఆంధ్రునిలో ఆంధ్రత్వం లేదు. లేదా సత్తా గల ఆంధ్రు లెవరూ కాంగ్రెస్సులో లేరు. ఇంతే.

## మొగ్గు ఎప్పుడూ అటే

కాంగ్రెస్సు, బొంబాయి సమావేశంలో ప్రధానమంత్రి చేసిన సాంఘిక పరిష్కారాన్ని (కమ్యూనల్ అవార్డు) అంగీకరించా లేకపోయింది. తిరస్కరించా లేకపోయింది.

అంగీకరిస్తే జాతీయతకి భంగం వస్తుందిట. తిరస్కరిస్తే మాహమ్మదీయులు తొలిగిపోతారుట. అంచేత దాన్ని గురించి యేమీ చెప్పదుట. శ్వేతపత్రాన్ని మాత్రం అది నిర్మొగమాటంగా—నిష్కర్షగా తిరస్కరించేస్తుందిట.

కాంగ్రెస్సు పత్రికలు యీ నిర్ణయాన్ని అపూర్వమూ, అనన్యసాధ్యమూ అని పొగడుతున్నాయి. ఢిల్లో రాజనీతి అంతా ఘనీభవించి వుందిట.

ఆ రాజనీతిమాట దేవు డెరుగును; కాని కొండంత గొప్పదీ, ఏళ్లు గడిపిందీ, పూచీ కలదీ, అద్భుతమైన త్యాగం చేసిందీ అనిపించుకునే కాంగ్రెస్సు ప్రధానమైన వొక వ్యాసఘట్టం తటస్థించిన ప్పుడు నీళ్లు నమిలింది. వెనక శారదాబిల్లు సందర్భంలో గూడా అది యిలాంటి పెడదారే తొక్కింది.

అయితే అయింది, పోనీ కాంగ్రెస్సు వెల్లడిస్తూ వున్న తృప్తికి యేమైనా అర్థం వుందా అంటే— నిజంగా కాంగ్రెస్సుయొక్క పరమావధి జాతీయతే అయితే అది యిప్పుడే పూర్తిగా నాశనమైపోయింది. ఏమంటే? మాహమ్మదీయులు తమకే సౌకర్యాలు కావా లని ప్రతిపాదించారో, వేటిలో వొక్క అక్షర మేనా తగ్గడానికి వీలు లేదని పట్టు పట్టారో అవన్ని మనం అంగీకరించాము. దీనివల్ల మనకీ, సిక్కులకీ కలిగే అపాయాన్ని వారు తొలగించబూనుకో లేదు. ఇలాగ వొక తెగవారికి కొండంత లాభమూ, వొకటి రెండు తెగలవారికి సముద్ర మంత నష్టమూ కలిగించే తీర్మానం చేసి "మేము జాతీయతని కాపాడా" మంటే అర్థం యేమిటి?

వాస్తవంగా యిప్పుడే జాతీయతకి భంగం కలిగింది. మాహమ్మదీయులు తొలగిపోతే జాతీయతకి భంగం కలగనే కలగదు. అప్పుడు పైవారు "అది హిందువుల సంస్థ అంటే అనవచ్చు; గాని దాని పరమావధి జాతీయత కాదనడానికి వీలు లేదు.

పోనీ యిప్పు డేనా మాహమ్మదీయులు కాంగ్రెస్సు వలయంలోకి వస్తారా అంటే అది యెప్పుడూ కొనసాగదు. వారు మనచేత తమకు కావలసిన హక్కు లన్నీ వొప్పించుకోడానికే చూస్తున్నారు; గాని మనతో కలిసిమెలిసి వుండడానికి కాదు. ఈప్రయోజనం వారికి కాంగ్రెస్సులో కొద్దిమందీ, పైని చాలా మందీ వుంటేనే నెరవేరుతుంది. దీనివల్ల "అపాయం మాత్రమే కలిగించే సిద్ధాంతాలూ, కార్యక్రమాలూ చూపించే గాంధిగారిని వారు అనుసరించ" రనే మెహానతు కూడా వారికి తక్కుతుంది.

ఇదంతా గమనించే ఆణే, మాళవ్యాగార్లు కాంగ్రెసులో నుంచి వెళ్లిపోతా మన్నారు. దీనితో

కాంగ్రెసు నిశ్చయంలో వుండే అనర్థాన్ని చాలా మంది గుర్తించారు. కాని కాంగ్రెస్సు వారికి పచ్చివెలక్కాయ గొంతుకపడ్డట్టయింది. ఈరాజీనామాలు ఎంత త్వరగా రద్దయిపోతే వారి కంత మంచిది. లేకపోతే యీ రహస్యం దేశం అంతటా వెల్లడి అయిపోతుంది. అందుకోసం వారు గాంధిగారి నాశ్రయించారు.

గాంధిగారి వశీకరణశక్తి గొప్పదా, మాళవ్యా గారి మొగమోటం పెద్దదా అనేది చాలా పెద్ద సమస్య; కాని దాన్ని చర్చించడాని కిది కాదు స్థలం. చివరికి మాళవ్యాగారు తమ రాజీనామాన్ని ఉపసంహరించుకున్నారు. వారు ఈసందర్భంలో చాలా — వెక్కి వెక్కి దుఃఖించారుట కూడానూ. దానితో ఆణేగారు కూడా తమ రాజీనామాని ఉప సంహరించేసుకున్నారు. కానైతే వారిద్దరూ "మే మింకా కాంగ్రెస్సు నిశ్చయాన్ని పూర్తిగా శిరసా వహించలేదు; కాని" అన్నారు గాని—యెం దుకు లెండి.

కాంగ్రెస్సువారు మళ్లీ స్థిమితపడ్డారు. ఈగండం తప్పించినందుకు గాంధిగారికి ధన్యవాదాలు సమర్పించారు. కాంగ్రెస్సు పత్రికలు "గాంధిగారి వశీకరణశక్తి అసాధారణం, అలౌకికం, అనన్య లభ్యం" అని పొగిడాయి.

అయితే: గాంధిగారి వశీకరణశక్తి అలాంటి— అలాంటి మహామహా యిదైనదే అయితే అది, మాహమ్మదీయుల దగ్గిర యేమీ పని చెయ్యలేక పోతోందేం!

కావలసింది కాస్తా అయిపోయింది. ప్రధాన మంత్రి చేసిన సాంఘికపరిష్కారమే స్థిరపడింది. మాహమ్మదీయులను చేపట్టడం ద్వారా కాంగ్రెస్సుకి బలం కలిగిస్తే తరవాత వారిని (మాహమ్మదీయులను) వప్పజెప్పవచ్చు నని కాంగ్రెస్సు హిందువుల అభిప్రాయమేమో—అది యెప్పుడూ కొనసాగదు. ఎప్పుడీ ప్రయత్నం జరిగితే అప్పుడే వారు మారంగా వుంటామంటారు. ఇంతవరకూ వారి పేరాసలను తగ్గించలేనివారు, ప్రధానమంత్రి దాకా వెళ్లకుండా యీవిషయం పరిష్కరించుకోలేనివారు, మహామంత్రి పరిష్కారాన్ని బాహాటంగా తిరస్కరించలేనివారు, తుద కీవిధంగా దానికి తల ఒగ్గినవారు "చూడు యిక ముందేం చేస్తామో" అంటే ఆమాటని నమ్మే వారిది పొరపాటు గాని అనేవారిది కాదు.

ఇలాగ గాంధిగారి నిర్ణయం యెప్పుడూ మాహమ్మదీయులకే అనుకూలంగా వుంటోంది; గాని మనకి కాదు. జాతీయతకి అసలే కాదు.

# స్వీకారము

## ౧౬. స్వదేశసంస్థానాలు

ఇది ౧౦౬ పుటల గ్రంథం. క్రౌన్ సైజు. ఆంటిక్కు కాగితాలు. చక్కని అచ్చు వెల ౦-౮-౦. గ్రంథకర్త నార్ల వేంకటేశ్వరరావుగారు. ఇది కావలసినవారు "నార్లవారు" కవుతరం, కృష్ణా జిల్లా అని రాసుకోవాలి.

పుస్తకం చిన్నదే; గాని వొక పెద్ద రత్నం అని చెప్పవచ్చు. ఆధునికాంధ్ర వాఙ్మయాని కిది అమూల్యమూ, అపూర్వమూ అయిన ఆభరణం. ఈపుస్తకం చదివినవారు నిజంగా ఉలికిపడకుండానూ, సిగ్గుపడకుండానూ, జలదరించుకోకుండానూ, క్రోధమూర్తులు కాకుండానూ, గగ్గోలు పడకుండానూ—చివరికి ఏడవకుండానూ ఉండలేరు. హృదయమేమో యీపుస్తకం చదవకూడదని చెబుతుంది; గాని విషయవివరణపద్ధతీ, శైలీ ఆపని చెయ్యనియ్యవు. తెనుగువారిలో, తమ

ప్రస్తుతస్థితికి విచారమూ, బాగుపడాలనే ఆవేదనా, సంఘసంస్కారం విషయంలో పట్టుదలా కలగాలంటే యిలాంటి పుస్తకాలే యిప్పుడు కావాలి. కనక తెనుగువారు, వేంకటేశ్వరరావుగారు ఇలాంటి యీ గ్రంథం రాసి ప్రకటించినందుకు సంబరపడుతూ వారికి తమ కృతజ్ఞతను తెలుపుకోవలసి వుంది.

## ౧౭ చంద్రిక లోన్‌స్క్వేర్ మదరాసు

ఇది ఆనందముద్రాక్షరశాలాధిపతులు ఆర్. వేంకటేశ్వర్ అండు కంపెనీవారిచే ప్రకటించబడుతూ వున్న సచిత్రమాసపత్రిక. సంపాదకులు వి.ఏ. కేషబ్‌చంద్రగారు. డబుల్‌క్రౌను సైజున ౮౦ పుటలు గలది. గ్లేజు కాగితాలు. ప్రతీ సంచికలోనూ రంగుల చిత్రం వొకటీ, సాధారణచిత్రాలనేకాలూ ప్రకటించబడుతున్నాయి. సంవత్సర చందా ౪-౦-౦.

ఆనందముద్రాక్షరశాలా, వేంకటేశ్వర కంపెనీ—యీరెండూ తెనుగువారిలో అక్షరాస్యులకందరికీ తెలిసినవే. వీరు ప్రకటించిన ఆంధ్రమహాభారతమూ, ఆంధ్రమహాభాగవతమూ, మనుచరిత్రా మొదలైన గ్రంథాలన్నీ సర్వాంగసుందరాలు కావడంవల్ల దేశంలో మంచి ఆదరణ పొందుతున్నాయి. ఇలాంటి ఈకంపెనీవారే యీపత్రిక ప్రకటిస్తారంటే ఇదికూడా వాటిలాగే సర్వాంగసుందరంగా వుంటుందని ఆశపడ్డాము; కాని ఆకృతి ముచ్చటగానే వున్నా, గ్రంథం నాలుగు రూపాయల చందాకు గాని, ప్రకాశకుల పేరుప్రతిష్ఠలకు గాని అనురూపంగా లేదు.

పత్రికాసంపాదకు లందరూ మాలాగే పద్యవాఙ్మయానికి తమ పత్రికల్లో చోటివ్వకుండా వుంటారని మే మెప్పుడూ అనుకోడం లేదు; కాని చంద్రిక స్వీకరించిన పద్యవ్యాసాలలో అనేకాలు చిల్లరపత్రికలుగూడా ప్రకటించ తగ్గివిగా లేవు. వాటిలో నవీనకవిత్వమూ లేదు, ప్రాచీనకవిత్వమూ లేదు. వాటి విషయంలో చంద్రికా సంపాదకులు తమ ధర్మం తప్పారని చెప్పక తప్పదు.

వచన వ్యాసాలలో గూడా గుణవత్తరాలు తక్కువే. ఇలాంటి పత్రికలు వాఙ్మయానికి పుష్టి కలిగించని రచనలను ప్రకటించడం చాలా సాహసమైన పని. ఈకాలంలో గూడా సమస్యాపూర్తులు ప్రకటించడం వింతగా వుంది. "వార్తలు—విశేషములు" వీటిలో కొన్ని దినపత్రికలకు గూడా అనవసరాలున్నవి. హాహాహాహాలు చంద్రిక గౌరవానికి పూర్తిగా భంగకరాలు.

ఇలాంటి స్వల్పవిషయాలు ప్రకటించడానికి యింత పెద్దయెత్తున పత్రికలు నడపనక్కరలేదు. ప్రకాశకులు ఈపత్రికద్వారా వొక వున్నతఫలాన్ని సాధించదలచితే ఆసాధనా ప్రణాలిక యింతవరకేమీ కనపడ్డం లేదు. ప్రకాశకులు ధనికులు. అనేక పరికరాలు పుష్కలంగా కలవారు. పైగా సాహసవంతులు. ద్రవ్యం సంపాదించాలనే సంకల్పం యీసందర్భంలో వారికి కలదని మేమే కాదు ఎవ్వరూ చెప్పలేరు; గాని చేసే ఖర్చుకు సద్వినియోగం వుండాలి. ప్రయత్నానికి విశిష్టమైన ప్రాప్యం వుండాలి. కార్యక్రమంలో ఔదార్యమూ, వున్నతాశయమూ వుండాలి. ఇంతవరకూ ప్రకటించబడ్డ నాలుగు సంచికలూ కూడా దీని పేరుకైనా తగినట్టున్నాయని చెప్పలేము.

ప్రకాశకులు సంగతు లన్నీ యోచించి తమ గ్రంథాలలాగే చంద్రికను గూడా రసికసేవ్యంగా వుండేటట్టు చేస్తారని నమ్ముతున్నాము.



# ప్రబుద్ధాంధ్ర

కళాభివర్ధనీపరిషత్తుపక్షమున ప్రకటింపబడు మాసపత్రిక

సంపాదకుడు:—శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

సంపుటము ౫ } రాజమహేంద్రవరము ఆగస్టు ౧౯౩౪ { సంచిక ౪

## కాళిదాసుని అపకీర్తి

విశ్వనాథ సత్యనారాయణగారు ఎం. ఏ



నైమిత్తికప్రళయం అయిపోవటంతోనే నూతన బ్రహ్మనిశ్వాసాలు బయలుదేరినై. ధర్మదేవత తన మూర్తి తాను చూచుకుంది. నిత్యమై సహజమైన తన సృష్టిని ఒక కాలంలో మూర్ఖులు గ్రథితమనుకొంటారని తలచింది. ఆభావంలో స్వకీయతేజోవికారమయినదిన్నీ భావిస్యత్కమయినదిన్నీ అయిన కవితామూర్తి మీద ఆమె మనస్సు పారింది. ఆమూర్తి తన చుట్టూ ఒక దివ్యతేజస్సు ఒక దివ్యలోకము కల్పించుకుంది. ఆలోకంలో ఒక తేజోరాశి భాసించాడు. ఆయన కాళిదాసు. అతని వాక్కులోనుండి యొక యశోరేఖ బయలుదేరి మూడులోకాలని తన శుభ్రజ్యోత్స్నలో ముంచియెత్తుతోంది. ధర్మదేవత పరకాయించి చూచింది. అంతటి ప్రభారాశిలో ఒక నువ్వుగింజంత నలుపు కనిపించింది. దాని మూర్తి ఏకదేశమందు ఏకకాలమందే కనిపించింది.

బ్రహ్మనిశ్వాసాలు సుళ్లుతిరిగి ఋక్కులైనాయి. యజుస్సులైనాయి, సామలైనాయి.

త్రేతాదిలో వాల్మీకిఋషి ముఖకమలంలోనుండి నూతనచ్ఛందోఽవతారం కలిగింది. నిత్యమైన తన నిశ్వాసాల్లో కొంత సారూప్యం తెచ్చుకొన్న యీ మనుష్యులలో ప్రథమమైన శబ్దబ్రహ్మ వివర్తాన్ని చూస్తే బ్రహ్మకి మళ్ళీ కాళిదాసుని యశోమూర్తి జ్ఞాపకం వచ్చింది. బ్రహ్మవాల్మీకుల అర్ధమైన చక్షుస్సులు రెండూ పరిశీలించినై. ఆ నల్లని మచ్చ అల్లాగే వుంది.

సమమధురోపనతార్థవాక్యబద్ధమైన రామచరితం సాగింది.

ద్వాపరాంతంలో వ్యాసులు అవతరించారు. ఆయన రచనలకి అంతూ పంతూ లేకపోయింది. వేదాలు విభాగించాడు. పద్ధెనిమిది పురాణాలు వ్రాశాడు. బ్రహ్మసూత్రాలు వ్రాశాడు. భారతం కావ్యం కట్టాడు. ఇంత చేసీ తన కవితాశక్తి యసంపూర్ణమనుకొని భవిష్యత్తులో చూశాడు. మహాకవి కాళిదాసు గోచరించాడు. ఆయన యశస్సు త్రిలోకాలల్లో త్రికాలాలల్లో దేదీప్యమానంగా వెలిగిపోతూంది. కాని ఏదో యొక చిన్న మచ్చ మాత్రం కనిపిస్తునే వుంది.

పుడతాడు పుడతాడు అనుకొన్న మహాకవి కలిప్రవేశించిన మూడువేల యేళ్లకు గాని పుట్టలేదు. ఆ

ప్రభువు పుట్టటంతోటే వ్యంగ్యలోకాల్లో ధ్వనిలోకాల్లో మోట్పాయితాలు కలిగినై.

ఆకవి పుట్టిన అగ్రహారంలో ఇంధనాలకి యజుస్సులు వచ్చు. వాసాలకి సామలు వచ్చు. గోడలకూ దూలాలకూ తర్కం వచ్చు. ఇళ్లల్లో ఈగలకు ధర్మశాస్త్రాలు తెలుసు. రజ్జువులకు వేదాంతాలు తెలుసు.

శిల్పమన్న పేరు పెట్టుకొని కవిత్వం ధర్మోల్లంఘన చేయలే దప్పటి కింకా. ఆరు శాస్త్రాలు చదివినా నాల్గు వేదాలు చదివినా ఆచరించినా ఋగ్యజుస్సామలకు కదిలే శిరస్సులు కాళిదాసు ఋతుసంహారశ్లోకాలకు కదలలేదు, సరికదా కదులుతై అని కూడ అనిపించలేదు. కుమారసంభవం వచ్చింది. కాశ్మీరంలో పరిషత్తులు పులకరించినై. దక్షిణాపథంలో పంచవన్నెల చిలకలు కంఠతా పట్టినై. రసప్రపంచకాలల్లో రాపి శ్యైన్యాపై పింపిళ్లు కూసినై.

కాని అగ్రహారం తొణకలేదు. బెణకలేదు.

మేఘదూతం వచ్చింది. అదివరకు దారి తెన్ను తెలియని మొగిలు బండ్లు సుఖంగా దారి తెలుసుక బయలుదేరారు. దాని దివ్యసంచారాలకు దిఙ్నాగులు తొలగి దారి యిచ్చారు. మధురభారతి ఒయ్యారాలు పోయి సిగ్గు లొలికించుకుంది. ఆసేతుసీతాచలం రసమేఘం రంగురంగుల నడకలు నడచి, సమార్ద్రము కాని క్షేత్రమే లేకపోయింది.

కాని అగ్రహారంమీద బొట్టు పడలేదు. వానవసుందనైనా ఒక్క దర్దుర మండే ఒక్క దర్దురమైనా కూసిందా? కూయలేదు. రఘువంశం వచ్చింది. అది వరకల్లా నేను కావ్యాన్ని నేను కావ్యాన్ని అన్న సంస్కృతరామాయణం బ్రహ్మసూత్రాలకి మల్లే ఉపనిషత్తులకి మల్లే వశిష్ఠులు రామచంద్రులకు దోవ యిచ్చినట్లు యిచ్చింది.

మహాకవి విక్రమార్కుని సభలో అర్ధసింహాసనారూఢు డైనాడు. మాళవిక నృత్యం చేసింది. చేసే ఆవిడ శరీరావయవా లన్నీ నక్షత్రాలల్లే మెరిసినై. మహాకవికి పాతికేళ్లు నిండలేదు. ఆయన ముగ్ధభావంలో మాళవిక సర్వావయవసుందరి అయింది. భానుని యాత్మ అనుకుంది. "ఇతను పుట్టాడు. నాకు త్రవ్వి బయటకు తియ్యాలసిన యవస్థ పట్టిస్తాడు."

రాజాంతఃపురము తెరల చాటున కిలకిలా నవ్వింది. విక్రమార్కుడు చతురాంతఃపురవధూప్రసాదనరసికు డైనాడు.

మహాకవి బంగారుసేలువవాడు, సింహాతలాటాల మురుగులవాడు. రత్నహారములవాడు, బోయీలు మోచిన పల్లకీ మీద నగ్రహారము చూడబోయినాడు.

అగ్రహారము నిత్యకర్మలయందు నిమగ్నమై యున్నది. మహాకవి వైభవమునకు అగ్రహారము నిక్కిఅకూడ భజించలేదు.

కవి ప్రౌఢు డైనాడు. అతని కూర్వశి కనిపించినది. ఆమె సౌందర్య మంతయు నామె యురోజకాఠిన్యమునందే కనిపించినది. ఆమె వియోగకటునిశ్వాసాలవల్ల ఆమె రొమ్ముగొమ్మ లేచుచు పడుచు నున్నది. కాళిదాసుకి సౌందర్యపిసాసచేత నున్మాద మెక్కింది. ఏమి యున్మాదము? ఉన్మాదావస్థలో నాట్యము నృత్యమైనది.

ధ్వనిలోకాలలో పరిణామము చాల లేదు. రసవీధులలో విస్తృతి పట్టలేదు.

మహాకవి తన జన్మస్థల మైన యగ్రహారమువంక దిరిగి చూడలేదు. అగ్రహారము మహాకవికి వందిమాగధప్రాయ మైన లోకమును అపగతబుద్ధి యన్నది. ఖద్యోతుని లింగభేదము తోడి మెరుగుడుపురు వన్నది.

మహాకవి కేబదియేళ్ళు వచ్చినై. కవి శకుంతలారూపమును ధ్యానించాడు. భాషాదేవివంక చూచాడు ఆమె తన శబ్దస్వరూపాన్ని కుంచించుకు వచ్చింది. ఆమె శరీరము చుట్టును కనపడీ కనపడని

జ్యోతిస్సులు వెలిగినై. ఆయన మూర్తి శబ్దాన్ని దాటి వ్యంగ్యాన్ని దాటి ధ్వనిని దాటి, రసాన్ని దాటి యానందవీథుల్లో భాసాభాస మైన బ్రహ్మ పదార్థ మల్లే గోచరించింది. ప్రభువు శకుంతలను చూచాడు. ముగ్ధ యైన మాళవికలో మల్లే ఆమె యందు ప్రత్యయవయవశోభ చూడలేము. ప్రౌఢ యైన యూర్వశియందు మల్లే వక్షోజకాఠిన్యం చూడలేము. సర్వసంసారముయొక్క సారము భావ మొకటీ యామె కన్నులయందు చూశాడు. ఆమె స్త్రీగా లేదు. అఖండ మైన పుణ్యముల ఫలముగా మాత్రమే గోచరించింది.

దానితో వేదాలకు పారుష్యం పోయింది. ఉపనిషత్తులలో క్లిష్టత్వం తగ్గింది. ఋక్ఛందస్సులు వచ్చి ఆర్యలతో చేతోడుగా వాదోడుగా మెలగినై.

ఆనందబాష్పములు కురిసినై.

సాత్త్వికోదయం నిత్య మైనవిషయం అయింది.

అగ్రహారం యథావిధి తన కర్మలు తాను చేసుకుంది. సులభంగా సాధించే ఆనందాన్ని బహుజన్మలచేత సాధిస్తానంది.

కాళిదాసు దివ్యశరీరంతో వాఙ్మయలోకాల్లో తిరుగుతున్నాడు. మూడు లోకాల్లో మూడుకాలాల్లో అతని కీర్తి తెల్లగా వెలుగుతోంది, మచ్చ వాడిపోయింది. కాని అక్కడే వుంది. అది అగ్రహారమల్లే చాయగా కనిపించింది. అగ్నిహోత్రపు పొగ లేశ మల్లే అల్లా అల్లా తోచింది. ఈర్ష్యాగ్రస్తమై అవిచారమై మూఢమై అరసజ్జ మైన బుద్ధికి మల్లే కళావిహీనమై కనిపించింది.

జగన్నాథు డైన కాళిదాసు ఆత్మ బ్రహ్మరథ మెక్కి తిరుగుతోంది.

బ్రహ్మ, వాల్మీకి, వ్యాసుడు, కాళిదాసు నలువురు నాల్గు యుగాలకు వాఙ్మయలోకాలకు బ్రహ్మలైనారు. భవభూతి వారున్నయెడకు వెళ్లాడు. వాల్మీకి కాళిదాసులు తమలో ఆయన్ని కలుపుకున్నారు.

మూడు లోకాలమీదా నాల్గు యుగాలు మళ్లీ తిరిగినై. మళ్ళీ తిరిగినై. వెలుగుతో నిండిపోయినై లోకాలు కాలాలు. మచ్చ మచ్చగానే వుంది.

ఓం. తత్సత్

---

# అదృష్టమంటే?

భావరాజు వేంకటకృష్ణరావుగారు. బి. ఏ., బి. ఎల్

ఇది జరిగి నూటముప్ఫయ్యేండ్లు అయింది. అది సిద్ధార్థి సంవత్సరము. టిప్పుసుల్తానును జయించడానికి జనరలు హారిసు బందరునుంచి యింగ్లీషు సైన్యం తోడుపంపవలసిన దని మార్టినుదొరకు తాఖీదు పంపినాడు. పదిహేను వందల మంది సోల్జరు, నాలుగువేల మంది సిఫాయీలు గల పెద్ద పటాలం యిరవై ఫిరంగులతో బయిలుదేరింది. ఈదండుకు భోజనపదార్థములు, మందుగుండు సామానులు, ఫిరంగులు, తుపాకులు తర్లించుకొని వెళ్లడానికి మామూలు పరివారం చాలింది కాదు. బందరుకోట గవర్నరు చుట్టుప్రక్కల గ్రామాలకు జనంకోసం కబురులు పంపించి, దండోరా కొట్టించినాడు.

సుంకర గురవయ్య శ్రేష్ఠి ఆరోజులలో బందరుకోటలో కాపురమున్న పెద్దవర్తకులలో గొప్పవాడు. ఆతడు యింగ్లీషువారికి దుబాసి.

ఆతడు బరాతం పంపిస్తే హైదరాబాదు వర్తకులు, చెన్నపట్నం వర్తకులు, కలకత్తా వర్తకులు కూడా కన్నుల నద్దుకొని లక్షలకొద్దీ రూపాయీలు చెల్లించేవారు. ఇంగ్లీషువారికి ఏదైనా అవసరం వస్తే ఆతని సలహా లేనిదే బందరుకోట గవర్నరు ఏపనీ చేసేవాడు కాదు!

గురవయ్యశ్రేష్ఠికి కార్యకర్త రావిపాటి బ్రహ్మన్న. ఆయన జటాంతస్వాధ్యాయి. జ్యోతిష్కుడు. కవి. రసజ్ఞుడు. బందరు పరగణాలో కాదుగదా చెన్నపట్నంలో నైనా యింగ్లీషు వ్రాయడంలో ఆయనంతటి ముసద్దీ లేడని ఆరోజులలో ఆయనచాలా ప్రఖ్యాతి సంపాదించాడు. బ్రహ్మన్న వ్రాసిన నివేదికలు, అర్జీలు మొదలయినవి యిప్పటికీ చెన్నపట్నం సెయింటుజార్జి కోటలో కనబడతాయి.

బ్రహ్మన్న సేవకుడు నాగన్న. నాగన్న అంటే బ్రహ్మన్నకు యింత అంతా అభిమానం అని వర్ణించడానికి అలవి గాదు—పుత్రప్రేమ.

“ఒరే నాగన్నా! నీవు ఒకనాడు చాలా అదృష్టవంతుడవు అవుతావురా” అని అంటూవుండేవాడు బ్రహ్మన్న పంతులు.

“చిత్తం! చిత్తం! దేవర చల్లగా ఉండి, దేవర కటాక్షం మాకు పూర్తిగా ఉంటే, అంతే శాన, సామీ” అని అంటూ వుండేవాడు నాగన్న.

ఇంగ్లీషువారి పటాలమునకు భోజనసామగ్రి మొదలయినవి సరఫరా చేయించాలని సుంకర గురవయ్యశ్రేష్ఠికి వర్తమానం వచ్చింది. ఇదెంత పని అని, బ్రహ్మన్నతో ఆలోచించినాడు.

ఆరోజులలో రైళ్లు లేవు. మహాపథాలు మంచి స్థితిలో వున్నా బళ్లమీద సామానులు తర్లించుకొని వెళ్లడం బహు ప్రయాసకరంగా ఉండేది. ఏళ్లూ, నదులు, కొండలు గుట్టలు దాటి బండ్లు వెళ్లలేక పోయేవి. కాబట్టి సామగ్రి బండ్లమీద వెళ్లే ఉపాయం లేదు. ఆరోజులలో లంబాడీల గిత్తలను గుత్తకు తీసుకొని వాటిపైన సరుకులు వేసుకొని వర్తకులు వెళ్లుతూ ఉండేవారు. నల్లమల, ఎర్రమల కొండలలో పుట్టి, పెరిగి తిరగడం అలవాటు అవడంచేత లంబాడీగిత్తలు, కొండలు గుట్టలు సులభంగా ఎక్కి వడిగా నడవగలవు. ఏళ్లూ, ఏళ్లూ అన్నా వాటికి భయం లేదు.

గురవయ్యశ్రేష్ఠికి పైనుంచి అంటే—అటు హైదరాబాదు, నల్లగొండ, ఓరుగల్లు, జగ్గయ్యపేట, బెజవాడలనుంచి, వచ్చే సరకు లన్నీ యిజారాదార్లు లంబాడీగిత్తలమీదనే వేసుకొని పట్టుకొని వస్తూ ఉండేవారు. అప్పుడప్పుడు అటు విశాఖపట్నం, నాగపురం, కటకంనుంచీ యిటు నెల్లూరు, బళ్లారి, గుత్తి, మైసూరు మొదలయిన పట్నాలనుంచి కూడా సరకులు యీ లంబాడీగిత్తలమీదనే మోయించుకొని వచ్చేవారు.

వానలు వెనుకపట్టి, శీతాకాలం జొరబడేటప్పుడు లంబాడీల దండు గిత్తలను దీసుకొని బయిలుదేరదు. కాని వర్షాకాలం గడవకుండా యింగ్లీషువారి పటాలానికి ప్రయాణం తగిలింది. సామగ్రి తర్లించడానికి పెద్ద సిబ్బంది కావలసివచ్చింది.

బ్రహ్మన్న అపుడు ఆలోచన చెప్పినాడు. దీవిలో లంబాడీల దండు ఒకటి విడిసి ఉన్నది. దానికి వెంటనే కబురు సంపమన్నాడు. కాని ఆలంబాడీలు వర్షాకాలం గడిసేనే కాని కాలు కదప మన్నారు. పోనీ మీలంబాడీగిత్తలను మాకు తోలిపెట్టండి ఖరీదు ఇస్తామన్నాడు బ్రహ్మన్న. పదిహేను వందల గిత్తలు, మూడువేల వరహాలకు బేరం నిర్ణయించుకొని పైకానికి బరాతం యిచ్చి గిత్తలను తోలుకొని వచ్చారు.

పప్పూ, ఉప్పూ, బెల్లం, బియ్యం, బట్టలు, తుపాకులు, మందుగుండు మొదలయిన సామగ్రి అంతా గిత్తలపైన సంచులు కట్టి యెక్కించినారు. కొన్ని పెద్ద గిత్తలను ఏరి వాటికి ఫిరంగులు కట్టినారు.

చాకళ్లను, మంగళ్లను, మాలమాదిగలను జీతాలిచ్చి రప్పించారు పరివారంలోకి. సిబ్బంది, గిత్తలదండు కదిలింది. దానికి నాగన్న నాయకుడైనాడు. ముందు పటాలము, వెనుక నాగన్న గిత్తల దండు నడిచాయి.

* * * *

టిప్పూసుల్తానుతోడి యుద్ధం రెండేండ్లు సాగింది. నాగన్న అతని గిత్తలు పరివారం కూడా సిపాయీలతో పాటు విరిగి సున్నమైనారు. పదిహేనువందల గిత్తలకు చివరకు నాలుగువందల గిత్తలు మాత్రం నిలిచాయి. గురవయ్యశ్రేష్ఠికి ఈ వ్యాపారంలో మొత్తంమీద పాతిక వేల వరహాలు నికరపు లాభం వచ్చింది. గిత్తలు చాలాభాగం నశించిపోయినాయి అని వర్తమానం వచ్చినపుడు ఆయన "పోనిలే మానాగన్నకు క్షేమమా? యిప్పుడెక్కడున్నాడు? ఇంటికెప్పుడు వస్తాడు" అని ఆదరంతో అడిగినాడు.

యుద్ధం ముగిసింది. టిప్పూ యుద్ధం చేస్తూ కత్తి చేతిలో ఉంటూ ఉండగా ప్రాణాలు విడిచి వీరస్వర్గం జూఱగొన్నాడు. ఆంగ్లేయులను జయలక్ష్మి యుద్ధరంగములోనికి ఎదురువచ్చి వరించింది. ఆంగ్లేయులను ఎదిరించే మొనగాడు అంతరించినాడు. ఆతని శ్రీరంగపట్నం వల్లకాడుగా మారిపోయింది. ఒక నెలక్రితం లక్ష్మి కలకలలాడుతూ నృత్యం చేసిన చోటు కాలవశమున గ్రద్దలకు రాబందులకు నిలయమైపోయింది.

దుర్గంధం కొట్టుతూ పాడువారి ఉన్న ఆపట్నం లోనికి మానవు డెవడూ ప్రాణాలతో వెళ్ళి రాలేక పోయేవాడు. ఆట్టి మస్థితిలో వున్నా, భయపడి పారిపోయిన భాగ్యవంతుల యిండ్లు దోచుకోవడానికి ముష్కరులు వెనుదీయడం లేదు. చేతి కందిన దాని నల్లా సోల్లజ్ఞు. సిపాయీలు యిదివరకే కొల్లగొట్టుకొనిపోయినారు. కోట, పేట, అంతా యిపుడు పాడువారి ఉన్నది. వర్షాలు బాగా కురియడంచేత ఒక నెలరోజులకు, కుళ్ళిపోయిన చెత్త, శవాలు మొదలయిన వన్ని కొట్టుకొనిపోయి కావేరిలో కలసిపోయినవి. పాడువారిన ఆమహానగరం లో యిటికరాళ్ళు తప్ప యేమీ దొరకపోయినా ఆశవున్న మానవు లెందరు సమయంలేకుండా పగలంతా అక్కడే వెదకుకుంటూ మసలుతూ ఉండే వారు.

శ్రీరంగపట్నం చూద్దామని మన నాగన్నకు కూడా కోరిక పుట్టింది. ఒకనాడు కోటలో తిరుగుతున్న అదృష్టవంతులకు మారుమూలలను యింటి గోడలసందులలో వున్న రహస్యపు అరలలో వరహాల సంచులు, రత్నాలు దొరికిన వని విన్నాడు. ఆమాట విన్నప్పటినుంచి అతనికి కూడా ఆశ ఎక్కువ అయింది. పొద్దుట బయలుదేరి కోటలో ప్రవేశించాడు. పగలంతా అరికాళ్ళు అరిగిపోయేటట్టు తిరిగినాడు. సాయంకాల మయింది. ప్రొద్దు వాలుటకు సిద్ధముగా ఉన్నది. పాపం నాగన్నకు ఒక్క చిల్లిగవ్వైనా దొరకలేదు. ఆతడు విసిగి వేసారినాడు. ప్రాణములు ఉసూరు మనుచున్నవి.

"ఏమి వెదకుతావు దొరా! ఆకలి మండుతున్నది కడుపులో. ప్రొద్దుట త్రాగిన గంజినీళ్ళు ఉప్పుగల్లు! పోదాం! రా సామి!" అని అన్నాడు వెంట నున్న చాకలి చుక్కయ్య.

నాగన్నకు తనివి తీరలేదు. అలసిపోయినా, ఆశ తీగలు సాగుతున్నది. ఇంకా ఎక్కడనైనా, ఏమయినా దొరుకుతుం దేమో అని ఆశ!

కోటలో ఒక వైపున కొన్ని కొట్లు ఉన్నవి. వాటిలో పూర్వం ధాన్యపురాసులు ఉండేవి. అవి అన్నీ యిపుడు ఖాళీ అవడంచేత, ఆప్రాంత మంతా నిర్మానుష్యం అవడంచేత వాటిలో దయ్యాలు కాపురం చేస్తున్నట్లు భీతిగొలుపుతు ఉన్నవి. నాగన్న సందెచీకటిలో అక్కడ వెదకడం ప్రారంభించినాడు. ఆసమీపంలో కుళ్ళిపోతూ ఉన్న ఉల్లిపాయల వాసన ముక్కు బ్రద్దలుగొట్టి, ప్రేవులు త్రోడేసేటట్టు కొట్టుతున్నది.

"అక్కడకు వెళ్ళుదాము. పదండి"అని అన్నాడు నాగన్న.

"అక్కడేముంది దొరా చీకటిలో!" అని అన్నాడు చుక్కయ్య.

"ఒరే చుక్కా! ఈఉల్లిపాయ లైనా వేసుకొని పోదామురా. వీటి నైనా పట్నం తీసుకెళ్ళి అమ్మకుంటే మూడు సంచుల వరహాలు మిగులుతాయి!" అని నాగన్న అన్నాడు.

అవైపునుంచి యీవైపు కొకసారి చూచి చుక్కయ్య "మూడు సంచులేం దొరా! యింకా వస్తాయి!" అని అన్నాడు.

నాగన్న గిత్తలదండు పిలిపించ మన్నాడు. మంచి ఉల్లిపాయ అంతా ఏరి సంచులలోని కెక్కించి గిత్తలమీదకు ఎత్త మన్నాడు.

అదృష్టం అంటే కనబడనిది. కనబడకుండా వచ్చేది. ఉల్లిపాయ లైనా యింటికి పట్టుకొని వెళ్ళి అమ్మకొని సొమ్ముచేసుకుందా మని నాగన్న ఊహించినాడు. కాని అతనికి అంతకంటె గొప్ప అదృష్టం చెప్పకుండా వచ్చింది.

కుళ్ళిపోతూ ఉన్న చచ్చు ఉల్లిపాయల రాసుల క్రింద వరహాల సంచులు కుప్పలుగా పడి ఉంటాయి తనకోసం అని నాగన్న కలలోను అనుకోలేదు. ఆశపడనూ లేదు. అదృష్టం అంటే అలాగున ఉండాలి! సంచులలోనికి ఉల్లిపాయలు ఎక్కిస్తున్నారు, నాగన్న అతని పరివారం అందరూ కలిసి. అంతలో ఘల్లు మని చప్పు డయింది.

"నాగన్నదొరా! మన అదృష్టం" అంటూ కేకలు పెట్టినాడు చాకలి చుక్కయ్య.

అదేమిటో అని దగ్గరకు వెళ్ళి చూచాడు నాగన్న. అప్పటికి బాగా చీకటి పడింది. చవితి చంద్రుడు క్రుంకుతూ గుడ్డి వెన్నెల కాస్తున్నాడు. అక్కడ కాగడా లయినా లేవు. వెలుతురు రంత కంటే లేదు. ఆచీకటిలో నాగన్న వరహాలసంచులు పాతిక లెక్కపెట్టినాడు. ఇంకా ఏమిటో రాళ్ళ లాగున బరువుగా ఉంటే ప్రొద్దుట నే చూచుకుందాము లెండి, వెన్నెల క్రుంగిపోకుండా సంచులు ఇవతలకు చేర్చండి అని అన్నాడు.

నాగన్న అప్పుడు గిత్త కొక వరహాల సంచి వేయ మన్నాడు. క్రిందా పైనా ఉల్లిపాయలు వేయించ మన్నాడు. నమ్మకమైన వారికి నలభయి మందికి నలభయి గిత్తలను ధనంతో వప్పగించినాడు. కోటలో అదివరకు అక్కడ యిక్కడ దొరకిన పాత తుపాకులను కొన్నింటిని, తన దగ్గర తూటాలు లేకపోయినా కొందరికి భుజాన వేసి రాత్రికి రాత్రి మకాం ఎత్తి ఏరు దాటినాడు.

బందరు చేరేటప్పటికి రావిపాటి బ్రహ్మన్న స్వర్గస్థులయినా డనీ, ఆయనతో పాటు గురవయ్య శ్రేష్ఠి కూడా కాలం చేసినా డనీ విన్నాడు. తన అదృష్టాని కంతకు కారణభూతు డైన బ్రహ్మన్నను తలంచుకొంటూ నాగన్న దుఃఖసముద్రంలో మునిగిపోయి పదిరోజులు మంచం పట్టినాడు.

ఒకనాడు నాగన్నదొర భార్యా రంగమ్మ ఏడుసూ భర్త చెంతకు వచ్చి "బ్రహ్మన్నపంతులు చనిపోతే మనకేం లోటు వచ్చింది? మీరు ఊరికే అలా పసిపిల్లలలాగున వాపోతున్నా రేమిటి? ఆ దేవర బిడ్డలం మనం. ఆయన మనలను రక్షించి కాపాడి యింతవాళ్లను చేశాడు. ఆయన పేరు మరిచిపోకుండా నిలబెట్టుకుందాం!" అని ఓదార్చింది.

"బ్రహ్మన్నగారి బిడ్డలం అన్నావు గనుక ఆదేవర పేరెట్టుకుందాం."అని అన్నాడు నాగన్న. అంతటనుంచి నాగన్నదొర యింటిపేరు బ్రహ్మన్న దేవరవారు అయింది. "బ్రహ్మన్నదేవర" "బ్రహ్మదేవర అయి, చివరకు "బమ్మదేవర", "బొమ్మదేవర" అయింది.

ఇంతలో వల్లూరి పరగణాకు శిస్తు చెల్లక వేలానికి వచ్చింది. బందరుకోటనుంచి మార్టినుదొర బొమ్మదేవర నాగన్న దొరకు కబురంపించి "కొంటావా?" అని అడిగినాడు.

"దొరగారి సెలవైతే, అభ్యంతరం లేదు."

అని అన్నాడు నాగన్న దొర. అంతటనుంచి బొమ్మదేవరవారు జమీందారులైనారు.

(ఈ వృత్తాంతం నేను బాల్యంలో బందరులో ఉంటూ ఉండగా ఒక వృద్ధుడు చెప్పాడు.)



# భావనావేశము

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి ఎం. ఏ., బి. ఎల్

సృష్టిహృదయమున స్రవించునది భావనము. భావనధునిహృదినుండి ఉవ్వెత్తుగ నుబుకునది ఆవేశము. భావనావేశము నిద్దురనుండి జీవకళలను ఎగురఁజిమ్మును. నిస్తబ్ధతనుండి గీతికాధారలను వెడలించును. రసబంధురహృదయమునుండి సౌందర్యమును గురిపించునది భావనావేశము. భావవిద్యూతములను తళ్కొత్తించునది భావనావేశము. ప్రత్యక్షప్రపంచమున దివ్యకార్యములను తాజ్‌మహాలు లట్లు నిలుపునది భావనావేశము. కావ్యజగతియందు బృందావనమును పరిమళించునదియు భావనావేశమే. దీని శక్తియందు జగదీశుఁ డదృశ్యుడై యుండును. ఇది బొమ్మ రాళ్లను సంపెంగపువ్వులు జేయును. చింతనిప్పులను మల్లెలుగావించును. మొద్దులను నిలిపి తాండవనృత్యము చేయించును! నవ్వుపల్లవములచే మొరడులను వికసింపఁజేయును. పాపులను పావనులను గావించును. పందలను పండితులను చేయును. చావును చంపి దివ్యదీప్తుల జల్లు జీవమును ప్రత్యక్ష మొనరించును. సృష్టికి ఆదియై సృష్టికి ప్రతిసృష్టిని చేయఁగలుగునది ఈ శక్తియే. దేవునకు మహత్తరమానవరూపు నిచ్చునదియు, మానవుని జగదీశునిఁ జేయునదియు నిదియే. తమమును పిండి వెలుగువెల్లువలను వెలారించునదియునీశక్తియే. అసాధ్యములను ఆశ్రితవందిమాగధుల నొనరించి, అరిష్టములను చరణాశ్రిత పరిచారికలఁజేసి దురంత దుఃఖములను భాగ్యావలుంఠిత శత్రులఁగావించి, బ్రహ్మాండమును చేతిచెండును చేయునదియు నీశక్తియే. సంభవాసంభవములును, జీవమృత్యువులును, భౌతికాధ్యాత్మికశక్తులును, జీవాత్మ పరమాత్మలును. దీని కతననే భేదరహితములై మహాపురుషుల జీవనరంగములందు జూపట్టును. మనుష్యహృదయము నిది ప్రాపుచేసికొనినందున, ఇహపరములు గోపికాగోపాలురై ఆందనరవతము రాసక్రీడల దేలుచుండును. గోపికాగోపాలురఁ గలుపు బంధము అనురాగము. సౌందర్యము, మాధుర్యము, ఆనందము, ఆవేగము, ఈ మిథునానురాగమున,— ఈ రాసక్రీడయం దున్నవి. ఆశయములును ఆదర్శములును ఇందు శోభిలుచున్నవి. కళామయమైన కృష్ణజీవనమునకు హృదయము ఆటపందిరి యైనపుడు మనుష్యజీవనము కనదురకాంతు లీను కావ్యజగతి కాదా? కాళక్రౌర్యముచే విషజ్వాలలు క్రక్కించి, భావనావేశమున దానిపై రసబంధురనృత్యము సలిపిన శక్తి అంతరంగజగతియందు వెలసియుండ దానిని గుర్తించిన వానికి గోవర్ధనగిరులు తలగొడుగులు గాక అడలుకొలుపు ఆపద లగునా? భావనావేశముపై నుఱ్ఱూఁత లూఁగువానికి కళలు పట్టపురాణు లగును. ఘనకార్యములు చేతిబొమ్మ లగును! ఘనశైల

ములు బొమ్మరాళ్లయి ఆతని కాలిక్రింద అణగియుండును! వాని జీవితము సౌందర్యోపేతమై, రసబంధురమై, గంభీరమై, ఆశయప్రభాకలితమై యుండును.

ప్రకృతినుండి హృదయములోనికిని, హృదయమునుండి ప్రకృతిలోనికి అదృశ్యమైవలెనివలె భావావేశము ప్రవహించును. దీని వీచికలందే రెండును గలిసికొనును. కావుననే కళోపాసకుడు ప్రకృతిని జూచి విస్మయచిత్తుఁడై పోవును. కళోపాసకుని గాంచి ప్రకృతియు పులకితశరీరయగును. హాయి జాల్లుచు ఇద్దరు చిత్రఖేలనము సలుపుకొందురు.

శాంతికాంతులు అరుణగగనమున జాలువారు తఱిఁ ఎడద విప్పారఁ గేలుమోడ్చి కళోపాసకుఁడు మధురగీతికలు పాడును. రంగారు కిరణపంక్తులందు బంగారు తలపులను నేలపుటపై రవికవి వ్రాయుటఁ జూచి, తన కల మాతని కిచ్చి, ఆతని భావ్యంతలేఖిని దాఁగొన నాతురంపడును! మృదుకరస్పర్శచే వసువు, వసుమతిని పులకితఁజేసి నవ్వులందును పువ్వులందును ప్రభాతమును కడపుచుండ రాగమయమైన వారి చెలిమి గాంచి ఆవేశభరితుఁడై కళోపాసకుఁడు శకుంతకాంతలను గవియ నంతరిక్షమున కెగయఁడా? భావనావేశముతో నుచ్చలిత మగు పక్షికూజితములకు నిజహృదయతంత్రుల గీతికౌరవములను అయగా సహకరించి తన్మయనృత్య మొనరించుచు జగన్మోహనుఁడైన కవికుమారుఁడు సృష్టికాంతను హృదయమునఁ జేర్చుకొనఁడా? మినుకులీను రసభావములను పువ్వు పడుచులు దిగ్భ్రమింగుట జూచి కడు కాంతుతో నాతఁడు వాని దాపలఁ జేరి సౌందర్యభిక్షను వేఁడుకొనఁడా? పూపడంతుల మోములకు కన్ను లప్పగించి ఆవేశభరమున పరిమళపూరమునకు మానసాధరము నొడ్డుచు, ఈసున సమీరుఁ డెల్లకడలందు గుసగుసలు సల్పుటఁ దిలకించి, సిగ్గున పొదరిండ్ల మఱుఁగున కరిగి కవి యువకుఁ డెందు కులుకుచుండఁడా? అపరంజి మరీచికి మన సిచ్చిన సుంచుతుంపురు మణికాంతులను నగుచుండ, బిందుసుందరి హృదయము జొచ్చి, పరవశుఁడై కాంతిరాశులను [illegible] కొనఁడా? ఈ సృష్టిఁ జూచి తన కేలిని యిముడ్చుకొనక కుసుమాధరముఁ గ్రోలుమ మధుపకమున ప్రణయినికి ప్రియమగువాఁడు దానిని వెఱపులఁ గాంచి కినిసి, కవి తుమ్మెదనై పాడుచుచు పాటలు పాడఁడా? గూళ్లమీఁది పచ్చందనపు పూఁతపై పైడి రంగులు తళ్కుమనంతన, ఆకుగముల మాటున దాగి కళోపాసకుఁడు పిట్టబిడ్డల తియ్యని కుహూరాలకు వీనుదోసి ఒగ్గి హాయినందఁడా? రసపూరితఫలములు నిండురూపముల హృదయములపై నొప్పారఁ, దీవయిల్లాండ్రు తోఁచినంతన, రసపిపాసువైన కవి ఆతురపాటున దొంగచూపుల నాదెస సారింపఁడా? అదికాంచి, ఈసున రవికవి వాని తలఁపులను క్రొందళ్కులందుఁ బట్టుబయలు కావింపఁడా? నిశీధిని సుబోధయందును, నీరంధ్రనీరదములందును తన తలఁపులను ముంచుచుఁ దేల్చుచు, ఆఁడుచు పాడుచు, నవ్వులు రువ్వుచు ఆనందవ్రతుఁడు నాకమును, నందనమును హృదయమున నింపుకొనఁడా? చెర్వుకెరటాల దేలుచు, కౌముదీపూరమున మునుఁగుచు పవనువలన సుమపతికి ప్రేమసందేశ మంపుచు, ఫుల్లవదనలైన కుముద్వతులఁ గాంచి పులకితచిత్తుఁడై సరోవరతీరమునకు పర్విడి, మఱిపుట్టువున తాను కల్వయై పుట్టవలె నని కవి తపసు చేయఁడా? వరుని జూచి మోహిత యగు వధువువలె కవిని గాంచి ప్రకృతి సీమంతిని హృదయము విప్పి తన సౌందర్యము నాతని వశ మొనరింపదా? భావనావేశమున కవి ఆనందమునం దీఁదులాడఁడా? పాలకరళ్లందు ఈఁదు సృష్టికర్తవలె ఆనందవీచికలం దీఁదులాడు కవి ఎన్ని యద్భుతములను సృష్టింపఁడు? భావనావేశమున నడచువాని కలము తరళకాంతులను విరఁజిమ్మదా? మనోహర

రూపులఁ గనుఱెనుటఁ బెట్టదా! సాహిత్యారామమున కమనీయ కళాజదనికలను నాటి చేయదా? వసుమతిని రసవాహినులం దోలలాడింపదా? స్వోత్కర్ష కళావిన్యాసములు భావనావేశమునఁ గదా తలసూపును! రాతిని కూడ రసమయము చేయునది, కటిక చీకటిని కూడ కళాసందీప్తము గావించునది, కంకాళమున జీవకళలు నింపునది, హృదయమును మీటి విశ్వసంగీతము వెడలించునది, సచ్చిదానందములను మూడుగ్రుక్కల ఆపోశనముఁ జేయించునది భావనావేశము కాక మఱేది?

సాహితీ సామ్రాజ్యమందును, మనుష్య జీవనమందును విశేషప్రశస్తిఁ గన్న "రసముల రాజు" శృంగారరసము భావనావేశమున నుబుకునదే! ప్రాచీనకవులు జడలే దాల్చినను తమ హృదయములందు సుధామధురవల్లరులనే పెరుఁగనిచ్చిరి గాని డొంకలఁబోలు జడలను గాదు. కెంపుతలపులు చిప్పిలు అలరు విరులను దురిమి తమ జడలను సురభీకరించిరి గాని అందు వల్మీకములను పెరుఁగనియ్యలేదు. నిహితప్రకృతినుండి కూడ సౌందర్యమును కొల్లగొట్టువారు కావున మునిముచ్చు అని వరూధిని వారిని గేలిచేసినది. శోకధారలను జాలువార్చునపుడు కూడ నా కళావ్రతులు కలస్వనమున రాగాలాపన మొనరించునారని వీణాతంత్రుల బోలి తీపి తుంపురులు రాల్చు వారి రచనపంక్తులే తెలుపుచున్నవి. దుఃఖమున దొలుకాడు ఘట్టములకు గల శృంగారరసవాహినులు స్రవించుచుండునని రామాయణమును తెలిచినవారెఱుఁగుదురు. వాల్మీకి హృదయము రసపూర్ణమేఘ మని ఎఱిఁగియే వానకోయిలయై కాళిదాసు దాని నాశ్రయించినాడు; పిదప దన హృదినుండి మెఱపుల వర్షము గురిపించినాడు. శృంగారమును ఆనందమును, సౌందర్యమును కవిహృదయమున నూరించు అద్భుతశక్తి యేది? భావనావేశము కాదా?

కవితావేశము ఏకోలఁదిమంది హృదయములందో మందాకినీవీచికల నుప్పొంగించును. సంగీత పుట్టిది కాదు. "రహిమీర యంత్రగాత్రముల రాల్ గరగించునది" విమలగాంధర్వము. మానవులకు మృగములకును దేవతలకును దానవులకును నొకే భాష యైనది గానము. అనురాగము ఆనందము, సంక్షుభిభావము సంగీతమున నుప్పొంగు భావనాబుద్బుదములు. గీతకళలు స్వరమునకు మెట్టు అని రవీంద్రుఁడు వాకొనెను. సామగానము జేయుచు ప్రాచీనులు నృత్యము సలిపిరి. నారదతుంబురుల నాట్యకౌశలము పురాణప్రసిద్ధము. కృష్ణుఁడు నృత్య మొనరించి వైకుంఠమును భూతలమున నిలిపినాడు. విశ్వమోహననృత్యము సలిపి నటరాజు సృష్టిమహత్త్వమును తేటపఱచినాడు.

కవిత్వనృత్యములందు వలెనే తక్కంగల కళలందును భావనావేశము చూపట్టును. శిల్పకౌశల్యమును చిత్రలేఖనానైపుణ్యమును దీనివలననే తేటపడును. ప్రాచీప్రతీచీ జీవనముల నుప్పొంగు భావములను రవివర్మ రాఫేలులు తమ చిత్రములందు చిత్రించిరి. రామారావు రామమోహనులును ఆనందమోహననందలాలులును, అవనీంద్రరవీంద్రనాథులును అధునాతన మానవహృదయములందు పొంగిపొరలు తలఁపుకరళ్లను తమ రంగులందు చిమ్మి పృథ్వికంతేని ఆనందభిక్ష నొసగిరి. గతభారతమహత్త్వమున గొండొక వడిచరింపఁదలఁచువారు అజంతా ఎల్లోరా గుహలందును. బృందావనభువనేశ్వరమందిరములందును బుద్ధగయదాక్షిణాత్యదేవాలయములందును ప్రవేశింపవలెను. తక్షశిల మొహెంజొదారో జింటూరా సారనాథములందు నేఁడు వెల్వడు శిల్పభాగ్యమును గాంచి అద్భుతప్రాచీనయుగమున మసలఁ గలిగితిని. స్థలకాలపరిమితులను ధిక్కరించి అనంతశోభ ననంతకాలమునకు ధారవోయు తాజ్‌మహలును చూచి భావనావేశమున గంతులిడనివారెవరు! ఈయాదేశము కతన అదృ

శ్యభావములు దివ్యదృశ్యము లగుచున్నవి. కళా జగతి యందును. ప్రత్యక్షవసుమతియందును అవతరింపఁ గలుగుచున్నవి. మృత్యువునఁ గూలిన సంఘటనములకు సంజీవి నిచ్చి చిరంజీవములు చేయుచున్నవి. బాహ్యాంతరజగతులకును త్రికాలములకును వియ్యమును నెయ్యమును గూర్చు కళకు ఆయువు భావనావేశము.

వక్తృత్వమును కళలలోనిదే. కళాహృదయుఁడు కాని వక్త మాటలు వట్టి గొడ్డు అప్పళట్లుండును. కళోపాసకుని పల్కులు శ్రోతల హృదయములను పరమహంసలను చేయును. ఉపన్యసించు సరోజనికిని పద్యపంక్తులందు పరుగులిడు సరోజనికిని భేదములేదు. మధుమయమైన సరోజని హృదయ మావేగముతో రవ్వరివ్వ మనుచుండును. భరతపక్షిని గూడి షెల్లీ కవీంద్రుఁ డెగసినట్లును, కోకిలవెన్నంటి మహాకవి కీట్సు అడవికొమ్మలందు (On the viewless wings of Poesy) ఎగసినట్లును, శబ్దపక్షవిక్షేపమున సరోజని ఎగసి శ్రోతలను గూడ నందనవనమునకు గొంపోవును. సురేంద్రుఁ డుపన్యసించుచు మేఘములతో మద్దెలలు మ్రోగించువాఁడు. శబ్దడోలికలందు భువనముల నుర్రూఁత లూఁగించు జగద్ధాత్రి బీసెంటుసతి యని సభ్యప్రపంచ మెఱుఁగును. నారాయణదేవు హృదయమునుండి ఆంధ్రమేఘములు సలుపు గర్జనలను మనరాష్ట్రీయు లెఱుఁగుదురు.

కళోపాసనమునకు వలెనే ఆధ్యాత్మికజీవనమునకును ఆవేగ మవసరము. కళ అనురాగమయమైనది. ఆధ్యాత్మికజీవనము భక్తిపూరితమైనది. అనురాగము నుండియే భక్తి జనించును. చెప్పనేల? అనురాగమే భక్తి యగును. భక్తియే అనురాగమగును. కృష్ణునెడ ననురక్తయైన రాధకంటె నెక్కుడు భక్తురాండ్రున్నారా? రాగవల్లరులందు బంధింపబడిన గోపికలు భక్తికి మేలుబంతులు కారా? శశికిరణములట్లును, గీతకళలట్లును, కవిభావములట్లును అనురాగలతికలు సౌందర్యసందీప్తములై ఆవేగభరములై యుండును. కృష్ణచైతన్యుఁడు "నాథా! నాథా!!" యని శ్యామసుందరుని సంబోధించుచు, ఆత్మవిస్మృతుఁడై నదియాలో నృత్యము సలుపుచుండువాఁడు. భక్తిపూరితహృదయుఁడై "మాతా! మాతా!!"యని దక్షిణేశ్వరమున రామకృష్ణుఁడు గంతులు వేయువాఁడు. ఆనందావేశుఁడై రక్తారుణపూర్వదిక్కును చూచి అడవిజాతి వాఁడు నృత్యము సలుపువాఁడు. కళాసౌందర్యమును కాంచి జర్మని షేక్స్పియరు గంతులు వేసినాడు. ప్రేమికులకును, కవులకును, భక్తులకును, గాయకులకును, చిత్రలేఖులకును, వక్తలకును, వీరులకును, శిల్పులకును, ఆవేశమును ఉద్రేకమును లేకున్నయెడల, బ్రదుకే లేదు. అనురాగమునకు ఆయువు ఆవేగము. భక్తికి ప్రాణము ఆవేశము.

గురుకార్యములు, చతికిలపడి యోచనాని మగ్నులైన వారికి, గాక ముందంజవేయువారికి సాధ్యమగును. మతగ్రంథములను తెరువుఁడు—చరిత్రలను చూడుఁడు. వీనియందలి మహనీయులను, వానియందలి మహాత్ములను ఎట్టివారో పరికింపుఁడు. ప్రజాసమూహములను వాగలల నూగించి, కటికిరాళ్లచే నయితము ఘనకార్యములు చేయించిన మహాపురుషులు ఆవేగపూరితులు కారా? కృషికకులమునఁ బుట్టిన మార్టిన్ లూథర్ పదునేనవ శతాబ్దమున, పాపభూయిష్టమైన యూరపుఖండమును తలక్రిందులు చేసి ఆవేశమయుఁడై మతమహత్త్వమును పునరుద్ధరింప లేదా? రసపుత్రవీరులును రసపుత్రరమణులును అద్భుతక్రియలను నెఱపి, భావనావేగము కతనఁ గదా శతాబ్దుల పైఁ గీర్తిచంద్రికలు పొదఁజల్లిరి! థెమిస్ట్కస్, ఎపమినన్డస్, లియనిడస్, హేనిబల్, సీజరు, అలెగ్జాండరు లాది మహావీరులు భావోద్రేకమువలనఁ గదా అసాధ్యములను పడఁదన్ని, నింగి చుక్కలను వెన్నముద్దలట్లు నంజుకొనిరి? మనుష్యమాత్రు లెక్క చూడని ఇటలీతుపా

రాద్రిపై (Vide: Abbot's 'Life of Napolean') లేడిదండు లట్లు తన దండులను దుమికించి, నిఘంటువునుండియు, ప్రత్యక్ష ప్రపంచమునుండి యు అసాధ్యమును పాఱదోలి, తీక్ష్ణదృక్కులచే నింగి చుక్కలను వడకించి, (Vide: Byron's famous Poem on Nopolean Bonaparte) ఎల్బాదీవినుండి మహోదధియం దుఱికి హుమ్మని ఉత్తాలతరంగములను పిడికిటఁ బట్టి, ఒక్క తన్నున యూరపుదేశమును అట్టిటు లాడించి సింహాసేనల కడలు పుట్టించి, వీరులందు వీరుఁడై మనుష్యులందు మనుష్యుఁడైన నెపోలియనును నెపోలియనుఁ జేసినది భావనావేశము కాదా? సన్యాసి యైన సవ్యసాచి హృదయమున భావోద్రేకమును పురికొల్పియే గదా గీతాచార్యుఁ డాతనిచే గాండీవ మెత్తించి కర్మక్షేత్రమున వాని నగ్రసరుఁ గావించినాడు! కమలకాసారమున లంఘించు రాజహంస వడువున, (Vide: Sakka's Palijataka) శిశువును రక్షింప భయదజ్వాలలందు దుముకు జనయిత్రికి ఉత్సాహావేగము లిచ్చునది భావనావేశము కాదా?

ఇది మేధాశిఖరములందుఁ బుట్టినది కాదు.— హృదయ ఉదధియందు ఉత్తుంగతరంగములై పొంగునది. కళను తనుపు భావోద్రేకమును, పరమహంసను తన్మయచిత్తుఁ జేయు భావనావేశమును, ఘనకార్యములను అరచేతఁ బట్టించు భావనావేగమును హెచ్చుతగ్గులు కలవి గాని వేర్వేరైనవి కావు. కవితారసమున నుప్పొంగునవి మృదువీచికలు. వీరరసమున నుప్పొంగు అలలు కొండలవంటివి. భక్తిరసమున దొల్కు కెరటాలు మలయహిల్లోల వాక్కులఁ బోలునవి. చెప్ప నేల?— రసము లన్నిఁటికిని ఆశయము లన్నిఁటికిని మూలవిరాట్టు భావనావేశము! కళాకౌశలమునకును, ఆత్మకైవల్యమునకును కన్నతల్లి భావనావేశము. పురుషార్థములకును, పరమార్థమునకును ఆధారము భావనావేశము. శూరుని సృష్టికిని, సంయమీంద్రుని సృష్టికిని, ఆనందవ్రతుని సృష్టికిని, సృష్టికర్త సృష్టికిని ఆయువు భావనావేశము.



# కంట్రాక్టు డ్రామా* అసంపూర్ణ రామాయణం

మల్లాది అవధానిగారు

(ఈప్రహసనం మొదటి సారి ౧౯౩౨ లో విజయనగరం మహారాజావారి కాలేజీ వార్షికోత్సవసందర్భంలో బి. ఏ. క్లాసు విద్యార్థులచే ప్రదర్శింపబడింది. తరవాత నిది బరంపురం గ్రాడ్యుయేట్లచేత శ్రీ గిడుగు రామమూర్తిపంతులవారి సప్తతిమహోత్సవసందర్భంలో రాజమండ్రిలో ప్రదర్శింపబడింది. వారిచేతనే వైజాగు, విజయనగరం, బరంపురం యింకా యెన్నో చోట్ల ప్రదర్శింపబడింది. ౧౯౩౩ లో వైజాగులో విశ్వకళాపరిషద్వార్షికోత్సవసందర్భంలో బి. ఏ. ఆనర్సు విద్యార్థులు కొందరు ప్రదర్శించారు.)

* * *

(తెర యెత్తగా వుత్త స్టేజీ కనబడుతుంది. దాని మీద రెండు యినపకుర్చీలు మాత్రం వుంటాయి.

---

* అన్ని హక్కులూ అవధానివి.

వెనక అడవి సీనూ స్తంభాల బొమ్మలు గల సైడ్కర్టెనులూ. దశరధుడు మెల్లగా నడుస్తూ వస్తాడు. మనిషి సన్నంగా అరడుగుల ఎత్తుగా వుంటాడు. మొహానికి మాత్రం సఫేదు పూసుకున్నాడు. మెడకి చెవులకి చేతులకి రంగు లేదు. నెరిసిన తెల్ల చింపిరి జుట్టు విగ్గుంటుంది. అది మాటిమాటికీ అతని నుదుటిమీదకి వొరుగుతూ వుంటే అతను దాన్ని సద్దుకుంటూ వుంటాడు. నల్లని మీసమూ తెల్లని గెడ్డమూను, చాలీచాలని వొక చింకి షిరాయి. పైని చెమ్కీ వూడిపోయిన మొహమలుకోటూను. చెవులకి లింగులింగు మంటున్న లోలాకులూ చేతులో కర్రకత్తీ వున్నాయి. మెళ్లో వొక రుద్రాక్షల పేరూ గన్నేరు పూల దండా వున్నాయి. దశరధుడు స్టేజి నడుమ వొక నిమిషం నిలుచుని 'ఆఁ' అని రాగం తీయడం ప్రారంభిస్తాడు. ఆరాగం పాటలోకి దిగుతుంది. పాట పాడుతున్నపుడు కర్రకత్తితో అడవిసీనును చూపుతూ వుంటాడు.)

దశ—(పాట)

వారె వారే శయ్యాగార మెంతో కడు వింత గొల్పె నాహా।

(పాట అయిపోయిన తరవాత)

నేను దశరధుం డను నృపశ్రేష్ఠుండను. నా రాజ్యంబు గోసల యనునది. దాని ముఖ్యపట్నంబు అయోధ్య యనంబడు. నాకు ముగ్గురు భార్యలు కలరు. పెద్దభార్య పేరు కవుసల్య—రెండో భార్య పేరు సుమిత్ర మూడవ భార్య యొక్క నామంబు కైక. కైక నాచిన్న భార్యయును ముద్దు భార్యయును ఐ యున్నది. ఇట్లుండగా పాపము నాకు చాలాకాలము వరకునూ పిల్లలు లేకపోయిరి. అపుడు నేను యొక యాగము చేసితిని. దానినే పుత్రకామేష్ఠి యని పెద్దలు వాక్రుచ్చుచుందురు. అందుచే నాభార్యలు ముగ్గురును అనగా కౌసల్య, సుమిత్ర కైకయును గర్భమును ధరించిరి. తొమ్మిది నెలలును నిండిన వెనుక సదరు భార్యలు ముగ్గురునూ నలుగురు పుత్రులను కనెను. ఆనలుగురు పుత్రులును మొగవారలే. వారే రామలక్ష్మణభరతశత్రుఘ్నులు. ఇట్లు దశరధుండ నగు నేను నామూనావ నా కొమాళ్లతో కలిసి సుఖంబుగా ముదం బొప్ప నా ప్రజలను కన్నబిడ్డల వలె పాలించుకొంటూ యున్నాను. ఈరోజున నేను కొలువు తీర్చి యున్నాను గనుకనూ, యీ అయోధ్యకు నేనే మహారాజును గనుకనూ నేనిపుడు పోయి అనవరత్నఖచితసింహాసనంబున చేతోమోదరహితంబుగ కూర్చునెద గాక.

(పోయి యినపకుర్చీలో కూచుంటాడు.)

(పాట పాడుతూ, పాటకు లయగా చప్పట్లు చరుస్తూ కళ్ళు మూసుకుని మంత్రి వొస్తాడు. తలను విగ్గు లేదు గాని వొక చెమ్లా వుంది. ఫ్రెంచికట్టు మీసం. గిల్టుఫ్రేము కళ్లద్దాలు. వెయిస్టుకోటు. సైను లాల్చి. బైరాగి మల్లుపంచె గుండారు. కాళ్లకి కల్కటా స్లిప్పర్లూను. ఇతను మాట్లాడే టప్పుడల్లా యెడమచేతిని పై కెగురవేస్తూ వుంటాడు.)

మంత్రి—(పాట)

మేరే మాలా బలాలో మదీన ముజే ॥మే॥

ధనము చేతుల దుముకుచుంటే

దగ్గరా చుట్టాల మంపురు

ధనము కొస్త నశించి నంతనె

తరలిపోవును యెల్లవారలు ॥మే॥

(పోయి రెండో యినపకుర్చీలో చూచుంటాడు)

దశ—ఇపుడు సభామధ్యంబున తథ్యంబుగా సింహాసనంబున కూర్చున్న దశరధమహారాజులుంగారి నగు నే నేమి చేయవలసి యున్నది? క్షణము ఆలోచింపవలయును. (ఆలోచించి) ఆఁ. మంచి యూహా చటాలున స్ఫురించినది. ఇపుడు నేనితనిని మంత్రీ యని చక్కగా పిల్చెదను గాక. మంత్రీ! సరియే! అనుకొని నట్లితనిని మంత్రీ యని పిలిచితిని. ఇంక యిపు డేమి చేయవలసియున్నది? మంచి యూహా! (స్టేజి మధ్యకు వచ్చి సభ్యులను ప్రశ్నించే టట్లు చేయి తిప్పుతూ—)

(డైలాగు)

నెలకు మూడు వర్షమూలు కురియుచున్నవా ?
మంత్రీ! కురియుచున్నవా !

మంత్రి—నెలకు మూడు వర్షమూలు కురియు
చున్నవీ రాజా కురియుచున్నవీ !

దశ—నేను ప్రజల బిడ్డలట్లు యేలుచుంటినా ?
మంత్రీ యేలుచుంటినా ?

మంత్రి—నీవు ప్రజల బిడ్డలట్లు యేలుచుంటివీ
రాజా యేలుచుంటివీ !

రాజు—చందమామ లాగు రాము డెదుగుచుం
డెనా ? మంత్రీ యెదుగుచుండెనా !

మంత్రి—చందమామ లాగు రాము డెదుగుచుం
డెనూ రాజా యెదుగుచుండెనూ ?

దశ—మంత్రిసూర్యమా ! మన రాజ్య మెట్లున్నదో చెప్పుమా !

మంత్రి—ఓయీ రాజా ! యేమి చెప్పం గలవాడ ? చెప్పుట కేమి యున్నయది ? చెప్పుటకు నోరు రాక యున్నది.

దశ—వర్యా ! అది యెందుచేతనో గదా ?

మంత్రి—రాజేంద్రుడా ! నిన్ను వర్ణింప నా కెంతయో కోలాహలముగా నున్నది. నిన్ను వర్ణింప నా డెందంబు ఆందోళనాకందళితం బగుచున్నది. గాని నిన్ను వర్ణింప నాలుగు చేతులు గల అవిఘ్న మూర్తి కైనను దరము కాదు సుమా !

దశ—మంత్రిపుంగా ! ఆలాగునా ? పోనిమ్ము యథాశక్తిగా వర్ణింపగదవే. చవితిచంద్రునకు నూలుపోగు.

మంత్రి—భూసురగ్రామణీ ! అయిన శ్రద్ధాభక్తులతో నాలకింప గదవే:

దశ—మనమా ! యేల నీకీ యారాటము ? ఏల నీకీ తొందర ? ఇతడు యిపుడు సంశయించుచున్నాడే ? ఇతడు నిజము బల్కునా ? బల్కునసుకొందము. కీడెంచి గదా మేలెంచవలయును ? ఇతడు నిజమును బల్కు డనుకొందము. అపుడు మన మేమి చేయవలయును ? మంచి యాలోచన స్ఫురించినది. ఇతనిని నిజమునే బల్కు మనెద గాక. అట్లు చేసిన ఇతడు నిజంబునే బల్కగలడు. మదించి చెట్లను పెల్లగించు చున్నటువంటిన్ని గబగబ పరుగెత్తగలిగినటువంటిన్ని మాంచి తొండము కలిగినటువంటిన్ని చేటలవంటి చెవులతో వుండు కున్నటువంటి యేనుగువంటి మనిషి వయిన యోమంత్రీ ! నీవిపుడు దయయుంచి నిజమునే బల్కుము. అబద్ధంబు బల్కజనదు. సత్య మేవ జయతి నానృతం !

మంత్రి—(చటాల్న లేచి నిల్చొని యెడం చెయ్యెగరేస్తూ స్థిర మైన నడవడీ జనుల కందరకు నూ వలయునే రాజ్యచాపల్యముననూ" అనే పద్యాన్ని వుద్రేకంతో చదివిన వెనక—)

గనుక నేనబద్ధమాడెదనా ? ఎంతమాట నంటివిరా? అవురా ! వినుము.

గీ॥ దశరథుడ వైన రాజేంద్ర విశదముగను
అలరు బల్పుల్కలను నీకు తెలియజేతు
విశ్వమందున నీకీర్తి వెలయుచుండె
అందముగ నెల్లచోటుల అహహ యరయ

(పైపద్యాన్ని విచారకరమైన రాగంతో పాడి యేడుస్తూ దశరథుడి పాదాలమీద పడిపోతాడు)

దశ—మెచ్చితిని. మెచ్చితిని. ఓయి సచ్చరిత్రా! నీవిచ్చకము బల్కక అచ్చసచ్చమునే వాక్రుచ్చి నాయిచ్చను నచ్చచెప్పితివి గావున నీకిదే అచ్చర లచ్చలిచ్చుచున్నాను బుచ్చుకొనుము.

(అని తన మెళ్లోని రుద్రాక్షల పేరు అతని మెళ్లో వేసి నమస్కారం చేస్తాడు.)

మంత్రి—ఓకీర్తిశేషుడా మరియు—

గీ॥ ధరను నీకును కౌసల్య ధర్మపత్ని—ఓయికీర్తిశే
షుడా మరియు
కిన్నుభముహూర్తమున నొక్క కొడుకుబుట్టె

దశ—(తలవూపుతూ) ఆలాగునా !

మంత్రి—

గీ. వాడె శ్రీరామచంద్రు డన్వాడు వాని
కీర్తి నీ కీర్తి—ఏమి రాజా వినుచుంటివా లేదా?
నీవు చేము డేమో మరల చెప్పుచుంటిని వినుము

గీ. కీర్తి నీ కీర్తి క్షణములో గెలిచె నరయ

దశ—హా! నెంత గోర మెంత గోరము! (దుఃఖాలున మూర్ఛిల్లుతాడు)

మంత్రి—

ఉ॥ చచ్చిరి సోదరు ల్సుతులు చచ్చిరి.........
......బిచ్చెద జీవితేచ్ఛ కల దేని బయల్పడు
మయ్య గ్రక్కునన్

కావున కష్టములు మానవులకు గాక జంతువులకు వచ్చునొక్కో? పూరడిల్లుము. పూరడిల్లుము.

దశ—ఇంకేమి పూరడిల్లుట? నాబ్రతు కంతయు తుద కిట్లొక క్షణంబున దగ్ధ మగు నని మంట పాలగు నని కలయైం దయిన దలంప నయితినే. కట్టా! ఒక్క కొడుకు—హా!

మంత్రి—ప్రియా! దశరథా! ఎంత యేడ్చిన నేమి లాభము? ఏడ్చి నంత మాత్రమున చనిపోయిన వారు తిరిగి వత్తురె యోంచి చూడగా. మనకు కష్టకాలము వచ్చినది భరింపక దప్పునొక్కో యీభూమిస్థలిన్.

ఉ. చల్లనిపై శ్రమం బుడుప జాలిన తామరపాకు
పీవనల్
.........ఓపల్లవపాణి—

దశ—(సిగ్గు నభినయించుతూ) చాలును లెండు (లేచికుర్చీలో కూచుని) మంత్రిగ్రామణీ యేమి విశేషములు?

మంత్రి—మన దేశమునందు ప్రజలు మిమ్మే తిండీ తిప్పలూ మానుకుని యెల్లవేళలా హృదయంబులందు ధ్యానించుచున్నారు.

దశ—ఇట్టి శుభకబురు తెచ్చినందులకే హారంబు గైకొనుము (అని తన మెళ్ళోని పూలదండను తీసి అతని మెళ్లో వేస్తాడు.)

మంత్రి—రాములవారి కీర్తి మీకీర్తికంటె నూరామడలకు ముందున్న దని నుండీ!

దశ—ఇట్టి అశుభకబురు తెచ్చినందులకు నాఅచ్చరలచ్చలున్ను నాహారంబును నాకిచ్చివేయుము. (అని తానే మంత్రి మెళ్లోనుంచి రుద్రాక్షలహేరూ పూలదండా తీసుకుని తన మెళ్లో వేసుకుంటాడు)

(గడియ నిశ్శబ్దము)

(చరచర లోపల్నుంచి సేవకుడు వొస్తాడు. వలంగా వుంటాడు. బొద్దుమీసాలు. చేతిలో లాఠీకర్ర.)

సేవ—(పాట)

ఈశ్వరా సంకల్ప మెవ్వా రెరుంగుదురా?

... ... ... ...

హా దైవమా! హా హతవిధీ! హా లోకమా! భరతమాతా! నాకు. నాకేది గతి? యెటుల బ్రతుకువాడ? ఇపుడీ ఘోరవార్త వీరి కెట్లెరిగింతు? అయ్యో! ఈవార్త వినిన వీరు గుండె పగిలి చావరా? చచ్చిన చావనిమ్ము. నావిధి, నాపనిని నేను చేసెదను. నేను సేవకుడ నగు నేనే నానాలుకతోనే చెప్పివేసెదను. ఓహృదయమా పిరికితనమును పారద్రోలుము. ఓదిగ్గజములారా! మీరును ధైర్యముతో నిలువుడు. ఓభూమీ! నీవును ధైర్యముతో కంపింపరాదు. ఓసర్వేశ్వరా! యీవార్త నెరింగించుటకు నానాలుకయం దింత బలమును ప్రసాదింవే. హా! నే నిపు డీతనిని యేమని బిలువగలను? దశరథా! యిటురా. (దశరథుడువచ్చి సేవకుని దగ్గర వినయంగా నిలుచుంటాడు) నానోరు బెరడుకట్టుచున్నది. నాకళ్ళు గిర్రుగిర్రున తిరుగుచున్నవి. అహా! కాలగతి దాట నేరి తరము? హా భరతమాతా! నీకట్టి గతి పట్టినది! (వలవల యేడుస్తాడు) హా! చెప్పుచున్నాను. నానాలుకతోనే నానోటితోనే చెప్పివేసెదను. దశరథా! నాయనా! కుమారా! యిటురా! నీవు బాలుడవు. భయపడకుమా. నేను చెప్పబోవు ఘోరవార్త విని చచ్చిపోకుమా!

ధైర్యము తెచ్చికొనుము. ఏల యేడ్చెదు? నీకొక భీషణవార్త నెరింగించెదనులే.

దశ—సేవకోత్తంసమా! విశేషంబు లెయ్యవి?

సేవ—(తన తలను రెండు చేతులతోను పట్టుకుని) విశేషములు—విశేషంబులు—పిడుగు-పిడుగువార్త. ఈ నాగుండెలలో కనికరము లేదుగదా. వినుము—హా మనమా! ధైర్యము ధైర్యము! వచ్చు ... చు ... చు ధైర్యము! వచ్చుచున్నాడు—హా—విశ్వా—మిత్రుడు (వొక్క యెగు రెగిరి తెరలోపలికి పోతాడు)

(తెరలో పాట)

థశరథా! థశరథా థశరథా

ఓరి మూర్ఖ! ఓరి శుంఠ! థశరథా!

దశ—(పైపాటను వినుట నభినయించి మంత్రితో) పాట.

సలలితమురళీనినాద మే అది సందేహ మేలా?

లలితాలాప మదిగో—అదిగో విను సఖీ—మురళి

గను సఖీ ॥స॥

మంత్రి—రాజేంద్రమా! మునిచంద్రముం డగు విశ్వామిత్రరుషి మురళిపై హరినామకీర్తనాహార పానము లుండ వాటిని దినుచు వచ్చుచున్నవాడు.

దశ—

గీ. అయిన నీవిప్పుడే పోయి అతని దీసు

కొంచు రాగదవే వోయి మంచివాడ

మంత్రి—

గీ. ఏల నాతండె యిచటకు నేగుదెంచు

చుండె ననవసరం బది పుండరీక

(లోపట్నుంచి "థశరథా" అన్న పాటను పాడుతూ వొక్కపరుగున విశ్వామిత్రుడు వొస్తాడు. నల్లని విగ్గూ తెల్లని మీసమూ గెడ్డమూనూ. మొహానికి యెర్ర రంగు. ఒకయెర్ర బనియను తొడుగుకున్నాడు. ఒక బైరాగిమల్లు పంచి సైకిలు కట్టూ. ఎర్రసిల్కు వాణీ మెళ్లో వల్లెవాటు, మొల ను సగం కనబడుతున్న పొడుండోక్కా. చంకలో పంచాంగమూ ఒక చేతిలో జారీ యింకో చేతిలో తీగెలు లేని తంబురాను.)

విశ్వా—(పాట)

థశరథా! థశరథా! థశరథా

ఇంతవాడ వని తెలియగ నైతిని

పంతమ నాతో పంతులు థశరథ?

బధ్ధ మాడక నబధ్ధ మాడితివి

సుధ్ధులు లేవా ఛీ ఛీ ఛీ ॥థశ॥

దశ—(విశ్వామిత్రునికాళ్ళపైబడి)

శ్లో. శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం

ప్రసన్నవదనం ధ్యాయే సర్వవిఘ్నోపశాంతయే

మంత్రి—(విశ్వామిత్రుని కాళ్లపైబడి)

శ్లో. సరస్వతీ నమస్తుభ్యం వరదే కామరూపిణీ

విద్యారంభం కరిష్యామి సిధ్ధి ర్భవతు మే సదా

విశ్వా—ఏమిరా శుంఠా నాదగ్గర నటరా నీ నక్క వినయములు. ఛీ పొమ్ము.

దశ—(పాట)

తప్పు క్షమియింపుమా ఘోరతాపసేంద్రమ నా

తప్పు లన్ని వొప్పులుగా తప్పకుండా తలచుమదిని

కప్ప వలె శపియింపక యిప్పుడె న న్రోవుమా

॥త॥

మంత్రి—(పాట)

మునివరా తుద కీట్లూ ననూ మోసగింతువా!

॥ము॥

దశ—నన్ను క్షమియింపం గదే

విశ్వా—శుంఠా! భడవా! వాచాలా! ద్రోహీ! మాతృహంతకా! సకలలోకభీకరాకారుండ నగు నే నటరా నిన్ను క్షమింతును.

మంత్రి—విశ్వామిత్రమా! ఆగ్రహాణము బొంద నేల? మరియు—(పాట)

శాంతమూ లేక సవుఖ్యమూ లేదూ సారసాదళా

నయనా ॥శా॥ దాంతునీ కైనా వేదాంతుని

కైనా... ॥శా॥

విశ్వా—ఛీ! నీవును ప్రేలుచుంటివిగా కుంకా? అన్ని పాములను తలయెత్తగా లేడీ పామును తల యెత్తినదట.

దశ—బాగున్నది ఓయీ విశ్వామిత్రా! నీవు నన్ను క్షమించని పక్షమందు నే నెట్లు బ్రతుకుటోయి?

విశ్వా—అరె ఉల్లా! యేమిరా ప్రేలుచుంటివి? మాతృహంతకా! పుత్రహంతకా! పితృహంతకా! గురుహంతకా! మునిహంతకా! (దశరధుని తలను తన కాలితో తంతాడు)

దశ—నేడు గదా మదీయతల ధన్యం బయి యొప్పారు చున్నయది! అయ్యో దేవా కఠినమైన తమ పాదంబు మృదువైన నాశిరంబును దాకి గాయపడిన దేమో? యద్దానిని నాతాలూకు కన్నీళ్లచే కడుగనిండు.

విశ్వా—ఓరి నటనసూత్రధారి! ఓరి ముసలి పీనుగా నీవు నాకాలు విరిచివేయుచున్నావుగా! నీవు నాకాలు విరిచివేయుచున్నావుగా! ఈ తంబూరాతో యిదిగో త్వదీయతలను బద్దలుచేయు చున్నవాడ. (తాంబూరాతో తంతాడు)

మంత్రి—విశ్వామిత్రమా! రాజేంద్రముం డగు దశరథ నృపాలు నేల దన్నెదవు?

విశ్వా—ఏమీ పిట్ట కూతి పట్టినదే? గుంట భడవా! నీకును యీరాయొక్క తంబురతో తన్నులు గావలయునా యేమి? ఇదే నీయొక్క వీపు దురదను తీర్చివేయుచుంటి. (మంత్రిని నాలుగు తన్ని, దశరధుణ్ని చావగొట్టి) మూర్ఖా నిన్ను క్షమించితినిరా.

దశ—(ఆనందంతో లేస్తూ) హా హతోస్మి హతోస్మి.

విశ్వా—(వేలు గిర్రున్న ద్రిప్పి) బంపవా?

దశ—నేను వచ్చె—

విశ్వా—(కమండలంలో నీళ్లన్నీ దశరధుడి నెత్తిమీద పోసి) గీ॥ నేనె కుసికుని తనయుడ నేని—

దశ—అం? అం! శపించవలదు.

మంత్రి—మాటిమాటికి శపింతు నని భయపెట్టెద వేల నోయీ?

విశ్వా—ఏమిరా శుంఠా! నీకు కూడ నాలుగు శాపాలు కావలెనా యేమి? (దశరధుని బుగ్గ పొడిచి) ఏమి మాటాడ వేమిరా పశువా!

దశ—దశరధరాజేంద్రముండ నగు నేను అరవైవేల యేండ్లు చక్కగా రాజ్యంబు చేసితిని. అందువలన యిపుడు ముసలివాడ నై యున్నాడను గనుకా—

విశ్వా—ఓరి ముసలి పీనుగా! (కమండలం అతని తలమీద బోర్లించి)

గీ॥ నేనె కుసికుని తనయుడ నేని—

మంత్రి—అం! శపింపవలదు. దశరథనృపాలా! విశ్వామిత్రుడు బస్సుపాటను చాలా బాగా పాడ గలడని వినియున్నవాడ. గనుక అద్దాని నతనిచే పాడింపుమా!

దశ—విశ్వామిత్రా! బస్సుపాట పాడి మమ్ము లను ఆనందాగ్నిలో కాల్చివేయుమా!

విశ్వా—ఓరి శుంఠా! నేను అందరివలె గ్రామఫోనుపాటలను సబువూ సందర్భమూ లేక పాడతా ననుకొంటివా? ఏమిరా మూర్ఖా! అసలు సంగతి యేమి చెప్పితివి?

దశ—పంపజాల! పంపజాల.

విశ్వా—గీ॥ నేనె—

మంత్రి—పంపుము రాజేంద్రా శాపములు తిన నేల?

విశ్వా—(ఆనందంతో మంత్రితో) మా మంచి మాటాడితివిరా శుంఠా! (దశరథునితో) ఓరీ ముసలి గాడిదా! లోకంబున అరుమార్గంబులు సామభేద ధన దండోపాయంబు లని వున్నయవి. అందు మొదటి అయిదును నీయందును ప్రయోగించితిని గాని లాభంబు లేకపోయె గాన నీపై నిదే

ఆరవ వుపాయంబగు దండంబును ప్రయోగించు చున్నాడను కొంచుకొను (రెండు చేతుల్లోను తంబూరా పట్టుకుని దాన్ని దశరధుని తన్నడానికి పైకెత్తుతాడు.)

మంత్రి—(చటాల్న అతంబూరాను పట్టుకొని) శాంతింపు, శాంతింపుము. నీవు దశరధుని అట్లు శపింపరాదు. అతనిని నీవు తన్నరాదు. అతనిని నీవు ముసలిగాడిదా యని బిలువరాదు. నీవు మాత్రము యౌవనుడవా యేమి?

విశ్వా—ఓరి భ్రష్టా ముష్టితుకునే జెష్టా! నీతో నాకేల యిష్టాగోష్ఠి? (దశరధునితో) కౄరా! రఘువంశ సుధాకరా! నిస్సారా! సదాచారా! ఘోరాకారా! రిపుభీకరా! నీకుమారా! ఎందుకు రా బంపవురా?

దశ—విశ్వామిత్రా! కుసికసగోత్రా! ఆరంభ సూత్రా! అపాత్రా! ఘోరపవిత్రా! దుర్భర చారిత్రా? బంప నాదు పుత్రా! మనసు లేదు మిత్రా!

విశ్వా—గీ॥ నేనె కుసికుని తనయుండ నేని—

మంత్రి—విశ్వామిత్రా నీవు కుసికుని తనయుడవగుట కేదేని సందేహ ముండియుండవలయును. లేనిచో పదేపదే అట్లేల యందువు?

విశ్వా—కొంచుకో! కొంచుకో!

దశ—శాపము వలదు, ఓరీ మంత్రీ అమృతమును విషము చేయక (అలస్యా దమృతం విషం) రామలక్ష్మణుల గొనిరమ్మి పొమ్ము.

మంత్రి—చిత్తము దేవరా (వెళ్తాడు)

(పటాపట్కాయశబ్దము, లైటు లారిపోతాయి. ఫోకసింగు రాముడు భూమిలోనుంచి పైకి లేస్తాడు. వలంగా వుంటాడు, పెద్దబొజ్జా, ఒంటినిండా నీలిరంగూ, బొద్దుమీసాలూ, తలను అట్ట కిరీటం. చేతులో దసరా బాణం. కాళ్లకి మువ్వలూను)

రాము—(పాట)

అమ్మ నాకూ బంగారు బండి కొని యియ్యవే!
బండి నేను యెక్కాద న్చెల్చెల్చె ల్లొక్కాదన్॥అ

నేనే గదా సర్వేశ్వరుండను. నన్నే కొందరు మూఢులు విష్ణువనియు, రాము డనియు, శివుడనియు అల్లా అనియు అల్లాటప్పయ్య అనియు యిత్యాది చాలా నామంబులతో పిలచుచుందురు. ఈమాయానాటకమునకు సూత్రధారుండను నేనే గదా. నేను త్రాగుచుందును. నేను త్రాగెడివి బ్రాండీ విస్కీలు గావు గోపికాగృహంబులందలి పాలు. నేనొకప్పుడు శయనించుచుందును: వేశ్యాగృహంబుల కాదు, గోపికాగృహంబుల. నామాయల నెవ రెరుంగుదురు? కంట్రాక్టరు యేభైయెనిమిది రూపాయలూ కక్కకపోతే మొహానికి కోటూ అయినా వెయ్యని వీరాధివీరుడను నేనే గదా! ప్రస్తుతము నేను బాలునివలె మెలగవలయును. అందునను పసిబాలునివలె మెలగవలయును. పాపము వృద్ధుడగు యీదశరధుండు నన్ను తన కుమారు డనియే నమ్మికొనుచున్నాడు (దశరధునితో) నాన్నా! నన్నేమో నువ్వేమో! మలి మలి అమ్మినావుతగా.

దశ—అవును రా నాకును కౌసల్యకును బుట్టిన కొడకా!

రాము—(మీసం దువ్వుకుంటూ) అయితే మలి, నన్ను నన్నెందుకు అమ్మినావు? నాకు బండి కొని త్తావు? ఏం నాన్నా? ఎంచక్కా నేనాడుకుంటాను? నేనూ తమ్ములూ బండెక్కుతాం. వూలి కెళతాం. ఏం నాన్నా? అయితే మలేమో నువ్వేమో మిటాయుండ కొనియ్యవూ?

మంత్రి—ఆహా పల్కు లెంత చక్కగానున్నవి. అవి కని విని తిని ఆనందింపవలసినవే గాని వర్ణింపవలసినవి కావు.

దశ—ఇంత అమాయకుని యింత పసిపాపను నేను ఎటుల బంపగలను. ఘోరఅరణ్యాలలో మ

ళ్ళుండవా? అముళ్ళు యితని కాళ్లలో గుచ్చుకోవా? అముళ్లను తీయుటకు అరణ్యాలలో మంగళ్లుందురా? హా! విశ్వామిత్రా నీకు నాపై నేల దయ కలుగదురా?

విశ్వా— ఏల యేడ్చెదు? ఇందాక నన్నడిగితివే బస్సుపాట పాడమని. సమయమువచ్చినది యిపుడు. నువ్వు నన్ను శ్రీరాముని అరణ్యాలకు యెట్లు తీసుకు వెళ్లెద వని అడుగుము.

దశ—నీవు శ్రీరాము నడవుల కెట్లు తీసుకు వెళ్లెదవు?

విశ్వా—మూర్ఖా వినుము—

(పాట)

బస్సు పుట్టిందోయి బాబూ బస్సు పుట్టిందీ
ఆబస్సు పుట్టి బళ్లవాళ్ల కడుపు కొట్టిందీ ॥బ॥

అటువంటి మహాబస్సు నెక్కించి నీకుమారుని తీసుకుని వెళ్లెదను. రామా నీవు నాతో అరణ్యంబుల కరుగుదెంచంగ వలయు. అక్కతమున నీవు త్వదీయ తండ్రియొద్ద సెలవుం గయికొమ్ము.

రాము—(తండ్రి దగ్గరగా జరిగి) నాకు బయమేస్తంది.

విశ్వా—ఆదిమధ్యానంతరరహితా! నీకా భయంబు. గనుక జాగొనరింపక దశరథుని యొద్ద ఆజ్ఞ బొంది విశ్వామిత్రమహాముని నగు నావెంట రమ్ము.

రాము—ఆహా! వీరందరును వొఠ మూర్ఖులును శుంఠలును. యెందుకూ పనికిరానివారలే గదా! లేకున్న యెడల రాముండ నగు నేనాజ్ఞ బొంద వలయునా?

సీ. భద్రాద్రిరఘురాము భజనకు జనుచుండ
బంధుమిత్రుల యాజ్ఞ బడయ నేల?

..............................

జనకశ్రేష్ఠమా! నేను ఘోరకీకారణ్యములకు అరుగుచుంటిని. తిరిగి మరలి వత్తునో రానో. మరల నిన్ను దర్శించు భాగ్యము నాకు కలుగునో కలగదో కదా? ఇవే నాకడపటి నమస్కారములు! (వలవల యేడుస్తాడు.)

విశ్వా—(రాముడి వేపు కోపంగా చూస్తూ) శుంఠా! ఎంత ఆలస్యంబును చేయుచుంటివిరా (కమండవులోనికి తన చేతిని పోనిచ్చి)

గీ॥ నేనె కుసికుని తనయుడ నేని—

దశ—హా! శ్రీరామచంద్రా! రఘుకులాబ్ధి సూర్యా! రావణసంహారకా! జానకీనాథా! పాహిమాం! పాహిమాం! (వలవల యేడుస్తాడు)

మంత్రి—హా తనయా రామా! (యేడుస్తాడు)

విశ్వా—ఓరీ రామా యీతంబూరాను పట్టుకో. ఇప్పుడే మన ప్రయాణమునకు ముహూర్తమును పెట్టెదను. (తంబూరాను రాముని కందిస్తాడు. ఒక్క పొడుంచిటా పీల్చి చంకలోని పంచాగం తీసి విప్పి, వొక పాత సులోచాలజోడు—కళ్లద్దాలు—తీసి కళ్లకు తగుల్చుకుని పంచాంగంలో నాలుగు కాగితాలు తిప్పి) ఆఁ. అమావాస్యా, మంగళవారం త్రిపాది నక్షత్రం, మధ్యాన్నం వొంటిగంటన్నరకి వర్జం, అనగా యిప్పుడు వర్జమన్నమాట. బ్రహ్మసృష్టికి ప్రతిసృష్టి యొనర్చిన నాకు వర్జముతో పని యేమి? ముహూర్తము చాలా బాగున్నది. ఇక పద రామా!

దశ—విశ్వామిత్రా! వర్జముతో నా కుమారుని తీసుకు పోయెదవా?

విశ్వా—అవునురా మూర్ఖా. అయిన నీవే మందువు? మారు మాటాడిన శపించివేసెదను. (తెర లోనికి చూస్తూ కుడిచేయి పైకెత్తి గట్టిగా—) ఓ పౌరులారా! వినుడు వినుడు!

(పాట)

బలే మాంచి చవుక బేరమూ!

..............................

(పాటంతా పాడి రాగం తీస్తూ తెరలోనికి నడుస్తాడు.)

రాము—నేను తప్ప యీలోకంబున అందరును
మూర్ఖులే గిదా (అతను కూడా లోపలికి పోతాడు.)

(మంత్రి, రాజు, పోక ర్నొకరు గట్టిగా కౌగ
లించుకుంటారు.)

మంత్రి—నాయొక్క బ్రతుకు బండ లయి
పోయినది.

దళ—నాయొక్క బ్రతుకు నీ రయిపోయినది.

(మంత్రి 'పోవు చున్నాడే నావిభుని జీవము
అనూ గొని' అన్న పాటను పాడుతూ తెరలోనికి
పరుగిడతాడు. రాజు 'పోయె నయ్యో యిపూడు
నన్ను బాసి ఆహాంతరూల మిన్నా' అన్న పాటను
సాంతంగా విరహాన్ని నటిస్తూ పాడి 'హా!' అని
పెద్ద బొబ్బ పెట్టి దుఖాలున మూర్ఛిల్లుతాడు తెర
మఖాలు కని పడుతుంది.)

* * *

ఈవిషాదాంతప్రహసనాన్ని, నేటి కంట్రాక్టరు
లకూ కంట్రాక్టునటకులకూ, ఆనాటకాలను చూచి
హాంగిపోయే ప్రేక్షకజనానికీ, భక్తిపూర్వకంగా
అంకితం చేసుకొంటున్నాను.



# వేయి స్తంభాల గుడి శాసనము

పరిష్కర్త:—విద్వాన్ కంభంపాటి అప్పన్నశాస్త్రిగారు

మధ్యయుగంనాటి ఆంధ్రదేశపు చరిత్ర కీగ్రంథం
చాలాముఖ్య మయినది. కాకతీయరాజుల పూర్వ
చరిత్రకు మూలస్తంభ మైన హానుమకొండ వేయి
స్తంభాలగుడిలోని శాసనం ఇందులో సర్వతోము
ఖంగా చర్చించబడింది. హానుమకొండలో ఒక
పరిశోధకమండలిని స్థాపించి నైజాంరాష్ట్రంలో
గల చారిత్రికసామగ్రిని బయల్పెడలించడానికి
కృషిచేస్తూన్న శ్రీ అప్పన్నశాస్త్రిగారు దీనికి పరి
ష్కర్తలు. ఈగ్రంథంలో పీఠిక, శాసనోపక్రమ
ణిక, చరిత్రాంశములు, శాసనమూలము, అనువా
దము, అనుబంధము అని ఆరుభాగా లున్నాయి.
ఇంతేకాక దీనిలో చక్కని పదిహేను చిత్ర
పటాలూ, మూడు దేశపటాలూ కూడా ఉన్నాయి.

ముద్రణము:—ఈగ్రంథం మేలురకం కాగితా
లమీద ముద్రించబడింది. అయినా దీనిలో ప్రమా
దాలూ, స్ఖాలిత్యాలూ ఎక్కువగా వున్నాయి.
శుద్ధపత్రం యొక్క పరిమితి ఐదు పేజీలు. ఇదిగాక
పీఠికలో మరికొన్ని సవరణ లున్నాయి. అయినప్ప
టికీ అనేకాలైన తప్పు లింకామిగిలి వున్నాయి.
శుద్ధపత్రంలో పుస్తకం చదువుకొనేవారు కొన్ని
భాగాలు చదవటం మానివెయ్యా లనీ, కొన్ని
చోట్ల కొన్ని పంక్తులు మార్చి చదువుకోవా లనీ
సూచించారు పరిష్కర్తగారు. ఇది పాఠకులకు
చికాకుకలిగిస్తుంది. (చూ. శా. ప, పే ౧,౨, ౩,౪)
కొన్ని పేరాగ్రాపులకు శీర్షికలు వేయబడలేదు. ఇం
దువల్ల ఒక విషయం ఇంకొక విషయం కలిసిపో
వటం జరుగుతుంది. ఒక్కొక్కప్పుడు అనవస
రంగా పాఠకులకి చిక్కు కలుగుతుంది. ఉదా.
౪౨ పేజీలో ౩ వ పేరాలో "రుద్రదేవుడు తన
తండ్రినిఁ జంపె ననుట నిజమా?" అనే శీర్షికతో
రెండవ ప్రోలరాజు మరణాన్ని చర్చించారు.
తుదకు వెలనాటి రెండవ చోడరాజు ఇతన్ని చంపి

వుంటా డనే నా అభిప్రాయాన్ని అంగీకరించారు. వెంటనే ౪౩ పేజీలో రెండవ పేరాను "ఇతని చావునకుఁ గారణము దేవగిరిరాజ్యాధీశు డైన జైత్ర పాలుఁడు" అని మొదలుపెట్టారు. ఈ పేరాలో చర్చింపబడ్డ అసలు విషయం ప్రోలరాజు కొడుకు రుద్రదేవుడి మరణం. చదివే వారికి మాత్రం పైపేరాలో ప్రోలుడి మరణాన్ని గురించి ఒక నిర్ణయం సి తిరిగీ దాన్ని గురించి ఇంకొక విధంగా ఎందుకు వ్రాశారా? అని సందేహం కలుగుతుంది. దీనికి కారణం యీ రెండో పేరాకి "రుద్రదేవుని మరణము" అనే పేరా హెడ్డింగు లేకపోవటమే. ఇట్లాంటి పొరబాటులు ౬ మొదలయిన పేజీల్లో కూడా వున్నాయి.

అనుక్రమణిక:—ఈశాసనంలో వచ్చే వ్యక్తుల యొక్క, స్థలాలయొక్క చర్చ గల భాగానికీ, శాసనమూలానికీ కలిపి ఒకటే అనుక్రమణిక తయారుచెయ్యబడింది. దీనివల్ల కూడా కొంత చిక్కు పాఠకులకి కలుగుతుంది. కొన్నిచోట్ల ఒకే అక్షరం క్రింద వ్యక్తుల పేర్లూ, స్థలాల పేర్లూ, శాసనారంభ పదాలూ, శాసనాల మధ్యలో వచ్చే మాటలూ వస్తాయి. (చూ. "అ" లో 'అనుమకొండ' ౧,౧౦,౧౩. ఇది చారిత్రిక భాగంలోని మాటకు సూచన. "అనుమకొండ నామ నగరీ" ౬౦ శా. ప ౩౪, ౭౬ ఇది శాసనశ్లోకారంభ మధ్యాంత్యాలలో ఎక్కడైనా సరే వచ్చే మాటకు సూచన.) ఇంత కంటే శాసనమూలాని కొకటిన్నీ, చారిత్రిక భాగాని కొకటిన్నీ వేర్వేరు అనుక్రమణికలు చేర్చితే బాగుండేది.

చిత్రపటాలు:— ఈగ్రంథంలోని చిత్రపటాలు కాకతీయుల కాలపు కళాపరిణామాన్ని తెలుసుకోడానికి మిక్కిలి తోడ్పడగలవు. అయినా వీటిని గూర్చి ఒక మాట చెప్పవలసి వుంది. ఇందులో ౪, ౫, ౭, ౯, ౧౦, ౧౧, ౧౪ సంఖ్యలు గల చిత్రాలు ఏకశిలానగరానికి సంబంధించినవి. ప్రకృతశాసనంలో యీనగరం ప్రశంస యేమీ లేదు. పైపటాలు చేర్చడం అనవసర మేమో. వీటిలో ౧౪౯ పేజీ కెదురుగా వున్న చిత్రానికి ఇంగ్లీషులో "supposed Head of Prataparudra" అని రాసి కూడా తెనుగులో "...ప్రతాపరుద్రుని శిరస్సు" అని నామకరణం చేశారు పరిష్కర్తగారు. ఇట్లా అనటానికి ఆధారాలు శాసనాల్లో గాని, వాఙ్మయంలో గాని ఏమీ కనపడవు. ఈశిల్పం పక్కనే వున్న ఒక లింగంమీద చెక్కబడి వున్న దేవతల ముఖాలతో పోల్చి చూస్తే యీశిల్పం ఒక మనుష్యుని దనీ, బహుశః ఒక రాజు దని తెలుస్తుంది. అంతే కాని ప్రతాపరుద్రుని శిర స్సిది అని అనటాని కాధారం లేదు. (ఈశిల్పపుచిత్రాన్ని ౧౯౩౭ ఏప్రిల్ భారతిలో నేను ప్రకటిస్తూ "రాజు తల" అని వ్రాశాను.) అంతే కాకుండా యీగ్రంథంలో వుండే యీ శిల్పం యొక్క బ్లాకు పాఠకులకి ఒక తప్పు భ్రమ కలగజేస్తూంది. సరిగా కంఠంమొదటికి విరగగొట్టబడ్డ యీశిల్పఖండాన్ని ఫొటోగ్రాపు తీసిన వారు ఒక రాతి కట్టపైన పెట్టి ఫొటో తీశారు. అందువల్ల యీకట్ట శిరస్సుక్రిందవుండే భుజాలు విరుగగొట్టడంవల్ల కన్పించే మొండెంవలె కనపడుతూంది. వాస్తవంగా యీశిల్పాన్ని చూడని వారు ఇది రోమనుల శిల్పంలో వుండే Bust వలె ఉన్న దని భ్రమిస్తారు. ఈగ్రంథంలో వున్న చిత్రపటాలని గురించి ఇంకో మాట చెప్పవలసివుంది. ఇది ౭౨ పేజీ తర్వాత "పద్మాక్షిగుడిలోని మతియొక స్త్రీవిగ్రహము" అనే చిత్రాన్ని గురించి. ఇది పురుషవిగ్రహం కాని స్త్రీవిగ్రహం కాదు. పద్మాక్షి గుడిలో ఎడమవైపున ఒక రాతిమీద ఒక జైనతీర్థంకరుడు అతని కెడమవైపున ఒక స్త్రీ విగ్రహం, కుడి వైపున ఒకపురుషవిగ్రహం చెక్క

బడి ఉన్నాయి. ఈరెండున్నూ ఈతీర్థంకరుడి యక్షిణీయక్షులవి. పరిష్కర్తగారు పైయక్షుడి విగ్రహాన్ని స్త్రీమూర్తి అని పొరబాటుగా పేర్కొన్నారు. ఈగ్రంథంలో ముఖ్యంగా వుండతగినది వేయి స్తంభాల గుడి శాసనపు ప్రతిబింబం. ఎన్నో యితరచిత్రాలను యీగ్రంథంలోచేర్చిన పరిష్కర్తగారు యీవిషయాన్ని గమనించి వుండవలసినది. డాక్టరు ఫ్లీటుయొక్క ఇతర పండితులయొక్క పాఠాలను సవరింపబూనుకున్న పరిష్కర్తగారు శాసనప్రతిబింబాలను కూడా ప్రకటించివుండవలసింది. అప్పుడు కాని వారి స్వతంత్రపాఠాలను విమర్శించడానికి వీలు కాదు.

తప్పుపేర్లు:—ఈగ్రంథంలో కొన్ని ముఖ్యమైన పేర్లు అనేకస్థలాల్లో తప్పుగా వున్నాయి. ౧ ఇండియన్ ఆంటిక్వారియన్ Indian Antiquarian, (చూ. పే.IX, ౩, ౧౧.౧౬), ౨Deccan History by Dr. R. Bhandarkar (పే. ౨౫), ౩ List of Antiquaries, (పే. ౩౫), ౪ బిజ్జన (పే. ౨౫, ౫౯) ౫ కదలాలయ (పే. ౨౬, ౫౦) ౬ హాల్జుప్రభువు(పే. ౩౧) ౭ దొమ్మరాజు (పే. ౩౫). మొదలగునవి ఇందుకు కొన్ని నిదర్శనాలు.

అనుబంధము:—పరిష్కర్తగారు అనుబంధములో నాలుగు శాసనాలు ప్రకటించారు. అందులోని రెండు మూడు నంబర్లు గలవాటికీ వేయి స్తంభాల గుడి శాసనానికీ ప్రత్యక్షసంబంధం లేదు. నాల్గో శాసనం చాలా ముఖ్యమయినదే కాని దానిలో తప్పులు చాలా వున్నాయి. మూడో శ్లోకంలో నాల్గో పాదంగా వ్రాయబడినది మొదటి పాదం. నాలుగో శ్లోకం పరిష్కర్తగారివలె విభజిస్తే ఛందోభంగం కలుగుతూంది. ఈశ్లోకాలను వారు నేను చదవగా వ్రాసికొన్నా మని నారు. నావద్దనున్నది నేను వారికి చూపించినది అయిన ప్రతిలో యీతప్పులేమీ లేవు. ముద్రణకు పంపేటప్పుడైనా పరిష్కర్తగారు వీనిని సవరించుకొని వుంటే బాగుండేది. ముఖ్యంగా అనుబంధంలో చేర్చవలసిన కొన్ని శాసనాలున్నాయి. వాటివల్లనే మనకు వేయి స్తంభాల గుడి శాసనంలో చెప్పబడ్డ స్థలాలనూ కాకతీయప్రత్యర్థులనూ నిర్ణయించడానికి వీలవుతుంది. నైజాంరాష్ట్రములోని జటచర్ల నెక్కొండ నగునూరు మొద లయిన గ్రామాలలోని శాసనాలిట్లాంటివి. ఇవన్ని కూడా సుజాత పత్రికలో ప్రకటించబడి వున్నాయి. సుప్రసిద్ధచారిత్రికపరిశోధలకు అయిన శ్రీశేషాద్రి రమణకవులు భారతి ౭ సంపుట ౬ సంచికలో వీటిని గురించి ఒక చక్కని వ్యాసం వ్రాశారు. నేను కూడా నా 'కాకతీయుల చరిత్ర'లో వీటిని ఉదహరించాను. పరిష్కర్తగారు వీటి నన్నిటినీ చూచే వున్నారని వారి గ్రంథం తెలుపుతూంది. అయినప్పటికీ వారు యీశాసనాలను అనుబంధంలో చేర్చకపోవడం వింతగా వుంది.

చారిత్రికవిషయాలు:—ఫ్లీటు, కృష్ణశాస్త్రి రామయ్యపంతులు, వీరభద్రరావు, సోమశేఖరశర్మగార్లున్ను, ఇటీవల శేషాద్రిరమణకవులున్నూ నేనున్నూ చర్చించిన చారిత్రికవిషయా లనేకాలు యీగ్రంథంలో వున్నాయి. సందర్భాంతరాలలో వ్రాయబడ్డ అభిప్రాయాలనూ సమన్వయాలనూ ఒకచోట కేంద్రీకరించి పరిష్కర్తగారు వాటికో నూతనత్వాన్ని ఇచ్చారు. వీరి అభిప్రాయాలు చాలావరకు నేను నా కాకతీయులచరిత్రము లో తెలిబుచ్చిన అభిప్రాయాలతో సరిపోతున్నాయి. అయినా మరికొన్ని సందర్భాలలో పరిష్కర్తగారి ఊహాలు విమర్శార్హాలుగా వున్నాయి. వాని నీక్రింద వివరిస్తున్నాను.

---

౧ ఇండియన్ ఆంటిక్వేరీ. Indian Antiquary, ౨ Early History of the Deccan by R. G. Bhandarkar, ౩ List of Antiquities, ౪ బిజ్జలుడు. ౫ కడలాలయు. ౬ హూలాల్షు పండితుడు, ౭ దొమ్మరాజు.

(౧) "ఈశాసనమునందలి తెనుగు గద్యను బట్టి అచింతేంద్రవరదు డుభయభాషాప్రవీణు డని మనము విశ్వసింపవచ్చును. ఈయన వ్రాసిన తెనుగు వచనం సలక్షణ మైన జాతీయభాషలో నున్నందున..." అని వ్రాశారు పరిష్కర్తగారు. (చూ. పే. ౧౯, ౨౦). ఈ ఊహకి వారు చూపిన కారణం చాల దు. పై తెనుగు గద్య మన దస్తావేజుల మతలబుల వలె ప్రతిశాసనంలోను, మొదటనో, చివరనో వుండేదే. దీనిని చేర్చడం కేవలం ఒక లాంఛనం. దీన్నిబట్టి కవియొక్క భాషాజ్ఞానం గాని, కవితా నైపుణ్యం గాని ఎంతమాత్రం తెలియవు. అట్లయితే శాసనరచయిత లందరూ కూడా భాషావేత్త లనిన్నీ మన దస్తావేజులు మొదలయినవి వ్రాసేవా రంతా ఆంధ్రపండితు లని చెప్పవలసి వస్తుంది.

(౨) వేయిస్తంభాల గుడి శాసనంలో రెండవ బేతరాజు "న్యగ్భూతీకృతనాయకః" అని వర్ణించ బడ్డాడు. (శ్లో. ౯) పాశ్చాత్యచాళుక్యచక్రవర్తి ఆరవ విక్రమాదిత్యుడి యొక్క 'త్రిభువనమల్ల' అనే బిరుదు రెండవ బేతరాజు క్కూడా వుంది. ఈరెండు విషయాలనూ పురస్కరించుకొని పరిష్కర్తగారు న్యగ్భూతీకృతనాయకః=తిరస్కరింప బడిన ప్రభువు అని అర్థం చెప్పి ఆప్రభువు ఆరో విక్రమాదిత్యు డని సమన్వయించారు. "అట్లగుట చేతనే యతని బిరుదమును బేతరాజు ధరించినా" డని వారి ఊహ. ఈఅర్థమూ, ఊహా కూడా చరిత్రకి విరుద్ధంగా వున్నాయి. బేతరాజు విక్రమాదిత్యుడికి సామంతు డనీ ఆశ్రితు డనీ "తత్పాదపద్మోపజీవి, పతిహితచరిత" మొదలయిన హనుమకొండకన్నడశాసనంలో యితని బిరుదులున్నూ, ఇతని మంత్రి ఇతనిచేత విక్రమాదిత్యుడి పాదాలకు మొక్కించా డనే విషయమూ స్పష్టపరుస్తున్నాయి. అంతే కాకుండా ఒక వ్యక్తి ఇంకొకడి బిరుదులు తాను ధరించా డంటే అతని యెడల తన కుండే భక్తిగౌరవాల్ని సూచించడమే. ఉద్దేశ్యం. అనేక మంది సామంతులు తమ రేలికల బిరుదుల్ని యిలా ధరించారు. (ఉ. పల్లవరాజైన మొదటి మహేంద్ర వర్మకుండే "మదనవిలాస, మాద్యచిత్తా"ది బిరుదులు రేనాటిరాజయిన పుణ్యకుమారుడు ధరించాడు.) పశ్చిమచాళుక్యరాజుల బిరుదు లైన "త్రిభువనమల్ల, త్రైలోక్యమల్ల" మొద లయిన బిరుదులు ఆంధ్రచోడసామంతు లెందరికో ఉండేవి. ఒక రాజును ధిక్కరించి ఇంకొక రాజు వహించే బిరుదులింకో విధంగా వుంటాయి. (ఉ. కంపిలయువరాజైన కుమారరాముడు కాకతీయప్రతాపరుద్రుణ్ణి ధిక్కరించి "వీరరుద్రనగండ" అనే బిరుదు ధరించాడు.) కనుక రెండో (కాకతీయ) బేతరాజు విక్రమాదిత్యుణ్ణి తిరస్కరించా డనే పరిష్కర్తగారి ఊహా సరి యైనది కా దని తోస్తూంది.

(౩) అనుబంధంలో వారు ప్రకటించింది కాక ఖాజీపేటలో దొరికిన మరి రెండు శాసనాలని గురించి ప్రశంసిస్తూ పరిష్కర్తగారు ఇవి రెండూ ఒకటే శాసన మనీ, అది రెండవ బేతరాజు దనీ ఊహించారు. (చూ. పే. ౨౦, ff ౨౪). ఇది సరి కాదు. ఇందొకదాంట్లో విక్రమాదిత్యుడి సామంతుడైన బేతరాజూ, అతని తండ్రి పోలరస పేర్కొ బడ్డారు. ఈ బేతరాజు రెండో బేతరాజే. రెండో శాసనం దుర్జయవంశీకు డైన బేతరాజునీ, అతని కొడుకు ప్రోలరాజునీ పేర్కొని యీప్రోలరాజు ప్రతాపాన్ని వర్ణిస్తుంది. ఇది రెండవ ప్రోలరాజు నాటిది. ఈవిధంగా ప్రత్యేకంగా వున్న యీరెండు శాసనాలూ ఒకటే అనటానికి ప్రమాణం ఏమీ లేదు.

(౪) రెండో ప్రోలరాజు రాజ్యాంత్యసంవత్సరాన్ని గురించి పరిష్కర్తగా రొక కొత్త సిద్ధాంతం చేశారు. ఈకాలం క్రీ. శ. ౧౧౫౮ అయ్యుంటుం దని నే నిదివరలో వ్రాశాను. శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు క్రీ. శ. ౧౧౪౦ అని ఊహించారు. పరిష్కర్తగా రీరెండు తేదీలనూ త్రోసి

పుచ్చి ప్రోలరాజు క్రీ. శ. ౧౧౪౯ లో మరణించాడని వ్రాశారు. (చూ. పే. ౨౫-౨౬, ౩౪-౩౫) వీరికి ప్రమాణం రాజరాజు ౨ (౩) వ సంవత్సరంలో కాకతిరుద్రుడి భార్య చేసిన ధర్మాన్ని తెలిపే ద్రాక్షారామశాసనం. దీన్ని శ్రీసోమశేఖరశర్మగారు ఉదహరిస్తూ ద్రాక్షారామంలోనే రుద్రదేవుడి మంత్రిది రాజరాజు ౧౩ వ సంవత్సరంనాటిది మరొక శాసనం కూడా వుందని వ్రాశారు. ఈరాజరాజు ౧౩ వ రాజ్యసంవత్సరం. క్రీ. శ. ౧౧౫౯ కి సరి అవుతుందని పరిష్కర్తగారే అంగీకరించారు. దాన్ని బట్టి వారు ప్రమాణంగా గ్రహించిన రాజరాజు ౨౩ వ సంవత్సరపు శాసనం క్రీ. శ. ౧౧౬౯ అవుతుంది. కాని పరిష్కర్తగారనుకొన్నట్లు క్రీ. శ. ౧౧౪౯ కానేరదు. కళింగసంచిక (పే. ౧౭౪) లో శ్రీశర్మగారు వ్రాసిన దానిని పరిష్కర్తగారు సరిగా అర్థం చేసుకోలేదు. గ్రంథంలో ఇల్లా వ్రాసి వారు శుద్ధపత్రంలో యీభాగం ఎక్కడ వచ్చినా వదలివెయ్యాలన్నారు. దీనికి కారణమేమో తెలియదు. ఇట్లాంటి వ్రాతలు పాఠకులని పెడదారి తొక్కిస్తాయి.

(౫) కాకతిరుద్రుడి అంత్యసంవత్సరాన్ని గురించి కూడా పరిష్కర్తగారు నూతనసిద్ధాంతం ఒకటి చేశారు. పిల్లలమఱ్ఱి గ్రామంలో శాసనం ఒకటి ఆధారంగా కాకతిరుద్రుడు క్రీ. శ. ౧౧౯౫ లో మరణించి వుంటాడని నేను వ్రాశాను. కాని పరిష్కర్తగారు Sewell పండితుడు List of Antiquities లో కుంకలగుంటగ్రామంలో క్రీ.శ. ౧౧౯౭ నాటి శాసనం ఒకటి కలదన్నాడనీ, ఈశాసనసంవత్సరమే రుద్రుడి అంత్యసంవత్సరమనీ వ్రాశారు. కాని ఈశాసనం విశ్వసనీయం కాదు. Sewell గారే యిది చాలా అరిగిపోయిందనీ, జాగ్రతగా పరిశీలింపతగిందనీ, ఇందులో ప్రతాపరుద్రుడి పేరు కనపడుతూందనీ, దీనికాలం శా. శ. ౧౧౧౯ (క్రీ. శ. ౧౧౬౭) కావచ్చుననీ వ్రాశారు. Dr. Burnell గారు దీని కాలం క్రీ. శ. ౧౨౨౯ అన్నారు. ప్రతాపరుద్రుడి పేరిందులో వుంటే Sewell గారిచ్చిన కాలం తప్పు. వారిచ్చిన కాలం సరి అయితే ప్రతాపరుద్రుడా కాలంలో ఉండటం అసంభవం. వివాదాస్పదమయిన యీశాసనంమీద ఆధారపడిన పరిష్కర్తగారి సిద్ధాంతం సమంజసం కాదు.

(౬) పరిష్కర్తగారు తమ పీఠిక II వ పుటలో "స్వయముగా యతియునై...శ్రీమత్కాకతి రుద్రదేవునికి బరమగురు వగుటవలన గూడ మన కీయన కావలసినవాడు" అని వేయిస్తంభాల గుడి శాసనాన్ని రచించిన అచింతేంద్రయతిని గూర్చి వ్రాసారు. ఈకవి కాకతిరుద్రుడికి గురువని చెప్పడానికి ప్రమాణమేమీ లేదు.

(౭) హనుమకొండ కన్నడ శాసనంలో చెప్పబడ్డ 'కడలాలయ' ఇప్పటి పద్మాక్షి కాదనీ, కడలాలయ లేక పద్మావతికి ఉండవలసిన లక్షణాలు పద్మాక్షిగుండం దగ్గర దొరకిన ఒక భిన్న విగ్రహానికున్నాయనీ, ఇప్పటి పద్మాక్షి ఆమె గుడిలో చెక్కబడి వున్న జైనతీర్థంకరుడి శాసనదేవి అనిన్ని, కాకతీయోత్సవ సందర్భంలో నేనున్నూ, డాక్టరు నారాయణరావుగారున్నూ అభిప్రాయపడినాము. అంతే కాని పరిష్కర్తగారు వ్రాసినట్లు (చూ. పే. ౫౧) "ఇప్పుడు పద్మాక్షి గుడిలో గలది జైనవిగ్రహము గాదనియు, దానిని తీసి గౌరదేవి బొమ్మ నచ్చట యుంచి యుందురనియు" మేము చెప్పలేదు. మా అభిప్రాయాలు హిందూ, ఆంధ్రపత్రికలలో ప్రకటించబడ్డాయి. వాటిని పరిష్కర్తగారు చూడలేదేమో.

వేయిస్తంభాలగుడి శాసనానికి సంబంధించిన యీగ్రంథాన్ని గురించి ఇంకొక మాట చెప్పవలసి వుంది. ఈశాసనంలోని వ్యక్తులను నిరూపించడానికి నైజాంరాష్ట్రంలోని శాసనాలే ముఖ్యాధారం. ఈశాసనాల్ని బయల్పడలించిన వారు

శ్రీ శేషాద్రిరమణకవులు. వారు ప్రకటించిన వ్యాఖ్యానాలే పండితుల్ని ఈశాసనాల వైపు ఆకర్షించాయి. 'అనుమకొండ శాసనము' అనే శీర్షికతో వారు భారతి ౭ సంపుటం ౬ సంచికలో ప్రకటించిన వ్యాసం వేయి స్తంభాల గుడి శాసనానికి తాళం వంటిది. పరిష్కర్తగారు పైవ్యాసాన్ని, సుజాతపత్రికలో పడ్డ కవుల వ్యాఖ్యానాలనీ చూచినట్టు వారి గ్రంథమే తెలుపుతూంది. అట్లాంటప్పుడు ఈగ్రంథంలో ఒక చోటనైనా నైజాం రాష్ట్రంలో చరిత్రపరిశోధనకి మార్గదర్శకులుగా వున్న శ్రీశేషాద్రిరమణకవుల ప్రశంశ చేయబడక పోడం చాలా వింతగా వుంది.

మొత్తంమీద ఈ గ్రంథం చాలా అమూల్యమయినది. పరిష్కర్తగారు మిక్కిలి కృషిచేసి వ్రాసిన శాసనశ్లోకాల అర్థాన్ని, చారిత్రికాది విషయాలు గల వారి వ్యాఖ్యానాన్ని చదివిన ప్రతివారికీ కాకతీయుల చరిత్రయందే గాక చరిత్ర పరిశోధనయందు కూడా ప్రబల మైన అభిరుచి కలగగలదు. ఈగ్రంథంలో అనేకమంది పండితులు అనేకసందర్భాల్లో వ్రాసిన అమూల్యవిషయాలన్ని క్రోడీకరించబడ్డాయి. శైలి మనోహరంగా వుంది. ప్రకృతశాసనంవలెనే ఆంధ్రదేశపు చరిత్రకి మూల స్తంభాలైన శాసనాలు చాలా వున్నాయి. వాటిని గురించి కూడా ఈవిధంగా ప్రత్యేక గ్రంథాలు రచించడం ముఖ్యావసరం. విద్వాన్ శ్రీ అప్పన్న శాస్త్రిగారీవిషయంలో మార్గదర్శకులయారు. వీరు ఇంకా చక్కని కృషి చేసి, చారిత్రికసామగ్రికి ఖని యైన నైజాంరాష్ట్రంలో వుండే యితర శాసనాది సామగ్రిని బయల్పరచి దేశానికి అమూల్యమైన సేవ చేస్తారుగాక. ఆంధ్రులు వీరి గ్రంథాన్ని, ఉద్యమాన్ని ఆదరించి ప్రోత్సాం ఇస్తారని నేను విశ్వసిస్తున్నాను. *

మారేమండ రామారావు



# హిందీవల్ల తెనుక్కి జరుగుతూ వున్న అపకారం

ఈశీర్షికతో జులై సంచికలో కొన్ని లేఖలు ప్రకటించి వున్నాము. ఇప్పుడివి ప్రకటిస్తున్నాము. ఇంకా మిగిలి వున్నవీ, వచ్చేవీ వరసగా ప్రకటిస్తాము. అయితే హిందీయొక్క దురాక్రమణాన్ని గురించినవారు మనలో చాలా తక్కువగా వున్నారు, కొందరికి ఈవిషయం యింత దూరం వెళ్ళిందా అని అనుమానం కూడా వుంది. జులై సంచికలో ప్రకటించబడ్డ లేఖలూ వ్యాసమూ చూసి గూడా కొందరు "అవునా?" అని తొక్కిళ్ళాడుతున్నారు. సామాన్యభాషగా అంగీకరించబడ్డ హిందీ మన తెనుగు దేశంలో తన స్థానం విడిచిపెట్టి తెనుగు స్థానం ఆక్రమించుకొంటోంది. మేము చేసే ఆక్షేపణ యిదీ. ఇందులోనూ, ♦ వెనకటి సంచికలోనూ చూపించబడ్డ వుదాహరణాలు ఈసంగతి రుజువుచెయ్యగలవు.

---

* ఇది ౯ × ౧౧౯ × ౧౬ పేజీల గ్రంథం. క్రౌన్ సైజు. గ్లేజు కాగితాలు. చక్కని అచ్చూ, బైండింగూనూ. ఆర్టుకాగితంమీద ముద్రించబడ్డ చిత్రపటాలు ౧౫ దేశపటాలు ౩ ఉన్నవి. వెల ౨-౦-౦. కలయువారు కలాభివర్ధని పరిషత్తు—రాజమహేంద్రవరం అని రాయాలి.

♦ "పాలకొల్లు జులై ౮:—పశ్చిమగోదావరీమండల మందలి సుప్రసిద్ధహిందీప్రచారకులు ఈపుర మందలి శ్రీయుత అద్దేపల్లి గంగరాజుగారి సత్రమున దక్షిణభారతహిందీప్రచారసభాఆంధ్రశాఖాసంచాలకులైన శ్రీ పీసపాటి వెంకటసుబ్బారావుగారి యధ్యక్షతను సమావేశమైరి......ఆపిమ్మట అధ్యక్షులు

ఏకవచన మంటేనూ, బహువచన మంటేనూ, యేమిటో తెలవని తెనుగుయువయువతులకు హిందీప్రచారకులు హిందీని నూరిపోస్తున్నారు. ఇది తప్పు కాదా అంటే హిందీవ్యాకరణంద్వారా తెనుగువ్యాకరణం గూడా మేము చెప్పడం లేదా అంటున్నారు. అయితే తెనుగువాళ్ళు హిందీద్వారా తెనుగువ్యాకరణం నేర్చుకోవలసిందేనా? ఇది సక్రమపద్ధతేనా? ఏకవచనబహువచనాలెరగని తెనుగుమనిషికి సామాన్యభాషయొక్క అవసరం యెప్పుడేనా కలుగుతుందా? పైగా హిందీ నేర్పేటప్పుడు ప్రచారకులు తెనుగులో వాడబడే అనేకసంస్కృతపదాలకు అర్థం చెబుతున్నారుట. తెనుగులో సంస్కృతపదాలు వాడేవారు వాటి అర్థం—అథవా భావం తెలవకుండానే వాడుతున్నారా? కాకపోయినా హిందీప్రచారకులు "అగ్రహం" "ప్రబంధకర్త" మొదలైన పదాలకు ఏం అర్థం చెబుతారూ? హిందీ నేర్చుకున్నాకే అనేకమంది తెనుగువారు భారతభాగవతాలు చదువుతున్నారంటే అది సంతోషించతగ్గదా సిగ్గుపడతగ్గదా? ఆంధ్రసాహిత్యమూ ఆంధ్రజాతీయమూ హిందీద్వారా ప్రపంచానికంతటికీ వ్యాపింపచెయ్యవచ్చునంటే హిందీకి యెప్పటికేనా అంత యోగ్యత కలుగుతుందా? అసలు ఆంధ్రసాహిత్యమూ, ఆంధ్రజాతీయతా ఆంధ్రులకేనా యిదివరకు బాగా కాకపోతే మానె కొంతవరకేనా తెలిసిందా? తులసీదాసు తెనుగునందలి అజంతశబ్దాల మాధుర్యం చూసే తన రామాయణంలో అజంతశబ్దాలను వాడేడన్న సంగతి సుబ్బారావుగారు హిందూస్థానీలకు చెబితే బాగుంటుంది; కాని మనకి కాదు. అయితే వొకవిశేషం కూడా వుంది. సుబ్బారావుగారు హిందీ తెనుగంత మధురమైనది కాదని చెబుతున్నారు. సంతోషమే. అయితే యిక తాము హిందీ అంటే అంత ఉక్కిరిబిక్కిరి కావడం యెందుకూ? హిందీ మనకి

---

ఈ క్రింది విధముగ నుపన్యసించిరి. "......హిందీ తెనుగుభాషను నశింపజేయుచున్నదను ప్రబుద్ధాంధ్ర పత్రిక వారి వ్రాతలు చూచిన నాకు ఆశ్చర్యము కలుగుచున్నది. హిందీప్రచారమువలన ఆంధ్రభాష వృద్ధి పొందుచున్నది. ఏకవచనము, బహువచనము అననేమో తెలియని వారలకు హిందీ చదువుచున్నప్పుడది యేమో చెప్పి ఆంధ్రవ్యాకరణము సహితము హిందీప్రచారకులు ప్రచారము చేయుచున్నారు. తెనుగులో వాడబడు అనేకసంస్కృతశబ్దముల కర్థము హిందీభాష నేర్చుకొని చాలమంది విద్యార్థులు తెలుసుకొనగలుగుచున్నారు. హిందీ నేర్చుకొన్నందువలన కొంతమంది సాహిత్యాభిరుచి కలిగి ఆంధ్రమునందును భారతభాగవతములు చదువువారలనే నెరుంగుదును. ఆంధ్రసాహిత్యమును ఆంధ్రజాతీయమును హిందీభాషద్వారా మనము చాల సులభముగా భారతదేశమునకే గాక ప్రపంచమునకంతటికిని తెలియజేయుటకు వీలుండును. ఆంధ్రభాష పరిపూర్ణమైనది. మృదువైనది. ఇందలి అజంతశబ్దముల మాధుర్యమును గ్రహించియే తులసీదాసు తన రామాయణమునందు విరివిగా అజంతశబ్దములనే ప్రయోగించెను.... హిందీప్రచారకులగు మీరలు ఆంధ్రదేశమునందలి ప్రతివారికిని హిందీ నేర్పి భారతీయులుగా తయారు చేయుడు. మీరందరు హిందీభాషాప్రచారము ద్వారా భారతదేశకల్యాణమునకు తోడ్పడుడు. (ఈ సమావేశంలో నిశ్చయించబడ్డ కొన్ని తీర్మానాలు) ౩ ఈ మండలమందలి సభ్యులు జిల్లాయందంతటను విరిగా హిందీప్రేమీమండలులు, వాగ్వర్ధనీసభలు స్థాపించి హిందీనాటకముల ద్వారా కూడ హిందీప్రచారము చేయవలెను. ౫ వ్యాపారులు, రైల్వే అధికారులు, ప్లీడరులు మున్నగువారు తమతమ ప్రకటన బల్లలమీద తెలుగుతోబాటు దేవనాగరిలిపిని గూడ వాడవలయును. ౬ ఈ జిల్లాలో రాష్ట్రభాషావిశారద కొరకొక మహావిద్యాలయము స్థాపించబడవలయును"

౧౧–౭–౧౯౩౮, ఆంధ్రపత్రిక అయిదోపేజీ, నాలుగో కాలం.

సామాన్యభాష అంటే అది అవసరమైనవారు అదియేలాంటిదైనా నేర్చుకుంటారు. అలాంటప్పుడు వారి మతబోధ చెయ్యడమూ, తెనుగువారి తెనుగుతనాన్ని చంపడమూ యెందుకూ? హిందీప్రచారకులు ఆంధ్రులను హిందీ నేర్పి భారతీయులుగా తయారుచెయ్యాలిట. అయితే మనం యిదివరకు భారతీయులం కామా" పశ్చిమగోదావరీమండలహిందీప్రచారకులు జిల్లా అంతటా హిందీప్రేమీమండలులూ, వాగ్వర్ధనీ సభలూ యేర్పరచాలిట. హిందీనాటకాలు కూడా ఆడాలి—ఆడించాలిట. అయితే తెనుగుదేశంలో తెనుగుకంటేనూ హిందీకి ఎక్కువ ప్రచారం కావా లనడం ఆత్మగౌరవంలో చేరుతుందా? ప్లీడర్లూ, వర్తకులూ మొదలయినవారు తమ ప్రకటనబల్లలమీద దేవనాగరిలిపి కూడా వాడాలిట. ఎందుకో? "మేము హిందీదాసులం" అని చెప్పుకోడానికా? లేకపోతే హిందూస్థానీలు వీధిలో వెళ్ళేటప్పుడు తమ ప్రతాపంయొక్క ప్రగమనశీలతను సులభంగా తెలుసుకోడానికా? పశ్చిమగోదావరిజిల్లాలో హిందీప్రచారాని కొక మహావిద్యాలయం స్థాపించాలిట. తెనుగుదేశం మొత్తంమీదేనా తెనుగూ, దాని కవసరమైన సంస్కృతమూ నేర్పడాని కొక మహావిద్యాలయం లేదు. అలాంటి దేశంలో హిందీ నేర్పడానికి జిల్లా కొక మహావిద్యాలయమా? ఇంతవరకూ యింగ్లీషువిద్యాలయాలతోటే తెనుగు కొంపలు గుల్లైపోతున్నాయి. తెనుగు భాష వెనకపడుతోంది. తెనుగుకవులు, తెనుగు గ్రంథకర్తలు కూలబడిపోతున్నారు. తెనుగుపత్రికలు గుంటపువ్వులు పూస్తున్నాయి తెనుగుజాతి వొక విధంగా ఆత్మగౌరవానికి దూర మవుతోంది. ఈస్థితిలో హిందీమహావిద్యాలయాలు కూడానా?

సంపాదకుడు

౧

జూను సంచిక "ప్రబుద్ధాంధ్ర"లో సంపాదకులు "హిందీభాషవల్ల తెలుక్కి జరుగుతున్న అపకారం" గురించి పేజీ మించని అభిప్రాయాలు కోరుతూ హిందీప్రచారకులను హద్దులో ఉంచటమే తమ అభిప్రాయ మని చెబితే హిందీభాషవల్ల తెలుక్కి జరుగుతూన్న అపకార మేమిటో నాకు తెలీకపోయినా, తెలుగువాళ్లు దేన్లో జొరబడ్డా వేలంవెర్రే నని తెలుసు కాబట్టి హిందీప్రచారంలో అంత వేలంవెర్రి అవసరం లేదని ఉద్బోధిస్తా రేమో కదా అనుకున్నాను. కాని జూలై సంచిక చూచిన మీదట వ్యవహారం చాలా ముదిరినట్టు కనిపిస్తున్నది. శేకుపల్లి కామేశ్వరరావుగారు అనేక పేజీలు రాయటమే కాకుండా హిందీఉద్యమానికి ప్రతిఉద్యమం ఒకటి బయల్దేరదియ్యా లని కూడా స్పష్టంగా చెబుతున్నారు. వారి అభిప్రాయం కేవలం హిందీప్రచారకులను హద్దులో ఉంచటంగా కనపడదు.

అభిప్రాయాలు వెలిబుచ్చినవారు ఈక్రిందివిషయాలను గురించి పొరపాటు పడ్డా రని నాకు తోచింది.

(౧) హిందీభాష తెలుక్కి ఏ మపకారం చెయ్యగలదు?

ఏమీ అపకారం చెయ్యలేదు. మనకు సంబంధించినంత వరకు హిందీ చచ్చిన భాషతో సమానం. దానికి మనం జీవం ఇవ్వలేం. అది మన మాతృభాష కాదు. ఇంగ్లీషయినా అంతే. ఈరెండు భాషలూ చెయ్యలేని అపకారం చచ్చి శిథిలమైన గ్రాంథిక భాష తాలూకు జీవం లేని ఎముకలు బతికున్న తెలుగుకు చేస్తున్నై. సజీవమైన మాతృభాషను తొక్కిపట్టేటందుకు బంధుకోటిలో చేరిన సంస్కృతం, గ్రాంథికభాషలైతే నేం. ఇరుగు పొరుగు హిందీ ఇంగ్లీషు భాషలైతే నేం? గ్రాంథికభాష మన తెలుగుమీద పెట్టిన మోపు హిందీ కాని ఇంగ్లీషు కాని ఎన్నడూ పెట్టలేవు. అయితే ఈభాషలను చూస్తే వ్యామోహ మెందుకు? ఎవరికీ సజీవంగా

ఉండని గ్రాంధికఆంధ్రమే మనవాళ్లి నింత వ్యామోహపెడుతూంటే, ఒకరి కైనా సజీవంగా ఉన్న హిందీ ఇంగ్లీషులను చూస్తే వ్యామోహం ఎందు కుండదు? స్వదేశవస్తువు లంతా కొనా లంటే దేశభక్తి అనటం కన్న మంచి తర్కం ఏమి టంటే స్వదేశవస్తువులు విదేశవస్తువులతో సమాన మైనవిగా చెయ్యటమే. అంతవరకూ కొంత శ్రమ తప్పదు. ఇప్పు డిప్పుడే సజీవ మైన తెలుగుకు బంధవిముక్తి కలుగుతున్నది. నలుగురు పెద్దలూ చేరి దాని అస్పృశ్యత తొలిగించారు. తన భాషలో భావాన్ని చక్కగా ప్రకటించగలవాడు తనది కాని ఇతర భాషకు పోతాడని ఎన్నడూ తలచవద్దు. పొరుగింటి పుల్లకూర అనవటమే కాని, ఎప్పుడూ రుచి కాదు. అనేకవందలమంది కాశీహిందూవిశ్వవిద్యాలయానికి పోయి హిందీ అక్షరాలు కూడా తెలుసుకోకుండా ప్రతిసంవత్సరం కొంప చేరుకుంటున్నారు.

(౨) మనకు హిందీ ఎంతవరకు ఆవశ్యకం?

హిందీభాష నేర్చుకోవటం, రాయకలగటం, మాట్లాడకలగటం — అరవలు తెలుగు మాట్లాడినట్టుగా నైనా సరే—చాలా అవసరం—మనకే కాదు—ప్రతి హిందువుడికీ! భాషాబాంధవ్యం ఎంతదూరం వెళుతుందో అందరం గమనించాలి. ఒక్క భాష నాగరికతను, మతాన్ని, ఆచారాలను అద్భుతంగా కలుపుతుంది. రాజకీయంగా హిందూదేశం యావత్తూ ఒక్క మెట్టుమీద నిలబడాలిసిన రోజు వచ్చింది. ఈరోజున ఎవరి భాషకోసం వాళ్లు పోట్లాడి దేశంలో ఎన్ని భాష లున్నవో అన్ని పెళ్లలుగా దేశాన్ని విరగదియ్యటం ఘోర మైన పని. అంతా ఒకటే కుటుంబం. ఇందులో పిన్నలకూ పెద్దలకూ ఒక భాష కాక మధ్య దుబాసి లచ్చన్న లెందుకు? కాశీనాధుని నాగేశ్వరరావుపంతులుగారు దేశ మంతా ఒక్క హిందీభాషయితే సంతోషిస్తా ననటం నా కెంతో ముచ్చటగా ఉంది. అది చాలా గొప్ప ఆశయం. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు అసమ్మతి చూపటాని క్కారణం కనపడదు. దేశమంతా ఒకటే భాష అయిన తరవాత అది హిందీ అయినా తెలుగైనా ఒకటే. అప్పు డక్కడ మరో భాష ఉండదు, ఎవ రాగ్రహించటానికైనా. దేశమంతా ఒకటే భాష కావటానికి తెలుగుకు కన్న హిందీ కెక్కువ అవకాశం ఉంది కాని మ రేమీ లేదు. అయితే అటువంటిది సంభవమా అంటే కాదు. మంచి ఆశయ మానా కాదా అంటే కాదనటాని కెవరికి ఎట్లా నోరు వస్తుంది? దేశమంతా ఒక భాష కావటంవల్ల ప్రయోజనము చాలా వందల సంవత్సరాల క్రితం రోముదేశమే ఎరుగును, ఇప్పు డింగ్లీషువారే ఎరుగుదురు!

అంతకన్న మనకు హిందీ భాషతో పని లేదు. నాకావలిసిం దెంతవర కంటే హిందూదేశంలో ఏమూలకు పోయినా నాహిందూసోదరులు మాట్లాడేది నే నర్థం చేసుకుని నేను నామాటలు వారికి తెలపగలగాలి. హిందూదేశంలో ఏమూలకు పోయినా "ఇది నాది!" అనిపించాలి. మన పూర్వులు హిమాలయపర్వతాలకూ కన్యాకుమారికి మధ్య ఉన్న ప్రతివస్తువూ తమ సొంతంగా భావించి అట్లా రాయగలిగారు. నేను మొదటిసారి కాశీ విశ్వేశ్వరుడి గుడి ప్రవేశించి "ఇది నాది!" అనుకోవా లని ప్రయత్నం చేసి ఓడాను.

హిందీ సారస్వతంతో నాకు పని లేదు. ఏ తెలుగు వాణ్ణి కూడా ఒక్క హిందీపుస్తకం చదవ మని చెప్పను, హిందీలో పుస్తకాలు రాయ మని చెప్పను, హిందీ పత్రికలు సారస్వతాభివృద్ధికి నడప మని చెప్పను. *

---

* కుటుంబరావుగా రిలా చెబుతున్నారు; కాని హిందీప్రచారకు లేం చస్తున్నారో వారికి తెలవడం లేదు. ఇది చూస్తే తెలుస్తుంది. "భీమవరం, జూలై ౨:—......శ్రీరామకృష్ణ హిందీపాఠశాల తరపున కోలమూరు ఉప్పులూరు గ్రామములయందు రెండు హిందీప్రేమీసంఘములను స్థాపించిరి. ప్రతిఆది

హిందీభాషకోసం ఏహిందువ్రుడు కూడా ఒక్క సంవత్సరం కన్న ఎక్కువ కాలం వ్యయం చెయ్యటం వ్యర్థం. అఒక్క సంవత్సరం ఎంతమాత్రం వృథా కాదు.

కామేశ్వర్రావుగారు కూడా భాషాసేవ అంటూ మాట్లాడటం చాలా విచారకరం. భాషచేత సేవ చేయించుకుంటాం. ఎన్ని భాషలు మాట్లాడగలిగితే అంత హాని అని కామేశ్వర్రావుగారి అభిప్రాయం కాదనుకుంటాను!

(3) హిందీ, తెలుగు పత్రికలు

తెలుగులో మంచి పత్రిక లింకా ప్రారంభం కాలేదనే చెప్పాలి. ఇంకా కొత్త. మన పత్రికలు అప్పుడే హిందీపత్రికలతో పోటీకి రాలేవు. పత్రికాసంపాదకులకూ వ్యాసరచయితలకూ జర్నలిజం అంటే ఏమిటో తెలీదు. మంచి ప్రింటింగు తెలీదు. పత్రికయొక్క బిజినెస్ సైడ్ తెలీదు. నలభై సంవత్సరాలనించీ నడుస్తున్న పత్రికలతో మన పత్రికలు పోటీ ఏమిటి? తెలుగు రాతలో కొమ్ములు తిరిగిన వాడికి వెట్టివాడి వేతనం కూడా లభించటం లేదు. ధైర్యం చేసి వ్యాసరచన కెవడు జీవితం అర్పిస్తాడు? అట్లా కొంతమంది చేరబడకపోతే తెలుగు పత్రిక లెట్లా పైకొస్తై? తెలుగు దేశంలో భారతి సంచికల కన్న మాధురి సంచిక లెక్కువ అమ్ముడుపోతున్న వనే అనకపోతే తెలుగుదేశంలో భారతి అమ్మినదాని కన్న మాధురి హిందీదేశంలో ఎక్కువ పర్సెంటేజి అమ్ముతున్న దని గమనించరాదూ? ఆలోపం భారతిలోనే ఉం దనుకో రాదా?

హిందీపత్రికలు కనక హిందీప్రచారాన్ని దూషించాం. మైమాగజీన్ నలభైవే లమ్ముతున్నది. దాన్లో పడే వ్యాసాలు చూడబోతే ఎట్లా ఉండాలో అట్లాగే ఉన్నై. దాదాపు ఆపక్కీగానే నడుస్తున్న వినోదినికి అంత ఆమ్మకం కనిపించదు. ఆఇంగ్లీషు పత్రిక కావల దని కాని ఈతెలుగు పత్రిక కావల దని కాని ఎవరు టపటపమా చెయ్యగలరు? తెలుగు పత్రిక కన్న ఇంగ్లీషు పత్రిక ఎక్కువమందిని తృప్తిపరుస్తున్న దని గ్రహించి ఊరుకోవలసిందే. నేనట్లే గమనిస్తున్నాను. ప్రబుద్ధాంధ్రను చూచూసేవాడు లేడు. తెలుగులో అటువంటి అమూల్యమైన వ్యాసా. లిస్తూ; రాయల్ సైజులో, ఇంగ్లీషు బాడీలో ప్రింటు చేసిన ౪౦ పేజీలతో చక్కని ప్రింటింగుతో రూపాయి సంవత్సర చందాకు వచ్చే పత్రిక కన్న కారుచౌక ఏదో నాకు తెలీకుండా ఉంది. వేలకు వేలు అమ్మటం లేదంటే అది కావలిసినవాళ్లు చాలా కొద్దిమందే నన్నమాట! అవునా టని ఊరుకోవటం కన్న చేసేదేముంది? హిందీప్రచారక్ అమ్ముతున్న దంటే భాష నేర్చుకోవా లని ఉన్న ప్రతివాడికి దాంతో పనుంది.

(౪) అభిప్రాయాలు :

"ఈ హిందీ ఆరాటంతో తెనుగువారిలోని రవంత తెనుగుతనమున్నూ రాలిపోతున్నది," అని మానుమచ్ఛాస్త్రిగారి అభిప్రాయం. ఈ హిందీ ప్రచారం రాకమునుపు మనలో ఉండి ఇప్పుడు పోయిన తెనుగుతన మేమిటి? శాస్త్రిగా రీవిషయం స్పష్టంగా చెప్పలేదు.

"ఒక భాష అభివృద్ధియిం దంటే మరో భాష క్షీణించిం దన్న మాటే" నన్నారు వామిత్రులు శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు. ఒకరి కిద్దరు

---

వారము రోజున వాగ్వర్ధినిసభ జరుగుచున్నది. రాష్ట్రభాషావిశారద విద్యార్థులచె నొక హస్తలిఖిత హిందీ మాసపత్రిక వెలువడుచున్నది. పాఠశాల తరఫున హిందీగ్రంథాలయము గూడ స్థాపించబడినది. వానర, విశ్వామిత్ర, సరస్వతి, హిందీప్రచారక మొద లగు హిందీసాహిత్యక మాసపత్రికలను తెప్పించి బాలురచే చదివించుచున్నారు......పాఠశాలయందు విద్యార్థులచే హిందీనాటకములు గూడ ప్రదర్శింపమనవి చేయుచున్నారు" ౪—౭—3౪ ఆంధ్రపత్రిక, రెండో పేజీ అయిదో కాలం.

హిందీ నేర్చుకోటం అభివృద్ధి కాదు. అసలా హిందీ ఏంతిని బతుకుతుందో మనకు తెలీదు. ఇంగ్లీషు మన దేశంలో ఎంత అభివృద్ధయిందో హిందీ కూడా అంతే. (ఒక తెలుగు హిందీ పండితుడు హిందీలో రాసిన ఒకానొక ఉపోద్ఘాతం చూసి హిందీవాళ్లు నవ్వుతుండగా నే చక్కా ఉండటం జరిగింది. ఆయనకు మంచి హిందీ రాదంటే అమాంతం మీదపడి కరుస్తారు!)

"చంద్రిక" కూడా హిందీప్రచారానికి ఆగ్రహించడం చూస్తే నాకు నవ్వాలో చింతించాలో తెలీటం లేదు. "చంద్రిక" భక్తితో పూజిస్తున్న తెలుగు ఎముకల కిక చలనం లేదే! ఏమైనా ప్రమాదం జరిగితే మేమంతా ప్రాణపదంగా పట్టుకొస్తున్న వాడుకభాష కుండాలి కాని. "చంద్రిక" వారి గ్రాంథికభాష మార్పుకూ చావుకూ అతీత మైపోయింది. లేక జీవభాష నెలన మేం కాలు పెట్టి ఉండగా మధ్య ఈహిందీ ఎక్కణ్ణించి చొచ్చిందని అనూయా? మా కే రాయైతే నేం తల పగల గొట్టుకోటానికి. గ్రాంథికభాష చెయ్యగల పనేమిటో తేలిపోయింది. ఒక్కసారి బయటికెళ్లి మళ్లీ లోపలికొచ్చి వీధిలో గమనించిందంతా రాయాలంటే కవిత్రయం, వారెక్కడా ఉపయోగించని మాటలు రెండు డజన్లు కావాలి. మా ఆశ అన్నీ ఇంకా పసికూనగా ఉన్న వాడుకభాషమీద నే ఉన్నై కనక "చంద్రిక" హిందీని చూసి అట్టే ఆగ్రహిస్తే హాస్యాస్పదంగా ఉంటుందని మనవి చేస్తున్నాను.

కొడవటిగంటి కుటుంబరావు

(కుటుంబరావుగారి కూడా హిందీవ్యామోహం యింత ముమ్మరంగా వుంటుందని మేమెప్పుడూ అనుకోలేదు. అయితే వారి రాత మాత్రం తెనుగువారు తమ భాషని, వాఙ్మయాన్ని చక్కబరుచుకుని దాకా హిందీని ముట్టుకోగూడదనడానికి చాలా బలకరంగా వుంది. ఏమంటే తెనుగంటే మన కిప్పుడు నీరసం. తెనుగుమీద మనవారికింకా ఉండవలసినంత అభిమానం కలగలేదు. ఈ సమయంలో మనం హిందీని నెత్తెక్కించుకుంటే తెనుగు వెనక బడిపోతుంది. దీనికి కుటుంబరావుగారి భావాలే నిదర్శనం. అసల్లో మేము హిందీని సామాన్యభాషగా గ్రహించడం ఆక్షేపించలేదు. అయితే అది హద్దు మీరి వస్తోందన్నాము. అంతే. అందుకు వుదాహరణాలు చూపించాము. కుటుంబరావుగారు వాటిని తాకలేదు.....కుటుంబరావుగారు గ్రాంధికాంధ్రం మనకి అపకారం చేస్తోందన్నారు. నిజమే. కనకనే దేశం యిప్పుడు దాని మీద తిరగబడుతోంది. ఎక్కడో సాహిత్యపరిషత్పత్రికమాత్రమే దాన్లో పడి మునకలు పెడుతోంది. దానివల్ల మన కేమీ అపాయం లేదు. చంద్రిక కూడా కొంతవరకూ ఆదారే తొక్కుతోందంటే ఆకష్టనష్టాలు అదే అనుభవిస్తుంది. చంద్రిక హిందీ ప్రచారానికి ఆగ్రహించడం తన సొంతానికి హాస్యాస్పదం కావచ్చు; గాని ఆంధ్రభాషకీ, ఆంధ్రవాఙ్మయానికీ, ఆంధ్రజాతికీ ఉపకారమే కాదూ?............"హిందీభాష నేర్చుకోవటం, రాయకలగటం, మాట్లాడకలగడం_అరవలు తెనుగు మాట్లాడినట్టుగా నైనా సరే—చాలా అవసరం—మనకే కాదు ప్రతిహిందువుడికీ" అన్నారు కుటుంబరావుగారు. సంతోషమే. అయితే ప్రచారకులు హిందీని తెనుగువారు వ్యావహారికంగా వాడుకోవాలని చెబుతున్నారు. ఆప్రచారకోపన్యాసభాగాలు గత సంచికలో మేము చూపివున్నాము. కుటుంబరావుగారు దాని కేమీ మాట్టాడడం లేదు. ఏం? ......కాశీనాధుని నాగేశ్వరరావుపంతులుగారు దేశం అంతా ఒక్క హిందీభాషయితే సంతోషిస్తాననటం కుటుంబరావుగారి కెంతో ముచ్చటగా వుందిట. అది చాలా గొప్ప ఆశయముట. "అయితే అటువంటిది సంభవమా అంటే కాదు"ట. ఇంకెందుకూ ముచ్చట? కష్టమైనా సుఖమైనా అసలది ప్రాప్యమైతే యెంత ముచ్చటయినా చూపించవచ్చు. ఇప్పుడెందుకూ? పైగా "ఉప్పు లేకుం

డానే ముప్పంటుం” అన్నట్టు యేమీ అవసరం లేందే హిందీలో మునిగిపోతూ వున్న మనవారు ఇలాంటి మాటల వల్ల మరింత దూర మైపోరూ తెనుగుతనానికీ?......కుటుంబరావుగారు కామేశ్వరరావుగారిని, గోపాలకృష్ణమూర్తిగారిని, హనుమచ్ఛాస్త్రిగారిని విమర్శించారు. కామేశ్వర్రావుగారి జాబు ఇంకోమాటు చదివితే దాన్లోనే వున్నాయి కుటుంబరావుగారికి జవాబులు. “ఈ హిందీ ఆరాటంతో తెనుగువారిలోని రవంత తెనుగుతనమున్నూ రాలిపోతున్న”దని హనుమచ్ఛాస్త్రిగారంటె, “ఈహిందీప్రచారం రాకముందు మనకు ఉండీ ఇప్పుడు పోయిన తెనుగుతన మేమిటి?” అని అడిగారు కుటుంబరావుగారు. నిజమే. ఇదివరకి తెనుగుతనం తక్కువ కనక ముందు మనం అదే సంపాదించుకోవాలి. అది లేని మనకి హిందీ యెందుకు? తెనుగువాడు తాను తెనుగువాడుగా నెగ్గలేనప్పుడు హిందీని ఏంచేసుకుంటాడూ? దాని దురాక్రమణాన్ని యేం అడ్డుకోగలడూ? మనకి తెనుగుతనం తక్కువ కనకనే అరవలలాగా, కన్నడులలాగా, ఇంకా తక్కిన వారిలాగా కాకుండా హిందీ అంటే ఆత్మహత్యకి కూడా సిద్ధపడుతున్నాం......“తెలుగులో మంచి పత్రిక లింకా ప్రారంభం కాలే దనే చెప్పాలి” సందేహం లేదు. కాని మంచివి యెలా ప్రారంభం అవుతాయీ? ఇంగ్లీషు బాగా అర్థం కాని తెనుగువారు ఇంగ్లీషుపత్రికలు కొనడం లేదు, కాని హిందీ నేర్చుకుంటూ వున్న తెనుగువారు ప్రారంభంలోనే హిందీపత్రికలు కొంటున్నారు. ఆహిందీపత్రికలను వారు సరిగా చదవనేనా చదవలేరు. ఇక అర్థం తెలవడం దాకా యెందుకూ? అలాగ ప్రారంభస్థితిలో గూడా పెద్దపెద్ద చందా లిచ్చి వారు హిందీపత్రికలు తెప్పించుకుంటారు గాని తెనుగుపత్రికల కేసి చూడరు. తెనుగుపత్రికలనే చదవవలసినవా రంతా యిలాగ హిందీపత్రికల కోసమే తమ పర్సులు కాళీ చేసుకుంటూ వుంటే యిక తెనుగుపత్రికలకు ఆర్థికపుష్టి యెలా కలుగుతుందీ? అది లేందే పత్రికలకు సర్వాంగసౌందర్యం యెలా వస్తుందీ? “తెనుగురాతలో కొమ్ములు తిరిగినవాడికి వెట్టివాడి వేతనం కూడాలభించడం లే”దని విచారిస్తూనే కుటుంబరావుగారు “ఆలోపం భారతిలోనే ఉందనుకోరాదూ?” అనడం యేం బాగుందీ? ఆర్థికపుష్టి లేక భారతి కొత్తమార్గాలు తొక్కలేకపోతోంది. అక్కడికీ రచయితలకు యే తెనుగుపత్రికా ప్రారంభించని సత్కారం ప్రారంభించి కూడా భారతి మంచి రాతలు సంపాదించలేకపోతోంది. ఈస్థితిలో మనవారు హిందీపత్రికల కెగబాకితే తెనుగుపత్రిక లింకా కూలిపోవూ? ప్రబుద్ధాంధ్రను మూచూసేవాడు లేకపోతే అది మాలోపం అని కూడా వొప్పుకుంటాం. అయితే వున్నంతమట్టుకేనా తెనుగుపత్రికలను చూడక వాటికి చెయ్యవలసిన ఆర్థికసాహాయ్యాన్ని హిందీపత్రికలకు చెయ్యడం తెనుగువారికి గౌరవం గాని, ఆదరం కాని కలిగిస్తుందా? పోనీ, తెనుగుపత్రికలు మంచి స్థితిలో లేవు కనక తెనుగువారు వాటిని మూచూడ్డం లేదు. హిందీపత్రికలు సర్వాంగసుందరాలయితే అవి చదువుతూ వున్న తెనుగువారికి “అయ్యో, మన కిలాంటి పత్రికలు లేవే!” అన్న విచారం కలగడం లేదేమీ? హిందీపత్రికలవంటి పత్రికలు తెనుగులో బయలుదేరడానికి వారు సాహాయ్యం—ప్రయత్నాలు చెయ్యడం లే దేమీ? ...ఇంతకీ తెనుగువాడికి “నేను బాగుపడాలి” అనే ఆవేదన కలగలేదు. కలగవలసిన సమయంలో హిందీవెల్లువ వచ్చి తెనుగుజాతిమీద యిసకమేటలు వేస్తోంది. ఇది కాదంటే లాభం లేదు. కుటుంబరావుగారి లేఖ కూడా యిందుకు నిదర్శనంగానే వుంది......అయితే కుటుంబరావుగారు పేరుపేరు వరసన్నీ ప్రబుద్ధాంధ్ర విలేఖకుల నందర్నీ విమర్శించారు. ప్రబుద్ధాంధ్రనీ చంద్రికనీ, యీవాదంతో సంబంధం లేని భారతినీ ప్రస్తావించారు. కాని ఆంధ్రభూమి ప్రస్తావన చేశారు కారు. ఏం?

సంపాదకుడు

౨

"నిజానికి తెనుగు భాష సంగతి తలుచుకుంటే సిగ్గు కాదు, దుఃఖం వస్తున్నది. మొదటినుండీ అన్య భాషాభిమానులైన కొందరి చేతుల్లో పడి తెనుగు తన వ్యక్తిత్వమే గోల్పోయింది, చాలవరకు"

"అనాడు సంస్కృతమును దేవభాషగా కొలిచే మన పండితులూ, కవులూ ప్రభువుల అధికార బలంతో స్వచ్ఛమైన తెనుగును శల్యావశిష్టముగా చేశారు. తెనుగు నుడికారం కంటే మన పురాణాల లోనూ, ప్రబంధాలలోను సంస్కృతనుడికారమే రాజ్యం చేసింది. సంప్రదాయాలు, కవిసమయాలు, వర్ణనలు, లోకోక్తులు, వృత్తాలు ఒకటేమిటి అన్నీ సంస్కృతంనుండే దిగుమతి. తుదకు సంస్కృతమే తెనుగుకు తల్లిభాష అని. తెనుగు స్వతంత్రభాష కాదనీ, తెనుగుకు ఉత్పత్తే లేదనీ, అనడానికి కూడా వెనుదీయలేదు. తెనుగు స్థితి యెంతవరకూ వచ్చిం దంటే? తెనుగువ్యాకరణం చదువుకోవా లంటే సంస్కృతం రాకపోతే వీల్లేదు. ఇలాంటి దౌర్భాగ్యం యే భాషకీ ఉండదు. తెనుగువాడికి తెనుగుదేశంలో గీర్వాణం వస్తేనే గాని చెలామణీ లేదు.—ఇలా వుండగా ఇంగ్లీషు వచ్చింది. దానితో మరొక దెబ్బ తగిలింది తెనుగుకు"

"మనవారు పట్టభద్రు లవుతారు. అమాంతంగా యింగ్లీషులో గంభీరోపన్యాసాలిస్తారు; కాని యీపట్టభద్రులలో నూటికి తొంబదిమందికి తెనుగు వర్ణక్రమం సహా సరిగా రాదు. తెనుగుపత్రిక చది వితే అర్థం కాదు. ఉపన్యాసాలకు తెనుగులో నోరు తిరగదు. ఇదీ తెనుగువారి స్థితి. తెనుగు చదువుకుంటే తెనుగుదేశంలో పొట్టకు కూడు దొర కదు. ఆంగ్లపండితుల నౌకరులకు దొరికేటంత జీత మైనా దొరకదు, మన తెనుగు పండితులకు"

"ఇది కొంత తగ్గుదల చూపిం దని అనుకొంటూ వుండగా తుద కబ్బెరా—అన్నట్లు హిందీ ఉద్యమం వచ్చింది. ఇది మరొక దెబ్బగా ఉన్న దిప్పుడు. స్పష్టంగా తెనుగు మాట్లాడడమైనా రానివారు కూడా హిందీవంక తిరిగారు. దానితో ఉన్న కాస్త తెనుగు అభిమానం కూడా సున్న అవుతు న్నది. హిందీప్రచారకుల మితిమీరిన ప్రచారమువల్ల తెనుగుభాషకు కలుగుతున్న అపకారం ప్రత్య క్షంగా కనపడుతున్నది. సంస్కృతంవల్లా, ఇంగ్లీ షువల్లా మనం కొంత విజ్ఞానం సంపాదించాము కాని తెనుగుకంటే ఏవిధంగానూ సారస్వతంలో గాని, విజ్ఞానంలో గాని అధికస్థానం లేని హిందీ వల్ల మనం నేర్చుకోతగిన దేదీ లేదు. అయినా మనను ముంచెత్తుతున్నది. ఈప్రవాహం యిల్లానే సాగితే ముందు ముందు తెనుగుభాషకు తెనుగు దేశంలో దిక్కు ఉండ దనిపిస్తోంది."

"కాంగ్రెసు వారూ, గాంధిమహాత్ముడూ హిందీ నేర్చుకోవా లనడంలో వారి అభిప్రాయం తెనుగును విస్మరించ మని కాదు. అలాగు ఎవరైనా భావిస్తున్నా రంటే అది పొరపాటే అవుతుంది. బెంగాలీవారూ, అరవలూ మొదలైన వారు సహా అవసర మైనంతమట్టుకు హిందీ నేర్చుకుంటున్నారు. కాని మనవారివలె మాతృభాషను త్రోసిరా జని హిందీని స్వీకరించడం లేదు"

"హిందీలో పట్టాలు పొందుతూ, తెనుగు సరిగా చదవడము కూడా రానివా రున్నా రంటే తెనుగు మూలపడుతున్న దన్నమాటే కదా?"

"దేశ మందరికీ తెలిసే భాష ఒకటి ఉండడం అవసరమే. అదెవరూ కాదనరు. కాని యెంత వరకు అవసరమో అంతవరకే నేర్చుకోవాలి. కాని నిత్యవ్యవహార మంతా హిందీలోనే జరగా లంటే తెనుగుదా రేమిటి అంటాము. తెనుగుదేశంలో గ్రంథాలయాలు మూలపడి నామమాత్రాలుగా ఉంటే వాటిని మరిచి హిందీగ్రంథాలయాలకోసం సర్వశక్తులూ వినియోగిస్తున్నారు. తెనుగు పత్రికలు

కాన ఊపిరితో బ్రతుకుతూ, చస్తూ ఉంటే హిందీ పత్రికలు వేలకొద్దీ దిగుమతీ చేస్తున్నారు. తెనుగు గ్రంథకర్తలు ప్రోత్సాహం లేక మూలమూలల మాడిపోతూ వుంటే హిందీకోసం వేలకొలదీ రూపాయలు ధారపోస్తున్నారు. తెనుగు ముందా హిందీ ముందా తెనుగువారికి? ఆంధ్రపత్రికవంటి వార్తాపత్రికలలో హిందీ ప్రచురించడం సంగతి అటుంచండి. కేవలం వాఙ్మయసేవకోసం పుట్టిన భారతిలో కూడా హిందీవ్యాసాలు వేశారు. అవీ విజ్ఞానవిషయాలు కాదు, కేవలం ఉపన్యాసాలు”

“తెలుగులో సంపూర్ణమైన వ్యాకరణము లేదు, నిఘంటువు లేదు, లక్షణగ్రంథం లేదు, చరిత్ర లేదు, భాషాశాస్త్రం లేదు. ఇంకా యెన్నో లేవు. అముద్రితగ్రంథాలు చెదపురుగుల కాహారమవుతూ కుప్పలు కుప్పలు నశిస్తున్నాయి; కాని మనం అన్యభాషకోసం ప్రాకులాడుతున్నాము. మాతృభాషను ఉపేక్షించి పొరుగింటికి చేతులు చాపుతున్నాము. ఇదీ మన తెనుగుసేవ”

“ఈసమయంలోనే తెనుగు యువకులు, తెనుగు నాయకులు జాగ్రత్తపడకపోతే ముందు ముందు తెనుగువారి చరిత్ర యింకో విధంగా పరిణమిస్తుంది. గనుక తెనుగు కేమాత్రమూ నష్టం కలగని విధంగా హిందీప్రచారం సాగించడానికి ఒక ప్రణాళిక యేర్పరచడం అవసరమని మా అభిప్రాయం. అలాంటి ప్రణాళిక తయారు చెయ్యడానికి హిందీ ప్రచారకులూ తెనుగు విద్యాధికులూ సమావేశము కావా అని కోరుతున్నాము. అట్టి సమావేశం యేర్పాటు చేసే బాధ్యత ముఖ్యంగా తెనుగునాయకుల మీదా ఆంధ్రసభలవంటి మహాసభలమీదా ఉన్నదని మనవి చేస్తున్నాము”

సత్యవాణి ౨౨—౭—౩౮

౩

కాంగ్రెస్ వ్యవహారాల్లో జోక్యంకలిగిన ప్రతి ఆంధ్రుడికి ఏదో కొంత సంస్కారవాసన తగులుతోంది. ఆవాసనలు వక విధంగా లేక భిన్నభిన్నాలుగా వున్నాయి. ఏదెట్లా వున్నా, ఆంధ్రదేశానికి, ఆంధ్రభాషకు ముప్పురాకుండావుంటే యే చిక్కూ లేదు. కాంగ్రెస్‌లో చిక్కుబడే, ఆంధ్రులు చేరువకువచ్చిన ప్రత్యేకాంధ్రరాష్ట్రాన్ని అధోలోకంలోకి నెట్టేశారు. ఈమాటంటే ఆంధ్ర కాంగ్రెస్ వాలాలు దెబ్బలాటకొస్తారు. కాంగ్రెస్ వాలాల మెప్పుకోసం కొందరు తదితర వృద్ధనాయకులు వీరిని మొఖమాటానికైనా బలపరస్తున్నట్లు మాట్లాడుతున్నారు. కాంగ్రెస్ వెల్లువవచ్చి ఆంధ్ర రాష్ట్రాన్ని వెనక్కునెట్టేసిందంటే తప్పులేదని వాదిస్తారు. ఆవిషయం మరోమారు ప్రత్యేకంగా వివరిస్తారు. ఆంధ్ర కాంగ్రెస్ వాలాలకు అన్ని సంస్కారాలతో పాటు “హిందీ” నేర్చుకోటమనేదికూడా అలవాటయింది. అలవాటుగాదు, తల్లినోట మట్టికొట్టి పెండ్లామును నెత్తెక్కించుకున్నట్లుగా వుంది ఆంధ్రులు హిందీ నేర్చుకోవడం. అసలు ఆంధ్రులు హిందీ నేర్చుకోవడానికి అలవాటు పడ్డది కారాగృహాల్లోనని నాయనుభవం. ౧౯౩౦–౩౧ సంవత్సరములలో కాంగ్రెస్ సత్యాగ్రహంలో జైలుకుపోయిన వారిలో హెచ్చుమంది హిందీని ప్రారంభించారు. జైలు ముద్దతినటం హిందీ బుక్కు చేపట్టడంగా జైళ్ళలో కాలం గడిపారు ఆంధ్రులు. హిందీ చదివితే గొప్పవాడని, చదవని వాడు శుంఠనేవరకు కూడా ఆంధ్రులు జైళ్ళలో తేల్చారు. నిజంగా ఆంధ్రులలో చాలా మందికి హిందీని నేర్పడం ప్రారంభించింది పిసపాటి వెంకట సుబ్బారావు గారని చెప్పవచ్చు. వారికి గల శాంతం, నేర్పు, బోధనాశక్తి, విసుకులేక పోవడం వ్రాయడానికి సాధ్యం కాదు. బళ్ళారి, ఆలీపూరు జైల్లో ౧౯౩౦ నవంబరు ప్రాంతాల్లో అమాంబా

పతు ౧౬౦౦ మంది కాంగ్రెస్ ఖైదీలుండేవారు. వీరిలో అన్ని తరగతుల వారుండేవారు. అరవలు కేరళంవారుకూడా అలీపూరు జైలులోవున్నా ఆంధ్రులంత వైరితనంగా అరవలు వగైరాలు హిందీని చంపలేను (?) జాతీయగీతాలు పాడాలంటే ఆంధ్రులు హిందీలో పాడితే అరవలు తమిళంలోనే విశేషంగా పాడేవారు. ఆంధ్రులు ప్రత్యేకంగా ఆంధ్రభాషను నేర్చుకోవడానికి ప్రయత్నం యెక్కువ చేయలేకుగాని అరవలు మాత్రం తమిళ భాష తరగతులుగా నేర్చుకుంటూ నేర్పేవారు. ఆంధ్రభాషను నేర్చుకుందామని నాబోటి వారెవరయినా మొదలు పెట్టితే. మన ఆంధ్రసోదరులు హిందీ నేర్చుకోలేమని యెగతాళికూడా చేశారు. అన్నప్పటికీ, ఆంధ్ర పండితులను శ్రీగరికపాటి మల్లావధానిగారివద్ద కొంత మందిమి తెలుగు కావ్యమే చెప్పుకున్నాం. రెండో పని అలీపూరు జైల్లో లేకపోవడంవల్లను. విసుగు విరామం లేకుండా సుబ్బారావుగారు వుదయం నుంచిరాత్రి ౯ గంటలవరకు శాంతంగా చెప్పడంచేత నున్నూ చాలామందికి హిందీమీద ప్రేమపుట్టి బంగీలకు బంగీలు హిందీపుస్తకాలుతెప్పించి, హిందీని ముంచేశారు. చాలామంది జైళ్ళలోనే హిందీలో తయారైనారు. జైళ్ళకువచ్చినవారిలో చాలామంది పల్లెవాసులే గనుక జైళ్లనుంచి బయటికి రాగానే ప్రతివారు హిందీ వ్యాపించేశారు. చేస్తున్నారు. ఆంధ్రనాయకులంతా "హిందీ" "హిందీ"అని వేదికలలో వుపన్యాసాలు చెప్పడం జోరయిపోయింది. మగాళ్ళను అంటిన యీవాసన స్త్రీలక్కూడా సోకింది. స్త్రీలుకూడా హిందీని బాగా ప్రేమించి వ్యాపించేశారు. హిందీభాష నేర్చుకుంటున్నా, ఆంధ్రభాష చదివి, తర్వాత హిందీ చెప్పుకుంటే అసలు తగాదా లేదు. తెలుగులో మాట్లాడడం, వ్రాయడం రాని ప్రతి ఆంధ్రుడు హిందీని నేర్చుకొని తల్లిభాష ఆంధ్రమునకు స్వస్తి చెప్పినారు. ఇప్పుడు హిందీ భాష ఆంధ్ర దేశంలో పల్లెపల్లెలో తాండవమాడుతూంది. అనేక మంది కాంగ్రెస్ యువకులు హిందీ నేర్పడానికి పల్లెల్లో ప్రయివేటు బళ్లుపెట్టుకుని జీవనం చేస్తున్నారు. హిందీపత్రికలు పూర్తిగా ఆంధ్రభూమికి దిగుమతి అవుతున్నాయి. బెజవాడలో పెద్ద హిందీ విద్యాలయం స్థాపన అయింది. ఇతర రాష్ట్రాలవారికంటే ఆంధ్రులు అతి వేగంగా హిందీని వుట్టడిస్తున్నారు. ఇందువల్ల ఆంధ్రులకు వచ్చే ఫలితం ఏమీకనబడదు. బ్రిటిష్ బావుటా ఎగురుతూన్నంత వరకు యింగ్లీషు చదివిన వారిని కాదని హిందీ చదివిన వారికి గొప్ప వుద్యోగాలు రావు, ఉన్నత గౌరవాలురావు. అసలు హిందీ మాతృభాషగా కలిగిన ఉత్తరదేశస్థులకే యేమీ లేనప్పుడు ఆంధ్రులు హిందీ చదువుకుంటే వచ్చేదీ కనుబడదు. ఇక కాంగ్రెస్‌లో గాంధీగారు హిందీమాట్లాడితే అర్థంకాదంటారా? ఆ భాగ్యానికి యిప్పుడు మన ఆంధ్రులు చదువుతున్న వాయువేగమనోవేగంగా ఆంధ్రభాషకు స్వస్తి చెప్పి హిందీనే నేర్చుకోవాలిసిన జరూరులేదు. స్వరాజ్యంవస్తే హిందీఅవసరం అంటారా-భగవంతునిదయవల్ల ఆదేజరగాలిగాని అప్పటికి హిందీ రాకపోదు. ఇంతకు ఆంధ్రభూమిలో హిందీని భుజాలమీద యెక్కించుకొని ఆంధ్రభాషను దిగతొక్కుతూవున్నది యెవరంటే ఆంధ్ర కాంగ్రెస్ వాలాలని ' నామనవి. ఇతరరాష్ట్రాలవారు కాంగ్రెస్‌లోవుండికూడా వారి రాష్ట్రములను, మాతృభాషలను పూజించి, ఆదరించి, తర్వాతనే కాంగ్రెస్‌ను కొలుస్తున్నారు. ఇక మన ఆంధ్రులో కాంగ్రెస్ సముద్రంలో మునిగి యిదిగో అదిగో గావున్న ఆంధ్రరాష్ట్రాన్ని నామరూపాలు లేకుండా చేసుకున్నారు. ఇప్పుడు హిందీ వెల్లువలో మునిగి తల్లి భాష అయిన ఆంధ్రభాషకు కళంకం గలుగజేస్తున్నారు. దేశభాషలందు తెనుగు

లెస్స అనేమాట మన ఆంధ్రులు, ముఖ్యంగా కాంగ్రెస్ వాదులు గుర్తించాలి. హిందీని తగినంతవరకే గౌరవించాలి. మాతృభాషకు ముందు గౌరవం చేయాలి. నూతనాలంకారాలతో ఆంధ్రభాషామ తల్లికి అడుగులొత్తాలి. ఆంధ్రులలోవున్న అన్ని రకాల భేదాలు పోగొట్టాలి. ఆంధ్రమూర్తిత్వం వకటేనని బెంగాలువారివలె కనపర్చాలి. ఇప్పటి వలె హిందీని ఆంధ్రభూమిలో పరువెత్తనిస్తే ఆంధ్ర భాష గౌరవం తగ్గుదల కాకపోయినా ఆంధ్రుల అశక్తి బయటపడుతుంది. ప్రజామిత్ర, సమదర్శిని, త్రిలిఙ్గ, చిత్రగుప్త, ఆంధ్రభూమి, కృష్ణాపత్రిక, మున్నగు తెలుగు పత్రికలన్నీ యీవిషయాన్ని గుర్తించి ప్రచారం చేయాలి. "ప్రబుద్ధాంధ్ర" యీవిషయంలో తీవ్రంగా పనిచేయటానికి నడుం కట్టింది. సమకాలిక పత్రికలు, ఆంధ్రభాషాభిమానులగు ఆంధ్రులు ప్రబుద్ధాంధ్రకు చేయూతనిచ్చి తెలుగుభాష గౌరవాన్ని నిలపెట్టి హిందీవెల్లువ లోనుంచి ఆంధ్రులను బయటికిలాగి, ఆంధ్రులంతా కలిసి ప్రత్యేకాంధ్రరాష్ట్రాన్ని సాధించటానికి పూనుకోవాలని పత్రికాధిపతులను, యువకులను ప్రార్థిస్తూ విరమిస్తాను.

మల్లెల శ్రీరామమూర్తి (ప్రజామిత్ర)

# రెండు జాబులు

"ఆర్యా, ఇప్పుడు నేనోరచయిత వ్రాతను బట్టి ఒక వ్యాసం వ్రాస్తే ఎంతవరకు అతనికి ఋణపడ్డానో చెప్పాలా వద్దా? సరే, అనువాదమే చేశాననుకోండి; ఆభోగట్టా లోకానికి తెలియజెయ్యాలా వద్దా? ఇది ఫలానా వ్రాతకు ప్రతికృతి అని చెప్పనంతకాలం ఇది మనదేఅని లోకం అనుకుంటుంది కదా—ఎందుకనుకోనియ్యాలి? సారస్వతంలో నిజాయితీ గొప్ప సుగుణం కాదా?

ఇట్టి నిజాయితీని అతిక్రమించిన వ్యాసం ఒకటి మీ ప్రబుద్ధాంధ్ర జూలై సంచికలో ఉన్నది. "చంటిపిల్లలు చనిపోవడం" అని ఆవ్యాసంపేరు. అది స్వతంత్రరచనకాదు. దానికి ఆంగ్ల వ్యాసకర్త Leigh Hunt వ్రాసిన "On the death of little children" అన్నది మాతృక. ఈ సంగతి ఎందుకు చెప్పబడలేదో? నేటికాలంలో చాలామంది తాము తర్జుమాలుచేసినావాటికిఫలానా పూర్వరచన ఉన్నదని చెప్పడంలేదు. ఇప్పుడు వాఙ్మయంలో ఈ సంప్రదాయం అంతరించిందా ఏమిటి? దీనికి మీ అనుమోదం కూడా ఉన్నదా ఏమిటి?

శ్రీరంగం శ్రీనివాసరావు

(తెనుగులో స్వతంత్రంగా రాయబడ్డ రచనలు ప్రకటించడమే మా సంకల్పం; కాని యెవరేనా యితరభాషలలో వున్న గొప్పరచనలు అనువదించి పంపిస్తే "ప్రకటించకూడ" దని మేము వ్రతం పూనలేదు. అయితే శ్రీనివాసరావుగారు చూపిన వ్యాసం అలాంటిదనే వూహతో ప్రకటించబడ్డది కాదు. అసలది స్వతంత్రం కాదని మాకు తెలవనే తెలవదు. వ్యాసకర్త యెక్కడా, యేవిధంగానూ ఆసంగతి సూచించలేదు. అలా సూచించకపోవడంలో వ్యాసకర్త వుద్దేశం యేమిటో మాకు తెలవదు; గాని అది మేము తప్పనే నమ్ముతాము. అయితే శ్రీనివాసరావుగారు చెప్పినట్టు ఇతరభాషలోవున్న రచనకు అనువాదం చేసి—లేక దాన్ని అనుసరించి రాసి ఆసంగతి చెప్పకపోవడం మనలో కొందరికి పిత్రాచారంగా వుంది. ఇది మంచిదని మేము చెప్పలేము. ఇలాంటి రహస్యాలను కనిపెట్టడం అన్ని సందర్భాల్లోనూ, అందరి విషయాల్లోనూ సంపాదకులకు—విశేషించి మాకు సాధ్యం కాదు. వ్యాసకర్తే తన ధర్మం నెరవేర్చుకోడం

చాలా మంచి పని. ఈ ధర్మాన్ని గమనించి వ్యాసకర్త చెప్పక, సంపాదకుడు గమనించలేక యీలాగ జరగడం తటస్థిస్తే అక్కడ పశ్చాత్తాపపడడం తప్ప వేరు గతి లేదు. సంపాదకుడు)

౨

"నమస్కారములు— మీపత్రికలో వచనవ్యాసాలే గాని పద్యవ్యాసాలు ప్రకటించ మని నియమం పూనినారు. దీన్ని పురస్కరించుకొని ప్రబుద్ధాంధ్రను ప్రశంసించే వారిలో కొందరు గతానుగతికంగా ఆధునిక పద్యవాఙ్మయాన్ని తీవ్రంగా నిరసించినారు. గద్యవ్యాసాలు మాత్రమే ప్రకటిస్తా మంటే మీరు గద్యవాఙ్మయశాఖను అభివృద్ధి చేయడం కోసమే ఆనియమం పూనినా రనుకున్నాను; కాని పద్యవాఙ్మయనిరసనమే మీ అభిప్రాయ మేమో అనుకోవడానికి అవకాశ మిస్తున్నవి మీ పత్రికలోని వ్యాసాలు. మనము ఒక వాఙ్మయశాఖను అభివృద్ధి చేయడం కోసం ఇంకో శాఖను నిరసించడం కేవలం సాహసం. ఇంగ్లీషు మొదలైన ఇతరభాషల్లో కూడ కథల పత్రికలూ, పద్యాల పత్రికలూ మొదలైనవి ఆయా శాఖలను ప్రత్యేకం అభివృద్ధిపరిచే అభిప్రాయందో నెలకొల్పినారు. కాని అంత మాత్రాన ఇతరశాఖలను వారెవరూ నిరసించడం లేదు. ఈ విషయంలో మీ అభిప్రాయం ఇదమిత్థమని ప్రకటించడం భావ్యమేమో అని తలంచుచున్నాను.

ఉన్నతాదర్శాలు గల మీపత్రిక ఉత్తమస్థానం అధిష్ఠించి వాఙ్మయసేవ చేయగల దని ఆశిస్తున్నాను."

పురిపండా అప్పలస్వామి

(మా మిత్రులు అప్పలస్వామిగారు ఈవిషయం యిలాగ లేఖారూపంగా అడగడం చాలా మంచి దయింది. ఏమంటే? అయిదారుగురు మిత్రులు ఈవిషయంలో మమ్మిలాగే ప్రశ్నించారు. "ప్రబుద్ధాంధ్రలో పద్యవ్యాసాలు ప్రకటించబడవు. ఎంచేతా? ప్రతీభాషలోనూ అపారంగా వుండవలసిన వచనవాఙ్మయం తెనుగులో బొత్తిగా లేదు. కనక దేశీయులకు ఈవిషయంలో శ్రద్ధ వహించా లనే సంగతి స్ఫురించడానికి" ఇదీ మా వుద్దేశం. ఇంతే కాని పద్యవాఙ్మయాన్ని మే మే సందర్భంలోనూ నిరసించం. కళాదృష్టితో చూస్తే వచనానికీ, పద్యానికీ తారతమ్యం చూపించడానికి అవకాశం లేదు. కానయి[illegible]చనం అయితే కవితయొక్క నిసర్గమాధుర్యమే అనుభవంలోకి వస్తుంది. పద్యం అయితే కవిత్వమూ సంగీతమూ మిళితమై విలక్షణమైన రుచి కలుగుతుంది. ఇది గమనించలేక కొందరు కవిత్వం పద్యమయం గానే వుంటుం దని భ్రమిస్తారు. కవిత్వం మాటల కూర్పుదలలో పొటమరిస్తుంది; కాని ఛందస్సులో కాదు. / అయితే ప్రతీదేశంలోనూ ఆదిలో పద్యవాఙ్మయమే ప్రారంభ మయింది. (ఇక్కడ పద్యం అంటే గేయాలకు కూడా గ్రహణం) పద్యవాఙ్మయం కూలంకషం అయిన తరవాతనే వచనవాఙ్మయం పొడచూపుతూ వచ్చింది. ఈస్థితిలో కవిత్వం వల్ల ఆనందం అనుభవించగలవాడు పద్యాన్ని గాని, వచనాన్ని గాని యెలా నిరసించగలడూ? అయితే: వొకటి మాత్రం వుంది. పద్యవాఙ్మయానికి జనుల నందర్నీ సంస్కృతచిత్తులుగా చేసే శక్తి లేదు. వచనవాఙ్మయానికి ఈశక్తి వుంది. మేము ప్రబుద్ధాంధ్రలో పద్యవాఙ్మయాన్ని మాని వచనవాఙ్మయాన్నే స్వీకరించడానికి యిదీ వొక కారణమే. (సంపాదకుడు)

# వ్యాఖ్యానములు

## ఆంధ్రమహాసభ

ఇది గుంటూరు జిల్లాలో జరుగుతుం దని మొదట కబురు వచ్చింది. తరవాత రాయలసీమలో—అనంతపురంలో అన్నారు. మరికొన్ని సభలు కూడా దీనికి జత చెయ్యాలని ఆలోచనలు జరిగాయి కనకనూ, అప్పట్లో ఓఢ్రుల దురాక్రమణవాంఛ మనలో కొంచెం—మాట మట్టుకేనా కసెంత చురుకు పుట్టించి వుంది కనకనూ, కాంగ్రెస్సు సంబంధమైన అడావిడి యేమీ లేకుండా దేశం అంతా నిస్తరంగసముద్రం లాగ నిశ్శబ్దంగా వుంది కనకనూ వొక నెల యెచ్చు తక్కువగా నేనా సభ తప్పకుండా జరుగుతుం దనీ, అజరగడం రాయలసీమలో కావడంవల్ల ఆధిక్యం సిద్ధించే కార్యక్రమం నడుస్తుం దనీ ఆశపడ్డాం.

కాని యిక యిప్పుడా ఆశకి యెడం లేదు.

ఏమంటే? కాంగ్రెస్సుకి కట్టుళ్లు తప్పిపోయాయి. పైగా అది అసెంబ్లీ యెన్నికలలో పోటీ చెయ్యడానికి నిశ్చయించుకుని చాలా ముమ్మరంగానూ, చురుగ్గానూ సన్నాహాలు చేసుకుంటోంది. జస్టిసుపక్షం కూడా యెన్నికల ప్రవాహంలో వురికి చాలా తీవ్రంగా పని చేస్తోంది. ఆపైని ఆంధ్రరాష్ట్రం అంటే కాంగ్రెస్సుకి నీరసమూ, జస్టిస్సుపక్షానికి అనిష్టమూనూ.

సరే, యిక మితవాదులకు ఆంధ్రోద్యమం యెప్పుడూ సవతి బిడ్డగానే వుంది.

ఇలాగ ఆంధ్రమహాసభ మళ్ళీ యింకో మాటు వెనకబడిపోయింది.

ఏం? కాంగ్రెస్సు పెదవి విరిచినంత మాత్రానా, జస్టిస్సుపక్షం వ్యతిరేకించినంత మాత్రానా, మితవాదులు యీ వేపుకే చూడనంత మాత్రానా ఆంధ్రోద్యమం చప్పబడిపోవలసిందేనా?

ఆంధ్రజాతి అంటే శుష్క రాజకీయప్రచారకుల యీ ముఠాలు మాత్రమే కాదు. ఈ కాంగ్రెస్సూ, ఈ జస్టిసుపక్షమూ, యీ మితవాదివర్గమూ, కల్లోలాలు పెంచి వున్న రవంత శక్తిని ఛిన్నాభిన్నాలు చేసేవే గాని ఆంధ్రజాతికి పుష్టి కలిగించేవి కావు. మరిన్ని భావదాస్యమూ, అనుకరణపరాయణతా, స్పర్థా పెంచి చీలికలు కలిగించేవే కాని నవశక్తి సంఘటించి, దృక్పథాన్ని కాలానుగణ్యంగా మార్చి, విలక్షణమైన వికాసం కలిగించతగ్గవి కావు.

ఆంధ్రజాతికి ఇవి ప్రాతినిధ్యం వహించ తగ్గవి కానే కావు,

ఆంధ్రదేశంలో యిప్పటికి గూడా యెలాంటి ప్రతికూలశక్తులు ముట్టడించినా సంప్రదాయాన్ని చిరసంచితమైన జాతీయధర్మాన్ని ప్రాణపదంగా కాపాడుకుంటూ వస్తూవున్న గృహస్థులు, పండితులు, స్త్రీలు, వ్యవసాయదారులు. శిల్పులు, కవులు, గాయకులు, పారిశ్రామికులు, వర్తకులు, సంపన్నులు, జమీందారులు ఉన్నారు. సమయం వస్తే ఆంధ్రజాతియొక్క పూర్వోన్నతికి స్మృతిచిహ్నాలుగా నిలవగలవారు వీరే గాని ఆ రాజకీయపక్షాల క, చ, ట, త, పలు కావు. పరవశులు కాని పత్రికాసంపాదకులూ, నవీనవిజ్ఞాన భరితులై వున్న ఆంగ్లవిద్యాపారంగతులూ, పూనుకుని సంప్రదాయాన్ని భంగపరచని నవీనమార్గాలు చూపించి నడిపిస్తే మళ్ళీ ఆంధ్రజాతికి జవసత్వాలు కలిగించగలవారు వీరే గాని మ రెవరూ కారు.

కనక మన రాజకీయప్రచారకులు ఆంధ్రోద్యమాన్ని చిన్నచూపు చూస్తున్నారంటే మనం ఆనందించతగ్గదే; గాని విచారించనక్కరలేదు.

అయితే యిప్పుడు కర్మవీరుల యీ వారసులకు ఉత్తేజం కలిగించాలి. ఇదీ యిప్పుడు అత్యవసరంగా

చెయ్యతగ్గపని. ఈపని చెయ్యా లంటే రాజకీయాలతో యేమాత్రమూ సంపర్కం లేనివారు ఆంధ్ర మహాసభని స్వాధీనం చేసుకోవాలి. ఆసందర్భాలున్నాయంటే యిప్పుడు ఆంధ్రరాష్ట్రప్రస్తావన కూడా విడిచిపెట్టివెయ్యవచ్చు. ఎమంటే ఆంధ్రరాష్ట్రం ప్రభుత్వంవారు నిర్మించవలసింది; కాని మన చేతిలో పని కాదు. రాజకీయాలు అనేకవిధాల కలుషితాలైపోయి వున్న యీసమయంలో దొరతనంవారు ఆంధ్రరాష్ట్రం నిర్మిస్తారని తోచదు. దీనికోసం మన జాతీయపునర్నిర్మాణం నిలుపు చెయ్యడానికి వీలు లేదు. ముందు ఆంధ్రజాతిఅంటే ఇరుగుపొరుగువారు "ఇలాంటిదా!" అని నివ్వెరపడేటట్టు చెయ్యాలి. ఈఫలం లభించా లంటే ఆంధ్రమహాసభ యొక్క దుష్టాంగాలు ఛేదించి నూత్నరూపం యివ్వాలి.

ఆడంబరం లేని యీ జాతీయసేవ చెయ్యడానికి నడుం కట్టుకునే వా రెవరు ?

వినిపించుకోండి. కూలంకషాలైన గోదావరి, కృష్ణ, తుంగభద్ర, పినాకిని మొదలైన మహానదులఉత్తుంగతరంగాల కలకలనినాదంతో ఆంధ్రమాత యిలా అడుగుతోంది.

## మన జాతి నిరీక్షిస్తోంది

ఏరోజు కారోజే మాహమ్మదీయులు హిందూస్త్రీలను చెరబడుతూ వున్నట్టు ఉత్తరహిందూస్థానంనుంచి వారమీద వార వస్తోంది. తరుణవయస్కురాలైన హిందూస్త్రీ బయటికి వచ్చిందంటే మళ్లీ యింటికి చేరుకుంటుందా లేదా అన్న అలజడి అక్కడ క్షణక్షణమూ పెరిగిపోతోంది. ఎవరు దీనికి జవాబుదారీ ?

హిందువు అయినవాడెవడూ దీన్ని అడ్డుకోలేకపోతున్నాడు. ఉపాయం కూడా యేమీ కనపడ్డం లేదు. హిందూస్త్రీల మానం రక్షించవలసిందని, మాహమ్మదీయుల స్వాధీనంలో వున్న తమ స్త్రీలను చెరవిడిపించవలసిందని అక్కడి హిందువులనేకులు దొరతనంవారిని ప్రార్థిస్తున్నారు. అయితే యెంత బలవంతమైనా కేవలం దొరతనానికి ఇది సాధ్యమా? హిందూస్త్రీలను హరించడానికి మాహమ్మదీయుల కుండే ధైర్యసాహసాలు తమ స్త్రీలను రక్షించుకోడానికీ చెరవిడిపించుకోడానికీ హిందువులకు లేనప్పుడు భగవంతుడు మాత్రం యీసందర్భంలో యేం చెయ్యగలడూ ?

మన వేదాంతం ఆత్మానాత్మవివేకం కలిగించడంలో అద్వితీయమే కావచ్చు; కాని అది పూర్తిగా మన కొంప తీసింది. అది మనకు మానవసహజమైన ఆశ లేకుండా చేసింది. అభిలాషను చంపేసింది. తెంపు, అభిమానము, పౌరుషము, శౌర్యము, ధైర్యము — వీటిని బుగ్గి చేసేసింది. "ఏమీ లేదు. అంతా మాయ" అని మూర్ఖబోధ చేసి మన బుర్ర కాళీ చేసేసింది. హిందువుడికంటే చలిచీమ నయం అనిపించింది.

నిజంగా మన మిప్పుడు కడుపునిండా తినలేము, మనసారా యేమీ అనుభవించలేము. కాలికొద్దీ నడవలేము. చేతికొద్దీ యేమీ చెయ్యలేము. కళ్లారా చూడలేము. ఆలోచించలేము. ఎత్తులు వెయ్యలేము. ముందుకి నడకలేము. అంతే కాదు, వెనక్కి కూడా రాలేము. ఏం చెయ్యతలుచుకున్నా నవనాడులూ కుంగిపోతాయి. అసలు తలుచుకోడానిక్కూడా శక్తి లేదు. జీవచ్ఛవం యేలాంటిదీ అంటే హిందూజాతిని ఉదాహరించవచ్చు.

మన జాతిని నిర్వీర్యం చేసింది. ఇంగ్లీషు ప్రభువుల ఆయుధశాసనం కాదు, మన వైరాగ్యం.

మన జాతిని సకలవిధాలా నేలబెట్టి కొట్టేసి ఇలాంటి అధమాధమస్థితికి తెచ్చింది మన వైరాగ్యమే కాని మరేమీ కాదు.

అయితే: మన వైరాగ్యం యీ సంగతి కూడా మనకి బోధపడనివ్వడం లేదు. లేకపోతే వెయ్యేళ్లనుంచి మాహమ్మదీయుల ప్రవృత్తి చూస్తూ, రెండు

వందల సంవత్సరాలనుంచి పాశ్చాత్యుల ప్రగమనశీలతని చూస్తూ, తెలుసుకుంటూ మన మింకా పూర్వ స్థితిలోనే — ఆ వైరాగ్యాన్ని పట్టుకునే వేలాడుతున్నా మంటే అర్థం యేమిటి?

హిందూజాతి బాగుపడా లంటే యిప్పుడు రాజకీయాలవల్ల ప్రయోజనం లేదు, సంఘాచారాలను దిద్దడంవల్ల లాభం లేదు. కావలసిన అన్ని వస్తువులూ మనమే తయారు చేసుకున్నా మనం బాగుపడము. బయటినుంచి వచ్చిన ప్రతికూలశక్తు లేమీ మనల్ని పాడుచెయ్యలేదు. మన వైరాగ్యమే మనల్ని చెరిచింది. చెరుస్తోంది. ఇంకా చెరుపుతుంది.

హిందూజాతిని బాగుచెయ్యగల మగవా డెవ్వడూ అంటే యీ వైరాగ్యాన్ని చంపగలవాడే. జాతి అంతా యిప్పుడు అలాంటి వ్యక్తికోసం నిరీక్షిస్తోంది.

## ప్రతిష్ఠా పిశాచం

క=కామేశ్వరరావు అనే వారు (౨౮—౭—౩౪ కృష్ణాపత్రికలో) "హిందీవ్యాప్తి ఉపద్రవకరమా?" అని అడుగుతున్నారు.

ఇంకా సందేహమా?

హిందీ తెనుగు భాషకు యెలాంటి వుపద్రవాన్ని కలిగిస్తోందో ప్రబుద్ధాంధ్ర జులై సంచికలో మేము చాలా వివరాలతో చూపించాము. (ఈసంచికలోనూ మరికొన్ని వివరాలు ఇచ్చాము) కామేశ్వరరావుగారు వాటి నన్నిటినీ బాగా పరిశీలించే వ్రా[illegible]రు. వారు అక్షరం అక్షరానికీ వాటిని స్మ[illegible]న కృష్ణాపత్రికలోని వ్యాసం రాశారు; కాని ప్రబుద్ధాంధ్ర అనే పేరు పలకడానికి వారికి నోరు తిరగలేదు, రాయడానికి కలమున్నూ ఆడలేదు.

"తెనుగు చచ్చిపోయి తెనుగువారి సర్వవ్యవహారాలలోనూ హిందీ ప్రవేశిస్తుందా?" అని కాదు ప్రశ్న. "హిందీప్రచారకుల ఉద్దేశం యేమిటి? దక్షిణదేశభాషల నన్నిటినీ చంపేసి హిందీనే స్వీకరించేటట్టు చెయ్యాలని వారు బాహాటంగా చెబుతూ వున్నప్పుడు ఆప్రచారాన్ని మందలించడమా, బలపరపరచడమా?" "నేను తెనుగువాణ్ణి" అని సగర్వంగా అనుకోగలవాడి కిప్పుడిదీ సమస్య.

"తెనుగును నాశనము చేసి హిందీయే తెనుగుదేశములో పట్టము గట్టుకొంటుం"దని మా కేమీ భయం లేదు. హిందీప్రచారకుల వుద్దేశం కొంతవరకూ నెగ్గవచ్చు గాని చివరికి నిర్మూలమే అయిపోతుంది. నిజమే. కాని యిప్పు డీకంగాళీ అంతా యేమిటి? తెనుగు భాషకు పుష్టి కలిగించవలసిన కొంత కాలాన్ని దుర్వినియోగం యెందుకు చెయ్యాలి? తెనుగువారే చేస్తున్న దుష్ప్రచారం తగ్గించనక్కరలేదూ?

గాంధిగారు గుజరాతీలో చాలా చాలా పని చేసి వుండవచ్చు; కాని వారు ఎక్కడికి వచ్చినా "హిందీ నేర్చుకోండి" అని నిర్బంధిస్తున్నారు. వారు దేశభాషల ప్రస్తావన ప్రతీచోటా చెయ్యడం లేదు. దీనితో ప్రచారకులు ఆవేశం పొందుతున్నారు. సదసద్విచారమూ, లాభనష్టాలూ యెరగని దేశీయులు ప్రచారకుల దుర్బోధలో పడిపోతున్నారు. లేకపోతే తెనుగులో వర్ణక్రమమేనా సరిగా రానివారు కూడా హిందీలో పట్టభద్రు లవుతున్నా రంటే అర్థం యేమిటి? పుస్తకం చేతబట్టింది మొదలుకుని హిందీలో గిడసబారిపోయిన తెనుగువారు ఇంగ్లీషులో గిడసబారిపోయినవారి లాగే తెనుగుకు దూరమైపోడానికేమేనా అడ్డుందా?

"మాతృభాషా గౌరవమును చాటడానికి తెనుగునాడులో సరియైన ఉద్యమము లేకపోబట్టే ప్రజలు తెనుగును అశ్రద్ధ చేయడము తటస్థించినది కాని తెనుగునందు ఏవగింపు పుట్టిన్నీ, హిందీయందు మోజు పుట్టిన్నీ కాదు"ట, అయితే మాతృ

భాషా గౌరవాన్ని చాటడానికి తమ దేశంలో సరియైన ఉద్యమం నడపలేని తెనుగువారు హిందీ ప్రచారోద్యమాన్ని శక్తికి మించి కూడా చేస్తున్నా రంటే యేమన్న మాట? ఏభాష కెలాంటి గౌరవం చెయ్యాలో తెనుగువారికి తెలవ దన్న మాటే కదా? అలాంటి తెనుగువారు సర్వానికీ హిందీనే ఉపయోగించడాని కేమైనా అభ్యంతరం వుందా? ఇంగ్లీషే చదువుతున్న వారిలో ఇప్పుడు చాలామంది చేస్తూ వున్న పనే కాదూ యిదీ? ఈసన్నివేశం చూసేనా హిందీ విషయంలో మనం జాగ్రత్త పడవద్దూ?.

"పోనీ, హిందీప్రచారానికి పూర్వమైనా తెనుగు నభివృద్ధిపరుద్దామనే సంచలనము పల్లెటూళ్లలో కలిగిందా? అప్పుడవి నిద్ర పోతూన్నవి''ట. తెనుగు దేశపు పరిస్థితులు తెలిసిన వారిలా అనలేరు. ఏమంటే? కృష్ణాపత్రిక, ఆంధ్రపత్రిక చేసిన విజ్ఞానవ్యాపనమూ, ఉద్బోధనమూ ఇంతా అంతా అని చెప్పడానికి శక్తి గాదు. తరవాత విజ్ఞానచంద్రికా మండలిద్వారా కే. వి. లక్ష్మణరావుపంతులుగారు మంచి నికరమైన ప్రబోధం కలిగించారు. తరవాత ఆంధ్రప్రచారిణి గూడా అపారమైన పఠనతృష్ణ కలిగించింది. ప్రారంభంలో అయిదారు సంవత్సరాలు ఆంధ్రమహాసభ చేసిన ప్రబోధం కూడా అనంతంగావుంది; కాని తరవాత కాంగ్రెస్సూ, హిందీప్రచారమూ వచ్చాక మన తెనుగువారు ఆంధ్రత్వాన్ని మరచిపోయారు. ఇది తెలవకుండా యేదోరాసెయ్యడం చాలా సాహసం అనిపించుకుంటుంది. పోనీ వారి మాటే వొప్పుకుందాం. "వాటిని (పల్లెలను) కాంగ్రెస్సూ తన్మూలకంగా హిందీ మేల్కొలిపినవి''ట. ఇదీ మాట. ఈముక్తాయింపుకోసం కామేశ్వరరావుగారు ఎత్తిన ఎత్తిది. అయినా వారి వాదాన్ని అంగీకరించినా హిందీ ఆంధ్రులను మేల్కొలిపిన దంటే తన జందెంలోకి యీడ్చుకుపోయిం దన్నమాటే కాదూ? లేకపోతే: హిందీద్వారా తెనుగు నేర్చుకుంటున్నా మంటారా? తెనుగువారికి ఇంతకంటే దౌర్భాగ్యం లేదు. ఇది సిగ్గుపడవలసిన విషయం.

"ఆంధ్రుల కిప్పుడు తల్లిభాషయెడల వారు నిర్వర్తింపవలసిన విధిని హెచ్చరించవలసియున్నది. ఆ భాషాసౌందర్యమును వారికి హృద్యతము చేయవలసియున్నది''ట. ఈసంగతి తెలిసే వున్నప్పుడింకెందుకూ హిందీ అంటే అంత అభిమానమూ? మాతృభాషలో ప్రజ్ఞ సంపాదించుకోకుండా పరభాషలో పని చెయ్యడానికి కెవరికీ అధికారం లేదు. అలాంటి ప్రజ్ఞ వున్నవారికి పరభాషలవల్ల యేమీ అపాయం కలగదు. తెనుగువారికి ముందు తెనుగు బాగా నేర్చి తరవాత హిందీ నేర్పుతా మంటే యెవ రేమంటారూ? "స్వతస్సిద్ధముగా అప్పుడే తెనుగుకు లభించే స్థానము తెనుగుకీ, హిందీకి లభించే స్థానము హిందీకీ, లభిస్తుం'' దన్నారు కామేశ్వరరావుగారు. ఈమాట కొట్లు వెలచేస్తుంది.

తరవాత రామేశ్వరరావుగారు రవీంద్రునాథఠాకూరుగారి ప్రస్తావన చేశారు. ఎందుకో బోధపడలేదు. అలాంటి కవులు లేని భాషలవా రంతా హిందీలో మునిగిపోవలసిం దనా వారి వుద్దేశం? శతావధాని వెంకటశాస్త్రిగారిని గూడా ప్రస్తావించి కామేశ్వరరావుగారు వారిని గౌరవించబోయారు; గాని చివరికి గౌరవస్థితిలో నిలపలేరు. ఏమో అన్నారు. కొంచెం యెక్కించబోయి చివరికి శాస్త్రిగారిని లోయలో కూలదోశారు. సాహసం.

ఇలాగ ఇప్పుడు జరుగుతూ వున్న హిందీప్రచారాన్ని ఎంత సమర్థించబోయినా కామేశ్వరరావుగారికే "కాని హిందీప్రచారకులు ఆంధ్రదేశంలో తెనుగు ఉన్న దనే గుర్తు కొంచెము ఉంచుకునే ప్రచారము చేయవలసి ఉంటుంది'' అని "కాని ఈలోగా మాతృభాషాభిమానము వదలకు డని దేశీయులను హెచ్చరించడం మాత్రం మానడానికి వీలు లేదు'' అని చివరికి వొప్పుకోక తప్పింది కాదు;

అయితే యీసంగతి వొప్పుకుని లోపున వారిని ప్రతిష్ఠ యెంతేనా యిబ్బంది పెట్టింది. కొదూ? పర భాషావ్యామోహం సుఖసుఖాల పోనిస్తుందా మరి?

## అగ్నిపరీక్షయిదీ

అనుకున్నంత పని జరిగింది.

"మాహమ్మదీయులా, బలపరచడం, హిందువులా?" అని అయినా కొంత అర్థం వుండును; కాని "మాహమ్మదీయులా ప్రధానం, జాతీయతా?" అని కచ్చితమైన ప్రశ్న.

కాంగ్రెస్సు జీవితంలో యిలాంటి సంధిగ్ధస్థితి యెప్పుడూ తటస్థించలేదు. బాధ్యతను గుర్తించే వారికి గుండెలు తుప్పూ తుప్పూ మనిపించే ప్రశ్న యిది; కాని నమరూ బెదురూ లేకుండా కాంగ్రెస్సు మాహమ్మదీయుల పక్షం అవలంబించింది. మళ్లీ చూడబోతే అమహాసంస్థ పేరు భారతజాతీయ మహాసభ!

అణే, మాలవ్యాగార్లకు కాంగ్రెస్సులో వుండడానికి అస్కారం లేకపోయినందుకు కొందరు ప్రముఖులు విచారించారు; కాని గాంధిగారి కా బెంగలేదు. వొక్క సత్యమూర్తిగా రుంటే చాలు ననుకున్నారు వారు. నిజమే, కాంగ్రెస్సుకి ఇన్నాళ్ళకి దొరికింది దిగ్గజంలాంటి అవలంబం!

అయితే కాంగ్రెస్సు పక్షంగా చూస్తే యిది చాలా పకడ్బైన సన్నివేశం. ఏమంటే? ఇప్పటిదాకా కాంగ్రెస్సుకి దొరతనంతో పోరాడడం వొక్కటే కార్యక్రమం. పర్యవసానం యెటు తేలినా దానికి విచారం లేదు. జయాపజయాలకు పూచీ అంతా దేశీయులదే.

ఇప్పుడదంతా మారిపోయింది. కాంగ్రెస్సే సొంతంగా మార్చుతుంది. జాతీయదృష్టితో పరిశీలించే అన్ని తెగల వారికీ, అన్ని మతాల వారికీ అన్ని జాతుల వారికీ, ప్రపంచకళ్యాణాన్ని ఆశించే అన్ని దేశాలవారికీ దానిమీద అజమాయిషీ చెయ్యడానికి అధికారం పుట్టింది.

నిజంగా కాంగ్రెస్సుకి ఎప్పుడో కలిగివుండవలసిన స్థితి యిది.

గాంధిగారి ప్రతిభకి వొరపిడి యిదివరకి కాదు, యిక ముందు.

అయితే అణే, మాలవ్యాగార్లు మాత్రం తొణక్కుండా—మేరువులాగ నిశ్చలంగా నిలబడి వుండాలి. లేకపోతే అంతా బూడిదలో పోసిన పన్నీ రయిపోతుంది.

## రాజూ, ప్రజలూనూ

హైదరాబాదు రాజ్యంలో యిక ముందు ఆరాజ్యం వారికే వుద్యోగాలు. ఇదివరకే అక్కడ వుద్యోగాలు సంపాదించుకుని వున్న వారికి వుద్యోగభంగం చెయ్యరు; కాని కొత్తవారిని చేర్చుకోరు.

స్థూలదృష్టికి "ఏమిటీ యీ సంకుచిత నిశ్చయం?" అనిపిస్తుంది. చాలా మందికి కష్టం కూడా కలుగుతుంది; కాని కోనియాడవలసిన సిద్ధాంతం యిది. అందరూ అవలంబించవలసింది కూడానూ.

ఉద్యోగం దొరకడంవల్ల దొరికిన వారికి నిర్విచారంగా సంసారం నిర్వహించుకోడానికి తగిన స్థిరమైన ఆదాయం కలుగుతుంది. ఈవిధంగా కొంత డబ్బు నైజాముగాజ్యంలోనే వుండిపోతుంది.

నిజమే; కాని యిక్కడ గమనించవలసిన సంగతి యిది కాదు. దీనివల్ల దేశీయులకే ముట్టవలసిన డబ్బు పైవారు తన్నుకుపోరు. దేశీయులు అసంతృప్తులు కానక్కర లేదు. పొట్ట చేతబట్టుకుని అగమ్యకాకులాగ అక్కడికీ, అక్కడికీ పరిగెత్తవలసిన బాధకూడా వుండదు.

ఇందులో ప్రధానమైన ప్రయోజనం యిదీ ఏమిటంటే?

"రాజానకుః ప్రజ శరీరము. రాజు ప్రజకు నాత్మ" అని నీతివచనం. ఇప్పుడు హైదరాబాదు రాజ్యంలో యీనీతి సర్వవిధాలా అనుష్ఠానంలోకి వస్తుంది.

నైజాముగారి యీ ఫర్మానాకు మా అభినందనాలు తెలుపుతున్నాం.

ప్రబుద్ధాంధ్ర

కళాభివర్ధనీపరిషత్తువారు ప్రకటించబడు మాసపత్రిక

సంపాదకుడు :- శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

సంపుటము ౫ } రాజమహేంద్రవరము సెప్టెంబరు ౧౯౩౮ { సంచిక ౯

# పెళ్లానికి తగ్గ మొగాడేడీ?

సుబ్రహ్మణ్యశాస్త్రి—సంపాదకుడు

తూర్పు తెల్లవారుతోంది దనగా జకరయ్యా, యెలిజబెత్తూ రైలు కోసం అనపర్తి స్టేషనుకి బయలుదేరారు. స్టేషను రాయవరానికి బిగిసి నాలుగు మైళ్లుంది; కనక యెండ తగలకుండా వెళ్లాలని వారు కొంచెం దురుసుగానే నడుస్తున్నారు. జకరయ్య చేతిలో చిన్నమూట తప్ప మరేమీ లేదు. యెలిజబెత్తు కులాసాగా కబుర్లు చెబుతూ పక్కపక్కనే నడుస్తోంది. ధవళేశ్వరంలో మిస్సమ్మ దగ్గిర గుమాస్తాగా వున్న తమ కుమారుడు కృపానందాన్ని గురించి వారిద్దరూ చాలా వుత్సాహంగా మాట్లాడుకుంటున్నారు.

ఆశపువారి తోట సమీపించాటప్పటికి మహేంద్రవాడలో టీచరుగా వున్న సామియేలు రామచంద్రపురం వెడుతూ వారికెదురుపడ్డాడు. మొదట అతను భక్తితో వారికి సలాములు చెయ్యడమూ, ఆదంపతులు ప్రేమతో అతగాణ్ణి దీవించడమూ, తరవాత కుశలప్రశ్నాదికమూ—ఇదంతా సక్రమంగా జరిగిపోయింది. అప్పుడు సామియేలు కృపానందం సంగతి యెత్తుకున్నాడు. "కృపానందం నాకు ప్రియమైన సోదరుని కంటేనూ యెక్కువ. అతణ్ణి చూస్తే నాకు ఆనందం పొంగిపోతుంది. నిన్న రాత్రే నేను ధవళేశ్వరంనుంచి వచ్చాను. అతను మీకు వెయ్యి సలాములు చెప్పమన్నాడు. మిస్సమ్మగారికి అతనిమీద వుండే ప్రేమ మరెవ్వరి మీదా లేదు. మీరు చాలా పుణ్యం చేసుకున్నారు. మీ కుమారుని కోసం గొప్ప అదృష్టం కనిపెట్టుకుని వుంది" అని అతను చెప్పగా వారికి బ్రహ్మానందం అయింది. "యేసుప్రభువు నిన్ను కాపాడుగాక. ప్రియమైన సామియేలూ! నువ్వు నాకు చల్లని కబురు చెప్పావు. నాకు కృపానందం యెలాంటి వాడో నువ్వూ అలాంటివాడవే" అని దానికి యెలిజబెత్తు బదులు చెప్పగా, జకరయ్య "యిప్పుడు నువ్వు మాపాలిటి దేవదూతవైనావు. ఇవాళ మా కృపానందం పుట్టిన రోజు. ఈపండుగు కోసం మా అబ్బాయి యేటా యింటికి వచ్చేవాడు; కాని యీ సంవత్సరం యీ వుత్సవం తమ బంగాళాలో జరగాలని మిస్సమ్మగారు చాలా పట్టుపట్టారు. అందుకోసం మేమే ధవళేశ్వరం వెడుతున్నాము" అని చెబుతూ సామియేలుని కౌగిలించుకున్నాడు.

తరవాత వుచితమర్యాదలు చేసుకుని వారెవరి దారిని వారు వెళ్లిపోయారు.

౨

ఈసంభాషణవల్ల ఆదంపతుల ముఖపద్మాలు చక్కగా వికసించాయి; కాని ఆలస్యం అయింది. ఘల్లున తెల్లవారిపోయింది. అందుకు కంగారు పడుతూ జకరయ్య వడిగా ముందుకి అడుగు వేశాడు. "బిడ్డమీద అందరికీ చాలా ప్రేమగా వుంది. ఈ సంతోషంవల్ల నాకు చాలా బలం వచ్చింది; కనక నీతో సరిగా నేనూ నడువగలను పద" అంటూ ఆమె అతని అడుగుల్లో అడుగు వేసింది.

సరిహద్దు పుంతలోకి వచ్చాటప్పటికి ఆదంపతు లిద్దరూ వులిక్కిపడి నుంచునిపోయారు. చూడగా రోడ్డు పక్కని యీతదుప్ప చాటున వొక యువతి మూలుగుతూ పడివుంది. కట్టుకున్న మల్లుపంచె చాలా తెల్లగానే వుంది; గాని అక్కడక్కడ రోడ్డు బూడిద మరకలతోటీ, నెత్తురు మరకల తోటీ నానా భీభత్సంగానూ వుంది. దగ్గిరికి వెళ్లి చూడగా వొంటినిండా అరిటికాయల్లాగ కదుములూ, తాంబ్ర బెత్తికల్లాగ బొబ్బలూ వున్నాయి. నెత్తిమీదా, కుడిభుజంమీదా, యెడమ మోకాలి మీదా గాయాలు పడి నెత్తురు అట్టకట్టి వుంది.

ఆస్థితి చూశాటప్పటికి వారిద్దరి హృదయాలూ కరిగిపోయాయి. వెంటనే యెలిజబెత్తు "ప్రభువా! ఈబిడ్డని రక్షించు" అంటూ దగ్గిరికి వెళ్లి కూచుని ఆమె శిరస్సు తన వొళ్లోకి తీసుకుంది. జకరయ్య "గాయాలు! గాయాలు" అంటూ ఆత్రపడుతూ దగ్గిర కూచున్నాడు. కమిలిపోయిన ఆపడుచుని శరీరం చూడగా వారికి వొళ్ళు జలదరించింది. యెలిజబెత్తు యువతి మొగమ్మీద కమ్మిన జుట్టు సవరిస్తూ "నీళ్ళు తీసుకురం"మ్మనగా, జకరయ్య మూట విప్పి చెంబు తీసి బోదినుంచి నీళ్లు తెచ్చి అందించాడు. వెంటనే ఆమె చెంబు నోటికందించబోయింది; గాని యువతి తల వూపి చెయ్యి పట్టుకుని "మీ రెవ?" రని అడిగింది.

"మేము క్రైస్తవులం"

"అయితే నన్నెందుకు ముట్టుకున్నారూ?"

"నీ స్థితి చూడలేకా"

"......................"

"నువ్విక్కడ యిలాగ యెందుకు పడి వున్నావూ?"

"కొట్టి యీడ్చి పారేశారు"

"యెవరూ?"

"......................"

"నిన్నెవరూ చూడలేదూ?"

"మహేంద్రవాడ బ్రాహ్మ లిద్దరు చూశారు"

"చూసి — నిన్ను యిక్కడే అట్టేపెట్టేశారేం?"

"అయ్యో..............."

"పలకరించారా?"

"పులిని చూసినట్లు పారిపోయారు"

"ఏం?"

"అది మా జాతి లక్షణం"

"అయితే యిది మా జాతి లక్షణం"

"......................"

"కష్టంలో వున్నవారికి సాయమూ, సేవా చెయ్య వలసిందని యేసుప్రభువు ఆజ్ఞ. ప్రజలకి దేవుని రాజ్యం చూపించి—జనులను నిజమైన మనుష్యులుగా చెయ్యడానికి మిషనువారు మమ్మల్ని రాయవరంలో నిలిపారు"

"......................"

"మా సేవ పొందడానికి నీ కిష్టం లేకపోతే మీ వాళ్లెక్కడ వున్నారో చెప్పు తీసుకు వస్తాము"

"యమదూతలనా?"

"మీ వాళ్లు యమదూతలా?"

"అంతకంటే అన్యాయం"

"అంటే?"

"యమదూతలు అయ్యవ్వ మాడితే గాని యేలిక ర్ని తీసుకుపోరు. మా వాళ్లు బతికి వుండగానే——"

"అయితే మే మెలాకనపడుతున్నామా నీకూ?"

"దేవదూతల్లాగ"

దంపతులిద్దరూ చకితు లైనారు. ఆమె ధోరణి వారికి బోధపడలేదు.

"అయితే మేము నీకు సేవ చెయ్యడానికి కింక అడ్డెందుకూ?"

"నేను మీ కెవర్ని?"

"ప్రాణికోటిలో మాకు సాటిదానవు. దేవుని రాజ్యంలో మాతో సమానంగా హక్కులు గల దానవు. ఇప్పుడు నువ్వు కష్టంలో వున్నావు కనక, నీకు సేవ చేస్తే దేవుడు మా పాపాలు మన్నించి మాకు మోక్షం యిస్తాడు. ఇది యేసుప్రభువు మాకు——అందరికీ చేసిన మహోపదేశం"

యువతికి వ్యధితహృదయంమీద అమృతం చిలికినట్లయింది. ఆమె రెండు చేతులూ అప్రయత్నంగా అంజలిముద్ర వహించాయి. కళ్లు మూతలుపడ్డాయి. పెదిమలు రావిరేకల్లాగ కదిలి పోయాయి.

వొక్క నిమిషం అయిన తరవాత యువతి మళ్లీ కళ్లు విప్పి చూసింది.

"ఈశ్వరసంకల్పం యిలా వుంది కాబోలు. దాన్ని అడ్డుపెట్టడానికి నే నెంతటిదాన్ని? నా కింకా బతకాలనే ఆశగా వుంది. దేవుడిచ్చిన ఆయుర్దాయం కష్టమో సుఖమో నలుగురితో పాటు అనుభవించకుండా మధ్యకాలంలో యెందుకు తుంచేసుకోవాలి? అలా చేస్తే మాత్రం శాంతి లభిస్తుందా? తుంచేసుకోవడం యీశ్వరతిరస్కారం కాదూ? నాకు చావు వస్తే యిదివరకే వచ్చివుండ వలసింది. ఇంత పని జరిగాక కూడా నేను బతికి వుండడం చూస్తే నన్నింకా బతికి వుండ మనే యీశ్వరు డాజ్ఞాపించినట్టు తోస్తోంది——"

"ఏకీ సిత——"

"రాత్రి పన్నెండు గంటలు దాటాక మా నాన్న, మా అన్నలూ కొట్టి వళ్లెరుకపట్లోకి యీడ్చేశారు. అరగంట కిందటే నాకు చైతన్యమో, మెళుకువో వచ్చింది"

"మీ వాళ్లే ని న్నెందుకు కొట్టారు?"

"......నేను పూర్వజన్మంలో యెన్నో పాపాలు చేశాను. లేకపోతే నాకీ జన్మ వచ్చి వుండదు......మీరు చూపిస్తూ వున్న వాత్సల్యం చూస్తే నాకు ప్రాణాలు లేచివస్తున్నాయి"

"యేసు ప్రభువు నిన్ను రక్షించుగాక"

"నా కిప్పుడు యేసు ప్రభువే గతి అయినాడు ......గొంతుక యెండిపోతోంది......మాట్లాడ లేను"

"కనిన్ని మంచినీళ్లు పుచ్చుకో అమ్మా"

"తెల్లవారింది. మొగం కడుక్కోకుండా నే నిప్పుడు మంచినీళ్లు పుచ్చుకోను"

ఈదీక్షకి ఆశ్చర్యపడుతూ యెలిజబెత్తూ, జకరయ్యా ఆమెని భద్రంగాలేవదీసి, నెమ్మదిగా నడిపించుకువెళ్లి రోడ్డు పక్కని కూచోబెట్టారు. వుత్తరక్షణంలో ఆమె దంతధావనం చేసుకుని చెంబెడు నీళ్లు తాగి మళ్లీ పడుకుంది. అది చూసి "వుండు. వుం" అంటూ యెలిజబెత్తు మళ్లీ ఆమె శిరస్సు తన వొడిలోకి తీసుకుంది.

3

యువతి నాలుగు నిమిషాలు కళ్లు మూసుకుంది. ఇంతలో ఆచెంబెడు నీళ్లూ ఆమెకి కొంచెం పుష్టి కలిగించాయి. వెంటనే ఆమె మెల్లిగా లేచి కూచుంది. "పడిపోతావు పడిపోతావు" అంటూ యెలిజబెత్తు ఆమె రెక్క పట్టుకుని ఆపింది; గాని తేలిపోతూ వున్న కళ్లతో ఆమె కమిలిపోయిన తన శరీరాన్ని వొకమాటు చూసుకుని వొక్క పెద్ద నిట్టూర్పు విడిచి కళ్లు మూసుకుని యెలిజబెత్తు వొడిలోకి పడిపోయింది. అది చూసి యెలిజబెత్తు

"బిడ్డ తన గాయాలు చూసుకుని మూర్ఛపోయింది" అంటూ ఆత్రపడగా జకరయ్య గబగబ వెళ్లి మళ్లీ నీళ్లు తెచ్చి ఆమె మొగమ్మీద చిలికాడు. యెలిజబెత్తు తన పమిటచెంగుతో మెల్లిగా మొగం తుడిచింది.

మరో నాలుగు నిమిషాలికి ఆమె మళ్లీ కళ్లు విప్పి లేచి కూచుంది.

"మీ రిద్దరూ భార్యాభర్తలా?"

"................."

"అవును" అన్నాడు జకరయ్య.

"మీకు బిడ్డ లెందరూ?"

"వొక్క కొడుకు" అంది యెలిజబెత్తు"

"కూతుళ్లు లేరూ?"

"అయ్యో! ప్రభువా!"

"నన్ను కన్నవాళ్లకి నేను తొమ్మిదో యేటనే గర్భశత్రువు నైపోయాను. వా రిద్దరూ యిప్పటికీ బతికే వున్నారు; గాని జ్ఞానం వచ్చాక నేను మాతృప్రేమనీ, పితృవాత్సల్యాన్నీ రుచేనా చూసి యెరగను. నా మొగం కనపడితే మా నాన్నకి కళ్లు చిమచిమలాడిపోతాయి. మా అమ్మ చేతులారా చంపలేక తప్పించుకు తిరుగుతోంది. నా మొగు డన్న పిల్లాడు చచ్చిపోయినందుకు ఆవిడ దుఃఖిస్తూనే వుంది; కాని నాకు సుఖం కలిగించడం— కష్టాలు తప్పించడం తన విధి అని ఆవిడ కూడా భావించలేదు. "అనుభవించు" ఇదే షష్టిగడియలూ ఆవిడ బోధన"

"ఇప్పుడా గొడవ లన్నీ యెందుకు తల్లీ?"

"ఇది వొక కెరటం. సముద్రంలో కెరటా లెందుకు వస్తాయీ? నా బతుకు సముద్రం అయిపోయింది. నన్ను మా వాళ్లే వితంతువుగా చేశారు; కాని కష్టాలు నేను అనుభవించాలి. జుట్టు తీయించకపోవడం వొకటే మావాళ్లు నాకు చెయ్యని అపకారం. నాలు గేళ్లనుంచి దానికోసం కూడా మా నాన్న రగడ పెంచుతూనే వున్నాడు; కాని నేను తరుచు మా చెల్లెలి దగ్గిర కాకినాడలో వుంటూ వుండడం వల్ల అది మాత్రం యింకా జరగలేదు"

"ఆయాసం వస్తుంది. అదంతా తరవాత చెబుదువు గాని లే అమ్మా"

"నా హృదయంలో నుంచి యీ దుఃఖం వుబుకుతోంది. దీనికి మీరు చూపుతూ వున్న ప్రేమే కారణం. మా జాతివాళ్ల లాగ మీ దారిని మీరూ పోయి వుంటే నాకీ వుద్రేకం కలక్కపోవును. ఆధారం— "అయ్యో" అని సానుభూతి చూపించే వారు అనుకున్నారు; కనక పూర్వపు కష్టాలన్నీ జ్ఞాపకం వచ్చాయి. .........మీకు కూతుళ్లు లేరన్నారు. నా కిప్పుడు నన్ను కడుపులో పెట్టుకునే తల్లిదండ్రులు కావాలి. మీరు నన్ను కూతురుగా ప్రేమిస్తారా?"

ఈ మాట అనేటప్పటి కామె కంఠం గద్గదికమై నేత్రా లశ్రుపూరితా లయిపోయాయి. ఆసన్నివేశం చూశాటప్పటికి ఆదంపతులుకి కూడా అలాగే తటస్థించింది. వెంటనే యెలిజబెత్తు ఆమెని పొదివి పట్టుకుని "తల్లీ! నువ్వు నా కూతురువు. నేను నీకు తల్లిని" అంది. జకరయ్య కూడా పుత్రికా వాత్సల్యంతో వోదార్చాడు. దీనితో యువతికి యేనుగు కున్నంత సత్తువ వచ్చింది. వెంటనే ఆమె యెలిజబెత్తుని గట్టిగా కౌగలించుకుని అతృప్త నయనాలతో ఆమె మొగంకేసి చూసింది. అప్పుడు యెలిజబెత్తు వుద్రిక్తహృదయంతో ఆమెని తన వక్షస్థలాని కదుముకుని, ఆమె కళ్లలో అమృతం వర్షించి, మాతృత్వానికి గుర్తుగా ఆమె నొసట వొక్క ముద్దు వుంచింది. తరవాత యువతి జకరయ్యమీదకి చేతులు చాపగా అతనా చేతులు గట్టిగా పట్టుకుని "తల్లీ! నిన్ను యేసుప్రభువు మాకు దయచేశాడు. ఆప్రభువునికన్న మేరీ అమ్మ. నిన్ను రక్షించుగాక" అని డగ్గుత్తికతో చెప్పాడు.

"అయితే నన్ను మీయింటికి తీసుకువెళ్లండి. ఇక్కడ నన్నెం కేమీ అడగకండి" అని ఆమె కోరగా వారిద్దరూ "సరే" అన్నారు.

౪

ఇంతలో మహేంద్రవాడ రైతులు ముగ్గురక్కడికి వచ్చారు. అందరూ శిలావిగ్రహాల్లాగ నుంచున్నారు; గాని అందులో వొకడు కొంతసేపటికి "యేమిటి గొడవ!" అని అడిగాడు. జకరయ్య దానికి తనకి తెలిసినంతవరకూ చెప్పి "రాయవరం వెళ్లి వొక బండి తెచ్చిపెడతారా?" అని అడగ్గా వారు ముగ్గురూ మారు చెప్పకుండా బోదె దాటి అరటితోటతో మాయమైపోయారు. అందుకు దంపతు లాశ్చర్యపడుతూ వుండగా "మమ్మల్ని సాక్ష్యం వెయ్యడానికా! మేం తిరగలేం బాబూ పని మానుకుని" అని తోటలోనుంచి వినపడింది.

"నేను చెప్పలేదూ? మా పద్ధతి యింతే" అని యువతి చెప్పగా యెలిజబెత్తు "యేం మనుష్యులమ్మా" అని తెల్లబోయింది. జకరయ్య "దయా దాక్షిణ్యా లున్నవారైతే వీరు బండి తేవడం దాకా యెందుకూ? వారు కొట్టి డొంకల్లోకి యీడ్చెయ్యడం యెందుకు వస్తుంది!" అన్నాడు.

దానిమీద యువతి "యిక యిక్కడ క్షణమేనా వుండడం మంచిది కాదు. నేను నడవగలను, నింపాదిగా పదండి" అంటూ తూలుతూ తూలుతూనే లేచి నుంచుంది. "వద్దు వద్దం"టూనే యెలిజబెత్తు కూడా లేచింది; గాని యువతి అంతలో రెండడుగులే వేసింది. ఇక చేసేది లేక జకరయ్య కూడా వెంట బయలుదేరగా యువతి యెలిజబెత్తు భుజంమీద తల ఆనుకుని నడుస్తూ "క్షణం. అర మైలే కాదూ మనం వెళ్లడం? బాధ లేదు, పదండి" అంది.

దారి పొడుగునా యెదురుపడ్డవా రంతా "యేమిటి సంగ"తని అడుగుతూ రాగా జకరయ్య "ప్రాంతలో పడి వుంది. ఆసుపత్రికి తీసుకువెళుతున్నాం" అని మాత్రమే జవాబు చెబుతూ వచ్చారు.

పావుగంటలో వారు రాయవరం చేరుకున్నారు. మరో పావుగంటలో ఆసుపత్రిలో యువతికి కట్టు కట్టడమూ, మందివ్వడమూ జరిగిపోయింది. మొత్తానికి యెనిమిదిం పావు అయేటప్పటికి దంపతులు యువతిని వెంటబెట్టుకుని యింటికి చేరుకున్నారు.

అది చాలా చిన్న యిల్లు. పూరిల్లు కూడానూ. వొక గది, వొక వంటగది, వొక హాలు, మూడు వేపుల వసారాలు. ఇంతే అయిల్లు; కాని అది చూపులకి చాలా ముచ్చటగా వుంది. ఎటు చూసినా చాలా పరిశుభ్రమై గాలికీ వెలుతురికీ లోటు లేకుండా వాసయోగ్యంగా వుంది. ఇంటి చుట్టూ పువ్వుల మొక్కలూ, తీగలూ—అది వుద్యానవనంలో వున్న బంగాళాలా వుంది. అచక్కదనానిక్కూడా యువతి చప్పున తేరుకుంది.

యెలిజబెత్తు నిమిషాలమీద వంట చేసేసింది. అప్పటి కప్పుడే జకరయ్య స్నానం చేసి బట్టలు మార్చుకున్నాడు. యెలిజబెత్తు యువతికి చాకింటి మడత కట్టబెట్టి ఆమెకీ, జకరయ్యకీ పింగాణీపళ్లేలలో అన్నమూ, కూరా వగైరా వడ్డించింది.

యువతి వొక్క క్షణం భ్రాంతురాలై వుండి, వుత్తరక్షణంలో ఆకాశంకేసి చూస్తూ అంజలిబంధంతో "ఈశ్వరా! అంతా నీకు తెలుసు. నువ్వే నాకు దిక్కు" అని మొక్కి భోజనం ప్రారంభించింది.

౫

ఇదంతా ముగిసేటప్పటికి పది అయింది. జకరయ్య యెలిజబెత్తుకేసి చూసి "ఇది మనం ధవళేశ్వరం చేరుకునే సమయం. అబ్బాయి రాజమండ్రి స్టేషనులో నిరుత్సాహపడి, కారణం తెలవని ఆవేదనతో బంగాళాకి వెళ్ళిపోయి వుంటాడు" అన్నా

డు. దానికి యెలిజబెత్తు "బిడ్డ నిరుత్సాహపడడం నిజమే; కాని ప్రభువు మనకీ పని పెట్టాడు. అబ్బాయి పుట్టిన రోజు వుత్సవంలో మనం అక్కడ అనుభవించే ఆనందం కంటే యిక్కడ యీ బిడ్డకి సేవ చెయ్యడంవల్ల కలిగే ఆనందం గొప్పదిన్నీ, శాశ్వత మైనదిన్నీ. అక్కడ మిస్సమ్మగారి దయ వల్ల బిడ్డకే లోటూ జరగదు. ఆ కారణంవల్ల కూడా మన ఆనందానికి కొరత లే" దని మాతృహృదయాన్ని వెల్లడించింది.

ఇది విని యువతి "సంగతి యేమి?"టని అడిగి జకరయ్య అంతా చెప్పగా "అయ్యో? నామూలంగా మీ ఆనందాని కెంత విఘాతం కలిగిందీ?" అని విచారించింది; కాని యెలిజబెత్తు "బిడ్డా! దానికోసం మాకు విచారం లేదు. నా కొడుకు పుట్టిన రోజున నాకు రత్నం వంటి కూతురు దొరికింది, మా మీద యేసుప్రభువుకి కటాక్షం వుందనడానికి ఇంతకంటే యేం నిదర్శనం కావాలీ?" అని చెప్పి ఆమెని ఓదార్చింది.

దానిమీద యువతి యిలా చెప్పింది.

"నిజమే. నాకూ యివాళ 'అమ్మా!' అని పిలవతగిన తల్లీ, 'బాబయ్యా' అని పిలవతగ్గ తండ్రీ దొరికారు. ఈ సౌభాగ్యానికి సోపానంగానే నిన్న రాత్రి నేను పరమదౌర్భాగ్యం అనుభవించవలసి వచ్చింది. వాళ్ల క్రోధం దేవుని దయవల్ల నాకు అదృష్టంగా పరిణమించింది. ఇక నా సంగతి చెబుతా వినండి. నా పేరు సుభద్రమ్మ. మా కుటుంబం పాలమూరు నూర్ళ్లో బ్రాహ్మణాగ్రహారంలోనూ చాలా యెన్నిక అయింది. బ్రాహ్మ లంతా మా కుటుంబం అంటే యెంతో గౌరవంగా చూస్తారు. బ్రాహ్మణమాత్రు లెవరూ మాయింటో ఆగలేరు. అంటే మాయింటో అందరూ నిప్పూ నీరూ కడుగుతారు. అలాంటి కుటుంబంలో నేనూ మా చెల్లెలూ మాత్రమే మారిపోయాం. నాకు ముగ్గురు అక్కలూ, వొక చెల్లెలూ, యిద్దరన్నలూ వున్నారు. నేను తరుచు కాకినాడలో మా చెల్లెలి దగ్గిర వుంటున్నాను. మా మరిది కాలేజీలో మేష్టరు. అతనికి బ్రహ్మసమాజం అంటే అభిమానం. తల్లి యింకా బతికివుండడంవల్ల అత నింకా ప్రత్యక్షంగా అమతంలో కలవలేదు; గాని కలిసినట్టే లెక్క. ఆమెకి యెనభైయేళ్లున్నాయి. నేడో రేపో అంటూ వుంది. "నన్ను కొస్త బూడిద చేసేసి తరవాత నీయిష్టం" అంది ఆవిడ. మా మరిది మూలంగా మా చెల్లెలూ, ఆయిద్దరి మూలానా నేనూ పూర్తిగా మారిపోయాం. మామరిది కాలేజీ నుంచి రాగానే మా కిద్దరికీ చదువు చెప్పడమూ, ఈ కాలపు మర్యాదలూ, పద్ధతులూ నేర్పడమూ — పాపం అతగాడికి విసుగంటూ లేదు. ఇరుగు పొరుగు అంతా అమతస్థులే కావడంవల్ల తరుచు నేను వారి యిళ్లకు వెడుతూ వారి ఆచారవ్యవహారాలు చూస్తూ నేర్చుకుంటూ వుంటాను. ఆ స్త్రీల పరిచయంవల్లా, మామరిది బోధనలవల్లా బ్రాహ్మణ జాతి అంటే రాక్షసజాతి అని బోధపడింది. వొక దయ లేదు. దాక్షిణ్యం లేదు. వేదాలూ, శాస్త్రాలూ చదవడమే; గాని అసత్యానికీ, హింసకీ జంకడం లేదు. నిప్పూ, నీళ్లూ కడగడం — యిలాంటివే బ్రాహ్మణలక్షణా లని వాళ్ల నమ్మకం. ......మా చెల్లెల్ని విడిచి వుండలేకపోవడం వొకటీ, పాలమూరు నరకంలో పడి బాధ పడలేకపోవడం వొకటీ — ఈ రెండు కారణాలవల్లా నేను తరుచు కాకినాడలో వుంటున్నాను. నాకు మళ్లీ పెళ్లి చేసుకోవాలని బుద్ధి పుట్టింది. ఈ బుద్ధి పుట్టాటప్పటికి నామనస్సు పాలమూరిలో వొక బ్రాహ్మడిమీద పడింది. కానైతే అతగాడు పెద్ద చదువు లేమీ చదవలేదు. ఆస్తి కూడా సామాన్యమే. కాని చిన్నప్పు డిద్దరమూ ఆడుకునేవాళ్లం. మాలో మేము అతను మొగుడని, నేను పెళ్లాన్నని అనుకునేవాళ్లం. సరిగా సమయానికి, ఆరుమా

సాల క్రిందట అతని పెళ్లాం కాపరానికి రాకుండానే కలరా వచ్చి చచ్చిపోయింది కూడానూ. మా మరిది కాకినాడలో యెన్నో సమ్మంధాలు చూపించాడు: గాని నామనస్సు అలా పోలేదు. మా చెల్లెలు "పాలమూరు బ్రాహ్మడు అంతపని చెయ్యలేడు సుమా" అంది. పాలమూరు పిల్లని నేను చెయ్యగలిగినప్పుడు అతను మాత్రం యెందుకు చెయ్యలేడూ?" అన్నాను నేను. కాకినాడలో వుండడంవల్లే నాలో మార్పు కలగడం నిజమే. పాలమూరిలోనే వుండిపోడంవల్ల అతనిలో మార్పు కలగడాని కవకాశం లేకపోవడం గూడా వాస్తవమే; కాని నాఆశ అలా అనిపించింది...... ఈ ఆశతో పాలమూరు వెళ్లాను. అతను పెళ్లి ప్రయత్నంలోనే వున్నాడు; గాని యింకా సిద్ధపడలేదు. అతని యిల్లు మాయింటిపక్క సందులోనే వుండడంవల్ల యేలాగో వీలు చేసుకుని వెళ్లి మొదట పరామర్శ చేసి, తరవాత సమ్మంధాల సంగతి యెత్తి చివరికి అతికష్టంమీద "వితంతువుని పెళ్లిచేసికోరాదుటోయీ?" అన్నాను. దానితో అతను ప్రకృతిలో పడ్డాడు. నాకేసి కొత్త చూపులు చూపించడం మొదలుపెట్టాడు. కొంచెం పరియాచకం—హాస్యం—వేళాకోళాలు—వెక్కిరింతలు—తుదకి ప్రేమభిక్ష; కాని పెళ్లి చేసుకోవాలనే వుద్దేశం మాత్రం లేదు. కాలం గడుపుకోవడం—వీలయినపుడు మంచి పిల్లని చూసి పెళ్లి చేసుకోవడం—ఇదీ యెత్తు; కాని యీ దురుద్దేశం నాకు తెలిసినప్పట్నుంచీ నేనతని యింటికి వెళ్లడం మానేశాను. దాసీదానిచేత కబుర్లు వచ్చాయి. దారికాసి బతిమాలడం—ఏమేమో వంకలు పన్ని మా యింటికే రావడం—ఇలాంటి వన్నీ సాగించాడు. అయితే; ఎన్ని బిత్తిరీలు చేసినా నేను లొంగలేదు. "పెళ్లి చేసుకుందాం. లేకపోతే దూరంగా వుండు" అని నేను కచ్చితంగా చెప్పేశాను. ఇదంతా అయేటప్పటికి పదిహేను రోజు లయింది.

......తరవాత యేం జరిగిందో తెలవదు: గాని వొకనాడు సాయంత్రం దాసీది వొక జాబు తెచ్చి యిచ్చింది. "ఏ సెలవు ప్రకారం నిన్ను పెళ్లి చేసుకోడానికి నిశ్చయించుకున్నాను. నువ్వెప్పుడు ఎక్కడికి రమ్మంటే అక్కడికి సిద్ధం" అని వుంది ఆజాబులో. మొదట కొంచెం అనుమానపడ్డాను; గాని చివరికి పొంగిపోయాను. ఈ వయస్సులో కోరుకున్న భర్త లభించడం కంటే ఆడదాని కిక కావలిసిం దేమిటి? కాని జాబు వచ్చిన యింకో గంటకి ప్రళయం ముంచుకు వస్తోన్నట్టు తెలిసింది. మా రహస్య వ్యాపారం కొందరు విద్యార్థులు కనిపెట్టారు. అది ఆనోటా, ఆనోటా పాకింది. చివరికి మా అమ్మకి తెలిసింది. మా అమ్మ మా పెద్దక్కతో చెప్పింది. అది వచ్చి "యేం తలుచుకున్నావే మొండి పీనుగా" అంటూ నన్నొక్క మొట్టు మొట్టి అడిగింది. అంతట్లో మా అమ్మ వచ్చి "వూరుకో, వూరుకో రేపు మీనాన్నతో చెబుదాం బుద్ధి మళ్లించుకోకపోతే" అంటూ మా అక్కని లాక్కుపోయింది; కాని నా పై ప్రాణాలు పైకెగిరిపోయాయి. "యిది యేలా పొక్కిందీ! ఏమవుతుందీ? ఇది మొగాళ్లకి తెలిస్తే పెళ్లి మాట దేవు డెరుగును. ఇంక నన్ను కాకినాడ వెళ్లనిస్తారా? బుర్ర గొరిగించకుండా వుంటారా? ఈ నరకంలో పడి బతకడ మెలాగా?" ఇలాగ నా మనస్సు అనేకవిధాల పోయింది. నిజంగా కంగారెత్తిపోయింది నాకు......... ఆ వేళ సాయంత్రం దాసీది మరో చీటి తెచ్చి యిచ్చింది. చూడగా దాన్లో "మన సంగతి బట్టబయలై పోయేటట్టుంది. ఇక యిక్కడ వుంటే మనకి ప్రాణాలు తక్కువ. తక్కినా నువ్వొక తల యెత్తుకుని తిరగడానికి వీలుండదు. అంతా అయోమయం అయిపోతుంది. కనక రాత్రి పన్నెండు గంటల వేళ నువ్వెలాగేనా చెరువు దగ్గిరికి వస్తే నేను కలుసుకుని మూరు దారిని తెల్లవారేప్పటికి నిన్ను కాకి

నాతోబాటే మీ చెల్లెలిగారి యింటో వస్తుగిస్తాను. వెంటనే—రేపే మనం పెళ్లి చేసేసుకోవచ్చు''నని వుంది......నాకు మళ్ళీ ఆశ కలిగింది. విరుచుకు పడిపోయే ఆపద తప్పిపోయినట్లు తోచి మనస్సు కొంచెం కుదుటపడింది: కాని రాత్రి పన్నెండు గంటలవేళ చెరువు గట్టుకు వెళ్ళాలి. యెలాగా? రాత్రి మా పెద్దక్క కాస్తే యేమిటి గయ్యా డం?......అప్పటి సితి యెలా వుంటుందో? వె ళ్ళాలి. తప్పదు'' అని నిశ్చయించుకున్నాను... నాకు నిద్ర రాలేదు ముసుగు—గాలికూడా ప్రవే శించడానికి వీలు లేనట్టు బిగించాను: కాని వేయి కళ్ళతో చూస్తూన్నట్టు అంతా కనిపిస్తూనే వుంది. లక్ష చెవులతో వింటూన్నట్టంతా వినపడుతూనే వుంది......పక్కయింటో గడియారం పన్నెండు కొట్టింది......మెల్లిగా ముసుగు తీసేశాను. అది శీతాకాలం కనక అందరూ గాఢనిద్రలో వున్నారు. లేచి, మునగాళ్లమీద నడిచి, మెల్లిగా తలుపులు తీసుకుని—క్షణంలో చెరువుగట్టుమీద పడ్డాను. ......అప్పటికప్పుడే అత నక్కడ కనిపెట్టు కుని వున్నాడు...... "ఇప్పు డిదప్పత్రి వెడితే తప్పకుండా మీ వాళ్ళు వెతుక్కుంటూ వచ్చి పట్టుకుంటారు. రాయవరం వెళ్ళి జట్కామీద రామచంద్రపురం చేరుకున్నా మంటే ప్రత్యేకంగా మోటారు చేసుకుని తూర్పు తెల్లవారకుండా కాకి నాడ వెళ్ళిపోతాం. ఏమంటూ'' వన్నా డతను. నాకూ అది బాగానే కనపడింది. "సరే" అంటే "సరే" అనుకున్నాం......బయలుదేరాం. మాకు చీకటి అడ్డురాలేదు. చలికూడా కనపడలేదు. ఇద్ద రమూ వొక మాటా మంతీ కూడా లేదు. ఊరుకుల తోటీ, పరుగులతోటీ వెనక్కాల ముమ్మెత్తేవరో తరుముకు వస్తూన్నట్టు మేఘాలమీద యెగిరిపోతు న్నాం......కాని మావాళ్ళు మా వెనక్కాలే వస్తున్నారు. మే మది కనిపెట్టే లేకపోయాం. నేను పడివున్నచోటికి వచ్చాటప్పటికి మా చిన్న న్నయ్య వచ్చి "మాదిగిముండా! యెక్కడికి వెళ తా'' వంటూ చెయ్యి పట్టుకున్నాడు......దాం తో నేను కెవ్వున కేక వేసి కూలబడ్డాను. వెంటనే మా నాన్న దెబ్బమీద దెబ్బకొట్టసాగాడు. మరో నిమిషానికి మా అన్నలు కూడా సాయపడ్డారు.... అందరూ నన్ను గొడ్డుని బాదినట్టు బాదేశారు. చివరికి కర్రదెబ్బ నెత్తిమీద పడింది. అంతే. దాంతో నాకు కళ్ళు తిరిగిపోయాయి. తరవాత యేం జరిగిందో? ఎవ ళ్ళేమయిపోయారో?...... తెల్లవారేక—అంతా మీకు తెలిసిందే''

ఇది పూర్తి అయాటప్పటికి సుభద్ర హృదయం తేలికపడింది.

ఇది విని దంపతు లిద్దరూ "యేసుప్రభువా!" అంటూ నిట్టూర్పులు విడిచారు.

౭

"అమ్మా! డాక్టరుగారి నడిగి సర్టిఫికెట్టు తె మ్మంటావా?'' అని జకరయ్య అడగ్గా "బాబ య్యా! యేసుప్రభువుకి గూడా సర్టిఫికెట్టు కావా లా?'' అని సుభద్ర బదు లడిగింది.

"కోర్టుకి వెడితే సాక్ష్యం యెలా వస్తుందీ—?'' అని యింతవరకూ తొక్కులాడుతూ వున్న జకర య్య యిది విని గతుక్కుమన్నాడు.

అక్కడ, పాలమూరిలో ప్రజలందరూ రాత్రి వీరావధాని చేసి చేయించిన దారుణకృత్యం విని ఆశ్చర్యపోతూ వుండగా సుభద్రమ్మ కిరస్తాని లలో కలిసినట్టు వార్త వచ్చింది. దీనితో వూరం తా గుబ్బుమని పోయింది.

వీరావధానీ, పెద్ద కొడుకూ నిర్విచారంగానూ, సావకాశంగానూ దేవతార్చనా భోజనమూ చేసి లోపలి అరుగుమీద కూచుని "ఏం జరిగిందో?'' అని ఆలోచిస్తూ వుండగా చూసి రావడానికి వెళ్ళిన రైతు వచ్చి తెల్లవారింది మొదలు జరిగిం దంతా చెప్పాడు. అదివిని లోపల్నుంచి వచ్చి పెద్ద కూతురు

"అది చచ్చిపోయిం దనుకుందాం. ఏం?" అంది; కాని యీ మాట వినిపించుకోకుండా అవధాని "నా పిల్లని లేవతీసుకుపోయా రని కిరస్తానీ వాళ్ళమీద ఛార్జి తగిలిపించా" అంటూ బుసబుసలాడుతూ గభీ మని లేచినుంచుని నడుం బిగించాడు. ఆ వృత్తాంతం చూసి రైతు తెల్లపోతూ వుండగా పెద్ద కొడుకు "నువ్వు తొందరపడకు నాన్నా!" అని శాంతపరిచి "పేరిశాస్త్రిని తీసుకు రారా" అంటూ తమ్ముణ్ణి పంపించాడు.

"ఏం నాన్నా! ఇదంతా చేసింది రామశర్మగాడు కదా. వాణ్ణి విడిచిపెట్టి కిరస్తానీల మీద యివ్వడం యెందుకూ ఛార్జి? ఇలాంటి కబుర్లు వూళ్ళో వుంటే తక్కిన వెధవపిల్ల లంతా చెడిపోతారు" అని పెద్దకూతు రంది; కాని అవధాని దానికి జవా బివ్వలేదు.

పేరిశాస్త్రి వచ్చాడు. అత డా వూళ్లో ప్లీడర్లలో ప్రముఖుడు. చూస్తూ వుండగా తల మార్చి తల పెట్టడంలో చాలా తెలివైనవాడు.

శాస్త్రి అంతా విని పక్కా పావుగంటసేపు ఆలోచించాడు. ఈ లోపుగా అవధాని "రెండు వేల రూపాయల నగలతో గూడా లేవతీసుకుపోయినట్టు ఛార్జిలో చేర్పించా"లని తృపపడుచు న్నాడు.

"కిరస్తానీల మీద ఛార్జి యివ్వా లంటారా?"

"అవును"

"మీ అమ్మాయిని వాళ్ళే లేవతీసుకుపోతే మరి దాని వొంటిమీద దెబ్బ లెలా వచ్చాయి?"

"...................."

"కిరస్తానీల ప్రోత్సాహంతో సుభద్రే మీ మీద ఛార్జి యిస్తే!"

అవధానికి మాట రాలేదు. కొడుకు లిద్దరూ శాస్త్రికేసి చూస్తూ కూచున్నారు. అప్పుడు పెద్ద కూతురు "వంశంలో యిలాంటి వెధవపీనుగులు పుడితే అన్ని చిక్కులే కాకపోతే మరే మవుతుంది? నాలు గేళ్లనుంచి పోరుతున్నాను దాని కొక్కడా బుర్ర గొరిగించెయ్య మని. విన్నారా యెవ రేనా?" అని టకాయించి అడిగింది. ఆమె యిలా అంటూ వుండగా "యేమి టేమిటి?" అంటూ ముసలావిడ వచ్చింది; కాని యెవరూ సమాధానం చెప్పలేదు.

"కిరస్తానీలమీద మీరు ఛార్జి యిచ్చినా, మీ మీద సుభద్ర ఛార్జి పెట్టినా మీ పని కడుపు చించుకుంటే కాళ్లమీద పడ్డట్టవుతుంది. మీరు కొట్టిన దెబ్బలు చాలా దారుణంగా వున్నాయిట. అవి చూస్తే యెలాంటి వాళ్ళూ కూడా మీపక్షంగా మాట్లాడలేరుట. పైగా "ఫలానా కిరస్తానీని పెళ్ళాడడానికి స్వయంగా నేనే వెళ్ళిపోయా" నంటుందట మీ అమ్మాయి. అదిమీకు మరీ అపకీర్తికరం"

"...................."

"కనక, మీ రిప్పుడు కానుకోవడంలోనే వుండాలి. ఇంతకీ: అక్కడి వుద్దేశాలూ, ప్రయత్నాలూ యెలా వున్నాయో తెలుసుకోవాలి. వీలు తప్పితే పది రూపాయలు పారేసేనా కేసు రాకుండా చేసుకోవాలి; గాని మనకి మరో దారి కనపడదు. ఈస్థితిలో రామశర్మమీద ఛార్జి పెట్టినా మనకి చిక్కే. ఏమంటే? స్థితి యెలాగా విషమించింది కదా అని వాడు కిరస్తానీలతో లాలూచీ అయితే?"

"...................."

"ఎన్ని విధాల చూసినా నాకు, మీకు అనుకూలించే సాధనా లేమీ కనపడ్డం లేదు. ఏమీ ఆలోచించకుండా దారుణమైన పని చేసేశారు. ఇప్పు డది విషమించుక్కూచుంది"

అప్పుడు ముసలావిడ అందుకుంది.

"కూచోదూ? కూచోదా అంట. అది యిల్లు దాటిం దని తెలిశాటప్పటికి ముగ్గురూ కర్రలు పుచ్చుకొని యములాళ్ళలాగ బయలుదేరారు. ఇన్నాళ్ళల నే నెంత మొత్తుకుంటూ వున్నా విన్నారా? యీ పెద్ద పీనుగు కూడా వాళ్లని యెగసం దో

సింది; గాని వెనక్కి తియ్యలేకపోయింది. ఇక వెనకా ముందూ చూడకుండా దూదియేకినట్లు—"

"మొండిపీనుగా! పోరి, దాన్ని కాకినాడ పంపించినదానవు నువ్వా? ఆ బ్రహ్మసమాజంగాడు దాని బుద్ధి మార్చేశాడు. వాడిక నాగుమ్మంలో అడుగుపెట్టగలడా? అసలు నీబుర్ర పగలగొట్టవలసింది. అలా చేస్తే దానికి బుద్ధి వచ్చును"

ఆవిడ, ముసలాయనికి జవాబు చెప్పబోగా కొడుకులూ, పెద్దకూతురూ కోట్లకుక్కల్లాగ ధాముధూములు చేశారు; గాని ఆమె వెనక్కి తగ్గలేదు. "వోరే పేరన్నా? మీ ళ్లంత గింజుకున్నా నాది కన్నకడుపురా నాయనా! కిరస్తానీది కావడం కంటే మళ్లీ పెళ్లి చేసుకోవడం మంచిది కాదుట్రా? ఏమాదిగాడికో కట్టబెడతారు; గాని కిరస్తానీలు మాత్రం దానికి పెళ్లి చెయ్యకుండా వూరుకుంటారుట్రా? మీళ్లంత యెగిసెగిసి పడ్డా లోకులు వాణ్ణి చూసి "పెద్దావధానులుగారి నాలుగో అల్లు" డని చెప్పుకోరుట్రా? నా కడుపు తరుక్కుపోతోందిరా నాయనా! రాత్రి తెల్లవార్లూ డొంకల్లో అది యేం బాధపడిందో? వీళ్ళు కొట్టిన దెబ్బలతో పాటు ముళ్లే గుచ్చుకున్నాయో, తేళ్లే కుట్టాయో, పాములే కరిచాయో, నక్కలే పీకేయో—వెర్రి పిల్ల యెంత కందిపోయిందో? ఎన్ని గాయాలు తగిలాయో? (గుండెలు బాదుకుంటూ) "అమ్మా" అని నన్నెంత తలుచుకుందోరా తండ్రీ? మనస్సు విరిగిపోబట్టిగాని అది కిరస్తానీలలో కలిసే మనిషిట్రా? మళ్లీ జన్మకి నీకడుపున పుడతాను గాని అది కాకినాడలో చెల్లెలిదగ్గిరికి చేరుకుని వుపాయం చేస్తూ తండ్రీ" అని బతిమాలుతూ ఆమె బారుమంది.

పేరిశాస్త్రి మాట్లాడలేకపోయాడు; గాని తతిమ్మా అందరూ ఆమెని దులిపేశారు. దాని మీద ఆవిడ యిక చేసేది లేక "దాన్నెడిపించిన వాళ్లు ముందుకు రా" రంటూ గిరుక్కున యింటోకి చక్కాపోయింది.

"కిరస్తానీలు ఛార్జి యిస్తా రంటావా?"

"ఇవ్వడానికి మార్గా లున్నాయి. ఇస్తే మిషనరీ దొరలు వచ్చి స్వయంగా పని చేస్తారు. దొరలు పని చేస్తే కేసు బిగవక మానదు"

"..................."

"పైగా ఇప్పుడు మన మేస్రీటు తురక కూడానూ. అగ్గికి గాలి—"

"ఏమిటి దారి?"

అవధానికి శరీరం స్వాధీనం తప్పిపోయింది. మాటకూడా తడబడడం మొదలుపెట్టింది.

"వూరుకుంటా వేమిరా?"

"ఏం చెయ్య మంటావూ?"

"వుపాయం లే దంటావా?"

"లక్ష వున్నాయి; కాని మాటలతో—"

"పారేద్దాం. ఏమాత్రం అవుతుం దంటావు?"

"అక్కడి సంగతు లేమీ తెలవకుండా యేం చెప్పగలనూ?

"అయితే వెళ్లిరా"

"నాచేత నైనంత పని చేస్తాను"

"ముం దేమాత్రం కావా లంటావు?"

పెద్ద కొడుకిలా అడగ్గా అవధాని "వో కాగితం యివ్వరా. పేరన్న మింగేస్తాడా యేమిటి?" అన్నాడు. వెంటనే పెద్దాతను నూరు రూపాయల నోటు తెచ్చి శాస్త్రి కిచ్చాడు.

శాస్త్రి తప్పని సరి వచ్చినట్లు నటిస్తూ దాన్ని పుచ్చుకుని పై కెత్తిపట్టి "యిది అగ్నిహోత్రం. కనక అతి జాగ్రత్తగా వాడతాను. ఇది యిలా వుండగానే పని జరిగిపోవచ్చు, లేక దీనితోనే సరిపోవచ్చు. చాలకపోవడంకూడా రావచ్చు; అయితే యిప్పు డేమీ చెప్పలేను. మీ రేమీ బెంగపెట్టుకోవద్దు; కాని కొంచెం—సాక్ష్యం తయారు చెయ్యడం మాత్రం మరచిపోకండి" అని చెబుతూ

ఆతను లేచి నుంచున్నాడు. తండ్రీ కొడుకులూ భారం అంతా నదీ''అని చెబుతూ అతన్ని వీధి గుమ్మందాకా సాగనంపారు.

౭

శాస్త్రి రాయవరం వెళ్లి అనేకవిధాల వాకబు చేశాడు; గాని సుభద్ర జకరయ్యా యింటికి వెళ్ళుతుందనీ, అతని యింటో భోజనం చేసిందని మాత్రమే తెలిసింది. డాక్టరుగారివల్ల కొన్ని సంగతులు తెలుసుకోవచ్చునని ఆసుపత్రికి వెళ్లగా ఆయన వూళ్లో లేరని తెలిసింది. మంత్రసాని వెటకారంగా మాట్లాడింది. "ఛార్జిలో యెవరెవర్ని చేరుస్తారు బాబూ?"అంటూ కంపౌండరు తలకాయ ఆడిస్తూ అడిగాడు.

శాస్త్రి నిరుత్సాహపడి మరో వీధికి బయలుదేరగా యిలాంటి వాడే రాయవరం కాపురస్థుడొకడు తారసపడ్డాడు.

"జకరయ్యా చార్జీ యిప్పించకమానడు"

"ఊహూ!"

"మిషనరీలు వచ్చి పని చేస్తారు"

"అలాగా?"

"డాక్టరుగారు, కంపౌండరు, మంత్రసాని—లక్షమంది సాక్ష్యం చెబుతారు"

"..................."

"అవిణ్ణి తండ్రీ, అన్నలూ కొడుతూ వుండగా మా లచ్చిరెడ్డి రాజమండ్రీనుంచి రైలు దిగి వస్తూ చూశాడు కూడానూ"

"..................."

"అసలు అవిణ్ణి లేవదీసిన కుర్రాయన రామచంద్రపురంలో బోలెడు ప్రయత్నాలు చేస్తున్నాడు అప్పుడే"

"సరే"

"చివరకి జకరయ్యా అవిణ్ణి తన కొడుక్కి పెళ్ళి చేసుకుంటాడు"

"బాగుంది"

"అయితే యిదేమీ జరక్కుండ వుండాలంటే మనం చక్రం అడ్డువేసెయ్యగలం"

"దొరకబ మానని స్తారా?"

"జకరయ్యా కోప్ప కెక్కితే గదా దొరలు రావడం?"

"అతను మానడం యెందుకు వస్తుందీ?"

"అదంతా మన చేతిలో వుందని చెప్పాను కాదూ? నన్ను తప్పించి యీవూళ్ళో క్రిమినల్ గాని, సివిలు గాని జరగడం మీ రెరుగుదురా?"

"..................."

"పైగా జకరయ్యా నేను గీసిన గీటు దాటడు. దాటలేడు."

"ఏం?"

"అతనికీ మాకూ యిచ్చి పుచ్చుకోడా లున్నాయి. అతనీవూళ్ళో సుఖంగా వుండడానికి నేనే ఆధారం"

"అయితే యే మాత్రం?"

"మన సంగతి మీకు తెలిసిందే. మన దగ్గిర చిల్లరూ, బేరాలూ లేవు. మనం కలగజేసుకున్నామంటే అన్న ప్రకారం—యేమంటారు?"

"చెప్పండి"

"కష్టసుఖా లన్నీ ఆలోచించి మీరు చెబితే కాదంటానా?"

"అయినా,—చల్లకి వచ్చి ముంత దాచడం యెందుకూ?"

"నా కొక్క కౌగితం చాలు"

"..................."

"వులిక్కిపడ్డా రేం?"

"లేదు లేదు. ఇంకెవ రెవరికీ?"

"జకరయ్యని కూడా మనం కూడగట్టుకోవాలి. అంతటికీ అతనే—తెలిసిందా?"

"అంకె చెప్పండి"

"అయిదు—పెళ్ళిఖర్చు లిస్తే గాని అతను రాజీకి రాడు"

శాస్త్రి జవాబు చెప్పలేదు. నుంచోలేదు కూడాను.

౭

రాత్రి తొమ్మిదిన్నర అయింది. అప్పటి దాకా సుభద్ర పక్కలో కూచుని ఆ కబురూ, యీ కబురూ అడుగుతూ, చెబుతూ వున్న యెలిజబెత్తు "యిక పడుకోవమ్మా" అంటూ తన పక్కమీదకి వెళ్ళికూచుంది. సరిగా యీసమయంలో గేటు గుంజుతూ యెవరో పిలిచారు. జకరయ్య హాల్లోనే పడుకుని వున్నాడు; కనక వెళ్ళి తలుపు తియ్యగా "సుభద్రయ్యమ్మగోరున్నారా బాబూ" అంటూ వొక స్త్రీ లోపలికి వచ్చి నెత్తిమీది తట్ట కింద పెట్టింది. దానిమీద జకరయ్య "నీ దే వూరు? సుశ్వావతి మనిషివి? ఆవిడతో నీ కేం పని?" అని అడిగాడు. అందు కా స్త్రీ "మాది పాలమూరు. నే నప్పలమ్మని. నన్ను వెంకసోడెమ్మగోరు రంపారు" అని చెప్పగా ఆమాట విని ముందు సుభద్రా, అ దేమిటో తెలుసుకోడానికి తరవాత యెలిజబెత్తూ యివతలికి వచ్చారు.

అప్పలమ్మ యేమి టేమిటో అడగ్గా సుభద్ర కొన్నిటికే జవాబు చెప్పి "నేను చచ్చిపోయానో లేదో చూసిరమ్మందా మా అమ్మ?" అని అడిగింది. "తండ్రీ అన్నలూ సుభద్రమ్మగారిని కళ్ళ బొడిచి తుప్పల్లోకి యీడ్చెయ్యడం ఆవిడికి తెలిసిందా?" అని జకరయ్య అడిగాడు; గాని అప్పలమ్మ అది వినిపించుకోకుండా తట్టలోనుంచి వొక మూట తీసి సుభద్ర ముందుంచి "యీ మూట మీ అమ్మగారు పంపారని తెలిసినా, నేను తెచ్చానని తెలిసినా మా బుఱ్ఱ లెగిరిపోతాయి. ఇక నేను వెళ్ళిపోవాలి. మానాయుడు నాకోసం రోడ్డుమీద నుంచున్నా" డని చెబుతూ లేచి నుంచుని, "మిమ్మ ల్నెలా గేనా కాకినాడ చేరుకో మన్నారు మీ అమ్మగారు" అంటూనే జువ్వలాగ వెళ్ళిపోయింది.

తరవాత సుభద్ర యింగితం కనిపెట్టి యెలిజబెత్తు మూట విప్పి చూడగా అందులో సుభద్ర నగలు — ముక్కుపుడకల దగ్గిర్నుంచీ వున్నాయి. అది చూసి ఆమె "కన్న కడుపు. పాపం యెంత విచారిస్తున్నారో ఆయమ్మగారు" అనగా, జకరయ్య "స్త్రీల ప్రేమ యింతటి దని యెవరూ పరిమితి చెప్పలేరు. అందులోనూ మాతృప్రేమ యెలాంటి సందర్భాల్లోనూ స్ఫుటంగా కనబడుతూనే వుంటుంది. దాన్ని అణచివెయ్యగల ప్రతికూలశక్తులు ప్రపంచకంలో యెక్కడా లేవు" అన్నాడు.

సుభద్ర రెండు కళ్లూ చెమ్మగిల్లాయి. పెదిమలు రావిరేకల్లాగ వణికిపోయాయి. వెంటనే ఆమె యేమీ మాట్లాడకుండా గదిలోకి వెళ్ళి తన పక్కమీద గోడవేపుకి తిరిగి పడుకుని కుమిలి కుమిలి దుఃఖింపసాగింది.

తరవాత యెలిజబెత్తు నగలమూట జాగ్రత్త చేసి పడుకుంది. జకరయ్య జరిగిన దాని కాశ్చర్యపడుతూ అరుబైట పచారు మొదలుపెట్టాడు.

౮

అప్పుడే సూర్యోదయం అయింది. గానుగ చెట్టు చిగురుటాకులు బాలభానుని లేత కిరణాలు పడి జిగిజిగ్గా మెరుస్తున్నాయి. పదహారు వన్నె బంగారాన్ని సడించే పొద్దుతిరుగుడు పువ్వులు విప్పారిన మొగాలతో కలకల్లాడుతూ సూర్యదేవునికి స్వాగతం యిస్తున్నాయి. అరవిచ్చి వున్న గులాబీ మొగ్గలు పిల్లగాలికి సుతారంగా వూగిసలాడుతూ కమ్మని సువాసనలు విరజిమ్ముతున్నాయి. విరగబూసి వున్న నైటుక్వీను తెల్లవార్లూ సౌరభవిలాసాలు ప్రదర్శించి అప్పుడే నృత్యం చాలించి బసకి వెడుతూ వున్న బోగంపిల్ల లాగ దయనీయమైన విలక్షణసౌందర్యంతో దర్శనీయంగా వుంది.

ఒక మాదిగ యువతి హాలు తుడుస్తోంది. యెలిజబెత్తు పొగడచెట్టు కింద కూచుని కాఫీకోసం నీళ్లు కాస్తోంది. మల్లిపందిరి దగ్గిర యీజీచెయిరులో కూచుని సుభద్ర యోచనావ్యగ్రయై వుంది. నిన్న పేరిశాస్త్రితో రాయబారం నడిపిన సూటేజంటు చేమంతిమడి బాగుచెయ్యడం మానిపించి జకరయ్యకేదో నచ్చజెప్పా అని తాపత్రయపడుతున్నాడు.

సరిగా యిలాంటి సమయంలో భోంయిమంటూ ఒక కారు వచ్చి గేటుదగ్గిర ఆగింది. జ్ఞానప్రకాశం వెంటనే కారు దిగి "వచ్చా" రని యెదట వున్న యెలిజబెత్తుతో చెప్పి అక్కడికి కనపడుతూనే వున్న జకరయ్యకేసి మళ్ళాడు. హారన్ విని సుభద్ర లేచి నుంచుంది.

చూడగా చెల్లెలూ మరిదీని. ఆమె దుఃఖం ఆపుకోలేకపోయింది. కామేశ్వరమ్మ రెప్పపాటులో వచ్చి మీద వాలి "బతికున్నావుటే బుల్లక్కయ్యా?" అంటూ బేరుమంది. సుందరం వదినగారి శరీరం మీద వున్న తట్లూ, కట్లూ చూసి నిర్విణ్ణుడైపోయాడు.

ఇంతలో జకరయ్య అక్కడికి వచ్చాడు. జ్ఞానప్రకాశం పరిచయం చెయ్యగా జకరయ్యా, సుందరమూ మందహాసంతో పరస్పరమూ వందనాలు చేసుకుని చెయ్యీ చెయ్యీ పట్టుకుని మర్యాద నెరుపుకున్నారు. యెలిజబెత్తు కూడా వచ్చి నమస్కరించగా జ్ఞానప్రకాశం వల్ల ఆమె ఫలానా అని తెలుసుకుని సుందరం ప్రతివందనం చేసి "మీ దంపతుల కరుణవల్ల మా వదినగారు బతికి మాకు దక్కారు. ఏం చేసినా మేము మీ ఋణం తీర్చుకోలేము. మీ వుభయుల యోగ్యతా విని మేము చాలా సంతోషించాము. మునిదంపతులవంటి మిమ్మల్ని చూసిన యీ దినం చాలా సుదినం" అని ప్రశంస చేశాడు. వారు కూడా అతని సౌజన్యాన్ని, హృదయవైశాల్యాన్ని చాలా చాలా మెచ్చుకుని తమ సంతోషాన్ని వెల్లడించారు.

వీ రిలా మాట్లాడుకుంటూ వుండగా తలుచుకుని తలుచుకుని సుభద్రమ్మా, వినలేక వినలేక కామేశ్వరమ్మా పదినిమిషాలు ఏకా యేడ్చారు. తరవాత సూటేజంటు జ్ఞానప్రకాశాన్ని చాటుకు పిలిచాడు.

"వీ రెవరు?"

"చెల్లెలూ మరిదీని"

"ఎందుకు వచ్చారూ?"

"తీసుకు వెళ్లడానికి"

"ఏమిటీ — ?"

"ఇంకో అరగంటలో వెళ్ళిపోతారు"

"ఇంత తెలివి తక్కువవా డయిపోతున్నా డేమిటి జకరయ్యా?"

"ఏం?"

"అయిదు వందలు — కరకులు — క్షణంలోనో, క్షణంలోనో చేతిలో పడిపోతాయి. ఎంతో కష్టపడి నేను పథకం పన్నాను. ఏమైనా తెలవాలా వద్దా?"

"ఏం చెయ్యమంటారూ?"

"వెళ్ళనివ్వకండి. దొరకోప్పడతా డని చెప్పండి. భయపెట్టండి"

"మా కెందుకూ ఆగొడవ అన్నీని?"

"మాంచి ముమ్మరంలో వుంది పిల్ల. కృపానందానికి పెళ్ళి చేసుకోవచ్చు. సమయానికి పిలిచినట్టు వచ్చింది. దేవుడే పంపించాడు. ఎందుకు చెడతారూ?"

"మనకి వద్దండి"

"ఏం?......బ్రాహ్మ లంటే భయమా?"

"ఎందుకూ?"

"ఇంకేం మరి?"

"ఆవిడ ఆపత్తులలో వున్నారు. నమ్మి మన యింటికి వచ్చారు. చెడు తలంపు తలిచామంటే యేసు ప్రభువు మమ్మల్ని శిక్షిస్తాడు"

"కొడతాడా యేమిటి?"

"................"

"ఏం, నవ్వుతా వేం?".

"ఇలా పోనివ్వండి"

"నేను మీ కోసమే చెబుతున్నాను"

"సలాం"

"వినరూ? జకరయ్యకి చెప్పవూ?"

"................"

"నాకు వచ్చేది కూడా చెడగొడుతున్నారు. బాగా ఆలోచించుకోండి"

"అలా వేళారా యెత్తు? క్షమించండి"

"ఏ మంటావు?"

"సలాం, సలాం"

ఏజంటుకి చాలా కోపం వచ్చింది. జ్ఞానప్రకాశం తిరిగి చూడకుండా చక్కాపోయాడు.

౧౦

ఎనిమి దయింది. ఇక బయలుదేరకపోతే సుందరం వేళకి కాలేజీకి వెళ్లలేడు. అత నెప్పుడూ వొక్క నిమిష మేనా వేళదాటి వెళ్ళి యెరగడు. ప్రతీ విషయంలోనూ అతను చాలా నియమంగా వుంటాడు. ఈసంగతి కామేశ్వరమ్మకీ, సుభద్రమ్మకీ గూడా బాగా తెలుసు.

అయితే ప్రయాణం ప్రస్తావన యెలా చెయ్యాలో సుందరానికి తోచలేదు. చివరి కతను కామేశ్వరమ్మ కేసి గంభీరంగా చూశాడు; కాని ఆమె కూడా యేమీ పాలుపోక అలాగే సుభద్ర కేసి చూసింది.

ఆచూపులో సుభద్రమ్మకి కూడా ఆసంగతి స్పష్టంగానే బోధపడింది. అయితే: ఆమె తనదే తరవాయి అని గ్రహించిన్నీ అంత వుపకారం—ప్రాణాలు నిలిపిన—తల్లినీ తండ్రినీ వెంటనే విడిచి వెళ్లడం యెలా గని ఆందోళపడుతూ తానుగూడా చెల్లెలి కేసీ, మరిది కేసీ అలాగే గంభీరంగా చూసి, చివరికి యెంతో సంకోచపడుతూ మొదట జకరయ్య కేసీ, తరవాత యెలిజబెత్తు కేసీ బెదురుతూ బెదురుతూ చూసింది:

ఆదంపతులు కూడా వీరంతా ప్రయాణం కోసం తొందరపడుతున్నా రని గ్రహించారు; కాని యెలిజబెత్తు యేటూ తోచక జకరయ్య కేసి చూడగా జకరయ్య అందుకున్నాడు.

"మీ వుద్దేశం తెలిసింది. మా స్వాధీనంలోకి వచ్చిన ప్రతీవారికీ మత దీక్ష యివ్వా లని మాకు మిషనరీలు చేసిన ఆజ్ఞ. దా న్ననుసరించి యిప్పుడు అమ్మాయికి మతదీక్ష యివ్వడానికి మా కేమీ ఆక్షేపణ లేదు; కాని మాకా సంకల్పం కలగలేదు. ఫక్తు పూర్వాచారపరాయణులైన వైదికబ్రాహ్మల యింటి వితంతుయువతి మాయింటికి రావడమూ, మాయింటో భోజనం చెయ్యడమూ—యివి సామాన్యవిషయాలు కావు. ఇంత జరిగిన తరవాత నిజానికి క్రైస్తవ మతదీక్ష పుచ్చుకున్నా వొకటే, లేకపోయినా వొకటే. పైగా మీరు బ్రహ్మమతం మీద అభిమానం—"

"ఇదివరకే అభిమానం. ఇక ఆమతదీక్ష పుచ్చుకోకుండా క్షణం వుండను. నిర్దోషురా లైన స్త్రీ విషయంలో యింతింత దారుణాలు తలవడానికి అవకాశా లిచ్చే యీ జర్జరితమతంలో యిక క్షణమేనా వుండలేను నేను. బ్రాహ్మణమతంలో మా వదినగారికి చోటు చాలదు. ఆమెని విడిచి మే ముండలేము. పైగా: నా బోధనల వల్లనే ఆమెకి దృష్టి మారింది. కొత్త ఆశలూ, కొత్త సంకల్పాలూ కలిగాయి. అంచేతనే ఆమె యింతింత బాధలనుభవించవలసివచ్చింది. నిర్దోషురాలి కిలాంటి అవస్థ కలిగించినందుకు ప్రాయశ్చిత్తంగా కూడా నేను వెంటనే బ్రహ్మమతదీక్ష పుచ్చుకోవలసి వుంది"

"అయితే మరీ సంతోషం. సత్యం బోధపడిన తరవాత మీ వంటి విద్యాధికులు చెయ్యవలసిన పనే చెయ్యబోతున్నారు మీరు. మిమ్మల్ని ఆదర్శంగా పెట్టుకుని మీతోటివా రంతా ప్రవర్తిస్తే యెంత బాగుండును?...ఇక ఆలస్యం చెయ్యను.

అమ్మాయి ఆరోగ్యం విషయంలో చాలా శ్రద్ధ వహిస్తా రని నమ్ముతున్నాను. తరుచు ఉత్తరాలు రాస్తూ వుండండి. తీరిక అయినప్పు డల్లా—సెల వయితే మే మిద్దరమూ వచ్చి—"

"ఎంత మాటా? మాయింటికి రావడానికి మీకు సెలవు కావాలా?"

"మీరు విద్యాధికులు. పెద్ద పదవిలో వున్నారు. నేను మీయెదట—"

"మనిషికి వున్నతి కలిగించేవీ, గౌరవం కలిగించేవీ చదువూ పదవీ యెంత మాత్రమూ కావు. మంచి చెడ్డలు గ్రహించే శక్తి యెవరి కుంటుందో, ఆ వివేచనని తమ నడతలో యెవరు చూపిస్తారో వారూ పెద్ద లంటే. ఈదృష్టితో చూస్తే మీరు గురువులూ, నేను శిష్యుణ్ణీని"

"తమ రలా సెల విష్యవద్దు. మీతో వాదించి నేను నెగ్గలేను......అమ్మాయికి శీఘ్రంగా నే సంపూర్ణారోగ్యం కలుగుతుం దనీ, తరవాత వెంటనే యోగ్యు డైన వరుణ్ణి చూసి పెళ్లి—"

"బాబయ్యా! ఇక అప్రస్తావన వద్దు. పెళ్లి మీద ఆశ నాకు పూర్తిగా మళ్లిపోయింది. మళ్లీ అది కలుగుతుం దని గాని, కలిగినా ఇంతలో కలుగుతుం దని గాని చెప్పలేను. తన్నే నమ్మి వచ్చిన నన్ను యములాళ్ల కప్పగించి పిరికిపంద— ఆపిల్లాడు పారిపోయినప్పుడే నాకు పెళ్లంటే అసహ్యం పుట్టింది. స్త్రీల మానం కాపాడలేనిజాతి యిది. స్త్రీల జీవితలక్ష్యాన్ని అర్థంచేసుకోలేనిమతం ఇది. స్త్రీకియుక్తవయస్సు రాకుండా నేపెళ్లిచెయ్యాలి అనే నిర్బంధాన్ని సృష్టించడానికి ముఖ్యకారణం యేమిటో నాకిప్పుడు స్పష్టంగా బోధపడింది. జాతి కనుగుణ మైన విద్య నేర్చిన బాలిక నిజంగా స్త్రీ రత్నం అవుతుంది. అలాంటి రత్నాన్ని సంపాదించా లంటే పురుషుడు పురుషకారాన్ని చూపించాలి. అది చూపించలేనివాడు శాశ్వతబ్రహ్మచారిగా వుండి పోవలసిందే; గాని మరి దారి లేదు. అప్పుడు స్త్రీ ప్రాణికోటికి సహజ మైన సౌఖ్యమూ, ఆనందమూ అనుభవించడానికి జాత్యంతరమన్నా కూడా కోరితే కోరవచ్చు. ఇదే తటస్థిస్తే దేశానికి వొక విధ మైన దౌర్భాగ్యం కలుగుతుం దంటే నిజమే: ఇలాంటి దేమీ తటస్థించకుండా వుండా లనే మన పూర్వులు స్త్రీని పశువుగా తయారు చేసే సన్నివేశాలు కల్పించారు. అయితే వారు స్త్రీ పశు వయిపోతే ఆ స్త్రీల చేతుల్లో పెరిగే మొగపిల్లలు పశుపతు లయిపోతా రని గ్రహించలేకపోయారు. ఇలాంటి అవిచారితధర్మాల నేర్పరచడంవల్ల తామే పశువు లయిపోవడం కూడా వారుగమనించలేకపోయారు. త్రికాలజ్ఞానసంపన్ను లని పొగడబడే మునులు ఇలాంటి అపసిద్ధాంతాలు ఏర్పరిస్తే జాతి నిర్వీర్యం అయిపోతుం దనీ, దేశం అన్యాక్రాంతం అయిపోతుం దనీ గ్రహించలేకపోయారు...... ఇంతకీ; మామరిదిగారి బోధనలవల్ల నాకు ప్రపంచకం అంటే యేమిటో, స్త్రీ కర్తవ్యం యేమిటో విశద పడ్డాయి. మీ సౌజన్యాన్నీ, మీ కర్తవ్యపరాయణతనీ చూడడంవల్లా, అనుభవించడంవల్లా నాకు నేను చెయ్యవలసిన పని కూడా తెలిసింది. కనక నే నిప్పుడు పెళ్ళిసంగతి వెనక్కి తీసేస్తూన్నాను. ఆంధ్ర స్త్రీలోకం యిప్పుడు నానాబాధలూ పడుతోంది. నాజీవితా న్నంతా స్త్రీలకూ పిల్లలకూ సేవచెయ్యడంలో గడిపేస్తాను. సేవలో వుండే సౌఖ్యమూ, ఆనందమూ మరి దేనివల్ల కలిగే వాటికీ తీసిపోవు. మీరంతా నాకు ఈసేవాదీక్షలో విజయం కలిగేటట్టు ఆశీర్వదించండి"

ఈమాటలు విని అంతా చకితు లైనారు. చూడగా సుభద్ర మొగమ్మీద విలక్షణ మైన తేజస్సు ధగధగ మెరసిపోతోంది.

* * * *

విడిపోవలసిన క్షణం వచ్చింది. అందరూ కూడా మాట్లాడలేక మిడుతూ మిడుతూ చూసున్నారు. డ్రైవరుకి కూడా మాంద్యం వచ్చింది. మేఘాల మీద యెగిరిపోయే మోటారు కూడా మలుపు దాటే దాకా కాళ్ళీడ్చుకుంటూనే వెళ్ళింది.

# తెలుగు టాకీలు—వాటి మందగతి

ఏ. వి. సీతారామయ్యగారు ఎం. ఏ. ఎల్. ఎల్. బి

(అవి టాకీ లైనా, మూకీ (silent) లైనా సినిమా ఫిలుములను గురించి యిటువంటి వ్యాసాలు రాయడానికి సీతారామయ్య పంతులు గారికి ప్రత్యేకార్హత వుంది. వీరు చాలా కాలం నుంచి నాటకాలను చదువుతూ, ప్రదర్శనాలను చూస్తూ ఆకళవిషయంలో చాలా పరిశ్రమ చేస్తున్నారు. ఇటీవల అంటే ౧-౧-౩౨ తేదీని ఆంధ్రనాట్యపరిశోధకమండలి అన్న పేరితో వొక సంస్థను ప్రారంభించి దానికి తామే సెక్రటరీగా వుంటూ పంతులుగారు చాలా పని చేస్తున్నారు. ఈ సందర్భంలో ఆసంస్థ ఆదర్శాల ననుసరించి వీరు, ప్రచురించబడుతూ వున్న నాటకాలను విమర్శిస్తూ, ఆడడానికి యోగ్యాలైన వాటిని సూచిస్తూ, ప్రదర్శనాలను విమర్శిస్తూ కృష్ణాపత్రిక, ప్రజామిత్ర, సమదర్శిని మొదలైన పత్రికలలో తరుచు అనేకవ్యాసాలు ప్రకటిస్తూ మంచి ప్రచారం చేస్తున్నారు. ఇటీవల వీరు ఫిలుము పరిశ్రమవిషయంలో పరిశోధనలు చెయ్యడానికి కలకత్తా వెళ్ళి రెండు మాసాలుండి అక్కడి స్టూడియోలన్నీ చూసి, పెద్దల సంపర్కాన్ని కలుసుకుని మాట్లాడి వచ్చి వున్నారు. చాలాకాలంనుంచి sound and shadow మొదలైన ఇంగ్లీషుపత్రికలలో ఈవిషయం మీద కొన్నో వ్యాసాలు ప్రకటించారు. ఇంకా ప్రకటిస్తున్నారు. కొద్ది రోజుల్లోనే వీరు వేల్ పిక్చర్సు స్టూడియో చూసిరావడానికి మద్రాసు వెళ్లబోతున్నారు. ఈవిషయంలో యిలాగ ప్రత్యేకపరిశ్రమ చేసి—చేస్తూ వున్న పంతులుగారు సినిమాలను గురించి భావబంధురాలైన వ్యాసాలను ప్రబుద్ధాంధ్రలో ప్రకటించడానికి పూనుకున్నారు. ఈ చిన్న లేఖ వాటికి వుపోద్ఘాతరూప మయింది. మా పాఠకమహాశయులు పంతులుగారి వ్యాసాలు జాగ్రత్తగా చదివి ఆదరిస్తారని ఆశిస్తున్నాం.

సంపాదకుడు)

ప్రస్తుతం మన దేశంలో బాగా లాభకారిగా వున్న పరిశ్రమ ఫిలిం పరిశ్రమ. అందులో దేశంలోకి టాకీ లొచ్చింతర్వాత యీపరిశ్రమ మరీ విజృంభించి రెండు మూడు సంవత్సరాలలో యిదివరకు కంటే పది పదిహేను రెట్లు అధికంగా ఫిలిం స్టూడియోలు తయారయాయి. ఉత్తర హిందూస్థానం బొంబాయి రాష్ట్రాలలోని ధనవంతులు దీంట్లో వున్న లాభాలు గుర్తించి విరివిగా ధనం పెట్టుబడి పెట్టి అపారంగా ధన మార్జిస్తూంటే మనవాండ్లు గుడ్లు మిటకరించి చూస్తూ కూర్చుని తమ కున్న ధనం ఎలెక్షనులకూ వగైరాలకూ తగలేసుకుంటున్నారు. ఆఖరికి ఇతరరాష్ట్రాల పెట్టుబడిదారులు తమ వ్యాపారాన్ని మన రాష్ట్రంలోకి గూడా వ్యాప్తి చెందించి మన కళను తమ ధనార్జనకు తార్చి నాశనం చేసి మన ధనాన్ని పీల్చివేస్తున్నా మనవాళ్లు మేల్కొలేదు. ఇప్పుడిప్పుడే మద్రాసులో వొక స్టూడియో పెట్టారుట మనవాళ్లు. అది ఎంతవరకు నిక్కాల్సయిన తెలుగు స్టూడియో అని చెప్పకోటానికి వీలవుతుందో నేను చెప్పలేను.

టాకీ పరిశ్రమ విషయమై కొంచమైనా పరిశ్రమ చేసినవాడికి ప్రస్తుతం మన తెలుగుటాకీల పరిస్థితులు గమనించి చూస్తే విచారం కలుగుతుంది. ఈవ్యాపారం విషయం బాగా తెలీక కేవలం కళాదృష్టితో చూచే వాడికి కోపం కూడా కలుగుతుంది. తెలుగు టాకీల ప్రస్తుతస్థితి గనక టూకీగా చెప్పాలంటే—స్వంత ఖర్చుల మీదనైనా సరే తయారవటానికి సిద్ధంగా వున్న నటులు. తెలుగు నటులను గురించి ఏమాత్రం తెలియని ఫిలిం కంపెనీ ఏజంట్లు; వీళ్లే తీయబోయే ఫిలింకు కావలసిన నటుల్ని ఏరి దీసుకుపోయేవారు. చవకబారు నటులతో లాభాలమీదనే దృష్టి వుంచి ఫిలిములు తీశే పెట్టుబడిదారులు. తీశే కథ

యొక్క భాష అయినా తెలియని డైరెక్టరులు. ఇదీ ప్రస్తుత తెలుగుటాకీల చరిత్ర. ఈ పరిస్థితులలో తెలుగుటాకీలు బాగా లేవంటే ఆశ్చర్యమేముంటుంది? ఉదాహరణగా: ఇంతవరకు తీయబడిన తెలుగుటాకీలలో వొకటి, నిరక్షరకుక్షులైన నటులు. వాళ్లని ఏర్పాటు చేసుకున్నది తమిళ సోదరుడు. ఫిలిం తీయించేది మార్వాడీ, డైరెక్టరు సాహేబు. కథ మన రాష్ట్రానికి ప్రత్యేకంగా సంబంధించినది. తీసేది బెంగాలులో!!!

కాని మన తెలుగు టాకీలకు డబ్బు రావటం లేదా అని అడగొచ్చు యెవరైనా. నిజంగా రావలసిన దాని కంటె చాలా యెక్కువగా వొస్తోంది. కారణం తక్కిన దేశభాషలలోని టాకీల మాదిరే మనవాళ్లకి భగవంతుడి పేరు చెప్పి ఏంచేసినా వూరుకుంటారు. అందువలననే మన టాకీ లన్నీ పౌరాణికగాథలు తప్ప సాంఘిక విషయాలు వుండవు. టాకీలు రాకముందే పౌరాణిక గాథలతో విసిగి వున్న ప్రేక్షకులకు టాకీలు విచిత్రంగా తెరమీద మాట్లాడే బొమ్మలుగా వచ్చినవి గనక గాని లేకపోతే యింత హడావిడి వుండదు. ఎన్నాళ్లు నిలుస్తుంది ఆవినోద భావము? ఆవింత! సరిగా గనక తీస్తే యీపురాణగాథల్తోనే యింకా చాలాకాలం గడపొచ్చు తెలుగులో. కాని యింతవరకు తీసిన వాటిని బట్టి తెలుగు టాకీల ముందుగతి ఆలోచిస్తే పరిస్థితులు ఆశాపూరితాలుగా లేవు.

మొదటికారణం పాత్రధారులు. ఇంతవరకూ మన తెలుగు నటుల్ని ఏమాత్రమూ యెరగని వాళ్లు నటనిర్ణయం చేయడం. అందువల్ల మన నాటకాలలో వ్యాప్తి చెందివున్న కంట్రాక్టు పద్ధతే అక్కడ కూడా జొరబడింది. ఫిలిం కంపెనీ యజమాని చేత పంపబడిన ఏజంటు మన దేశంలోని పరిస్థితులు తెలియని కారణం వల్ల ఏ ఏజంటుకో లోబడిపోతాడు. ఏజంటు ఆఫిలింకు కావలసిన 'సెట్టు' నంతా తీసుకు రావడానికి కొంత మొత్తానికి వొప్పుకుంటాడు. కంట్రాక్టరుయొక్క సెట్టు ఫిలింకంపెని యజమాని వొప్పుకొండేట్లు చేయడానికి ఏజంటు కాంట్రాక్టరు వద్దనుంచి కొంత కమీషను పుచ్చుకోవడం కూడా కద్దు. సెట్టు యెంత చవకగా తయారైతే అంత లాభం కాబట్టి కాంట్రాక్టరు అతడుతమ్మ యిజాగాయిజా అనందర్నీ పోగుచేసుకొని ముఖ్యమైన ఏ వకరిద్దరికో కాస్త పారేసి ఫిలిం కంపెనీకి తీసుకుపోతాడు. ఈఫిలిం నియమంలో కంపెనీ యజమానికి హిందీ ఫిలిము మీద నున్న అభిమానం దీనిమీద వుండదు. కారణం ఇది వొక చిన్నరాష్ట్రానికి సంబంధించినదే గాబట్టి. అందువల్ల తెలుగు ఫిలిం తీసేటప్పుడు స్టూడియో అందరికీ నిర్లక్ష్యమే.

సెట్టు స్టూడియోలో చేరంగానే డైరెక్టరు ఛార్జిలో పడుతుంది. ఇంతవరకు మన ఫిలిములు డైరెక్టు చేసిన వాళ్లకి తెలుగు భాషే రాదు. ఫిలిము తయారవడానికి డైరెక్టరు యొక్క బాధ్యతను గురించి వ్రాస్తే ప్రత్యేకవ్యాసమే రాయాల్సి వస్తుంది. అది మరో మారు ముచ్చటిస్తా. నటులు చెప్పే పొరను తెలిస్తే గద వాళ్ల యాకను సరిగా వుంది గదా అని తెలిసేది! పాడే కీర్తనలు పద్యాలూ సమయోచితంగా వుండి సందర్భానుసారంగా పాడబడుతున్నయ్యా అంటే భాష తెలియాలి గద. భాషే తెలియని డైరెక్టరు డైరెక్షనేమిటి అంటే మాకు చాలా అనుభవముందంటూ కస్సుమంటూరు. ఇంతకీ పెట్టుబడి వాళ్ల చేతులో వుంది. వాళ్లు ఇష్టమొచ్చినట్లు ఆడుతున్నారు.

తరువాత నాటకం ఫిలింకు తగినట్లుగా రాయడం కథకు కావాల్సిన వస్తువులూ, వాతావరణం మొదలైనవి ఏర్పరచడానికి ప్రత్యేకనిపుణులు గావాలి. వాళ్లందరికీ కథ తెలిసి వుండాలి. నాటకాన్ని ఫిలింకు సరిపరచడం అదో ప్రత్యేకకళ. మన తెలుగు టాకీలలో ఈ విషయాలన్నీ గాలికి

వదిలేసి ఫిలిం యివ్వడానికి పోయిన నటుల్రేస్తుల సభహాల మీద ఉన్న తయారీని ఏసాహేబు చేతనో డైరక్టయిం జనిపిస్తారు. కొన్ని ఫిలిములు పెద్ద నటులుండీ కూడా పాడైనై. దానికి కారణం కంపెనీవాళ్లు తమకి యిష్టమొచ్చిన వేషాలు వేయిస్తే నాటికి వాళ్లు తగకపోయినా చెబ్బ కక్కూర్తి రిపి వేయడం మూలాన. పేరుంట గదా అని యడవల్లి సూర్యనారాయణగారిచే సీతాకళ్యాణంలో రాముడి పాత్ర వేయించారు. ఫలితం మనం చూచాం.

ఫిలిములు యితర రాష్ట్రాలలో తీయడం వల్ల చిన్న వేషాలు వాటి వరకానికి గావల్సిన తక్కిన జనం తెలుగువాళ్లు కాక ఏ బెంగాలీ జనమో తయారవడం. ఇటువంటి పరిస్థితులలో తయారయే ఫిలిములు యీవిధంగా గాక తదన్యంగా యెట్లా వుంటై?

వీటి నన్నిటిని సరి చూసిన మంచి తోవలో గనక దిద్దుకోకపోతే తీయబోయే ఫిలిములకు యిది గతి కొచ్చిన [illegible] [illegible]వు. క్రమేణా నష్టాలు కూడా వస్తై. అప్పుడు స్వదేశీఫిలింలని అభిమాన మైనా లేదు మనవాళ్లే కని పరితపిస్తే ఏం లాభ మౌతుంది కంపెనీవాళ్లు? ఇప్పటికే తెలుగు టాకీల కన్నా హిందీ టాకీలకే యెక్కువ అభిమానం చూపుతున్నారు జనం. ఈ తప్పు అన్నిటిని దిద్ది తెలుగు వాళ్లతో కూడుకొని వున్న దని చెప్పబడుతున్న "మద్రాసు వేల్ పిక్చర్సు" వారు తీసే ఫిలిములు నిజాలైయిన తెలుగు ఫిలిములుగా తయారుచేస్తారని ఆశిస్తున్నాం. పరిస్థితులు అదే విధంగా వుంటే యిక తెలుగు టాకీల మందగతి వేరే చెప్పాలా?



# కలియుగధర్మం

"చలం"

కృతయుగంలో ఒకటో పాదంలో దుందుభినామ సంవత్సర కార్తీక శుద్ధ త్రయోదశి ఉదయాన సుముహూర్తమందు శౌనకాదిమహర్షు లందరూ నిత్యకృత్యాలు తీర్చుకుని స్నానాలు చేసి వీభూది ధరించి దర్భాసనాల మీద సూతమహర్షి చుట్టూ చేరి కూచున్నారు. అప్పుడు శౌనకమహర్షి యేమన్నా డంటే?

"గురువర్యా, కలికాలము, కలికాలము అంటారు. అప్పుడు ధర్మము ఒక పాదం మీదే నడుస్తుం దంటారు. ఎంత ఆలోచించినా మాదృష్టికి ఆవిషయం గోచరం కావటం లేదు. అంతు లేనిదీ, ఆత్మానందకర మైనదీ సమస్తసౌభాగ్యకర మైనదీ ఐన యీ ఆధ్యాత్మికసంపదను వొదిలి ప్రజలు విషయలోలులూ, ధర్మవిచ్ఛేదకులూ ఎలా కాగలరో మా మనస్సులకు గోచరము కావటము లేదు. తమరు మాకు విదిత మయ్యేట్లు బోధ చెయ్యవలె నని కోరుకుంటున్నాము" అన్నారు.

అప్పుడు సూతమహర్షి యేమన్నా డంటే—

"నే నింతకంటె మీకు చెప్పిన దానికన్న యేమి చెప్పగలను? కాని వొకటి చేస్తాను. నా యోగదృష్టివల్ల భవిష్యత్తును చూసి వర్ణిస్తాను. అప్పుడు మీకు ఆవిషయం సులభంగా వ్యక్త మౌతుంది" అని కళ్ళు మూసుకుని యోగనేత్రాన్ని తెరిచాడు. వూపిరి బిగబట్టి తన్మయులై అందరు జడధారులూ ఆయన వదనారవిందము వైపు చూస్తూన్నారు. మెల్లిగా పెదిములు కదిలి యీమాటలు ఆయన వాక్కునించి వినిపించాయి.

త్రేతాయుగము — ఊఁ — ద్వాపరం — ఆ — కలి — మొదటి పాదం. రక్తాక్షినామసంవత్సరం

శ్రావణమాసం — కృష్ణపక్షం — ద్వాదశి — బుధవారం — జంబూద్వీపం — భరతవర్షం — భరతఖండం — కృష్ణాకావేరి మధ్యదేశం — తెనాలి అగ్రహారం — గ్రామం కాదు — పట్టణం కాదు — ఉదయం — అరుణోదయ మయింది — పట్టణం నిశ్శబ్దంగా ఉన్నది — ఏమి టిది! ఒకరూ లేవలేదు — సంధ్యానుష్ఠానాదులు లేవు — వేదపాఠం వినపడటమే లేదు — ఊ — ఊ తెరచి వేసిన ఒక యిల్లో — కొన్ని బోడివి — చీకటి — ఒక యింటిమీద యింకొకటి — గృహశాస్త్రనిబంధనలను అన్నిటిని ధ్వంసం చేశారు. ఆమూల దీపం దగ్గిర ఒక వటువు చదువుకున్నాడు — ఏ మంటున్నాడూ —

అక్బర్ — వజ్ — ఏ గ్రేట్ రూలర్. అంటే? ఏం భాష అది?

ఆకుర్రాడి జుట్టేమిటి అట్లా వుంది? ముందు సెంట్రుకలూ — వెనక పొట్టీ — ఛీ. ఛీ. దంతధావన మన్నా చేయలేదు. ఉండు. ఏమిటా శబ్దం? ఎవో ఇనపకమ్ములమీద దొర్లుతో పొడుగ్గా రాక్షసివలె నల్లని పొగలు చిమ్ముతో వొస్తోంది. ఎదో పాపం! ఈపట్టణంమీదికి వొచ్చింది. పొడుగ్గా పాములాగ వుంది. కీచు మని కూసింది. అంత పెద్ద జంతువుకి అంత సన్నని కంఠ మేమిటి? బ్రహ్మకి ఆనాటికి వెర్రెత్తుతుంది గావును? దాని పొట్టలో మనుషులు. తలలో తోకలో — రామ, రామ, ఎందర్ని మింగిందో! నిప్పులు కక్కుతోంది. అ. పొట్టలో తోకలో అన్నీ మంటలే — అరే — మనుషులు బతికే వున్నారయ్యా దానిపొట్టకి కిటికీలు — చూస్తున్నారు బైటికి. ఆగింది — దూకుతున్నారు. పొట్ట చించుకొని దూకుతున్నారు. పెట్టెలు — పరుపులు ఎట్లాంటి మృగం? సాధువు — మచ్చి కయింది. పాపం — అరే! అరే! తల వూడి దూరముగా పోతోంది — సామాన్లు పట్టుకొని వొంతెన దాటి పోతున్నారు. అక్కడవి రథాలూ — బస్సూ — ఇదేమిటి బస్లు అట్లా వున్నాయి? ఒకడు రథంలో యెక్కుతున్నాడు. వాడి బట్టలు వింతగా వున్నాయి. అన్ని వేరుగా వున్నాయి. నెత్తిమీద పళ్ళెం బోర్ల తలపాగా పెట్టాడు. మెళ్ళో ఒక పీలికి కట్టుకున్నాడు. రథంలో కూచుని ఒక పెట్టెలోంచి ఒక పుల్ల గీచి అగ్నిని పుట్టించి — నోట్లో అదేమిటి? ఒక గొట్టం దాన్ని వెలిగించి పొగ వొదులుతున్నాడు. ఎందుకు? వీడేకాదు, చాలమందికి వున్నాయి అట్లా. కొందరికి నల్లటి పుల్లలు, కొందరికి తెల్లవివి. అన్నీ కాలుతున్నాయి — పొగలు వొస్తున్నాయి. ఏం ఆచారమో అది? ఆరథం అట్లా వుందే? గుర్రాలు లేవు ఏమీ లేవు — పెద్ద అరుపు అరిచి ఘూర్ణిల్లుతోంది. సాగింది ముందుకు, అరె! అదేదో మృగం భూతం. వెనక ధూమాలు వెదజల్లుతోంది. పోయింది. దూరంగా వీధిలో కొందరు ఒక యింటో దూరుతున్నారు. బల్లల మీద గిన్నెలున్నాయి. తింటున్నారు. విస్తళ్ళలో కుడుములు గిన్నెల్లో ఏదో పానీయము — వేడిగా పొగలు వొస్తోంది. తెల్లవారకముందే — స్నానం సంధ్య — కర్మ — అగ్నిహోత్రం ఏమీ లేవే — అబ్రాహ్మలే ఆవొడ్డించేవాళ్లు. అన్నికులాలూ — తింటున్నారు. మ్లేచ్ఛుడు — శూద్రుడు — అందరూ ఒకచోటే ఒక పాత్రలోనే. ఛీ — ఛీ — ఇంక చూస్తే నరకము వస్తుంది పోని —

సాయంకాలం చూద్దాము — ఆ... సాయంత్రం ... పెద్ద వీధిలో గుంపు. ఒకడు ఉపన్యాస మిస్తున్నాడు. చాలా పెద్ద గుంపు — అదేమిటీ? ఇంకో రథం. చాల పెద్దది ఆగింది. గుంపులో కలవరం. గుంపులో చాలమంది ముతకబట్టలు వేసుకున్నారు. తెల్లటి టోపీలు — వీరెవరో యెదో ఆశ్రమంవారేమో? యెవన్నా క్రొత్త మతమో! పాపం పాపం ఆరథంలోంచి ఆయుధపాణులై దిగారు శత్రురాజులేమో! లేక రాజభటులా! కొడుతున్నారు. కర్రలతో మోదుతున్నారు. చాలమంది పరిగెత్తారు; కాని ఆ తెల్లటోపీల వాళ్ళు మంచునే యున్నారు. రామభజన చేస్తున్నారు. దెబ్బలు తింటూనే — ఒకడి

చేతులో జెండా వుంది. దాన్ని వొదలడు—హారి హారి! ఎట్టా కొట్టారో! జండా వదలకుండా అట్టానే పడిపోయినాడు కింద. తిరిగికొట్టరే! అయ్యో! యెంత దుర్గతికి వొచ్చారు—క్షాత్రం ఎంత నశించింది! పరసైన్యాలనించి రక్షించుకోరే! భారతి సంతతి యెంత హీనదశకు వచ్చింది! లేదయ్యా! వుండు. కాదయ్యా! లేదు. ఒక్కడూ పరిగెత్తలేదు. రాము! రామ" అంటున్నారు. ఆళ్ళల్లో శాంతం దయ ఏమి? భీతి లేదు. ఎంత అహింస! ఎంత క్షమ! ఆహా! పరంపరయూ తొంగుడు లయ్యా! కలికాలపు ఋషులు, యీ వేషాలలో వున్నారు.

అదుగో సన్యాసి వొస్తున్నాడు ఒకడు. ఇంక యీ యుద్ధాన్ని మాన్పుతాడు. లేదు—ఒక్కడు నమస్కరించడే? తోసేస్తున్నారు. ఏమిటయ్యా యీ కాలం?

కాని యెంత ధర్మం వుందయ్యా? ఒక్క పొద మేమిటి? వర్ణాలు ఆశ్రమములు నశించాయి సర్వకర్మలూ ఆచారాలూ విధ్వంస మైనాయి—కాని యెంత క్షమ! యెంత శాంతం! యీ కర్మలు యీ కులాలు పోతే నేమయ్యా అట్లాంటి కర్మ యోగు లున్న తరవాత!

టోపీలవాళ్లని లాక్కుపోతున్నారు. మరి వీళ్ళు పరరాజభటు లయితే యీ పట్టణమున రాజభటులు లేరే? కాదు వీళ్ళు రాజభటులు. ఈ తెల్ల టోపీల పురుషులు ఈ రాజుకు వ్యతిరేక మైన మత ప్రచారం చెయడం చేత వారిని హింసిస్తున్నారు. ఆ దండనాధికారి దగ్గిరకి తీసుకు వెళ్ళారు. ఆటోపీలు లాగేసి పొమ్మన్నాడు. గాయాలు తగిలిన వాళ్ళని తీసుకెళ్ళారు. అది వైద్యాలయం గావును కట్లు కడుతున్నాడు—అక్కడే పడుకోపెట్టాడు ఎంత శుభ్రముగా వున్నదో యీ ఆలయము? ఎన్ని మందులు ఎండరు రోగులో అబ్బా! ఎటువంటి రోగాలో! ఎంత పాపం పెరిగింది! మనుష్యుల్లో ఆచారమూ శుచీ నశించి రోగా లెక్కు వైనాయి. ఈ పట్టణం యెంత అశుభ్రముగా వుందని; కాని యీ వైద్యు లెంత మంచివాళ్లో! రాజవిరోధుల్ని యెంత ఆదరిస్తున్నారో! పాపం యీ రాజభటులో అప్పుడు కొట్టారే గాని యెంత దయగా మాట్లాడు తున్నారు. యెంత మంచి ప్రభుత్వ మయ్యా? మన కాలంలో ఐతే ఒక్క నిమిషములో తలలు తీసేస్తారు కద! విరోధుల్ని కూడా యింత దయగా ఆదరిస్తాడే యీ ప్రభువు! ధర్మం లేక పోతే నేమయ్యా!

మిగిలిన తెల్లటోపీల వాళ్ళు యిళ్ళకి పోతున్నారు. రాత్రయింది, దీపాలు వెలిగించారు. తెల్లగా వెన్నెలకాస్తున్నట్లే వెలుగుతున్నాయి. అదీపాలేమిటి? యెంత చిత్రమో! ఏ దేశమో నల్లటి వాడు పెద్ద మీసాలు వాడు తెల్లటోపీవాడు యిట్టానే వెళ్ళుతున్నాడు యింటికి—మాన్యం—ఆమె భార్య గావును, పిల్ల నెత్తుకు వొచ్చింది. భర్తకు నమస్కరించనన్నా నమస్కరించదు. భక్తి లేదే! మాటల్లో చూపులలో తృణీకరిస్తోంది. తిడుతోంది. భర్త చే. కొట్టాడు. ఆమెను బైటకి యీడ్చాడు. అబిడ్డతో సహా. యిందాక ఆరక్షకభటుల ముందు అశాంత మేమిటి? నిజమైన శాంతభావ మబ్బలే దయ్యా! ఆసహన మంతా ఆబహిరంగసభలోనే! ఆ అబలను స్త్రీని ఆశిశువుతో కూడా గెంటి తలుపు వేశాడు. లోపల భోజనం వొడ్డించుకున్నాడు. పాదాలన్నా కడుక్కోలేదు. స్నానం—అర్చనం—అగ్నిపూజ—భాగవతగృహం—ఎక్కడా ఒక దేవతాపట మైనా లేదు. పాప మామె వీధులోనే నిలుచొని యేడుస్తోంది. తోవ బొయ్యేవాళ్లు యెవ్వరు విచారించరు. బిడ్డ యేడుస్తోంది. వాడి భోజన మయింది. అంతా అట్లానే వొదిలి తలుపు తీసి వెడుతున్నాడు వీధివెంబడి. పాపం ఆమె భయంతో లోపలకు వచ్చింది. వెదుకుతూంది. బిడ్డకైనా యేమీ లేదు తినడానికి. అంతా తిన్నాడు. పడుకుంటోంది యేడుస్తో. వాడో ఆతెల్లటిపుల్లలు కొని వెలిగించి పొగ పూత్తో పోతున్నాడు—ఇదయ్యా కలియుగం. చాలునా?

## మద్రాసు యెస్టేట్సు ల్యాండు ఆక్టు సవరణబిల్లున్నూ

శ్రీ గండికోట సత్యనారాయణమూర్తిగారు. ఎం. ఏ

గతసంవత్సరము ఇనాందార్ల సాగు హక్కులకు నష్టము కలిగేటట్లు మన చెన్నపురి శాసనసభవారు మద్రాసు ఎస్టేట్సు ల్యాండాక్టు సవరణ బిల్లును ప్యాసుచేయగా రాజధాని ఇనాందార్లు పెద్ద ఆందోళనము చేసినందున గవర్నరుగారు ఆస్తులను అపహరించే స్వభావముగల ఈసవరణబిల్లును ఇనాందార్లకు నోటీసు లేకుండా అంగీకరింపబడకూడదు అనిన్ని, ఇనాముల గురించి ప్రత్యేకముగా ఒక బిల్లు కొలది కాలములో పెట్టబడును అనిన్ని చెప్పి అప్పటికి ఆగడము తప్పించెరు. ఈసంవత్సరము జూలై ౧౪ వ తేదీని లోగడ ఇనాందార్లు కూడదన్న శెక్షన్లు కల కొత్త యెస్టేట్సు ల్యాండాక్టు సవరణబిల్లు గవర్నరు జెనరల్గారి అనుమతితో కూడా గెజెటులో ప్రచురణ అయింది. తే ౩౧-౭-౩౮ దీని, ప్రెసిడెన్సీ ఇనాందార్ల గవర్నింగు బాడీ సభ్యులు వేర్వేరు జిల్లాలనుండి రాయబారముగా వెడలి శ్రీ రెవిన్యూమెంబరయిన సర్. ఆర్చిబాల్డు కేంపుబెల్ దొరగారికి ఈ క్రొత్తబిల్లు వలన ఇనాందార్లకు కలిగే నష్టములను విరివిగా వివరించి చెప్పి, ఇదివరకు ఇనాందార్లు, చెన్నపట్నం గవర్నరుగారికి సమర్పించిన వినతిపత్రములోని ముఖ్యాంశము లెత్తి చెప్పి, ఈబిల్లు విషయమై ఏర్పడబోయే శెలక్టు కమిటీలో న్యాయముగా చేయబడవలసిన సవరణలను కొన్నిటిని సూచించి, ఇనాముల విషయమై ప్రతిజిల్లాలోను జిల్లా అధికార్ల మూలమున గాని శెలక్టు కమిటీ సభ్యుల మూలమున గాని క్రమమైన విమర్శనము సాక్షివిచారణ చేయకుండా ఈబిల్లు శాసనసభలో ప్రవేశపెట్ట కూడ దని విన్నవించిరి తే ౨-౮-౩౮ దీని ఈబిల్లు గౌ॥ రెవెన్యూ మెంబరుగారి వలన ప్రవేశపెట్టబడి ౨౧ మంది సభ్యులు కల శెలక్టుకమిటీకి పంపబడెను. శెలక్టుకమిటీవారేమో రాజధానియందంతట ప్రచారము చేసి ఇనాందార్ల వద్ద సాక్ష్యము పుచ్చుకొనక యనిన్ని, ప్రత్యేకవిమర్శన మేమీ చేయ రనిన్ని, ఈరెండు మాసములలోపుగా ఎవరైన లిఖితపూర్వక మైన విన్నపములు పంపితే ఆలోచించి తొందరగా వారి నివేదిక తయారుచేసి అక్టోబరు మాసములో శాసనసభలో బిల్లు చర్చకు తీసికొనివచ్చెద రనిన్ని తెలియవచ్చుచున్నది. వ్యవధి విశేషం లేదు కావున ఇనాందార్లకు ఈకొత్త బిల్లువలన కలిగెడు కష్టనష్టములను వానిని సంస్కరించవలసిన మార్గములను, వీటినిగురించి ఇనాందార్లు వ్యక్తిగతంగా గాని తమ తాలూకా లేక జిల్లా ఇనాందార్ల సంఘముల మూలముగా గాని, ప్రెసిడెన్సీ ఇనాందార్ల సంఘము శెక్రెటరీగారికిన్ని ప్రధానమంత్రి శ్రీ బొబ్బిలి రాజావారికిన్ని, ఎస్టేట్సులాండాక్టు సవరణబిల్లు శెలక్టుకమిటీ శెక్రెటరి గారికిన్ని (ఈముగ్గురి విలాసము చెన్నపట్నమే) లిఖితరూపక మైన విన్నపములను అతి తొందరగా పంపవలె నని ఇనాందార్లను హెచ్చరిస్తూ ఏతద్విషయమై నా అభిప్రాయములు సలహాలు కొన్నిటి నిదిగువ పొందుపరుస్తున్నాను:—

ఎస్టేట్సులాండాక్టు ౩-వ సెక్షను క్లాజు ౨ (డీ) కి బదులుగా కొత్తబిల్లులో పేర్కొనబడిన "ఎస్టేటు" పదనిర్వచనము అమలులోనికి వస్తే ఇనాందార్లకు చిరకాలానుభవ మైన సాగుహక్కు లేక కుడివరము హక్కు అంతరిస్తుంది. అది తాత్కాలికముగా ఇనాంభూమి సాగుచేసే రైతువానికి వస్తుంది; అంటే ఇనాందారుని ఇష్టము లేకుండా రైతువాడు ఇనాం భూమిని జమీందారీ జిరాయితీ

భూమి లాగున అమ్మి వేయవచ్చును. తనకా పెట్టవచ్చును. ఇతరత్రా అన్యాక్రాంతము చేసుకొనవచ్చును. ఇనాందారునకు మేల్వారము లేక శిస్తు పుచ్చుకొనే హక్కు మాత్రం ఉంటుంది. ఆహక్కు ఇనాందారుడు అమ్మినా కుడివరము హక్కునకు వచ్చే ఖరీదు రాదు. రూ ౩౦౦౦ లు ఖరీదు చేసే ఇనాంభూమి ఇకమీదట ఇనాందారుడు అమ్మితే సుమారు రూ౧౦౦౦లు మాత్రమే వస్తాయి. ఇనాం రైతు గాని అమ్మితేసుమారు రూ౨౦౦౦లు వస్తాయి. లేకపోతే సుమారు రూ ౧౨౦౦లు ఇనాందారునికున్నూ రూ ౧౮౦౦ లు రైతువానికిన్ని రావచ్చును. మేల్వారము, కుడివరము హక్కులకు అంత వ్యత్యాసమంది. ౫౦ మెడ్రాసు ౭౦వ తీర్పు ప్రకారము మన చెన్నపట్నం హైకోర్టువారు కుడివరముదారునికి ౩ వంతులలో ౨ వంతులున్ను మేల్వారముదారునికి ౩ వంతులలో ౧ వంతున్ను పరిహారము ముట్టచెప్పేరు; ౩౬ మెడ్రాసు ౩౯౫ తీర్పు ప్రకారము కుడివరందారునికి ౫ వంతులలో ౩ వంతులున్ను మేల్వారందారునికి ౫ వంతులలో ౨ వంతులున్ను ముట్టచెప్పేరట. నా ఉదాహరణమునకు ఈ హైకోర్టు తీర్పుల సూత్రము ఒక విధముగు ప్రమాణము. ఈ బిల్లు ముందు ప్యాసవుతుందన్న రూమరు వల్లనే అప్పుడే ఇనాంభూముల ధరలు మందగించాయి. ఇంకా మందగిస్తాయి; ఇనాందార్లు ఇనాంభూములు కొనుక్కున్నప్పుడు ఈ హక్కులు తమకు ఉంటా యన్న నమ్మకముతో కొనుక్కున్నారు కదా! ఇప్పుడు కొత్త పద్ధతి పెట్టి వారి కొంప తియ్యడం న్యాయం గాదు. ఇంతేకా, నష్టపరిహారము ఇవ్వకుండా ఆస్తులను అపహరింపవచ్చునా? గవర్నమెంటువారు హక్కులను ఆస్తులను తప్పక కాపాడువారు అనే సామాన్యపు నమ్మకమునకు ఈ బిల్లు భంగము కాదా! తప్పనిసరిగా ఈ కొత్త బిల్లు చట్టము కావలెనంటే ఇనాందారునకు భూమివలన వచ్చే భాగమునకు ౨౦ ఇంతలో ౩౦ యింతలో నష్టపరిహారము వచ్చేటట్లు చట్టదిట్టము చేస్తే గడ్డిలో మొల్ల అనునట్లు ఒకలాగున ఉంటుంది. అట్టి చట్టదిట్టము కష్టమైతే పూర్వము లాగునే ఎస్టేటు అనే పదమునకు వ్యాఖ్యానం ఉండాలి; ఇనాములు "యెస్టేట్లు" అనేటట్టు సవరణ పెట్టకండి.

(౨) ఇనాము భూముల గురించి దావాలు వస్తే ఆభూకామందునకు మేల్వారము కుడివరము హక్కులు రెండున్నూ ఉన్నాయా లేక ఒక్క మేల్వారము హక్కు మాత్రము ఉన్నదా? అనే సారాంశము విశదపరచవలసివచ్చే టప్పుడు భూమియందు కుడివరం హక్కు వున్నదని రుజూవు చేయవలసిన భారము రైతువానిదని మన హైకోర్టువారు కొన్ని తీర్పులు చేసియుండిరి; కొన్ని దావాలు ప్రివీకౌన్సిలు వరకు వెళ్ళినప్పుడు అట్టి రుజూవు భారము భూకామందుయందు గాని, రైతువానియందు కాని ఉన్నదని ఖచితముగా తీర్మానించుటకు వీలులేదనిన్ని ఆయా దావాల వివరాంశములను అనుసరించే తీర్మానింపబడవలెననిన్ని కొన్ని తీర్పులు చెప్పేరు. భాగ్యవంతుడగు ఇనాందారునితో, బీదవాడగు రైతు పోరాడలేక నష్టపోతున్నాడని ఈ కొత్తబిల్లు పెట్టవలసివచ్చిందని కొందరంటున్నారు. అదే కొత్తబిల్లుయొక్క వాస్తవోద్దేశమైతే, అట్టి తగాయిదాలు వచ్చినప్పుడు రుజూవు భారము కొన్నికొన్ని అవస్థలలో ఇనాందారునియందున్ను మరికొన్ని అవస్థలలో రైతువానియందున్ను ఉండవలసిందని న్యాయవిశారదులగు మన శాసనసభవారు ఒక ప్రత్యేకసవరణ చేస్తే ఈ అందోళనమే ఉండదే! సెలక్టు కమిటీలో వున్న న్యాయశాస్త్రజ్ఞులు ఈవిషయమై ఉభయవాదులకు అంతగా నష్టము లేని సవరణ ఒకటి కల్పించి పూర్వపు ఆక్టులో వున్న "ఎస్టేటు" పదవ్యాఖ్యానము మార్పులేకుండా ఉంచితే తగాయిదాలన్ని అంతరిస్తాయి.

(౩) ఇనాందార్లను జమీందార్లతో సమానం చేసేఉద్దేశముతో ఈ కొత్తబిల్లు పెట్టవలసివచ్చిందని

కొందరంటున్నారు. ఇదెక్కడి మాట! ఈన్యాయము కుదరదు. చరిత్రాత్మకముగా చూచినా ఆర్థికరీత్యా చూచినా న్యాయరీత్యా చూచినా వారి అంతస్థులు సంస్థలు వేర్వేరు. పెద్ద జమీందారీ భూముల విషయమై నిర్మింపబడ్డ చట్టము అల్ప భూస్వాము లైన ఇనాందార్ల విషయంలో వర్తించేటట్టు చెయ్యబూనడము సాహసము. "ల్యాండు శిస్టమ్సు ఆఫ్ బ్రిటిష్ఇండియా" అనే గ్రంధరాజము ౪ వ సంపుటములో బేడెన్ పవల్ దొరగారు "జమీందారీ ఎస్టేట్లలో ఇనాములు చేర వని" స్పష్టముగా వ్రాసేరు. ౧౯౦౮ లో ఎస్టేట్సు ల్యాండాక్టు ప్యాసైనప్పుడు ఈ ఇనాముల విషయమై చర్చ జరిగింది. అప్పుడు బి. యన్. శర్మగారు, వి. కృష్ణస్వామి అయ్యరు గారు, జి. ఫోర్బ్సు దొరగారు మేల్వారము కుడివరము హక్కులు రెండున్ను కల ఇనాం భూములు ఎస్టేట్లగా పరిగణించబడ కూడ దని తీర్మానించి ౧౯౦౮వ సంవత్సరపు ౧వ ఆక్టు ౩వ శెక్షను ౨వ క్లాజు (డీ) ఏర్పరచేరు. వారి ఉద్దేశాలవికావు సంగతి సందర్భాలు వేరు అని వాదించే వారు అప్పటి శాసనసభ ప్రొసీడింగ్సు జాగ్రత్తగా చదవవలసి ఉంటుంది. ఏ యినాం భూముల విషయములో ఒక్క మేల్వారము హక్కు మాత్రము ఇనాందారునకు యివ్వబడెనో ఆభూములను "ఎస్టేట్లు" అనియే వ్యవహరించవచ్చును. ప్రస్తుతము అమలులో వున్న పద్ధతియే యిది. ఇనాం కమీషన్ వారు ఇనాందారునకు ఒక్క మేల్వారం హక్కు వున్నదా లేక మేల్వారం కుడివరం హక్కులు రెండూ ఉన్నాయా అనే సమస్య తీర్మానించ లేదు. న్యాయస్థానములలోనే అది తీర్మానింపబడ వలె నని అభిప్రాయపడ్డారు.

౪ "ఇనాం భూములను దున్ని సాగు చేసే రైతు వానికే భూమి హక్కు ఉండాలి గాని ఇనాందారునకు హక్కు లేదు; పూర్వపు పద్ధతి యిలాగే వుండేది; ధనవంతులు బలవంతులు అయిన ఇనాందార్లు ఈ హక్కు తమ దని చెప్ప ఇటీవల అన్యాయముగా ఆక్రమించుకొన్నారు: ఇనాం రైతు నాయకులము మే మిప్పుడు బయలుదేరి చట్టరూపకముగా కుడివరం హక్కు రైతువానికిప్పిస్తాము" ని ప్రగల్భాలు పలికే జస్టిసు పక్ష నాయకుల వాదము నిరాధార మైనది; అన్యాయవాదము; చరిత్రాత్మక సాక్ష్యములకు విరుద్ధము. గతసంవత్సరము వరకు, అనగా ఎస్టేట్సు ల్యాండాక్టు ప్యాసుకాబడిన ౧౯౦౮ లో గాని తరువాత సవరణబిల్లులు ఉపపాదింపబడినప్పుడు గాని ఈఅసందర్భవాదము లేనే లేదు. జమీందార్లకు ౧౯౦౮ వ సంవత్సరపు ౧ వ ఆక్టు ప్రకారము జమీందారీ జిరాయితీ భూముల విషయములో అదివరకు రైతులకు ఉండియున్న సాగుహక్కులు చట్టదిట్టము అయినాయి. ఇనాముల విషయమై ౧౯౦౮ కి తత్పూర్వము గాని తదనంతరము గాని ఇనాం రైతుకు సాగు హక్కు అసలే లేదే? అట్టి సందర్భములో ఇట్టి విచిత్రపు వాదము చేయడము చాలా శోచనీయముగా వుంది. కొన్ని జమీందారీలలో జిరాయితీ రైతుల పట్ల జమీందార్లు చేయుచున్న అత్యాచారములను బయటపెట్టి కొందరు ఇనాందార్లు ఆందోళన చేస్తున్నారు; కావున, ఇనాందార్ల కొంప తీసి వాళ్ల సాగుహక్కులు నాశనము చేసి పగ తీర్చుకొందా మని శాసనసభలో పలుకుబడిన్ని తాత్కాలికపు మెజారిటీయున్నూ కల జమీందార్లు పన్నగడ ఫలితమే ఈబిల్లు; ఈజమీందారులలో కూడ కొందరికి ఇనాం గ్రామాలు ఉన్నాయి; ఇనాముల విషయము వచ్చే నష్టము భరించి అయినా ఈబిల్లు ప్యాసుచేయించా లని సంకల్పించుకున్నట్టు కానవస్తుంది.

౫ "ఈసవరణబిల్లు ప్యాసయితే ఇనాందారునకు వచ్చే నష్ట మేమి లేదు; సాగు హక్కు రైతు వానికి వచ్చినా ఫరవాలేదు: ఇప్పటి లాగే ఇనాందారు ఎవడు రైతయితే వానివద్ద భూమి పంటలో

ని భాగము పుచ్చుకోవచ్చును గదా” అనే వాదన కొందరు చేస్తారు. ఈ వాదనలో చాలా ప్రమాదా లున్నాయి: గమనించండి:—

ప్రస్తుతము కౌలు ముచ్చిలకౌలలోని కౌంట్రాక్టు షరతుల ప్రకారమూ ఇనాందారునకున్నూ వాని రైతునకున్నూ ఉన్న సంబంధము అంతరించి పోతుంది. షరతాఖరున భూమి వదలివేయాలి అనే నిబంధన ఇక మీదట రైతువానికి వర్తించదు. రైతు 'నాదే భూమి' అంటాడు: శాశ్వతమైన సాగు హక్కు నాకు వచ్చిందంటాడు; అంచనా లేక కైలుపద్ధతిని రైతువాడిక మీదట ఫలసాయము భుక్తకివ్వడు; దరిని యున్న జిరాయితీ భూముల పద్ధతియే కావాలి అంటాడు; ధాన్యాలు మీ వని అనుకోండి గాని ధాన్యాలు మావే అనిన్ని ముండభరణం లాగు నగదుశిస్తులు జిరాయితీ భూములలో లాగు “రికార్డ్ ఆఫ్ రైట్సు, సెటిల్మెంటు” ప్రకారమే కడతామనిన్ని ఇనాంరైతులిక మీదట అగ్రహారం భుక్తలతో వాదిస్తారు. ఇదంతా యినాందార్ల కెంత నష్టమో ఊహించుకో వాలి గాని వ్రాయడానికి అలవి కాదు. ఈసందర్భములో సెలెక్టుకమిటీవారికి మనవి చేసిన దేమంటే ఈబిల్లు తప్పని సరి అయితే ఇప్పటి లాగున కౌలు ముచ్చిలకౌల కౌంట్రాక్టు షరతుల ప్రకారము రైతువల్ల ధాన్యరూపకమైన భాగాలు చెలామణీ అవాలి అనే సవరణ అయినా చెయ్యండి.

(౬) “శిస్తులు వసూలు చేయుటకు ల్యాండ్ ఆక్టు ప్రకారము జమీందారునకు ఉన్న అధికారాలు (అనగా, రెవిన్యూకోర్టులో దావా చేసి రైతువాని భూమి అమ్మించుట, రైతువాని చరాస్తి జప్తు చేయించి అమ్మించుట) ఇనాందారునకు కూడా వస్తాయి మంచిది కాదా” అని అంటారు కొందరు. ఎక్కువ భూములు, పెద్ద సిబ్బందీ, ఉద్యోగ వర్గము, పలుకుబడి కలిగివున్న జమీందారునకే ఈ అధికారాలు సరీగా చెలాయించడము ఎంతో కష్టంగా ఉంది; అల్పభూస్వామి అయిన ఇనాందారుడీ అధికారాలు చెలాయించలేడు. ప్రస్తుతం ఇనాందారునకు రైతునకు ఉన్న స్నేహభావాలు అంతరించి వైషమ్యాలు రేకెత్తుతాయి. పెరుగుతాయి సివిల్ కోర్టులలో వలె రెవిన్యూకోర్టులలో క్రమమైన న్యాయబద్ధమగు విచారణ ఉండదు. ఎక్సపార్టీ సమ్మరీ డిక్రీలు, నాటి అమలు సందర్భంలో దెబ్బలాటలు, ఆపైని క్రిమినల్ దావాలు— ఇవి జాస్తీ కాక మానవు.

(౭) మేల్వారము కుడికరము హక్కులు రెండున్ను ఉంటాయనే సంపూర్ణనమ్మకముతో బోలెడు డబ్బు పోసి ఇనాం భూములు కొనుక్కున్న వాళ్ళు, తణకాలు పట్టిన వాళ్ళు, ఇప్పుడా యినాంభూముల గురించి దావాలు తెంటాలు సివిల్ కోర్టులలో పడుతూ ఉన్నవాళ్లు—ఈకొత్త బిల్లు అమలులోనికి వస్తే వీళ్లకి చాలా నష్టం వస్తుంది. వీరి హక్కులకు భంగము రాకుండా సెలెక్టు కమిటీవారు చట్టదిట్టం చెయ్యాలి.

(౮) ఈబిల్లు ఆక్టు కాగానే భూమిని సాగు చేయించుకొని ఖరునాయం అనుభవించగల అధికారము చాలా మంది ఇనాందార్లకు పోతుంది. నిరుద్యోగసమస్య ఆర్థికమాంద్యము జాస్తీగా వున్న ఈరోజులలో ఇట్టి బిల్లు వెంటనే అమలులోనికి వస్తే చాలామంది ఇనాందార్లు దివాలా తీస్తారు. ఈబిల్లే తప్పని సరి అయితే, “మలబారు టెనెన్సీ లా”లో వున్నట్లు కొన్ని చట్టదిట్టాలు చేసి ౧౦ సంవత్సరాల తరవాత ఈబిల్లు అమలు అయ్యే టట్లు సవరణ పెట్టాలి.

(౯) ఎంతో ధనవ్యయం చేసి సివిల్ కోర్టులలో ఈభూములు “ఎస్టేట్లు” కావు, రైతులకు కుడివరం హక్కులు లేవు అని తీర్పులు పొందిన ఇనాం భూముల విషయంలో ఈసవరణ చట్టం వర్తించకూడదన్న నిబంధన సెలెక్టు కమిటీవారు పెట్టాలి. కొంతమంది ఇనాందార్లు ప్రివీకౌన్సిల్ వరకు వెళ్ళి

త్రిశ్నలు సంపాదించారు. ... సవరణ బిల్లు తొందరగా పాసుచెయ్యాలి ...

(౧౦) "ఇనాందార్లు ఇనాం రైతులను చాలా బాధిస్తున్నారు; వారికి ... ఇనాం రైతుల గతి. ఈబిల్లు ద్వారా ఇనాం రైతులకు ఆర్థిక విమోచనము కలిగిస్తా మని చెప్పే కొందరి శాసనసభ్యుల ... ఆర్థిక విమర్శ చేసి ఇట్టి ... తేలిస్తే బాగుంటుంది గాని కట్టుకథలు చెప్పడం న్యాయం కాదు. మొన్న ... శాసనసభలో జస్టిసుపక్షం ఆయన ఒక రన్నారూ "......మానవ ఋతుత్వాబ్దముఖంను ప్రమాణము గా దనియు, మనుస్మృతి ననుసరించినచో శ్రీ వెంకట్రామయ్యర్ గారు (వీరు ఇనాందార్ల పక్షము మాట్లాడిన శాసనసభ్యుడు) పురోహితులై యుండవలసినదే గాని ప్లీడరై శాసనసభలో ఉండరాదు,.....'' ఈ పెద్దమాటలు చెప్పిన ఆయన వంశం వారు మొదట ఇనాంభూములు సాగుచేసే వారే; ఇప్పుడేల ప్లీడరై శాసనసభలోనికి వచ్చేరో! ఇనాందార్ల దౌర్జన్యము పడలేకనా! తామూ ఇనాందార్లే! ఈ మధ్య ఇలాంటి సవరణబిల్లు శాసనసభలో చర్చించబడ్డప్పుడు, ఒక సభ్యు డీ దిగువ ప్రశ్నలకు గవర్నమెంటువారిని జవాబు చెప్ప మని కోరేరు:—

ల్యాండాక్టు ౩ వ శెక్షన్ క్రింద వచ్చే ఇనాం భూములు కల గ్రామాల జాబితా యేదీ? ఏయే యినాంగ్రామాలలో భూము లన్నీ పంపకము అయినాయి? ఎన్ని యినాం గ్రామాలలో ౧౦ మందికి మించిన అనుభవంతులు వున్నారు? ఒక్కొక్కరికి ఎంత విస్తీర్ణం గల భూమి ఉన్నదీ? మేల్వారము కుడివారము రెండు హక్కులూ కల ఇనాందార్లెందరున్నారు? ఏయే యినాం గ్రామాల విషయంలో ఇనాందారునకు కుడివారం హక్కు వున్నట్లు యిదివరకు కోర్టు తీర్పు లైనాయి? ౧౯౦౮ కి పూర్వము ౧౯౦౮ కి తదనంతరము ఎన్ని యినాం గ్రామాలు గాని గ్రామభాగాలు గాని క్రయబడ్డమై వున్నాయి? ఇనాందారునకు రైతునకు కల ఆర్థిక సంబంధం మేలా వున్నది? జిరాయితీ రైతునకు జమీందారునకు కల సంబంధానికి దీనికి తేడా యేలాగున వుంది?—ఇట్టి ప్రశ్నలకు ఉత్తరములు చెప్పుటకు కావలసిన భోగట్టా నావద్ద లే దని గౌ॥ రెవెన్యూ మెంబరు గారే ఒప్పుకున్నారు. మొన్న ౩౧-౭-౩౮ న శ్రీ ... చేస్తూ ... రాయబారముగా వెళ్ళి ఇనాముల సమస్యను గురించి గౌ॥ రెవెన్యూ మెంబరు గారితో సంప్రతించినప్పుడు కూడా ఇనాముల గురించి ఆర్థికవిమర్శనము చేయించం డని కోరేము, ఆలోచిస్తా మన్నారు. ఇప్పుడేనా పూర్వ ప్రశ్నలకు జవాబులు చెప్పడానికి కావలసిన భోగట్టా అంతా సంపాదించేరో లేదో తెలియదు. ౨-౮-౩౮ తేదీని ఈసవరణ బిల్లు గురించి మాట్లాడుతూ ఒక శాసనసభ్యు డన్నాడూ—ఇలాంటి భోగట్టా ఇనాందార్లే సంపాదించా లని. మంచి మాటే గాని చిక్కు ఎలా వుందంటే—కావలసిన భోగట్టా లేకుండానే, ఈవిపరీతపు చట్టం ప్యాసు చెయ్యడానికి ఆలోచిస్తున్న వారూ శాసనసభ్యులే. మీరు విమర్శనము చెయ్యండి మాకు తోచిన న్యాయము మేము చేస్తా మని ఇనాందార్లు అంటే విమర్శన చెయ్యడానికి వారికి బద్ధకమో తీరుబడి లేదో. శెలక్టుకమిటీవారైనా రాజధానియందంతటా ప్రచారం చేసియో, లేక, జిల్లాకలక్టర్లు తహశీల్దార్లు మొదలైన రెవిన్యూ అధికార్లకు వ్రాసియో మీద ప్రశ్నలకు సరియైన జవాబులు లెక్కలతో సహా సంపాదించి సంగతి సందర్భాలు బాగా ఆలోచించి వారి సలహాలు శాసనసభవారికి నివేదించవలసి వుంటుంది. తగిన విమర్శన చెయ్యకుండా పట్టి దురభిప్రాయాలు మనసులో పెట్టుకొని ఈ అసందర్భపు ఇనాముల బిల్లు ప్యాసుచేయకం డని శాసనసభ్యులను కోరుతున్నాను.

(౧౧) ౧౯౦౮ వ సంవత్సరపు ౧ వ ఆక్టు ౧౮౫ వ సెక్షనులో "ప్రయివేటు ల్యాండు" విషయంలో క్రొత్త బిల్లులో చేయబడిన సవరణ అన్యాయ మైనది. ౧౯౦౮ వ సంవత్సరమునకు పూర్వము ఇనాందారుకు "ప్రయివేటు ల్యాండు"గా కౌలు కిచ్చిన భూమి ఇనాందారుని భూమిగా పరిగణింపబడు నని సదరు సవరణ యొక్క భావము, అయితే దీనిలో చాలా అసందర్భం వుంది: "ప్రయివేటు ల్యాండు" అనే మాటల పోగు "జిరాయితీ ల్యాండు" నకు వ్యతిరేకంగా ల్యాండాక్టులో వాడబడుతూ వచ్చింది. అట్టి విచక్షణ ఇనాం భూములకు వర్తించదు. మేల్వారము కుడివరము హక్కులు రెండు కల ఇనాం భూమి యావత్తూ ఇనాందారుని స్వంత ఆస్తియే. దానిని "ప్రయివేటు ప్రోపర్టీ" అనాలి. ఈసవరణ పూర్తిగా సంస్కరించి "ప్రయివేటు ల్యాండు" నిర్వచనము సరిగా పూర్వాపరాలె సెలక్టు కమిటీవారు చెయ్యాలి.

(౧౨) భూమిని సాగుచేసే వ్యవసాయదారునకే సాగు హక్కు లేక కుడివరం హక్కు వుండాలి; చాలా మంది ఇనాందార్లు రైతులచేత తమ భూములు సాగుచేయిస్తున్నారు కాబట్టి కుడివరం హక్కులు ఇనాం రైతులకే చెందజేయవలసింది; ఈ విషయంలో రైతు లందరూ ఇనాం రైతుల పక్షం వుండి ఆందోళన చెయ్యాలి" అని కొందరు రైతునాయకులు ప్రబోధము చేస్తున్నారు. ఈవాదన లోని అసందర్భము కొంచెం జాగ్రతగా చూస్తే విశద మవుతుంది.— జిరాయితీ రైతులలో కూడా కొంతమంది భూమి స్వయంగా సాగుచేయక వేరే రైతులను నియమించి సాగుచేయించుకుంటున్నారు. ఈమోది సూత్రము జిరాయితీ రైతుల క్రింద భూమిని సాగు చేసే రైతులకు కూడా వర్తించడం న్యాయం కదా! అనగా, జిరాయితీ రైతులకు కుడివరం హక్కు లు పోయి వాళ్ల చేతిక్రింద నున్న కౌలే రైతులకు సంక్రమించాలి. ఈరైతు నాయకుల మాటలు విని తమ సాగుహక్కులను నష్టపరచు కొనుటకు ఒప్పుకునే జిరాయితీ రైతు లెంతమంది వుంటారో చెప్పడం కష్టము! ఎవ్వరూ బుద్ధిమంతు లైతే ఉండ రనే చెప్పగలను. అయితే రైతు నాయకు లిప్పుడు జిరాయితీ రైతుల సాయంతో ఆందోళన చేసి మొదట ఇనాందార్ల సాగు హక్కులు తీయించి వేసి తరువాత తమకు సాయం చేసిన జిరాయితీ రైతుల సాగు హక్కులు ఊడ బీకిస్తారు కాబోలు! ఈనాయకులు చెప్పే సూత్ర స్వభావము పాపం జిరాయితీ రైతులు గ్రహించక పోవడము వారి దౌర్భాగ్య మనే చెప్పవచ్చును. మాటవరుసకు, జిరాయితీ రైతులకు కూడా కుడి వరం హక్కులు పోయి వారి చేతిక్రింద వుండి దున్నుకునే రైతులకు వస్తవి అనుకుందాము. అప్పట్లో, జిరాయితీ రైతులకు మేల్వారం హక్కైనా యిస్తారా? లేక ఏహక్కూ యివ్వరా? న్యాయ రీత్యా కుడివరం హక్కు పోయినప్పుడు, మేల్వారం హక్కైనా ఇవ్వాలి. జిరాయితీ రైతులకు మేల్వారమూ, వారి చేతిక్రింద సాగు చేసే రైతులకు కుడి వరం హక్కూ వస్తే జమీందారుని కేమి ఉంటుంది? ఈజమీందార్ల సంస్థకే స్వస్తి చెప్పించేసి వారికి మన రైతునాయకులు పింఛన్లు "రికమెండు" చేస్తారా యేమిటి? ఇంతకూ, ప్రస్తుతపు శాసనసభలో పలుకుబడి కల జమీందార్లు ఒప్పుకుంటారా ఈ న్యాయానికి? ఇక రైత్వారీ భూస్వాముల క్రింద భూమి దున్ని సాగు చేసే రైతులకు కూడా పై సూత్రాన్ని బట్టి కుడివరం హక్కు వస్తుంది; గవర్నమెంటుకు ఉన్న మేల్వారం హక్కైనా రైతు భూస్వామి కిస్తారా? లేక పంచులు వేసు కుంటారా? దేశాన్ని ఏలే గవర్నమెంటుకు ఏహక్కూ యివ్వకుండా వ్యాఖ్యానాలు చేస్తారా? "స్టేట్", అనగా దేశాన్ని ఏలే గవ

ర్నమెంటు. దానికి ప్రస్తుతం భూస్వామిత్వం వర్తింపజేసి ఆపైని తెలివిగా మాటలు చెప్పాలి. ఇదే "స్టేటుస్క్వాండులాక్జిం" సిద్ధాంతము. మన రైతునాయకులు చెప్పిన సూత్రాలు జపించవచ్చును గాని అమలులో పెడితే అల్లకల్లోలం, కలవరం, విప్లవం దేశంలో పుట్టక మానదు. ఇంతేకాక, ఈ ఇనాముల బిల్లు ఆక్టు అయితే ఇనాందార్ల ఆస్తులు హక్కులు నశిస్తాయి; ఒకనికి వున్న ఆస్తియందు కల హక్కు క్రొత్త చట్టం పెట్టి గవర్నమెంటు భంగపెడితే, గవర్నమెంటు వారి యందు ప్రజలకు వుండే నమ్మకము, విశ్వాసము క్షీణించదా! ఇట్టి రాజకీయసమస్యలు, రాబోయే క్లిష్టపరిస్థితులూ అన్నీ రాజ్యాంగవేత్తలైన మనశాసనసభవారు ఆలోచించాలి.



# హిందీవల్ల తెనుక్కి జరుగుతూ వున్న అపకారం

దీన్ని గురించిన లేఖలు శరపరంపరగా వస్తున్నాయి. ఇందులో కొన్ని మాత్రమే ప్రకటించగలిగాము. చాలా పత్రికలు కూడా మా వాదాన్ని బలపరుస్తూ సంపాదకీయాలు ప్రకటించాయి. ఆంధ్రపత్రిక కూడా యీ విషయాన్ని తాకింది; గాని చాలా ముభావంగా మాట్లాడింది. పత్రికా సంపాదకీయాలు గూడా కొన్ని యిక్కడ చూపిస్తున్నాము. తక్కినవి క్రమంగా ప్రకటిస్తాము. గృహలక్ష్మి మా వాదా న్నంగీకరించిం దనే చెప్పవచ్చు; అయితే ఆమె హిందీ వ్యాపకంవల్ల తెనుక్కి నష్టం లే దంటుంది. మేము తెనుగుభాషని ప్రచారకులు తొక్కెయ్యా లని చూస్తున్నా రన్నాము; గాని హిందీ తొక్కేస్తోం దనలేదు. జూలై సంచికలో మేము ప్రచారకుల దృఢసంకల్పాలను చూపే వున్నాము. హిందీ మనం నేర్చుకోవాలంటే సరే; కాని అది బజారుభాషగా మాత్రమే వుండాలి. తెనుగు యిళ్లల్లో దానికి ప్రవేశం వుండడానికి విలు లేదు. ఆ కొంత ప్రయోజనం కోసం యింత ఆడావిడి యెందుకూ? జిల్లా కొక హిందీప్రచారక సభని యేర్పరిచినా—రాత్రింబగళ్లు యెడతెరిపి లేకుండా పని చేసినా ఇంగ్లీషు వడి మళ్లీ దాకా హిందీ యీ ప్రాంతాలలో వినోదానికే వుపకరిస్తుంది. ఇంగ్లీషు వ్యాపకాన్నయినా యీ హిందీ తగ్గించలేదు. ఇక వున్న దల్లా యేమిటంటే? వొక కారణంవల్ల హిందూస్థానీలు తమ హిందీని గురించి యింత శ్రద్ధా, తహతహా చూపిస్తున్నారు. "హిందూదేశానికి సామాన్యభాష యేది? దానికి వాడవలసిన లిపి యేమిటి?" ఇదీ అసలు ప్రశ్న. మహమ్మదీయులు తమ ఉర్దూభాషే సామాన్య భాషగా వుండా లంటున్నారు. దానికి పార్శీలిపే వాడా లంటున్నారు. హిందీని, దేవనాగరిలిపిని వా రెప్పుడూ వొప్పుకోలేదు. కాకినాడ నగరంలో కాంగ్రెస్సు సమావేశానికి వొకటి రెండు రోజులు వెనక జరిగిన హిందీసాహిత్య పరిషత్తుయొక్క అపసర సమావేశంలో డాక్టరు కిచ్లూ, మౌలానా మహమ్మదాలీ ప్రభృతి మహమ్మదీయులు ఉర్దూపక్షంగా చాలా పట్టుపట్టారు. నెహ్రూకుటుంబం కూడా ఆవాదా న్నంగీకరించింది. చివరికి అదే నెగ్గింది. తదనుగుణంగా కాంగ్రెస్సులో నెహ్రూద్వయమూ, సరోజినీదేవి కూడా శుద్ధవుర్దూలోనే మాట్లాడారు. కిచ్లూగారు ఇంగ్లీషూ హిందీ వొక్క ముక్కయినా ఉచ్చరించలేదు. మహమ్మదాలీ గారూ, షౌకతాలీ గారూ ఇంగ్లీషు ఉర్దూలలో మాట్లాడారు. ఇది యిలా వుండగా అలహాబాదు, లక్నో, కాన్పూరు మొదలైన శుద్ధ హిందూస్థాని నగరాల్లో కూడా కోర్టుభాష ఉర్దూ కాని హిందీ కాదు. ఢిల్లీప్రాంతంలోనూ అంతే. పంజాబులో కూడా అంతే అని తెలుస్తోంది.

పులిమీద పుట్ర అన్నట్టు హైదరాబాదు రాజ్యంలో వొక స్వతంత్ర విశ్వవిద్యాలయం లేని వ్యవహారం అంతా కేవలమూ వుర్దూలో నడిపిస్తోంది. ఇలాగ వుర్దూకీ, హిందీకీ మధ్య నేనా అని దాయాదులైన పోటీ వచ్చింది. ఈ స్థితిలో దక్షిణభారతదేశాన్ని తాము ఆక్రమిస్తే తమ హిందీకి బలం వస్తుందని హిందూస్థానీలు యీ యెత్తు యెత్తారు. కాంగ్రెసు హిందీని సామాన్యభాషగా వాడాలంటోందంటే దాని వుద్దేశం వేరు. కానైతే అరబ్బీ, పార్శీ మిళితమైన వుర్దూ కంటె సంస్కృత మిళితమైన హిందీయే మనకి సులభసాధ్యం అవుతుంది; గాని హిందూస్థానీల ప్రయత్నం యెందుకో తెలుసుకోకుండా మనకీ కంగా రెందుకూ? స్వరాజ్యం వచ్చి, అది హిందీనే అంగీకరించినా యీ దక్షిణప్రాంతాలలో యెక్కడా అది కోర్టుభాషగా వుండదు. శాసనసభలలో కూడా దానికి ప్రవేశం వుండదు. ఏప్రాంతానికాప్రాంతపు భాషలోనే సర్వవ్యవహారాలూ నడుస్తాయి. వొక్క అఖిలభారత వ్యవహారాలకు సంబంధించినంతవరకే సామాన్య భాష వాడబడుతుంది. అప్పుడు కాంగ్రెసు కేంద్రప్రభుత్వసంస్థ అయిపోతుంది; కనక దాని వ్యవహారాలు సైతం ఆ సామాన్య భాషలోనే జరుస్తాయి ఇలాగ యేది సామాన్య భాష అయినా పరిపాలనాధికారం మనకి స్వాధీన మయినా దానికి మన సామాన్య భాషకి ఉండవలసిన దానికంటే చాలా తక్కువ ప్రచారం మాత్రమే వుంటుంది. కాంగ్రెస్సు వ్యవహారాలు ఇప్పుడు కూడా కేవలమూ హిందీలో జరగడానికి వీలులేదు. ఇంగ్లీషే అక్కడ ప్రాధాన్యం వహించి వుంటుంది. ఇన్ని సంగతు లుండగా మా ఆంధ్రసోదరులు దుడుంగు పంటే గేలం వేసి యిలాగ హిందీని పట్టుకుని పాకులాడడం ఆత్మహత్య తప్ప మరేమీ కాదు.

(సంపాదకుడు)

౧

"అయ్యా, ఆగస్టు సంచిక "ప్రబుద్ధాంధ్ర" ఇప్పుడే అందింది. చూశాను. నావ్యాసం నేను కోరిన ప్రకారం ఈసంచికలో చేర్చినందుకు కృతజ్ఞుణ్ణి. మీరు నావ్యాసాన్ని గురించి రాసిన దానిమీద ఒక్క ముక్క రాయదలుచుకున్నాను. ప్రచురణార్థం కాదు. చేస్తే వద్దనను.

ఒక్క విషయం గమనించండి. ఒక్క నాగేశ్వర్రావుగారి ఆదర్శం తప్ప మిగిలిన విషయాలను గురించి మీతో నాకు పేచీలేదు. మీరు తూకంగా చెప్పే ముక్కలకూ అభిప్రాయాలిచ్చేవాళ్లి గొర్ర దాటుకూ ఏమీ సంబంధం లేకుండా ఉంటున్నది. హిందీప్రచారకుల్ని నేను హద్దులో ఉంచవద్దన్నానా? మీరు చెప్పిన ఉదాహరణలను తాకపోవటానికి నాసమ్మతే కారణం. నాకు హిందీ వ్యామోహం ముమ్మరంగా వుందని ఎట్లా గ్రహించారో తెలీదు. నాకు హిందీ అక్షరాలైనా వచ్చునని ఎవరికీ తెలీదు. హిందీ అర్థం చేసుకోవటం సుమారుగా మాట్లాడగలగటంతో, నాపని అయిపోయింది కూడా స్పష్టంగా చెప్పను. ఇక నాగేశ్వర్రావుగారు చెప్పిన ముక్క నాకు ముచ్చటగా ఉండటానికి కారణం ఆయన చెప్పిన సంభవమని కాదు. చాలా ఆశయాలు గొంతెమ్మ కోరికలుగానే ఉంటై. కాని నేను ముచ్చటపడ్డది నాగేశ్వర్రావుగారు తెలుగుసారస్వతానికి శరీరద్రవ్యాలిస్తూ కూడా భావిస రాజకీయంతో గల సంబంధం గ్రహించినందుకు. నాగేశ్వర్రావుపంతులుగారంత అజ్ఞాని అని భావించుకున్నా హిందూదేశంలో హిందీ తప్ప మిగిలిన భాషలన్నీ నశిస్తవని నమ్మినట్లు అనుకోటానికి కారణం లేదు. అటువంటి నమ్మకం ఏరోజున కలిగితే ఆరోజునించీ భారతీ ఆంధ్రపత్రికలు హిందీలోనే వచ్చేవి. వాటి సర్క్యులేషను కూడా పెరిగే ఉండేదేమో!— పరిస్థితులు చూస్తే.

పత్రికల విషయం మీరు చెప్పింది చూడండి. ఇంగ్లీషు పత్రిక కొనేవాడు భాష అభివృద్ధి చేసుకోటానికి కొనడు. హిందీ వచ్చీ రానివాడు కూడా భాషకోసం హిందీపత్రిక కొంటాడు. ఇక ఇంగ్లీషు తెలుగు పత్రికల్లో ఒక తారతమ్యం ఉంది. ఇంగ్లీషు అర్థమైన వాళ్లలో కూడా సగం మంది ఇది పిచ్చి ఇంగ్లీషు, ఇది మంచి ఇంగ్లీషు అని చెప్పలేరు. తెలుగట్లా కాదే! తెలుగు పత్రికలు బాగుపడాలంటే తెలుగుపత్రికలు బాగుపడటమే మార్గం కాని ఇతర పత్రికలు పడిపోవటం కానే కాదు. మీరా పాయింటు గ్రహించవలసిందే కాని వాదవ లాభం లేదు. ఆంధ్రుల్లో పదిహేను వీసాలు ఇతర భాషల వెంట పరిగెత్తినా మనం అధైర్యపడవలసిన అవసరం లేదంటున్నాను. కాని మీరు ఒక్కటి రుజువు చెయ్యగలిగితే నేను రాసిన వ్యాసం వ్యర్థమౌతుందని ఒప్పుకుంటాను. హిందీ నేర్చుకునేవాడు తెలుక్కి సహాయం చెయ్యటం అసంభవమా? అయితే హిందీ పోతే గాని తెలుగు నిలవదు. నామట్టుకు నాకా అనుమానం లేదు. ప్రతి ఆంధ్రుడూ హిందీ నేర్చుకుని కూడా తెలుగు అభివృద్ధికి అడ్డం లేకుండా ఉండవచ్చును. తెలుగు వదిలి హిందీ ఎత్తుకోండి అని ఎవడైనా ప్రచారం చేస్తే వాళ్లవల్ల తెలుగుకు కలిగే లాభం లేదు. ఇంకొకటి గమనించండి. వీధి పక్కన మురుగు కాలవలు తప్పవు. జైలుకు పోయిన వాళ్లలో ఎటువంటి వాళ్లున్నారో చూడండి. ప్రచారకులు—హిందీప్రచారకులు కూడా అంతే. వాళ్లకోసం ఎదురు ప్రచారం ఎందుకు చెయ్యాలో నా కర్థం కాలేదు.

మీరు చెప్పే దానికీ ఇతరులు చెప్పే దానికీ సంబంధం లేకుండా ఉంది. వాళ్లను మీరు వెనకేసుకొస్తే లాభం లేదు.

నావ్యాసం చిత్తు రాసి తిరిగి రాయటంలో "ఆంధ్రభూమి" పేరు ఎట్లా వదిలేశానో వదిలేశాను. కాని నేను రాసిన దాన్లో ఆంధ్రభూమికి సమాధానం "హిందీ, తెలుగుపత్రికలు" అనే ఘట్టంలో ఉంది. గమనిస్తారు గాక! సెలవు"

—కొడవటిగంటి కుటుంబరావు

(ఆంధ్రభాషలో ప్రావీణ్యమూ, ఆంధ్రరచనలో చాతుర్యమూ, ఆంధ్రత్వాన్ని గురించి గర్వమూ వుండే ఆంధ్రుడెలా రాయాలో కుటుంబరావుగారలా రాశారు. చాలా సంతోషం. ఇక మేము జవాబు చెప్పవలసింది ఒక్కటే ప్రశ్న. "హిందీ నేర్చుకునే వాడు తెలుక్కి సహాయం చెయ్యడం అసంభవమా?" ఎంత మాత్రమూ కాదు; కాని ఆసంకల్పం వుండాలి. "మనం పరభాషలు నేర్చుకున్నందుకు ఆభాషలలో వున్న మహాగ్రంథాలన్నీ, ఉత్తమవాఙ్మయం అంతా మన భాషలో వుండా" లనే ఆశ వుండాలి. "మన వాఙ్మయం సర్వాంగ సుందరంగానూ, ఇతర్లకి లోభం పుట్టించేదిగానూ వుండా" లనే ఆవేదన వుండాలి. ఇది వున్నవాడు హిందీ ఒక్కటే కాదు ఎన్ని భాషలు నేర్చుకున్నా ఆక్షేపణ వుండదు. నేర్చుకుంటే లాభం కూడాను. నేర్చుకోవడం అవసరమున్నూ. అయితే యిప్పటి హిందీ ప్రచారం యిందుకనుకూలంగా జరుగుతోందా! వృత్తివిద్యలు కూడా హిందీలోనే చెప్పాలన్న ఆప్టేగారి వుద్దేశమూ, హిందీని మనం వ్యావహారికంగా వాడుకోవాలనే పీసపాటి సుబ్బారావుగారి అభిప్రాయమూ, గమనిస్తే దక్షిణభారతదేశంలో యీ హిందీప్రచారం దేనికోసం జరుగుతోందో వేరే చెప్పనక్కరలేదు. ఈ సంచికలో ఒక రాష్ట్రభాషావిశారదుని లేఖ కూడా వుంది. దాన్ని చూస్తే హిందీమానవప్రముఖుల ప్రయత్నాలు ఆంధ్రభాషని అణుక్కి తొక్కెయ్యడానికే అని స్పష్టంగానే బోధపడుతుంది. అయితే యీ ప్రయత్నాలు నెరవేరి తెనుగు నిజంగా చచ్చే

పోతుందా అని కుటుంబరావుగారి సందేహం. మే మీ ప్రచారకుల మాటల నెందు కుదాహరించామో కుటుంబరావుగారు బాగా యోచించవలసి వుంది. గృహలక్ష్మి కూడా యీ సంగతి గమనించకుండా యేమి టేమిటో రాసింది. ఏదో వొక ప్రయోజనం కోరి మన వారు నేర్చుకుంటూ వున్న ఇంగ్లీషు సకలవిషయాలలోనూ మన నెలా ఆక్రమించేస్తోందో తెలుసుకుంటే, ప్రారంభంలోనే ఆత్మగౌరవాన్ని చంపిన హిందీ ముందు ముందు మన కింకా యెలాంటి స్థితి కలిగిస్తుందో బోధపడుతుంది. సంపాదకుడు)

౨

“అయ్యా! ఆంధ్రదేశంలో హిందీప్రచారం విషయంలో తాము ఒక్కసారి ఆంధ్రుల దృష్టిని అంతర్ముఖం చేసినందుకు వంద్యులు. మీరు పూరించిన భయంకరనాదం దాదాపు అన్ని తెలుగుపత్రికల్లోను మారుమోగింది. అనుకూల ప్రతికూలము లైన చర్చలు జరిగినాయి. వీటిని బట్టి మనం కొన్ని సారాంశాలు తేల్చుకోగలిగి ఉన్నాము. ఈవిషయం నిజానికి నన్ను కూడా కొంత కలచిందే అవడంచేత ఒక్క సూచన చేస్తున్నాను.

ఇంతవరకూ సాధారణంగా అంతా అంగీకరించిన సారాంశా లేమంటే (౧) భారతవర్షం యొక్క రాజకీయ పురోభివృద్ధికి ఒక సామాన్య భాష అత్యవసరం. (౨) హిందీ మాత్రమే అనేక హేతువులచేత ఆస్థానం ఆక్రమించుకోగలుగుతుంది. (౩) అందుచే హిందీప్రచారం అవశ్యంగా జరగవలసిందే. ఇంక వివాదాంశ మేదంటే ఈప్రచారవిధానాన్ని గురించి. నిజమే; కొంతమంది ప్రచారకుల అమితోత్సాహావేశాలు మాతృభాషాభివృద్ధికి ప్రతిబంధకంగా కూడా పరిణమిస్తూన్న వన్నమాట కాదనడానికి వీల్లేదు. ఇందుకు మీరు కష్టించి ఆంధ్రపత్రికలోనుంచి ఎత్తి వ్రాసిన హిందీప్రచారకుల ప్రసంగాలే తార్కాణం. ఈస్థితిలో హిందీ ఆవేశంలో ఆత్మవిస్మృతికి లోనై కొట్టుకుపోయే ప్రచారకుల దృష్టిని ఒక్కసారి ఆత్మశోధన వంకకు త్రిప్పటం అవసరమే అని నేనున్నూ తలుస్తాను. చాలా మంది హిందీప్రచారకులు దేశసామాన్యభాష అయిన హిందీకిన్నీ మాతృభాష అయిన తెనుగుకున్నూ గల తారతమ్యం సరిగా గుర్తించినట్లు తోచదు. కారణం వారిలో తెనుగు సంస్కారలోపమే. తెలుగు బాగా నేర్చుకుండానే హిందీ అభ్యాసం చెయ్యడంవల్ల ఈలాటి విపర్యాసం కలుగుతూన్నది. నిజానికి, శివన్నశాస్త్రిగారి లాగు తెలుగు పాండిత్యం గడించి కాని అథవా, కొంతయైనా తెలుగు పరిజ్ఞానం అలవర్చుకొని కాని హిందీ నేర్చుకొని ప్రచారకులుగా పని చేసే వారు నేటి ప్రచారకుల్లో ఎందరు ఉన్నారు? తెలుగు పరిచయం లేని హిందీప్రచారకులనుంచి ఇంతకంటె యెక్కువ ఆశించడం కూడా పొరపాటే. అందుచే మాతృదేశాభివృద్ధికి ముందుగా మాతృభాష, ఆతర్వాత రాష్ట్రభాష ముఖ్యమని గ్రహించి ఉభయభాషావిదు లైన హిందీప్రచారకులను తయారుచేస్తే మీరు భయపడే అనర్థకములకు తావు లేకుండా పోతుంది. అప్పుడు హిందీప్రచారకులు ఆంధ్రభాషాభిమానంతోటీ, ఆంధ్రభాషాజ్ఞానంతోటీ నిండి హిందీప్రచారానికి మట్టుకే కాక ఆంధ్రాభ్యుదయానికి కూడా తోడ్పడగలుతారు. అందుచే హిందీప్రచారకులుగా పని చేయగోరే వారంతా ముందుగా తమ దృక్పథాన్ని మార్చుకోవడమున్నూ తమ తెలుగు జ్ఞానం విస్తరింప జేసుకోవడమున్నూ మంచి దని నాసలహా. ఈలాగయితే వీరి తెలుగు వేషభాషలు ఏమాత్రమున్నూ వికృతి పొందవు. వీరు హిందీని మరింత సులువు పద్ధతుల్లో బోధించగలుగుతారు. వీరు తాము ప్రచారం చేసే పల్లెపట్టణాల్లో కొడిగారుతూన్న తెలుగు దీపానికి కొంచెం తైలం పోసినవా రవుతారు. వీరివద్ద తరిఫీదు అయే విద్యార్థుల్లో తెలుగు అభిమానం చిగిరింప చేస్తారు. వారి దృష్టిని తెలుగు

పత్రికలమీదికీ, పుస్తకాల మీదికీ కూడా ప్రసరింప చేస్తారు. ఇంతే కాక తాము నేర్చిన హిందీలోని సద్విషయాల్ని తెలుగులోకి మార్చి తెలుగువాఙ్మయాన్ని విశాలపరుస్తారు.

హిందీ ప్రచారకులారా! ఈఅలజడి కేవలం హిందీమీది అసూయచేతనే పుట్టిందని అనుకోకండి. దీని పరమార్థం మీరు బాగా గ్రహించి హిందీ దేశభాషలకు సైదోడు మాత్రమే కాని శత్రువు కాదనిన్ని. హిందీకి తెలుగు యిళ్లల్లో తావు ఇవ్వడం కొంపకు ముప్పు తెచ్చుకోవడం యే మాత్రం కాదనిన్ని, భారతజాతీయత ఆంధ్రత్వసిద్ధికి విరుద్ధం కాదనిన్ని మీరు మీనడవడిచేతను, ప్రచారపద్ధతులచేతను నిరూపించవలసియున్నారు.

—మంగిపూడి పురుషోత్తమశర్మ

(మా మిత్రులు పురుషోత్తమశర్మగారు మే మీ ప్రచారం మొదలుపెట్టక మునుపే హిందీవల్ల తెనుక్కి జరుగుతూ వున్న అపకారాన్ని గుర్తించి వున్నారు. వారప్పుడప్పుడు కాంగ్రెస్సు గుడారాల్లో హిందీ దురాక్రమణం విషయమై తమ అసమ్మతిని దృఢంగా వెల్లడిస్తూనే వచ్చారుట; అయితే తాము గ్రహించిన ఆపత్తును పత్రికల ద్వారా వారప్పుడే దేశీయులకు తెలియపరిచి వుండవలసింది. వారప్పుడలా చేసే వుంటే హిందీముగ్ధుల దుష్ప్రచారం యింత ముదిరిపోయీ వుండక పోవును. అస్మదాదు లిప్పుడింత నిక్కచ్చిగా ప్రతికూలప్రచారం చెయ్యవలసిన అవసరమూ లేక పోయి వుండును; కాని యేదో వాకానాక ప్రతిష్ఠ వారి నప్పుడీ పనికి పూనుకోకుండా ఆటంకపరిచి వుంటుంది. అయినా యిప్పుడేనా వారింత సరళంగా—యింత వివరంగా—యింత నిర్మొగమాటంగా హిందీప్రచారకుల వినాశకరప్రయత్నాలను బహిరంగపరిచి. యిది తప్పనీ, మాతృద్రోహమనీ ముక్తకంఠంతో చెప్పడం చాలా మంచి పని,... శర్మగారు ఆంధ్రభాషలో ప్రావీణ్యం లేని ఆంధ్రులు తమ వారిలో హిందీ ప్రచారం చెయ్యడం చాలా తప్పని ఖండితంగా చెబుతున్నారు. తమ దేశాన్ని తమకి తామై ప్రేమించ గలిగే వారూ, తమ భావయంత్రం యెప్పుడూ మాతృభాషలోనే పని చేస్తుందని గ్రహించుకో గలవారూ, తనకు తాలిన ధర్మానికి సిద్ధపడడం ఆత్మహత్య అని యెరిగి వున్నవారూ చెప్పవలసిన మాటే యిదీ,

సంపాదకుడు)

3

“శాస్త్రిగారూ! హిందీప్రచారము పట్ల మీరు వ్యతిరేకాభిప్రాయములు ఏల చూపుచున్నారు? ఏదియో యొక పక్షమూనం దుండుట ప్రతి పత్రికయొక్క స్వభావము. హిందీ ప్రచారము కావలయు ననెడి పత్రికలు కొన్ని. హిందీప్రచారము చేయకూడ దను పత్రికలు కొన్ని. ‚ఆంధ్రభూమి’ చంద్రిక. ప్రబుద్ధాంధ్ర, భారతి హిందీప్రచారమును ఎదుర్కొనుచున్నను, ఆంధ్రదేశములో హిందీప్రచారము తగ్గునని మాత్రము తాము కలలోనైనను తలువనుండురు గాక.

మీరు ఆంధ్రదేశములో స్థాపింపబడిన హిందీ మహావిద్యాలయములను గూర్చియే వ్రాయుచున్నారు గాని ప్రతి పట్టణములోను, ప్రతి పెద్ద గ్రామములోను స్థాపింపబడిన ఆంగ్లపాఠశాలలను గూర్చి వ్రాయరైరి. ఆంధ్రదేశములో నున్న హిందీవాగ్వర్ధనీమండలులలోను సభలలోను హిందీభాషయందే మాట్లాడవలె నన్న వారిని దూషించుచుండిరి. కాని ఆంగ్లపాఠశాలలో నుండు ‘Debating society’ లను గూర్చి మాటయైనను ఎత్తరైరి. కారణము ఏమియో తెలియకున్నది. మీకు వాస్తవముగ ప్రేమ ఆంధ్రభాషయందే యున్నచో ఆంగ్లభాషా ప్రచారము పట్ల గూడ వ్యతిరేకాభిప్రాయము చూపుట మంచిది. ‚హిందీ—తెలుగు’ హిందీ పెల్లువ

౪

"మహాశయా, అభినందనములు మీ 'హిందీ' దాడికి. తెనుగు మిసిమికి పస నిడ్డ తిక్కన మొదలుకొని మన తెలుగు భాషకి అన్నీ అవాంతరాలే. నేడు కలిగిన 'హిందీ' ఉపద్రవంనుండి ఆంధ్రభాషను మీరు తప్పించుటకు ప్రయత్నించడం బహుళంగా ఆంధ్రదేశీయుల్ని ఆకర్షించింది. 'గృహలక్ష్మి' మాత్రం హిందీవల్ల మన భాషకి ఉపద్రవం ఆట్టే కలగనేర దని గోడమీద పిల్లివాటంగా చెప్పినా, అన్ని పత్రికలూ మీ వాదాన్ని బలపరిచాయి. హాస్యరసపత్రి కైన 'వినోదిని' కూడా మీ యీ వాదాన్ని బలపరిచింది సంపాదకీయవ్యాసంలో. ఆంధ్రభాషకు మీ రీవిధంగా చేస్తున్న సేవ జూసి 'భళీ' అంటోంది ఆంధ్రమాత! మీరు ధన్యులయారు. అందుకు నా ధన్యవాదాలు అందుకోండి.

నేను కూడా మీ వాదాన్ని బలపరుస్తూ ఒక 'హిందీ' లేఖను పంపాను ప్రకటనార్థం: మీ వాదాన్ని యథాశక్తిగా నేను బలపరిచాను. 'హిందీ వెల్లువ ఆంధ్రభాష' మీద మేట వేయకుండా, మీరు కడుతూ ఉన్న చెలియలి కట్టకు 'ఉడుతాభక్తి'గా నేనూ సాయం చేస్తున్నాను.

కాని, ఒక అంశం:

స్వర్గీయ నెహ్రూగారి ప్రతిభ జాతీయవీరుడుగా సమరంలో సేనానిగా ఉండడంచేత నే గాక ఒక రాజకీయప్రణాళికను సిద్ధపరచడంలో కనపడింది. అట్లాగే మీరు యీ హిందీప్రచారం యొక్క హద్దు మీరడాన్ని ఖండించడమే గాకుండా, యిక ముందు హిందీప్రచారం ఆంధ్రభాషకి హాని కలక్కుండా నడపే విధానాన్ని సూచిస్తో ఒక ప్రణాళికను తయారు జేసి ద. భా. హిందీప్రచారకసభకి పంపితే బాగుంటుం దని నా అభిప్రాయం. సమాధానమార్గంగా మనం సంచరిస్తే ప్రచారకులు కూడా తల ఒగ్గక మానరు. ఉభయత్రా యిట్టి సామరస్యం ప్రయోజనకర మనే నేను తలుస్తాను."

దేవగుప్తాపు విశ్వేశ్వరరావు

౫

"తెలుగువారి హిందీ చదువు" వలన తెలుగున కపకారము జరుగుచున్న మాట వాస్తవము. ఇదివఱకింగ్లీషు చక్కటిదియే తెలుగున కపకరించుచుండునది. ఇపుడు హిందీ దానికి శత గుణముగా నపకరించుచున్నది. ఈయపకార మాభాషలవలన నగుచున్నది కాదు. వానిని జదివిన తెలుగువారి వలలనే సంప్రాప్త మగుచున్నది.

తెలుగువారిది వివేచన లేని ఉత్సాహము; ఆత్మహితము దెలియని ఆవేశము. దీనివలన వారికి పొసగు నవర్థము లనేకములు.

తెలుగువారు హిందీ రాష్ట్రభాష కావలె నను నిర్ణయము విన్నారు; హిందీప్రచార ప్రారంభము ను గన్నారు? అంతే, హిందీ చదువ ప్రారంభించినారు. ఇప్పటికి దక్షిణభారతమున హిందీ చదివిన, చదువుచున్న వారిలో సగము మందికి పైగా వారు తయారైనారు. తెలుగు కూడ మాని వేసి హిందీని చదివిన వారు వీరిలో ననేకులు. ఎన్ని భాషలు వచ్చినను మాతృభాషనే మాటాడవలయునన్న నియమము తదితరులకు; హిందీ వచ్చిన వారు హిందీలోనే సంభాషింపవలె నను నియమము తెలుగువారికి. తెలుగే వలదు; హిందీనే చదువు డనియు ప్రబోధించువారు కూడ పలువురు. ఊరూర హిందీ పాఠశాలలు వెలసినవి తెలుగు నాట. ప్రచారకులు ననేకులు. ఇది యంతయు తెలుగువారి నిరుపమదేశోద్ధరణవాంఛను ప్రకటించుచున్నది. ఇది యెంతవఱకు సఫలము కాగల దో ఊహించుట కిపుడు సాధ్యము కాదు; కాని,

దీని వలన ప్రకృతము వారి మాతృభాషకు మాత్రము మహోపద్రవము కలుగుచుండుట నిక్కము.

హిందీ చదివిన తెలుగువారు ఏది మాటాడినను ఏది వ్రాసినను అంతయును హిందీ సంప్రదాయములతో నింపివేయుచున్నారు. ఇందువలన వికృతస్వరూపము, విపరీతస్వభావము తెలుగునకు ఏరుపడినవి. దాని తీయదనము దిగజారిపోయినది; దాని వ్యక్తిత్వమునకే హాని యగుచున్నది. 'దేశభాషలందు లెస్సయది' యను ఖ్యాతి గనిన తెలుగునకు నేటికీ తీరని చేటు వాటిల్లినది. దాని తీరుతీయముల మేలితనమును తెలిసిన సహృదయుల కిది దుస్సహము. కావుననే దేశమున నలజడి పుట్టినది. తెలుగు తెలుగు దనమును కాపాడుకొనవలె నను హెచ్చరికలు నలుమూలల మారుమ్రోయుచున్నవి. ఈప్రబోధము న్యాయ్యేతరము కానట్టి కర్తవ్యము.

హిందీ రాష్ట్రభాష యగుట కెవ్వరికిని విప్రతిపత్తి యుండ బనిలేదు—దేశక్షేమము కోరని దేశీయు లుండరు కాన. హిందీ యెడ ద్వేషము నుండ బని లేదు. కాని ప్రతివారికిని మాతృభాష యెడ నాదరము బరమావశ్యకము; తదుద్ధరణము ప్రథమకర్తవ్యము. నాయకులు నిఖిలభారతదేశమున కొక రాష్ట్రభాష కావలయు నన్నారు దేశవ్యవహారముల నడుపుకొనుటకు. వా రెవ్వరు నెన్నడు మాతృభాషలకు స్వస్తి చెప్పు డని శాసింపలేదు. తాము నట్లు చేయలేదు.

అరవలు, కన్నడులు, మలయాళులు, ఇతరులు హిందీని నేర్చుకొనుచున్నారు. కాని వా రెవ్వరును తెలుగువారి వలె మాతృభాషను పాడుచేసికొనలేదు. వివేకులు స్వవిషయములయం దెప్పుడును జాగ్రత్త గలిగియే యుందురు.

తెలుగువారి యజాగ్రత్త, యవివేకము వారి భాషకు నీ తీరున చెరుపును కలిగించుటయే కాక దేశనాయకులకును అపకీర్తికళంకమును దెచ్చిపెట్టునవి. ఇక నయినను ప్రబుద్ధు లయి తెలుగువారీ రెంటిని దూరముగ పోబెట్టుదురు గాక!

భారతి (ఆగష్టు)

౬

“మైసూరులో శ్రీమతి సరోజనిదేవి హిందీ ప్రచారసభ్యుల కుపదేశించుచు నిటుల ప్రసంగించెను:

“మీరు చాల మంచి పని చేయుచున్నారు. ఒక ప్రాంతమునుండి మరియొక ప్రాంతమునకు బోవువా రొకరి భావముల నొకరు దెలుసుకొనుటకు సాధారణ మగు జాతీయభాష యొక టుండవలయును. ఉత్తరదేశపు స్త్రీపురుషులు వచ్చినపుడు వారితో సంజ్ఞలతో మాట్లాడెదము. అంతకన్న వారి భావము లేవో తెలుసుకొనజాలము. అందుచేతనే గాంధిమహాత్ముడు హిందీ జాతీయభాషగ నుండవలె నని నిర్బంధముగ నాదేశించెను. కాని మీరు యెంతవరకు ప్రవేశ ముండవలెనో యోచించుకొని హద్దులను దెలుసుకొనవలెను. ఈసంస్థానమునందు కన్నడమే దేశభాష. కన్నడభాషనే యిచటి పౌరుడు పెంపొందించవలెను. ఈహద్దులను తెలుసుకొని మీరు చేయుచున్న చక్కని ప్రచారమును జేయవచ్చును. కబీరు మహాత్ముని సుందరహిందీ నాగమృతము గ్రోలి భారతదేశమం దన్ని జాతులకును సన్నివేశము సమకూర్చవచ్చును.”

“ఈవాక్యము (లు) అను ఆంధ్రమాతృభాషాభిమాను లందరును గమనింపదగినవై యున్నవి. హిందీప్రచారము జేయు నాంధ్రు లందరును యోచింపదగును” ౬—౯—౩౮ ఆంధ్రపత్రిక



# మధురపూడి శాసనము

మారేమండ రామారావుగారు. ఎం. ఏ. బి. ఇడి.

రాజమహేంద్రవరమునకు ఏడున్నర మైళ్లు దూరమున గోకవరం రోడ్డుకు అర మైలు దూరములో మధురపూడి గ్రామము గలదు. ఆయూరి చెరవులో నేదియో వ్రాత గల యొక పెద్ద రాయి గలదని కొంతమారు వాస్తవ్యులైన శ్రీయుత నేదూరి గంగాధరంగారు నాకు తెల్పిరి. అంతట నేనును నామిత్రులగు శ్రీయుత చేకుమళ్ల కామేశ్వరరావుగారును పోయి యారాతిని పరిశీలించితిమి. రాయి సుమారు రెండు గజముల పొడవును, అడుగున్నర వెడల్పును, అడుగు యెత్తును గలది. నీటిలో నుండి దీనిని బయటికి దీయుటకు ౨౦ మంది మనుష్యుల సాహాయ్యము కావలసి వచ్చినది. ఈరాతిపై నొక వైపు గరుత్మంతుడును, సూర్య చంద్రులును చెక్కబడి యున్నారు. నాల్గవ వైపున ౧౬ పంక్తులలో తెలుగు భాషలో నీక్రింది శాసనము చెక్కబడి యున్నది. ఇందు మొదట కాటయ వేముని ప్రశంసించు నొక సంస్కృత శ్లోకము మాత్రము గలదు.

## మూలము

౧. నప్తా కాటయశౌరేః పౌత్రో మా
౨. రస్య కాటనృపసూనుః (౧) వీరాంనహో
౩. తన్నృపతే ర్జామాతా జయతు వేమ
౪. భూపాలః (౨) స్వస్తిశ్రీ శకవరుషంబు
౫. లు ౧౩౨౬ లగు నేంటి తారణసంవ
౬. త్సర పుష్య సు ౧౦ గు నాంటి మకర
౭. సంక్రాంతి పుణ్యకాల మందూను
౮. కాటయరెడ్డి వేమారెడ్డింగారు తమ
౯. స్వామి అైన కొమరగిరిరెడ్డింగా
౧౦. రికి అక్షయసుకృతము లవునట్టు
౧౧. గాను మదురపూండి కొమరగిరి పు
౧౨. ర మని......శ్రీగౌతమీ తీరమం
౧౩. దున్న వేదాద్రి శ్రీవరాహ దేవరకు
౧౪. ఆచంద్రార్క స్థాయిగాను ధార వో
౧౫. సి మహాపుణ్యాంం సేశిరి. మంగళ మహా
౧౬. శ్రీ శ్రీ జేయున్.

## దాత

ఈశాసనమును వేయించిన వాడు రాజమహేంద్రవర రెడ్డిరాజ్య స్థాపకుడగు కాటయవేమారెడ్డి. ఇతఁడు కొండవీటిని పాలించిన రెడ్డిరాజులలో ప్రోలయవేమారెడ్డికి ప్రాత్రీపతి. అనపోతారెడ్డికి అల్లుఁడు. కుమారగిరిరెడ్డికి చెల్లెలి భర్త, మేనమరది.

## కాలము

కాటయవేముడు శా. శ. ౧౩౨౬ తారణ సంవత్సర పుష్య శుద్ధ దశమీ గురువారమునాడు ఈశాసనములో చెప్పబడిన దానమును చేసెను. ఇందలి శకసంఖ్యాదికము క్రీ. శ. ౧౪౦౫ వ సంవత్సరము, మార్చి ౧౮ వ తేదీ యగుచున్నది.

## విశేషాంశములు

రెడ్ల చరిత్రమున కీశాసనము మిక్కిలి ముఖ్యమైనది. కుమారగిరిరెడ్డి రాజధాని యగు కొండవీటిలో విద్యావినోదములతో కాలము బుచ్చుచుండ నతని మరదియు మంత్రియు నగు కాటయ వేముడు రాజకార్యముల చక్కబెట్టుచు నుండి, గోదావరీనది మొదలు సింహాచలము వరకును గల దేశమును జయించెను. అందువలననే యీ శాసనమున కాటయవేముడు కుమారగిరిని తన 'స్వామి' యని పేర్కొనినాడు. ఇప్పటి మధురపూడికి కాటయవేమునిచే కుమారగిరిపుర మను పేరు పెట్టబడె నని యీశాసనము తెల్పుచున్నది. ఈ గ్రామమునే గాక కాటయవేమారెడ్డి యనేకస్థలముల కుమారగిరి పురము అను దానముచేసెను. ఇట్టి కొన్ని గ్రామముల సమూహమున కాతడు కుమారగిరిమండల మని కూడ పేరిడెను. (E. R. ౧౯౧౫ P. ౧౧౫ Para ౫౬.)

## సమస్యలు

ఈశాసనమువలన కొన్ని సమస్య లేర్పడుచున్నవి. అందు మొదటిది క్రీ. శ. ౧౪౦౫ నాటి యీశాసన సంవత్సరమున కుమారగిరిరెడ్డి జీవించియుండెనా యనునది. క్రీ. శ. ౧౪౦౦ ప్రాంతమున ఆరెడ్డిరాజు తన రాజ్యమును రెండుగ విభజించి, యందలి తూర్పు భాగమునకు రాజమహేంద్రవరమును రాజధానిగా చేసి కాటయవేమారెడ్డి కొసంగెను. క్రీ. శ. ౧౪౦౪ నుండియు పెదకోమటి వేమారెడ్డి కొండవీటిని పరిపాలించె నని శాసనములు తెల్పుచున్నవి.

దీనిని బట్టి కుమారగిరి యాసంవత్సరముననో; అంతకు బూర్వమో మరణించె నని తోచుచున్నది. కాని కుమారగిరిరెడ్డి జీవించియుండగనే యతనిని రాజ్యచ్యుతుని జేసి పెదకోమటివేముడు కొండవీటి సింహాసనము నధిష్ఠించె నని శ్రీయుత చిలుకూరి వీరభద్రరావుగారును (ఆం. చ. 3 భా. పే. ౧౯౩) "కుమారగిరి ౧౪౦౩ వరకును రాజ్య మేలెను. అత డటు తర్వాత గూడ నాలుగు దేండ్లు జీవించియున్నట్టున్నాడు." అని శ్రీయుత వేటూరి ప్రభాకరశాస్త్రిగారు (శృ. శ్రీ. పే. ౯౧) నభిప్రాయపడియున్నారు. క్రీ. శ. ౧౪౦౦ లో నే కాటయవేముడు రాజమహేంద్రవరరాజ్యమునకు వచ్చియుండును. క్రీ. శ. ౧౪౦౪ లో కుమారగిరి మరణించి యుండినచో, మరుసటి సంవత్సరము కాటయవేముడు కుమారగిరిని తన 'స్వామి' యని పేర్కొని, యతని కక్షయసుకృతముగా మధురపూడిని దానము చేయుట పొసగనేరదు. కాన పైన చెప్పబడిన శ్రీప్రభాకరశాస్త్రిగారి యూహననుసరించి, యీశాసనకాల మగు క్రీ. శ. ౧౪౦౫ వరకును అనగా పెదకోమటి వేముని రెండవ రాజ్యసంవత్సరమున గూడ కుమారగిరిరెడ్డి జీవించియుండె నని తోచుచున్నది. ఈశాసనమునుండి బయల్వెడలు రెండవ ప్రశ్న గౌతమీతీరమం దున్న వేదాద్రి యేది? యనునది. శ్రీనాథుడు తన కవితాసంపదకు కమలాచలముపై నుండు మార్కండేయుడును, వేదాద్రిపై నుండు నరసింహస్వామియు కారణము అని కాశీఖండమునందు జెప్పియున్నాడు. దీనిని బట్టి యీ వేదాద్రి రాజమహేంద్రవరమునం దుండెడి దనియు దానిపై నృసింహస్వామి యుండెడివా డనియు స్పష్ట మగుచున్నది. ఈగిరియు నాలయమును గూడ నేడదృశ్యము లైనవి. కంభంవారి సత్రము వెనుక నుండు నాలయములోని దేవుడు వేదనరసింహస్వామి యనియు, నతనికే వరాహనరసింహస్వామి యని కూడ మరియొక పేరు పూర్వ ముండెడి దనియు, ౯౫ సంవత్సరములు జీవించి రెండేండ్ల క్రితము మరణించిన మా తాతగారు చెప్పుచుండిరి. దీనిని బట్టి మధురపూడి శాసనములోని వేదాద్రి వరాహదేవర నేడు కంభంవారి సత్రము వెనుక నున్న గుడిలోని నరసింహస్వామి యగుట కవకాశ మేర్పడుచున్నది. రైల్వే వంతెన వద్ద పుష్పగిరియు, నేటి మార్కండేయాలయము వద్ద కమలాద్రియు, కంభంవారి సత్రము వద్ద వేదాద్రియు గౌతమీతీరమున పూర్వ ముండెడి వేమో! మధురపూడి గ్రామము కోరుకొండకు ఐదుమైళ్ల దూరములో నున్నది. అచ్చట నొక నాయకవంశీయులు రాజ్యము చేయుచుండిరి. అట్టి సందర్భమున కాటయవేమారెడ్డి కోరుకొండకు మిక్కిలి సమీపమునందున్న మధురపూడి నెట్లు దానము చేసె నను మూడవసమస్య ప్రకృతశాసనమూలమున బయల్వెడలుచున్నది. కోరుకొండ కైఫీయతులో రెండవ ముమ్మిడినాయకుడు కోరుకొండలో క్రీ. శ. ౧౩౯౫ వరకును రాజ్యము చేసె ననియు నటుపై కాటయవేమారెడ్డి యీరాజ్యమును జయించి, కోరుకొండ దుర్గములో కొంత సైన్యము నుంచె ననియు చెప్పబడియున్నది. క్రీ. శ. ౧౪౦౦ నాటికే యీరెడ్డిరాజు రాజమహేంద్రవరమున కేతెంచె నని యిదివరలో చెప్పియుంటిమి. కోరుకొండకు సమీపమున నున్న మధురపూడిలోని ప్రకృతశాసనము కాటయవేముడు ౧౪౦౦ ప్రాంతమునందే కోరుకొండను జయించె నను కోరుకొండ కైఫీయతులోని యభిప్రాయమును బలపరచుచున్నది.

# వ్యాఖ్యానములు

ఆంధ్రమహాసభ

"దీన్నెందుకు జరిగించాలి? దీనివల్ల లాభం యేమిటి?" అని శ్రీసాధన పత్రికలో వొక ఆంధ్రుని ప్రశ్న.

మంచిదే. ఇందులో రహస్యసందర్భాలేమీ లేవు. ఆంధ్రు డిలా అణగఅణగిన స్థితిలో వుండడమే యీసభని సమావేశపరిచి తీరాలని గొంతెత్తి చెబుతోంది.

ఇది సంపూర్ణస్వరాజ్యాన్ని సాధించడం కోసం బయలుదేరలేదు. డొమినియన్ స్టేటస్సు సంపాదించడానికి పూనుకోలేదు. దొరతనం చివరి కేమిటిస్తే దానితోటే తృప్తిపడడానికిన్ని యిది సిద్ధపడలేదు.

ఆంధ్రమహాసభకి ఇవి ప్రాప్యాలు కావు. పరమావధులున్నూ కావు.

ఆంధ్రమహాసభకి రాజకీయకల్లోలాలతో సంబంధం లేదు. దేశీయుల సంపర్కైకతాటిమీద నడిపించడమే దీని వుద్దేశం; కాని నలుదిక్కులా చెదరగొట్టడం కాదు.

భిన్న ప్రభుత్వాలకు చెంది వున్నా, భిన్నవాతావరణంలో వుండినా జాతిని బట్టీ, భాషని బట్టీ, సంప్రదాయాన్ని బట్టీ ఆంధ్రుడైన ప్రతివాని రక్తమూ వొక చోట పుట్టిందే అని బోధపరిచి, వుడుకెత్తించి ఆంధ్రునికి హిందూసభ్యతలో ఉన్నతమైన పదవి భుక్తపడేటట్టు చెయ్యడమే ఆంధ్రమహాసభ పని.

దీనికి ముందు,

"ఆంధ్రు డంటే యెలాంటివాడు? ఆంధ్రజాతి యొక్క ప్రత్యేకత యేమిటి? ఆంధ్రుని పూర్వాన్నత్యం యొక్క పరిమితి యెంత? అది పూర్వపక్షం అయి పోడానికి కారణం యేమిటి?" ఆంధ్రుని హృదయంలో ఈజిజ్ఞాసని రాజబెట్టాలి.

"ఆంధ్రుని ప్రస్తుతస్థితి యేమిటి? మళ్ళీ సాధించ తగిన ఫలం ఏమిటి?" ఆంధ్రుని బుద్ధికి యీ వొరపిడి కలిగించాలి.

"దిగ్భ్రమ కలిగించే అనేక కర్తవ్యాలు గల యీ సమయంలో ఆంధ్రునికి ముఖ్యకర్తవ్యం యేమిటి? దానికి సాఫల్యం కలిగించే కార్యక్రమం యెట్టిది?" ఆంధ్రుని మస్తిష్కంలో యిలాంటి యోచన రేకెత్తించాలి.

"తోటివారంతా ముందుకి పోతూండగా నేనింకా వెనకనే వుండిపోయానే! సాటివారంతా తమ మౌలికత్వాన్ని నిలుపుకుంటూ వుండగా—బలపరుచుకుంటూ వుండగా నేనింకా వొకరి అడుగులలోనే అడుగులు వేస్తూ—వొకరి అజ్ఞల కోసమే చెవులొరజేసుకు చూస్తూ, దాస్యం చేస్తున్నానే! మౌలికత లేలివాడని నవ్వులాటపాలవుతున్నానే!" అని ఆంధ్రునికి ఆవేదన పుట్టించాలి.

"భారతదేశం అంతా విహారరంగంగా చేసుకుని, మహాసామ్రాజ్యాలు నిర్మించి, అనేక ప్రాంతాల వారిని పరిపాలించి—అయ్యో! నేడు భృత్యునిగా అనుచరునిగా—మట్టితలకాయవానిగా యీసడించబడుతున్నానే" అని ఆంధ్రునికి ఆవేశం కలిగించాలి.

ఇంత పని జరగాలంటే, ఇంత ఫలం కలగాలంటే యేమిటి దారి?

తోసిపారేస్తే పోదు. బూకరిస్తే చెల్లదు. కప్పెడితే ఆగదు.

మన కిప్పుడు ఆంధ్రమహాసభ వొక్కటే ఆధారం. ఆంధ్రమహాసభ వొక్కటే మళ్ళీ మనకి చైతన్యం కలిగించేది.

హైదరాబాదురాజ్యంలో ౧౦ సంవత్సరాల యీమధ్యకాలంలో తోటి మహారాష్ట్రుడు వొక్కడేనా కలవకపోయినా ౧౭ లక్షల ఆంధ్రులు మాహమ్మదీయమతంలో కలిసిపోయా రన్నా, బళ్లారిజిల్లాలో కన్నడుల ఔద్ధత్యాన్ని ఎదిరించలేక తొమ్మిదిలక్షల ఆంధ్రులొక్క తరంలో కన్నడులైపోయా రన్నా, మూడు మూర్తులా ఆంధ్రులైన చిత్తూరు మాండలికలు అయత్నంగా అరవలైపోతున్నా రన్నా—కారణం యేమిటీ? ఈసంగతులు మనలో అనేకులకు తెలవలే దంటే యేమన్న మాట? తెలిసినవా రేనా మక్కిన వేలలాగ కిమ్మనకుండా వూరుకున్నా రంటే యేమన్న మాట?

వోఢ్రులు వొక పెద్ద ఆంధ్రభూఖండాన్ని సాయంపట్టేస్తున్నారు. అక్కడి మనవారు మొదట కొంచెం ఆందోళనం సాగించారు; గాని యిటీవల మళ్లీ ఆత్మవిస్మృతి పొందారు. తమ హృదయంలో కెళ్లిస్తూ వున్న భాధ కంటే వారికి ఎక్కణ్ణుంచో వినపడ్డ మాటలు చురుకుపుట్టిస్తున్నాయి. కారణం.?

మన ఆంధ్రత్వం విరిగిపోయింది. మనలో మన పూర్వుల రక్తం యింకిపోతోంది.

కాని యింకా పూర్తిగా మరపు కలగలేదు. పునర్వికాసానికి అవసరాలైన సన్నివేశా లింకా పూర్తిగా నశించలేదు.

ఆంధ్రమహాసభని మళ్లీ సమావేశపరచండి. ఆంధ్రునిలో ఆంధ్రరక్తం మళ్లీ వుబుకుతుంది. ఆంధ్రతేజస్సు మళ్లీ విజృంభిస్తుంది. ఆంధ్రు డంటే సింహప్పిల్ల అని భారతదేశం అంతటా ప్రతిధ్వనింపచేస్తుంది.

మరిచిపోయారా? వొకప్పుడు ఆంధ్రమహాసభ మళ్లీ మనకి ఈఆశ పుట్టించలేదూ? ఈమూలనుంచి ఆమూలకీ, ఆచివరినుంచి ఈచివరికీ వొక్క ఆవేశతరంగాన్ని వురకించలేదూ?

రాయలసీమలో ఆంధ్రమహాసభ జరగా లని అక్కడివారి కెవరికీ కోరిక లేదంటాడు "ఆంధ్రుడు" వెర్రి మాట యిది. మూరురాయరగండడైన శ్రీకృష్ణదేవరాయ సార్వభౌముని సింగపురందకంటే ఆంధ్రమహాసభకి తగిన స్థలం యేం వుందీ?

మాకు తెలుసు. "ఆంధ్రుని" మనస్సులో ద్వేషం లేదు. అది వొకానొక సన్నివేశంవల్ల కలిగిన అసంతృప్తే గాని ద్వేషం కాదు ఆంధ్రులంతా త్రికరణశుద్ధిగా—ఎడతెగకుండా ఆంధ్రమహాసభని సేవించుకుంటూ వుంటే ఆ "వొకానొక సన్నివేశం" తటస్థించకే పోవును.

ఇప్పుడేనా మించిపోయింది లేదు. అనంతపురం మాండలికులూ, . మళ్లీ నూత్నావేశంతో ప్రారంభమైన శ్రీసాధనపత్రికా, యేప్పరంమకోలేని వైకల్యంతో క్షోభపడుతూ వున్న "ఆంధ్రుడూ" వెంటనే నడుములు కట్టి నిశ్చితమైన ఆంధ్రమహాసభని జరిపి ఆంధ్రజాతీయభావానికి మళ్లీ దృఢమైన పునాది వేస్తారు గాక.

## పొరబాటా? వుద్దేశమే యిదా?

"హిందీప్రవాహమునకై ఆనకట్టు నిమిత్తము ఆంధ్రరాష్ట్రమునం దక్కడక్కడ ప్రయత్నములు జరుగుచున్నవి. ఆ ఆనకట్ట మంచిదే. హిందీప్రచారకశిక్షణము బడయవచ్చిన మీ రందరు హిందీతో బాటు ఆంధ్రభాషాజ్ఞానమును సైతము సంపాదింపవలయును."

౨౯-౭-౩౮ ఆంధ్రపత్రిక. పేజీ ౪. కాలం. ౫

బెజవాడలో ఆంధ్రప్రాంతీయహిందీమహావిద్యాలయంలో జరిగిన ప్రచారక తరగతి ప్రారంభోత్సవంలో విద్యార్థుల్ని దీవిస్తూ మాగంటి బాపినీడుగా రన్న మాట లివి,

బాపినీడుగారు శుద్ధహిందూస్థాని పెద్దమనిషి మాట్లాడవలసినట్లు మాట్లాడారు.

బాపినీడుగారికి హిందీప్రచారం చేసే తెనుగువారికి తెనుగుభాషలో పాండిత్యం వుండా అన్న సంగతి తెలుసు అయితే వారు తెనుగులో పాండిత్యం సంపాదించి తరవాత హిందీ నేర్చుకోవడమా, లేక హిందీ నేర్చుకుంటూనే తెనుగు నేర్చుకోవడమా ?

ఇదీ ప్రశ్న. ఇది చాలా సున్నితమైనది. విషయం కూడా సూక్ష్మవిచారణ చేస్తే గాని బోధపడంది.

అసలు భాషాప్రచారం అంటేనే పాండిత్యంతో సంబంధించిన పని. హిందీప్రచారం చెయ్యడానికి తెనుగువాడు హిందీపాండిత్యం సంపాదించాలంటే మొదట తన తెనుగులో పండితుడైతే గాని అతను హిందీ నేర్చుకోవడం జాతీయతకి విరుద్ధం. అదీకాక, తనమాతృభాషలో పాండిత్యం కుదిరితే గాని తెనుగువాడు హిందీలో పాండిత్యం సంపాదించడమూ, ఆహిందీని తెనుగువారికి నేర్పడమూ కొనసాగవు. ఇలాగ రెండు భాషలలోనూ ప్రవీణుడైతే గాని అతనికి హిందీ ప్రచారకత్వయోగ్యత సిద్ధించదు.

అయితే బాపినీడుగారంత దూరం ఆలోచించలేదు. నిజానికి వారు ఆంధ్రభాషలో పండితులు కారు. హిందీలోనేనా పండితులని వారికి పేరు లేదు; వారు హిందీప్రచారకవిద్యార్థులికి హితోపదేశం చేశారు.

చేసిన ఉపదేశం యిలా వుంది.

కాశీశ్వరరావుపంతులుగారుకూడా, ప్రారంభోత్సవం నిర్వహిస్తూ జాతీయవిద్యని గురించి చాలా దూరం మాట్లాడారు; కాని వారు కూడా జాతీయతకి సరియైన నిర్వచనం గ్రహించినట్లు లేదు. వారు మన జాతీయవిద్యకి హిందీ ముఖ్యాంగం అన్నారు. ఇది చాలా తప్పు సిద్ధాంతం. హిందీ మనకి సామాన్యభాష మాత్రమే. విద్య వేరూ భాష వేరూనూ. జాతీయవిద్య మనకీ, అరవలకీ కన్నడులకీ, మహారాష్ట్రులకీ, బంగాళీలకీ, హిందూస్థానీలకీ—అందరికీ వొకటే. అయితే యేప్రాంతంవారి కాప్రాంతీయభాషలో అది నేర్పబడుతుంది. అలా నేర్పబడితేనే అది జాతీయవిద్య అవుతుంది.

సంగతి యిలా వుండగా మనవారిలో కొందరు హిందీ మనకి జాతీయభాష అని చెబుతున్నారు. జాతీయభాషకీ, సామాన్యభాషకీ వుండే అంతరం వారు గ్రహించలేదు. హిందీ అందరూ నేర్చుకు తీరాలనే సిద్ధాంతాన్ని ఆచరణలో పెట్టించడానికే వారిలా చెబుతున్నారు గాని వేరు కాదు. దక్షిణభారత దేశీయులను చివరికి హిందీనే మాతృభాషగా చేసే ఉద్యమానికిది ప్రాతిపదిక. నిజంగా వీరు ఏప్రాంతంవా రాప్రాంతీయభాషలో—తెనుగువారు తెనుగులోనే చదువుకోవాలని, అప్పుడే విద్యార్థులు సులభంగా విజ్ఞానాన్ని సంపాదించుకోగలుగుతారని గ్రహించలేక పోయేయెడల జాతీయవిద్యని గురించి వీరు మాట్లాడకూడదు. మన యునివర్సిటీలలో ఇంగ్లీషు ప్రధానభాషగా వున్నందుకు మన మందరమూ ఆక్షేపిస్తున్నాము. మన జాతీయవిద్యకి హిందీని ముఖ్యభాషగా అంగీకరించేయెడల యిక యింగ్లీషుని బహిష్కరించడం యెందుకూ ?

మొత్తానికి తెనుగుదేశంలో జరుగుతూ వున్న హిందీప్రచారం గోముఖవ్యాఘ్రంగానే వుంది.

(రివ్యూకోసం పుస్తకాలు పంపేవారు రెండేసి ప్రతులు పంపాలి. వొకటి పత్రికాభాండాగారానికీ, వొకటి రివ్యూ చేసేవారికిన్నీ. అలా పంపేవారి పుస్తకాలమీదే రివ్యూ త్వరగా ప్రకటన అవుతుంది. వొకొక్క ప్రతే వచ్చే పుస్తకాల మీద రివ్యూ ఆలస్యం అవుతుంది. అంతే. రివ్యూలు గ్రంథాన్ని బట్టి తద్జ్ఞులచేతనే రాయిస్తాము. వున్న నున్నట్టు రాసేవారిచేతనే రాయిస్తాము. కనక పుస్తకాలు పంపేవారు ఆరివ్యూలతోనే సంతృప్తి పడాలి. వాటిమీద పునర్విమర్శనలకు మా పత్రికలో తావియ్యలేము.)

౧౮ నేనూ, మాకాంతం

'కాంతంకథల'తో మునిమాణిక్యం నరసింహారావు గారు తెనుగు కథకుల్లో ఒక స్థానం సంపాదించారు. 'నేనూ, మాకాంతం' ఆస్థానాన్ని బలపరిచింది. ఇందులో సామాన్య సాంసారిక విషయాలు కొన్ని తీసికొని చిత్రించారు. 'సీత మొగుడు' 'పిలికొండలూ' తప్పిస్తే తక్కిన వాటిలో చక్కని గోరు వెచ్చని హాస్యం పోషింపబడింది. 'పిలికొండలు'లో కమల పరివర్తనానికి కారణం ఏమీ నిరూపించబడలేదు. ఆమెమార్పుకు కథకునివలెనే మనం కూడా "అది చిత్రమైన దైవసంఘటన" అని అనవలసి వస్తున్నది. కాంతంపాత్ర మొదటినుండీ చివరవరకు ఒక విధంగానే పోషింపబడింది. కాంతం అమాయకమైన ఇల్లాలు. ఆమె సాంసారిక హృదయం చాలాచోట్ల సున్యంక్తగా చిత్రించి చూపారు మునిమాణిక్యంగారు. అయితే ఈపుస్తకం కథలసంపుటము అనడంకంటె ఇదంతా ఒక కథాభాగం అనడం సమంజసంగా కనపడుతుంది. తదనుగుణ్యంగా పేరుకూడా సార్థకం గానే ఉంది......మిత్రులు మునిమాణిక్యంగారు కథకులుగా ఇపుడున్న స్థానంలోనే ఉండిపోక ఇంకో మెట్టుకూడా వెళ్ళాలంటాను.

—పురిపండా

ప్రేమతత్త్వము

౧౮

బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిలు గారుకవిగాకంటెపండితుడుగా ఎక్కువపరిచితులు, ఆంధ్రదేశానికి.

వీరు ఈపుస్తకపు పీఠికలో "నాజీవితములో సంఘటిల్లిన యాకస్మిక విపరిణామమునఁ దన్మయమై తదేకాగ్రమైన నాచిత్తవృత్తియే ఈగ్రంథముగాఁ బరిణమించినది" అని వ్రాయుటచేత ఇది యొక శాస్త్రగ్రంథముగా పరిణమించినది.

ప్రేమతత్త్వమును నిర్వచించుటకు కొండను తవ్వినారు. ఎలుక దొరకలేదు.

ప్రేమ అంటే వీరి దృష్టిలో మన కందరికి రూపాయిలమీద సినిమాల మీద పుస్తకాల మీద కుర్చీలమీద ఉండే మమకారమువంటిదిలాగ కనిపిస్తుంది. ప్రేమకు పర్యాయపదములుగ కూరిమి, వాంఛ, తమకము, ఇచ్ఛ అని శాస్త్రిలుగారు, వాడినారు.

"కామ స్సంకల్పో, విచికిత్సా, శ్రద్ధాఽశ్రద్ధాధృతి, రధృతి, ర్హ్రీ, ర్ధీ, ర్భీ, రిత్యేవంసర్వంమనః" ప్రేమకు ఈమనస్సు ఆశ్రయమట. ఈప్రేమవలన నవసరములు పుట్టునట. ఈఅనుగమము అప్రసిద్ధము. ప్రేమను స్థాయిగానుంచి రసములను సాధించి చూపినారు. కాని బీభత్సమునందును, భయానకమునందును, అద్భుతము నందును, ముఖ్యముగా నీయనుగమము కుదరదు. మొత్తముపై ఇందలి ప్రేమతత్త్వ నిర్వచనం దధివ్రీహిన్యాయగా ఉంది

ఇందులో ప్రాబంధికపు టను గమము సిద్ధింపచేయాలని చాలా ఉబలాటపడ్డారు. అటలవర్ణన ఆంధ్ర సంస్కృత కవులస్తుతి, మొదలయినవి ఈ పుస్తక విన్యాసానికి అరోవేలు. యతిప్రాసలకు పొల్లుపదాలు వాడడం సీసపద్యాలలో పొడుగు సమాసాలు కట్టటం ప్రాచీన వాసనకు లక్ష్యములు. ఏమైన శాస్త్రిగారు శ్రమించి వ్రాసిన ఈపుస్తకం ఏవిచక్షణుణ్ణి కదిపినా కృతార్థమే అవుతుంది.

హనుమదింద్రకంటి



# ప్రబుద్ధాంధ్ర

కలాభివర్ధనీపరిషత్తువారు ప్రకటింపబడు మాసపత్రిక

సంపాదకుడు:— శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

సంపుటము ౫ } రాజమహేంద్రవరము అక్టోబరు ౧౯౩౪ { సంచిక ౧౦

## అన్నంత పనీ జరిగింది

సుబ్రహ్మణ్యశాస్త్రి—సంపాదకుడు



"కట్టినవి నీరుకావి బట్టలూ, దిద్దింది క్రాపింగు జుట్టూనూ. ఎవ రయ్యా నువ్వూ!"

"అన్నార్తుల్లో వొకణ్ణండి"

"ఇదివరకే రోజుకి ముగ్గురు చొప్పున వున్నారు వారాల విద్యార్థులు. వొక్క శనివారం మాత్రమే యిద్ద రున్నారు. నువ్వు మూడో వాడవు తప్ప కుండా రావచ్చు"

"నా మనవి—"

"ఇంకా యేమిటీ? కోర్టుకి తొరగా వెళ్లిపోవాలే నేను?"

"నా సంగతి నిమిషాల్లో—"

"గంటకి అరవై నిమిషాలు"

"అయిదు చాలండి నా విన్నపానికీ, తమ సెలవు కూనూ"

"మోటా రెక్కబోతూ వుండగా—"

"నాలుగు—"

"అదీ యెక్కువే"

"మూడు—"

"కానియ్యి"

"నేను తమ సాయం—నే నిప్పు డున్న స్థితిలో అది సాయంలోనే చేరుతుం దండి"

"కానియ్య మన్నాను"

"నే నిప్పుడు వారం కోసం రాలే దండి"

"డబ్బు కావా లంటావా?:

"సరిగా అంతే నండి; కాని దానికి జీతం అని పేరు పెట్టా అని మనవి"

"కవిత్వం కడుతున్నావే! చమత్కార మైన వాడవే, అయితే యేం పని చేస్తావు నా దగ్గిర?"

"తమ కేం అవసర మైతే అదీ, తమ రేం చెయ్య మంటే అదీ నండి"

"గుమాస్తాగిరీ"

"చెయ్యగల నండి"

"అటెండరీ"

"అభ్యంతరం లే దండి"

"మహానసం మీద సూపర్వైజరీ"

"ఆక్షేపణ లే దండి"

"అవసరం తటస్థిస్తే యెప్పు డేనా—పొరుగూరు వెళ్లినప్పుడు సుమా! ఆధ్వర్యం?"

"సందేహించ నక్కర లేదండి"

"అయితే యిక నీకు చేత గాని పనేమి టయ్యా?"

"ఏదో వొక ప్రయోజనం తీర్చకుండా డబ్బు అడగడం"

"సెబాస్! దిట్టమైనవాడవే. చూడతగ్గ వాడవు కూడానూ. అయితే వుండిపో తరవాత మాట్లాడుకో వచ్చు"

"చిత్తం ఇన్నాళ్లకి నాకు అవలంబం—"

"ఏమిటీ?"

"ఎన్ని విధాల ప్రయత్నాలో చేశాను. ఎందర్నో ఆశ్రయించాను; కాని యీమాత్రం మాట అన గలిగిన వారు కనబడ లేదండి"

"దానికేం లే? మరి నేను వెళ్లిపో వచ్చునా?"

"సెల వయితే కోర్టుకి వస్తా నండి"

"అక్కర లేదు"

"అయితే నాకు సెలవు దయచెయ్యండి"

"ఎక్కడికీ?"

"నాళంవారి సత్రంలో బస చేశా నండి"

"భోజనం యిక్కడే, తెలిసిందా?"

"తెలిసిం దండి"

"ఎప్పుడూ?"

"ఇందాకా సూచన గానూ, ఇప్పుడు స్పష్టం గానూ నండి"

"బాగుంది. అయితే తొందరగా వెళ్లాలా?"

"మూడు నిమిషాలూ మగిసిపోయా యండి. అక్కడ తమకి తొందర పనులు—"

"అయితే లే, ను వ్వేం చదివావూ?"

"లోవరు సెకండరీ సర్టిఫికెట్టు సంపాదించాను. మేఘసందేశం కూడా పూర్తి చేశా నండి"

"అందులోనూ యిందులోనూ కూడా త్రయమే అన్న మాట"

"చిత్తం"

"మరి వెళ్లిరా"

"..............."

"నీ పే రేవరూ?"

"రామచంద్రశాస్త్రి"

"ఇంటి పేరు?"

"వేమూరి వా రండి"

"వూరు?"

"మహేంద్రవాడ"

"సరే"

"తమరు కోర్టునుంచి వచ్చాటప్పటికి మళ్లీ దర్శనం చేసుకుంటా నండి"

"మా వొంటెద్దు బండి తీసుకు వెళ్లి సామాను పట్టించుకు వచ్చి, అదిగో,—ఆగదిలో ప్రవేశించు"

"సామా నల్లా చిన్న రైలు సంచీ మాత్రమే, బండి పని లే దండి"

"వెళ్లి రా"

౨

పంతులయ్యా, రామచంద్రమూ మళ్లీ రాత్రి భోజనాల దగ్గిర కలుసుకున్నారు. ఆపూట వారాల విద్యార్థులు ముగ్గురూ కాక మరో నలుగురు అభ్యాగతులు కూడా వున్నారు. చిన్న గుమాస్తా లిద్దరూ సరే సరి. మొత్తానికి బంతి బాగా పూటుగానే వుంది.

వడ్డన వాయువేగమనో వేగాలమీద పూర్తి చేసి జానకమ్మ నేతిగిన్ని పట్టుకుని వంటింటి గుమ్మంలో నుంచుంది.

అలవాటు చొప్పున పంతులయ్య మొదటి బంతీ తన బంతీ కూడా పారచూశాడు. మెరుపు దీపాలు మూడూ ఝామ్మని వెలుగుతున్నాయి; కనక హాలంతా నల్లపూస కూడా కనపడే టంత ప్రకాశ మానంగా వుంది. ఆ వెలుగులో పంతులయ్యకి రామ చంద్రశాస్త్రి మొగమ్మీద యేదో విలక్షణ తేజస్సు కనపడింది.

"వచ్చావా?"

"చిత్తం. నేను చిన్న గుమాస్తాగారితో మాట్లాడుతూ వుండడంవల్ల తమరు కోర్టునుంచి రావడమూ, షికారు వెళ్లడమూ గమనించలేకపోయానండి"

"కోర్టులో వొక గంట పూరికే కూచోవలసి వచ్చింది. నిన్నక్కడికి తీసుకువెళ్లనందుకు చాలా విచారించాను"

"తమ రలా సెల విస్తే—"

"తప్పేమీ? అది అక్షరాలా నిజం. నిజం చెప్పడం తప్పా?"

అప్పుడొక అభ్యాగతు డిందుకన్నాడు.

"వాస్తవం అన్నది, చూచారూ! సత్యం హృదయానికి ఉత్తేజనం కలిగిస్తుంది. అసత్యం దాన్ని కుంగదీసేస్తుందండి"

"మీ ప్రసక్తి లేదిప్పుడు. చూస్తూ వింటూ వుండండి"

"చిత్తం, చిత్తం. తమ సెలవూ. సందర్భం వచ్చింది కనక—"

"కాదు కనక వూరుకో మంటున్నాను"

"....................."

"రామచంద్రం!"

"ఏమి సెలవు?"

"నువ్వని వచ్చేస్తోంది మాట. ఎవర్నీ కూడా 'మీ' రనడమే మంచిది కాని—"

"భృత్యుణ్ణి 'నువ్వ' ని పిలవడమే ధర్మమండి.

"అయితే నువ్వక్కడ కాదు, నాయెదటికి రా"

ఇది విని యెదటి బంతిలో మొదట కూచుని వున్న మూడో గుమాస్తా చివరికి వెళ్లాడు. రామచంద్రం పైకి వచ్చాడు. గుమాస్తాల కిద్దరికీ అన్నారుగణంటూ ప్రాధేయపడి వచ్చినవాడి కిలాంటి ఆదరణ కలగడం చాలా యిబ్బందిగానే వుంది; కాని—కక్కిన పేలలాగ—చూపులు విస్తళ్లమీదకి తిప్పేసుకున్నారు.

"ఇతగాణ్ణెరుగుదువా జానీ?"

"యెరగను"

"ఎప్పుడేనా చూశావా!"

"లేదు"

"అయితే యింటో మనిషిని చూసినట్టు చూస్తూ వుండు"

"అలాగే"

ఈమాటలు విని చకితురాలై వంటింటో చారూ అన్నమూ తింటూ వున్న సుభద్రమ్మ రామచంద్రాన్ని తొంగి చూసింది.

తరవాత పంతులయ్య వుద్ధరిణతో నీళ్ళు చేతిలో పోసుకుని "ఇక కానిద్దామా! ఏమండీ అవధానులు గారూ! పరిషేచన చేద్దామా?" అంటూ విస్తరి మీద చల్లాడు.

౩

పంతులయ్య వుయ్యాలా మంచంమీద కూచుని వుండగా సుభద్రమ్మ తాంబూలపు పళ్లెం తెచ్చి అందించి పక్కని కూచుంది.

"ఏం తల్లీ?"

"మళ్ళీ వొక కథ రాసేశాను నాన్నారూ!"

"అయితే సాఫు రాయించా లన్న మాట"

"అవు నండీ"

"పొద్దున్న—పోనీ రామచంద్రం రాయగలడేమో?"

"కనుక్కోండి నాన్నారూ! సూరయ్యగారు రాస్తే నేను మళ్ళీ దిద్దుకోవలసివస్తోం దండీ"

"నాయణ్ణి పిలు"

సుభద్రమ్మ పిలవగా పోతునాయుడు గబగబా పైకి రావడమూ, పంతులయ్య చెప్పడమూ, నాయుడు కిందికి వెళ్ళి పిలవడమూ, రామచంద్రం రావడమూ వెంట వెంటనే జరిగిపోయాయి. సుభద్ర లేచి పక్కనున్న మంచంమీద కూచుంది. పంతులయ్య వుయ్యాలా మంచంమీద చోటు చూపించి కూచో మన్నాడు; కాని రామచంద్రం అలాగే నుంచున్నాడు.

"ఏం?"

"నా కిదే తగిన పదతండి"

"ఏమిా ?"

"తమరు క్షమించాలి. నేను భృత్యుణ్ణి"

"సరే. మర్యాదల సంగతి తరవాత తేల్చుకుందాం; కాని మా అమ్మాయి తరుచు చిన్నకథలు రాస్తూ వుంటుంది. నువ్వు సాఫు రాయగలవా ?

"రాయగల నండి"

"నువ్వు తెనుగులో రచన చెయ్యగలవా?"

"కొంచెం చేత నవునండి. అయితే: వ్యావహారికంలో వెళ్ళినట్టు గ్రాంథికంలో వెళ్లదండి కలం ముందుకి"

"అదే నోయ్! వ్యావహారికం అప్పుడే దేశం అంతా పాకిపోయింది కాదూ! మహా దిట్టమైనవాడోయ్ గిడుగు రామమూర్తి పంతులూ! నవీనవాఙ్మయనిర్మాత లైన యువకుల నందర్నీ లోపు చేసుకున్నాడు పంతులు. ముసలి తలకాయలు గ్రాంథికమోా అంటూ గోల పెడితే మాత్రం ఆవాదం యిం కెన్నాళ్లు నిలుస్తుందీ? .......... మా అమ్మాయి కూడా రామమూర్తి పంతులు వాదమే నచ్చింది. నువ్వూ మా అమ్మాయీ చివరికి వొక జట్టులోనే చేరారు. బాగుంది కనక నువ్వు సాఫు రాయడమే మంచి దన్న మాట"

"తమ అమ్మాయిగారి లాంటి యువతీమణులు వ్యావహారికంలో చిన్న కథలు రాయడం అధునికాంధ్రవాఙ్మయచరిత్రలో వొక ప్రత్యేకప్రకరణం ప్రారంభించడం అన్న మాటండి, చాలా సంతోషం"

"ఇదివరకి నాలుగో గుమాస్తా సాఫు రాసున్నాడు, కాని అతను రాసిన సాఫు కంటే మా అమ్మాయి రాసిన చిత్తే నయం"

"నా శక్తికొద్దీ రాసి దాఖలు చేసుకుంటానండి"

"వొక కథ రాస్తే యెలా వుంటుందో తెలుస్తుందండీ నాన్నారూ!"

"విన్నావుటోయ్ ?"

"రాసి చూపిస్తాను. దస్తూరివిషయంలో మాత్రం వెంటనే మెప్పు పొందగల నండి"

"సరే. కథ యిదేనా తల్లీ ?"

"అదే నండీ"

"ఇదిగో నోయ్ !"

రామచంద్రం దాన్ని పుచ్చుకుని "యెన్నాళ్లకి పూర్తి చెయ్య గల వని పంతులయ్య అడిగ్గా పేజీలు లెక్క చూసి "రేపిసాటికి దాఖలు చేసుకుంటానం" అన్నాడు. అది విని తండ్రీ కూతురూ కూడా చాలా ఆనందించారు. సూరయ్య యెప్పుడూ పది రోజులు కాకుండా రాసి యివ్వలేదు. "ఏమోయ్ ?" అంటే, "అఫీసు పని తెమలడం లేదండి" అంటూ వుంటాడు"

"ముందు వొక మాట కథ చివరిదాకా చదివితే గాని రాత మొదలు పెట్టగూడ దండీ నాన్నారూ"

"వినపడింది టోయ్ ?"

"వినపడిం దండి"

"సరి వెళ్ళు. సూరయ్య నడిగితే కలమూ కాగితాలూ యిస్తాడు పుచ్చుకో"

రామచంద్రం సెలవు పుచ్చుకుని కిందకి వెళ్లిపోయాడు. తరవాత రెండు నిమిషాలకి జానకమ్మ వెండిచెంబుతో మంచినీళ్ళు తెచ్చి, కడపరాతి బల్లమిాద వుంచి, హాలులోకి వెళ్లి, వొక సోఫాలో చదికిలబడింది. తండ్రికి వార్తాపత్రిక అందించి సుభద్రమ్మ తన గదిలోకి వెళ్ళిపోయింది.

౪

పొద్దున్న అరున్నర అయిుంది. ఉరోతీ గొట్టంలో నుంచి పొగ దూసుకు వచ్చే టట్టు చలిగాలి రివ్వున విసురుతోంది. సూర్యకిరణాలు వొణుకుతూ వొణుకుతూ అడుగు లేస్తున్నాయి. పట్నం అంతా జాగ్రదవస్థలోనే వుంది కాని అగర్భశ్రీమంతుల్లో కొందరింకా మంచాలు దిగలేదు.

అంత చలిలోనూ కూడా గోదావరి గట్టు పొడుగునా అన్ని రేవులలోనూ చాలా మంది స్త్రీపురుషులు సావకాశంగా స్నానాలు చేస్తున్నారు.

రామచంద్రశాస్త్రి అప్పుడే స్నానం చేసి వచ్చాడు; కనక కండువా కప్పుకున్నా కొంచెం వొణుకుతూనే పొగడచెట్టుకింద కూచుని సాఫు రాసిన కథలో అక్షరసాలిత్యాలు సవరిస్తున్నాడు. నాలుగో గుమాస్తా ఆవేళ చూడవలసిన కాగితా లన్నీ ఆఫీసులో బల్లమీద సవరిస్తున్నాడు. పెద్ద గుమాస్తా పారిజాతచెట్టుకింద నుంచుని కక్షిదారు తెచ్చిన కొత్త కాగితాలు చదువుతూ చెట్టుకింద ప్లీడరులాగ మధ్యమధ్య యేమిటేమిటో ప్రశ్నలు వేస్తూ లాయరు దర్జా అనుభవిస్తున్నాడు. జానకమ్మ "కాఫీకి పొద్దెక్కిపోయిందిరా" అంటూ పాలికాపు మీద చిరాకు పడి అప్పుడే లోపలికి వెళ్ళిపోయింది.

సరిగా యిలాంటి సమయంలో పంతులయ్యా, సుభద్రమ్మా గేటు తెరుచుకుంటూ లోపలికి వచ్చారు. ఇద్దరూ తలకి వూలు మఫ్లరులూ, కాలికి రబ్బరు జోళ్ళూ తొడుక్కుని వున్నారు. కొత్తవాళ్ళు చూస్తే అయిద్దరూ యెవరో అభ్యాగతు లనుకుంటారు; కాని యింటి యజమానులే అనుకోరు.

ముందు పెద్ద గుమాస్తా, తరవాత కక్షిదారూ సమీపించి నమస్కారాలు చేసి నుంచోగా రామచంద్రం నమస్కారం అయిన తరవాత పంతులయ్య చేతికి కాగితా లందించాడు.

"ఏమి టోయ్?"

"తమ రిచ్చిన కథ సాఫు రాసేశా నండి"

"అప్పుడే?"

"రాత్రి పదకొండు గంటలికే రాత అయిపోయిందండి"

"ఏం చురుకూ! చూశావు టమ్మా?"

"సూరయ్యగారి చేతిలో నుంచి కాగితాలు వచ్చాటప్పటికి విసు పొచ్చిం దండీ"

"అక్షరాలు కావివి ముత్యాలు. చూడు తల్లీ!"

"ఇంచక్క వుంది నాన్నారూ దస్తూరీ. ముద్దొస్తూం దండీ"

"చాలా చురుగ్గా కూడా రాస్తాడు. మంచి ప్రజ్ఞ"

"మధ్యమధ్య యేవో కొత్త మాటలు—ఇవేమిటండీ నాన్నారూ?"

"ఏమేనా చేర్చావా యేమిటోయ్?"

"తమ అమ్మాయిగారు నన్ను క్షమించక మానరనే ధైర్యంతో అపని చేశాను. అక్కడక్కడ కొన్ని మాటలు—లెక్కకి నాలుగు మాత్రమే—కొంచెం పేలవంగా వున్నా యనుకుని అవి అలాగే వుంచి అక్కడ వుండతగ్గ వని నాకు తోచిన మాటలు పైని చేర్చా నండి. ఇలా యిస్తే కొట్టేస్తాను"

"ఏమంటా వమ్మా?"

"చాలా బాగున్నా యండీ వారు చేర్చినవీ"

"అయితే యిక కొట్టెయ్యడ మెందుకూ?"

"వెనకటి కథలు కూడా యిలా సవరిస్తే—"

"నాకంత తాహతు లేదండి. ఏదో ఘుణాక్షరన్యాయంగా ఈమాటలు వచ్చాయండి"

"పోని, తాహతు వున్నంత వరకే సవరించు, ఏం తల్లీ?"

"ఘుణాక్షరన్యాయం అప్పుడు మాత్రం యెందుకు పట్ట దండీ నాన్నారూ?"

"విన్నావు టోయ్?"

రామచంద్రం మాట్లాడలేకపోయాడు. సుభద్ర మాటలు అతణ్ణి పరవశుణ్ణి చేశాయి.

రామచంద్రం చేసిన దిద్దుబాటువల్ల తన రచనకి వచ్చిన విశిష్టతను తెలుసుకుంటూ, మధ్యమధ్య అతని మీద అపాంగవీక్షణాలు పరుపుతూ సుభద్ర కూడా పరవశురా లయింది.

“సరే. తోటలో కూడా యేమేనా సవరణలు చేయించాలేమో బాగా పరకాయిస్తూ వుండు. నేను కూడా స్నానం చేసి నిన్ను పిలుస్తాను, కాఫీ పుచ్చుకుందాం” అని చెబుతూ పంతులయ్యగారు, అతని వెనకాల—పదడుగుల కోమాటు రామచంద్రం కేసి తిరిగి తిరిగి చూస్తూ, సుభద్రమ్మా యింటోకి వెళ్లిపోయారు.

౫

జయంతి చంద్రమౌళి పంతు లంటే రాజమహేంద్రవరం వకీళ్లలో కిరీటం లేని రాజని ప్రసిద్ధి. నెలనెలకీ యే లాయరుకీ లేని రాబడి. యెన్ని కరువులు వచ్చినా తరగని గాదులు. ఇంద్రభవనం లాంటి మేడ. చుట్టూ నందనవనం వంటి విశాలమైన వుద్యానవనం. మోరంపూడి రోడ్డున పాతిక యకరాల తోట. నడిబజారులో పెద్దపెద్ద కొట్లు. ఆల్కట్టు తోటలో వొక పెద్ద నివేశనం. వొక మోటారు. వొక బ్రూహాం. వొక వొంటెద్దు బండి. పుష్కలమైన పాడి. వొక టేమిటి—అన్నింటికీ తోడు అతను మంచి భోగి త్యాగిని. చుట్టాలు, అతిథులు, అభ్యాగతులు—యెవరో వొకరు యెప్పుడూ యింటో వుంటూనే వుంటారు. రాజమహేంద్రవరంలో సాహసానికీ ఔదార్యానికీ అతనిదె మొకటె పద్ధు. అతని సలహా, అతని సాయం, అతని సమ్మతి లేందే ఆపట్నంలో యే వుద్యమమూ యే కార్యమూ జరగవు. వకీళ్లంతా అతని దగ్గర జూనియర్సులాగ మసులుకుంటారు. అతను తప్పుడు కేసులు పట్టడని న్యాయస్థానంలో యెంతో నమ్మకం. సర్కారుకే నేదేనా వచ్చిం దంటే అతని దగ్గిర అర్జీకపనులు చెయ్యడానికి పోలీసులు జంకుతారు.

ఏవిధంగా చూసినా ఆపట్నంలో అతని యిష్టమే చట్టం.

కాని మువ్వయి తొమ్మిదో యేట—అంటే యిప్పటికి ఆరేళ్ల కిందట అతని భార్య చనిపోయింది. పరామర్శ చెయ్యడానికి వచ్చి మళ్లీ పెళ్లి చేసుకోవలసిం దని యెందరో రోజుల్లోనే సలహా చెప్పారు. అనేకమంది కూతుళ్ల తండ్రులు రాయబారాలు పంపారు. వితంతువివాహం చేసుకుంటాడేమో నని తరుణ్యమావలంబకులు కూడా కొంచెం ప్రయత్నించారు; కాని అత నందు కంగీకరించలేదు. “రోజు లెలాగేనా వెళ్లిపోతాయి. సుభద్ర చల్లగా వుంటే—నా కదే సౌఖ్యం. అదే ఆనందం” ఇది వొక్కటే అతని సమాధానం.

అతనికి సుభద్ర వొక్కత్తే సంతానం. మరి కలగా లేదూ, కలగలే దని అతనికి బెంగా లేదూ. కొడుకన్నా లేనందుకు భార్య తల్లడించి పోయింది; కాని అతను “ఆడపిల్ల చేదా?” అని వాడు. రోజు లిలా గడిచిపోతూ వుండగా ఆమె, జబ్బు చేసి పదిమాసాలు తీసుకుని, యెన్ని వైద్యాలు చేయించినా ప్రయోజనం లేక చివరికి కాలం చేసింది. అయితే జబ్బు ముదిరిం దని తోచగానే ఆమె “పిల్ల పెళ్లేనా నా కళ్ల బెట్టండి” అంటూ ప్రాధేయపడింది. కానైతే సుభద్ర అప్పటి కెనిమి దేళ్ల పిల్లే. కూతురికి అంత చిన్నతనంలో పెళ్లి చెయ్యడం అతనికి సుతరామూ యిష్టమూ లేదూ. అయినా యిది భార్య తుది కోరిక అని తాను కూడా గ్రహించి వున్నాడు; కనకనూ, స్వతహాగా ఆమె చెప్పిన పని చెయ్యకుండా వుండలేడు; కనకనూ ఆమె చెప్పిన వరుణ్ణి తెచ్చి సుభద్రకి దేవదుందుభులు మోగే టట్టు పెళ్లి చేశాడు.

అదివరకి యింటో నేనా సరిగా మసలని ఆమె యీ వుత్సాహంవల్ల ఆనాలుగు రోజులూ పెళ్లివారిని భోజనాలకి పిలవడానికీ, వారికి లాంఛనాలు తీర్చడానికీ—యింకా—యింకా యిలాంటి వాటికీ విడిదిలోకి కూడా వెళ్ళి వచ్చేది. “మాటా

రులో వెళ్ళిపోతున్న అత ననేకవిధాల నచ్చజెప్ప బోయివాడు; కాని "నాళంవారి సత్రంలోకి— యేమంత దూరమండీ? కాకపోయినా నాకు జబ్బు మళ్ళిపోయిందండీ" అని ఆగుంటలు పడ్డ కళ్ళు తిప్పుకుంటూ ఆమె, మరదళ్ళనీ, చెల్లెళ్ళనీ, మేనగోడళ్ళనీ వెంట వేసుకుని గుడుగూ గుడుగూ తిరిగేది.

మనుగుడుపులు కాగానే ఆమె ప్రోత్సాహం వల్ల ఆతను అల్లుణ్ణి యిల్లరికం తీసుకువచ్చాడు.

ఆవేళ రాత్రి పంతులయ్య వొళ్లో కూచుని అతని నోటికి తమలపాకుల చిలకొట్లు అందిస్తూ ఆమె "నా కోరికలన్నీ తీర్చారండీ" అని మెడ చుట్టూ చేతులు చుట్టేసి, బుగ్గకి బుగ్గ ఆనిస్తూ కొత్త పెళ్లికూతురు లాగ కసింత సేపు గునిసింది.

అంతే. తరవాత వారం రోజులకే రోగం తిరగబెట్టి ఆమె గుటుక్కుమంది.

మరో రెండేళ్లకి గోదావరిలో యీతా లాడుతూ పదహారేళ్ల అల్లుడు కూడా దగా చేశాడు.

పాపం, వైధవ్యం వచ్చాటప్పటికి సుభద్రకి తొమ్మిదో యేడు వెడుతూ వెడుతూ వుంది.

ఇలాగ భార్యా పోవడం, కూతురు మూలపడ్డం వేరే సంతానం లేకపోవడం—కొన్నాళ్లదాకా పంతులయ్య పంతులయ్యలాగ తిరగలేదు; కాని మరికొన్నాళ్లకి మనస్సు రాయి చేసుకుని ప్రాక్టీసులో మునిగిపోయాడు.

గారంగా పెరిగింది కనక సుభద్ర ప్రతీ రోజూనా సరిగా బడికి వెళ్లి యెరగదు. కాగా మొగుడు పోయాటప్పటికి ఆమె రెండో తరగతి చదువుతోంది. అప్పటి కామె భర్తని గురించిన దుఃఖం అట్టే యెరక్కపోయినా అత నామెని బడికి పంపించడాని కిష్టపడలేదు. తీరిక అయినప్పుడల్లా యింటికి వచ్చి పాఠాలు చెబుతూ వుండడానికి బాలికాపాఠశాలలో పని చేస్తూ వున్న వొక వుపాధ్యాయురాలి నేర్పరిచి అతను సుభద్ర విషయంలో తల్లిగూడా చూపవలసిన శ్రద్ధ అంతా తానే చూపిస్తూ ఆమె భవిష్యత్తుకి పునాదులు వెయ్యసాగాడు.

౬

ఇది యిలా వుండగా:

జానకమ్మ కూడా చిన్నతనంలోనే వితంతువయిపోయింది. పుట్టింటికి వెళ్లి వళ్లు మాటలు పడుతూ చాకిరీ చేస్తూవుంటే రోజు లెలాగో వెళ్లిపోయి వుండును; కాని ఆమె మిషనరీల బాలికాపాఠశాలలో యేడో తరగతి చదివి వుంది; కనక అస్వతంత్రపు బతుకు ఇష్టం లేక ఆడపిల్లలికి ప్రయివేట్లు చెబుతూ రాజమహేంద్రవరంలోనే వుండిపోయింది. ఈవృత్తిలో ఆమెకి నెలకి పది రూపాయలు దొరికేవి. ఏ శిఖస్తుఅయిపోయిందో వొక చిన్న కొంప సొంతంగా వుంది కనక అద్దె బాధ లేకపోవడంవల్ల ఆసంపాదనతో ఆమెకి రోజులు రాజాంగంగా వెళ్లిపోయావి.

ఇలాగ నాలుగు నెలలు గడిచాటప్పటికి జానకమ్మకీ, సుభద్రకీ పరిచయం కలిగింది. తరవాత సుభద్ర కోరగా పంతులయ్య నెల కెనిమిది రూపాయ లివ్వడానికి అంగీకరించి రోజూ వొక గంట చదువు చెప్పడానికి జానకమ్మని కూడా యేర్పరిచాడు.

ఆమె తొమ్మిదింటికి వచ్చేది. ఇక్కడ తొమ్మిదిన్నరకి తండ్రికీ సుభద్రకీ భోజనసమయం. అందేత జానకి ఆ అరగంటా పాఠం చెప్పి, మళ్లీ సాయంత్రం వచ్చి యింకో గంట చెప్పేది. వొకొక్కప్పుడు సుభద్ర భోజనం అయ్యాదాకా కనిపెట్టుకుని వుండి తరవాత పాఠం పూర్తి చేసి వెళ్ళిపోయాది. మరొకొక్కప్పుడు సుభద్ర పట్టుపట్టగా యిక్కడే భోజనం చేసి మరోగంట సేపు యెక్కువ కూచుని వెళ్ళిపోయాది.

కాని పద్దెనిమిది రూపాయల ఆదాయానికి సంతోషించినంత కాలం పట్టలేదు. జానకి ఆర్జన కొందరు పెంగరాజులకి కళ్ళు కుట్టింది. వారు కుట్రలు పన్నారు. అందుకు ఫలితంగా "సుభద్ర నే ప్రధానంగా చూడుకుంటూ మాపిల్లలికి సరిగా చెప్పడం లే" దని వంకలు పన్ని ముగ్గురు పిల్లల్ని తల్లిదండ్రులు పంపడం మానేశారు. మరో పిల్ల "మా నాన్న నాకు కూడా మరో మేష్టార్ని కుదురుస్తాడుట" అంటూ పాట మొదలుపెట్టింది. అయిదో పిల్ల తండ్రి "జీతం తగ్గించుకుంటే గాని నావల్ల కా"దని కబురంపాడు.

ఏమిటీ చెయ్యడం? ఇంకో తొమ్మిది రూపాయలకి ఆశపడితే అసలు పదీ యెగిరిపోతున్నాయి. జానకమ్మకి సంతోషం పోయి యేడుపు వచ్చింది. ధైర్యం పోయి భయం పట్టుకుంది.

కాని పంతులయ్య యిదంతా విని "మాయింటో వుండిపోరాదూ? నే నిదివర కిస్తూవున్న ఫ్టైనిమిది రూపాయలూ యిచ్చేస్తూనే వుంటాను. మాతో పాటు భోజనం చెయ్యవచ్చు సుభద్ర మీ కెలాగా బహుమతీ యిస్తూ వుండాలి కనక బట్టలికి లోటుండదు. పైగా యింటిమీద అయిదారు రూపాయలు అద్దె కూడా వస్తుంది. ఆలోచించుకోండి" అనగా ఆమె కష్టసుఖాలు బేరీజు వేసుకుని "వాళ్లని కుళ్ళి చావనీ" అనుకుని పంతులయ్య మేడలో ప్రవేశించింది.

అయితే లోకాని కవసరం లేని సంగతి లేదు కదూ? ఆమె యిరవై నాలుగేళ్ల వితంతువు కావడం. అతను నలభై అయిదేళ్ల విధురుడు కావడం. ఇంటో చిన్నపిల్ల సుభద్ర తప్ప మరో ఆడది లేక పోవడం. పైగా సొంత యిల్లు వుండిన్నీ జానకమ్మ పంతులయ్య మేడ యెక్కడం. ఇంకేమీ? స్వాము లంతా గుసగుసలు పోయారు. యుక్తులమీద యుక్తులు పన్నారు. చర్చలు చేశారు. చివరకి ఆమె పంతుల్ని అలుముకుం దని సిద్ధాంతం చేశారు.

ఆమె అదివరకే పంతులమ్మ కనక అతనికి పంతులయ్య అని పేరు కూడా పెట్టారు.

లోకం యిలాగ ధర్మసంస్థాపనం చేస్తూవుండగా మొదట "మేష్టారూ!" తరవాత "జానకమ్మగారూ!" ఆపైని "పిన్నిగారూ!" అయి చివరకి జానకమ్మ సుభద్రకి "వొసే, పిన్నీ!" అయిపోయింది, పంతులుకి "బాసె" అయిపోయింది.

జానకమ్మకి కూడా ఆయింటో సర్వస్వాతంత్ర్యాలూ వచ్చాయి. వంటలక్క మూలంగా నెలకి నాలుగు రోజులు వంట చెయ్యడం తప్ప ఆమెకి మరే కష్టమూ లేదు.

సుభద్రకి తల్లి లేదు. అంతే; కాని ముద్దుకీ మురిపానికీ యేమీ లోటు లేదు. ఇది చూసి పంతులయ్య సంఘానికి బలాదూరు చెప్పాడు.

౨

రామచంద్రం సాఫు రాసిన సుభద్ర కథ భారతిలో పడింది. అచ్చులో చూశాక అతను చేర్చిన మాటలవల్ల వచ్చిన మాధుర్యం ఆమెకి మరీ కనపడింది. దానితో ఆమె బ్రహ్మానందపడి గబగబ వెళ్ళి తండ్రికి చూపించింది.

"తక్కిన కథలు కూడా దిద్దించిపెట్టరు టండీ నాన్నారూ?"

"అలాగే నమ్మా"

"నిజంగా?......ఏమండీ నాన్నారూ? నిజంగానే?"

"సందేహ మెందుకు కలిగిం దమ్మా?"

"అయితే మ రెప్పుడు చెప్పండీ"

"ను వ్వెప్పుడు కావా లంటే అప్పుడే"

"నిజంగా?"

"ఆదేమి టమ్మా?"

"మరీ—ఇవాళే చెప్పెయ్యండి రామచంద్రం గారితోటి"

"అలాగే లే"

"......................"

"ఇంకా యేమిటి?"

"ఏ మండీ నాన్నారూ?"

"ఏం తల్లీ?"

"......................"

"చెప్ప వమ్మా!"

"నేను రాసిన కథ లన్నీ సాఫు రాయించి—"

"రాయించీ?...ఏమిటి తరవాతా?"

"......................"

"అ దేమి టమ్మా?"

"మీరు కోప్పడతా రేమో బాబూ?"

"......................"

"చెప్పెయ్య మంటారా?"

"ఊఁ"

"అచ్చుకూడా—"

"ఆమాట చెప్పడాని కింత ఆలోచన యెందు కమ్మా?"

"భయ మేసిం దండీ"

"నీకంటే నా కింకేం వుంది తల్లీ? నీ కర్లేమి టమ్మా?"

"అచ్చు కూడా రామచంద్రంగారే—"

"అతనే చేయించా లా పని. నాకు తీరుపడి లేదు కదా? నీకు వల్లకాదు కదా? మ రెవరు చేస్తారూ?"

"......................"

"ఇంకా యేమిటి?"

"......................"

"ఇదేమి టమ్మా యివాళ యిలా..."

"చెప్పేస్తాను"

"......................"

"నాన్నారండి"

"ఎందు కమ్మా?"

"చెన్నాపట్టంలో........"

"మరీ సంతోషం. రామచంద్రాన్ని వెళ్లమందాం"

సుభద్రకి ప్రాణాలు లేచివచ్చిన ట్టయింది. ఆ సంతోషంతో ఆమె అలాగా యిలాగా చూడగా తోటలో కొళాయి దగ్గిర పంచెకి సబ్బు పట్టిస్తూ రామచంద్రం కనిపించాడు.

"అలా చూడండి నాన్నారూ"

"రామచంద్ర మేనా అతనూ?"

"అవు నండీ"

"ఏం చేస్తు—బట్టలు ఉతుక్కుంటు న్నట్టున్నాడు.

"రెండు రోజుల కోమాటు సబ్బు పట్టిస్తా రండీ ఆయనా. రెండు పంచెలే వున్న ట్టున్నాయి పాపం"

"వొట్టి వెంగమాటం మనిషిలా వున్నాడు రామచంద్రం. నిన్న రాత్రి విన్నావా జీతం యెంత కావాలో తేల్చ మంటే యే మన్నాడో నూ?"

"ముందు బట్టలు కొనిపెట్టండీ పాపం!"

"అయితే బజారుకి వెళ్లి నీకు నచ్చినవి పట్టుకురా"

"......................"

"హాస్యం కాదు. నీకథలు అతను దిద్దిపెడుతున్నాడు. అతనికి నువ్వు బహుమతీ చెయ్యాలి"

"......................"

"నీయిష్టం వచ్చినంత సొమ్ము పుచ్చుకుని బజారుకి—జానీ కూడా వస్తుంది వెళ్లు"

"......................"

"నుంచోకు మరి. అతను ఆపంచె వుతుక్కుని ఆరేశాటప్పటికి నువ్వు బట్టలు తెచ్చి అతని కివ్వాలి. వెళ్లు మరి"

"......................"

ఆబట్టలతో నాతో కూడా పోటారులో కూచోడానికి బిడియపడుతున్నా డతను. నీలం చాపులు తేవాలి సుమా?"

"పిన్నితో కూడా చెప్పండి"

"చెబుతాను లే, నువ్వు సొమ్ము తీసుకురా"

"................."

"నీయిష్టం అన్నాను కాదూ?"

"................."

"చొక్కాలు కూడా కుట్టించాలి సుమా"

"................."

"అవునండీ పాపం"

"ఇప్పుడు తెలిసిందా యెంత సొమ్ము పట్టుకు వెళ్ళాలో?"

"................."

"చేసిన పని శుభ్రంగా—మళ్లీ కక్కుర్తి వుండకూడదు. రెండు వందలు పట్టుకు వెళ్లు"

సుభద్ర మాట్లాడకుండా తాళాలు పుచ్చుకుని యినప్పెట్టి వున్న గదిలోకి వెళ్లింది "డ్రైవర్ని పిలవరా నాయుడూ" అంటూ పంతులయ్య కిందికి వెళ్లాడు.

* * * * *

"పదిహేను రోజుల్లో పుస్తకా లన్నీ పట్టించుకు రావాలి"

"చిత్తం"

"గడువు దాటగూడదు. పని తరవాయి వుండకూడదు"

"అలాగే నండి"

"ఇవాళ మెయిలుకే వెళ్లు"

"వెడతా నండి"

"ప్రూఫు రాయడానికీ, అచ్చు వేయించడానికీ, బైండు చేయించడానికీ పదిహేను రోజులు చాలా?"

"నాలుగు కథలే కాదండీ ప్రస్తుతం వేసేవి? అగడువు చాలండి"

"ఇవేనా తల్లీ కథలూ!"

"అవునండి నాన్నారూ"

"..................."

"..................."

"సూరయ్యగారి నడిగి కాగితాలు పుచ్చుకో"

"చిత్తం"

"వంటయిందా జానీ?"

"చారు పోగుస్తోంది కామప్ప"

"అయితే రామచంద్రానికి ముందు పెట్టించెయ్యి, అతన్ని మెయి లెక్కించి వచ్చి మనం తరవాత భోంచేద్దామేం తల్లీ?"

"అలాగే నండీ"

"..................."

"మరి చూస్తా మేమమ్మా?"

"..................."

"నీచేత్తో యివ్వాలి. తొరగా కానియ్యవమ్మా"

"..................."

"అవి పుచ్చుకోవోయ్"

"వాటి నేం చెయ్య మంటా రండి!"

"అవి నీకు బహుమతీ. నువ్వు కట్టుకోడానికి బట్టలు లేక—ఇందాకా నువ్వు పంచెకి సబ్బు పెట్టడం మా అమ్మాయి చూసింది. అదీ జానీ బజారుకి వెళ్ళి నీకు బట్టలూ, చొక్కాగుడ్డలూ తెచ్చారు. పుచ్చుకో"

"..................."

"ఏం, చూస్తా వేం?"

"నాతాహాతు—"

"మోటారులో నాపక్కని కూచోవాలంటే అలాంటి బట్టలే కట్టుకోవాలి"

"..................."

"ఇక సందేహించకు. పుచ్చుకో"

"నాతల విలువ నాకు తెలుసునండి. ఇలాంటి బట్టలు కట్టడానికి నాకు గుండెలు తాళవండి"

నీతల విలవ నీకంటే నాకు బాగా తెలుసు. పుచ్చుకో"

"..................."

"నా మాట విను"

"....................."

రామచంద్రం మాట్లాడలేదు. అతని కళ్లల్లో ఆనందబాష్పాలు గిర్రున తిరిగాయి. ఇక నుంచో లేక పంతులయ్య కాళ్లమీద పడ్డాడు. అతని అమాయికానందాన్ని చూశాటప్పటికి పంతులయ్యకి కూడా సంతోషం కలిగింది.

తరవాత పంతులయ్య చేయూత యిచ్చి లేవతియ్యగా రామచంద్రం అప్పుడు కూడా కొంచెం సందేహిస్తూనే ఆబట్ట లందుకున్నాడు.

ఇచ్చాటప్పుడు సుభద్రకీ, పుచ్చుకునేటప్పుడు రామచంద్రానికీ, వొకరి చెయ్యి వొకరికి తగిలింది. దానితో రామచంద్రానికి శరీరం వణికింది. సుభద్రకి వొళ్లు జల్లు మంది.

౭

"ఈపాటికి కథలు సాఫు రాసెయ్యడం కాదుటండీ నాన్నారూ ?"

"అయిపోవచ్చు"

"ఇవాళో రేపో అచ్చు మొదలుపెడతా రన్న మాట. కాదుటండ ?"

"అలా యెందుకూ ? సాఫు రాసిందల్లా అచ్చు వేసేస్తూ వుండకూడదూ ?"

"అవును నాన్నారూ ? రామచంద్రంగారికి రాయండీ అలా చేయించ మని"

"అతనికి తెలవదు టమ్మా అదీ ?"

"రాస్తే యేమండీ ?"

"మన మేమీ రాయవద్దు. గడువులోపున తేగలడో తేలేడో చూద్దాం."

ఈమాట వినేటప్పటికి ఆమె హృదయం తక్కు మంది. "ఈపరీక్షలో నెగ్గగలడో లేడో పాపం" అని ఆమెకి అతనిమీద జాలికలిగింది.

* * * * * *

"అరవభోజనం—రామరామా ! విధిలేక తిని వాయట నాన్నారు. పాపం రామచంద్రంగా రేం చేస్తున్నారో ?"

"పదిహేను రోజులేకాదూ ! కాకపోయినా భోజనం సయించకపోతే కాఫీ వుండనే వుంది. మద్దినుసు పిండివంటలూ—"

"అసలు ఆవకాయ పట్టుకు వెళ్లమనవలసింది, తోచిందికాదు. నువ్వేనా జ్ఞాపకం చేశావు కాదే మిటే పిన్నీ ?"

"ఇప్పు డయితే రేం, పోనీ పంపించకూడదూ?"

"అవునవును. బాగానే వుంది నీ ఆలోచన. నాన్నారితో చెప్పవే"

"నువ్వే చెప్పూ"

"నువ్వు చెప్పకూడదా యేమి టమ్మా ?"

"అయితే యింకా యేమేం పంపించాలో ఆలోచించు, నేనే చెబుతాను"।

ఇది విని సుభద్ర "యింకే మున్నాయీ ? ఇంకే మున్నాయీ ?" అని ఆలోచన మొదలు పెట్టింది.

* * * * * *

"మిఠాపాటి కాయలుట, బత్తాయి కాయలు తెచ్చిం దండీ నాన్నారూ అప్పలమ్మ"

"ఏ మంటుంది ?"

"ఇవ్వకుండా వెళ్లదుట"

"ఏమాత్రం తెచ్చింది ?"

"గంపెడు"

"రెండు డజన్లు పుచ్చుకో యివాళకి. రేపు మళ్లీ తెమ్మను"

"....................."

"....................."

"ఈపాటికి చెన్నాపట్టం చేరుతుంది టండీ ఆవకాయ నాన్నారూ ?"

"నిన్ననే అందుతుందమ్మా అతనికీ"

"................. ..."

"...... ..............."

"ఆవేపు బత్తాయి కాయ లింత బాగుండవు కాదుటండీ నాన్నారూ ?"

"మనకి నచ్చవు. అక్కడి వాళ్లకవే అమృతం"

"నిజమే......ఇక్కడి వాళ్లక్కడికి వెడితే వాళ్లని చూసినప్పుడల్లా యిక్కడి పళ్లు తలుచుకుంటూ లొట్టలు వేసుకోవలసిందే"

"......................"

"......................"

"ఏమండీ నాన్నారూ! ఇక్కణ్ణుంచి వెళ్ళిన వాళ్లకోసం అక్కడి వర్తకులు యిక్కణ్ణుంచి తీసుకువెళ్ళి అమ్మకూడదు టండీ?"

"అమ్మవచ్చు......పోనీ రామచంద్రాని కేమేనా పంపిద్దామా తల్లీ?"

"పంపించండి నాన్నారూ! సాఫు రాయడమూ, ప్రూఫులు దిద్దడమూ, ఆపైని అరవభోజనమూ—వేడి చేస్తుం దేమో నండీ పాపం వాడికీ?"

"అయితే తెచ్చిన వన్ని యిచ్చేసి పొమ్మను అప్పలమ్మని"

"పాపం వారి మూలాన నాకథలు ఇంచక్కతయా రవుతాయి. పుస్తకం కూడా ముద్దులు మూట కడుతూ వుంటుంది. కదు టండీ నాన్నారూ?"

"మరే"

"......................"

"......................"

"అయితే పళ్లన్నీ పుచ్చుకోనా నాన్నారూ?"

"వందేనా వుంటాయా?"

"తక్కువయితే తెమ్మంటాను. ఏం?"

"ఊఁ"

"మనకి రెండు డజన్లు చాలు. మళ్లీ రేపు తెస్తుంది కాదూ?"

"అవును"

"సూరయ్యగారి నిక్కడికి పంపించనా?"

"పంపించు"

సుభద్ర మెట్లెక్కి నింపాదిగానే నడిచింది; కాని ఆమె హృదయం పురకలు వేసింది.

* * * * * *

"మొన్న మనం కొన్నామూ, కోటుగుడ్డా? అది నిగనిగ మెరిసిపోతోంది కాదుటే పిన్నీ?... "నేవీ బ్లూ" అంటారు దాన్ని......చెన్నాపట్టంలో వాళ్లు కుడితే చొక్కాలు వొంటికి పూసినట్టు సరిపోతాయిట. నాన్నారి కోట్లన్నీ అక్కడ కుట్టించినవే"

"......................"

"ఆ నేలం పంచెలు తెలుపుచేస్తే పాము మీసంలాగ మెరిసిపోతాయి కాదుటే పిన్నీ?"

"అవును"

"పుప్పొడ కండువాలు కూడా రెండు కొనవలసింది. మరచిపోయాం"

"మరే [illegible]"

"అసలు సొమ్ము కూడా తక్కువ పట్టుకువెళ్లాం. మిగిలితే ఆ కండువాల మాట తోచునేమో"

"పోనీ, అత నింటికి వచ్చాక కొని యివ్వరాదూ?"

"......................"

"మీనాన్న మాత్రం వొద్దంటారా ఏమిటి?"

"ఆ వేళ వారు పంచెకి సబ్బు పెడుతూ వుంటే నాకు జాలేసింది పాపం!"

"......................"

"వారికి బట్టలు కొని పెట్ట మని తీరా నోరు జారి వచ్చేసింది. మాట కాని నాన్నగా రేమంటారో—ఏమనుకుంటారో అని నాగుండెలు పీచుపీచు మంటూ—బేజా రైపోయా నేవ్ పిన్నోయ్"

"ఊహూఁ"

"ఇప్పటికీ పుప్పొడ కండువాల మాట చెబితే మాత్రం—నాన్నగారికి కోపం వస్తుందే. చెప్పొద్దే. ఏమే పిన్నీ?"

"నీకు భయ మైతే నేను చెబుతాలే పోనీ"

"నువ్వు చెప్పు. నువ్వు చెబితే నాన్నారు తెప్పించి చెన్నాపట్టం పంపేస్తారు కూడానూ. అవి అక్కడ యిస్త్రీ చేయిస్తే మరీ బాగుంటాయి. కదూటే?"

"అవును"

"రామచంద్రంగారి మూలానే నాకథలు పుస్తకంగా అచ్చయిపోతున్నాయి. ఆవేళ ఆకథ వారు సవరించకపోతే నాకీ వూహా తోచకపోను...వారి మేలు మరిచిపోగూడదు. ఈపుస్తకం వచ్చేశాక యీమాటు తక్కిన కథలు కూడా అచ్చు వేయించెయ్య మని అడగాలి నాన్నార్ని. ఈమాటు చెన్నాపట్టం వెళ్ళేటప్పుడు వారిని అక్కడ రిస్టువాచీ కొనుక్కో మంటారు నాన్నారు. ఔనా పిన్నీ?"

"మీ నాన్న అలాంటివారే పాపం. చూశావు కాదూ" నాకు వద్దు మొర్రో "అంటూంటే యీ రవ్వల వుంగరం కొనిపెట్టారు వేలుకీ?"

"అవునవును......రిస్టువాచీ కంటే—ఏ మంటావే నువ్వూ?"

"పోనీ రెండూ యిప్పించూ నువ్వూ"

"బాబోయ్!"

౯

రామచంద్రం చెన్నపట్నం వెళ్ళాక రోజులు గడిచిన కొద్దీ సుభద్ర మనస్సు యేమిటో గజిబిజి పడిపోసాగింది. అదివర కామె యేం చేసినా యేకాగ్రచిత్తంతో చేసేది. అలాంటి మనిషి కిప్పుడు మనస్సు కొస్తసేపైనా నిలవదు. ఎంత మంచి పుస్తకం తీసినా నాలుగు బంతులు చదివేటప్పటికి చప్పబడిపోతుంది. ఎంత చక్కని పత్రిక పుచ్చుకున్నా అదేదో అలుముకుపోయినట్టు తోస్తుంది. హార్మోనియం మీటితే అపశ్రుతి కనపడుతుంది. తోటలోకి వెడితే వొక చెట్టులోనూ, వొక తీగలోనూ, వొక పువ్వులోనూ లావణ్యమూ, నాజూకూ కనపడవు. ఫలహారంలో యేదో రుచి తక్కువయినట్టు తోస్తుంది. కాఫీలో ఘాటూ, సువాసనా పోయినట్టుంటుంది. భోజనం దగ్గర కూచుంటే మాటలే కాని లోపలి కేమీ పోదు. మూడాకులతో తాంబూలం చెల్లిపోతుంది. ఇంతే కాకుండా యేపని మొదలు పెట్టినా దృష్టి అతని మీదికే పరిగెడుతుంది. ఎంతసేపూ ఆమె అతని ఆకారాన్ని రూపింపుకుంటుంది. చేష్టలు మననం చేసుకుంటుంది. మాటలు జ్ఞాపకం చేసుకుంటుంది. పంచెకి సబ్బు పెడుతూ వుండడం జ్ఞాపకం వచ్చి మనస్సు చివుక్కు మనిపించుకుంటుంది. చప్పున నిద్ర పట్టదు. పెందరాడే మెళుకువ వస్తుంది. స్నానం చేసేటప్పుడు వొకొక్కప్పుడు సబ్బుమాట మరిచిపోతుంది. వొక్కొక్కప్పుడు తడిబట్ట విడిచెయ్యకుండానే తల దిద్దుకుంటుంది. ఏమి టేమిటో చేస్తుంది.

ఏం? తన స్థితిలో ఏదో మార్పు వచ్చిం దని ఆమెకి తెలుసు. తన మనస్సులో యేదో పురి కొంటోం దని తెలుసు. ఏం? ఎందుకు జరగాలీ యిలాగా? అప్పుడప్పు డామె కీ ప్రశ్న తోచడం కూడా కద్దు. కాని అలాంటప్పు డల్లా "కథ లించక్క దిద్దుతారు" ఆమెకి స్ఫుటంగా కనపడీ విషయం యిదీ.

వొకనాడు పొద్దున్న ఆమె యేదో యాదాలాభంగా రామచంద్రం గది కేసి వెళ్ళింది. అది కనపడేటప్పటికి తాళం తియ్యాలి అని తోచింది. తాళం తీశాటప్పటికి గది తుడిపించా లని—ఇక నుంచుంటే వొట్టు. వొకటే గంతు. సమయానికి తండ్రి కచేరీలో వుండడం, జానకమ్మ గోదావరికి వెళ్ళడం. దొడ్లో పాలికాపుతో కజ్జాపడుతూ వున్న అప్పలమ్మ మాటలు వినపడుతూనే వున్నాయి; కాని ఆమె దాన్ని పిలవలేదు. పిలవాలని అనుకోలేదు. స్వయంగా వెళ్ళి చీపురు తీసుకు వచ్చి తనే తుడిచింది.

మేజా తుడిచింది. పక్క దులిపింది. కుర్చీ సరిగా సర్దింది.

ఇదంతా అయినాక, "ఎందుకిలా చెయ్యడం?" అని యెవరో అడిగినట్టయింది. ఎందుకూ? అందుకే కథలు సవరించి పెడుతున్నాడు కనక.

ప్రతీదానికీ ఆమె యీ కారణమే వూహించుకునేది; కాని యిందులో వూతం చాలినట్టుండేది కాదు. ఏదో లోటుగా వున్నట్టూ, ఏమో అతకనట్టూ కనపడేది; కాని అస లేమిటో బోధపడేది కాదు.

వొకనాడు ఆమెకి హఠాత్తుగా అతని ఫొటో చూడాలని తోచింది. కాని యేదీ! మొదట ఊసూరుమనిపోయింది; కాని తరవాత లేకపోవడమే మంచి దనుకుంది. ఏమంటే? వుండడమే వస్తే ఆ కరుకావి బట్టలతో తీయించుకున్నదే కాదూ?

ఆపాత వేషం బాగుంది కాదు. నిజమే; కాని కొత్త వేషం యేదీ? బట్టలు పుచ్చుకునేటప్పుడు కలిగిన వణుకుతోనే అతను మెయిలెక్కాడు. కట్టుకున్న దేదీ? చెన్నాపట్టంలో కుట్టిన కోట్లు వూనినట్టుండడానికి కుట్టడం అయినాక కదా? నేలంచాపు కూడా పాముమీసంలా వుండడానికి చలవచేయించాక కదా? అస లతను మడతే విప్పలేదూ. కోటు గుడ్డ నరేసరి; కాని ఆమెకి అతనా బట్టలు ధరించి మిలమిల మెరిసిపోతూ కనపడుతున్నాడు.

అతను సాయంత్రం బీచికి వెడుతున్నాడో లేదో. ఎప్పుడేనా మెరుపు రైలూ, లైటుహౌసూ యెక్కుతున్నాడో లేదో. ఇంచక్కటి చేపలు—అదేదీ? ఆక్వేరియం—మరే, అందులోకి వెడుతున్నాడో లేదో? ఆ అడయారు, ఆ బిసెంటు నగరం, ఆ పెద్దమర్రిచెట్టు, ఆ మ్యూజియం, ఆ పీపిల్సు పార్కు, ఆ మౌంటురోడ్డు షాపులు, ఆ థియేటర్లు, ఆ హార్బరు, ఆ వైపుల చెరువు—అవన్నీ చూస్తున్నాడో లేదో? పాపం చూడవలసిన దేమిటో తెలుసునో తెలవదో! డబ్బు సరిపోతుందో లేదో! ఎక్కువ ఖర్చుచేశావనిపోతా రేమోనని యేం పొడుదుడుకులు పడుతున్నాడో?

సుభద్రకి మనస్సు మనస్సులో లేదు. పోనీ, ఆవున్నచోటేనా నిలకడగా వుందేమో అంటే అదీ లేదూ.

౧౦

ఎనిమిది న్నర అయింది. మూడో అంతస్థు పైని వున్న గుమ్మా యెక్కి సుభద్ర కొంతసేపు వీధి పొడూగునా చూసింది. వొక పావు గంట అయాక మొదటి అంతస్థు వీధివసారాలో పచారు చేసింది. తొమ్మి దయాక తోటలోకి వెళ్ళి ద్వారం దగ్గరగా తచ్చాడడం మొదలుపెట్టింది.

గుమ్మంలో మొదట వొక వొంటెద్దు బండి ఆగింది; కాని రామచంద్రం చచ్చు వొంటెద్దు బం డెక్కుతాడా? పైగా ఆలస్యం అయిపోదూ?... తరవాత వొక ఫీటన్ వచ్చి నిలిచింది; కాని ముసిలి పండెవడో దిగి దగ్గుకుంటూ పంతులయ్య ఆఫీసులోకి వెళ్ళిపోయాడు. తరవాత వొక మోటాగు వచ్చింది; కాని యింటిదగ్గిరనుంచి స్టేషనుకి మోటారు వెళ్లలేదుగా?

సరిగా తొమ్మిదింబా వయింది. వొక జట్కా వచ్చి ఆగింది. ఎవరో పిల్లాడే. కట్టింది సేలం పంచే. తొడిగింది నేవీబ్లూ—అకండువా—రామచంద్రమే. తోటంతా వొక్కమాటు తళుక్కుమనిపోయింది. చూసేగా అతనూ ఆమే గేటులో వున్నారు.

"పుస్తకాలు తెచ్చా—నం—డీ" అన్నా డతను; గాని తా నిచ్చాడో ఆమె పుచ్చుకుందో గమనించలేకపోయాడు. చూసేగా సుభద్ర అప్పుడే మేడ మెట్లెక్కుతోంది. నడకే; కాని ఆస్థలమంతా క్లుప్తమైపోయింది.

పంతులయ్య మేడమీద వొక జమీందారీ కేసులో యిద్దరు దాసీలను యేం చెప్పగలరో పరీ

క్షిస్తున్నాడు. జమీందారు ఆప్రశ్నలు వింటూ ఖిన్నుడై దగ్గిరే వున్నాడు. దివాను కూడా నాలుగు గజాల దూరంలో నుంచునే వున్నాడు; కాని సుభద్ర యిదేమీ చూడలేదు. ఏమీ జంకనూ లేదు. వెనక్కాలే వెళ్ళి, యెడం చెయ్యి తండ్రి మెడ మీద ఆనించి, మొగానికి మొగం తగిలేటట్టు ముందుకి వంగి "పుస్తకాలు వచ్చాయి నాన్నారోయ్" అంటూ గిల్టు అక్షరాలతో మిలమిల మెరిసిపోతూ వున్న పుస్తకాలు చేతిలో పెట్టింది.

సుభద్ర వుత్సాహమూ, ఆపుస్తకాలూ చూశాటప్పటి కతనికి కూడా బ్రహ్మానందం అయింది. అతను కేసు సంగతి మరిచిపోయాడు. "అప్పుడే వచ్చాడుటమ్మా రామచంద్ర?" అన్నాడు. అంతే. మరేమీ—అధరస్పందన మేనా చెయ్యలేదు. దాసీలకి—దివానుకి—చివరికి జమీందారుకి కూడా యేమీ చెప్పలేదు. గభీమని లేచి కిందికి చక్కాపోయాడు. "గిల్టు అక్షరాలు—మనం చెప్పలేదు కాదుటండీ నాన్నారూ! ఎంత ముద్దుగా వున్నాయో!" అంటూ సుభద్ర కూడా వెంబడించింది.

* * *

"అనకూడదు కాని సూరయ్యగారే సాఫుగా యడం వస్తే—"

"ఆయనే సాఫు రాయడం వస్తే చెన్నాపట్టం వెళ్లడమూ, అచ్చు వేయించడమూ, నువ్వు ఆయనికి పళ్ళూ అవీ పంపడమూ—యివన్నీ యెందుకు వస్తాయీ?"

"అవునేవ్!...కాని సూరయ్యగారికి పళ్ళు పంపిస్తునేం? నాన్నారు అలాంటి బట్ట లిస్తురేం?"

"ఆయన్ని చూస్తే నాకు వొళ్లు మండిపోతుంది—"

"నాకూనూ. వొక కథ రాయడానికి పది రోజులు పట్టేది. "ఆఫీసు పనులు తేలడం లే" దని నాతోనూ, "అమ్మాయిగారి కథలు రాయడంతో సరిపోతోం" దని నాన్నారితోనూ చెబుతూ యింటో కూచుని—"

"అంత మేలు చేశాడు కదా మరి రామచంద్రానికి నువ్వేం బహుమతీ చేస్తావూ?"

"అవునే పిన్నోయ్! నాకు తోచిందే కాదు చూశావా?...ఏం చెయ్య మంటావే?"

"నా కేం తెలుసునే!"

"వులకం"

"కాకేమమ్మా? నువ్వు కథలు రాయడమూ, అతను దిద్దడమూ, యిద్దరి వుద్దేశాలూ కలవడమూ—"

"బహుమతీ మాట చెప్ప మంటే దండకం విడేస్తా వేమిటే"

"నే నేం చెప్పగలనే? నీ మనస్సులో యేం వుందో—"

"అసలు నాకు తోచందే లే"

"కభుర్ల కేం లే? నిజంగా యేమీ లేకపోతే కోరి అలాంటి బట్టలు నీ చేతుల్తో యివ్వగలవా? చెన్నాపట్టం వెడితే పదిరోజుల్లో తిరిగి వచ్చేవాడికి వూరగాయీ, బత్తాయిలూ పంపించగలవా? పైగా వుప్పాడ కండువాల కోసమూ, రిస్టువాచీ కోసమూ, రవ్వల వుంగరం—"

"ఆమాట నువ్వు తెచ్చావు"

"నేను తెస్తే మాత్రం, నువ్వు విడిచిపెట్టావా యేమిటి?"

"......................."

"పైగా అతనింటికి వచ్చేదాకా నీకు నిద్రాహారాలు సయించాయా?...నే నెరగ ననుకున్నా వేం?"

సుభద్ర మాట్లాడలేదు. మొగం కూడా పైకెత్తలేదు. ఆవంచి వున్న మొగమ్మీద ఆనందమూ, ఆనందం మీద సిగ్గూ, సిగ్గుమీద మాన్పాటూ ఇట్టిట్టే అలుముకు పోయాయి.

౧౧

పంతులయ్య మేడమీద దక్షిణపు వసారాలో పచారు చేస్తూ పత్రిక చదువుకుంటూ వుండగా

ముసిముసి నవ్వులు నవ్వుతూ వచ్చి జానకమ్మ పత్రిక పుచ్చుకొంది.

"ఏం కథా?"

"అమ్మాయికి సమ్బంధం చూడండి"

"ఎంచేతా?"

"ఈడు వచ్చింది కాదూ?"

"అయితే నువ్వే చూడరాదూ?"

"అన్నట్టు—మన మేమీ కష్టపడనక్కర్లే దా విషయంలోను"

"అంటే?"

"నా రండి తెలుస్తుది?"

ఇద్దరూ వుత్తరపు వసారాలోకి బయలుదేరారు. పంతులయ్యకి జానకమ్మ చూపించపోయింది అర్థం అయింది; కాని వరు డెలాంటివాడో అని కంగారు పట్టుకుంది మధ్యదారిలో జానకమ్మ "మీ రేమీ మాట్టాడకండేం" అంటూ చేత్తో కూడా నిషేధించింది; కాని అత నంతకి ముందే నిరవు డయి పోయాడు. చివరి కిద్దరూ వసారా గదిలోకి వెళ్లి కిటికీ దగ్గర నుంచున్నారు.

కిందికి చూడగా తోటలో పొగడ చెట్టుకింది అరుగుమీద తువ్వాలు పరుచుకు పడుకుని రామచంద్రం యేదో పుస్తకం చూసుకుంటున్నాడు. సుభద్ర సీమచింత కట్టవ చాటున నక్కి వుండి అతన్ని తొంగితొంగి చూస్తూ వుబలాటపడి పోతోంది.

పంతులయ్య పెద్ద నిట్టూర్పు విడిచాడు.

"ఏ మంటావ్?"

"అతను చెన్నాపట్టం వెళ్లింది మొదలు అమ్మాయికి నిద్ర లేదు. హారం లేదు. మరి ప్రపంచకం కూడా లేదు"

"అతనికి తెలుసునా?"

"వో్రి అమాయికుడు. ఏమీ యెరగడు పాపం!"

"ఏమిటి చెయ్యడం?"

"ఈడూ జోడూనూ. ఆపైని అమ్మాయి తల్లడించి పోతోంది; కాని—"

"ఇంకా యేమిటి?"

"మీ దర్జాకి—"

"నిజమే. మనం ఐశ్వర్యవంతులమే; కాని అతని భావోన్నతి యెదట మన దర్జా యేపాటిదీ? అమ్మాయికి తగిన వరుడు అతను తప్ప భూమ్మీద మరొకడు లేడు. ఈశ్వరు డత న్నిందుకోసమే మన యింటికి తీసుకువచ్చాడు. అతన్ని పెళ్లి చెయ్యడం కంటే అమ్మాయికి నేను చెయగలది మ రేమీ లేదు"

"....................."

"నే నీ పని చెయ్యకపోతే అమ్మాయికి అపకారమూ, దాని తల్లికి ద్రోహమూ, చేసిన పాపాన పోతాను"

"....................."

"అమ్మాయికి పెళ్ళియీడు వచ్చిం దనీ, అదొక యింటిది కావడం కోసం అటమటించిపోతూ వుంటుం దనీ యెరుగుదును. అయితే: అమ్మాయి దృష్టి యెలా పోతుందో, యెలాంటి వాడు నా సంపత్తికి వ్యవహర్త అవుతాడో అని నేను చాలా బెంగపెట్టుకున్నాను; కాని నా బెంగ తీరడమే కాదు; తపస్సు ఫలించింది"

జానకమ్మ మాట్టాడలేదు. రెప్పకూడా వెయ్యలేదు. పంతులయ్య మొగమ్మీద వొకటే చూపు—

"ఏ మంటావ్?"

"....................."

"ఏమిటి చూస్తున్నావు?"

"దేవతాకళ"

"ఎక్కడా?"

"మీ మొగమ్మీద"

పంతులయ్య అత్యానందంతో ఆమె యెడమ బుగ్గమీద యిట్టే అన్నాడు.

"మీరు వేసే ప్రతీ అడుగులోనూ, చేసే ప్రతీ పనిలోనూ,—వుచ్చరించే ప్రతీ అక్షరంలోనూ అంతు లేని ఔదార్యం కనపడుతూనే వుంది. మీ స్వరూప మంతా నా కిప్పుడు బోధపడ్డట్టెప్పుడూ బోధపడలేదు. లోకంలో యే సంపన్నుడూ, యే పండితుడూ, యే భోగీ, యే దాతా, యే తంత్రీ కూడా మీ కాలి గోటి కయినా పోలరు" అని చెబుతూ ఆమె అతని వక్షస్థలమ్మీద తన మొగం ఆనించుకుని పరవశురా లయిపోయింది.

# హరిజనోద్యమపు ఆవశ్యకము

శ్రీ కొమాండూరి శఠకోపాచార్యులుగారు ఎం. ఏ. బి. ఎల్.



హరిజనులు హిందువు లగుటయే గాక చాతుర్వర్ణ్యములో నాలుగవవర్ణమం దంతర్భాగము లగు నిమ్నజాతివా రని తోచుచున్నది. * వారి అస్పృశ్యత యెప్పు డేరీతిగా నారంభించినదో స్పష్టముగా తెలియుట లేదు. మహమ్మదీయులు క్రైస్తవులు మొదలగు అన్యజాతీయులు హరిజనుల నస్పృశ్యులుగ నెంచుట లేదు. హిందువులలోనే మిగిలినవారు వీరి నంటరానివారుగ నెంచుచున్నారు. అంతేగాక మన రాష్ట్రపు గ్రామాదులయందు పెక్కుచోట్ల మనవారు హరిజనులను సమీపించరానివారుగను, చెప్పరానివారుగ నెంచుచున్నారు. ఆర్థికముగను, సాంఘికముగను గూడ వీరి దుస్థితి వర్ణనాతీతము. ఇందుకు చాల వఱకు వీరి అస్పృశ్యత కారణము. జన్మచే ఆనువంశికముగ నేజాతిని అస్పృశ్యముగ నెంచుటకు వేదములు భగవద్గీత మొదలగు మన మూలగ్రంథములలో నాధారము కనబడదు. ఈ హరిజనులే హిందూమతమును వదలి తురకలో క్రైస్తవులో అయినచో, మన హిందువు లందరము వారి నస్పృశ్యులుగను, క్షుద్రులుగను చూడక మిగిలిన మహమ్మదీయులతోను, క్రైస్తవులతోను సమముగ గౌరవింతుము. అందుచే వారి ఆర్థికస్థితిగూడ బాగుపడుచున్నది. హిందూజాతి భద్రత గోరువారందరు హరిజనులను వారి ప్రస్తుతహీనస్థితినుండి యుద్ధరింప బూను టవసరము. వారి నన్యజాతీయుల కన్నను, మృగముల కన్నను గూడ మిక్కిలి నీచముగ జూచుట మిక్కిలి అన్యాయ మని మన పెద్దలు చాలమంది అంగీకరించుచున్నారు. చిరకాలమునుండి మహనీయు లగు అనేకహిందూమత సంస్కర్త లందుకై ప్రయత్నించిరి. ఇటీవల గాంధిగారు కాంగ్రెసు కార్యక్రమములో రాజకీయముల కన్న గూడ దీనికి ప్రాధాన్య మిచ్చిరి. అందుపైన రాజకీయముగ జాతీయవాదులై కాంగ్రెసు అభిమానులుగా నుండిన వారిలో గూడ చాలమంది సనాతనులు దీనికి వ్యతిరిక్తులై, అందుకు గాంధీజీ మొదలగువారి ననేకవిధముల దూషించిరి. అందుచే ప్రబలిన ద్వేషోద్రేకమే గాంధీజీపై ఇటీవల బాంబు వేయబడుటకు కారణ మయ్యె నని చాలమంది ♦ యూహించుచున్నారు. హరిజనుల నుద్ధరించుట, కొంతవర కస్పృశ్యతా నివారణము మంచిదే గాని అది ప్రస్తుతావసరము కాదని గాంధిగారు మొదలగు కాంగ్రెసునాయకులు కేవలరాజకీయకార్యక్రమమే యిప్పుడు బాగుగా నడిపించవలెనని అందుచేతనే స్వరాజ్యము లభించగలదని ఆ పైని హరిజనోద్ధరణము సావకాశముగ వీలగునంతవఱకు జరుపవచ్చు నని తీవ్రసనాతనుల నాయకులు కూడ చెప్పుచున్నారు. అఖిలభారతవర్ణాశ్రమధర్మసభాధ్యక్షులకు అవధానిశిరోమణి శ్రీ కాశీ కృష్ణాచార్యులవారును యిట్టి అభిప్రాయమునే తెల్పిరి. కాని విమర్శించుచో ఈ అభిప్రాయము పొరబా టని తోచును.

హరిజనోద్ధరణము వెంటనే జరుగనిచో జాతీయవాదులు గోరు నిర్మాణకార్యక్రమము అన

* ప్రబుద్ధాంధ్ర యీ సాలు జూను నెల సంచికలో "హరిజనులజాతి" అను శీర్షిక వ్యాసము చూడుడు.

♦ ఈ బాంబు ప్రయోగమువలన తీవ్రముగా గాయపడిన శ్రీ ఎల్. బి. భోపేత్కరుగారు ఈ ప్రయోగము గాంధిగారి నిమిత్తము ఉద్దేశింపబడలేదని మాలవ్యాగారితో చాల దృఢముగా చెప్పినట్లు యిటీవలి పత్రికావార్తలు చెబుతున్నవి. (సంపాదకుడు).

~~౩౦~~
౫౦

గా ఖద్దరువ్యాప్తి, త్రాగుడునివారణ, హిందూమహమ్మదీయ సఖ్యత... 

గా ఖద్దరువ్యాప్తి, త్రాగుడునివారణ, హిందూముసల్మానుమైత్రి, స్వదేశి మొదలగునవి సరిగా నెరవేరునా? ఖద్దరు జనసామాన్యమున వ్యాపించకపోవుటకు మూలకారణము అవి మిల్లుబట్టలకన్న చాల ప్రియముగ నుండుటయే. ఉన్నతజాతివారు నూలు తీసి బట్టలు నేయుటకు వారు సంపాదించు కూలి రేటు కిట్టుబాటు గాదు. నిరాధారులగు ఆదిహిందువులకు మాత్రము గిట్టును. పూర్వకాలమందు అన్నిప్రాంతములందును హరిజనులు చాల ప్రశస్తమగు నూలు తీసి నేయుచుండిరి. ఇప్పటికిని గుంటూరుజిల్లాలోను పశ్చిమాంధ్రమందును కొన్ని యితరస్థలములందును కూడ మాలలు నేసిన బట్టలను తక్కిన జాతులలో చాలమంది ఉపయోగించుచున్నారు. రోజు కణా కూలి కూడ దొరకక గుడిసెలలో దిక్కులేక యున్న వీరికి ఆయా గ్రామస్థులు దూది నిచ్చినచో వీరును వీరి పిల్లలును కావలసినంత నూలు బట్టలు మిల్లునూలు బట్టలకన్న చవుకగా తయారుచేయుదురు. అందుచే వారికి కావలసిన గంజి అన్నము దొరికి సంతోషించి కృతజ్ఞులగుదురు. మఱియు చెప్పులు మొదలగు తోలుపనులు, వడ్రము, కమ్మరము మొదలగు పనులు హరిజనులే పూర్వము చాల చవుకగాను, అతి నిపుణతతోడను చేయుచుండిరి. కాలక్రమమున వారితో సంపర్కము మనకు పూర్తిగ వదలిపోయి వారు కూడు లేక మలమల మాడుచుండ మన మన్యదేశవస్తువులనువాడుచున్నాము. కూలిజాతిలో ముఖ్యులగు నీ హరిజనులను దగ్గిర దీసి విద్య గరపి వారిచే చవుకగా మనకు వలయు బట్టలను, చెప్పులను, యింకను యితరవస్తువులను మనము తయారుచేయించుకొనవచ్చును. ఇందు కస్పృశ్యత తొలగి హరిజనులలో పరిశుభ్రత ప్రాథమికవిద్య వ్యాపించుటయే గాక వారికి మిగిలిన హిందువులందు విశ్వాసము కలుగుట చాల అవసరము. వారిని దూరములోనే యుంచి వారి బ్రతుకును గూర్చి మనము కేవల మశ్రద్ధగా నుండు నంత కాలము హరిజనుల పరిశుభ్రులై, వృత్తిహీనులై దిక్కు లేక యుందురు. గ్రామపునర్నిర్మాణమునకును హరిజనోద్ధరణ మవసర మని పైసంగతుల వల్లనే స్పష్టము కాగలదు. కోట్లకొలది నిరాధారులుగ నున్న హరిజనుల చవుక కూలివలన మిగిలిన జాతి పారిశ్రామికులుకూడ యితరవస్తువులను చవుకగా చేయకలుగుదురు. అందుచే గ్రామములందు నశించిన వృత్తు లన్నియు తిరిగి యేర్పడును. మద్యపాన నిషేధము జయప్రదమగుటకు అజ్ఞానాంధులై కేవలము మూఢు లగు నీ అస్పృశ్యుల మనవద్దకు రానిచ్చియు గూడెములకు బోయియు వారికి తగు బోధ చేసి వారి నట్టి మూఢత్వమునుండి మరలించు టవసరము. త్రాగుడందరి కన్న మాలమాదిగలలోనే యెక్కువగా వ్యాపించి యున్నది. వారు శుభాశుభ కార్యములందును, కులసభలందును, అమ్మవారి ఉత్సవములందును విశేషముగ త్రాగుదురు. త్రాగుడు అమ్మవారికి ప్రీతికర మనియు, మధుసేవ జరుగనిచో గ్రామదేవత కాగ్రహము కలుగు ననియు వారి నమ్మిక. మతాచార సంబంధము లగు యీ మూఢవిశ్వాసములను అజ్ఞానమును తొలగించుటకు హిందూధర్మము మద్యపానమును గాక తన్నిషేధమునే బోధించు ననియు క్షుద్రదేవతారాధనము, మృతజంతు మాంసభక్షణము, గోమాంసాశనము కూడ దనియు వారికి బోధింపవలసి యున్నది. మతపీఠాధిపతులును, హిందూసనాతన ధర్మనాయకులును, ఇట్లు చేయుచో హరిజనులలోనే గాక వీరితో కలిసి త్రాగు చాకళ్లు మొదలగు వారిని గూడ బాగుచేసి హిందూమతము నుద్ధరింప కలుగుదురు. కాని వారి బాధ్యత నెంతమాత్రము నెరవేర్చుట లేదు. విశేషముగ త్రాగు ఆరుకోట్ల హరిజనుల గూడెములపైపైనను చూడక వారి సంస్పర్శను విషతుల్యముగ జూచుచు మనలో మనము త్రాగుడు కూడదని యెంత ప్రచారము చేసినను మద్యపాన

నిషేధ మెన్నటికిని జయప్రదము కానేరదు. ఈఆదిహిందువుల త్రాగుడు, అమ్మవారి జాతరలు మొదలగు దురాచారములు వారినే గాక హిందూజాతి నంతను గూడ గుల్ల చేయుచున్నది. బ్రాహ్మణులుగూడ ఇందుకు లోనగుచుండుట శోచనీయము. పునాది దుర్బలమై గుల్ల యగుచుండ దాని నశ్రద్ధ చేసి భవనమునకు పైఅంతస్తులు గట్టి అలంకరించుటచే లాభ మేమి? ఎప్పుడో ఒక సారి ఆభవన మంతయు కూలక తప్పదు. ఆర్థికముగను, సాంఘికముగను (కొందరు నమ్మకపోయినను రాజకీయముగను గూడ) నీ ఆదిహిందువులే హిందూసంఘపు పునాది. వారు నశించినచో హిందూసంఘ మంతకు హాని కల్గును. మరియొక విషయము. ఈ ఆదిహిందువులను మహమ్మదీయులో క్రైస్తవులో తమ మతము నందు చేర్చుకొనుటకు ప్రచారము చేయుట, ఆ మాలమాదిగలు తమకు అందుచే నస్పృశ్యతానివారణ కలిగి ఆర్థిక సాంఘికలాభములును కలుగు నని ఆమతములలో కలియుట, అంతట వారికి క్రైస్తవ ముసల్మాను ప్రచారకులకు మన ప్రచారకులకు ఘర్షణ విరోధములు కలుగుట పరిపాటి అయినది. హిందూసంఘము మన దేశమున ప్రస్తుత మధిక సంఖ్యాకము. హరిజను లామతములలో చేర్చుకొనబడినచో హిందువు లల్పసంఖ్యాకులై దేశమున ఇప్పుడున్న పలుకుబడి కూడ లేకుండ పోవుదురు. హిందూదేశములోనే హిందూమతము క్రమముగా క్షీణించిపోవును. ఈవిపత్తు రాకుండుట కైనను హరిజనుల అస్పృశ్యత తొలగించి కలహబీజ మగు మతాంతరప్రాప్తి వారింపనిచో వారు నిరాశులై హిందూమతము వీడుటయు, యితరమతస్థులు మనము "మాపిల్లంటే మాపిల్ల"అని వారికై తగువు పడుటయు తప్పదు. అందుచే హిందూసంఘటనమునకే గాక హిందూముసల్మానుక్రైస్తవసఖ్యతకు కూడ అస్పృశ్యతానివారణ మవసరము. మన దేశపు యితరులతో పాటు హిందువులలో గూడ నూటికి ౯౩ రు నిరక్షరకుక్షులు. మన దేశము చైనా తప్ప తదితరదేశస్థు లందరు సాధారణముగా నూటికి ౯౦ మందివరకు విద్యావంతులే. మన జనసామాన్యమునకు ప్రాథమికవిద్య అయినను లేనందున సంఘము క్షీణదశలో నున్నది. జనుల ఆరోగ్యము, గ్రామపారిశుద్ధ్యము పత్రికల ప్రచారాధిక్యము, గ్రంథాలయవ్యాప్తి, దురాచారనివారణము, యిట్టి దేశహితకరోద్యమముల కన్నిటికి పామరజనులలో ప్రాథమికవిద్యావ్యాప్తి అత్యవసరము. హిందువులలో వివిధకులము లన్నిటికన్న హరిజనులే అధికసంఖ్యాకులు. వారిలోనే విద్య బొత్తిగా శూన్యము. మాలపల్లెల వైపు చూడక మన పాఠశాలల లోనికి వారి పిల్లలు వచ్చిన కంటగించుకొనుచు వారి విద్యకై మనము శ్రద్ధ వహించనంతవరకు జనసామాన్యపు నిరక్షరత అజ్ఞానము పోవు. ఈమాలమాదిగల దురాచారములు, మౌఢ్యము నివారణ చేయనందున తక్కిన జాతులకు గూడ నిది వ్యాపించుచున్నది. ఇట్లు గ్రామపునర్నిర్మాణము సాంఘికాభివృద్ధియే గాక రాజకీయనిర్మాణకార్యక్రమము గూడ జయప్రద మగుటకు ముందుగా నీ ఆదిహిందువుల నుద్ధరించి వారి నధోగతిపాలు కాకుండ కాపాడుట అవసర మని తోచుచున్నది.



# ఒక పతివ్రత

కొడవటిగంటి కుటుంబరావుగారు



ఇది నా జీవితంలో విపరీత మైన సంఘటన. ఇందులో నా తప్పేమీ లేకపోయినప్పటికీ, ఇది నా జీవితానికి కళంకం తెచ్చింది. ఇది జరిగి ఇప్పటికి పది సంవత్సరా లయింది: దీని ఫలితం ఇంకా నన్ను వెంటాడే, నాకు నిద్రాహారా లందూ ఇతర ఐహికవాంఛలందూ విముఖత్వం కలిగిస్తున్నది అన్నిటికన్నా నన్ను బాధిస్తున్నది స్త్రీపై ముఖ్యం. నన్ను ప్రకృతి బ్రహ్మచర్యానికి నిర్దేశించ లేదు, కాని ఇంతకాలం నించీ చేస్తున్న పనే అది. దాపరికం ఎందుకు? నేను ఆడదాన్ని చూసి పూర్తిగా చెదిరిపోయినాను! నా బెదురు పోగొట్టగల స్త్రీజాతి లేకపోలేదు; కాని ఆసందుల్లో అడుగు పెట్టటానికైనా నాకు నైతిక మైన గుండె నిబ్బరం లేదు. నేనట్లా పుట్ట లేదు.

ఈఅనుభవం పగవాడి కైనా వద్దు!

నేనిది మొదటి సారి కాదు రాయబూనటం. బిడియం విడిచి నా సంగతి నేను రాసుకోగలగటానికీ శక్తి ఇచ్చాడు కాదు భగవంతుడు. అట్లా రాసి సంతోషించే మనస్తత్వం ఆభావకవులకే అవగతం కావాలి. కాని జరిగిందంతా ఒక్కసారి లోకానికి వెల్లడి చేసేస్తే నా మనస్సు చాలా తేలికవుతుం దని అంతరాత్మ చెబుతున్నది. చేస్తున్నాను నా పదమూడో ప్రయత్నం! తగిన మనోబలం ఇవ్వ మని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను.

నేనింకా బాల్యదశలో ఉండగానే, నాకింకా పాతివ్రత్య మంటే ఏమిటో తెలీక మునుపే, నాభార్య పతివ్రత కాబోతుం దని ఎరుగుదును. నాజాతకం రాసినాయన అముక్క రాశాడు! అప్పటి కింకా పుట్టని పిల్ల నప్పుడే పవిత్రంగా భావించుకోటం మొదలుపెట్టాను!

మా నాన్న చేసిన అసాంత్రప్పనుల్లో నావివాహం ఒకటి. అతి స్వల్పవిషయాల కోసం ఉభయపార్టీల వారూ అతిదారుణంగా దెబ్బలాడుకున్నారు. అప్పటికి మా నాన్న ఇంచుమించుగా నాకు రెట్టింపు వయసువాడు, మా మామగారు నాకు మూడింతల వయసూ, పదింతల అనుభవమూ కలవాడు? అనుభవం వల్ల కూడా అజ్ఞానమూ అవివేకమూ నశించ వేమో ననుకున్నాను.

ఈ తగాదాలు వైరంగా పరిణమించి నా మనసును ఆందోళన పెట్టినై. వివాహానంతరం ఆరెండు మూడు సంవత్సరాల కాలం అచ్చట్లూ ముచ్చట్లూ లేకుండా పోవటమే కాక, నాపతివ్రతను నేను ఏపండగమిషమీదనో చూసుకోటం లేకపోగా, ఆ రెండు మూడు సంవత్సరాల గడువును అతీ గతీ లేకుండా పొయ్యేటట్టూ, నే నేదైనా తెగబడి చేసే దాకా, నలుగు రయిన వాళ్ళకూ ఎదురుతిరిగే దాకా నాకూ నాభార్యకూ ఎడబాటు తప్పనట్టూ కనిపించింది. పూర్వమల్లే నే ఇక ముందు కూడా నలుగురి చేతా బుద్ధిమంతు డనిపించుకోవా లంటే చచ్చువెధవగా ఉండటం కూడా తప్ప నని కూడా తేలిపోయింది. ఈ విధంగా నా అభిప్రాయాలు మారిపోతున్నప్పటికీ, అదివరకు మంచిగా కనపడ్డదిప్పుడు చెడుగా నిర్ధారణ అవుతున్నప్పటికీ నా ప్రవర్తనలో ఎటువంటి మార్పూ చేసుకోలేకపోయిన అసమర్థుణ్ణి నేను. అదే పనిగా పెట్టుకుని ఇంత కాలం నించీ నాకంటి అసమర్థులను ప్రతిరోజూ లెక్క లేనంతమందిని కనిపెడుతున్నాను. మన సంఘం యావత్తూ నావంటి అసమర్థులతో నిండినట్టు కనిపిస్తుంది. మన అభిప్రాయాలకు అనుగుణ్యంగా ప్రవర్తన మార్చుకుని అసమర్థత దులిపేసుకోటం మాటలతో సులభంగానే అవుతుంది కాని

ఆచరణలో పెట్టటానికి ఎంతో బుద్ధిబలమూ ఆత్మగౌరవమూ కావాలి. అంతే చెప్పటానికీ చెయ్యటానికీ భేదం. చెప్పటం బాగా చాతయినవాళ్లు ఏకారణంవల్లనో బుద్ధిబలానికీ ఆత్మగౌరవానికీ ప్రాముఖ్యత ఇవ్వకుండా ఉంటున్నారు. బాగా ఆలోచించగా మన జాతి వెనకపడి ఉండటం ఇతరజాతులకన్న మనం తక్కువ తెలుసుకున్న వాళ్లం కావటం కాదని తోస్తున్నది. మన జాతికి ముఖ్యంగా ఆత్మగౌరవం ఏనాడు పూర్తిగా కలుగుతుందో ఆనాడు మనం ఇతరజాతులన్నిటినీ మించి ముందు పోతాం అంత దాకా మనకు కావలిసిన వాళ్లు చెప్పగలవాళ్లు కానే కాదు; చెయ్యగలవాళ్లు! ఈలోపుగా మన సారస్వతం ఎంత అభివృద్ధి చేసుకున్నా అది ఇతరజాతుల మెప్పు సంపాదిస్తుంది కాని మన కేమీ ఉపకరించదు!

నాకు పార్వతీశంతో పరిచయం కలిగింది గుంటూరులో. నా కక్కడ తాలూకా ఆఫీసులో ఆరునెల్లు ఆక్టింగ్ గుమాస్తాగిరి ఒక పెద్దమనిషి సిఫారసు మూలాన లభించింది. ఆఫీసుకూ హోటలుకూ కూడా దగ్గిరలోనే ఉండే టట్టు అరండల్ పేట పోస్టాఫీసు చుట్టుపక్కల గది కోసం వెతకటం ప్రారంభించాను. నాకు నచ్చిన గది ఒకటి కనపడ్డది. గది చాలా విశాలంగా ఉండటమే కాక అద్దె నాలుగు రూపాయలే కావటం ఒకటీ, ఇంట్లో ఒక వృద్ధురాలూ ఆవిడ కుమారుడూ (కాలేజిలో చదువుకుంటున్నాడప్పుడు) మాత్రమే ఉండటం వల్ల బావికీ దొడ్డికీ స్వేచ్ఛగా వెళ్లుతుండటానికి ఆటంకం లేకపోవటం ఒకటీ, గది వాకిలి ఇంటివారితో సంబంధం లేకుండా వీధిమీదికి ఉండటం ఒకటీ నాకు చాలా తృప్తికరంగా ఉన్నై. కాని ఇంటావిడ ఒక కండిషను పెట్టింది.

“రే పుదయం ఏమాటా చెబుతా న్నాయనా! పది పన్నెండు రోజుల కింద ఇంకో అబ్బాయి వచ్చి ఈరోజు సాయంత్రం లోపలే ఏమాటా చెబుతాను; అంత దాకా ఎవరికి మాట ఇవ్వవద్దని చాలాచాలా చెప్పి పోయినాడు. మళ్లీ కనిపించలేదు. బహుశా రాడనే తోస్తుంది. మరి ఆగడువు లోపల నేకెట్లా మాట ఇవ్వను?” అన్నదావిడ. “సరే లెండి! ఫరవాలేదు!” అని నేను నిశ్చింతగా వెళ్ళిపోయినాను. ఆకుర్రవాడు మళ్లీ రావచ్చాడా అని నాధైర్యం. మర్నాడు నేను వెళ్లేటప్పటికి గది ఆక్రమించబడి ఉంది!

నాకు పూర్తిగా ఆశాభంగమయింది. ప్లాటుఫారంమీద అడుగు పెడుతూండగా రైలు సాగిపోయినవాడు పోతున్న రైలువంక నిరర్థకంగా చూస్తూ నిలబడ్డట్టు నేను నిష్ప్రయోజనంగా కొంచెం సేపు ఆ గదిముందు తారట్లాడాను. ఇంతలో అతను నన్ను చూసి లోపలికి ఆహ్వానించి సంభాషణలోదించి జరిగిందంతా తెలుసుకున్నాడు. ఆకాస్త సంభాషణలోనే నా కతని మీద మంచి అభిప్రాయం ఏర్పడ్డది. మొదటి సంగతి అతను స్నేహపాత్రుడు. ఎక్కడికి పోయినా ఎక్కువ ప్రయత్నం అవసరం లేకుండా గౌరవం పొందగలవాడల్లే కనిపించాడు. అతని వయస్సు అప్పటికి ఇరవై రెండు దాటి ఉండదు. నాకంటె రెండు సంవత్సరాలు పెద్ద. అంతే! అయినా అతని ముందు నాకు నేనే వృద్ధున్ననిపించాను. అతను ఆరోగ్యంతోనూ బలంతోనూ పొంగిపోతున్నాడు. అతని మెడ చాలా బలిష్ఠంగా ఉంది. అతను వేసుకున్న మల్లు లాల్చీ అతని దండలనూ ఛాతీని దాచలేకుండా ఉందన్నమాట. అతని నడుము ఇరవై నాలుగంగుళాలు మించి ఉండదు. అసలిన్ని బాహ్యలక్షణాలు వర్ణించటం అనవసరం. ఇద్దరు మనుష్యులకు పరస్పరాకర్షణ కలగటానికి భాషాతీతమైన విషయాలనేకం ఉంటై.

ఒక్క నిమిషంలోపలే మా సంభాషణ అయిపోయింది. పైన మరో అరనిమిషం అనవసరంగా

కూర్చుని ఒక నిట్టూర్పు విడిచి లేచాను. గది వెతుక్కోవలసిన పని అట్టే ఉంది మరి. నేను కాళ్ళీడ్చుకుంటూ గుమ్మందాకా పోయిన తరవాత అతను నన్ను పిలిచి అనుమానిస్తూ ఇద్దరం ఒక గదిలో ఉండటం అసంభవమౌతుందా అన్నాడు. నాకా ఆలోచన తట్టనే లేదూ! లోపల ఉత్సాహం అణుచుకుని ఎందు కవుతుం దన్నాను. ఒకరి తరవాత ఒకరు లాభాలు కూడా కనిపెట్టాం.

“అద్దె రెండు రెండు రూపాయలే అవుతుందీ!”

“అవును. ఒకళ్ళ కొకళ్ళు తోడుగా ఉంటాం!”

“అవును. కంపెనీగా ఉంటాం—ఒంటరిగా బిక్కు బిక్కు మంటూ ఉండే కన్న!”

“గది ఒకళ్ళకే చాలా ఎక్కువ కూడానూ!”

ఆసాయంత్రం నేను కూడా ఆగదిలో ప్రవేశించాను.

పార్వతీశం నాకు కొత్తరకం మనిషి. కొత్త అనుభవం కూడానూ!

అటువంటి మనిషిని నేనంతకు పూర్వం గాని తరవాత కాని చూడలేదు. అతనితో పరిచయం కలుగుతున్న కొద్దీ అతనిలో నా వంటివాడు నేర్చుకోవలిసిన విషయాలు చాలా కనపడ్డై. ఈవిధంగా అతని మీద నా కభిమానం ఎక్కువవుతూండగా అతన్ని గురించి దారుణమైన సంగతి తెలిసింది. తెలిసిం దేమిటి? అతనే చెప్పాడు—తనకు చుట్టుపక్కల నలుగు రైదుగు రాడవాళ్ళతో ఇలాకా ఉందని!

నేనంతకు పూర్వం వ్యభిచారం చాలా చెడ్డదనే నమ్మకంతో ఉండి, అంత చెడ్డది కాకపోవచ్చును దేశకాలపాత్రాలను బట్టి అని అనుమానమైనా లేకపోవటంవల్ల, దాన్ని గురించి ఆలోచించిన పాపాన పోయిన వాణ్ణి కాను. ఇప్పు డిక తప్పకపోయింది. ఎందుచే తంటే, నేను త్వరగా అభిప్రాయం మార్చుకునే వాణ్ణి కాను మరి. రంకుతనం చెడ్డ దనే అభిప్రాయం మార్చుకోటం ఎంత ఇష్టం లేదో, అతను పెద్ద మనిషిఅన్న అభిప్రాయం మార్చుకోటం అంతకన్న ఇష్టం లేదు. నిజం విచారిస్తే మొదటి అభిప్రాయం నాది కాను. రెండోది నా సొంతం. ఆత్మగౌరవాన్ని గురించి ఉపన్యాసం ఇన్నిసార్లు నాకు నేనే ఇచ్చుకున్న నేను ఇంత స్వల్పవిషయంలోనే దాన్నెందుకు పోగొట్టుకోవాలి? నాది కాని అభిప్రాయంమీద గౌరవంచేత నాసొంత అభిప్రాయాన్ని ఎందుకు మార్చుకోవాలనిపించింది.

ఆలోచించగా ఆలోచించగా రంకుతనానికి మూడభ్యంతరాలు కనపడినై. ఒకటి, రంకుతనం అవినీతి అందుచేత ఆపని చేసే పురుషుడి భార్య మనస్సూ స్త్రీ, భర్త మనస్సూ వ్యధపొందుతై. దానికి తగిన కారణం ఉన్నా లేకపోయినా, వ్యధ పొందటం నిజమే కనక అవినీతి అనటానికి సందేహం లేదు. రెండు, రంకుతనం వల్ల ఒకరు కన్న పిల్లలు మరొకరి పాల పడటాని కవకాశం ఉంది. ఇది ఆలోచించిన కొద్దీ దారుణంగా కనపడ్డది. మూడు, ఒకరి నించి మరొకరికి వ్యాధులూ అవీ సంపకం కావటం. దాన్ని గురించి ఆలోచించ బుద్ధయినా పుట్టలేదు. పార్వతీశాన్ని వాదనలోకి దింపితే ఈ మూడు కారణాలూ ఎట్లా తోసేస్తాడో అర్థం కాలేదు. అంత వరకూ అతని పెద్దమనిషితనానికి భంగం కలుగుతున్న దనే భావించవలిసొచ్చింది తప్పని సరిగా.

కాని తీరా ఈవిషయం తెచ్చిం తరవాత పార్వతీశం నాకు ఊపిరి తిరగకుండా మాట్లాడాడు.

“ఒకరకం స్త్రీపురుషసంయోగం తీసుకుని అదే రంకుతన మని నమ్ముతున్నావు! నే నది అంగీకరించను. యాభై యేళ్ళ వాడు మూడో పెళ్ళి చేసుకుని ఆపిల్ల ఇష్టాయిష్టాలు విచారించకుండా ఆపిడతో సంసారసుఖం ఏరంకుతనం కన్నా ఘోరంగా

కనిపిస్తుంది నాకు అది చెరచటమే నంటాను అది నీతయితే నే నాచరించేది అంతకన్నా వెయ్యిరెట్లు ధర్మం. నా రంకుతనంలో—నువ్వన్న మాటే అంగీకరిస్తాను—అనేక భార్యాభర్తల కలయికలో లేని సౌందర్యం ఉంది. నాకు స్త్రీ అవసరం లేందీ ఇల్లు బయలుదేరను. అప్పుడు కూడా నాకోసం కని పెట్టుకుని ఉన్న ఆ కేదాని దగ్గిరికే పోతాను. నా రంకుతనంలో కక్కుర్తి లేదు. నాకో వెర్రి లేదు. నాసుఖం వెంట పశ్చాత్తాపం గాని, అసూయ గాని, ఏఇతరమనోజాడ్యం గాని లేదు. మనస్సుకు కాని శరీరానికి కాని జబ్బు చెయ్యని ఆనందం. దాన్లో ప్రేమ కూడా ఉంది. ఒక్క భార్య ఎదురుగా కూర్చుని ప్రేమ ఎక్కడుందా అని తల పగిలేటట్టు ఆలోచించే వాడికన్న నే నెంత నయం! నన్ను ప్రేమ అనేక రూపాలతో ఎదుర్కొంటుంది!

"నువ్వు చెప్పే నీతి ఆడదాన్నీ మగవాణ్ణీ ఆజన్మాంతం కట్టేసి చెప్పరాని బాధ తెస్తుంది. ఏ స్త్రీని ఎప్పుడు వదిలెయ్యాలో నాకు తెలుసును. అట్లా వదిలెయ్యటం నీకు భయంకరంగా ఉంటుంది. కాని అది మాఇద్దరికీ మంచి దని తెలిసినప్పుడే నే నటువంటి పని చేస్తాను.

"అదీ కాకుండా ఈవిషయం నీతి యావత్తూ విశదంగా తెలుసుకునే దాకా ఫలాని నీతి ఇది కాదని చెప్పరాదు. రోగా లున్న వాడి భార్య వాడితో కాపరం చెయ్యకపోవడం నీతా కాదా? నువ్వాలోచించ లేదు! స్త్రీపురుషులు అన్యోన్యంగా ప్రేమించుకుని మూడో కంటివాడికి తెలీకుండా రంకుతనం చెయ్యటం నీతా కాదా? ఆలోచించ లేదు! రహస్యంగా పిల్లలను కని ఇంకోరి భారం మీద వదిలిపెట్టటం నీతి కాదు! సరే, మూడు జన్మాల దరిద్రుడు సాలుకో పిల్లను కనటం నీతా అవినీతా? ఆలోచించ లేదు!

"నువ్వు ఒక్క విషయం ఆలోచించ లేదోయి! నీతి ఒక్కడి వల్ల ఆచరణలోకి వచ్చేది కాదు. అది సంఘంమీద ప్రసరించి నాగరికతనూ సంఘాన్నీ వృద్ధి చెయ్యాలి. ఈలోపల నేను రోగాలు తగలకుండా, నావల్ల ఇతరులకు గర్భాలు రాకుండా నా చాతనైన జాగర్త పడటం లేదనుకోకు!"

"ఇదంతా నాకు పట్టలేదు. నా కల్లా ఒక్కటే దిగులు! ఈనాటివరకూ నాకు దొరికే ఆడవాళ్ల విషయంలో నేను పొరపాటు పడటం లేదు. మరేం లేదు. తాత్కాలికంగా కలుసుకున్న కాస్సేపూ అవతల మనిషికి నామీద పూర్తయిన ప్రేమ ఉండాలి. అటువంటి మనిషి కాదని మొదటి చూపులోనే తోచిందా ఆవిడ రంభ గానీ తిరిగి అటు చూడను. ఇంతవరకూ నాఇన్‌స్టింక్ట్ సరిగానే పని చేస్తున్నది. పొరపాటున నా మీద ఇష్టంలేని మనిషిని సమీపించి ఒకసారి చివాట్లు పడ్డా ననుకో! ఇక నన్ను నేను క్షమించుకోగలనా? తరవాత ఆత్మహత్య చేసుకోటం తప్ప గతి లేదు. నాకంత అభిమానం ఉంది. ఇంతవరకటువంటి పరాభవం జరగలేదు. ఏక్షణం జరిగినా జరగవచ్చును! ఒకడు నా చెయ్యి చూసి నిన్ను స్త్రీ మోసగిస్తుం దని చెప్పాడు. తనకు సామిస్త్రీ బాగా రా దని కూడా ఒప్పుకున్నాడు. కాని నన్నామాట మధ్యమధ్య బాధిస్తూంటుంది, బ్రదర్!"

నే నతని ధోరణికి దిగ్భ్రమ చెందాను. ఇటువంటి ఉపన్యాసం నే నెన్నడూ వినలేదు.

"అయితే ప్రేమను గురించి నీ అభిప్రాయం లోకాభిప్రాయానికి భిన్నంగా ఉన్నట్టు కనిపిస్తుందే!" అన్నాను.

"లోకం ఊహించుకునే ప్రేమ పద్యా లల్లటానికీ కైత్వే నవలలు రాయటానికీ మాత్రమే పనికొస్తుంది. నేను ప్రేమ అనేది నా అపరిపూర్ణత్వానికి

పరిపూర్ణమైనది. అది ఎక్కువ భాగం శరీరసంబంధమైనది. నాతో సంబంధమున్న ఆడవాళ్లను గురించి నేను పూర్తిగా తెలుసుకోను. తెలుసుకున్న ఉత్తరక్షణం ప్రేమ పలాయనం అవుతుంది. ఈ తెలుసుకోవటం మనిషి లోపాలకే కాక ఒక్కొక సారి మంచి గుణాల కూడా వర్తిస్తుంది. ఒకప్పుడు నాతో సంబంధం గల అమ్మాయి నా ఎదట తన అవినీతిని దూషించుకుంది. వెంటనే నేను ఆమెను వదిలిపెట్టి వచ్చేశాను. నా కామెను చూస్తే కోపం రాలేదు కాని ఇక మా ఇద్దరికీ తాత్కాలికంగానైనా పరిపూర్ణమైన ప్రేమ కలగదని నేనెరుగుదును!"

ఉత్త ఉపన్యాసం వినటం అట్టే కష్టమనిపించలేదు కాని దంపు పురాణం ఎత్తగానే నాకు చికాకు ప్రారంభమైంది. నా మొహంలో అతనేదో మార్పు గ్రహించి ఉండాలి; వెంటనే విషయం మార్చాడు.

"మరో ముఖ్యమైన విషయం," అన్నాడతను. "అనేకమంది ఈ విషయంలో శీలవంతులనిపించుకునే వాళ్లు తమ శీలాన్ని స్త్రీ సంపర్కమనేది జీవితంలో లేకుండా చేసుకుని ఆపదానికి మైలు దూరంలోనైనా ఉండక దక్కించుకుంటారు. వాళ్లకు మాతృత్వం ఏమిటో ఎన్నటికైనా తెలుస్తుందా? అసంభవం. నేను నా తల్లి మాదిరిగా ప్రేమించగల స్త్రీ కనీసం ఒకతె ఉంది. నాకన్న రెండేళ్లు చిన్నది. నమ్ముతావా? ఆవిడ నా మనస్సును పైనుంచి కిందకి చదవగలదు. నా మంచి చెడ్డలు ఆవిడ దగ్గర దాచలేను. ఆవిడ నాకన్న ఎంతో అబల, ఆవిడ దగ్గర ఉంటే నాకు కొండ ఉన్నట్టుంటుంది! మనస్సుకు ఆందోళన కలిగినప్పుడల్లా వెళ్లి వాళ్ళింటో పదిరోజులుండి వస్తుంటాను!"

ఈ విషయమై అతని దగ్గర మళ్లీ సంభాషణ తేలేదు నేను. అతను చెప్పిన ముక్కలు వారించుకుంటూ చాలా రోజులు గడిపాను.

నా ఉద్యోగం ఇంకా నెలరోజులతో ఆఖరవుతుందనగా జరిగిందా ఘోరం!

ఆ రోజుల్లో పార్వతీశంలో మార్పు గ్రహించాను. అతను యథాప్రకారం వారానికో రాత్రి ఇల్లు వదిలిపోవటం మానుకున్నాడు దానికి బదులు ప్రతిరోజూ సూర్యాస్తమయం వేళ ఎక్కడికో వెళ్లి దీపాలు పెట్టగానే రావటం మొదలుపెట్టాడు.

ఒకరోజు అతనింటికి రాగానే "కొత్తపద్దా!" అని అడిగాను.

అతను కాస్సేపు నావైపు పరధ్యానంగా చూసి "నాలో ముసలినాడి లక్షణాలు కనిపిస్తున్నయ్యా?" అని అడిగాడు.

ఏమట్లా అడుగుతున్నావన్నాను.

"మరేం లేదు. కొంచెం ఉటోపియనయిపోతున్నానేమో అని భయం వేస్తున్నది. అది తప్పకుండా వార్ధక్య లక్షణమే!"

"ఏం?"

"ఎవరో పిల్లను చూసి నాకీ పిల్ల లభిస్తే ప్రపంచకమే అక్కర్లేదనుకోటాన్నేమంటావు? నాకిటువంటిదింతవరకూ ఎన్నడూ జరగలేదు."

"ఇప్పుడు జరిగిందా?"

అతను కాస్సేపు గంభీరంగా ఉన్నాడు. కాని చూస్తుండగానే అతనిలో నేనెన్నడూ గమనించని ఉద్రేకం వచ్చింది. "ఆ పిల్లకోసం గుండె కోసేసుకుంటానోయి! నాకు ముసలితనం లేదూ ఏమీ లేదూ! ఆ పిల్ల నా భార్య అయి ఉంటే నేను పర స్త్రీ వంక చూడక పోయి ఉందును! ఛీ! ఏం బతుకిది?...(నవ్వుతూ) కీచకుడికి ద్రౌపదిని చూడగానే ఇట్లాగే అనిపించిందేమో?"

నేను అప్రయత్నంగా "అదేం పోలిక?" అన్నాను

ఆ తరవాత ప్రతిరోజూ అతనిలో మార్పు గమనిస్తూ వచ్చాను. ఒకరోజు ఉత్సాహంగా పొంగి

పోతూండేవాడు. ఒకరోజు పండగరిసే కళ్లనీళ్ల పర్యంతం అయేటట్టు ఏడ్చేశాడు. "స్త్రీ స్వర్గమ మయింది. ఉన్మాదం తల కెక్కింది!" అను కున్నాను. అతన్ని ఏవిధమైన ప్రశ్నలూ వెయ్య లేదు నేను.

గురువారం నాడు సాయంకాలం అతను నాతో "ఇది దుర్భరం అవుతున్నది. మా సీతమ్మను చూసి రావాలి!" అని ఇల్లు వదలిపెట్టి పోయి నాడు. ఆరాత్రి అతను అమితానందంతో ఉన్నాడు—పెన్నిధి దొరికినవాడల్లే! అమాటే అడిగాను. దొరకనే దొరికిం దన్నాడు.

మర్నాడు సాయంకాలం అతను వెళ్లిన పావు గంటకే తిరిగి వచ్చాడు. అతని ఆనందం వర్ణనా తీతం!

ఆరాత్రి అతను పెళ్లికొడుకల్లే ముస్తాబయి నాడు. గడియారం చూసుకుంటూ కాలు నిలవక నేమో అటూ ఇటూ బోనులో మృగమల్లే పచారు చెయ్యటం మొదలుపెట్టి పది కాగానే బోనులో నించి వదిలిపెట్టిన ఎలికల్లే బయటికి జారుకున్నాడు.

పదకొం డయింది. నాకు నిద్ర పట్టలేదు. అతను వచ్చేవరకూ మేలుకుని ఉండటం మర్యాదగా ఉండదు. నే నతనికి ఉత్సాహభంగం ఏవిధంగానూ కలిగించలేదు అంతవరకూ. అతను వచ్చే వరకూ నేను మేలుకుని ఉండటం కూడా అతని మనస్సుకు కష్టం కలిగించవచ్చును. పదకొండున్నర అయింది. కళ్లు మండుతూన్నా నిద్దర మాత్రం వచ్చేటట్టు లేదు. నా ఆలోచనకు దారీ తెన్నూ లేదు. పన్నెండు!

బయట అడుగుల చప్పుడు. నేను నిద్రలో ఉన్నట్టు పడుకున్నాను.

"ఎవ రండీ లోపల?"

"ఎవరది?" అంటూ నేను పక్కమీద లేచి కూర్చున్నాను.

"నేను డాక్టరుగారి నౌకర్ని. మీ పార్వతీశం గారు బతికేట్టు లేరండి. మిమ్మల్ని డాక్టరుగారు చప్పున రమ్మన్నారు."

ఈమానవప్రకృతి కొన్నికొన్ని విషయాల్లో మారదేమో ననిపిస్తుంది. వాడు స్పష్టంగా పార్వతీశ మని చెబుతూంటే నేను పార్వతీశం కాదని నాకునేను రెండు నిమిషాలు నమ్మించాను. అప్పుడు ఒక్కసారిగా దడ పుట్టుకొచ్చింది. వణుకుతూ లేచి తలుపు దగ్గిరగా వేసి వాడి వెంట రొప్పుతూ నడుస్తూ సంగతి కనుక్కున్నాను. బ్రాడీ పేటలో గుడికి సమీపంలో ఎవరో పడి ఉన్నట్టు చూసి పక్కనే ఉన్న బండీమీద డాక్టరుగారింటికి చేర్చాడుట ఒక పెద్దమనిషి. ఎవరో పార్వతీ శాన్ని గట్టి కర్రతో వెనకనించి బలంగా కొట్టారు. తల అడుచుకు పోయింది. బతకటం అసంభవం! నాకు చెమటతో బట్టలు తడిసిపోయినై.

నేను వెళ్లేటప్పటికి అంతా మించిపోయింది. డాక్టరుగారు కాగితంమీద పార్వతీశం నోటివెంట వచ్చిన మాటలు రాసి పెట్టి చూపించాడు. "అను కున్నంత పని అయింది. బతకటం అనవసరం. మా సీతమ్మను చూస్తే—" ఇంకా ఏమిటో గొణిగా డట. డాక్టరుగారికి స్పష్టంగా తెలీలేదు.

డాక్టరుగారి కుర్రవాడు శవం మీది గుడ్డ తీశాడు. ఆదృశ్యం చూడగానే నాకు మూర్ఛ వచ్చేటట్టయింది. కళ్లలోకి నీళ్ళు తిరిగి అదృష్ట వశాత్తూ చూపు చెడ్డది. నేను తల పక్కకు తిప్పుకో గానే వాడు మళ్ళీ గుడ్డ కప్పేశాడు.

అంత సాహసం ఎవరు చేశారో తెలీనే లేదు! అర్థం లేకుండా నేను వెర్రివాడల్లే గుడిచుట్టూ తా రట్లాడటం మొదలుపెట్టాను ప్రతిసాయంత్రమూ. ఒక రోజున ఎక్కడో చూసినట్టున్న మొహం కనపడ్డది గుళ్ళోకి పోతూ. తరవాత జ్ఞాపకం వచ్చింది నాభార్య! చాలా అందగత్తె అయింది! నాభావమరిది!! తాగుబోతు వెధవ!!

నా రక్తం వేడెక్కి వేడి చెవులవెంట రావటం మొదలుపెట్టింది. పార్వతీశం చావుకు పెద్దమనిషల్లే పగతీర్చుకోగలనా?

బయట నాభార్యకోసరం కనిపెట్టుకుని ఉండి తరవాత ఆమెను వాళ్లింటిదాకా వెంబడించాను. నన్ను చూడగానే నాభార్య మొహం మూడురంగులు మారింది.

ఎవరూ నన్ను మర్యాద చెయ్యకుండానే నేను లోపలికి పోయి సావిట్లో నాభార్యను రెక్కపట్టి నిలవేశాను.

"నాస్నేహితుణ్ణి చంపించింది నువ్వేనా?"

మాట లేదు. మొహం మరో రంగు మారింది.

"నువ్వతని వంక ప్రేమతో చూడకపోతే అతనంత పరవశుడు కాడు. నీఅన్నతో నువ్వెందుకీవిషయం చెప్పాలిసొచ్చిందీ? అతనే కనుక్కున్నాడా?"

మాట లేదు. కాని నాపట్టు నాకు తెలీకుండానే బిగిసి ఉండాలి. నాభార్య చిన్న కేక పెట్టి చెయ్యి వదిలించుకోవాలని చూసింది. నేను పట్టు మరింత గట్టిగా పట్టాను.

"అబ్బబ్బ! నన్నడిగాడాయన! అందుకని చెప్పాను! అమ్మమ్మమ్మ!"

"అంత మాత్రానికే నీ పాతివ్రత్యానికి భంగం కలిగిందా? అంత పతివ్రతవు మీవాళ్లను పాటించకుండా నాదగ్గిరికెందుకు రాలేను? అతన్నెందుకు ప్రోత్సహించావు? ఏకం ప్రోత్సాహం లేకుండా అతను నిన్ను అడిగే స్థితి కొచ్చాడా?...నీమీద పగ తీర్చుకుంటాను! నిన్ను నేను ఆదివరకు వదలకపోయినా ఇప్పుడు వదిలేస్తున్నాను. నువ్వెక్కడున్నా నేను వెయ్యి కళ్లతో చూస్తూంటాను. నువ్వే రోజు ఇంకోడితో పోతే ఆరోజు నీకు నాచేతులో చావు తప్పదు! నిన్ను బహిరంగంగా చిత్రవధ చేస్తాను...మగవాడికి ఇంకో మగవాడిమీద ఎంత ప్రేమ ఉండవచ్చునో అంత ఉంది నాకతనిమీద! మమ్మల్నిద్దర్ని ధ్వంసం చేశావు ఒక్కదెబ్బతో" నా కళ్ల వెంట నీళ్లు కారటం మొదలుపెట్టినై. నేను వెంటనే ఆచోటు వదిలిపెట్టి ఇంటిదారి పట్టాను. దారి వెంట నాభుజంమీద చెయ్యి వేసి పార్వతీశం నడుస్తున్నట్టయింది! నా వేడి తక్షణం దిగిపోయింది.

# నోట్లో నువ్వుగింజ

కొల్లూరు ధర్మారావుగారు, బి. ఏ.

— ఉదయం ఆరు గంటలవేళ —

( యింట్లో )

"జానేవ్, యివాళ వంట కాస్త త్వరగా కానీ"

"చేసే వుద్యోగమేమిటి ఇప్పుడింత తొందరకి?"

"ఉందిలే, వేరే ఒక..."

"చెబుదురూ కాస?"

"యీ ఆడవాళ్లతో యిదే బాధ; అది వేరే ఒక రహస్యం; నీతో చెబితే ఆడగక్కలేను. నీ నోట్లో నువ్వుగింజ నానదు."

"ఒట్టూ, ఎవరితో చెప్పినా. చెప్పండి."

"చిన్న ఉద్యోగం వొకటి కలిసొచ్చే లాగుంది. కోటలో గుమాస్తాగిరి ఓ ఆర్నెల్లు ఆక్టింగు ఉమేజువారీ తటస్థపడే లాగుంది"

"ఉమేజువారీ అంటే?"

"నీ కక్కడలేని భోగట్టాలూ కావాలి— ఉమేజువారీ అంటే జీతం యివ్వరు. అయితే నేంలే, తర్వాత లాభిస్తుంది."

"జీతం బత్తెం లేని నౌఖరీకి ఆర్నెల్లే అని నిర్ణయమెందుకూ?"

"నీతో చెప్పడం పొరపాటు. వంట చేస్తావా. కోసాకూ కబుర్లేనా?"

* * * *

— ఉదయం ఏడు గంటలవేళ —

( చెరువుగట్టున )

"సూరమ్మత్తా, మీది మడిబట్టైతే యీ బిందె కొంచెం యెత్తుదూ."

"అప్పుడే వంట మడి కట్టుకున్నావుటే, సుబ్బమ్మా, యేమిటి విశేషం?"

"యేమీ లేదో, వూరికేనే"

"ఓస్, నవ్వుతున్నావు, యేదో వుంది. చెబుదూ?"

"...................."

"నీ మొగుడు డామధ్యని కలకత్తావో యెక్కడికో నౌఖరీ కోసాన్ని వెళతానన్నా డనుకున్నారు, వెళ్లలేదేం?"

"మీ రెవళ్లతోటీ అన నంటే చెప్తాను."

"ఒట్టూ. నాకేం గావాలమ్మా అందరితో చెప్పడానికి?"

"మా ఆయనకి దివాణంలోనే నౌఖరీ అయింది. అందుకే యీ తొందర"

"సుఖపడ్డావమ్మా, జీతం యెంత?"

"......ప......పాతిక"

"యేదో, వేన్నీళ్లకి చన్నీళ్లు. ఉన్న వూళ్లో అదిమాత్రం యెంత గాను"

"ఎక్కడా అనకండేం, యింకా?"

"ఛస్, యెంతమాట!"

* * * *

— ఉదయం తొమ్మిది గంటలవేళ —

( బజారులో )

"ఏమిరో, పుల్లయ్యా. యీమధ్య నెక్కడా ఏష్యం అయిపోయేవు?"

"ఏ మడుగుతా వబ్బీ! ఇది మూడో మాటూ విశాఖపట్నం వెళ్లడం. కాళ్లరిగిపోయి డబ్బైపోతూంది కాని నౌఖరీ యెక్కడా పుట్టలేదురా."

"మెట్టు ప్యాసై నువ్వే యిలా గంటావేం ఒరే? కోటలో చాలా ఖాళీ లున్నాయిట్రా, ప్రయత్నించవో లేదో."

"ఖాళీ లెక్కడో రే, ఖజానా పెట్టెల్లో తప్ప"

"సరిపోయింది! నీతో చదూకున్న రంగడికి ముప్ఫై రూపాయలమీద వేసేరుటూ?"

"ఎప్పుడూ?"

"అదేమో, నీలాటి రేవు నంతా అనుకుంటున్నారని మా అమ్మ చెప్పింది ఇందాకా!"

"పోస్, నే నన్నమ్మను. తరుడుఘోరం వాడి కేమిటి..."

"అలా కొట్టి పారెయ్యకబ్బీ! అదృష్టానికీ చదువుకీ సమ్మంధం యేమిటి?"

* * * *

— ఉదయం పదకొండు గంటలవేళ —

(వాల్తేరు స్టేషనులో)

"ఇదుగో, విజయనగరం నుంచేనా యేమిటి రావడం?"

"అవును, మీరేమిటిలా దయచేసేరు?"

"మీవూరెడదామనే, మరేమిటి వింతలు?"

"యేమున్నాయి?"

"మా మేనల్లు డెప్పుడేనా కనిపిస్తూంటాడా? మా రంగరావు."

"వారం రోజులకిందట చూసేను. కులాసాగా వున్నాడు. వాడికి కోటలో ఖిల్లేదారీ ఉద్యోగం అయిందిట?"

"నాకేం తెలీలేదే. మీకెవరు చెప్పేరూ?"

"ఏమో, విజయనగరం స్టేషనులో కాఫీతాగుతూండగా యెవళ్లో పదిమందీ అనుకుంటూన్న మాటలు నా చెవిని పడ్డాయి. అయినా తరుడుఘోరం వాడికంత ఉద్యోగం..."

"చెప్పలేం లెండి. అయితే కాకూడదూ? వాళ్లతండ్రి ప్రభువులదగ్గిర విశ్వాసంగా మెసిలిన నౌఖరు."

"మీకు తరం రాయలేదూ?"

"అదే ఆశ్చర్యంగా వుంది"

* * * *

—మధ్యాహ్నం మూడు గంటలవేళ—

(కంటోన్ మెంటు బంగాళావద్ద)

"ఏమోయ్, దివాన్‌గారు నిద్రలేచేరేమో చూడూ."

"ఇక్కడ గలభా చెయ్యకండి, కోప్పడతారు, గేటు అవతల వుండండి."

"పదిగంటలనుంచీ కనిపెట్టుకున్నాను, ఇంకా నిద్దరపోతున్నారా?"

"నేరమ్మన్నానుటయ్యా...యేమిటీయన ధాష్టీకం...వెళ్లండవతలకి!"

"వోయ్ చూడూ...(చేతిలోకి వో అర రూపాయి జారవిడిచి)...కొంచెం కనిపెట్టాలి కాని..."

"పేరయ్య పాసుర్లుగా రబ్బాయిలా, మీరు!"

"నువ్వైరగం దేముంది?"

"ఆ బెంచీమీద కూర్చోండి, దివానుగారిలాగే వొస్తారు."

*　*　*　*

"చిత్తం"

"ఎవరోయి ఆతవలా?"

"చిత్తం. ఏలినవారి దర్శనానికని వొచ్చేను. దరఖాస్తు దాఖలుచేసు..."

"ఎందుకండీ?...మీ పేరు?"

"రంగారావు"

"దరఖాస్తెందుకు, మీకేం గావాలి?"

"తమ ఆఫీసు ఇలాకాని ఓ ఆక్టింగు ఉమేజువారీ ఖాళీ వొచ్చిందని"

"లాభంలేదండి, ఇవాళ పదిగంటలప్పుడో కర్రి ఎపాయింటు చేసేసేను."

"చిత్తం చిత్తం, తమరు తలిస్తే..."

"మీరి మీ పనైంది, వెళ్లండికను."

"అన్నం పెట్టించా అంటే..."

"వోయ్ డఫేదార్, వీరి నవతలకి పంపించెయ్."

*　*　*　*

—సాయంత్రం అయిదు గంటలవేళ—

(బజారు రోడ్డున)

"ఏమిరో రంగా, యిలా గొస్తున్నావు? బండీ గుఱ్ఱం సప్లై లేవేమిటి?

"నీ కింత హాస్యంగావుంది. ఇహను జట్కాతోలుకుంటేనే బాగుండే లాగుంది."

"నాఖరీలో ప్రవేశించకే పోవాలికాని, బ్రదర్, ప్రవేశించాక జట్కావాడి వృత్తే బాగున్నట్టనిపిస్తుందిలే. ఇంతకూ కోర్టేవు మంచిధాన్ని. బాలెప్పుడేమిటి?"

"పోనిద్దూ వొరే యేడిపించకా?"

"కోటలో పాగావేసి యెడుపేం నీకూ? నువ్వెంత బాలు ఎగరెయ్యడానికి దాచినా నాకు తెలీ లేదనుకున్నావు కాబోలు. మీమామ వార్తరులో కనిపించి చెప్పేడులే."

"మధ్య మా మామేఁవిటి చెప్పేడు?"

"నీకు ఖిల్లేదారీ అయిన భోగట్టా!"

"హరీ, దీని తస్సాగొయ్యా!"

*　*　*　*

రాత్రి యెనిమిది గంటలవేళ

(ఇంట్లో)

"ఈ గమతు మూసేవే."

"ఏమిటండోయి!"

"నాకు ఖిల్లేదారీ అయిందని మామామ అన్నాట్ట విశాఖపట్నంలో! దిక్కుమాలిన గుమాస్తాగిరీకోసం ప్రయత్నం ఆరంభించి పన్నెండు గంటలైనా కాలేదు. యీ బుకారేమిటి చెప్మా?"

"వాశ్చర్యం!"

"నేను రెండో కంటికి తెలీకుండా అవస్థపడితే, యిదేమిటో?"

"..................."

"నువ్వెవళ్ళతోటీ అనలేదుకద!"

"ఒట్టూ......ఒక్కనూరమ్మత్తతో మాత్రం ఎవళ్ళతోటీ చెప్పనని వొట్టేయించుకు చెప్పేను పొద్దుట."

"మరేం? పెదవిదాటింది, పృథివీదాటింది!"

(శేషాద్రిరమణకవులు.)



వాఙ్మయవేత్తలును బరిశోధక వతంసులును నగు బ్రహ్మశ్రీ జయంతి రామయ్యపంతులువారు ప్రచురించిన శాసనపద్యమంజరి జూచి మిగుల నానందించితిమి. శాసనములలోఁ బద్యవాఙ్మయ మెంత విరివిగ వ్యాపించెనో అప్పటి లిపి లేఖనక్రమము వాఙ్మయవికాసము సూక్ష్మదృష్టితో గమనింపఁ దలంచువారల కీగ్రంథ మెంతయు నుపకారము జేయును. గ్రంథము రాయలు సైజులో ౧౧౩ పుటలు గలిగి నాలుగు శాసనపటములతోడను ౪౨ శాసనపాఠములతోడను నలరారుచున్న ఈయుత్తమ గ్రంథమును స్వల్ప మగు వెలకు ఒసంగుట యొక విశేషము. నిజాము రాష్ట్రమునకు సంబంధించిన పద్యశాసనము లిందు రెండుమాత్రమే గలవు. ఒకటి కరీమునగరము శాసనము. ఇది గంగాధరుఁ డను రుద్రదేవుని మంత్రి నెలకొల్పినది. అందుండి రెండు పద్యములును ఒక పద్యార్థము మాత్రమె యుదాహరింపఁబడినది. మిగిలిన భాగము వారికి లభించి యుండదు. కాననే శతాబ్దము నూహించియు అసంపూర్ణ మనియు నుదాహరించిరి. ఈశాసనముఁ గాకతీయచరిత్రమునకుఁ జాల విలువగల సాధనము. దీనిపయి నొక లఘువిమర్శము మార్చినెలలో వెలువడిన ప్రబుద్ధాంధ్ర యందుఁ గాంచ నగును. రెండవది ఉప్పరపల్లి శాసనము. దీని ప్రతిబింబము విమర్శము భాషాంతరీకరణము నిజాము దొరతనమువారి శాసనశోధకసంఘమువారు ప్రకటించిరి. దీనిలోని చివరఁ గల యొక పెద్ద వచనము తొలగింపఁబడినది. అది యుంచినచో నానాఁటి వచనస్వరూపము గూడ గుర్తింప వీలయ్యెడిది. ఇంకను గొన్ని పద్యశాసనములు నిజాము రాష్ట్రమునకు సంబంధించినవి ప్రచురింపఁబడినచో నెంతయో బాగుండెడిది.

ఈసంపుటమునఁ గల పద్యశాసనములలో నన్నయ్యభట్టారకునకు ముందుఁ బుట్టిన పద్యశాసనములు రెండు గలవు. ఇందొకటి క్రీ. శ. ౯౪౪ నాఁటి గుణగవిజయాదిత్యుని మంత్రి యగు పండురంగనిది. ఈశాసనము మంజరిద్విపదలో నుండి యాకాలపు వాఙ్మయచ్ఛందోవిశేషములఁ దెల్పుచున్నది. దీని యందలి విశేషములు కే. వి. లక్ష్మణరావు పంతులవారి చిత్రాడ ఆంధ్రపరిశోధకమహామండలి యన్యత్రోపన్యాసమునఁ జర్చింపఁబడినది. లక్ష్మణరావుపంతులువారు సరి యగు ప్రతిబింబమునకుఁ బ్రయత్నించు నాటికే శాసనశిల మాయమైనది. సరి యగు ప్రతిబింబముతో శ్రీ. జ. రామయ్యపంతులువారు ప్రకటించి మనకు మహోపకృతి గావించిరి. రెండవది యుద్ధమల్లుని బెజవాడశాసనము. ఇదియు నన్నయభట్టారకునకు బూర్వపుదే. పద్యములు మధ్యాక్కరలు. ఇందు ద్రవిడకర్నాటభాషలలో నుండి ప్రకృతవాఙ్మయమునఁ గనిపింపని యొక వింత యక్షరపు టునికి శ్రీ లక్ష్మణరావు పంతులవారు గమనించి యాచర్చ నంతయుఁ బ్రకటించిరి. శ్రీరామయ్యపంతులువారు, ఈసిద్ధాంతము నామోదించి యావర్ణము కాలక్రమమున "డ" గా మారుట సూచించిరి. ఈరెండుశాసనము లీగ్రంథమునకు అలంకారము లనవచ్చును.

దీర్ఘాసి, దాక్షారామ పద్యశాసనములు రెండును నన్నయ్యభట్టారకుని నాఁటివి. ఈరెంటివలన నన్నయ్యభట్టు కాలమున బలువు రాంధ్రకవులు గల రనియు నన్నయ్యభట్టారకుఁడు ప్రథమాంధ్రకవి యను కొనుట భ్రాంతి యని తేలును. ఈరెండు పద్యశాసనముల వలన నన్నయ్య నాటి వాఙ్మయవిశేషములు కొన్ని తెలియును. అనునాసికములుగ

నుచ్చరింపఁ బడుటకుఁ గాబోలు అరసున్న రాఁద గిన తావులం దెల్ల నిండుసున్న వాడఁబడినది. ఇంతి యకాక ప్రాసస్థలము దీర్ఘముమీఁది యరసున్న నిండుసున్నగ "కూంతు సరయ పోల్పం గాంత లెందు" అని ప్రయోగింపబడినది. ద్రాక్షారామశా సనములోని సీసపద్యమునందలి ఎత్తుగీతలో నొక తావున మాత్రము యతియు మిగిలిన తావులం దెల్లఁ బ్రాసలును గలవు. దీర్ఘానీ శాసనమునందు సీసపాదములం దంతటను బ్రాసములును గీతము నందు యతులును గలవు. ఇంతియ గాక గిడ్డిసింగి యనుచో ఛందోభంగము గలుగకుండుటకు రేఫ తేలబలుకుటయు శసలకు బ్రాసము ఏండ్లు అనుచో ఏండులు అను వ్యస్తరూపము విశేషించి గమనింపఁ దగినది. దీర్ఘాని భగవతి + దేవి యనుచో బ్రాస వదలి యతి వేయఁబడుటచే నాకాలమున నియ మము బాధకముగా దనియు దలంపవచ్చును. శాస నములలో గల పేరులు గొన్ని యిపుడు వాడుకలో లేవు. ఈ దేశ్యనామములలో రేవలదేవి, పొన్నరాంబ, బాదమ్మ, గడియమదేవి, వెన్నమ్మ, విల్లమ్మ, దం డ్యమ్మ, దోరమ్మ, కబ్బలదేవి, జన్నమ్మ, రకమాంబ బెజ్జము బెజయితదేవఁడు, గొంకరాజు, కన్నోజు, మండరాజు, బంగెన, పెమ్మడి, పండయ్య, గంటఁడు, దేచన, నల్లరాజు, గోరంపప్రభువు, విద్దయ్య, చింత మనాయకుఁడు, బల్లరాజు, పెఱుకువగొద్దయన, లోన గునవి యిపుడు వాడుకలో లేనివి. ప్రాచీన శబ్ద ముల పట్టికవలె మనుష్యులయు గ్రామములయు నామముల పట్టిక సిద్ధము చేయుటయు వాఙ్మయ సేవలో నొక భాగము కావచ్చును. గోద్దన అను నది గోవిందశబ్దమునకు దద్భవ మని విశ్వసింప వచ్చును. ఇటులే శాసనములందు గ్రామముల యొక్కయు మనుజుల యొక్కయుఁ బేరులు ప్రాచీనవాఙ్మయస్వరూపమును బోధించుచున్నవి.

వర్ణక్రమసంబంధములు, ప్రాతికు ఉచ్చారణము లకుఁ గల భేదములు శబ్దలక్షణమునకు సంబంధించిన ప్రయోగవిశేషములు ఛందోవిషయము అను శీర్షి కల క్రిందఁ బంతులువారు గావించిన విమర్శము వారి పరిశోధనపాటవమునకుఁ బ్రాచీనాంధ్రస్వ రూపనిరూపణమునకు లక్ష్యముగ నున్నది.

శాసనపద్యములు గొన్ని మాత్రము కేవలముగ నున్నను జాల భాగము కవితాప్రౌఢిచేఁ బ్రాచీన ప్రబంధకవితకు దీసిపోవకున్నవి. శాసనగ్రంథకర్తల పేరులు స్థాపకు లుదాహరించినచోఁ గొందఱు కవులు మనకుఁ బరిచితులయ్యెడు నారగానిత అరుమగ నాయాచారము మున్నగువారలు తెలియును. శ. స. ౧౦౪౦ నాటి చేబ్రోలు శాసనమున విశ్వ కర్మవంశజుఁ డగు సూరఁడు సోదరసహితుఁడై సంగరములలోఁ బ్రత్యర్థుల నడఁచి విజయము బడసి ఎఱ్ఱమరాజ జనవిభుని నాగరాజ సత్కారా దులు బడసిన యంశము ప్రత్యేకించి గమనింపఁ దగినది. వృత్తి జీవనముఁ గాక రాజకీయమునఁ గూడ విశ్వకర్మకులజులు పేరొందిరనుట కీశాస నము ప్రధానాధారము. ౧౬ వెం శ. స. ౧౦౬౭ నాటి నాదిండ్ల శాసనమున పోతన సోమయాజి ప్రశంస గలదు. ఈ సోమయాజి వైదికాచార రతుఁడు. మహాజ్ఞాని. అతని వంశజులు సద్గ్రామైక జీవను లగు మంత్రులు. బ్రాహ్మణు లాకాలమున నియోగి వైదికి భేదము పాటింపక లౌక్యరాజకీయ ములలోఁ బాల్గొని రనుట కీశాసన మాధారము కాఁగలదు. శ. స. ౧౦౬౩ నాటి చేబ్రోలు శాస నమువలన చతుర్థవంశజుఁడును భీమరాజు కుమా రుఁడు నగు పండఁడు మనకుఁ బరిచితుఁ డగు చు న్నాఁడు. ఈపండఁడు దేసటి విశేషణము వలనఁ బంటరెడ్డి కులజుఁడు కానోఁపు నని తోఁచును. ఇతఁడు సర్వకలాప్రవీణుఁ డఁట. అంతియ గాక కవి యని సైత మాశాసనమున నిక్రింది పద్యమునఁ జెప్పఁబడినది.

చ. తెలుఁగు సదర్థభావమున నద్గతసూక్తులఁ గూర్చి
కర్ణనల్
గొలుసుగొనంగ వ్రాసితిని గోరిన సంగతి వచ్చి
మట్టఁగో
పలుగతి దేశిమార్గములు మట్టుపడన్ గటనంబు
లొప్ప నా
ట్యుల క్రియఁ జెప్ప నేర్చె నృపధూర్జటి భీమయ
పండఁ డిమ్మహిన్.

ఈకవిరాజు గ్రంథము పేరైన మనకు తెలియంగ రాదు. సర్వలక్షణసంపన్నుఁ డగు నితని కావ్య మెట సడిపోయినదో! శ. స. ౧౧౫౦ నాటి అమరావతి శాసనమున ఎల్లమంత్రి పదమూఁడవ యేట మంత్రిపదవి నొంది ప్రసిద్ధి నొందె నఁట. ఈతని చరిత్రము నాఁటి రాజు కాలము గూడ గ్రహింపఁ దగిన యవకాశములు లభింపమి సంతాపకరము. శ. స. ౧౧౫౩ నాటి తిమ్మాపురము శాసనమువలన, చందవోలులోని పండీశ్వరాలయములో నర్తకియు వేశ్యయు నగు చొక్కముపుత్రి కామదేవి కులోత్తుంగచోడ గొంకరాజునకు దేవి యఁట. ఈమె యన్న కాకతీయగణపతిదేవుఁడు వెలనాటిని ముట్టడించినపుడు గొంకరాజు పక్షమునఁ బోరి రణరంగమున నిహతుఁడైన యంశము ఈశాసనమునందీ క్రింది విధమునఁ జెప్పబడినది.

క. అని గంచెఱువుల కోటను
గణపతి సైన్యంబు నొడిచి ఘను గొంకమహీ
(మణిజు) మెచ్చించి సురాం
గనలకుఁ గామఁడయి సనియెఁ గాముఁడు
మహిన్.

దాక్షారామశాసనములవలన ప్రకాశభారతి యోగియుఁ గొండవీటి శాసనములవలన శ్రీనాథకవియు శాసనగ్రంథకర్తలుగా మనకుఁ బరిచితులైరి. ఇరువురు సమకాలికులే గాని మొదట వాని కవిత యంత మేలైనది కాదు. అతని వివరములును, దెలియవు. శాసనపద్యములలోఁ గొన్ని తావులఁ బ్రస్తావనోచితములు ధర్మబోధకములు వర్ణనాభూయిష్ఠములు నగు పద్యములు కలవు. ప్రబంధయుగము నాటి అనుకరణము గూడ శాసనకవులలోఁ గొంచెము గోచరించుచున్నది. దృష్టాంతము.

జాహ్నవీ యమునాది సకల పావననదీ
విమల తీర్థాంభః పవిత్రితంబు
(పిరంగిపురము శాసనము)

చతుర జనానీక సప్త పావననదీ
తీర్థ పవిత్రితాధిక జలంబు.
(వంకాయలపాటి శాసనము.)

ఇటులే యింకఁ గొన్ని యనుకరణములు జూపవచ్చును. ఈశాసనములు నందిగామతాలూకా వేదాద్రి చెంత గల శా. శ ౧౩౩౭ నాటి యీజదిమలుక పద్యశాసనాలు ప్రత్యేకించి యాదరింపఁ దగినది. శరఖుములుక జైనది ఒడయలునకుఁ బ్రతినిధిగఁ గృష్ణాతీరమునకుఁ బాలకుఁ డగు ఈజదీనులకు వేదాద్రితీరమునఁ గృష్ణకు సోపానములు గట్టించియు మాగఁలములలోఁ జలివేందరలు బెట్టించియు బీదలకుఁ బెండ్లి పేరంటములు జేయించియు ఆర్యధర్మముల నుద్ధరించెను. మహమ్మదీయులు ఆంధ్రదేశమునకు గావించిన మహోపకారములు దెలుపు శాసనము లోక సంపుటముగా వేసిన హిందూ మహమ్మదీయ మైత్రికి సాధనము గాఁగలదు.

మొత్తము మీఁద నగు వఱకు శాసనములు భిన్నభిన్నమైనవి. బుద్ధిపూర్వకముగఁ జెఱుపఁబడినవి. చాలశాసనములు స్థానభ్రష్టములై ప్రత్యేకించి యన్వేషింపఁదగిన విధముగా సందులలో గొందులలోఁ బడి దుర్వినియోగము గావింపఁబడుటచే శాసనపాఠములసమగ్రమగుటయుఁ జరిత్రాంశము అసమగ్రము లగుటయుఁ దటస్థించుచున్నది. శాసనముల విలువయు వానికి వాఙ్మయమునఁ గల స్థానము ప్రజాసామాన్యమునకు బోధ యగువఱకు శాసనములు నశించుచునే యుండును. కాన స్థానికులు శాసనరక్షణమునందు మిగులఁ

బట్టుదల జూపియుఁ బ్రజల యుపేక్షాభావముచే శాసనములు నశింపకుంటను దొరతనమువారి సహాయము కోరియు విద్యాధికులు శాసనరక్షణ మొనరించుట కర్తవ్యము.

వ్యాసము పెరిగియుపోయినఁ బోవుగాక. ప్రకృతగ్రంధమునుండి రసవత్తరము లగు కొన్ని పద్యము లుదాహరించి గాని వ్యాసము ముగింప హృదయ మియ్యకొనుట లేదు. ఆంధ్రకావ్యములందుఁ గనిపించు కవితావిలాసము లన్నియు శాసనకవితయందు సైతము గల వనుట కవుపైన పద్యములు కొలఁదిగ నుదాహరించి గ్రంథప్రకాశకు లగు శ్రీజయంతి రామయ్యపంతులవారి యమోఘకృషి ప్రశంసించి ఇంతతో నీ వ్యాసమును ముగించుచున్నారము.

చ. ఇల జగతాపిఖడ్గమున నీల్గిన వీరుని రంభ పుచ్చుకోఁ

దలఁచినఁ దూర్పు దిక్కున ఘృతాచి గిసుక్కన దుమ్మెనంతలో

పలఁ జనుదెంచె వాని కులభామిని నింగి పథంబునందు ని

ష్ఫలితను రంభయున్ వెలయువారిన నవ్విరి తోడి కామినుల్.

సీ. తురగచర్మంబునఁ గర మొప్పు నెటికిఁ గా
బసరించి దానన ముసుఁగు బెట్టి
తెలుపెక్కఁ గతిపోవ వెళగిన పుసుక మిం
చిన వెండి కోరగాఁ జేతఁ బట్టి
ఏనుఁగు తలలలో నెసఁగిన ముత్తయం
బులు కుంకుమాక్షతంబులుగఁ బోసి
బేతాళఢాకినీ భూతంబు లార మీ
కును మంజికం బని కుడువఁ జెప్పి
యొక పిశాచవధూటి తా నుత్సహించె
రాయ జగతాపగంగ భూరమణుఁ డాజి

నమరఁ బెండిలికొడుకు మల్లానవిభుఁ
డెలఁగి సుకాంతతోఁ బెండ్లి సేయు నపుడు.

[శకాబ్దము లేని కడపమండలము
పొద్దుటూరు శాసనము.

మ॥ ప్రతిపక్షక్షితిపాలకుంజరమద
ప్రారంభసంరంభ ము
ద్ధతబాహానిహితప్రచండనిశితో
ద్యతదండధారానఖా
హాత్తి భేదించి యఖర్వగర్వబలశౌర్య
స్ఫూర్తి గంభీరవా
కృతియై (సన్నుత) స్ఫూర్తి దాల్చి వెలసెన్
రేచెర్ల రుద్రుండిలన్॥

(శ ౧౧౫౪ నాటి ఉప్పరపల్లి శాసనము)

సీ॥ కపటనూకరమైన కైటభాసుర వైర
ఖురపుటంబులఁ బరిత్యుణ్ణ మయ్యె
రఘుకులోద్వహధనుర్యంత్రముక్తము లైన
చిచ్చరమ్ముల వేఁడిఁ జేవఁ దఱఁగె
కుంభసంభవుని హస్తాంభోరుహంబున
నాపోసనం బయి హ్రాస మొందె
పాషాణముల నచ్ఛఫల్లగోలాంగూల
కపియూధముల చేతఁ గట్టువడియె
వనధి యేభంగి సరివచ్చు ననఁగ వచ్చు
నారసాతలగంభీరవారి యగుచు
నపగతాపాయ మగుచు శోభాఢ్యమగుచు
ననుపమం బైన సంతానవనధితోడ॥

(శ్రీనాధుని శాసనకవిత)

శాసనములు కాలక్రమమునఁ బ్రచురింపఁబడినవి గాన ఆంధ్రకవితాపరిణామము లేఖనక్రమమునఁ బొందిన మార్పులు గుర్తింప వీలు కలుగుచున్నది. స్వల్పక్రయమున లభించు శాసనపద్యమంజరి గొని గ్రంథకర్త గారి మహోద్యమము శ్లాఘింప భాషాభిమాను లగు నాంధ్రసోదరు లర్హులు.

---

అని యెందుకు బయలుదేరరాదు చదువరి? ఆశలేని యీ దుఃఖమువల్ల దృశ్యము విషాదాంత మెందుకై పోలేదని ప్రశ్నించండి. అంతేకాని యిది అయోమయమా? ఆశ అంకురించడము కవి వ్రాయలేదు. అందువల్ల నిది ఖండమై పోతుంది (fragments) దాని కిచ్చే గౌరవము ముట్టచెప్పండి.

తర్కమూ వ్యాకరణమూ సహృదయత్వాన్ని నశింప జేస్తాయి.

కత్తికోతలేదు గాజుగొట్టము లేదు
మాత నెత్రుశోధ నేతలేదు
యెవర ప్రకృతిదేవి యెడిజేరి చనుగ్రోలి
మేనుమఱచి నిదుర కౌని కవికి.

చదువరి బడిపిల్లవాడు వ్రాసిన వ్యాసాలుదిద్దే మేష్టరు లాగ బయలుదేర కూడదు. కావ్యము పఠించబోయే విద్యార్థిలాగ గౌరవదృష్టితో చూడాలి.

—కౌశికః

# హిందీవల్ల తెనుక్కి జరుగుతూ వున్న అపకారం

(ఈవిషయంలో యిదివరకు చాలా లేఖలు ప్రకటించి వున్నాం. వచ్చినవి యింకా చాలా వున్నాయి. విఖ్యాతాంధ్రకవీశ్వరులు మంగిపూడి వేంకటశర్మగారు కూడా సమగ్రంగాచర్చ చేస్తూ వొక వ్యాసం పంపారు. అదీ, మరికొన్ని వచ్చే సంచికలో ప్రకటిస్తాము. మాతృభాషాభిమాను లనేకులు ఈవాదాన్ని బలపరుస్తూ అనేకస్థలాలలో వుపన్యాసాలు చేస్తున్నారు. పత్రికలకు రాస్తున్నారు. హిందీ ప్రచారకులు కూడా కొంద రిందులో వున్న సబబు గ్రహించి ప్రోత్సాహం కలిగిస్తున్నారు. ఇక్కడ వొక సోదరీమణి రాసిన చిన్న లేఖను మాత్రం యీ నెలకు ప్రకటిస్తున్నాము. ఈమె హిందీలో చాలా ప్రవేశం సంపాదించిన్నీ మాతృభాషయెడల అభిమానం పోగొట్టుకోకుండా, హిందీమానసపుత్రుల దుష్ప్రచారాన్ని యెదుర్కుంటూ మాతృసేవ చేస్తూ వున్నందుకు మాప్రశంసలు తెలుపుకుంటున్నాము. సంపాదకుడు)

సోమయాజులుగారూ! ఆంగ్లభాషపట్ల మీరు వ్యతిరేకాభిప్రాయ మేల చూపుచున్నారు? విదేశభాష యనియా? విదేశీయులగు ఆంగ్లేయులు మన యీదేశమును పాలించు చుండునంతవరకును మనకు ఆంగ్లభాష ముఖ్యావసర మనియే నేను చెప్పుచున్నాను. హైందవరాజ్యాంగమునకు సంబంధించిన యాభాష నభ్యసించినవారే రాజ్యాంగవిషయములు తెలుసుకొనగలుగుచున్నారు, కాబట్టి స్త్రీపురుషులు ఆంగ్లభాష తప్పక చదువవలెను. ఆర్థిక, రాజకీయ, సాంఘిక, ధార్మిక—ఇత్యాదివిషయములకు సంబంధించిన పుస్తకములు మనము ఆంగ్లమునందే చూచుచున్నాము. హిందీయందు గాని తెనుగునందు గాని స్వతంత్రముగ రచించబడిన పుస్తకములు మనకుగాన్పించుట లేదు. ఏదేని యొక టుండిన అది ఆంగ్లమునకు అనువాదమే!

ప్రతి పెద్ద గ్రామములోను స్థాపింపబడిన యాంగ్లపాఠశాలలను గూర్చి వ్రాయరైతి రని మీరు నుడువుచున్నారు. ఆంధ్రభాషయందే ప్రేమ యున్నచో ఆంగ్లభాషాప్రచారముపట్ల వ్యతిరేకాభిప్రాయము చూపుట మంచి దని మీ రన్నారు. కాని అత్యావసరము లగు ఆంగ్లభాషకు గాని ఆంగ్లపాఠశాలలకు గాని వ్యతిరేకాభిప్రాయ మెవరు చూప సమ్మతించెదరు? ఈభాషాప్రచారమునకు

ప్రతిగ్రామములోను ఒక మిడిల్ స్కూలు అయినను ఉండుట ముఖ్యావసరము. కాని మన స్త్రీపురుషుల దౌర్భాగ్యమువలన ఐదారు గ్రామములకు ఒక స్కూలు ఉన్నది. ఈస్కూలునందైనను స్త్రీ పురుషులు తప్పక ఆంగ్లభాష అభ్యసించవలయు ననియే నేను ప్రార్థించుచున్నాను.

మన సుబ్రహ్మణ్యశాస్త్రిగారనునట్లు ఆంగ్ల భాష అపకారముతో పాటు వుపకారము కూడ చేయుచున్నది. ఆంగ్లభాషలో గొప్ప వాఙ్మయ మున్నది. ఇటువంటి భాష యెడల వ్యతిరేకాభి ప్రాయను చూపుట మంచి దని మీరెట్లు నుడువ గలిగిరి? కాని హిందీభాష చదువకూడ దని కాను నేను చెప్పునది. మొదట మాతృభాష స్త్రీపురుషులు చక్కగ అభ్యసింపవలెను. అటుపిమ్మట రాజ్యాంగమునకు సంబంధించిన భాషయు, తరువాత యింకెన్ని భాషల నైనను నేర్చుకోవచ్చును. కాని ఇక నైనను హిందీభాషయందుండు ప్రేమవే ఆంగ్లభాషయెడల మీరు ఈర్ష్య చూపకుందురని నేను విశ్వశించుచున్నాను.

—యేర్లగడ్డ చిలకమ్మ



# స్వీకారము

## బొమ్మల మద్రాసు

ఆశా, సంకల్పమూ వుండీ కూడా చాలా మంది మద్రాసు వెళ్ళలేరు; కాని అది చూడ తగ్గ నగరం. విశేషించి మనం పట్టుబడి సంపాదించుకోవలసిన స్థలం. మద్రాసులో మనం చెయ్యవలసిన పని చాలా వుంది.

వెళ్ళలేనివారికి మద్రాసు అంటే బోధపడడానికీ వెళ్లినవారి కేనా సులభంగా పరిచితం కావడానికీ మద్రాసుకి సంబంధించిన బొమ్మలు వుండడం చాలా అవసరం.

ఖండాంతరాలలో ప్రతీ పెద్ద నగరానికీ ఇలాంటి యేర్పాటు లుంటాయి.

ఇప్పుడు మద్రాసు విషయంలో యీ లోపం కొంతవరకూ తీరింది.

కోమా ఫొటోసర్వీసువారు మద్రాసులో వున్న ప్రసిద్ధ—ప్రధానస్థలాలకు ఫొటోలు తీసి సెట్టు సెట్టుగా అందరికీ అందచేస్తున్నారు.

వాటిలో వొక సెట్టు—రెండోది మా కార్యస్థానం అలంకరించింది. ఇందులో ౧ హైకోర్టూ, ౨ సెంట్రల్ స్టేషను స్టాన్లివంతెనా, ౩ రామస్వామి మొదలియారు సత్రిమూ, ౪ ఎగ్మోరు స్టేషనూ, ౫ ఐస్‌హౌసూ, ౬ క్వీన్‌మేరీకళాశాలా, ౭ వెటర్నరీకళాశాలా, ౮ సెనేటుహౌసూ, ౯ డి. పి. డబల్యు సెక్రటరియేటూ, ౧౦ మర్కంటైలు బాంకీ ౧౧ పెన్‌లాండువార్కు..., ౧౨ బర్మాషెల్ కంపెనీ భవనమూ—మొత్తం పన్నెండు ఫొటోలు చక్కనివి వున్నాయి. ఈ సెట్టు పోస్టుకార్డులు కాక వొక రూపాయి. మనవారు వీటిని సంపాదించి మద్రాసును గురించి కొత్త ఆశలు కల్పించుకుంటా రని నమ్ముతున్నాం *

* కావలసినవారు ఈక్రింది అడ్రసుకు రాసుకోవాలి. "కోమా ఫొటో సర్వీసు, ట్రిప్లికేను మద్రాసు."

# వ్యాఖ్యానములు

## ఆంధ్రోద్యమం

నిజమే కావాలా? అయితే కాంగ్రెస్సు మనల్ని తొక్కేసింది; వుద్ధరించలేదు.

మన జాతీయతని అది ఛిన్నాభిన్నం చేసేసింది.

అన్ని ప్రాంతాల వారితో పాటు అఖిలభారత వికాసం కోసం పని చెయ్యవలసిన పూచీ మనకిన్ని వుంది. అయితే అది పరిమితం. దానికి హద్దు వుంది. ఇప్పటి లాగ మన శాయశక్తులూ దానికోసం వినియోగించవలసిన అవసరం యేమీ లేదు.

అసలు మనకి ఆ అవకాశమే లేదు. ఏమంటే? మన కిప్పుడు ఆంధ్రత్వమే దృఢంగా—సమగ్రంగా లేదు.

మొదట మనం ఆంధ్రులం. తరవాతే భారతీయులం. మనం సర్వవిధాలా ఆంధ్రులంగా చెలామణీ కాగలిగినప్పుడే భారతీయతలో మన అంశ ప్రకాశమానంగా వుండగలుగుతుంది.

భారతీయత అంటే, యీ భిన్నప్రాంతాల వారి కలయికవల్ల స్ఫురించే భావమే; కాని దానికి విశిష్టరూపం లేదు.

కాలు సరిగా లేకపోతే మనిషి కుంటివా డయినట్టే—కన్ను కనపడకపోతే గుడ్డివా డయినట్టే—చెవి వినపడకపోతే చెవిటివా డయినట్టే యీ భిన్నప్రాంతాలవారిలో యెవరు నీరసంగా వుండినా ఆభారతీయతకి కుంటితనమో, గుడ్డితనమో—యేదో వొక వైకల్యం యేర్పడుతుంది.

భారతీయతకి సంపాదించవలసిన వికాసం వేరు. అది వొక్కొక్క ప్రాంతం వారిలోనుంచి వొక్కొక్క అంశ—వొక్కొక్క కిరణం వెడితే రాశిగా ఏర్పడే తేజస్సు వంటిదే కాని మరో విధంగా సాధ్యపడేది కాదు.

ఈ పరమార్థం బోధపరుచుకుని చూస్తే మన స్థితి బోధపడుతుంది.

వొక స్వదేశీ విషయం చూద్దాం. ప్రతీ వస్తువూ మన కిదివరకి ఖండాంతరాలనుంచి వచ్చేది. అగ్గిపుల్ల, సబ్బుబిళ్ల, కలంపుల్ల—చివరికి ఏడ్చే పిల్లల చేతిలో పెట్టడానికి బిస్కత్తులు కూడా ఏస్వీడనో, యే జర్మనో, యే యింగ్లండో పంపితే కాని మనకి దిక్కు లేకపోయేది. ఇప్పు డివన్నీ హిందూదేశంలోనే తయా రవుతున్నాయి. నిజమే. అయితే మన ఆంధ్రత్వాన్ని స్మరించుకుంటూ చూడండి. అగ్గిపుల్ల మనకి రంగూన్నుంచి రావాలి. సబ్బుబిళ్ల బొంబాయినుంచి రావాలి, కలంపుల్ల కలకత్తా నుంచి రావాలి. బిస్కత్తులు పునహానుంచి రావాలి. చివరికి కూడుగుడ్డలలో గుడ్డలు కూడా అహమ్మదాబాదునుంచి రావాలి. మన కేమీ లేదు. ఇతరప్రాంతాలకి యెగుమతీ చెయ్యడం దాకా వద్దు, సొంతానికి వాడుకోడానికే మన దగ్గిర యేమీ లేదు. అన్నీ పైనుంచి వూడిపడాలి.

వానలు కురవకపోతే కూడా మనం బతగ్గలం; గాని యీ దిగుమతీలు ఆగిపోతే మనకి వూపిరి రాదు.

వొక్క డబ్బు మాత్రమే మనం ధారాళంగా యెగుమతీ చెయ్యగలం. చెయ్యగలుగుతున్నాం. చేస్తున్నాం.

అంటే, మనం యిదివరకెలాంటి స్థితిలో వున్నామో యిప్పుడూ అలాంటి స్థితిలోనే వున్నాం.

ఇప్పుడు కాంగ్రెస్సు దృష్టి యేమిటో పరిశీలించండి. "ఈచిల్లర వస్తువు లేనా మనం ఖండాంతరాలనుంచి దిగుమతీ చేసుకోవలసిన అవసరం తప్పిపోయింది. కనక అందరూ యివ్వే వాడండి. విదేశాలనుంచి వచ్చే వాటిని ముట్టకండి" ఇదీ కాంగ్రెస్సు బోధ.

కాంగ్రెస్సుకింద అణగిపోయి వున్న ఆంధ్రుని స్వదేశీ అభిమానం అంటే యిదీ.

ఈస్థితిలో—ఇలాంటి సమయంలో భారతీయతకి మనం యేమి పుష్టి కలిగించగలమూ!

మనం బాగుపడాలంటే—యిరుగుపొరుగు వారితో మనం సమానస్థాయిలో వుండాలంటే—తుదకి కాంగ్రెస్సులో కూడా మనం తగినంత ప్రయోజకత్వం చూపించాలంటే వెంట్రుకమొదట మనం మనంగా తయారుకావాలి. ఆంధ్రుడంటే రక్తమాంసాలు లేని కంకాళం అని కాక 'కొదమ సింగం' అని తక్కిన ప్రాంతాలవారు గుర్తించేటట్టు తయారు కావాలి.

ఈఫలం లభించాలంటే ఆంధ్రోద్యమమే మనకి గతి. ఆంధ్రమహాసభే మనకి ఆధారం.

వొకప్పుడివి రెండూ "నాయనా! నువ్వు ఆంధ్రుడవోయీ!" అని మనల్ని తట్టి లేపాయి. "లే. ఎవరేం చేస్తున్నారో చూడు" అని మన కళ్ళు తెరిచాయి. "వురుకు. వెనకపడిపోతున్నావు. సాటివారు తొక్కేస్తారు సుమా" అని వుత్సాహం కలిగించాయి. నిజంగా మనకి అప్పుడు ప్రబోధం కలిగింది. ప్రత్యభిజ్ఞానం కలిగింది. స్వస్వరూపం కూడా బోధపడింది. రక్తనాళాల్లో వేడివేడి కొత్త రక్తం వురకలు వేసింది; కాని మంచి రసకందాయపు పట్టులో నడమంత్రపు కాంగ్రెస్సు వచ్చి వీటిమీద దెబ్బ కొట్టింది.

ఇంతే కాదు. స్వార్థపరులైన కంపెనీ యేజంట్లు మనవాళ్ళని కూలీలుగా ఖండాంతరాలకి తీసుకుపోతూన్నట్టు గుజరాతీలకీ, హిందూస్థానీలకీ మనల్ని భృత్యులుగా తయారు చేసింది కాంగ్రెస్సు.

మన ఆంధ్రోద్యమాన్ని అడిచేసింది. మన ఆంధ్రమహాసభని నేలమట్టం చేసింది. మన రాష్ట్రవాంఛని తునాతునకలు చేసేసింది. కాంగ్రెస్సు ఆంధ్రజాతిమీద వొక్క ముసుగు పెట్టేసింది.

"సంపూర్ణస్వరాజ్యమే మనకి లక్ష్యం. తెనుగు జిల్లాలను విడదీసి వొక ప్రత్యేకరాష్ట్రంగా నిర్మించవలసిందని దొరతనం వారిని కోరడం సహాయ నిరాకరణవ్రతులమైన మనకి నామోషీ పని. అది మన ఆత్మగౌరవానికి భంగకరం" ఇదీ మనకి కాంగ్రెస్సు చేసిన వుపదేశం.

మనం యీ వుపదేశాన్ని పూర్తిగా తలకెక్కించుకున్నాం. దీనితో మనకి ఆంధ్రత్వం మరుపు వచ్చింది. నైజాము రాజ్యంలో మన ఆంధ్రులు మాహమ్మదీయులయిపోతూవుంటే మనకి తెలవలేదు. బళ్ళారి ప్రాంతంలో మన జాతి పిల్లలకు మన తల్లి, తెనుగుభాష దూరమయిపోతూ వుంటే మనకి కనపడలేదు. చిత్తూరుజిల్లామీద ఘాటయిన అరవ ముద్ర పడిపోతూ వుంటే మనకి బోధ కాలేదు. మద్రాసులో వొకరోజుకంటే వొకరోజు మన స్థితి అధ్వాన్నమయిపోతూ వుంటే మనకి చీమ కుట్టినట్టు లేదు. చివరికి గంజాంజిల్లా వోఢ్రదేశంలో కలిసిపోతూ వుంటే కూడా మనకి నొప్పి కలగలేదు. ఇప్పటికీ మనకి అసంపూర్ణ స్వారాజ్యమే లక్ష్యం.

అయితే; యిప్పుడు ధర్మాతిక్రమణం చెయ్యడానికి జంకని యీ సరిహద్దులవారు అప్పుడు మాత్రం మన హక్కులు గమనిస్తారా? విడిచిపెడతారా?

ఇదంతా యెందుకు వచ్చింది?

తనకు మాలిన ధర్మం లేదు. లేవండి. నడుం కట్టండి. ఇప్పుడేనా యింకా మించిపోయింది లేదు. ఆంధ్రరాష్ట్ర నిర్మాణపు టాశ యింకా కనుమరగిపోలేదు. మన ముక్తి మన చేతుల్లోనే వుంది. మన కాళ్ళమీద మనం నిలవ కలిగినప్పుడే అఖిల భారతోద్యమంలో మనకి ఆవాహనవున్నా విసర్జన వున్నానూ.

కనక మనం యిప్పుడేనా మేలుకుని, ఆంధ్రోద్యమానికి మళ్ళీ ప్రాణప్రతిష్ఠ చేసుకుని, ఆంధ్రమహాసభని మళ్ళీ సమావేశపరుచుకుని ఆంధ్ర వికాసానికి అత్యవసరమైన—ప్రధానసాధనమైన ప్రత్యేకాంధ్రరాష్ట్రాన్ని సాధించుకోవాలి.

ఇదే మన కిప్పుడు ధ్యేయం. ఇదే ప్రాప్యం. ఇదే పరమావధి.

## జాతీయత కల ప్రిన్సిపల్

"వ్యవహారాని కెంత కావాలో అంతే హిందీ నేర్చుకోవాలి; కాని అందులో పండితులు కావడానికీ, పుస్తకాలు రచించడానికీ ప్రయత్నించ కూడదు. అంత హిందీభాషాపరిజ్ఞానం మనకి అవసరం లేదు. బొడ్డూడని పిల్లలు కూడా హిందీ అక్షరాలు, అ, ఆ, ఇ, ఈలు నేర్చుకోవడం చాలా విచారకరం. హిందీలో పరీక్ష లుండకూడదు"

ఆంధ్రజాతీయ కళాశాల ప్రిన్సిపలు కోలవెన్ను రామకోటేశ్వరరావుగారు, హిందీపరీక్షార్థులకు యోగ్యతాపత్రా లిచ్చిన బందరు సభలో చెప్పిన మాట లివి.

విద్యార్థుల నవజీవితాలకు జాతీయతాసంస్కారం కలిగించవలసిన ఆచార్యదేవుని బాధ్యత యీ మాటల్లో ప్రతీ అక్షరంలోనూ అతిజటిలంగా కనపడుతోంది. సామాన్యభాషగా అంగీకరించబడ్డ హిందీకి అనాదరం చూపకుండానూ, మాతృభాష అయిన తెనుక్కి దెబ్బ తగలకుండానూ ఇలాగ తూచినట్టు మాట్టాడడం నిజంగా కొనియాడ తగ్గ సంగతి. దేశాభిమానం చూపించడంలోనూ, నాయకులుగా చెలామణీ అవుతూ వున్న వారి ఆజ్ఞలను అనుసరించడంలోనూ విశేషం లేదు; కాని తన బుద్ధిని వినియోగించి పెద్దల సందేశాలకు చక్కని వ్యవస్థ చూపించడంలోనే ప్రజ్ఞ వుంది.

రామకోటేశ్వరరావుగారు ఇంగ్లీషులో ఎం. ఏ. పరీక్షలో ఆరితేరినవారు. ప్రఖ్యాతి పొందిన ఆంగ్ల మాసపత్రిక (త్రివేణి) కి సంపాదకులు. ఆంధ్ర వాఙ్మయానికి వారు కలిగించిన పుష్టి యేమీ లేక పోయినా వారు మాతృభాషయొక్క అప్రతిద్వంద్వపదవిని గుర్తించి వున్నారు. ఆంధ్రవాఙ్మయం యొక్క నవీనవికాసావశ్యకాన్ని బాగా గ్రహించి వున్నారు. కనకనే వారు హిందీయొక్క దురాక్రమణాన్ని యిలాగ నిక్కచ్చిగా ప్రతిఘటించ కలిగారు.

జాతి అంతా అనుకరణపరాయత్వంలో పడి పోతూ వున్న యీ సమయంలో రామకోటేశ్వరరావుగారివంటి, తమ్ము తాము తెలిసిన ప్రతిభావంతులు కొందరేనా వుండడం ఆశావహంగా వుంది.

## జాతీయ కాదు, సామాన్య

రామకోటేశ్వరరావుగారు మన ఆంధ్రదేశంలో హిందీకి నిలిచివుండ తగిన స్థలం చూపించిన సభలోనే డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్యగా రిలా మాట్లాడారు.

"పిల్లలూ వయసువారూ, వృద్ధులూ కూడా తప్పకుండా హిందీ నేర్చుకోవాలి...ప్రతీవారూ హిందీ నేర్చుకుంటే ఆంధ్రపత్రిక, కృష్ణాపత్రిక వంటి మాతృభాషాపత్రికల వ్యాపకం తగ్గిపోతుం దనడం హాస్యాస్పదంగా వుంటుంది...హిందూ దేశంలో ౧౨౦ కోట్లమంది హిందీ మాట్లాడేవా రున్నప్పుడు ఎప్పటికైనా ఆభాషే జాతీయభాషగా పరిగణింపబడుతుంది; గాని మిగిలిన భాషల కెప్పుడూ ప్రాముఖ్యం వుండదు. పైగా కాంగ్రెస్సు ప్రతివారినీ హిందీ నేర్చుకోమని ఆజ్ఞాపించినప్పుడు ఎవరికీ ఎలాంటి శంకలూ, అనుమానాలూ వుండడానికి తావు లేదు"

పట్టాభిసీతారామయ్యగారు "ప్రతీవారూ హిందీ నేర్చుకుంటే ఆంధ్రపత్రిక, కృష్ణాపత్రిక వంటి మాతృభాషాపత్రికల వ్యాపకం తగ్గిపోతుం దనడం హాస్యాస్పదంగా వుంటుం" దంటే ఆపత్రికలకు తెనుగుదేశంలో యెంత వ్యాపకం వుండాలో, ఇప్పు డెంత వుందో వారి కేమీ తెలవ దని స్పష్టమే. "కాంగ్రెస్సు ప్రతీవారినీ హిందీ నేర్చుకోమని ఆజ్ఞాపించిం" దంటే వారు ఆ ఆజ్ఞకి పరిమితి గ్రహించలే దని కూడా విశదమే. కనక యీ విషయాల మీద చర్చ అవసరం లేదు.

ఇక వున్న దల్లా యేమి టంటే?

"హిందూదేశంలో ౧౨౦ కోట్లమంది హిందీ మాట్లాడేవా రున్నప్పుడు ఎప్పటి కైనా ఆభాషే జాతీయభాషగా పరిగణింపబడుతుంది; గాని మిగిలిన భాషల కెప్పుడూ ప్రాముఖ్యం వుండ" దం టున్నారు వారు.

'జాతీయత' అంటే యేమిటో బాగా విచారణ చేసే అంటున్నారా సీతారామయ్యగా రీమాట?

భాషాశబ్దాన్ని సామాన్యపూర్వ్యం చేసినప్పుడూ, జాతీయపూర్వ్యం చేసినప్పుడూ కలిగే అర్థభేదానికి తూర్పుకీ పడమటికీ వున్నంత వార వుంది. ఏమాత్రం భాషాజ్ఞానం వున్నవారి కేనా యీభేదం సులభంగానే బోధపడుతుంది. అయితే: సీతారామయ్యగా రీభేదం తెలవకుండా మాట్లాడుతున్నా రని కాదు. ప్రకృతియొక్క నిరంకుశత మీద వారికి నిర్లక్ష్యభావం వున్నట్టుంది.

సేతువు మొదలు శీతాచలం దాకా వున్న ప్రదేశం అంతా భారతదేశ మని పిలవబడుతూ వుండడం సత్యమే. ఈభారతదేశం మాతృభూమిగా గల ప్రజాసమూహం అంతా భారతజాతి అని అనిపించుకుంటూ వుండడం కూడా నిజమే.

కాని యీ భారతదేశాని కంతటికీ—యీ భారతజాతి కంతటికీ భారతభాష అని వొక భాష లేదు. ఏం?

చిత్రవిచిత్రా లైన శీతోష్ణస్థితులు గల యీ విశాలదేశంలో, సహజసిద్ధా లైన ప్రత్యేకవలయాలు గల యీ అనంత జనసముద్రంలో వొకటే భాష వుండడానికి తగిన సన్నివేశా లేమీ లేవు.

"భారతదేశం" "భారతజాతి" అనే యీ మాటలు వశ్యవాక్కు లైన మత ప్రవక్తల నిర్మాణ చాతుర్యంవల్లా, అవక్రపరాక్రమవంతు లైన చక్రవర్తుల రాజ్యాంగ విధానంవల్లా వ్యవహారంలోకి వచ్చినవే; కాని సహజంగా పుట్టినవి కావు.

విజాతీయుల సంపర్కం యెరగని ఆరోజుల్లో, వారు గీర్వాణభాష అనే వొక ప్రత్యేకభాష ద్వారా అనుబంధం కలిగించుకుని సాముదాయిక వ్యవహారాలు కొనసాగించుకున్నారు.

అప్పు డేనా వారు దానికి 'దేవభాష' అని యెవరికీ తగాదా లేని పేరు పెట్టుకున్నారు; గాని 'జాతీయభాష' అని గాని పట్టం కట్టలేక పోయారు.

తరవాత వచ్చి దేశాన్నంతా కబళించిన పృద్గా భాషకీ, యిప్పు డిమధ్యల్లో వున్న యింగ్లీషుభాషకీ కూడా 'రాజభాష' అని మరో పేరు వచ్చింది; కాని 'జాతీయభాష' అని రాలేదు.

ఇక ముందు కూడా యీ పర్యాయ మిలా జరిగిపోవలసిందే; కాని మరోలాగ సాగడానికి వీలులేదు.

కాదూ కూడ దని గాంధిగారూ, గాంధిగారిని అంధవిశ్వాసంతో అనుసరించే వారూ కాంగ్రెస్సు ద్వారా పట్టు పడితే కాంగ్రెస్సు పతనం కావడాని కిదే ప్రధానకారణం అయిపోతుంది.

తమ తమ మాతృభాషల్లో నవీనవిజ్ఞానాన్ని సేకరించుకుంటూ వాఙ్మయాలకు సంపూర్ణత సంపాదించుకుంటూ వున్న హిందూదేశపు భిన్నప్రాంతాలవా రెవరూ కూడా హిందీకి జాతీయశబ్దాన్ని అతకనివ్వరు.

పైగా మహమ్మదీయులు హిందీని సామాన్యభాషగానే అంగీకరించడం లేదు. జాతీయభాష అని పేరు పెడితే దాన్ని వారు అసలే తిరస్కరిస్తారు.

అసలు మనవారు మహమ్మదీయుల హిందీ ప్రతిఘటనం బాగా గుచి చూసే వుండలేదు.

సత్యం యిదీ. ముందు ముందు జరిగేది కూడా యిదే. ఏమి టంటే?

ఆంధ్రులకు ఆంధ్రమే జాతీయభాష. ఇలాగే ద్రావిడులకీ, కర్నాటకులకీ, మహారాష్ట్రులకీ, వంగీయులకీ—తక్కినవారికీని. హిందీ జాతీయభాష అంటే అది హిందూస్థానీలకు మాత్రమే. తక్కినవారి కది వొక ప్రాంతీయభాష. దేవుడు మేలు చేస్తే హిందూదేశానికి సామాన్యభాష. అంటే బజారు భాష మాత్రమే.

ఇంతకంటే దాని కెవ రెలాంటి విశేషణాలు కూర్చినా అది జాతీయతకు దూర మైన—యెరగని ప్రసంగం అయిపోతుంది.

# ప్రబుద్ధాంధ్ర

కలాభివర్ధనీపరిషత్తుపక్షమున ప్రకటింపబడు మాసపత్రిక

సంపాదకుడు:—శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

సంపుటము ౫ } రాజమహేంద్రవరము నవంబరు ౧౯—౩౮ { సంచిక ౧౧

## ఇలాంటి తవ్వాయి వచ్చినట్టయితే........?

సుబ్రహ్మణ్యశాస్త్రి—సంపాదకుడు



"పక్కనే అంత గట్టుండగా యేం పని సాయీబూ అదీ? నిక్షేపం లాంటి చెర్లోనే పుక్కిలించి వుమ్మేసుకోవాలా? మీకు మాత్రం యెంగిలి తప్పు కాదూ? కాండ్రించి కూడా—చెప్పిన కొద్దీ మరీని. పోనీ, నీ యిష్టం వచ్చినట్టు చేసుకో. ఎవళ్లెంత చేసుకుంటే అంతా వాళ్లే అనుభవిస్తారు. నాకేం?"

"నీకే బుద్ధీ వుందీ లేదా సోమ్ యాజుల్? ఘుమ్యా ఘుమ్యా షీదీ షీదీ, చెర్వా హంతా గరీబ్ చేష్ఛి, హింకా మాకీ హాఛ్ఛేపన్ చేస్తావ్, భాన్సూ"

రామప్పసోమయాజులు మరి మాట్లాడలేకపోయాడు. "బుద్ధి గడ్డి తినడంవల్ల నిన్ను పలకరించా"నని మనస్సులోనే పశ్చాత్తాపపడ్డాడు. "అంతటితో చాలించి యిక వెళ్ళిపో మహాప్రభూ" అని కళ్లతో ప్రార్థించాడు.

యేలాంటి కళని వున్నాడో సాయిబు కూడా యిక మాట్లాడలేదు; కాని అతను వొడ్డెక్కుతూ వుండగా యాజులు పెద్దకూతురు యెత్తెత్తి కాళ్లేసుకుంటూ యెదురు వచ్చి, మొగం చిట్లించుకుంటూ వొక వోరకి తప్పుకుంది. కానైతే సాయిబు కూడా వొక పక్కగానే వున్నాడు. అక్కణ్ణుంచి కదలడం కూడా అతని కిష్టం లేదు. అయితే ఆమె వాలకం చూడగా అతనికి కొంచెం కోపం వచ్చింది. మొదట మొగం అయిమూలగా వంచి, మూతి బిగించుకు తీక్ష్ణంగా చూశాడు. తరవాత లోపల్లోపల యేమిటో గొణుక్కున్నాడు. చివరికి "బ్రామ్మన్ సైతాన్కా గడ్డీ యేస్తాం మాకీ" అని తుబుకూతుబుకూ పావంచాల మీద కూడా వుమ్మేస్తూ గబగబా చక్కాపోయాడు.

"ఎవర్ని నాన్నా సాయీబు తిడుతున్నాడూ?"

"ఇంకెవర్ని? ఎవళ్లకేనా బ్రహ్మిగాళ్ళే కదా లోకువ? కానీ—తిట్టుకోనీ—ఈశ్వరుడు లేడూ?"

"అస లెందుకు వచ్చిందీ?"

"కాండ్రించి చెర్లో వుమ్మేస్తావా!" అన్నాను. అదీ అపరాధం. ఇక వొక టేమిటి, నానా మాటలూ—హారోం హర......"

యాజులు వొక్క ములుగు ములిగి, పిలక జాడించుకుని, ఆచమానం చేస్తూ యాదాలాభంగా పక్కకి చూడగా, కుండలు కొందరూ, బిందెలు కొందరూ పుచ్చుకుని, పాతికమంది మాదిగ స్త్రీలు

యొడమ వేపు గట్టు పొడూగునా వరసాగ్గా నుంచుని వున్నారు.

అసలే యాజులికి బహు చిరాకుగా వుంది. ఆపైన యెండెక్కి పోవడం దానిమీద వైశాఖమాసపు కారెండ నెత్తి మాడ్చేస్తూ వుండడం. పైపెచ్చు యిదీ.

ఆది చూశాటప్పటికి యాజులికి ఫెడీ మని వొక్క మెరుపు దెబ్బ తగిలినట్టయింది. తానెక్కడ వున్నదీ, యేం చేస్తూ వున్నదీ, యేం జరుగుతూ వున్నదీ అతని కేమీ బోధపడలేదు. పైగా యెవరో కాళ్లకింద మంటలు పెడుతూ వున్నట్టు వొళ్లు రణ కంపర మెత్తిపోయింది. దాంతో అతను నిప్పులు తొక్కిన కోతి లాగ యెగి రెగిరిపడుతూ వొక్క పొలికేక పెట్టాడు.

కాని వాళ్లక్కణ్ణుంచి కదల్లేదు. ఆపెడబొబ్బ కూడా వినిపించుకోలేదు.

"పోరేం?......మాదిగ పీనుగుల్లారా!.. పోతారా పోరా?"

"మంచినీళ్లకి వచ్చామండి"

"మీ చెరు వేమయిపోయిందీ?"

"కుష్టురోగపు లచ్చిగాడు దాంట్లో పడి చచ్చిపోయాడండి"

"అయితే మాత్రం......"

"అనీ ళ్లెలా తాగమండి దొరగారూ?"

"కల్లుకంటే చెడిపోయాయా?"

"........................"

"పొండి పొండి, మున్సబు కరణాలకి తెలిస్తే పాతేస్తారు మిమ్మల్ని...తొరగా—యింకా నుంచుంటారేం?"

"నీళ్ళు ముంచుకోకుండా వెళ్లి యేం చెయ్యమంటా రండి బాబయ్యా?"

"చెర్లో దిగా రంటే మహామ్మాయి వండించేస్తాను మిమ్మల్ని, వెనక్కి మళ్ళరేం?"

"మేం దూరంగా పోతాం, మా కుండల్లో నీళ్లు పోసి వెళ్ళిపోండి కామందులు"

"అలాగేం? అబ్బో! ఎంత మదిరిందీ మీకు పొగరూ?......పోతారా వొద్దెక్కనా?"

"మాటకి మాట యెలా అందిస్తున్నారో చూశావా? స్నానం కూడా చేశావు నువ్వు వాళ్లతో మాట్లాడకు నాన్నా! అదిగో రామినీడుగారి అబ్బులు కామోసు బిందె పట్టుకు వస్తున్నాడు వాళ్లకి నీళ్లు పొయ్యడానికి. అతను వాళ్ల కుండల్లో పోశాటప్పుడు కొన్ని నీళ్లు కింద పడి చెర్లోకి చారి తీస్తాయి, నువ్వు తొరగా తెములొచ్చెయ్యి"

ఈ మాట చెవిని పడేటప్పటికి యాజులికి కరిగిన సీసం కాళ్లకిందికి పాకి వచ్చినట్టయింది.

ఇక వొక జంధ్యాలు తోముకోడం లేదు. వొళ్లు తోముకోడం అసలే లేదు, సంకల్ప మేనా ప్రారంభం కాలేదు, చివరికి తడి బట్టైనా విప్పేసుకోలేదు; పక్కా గంట పట్టే స్నానం మూడు నిమిషాల్లో తేల్చుకుని, గభీమని వొడ్డెక్కి, పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ—దూకుతూ యింటికి వెళ్లిపోయాడు యాజులు.

"నిక్షేపం—గంగాళం లాంటి చెరువు తగులడిపోతుంది కామోసు. దిక్కుమాలిన కర్మం కాలవలు కూడా కట్టేశారేం గతి యింకా?" అని సాగతీసుకుంటూ ఆమె కూడా అతని వెనక్కాలే యెగిరిపోయింది.

౨

ఎన్ని తరాలనుంచో, మాదిగల కొక చిన్నదీ, తక్కిన అన్ని కులాలవారికీ వొక పెద్దదీ, ఆవూళ్లో రెండు చెరువు లొక దానితో వొకటి కలిసే వున్నాయి. పెద్ద చెరువులో వున్న నిలవ నీరు పోవా లంటే చిన్న చెరువే దారి. చిన్న చెరువులోకి కొత్త నీరు రావా లంటే పెద్ద చెరువే దారి. ఇలాగ ఆరెండింటికీ ఆదికాలంనుంచీ యెడతెగని

సంబంధం వుంది. పైగా వాటిని రెండింటినీ కలిపే తూము తరుచు తెరిచే వుంటుంది. ఆతూము దగ్గిరిగా మాదిగ లప్పు డప్పుడు మావులు కట్టుకోవడం కూడా వుంటూనే వుంటుంది,

ఆవూళ్లో అరవై యిళ్లు బ్రాహ్మ లున్నారు. మున్సబూ కరణమూ కూడా అక్కడ బ్రాహ్మలే. రయితాంగం— కమ్మవారు పాతిక యిళ్లవా రున్నారు; కాని అట్టే మోతుబర్లు కారు. పాటకపుజనం కూడా చాలా కొద్దే అయితే మాదిగిపిల్లిలో మాత్రం యాభై అరవై కొంప లున్నాయి.

అది యెప్పు డెలా తటస్థించిందో కాని, ఆవూళ్లో ముప్ఫయి తొమ్మి దిళ్లు తురకలు కూడా వున్నారు. వారిలో చాలామంది బీదలే: గాని తోళ్లవర్తకులొక రిద్దరు సంపన్ను లే వున్నారు. చిన్న మసీదు— కమ్మవీధి నానుకునే వుంది.

పదేళ్లకిందట మిషనరీలు వచ్చి మాదిగిపిల్లిలో వొక పాఠశాల లేవదీశారు. ఏడెనిమిది కుటుంబాల మాదిగల్ని మతంలో కూడా కలిపారు. అయిదారుగురు మొగపిల్లలు ప్రయిమరీలో తేలారు. పాఠశాలల్లో పాతికమంది పిల్లల పే ర్లున్నాయి. పది పదిహేను క్రాపింగులు వెలిశాయి. అంతే. మాదిగలతో పాటు కిరస్తానీ పంతులు కూడా అక్కడే—అలాగే కాపరం వున్నాడు. కాని మొత్తానికి మిషనరీలవల్ల మాదిగలకి వూళ్లో కొత్త పరపతి యేమీ కలగలేదు. మతంలో కలిసినవాళ్లనా మామూలు వృత్తుల్లోనే వున్నారు.

సంవత్సరం కిందట బదిలీ అయి వచ్చిన కిరస్తానీ పంతులు మాత్రం కొంచెం ఘటకుడు

* * * * *

పోలీసులు శవాన్ని దహనం చెయ్యడానికి సెలవిచ్చి వెళ్లిపోయారు.

* * * * *

అతికష్టం మీద రెండు రోజు లెలాగో గడిచి పోయాయి. కిరస్తానీపంతులు గాంధీగారి మాట చెప్పి మాదిగపిల్లిలో కొంచెం పు రెక్కించాడు.

ఆవేళ సాయంత్రం నాలుగు గంటలవేళ పెద్ద మాదిగ లిద్దరు కిరస్తానీ పంతుల్ని వెంటపెట్టుకు వచ్చి నడివీధిలో కూమని వున్న మున్సబుకరణాలని, బ్రాహ్మణప్రముఖుల్నీ, కమ్మదొరల్నీ సంబోధించి "మా మాట యేం చెప్పా రండి" అని అడిగారు.

"మాట్లాడ రేమండి కామందులు!"

"ఈరెండు రోజుల్నుంచీ యేం చేస్తున్నారురా?"

"వో పూట వొకరూ, యింకోపూట యింకోరూ కమ్మదొరలు పోస్తున్నా రండి గట్టుమీద మా కుండల్లో నీళ్లు"

"ఇక ముందుకూడా—కొలవలు తెరిచి, చెరువుల్లో కొత్తనీరు పెట్టుకుని దాకా అలాగే కాలక్షేపం చెయ్యండి"

"చెయ్యలే మండి"

"ఏం చేస్తారు మరీ!"

"చెరువులో దిగి నీళ్లు ముంచుకోడానికి మాకు సెలవిప్పించండి"

అందరూ గతుక్కు మని వొకరికేసి వొకరు చూసుకున్నారు.

"ఇదంతా ఆకిరస్తానీ పంతులు చేస్తున్నాడు" అన్నాడు వొక కమ్మదొర తల వూపుతూ, మెల్లిగా. మాదిగపిల్లిలో కిరస్తానీలు ప్రవేశించాక మాదిగలు చెప్పిన మాట వినడం మానేశా రని కమ్మవారికి కొంచెం గుర్రుగా వుంది.

"ఇప్పుడు మనం కొంచెం బిగించామంటే యీ కిరస్తానీలను వెళ్లగొట్టించెయ్యవచ్చు చులాగ్గా" అన్నాడు యాజులు కళ్లెగరవేసుకుంటూనూ ఆచౌదరితోటి. అందరూ కొద్దిగానో గొప్పగానో తలలు వూపారు.

కిరస్తానీపంతులు వారి ముఖలక్షణాలను బట్టి సంగతులు గ్రహిస్తూ యెతులు వేస్తున్నాడు.

"వల్లకాదు. మీ తండ్రులనాడు—మీ తాతల

నాడు—మీ ముత్తాతలనాడు—ఎప్పుడేనా యెరుగుదురా మీరు ఆవాజిబీ?"

కళ్లెఱ్ఱజేసి వురుముతూ యిలా అడిగాడు కరణం.

"లేకపోతే మా చెరువులోకి నిండా నీరు విడిచిపెట్టించండి"

"అదీ వల్లకాదూ. వున్న కసింత నీరూ మీ కిచ్చేసి మేము మట్టి తాగమా?"

"మరి మా మాటో దొరగారూ?"

"ఆమాట దేవుడి కొడుకు నడగండి"

మున్సబు చటుక్కున యిలా అనేశాడు; కాని వెంటనే నాలిక కరుచుకున్నాడు. అది చూసి కొందరు "ఫరవాలే" దన్నారు. కొందరు "మాటలు విడిచిపెట్టకండి" అన్నారు.

అప్పుడొక చౌదరి అనుకున్నాడు.

"ఎవరికీ యిబ్బంది లేకుండా కాలం వెళ్లిపోవాలంటే యిదివరకి నడిచిందే పద్ధతి, అయితే, అస్తమానూ మీ కందరికీ నీళ్లు పోస్తూ కూచోడానికి యెవరికి సాగుతుంది? కనక మా వాళ్లలో యెవర్నేనా రాయితీగా కుదురుస్తాను జీతం మీ రిచ్చుకోండి"

"దేవు డిచ్చిన నీరు మీ రంతా పూరికే వాడుకుంటూ వుండగా డబ్బిచ్చి మేము కొనుక్కోవాలా అండీ?"

"[illegible], లేకపోతే ఏం చేస్తారూ?"

"బాగా ఆలోచించండి కామందులు"

"ఆలోచించే చెప్పాం. కాకపోయినా యిందులో ఆలోచించవలసిం దేమీ లేదు"

"మేము లేకపోతే మీకొక్క రోజు గడవదు. మా కష్టసుఖాలికి మీరే పూచీ. బాగా పరకాయించుకోండి బాబయ్యా"

"ఇప్పటిమట్టుకు మీ కొంపల్లో వొక్క చెంబు తీసుకోండిరా".

పోరకాల వున్న వొక శాస్త్రులు యిలా అనగా "అట్లు నవ్వును, పాదిరీదొరలు మయ్యి పట్టించిపెట్ట రాదూ మీకూ? పూరికే మతంలో కలుపుకోగానే తీరిందా" అన్నాడు చౌదరి.

"ఎక్కణ్ణుంచో వచ్చిన పాదిరీలు మమ్మల్ని చూస్తారా బాబయ్యా?"

"అయితే యెన్ని తరాలనుంచో వున్న మతం యెందుకు వొదిలిపెట్టారు మీరూ?"

ఈమాట మీద "అలా నిలవేసి అడగం" అని వొకడూ, "ఇనుక్కులు నేలమట్టం చెయ్యాలంటే యిదే సమయం" అని మరొకడూ, "ముందు క్రాపింగులు గొరిగించెయ్యా" లని యింకొకడూ—తలో మాటా కొంచెం గట్టిగానే అన్నారు.

ఇవన్నీ పంతులు చెవిలో పడ్డాయి. గిర్రున తల తిరిగిపోయిం దతనికి. వెంటనే సరళమైన అతని స్వరానికి కరకుతనం వచ్చింది.

"ఏ మంటారు?"

"మీరే చెప్పండి"

"రాజీ కుదరదు"

"కనపడుతూనే వుంది"

"మన పూచీ వదిలిపోయింది. వారికి వారే రాజీకి వస్తే ఆలోచిద్దాం"

"......................"

"వెళ్లిపోదాం పదండి"

వొక్క క్షణం అయినాక "యేం బాబయ్యా, యేం సెలవూ?" అని వొక పెద్దమాదిగ అడగ్గా, "నాలుగు పూటలు కళ్లు మూసుకుంటే వెళ్లిపోయీ దానికి తగువు పెంచా లేమిట్రా?" అంటూ చౌదరి వెటకారం చేశాడు.

పంతులు వూపిరి బిగపట్టి మాదిగల కేసి దృఢ నిశ్చయంతో చూశాడు. "ఇక యెందు కేనా తయారే" అన్నట్టు తల లూపి "పదండి" అంటూ మాదిగలు దారి తీశారు.

* * * * *

"మనం మన జాగ్రత్త మీద వుండడం మంచిది" అని తూజాల్లా చెప్పిన సలహా మీద కొత్త అందరూ

ఆలోచించి, రాత్రీ పగలూ కూడా సరిహద్దు గట్టు మీద కాపలా వుండడానికి మెరిక ల్లాంటి యిద్దరు కమ్మ యువకుల్ని జీతానికి పెట్టారు.

3

పంతులు తల చించుకున్నాడు. కాని వుపాయం తోచలేదు. అయితే, పెద్ద చెరువులో దిగి తీరా లన్న పట్టుదల మాత్రం అతని కెంత మాత్రమూ తగ్గలేదు, సరికదా పెనవేసుకుపోతూనే వుంది.

"ప్రయోజనం కలగదు" అని నిశ్చయం చేసు కునే అతను రామచంద్రపురం వెళ్లి యీసంగతు లన్నీ హరిజనసంఘాధ్యక్షునితో చెప్పి సాయం చెయ్య మని కోరాడు. దానిమీద "తప్పకుండా నూ" అంటూ ప్రారంభించాడు ఆత్యాగమూర్తి "మీ వుద్దేశం చాలా మంచిది. మీ దీక్ష నాకు పారవశ్యం కలిగిస్తోంది. హరిజనసోదరుల చిక్కు లకు నేను మిక్కిలీ పరితపిస్తున్నాను. కాంగ్రెస్సు దృష్టి అంతా యిప్పుడు హరిజనుల పక్షంగానే వుంది. అయితే—మీరు కొంచెం విశాలభావం తోటీ, విశ్వమానవసౌభ్రాత్రంతోటీ, లోకకల్యాణ దృష్టితోటీ యీసమస్యని సమన్వయించా లని కో రుతున్నాను. ఇది చాలా సందిగ్ధస్థితి. పైగా మీ వూరి పరిస్థితులు వేరు. ఇంతకీ: ఇప్పుడు కాంగ్రె స్సు సాంఘికబహిష్కారాన్ని దూరంగా పెట్ట మని చెప్పి అసెంబ్లీ యెన్నికలలో వురికింది. మీవూళ్లో డెబ్భయి తొమ్మిది వోట్లున్నాయి. అన్నీ అగ్రజా తులవారిలోనే వున్నాయి. మేమిప్పు డీస్వల్పవిష యంలో కలగచేసుకున్నా మంటే విశ్వవ్యాప్తమైన హిందూస్థానభవితవ్యానికి అపాయం సంభవించ గలదు. కనక మీ రిప్పు డీసంకుచిత దృష్టి విడిచి పెట్టి రాట్నం చేపట్టండి. హిందీ నేర్చుకోండి. గ్రామపునర్నిర్మాణానికి బలం కలిగించండి. కాం గ్రెస్సువారిని మీ రంతా కలిసి అసెంబ్లీకి పంపకలి గా రంటే అప్పుడు మీ పని చక్కగా—చూసేం డీ! ఆంధ్రరాష్ట్రీయకాంగ్రెస్సు కమిటీ అధ్యక్ష పదవిని మీ వంటి హరిజనసోదరునికి ఇవ్వా లని నేను ఘోరంగా వాదించబోతున్నాను. మరి దయ చెయ్యండి"

పంతులు తుళ్లిపడ్డాడు. మరి అక్కడ నుంచో లేదు.

* * * * * * * * *

రాత్రి తొమ్మిది గంట అయింది. అప్పుడే భో జనం చేసివచ్చి పంతులు అరుబైట పడక్కుర్చీలో కూచున్నాడు. అంటించిన చుట్ట పూర్తి అయేట ప్పటికి మాదిగకులపెద్దలు నలుగురు వచ్చి చుట్టూ కూచున్నారు.

"అప్పుడే వారం రోజులు గడిచిపోయాయి. దారి తెన్నూ యేమీ కనపడ్డం లేదు. పెద్ద కులాల వారికీ మనకీ తగువు మాత్రం పెరిగిపోయింది"

"నిజమే. ఎప్పటి కేనా మన కిదే దారి. వారూ మనమూ యిష్టంగా వున్నంత కాలమూ మన కేమీ లాభం కలుగదు. మనం వారి చుట్టూ—మాబతుకు మీ దయాధర్మబిచ్చాలమీదే వుం దని మనం దేవు ళ్లాడినంత కాలమూ మన చిక్కులూ, ఇబ్బందు లూ వారికి బోధపడవు. "వీళ్ళని చెండనాడుకుంటే మన పని బండిసున్నా అవుతుం" దని వారికి తెట్ట తో చేటట్టు మనం చెయ్యగలిగినప్పుడే వారు మన ల్ని మనుష్యు లని భావించి రాజీకి వస్తారు"

"కాలవలు తెరిచా రంటే—"

"తరవాత మనకి మన్నే. ఈలోపునే కావా లేమయినాసూ. అయినా యింకో యిరవై మూడు రోజులు మనకి గడు వుంది. ఏలాగు దగ్గి రేనా మరామత్తు పూర్తి కాక అధికార్లు మరో పది రోజు లు గడువు పెంచడం కూడా వుంటూ వుంటుంది. కంగారు పడకండి. నేను నౌకరీకి సెలవు పెట్టి యీ పనిలోనే మునిగి వుండడం మీరు చూస్తూ నే—"

"పోనీ, మనం కట్టు కట్టి వారి పనులు మానేస్తే?"

"మనమే చెడిపోతాం. మీచేత ఆపని చేయిస్తే నాకు పేరు రావచ్చు. పత్రికలు "ఓహోహో" అని పొగడవచ్చు. కాని నెగ్గించుకోలేక మీరు మాడిపోతారు. చివరికి వారి కాళ్ళూ కడుపూ పట్టుకోవలసివస్తుంది"

"........................"

"........................"

"ఏరాత్రో పెద్ద చెరువు నీరు కూడా మురుక్కాలవలోకి కొట్టేస్తే?"

"........................"

"........................"

"పెద్ద కులం వారిని యుద్ధానికి కవ్వించామన్న మాట"

"రయితులు మనకంటే తక్కువ వున్నారు. కర్ర పుచ్చుకున్నా మంటే బాపనోరు తలుపులు బిగించుకుని—"

"చుట్టుపట్ల వూళ్లు లేవూ?"

"మాదిగిపిల్లులు మాత్రం—అవును లెండి"

"నిదానించండి. మనం పెద్ద చెరువులో దిగి తీరాలి. ఇది తప్పదు. మీ రీ పట్టు మాత్రం విడవ కూడదు. మంచి వుపాయం—"

సరిగా యీ సమయంలో "నాకు దొరికిం దండోయ్!" అంటూ విస్సన్న వగర్చుకుంటూ వచ్చాడు. కులపెద్దలు "పరుగు పరుగున వచ్చాడు. ఆయాసం తీర్చుకోనివ్వండి పాపం" అన్నారు. "మంచినీళ్ళు పుచ్చుకుంటావా?" అన్నాడు పంతులు. దానికి వద్దని బుర్ర వూపుతూ వగర్చుకుంటూనే "నేను తురకమతం పుచ్చుకుంటా" నన్నాడు విస్సన్న. అది విని కులపెద్దలు "ఛా, ఛా! ఏం పనిరా అదీ?" అని మూతి విరిచారు; కాని "వుండం" డంటూ పంతులు వొక్క నిట్టూర్పు విడిచాడు.

పంతులుకి నిజంగా చెరువులో దిగి సావకాశంగా స్నానం చేసినంత వుత్సాహం కలిగింది. చాలా నిదానమైన బుద్ధి కలవా డతను. తాను మాల వెంకడుగా వుండేటప్పటికంటే యిప్పటి తన స్థితి అన్ని విధాల బాగానే వుంది. చదువుకి చదువు, వుద్యోగానికి వుద్యోగం, డబ్బుకి డబ్బు, పలుకుబడికి పలుకుబడి, గౌరవానికి గౌరవం—యేమీ లోటు లేదు. కాని మతంలో కలసినా తాను వూళ్లో కాపరం చెయ్యడానికి వల్ల కాదు. చెరువు ముట్టుకోడానికి వీలులేదు. ఇక కిరిస్తానిమతంవల్ల మాదిగల కేం లాభమూ?

బాగా ఆలోచించాడు పంతులు. "తురకమతంలో కలిస్తే స్వేచ్ఛ. ఎవరూ దేనికీ అట్టుకోరు. వూళ్ళో అందర యిళ్లల్లోకీ వెళ్లవచ్చు తురక అంటే యెవరూ నోరెత్తరు" ఈలాభాలు స్పష్టంగా కనపడ్డాయి అతనికి"

"నీకే తోచిందా?"

"రామచంద్రపురం నుంచి వస్తూ కరీం సాయిబుగారు చెప్పారు"

"అందరూ కలవాలన్నారా?"

"ఇష్టం వున్నవాళ్లు—పెద్ద చెరువులో దిగాలని, వూళ్లో అందరి యిళ్ళలోకీ వెళ్ళాలని ఆశ వున్నవాళ్లందరూ రావచ్చు నన్నారు."

"శెభాస్" అని యెగిరి గంతు వేశాడు పంతులు; కాని కులపెద్దలికి మొదలూ తుదా యేమీ కనపడలేదు.

"నువ్వే మన్నావు?"

"నా మట్టుకి నేను సిద్ధం అన్నాను"

"మరి నీకు కులం?"

"కులంకోసం కులం విడిచిపెట్టేస్తాను నేను"

"తక్కినవాళ్లెవళ్లూ కలవకపోతేనో?"

"వాళ్ల కర్మం"

"................"

"బర్మాలో నేర్చుకున్నాను కనక హిందూస్థానీ నా కిదివరకే వచ్చును ఏను కొంపల వాడి మొక్కుంది కనక గడ్డం—చూసుకోండి"

"...................."

"నేను గ్రామనౌకర్ని కనక కరీం సాయిబుగారి తోటి కరణంగారి యింటోకీ, మున్సిబుగారి యింటోకీ—బాపనోరి యిళ్లన్నీ దూరేస్తాను. రోజూ చెర్లోనే తానం మాడతాను"

"అంతటితో వూరుకో"

ఇలా అంటూ పంతులు వాళ్ల నందర్నీ యిస్కూలు వాళ్లోకి తీసుకువెళ్లి రహస్యాలోచన సాగించాడు.

౪

"సలామ్ మహారాజ్!"

"ఏ వూరు—విస్సిగా!"

"అయ్యా! మీకీ యింకా అస్మంటీ మాటా పన్కి రాద్: యిస్సన్న నిన్నటిక్కి యిస్లామ్ మతంలో కల్సిపోయాడ్. పేరూ సెప్తాం, యిస్తాయిల్ సాబ్! అయా మీకీ సలాం చెప్పీ వుండాడ్ కన్కా మీకీ మళ్లీ బదుల్ సలామ్ చెప్పాలా అండీ"

"ఏమిటీ, యేమిటీ?" అంటూ కరణం పడక్కుర్చీలోనుంచి లేవబోయాడు; కాని సాగింది కాదు. ఆమాట వినడం తోటే నడుము విరిగిపోయిం దతగాడికి. అయితే, వెంటనే రెండు చేతుల తోటీ కళ్లు మూసుకుని లోపల్లోపలే "రామా, రామా" అనుకుంటూ అలాగే వుండిపోయాడు.

కరణం స్థితి యిలా వుండగా, సరిగా యీ సమయంలోనే ఇన్కంటాక్సు నోటీసు చేత్తో పుచ్చుకుని "నిద్రా యేమిటోయ్?" అంటూ రామప్ప సోమయాజులు వచ్చాడు. కరీమునీ, ఇస్మాయిల్నీ వీధిగుమ్మంలో నుంచే చూశా డతను; కాని యిద్దరికీ గడ్డా లుండడంవల్ల యిద్దరూ తురకలే అయి వుంటా రనుకున్నాడు? కాని పరకాయించి చూడలేదు. దగ్గిరికి వచ్చాకేనే అతని కళ్లు కరణంమీాదే పడ్డాయి. ఇంతే కాక. అస లతనికి అనుమానపడవలసిన అవసరం యేం వచ్చిందీ?

అప్పుడు కరీము వొక కుర్చీ కరణానికి దగ్గిరగా వేసి "కూచోండి మహారాజ్" అని యాజులుతో చెప్పి పక్కకి తిరిగి కన్ను గీటాడు. వెంటనే యిస్మాయిలు "సలామ్ యాజుల్ మహారాజ్" అన్నాడు. యాజులు కుర్చీమీద కూచుంటూ, "అభీష్టసిద్ధి—" అని ఆశీర్వచనం చేస్తూ యాదాలాభంగా కన్నెత్తి చూస్తాడు కదా కుడిచెయ్యి అలాగే నొసట వుంచుకొని, చిరునవ్వు నవ్వుతూ, వంగి విస్సిగాడు—

యాజులు వులిక్కిపడ్డాడు. ఆకంగారులో కుర్చీ వెనక్కి పడిపోయింది. కుడిచేతిలో వున్న నోటీసు వొక వేపుకీ ఎడమచేత్తో వున్న పొడుముకాయ వొక వేపుకీ పడిపోగా యాజులు వెల్లకితలా పడి వొక్క క్షణానికి పక్కకి దొర్లి లేచి, తూల్తూ తూల్తూ దూరంగా వెళ్లిపోయి "వోరి మాదిగి పీనుగా" అని యిక మాట్లాడలేకపోయాడు.

ఇదంతా వేళ్ల సందుల్లో నుంచి చూస్తూనే వున్న కరణం యిక లాభం లే దని నిశ్చయించుకుని యెత్తుపడిపోయినవాడిలాగ మెల్లిగా లేచి కూచున్నాడు.

"ఈదురంతం యేమిటోయ్ కరణం?"

"తురకల్లో కలిశాడు విస్సిగాడు—"

"అద్గో, అద్గో. అస్మంటీ మాటా—చెప్పానూ లేదూ మహారాజ్? యిస్సన్నా జాంతే నై. యిస్గాడూ మర్గయా అనోక్కండి. యిస్మాయిల్ సాబ్ చెప్పండి. లేకపోతే బడా తంటాల్—హంతా మీకీ యొర్గుదుర్"

"ఏమిటోయ్ యీ పుట్టిమునకా!"

"మనకర్మం. ఇం కేం చేస్తామూ? రండి, కూచోండి"

"ఛా, ఛా! తన్ని తగిలెయ్యక వాణ్ణింకా—"

"ఖబర్దారీ యాజుల్ సాబ్! మాకీ ముసల్మాన్! హూ, హిక్దా మీకీ పప్పూ—"

"కరీం! వూరుకో. వారు పెద్దలు—"

"పెద్దల్కీ, చిన్నల్కీ తేడా వుండ్వాలా. ఘనుస్మాఘనుస్మా మాటల్ సెస్తే—మహారాజ్! మాకీ ఘౌరవం కావాలా. మీకీ ఘౌరవం చేస్తామ్. బరాబర్"

ఈసందట్లో యాజులు మేఘాల మీద యెగిరి పోయాడు.

కరణం వొక్క క్షణం ఆలోచించాడు, కాని యేటూ పాలుపోలేదు. చివరి కతను "యీ దెయ్యాలు వొదిలిపోతే చాలు" నని నిశ్చయించుకుని "నాకు దొడ్లో పనుంది. మీ రిప్పటికి వెళ్లిపొండి" అని నౌకర్లకి చెబుతూ మాట వినిపించుకోకుండా లేచి చక్కాపోయాడు.

ఇదంతా చూశాటప్పటికి యిస్మాయిలుకి చీకట్లోనుంచి గభీ మని వెలుగులో పడ్డట్టయింది. యుగయుగాలనుంచి వున్న పుట్టుగుడ్డితనం పోయి వున్నట్టుండగా అతినిశిత మైన చూపు వచ్చినట్టయింది. ఇప్పుడే తల్లి కడుపులోనుంచి పుట్టి, పుట్టిన వెంటనే ప్రాజ్ఞత వచ్చినట్టున్నా అయింది. దీనితో అతనికి బ్రహ్మానందం కలిగింది. చూస్తూ వుండగా కళ్లల్లోనుంచి బాష్పప్రవాహం వురకలు వేసుకుంటూ ఉంఘించింది. ఇది యిలా వుండగా: మాదిగపిల్లిలో మట్టుకే గడప దాటి లోపలికి వెళ్లగల తనకి అందరి యిళ్లల్లోనూ సంచరించడాని కిలాంటి అధికారం యిచ్చిన యిస్లాము మీద అతనికపార మైన భక్తీ, విశ్వాసమూ కలిగాయి. ఇదంతా కరీము మూలానవల్లనే తనకి సంభవించడం కూడా అతనికి జ్ఞాపకం వచ్చింది. వెంటనే అతను కరీం పాదాలమీద పడి "భాయీ! ఋణం నేను తీర్చుకోలేను. నే నిదివరకి పురుగుకంటే అన్యాయంగా బతికాను. నేనూ మనిషినే అని తల యెత్తుకుని తిరగ్గల అదృష్టం నా కిప్పటికి కలిగింది. ఇస్లాం మతం రాజామతం. భాయీ! నేను యిస్లాము మతాన్ని నిందించిన వాడి నాలిక పెరికేస్తాను. ఇస్లాము మీద పగబట్టినవాళ్లని నాతేస్తాను. ఇస్లాం మతం కోసం నేను ప్రాణా లిచ్చేస్తాను" అని యిక మాట్లాడలేకపోయాడు.

దీంతో కరీముకి ముందు గంభీర మైన ఆనందమూ, తరవాత అత్యున్నత మైన గర్వమూ కలిగాయి. అతనికి మహమ్మదువారు వచ్చి తన శిరస్సుమీద చెయ్యి వుంచి దీవించినట్టయింది. వెంటనే అతను యిస్మాయిల్ని లేవదీసి, గట్టిగా సగరించుకుంటూ యెదురొమ్ము విరుచుకు నిలిచి "యిస్మాయిల్! భాయీ! మతం అంటే యిస్లాం వొక్కటే మతం. మన్సి అంటే ముసల్మాన్ వొక్కడూ మన్సి. దేవ్డూ అంటే అల్లా వొక్కడూ దేవ్డు. గుర్వూ అంటే మహమదావార్ వొక్రూ గుర్వు. తెల్సిందీ భాయీ! మన్కీ మతంలో మన్సికీ మన్సికీ యెక్వా తక్వా లేవ్. నవాబ్, గులాము వొక్కటి కంచంలో నాష్టా పడ్తార్. ప్యారీ యిస్మాయిల్! యిదీ వొక్కటి యినోక్కా. అల్లా కటాక్షం సల్లంగా వుంటే ముసల్మానూక్కా లుక్సాన్ లేదు. ముసల్మానూక్కా దుఃఖం లేదు. ముసల్మానూక్కా బయ్యం లేదు. ముసల్మానూక్కా షత్రుల్ లేదు. ముసల్మానూక్కా అపాధం లేదు. నమ్ము భాయీ!" అని అతన్ని కౌగిలించుకుని పరవశుడైపోయాడు.

౫

పదిన్నర అయింది. పావంచాలూ, చెరువూ బ్రాహ్మణముండాగాళ్లతో నిండిపోయి వున్నాయి. చెంబులు తోమేవాళ్లు కొందరు. బట్ట లుతికేవాళ్లు కొందరు. స్నానం చేసేవాళ్లు కొందరు. కథలు చెప్పేవాళ్లు కొందరు. జాతేపాలు పన్నేవాళ్లు కొందరు. వొకచోట సంభావనల గొడవ. వొకచోట వరకట్నాల బేరం. ఇంకోచోట వొంగ పాతమ్యాల పన్నాగం. మరోచోట వడ్డీలెక్కలు.

వేరొక చోట మనోపత్తి పాపాల ఆలోచనలు. మధ్యమధ్యా, అక్కడక్కడా వేశ్యాప్రశంసలు. సంగీతాలు. చాటుధారపద్యాలు ప్రాస్తావిక శ్లోకాలు. ఇంగ్లీషు టప్పాలు. అసావాదిత్యో బ్రహ్మలు. అర్ఘ్యప్రదానాలు. గాయత్రీజపాలు. వూతపదాలు. వో! వొకటేమిటి, రేవంతా మహా కోలాహలంగా వుంది.

ఇలాంటి స్థితిలో:

అటు మాదిగిపల్లిలో నుంచి పిన్నలూ, పెద్దలూ —స్త్రీ పురుషులు యెనభై తొంభై మంది బిలబిల్లాడుతూ వచ్చి సరిహద్దు గట్టుమీద వరసలు తీరి కూచున్నారు.

ఇటు తురకపేటలో నుంచి జమాజెట్టీల్లాంటి యువకులు పాతిక ముప్పయిమంది లాఠీకర్రలు పుచ్చుకు వచ్చి దక్షిణపు గట్టుమీద మీసాలు దువ్వుకుంటూ, వంకరచూపులు చూసుకుంటూ బారులు తీరి నుంచున్నారు.

బ్రాహ్మలందరూ అదీ యిదీ కూడా చూశారు. అయితే, అదేమిటో, యిదెందుకో యేమీ బోధపడకపోయినా తురకలూ, మాదిగలూ గూడుపుఠాణీ చేస్తున్నారనీ, యిప్పుడేదో వొక సాహసకార్యం జరిగిస్తారనీ మాత్రం తట్టింది. వెంటనే అరణగోణధ్వని అంతా చప్పుగా చల్లారిపోయింది. పైగా వారందరికీ యెక్కడలేని చురుకూ వచ్చింది. అష్టోత్తరశతగాయత్రికి సంకల్పించినవారు అప్పటికయినంత సంఖ్యతో చాలించి ఆచమానం చేశారు. పూర్తిగా సంధ్యావందనం చెయ్యబూనినవారు అర్ఘ్యప్రదానంతో పూర్తి చేసేశారు. సబ్బు వుపయోగించదలచినవారు వొట్టి చేతులతోనేనా తోముకోకుండా స్నానం ముగించేశారు. కట్టుకున్న బట్టలు వుతుక్కుందామని నిశ్చయించుకున్నవారు ఆబట్టలు విప్పనేనా విప్పకుండా చెంబులతో నీళ్లు ముంచుకోసాగారు.

ఇలాగ వొక్క నిమిషం గడిచింది. రెండో నిమిషం ప్రారంభం అయింది; కాని అది పూర్తి కాకుండా కరీమూ, యిస్మాయిలూ యేనుగు గున్నలలాగ వచ్చి చివరి పావంచామీద నుంచున్నారు.

కరీము కరీమే. ఇక రెండో మనిషా? కనురెప్పలు రెండుమార్లు ఆడేటప్పటికి అతను మాదిగి విస్సిగాడని అందరికీ తెలిసిపోయింది. వెంటనే అందరికీ శరీరాలు గరిపొడిచాయి. చెవులు గళ్లుపడ్డాయి. మనస్సులు చెదిరిపోయాయి.

అయితే వారింకా సరిగా తేరుకోకుండానే దక్షిణపు గట్టుమీద నుంచి చెవులు గింగురుమనేటట్లు వొక యీల వినవచ్చింది. అది పూర్తి కావడం తరవాయిగా కరీము యిస్మాయిలుకేసి చూస్తూ "అల్లాహో అక్బర్" అని గొంతెత్తి అన్నాడు. తరవాత యిస్మాయిలు బ్రాహ్మలకేసి చూస్తూ అంతకంటేనూ గట్టిగా "అల్లాహో అక్బర్" అని రెండు చేతులూ పైకెగరవేశాడు.

అంతే. వెంటనే యిద్దరూ గభీమని గభీమని బ్రాహ్మల మధ్య వురికారు.

దాంతో అగాధమైన సముద్రంలో పెద్ద కొండలు విరుచుకు పడ్డట్టయింది. చేటలతో కొట్టినట్టు బ్రాహ్మలందరిమీదా నీళ్లు చిందాయి. కొందరికి వూపిరాడక వుక్కిరిబిక్కిరయింది. కొందరు హఠాత్తుగా యెగసిన కెరటాలకు తట్టుకోలేక వూగిసలాడారు.

కాని యెవరూ కొప్పడలేదు. "ఏం పని యిదీ?" అనేనా అనలేదు. నోళ్లలోనైనా గొణుక్కోలేదు. దురాయి కట్టినట్టందరూ కిక్కురుమనలేదు. కొందరు కొయ్యయిపోయారు కూడానూ.

బ్రాహ్మలిలాగ శిలావిగ్రహాలయిపోగా కరీమూ, యిస్మాయిలూ "వొళ్లూ సల్లపడిందీ భాయీ" అంటే, "ప్రాణాలు తేరుకున్నాయి భాయీ" అని వొళ్లు తోముకోవడం మొదలుపెట్టారు.

బ్రాహ్మలకి సముద్రంలో వుందన్న బడబానలం యిప్పుడు ఆచెరువులో ప్రత్యక్షం అయింది. వారిలో వొక్కరూ కూడా యిక క్షణమేనా వుండలేకపోయారు. ఎలా వున్నవారలాగ—యెక్కడున్నావారక్కణ్ణుంచి వొడ్డెక్కి, వెనక్కి తిరిగి చూడకుండా—నింపాదిగా కాదు—వురకలూ పరుగులూ పెడుతూ మాయమైపోయారు.

ఇది చూసి మాదిగ అందరూ దిక్కులు బద్దలాపోయే ట్టు చప్పట్లు చరిచారు. తురకయువకులు ఆకాశం చిల్లులు పడిపోయే ట్టు యీలలు వేశారు.

కరీమూ, యిస్మాయిలూ విరగబడి నవ్వారు.

"........................"

?



# నిజాము రాజ్యములోని తెనుగువారి స్థితి

సురవరము ప్రతాపరెడ్డిగారు బి. ఏ., బి. ఎల్

ప్రబుద్ధాంధ్ర సంపాదకులు "నిజాంరాజ్యంలోని తెనుగువారి స్థితి అని రాస్తే చాల సంతోషిస్తాను" అని నాకొక జాబు వ్రాసినారు. వారి కోరిక అనుల్లంఘనీయము. ఏదేని విషయమును గురించి వ్రాయుమనిన నా కొందోళన కలిగియుండెడిది. వారే వస్తునిర్దేశము చేసి వ్రాసినందున శ్రమ తప్పినది. నాకును నిదే విషయమును గురించి బ్రిటిషిండియాలో నుండు ఆంధ్రసోదరులకు తెలుపుకొనవలెనని బహుకాలమునుండి కోరిక యున్నది. ఏమి గ్రహచారమో యేమో నిజామాంధ్రు లన్న నిజాములో వలెనే బయటను నిరాదరణమే కనిపించుచున్నది. ఇచ్చట లక్షల కొలది యాంధ్రుల కుండు కష్టసుఖములను గురించి కావలసినంతగా వ్రాయువారే లేరు. మహారాష్ట్రుల కుండు నభిమానములో దశాంశము కూడ నాంధ్రులలో లేదనవచ్చును. నిజాము రాష్ట్రములోని హిందువులకు అందు ముఖ్యముగా మహారాష్ట్రులకు కష్టములు కలిగిన బొంబాయి రాష్ట్రపు పత్రిక లేమి, నాయకు లేమి తీవ్రచర్యలు చేయుచుందురు. కాని మన ఆంధ్రసోదరులలో నిట్టివి కాంచుట లేదు. ఏ తాలూకా మూలయందో యే చిన్నసభయో జరిగిన దానికి ముఖ్యస్థాన మిత్తురు కాని అఖిలనిజామురాష్ట్రాంధ్రులకు సంబంధించిన ప్రథమద్వితీయమహాసభలు (Conferences) జరిగిన వాటికి దగు స్థానమిచ్చు పత్రిక లేకపోయెను. కావున మా కథ కొంతయైనను నాకు తెలిసినంత మాకు ప్రమాదము లేకుండు నట్లుగా వ్రాయగలిగినంత బ్రిటిషాంధ్రసోదరులకు తెలుపుకొనిన నిక ముందైనను మమ్ము వలసపోయిన వారినిగా, లేక అనాగరికులనుగా తలపక మాయందు సానుభూతి చూపి మాకే కష్టములు వచ్చినను అవి తమ కష్టములుగా భావించి సర్వవిధముల సాయపడుదు రని యాశతో వ్రాయుచున్నాను.

నిజాము రాష్ట్రము యొక్క మొత్తము వైశాల్యము ౮౨౬౯౮ చదరపు మైళ్లు. దీనిలో ఆంధ్రప్రాంతము యొక్క విస్తీర్ణము ౪౧౫౦౨ చదరపు మైళ్లు. (అనగా నిజాము రాష్ట్రములో సగము భాగము). ఈరాష్ట్రములో ౧౬ జిల్లాలు కలవు. అందు తెనుగు జిల్లాలు ౮.

(౧) వరంగల్ (ప్రాచీనపు ఓరుగల్లు)
(౨) కరీంనగరు.
(౩) ఆదిలాబాదు.
(౪) అత్రాపుబల్దా (అనగా "బల్దా" నగరము చుట్టు నుండు భాగము)
(౫) మెదకు.
(౬) నిజామాబాదు (దీనిని పూర్వము "ఇందూరు" అనుచుండిరి)
(౭) మహిబూబునగరు (దీనిని పూర్వము "పాలమూరు" అనుచుండిరి)
(౮) నల్లగొండ.

ఇటీవల "బాగాల్" అను జిల్లా ఒకటి ప్రత్యేకముగా విభజింపబడినది. ఇవి గాక కర్ణాటకములో చేరిన రాయచూరు జిల్లాలో నీ క్రింది భాగములు ఆంధ్రులవే.

(౧) అలంపూరు తాలూకా.
(౨) గద్వాలసంస్థానము.

## జనసంఖ్య.

ఈరాష్ట్రముయొక్క మొత్తము జనసంఖ్య ౧౪,౪౩౬,౧౪౮

| | |
|---|---|
| అందు ఆంధ్రులు | ౬,౯౭౨.౫౩౪ |
| మహారాష్ట్రులు | ౩,౭౮౬,౮౩౮ |
| కర్ణాటకులు | ౧,౬౨౦,౦౯౪ |
| ఉర్దు మాతృభాషగా గలవారు | ౧,౫౦౭,౨౭౨ |
| మహమ్మదీయులు | ౧౫౩౪౬౬౬ |
| ఇతరులు | ౫౪౯,౪౧౦ |

తెలంగానా, అనియు, మరాట్వాడా అనియు నిజాం రాష్ట్రము రెండు భాగములుగా విభజింపబడినది. రెండవదానిలో కర్ణాటకులును చేరియున్నారు.

## విద్య—భాష

నిజాము రాష్ట్రములో అక్షరాస్యులు ౫ యేండ్లు అంతకు పైబడిన వయస్సు గలవారిలో నూటికి ౫ గురు. కావున నాంధ్రులలోను నిరక్షరాస్యుల సంఖ్య అపారము. దీనికి తోడుగా నిచ్చట ప్రత్యేకపరిస్థితులు కొన్ని ఆంధ్రుల విద్యాభివృద్ధి కాటంకములు కలిగించుచున్నవి. బ్రిటిషిండియా రాజకీయభాష యగు ఇంగ్లీషును మాతృభాష యగు ఆంధ్రమును ఆంధ్రులు నేర్చుకొందురు; కాని యచ్చట బహుభాషలలో ప్రవీణత నొందవలసి యున్నది. సార్వభౌమభాష కావునను పాఠశాలలో పాఠ్యమగునట్టిది గావునను ఇంగ్లీషు తప్పని దయ్యె. ప్రభుత్వభాష కావున ఉర్దూ నిర్బంధ మయ్యె. ఉర్దూలో ప్రావీణ్యత నొందవలెనన్న అరబీ చదువకున్నను ఫార్సీ మాత్రము తప్పక చదువవలసినదే. ఇక అభిమానభాష ఆంధ్రము. అది ఐచ్ఛికము, లాభరహితము. ఎవరు చదువుదురు? కావున ఆంధ్రభాష యచ్చట దినదినము క్షీణించుచున్నది. భాషలో ఉర్దూసాంకర్య ముండుట సహజమే. బ్రిటిషిండియాలో ఇంగ్లీషు కల్తీ యెట్లుండునో అదే విధముగా మాభాషలోను ఉర్దూ సమ్మేళనము బాగుగా కలదు. ముఖ్యముగా అపచారము చేయువారు రెడ్లు, వెలమలు, గోలకొండవ్యాపారులు, నియోగులు, మున్నూరుకాపులు. వీరు ఈ రాష్ట్రములో గణనీయులు. అయినను వీరికి ఉర్దూభాషయే ఉగ్గుపాలతో నేర్పు విద్య. అనేకులకు తెనుగులో మాట్లాడుట కన్న ఉర్దూలో విసరివేయుట చాల సులభము. మరియు గౌరవప్రదమనియు తలతురు.

## వేషములు

"స్వస్థానవేషభాషాభిమతా స్సంతో రసప్రలుబ్ధధియః" అన్న నన్నయ్యభట్టు వాక్యములు మాయందు నిరర్థకములే. భాషకు తోడు వేషము. బ్రిటిషిండియాలోను (ఇప్పుడు తగ్గుచున్నను) ఇంగ్లీషు వేషములు యువకులలో కలవు. మారాష్ట్రమందును తురకవేషములు బహుళములు. ఇంగ్లీషు వేషములు వేయువారిని,

"ఏనుగు తోలు దెచ్చి ఏడాది యుతికిన
నలుపు నలుపే కాని తెలుపు కాదు"

అన్నట్లు తమ రంగును మార్చుకొనజాలనందున మన వారే యని పోల్చుకొనగలము. కాని తురకవేషములు వేసిన వారిని హిందువు లని కాని ఆంధ్రులని కాని నిర్ణయించుట కెవ్వరికిని సాధ్యము కాదు. కొందఱు హాజీల వలె మౌల్వీల వలె వదలు లాగులను కొందఱు అప్పుడే పంజాబునుండి దిగివచ్చిన పఠానులవలె బిఱ్ఱు పైజామాలను ధరించి షేర్వాని తుర్కీటోపీ ధరించి కత్తి లేని ముసల్మానులవలె నుందురు. ఇంతటితో తృప్తి నొందక కొందరు (వారు రెడ్లు) గడ్డములు పెంతురు. అగడ్డములను గూడ ఇరుపాయలుగా పాపట తీసి దువ్వి పెంచుచుందురు. కొందఱు (వారును రెడ్లే) మహమ్మదీయ తీర్థస్థాన మగు అజమీరు (షరీఫ్)కు యాత్రకేగి వత్తురు. రెడ్లలో వెలమలలో రెండు ఉర్దూ ముక్కల డొక్కశుద్ధి యైనవారెల్లను తురకవేషములలో నుందురు. (ఇప్పుడిప్పుడు నూటికి సగమువంతు ఈ వేషములు తగ్గిపోయిన వని చెప్పగలను.)

## విద్యాభివృద్ధి కాటంకములు

విద్యావిషయము చెప్పుచు వేషములోనికి దిగితిని. విద్యకు ఆటంకములలో నొకటి రాజకీయ భాష యగు ఉర్దూ అని చెప్పితిని. సుమారు ౧౨ సంవత్సరములనుండి ఉస్మానియా విద్యాపీఠము స్థాపిత మైన నాటినుండి ఉర్దూ ప్రధానభాష యగుట జేసి యితరభాషలు మూల బడిపోయినవి. పైగా ౧౩౪౩ ఫసలీలో అనగా ౧౧ ఏండ్ల క్రిందట ప్రైవేటు బడుల శాసనము బయలుదేరెను. దాని మూలమున ప్రభుత్వాజ్ఞ లేనిది ప్రైవేటు బళ్ళు ఎవరును స్థాపించ గూడదు. స్థాపించిన బలవంతముగా మూయింపబడును. ఈ పరిస్థితులను గమనించియే మహారాష్ట్రులు తమ భాషాభివృద్ధికై "వివేకవర్ధనీపాఠశాల"ను స్థాపించినారు. ఆంధ్రుల కిట్టిది లేదు. కాని మహారాష్ట్రులే స్థాపించి వదలుకొనిన బాలికా పాఠశాలను ఆంధ్రులే యిప్పుడు నడుపుచున్నారు. అందు ఇంగ్లీషు ఆంధ్రము మెట్రిక్యులేషను వరకు చదివింతురు. ప్రస్తుతము ౧౫౦ గురు బాలికలు చదువుచున్నారు. విద్య యుచితము. కాని ప్రభుత్వము సహాయము సంపూర్ణముగా సున్న. ఎన్ని మారులు మొఱ పెట్టుకొనినను దమ్మిడీ సహాయము కూడ చేయకుండుట ఆంధ్రుల దురదృష్టమే. లేకున్న బ్రిటిషిండియాలోనే కాక విదేశములందును విద్యకై వేలు కాదు కదా లక్షలేకేట దానము చేయుచుండిన మా ప్రభుత్వమువారికి స్థానిక విద్యాసంస్థ అందు బాలికల విద్యకై యేర్పడినట్టి దానికి సహాయము చేయు మన్న సనేమిరా అని బహిష్కరించుకొని కూర్చుండుట యేల? ఏది యెట్లున్నను ఈ పాఠశాలను పట్టుదలతో ప్రశంసనీయముగా చందాలెత్తి నడిపించుచున్న మాడపాటి హనుమంతరావు ప్రభృతులు ప్రశంసనీయులు.

## ప్రజాహిత సంస్థలు.

అంతగా పేర్కొనదగినవి లేవు. ఉన్న వానిలో నిజాంరాష్ట్రాంధ్రజనకేంద్రసంఘము హైద్రాబాదు నగరాంధ్రజనసంఘము ముఖ్యమైనవి. మొదటి దానికి ఆదినుండియు మాడపాటి హనుమంతరావు గారు కార్యదర్శులు. ఈ సంఘపక్షమున ననేక స్థలములలో గ్రంథాలయాదిసభలు జరుపబడినవి. రెండు మహాసభలు జరిగినవి. సుమారు ౨౦ లఘు పుస్తకములు ముద్రింపబడినవి. ఇక్కడి యాంధ్రుల పరిస్థితుల నెఱుగ గోరువారు ఈ ౨౦ గ్రంథములను పై మాడపాటి హనుమంతరావుగారి వద్దనుండి తెప్పించికొని చూచిన విషయగ్రహణ మగును. ఈ రాష్ట్రములో సుమారు వందవరకు ఆంధ్ర గ్రంథాలయములు స్థాపింపబడెను. కాని యందు సగము పైగా అంతరించినవి. (ఇది ఆంధ్రుల కుండు లక్షణమే) మిగత సగములో కొన్ని మిణుకు మిణుకు మనుచున్నవి. దీనికి తోడు ప్రభుత్వము యొక్క అనాదరము. బరోడాలో ప్రజాస్థాపిత

గ్రంథాలయములకు ప్రభుత్వసహాయ మొసగగా నీరాష్ట్ర గ్రంథాలయములపై పోలీసువారొక కన్నుంచవలెనని అజ్ఞ యున్నది. ఇప్పు డున్న గ్రంథాలయములో దినదినాభివృద్ధి పొందునది క్రీ. శ. ౧౯౦౫ లో స్థాపింపబడిన నగరమందలి శ్రీకృష్ణదేవరాయాంధ్ర గ్రంథాలయము. ఇందు సుమారు ౫౦౦౦ సంస్కృతాంధ్రాది గ్రంథములును అముద్రితతాళపత్ర గ్రంథములును, అముద్రితశాసన ప్రతిబింబములును కలవు.

రెడ్డి హాస్టల్

హైద్రాబాదునగరమును చూడవచ్చు నాంధ్రుడు తప్పక యీహాస్టలును తిలకించి పోవలసినదే. ఇంతటి ప్రశంసనీయ మైన ప్రజాహితసంస్థ బ్రిటిషాంధ్ర భాగమునందును లేదనవచ్చును. సుమారు మూడు లక్షల విలువగల భవనములు, సుమారు ౧౨౦౦౦ గ్రంథములు గల భాండాగారము సుమారమి ౧౫౦ విద్యార్థులును గల సంస్థ యిది. ఈ సంస్థ యేర్పడిన తర్వాతనే రెడ్లు వేషభాషలందు నాగరికులు కలిగిన వన వచ్చును.

ఆచారములు

నిజాము రాష్ట్రములో రైళ్లు తక్కువ. అందు తెలంగాణాలో మరీ తక్కువ. నల్లగొండ, కరీంనగరు, అత్రాపుబల్దా, జిల్లాలకు రైలు మార్గమే లేదు. తక్కిన జిల్లాలకును బాదరాయణసంబంధముగా జిల్లాలో నొక మూలన పోవుచున్నది. విద్యావ్యాపకము సున్న. అట్టిచో జనులు పూర్వాచారపరాయణులు; మూఢవిశ్వాసములు మెండు. సనాతనులకు పెట్టని కోట. రెడ్లలో వెలమలలో, గోలకొండవ్యాపారులలో జనానా పద్ధతి మెండుగా నున్నది. రెడ్లలో మూడు తెగలు. దేశముఖు (దొరల) తెగ మొదటిది. రెండవది పటేండ్ల తెగ (గ్రామమున్సిపులు) మూడవది కాపులు. ఒకరి కన్న నొకరు హెచ్చని తలతురు. దేశముఖులలో పూర్ణముగా, పటేండ్లలో సంపత్తు ముదిరిన చోట గోషా పద్ధతి కలదు. వెలమలలో ధనికులందే కాక బీదసాదలందును సంపూర్ణముగా గోషా కలదు. తురకల కన్న హెచ్చుగా విపరీతపద్ధతులపై నీ "ఘోష" వీరి యందు కలదు. గోలకొండ వ్యాపారులలోను "దేశపాండ్యాలు" (దొరలు) కరణములు అని రెండు శాఖలు. అందు మొదటి శాఖలో గోషా కలదు.

రెడ్లకు గోలకొండ వ్యాపారులకును మతమందు పట్టుదల తక్కువ. ఇస్లాం మత విశ్వాసములు కొంచెతికి కలవు. ౯_౧౦ ఏండ్ల క్రిందట పెద్దపల్లి జాగీర్దారగు రాజేశ్వరరావు జీవించిన కాలములో ముసల్మాను విశ్వాసములు కలిగి చనిపోవునప్పుడు తన శవమును ముసల్మానుల కిచ్చి గోరీ కట్టించుటకై యేర్పాట్లు చేసికొని చనిపోయెను. అతని యధీనములో సుమారు ౨౦౦_౩౦౦ గోలకొండ వ్యాపారి కుటుంబము లుండెను. వారిపై వీరి యభిప్రాయములు చలామణి యగుచుండెను.

ఆదిహిందువుల కేలాటి సౌకర్యములు సవర్ణులు కలిగింపనందున అనేకస్థలములలో క్రైస్తవమందును మహమ్మదీయమతమందును వీరు చేరిపోవుచున్నారు. ఈ యుభయమతముల పక్షమునుండి మిషనులు పని చేయుచున్నవి.

ఆంధ్రసంస్థానములు

మారాష్ట్రములో ముఖ్య మైన యాంధ్రసంస్థానము లివి.

౧ గద్వాల.
౨ వనపర్తి
౩ కొల్లాపురము
౪ అమరచింత
౫ గోపాలుపేట
౬ దోమకొండ
౭ సిర్నపల్లి
౮ సురపురము

ఇవి గాక దొంతి, చింబోడు వంటి చిన్నచిన్న జాగీరులు చాల గలవు. నారాయణపురము అను నొక గొప్ప రెడ్డి సంస్థాన ముండెను. ఆరెడ్డి దొర

వారు లీలావిలాసుడై ముసల్మాను స్త్రీని నికా చేసికొని ఇస్లాం మత స్వీకారమొంది సంతానహీనుడై చనిపోయెను. సంస్థానము ఖాల్సా (జప్తు) అయ్యెను. ఆయిదారు చిన్న జాగీరులు మాత్ర మతని సంబంధులైన ముసల్మాను స్త్రీల వశమున నిప్పుడున్నవి.

పై ఎనిమిది సంస్థానములు ఆంధ్రసంస్థానములు. కాని వీనిలో ఖాల్సా యిలాకా (అనగా నేరుగా శ్రీ నిజాం ప్రభువు పరిపాలనమందుండు భాగము) లోవలె సౌకర్యములు తక్కువ. పన్నులు హెచ్చు. విద్య ఖాల్సా కన్న హీనము. సంస్థానముఖ్యపట్టణమందేవో యొకటి రెండు సర్కారీ బళ్లు తప్ప తక్కిన గ్రామములలో సర్కారీ బళ్లు లేనే లేవనిన పొరపాటు కానేరదు. రైతులు (ఏలాగో!) సాధారణముగా నందఱును దరిద్రులే! టప్పా సౌకర్యములు ఖాల్సాలోనే సరిగా లేనందునను సంస్థానములకు దానితో సంబంధము లేనందునను తప్పుపట్టుట తప్పే యగును. ఇట్లుండియు గద్వాల వనపర్తి సంస్థానములలో ప్రాచీనమునుండియు కవిపండితుల సమ్మానము జరుగుచుంటచే నిప్పటికిని నాసంస్థానములలో పండితుల నిలువ కొంత మిగిలి యున్నది. ఈ సంస్థానముల అధిపతులు మనస్ఫూర్తిగా తలపెట్టిన నిజాం రాష్ట్రాంధ్రు లందఱిని నచిరకాలములోపలనే యుద్ధరించగలరు. కాని ప్రకృతము తమ సంస్థానప్రజలనైన నుద్ధరించిన నదియే పదివేలు.

## ఆర్థికస్థితి

తెలంగాణా రైతులు మరాట్వాడా రైతుల కన్న బీదవారు. మరాట్వాడా భూములు సారవంతమైనవి. తెలంగాణా భూములు చాలపట్టు చెలకలు (ఇసుక నేలలు) వ్యవసాయము కూడా చాల మోటుగ నున్నది. కొన్ని తావుల విత్తనము భూమి దున్ని చల్లుటయో లేక చేతితో విత్తనములు నాటుటయో యై యున్నది. రైతులు విశేషముగా అప్పుల పాలై యున్నారు.

హైదరాబాదునగరము ఆంధ్రుల స్థానమే. నగరమందు ఆంధ్రులు సుమారు రెండు లక్ష లున్నారు. మహారాష్ట్రులు 30000 మాత్రమే యున్నను ఉద్యోగులు, వకీళ్ళు, ఇతర గౌరవవృత్తుల కలవారు మహారాష్ట్రులే. ఆంధ్రులలో వకీళ్ళు కూడా 30 మందికన్న హెచ్చుగా లేరు. వారును పేరు ప్రతిష్ఠలు కలవారు కారు. ఉద్యోగములందు గొప్ప యుద్యోగులు లేనే లేరనవచ్చును.

## మొత్తముపై

నిజాము రాష్ట్రాంధ్రుల స్థితి చాల హేయమై యున్నది. విద్యావ్యాపకము లేదు. గ్రామజనుల స్థితి చాల శోచనీయము. సౌకర్యములు చాల తక్కువ. విచారించువారు గాని సానుభూతి చూపువారు గాని లేరు. గష్తీ నిషాన్ ౫౩ అనునది ప్రజల వాక్స్వాతంత్ర్యమును నిరోధించుచున్నది. ఇది చాల విపరీతమైన గష్తీ. అధ్యక్షుని పసందు, ప్రభుత్వమునకు కావలెను. పది దినములకు ముందే జిల్లాకలెక్టరు అనుమతి సభకై పొందవలెను. ఉపన్యాసకు లెవరో వారేమి మాట్లాడుదురో తెలుపవలెను. రాజకీయముల వాసనయే కూడదు. రాజకీయేతరములకే పైకట్టుబాట్లు, ఇట్లు కొన్ని యిబ్బందు లున్నను మా రాష్ట్రము ఇతర దేశీయ రాష్ట్రముల కన్న చాల మేలే. రైతుల కష్టములను అప్పుడప్పుడు పన్నులు మాపు చేయుచు తొలగింతురు. పత్రికలకు కొంత స్వాతంత్ర్య మున్న దనవలసినదే. ఈ రాష్ట్రములోని పత్రికలు వ్రాయునట్లు తీవ్రముగా నితరసంస్థానములలో వ్రాసిన పత్రికలు చాలకాలము జీవించి యుండవు. న్యాయమైన సత్యమైన విమర్శనమును ప్రభుత్వమువారు నిరసింపరు. ఏది యెట్లున్నను ఆంధ్రులు తమ సంఖ్యను బట్టి ప్రభుత్వోద్యోగములందు గాని, స్వతంత్రవృత్తులందు గాని, వ్యాపారవ్యవసాయము లందు గాని చాల వెనుకబడి హీనస్థితియం దున్నా రనుట నిర్వివాదాంశము.



# సాహిత్యము

శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారు



సాహిత్యశబ్దానికి "సహితానాం భావః సాహిత్యం" అనేది శబ్దవ్యుత్పత్తి ననుసరించిన సామాన్య నిర్వచనం. సాహిత్యసామ్రాజ్యంలో గోచరించే ప్రాతిస్వికరూపాలు సాహిత్యరూపాన్ని సంపాదించుకొని ప్రతిష్ఠను పొందుతవి.

అంగముల ఆనందకత్వం ప్రధానానుసారి. ఈసాహిత్యం లలనాలావణ్యప్రఖ్యం. వనితాశరీరంలో ప్రత్యేకావయవాలకంటె భిన్నపదార్థం గోచరించుతుంది. అదే సృష్టినిర్మాణచాతుర్యం. ఆనందప్రదమైన లావణ్యం.

సాహిత్యానికి లావణ్యసాదృశ్యం విశిష్టధర్మాన్ని సంపాదన చేస్తుంది. సాహిత్యం విశేషరూపాలకంటె భిన్నమైన విశిష్టధర్మం. అఖండోపాధి. విశేషరూపాలు విశిష్టధర్మాన్ని విడిచిపెడితే స్వారస్యసంపాదన చేయలేవు. అవయవాలు అవయవిని విడిచితే స్వరసములు కావు. విశిష్టధర్మం జీవనప్రదం.

అనేకవిజాతీయాల విశేషసంబంధం సమరసమైన అఖండధర్మాన్ని సంపాదించుతుంది. ఈప్రధానమాత్రానుసారంగా అమణులు స్థితిని పొందుతవి. అవికీర్ణతేజోలేఖలకు సాహిత్యం నిత్యప్రకాశకల కేంద్రస్థానము.

విడివిడిగా భిన్నధర్మాలతో కూడుకొన్న మాదకద్రవ్యాల సంబంధం మదశక్తిని కలుగజేస్తుంది. ఆకు వక్క సున్నముల కూడిక రక్తిమను సంపాదించుతుంది. శాస్త్రముల యోగ్యబంధంలో సాహిత్యదీపం వెలుగుతుంది.

వాఙ్మయగతమైన సాహిత్యం ఆనందప్రదమైన అఖండశక్తి, లక్ష్యస్వరూపసాన్నిధ్యప్రాప్తి సాహిత్యంలో మిళితమై ఉంది. సాహిత్యవేత్తకు ఆనందసామ్రాజ్యములో నీ లక్ష్యశుద్ధి ఉంటుంది.

ప్రకృతిశరీరంలో శాస్త్రాలు అవయవాలు. ఇవ్వి బాహిరాకారాన్ని నిరూపించుతవి. భిత్తిచిత్రం మాదిరి ప్రకృతిశరీరం ఇందులో గోచరించుతుంది. కాని ప్రధానజీవం పొడగట్టదు. సమస్తశాస్త్ర సమ్మేళనంలో ఆనందసింహాసనం మీద సాహిత్యశక్తి తేజోరూపంగా భాసించుతూ కళాప్రచారం చేస్తుంది. శాస్త్రీయరహస్యమే సాహిత్యంలో ఇమిడి ఉంటుంది. అయినా ఇందులో చైతన్యస్ఫూర్తి ఉంది.

ప్రతిప్రాణికీ జీవితలక్ష్యం ఆనందమే. ఈఆనందమే సాహిత్యరహస్యం. సమస్తశాస్త్రాలు ఆనందాన్వేషణం చేసినవి. వీటి సామగ్ర్యంతో ముందుగా అనాయాసంగా సాహిత్యతత్త్వం ఆనందచుంబనం చేసింది.

అఖండజగత్తులోని తేజోధామము సాహిత్యతత్త్వవేద్యము. సాహిత్యము సమగసము. సాహిత్యోపాసన సంవిత్సామ్రాజ్యసార్వభౌమత్వం సంపాదించుతుంది.

తత్త్వనిరూపణముకై బయలుదేరిన శాస్త్రాలు ప్రకృతి ప్రత్యేకరూపం తెలియజేసినవి. చివరకు అందులోనే పర్యాప్తిని పొంది తరువాతి వారికి పూర్వపక్షకోటిలో చేరినవి.

కేవలం కాయికాదికర్మలకు ప్రాధాన్యం అంగీకరించి పాశ్చాత్యదృష్టితో ప్రపంచతత్త్వానుసారంగా ఫలనిర్ణయం చేయటానికి మీమాంస ప్రయత్నించింది.

ఒకవాచికధర్మం లక్ష్యంగా సమస్తజగత్తునూ సమన్వయం చేస్తూ పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ రూపమైన శబ్దబ్రహ్మధ్యానమే ప్రధానమని వ్యాకరణం ప్రతిపాదించుతోంది. ఇందులో పరావిత్తు పరానందము.

సమస్తప్రపంచరహస్యాన్ని సూక్ష్మరూపంగా ధ్యానించి అణుతత్వం వ్యక్తం చేసి దీనికి కారణం ఏమిటో ఊహించమని న్యాయం వైశేషికం బుద్ధి సమున్మీలనం చేస్తున్నవి.

సృష్టిక్రమాన్ని స్పందరహస్యం దగ్గరనుంచీ స్పష్టం చేసి బుద్ధి వికసించితే బంధత్రయచ్ఛేదం చేసుకోమని సాంఖ్యం సెలవిచ్చింది.

అంతటా సాంఖ్యాన్ని అనుసరించుతూ బంధచ్ఛేదనసాధనాలు నిరూపించి సహస్రారసుధాసాగరంలోని పీయూషమార్గాన్ని యోగం చూపించుతోంది.

ఇవి ఏవీ పరమార్థసాధనంలో బాగా ఉపయోగించవని బాదరాయణమౌని బాజా వాయించాడు. కర్మల చిత్తశుద్ధితో తర్కప్రతిభలోని బుద్ధి సమున్మీలనంతో సాంఖ్యబుద్ధివికాసంతో, వ్యాకృతిలోని అంతర్ముఖమైన పరానుసంధానంతో పీయూషలహరీమార్గం చూపించుటయే కాక, అద్వైతం, పరబ్రహ్మజ్యోతిని దర్శింపచేసి ఆనందమయం చేసింది.

వీటి సమ్మేళనస్వరూపం సాహిత్యం. శాస్త్రానుసంధానఫలాన్ని అనుసరించుతూ ఆంతరంగికమైన అంతర్ముఖాన్తర్జ్యోతిని దీపింపచేసి అనుకూలమార్గాన్వేషణం చేయించుతూ ఆనందరసం చేర్చేది సాహిత్యమే.

సాహిత్యం తను సమరసం కాబట్టి శాస్త్రాలకు సామరస్యం సంపాదించింది. దుష్ప్రవేశం, దుర్గమం, కర్కశం, అయిన రీతిని విడిచి, అందరిపై సమబుద్ధితో ఆనందం వర్షించింది. విశ్వమోహనగానంతో సాహిత్యం ప్రపంచపాషాణం కరిగించి ఆనందరసప్రవాహం వెలిగొలిపింది.

చారిత్రికంగా చూస్తే శాస్త్రాలు బయలుదేరిన తరువాత సాహిత్యస్ఫూర్తి విలసిల్లినట్లు స్పష్టం. సాహిత్యవిశిష్టరూపం శాస్త్రతత్త్వాలతో కలిసి ఉండటం అర్వాచీనతాహేతువాదాన్ని దృఢం చేస్తుంది.

సాహిత్యం ఆనందగ్రంథి. అపత్యస్వరూపం. అపత్యం తల్లికీ, తండ్రికీ సమానంగా ఉల్లాసానందం ఇచ్చి తారకమై అభివృద్ధి హేతువైనట్లు, సాహిత్యం శాస్త్రాలకు విరుద్ధం కాక వాటి ఆనంద (లక్ష్య) రూపంగా ఉండి లోకంలో సన్మార్గ ప్రవర్తకం అవుతుంది

అలంకారశాస్త్రం సాహిత్యం కాదు. సాహిత్యవిజ్ఞానానికి సంజీవనౌషధి సర్వశాస్త్రముల ఏకోన్ముఖమైన తత్త్వం అలంకారశాస్త్రవాహినిలో ప్రవహించి సాహిత్యసాగరం చేరుతుంది. ఇది సాహిత్యానికి సన్నిహితమార్గం.

ఇక్కడ యోగ సమన్వయం కుదురుతుంది.

యమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యానసాదృశ్యం శాస్త్రసముదాయానికి సమన్వయించుకోవచ్చు. ఈ అవస్థలో ధ్యేయం స్పష్టమయింది కాబట్టి లక్ష్యసిద్ధి కలిగి. ధారణా సాదృశ్యం అలంకారశాస్త్రానికి రూఢం చెయ్యవచ్చు. ధారణలోని నైరత్యం సంప్రజ్ఞాతసమాధిలోని ఔన్మన్యం సంపాదించుతుంది. అలంకారశాస్త్రానుసంధానం సాహిత్యప్రవణమైన ఔన్మన్యం సంపాదించుతుంది. అసంప్రజ్ఞాత సమాధిలోని అఖండకళ్యాణానందరసం సాహిత్యతత్త్వం.

అలంకారశాస్త్రపఠనమాత్రాన సాహిత్యవిత్త్వం రాదు. ఈశాస్త్రం “మార్గదర్శీమహర్షిః”

సాహిత్యతత్త్వంపరాపరరహస్యం. సాహిత్యసన్నిహితమైన అలంకారశాస్త్రం వస్త్వలంకారరసము లనే వ్యంగ్యత్రయంతో ఉంటుంది కాబట్టి అక్షరతత్త్వం కూడుకొన్నది. ఇది ఆధ్యాత్మికం. సర్వసిద్ధిప్రదం. అతిరహస్యం. మిగిలిన వాటితో ఇతరశాస్త్రాల కున్న సంబంధాన్ని ఈ వక్రతత్త్వం తెలుసుకున్నవాళ్లు గ్రహించుతారు.

సాహిత్యం నీరసం కాదు. నవరసముల సమష్టిరూపం. సృష్టిసర్వస్వం సాహిత్యంలో నుండి బయ

లుచేరింగి. సంహారక్రమాన్ని అనుసరించితే సాహిత్యం అవధి. శాస్త్రసముదాయానికి సాహిత్యం కేంద్రస్థానముగానూ గమ్యస్థానముగానూ ఉంది. ప్రపంచసారం సాహిత్యం. సాహిత్యానికి ప్రధానమైన అవయవం అలంకారశాస్త్రం. ఇది శాస్త్రాల నన్నిటిని వడబోసి నిగ్గు తేల్చుతుంది. చాలినన్యాయం దీనికే సమన్వయించాలి. గుణదోషవివేకం సౌందర్యనిర్ణయం, సారనిరూపణం చేసేది ఈశాస్త్రమే. సారస్వతోపాసకుడైన సాధకుడు అలంకారం చదువకపోతే వ్యర్థుడై వంచితుడౌతాడు. కుచకచోరుశ్రోణీసౌభాగ్యాదులే ఇందులో వర్ణన విషయం, అందువల్ల అనుపాదేయం అని అపవాద మాపాదన చేసిన అకామహాత్ము లున్నారు. అది కేవలం శుద్ధశ్రోత్రియం మాట. అనుకూలమైన ఆనందం ఇందులోనే ఉంది. ప్రకృతి యథార్థస్థితిని స్పష్టం చేసి ఊర్ధ్వదృష్టిని ఉన్నతసౌభాగ్యాన్ని ఉచ్చైఃపదవిని సంపాదించేది ఇదే. సమస్తోపాసనా పద్ధతుల్లో ప్రకృతిరూపమే ధ్యేయపదార్థం. ప్రకృతితత్వం తెలుసుకొంటేనే గాని బ్రహ్మసాయుజ్యం రాదు. పిల్లవాడు ముందుగా తల్లిని తెలుసుకొని తద్వారా తండ్రి నెఱుగుతాడు. సాధకుడు ప్రకృతితత్వం తెలుసుకొంటే తద్వారా బ్రహ్మపదార్థం తెలుసుకుంటాడు. సమస్తపదార్థాల్లోను బ్రహ్మ అనుస్యూత మనే శాస్త్రకారులు చెప్పారు కాని స్పష్టంగా నిరూపణం చెయ్యలేకపోయినారు. అసలు బ్రహ్మ "నేతి నేతి" విజ్ఞేయం అయినా సృష్టిసర్వస్వంలో ఎట్లా ఇమిడి ఉన్నదో నిరూపించింది అలంకారశాస్త్రమే.

రమణీయత్వం ఎక్కడ స్ఫురించుతుందో అది ఆనందరూపమైన బ్రహ్మం. సారభూతమైన సాహిత్యం, అలంకారశాస్త్రప్రధానాశయము చమత్కారనిరూపణము. అలంకారప్రపంచంలోని ప్రతి అణువూ చమత్కారంగా ఉండాలని నిరూపించారు. ఈశాస్త్రీయాంశంలో అంతటా చణుకు తళుకు, మెఱుపు గోచరించుతుంది.

శాస్త్రరచన నీరసం. సద్యఃఫలదం కాదు. అభ్యాసయోగంలో నిష్ణాతుడైన వాడికి ఫలం లభిస్తుం దేమో. ఎంత వఱకూ ఆనందాభిలాషికి శాస్త్రం బాధాకరం. అలంకారశాస్త్రం ఉన్మనీ భావం మాదిరి సాహిత్యలీనత్వం సంపాదించుతుంది. ఇతరశాస్త్రాల సారం పిండి నవనీతం సంపాదించి ఇస్తుంది. దాన్ని అనుభవించటానికి సహృదయత్వం కావాలి. "హృదిముదిమభాజి కావ్యామృతైః" సాత్త్వికసాత్త్వికభావం అతిశయించితే సాహిత్యప్రవణత కలుగుతుంది. అలంకారస్వర్ణవేదికపై కూర్చొని శాంతంగా సాహిత్యోపాస్తి చేస్తే ధన్యు లౌతారు.

ప్రవృత్తి కుపకరించేవి శాస్త్రాలు. ఆనందసాహిత్యాని కుపకరించేది అలంకారశాస్త్రం. దీనిలోని వర్ణనావిశేషాలతో ఆనందించడమే కాని ప్రవర్తనలో సమన్వయించుకోరాదు. "కావ్యవిషయే చ వ్యంగ్యప్రతీతీనాం సత్యాసత్యత్వపరీక్షా కేవల ముపహాసాయైవ ప్రకల్పతే" అని ఆనందవాక్యము.

సాహిత్యం కళ. చంద్రుడు షోడశకళాపూర్ణుడు ఆకళల్లో సాహిత్యం సాదాకళ, ధ్రువకళ. సర్వోపాస్యం.

# వేలము వెఱ్ఱి కవిత్వము

గన్నవరపు సుబ్బరామయ్యగారు

నేడు కవిత్వ మనేకవిధములు. అందులో వేలము వెఱ్ఱి కవిత్వ మొక విధము. కొంత కాలము నుండియు నీవేలము వెఱ్ఱి కవిత్వము ఉప్పెనవలె దేశమును ముంచివేయుచున్నది. కలమును పట్టగలవారందరు కవినామధారు లగుదురు. కలమును పట్టుటకును కవిత్వము చెప్పుటకును ప్రారంభ మొక్కటే యనుట యథార్థకథనము. పత్రికాప్రకటనాంతము ఈకవిత్వము. ఇది గద్యపద్యోభయాత్మకము; కాని పద్యాత్మకముదే పైచేయి. దీనికి భాషాపాండిత్యమే కాదు తత్పరిచయమును ప్రయాసమే కాదు ప్రయత్నమును పని లేదు. ఆద్యవస్థ యయిన అక్కర లేనిది; కేవలము అయత్నసిద్ధము.

పదము లేరుడు కాయలు. అవియు నొక యేబదిని మించవు. వానిలో సంస్కృతపదములది మేలు పాలు; శతావధానుల కూతగ్రలు కొన్ని; మారుమూలలవి కొన్ని; అలౌకికము అగు లౌకికములు కొన్ని; అవైదికము అగు వైదికములు కొన్ని; భావార్థకముల నెక్కించుకొని లుప్తభావార్థకము లయిన భావార్థకములు కొన్ని; 'ఇంచు'ల మాటున దగుల్కొని పొంచి చూచునవి కొన్ని; నెత్తిపయి 'ఇల్లు' కట్టుకొని కూరుచున్నవి కొన్ని; ఇట్టిది అసంస్కృతపదముల తీరు. అవి అన్యోన్య భీకరము అగు 'ఝిల్లీభల్లలులాయకభల్లుకఫణి, ఖడ్గగవయబలిముఖచమరీఝిల్లీహారిశరభాదు' అగు వన్య మృగములను బోలినవి.

'వెరిప్రుచకయలు, ఉమెతకయలు, అమవసనిసలు' కొన్ని; పిప్పలు కొన్ని, పుప్పలు కొన్ని; బిగిసినవి కొన్ని, సడలినవి కొన్ని; నిడునిడుదలు కొన్ని, గిడ్డగిడసలు కొన్ని. ఇట్టిది విరిగిలిన తెలుగు పదముల సౌరు. అవి ఒండొంటిని మచ్చరికించు గృహ గ్రామసంచారు లగు జంతువులను బోలినవి. అవి గ్రామవాళితే కావు, దేశవాళీలు కూడ. ఏవంవిధ శబ్దాత్మకజంతుసమూహముల కీవేలము వెఱ్ఱికవిత్వము పొలికలను. వీని సమర ఘోషసంకులము; సంకరము. వీని యార్భాటము కర్ణారుంతుదము. తీరనిది పోరు. ఏనాటికిని పొత్తు కలియబోదు,

ఏవంగుణ విశేషణ విశిష్ట శబ్దసమంచిత మగు కవిత్వము నిర్మాణము, స్వభావము విదేశభాషా సంప్రదాయ సాధనసంపన్నములు. పట్టుపగలింటి దొంగతనము దాన కొంత; కొండొకచో నంతయును. ఈ వేలము వెఱ్ఱి కవిత్వమున పదములు, భావములు అతుకవు. ధార కలమున నుండి స్రవించు 'సిరా' యందే కాని కవిత్వమున కనుపించదు. అక్షరముల పొందిక పదములకు కుదురదు. బంతుల తిన్నదనము రచనమున మృగ్యము. ఛందస్సు స్వచ్ఛందము. యతికి సత్త్వము, ప్రాసకు వాసి లేవు. పాదములకు తడబాటు అధికము. తరచునవి యీవలావల బడుచుండును. అనిర్వాహ్య మగు అఖండత గిట్టదు. వస్త్వాశ్రయము నొల్లని వైరాగ్యము, అర్థదారిద్ర్యమువలన భావార్థసంపాదన మసాధ్యము. ఏవంరూప మగు నీకవిత్వము పండితులకు అపండితులకు ఒక్క తీరుననే వెఱ్ఱి నెక్కించును. దీనివలన సహృదయులు విగతహృదయులు, అథవా, విపరీతహృదయులు కాక తప్పదు.

పత్రికల పంచ నీవేలము వెఱ్ఱి కవిత్వము బ్రదుకు చున్నది. దీనివలన కవితాగౌరవము కడమువడు చున్నది. ఇది బ్రదికి యుండునంత దనుక సహృదయులు కవిత్వతత్త్వ విషయమున నస్తినాస్తి విచికిత్సా బీభత్స హృదయులయి యటమటించు చుందురు.

# *దొంగాటకం

విశ్వనాథ కవిరాజుగారు

(రాత్రి ౧౦-౩౦ గం. రాజ్యం తమలపాకు చిలకలు చుడుతూంది. ౨౨ సం॥ కొంచెం పెద్ద నుదురు. సోగకళ్లు. చిఱుతవాటు మొఘం తెలివితేట లున్నట్లే కనబడుతుంది. ప్రకాశం ౩౦ సం॥ ఒడ్డూ పొడవూ మంచి బందోబస్తూ గల మనిషి. మాట కూడా గంభీరంగానే వుంటుంది. నిక్కరూ స్వెట్టరూ వేసుకొన్నాడు. షిల్ ఫ్రేము స్పెక్టికిల్సు. రిస్టువాచీ. థర్మోఫ్లాస్కు మెళ్ళో తగిలించుకొన్నాడు. చేతులో బేటరి లైటు. స్లిప్పర్సు వదలి జోళ్లు తొడుగుతూ)

ప్రకా—అప్పుడు పంపు కొట్టావా సైకిల్ కి.

రాజ్య—ఆ.

ప్రకా—కేసులో పెట్టావా సిగరెట్సు.

రాజ్య—లేదు.

ప్రకా—ఇంకా కిల్లీలు కట్టలేదు కదూ!

రాజ్య—ఎన్ని ?

ప్రకా—రోజూ చెప్పవలె నేమో! అర డజను. అప్పుడే ౧౦-౪౦.

రాజ్య—అంటే యీవాళ కూడా దొంగాటకానికి బయలుదేరుతున్నారన్న మాట.

ప్రకా—ఆ. వాడీ వూళ్ళో గలాటా చేస్తూండే వరకూ లేకుంటే వాడు పట్టుపడే వఱకూ మనకీ పని తప్పదు.

రాజ్య—ఈ ౧౦-౧౨ రాత్రులూ కాళ్లకు నెత్తుర్లు దిగేటట్టు వూరంతా తిరిగేరు గాని కొసకి ఆ దొంగను పట్టగల్చేరా ?

ప్రకా—ప్రయత్నం మన చేతుల్లో వుంది గాని ఫలితం ఎవరు చెప్పగలరు? ఈవేళ కాకుంటే రేపు దొరకుతాడు.

రాజ్యం—ఏం? పోలీసులు లేరూ నెలకు బోలెడేసి జీతం తీస్తూ? మీ రెందు కింత శ్రమ పడడం?

ప్రకా—వాళ్లు దొంగ దొరికిన తర్వాతనే కనబడతారు. పట్టివ్వడం మన బాధ్యతే. కొట్టులో పెట్టడం మాత్రం వాళ్ల పని.

రాజ్యం—మరి వూళ్లో యిందరు వస్తాదులూ తాలెంఖానావాళ్లూ వున్నారు—

ప్రకా—వున్నారు. వాళ్లు మరో వస్తాదు వచ్చి బస్తీ మీద సవాలు కొడితేనే పైకి వస్తారు. రాజ్యం! ఎంతో ధైర్యసాహసా లుంటేనే కాని మనిషి ఇంత పనికి పూనుకో లేడనుకో. దొంగతనానికి వచ్చినవాడు అన్నిటికీ సమస్తతెగ తెంపులూ చేసుకొనే వస్తాడు. వాణ్ని ఎదిరించడ మంటే సామాన్య మైన పని గాదు—మనమూ ప్రాణాలకి తెగించాలి.

రాజ్యం—అయితే యెవ్వరికీ లేనిదీ మన కెందుకీఘోరసాహసం? పుణ్యమా పురుషార్థమా?

ప్రకా—కీర్తి? పేరు ప్రతిష్ఠలు? ఇప్పటికే వూళ్లో నాపేరు ఆదొంగ పేరు కంటే యెక్కువగా మ్రోగిపోతున్నది. ఇదివరకు నాతో పరిచయం లేని పెద్దమనుష్యు లెందరో నాకీ మూలాన స్నేహితులైనారు. ఎంతో మంది బి. యే. స్టూడెంట్సు మొదలైన వాళ్లు కూడా నావెంట వస్తూ నాచెప్పుచేతలలో తిరుగుతున్నారు. ఇంకేం కావలె చెప్పు?

రాజ్య—బాగానే వుంది గాని మన కేదైనా ప్రమాదం వస్తే ఈస్నేహాలు రక్షిస్తవా?

ప్రకా—నాకే ప్రమాదం రాదనే ధీమా నాకున్నది. నా బాకు నాదగ్గర వుంటే చాలు.

---

* వూళ్లో వొక యింటోనే చోరీ జరిగితే దొంగతనం అంటారు. వొక వూళ్లో రోజూ రోజూ అనేకచోట్ల చోరీలు జరుగుతూవుంటే దాన్ని దొంగాటకం అంటారు. ఇది విశాఖపట్నం జిల్లాలో వాడకంలోవున్న మాట.

రాజ్య—ఆదొంగ రివాల్వరు పట్టుకొని వుంటాడేమో!

ప్రకా—రివాల్వర్ ఎదురుగుండా వుంటేనే పేలుస్తుంది. బాకు వెనకనుంచి పొడుస్తుంది.

రాజ్య—ఒకరి ప్రాణం తీసివేస్తే గవర్నమెంటు వూరుకుంటూరా?

ప్రకా—ఆత్మసంరక్షణార్థం చంపే మంటే తప్పకుండా వూరుకొంటూరు. అందులో ఇటువంటి గజదొంగను చంపే మంటే ప్రెజంటు కూడా యిస్తారు. అసలు ఇటువంటి సాహసం చేసిన వాళ్లనే డిటెక్టివులుగా వేస్తారు.

రాజ్య—ఎది యేలాగైనా మీరు పెట్రోలింగుకు వెళ్లడం నాకిష్టం లేదు.

ప్రకా—ఇది బాగుంది! రామాయణ మంతా విని రాముడికి సీత యేమవుతుం దని అడిగిందట. ఏమిటి నీకు భయం!

రాజ్య—నా కంతా భయమే. మిమ్మల్ని గురించి—నన్ను గురించీ కూడా. ఆదొంగ వెధవ యెవడో—పెళ్లాం పిల్లలూ లేని దిక్కుమాలిన ముండాకొడుకు—అన్నిటికీ తెగించి వస్తాడు—వాడి చేతిలో మీరు దొరుక్కుంటే యింకేమైనా వుందీ! మీరు వూళ్లో పెట్రోలింగుకు వెళ్లిన తర్వాత వాడు మనయింట్లోనే ప్రవేశిస్తే—నా ప్రాణాలు ఉన్న వున్నట్లు లేచిపోవు! మన కిప్పుడున్న కీర్తి చాలు. మీరు వెళ్లనే వద్దు.

ప్రకా—నేను వెళ్లకుండా ఇంట్లో కూర్చుంటే తక్కినవాళ్లందరూ వచ్చి మన యింటి మీద పడి నన్ను బయటకి లాగుతారు.

రాజ్య—జ్వరం వచ్చిం దని చెప్పి కప్పుకొని పండుకోండి.

ప్రకా—ఎన్నాళ్లని పండుకొంటూను? నాకీ అబద్ధాలూ పిరికిచేష్టలూ నచ్చవు సుమా! దేవుడు నన్ను మగాణ్ణి చేశాడు. నేను మగాడుగా వుండవలె.

రాజ్య—కాని దేవుడు న న్నాడదానిగా వేశాడు గనుక—నాపిరికితన మేలాగు పోతుంది? తన్ను నమ్మిన ధర్మం మొదలు చెడ్డ వేరం వుంటవు. ఇంటు గెల్చి రచ్చ గెలవ మన్నాడు. మొదట స్వవిషయం చూసుకోండి.

ప్రకా—వీలు లేదు. నాకు స్వవిషయం కంటె లోకవిషయమే ముఖ్యం. ౧౦-౩౦ ఇంక వెళ్ళాలి. ఆకిల్లీలూ బాకూ అందుకో.

రాజ్య—మీకు లక్ష చెప్పండి—నేను వప్పను. ఆదేమో ఏరోజుకంటె యీవేళ నాకు మరీ భయంగా వుంది. మీరు సినిమానుంచి ఒక గంట రావడం అలస్యం అయేసరికి నేను వెర్రెత్తిపోయినాను.

ప్రకా—ఇంక నీ కింటి దగ్గర కాపలా కూర్చుని నే నపకీర్తి పాలు కావలెనా?

రాజ్య—కీర్తో అపకీర్తో. అర్ధరాత్రివేళ నేనొక్కర్తెనూ ఇంట్లో వుండలేను.

ప్రకా—ఇల్లు యినపపెట్టె లా గుంది.

రాజ్య—కాని నామనస్సు! ఆవేశ మంతా విప్పండి ఇవుగో రెండు కిల్లీలు కట్టాను. ఇవి చాలు లెండి. గడచిన ౧౦-౧౨ రాత్రులూ నిద్ర లే నే లేదు. ఈరాత్రి అయినా సుఖంగా నిద్రపోండి.

ప్రకా—ఆదొంగ వెధవ యీవూళ్లో తిరుగుతూ న్నంతవరకూ నాకు ఇంట్లో పండుకొన్నా నిద్ర పట్టదు.

రాజ్య—లేకుంటే జబ్బు చేస్తుంది.

ప్రకా—సింహస్వప్నమా అని అదిమాత్రం తెచ్చిపెట్టకు. దైవకృపవల్ల నాశరీరం వుక్కు నునక—వజ్రపు ముక్క.

రాజ్య—కాని మానవశరీరం—విధిగా విశ్రాంతి కావలె.

ప్రకా—ఔను. ఏవో మాటలలో పెట్టి నన్ని లాగు నిలబెట్టేస్తే యెట్లా ?

రాజ్య—మీరీ రాత్రి గడప దాటి అవతలకు వెళ్తే నేను వస్తానండి. కావలిస్తే తెల్లవారితే ఉదయం నన్ను మాపుట్టింటికి పంపించివేసి మీరు—

ప్రకా—ఔను గాని యేమిటీ మొండితనం ! సినిమాలే సిదా ?

రాజ్య—మొండితన మనండి—గయ్యాళితన మనండి. నా భయం తీర్చమని నేను నాభర్తను కోరడం తప్పు కాదుగద. నామనస్సు భయంచేత యేలాగు గడ్డ కట్టి పోయి వుందో మీకేం తెలుసు? మీవన్ని ధైర్యసాహసాలు లోకంలో అందరికీ—స్త్రీలకీ బాలురకీ సహా వుంటాయనుకోవడం మీ తప్పు.

(లోపలనుండి)

మిస్టర్ షెర్లాక్ హోమ్సు !

ప్రకా—రైటో—కమింగ్.

రాజ్య—మీరు మాత్రం వెళితే నేను వప్పను సుమండీ. తర్వాత నన్నని లాభం లేదు. వాళ్ళ నేవో చెప్పి పంపించేసి రండి. ఈవేష మంతా విప్పండి (తానేవిప్పి) ఈశాలువు కప్పుకొని వెళ్లి జ్వర మని యేవో చెప్పి చక్కా రండి (తానే శాలువు కప్పును)

ప్రకా—మన దేశంలో పురుషుల ధైర్యసాహసాలు చావడానికి స్త్రీలే కారణ మని యిప్పుడు తెలిసింది. షేమ్ షేమ్. (వెళ్లును)

రాజ్య—(వస్తువులు సర్ది ప్రక్కలు రెండు మంచాలపై పఱచి నడుమ ఈజీచైర్ వేసి యింకేమేమో సవరించు చుండును)

ప్రకా—(వచ్చి) చా చా చా ! నావుత్సాహ మంతా ధ్వంసం చేశావు. నాచేత అబద్ధ మాడించేవు. వాళ్ళను పంపిచివేశాను. ఇంకేమి చేసేది? (మంచము మీద కూలబడును)

రాజ్య—ఆపాప మంతా నాదే లెండి కాని వాళ్లు వెళ్లి పోయూరా ?

ప్రకా—ఆ. ఏమైనా అంత అవసర మైతే సైకిల్ మీద కబు రెట్ట మన్నా.

రాజ్య—నిన్నరాత్రి యేమీ లేదట గదూ ?

ప్రకా—లేకపోవడ మేం ? నిన్నరాత్రే ఘోరం జరిగింది. నిన్న ౧౨ గంటలకి కోమటి వీధిలో పడ్డాట్ట. ఒక కోమటీ—తన కొడుకూ—ఇంకా యెవరో ముగ్గు రొక గదిలో గడియ వేసుకొని పండుకొన్నా రట. ఏలా గొచ్చాడో అగదిలో కొచ్చి కోమటి తలకాయ మీది కత్తి తాళా లేవన్నాట్ట. దానితో అకోమటి గగ్గోలెత్తి పోయి నోట మాట రాక—చేత కాని ముండా కొడు కై పోయినాడు—లేకుంటే తాళాలు కావాలిరా స్కౌండ్రల్ అని గూబ పగలేయ వల్సింది.

రాజ్య—అయితే యే మయింది తుదకి ?

ప్రకా—వేటకొడు మెత్త నైతే లేడి మూడు కాళ్లతో నడుస్తుంది. దానితో ఆదొంగవాడు పీక పట్టుకొని—నోట్లో గుడ్డలు కుక్కి—

రాజ్య—అబ్బా—చెప్పకండీ—నాకు భయం వేస్తూంది. ఈవాళ సినిమా కథ చెప్పండి.

ప్రకా—"ముసుగుదొంగ"—అదీ దొంగ కథే.

రాజ్య—ఆకథావొద్దు సినిమాలోనూదొంగలే. వూళ్లోనూ దొంగలే. మరేదైనా మంచి కథ చెప్పండి,

ప్రకా—౧౧-౩౦ అయింది. ఇప్పుడు కథేమిటి గాని పెరటి తలుపు లన్ని దిట్టంగా వేశావా ?

రాజ్య—వేశాను. నా కంత కంటే భయం. మీ రా దొంగ నెప్పు డైనా చూశారు ?

ప్రకా—చూస్తే విడిచిపెడతానూ ? చూడక పోయినా విన్నదాన్ని బట్టి పోల్చగలను లే.

వీడంతా వొక సినిమా దొంగలాగు తయారవుతాట్ట. తలమీద పెద్ద విగ్గొకటి. యెవడో ఆజుట్టు పట్టుకొనేసరికి అది వాడిచేతులో వుండిపోయిందట—వీడు పారిపోయినాట్ట. వీడు లోపల యినపతీగల బనీను తొడుక్కుంటాట్ట. నేనూ వొకటి కొందామని చూస్తున్నా. ఒక పోలీసువాడు కత్తితో పొడుస్తే—దెబ్బ తగలతే దట—వాడు పారిపోయినాట్ట. చేతిలో టార్చిలైటొకటీ—వొక చేతిలో రివాల్వరు—మామూలుగా కత్తి మొలలో వుంటుందిట—బాకొకటిట—మెళ్లో నాలాగే కాఫీతో ధర్మోఫ్లాస్కుంటుందిట—

రాజ్య—మరి అసంగతి చెప్పకండి. నేనొక్కటడుగుతాను—చేస్తారూ?

ప్రకా—ఏమిటి కథా?

రాజ్య—మీకు పండుకోవడమే నిద్ర వస్తుంది. నాకు రాదు. అంచేత నేను ముందర పండుకుంటాను. మీరేదైనా చదువుతూ వుండండి. నేను నిద్రపోతాను. తర్వాత మీరు నిద్ర పోదురుగాని.

ప్రకా—ఏం చదివేది? ఇంగ్లీషు పుస్తకాలు సికరం కావు. వెధవ తెలుగంటే నాకసహ్యం.

రాజ్య—పోనీ యింగ్లీషు పుస్తకమే చదివి తెనుగన చెబుదురూ.

ప్రకా—(లేచి వెళ్లి పుస్తకం తెచ్చి) ఇదిగో 'మార్క్వుంఢేయా' అని ఇది చాలా మంచిపుస్తకం. దీన్ని నాన్‌డిటెక్టివు అంటారు (చదివి చెప్పుతూ) అప్పుడే నిద్ర పట్టింది (పుస్తకం మూసి యీజీచైరెత్తిపెట్టి తానూ పండుకొనును)

రాజ్య—దీపం తగ్గించేస్తురు అమ్మమ్మ!

ప్రకా—ఇంకా నిద్ర పట్టలేదూ? (తగ్గించి పండుకొనును)

(పెరటిలో పెద్ద చప్పుడు)

రాజ్య—(దిగ్గున లేచి) అమ్మో! ఏమిటది! ఎంత చప్పుడో!

ప్రకా—ఏమిటి చెప్మా!

రాజ్య—దొంగ! తప్పకుండా దొంగ! నిస్సందేహం.

ప్రకా—ఉండు క్షణ ముండు (జాగ్రతగా విని) ఇప్పుడేం చెయ్యడం?

రాజ్య—కేకలు పెడదాం—దొంగో అని గట్టిగా?

ప్రకా—నలుగురూ మూగి చూసిన తర్వాత ఏదొంగా లేకపోతే నాకు కమ్మ కట్టివేయరూ? చెప్తా. (ఏదీ గతి నాకు—గ్రామఫోను రికార్డు వేయును)

రాజ్య—(సగంలో ఆపి) అవతలనుంచి కొంప మునిగిపోతూ వుంటే ఈగ్రామఫోను వాద్యమేమిటి? (తీసి వేయును)

ప్రకా—వాడే దొంగయితే వాడికి మనం మేలుకొని వున్నట్లు తెలుస్తుంది.

రాజ్య—అయితే ఈలాగు తెల్లవార్లూ గ్రామఫోనుతో కూర్చుందామంటారా యేమిటి? చా చా! పెరట్లో ఓమారు చూచిరండి.

ప్రకా—తలుపు తెరచే సరికి వాడు లోపల ప్రవేశిస్తే?

రాజ్య—అప్పుడే వెంటనే కేకలు పెడదాం.

ప్రకా—ఉండు. ముందర కిటికీ తెరచి చూదాం (తెరచును. పిల్లి లోపలకు గెంతును) పిల్లి! వెధవ గొడ్డు!

రాజ్య—బ్రతికేం. భగవంతుడా! నాప్రాణాలు మీద కెగిరిపోయినాయి.

ప్రకా—రా. అయినా ఓమారు పెరడు చూదాం.

రాజ్య—అమ్మో! నేను రానమ్మే! నేను రాలేను సుమండీ!

ప్రకా—దొంగా మనిషివంటి వాడే! దొంగ న్నా యింత భయ మైతే యేలాగే? ఏదీ ఆటార్చి లైటూ బాకూ ఈలా గియ్యి నే చూసివస్తా! (తలుపు తెరచి వెళ్లును. రాజ్యం ముసుగు కప్పుకొని పండుకొనును. దొంగ మెల్లగా ప్రాకుకొని వచ్చి మంచము క్రిందికి పోవును. ప్రకా—తిగిరి వచ్చి తలుపు గడియ వేసుకొని) అప్పుడే ముసుగు తన్నేవా? ఏమి భయమే! ఆడవాళ్లకింత లేని ధైర్యసాహసాలు! వీళ్లకు పురుషులతో సమాన స్వాతంత్ర్యం కావాలె నట! లేలే. ఏదొంగా లేడు.

రాజ్య—(ముసుగు తీసి మంచంపై కూర్చుని) లేడూ లేడూ! బ్రతికేం!

ప్రకా—మనం కాదు వాడు బ్రతికాడు ఏమూండాకొడుక్కి గుండె లున్నాయి మన యింటికి రావడానికి?

(దొంగ గప్పున ఇద్దరి యెదుటా నిల్చును)

ఇద్దరూ—ఓఓఓ...దొ—దొ—దొ—

దొంగ—షటప్! (రివాల్వరు చూపి) తల పేలుస్తా నోరు విప్పితే.

ప్రకా—(ఒక చేతితో తన నోరు మూసికొని రెండవ చేతితో గట్టిగా ఆమె నోరు మూయును)

దొంగ—నోరు మూసుకొని కప్పుకొని ఆమెను పండుకో మని చెప్పు.

ప్రకా—పండుకో పండుకో. మాటాడితే గట్టిగా వూపిరి తీస్తే ఈయన తల పేల్చేస్తానంటున్నారు. లేకుంటే యేమీ అన రట. పండుకో (బలవంతముగా పండుకో బెట్టి శాలువు నిండా కప్పును)

రాజ్య—అమ్మో దొంగ! దొంగ! (ముసుగులో మూల్గుచుండును)

ప్రకా—ఎవరు దొంగ? ఆయన దొంగ అని అప్పుడే నీకేం తెల్సు?

రాజ్య—భయం భయం. హ హ హ హ. (వణకిపోవుచుండును)

దొంగ—నోట్లో గుడ్డ క్రుక్కి ఈమె నోరు కట్టివేయి. కదలకూడదు.

ప్రకా—ఈమె మలేరియల్ జ్వరంతో బాధ పడుతూంది. అందువల్లనే యీ వణకూ పలవరింతలూ. మాటాడకు రాజ్యం! (చెవిలో మెల్లగా) భయం లేదు. నేనున్నాను. నువ్వు హాయిగా పండుకో. పండుకుం దండి.

దొంగ—ఆరాకింగ్ చైరు ఈలాగు వెయ్యి.

ప్రకా—తొందరలో గమనించలేదు. పాపం ఇంతసేపూ నిలబడిపోయినారు. (చైరువేసి) దయచేయండి.

దొంగ—(కూర్చుండి నోటుబుక్కు తీసి వ్రాసుకొనుచూ) మీపేర్లు? మీ సంగతులు?

ప్రకా—నాపేరు రాజ్యలక్ష్మి. దీనిపేరు ప్రకాశరావు. వయసులు 30-౨౫. భార్యాభర్తలం. కేస్టు హిందూస్. బ్రాహమిన్స్. నేను మేల్. ఇది ఫీమే లండి. అన్నట్లు మాయింటిపేరు ద్వివేదులవా రండి.

దొంగ—నీయింటి దగ్గర యేమే మాయుధా లున్నవి?

ప్రకా—మేమేం రాజాలం గనుకనా? సంసారులం—బ్రాహ్మలం. యేం మాయుధా లుంటవి! కత్తిపీటా—కోరాం—పారా—బొరిగా—గునపాం.

దొంగ—అవి కావు.

ప్రకా—అయితే నాదగ్గర పెన్నైఫు—సేఫ్టీ రేజరు—సెల్ఫుషేవింగుకు ఎడోనిస్ బ్లేడ్సు ఒక డజను—అంతే—నా వైఫ్ దగ్గర కొన్ని హెయిర్ పిన్సు—చిన్న కత్తెర—

దొంగ—(విషపు నవ్వుతో) తమాషా! ఆయుధము లేదా?

ప్రకా—అన్నట్లు మరచిపోయినాను. ఒక్క చిన్న బాకీ వున్నది. (ఇచ్చి) పనసకాయ కొట్టుకొందుకు మొన్ననే కొన్నాను. అట్టే బాగా లేదు. ఉంచనివ్వండి.

దొంగ—ఈయిల్లు నీ దేనా?

ప్రకా—కాదండి. అద్దెకొంప. నెలకు రూ ౨౦ లు అద్దె. తమవంటి తగు మనుష్యులు వస్తే కూర్చోపెట్టడానికి మంచి గదైనా లేదండి.

దొంగ—నీకు సంవత్సరానికి రాబడి యెంత?

ప్రకా—ఏదో ౫ వందలండి. అదైనా కాగితం మీదనే. మెరకభూములు నిరుడు వరదలు వచ్చి భూములు మంపుకైపోయినాయి. రైతువారీ గడుసుమీరి పోయింది. భూఖామందు ఖాతరే లేదు. పోనీ దావాలు వేదామంటే మున్సబు ముండాకొడుకు సాన్‌బ్రామిన్సు అయిపోయినాడు (నాల్క కొరుకుకొని) తమరు నాన్‌బ్రామిన్సా యేమిటండి లేకుంటే బ్రామిన్సేనా?

దొంగ—ఊఁ—నీదగ్గర నగ దేమాత్ర ముంది?

ప్రకా—ఏ ముంటుం దండి? ఉన్నవాళ్ల మిద్దరం గాని ఖర్చు చాలా జాస్తీ అండి. అందులో నాభార్య జాబరా మనిషండి—శెట్టి పీను.

దొంగ—సొమ్ము—నగదు—నీదగ్గర యేమాత్ర ముంది?

ప్రకా—చిత్తం చిత్తం. ఏదో దినవెచ్చానికి ౫—౬ వుంటుంది.

దొంగ—చూపించు తీసి చూపించు.

రాజ్య—అమ్మో అమ్మో!

దొంగ—నోరు మూసుకో నువ్వు. రెఛెడ్ వుమన్.

ప్రకా—అలాగే నండి—వట్టి దౌర్భాగ్యం మనిషి. మీ రేదో వ్యవహారం మాట్లాడుకుంటూంటే నీమాటలు గేమిటె? ఏమిటె కొంప మునిగిపోయింది? అయ్య నేదో అడుగుతున్నారు—నే నేదో చెప్తున్నాను—

రాజ్య—ఆసందుగ పెట్టె చూపించండి. ఇదుగో తాళం (తీసి యిచ్చును)

దొంగ—(బాకెత్తి) నువ్వు మాటాడే వంటే ఇది గుండెలలోకి విసరేస్తాను.

ప్రకా—క్షమించండి క్షమించండి. నువ్వూరుకో. (చెవులో మెల్లగా) కాని కాని. భయం లేదులే. ఈ వేష మంతా చూసి చేయవలసిన పని ఆఖర్న చేసివేస్తాను. నువ్వు పండుకో—మరి మాటాడ దండి. ఆసందుగ పెట్టె తెస్తునా?

దొంగ—ఆ అయిరన్ సేఫ్ తీయ వోయ్.

ప్రకా—కొంప మునిగిపోయింది రాజ్యం! ఇనపపెట్టె కొననోయి కొననోయి అంటే కొనే దాకా ప్రాణం బుచ్చుకొన్నావు. సరదా తీరిందా?

దొంగ—ఏమి?

రాజ్య—తాళాలు పోయినా యండి.

దొంగ—(అమాంతం దేయపుస్తక మాతని మొంగముపై కొట్టును)

ప్రకా—ఉన్నా యండి ఉన్నా యండి. కాని సరిగా తిరగటం లేదండి. అసలు వూళ్లో దొంగతకంగా వుందని పెట్టె మూసేసి తాళాలు నూతులోకి విసరేశా నండి—తర్వాత తీయించుకోవచ్చునని.

దొంగ—(లేచి వాని రెక్క పట్టుకొని) రా. దిగు. దిగి తీయవలె. పద.

రాజ్య—(దిగ్గున లేచి నమస్కరిస్తూ) మీధర్మ మూరొ ఆయనను దింపకండి. ఆయన కీత రాదు. కావలిస్తే నన్ను తోసివేయండి నూతులోకి—తాళం వెదకి తీసి నేను పైకి విసరివేస్తాను.

దొంగ—నువ్వితని కంటె వట్టి పేచీమనిషిలా గున్నావే!

ప్రకా—పేచీమనిషా యింకా పేచీ మనిషా! ఈమెతో ప్రతిరోజూ నే నెంత బాధ పడిపోతున్నానో ఆపరమేశ్వరుడికి తెలుసును. మహా మారురాలు!

ఖ
దొంగ—సరే. నిప్పుడు కాకుండా పెట్టె బద్దలుకొట్టే సాధనం నా దగ్గర వుంది. నేను చూస్తా. మరి మీకీ పెట్టె మాత్రం ఎందుకూ పనికి రాదు.

రాజ్య—బంగారం లాంటి పెట్టె—మొన్ననే కొన్నాం. విరవే నివ్వకండి.

ప్రకా—విరవకండి సార్! నాదగ్గర డూప్లికేటు కీసు వున్న దండి. తీస్తా.

దొంగ—తాళాలు దగ్గర పెట్టుకొనేనా యిన్ని వేషాలు వేశావు దగుల్బాజీ. తీయి ౧౦ గుంజీలు తీయి ముందు.

రాజ్య—ముద్దు పిల్లకాయ లాగు గుంజీలు తియ్యడ మేమిటి! తీయవద్దు.

ప్రకా—ఆయన నోరు మూసుకో నోరుమూసుకో అని చెప్తూ వుంటే నీకు కాదూ? తీస్తా నండి సర్. మూసు గేసుకో ఆయనకి కోపం రాగల్దు.—(తీయును)

దొంగ—ఇదిగో నేను తగు మనిషితరహా చూపించేటప్పుడు మీరు అట్లే వుండవలె. తెలిసిందా? మీరు పశువుల లాగు ప్రవర్తిస్తే మిమ్మ వేటాడే మార్గం నాకూ తెలుసును. ఇది ౨౦-వ శతాబ్దం. ఎటువంటి ఘోర మైనా పాప మైనా కూడా నాజూకుగా జరగవలె. నేను ౨౦-వ శతాబ్దపు మనిషిని. సజావుగా వ్యవహారం నడిపిస్తే నాలాభంలో నూటికి ౫ చొప్పున కమిష నిస్తాను. మీరు బైతుల్లాగు గగ్గోలెత్తితే మీప్రాణం పుచ్చుకొంటా. తెలిసిందా? పెట్టె తియ్యి. ఒక్క యింట యింత సేపు కూర్చుంటే యేలా గాను?

ప్రకా—చిత్తం చిత్తం. (తీసి) దయచెయ్యండి.

దొంగ—(విప్పిచూచి) ఏం? ౫౬ వుందన్నావు.

ప్రకా—అవునండి. ౫౬ అంటే ౫౬ వంద అన్న మాట.

దొంగ—అలాగా?......అవి ఒక కవరులో పెట్టు.

ప్రకా—చిత్తం.

దొంగ—అచిల్లర రూపాయి లెన్ని?

ప్రకా—౧౩-౧౫

దొంగ—అవి నీపైఖర్చు కుంచుకో—తెల్లవారగానే డబ్బుకోసం ఎక్కడికి పోతావు కనుక. ఆసామాన్లు తియ్యి—ఆ వెండి సామాన్లన్నీ.

రాజ్యం—అయ్యోరామా! ఎంతో ముచ్చటపడితే మొన్న మొన్ననే మాఅన్నయ్య వీటిని బొంబాయి నుంచి పంపించే డండీ,

ప్రకా—ఆ కష్టపడిపోయినాడు పాపం మీ అన్నయ్య. ౭౦౦ నేను పంపితే ఖర్చు పెట్టేసుకొన్నాడు కొంచెం మరి నెల్లాళ్లకు పంపేడు—ఎంత కమిషన్ తీసేడో!

దొంగ—మీభావమరదీ మీభార్యలాగే పరమ దగుల్బాజీ లాగున్నాడే.

ప్రకా—ఇంకా మెల్లిగా సెలవిస్తున్నారు—రొండుకు రొండే.

దొంగ—సరే. వెండిసామాన్లు ఇత్తడిసామాన్లు ఎవరు మోసుకుపోతారు—నా కక్కర లేదు. నేనివ్వబోయే ౧౦౦ కి ౫ కమిషన్ కిందా అవి మీకే వుంచుకోండి.

రాజ్య—మంచాలు కుంచాలు బిందెలు చెంబులూ కూడా వదలివేస్తున్నారు కనుక అవీ కలిపి వేయండి ౧౦౦ కి ౧౦౦ కమిష నిచ్చిన గొప్ప మీ కుంటుంది.

ప్రకా—ఇదే యిబ్బం దండీ—ఏమి తెచ్చి యివ్వండి సంతృప్తి అన్నది లేదు ఈప్రాణికి.

దొంగ—బంగారవు నగలు కనబడవేం?

ప్రకా—ఉన్న వేవో పై వైపు వొంటిమీదనే వున్న వండి. నిద్రపోతూన్నప్పు డైనా వాటిని తీయ దండి.

రాజ్య—అవే మాత్రం వున్నా యండి—కంటె వొడ్డాణం గొలుసూ నిరు డమ్మివేశా రండి.

ప్రకా—మరి యిల్లు కట్టడానికి సొమ్ము చాల కపోతే అమ్మివేశా నండి.

దొంగ—కట్టించి కట్టించి అద్దెయిల్లు కట్టించే రేమి టండి!

ప్రకా—చిత్తం చిత్తం. అమ్మివేయడమే మే లైంది. అదైనా దక్కిందిలేకుంటే—

దొంగ—లేకుంటే?

ప్రకా—మరేం లేదు—తమ రొస్తా రని తెలియక అమ్మివేశాను. తెలిస్తే ఉంచివేదును. ఏదో అదీ యిదీ కలిస్తే తమకు కొంత అదనుకు పనికి వచ్చు నంటున్నా.

దొంగ—ఆవిడ వంటిమీది వస్తువు లన్నీ తీయించి తీసుకు రండి.

రాజ్య—చెయ్యి చెప్పండి లక్ష చెప్పండి. పోతే నా ప్రాణ మైనా పోనివ్వండి. నేనివ్వను.

ప్రకా—చూడు. ఆయన మాట కాదనకు. ఆయన మనస్సు కరిగి—'ఈ స్వల్పవస్తువులు ఇవి మన కేమాత్రం' అని తోచి ఆయనే వదలేయవచ్చును. ఈయన సామాన్యుడు కాడు. ౨౦—వ శతాబ్దం మనిషి ఈకాలంలో ఈయన వొక్కడే.

రాజ్య—నన్ను చిత్రవధ చేసినా సరే నేనివ్వను గాక యివ్వను.

ప్రకా—ఏమండీ సార్! మావా ళ్లివ్వ మంటున్నా రండి. ఫీమేల్ ఎంతో మంచి పతివ్రత అయితేనే కాని తన వొంటిమీద చెయ్యి పెయ్య నివ్వ దండి. తమకు పెళ్లయిం దండీ సార్!

రాజ్య—అయితే ఆవిడ యెవరో మహా అదృష్టవంతురా లైయుంటుంది. దొంగ పెళ్లా మైనా కావలె దొర పెళ్లా మైనా కావలె అని.

దొంగ—ఏమిటీ ఆలస్యం—మొదట ఆవస్తువు లందుకో.

ప్రకా—ఏలాగు నండి? మీరో సారి చెప్పి చూడండి.

దొంగ—నాప్రారబ్ధం. నేను ఆడదాన్ని నగ లిమ్మని యాచిస్తానా—లేకుంటే బాధిస్తానా!

ప్రకా—నేను సిగ్గుమాలి యాచించినా లాభం లేకపోయింది. పోనీ కొంచెం బాధించనా అండి—నొక్కక పోతే మామిడిపండులోనుంచి రసం రాదు.

దొంగ—(టైముచూచి) ౧—౫ ఇంక నేను లేవవలె. వేగం కా నివ్వండి.

ప్రకా—రాజ్యం! ఆయన్ని ఎంతవేగం పంపివేస్తే మన కంత మేలు. ఇవ్వక తీరదు. తే.

రాజ్య—ఇంక పోవడమే! ఏదో చేయవలసిన పని వీడి కొఖర్సు చేస్తా మన్నారు. మరచిపోయినారా యేమిటి?

ప్రకా—సమయం చూస్తున్నా! ఇంకా వీడు పోయేవరకూ వేళ వుందిగా. మంచి వుపాయం ఆలోచిస్తున్నా. ముందు నగసలు తీసి వీడి మొఖం మీద పారవేయి.

రాజ్య—నే నేం దరిద్రాన్ని అనుకున్నా రా యేమిటి? నే నివ్వ నండి.

ప్రకా—ఇవ్వకపోతే నీ గుడ్డేం పోయింది. 'ఆడవాళ్లని బాధిస్తానా' అని ఇత డనడం చేత నిన్నేమీ అనడన్న ధీమా నీ కున్నది. ఇంక నేనా లాగు నస్తే నీకేం! ఇవి నేను చేయించి పెట్టిన వస్తువులు కాని నీయబ్బా నీ తాతా చేయించినవి కావు—

రాజ్యం—(ఏడుస్తూ) తీసుకొండి. మీవస్తువులు మీరు తీసుకోండి. నా కక్కర లేదు. (ఇచ్చును)

ప్రకా—(తెచ్చి యిచ్చి) ఇవి యే మాత్రం లెండి తమ వంటివారి కంటికి—తృణం.

దొంగ—నా జ్ఞాపకార్థం ఆవిడని ఈ జడబిళ్ల ఉంచుకోమనండి.

ప్రకా—చిత్తం. తమ జ్ఞాపకార్థం వేరే వస్తువెందుకండి—తమరే చాలు. తమర్ని ఈజన్మలో మరవగలమా అండీ?

దొంగ—అలాగు కాదు. మరి ౪ రోజులు పోయిన తర్వాత మరో దొంగ మీయింటిమీద పడితే అనుకోండి. అప్పుడు మీరు నన్ను మెచ్చుకోవలె. ఇందుకండి.

రాజ్య—చాలు చాలు. ఇంకా మాకొంప మీదికి దొంగల్ని తెచ్చిపెట్టకు.

ప్రకా—ఏమేవ్? ఊఁహూఁ! స్నేహం దగ్గర విరోధం తెచ్చే టట్లున్నావు. జాగ్రత.

దొంగ—అయితే నాపని పూర్తి అయినట్లేనా?

ప్రకా—చిత్తం. ఇం కేముంది.

దొంగ—అదే అడుగుతున్నా (నవ్వుతూ) ఇం కేముం దని?

రాజ్య—అదిగో ఆయన వున్నారు—కావలిస్తే తీసుకపొండి.

దొంగ—మంచిది వెళ్ళవస్తాను—నాకు తాంబూల మిప్పించివేయండి.

రాజ్యం—ఇంకా అదికూడా మిగిలిపోయిందా? (అసహ్యంతో కొరకొర చూచును)

ప్రకా—రా పిల్లా! చప్పున ౪ం ఆకులు చుట్టు.

రాజ్యం—నాచేత కాదు. అదుగో ఆకూ వక్కా యివ్వండి. చాలు.

ప్రకా—(మెల్లగా) ఆకూ వక్కా యిచ్చేస్తే వెంటనే వెళ్లిపోతాడు. మరొక్క క్షణం కూర్చోపెట్టి బాతాఖానీలో పెడితే అప్పుడు నా తడాఖా తెలిపిస్తాను. (గట్టిగా) చుట్టు. బాగా చిలకలు చుట్టు.

రాజ్య—(తల వంచుకొని ఆకులు చుట్టుచుండును)

దొంగ—(కూర్చుండి) కానిండి. అయిన ఆలస్యం ఏలాగూ కానే అయింది. (రిస్టువాచీ చూచి) ౧-౩౫. అబ్బా! (సిగరెట్టు కేసులోనుండి తీసి అతని కొక టిచ్చి తా నొకటి పట్టి అగ్గిపుల్ల వెలిగించి తొలుత అతని కందించును)

రాజ్య—ఇ దేమిటి? ఈ యగ్గేమిటి? చేసింది చాలక కొంప కగ్గి పెడుతున్నావా?

ప్రకా—దొంగగారూ నేనూ సిగరెట్లు కాల్చుకుంటూంటే మధ్య నీకగ్గో లేమిటి? నీపని నువ్వు చూసుకో. చిత్తం చిత్తం. తమకు చాలా ఆలస్యమైపోయిందిక్కడ.

దొంగ—అయిపోయిం దండీ. ౧-౪౦. ఇంక మరోచోటుకు వెళ్లడానికి వేళ లేదు. ఓపిక కూడా లే దండి. అబ్బబ్బా! ౩౫ రోజు లయింది నిద్ర అన్నది లేనే లే దనుకోండి. శరీరం సుభ్రంగా చెడిపోయింది.

ప్రకా—వెధవది నైటు డ్యూటీ కష్టమే నండి.

రాజ్య—పాపం. ఎందు కింత కష్టపడిపోతున్నా వేమిటి?

ప్రకా—నువ్వు నోరు మూసుకో—మగాళ్లం మేమూ మేమూ మాటాడుకొంటూ వుంటే పానకంలో పుడకలాగ మధ్య దూరుతావు—

దొంగ—మాటాడనివ్వండి—నేను వచ్చిన పని అయిపోయింది కనుక ఇంక నన్ను ఒక పరిచితుడుగాను స్నేహితుడుగాను మీరు భావించవచ్చును.

రాజ్య—అయితే అడుగుతాను—ఈపాడువృత్తి కాకుంటే ఇంతకంటే మంచివృత్తి మీ కేమీ కనబడ లేదూ?

దొంగ—ఏంచేత నమ్మా ఇది పాడువృత్తి అంటున్నావు?

రాజ్య—ఒకరి సొత్తు బలాత్కారంగా అపహరించడం పాపం కాదూ?

దొంగ—ఒకరి సొత్తేమి టమ్మా? తాను వచ్చేటప్పుడు తెచ్చాడా? పోయేటప్పుడు పట్టుక

పోతాడా? అది మనసొత్తైతేనే మన దగ్గరవుంటుంది. ఋణం లేందీ తృణమైనా ముట్టదంటారు. ఈవూళ్లో ఇందరు ధనవంతు లుండగా నే నిక్కడకే యెందుకు వచ్చాను? నా సొమ్ము ఇక్కడ వుంది గనుక.

రాజ్య—ఆఁ! నీ అబ్బా నీతాతా గడించి ముల్లె యిక్కడ దాచపెట్టేడు.

ప్రకా—ఇదిగో చెప్తున్నా—నోరు మూసికో. తమరు సెలవిచ్చింది సత్యం.

దొంగ—ఈచుట్టుపట్ల మీకు తెలిసిన వాళ్లలో ఎక్కువగా నగదు వ్యాపారం చేస్తూ పిసరూ పిప్పి బాగా వున్నవాళ్లెవళ్లైనా వున్నారా?

ప్రకా—చిత్తం ఇక్కడికి ౭ మైళ్ల దూరంలో రాంపురంలో జయంతి వారని వున్నారు. అర్ధరాత్రివేళ అయినా ౫—౬ సంచులు కావా లంటే అక్కడే దొరుకుతుంది.

రాజ్య—ఇక్కడి కింతటితో చాలు. మీ ధర్మమా అని వాళ్లకు కూడా సుడిపెట్టకండి.

ప్రకా—వాళ్లు మన అత్తవారు లెండి. పుట్టింటి అభిమానం కొద్దీ ఇది యీలాగు దేవులాడుతుంది. సత్యం చెప్పవలసివచ్చేటప్పుడు మనిషి తన పర అన్న భేదం చూపించకూడదు. ఏమండీ?

దొంగ—సరే రాసుకుంటా— రాంపురమా? ఇంటిపే రేమన్నారు?

రాజ్య—జోస్యులవారు.

దొంగ—(వ్రాసికొని) మీరుచెప్పినచోట నాకు దొరికే లాభంలో ౧౦౦ కి ౫ చొప్పున మీకు కమిష నిస్తాను.

ప్రకా—భేష్. అయితే నా నష్టం యిందులో కొంత కలిసివస్తుంది. పోయిన డబ్బు పోయింది గాని తమరు మాయింటికి దయచేయడం నిజంగా నా అదృష్టం. ఇంక నేను మీకింద కమిషన్ ఏజంటుగా పని చేస్తాను.

రాజ్య—ఇంక ఈయన కింద ఉద్యోగ మొక్కటే తరవాయి. ఇదిగో తాంబూలం. ఇంక అయన్ని అంపకం పెట్టరండి.

దొంగ—(తాంబూలం పుచ్చుకొని) అబ్బా! తల రింగురింగు మని తిరిగిపోతున్నది. కాఫీ ఏస్పరిన్ గాని వుందా?

రాజ్య—ఏమిటీ హిరణ్యాక్షవరాలు? తెగూ తెంపూ లేకుండా వుంది—ఇది వుందా అది వుందా అని. ఇంట్లో యింకేమేమి మిగిలివున్నవో వరాసగా చెప్పివేస్తాను. తినవలసినవి తినేసి త్రాగవలసినవి త్రాగేసి పట్టుకపోవలసినవి పట్టుకపో. అటకమీద అనకాయ వుంది; మంచంలో చద్ది అన్న ముంది—

ప్రకా—చాలు చాలు వూరుకో. దాని మాటల కేమండీ. పట్టి ఫీమేల్... కాఫీ ఏస్పరిన్ లేదు గాని థర్మోఫ్లాస్కులో తయారైన కాఫీ వుంది. ఓవల్ టిన్ కావలిస్తే ౨ నిముషాల్లో స్టౌమీద తయారు చేయించేస్తాను.

రాజ్య—చేయించేస్తారు! నేను చేయను. కావలిస్తే మీరే చేసుకోండి.

ప్రకా—అన్నట్లు స్పిరిట్ లేదు కదూ!

రాజ్య—అది వుంటే యీప్రారబ్ధ మేమి?

దొంగ—శ్రమెందుకు లెండి— ఆకాఫీ యే అందుకోండి (త్రాగి తాంబూలం వేసుకొని) అబ్బా! లాభం లేదండి. మహా బాధగా వుంది. అమృతాంజనం వుందా?

ప్రకా—లేదు. నేను కొంచెం ఆయుర్వేద వైద్యుణ్ణి—ఒక్క మోతాదు మందిస్తాను పుచ్చుకోండి. (లోనికేగును)

రాజ్య—(కొంచెం దూరంగా నిల్చి) నీకింతటితో నైనా మమ్మల్ని అనుగ్రహించి విడిచిపోవాలనుంటే పో—ఇహ నైనా తలు పేసుకొని పండుకొంటాం. లేకుంటే నీకూ ఇక్కడ కొంపుకొట్టు వేసేస్తాను—ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటూ పండు

కోండి—అబ్బబ్బా! దొంగవాడుకూడా మాటల పోగూ బాతాఖానీరాయుడూ అయితే మహా బాధ. (లోపల నుండి) రాజ్యం!

రాజ్య—ఆ వస్తున్నా (లోనికేగును)

దొంగ—(తలదించుకొనే) ఎవ్వ రేమంటూన్న దీ నాకు తల కెక్కడం లేదు. మందు తెప్పించండి. (క్షణ మూరకుండి తల కొట్టుకొని బాధపడుతూ) ఏమండీ! నిద్రపోతున్నారా? ఇంకా తేరేం?

(తెత్తురు)

ప్రకా—ఇది కళ్లు మూసుకొని గుటక్కున మింగేయండి—ఘంట నే గుణ మిస్తుంది.

దొంగ—ఊహూ! మీరు కొంత పుచ్చుకోండి ముందు.

ప్రకా—ఇది ఒక్క మోతాదే నండి.

దొంగ—ఈమోతాదు మీరు ముందు పుచ్చేసు కోండి—తర్వాత నాకిత్తురు గాని.

ప్రకా—ఇదితలనొప్పి లేకుంటే వికటిస్తుం దండి.

దొంగ—(ప్రకాశం చెయ్యి పట్టుకొని) నిజం చెప్పు—ఏమిటీ మందు?

ప్రకా—క్షమించాలి—నేను వద్దువ ద్దంటూ వుంటే నాభార్య బలవంతపెట్టి యీమందు కలి పించిం దండి.

దొంగ—ఏమిటీ మందు?

ప్రకా—మరేం లేదు. మత్తుమందు. ఇది పుచ్చు కొంటే కబీవేళకే తెలివి వస్తుంది.

దొంగ—ఛీఛీ. ఈలోకంలో నమ్మదగినవా డొక్కడు లేడు.

రాజ్యం—చాచా—లోకంలో నమ్మకస్తు లెక్కడున్నారు—ఒక్క దొంగలు తప్ప.

దొంగ—ఇందాకా నీకు విడిచిపెట్టిన రూపాయి లిచ్చివేయి—నీ అపరాధానికి రూ ౧౫ లు జరి మానా.

రాజ్య—నువ్వు నిజంగా జడ్జీలా గున్నావు కాని దొంగలాగు లేవు.

ప్రకా—నువ్వు ప్లీడరులాగ లేవు? చాలులే వూరుకో. (సా మ్మిచ్చును)

రాజ్య—నాప్లీడరీ మాట కేం గాని మీ రున్నా రు నేరస్థుడు లాగు.

ప్రకా—ఇదే నండి అల్లర. అసలు హౌస్ బెండు అంటే గౌరవం లేదండి. నువ్వంటె నువ్వు.

దొంగ—తలనొప్పి దుర్భరంగా వుంది. ఒక ఘంట నిద్రపోతే సర్దుకొంటుంది. పండుకొం టాను. ౧౨౦. సరిగా ౩ గం॥కి నన్ను లేపివే యండి. ఎలారం టైంపీ సుందా?

రాజ్య—శ్రీరామచంద్రా! ఇది గంటల గొడ్డీ అపరేషన్ లా గుంది—చిత్రవధ.

ప్రకా—(తెచ్చి) ౩ గం॥లకు ఎలారం పెట్టనా?

దొంగ—పెట్టండి—ఇదిగో అంతవఱకూ మీరూ మేలుకొని వుండండి.

ప్రకా—(ప్రక్క సర్దుతూ) మీరూ అంటే నే నొక్కడ నేనా? ఈమె కూడానా?

దొంగ—మీ రొక్కరే. (పండుకొని) మళ్లీ యీసారి యేమి ద్రోహం తలపెట్టినా చాలా చిక్కు పడిపోతా రన్న సంగతి నేను చెప్పకుండా నే మీరు తెలుసుకోవలసి వుంది.

(క్షణం నిశ్శబ్దం)

రాజ్య—అయితే యీశవజాగరం మీకు తెల్ల వార్లూ వుం దన్న మాటే!

ప్రకా—(మెల్లగా) మాటాడక మధ్య గదు లోకి వెళ్ళి పండుకో.

రాజ్య—మీకంత సరదాగా వుంటే నాకేం కా నివ్వండి—ఏమిటీ భాగవతం? వీడి వ్యవహారం చూస్తే ఇల్లరికం వుండిపోయే టట్లుంది.

ప్రకా—ఈయన ౨౦-వ శతాబ్దపు మనిషి.

రాజ్య—అంటే ?

ప్రకా— అంటే ఆడవాళ్లూ చదువులేని వాళ్లూ మీకేం తెలుస్తుంది? మంచి మంచి ఘరానా మనిషన్న మాట.

రాజ్య—వీడెవడో నోవల్సులో దొంగలాగున్నాడు కాని—

ప్రకా—గట్టిగా మాట్లాడకు—నిద్ర పట్టినట్లుంది. నిజంగా ఈనోవల్సు వల్లా సినిమాల వల్లా దొంగతనం మోస్తరు మారిపోయి యెంత నాజూకుగా తేలిందో చూశావు?

రాజ్య—మోస్తరు మారితే నేం—ఫలితం వకటే. ౧౨౦౦ కి సుడిపెట్టేడు కదూ?

ప్రకా—మెల్లిగా—మెల్లిగా నిద్ర పట్టినట్టుంది.

రాజ్య—ఇదిగో నా మాట విని—ఈలాగు రండి (దూరముగా గొనిపోవును)

ప్రకా—మరి చెప్పకు. నీ మాట నేను వినను—అది వినబట్టే యింతైంది.

రాజ్య—పోయిన ౧౨౦౦ కి లేందీ ఈ జరిమానా ౧౫ రూ॥లకేనా విచారం?

ప్రకా—లక్ష పోతే విచారం లేదు. కాని మగవాడన్న వాడికి ఒక కాణీ జరిమానా పడితే యెంత పరువు నష్టం!

రాజ్య—మగతన మడగక్కర లేదు. ఈలాటి మగవాళ్లుంటే రామసహాయం! పెట్రోలింగుకు వెళ్తారట! దొంగల్ని పడతారట. ఇదంతా ఒక సరదా ఆట కాని యింకేం కాదు. మీరింత మనిషివున్నారు—వీడు చూస్తే అర్భకుడు—టక్కున నిలబెట్టేస్తే? కోమటి ఆచి పెట్టి ఓ లెంపకాయ కొట్టలేకపోయినా డన్నారు—మీ రేంచాశారు. కొసకి గుంజీలు కూడా తీశారు సిగ్గు సిగ్గు.

ప్రకా—వేశాను. ప్లాను వేశాను. సమయం చిక్కనీ—ఏం చేస్తానో—

రాజ్య—మొదటనుంచీ అదే పాట పాడుతున్నారు కాని చెయ్యడమే కనబడదు. బాగా నిద్ర పట్టింది. నామాట విని ఇప్పుడు వీణ్ణి ఈమంచానికి కట్టివేయండి. మరి సిగ్గు నమలక లెండి సాహసించండి.

ప్రకా—సాహసం లేక కాదు. దొంగ యొక్క నిద్ర దొంగనిద్ర. మన మేమైనా తొందర పడితే ప్రమాదిస్తుంది.

రాజ్య—ఇంతకంటె యింకో ప్రమాద మేమిటి. కావలసిం దేమో కానే అయింది. దొంగా మనిషి వంటివాడే. వెచ్చగా కాఫీ త్రాగేడు—చల్లగా నిద్ర వచ్చింది. వాడికీ నిద్రాహారాలు కావలె. మనిద్దరం పట్టి ససవల మున్న సంగతి వాడికి బాగా తెలిసింది. హాయిగా నిర్వ్యాచీగా పండుకొన్నాడు.

ప్రకా—ససవల మేమిటి—అసందర్భంగా మాట్లాడుతున్నావు?

రాజ్య—కాకంటే మ రేమిటి? గుంజీలు తియ్యమంటే గుంజీలు తీసేసి. జరిమానాలు కట్టమంటే జరిమానాలు కట్టివేసి. స్వాములవారికి సేవచేసినట్లు—అడుగులకు మడుగు లొత్తుతూ—చాచా మీరింత నాదారు మనుష్యు లనుకోలేదు నేను.

ప్రకా—ఈచాదస్త మంతా యెందుకు? అయితే యేం చెయ్య మన్నావు?

రాజ్య—నేను ముందర సాహసిస్తా చూడండి. (వాని దగ్గర నుండి బాకు తీసి) దొంగను చంపితే గవర్నమెంటు ప్రైజం టిస్తా రని చెప్పేరు—ఒక్క నరకు నరకండి.

ప్రకా—నువ్వే చూడలే నన్నావు?

రాజ్య—అప్పుడాలా గనిపించింది కాని—ఇప్పుడు చిత్రవధ చేసినా నాకు సంతోషమే. ఏం పాపం లేదు. మరి సిగ్గు నములక నరకండి (బాకిచ్చును)

ప్రకా—(క్రింద పెట్టి) అమ్మో వద్దు వద్దు. నిద్రపోతూన్నప్పుడు నరకకూడదు—లేస్తున్నాడు.

రాజ్య—లేదు. ఇటునుంచి అటు తిరిగి పండు కొన్నాడు. పోనీ ఈతాడుతో మంచానికి కట్టివే యండి (తాడు తెచ్చి) ఈమాత్రం చేయలేరా?

ప్రకా—(ఆలోచించి) నేనొకటి చెప్తా—నువ్వు కట్టు. తెలిసింది. వాడు లేచి నిన్నేమైనా అంటే నేను మధ్య పడతాను.

రాజ్య—ఏం మగతన మండీ! ఏం మగతన మండీ! పోనీ పోతే నా ప్రాణం కదా పోతుంది. (మంచాని కొక కొస కట్టి) నేను కడితే గట్టిగా వుండదు—వెంటనే వదుల్చేసికొంటాడు. మీరు కట్టండి—ఈమాత్రం చేస్తే తప్పు లేదు.

ప్రకా—ఈలాగు తే. (తాడు పుచ్చుకొని దొంగ గుండెలపై ఎక్కి వేయును)

దొంగ—(దిగ్గున లేచి) దగుల్బాజీ—దగుల్బాజీ!

ప్రకా—(గజగజ వణకిపోతూ) క్షమించాలి క్షమించాలి. (చప్పున పోయి భార్య రెక్క పట్టుకొని కొనివచ్చి) 'స్త్రీబుద్ధిః ప్రళయాంతకా' అని దీని మాట విని ఈఅపరాధం చేశాను. చుట్టుకొని తిరిగిపోతా వేం? నిలబడు.

దొంగ—(ఒక గ్రుద్దు రాజ్యానికి గ్రుద్ది) ఏమి నీకీటువంటి పాడుబుద్ధి పుట్టింది?

రాజ్య—(ఏడుస్తూ) నీ చేతులు పడిపోను. నువ్వు నన్ను కొడతా వట్రా? నీకు తల్లిలేదూ? అక్క చెల్లెళ్లు లేరూ? పెళ్లాం లేదూ? వాళ్లనెవరైనా యీలాగు—

ప్రకా—నీ కంతే కావాలి. నోరు మూసుకో. పాడుపని చేయించి మళ్లా యేడుస్తావు!

రాజ్య—అమ్మ అమ్మ! ఏమిటీ ఘోరకలి? లోకంలో యింత చేతకానితనం కూడా వుంటుంది! మగవాడీమాత్రం కూడా పౌరుషం లేని సన్నాసి అయిపోతే ఇంక వెంగు డనిపెద్దు లని పెళ్లని పేడాడు అని ఎందుకీ తంతు అంతా?

ప్రకా—అయ్యో! ఊరుకుంటుందా ఓ చెంప కాయ కొట్టమందా. ఏమిటా పేలాపన?

దొంగ—(రాజ్యంతో) పో లోపలికి పో. ఇంక నువ్వు నాకంటికి కనబడితే చూడు—పో.

రాజ్య—(ఏడుస్తూ లోనికి పోవును)

దొంగ—నువ్వు చేసిన నేరానికి నిన్నేమి చేస్తే తగిన శిక్ష అవుతుంది?

ప్రకా—నిలువుగా చీరేస్తే తప్పులేదు. ఇదుగో చెంపలు వేసుకొంటున్నా (వేసికొని) క్షమించండి. కావలిస్తే ౧౦ కాదు ౧౦౦ గుంజీలు తీసేస్తాను తీయబోవును)

దొంగ—గుంజీలు! గుంజీలు! నీకు ౧౦౦౦ రూ. జరిమానా వేశాను.

ప్రకా—అమ్మో అమ్మో! ఎక్కడ తెస్తును?

దొంగ—కొంప వున్నది గా—పత్రం రాయి.

ప్రకా—ఇంటిమీద ఇదివఱకే అత్తెసరుగా అప్పున్నది.

దొంగ—బాకీటుతే (పుచ్చుకొని అది గుండెలపై పెట్టి) వ్రాస్తావా!

ప్రకా—రాస్తాను రాస్తాను. కాని ఇప్పుడు స్టాంపెక్కడనుంచి వస్తుంది?

దొంగ—నాదగ్గర వుంది. ఇదుగో కాగితం. కలం. ఇంకా మోసం చేస్తే ప్రాణానికే మోసం వొస్తుంది. జాగ్రతగా రాయి.

ప్రకా—(రాసి) ౧౯౩౪ అక్టోబరు నెల తే ౧౫ దిని విజయనగరం కాపురస్థుడు లేటు ద్వివేదుల చలమయ్యశాస్త్రిగారి కుమారుడు ద్వివేదుల ప్రకాశరావు. తర్వాత ఏం వ్రాయమన్నారు?

దొంగ—రాయి. శాంపురం కాపురస్థులు.

ప్రకా—శాంపురం! శాంపురం!

దొంగ—రాయి. జయంతి కృష్ణావధాని, గారి కుమారుడు జయంతి కుటుంబశాస్త్రి ఉరఫ్ మాస్టరు కుట్టూ—రాయ వోయ్.

ప్రకా—(చూసి చూసి దిగ్గున లేచి) ఆరె నీ సిగా తరగా—నువ్వే న టోయ్, రాజ్యం! రావే రావే. మీయన్నే కుట్టుగాడు!

రాజ్యం—(నవ్వుతు చప్పున వచ్చి) అవునా అన్నయ్యా. అయితే నువ్వేనా? బ్రతుకు దేవుడా! అయితే యీ వేష మంతా యేమిటి?

ప్రకా—అదే నేనూ అడుగుతున్నా—అయితే యీ పొయ్యి కాల మేమిట్రా! (ఒక్క గ్రుద్దు గ్రుద్ది) ప్రాణంపుచ్చుకొన్నావు. అయితే బొంబాయి యినుంచి యెప్పుడు వచ్చేవు? ముందు ఒక ఉత్తరం లేదు. పత్రం లేదు.

దొంగ—ఇదిగో పత్రం—రాయి రాయి.

ప్రకా—ఆ! రాస్తాను రూ౧౦౦౦౦లూ నొక్కుక పోదు గాని (పత్రం చించి వేయును)

దొంగ—అవును అయినవాళ్ళ కిస్తావా—పరాయివాళ్లకు చేపుతావు కాని.

ప్రకా—సరే నీసంగ తేమిటి చెప్పు కూర్చోవే (ముగ్గురు మంచముపై కూర్చుందురు)

దొంగ—ఏముంది? ఇప్పుడు సాగర్ మువీటోనునుంచి—నిరోూ ఇంపీరియల్ లోకి మార్చేసుకొన్నా. నీకా సంగతి వెండిసామాన్లు పంపినప్పుడు రాసేను గా!

ప్రకా—అవును—ఇప్పుడేం ఫిల్ము తీస్తున్నారు?

దొంగ—'కాలపోర్' అను ఫిల్ముషూటింగులో వుండగా 'డిరెక్టరు' చనిపోయినాడు. ౧౫ రోజులు సెలవు తీసుకొని యింటికి వచ్చేను. ౩ రోజుల క్రిందట—ఓమారు మాచెల్లిని చూసి పోదా మని వచ్చేను సాయంకాలం.

ప్రకా—అయితే ఆఫిల్ము తీసూ అడస్సుతోనే వచ్చేశావా యేమిటి? లేకుంటే అది యిక్కడ ప్రాక్టీసు చేసుకోవలె ననుకొన్నావా?

దొంగ—లేదు లేదు. రావడమే మాచెల్లి చెప్పింది—దొంగల్ని పట్టడానికి నువ్వు ప్రతిరోజూ ప్రాక్టీసు చేసున్నా వని— పెట్రోలిం గని రాత్రి తెల్లవార్లూ వూళ్లో తెగ-తిరుగుతున్నావని— ఇంటిదగ్గర కూడా అవే కబుర్లు చెప్తూ ప్రాణం పుచ్చుకొంటున్నా వని—అది విని నీధైర్యసాహసా లేమిటో మా చెల్లిలికి చూపిస్తా మని—

ప్రకా—అంటే నీవేష మంతా దీనికి ముందే తెలుసు నన్న మాట! ఇద్దరూ కోడించుకొని చేసిందే యీ పనంతా! ఆరె మీసాహసం మండా!

రాజ్య—పెళ్లయిన యిన్నాళ్ళకైనా మీధైర్య సాహసాలు నాకు తెలియవద్దా మరి. ఈయనే ఆంధ్రా ష్లాకుహూ మ్సట అన్నయ్యా—అంటే యేమిటి?

దొంగ—ఆంధ్రా అంటే ఇమిటేషన్ అన్న మాట ఆతర్వాత ఎంత గొప్ప పేరున్నా ఫర్వా లేదు. దాని శక్తిని ఇది ఆర్పేస్తుంది.

ప్రకా—మహంకాళీ! నీచాకచక్యం నిరుపమానం. ఒక్కచోట ఒక్కచోట తొణికేవు కావు గదా! ఆశ్చర్యం! నువ్వు చేసిం దంతా నట నైతే వీడికంటే నీవే పైనేయి. బావా! ఇది సంసారిగా కంటె సినిమా నటిగా బాగా రాణిసుంది. దీన్ని కూడా నీతో తీసుకపోయి యేసాగర్ లోనో త్రొక్కివేయ్.

దొంగ—నువ్వు కూడా రావా లోయ్—ఆ మహారాష్ట్రపు భోజనం ఏమీ సరిపడకుండా వుంది.

ప్రకా—(అట్టే చూచి) మాగొప్ప ఆట ఆడేవు కదూ. ఏదీ షేక్‌హాండు ఈలాగు పారేయ్— (చేయి పట్టుకొని) హాల్లో, మాస్టర్ కుట్టూ!

దొంగ—(పంజా గట్టిగా నొక్కి) హెల్, ఆంధ్రా ష్లాక్ హోమ్సు!

రాజ్య—ఆఁ! ఆఁ! వదలీ వదలీ—(ఇద్దరి చేతులూ పట్టి నవ్వుతూ విడిపించును)

———

# అబ్బాయి నాన్న

మల్లాది రామకృష్ణశాస్త్రిగారు

'చెప్పండి...మరి!'

'ఏమిటి?'

'చందమామను చంద్రుణ్ణి, మామ అని ఎందుకు పిలవడం?'

'ఏమో'

'ఓస్... ఇంతేనా...'

'ఐతే, చెప్పనా..'

'ఆఁ...'

'నీవు ఒప్పుకుంటావా?'

'ముందు చెప్పండి. గెలవలేక...'

'నీలాటి చక్కని చుక్కలు కూతుళ్లుండటం చేత'...

'సంతోషించారు తెలివికి, తమ రికరో అప్పుడు...?'

'మేం... లక్ష్మీపుత్రులం!'

'ఓహో... అదా సంగతి! రోజా, తోటలో పూలన్నీ మాయ మౌతూంటే... ఏమైపోతున్నాయా అనుకుంటున్నా. ఎవరి మీద ప్రయోగించడానికేం బాణసంచంత?'

'అది కాదండి నాకు తెలుసులే. దేవిగారికి తలబార, దండలు అమరడం లేదని గుసుగు'

'పోనీ తీసుకోండిమీ క్రాపింగు...లో...కి...'

'నవ్వు.. అలాగే...నవ్వితే నే నూరుకోను...'

'ఐతే కోపం తెప్పించుకుంటూ...ఇదుగో, బుంగమూతి పెడుతున్నా... వచ్చేసింది... ఊఁహూఁ...'

'ఇదిగో...ఓయ్! ...ఊఁ! ...పలకవూ? ఏమిటి నిజంగా కోపం వచ్చినట్లేనా?. ఊహుఁ! అలా ఐతే నేను ఒప్పుకోను. అన్నింటికీ ఓమాదిరిగా నే తల ఊగిస్తే ఏలా? కోపం రాలేదా?. వచ్చిందా? వచ్చిందీ? సై. ఇక కాచుకో, చక్కిలిగింత పెట్టినా—నవ్వకూడదు—ఏం. సరేనా?'

*  *  *  *  *

'ఏమిటా కిచకిచలు?. ఇంకా మేలుకునే ఉన్నారా?!...'

'..... ...............'

'వినబడుతూనే ఉంది లే నవ్వు. మీరు మాట్లాడక పోయినా—'

'ఇక చాలించండి, ప్రొద్దు పోయింది. అమ్మాయి! ఇక పడుకో అమ్మా! ఓపలేని పిల్లవు. ఒళ్లు భారకిస్తుంది. వాడికేం లేం? అలవాటేగా తెల్లవార్లూ మేలుకోడం?'

*  *  *  *  *

'చెపుతే విననేర్చు లే దేం చేతునమ్మా? వాడు వాడే; అది అదే....ఇదుగోనర్రా! ఇక నే నూరుకోను'

'...మరే...అమ్మమ్మా...'

'కాదండీ...అమ్మమ్మగారూ...ఈయనే...'

'చూడవే....న...వ్వి...స్తూం....ది...నే...ను...'

*  *  *  *  *

'మీయిష్టం మీది నాయనా...ఉండండి, మెట్లగదిలోకి వెళ్లి పెద్ద మీట వేసేస్తా...దీపా లున్నంతవరకూ___'

*  *  *  *  *

'అమ్మమ్మా! వెన్నెల్లో నీమనుమరాలే...'

'ఊఁ! అఘోరించండి...మీయిల్లు బంగారంగానూ'

౨

'చూడండి...'

—మిమ్మల్నే...'

—అక్కడ కాదు...ఈలా రండి...'

—అబ్బ! రండి...ఇంతలో మరేం అరిగి పోరు...'

—ఓః! పిలిచిన కొద్దీ బిగింపు ఎక్కువౌతూం దేం? మిమ్మల్ని ఎవరూ కొరుక్కు తినరు లెండి రద్దురూ...'

'...................'

'ఎందుకూ?'

'...అలా చూడరేం. పాపపిలుస్తూన్నాడు...'

'అ...నీ అంత వాడే...తక్కువా ఏం?'

'కాదండీ...మీ అంతవాడు. మీ గుణా అన్నీ అప్పుడే అబ్బినాయ్. అనుక్షణాం అనుసరించి ఉండాలి కదా....ఓస్! లేదమ్మ! మా నాన్న! మా బంగారు తండ్రి! నిన్ను కాదమ్మ! అబ్బ! ఎంతరోష మొచ్చిందో! ఒక్క మారు తీసుకోండి. ఏలా చేతులు చాస్తున్నాడో.........'

—కే.అ.వు...కే...వు...కే...వుం...గాఅ...—

పోనీ లెండి. తెలియడం లా? వాడి భాషలో నన్నెత్తుకోవు....నన్నెత్తుకోవు? ...అని....ఏలా పిలుస్తూన్నాడో...'

...ఇంత మాత్రం కవిత్వం నాకూ చేతనవు. నీవు పనికిరావు...అమ్మవు కావు...అంటున్నాడు సరేనా...'

'మహా నేర్చారు లెండి మాటలు...'

'మాట...'

'................'

'పాపని...అమ్మమ్మకు యిచ్చి—'

—ఏం'

—వినిపించలా.'

—ఏమిటి?'

'నాకు తెలియదు బాబూ!. అవిడ కిస్తే వాడూరుకోడు...పని వేళప్పుడు—''

'అలా గైతే...'

'వాణ్ని చూడండి...ఊహుఁ అంటున్నాడు. వల్లకాదు...'

'ఊహు...నేను అంటూ వల్లకాదని...'

'మీ అమ్మమ్మ దగ్గర పోయి కూర్చుంటూ!!'

౩

'అమ్మాయ్!...అదేమిటే? అలా మాటిమాటికీ తొట్టె కుదుపుతూంటే మళ్లా మేలుకుంటున్నాడు? అసలే కొంటె కోణంగి. పోనీ కాస్సేపు కాళ్లమీద వేసుకుని ఎత్తుకొట్టు...అంతే ఎగరేయకు, ఉలికి పడతాడు...ఒక్క పావుగంట అడించు. నేను మడి విడిచి ఇవతలకు వచ్చి తీసుకుంటూ—...'

* * * * *

'ఇంకా. పడుకోలా వాడు?'

'ఊహుఁ.మ్. బిగ్గరగా అనకండి...ఇప్పుడే కాస్త కునుకుతున్నాడు. మళ్లా లేస్తే నన్ను వేపుకు తింటాడు...'

'వీడొకడు...దొరికాడు...'

'...................'

'నిజంగానే. వెన్నెల రాత్రుల్లో...ఎంత హాయిగా ఉండేవాళ్లం? ఇప్పుడు—'

'అః...మీకు ఎప్పుడూ అదే రంధి...'

'అవును...నా ఆనందానికి—నా అనుభవానికి అడ్డం గొట్టడానికి పుట్టాడు. వీడు...'

'ఏమిటా మాటలు?—'

'ఏమిటా...నీతో మాట్లాడటానికైనా నాకు ఇప్పుడు 'స్వతంత్రం' లేదు. బిగ్గరగా పిలవకూడదు. అబ్బాయి ఉలికిపడతాడు. బిగ్గరగా నడవకూడదు. ఆయన మేలుకుంటాడు. నీవు నాతో కాస్సేపు తీరికగా ఉండకూడదు. ఆ మహారాజాధిరాజు పోరు మొదలెడుతాడు. ఐతే నేను, ఇక ఇంట్లోనూ ఉండకూడదు. అలా గైతే!'

'ఎక్కడ నేర్చుకున్నారు ఈ పాఠ మంతా? మీకే ఉన్నారా మహా పిల్లలు? గాలికి తిరిగివచ్చి కబుర్లు చెప్పడానికే మీకు యింత కష్టమైతే అ స్తమానం కనిపెట్టుకుని కూర్చునే దానికి నాకు ఏలా ఉంటుంది'...ఐనా మన పిల్లవాడికి మనం చేసుకోవడం అబ్బురమా? ఒకరికి చెప్పా? వాడు మాత్రం అందరి పిల్లల లాగా విసిగిస్తాడా?'

'వెనకవేసుకు వస్తున్నావ్. అవును, నీకు వాడితోనే లోకం. నామాట—'

'ఆ...మీ మాట...మీరు చెప్పే మాట ఏమిటో నాకు తెలుసును. కొత్తా'

'ఊఁ...వీడిమూలానే నాకు నీవు దూరమౌతున్నావ్. ఐనావు. ఎందుకు పుట్టాలీ...వీడు?'

*  *  *  *

'వింటున్నా మీ చిలకపలుకులు, మహా అక్షణంగా ఉన్నాయ్...'

'కాదే అమ్మమ్మా!...'

'చూడండి! వాళ్ల అబ్బాయితో యుద్ధం చేస్తున్నారు...'

'అవును...వాడు ఎందుకు పుట్టాలి...'

'అలాగేం? నాయన్నా! నీవు ఎందుకు పుట్టావు?'

'మా అమ్మ కన్నది...'

'మీ అమ్మ కంటే మాత్రం. నువ్వు ఎందుకు పుట్టడానికి ఒప్పుకున్నావూ? నిన్ను కాకపోతే ఇంకొకణ్ణి కనేది. కడుపుతూన్నమ్మ కనక మానుతుందా? వండుకున్నమ్మ తినక మానుతుందా?... ఏం...'

'.....................'

'జవాబు చెప్పవేం? ఇందాకన్నుంచీ, నోరులేని పసికుంక వాడిమీద ఎగిరావ్. చెప్పు మరి?

*  *  *  *  *

'మీరూ...మీవేషాలూనూ. ఎత్తుకో. ఓమారు ఎత్తుకు తిప్పు. ఎందుకు ఎత్తుకోందీ ఇంతవాడవైనావ్? నేనూ. బతికుంటే చూడకపోతానుటే? వాడూ రేపు ఈ పాటికి బతికి బట్టకడితే వాడి పెళ్లాం దగ్గరా ఈలాగే ధిమాకులు చేస్తాడు. అప్పుడు మనవణ్ణి నీవే ఎత్తుకు మోయాలి. చాల్లే. ఇక ఈలాతే. ఈ నిమిషానికే పండుతండ్రిని పిసిగేశావ్. ఈ కాలం వాళ్లకు...ఏదీ తెలియదు. అదేం లోకమో? పోన్లే నాయనా? నీవు నాదగ్గిరే పడుకుందువు కాని. మీ అమ్మనీ నాయన్ని గంతు లేసుకోమను. ఇనుగోనే అమ్మాయి...! నవ్వొస్తే ఆపుకోవాలి కాని—విరగబడుతూ, పరిగెత్తితే ఏలాగే? ఒక్కమారు వీణ్ణి తీసుకో...'

---

# హిందీవల్ల తెనుక్కి జరుగుతూ వున్న అపకారం

ఈసంచికలో మంగిపూడి వేంకటశర్మగారి లేఖ ప్రకటిస్తామని చెప్పి వున్నాం. అయితే దొంగాటక మనే రూపకం అనుకున్నంత కంటే ౨౮ పేజీలు పెరిగిపోవడంవల్ల వీలయింది కాదు. వచ్చేసంచికలో తప్పకుండా—మున్నంగి శర్మగారి లేఖకూడా ప్రకటిస్తాం. సంపాదకుడు

"గ్రుడ్డి ఆవేశంతో బయలుదేరిన కృతకదేశాభిమానంతో రాష్ట్రచింత నశింపజేసే స్థితిలోకి మనల్ని హిందీ తెచ్చే సరికి మీ శంఖధ్వానం నాలుగు దెసలా మారుమ్రోగింది. ఇందుకు మా అభినందనాలు. హిందీ మిషనరీలు క్రైస్తవమిషనరీల కన్న మనల్ని ప్రమాదస్థితిలోకి తేగలరు మీ రీ జెండా లేవనెత్తకపోతే"

కొల్లూరి ధర్మారావు కవి బి ఏ

---

# వ్యాఖ్యానములు

## సత్యమూర్తిగారికే వోటు?

కాంగ్రెస్సు అసెంబ్లీలో ప్రవేశిస్తూ వుండంటే మాకేమీ ప్రసక్తి లేదు. ఆపక్షంలో యెవరు నెగ్గినా మాకు ఆక్షేపణలు కూడా లేవు; కాని కాంగ్రెస్సు మదరాసులో సత్యమూర్తిగారిని నిలిపింది. నిజంగా యిది మనమీద సవాలు!

మదరాసులో సగానికి పైగా మనవాళ్లున్నారు. మనలో వోటర్లు కూడా ఎక్కువే. మన వోటిచ్చి సత్యమూర్తిగారిని నెగ్గించడం అంటే మన వేలితో మన కన్ను పొడుచుకోవడం అన్నమాట. అసలు సత్యమూర్తిగారికి వోటు చేయడమే మనకి మనం పరాభవం చేసుకోవడం.

ఇలాంటి సందర్భంలో మరో జాతివాళ్లయితే యీ నిర్ణయాన్ని దృఢంగా ఆక్షేపించి వుందురు. మొన్నమొన్న — హైదరాబాదుకి సంబంధించిన కాంగ్రెస్సు వ్యవహారంలో వొక ఆంధ్రుడు కాంగ్రెస్సు ఆఫీసులో (జీతపు) సెక్రటరీగా వుండడాన్ని వామనరామచంద్రనాయకుగారు తీవ్రంగా ఆక్షేపించారు; కాని సత్యమూర్తిగారిని నిర్ణయించినందుకు మనవాళ్లేమీ మాట్లాడలేదు. పైగా మనవాళ్లే— మన ఆంధ్రపత్రికే సత్యమూర్తిగారికి జయం కలిగించాలని తాపత్రయం—చెప్పుకుంటే సిగ్గు.

సత్యమూర్తిగారి వాగ్ధాటీవల్లా, యెత్తులవల్లా ప్రజలలో తనమీద భక్తివిశ్వాసాలే ప్రబలుతాయో, నిరసనభావమే కలుగుతుందో చూసుకోవలసిన పూచీ కాంగ్రెస్సుదే; కాని సత్యమూర్తిగారు, అసెంబ్లీలోకి వెడితే ఆంధ్రజాతీయతకి తీరని అపకారం చేస్తారు. ఇది ముమ్మాటికీ నిశ్చయం. అసలు, వారి దీక్షే యిదీ.

ఆవెళ్లడంలోనూ తెనుగువారి సాయంవల్లనే వెళ్లడం. ధిక్!

ఇంతకీ: సత్యమూర్తిగారు మనకి చేసే అపకారం యేమిటంటే? దానికి వారిదివరకే పునాదులు వేశారు. మొన్నటి ఏప్రిలులో బరంపురంలో జరిగిన ఓఢ్రయువజనుల రెండో సమావేశపు కార్యక్రమం వొకమాటు చూస్తే యీ సంగతి బాగా బోధపడుతుంది.

అసలు శ్వేతపత్రమే కొంత తెనుగుభూభాగాన్ని ఓఢ్రరాష్ట్రంలో కలుపుతోంది. ఇలాంటి సందర్భంలో శ్వేతపత్రంలో సూచించబడ్డ సరిహద్దులతో ఓఢ్రరాష్ట్రం లాభకరం కాదని, అందులో చేర్చబడని జయపురం, పర్లాకిమిడిపట్టణం, తత్సంస్థానం, మాళువాలు, మందసా, టెక్కలి, జలంత్రా, బుడారిసింగి, సింగుభూమి, ఫుల్‌జారు మొదలయిన స్థలాలన్నీ ఓఢ్రరాష్ట్రంలో కలిపించుకుని తీరాలని సత్యమూర్తిగారు ఓఢ్రయువకులను పురెక్కించారు. ఈమాటలతో వారు అసభలో తీర్మానాన్ని నెగ్గించారు. ఆసభలో తీర్మానాన్ని సత్యమూర్తిగారే ప్రతిపాదించారు కూడాను.

ఏవంగుణవిశేషవిశిష్టులయిన సత్యమూర్తిగారికి మనవాళ్లు ఓటు చెయ్యవలసిందేనా?

మన ప్రముఖులు కాంగ్రెస్సులో చేరి త్యాగం చేస్తున్నారంటే "అది యేమిటో చెప్మా?" అనుకున్నాం. ఇప్పుడు బోధపడింది.

## ఇప్పటికీ, యెప్పటికీ, కూడా

"మీకు చేతనైతే యెదట నిలవబడండి. మేము హిందీప్రచారం మానం. ఇంకా అధికంగా కూడా చేస్తాం. మాకు చెవకొల్ల పెద్ద ఆసరా— పెద్ద పెద్ద జీతాలిచ్చే ఏర్పాటులున్నాయి. జటిలమైన

కార్యక్రమం వుంది. మీ రాతల వల్ల మా హిందీ ప్రచారాని కేమీ అడ్డు రాదు" హిందీప్రచారం చేస్తూ వున్న ఆంధ్రసోదరు లిలా సవాల్ చేస్తున్నారు.

ఈ సవాలుకి మేము హృదయపూర్వకంగా స్వాగతం యిస్తున్నాము.

అయితే: మే మిప్పు డెవరికీ జీతా లివ్వడం లేదు. ఇవ్వాలేము; కాని మాకూ కార్యక్రమం వుంది.

సామాన్యభాషకోసం మనం యిప్పు డింత హైరానయిపోవడం యెంత అనవసరమో, హిందీ వల్ల తెనుక్కి యెంత అపకారం జరుగుతోందో, వీధిలో నిలబడివుండవలసిన హిందీ తెనుగులోగిళ్లలోకి చొరబడరావడం తెనుగువారి కెంత సిగ్గుల చేటో, తెనుగువారే యెలాగ తెనుగుమీద దండెత్తుతున్నారో బోధపరిచి, తెనుగువారిలో కొందరి నేనా మాతృభాషారక్షణకోసం పరభాషల నెదిరించే టంతటి అభిమానవంతులు గానూ, శూరులు గానూ, ధీరులు గానూ, నిజమైన తెనుగుతనం కల వారిని గానూ తయారు చేసుకోవడమే యిప్పటికి మా కార్యక్రమం.

మా శక్తికొద్దీ దీన్నే మే మిప్పు డాచరణలో పెడుతున్నాం.

అయితే: సాగినా సాగకపోయినా హిందూస్థానీ వచ్చి, తెనుగుని చంపేసి, తెనుగు యిళ్లల్లో తమ హిందీని ప్రవేశపెట్టడానికి ప్రయత్నించడంలో కొంత అర్థం వుంది. వారి నెదురుకోడానికి కూడా మేము నిశ్చింతగానూ, నిష్కర్షగానూ సిద్ధపడగలం; కాని వారి విరాళాలవల్లా, వారి పర్యవేక్షణం కిందా సంహారకార్యక్రమం ఆమలులో పెడుతూ వున్న సంస్థలో జీతాలు తింటూ తెనుగు మీద దండెత్తే తెనుగువారినే మే మిప్పు డెదురుకో వలసివచ్చింది.

దీన్ని బట్టి తెనుగు జాతి యిప్పు డెలాంటి స్థితిలో వుందో, ఇలాంటి పరిస్థితుల్లో కార్యసాఫల్యం దాకా అక్కర్లేదు, జనానుమోదాన్ని పొందడం యెంత కష్టమో, యిది యెంత దౌర్భాగ్యస్థితో హిందీప్రచారకులు కొంచెం యోచించవలసి వుంది.

కాని, మా మీద వారిలాగే నిశ్చింతగా సవాలు చేస్తూ వుండవచ్చు. తమకి గల వెనక ఆసరాని బాగా పూర్తిగానే వినియోగపరుచుకోవచ్చు. వారిని మే మేమీ ఆక్షేపించం.

ఏ జీతమూ, నాతమూ లేని సినేటు, సిండికేటు సభ్యులే తెనుగులో విద్యావిధానం యేర్పరిస్తే దేశం ధ్వంసం అయిపోతుం దని, జాతి అజ్ఞానాంధకారంలో కూలిపోతుం దని, గోల చేసే టప్పుడు బోలె డేసి జీతాలు పుచ్చుకునే యీ హిందీ ప్రచారకులు ఇలాగ సవాల్ చెయ్యడంలో వింత యేమీ లేదు.

మంచిదే. ఈ పోరాటంలో ఇప్పటికీ ఎప్పటికీ కూడా మేము కటిబద్ధులమే. మా మాతృభాష మీద విరుచుకు పడే ఆపతు నెదురుకోవడంలో యేమి తటస్థపడినా మా కానందమే.

## మిగిలిపోవు, రెట్టింపు తెలుస్తాయి

"........అయితే ఈ గ్రంథాలను పాఠశాలలలో ప్రవేశం కలిగించవలసిం దనే వారిలో నేను చేరను. ఏమంటే ? ఈభాష సులభమే; కనుక గురువుల బోధతో దీనికి అవసరం వుండదు. విద్యార్థిదశ కాస్తా దీని పఠనంతో సరిపోతే గురుశుశ్రూష చేసి తెలిసికొనే విషయాలు మిగిలిపోతాయి. కాబట్టి గ్రాంథికభాష నే వాడుక చేయుడమ్మొక్కటీ అవసరం........"

కృష్ణాపత్రిక (౬-౧౨-౩౪)

పాఠ్యగ్రంథాలు గ్రాంథికంలోనే వుండా లని ప్రతిపాదిస్తూ శతావధాని చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారిలా అన్నారు.

ఏవిషయంలో నేనా సరే గ్రంథాలు రాయ తగ్గది గ్రాంథికమా, వ్యావహారికమా అనే తగువు చాలా రోజుల కిందటే తేలిపోయింది. ఇప్పుడు వ్యావహారికంలోనే అనేక గ్రంథాలు ప్రకటించ బడుతున్నాయి. 'మాలపల్లి' వంటి ఉద్గ్రంథాలు పాఠశాలలలోనే కాదు, కళాశాలలలోకూడా నిరాఘాటంగా ప్రవేశిస్తున్నాయి. ఇది యిలా వుండగా, మొదట గ్రాంథికమో అని పాకులాడి నవారనేకులిప్పుడు వ్యావహారికంలోకి బదిలీ అయిపోతున్నారు. పైగా వ్యావహారికంలో రచన సాగించినవారెవరూ గ్రాంథికంలోకి దిగిపోవడం లేదు. కనక యిప్పుడు వ్యావహారికాన్ని కించపరచ పోతే సాగేదీ లేదు, గ్రాంథికాన్ని గొప్ప చెయ్య పోతే వొరిగేదీ లేదు.

ఇక వున్న దల్లా యేమిటంటే?

వ్యావహారికం సులభమే; కాని దాన్లో వున్నది సౌలభ్యం వొక్కటే కాదు. అందులో జీవం వుంది. హృదయాన్ని తాకించే శక్తి వుంది. యుగయుగాల నుంచి సంచితం అవుతూ వుండే జాతీయత వుంది. రసానుభవం కలిగించే రీతి వుంది. అంచేత విషయం గంభీర మయిన కొద్దీ వ్యావహారికమున్నూ జటిలం అవుతూనే వుంటుంది. తరగతుల వరసని విద్యార్థికి భాషాపరిచయం క్రమాభివృద్ధి పొందుతూనే వుంటుంది; కాని గ్రంథకర్త యొక్క పాండిత్యాన్ని పట్టి గురువు బోధించవలసిన మెలుకువలు వ్యావహారికంలో అనేకాలుంటూనే వుంటాయి.

ఇంతే కాకుండా, గ్రాంథికం బోధించినకొద్దీ శిష్యుడి బుద్ధి గమొగొయ్యి అయిపోతుంది. అసలు గురువునే అడుగడుక్కీ సంశయాలు పీక్కు తింటూ వుంటాయి.

వ్యావహారికం బోధిస్తూ వుంటే గురువుబుద్ధి పండు వెన్నెల లాగా, పిల్లగాలి లాగా ప్రసన్న భావం తాలుస్తూ వుంటుంది. శిష్యుడి బుద్ధి గులాబీ పువ్వులాగ వికసిస్తూ, గుబాళిస్తూ వుంటుంది. కనక, వ్యావహారికానికి గురువుల బోధతో అవసరం వుండ దనడానికి వీలు లేదు.

ఇక విషయాల సంగతి. ఈసందర్భంలో వేంకటశాస్త్రిగారింకో మాట ఆలోచిస్తే బాగుంటుంది. ఏమంటే? విషయం కోసం భాష; కాని భాష కోసం విషయం కాదు. ఇంతే కాక: విద్యార్థికి ప్రధాన మైనది విషయపరిజ్ఞానం; కాని భాషాపాండిత్యం కాదు. అసలు సూదితో దారం వచ్చేటట్టు విషయంతో భాష వస్తూనే వుంటుంది. కాగా, వ్యావహారికం సులభమే; కనక, విద్యార్థికి భాషకోసం గడపవలసిన కాలం కూడా విషయ బోధకే వినియోగపడుతుంది. అంటే, భాష కఠిన మయినప్పుడు తెలిసే విషయాల కంటే భాష సులభ మయినప్పుడు రెట్టింపు విషయాలు తెలుస్తాయి. ఇది మంచిదే కాదూ? కావలసిందే కామా? విద్యా విధానంలో ఆవశ్యమూ అవలంబించవలసిన పద్ధతే కాదూ?

## నమ్మండి. చివరికి వుర్దూ

హిందూదేశానికి సామాన్యభాష హిందీ అని, దానికి లిపి దేవనాగరి అని కాంగ్రెస్సు చెబుతోంది. దక్షిణ భారతదేశంలో దీన్ని గురించి బ్రహ్మాండ మైనంత ప్రచారం జరుగుతోంది. మన ఆంధ్రులు కొందరు హిందీ తమ సొంత భాష అన్నంత ఆవేశంతో ఆప్రచారంలో పాల్గొంటున్నారు.

కాని మాహమ్మదీయులు ఈహిందీని, దేవనాగరిలిపిని అంగీకరించడం లేదు 'వారు వుర్దూభాషని సామాన్యభాషగా వాడా లని; దానికి లిపిగా పార్శీ వాడా లని, చెబుతున్నారు.

దక్షిణభారతదేశీయులకు మాహమ్మదీయుల ఈప్రతిఘటనం తెలవదు.

కాని యిది జాగ్రత్తగా ఆలోచించ తగ్గ విషయం. "హిందూదేశానికి సామాన్యభాష యేది?"

అనేతగు వింకా పరిష్కారం కాలేదు. ఇది తీవ్ర రూపం దాల్చే రోజులు ముందే వున్నాయి.

నిజానికి వుర్దూ మాట్లాడేవాళ్ళకంటె హిందీ మాట్లాడేవాళ్ళే యెక్కువ వున్నారు; కాని ఉత్తర దేశం అంతటా—హిందీ యెక్కడ పుట్టిందో, యెక్కడ నాడుకలో వుందో, యెక్కడనుంచి మన తెనుగుదేశం మీదకి వురకలు వేసుకుంటూ వస్తోందో అక్కడ కూడా కోర్టుభాష వుర్దూ కాని, హిందీ కాదు.

భారతసంవారు సైన్యానికి సంబంధించిన వ్యవహారాల్లో వాడేది కూడా వుర్దూ కాని హిందీ కాదు.

ఇది యిలా వుండగా, మాటిమాటికీ— ప్రసక్తి వచ్చినప్పుడల్లా—సందర్భం కానప్పుడు కూడా దక్షిణభారతదేశీయులకు "హిందీ నేర్చుకోండి" అని నిక్కచ్చిగా హితబోధ చేస్తూ వున్న గాంధిగారు కాంగ్రెస్సులోనుంచి వెళ్ళిపోతూ వెళ్ళిపోతూ, కాంగ్రెస్సు సభ్యతను కోరే దరఖాస్తులలో హిందీలో గాని వుర్దూలోగాని సంతకాలు చెయ్యాలని శాసించారు. మొన్న బొంబాయిలో జరిగిన కాంగ్రెస్సులో కొందరు వుర్దూలో సంతకం చెయ్యడం నేర్చుకున్నారుట కూడానూ.

ఏం?

అసలు, భాషైకరాష్ట్రసిద్ధాంతాన్ని అంగీకరించి ఆచరణలో పెడుతోం దన్న కాంగ్రెస్సు ప్రాంతీయభాషలలో కాక అన్నిప్రాంతాలవారినీ హిందీలో సంతకాలు చెయ్యమనడమే స్వవచనవ్యాఘాతం. అందులోనూ వుర్దూలో కూడా సంతకాలు చెయ్యవచ్చు ననడం మరీ తప్పు.

దీనివల్ల గాంధిగారు కూడా మాహమ్మదీయుల ప్రతిఘటనాన్ని ఎదురుకోలేకపోయా రని స్పష్టమే.

హిందీమగులకిది మంచి గుణపాఠం. ఎరగనేర్చుకుంటే హిందీకోసం ఖర్చుపెట్టే డబ్బూ, గడిపే కాలమూ అంతా బూడిదలో పోసిన పన్నీ రయిపోతుం దని వారికి వేరే చెప్పనక్కర లేదు.

ఇంకొకటి కూడా వారు గ్రహించవలసి వుంది. ఏమిటంటే? సామాన్యభాషను గురించి మాహమ్మదీయులు ఏమీ శ్రద్ధ చెయ్యడం లే దంటే యేమన్న మాట? ప్రస్తుతం సామాన్యభాషగా చెలామణీ అవుతూ వున్న ఇంగ్లీషుని తప్పించేసి ఆస్థానంలో మరోభాషని ప్రవేశపెట్టడానికి ముందు సంపాదించుకోవలసిన హక్కులు చాలా వున్నాయి. వాటికి సాధనంగా బలపరచుకోవలసిన—గడించుకోవలసిన యోగ్యత చాలా వుంది.

## కచ్చితంగా చెప్పండి

హిందీ మనకి 'సామాన్యభాష' అని కొందరూ, 'జాతీయభాష' అని కొందరూ అంటున్నారు. ఈరెండింటికీ అర్థంలోనూ, వినియోగంలోనూ చాలా భేదం వుంది. ఇది కాక: దక్షిణభారతహిందీప్రచారసభవారూ, హిందీమహావిద్యాలయంవారూ, వారికి ఆజ్ఞలు సాయించేవారూ, వారి ననుసరించేవారూ చేస్తూ వున్న ప్రచారం చూస్తే వారందరి వుద్దేశమూ దక్షిణదేశభాషలను చంపేసి, వాటి స్థానంలో పూర్తిగా హిందీని ప్రవేశపెట్టడంగా స్పష్టంగా కనపడుతోంది. అవునా కాదా? ఈవిషయం ప్రజలకి స్పష్టంగా తెలవాలి.

ఈ సంగతి తేలాలంటే దక్షిణభారతహిందీప్రచారసభవారూ, హిందీమహావిద్యాలయంవారూ ఈక్రింది ప్రశ్నలకు కచ్చితంగా జవాబులు చెప్పాలి. వారు దేశభాషలవిషయంలో తమకి దుశ్చింత లేదని మాత్రమే అంటే చాలదు.

### స్వరాజ్యం వచ్చాక

౧. హిందూదేశాన్ని భాషైకరాష్ట్రంగా విభజించడం వారి కార్యక్రమంలో వుందా లేదా?

౨. అలా విభజించినప్పుడు ఆయా రాష్ట్రాల శాసనసభలలోనూ, సకల న్యాయస్థానాలలోనూ, కార్యస్థానాలలోనూ, సకలవ్యవహారాలూ ఆయా రాష్ట్రాల భాషలలోనే జరపాలా, హిందీలో జరపాలా?

౩. ఆయా రాష్ట్రాలలో ప్రాథమికపాఠశాలలు మొదలు కళాశాలలవరకూ— విశ్వకళాపరిషత్తులలో కూడా విద్యావిధానమూ, వ్యవహారమూ అంతా ఆయా రాష్ట్రాల భాషలలోనే జరపాలా హిందీలోనా ?

౪. మన విద్యావిధానంలో ఇంగ్లీషుకి స్థానం వుండాలా అక్కర లేదా? వుంటే ఏ తరగతి మొదలుకుని ?

౫. స్కూలుఫయినలులో తప్ప మరే కింది తరగతిలోనూ హిందీని ప్రవేశపెట్టకుండా వుంటారు కాదూ ?

౬. స్కూలుఫయినలు మొదలు పైతరగతులలోనేనా కేవలమూ వ్యవహారం నడిపించుకోడానికి తగినంత మాత్రమే తప్ప సాహిత్యం కోసమూ, పుస్తకాలు రాయడానికీ, పత్రికలు నడపడానికీ, అవసరం అయేటంత హిందీని నేర్పే విధానం యేర్పరచరు కాదూ ?

౭. సామాన్యభాషని వాడవలసిన సమయాలు ఆయా రాష్ట్రాల వారికి ఇతరరాష్ట్రాల వారితో సంబంధం కలిగినప్పుడే తటస్థిస్తాయి కాదూ ?

౮. ఆయా రాష్ట్రాలవారు తమలో తమకి పని కలిగినప్పుడు రాతలలోనూ, సంభాషణలలోనూ, వినోదాలలోనూ—సకలసందర్భాలయందూ మాతృభాషని తప్ప మరో భాషని వాడడం దేశద్రోహమూ మాతృద్రోహమూ అనిపించుకుంటాయి కాదూ !

౯. సామాన్యభాషయొక్క ప్రయోజనం కేంద్ర ప్రభుత్వంలోనూ, కేంద్రశాసనసభలోనూ, కేంద్ర న్యాయస్థానంలోనూ, భిన్నభాషలు వాడుకలో వుండే పట్నాల—నగరాల బజారులలోనూ మాత్రమే కాదూ ?

౧౦. ఆయా రాష్ట్రాల ప్రభుత్వవ్యవహారాలకూ, ప్రజలవ్యవహారాలకూ సంబంధించిన యావత్తు కాగితాలూ కేంద్రప్రభుత్వానికీ, కేంద్రశాసనసభకీ, కేంద్రన్యాయస్థానానికీ పంపవలసివస్తే వాటిని సామాన్యభాషలోకి అనువదించి మాత్రమే పంపాలి కాదూ ?

౧౧. ఆయా రాష్ట్రాలవారు—అంటే హిందూస్థానీలు తప్ప తతిమ్మా అన్ని రాష్ట్రాలవారూ కేంద్రప్రభుత్వనిర్వహణానికి సంబంధించినంతవరకే గాని తక్కిన హిందీసామ్రాజ్యానికి ఏవిధమైన పోషణా చెయ్యవలసిన పని లేదు కాదూ ?

౧౨. ఇతరరాష్ట్రాల ప్రభుత్వాలతోనూ, కేంద్ర ప్రభుత్వంతోనూ అధికారికమైన ఉత్తరప్రత్యుత్తరాలు జరపవలసిన పూచీగల ఉద్యోగులకు తప్ప తతిమ్మా యేవుద్యోగులకీ హిందీలో పాండిత్యం వుండవలసిన నిర్బంధం లేదు కాదూ ?

౧౩. హిందీటాకీలవల్ల ఆయా రాష్ట్రాల భాషల టాకీలకీ, హిందీగ్రామోఫోనుప్లేట్లవల్ల ఆయా రాష్ట్రాల భాషల ప్లేట్లకీ నష్టం రాకుండా వుండేటంత బిగువుగా నిబంధనలు చెయ్యాలి కాదూ ?

౧౪. పైని పేర్కొన్న రెండు సభలవారూ నడిపే విద్యావిధానంలో హిందీలో సాహిత్యజ్ఞానం కలగడానికే; కాని వ్యవహారజ్ఞానం కలగడానికి తగిన పాఠ్యక్రమం యేమీ లేదు కాదూ ?

౧౫. ఇప్పుడు ఇంగ్లీషుని విడిచిపెట్టి హిందీతో నెరవేర్చుకోతగిన పను లేమీ లేవు కాదూ ?

౧౬. హిందీని పైకి తెచ్చిన కాంగ్రెస్సులో కూడా ఇప్పుడు హిందీకి తగిన స్థానం లేదు కాదూ?

౧౭. తెనుగు గ్రంథకర్తలు నిరుత్సాహపడిపోతూవుండగా, తెనుగు గ్రంథప్రకాశకులు దిగనారిపోతూవుండగా తెనుగు గ్రంథాలయాలు హిందీ గ్రంథాలతో నిండిపోతూ వుండడం దౌర్భాగ్యానికి సూచన కాదూ ?

౧౮. తమ మాతృభాష హీనస్థితిలో వుండగా దాన్ని స్మరించక ప్రలోభనాలకు లోబడి హిందీ ప్రచారం చెయ్యడమే కాకుండా తెనుగు యువకులు మాతృభాషాసేవకులమీద సవాళ్లు చెయ్యడం అసభ్యం కాదూ ?



# ప్రబుద్ధాంధ్ర

కలాభిజ్ఞగోష్ఠీపరిషత్తుచేత ప్రకటింపబడు మాసపత్రిక

సంపాదకుడు:—శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

సంపుటము ౫ } రాజమహేంద్రవరము డిశంబరు ౧౯-౩౮ { సంచిక ౧౨


## ప్రదోషం

కాశీసోమయాజుల శ్రీనివాసమ్మగారు.

(చిరంజీవిని శ్రీనివాసమ్మ విజయనగరం, మహారాజావారి కాలేజీలో ఛీఫ్ లెక్చరరు బ్రహ్మశ్రీ కాశీసోమయాజుల రామమూర్తిపంతులు ఎం. ఏ గారి సుమమరాలు. ప్యారీశంపేట ఇన్‌స్పెక్టరు బ్రహ్మశ్రీ కాశీసోమయాజుల వేంకటరమణరావుగారి కొమార్తె. ప్రధానాంధ్రోపాధ్యాయులు బ్రహ్మశ్రీ మల్లాది విశ్వనాథకవిరాజుగారి శిష్యురాలు. వయస్సు పదిహేనేళ్ళే; కాని వర్ధమానచంద్రకళ. నిశితప్రతిభావంతురాలు. కాశీనగరమునందలి హిందూ యునివర్సిటీవారి మెట్రిక్యులేషను పరీక్షకు చదువుతున్నది. ఈమె భవిష్యజ్జీవితం తేజస్వంతమై ఆంధ్రనారీలోకానికి విశిష్టత సంపాదించబోతుం దని నమ్మడానికి బలమైన సూచన లున్నాయి. సరళమైన భావనాబలమూ, మధురమైన కవితాధారా, శక్తివంతమైన తన్మయీభవనయోగ్యతా కల శ్రీనివాసమ్మ రచన సంపాదించగలిగినందుకు మేము మిక్కిలీ గర్విస్తున్నాము.

సంపాదకుడు)

ప్రాగ్దిశాకాంతకు భానుడేమికావలెనో—అతడరుణదృష్టులతో కొఱకొఱ చూస్తూ దవ్వుదవ్వుగా పోతున్నాడామెనుంచి. వాని హృదయం రాగమయమో క్రోధపూర్ణమో తెలుసుకోనయత్నింపకుండనే నక్షత్రాలంకారముల నమర్చుకుంటూ వున్నది తూర్పుదిక్కు. ఈయలంకారమంతా తన కొఱకే అని భావించుకొని రాగరసంతో వుబ్బిపోయి దోబూచులాడుతున్నాడు చంద్రుడు. చిరకాలమిత్రుడికి మల్లే చంద్రుడికి స్వాగత మిస్తూ వుంది తూర్పుదిక్కు. తన హృదయ మెట్లున్నా వెలుపలికి మాత్రం చల్లదనమూనే ప్రకటిస్తూ ఒరులకు కానరాకుండా ప్రాగ్దిశ యొడలారసికొని పరుగిడుతున్నాడు ప్రభంజనకుమారుడు. ఆసూర్యుణ్ణి, ఈచంద్రుణ్ణీ నడుమ వచ్చిన యీ ప్రభంజనుణ్ణీ చూచి తాను తన సంపూర్ణకుటుంబము నడుమ నున్నట్లు మురిసిపోతూ వుంది తూర్పుదిక్కు.

ఈ విచిత్రనాటకములు చూస్తూ తన్ను తాను మరచిపోయింది కళ.

కళ వొక దేవీస్వరూప మని వాడుక. ఆపల్లెలోని వృద్ధులు మొదలుకొని పసిబిడ్డల వరకు అందరూ ఆమెను హృదయపూర్వకంగా ఆరా

ధిస్తారు.......ఎందుకంటే—ఆమె వచ్చిన తర్వాత ఆవూళ్లో పాడిపంటలు చాలా హెచ్చయిన వట. ఒకడు చంద్రుని చూచి ఆ మొఘం చూచినాడట—ఆనెలలో ౭౦౦ లాభం వచ్చిందట వాడికి. ఇంక అందరూ మంచముల మీద నుంచి లేచి...

కళ ప్రకృతికి ముద్దుబిడ్డ. ప్రకృతి వొళ్లో ఆడుకొంటూ ఆమె వొక్కొక్కప్పుడు తన్నే మరచిపోతూ వుంటుంది. ఒక్కొక్కప్పుడు మెలకువతో ఈ విచిత్రనాటకం చూస్తూ దీనికి నాయికో నాయకు లెవరా అనుకొంటుంది. ఒక్కొక్కప్పుడు స్వప్నసామ్రాజ్యంలో సంచరిస్తూ ఛాయావ్యక్తులను పలకరిస్తూన్నట్లు పలవరిస్తుంది. ఇప్పుడీ అవస్థలో వుంది కళ.

ఇంతలో కళకు కండ్లు మూసే రాకరు—

'శ్యామం ?'

'చతుర్దశలోకాలూ ఒక్క రీలులోనే తిరిగిపోతున్న వేమో యీ మాటిని పెర్ఫారమెన్సులో?'

'రోజంతా తలుపు మూసుకొనే కూర్చున్నా వేం గదిలో ?'

'కళాదేవి నుపాసిస్తున్నా.'

'సంగీతం పాడుతూన్నట్లు లేదు—కవిత్వం కడుతున్నావా ?'

'కవిత్వానికి దశ మళ్లిపోయింది...చిత్రకళ...'

'అబ్బ! పైమెట్టే! ఏదీ ఏదీ'

కళ ముఖం వికసించింది; శ్యామం హృదయం త్రుళ్ళింత లాడింది. కళ పెదవి విరిచింది; శ్యామం ముఖంలో నెత్తురు విరిగిపోయింది.

'రచన చాలా బాగానే వున్నది గాని మళ్లీ పురాణఫక్కిలో పడ్డావేం ?'

'సుభద్రార్జునులు—వారు పురాణదంపతులైనా వారి ప్రేమ నిత్యయవ్వనం గలది. అయితే నీ కిది నచ్చలే దన్న మాట ?'

'నువ్వు వ్రాసేవు గనుక నాకు చాలా చాలా నచ్చింది'

అతని పెదవులపై చిరునవ్వు తళుక్కున మెరసి వెన్నెలను వెక్కిరించింది.

'కళా! నిజంగా నీకు నామీద ఇంత ప్రేమ వుందీ?'

'బాగుంది! చాలా చక్కగా అడిగేవు! నిన్ను కాకుంటే ఇంకెవరిని నేను ప్రేమించవలె ?'

'అయితే నా యింగ్లాండు ప్రయాణం నీకు బాధగానే వుంటుం దేమో !'

'బా ధెందుకూ ? నువ్వు ఐ. సి. యస్ పట్టా పుచ్చుకొని కలక్టరుగా వచ్చి యిండియా అంతా వుద్ధరిస్తూ వుంటే చూడడానికి నాకు ఆనందం గాదూ? కాని వచ్చేటప్పుడు ఒక పట్టాతోనే రావలె నని నాకోర్కె.'

ఇరుపైపులనుండీ తరుచు బడుతూ వున్న చెవుల పిల్లిలా గున్నాడు శ్యామం.

... ... ... ...

'నిన్నటి కథ పూర్తిగా చెప్పివేయి. ఉమాబాల యెవర్ని చేపట్టింది? బాలచంద్రుడు గతి యేమైంది?' అంది కళ.

'తెల్లవారుఝామున జయలుదేరి నేను దూర దేశం వెళ్ళిపోతూ వుంటే ఇప్పుడు ఆత్మకథ కాకుండా పైకథ లడుగుతావేం ?'

'ఆత్మకథల కేముంది? ఎవరికి తెలియంది గనుక? ఇంతకీ ఆత్మవిషయం విస్మరించినప్పుడే ఆనందం. చెబుదూ—ఉమాబాల యెవర్ని పెండ్లాడింది? బాలచంద్రుడు—'

'తన్ను పెండ్లాడకపోయిన తర్వాత యింకెవరిని పెండ్లాడితే నేం ! బాలచంద్రుడికి మాత్రం తన జీవితంలోని సౌఖ్యం అంతరించిపోయింది. లోకమంటే అతని కగ్నిహోత్రం లాగు కనబడ్డది—'

'సరే. వెర్రెత్తిపోయి దిక్కుమాలి దేశాల వెంబడి తిరుగుతున్నా డనో సన్యాసం పుచ్చుకొని లోకం విడిచి ఏకాకిగా యేమూలనో వున్నా డనో లేకుంటే దుఃఖభారం సహించలేక ఆత్మహత్య

చేసుకున్నా డనో కవిశేఖరుడు కథ ముగించి వుంటాడు.'

'లేకుంటే యింకెట్లా ముగించవలె?'

'మరో మార్గం లేదా? ఔనౌను. ఉన్న దేమో లోకసహజ మైన మార్గం—ఉత్తమమార్గం. అది కావ్యాలలో పనికిరాదాయె.'

'ఏమది? చెబుదూ'

'ఉమాబాల ఒకడిని పెండ్లాడి యేలాగు సుఖంగా వుందో అలాగే బాలచంద్రుడు కూడా యింకొకతెను పెండ్లాడి సుఖంగా వుండడం రెండు కుటుంబాలూ అన్యోన్యంగా వుండడం—కథలకి కవీశ్వరులు ఇటువంటి పరిసమాప్తి యివ్వరేం?'

'చా చా! ఇందులో కల్పన యేముంది? రస మేముంది? కవిత్వ మేముంది?

'ఔనౌను. బాలచంద్రు డధోగతి పాలై పోయినా డంటే లోకానికి ఉమాబాలమీద వొల్లమాలిన ఆగ్రహం వస్తుంది. అదే కాబోలు రస మంటే?'

'పోనీ గాని అంత ప్రేమించిన బాలచంద్రుణ్ణి'

'బాగుంది. తనకు ప్రేమ లేనప్పుడు ఆమె యింకేమి చేస్తుంది? ప్రేమించిన వాళ్ళ నందరినీ ప్రేమించడం స్త్రీకి వశమా? అది విధా? అలాగు చేయక పోవడం తప్పా? ఏమిటి శ్యామం—ఇంగ్లీషులో మహామహా గ్రంథా లన్నీ చదివే నంటావు—ఇదే నా నీకు గల్గిన లోకజ్ఞానం?'

'పోనీ—ఉమది తప్పు కాదు. కాని బాలచంద్రుడు మాత్రం ఆమెపై ప్రేమచేత జీవితం త్యజించడం—'

'చాలా నింద్యం. అసహ్యం. నిజంగా నా కతగాడి మీద కనికారం కూడా కలుగదు. అతడి ధీరత్వాన్ని చూచి నవ్వుతాను. అంతే. తాను పురుషుడై వుండిన్నీ అవస్థ నతిక్రమించలేక—ఎదురుకోలేక తుదకు తట్టుకోలేక మేకపిల్లలాగు అవస్థకు లొంగిపోవడం కంటే లజ్జావహ మైన కృత్యం మరొకటి లేదు.'

'ఇది శాకుంతలం చెప్తున్నా దేమో?'

'శాకుంతలం— ఉత్తరరామచరిత్ర మాత్రమే కాదు భారతీయవాఙ్మయ మంతా కూడా. అది వీరపద్ధతి. కావలసిన ఆడది దొరకలేదని చచ్చిన వాడు కావలసిన కోటుగుడ్డ దొరకలేదని యెందుకు చావకూడదు? వాడికి లోక మెందుకు చంద్రశిలాప్రతిమ నిర్మించకూడదు?'

'పురుషుల హృదయతత్వాన్ని స్త్రీలు నిరూపిస్తే—'

'స్త్రీల హృదయతత్వాన్ని పురుషులు నిరూపించిన ట్లుండ దేమో?'

'నువ్వు చెప్పింది నిజమే లే. అదో పద్ధతి. అదీ కొందరికి నచ్చవచ్చు'

'ఆకొంద రెవరో చెప్పనా? నీవీరుణ్ణి మెచ్చుకొనే వాడు—ఇప్పటివారు—అనగా అతడి సమకాలికులు. నావీరుణ్ణి మెచ్చుకొనే వారు. పుట్టబోయేవారు. అనగా అతణ్ణి గాక అతని చర్యనే తెలిసినవారు'—

'నిజమే. ఒప్పుకొన్నాను—కాని నిన్న నిచ్చిన శశిరేఖాపరిణయం చదివేవా.'

'ఈరోజంతా నువ్వు సుభద్రార్జునులతో కూర్చుంటే మరి నేను చేసే దేమిటి? శశిరేఖాభిమన్యులతో ముచ్చటిస్తున్నా!'

'ఏలా వుంది గ్రంథం?'

'పద్యా లెంత మధురంగా వున్నవి!'

'భావములు?'

'అనుగుణ్యంగానే వున్నవి. రసం అదే పద్ధతి. కల్పనలు అవే'

'నాయికానాయకులు సంబంధం?'

'ఏముంది? లోకంలో చెలామణీ అవుతూన్న సంబంధమే'

విసుపు పుట్టింది శ్యామానికి. ఎప్పటికీ తన భావం తెలుసుకోకుండా వున్నదే—అంత ముగ్ధా! కొంటెతనమా?

'ఇంతవరకూ పైకథలు ప్రస్తావించేము గనుక ఇంక ఆత్మకథకు వస్తాం.'

'నువ్వు మహాత్ముడివి కాబోతున్నావు కనుక నీయాత్మకథ వినదగే వుంటుంది. నాకు చెప్పడానికేముంది? నువ్వు చెప్తే నేను ఊకొడతా.'

'నేను రేపు దూరదేశం వెళ్తున్నాను కదా నీ మనస్సు భారంగా లేదూ?'

'భరించలేనంత భారంగా వుంది.'

'అలాగు కనబడవే.'

'కనబడాల నని లేదు. కనుకనే ఆభావాన్ని బలవంతంగా తప్పించుకొంటున్నా.'

'రేపు నాతో విజయనగరం దాకా వస్తావు కదూ'

'వస్తా. వాల్తేరు దాకా కూడా వస్తునా అని ఆలోచిస్తున్నా'

'అక్కడనుంచి మళ్లేటప్పుడు నీమనస్సు చెల్లాచెద రయిపోదూ?'

'నీమనస్సో?'

'నేను రైలులోనుంచి క్రింది కురికివేస్తా నేమో!'

'చెప్పినానే. ఆఖీరుత్వమే నే నసహ్యించేది. ఆరైల్వే ప్లాటుఫారమును నువ్వొక నాటకరంగం చెయ్యదలంచుకొంటే నేను రానే రాను?'

'లోక మంతా నీలాగే శిలాప్రతిములు కావలె నంటావు నువ్వు'

'నేను శిలాప్రతిమను గాను. మానవకాంతను. అంతే.'

'అయితే నీహృదయంలో ప్రేమ వుందీ?'

'రామకోటిలాగు ప్రేమకోటి వ్రాసి భద్రాద్రి రాముడికి మల్లే నీకర్పించవలె నేమో!

'అయితే నేను ధన్యాత్ముణ్ణి. నేను తిరిగి దేశం వచ్చేసరికి ౪ ఏండ్లవుతా. ఇంతకాలం నువ్వు పెండ్లి లేకుండా నాకొరకు నిరీక్షించి వుంటావు?'

'తెలిసిన వ్నే యీనడుమ పెండ్లాడతా ననుకో— అయినా నీ సెలవులు చూసుకొనే పెండ్లాడతా. ఆబ్బ మొఖం చూచుకోక నామొఖం చూచి నువ్వు పెండ్లికి తప్పకుండా వచ్చి తీరాలి. క్షమాపణవుత్తరాలు పనికిరావు. తెలిసిందా? కావలిస్తే ఆపెండ్లి ముహూర్తం నువ్వే యేర్పాటు చెయి.'

శ్యామం ఆ తోటలోని చెట్లలో తా నొక చెట్టయి పోయినాడు.

"ఏం శ్యామం! ఏమది? ప్రాణంతోనే వున్నావా?"

"ఎంత నవ్వులాట అయినా అంత మోటుమాట కూడదు.'

అతని కళ్లు వింత భావాలను వెలిగ్రక్కుతున్నాయి. అతని ముగంలో అద్భుత తాండవిస్తూ వుంది. కావ్యభాషలో లతలలో ఆమె వక లత అయిపోయింది.

'సరే. రేపు ప్రయాణం లేను కొద్దిరోజులలో నిన్ను పెండ్లాడి మరీ నేను వెళ్తాను—అప్పుడైనా వెళ్లా లని బుద్ధిపుడితే.'

ఈతుది మాట వింటో లేదో చెవులు మూసుకొంది కళ. వొళ్లంతా ముచ్చెమటలు పోసింది. గుండె దడదడ కొట్టుకొంది. కాళ్లు చేతులు గజ గజ లాడసాగినాయి—

'శ్యామం! మనం పశువులమా!' అంది కళ. అతని ఆశాదీపిక చటుక్కున ఆరిపోయింది. నిరాశతో 'ఏమి' అని కాబో లన్నా డతడు.

'అన్నదమ్ములూ అప్పచెల్లెం డ్రనే భేదం లేకుండా—'

'నువ్వు నాచెల్లెలివా? నేను నీ యన్ననా?'

'అత్త మగవాడైనా నాన్న ఆడదైనా మనిద్దర మేమై వుందుము?'

'అయితే యింతకాలం నువ్వు వహించిన ప్రేమ సాంతాని కర్థ మేమిటి?'

'ఇదా నీవు పొసికట్టిన అర్థం! వెఱ్ఱివాడా! పవిత్రమైన ప్రేమకూ తుచ్ఛమైన మోహమునకూ సఖ్యం కల్పిస్తున్నావు. బుద్ధిమంతుడవే! భార్యాభర్తలకు సంబంధించిన దేనా ప్రేమ అంటారు? మనం ప్రకృతిని, తల్లిదండ్రులను, సహోదరులను. మిత్రులను, దేవదేవుని ప్రేమించలేదా? దానికి ప్రేమ అనే పేరు తగదా?'

'శ్యామం! నిన్ను సోదరుడవని భావించి ప్రేమిస్తున్నాను. క్షమించు.'

అతనికి పర్వతాగ్రంనుంచి పాతాళానికి పడిపోయినట్లయింది. కళ్లు చీకట్లు కమ్మాయి. ఏదో పురుగు తలలోని నరాలను కొరికివేస్తూ వుంది. ఓర్చుకొన్నాడు. నవ్వగలిగినాడు—మాటాడగలిగినాడు!

'అమ్మా! నువ్వు చెప్పింది నిజం. మనం ఆలుమగలం కావడం కంటె అన్నా చెల్లెలూ కావడం ఎంత యుక్తం! దూర మాలోచించినావు. మంచి చెప్పి విచారిస్తావేం? లే. ఏడవకు' అన్నాడు శ్యామం.

కళకు చీకటిలోనుంచి వెలుగులోకి వచ్చినట్లయింది. శ్యామం ఇంతకు ముందే వెలుగులోనుంచి చీకటిలో పడ్డాడు. పట్టరాని సంతోషంతో ఒక కేక వేసి కళ అతణ్ణి కౌగలించుకొంది. శ్యామం చిన్నబిడ్డను తీసుకొన్నట్లు ఆమెను గట్టిగా కప్పుకొన్నాడు.........కాని వేళ వుండగానే కోడికూతకు ముందే శ్యామం బయలుదేరి వెళ్లిపోయినాడు. ప్రక్కమీదనుంచి లేవడమే కళ కంటికి ౪ ఏండ్ల కాలం కాలరూపంతో సాక్షాత్కరించింది.



# జెసూటు వృత్తాంతములు

మల్లంపల్లి సోమశేఖరశర్మగారు



క్రైస్తవమతమునందలి రోమను క్యాథలిక్కు శాఖా చారిత్రమున క్రీస్తు శకము పదునారవ శతాబ్ది ప్రథమపాదము ఒక స్మరణీయ మయిన ఘట్టము. ఆకాలమున ఒక వంక జర్మనీదేశమున మార్టిను లూథరు అమాయకు లగు ప్రజల మూఢవిశ్వాసము అను లోకువగా గొని రోమను క్యాథలిక్కు పీఠాధిపతు లగు పోపులు చెలాయించు నిరంకుశకపటాధికారమునకు దన యసమ్మతిని దెలుపుచు, కొన్ని కొన్ని విషయములందు వారిని ధిక్కరించి విప్లవధ్వజమును లేవనెత్తుచుండ వేఱొక వంక స్పెయిను దేశమున వారి యధికారము నింకను దృఢముగ బాదుకొల్పి మఱింత ప్రోది సేసి వారికి దివ్యనీరాజనముల నర్పించుటకు సెయింటు ఇగ్నేషియస్ మతాభినివేశముతో తీవ్రప్రయత్నములు సలుపుచుండెను. ఈ రీతిని రోమను క్యాథలిక్కుమత ప్రపంచ మంతయు నల్లకల్లోల మయిన కాల మది.

ఆకాలమున క్రీ.శ. ౧౫౩౪వ సంవత్సరమున తమయొక్క, తమ యిరుగు పొరుగు వారియొక్క ఆధ్యాత్మికాభివృద్ధికి పాటుపడు నిమిత్తము లయోలా సెయింటు ఇగ్నేషియస్ అను స్పెయిను దేశస్థుడు 'యేసుక్రీస్తు సంఘము' అను పేర నొక సంఘమును స్థాపించెను. ఈసంఘసభ్యు లెల్లరు

దారిద్ర్యమును వరించి, బ్రహ్మచర్యమును పాటించి, తమ సంఘాధ్యక్షునికి పరమాజ్ఞానువర్తులయి మెలంగవలెను. ఇవి వారి శపథములు. వీనికి తోడు, మతాంతరులను, మతద్రోహులను తమమార్గమునకు త్రిప్పి వారికి బోధ చేసి 'సత్య మత' మిప్పించుటకు మతబోధకులుగా గాని, లేదా తమకు తోచిన మఱి యేవిధమున నైన క్రైస్తవమతమునకు సేవ చేయుటకు గాని ప్రధానమతాచార్యుడగు పోపు తమ నెక్కడకు బంపిన నక్కడకు వెళ్లవలెనను మఱియొక విధి కూడ గలదు. పూర్వోక్తశపథముల ననుసరించియే వారొక విధముగ సన్యాసులని తేటతెల్ల మగుచున్నది. చక్కని కట్టుబాటుల మీదను, నిశిత మయిన శిక్షణపద్ధతుల మీదను ఏర్పడిన యీవ్యవస్థను క్రీ.శ. ౧౫౪౦-వ సంవత్సరమున పోపు తన యామోదమును దెలుపుటయే కాక, మార్టిను లూథరు వలననుండి రోమను కాథలిక్కుమతమున కుపద్రవము సంభవించుచుండిన కాలమున తన్మతమున కండగ నుండుట కేర్పడిన దగుటచేత ఈసంఘసభ్యుల కంతవఱకు తన క్రింది మతాచార్యుల కెవ్వరికి నొసంగని మర్యాదలను గౌరవప్రపత్తులను కూడ నిచ్చి వారి నాశీర్వదించెను.

సంఘము కొఱకు వ్యక్తి కాని వ్యక్తికొఱకు సంఘముకా దన్నది వీరి లక్ష్యము. సెయింట్ ఇగ్నేషియసే ఈసంఘసంప్రదాయమునకు ౧౫౪౧ మొదలు ౧౫౫౬ వఱకు నధిపతిగా నుండెను. సంఘమున జేరిన వార లెల్లరు బాగుగ చదివిన విద్వాంసు లగుటవలనను, పట్టుదలతో తమ కార్యక్రమమునకు పూనుకొని పని చేసినందువలనను అతిశీఘ్రకాలముననే యీసంఘ మాకాలమున పేరు ప్రోగిన సంస్థలలో నొక్కటి యయినది. ఈసంఘమునందలి సభ్యులనే ప్రజలు 'జెసూ' ట్లని, 'జెసూట్ ఫాదరు' లని వ్యవహరించుచు వచ్చిరి.

జెసూట్లు యూరోపునందలి యున్నతతరగతుల వారి కుపాధ్యాయు లయి, అప్పటికి వాడుకలో నుండిన విద్యాశిక్షణపద్ధతియందు పెక్కు మార్పులు తెచ్చిపెట్టి విద్య నెంతయు నభివృద్ధి నొందించిరి. పెద్దపెద్ద జమీన్‌దారులును, చిన్నచిన్న సంస్థానికులును గూడ తమ పిల్లలను చదువు నిమిత్తము వీరి కడకే పంపుచువచ్చిరి. ఈరీతిని ప్రజలలోను, పెద్దపెద్ద సంస్థానములలోను చిన్నచిన్న సంస్థానములలోను గూడ వీ రెక్కువ పలుకుబడిని సంపాదించిరి. తుద కాత్మలాభము కొఱకు పరనష్టము కొఱకు అతివిస్తరిల్లిపోయిన తమ పలుకుబడి నెక్కడ వారు వినియోగింతురో యని పూర్వపు మతగురువులును, విద్వాంసులును గూడ భీతచిత్తులైరి. తుదకు విశ్వవిద్యాలయములు కూడ వారి పలుకుబడికి లొంగి వశ్యములు అయినవి.

పోపు ప్రసాదించిన విశేషగౌరవమర్యాదల వలనను విద్యామూలమున సంస్థానములందు తమకు చేకూరిన విశేషము పలుకుబడి వలనను వారికి అతిశయాహంకారగర్వములు ప్రబలినవి. తుదకు తమకు నియత మయిన కార్యరంగము నతిక్రమించి వారు ఎచ్చట నున్న నచ్చటి రాజకీయములందు కూడ అనవసరముగను, అప్రస్తుతముగను జోక్యము కలిగించుకొనుచువచ్చిరి. ఈకారణమున వీరికిని, రాజకార్యధురంధరు లగు వారికిని నడుమ ఈర్ష్యాసూయాద్వేషములు మొలక లెత్తి క్రమముగా వర్ధిల్లినవి. మొట్టమొదట అత్యున్నతభావములతో నేర్పడిన యీసంఘము కొన్నికొన్ని నీతినియమములు శిథిలము లగుటవలనను, పూర్వోక్తాది ఇతరకారణములవలనను అప్రథకు బాల్పడి తుదకు ప్రజల యాగ్రహానాదరములకు గుఱియై చాల అవాంతరములకు లో నయినది. తుద కీతత్సభ్యుల చర్యల వలన ఈసంఘము నణచివేయవలసినంత వఱకు వచ్చినది. ౧౭౫౯ లో ఈసంఘమువారిని పోర్చుగలు దేశమునుండి వెళ్లగొట్టిరి. ఫ్రాన్సుదేశమున ౧౭౬౪ లో నీసంఘ మణచి వేయబడినది. ౧౭౬౭ లో స్పెయినునుండి, తరువాత నపుల్సు, పార్మా, మాల్టాల నుండి

జెసూట్లను దరిమివేసిరి. వీటి అన్నిటికంటె పిట్ట పిడుగువలె వచ్చి పడినది పోపు శాసనశ్రీముఖము. ౧౭౭౩ లో పోపు ౧౪-వ క్లెమెంటు ఈసంఘమును రద్దుపఱచుచు నొక శాసనము కావించెను. తరువాత మరల నీసంఘమును పునరుద్ధరించుటకు చాల ప్రయత్నములు జరిగినవి. తత్ఫలముగ ౧౮౧౪-వ సంవత్సరమున నీసంఘమునకు ప్రాణప్రతిష్ఠ జరిగినది కాని దానికి పూర్వపుదార్ఢ్యము కాని, శక్తి కాని, చురుకుదనము కాని కలుగలేదు. ఎట్టెట్లో జీవితము గడుపుకొనుచు నీసంఘ మిప్పటికిని ప్రధానముగ విద్యావిషయమున గృషి చేయుచున్నది.

ఆధునికకాలమున మతబోధ నిమిత్తము క్రైస్తవులు యూరోపు విడిచి దేశాంతరముల కరుగుట పదునాఱవ శతాబ్దితో నారంభ మయినది. ఈకాలముననే యూరోపియనులకు అమెరికాఖండ మొకటియున్నట్టును, 'గుడ్ హోపు' అగ్రము ద్వారిని హిందూదేశమునకు బోవుటకు మార్గాంతర మున్నట్టును తెలిసినది. అంతటితో తమ పొరుగున నున్న మహమ్మదీయులతో నొక మూల గ్రుద్దులాడుచు గూర్చుండక తమ మతమును విస్తరింపజేసికొనుటకు విశాలప్రపంచ మింకను గల దని తెలిసి వారు తత్ప్రయత్నములకు గడంగిరి. ముందుగ రంగమున నవతరించినవారు రోమనుక్యాథలిక్కులు. వీరు మతాంతరులకు బోధించి వారిని దమ మతమున గలుపుకొనుట పోర్చుగల్, స్పెయిను దేశపు వలస రాజ్యములలో నారంభ మయినది. అప్పటికే వర్తకవ్యాపారమున కని వచ్చి పోర్చుగీసువారు హిందూదేశమున రాజ్యసంపాదనమునకు బ్రయత్నించుచుండిరి. ౧౫౪౨ నాటికి హిందూదేశపు పశ్చిమ తీరమున నున్న గోవా రేవు పోర్చుగీసువారి యధీనముననే యుండెను.

౧౫౪౧ లో ఫ్రాన్సిస్ జేవియర్ హిందూదేశమునకు వచ్చుటతో మతబోధ నిమిత్తము క్రైస్తవులు దేశాంతరములకు బోవుట ఆరంభ మయినది. ఫ్రాన్సిస్ జేవియరు ౧౫౪౨ వ సంవత్సరము మే నెల ౬-వ తేదీని గోవారేవున దిగెను. ఆధునిక కాలమున మతబోధ నిమిత్తము దేశాంతరములకు బయలుదేఱిన మొట్టమొదటి క్రైస్తవమతబోధకుడే కాక హిందూదేశమునకు వచ్చిన మొదటి జెసూట్ ఫాదరు కూడ నితడే. ఇగ్నేషియస్ సాహచర్యప్రభావములవలన అతడు నూతనముగ స్థాపించిన యేసుక్రీస్తుసంఘమున జేరిన మొదటి సభ్యులలో నీ జేవియ రొకడు.

ఫ్రాన్సిస్ జేవియరు హిందూదేశమునకు వచ్చి గోవా చుట్టుపట్టులను, ఇంకను దక్షిణమండలము లందును పూనికతో పని చేసి చాలమంది తక్కువ తరగతుల వారికి క్రైస్తవమత మిప్పించెను. పిదప ఈ ఫాదరు సింహళము, మలాకా, మొలక్కాసు లలో తాను వచ్చిన కార్యమును గొంతవఱకు సాధించి పిదప జపానుదేశమున కరిగి యచ్చట నొక 'మిషను' స్థాపించెను. అటు వెనుక, ప్రచారము చేసి చీనాదేశస్థులకు గూడ రోమనుకాథలిక్కు మత మిప్పించు తలంపుతో నతడు చీనాదేశమునకు వెళ్లుచుండ, కాంటన్ నగరమునకు సమీపమున క్రీ. శ. ౧౫౫౨ లో చనిపోయెను.

అటుతరువాత జెసూటుఫాదరు లొకరి తరువాత నొకరుగ అనేకులు హిందూదేశమునకు వచ్చిరి. అనతికాలముననే మధురయందు వారి 'మిషను' ఒకటి యేర్పడినది.

జెసూటుఫాదరులు తాము క్రైస్తవమత మిచ్చిన వారిలో నుత్తము లయిన దేశీయులనే మతబోధకులుగ నేర్పాటు చేసి వారిచేతనే తమ దేశీయుల మతమును ఖండింపజేయుచువచ్చిరి. మఱికొందఱు

జెసూట్ ఫాదరులు, రాబర్ట్ డి నొబిలి వంటివారు బ్రాహ్మణులలో బ్రాహ్మణులుగ నటించి బ్రాహ్మణులనుండియే హిందూమత సిద్ధాంతములను దెలిసికొని తన్మతము పయి దండెత్తి పరమతనింద, స్వమతస్తవముల మూలమున స్వమతాభివృద్ధి కావించుకొనుచువచ్చిరి. స్వమతాభివృద్ధికి పరమతఖండన మొక సాధనము కాబోలు.

ఏ దేశమునకు వెళ్లిన నక్కడ ఈ జెసూట్ ఫాదరులు అక్కడి ప్రజలతో గలసిమెలసి తిరుగుచు, తమ పని సాగించుచు, అచ్చటి రాజకీయవ్యవహారములు, ప్రజల మతాచారవ్యవహారములు మొదలయినవి వారినుండి తాము విన్న వానిని గురించి కాని, తాము స్వయముగ కన్న వానిని గురించి కాని తమ యధికారుల యాజ్ఞ ననుసరించి వ్రాసి పంపుచుండువారు. వీటికి జెసూటువృత్తాంతము అని నేటి వ్యవహారము. హిందూదేశమునకు క్రీస్తుశకము పదునాఱవ, పదునేడవ శతాబ్దులలో వచ్చిన జెసూట్ ఫాదరులు ఇచ్చటి దేశభాషలను గూడ నేర్చుకొని తరువాత వచ్చు ఫాదరుల, ఇతర క్రైస్తవ మతస్థుల యుపయోగార్థము దేశభాషావ్యాకరణములను, నిఘంటువులను గూడ రచించియున్నారు. దేశభాషలను బాగుగ నభ్యసించి, వ్రాయను చదువను ధారాళముగ ప్రసంగింపను నేర్చి వ్రాసిన వృత్తాంతము లగుటచేత జెసూటుఫాదరులు మన దేశమును గురించి వ్రాసిన విషయములు కొంత వఱకు అసంబద్ధము లయిన అతిశయోక్తులతోను, మతవిషయము లందసత్యములతోను నిండియున్నను రాజకీయముగ నవి సుతరామూ కొట్టివేయదగినవి కావు. శాసనములవలన గాని, నాణెములవలన గాని, వాఙ్మయమువలన గాని విడని కొన్ని కొన్ని చిక్కులు ఈ జెసూట్ వృత్తాంతముల వల్ల విడుచున్నవి; అంతియ కాక లోపించి పోయిన కొన్ని కొన్ని చరిత్రభాగముల సరి విషయమును దెలిపి పూరింపజేయుటయు గలదు. అందువలన పదునాఱవ శతాబ్దినుండి మన దేశచరిత్ర రచనమునకు గల ప్రధానాకరములలో ఈ 'జెసూటువృత్తాంతము' లొకటి. ఇవి యన్నియు పోర్చుగీసు భాషయందున్నవి. వీటిలో చాల వఱకింకను ఇంగ్లీషు భాషలోనికయిన ననువాదము కాలేదు. విజయనగర చరిత్రరచనమునకును, తంజావూరు మధుర నాయకరాజ్య చరిత్రరచనమునకును ఈ జెసూటు వృత్తాంతములు చాల ముఖ్యము. ఈ వృత్తాంతములలోని కొన్ని కొన్ని భాగములను బొంబాయి చరిత్రపత్రికయందు ఫాదరు హేరాసుగారును మధురనాయకరాజ్యచరిత్రమున స్వామినాథయ్యరుగారును ఇంగ్లీషులోనికనువదించి ప్రకటించియున్నారు. ఆంధ్రచరిత్ర పరిశోధకులలో ఏకొందఱయిన పోర్చుగీసుభాష నేర్చుకొని మన దేశచరిత్రమునకు సంబంధించినంత వఱకయినను ఆవృత్తాంతములను తెలుగులోనికి, ఇంగ్లీషులోనికి అనువదించుట ఆవశ్యకము.

తెలుగుదేశమునకు వచ్చిన మొట్టమొదటి క్రైస్తవ మతబోధకులు జెసూట్ ఫాదరులే. అందువలననే తెలుగున క్రైస్తవమతబోధకునికి పాదిరి (ఫాదరు—Father—శబ్దభవము) అని, వారి 'చర్చి'కి 'పాదిరిగుడి' అని వ్యవహారము వచ్చినవి.



# నిజమైన పతివ్రత

కొడవటిగంటి కుటుంబరావుగారు.



మనవాళ్లు పతివ్రత అనే పదం చెవికి కంటకింపు అయ్యే వరకూ అన్నుల్లో ఉంచారు. ఇప్పటి కాలపు వాళ్లకు పతివ్రతాత్వాన్ని గురించి ఎటువంటి అభిప్రాయా లున్నవో గమనించే ముందు పూర్వ కాలపు పతివ్రత లెటువంటివారో ఆలోచిద్దాం. ఒక హరిదాసుగారు చెప్తూండగా విన్నాను—పతివ్రతలు మూడు రకాలట. మొదటి తరగతి పతివ్రత ప్రపంచంలో తన భర్త తప్ప మరి మగవాడు లేడని భావిస్తుందట. రెండో రకం ఆమె ఇతర పురుషులనందర్నీ అన్నలుగానూ తండ్రులుగానూ భావిస్తుందట. మూడో రకం పతివ్రత పరపురుషులమీద మనస్సు పోయినా అణుచుకుని తన భర్తతోనే కాలం వెళ్లబుచ్చుతుందట! పతివ్రతాత్వమంటే ఏమిటో విశద మౌతూనే ఉంది—రంకుతనం చెయ్యని మనిషి పతివ్రత!

ఇక అసలు పతివ్రతలను చూడండి! ద్రౌపదీ సీతా, దమయంతీ, చంద్రమతీ మొదలైన వాళ్లను తీసుకోండి. అందరూ తమ భర్తలను స్వయంవరం చేసుకున్నారు, అందరూ కష్టా లనుభవించారు. చాలా మంది భర్తలనుంచి ఎడబాటు కూడా పొందారు. కష్టాలకు తట్టుకున్నారు. తమ భారం యావత్తూ భర్తల మీద పెట్టి "నువ్వే నా దైవం! ఏం చెయ్యమంటే అది చేస్తాను!" అనకుండా తమ ఆలోచనాశక్తి వినియోగించారు. విపరీతమైన ధైర్యం చూపించారు. వాళ్లను భర్తలయొక్క నీడ లనటం అమర్యాద అంటాను. రావణాసురుణ్ణి అంతకాలం ఒంటరిగా ఎదిరించిన సీత రాముడి నీడ ఎట్లా అవుతుంది? ద్రౌపది తన గొప్పతనం సత్యభామకు తెలుపుకునేటప్పుడు "ఏమో నమ్మ! వాళ్లనే దేవుళ్లుగా నమ్మి ఉన్నాను!" అని ఊరుకోలేదు. ద్రౌపది చెప్పుకున్న గుణాలన్నీ పతివ్రతకు అవసరమే. ఆ అయిదుగురు భర్తల భార్యను మించిన పతివ్రతలు పురాణాల్లో ఎక్కడా కనిపించరు. (పతియందు వ్రతం కలది పతివ్రత అనే ఉద్దేశంతో ఆ పదం వాడటం లేదు; ఆధర్మ స్త్రీకి ఇది పర్యాయపదంగా వాడుతున్నాను.)

చిత్రాంగిని తీసుకుందాం. మాటవరసకు చిత్రాంగిని సారంగధరుడి కిచ్చా రనుకుందాం. అప్పుడు చిత్రాంగి మిగిలిన మగవాళ్ల నందర్నీ ఆడవాళ్లుగా చూస్తుం దనుకుందాం (అనుకోటాని కీ కూడా కోతిగానే ఉంది!) అప్పుడు చిత్రాంగి ఉత్తమజాతి పతివ్రత అవుతుందా? కాదని నా వాదన. చిత్రాంగికి పతివ్రత కుండవలసిన స్థైర్యం, స్వతంత్రంగా ఆలోచించే శక్తీ రెండూ లేవు. జనక మహారాజు మొండికెత్తి సీతను—రాముణ్ణి వరించిన సీతను—మరొకడి కిచ్చా డనుకుందాం. అప్పుడు సీత పతివ్రత అవుతుందా? అవుతుం దనే నా నమ్మకం. రాముడి మీది ప్రేమ ఆవిడ పతివ్రతాత్వాన్ని ఒకటో మెట్టు మీదినించి మూడో మెట్టుకు తోస్తుందా? ఎప్పటికీ తొయ్యదు!

ఈకథ కీ ఉపోద్ఘాతం చాలు.

* * * *

సీత కొత్తగా కాపరాని కొచ్చింది. ఆమెకింకా తన మామగారు చితికిపోయిన సంగతి తెలీదు; ఇరవై ఎకరాల మాగాణీ భూమీ, పది వేల రూపాయల కిమ్మతు ఇల్లూ మార్వాడీ అప్పుకింద తాకట్టులో ఉన్నట్టు తెలీదు. ముందు ఇంటికొచ్చింది ఎసరు. సేటుగాడు రెండు వేలకు ఇల్లు కొట్టేయించుకున్నాడు. సీత మామగారి సహోదరుడు తెలిసి కూడా వచ్చి అడుకోకుండా ఊరుకున్నాడు!

"ఏమండీ? అట్లా ఉన్నారేం?" అంది సీత మొగుణ్ణి. సీత మొగుడు నిట్టూర్పి జవాబు చెప్ప

లేదు. ఆఇంటిల్లిపాతీ ఊరందరూ ఎరిగిన విషయం — సీతకు వారం పది రోజుల్లో ఎట్లాగో తెలియబోయే విషయం — సీతకు తెలియజేయటం నామర్దాగా భావించారు! మర్నాడు సీత తోడికోడలు కుండ పగలేసి "బంగారం వంటి కొంప పోతున్నదో!" అని యేడవటం మొదలు పెట్టింది. అందరూ కళ్ల నీళ్లు పెట్టుకున్నారు. అర్ధ్రాత్రి మొగుడి దగ్గిర్నించి సీత సంగతంతా లాగింది.

తొలికోడి కూసే వరకూ సీత నిద్ర పోలేదు. మతి చెడకుండా ఆలోచించ గలిగితే నే ఫలం ఉంది. గురికి బారెడు ఎడంగా అనేక ఆలోచనలు తట్టినై. అన్నీ తోసేసి ఒక తీర్మానాని కొచ్చింది. వెంటనే గాఢసుషుప్తి ఆమెను ఆవరించింది.

మర్నాడు అందర్నీ చేర్చి సీత ఆలోచన ప్రారంభించింది. వాళ్ల చేత కూడా ఆలోచింపచేద్దామని ఆమె ప్రయత్నం. కాని అందరూ మతిచెడి ఉన్నారు. అప్పు డందరితోనూ తన ఆలోచన చెప్పింది.

"నేను ఉద్యోగం చెయ్యబోతున్నాను!" అంది సీత. కల్లోలం బయలుదేరింది. ఒకరు హామర్దా అన్నారు. ఆడది ఉద్యోగం చేసి పెట్టే కన్న మాడి చస్తా మన్నాడు సీత బావగారు. ఉద్యోగం చెయ్యటం కన్నా చాటుగా లంజరికమే మెరుగన్నాడు మామగారు. సీత మొగుడు విసుగ్గా అందర్నీ నోరు మూసుకోమన్నాడు.

"ఎందుకు మాటలు చూసి బెదురుతారు!" అంది సీత.

సీత పెట్టె తీసుకుని మేనమామ దగ్గిరికి పోయి ఉద్యోగం కావా లంది. సీతకు టైప్‌రైటింగ్ చాతవును. పదిహేను రూపాయలకు దమ్మిడీ ఎక్కువివ్వ నన్నాడు. ఆయన దో రకం మనిషి. సరే నంది సీత. సీత ఉత్తరం అందగానే మొగుడు వచ్చేశాడు. అతనికి కూడా సీత మేనమామ ఆ ఇన్స్యూరెన్సు కంపెనీ తరఫున కాన్వాసర్ గా ఉండటానికి అనుజ్ఞ ఇచ్చాడు. ఇద్దరి సంపాదనతో కూడా గడపటం బహు కష్టమయింది. పత్రికలకు సీత వ్యాసాలు రాసి ధనార్జన చెయ్యా లని చూసింది. కానిఅది ఎప్పుడూ జయప్రదం కాలేదు.

తరవాత సీత ఆవూళ్లో ఒక నాటకసమాజం ఉంటే దాన్లో వేషాలు వెయ్యటానికి పూనుకుంది. కొంతకాలం అది చాలా లాభించింది కాని సీత చనువుగా మాట్లాడటం మరోవిధంగా తీసుకుని కంపెనీ ప్రొప్రయిటరు గారు కొత్త కండిషనులు మాట్లాడబోయినాడు. సీత నవ్వి "క్షమించండి! నేను చాలా పూర్వకాలపు దాన్ని!" అంది. ఆ రోజుతో ఆఉద్యోగం అయిపోయింది.

డబ్బు సంపాదించటానికి సీత చాలా ప్రయత్నాలు చేసింది కాని ఎక్కడికి పోయినా మగవాళ్లు ఒకటే యావగా కనిపించింది. ప్రపంచంలో ఇంత మంది బాలెన్సు లేని మగవా ళ్ళున్నా రని సీత ఎరగదు.

అనుకోని అదృష్టంగా సీతకు టాకీల్లో నటించే అవకాశం గ్రామఫోను కంపెనీ వారికి రికార్డు లిచ్చే అవకాశం ఒక్క సారి వచ్చినై.

"నాకు పాడటం గాని నటించటం కాని చాతవు నని నా కింతవరకూ తెలీదోయ్ — వాళ్లు పిలిచే దాకా!" అన్నది సీత నవ్వుతూ నేను మొన్న ఆమెను కలుసుకుని మాట్లాడినప్పుడు. "మగ వాళ్లకు ఆలోచనాశక్తి లేదనుకోవాలి. నన్నెంతమంది మగవాళ్లు వెంటాడారు. అటువంటివి ఇష్టం లేనప్పుడు అప్సెట్ అయిపోయి మూర్ఛపోవటం అవివేకం. ఎవరో దారిన పోయే పోకిరాయి కన్నుకొట్టటానికి మన వ్యక్తిత్వంతో ఏమీ సంబంధం కనిపించదు! అటువంటి వాటికి నా వంటి ఆడది సంసిద్ధురాలై ఉండటమే కాక ఇంకొకరి సహాయం కోరకుండా తట్టుకు రావాలి!"

సీతనూ మొగుణ్నీ అత్తవారు చాలా కాలం కిందటే వెలేశారు! సీత మామగారు గౌరవంగా బతకలేక ఒకటి తరవాత ఒకటి దొంగతనాలు చేస్తున్నట్టు తెలుస్తుంది!

# నాటకాలు—పాత్రలు—భాష

ఉభయభాషా ప్రవీణ—నువ్వూరి సూర్యనారాయణమూర్తిగారు



నేటి కాలంలో చాలామంది నాటకాలే రాస్తున్నారు. ఇప్పుడు చాలా మంది దృష్టి "నాటకరచనాంతం పాండిత్యం" అనే దారిలో పడింది. అన్నిటికంటె రాయడంలో కష్టం కలిగించేది నాటకమే అని మన పెద్దల నమ్మకం. కాని నాటక నియమా లన్నీ మానిపోవడం చేతనున్ను, ఆ నియమాలమీద ప్రేక్షకలోకానికి ఆదరం తగ్గడంవల్లను ఇప్పుడు నాటకం రాయడమంతే సుఖం దేన్లోనూ కనపడదు.

ఈనాటకాలని మూడు రకాలుగా విభజించొచ్చు. పౌరాణికాలు, చరిత్రాత్మకాలు, సాంఘికాలు, అని. ఈమూడు రకాల్లోనూ సాంఘికాల కున్నంత చలామణీ ఈరోజుల్లో వేటికీ లేదు. ఏరోజు కారోజు చక్కని పేర్లతో ఈరకం నాటకాలు బయిలుదేరుతున్నాయి. ఓమూల "రంగూన్ రౌడీ" బయల్దేరితే మరోమూల "రౌడీలకి రంకు మొగుడు" అనేది బయటబడుతోంది. ఓమూల "కాలేజీ గరల్" అని ఒకరు రాస్తే దాన్ని అణగతొక్కడానికి "కాలేజీ స్కాండల్" అని మరోటి చలాయిస్తోంది. తాత్కాలికంగా నట ప్రేక్షకలోకంలో దేనికేనా "నక్కబాయి" లా కాస్త పేరొచ్చిం దంటే దాని కనేక ఫొటోలు మర్నాటికే తీసేస్తున్నారు మారు పేరులతోటి.

ఇప్పటి లోకంలో చాలామందికి దేవుళ్లమీదా పురాణాల మీదా నమ్మకం తగ్గడంవల్ల, అల్లాటి నాటకా లెంతటి మంచి వైనా వెకటిస్తున్నాయి. అందువల్లే సావిత్రి లాటి పతివ్రత మొగుడి ప్రాణాలకోసం "యముడి దగ్గిరనా మూడు రాత్రుళ్లు పడుక్కొని ముచ్చం మూడు ముద్దు లిస్తాను" అన్నదనిన్నీ, వేదకాలంలోంచీ ప్రసిద్ధిలో వున్న హరిశ్చంద్రుణ్ని కొడుకు "ఏమిటి వెధవ నాన్నా! అమ్మని నిప్పుమాట్లో దిగమంటావు? నువ్వు దిగు కళ్లు మూసుకుని మేం ఇంకో నాన్నని తెచ్చుకుంటాం" అని మూక చేసినట్టున్ను రాసే ప్రబుద్ధుల్ని చూసేం గదా? ఈరకంగా కంగాళీలు బయల్దేరుతున్నాయి. నానాటికి ప్రజల నమ్మకాలు అంతరించి ఇల్లాటి వాటి మీదే ఎక్కువ నమ్మకం ఆదరం కలుగుతోంది. ఇంకా యీ కక్కలం చాలక కొన్ని బూతుల సంచికలు పబ్లీకుగా బయల్దేరడం కూడా మాస్తున్నాం. ఎక్కువమంది చందాదార్లు కూడా దీనికే. నిజమే మరి. "మధుసేవ" మీద ఉండే ఆప్యాయం మరో శాకుంతల మీద వుండదు. "చింతామణి" మీద వుండే కౌతుకం శ్రీరామాయణం మీద కలగదు గదా? ఇల్లా వుంది లోకానికి నాటకీయాభిరుచి......

సంస్కృతం వాళ్లు నాటకం రాయా లంటే దానికి బోలెడు నియమాలు చెప్పేరు. అంకాలు ఎక్కు వుండకూడదని, సంధు లుండా లని, నాందీ సూత్రధారు లుండా లని, విష్కంభాదులు తప్పవని బిగించేరు. ఇంకా యిల్లాగే, కథ మాత్రం ఎల్లా వున్నా లేగాదా లే దన్నారు. వాళ్లని పట్టి మన తెనుగువాళ్లు కూడా ఈనియమాలని పాటించేరు పెద్దలు. రాను రాను వాటిలో కొన్నింటికి ఫ్రెంచికట్టు చేసేరు. ఇహ రాసే వాళ్లే యిలా వుంటే ప్రదర్శించే వాళ్ల విషయం చెప్పే దేమిటి? ఇప్పటి నటులు కొందరు తమకు కావలసిన చోట పద్యాలని తీసి ఇష్టం హొచ్చిన వాటిని చేరుస్తున్నారు. "నాన్సెన్సు, ఇది చాలా ఎఫెక్టుగా వుంది" అని దాన్ని వొమెట్ చేసి కొత్త సాంగ్సు నడుమ నడుమ "అసంపూర్ణరామాయణంలా"

అతకడం. ఇల్లాగే విషాదాంతాలు సుఖాంతాలు గాను సుఖాంతాలు విషాదాంతాలు గాను మార్చి శృంగారంలో భీభత్సం, వేదాంతం, భక్తి, వీటల్లో శాస్త్రోక్తిసు జేర్చి ఎవరి యిష్టం వొచ్చినట్లు వాండు వేసే నాటకాలకి పేరు బలకంతాన్ని లాక్కొస్తున్నారు. కొందరికి గంటలోనూ గంటన్నరలోనూ ఆడెయ్యడానికి తగ్గట్లు నాటకాలుండాలని స్పెషల్‌గా కవుల చేయి పట్టి రాయించుకుంటున్నారు. ఇల్లాంటి పరివర్తనం నాటక కళని ఉద్ధరించడమంటారో నశింపజేస్తుంటారో సహృదయులు నిర్ణయించండి.........

ఇంక పాత్రధారణాల విషయం మాస్తే గంపెడు రాయవలసి వుంది. ఈ విషయాలు చాలామంది ఎప్పటి కప్పుడే రాస్తున్నారు. ఐనా రెండు మాటలు. పిలకజుట్టుతోనూ పెడికేడు జంఝాలతోనూ గోచీతోనూ వీణబుఱ్ఱ పట్టుకుని పురాణాల్లో తిరిగే నారదమునీంద్రుడు ఉంగరాలు తిరిగి చెవులమీద పడే కటింగ్ జుట్టుతోనూ సైకిల్ కట్లతోనూ నాభిపర్యంతం వేలాడే రకరకం పూల దండలతోనూ ప్రవేశం సంసారికళా. పతివ్రతా తత్వం నినదించే సావిత్రీ చంద్రమతి పాత్రల్లో వంకర పాపిళ్లు, బోనికాళ్లు జబ్బలు తెగ్గొట్టిన రవికెలు, పవిటి పిన్నీసులు, నాజూకైన డాలర్ గొలుసులు, బర్మా సిగలతోటీ, కలకటా స్లిప్పర్లతోటీ ప్రత్యక్షం. ఆ ఫేసుపౌడరు మొహానికి కొట్టుండడు. ఇల్లా వుంటే ఆమె పతివ్రతో వచ్చి భోగందో ఆలోచించండి. ఐతే యీ చిక్కు పౌరాణిక నాటకాల్లోనే గాని సాంఘికాల్లో ఎల్లా వేసినా ఎంత ఫేషనబుల్‌గా వున్నా చిక్కులేదనుకోకండి. సర్వసామాన్యంగా నటు లందరికీ ఫ్రెంచికట్టింగు, క్రాఫు, తప్పని తద్దినా లవడం చేతనూ, పైన చీరకట్టినా లోపున తొడిగే లాగో యీజారో సగం సగం కనిపిస్తూండడం చేతనూ, అక్కడా యీ బాధ తప్పలేదు. అభినయించేది తురకి పాత్రైనా గెడ్డం నున్నగా వుండక తీరదు. కొన్ని గెడ్డాలు కట్టినా అసహ్యం కదా? "చింతామణి"లో బిల్వమంగళుడు లాంటి పండితుడికి గూడా పైజామా రింగులు, నూనూసమీసాలు, మోకాళ్ల దాకా సిల్కుషర్టు, నుగ్గులు లేని క్రాఫు, నడుంకిందకి రోల్డ్‌గోల్డు బొత్తాములు... ఇల్లా వున్నాయి మన ప్రదర్శనయోగాలు...

ఇంక భాషావిషయంలో కవులు కూడా పాత్రల్ని ఎల్లా పోషిస్తున్నారో కొంత అనుకుందాం. ఈ విషయం మనం సంస్కృతంలోంచి తీసుకోవలసుంది అంటాలో

"ప్రాకృతం సౌరసేని న నీచపాత్రస్య చ స్త్రీయః
పైశాచం మాగధం వా స్యాత్ పిశాచాత్యన్త నీచయోః
యద్దేశ్యం నీచపాత్రం స్యాత్ తద్దేశ్యం తస్య భాషితం
భాషా తు సంస్కృతం ప్రోక్తం అనీచానాం కృతాత్మనాం"

అని ఆయా పాత్రలకి ఆ భాషలు వాడా లని చెప్పుతున్నారు. కాళిదాసాదు లల్లాగే వాడేరు. ఇది తెనుగు వారిలో మాత్రం బాగా అంటలేదు. గ్రామ్యం గాని వ్యావహారికం గాని వింటేనే తప్పని రకంలో చాలా మంది మన నాటకకర్త లున్నారు. ఇదీ సంస్కృతం పెద్దలు

"అపశబ్దం ప్రయుంజానో రౌరవం నరకం భవేత్
ఏక శ్శబ్ద స్సమ్యక్ జ్ఞాత్వా స్వర్గే లోకే కామధు గ్భవతి"

అని మప్పు పెట్టినదే. కనకనే చాలా మంది పాత్రయొక్క పాత్రాపాత్రత తెలియకుండా నాటకాల్లో మాట్లాడించి స్వభావం చెడగొట్టేరు. వీరిలో ముఖ్యులు వీరేశలింగం పంతులుగారు. వీరి శాకుంతలంలో బెస్తవాని పాత్ర ఆరోజుల్లో అధమం "విద్వాన్" ప్యాసైన మనిషిలా మాట్లాడేడు. కాళిదాసు మాత్రం ఆ విషయం జాగ్రత్తగా వున్నా ఆపరిణామంలోకి వీరు దిగకపోడానికి కారణం మన పెద్దల వాసనే అనుకుంటాను.

రెండో వారు చిత్రనళీయకర్తలు కృష్ణమాచార్యులవారు. వీరు ప్రఖ్యాతులైన నాటకస్రష్టలు. ఈ నాటకంలో అరణ్యంలో తిరిగే ఎఱుకలవాళ్లని దాసదాసీజనాలని నుంచి యమకంగా గ్రాంథికంలో మాట్లాడించేరు. వాడికి కవిత్వపరిచయం కూడా వుందని తెలియడానికి ఒకటి రెండు పద్యాలు కూడా చెప్పించేరు ఇంకా వంటింట్లో బాహుకునిచేత ఒక్కొక్క మాటుగా ౨౦—౩౦ పద్యాలు వరసకూ చదివించేరు. ఇదంత యిబ్బంది చెయ్యదు గాని దీనివల్ల ప్రదర్శనానుకూలసృష్టి కవిగారికి లేదనొచ్చు. మొత్తం మీద గ్రాంథికంగానే అన్ని పాత్రలని మాట్లాడించేరు.

ఇహ వడ్డాదివారి నాటకాలని పరిశీలిస్తే వీరి "చండకౌశికం"లోని చండాలురు కూడా కవులు గ్రాంథికవాదులూ అయ్యేరు. ఇల్లాగే వీరి "వేణీసంహారం" "మల్లికామారుతం"లో నూను. భట దాసీదాసులకైనా గ్రామ్యం లేదు.

జయంతి భావనారాయణగారి గతులు కూడా యింతే. వీరి "సంగీతసభ"లో ప్రాతిగామిన్ని "సౌందర్యసతీమణి"లో నేడేలున్ను "ప్రత్యక్షనారసింహం"లో రాక్షసచారులున్నూ వ్యాకరణశుద్ధంగా భాష పలికినవారే.

కస్తూరి శివశంకరకవిగారి "జలజాసౌభద్రీయం"లో కరిముఖుడు సింగిభుడు అనే రాక్షసులు కూడా గ్రాంథికభాషలోనే మునిగి తేలేరు.

ఇంకా చూపించాలంటే కోపల్లి వెంకటరమణగారి "శ్రీరామవిజయం"లోని కంచుకీ, త్రిజటలున్ను, పానుగంటి వారి "సారంగధర" లోని లవిత్రా కంటకులు తలారులున్ను, పేరి కాశీవిశ్వనాథవిద్వత్కవిగారి "పూర్వశాకుంతల" లోని సఖి, భటాదులున్ను, ద్వివేదివారి ప్రద్యుమ్నానందంలోను, పాతాళభేరి సుబ్రహ్మణ్యకవిగారి "శ్రీరామపట్టాభిషేకం" లోని శూర్పణఖాదీర్ఘనాసలున్ను, బులుసువారి "కోసలసామ్రాజ్యం" లోని బాలుడు, శూర్పణఖారాక్షసాములున్ను, వుమ్మే ఆలీషాగారి "చంద్రగుప్త" లోని చేటీసామాన్యులున్ను, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి "సాహసిక రాజపుత్రం" లోని తురకసైనికులు, భటాదులున్ను, గూడా పాత్రోచితభాషల్లో మాట్లాడలేదు. ఇంకా శ్రీనివాసరావుగారు "హరిశ్చంద్ర" లో కాటికాపరి వీరబాహుని నోట గ్రాంథికంగా పలికించేరు. అందువల్ల కొంపలు మునగలేదు గాని, వాడు చూస్తే మాలాడు. వేషభాషలు చూస్తే ఐదారు నెల్ల దాకా అన్నహితవు తప్పుతుంది. శ్మశానం, శవాలూనూ, వాడు చూసే ప్రకృతి. అల్లాటి వాడు తెగతాగి కండలు బుజాన్నేసుకుని వచ్చే టప్పుడు. గ్రాంథికంగా మాట్లాడితే ఏమేనా సహజంగా వుంటుందా? అప్పుడు శ్రీలక్ష్మీకాంత కవిగారు పోషించిన వీరబాహుడులా వుండాలి చూడండి.

"తొలిగి.పో సెంపయ్యా! దొరలు పెద్దింటోళ్ళి
తెలిసి సెప్పాపోతే। పలవా పొమ్మంటారు॥తొ॥
పబులు మీసకాల। కట్టి యేస్కొండయ్యా
గభగాభ భొభొ మని। కరవనత్తుం డయ్యొ ॥తొ॥
వాచనం తారూ మా। దోచ మంతారు నే
కాచెంత సరుకేస్తు। కాటి కల్లా వుంటె॥తొ॥"

ఈ పాట పాడుతూ జానెడు చుట్ట నోట్లో పెట్టుగుని తూలుతూ రంగం మీద కొచ్చిన వీరబాహుడే అందంగా వుంటాడో పైవారి వాడే గు

మ్మనిపిస్తాడో చూసే వాళ్లకే తెలుసు—కస్తూరి నరసింహంగారు కూడా తమ "నవహరిశ్చంద్ర"లో చక్కగా వీరబాహుడి చేత నటింపించేరు. ఇల్లాంటి దృష్టి వుండి ఏ పాత్రని ఎల్లా నడపాలో తెలిసిన వారు కూడా వున్నారు. వీరిలో పెద్దలు గురజాడ అప్పారావుగారు. వీరు "కన్యాశుల్కం" రాసేరు. ఇందులో కథ నిత్యం జరిగే మనుష్యసంపర్కమైన సాంసారిక గాథ లాటిదే కనక అన్ని పాత్రలూ వ్యావహారికాన్నే మాట్లాడతాయి. ఇప్పటి వున్న నాటకాల్లో దీని కొచ్చినంత పేరు దేనికీ లేదు గదా!

రెండో వారు వేదం వేంకట్రాయశాస్త్రిగారు. వీరు "శాకుంతలం" బెస్తవానిచేత,

"బెమ్మ నోట్టరాసిన బువ్వేదో। బెమిని పోదు గదా
దమ్మెమె గానీ కమ్మెమె గానీ। తప్పరాదు గందా
మేకలు మింగే బేపన రొయ్యకి। మెత్త మణుసు గందా!
ఏకలి సేసిన అకలి కోసం। యీ గ్రాసు డొప్పుగం దా?"

ఈ రీతిగా నడిపించేరు. ఇది నిజంగా వినే సరికి ఎంతో జాలిగా వుంటుంది.

ముట్నూరి మంగిపూడి వార్ల "పుష్పవేణి" నాటకంలో భీముడు అనే దొంగ గ్రామ్యంగా గజదొంగలా మాట్లాడేడు. భాషకి తగ్గ భావాలు. కొచ్చెర్లకోటవారి "అపవాదతరంగిణి" లోని సేవకులు దాసీలు కూడా గ్రామ్యంగానే మాట్లాడేరు.

కాళ్లకూరి నారాయణరావుగారి "చింతామణి" లో నీచపాత్రలు గ్రామ్యంగానే మాట్లాడేయి. ఇది కూడా ప్రసిద్ధిలో వున్న నాటకమే అని అందరికీ తెలుసు.

ఇంకా ఇల్లాటిది బలిజేపల్లివారి "బుద్ధిమతీ విలాసం" లోనూ కనిపిస్తుంది. కేశవదాసుగారి "కనకతార" లోనూ వుంది.

ఐతే పాత్రోచితభాష వుండా లంటే ఏ వేనా కథల్లో సాయిబుపాత్ర వస్తే తురకంలోనూ ఇంగ్లీషుపాత్ర వస్తే ఆ పాత్రలని ఆ భాషలలోనే మాట్లాడించా లనిన్నీ ఇవన్నీ అర్థం చేసుకుని పాండిత్యం లోకుల కందరికి నటులకీ కూడా వుండా లన్న మాటా? అని ఎవ రేనా అనొచ్చు. అయితే యిప్పు డున్న గ్రాంథిక భాషా, పద్యాలు, సంపూర్తిగా తూచా తప్పకుండా మనవాళ్ళం దరికీ అర్థం అవుతోం దని పైవా రనగలరా? ఇప్పు డిందులోనూ పాటలలో రాగాలు కళలు, సంగతులు చూసి సంతోషించేవాళ్ళే గాని అర్థం సరసంగా గ్రహించే సామాజికు లేరీ? అల్లా అర్థం గ్రహించేవారే సామాజికు లైతే "భమిడిపాటి కామేశ్వరావు"గా రన్నట్లు ఓమూల హరిశ్చంద్రు డేడుస్తుంటే శ్రీరాగ మెందుకు కాంభోజి లెందుకు? అరునొక్క రాగం ఎత్తక. అప్రస్తుతో వున్న శకుంతల మోకాళ్లు మణిచి కూచుని సడెన్ గా నాటకం నడుమ అన్నూలపాట లెందుకు? అప్రసక్తాలైన గ్రామఫోను రికార్డెందుకు? ఇంకా యిల్లాగే పెద్దపెద్ద ఫీలింగ్సు చూపించి నాయకా నాయికలు మూర్ఛపోయేటప్పుడూ "దళమా శయ్యేదలో నడంగియు" అనే పద్యం అఖరు దని హరిశ్చంద్రుడు చంద్రమతీ తాము భార్యాభర్తల మని తెలుసుకుని దభాలుని స్టేజి మీద పడేటప్పుడూ గొంతుకు చించుకుని ఆ "కన్నుమోర్లు" ఎందుకు బాబూ? ఇదంతా అర్థం చేసుకునే ఆడే భాగోతమే ఐతే నటులు కూడా

"పాతాళమున కేగి బ్రతుకవచ్చు నటన్న"

అనే పద్యం చదివేటప్పుడు రెండు చేతులు పైకి చాపి ఆకాశాన్ని చూపించి "యాక్షన్" చేయడం గూడా అర్థజ్ఞానంతో కూడిందే అనొచ్చు. కనక తెనుగులో ఏ సాయిబు పాత్రేనా పెట్ట దలుచుకుంటే వాళ్ళ భాషలో వున్న పదాలనే మన తెనుగు పదాలతో కలుపుతూ తెనుగు ప్రత్యయాలు చేరుస్తూ మాట్లాడిసే అందం, ఇహ నీచపాత్ర లేవైనా పెట్టా లంటే ఏజాతికా యాస, మాటలో వచ్చేలా గ్రామ్యంగా నడిపిస్తే సొంపు. అదే అదే

టప్పుడు అద్భుతానందాన్నిస్తుంది. చూడండి కవిరాజుగారి "బొబ్బిలియుద్ధం" అందులో హైదరుజంగు గారి ప్రసంగం కళ్ళు, వేదంవారి "ప్రతాపరుద్రీయము"లో సుల్తాన్ పోకు మాటలు చూస్తే సందర్భం గోచరమవుతుంది. ఎంచేతనంటే,

"భావా యే ఉత్తమానాం తు నతా న్మధ్యేషు
యోజయేత్
తే భావా శ్చైవ మధ్యానాం నతా న్నీచేషు
యోజయేత్"

అన్నాడు కనక. ఇల్లాగే ఉత్తమభావాలు ఉత్తములకి నీచభావాలు నీచపాత్రలకి పెడుతూ నీచభావాలకి సాయం భాష కూడా ఉత్తమం కాని దాన్ని పెడితే అప్పుడు మరీ బాగుండొచ్చు కాదూ? ఎంకి పాటలు ఈ వుద్దేశంతోనే బయల్దేరేయి. మరిన్ని

"యో దేశభాషారహితం కావ్యం ప్రయోజయే
దుష్టం
తస్యా ప్యభిలేఖ్యః స్యాత్ ఘాత సత్ జ్ఞై హి
దోషజ్ఞైః"

అన్నట్లు దేశభాష అనగా సార్వజనీనంగా వాడబడుచున్న వ్యావహారిక భాష, అది లేని కావ్యము దుష్టమని గదా పైదాని భావము. కనక పాత్రోచితభాష నాటకాలకి అందం తెస్తుంది.

అల్లా అయితే రాసే నాటకమే మ్లేచ్ఛులది గాని ఇంగ్లీషు పాత్రలతో ఇంగ్లీషు నాటకం గాని అవుతుంది. అప్పుడు మొదటి నించీ తురకభాషతోటీ ఇంగ్లీషుతోటీ రాయాలన్నమాటే. లేకపోతే ఉచితభాష కాకపోతుంది. అలా రాస్తే అది ప్రదర్శించడంలో అందమెల్లా వుంటుంది? అప్పుడు అనువాదాలకి ఫలితం ఉండదే? అనకూడదు. ఆ గాథలోనే ప్రధానపాత్రల విషయానికి గ్రాంథికాంధ్రం రాసి తక్కువ పాత్రలకి మాతృకభాషలో వుండే యాస కలిగేలా రాయడమే మంచిది. ఇల్లా రాసిన నాటకాల్లో "ఖిల్జీరాజ్యపతనం, దుర్గాదాసు" మొదలైనవున్నాయి. ఇందులో మొదటిది మ్లేచ్ఛగాథ. రెండోది హిందీ గాథ. ఈ రెంటిలోనూ నేను చెప్పినట్లే పాత్రలు నిర్వహించబడ్డాయి. ఆంధ్రులకి కూడా అర్థం అయేలాగ నీచపాత్ర భాష వుంది. ఇల్లా రాసినందువల్ల నాటకం స్వభావసిద్ధంగా వుండి సామాజికులకు రసోత్పత్తి కలగచెయ్యడంలో అభ్యంతరం లేదు. "బొబ్బిలియుద్ధం"లో బుస్సీదొర యింగ్లీషు మాటలు విసురుతూ చక్కగా మాట్లాడేడు. కనక నాటకకర్తలందరూ భాషలో పాత్రపోషణం చూచుకుంటూ ప్రదర్శనానుకూలంగా ఏ గాథలు రాసినా అందము తప్పి ఉండదని నా మనవి—

ఇంకో మాట. మన లక్షణకర్తల్లో సరసులు కూడా గ్రామ్యాన్ని పాత్రోచితంగా వాడవచ్చని చెప్పేరు.

"అధమప్రకృతిషు గ్రామ్యోక్తి ర్గుణః"

"గ్రామ్యం తత్ర ద్విధా సాధు"

"గ్రామ్యంబు తత్తజ్జాతివర్ణంబులం బ్రయోగార్హంబగు" పైవాటిని పట్టి శిష్టప్రయోగాలు లేనిదే వారల్లా చెప్పరు గదా? ఆ సూత్రాలకింద ఉదహరించిన ప్రయోగాలు కూడా పెద్దవాళ్లవే. చూడండి.

"నూసినా మేలు బాగెము, సేసినాము"

ఇది యయాతి చరిత్రలోది. గ్రామ్యజనం రాజుగారి దర్శనం చేద్దామనే సందర్భంలో అనుకుని మాటలివి. ఇల్లాగే మనుచరిత్రలోనూ వెంకటాచలమాహాత్మ్యంలోనూ సారంగధరచరిత్రలోనూ కూడా ఈ పాత్రోచితభాషే వాడబడింది. వారు రాసేరనే కాకుండా ఏపాత్రని నాటకాల్లో ఎల్లా మాట్లాడిస్తే బాగుంటుందో ఎవరికి వారే ఆలోచించొచ్చు. దానితో పాటు కాలపరిస్థితిని జనుల రుచిని అనుసరించి అందులో అనుచితాన్ని బహిష్కరించి నాటకాలు రాస్తే అవి లోకంలో ప్రసిద్ధికెక్కి ప్రదర్శింపబడి నాటకత్వానికి సార్థకత్వం సంపాదిస్తాయి. ఇంతే నా వుద్దేశం—

# కుంతి

మల్లాది అవధానిగారు

ఆ పదిహేనేళ్ళ అమ్మాయి ప్రతి రోజూ సాయంత్రం వేళ సూర్యుడు వెళ్ళిపోయిన వెంక క్రమ్ముకునే మసక చీకట్లలో మెల్లమెల్లగా తడబడే అడుగులతో గంగానదీతీరానికి వొస్తుంది తీరాన యిసుకలో కూచుని మానవహృదయం మీదకు తెంగవలె నదిమీదకు వొరుగుతున్న చీకటిలోనికి, వొడ్డున లంగరు వేసి వున్న పడవలవేపూ అదేపనిగా చూస్తూ కూచుని యేమో యేమో ఆలోచిస్తూ వుంటుంది. అలానే అసమాధ్యవస్థలో యే నడిరేయి దాకానో వుండి వొక్కసారిగా నిద్రనుంచి వలె తుళ్ళిపడి లేచి తన చుట్టూను ఆకాశం వేపూ చూసి తొందర తొందరగా యింటికి వెడుతుంది.

ఆమెను ఆనదీతీరం రోజూ సాయంత్రం వేళ యెందుకు ఆకర్షిస్తుంది? అదంతా వొక కథ—

అర్నెల్ల కిందటి ముచ్చట.

అన్నట్టు—ఆ అమ్మాయి పేరు కుంతి. మొన్న శ్రావణానికి పద్నాలుగు వెళ్ళి పదిహేనో యేడు వొచ్చింది. కుంతి కన్యక. ఎర్రగా వుండవలసిన ఆమె బుగ్గలూ పెదవులూ పాలిపోయి తెల్లగా వున్నాయి. వెన్నెల మెరుగును గలిగి వుండవలసిన ఆమె కన్నులు మబ్బు పట్టిన ఆకసం వలె వున్నాయి. ఆమె నున్నని దేహానికి వుండవలసిన నిగనిగలు లేవు—అందుకు కారణభూత మైనదే యీ కథ—

ఆ సాయంత్రమూ, యీ సాయంత్రము లాగునే వుంది చల్లని గాలిలో 'గంగ' కదులుతూంది. నది మీదకు...అది శుక్లపక్ష మైనా...నునుచీకటి వొరుగుతూంది. వొడ్డున లంగరు వేసిన పడవలు యిలాగునే వున్నాయి. వినీలాకాశం వొక చుక్కను కన్నది.

ఆ అమ్మాయి.. కుంతి అదుగో అక్కడనే అయిసుకలో అదే విధంగా కూచుంది. కాని యిప్పటివలె అప్పుడు ఆమె మొహంలో ఆలోచనా, గంభీరతా లేవు. అప్పుడు ఆమె మొహం వికసించిన గులాబివలె వుంది. ఆమె కన్నులు బాగా వికసించినాయి. పెదవులు చిరునవ్వులను యెదుపెక్కినాయి. అందుకు కారణం ఆమె వొళ్లో వొక బిడ్డ వున్నాడు.

ఆమె అపరిమిత ఆనంద వేపు చూస్తూ కిలకిల నవ్వుతూంది. అతేపదేపున తన పెదవులతో ముద్దర వేస్తూంది; తన కౌగిలిలో నలిపి వేస్తూంది, తన వక్షానికి అదుముకుంటూంది. అతని పాలబుగ్గలు యెర్రగా కందిపోయేటట్టు ముద్దాడింది. అతని అరచేతులతో తన కన్నులను కప్పుకుంది, కిలకిల నవ్వింది. ఆ అబ్బాయిని బిగువుగా కౌగలించుకుని అతని దేహాన్నంతా ముద్దు పెట్టుకుంటూంది. ఆ అబ్బాయి వుక్కిరిబిక్కిరియిపోయి వూపిరికోసం కలత చెందుతున్నాడు. ఆమె గుండె చటాల్న పగిలింది. అబ్బాయి నీరస దేరాడు. "అమ్మ!" అంది ఆమె. అతని వేపు అదే పనిగా చూసింది. ఘక్కున నవ్వింది. ఆమె కళ్ళలో నిప్పు గ్రుడ్ల వలె తిరిగాయి.

అప్పుడే ఆకాశానికి చందమామవుదయించాడు. ఆకాశ మంతా వెన్నెలతో నిండిపోయింది. ఒక్క ఆకాశమే కాదు—గంగానదీ...యిసుకదిబ్బలూ...చెట్లూ...అన్నీని.

అయినా ఆమె ఆ చందమామను చూడలేదు. ఆ వెన్నెలను చూడలేదు. ఆ గంగానదిని...ఆ...ఆ చెట్లని చూడలేదు. తన కౌగిలిలోని పసికందు వేపు చూస్తూంది. "నా చిట్టీ! నా చిట్టీ," అంటూ నవ్వుతూంది. "నా చందమామా!" అవును. అతను తన చందమామే. తన రక్తం...తన ఆత్మ...తన హృదయం...తన సర్వమూను. ఆనందాన్ని పట్టలేక వలవల యేడ్చింది. ఆమె కన్నీటితో ఆపసికందు మోము తడిసిపోయింది. ఆమె గుండె ఝల్లు

వుంది! అయ్యో! తన చిట్టితండ్రికి...అప్పుడు పుట్టిన పసికందుకి యిదా నీళ్ళపోత? తన కన్నీళ్ళతో నీళ్ళపోత! "నాన్నా! నాతండ్రీ! కుంతి కడుపున యెందుకు పుట్టావు?"

ఆమె తన పయ్యెదను తొలగించి స్తనాన్ని ఆపసివాని నోట్లో పెట్టింది. ఆ యెర్రని చిన్ని పెదవులు మెత్తగా మృదువుగా హాయిగా తన స్తనాన్ని పీలుస్తుంటే—! ఎంత హాయి!—తానెంత అదృష్టవంతురాలు!

"కుంతీ నువ్వు! కన్యకవు! ఆసంగతి మరిచిపోకు" అని యెవరో తన మనస్సు పొలిమేరల్లో నిలిచి చెప్పినట్లయింది. ఆమె గుండె ఝల్లు మంది.

లోకం!—తాను కన్యక...తనకు బిడ్డడు...!—లోకం!

ఆకాశ మనే నదిలో చందమామ కొట్టుకుపోతున్నాడు. చాలా రాత్రయింది.

ఆమె లేచి నిలుచుంది. తన బిడ్డను రొమ్ముకు మళ్ళా మళ్ళా అదుముకుంది. మెల్లగా పడవల దగ్గరకు నడిచింది. బిడ్డను వొక సారి ముద్దుపెట్టుకుంది. "నాన్నా! నాన్నా!" అని వొణికే గొంతుకతో ఆ అబ్బాయిని పిలుస్తూ కన్నీళ్లు విడిచింది. ఆ అబ్బాయి "అమ్మా!" అంటూ యేడ్చాడు. "అమ్మా! అమ్మా!" యెంత తీయగా వుంది ఆ మాట. ఆమె వెక్కి—వెక్కి యేడ్చింది. ఆ అబ్బాయిని ఒక పడవలో వుంచింది. మళ్ళా అతన్ని తీసి యెత్తుకుని మళ్ళా పడవలో వుంచింది. పడవ లంగరు వొదిలివేసింది.

గంగానదిలో ఆపడవ యిటు అటు వూగుతూ మెల్లగా వెడుతూంది...జోరు...పడవ పరిగెడుతూంది. పడవ కానరాదు. దూరాన నదిలో వొక నల్లని చుక్క... అదీ మాయ మయింది.

అయినా ఆమె అటువేపే అలాగున చూస్తూ నిలుచుంది. పది నిమిషాలు—యిటు అటు చూసింది. "నాన్నా! నా చిట్టితండ్రీ" అని అయిసుకలో పడి బోరున యేడ్చింది ఆ కన్నె.

చాలా రాత్రయింది ఆమె యిల్లు చేరుకునే సరికి.

ఆమె గాత్రులు—

ఆమె నడిరాత్రి దాకా యేమో ఆలోచిస్తూ కూచుంటుంది. అప్పుడామెకు చిన్న కూర్కు పడుతుంది. ఆ మాయనిద్రలోనూ ఆమె తన పక్కను దేని కోసమో తడుముకుంటుంది. "నాన్నా! నా చిన్ని తండ్రీ!" అని పలవరిస్తూ లేచి పోతుంది. నిద్రలేచి తన చిన్నితండ్రి కానరాకపోగానే వెక్కి—వెక్కి యేడుస్తుంది ఆ కన్నె.

ఒకరాత్రి నడిరేయిని యిదే విధంగా ఆమె నిద్రనుంచి లేచింది. "నాన్నా! నాచిన్ని తండ్రీ!" అంటూ కిటికీదగ్గరకు వెళ్ళి అవతలకు చూస్తూ "నాన్నా నాచిన్ని తండ్రీ!" అని కేక వేసింది. అవతల కటికచీకటి. బోరు మని వాన. ఆచీకట్లో ఆవానలో తన చిన్నితండ్రి...పొట్టిగా...లేతకాళ్ళతో నడుస్తూ...చిట్టి చేతుల్తో చప్పట్లు చరుస్తూ ...ముద్దు నోరుతో "అమ్మా!" అని పిలుస్తూ... వానలో తడిసిపోతూ జుట్టులోంచి నీళ్లు కారుతున్నా లక్ష్యపెట్టక అమ్మ దగ్గిర "బాయి" తాగడం కోసం వొస్తున్న ట్లనిపించింది కౌబోలు నామెకు. ఆమె కిటికీలోనుంచి బయటకు గెంతివేసింది. ఆమె తల్లిదండ్రులు ఆమెను లేవనెత్తి యింట్లోకి తీసుకు వచ్చి పడుకోబెట్టారు. ఆరాత్రి ఆమెకు చాలా జ్వరం వచ్చింది. ఆజ్వరంలో "నాన్నా! నాచిన్ని తండ్రీ! ఇంత చీకట్లో యింత వానలో భయం వేస్తున్నా అమ్మకోస మని వొస్తున్నావా?" అని పలవరించింది ఆ కన్నె.

జ్వరం పోయింది.

ఆ పదిహేనేళ్ళ అమ్మాయి ప్రతిరోజూ సాయంత్రం వేళ సూర్యుడు వెళ్ళిపోయిన వెనక క్రమ్ముకునే మసకచీకట్లలో మెల్లమెల్లగా తడబడే అడుగులతో గంగానదీతీరానికి వొస్తుంది.

# హిందీ-తెలుగు-కాంగ్రెసు-ఆంధ్రోద్యమం

(రాజా వత్సవాయి రాయజగపతి వర్మ గారు)



ప్రబుద్ధాంధ్రపత్రికలో హిందీని గురించి ఆదినుండియు వ్రాయబడుచున్న విషయములు చేయబడుచున్న ప్రబోధము గమనింప నా కెంతో విషాదము కలుగుచున్నది. 'దేశభాషలందు తెలుగు లెస్స' అను కీర్తి నొందిన ఆంధ్రభాషను తమ బిడ్డలకు నేర్పుటమాని అతిల నుండియు హిందీ నేర్ప బూనిన ఆంధ్రుల దాస్యజీవనముకు విచారింపని ఆంధ్రు డుండబోడని నా నమ్మకము. వేలంవెర్రికి దాసానుదాసు లగు నేటి ఆంధ్రులలో గల లోపముల వెదకుటయే మన పనిగ పెట్టుకొంటిమేని ఎన్ని యేని లోపముల జూపింపవచ్చును. అవ్యక్తతతో సంచరించు వారి తప్పిదములను వెల్లడించి మందలించి మన పని మనము చేసుకొనుట న్యాయము గాని చాదస్తముగ రాయుట ధర్మము కాదని పత్రికాధిపతులు గమనింప ప్రార్థన. ఇక హిందీ ఎంత వరకు అవసర మనునది కూడ ఆలోచింపవలసిన విషయము.

వివిధభాషలతోను వివిధజాతిమతభేదములతోను నిండి యున్న భారతదేశముకు యిపుడు ఆంగ్లేయ పరిపాలనావిజృంభణ వలన ఇంగ్లీషు భాష రాజభాష యైనటులనే కొంతకాలమునకయిన దేశమునకు స్వాతంత్ర్యము లభించునెడల ఏది యైన దేశభాష రాజభాష కాదగిన అవసర మున్నది గాని లేకపోలేదు. మహమ్మదీయపరిపాలనలో హిందూస్తాని రాజభాష యై విలసిల్లుటవలన దానితో దగ్గర సంబంధము గల్గి మన ఆదిభాష యగు సంస్కృతపదమిళితమై యుండు హిందీకి రాజభాష అగుటకు ఎక్కువ వారసత్వ మున్న మాట వాస్తవము. అంత మాత్రముచేత దేశభాషలను వదిలి ప్రవర్తించుట మూర్ఖత. ఇంగ్లీషు రాజభాషగ నున్నంత మాత్రమున దానినే నేర్చుకొనవలెను గాని తెలుగును త్యజింపవలెననుట ఎంత అవ్యక్తతయో కొంచెము హెచ్చుతగ్గుగ నిదియు అంత అవ్యక్తతయే. ఇంతకును దేశమునకు పారతంత్ర్యము పోయిన పిమ్మట కావలసిన విషయమునకిపుడు మాతృభాషను దూరమున నుంచుటకు ప్రయత్నించుట అవ్యక్తత అనవలయునో మూర్ఖత అనవలయునో మరే మనవలయునో ఆలోచింపదగు గాక! ఇట్టి అసంబద్ధపు దూరాలోచనలకు లోనై ఆంధ్రులు తమ పూర్వస్థానమును గోల్పోయి కొట్లాటలతోను కబుర్లతోను వీరావేశములతోను కాలము వెళ్లబుచ్చుచుండుట జూచి తోడి జాతులు ఆంధ్రులను నీచముగ జూచుటలో వింత యేమున్నది?

ఇక నైన యీ అనవసరపు వాదప్రతివాదములకు చోటిచ్చుట మాని పత్రికాధిపతులు తమ విలువగల పత్రికలో ఆంధ్రాభ్యుదయమున కుపకరించు విషయములకు మాత్రమే తావీయవలెనని కోరుచున్నాను.

ఆంధ్రాభ్యుదయమునకు కాంగ్రెసు అడ్డు వచ్చిన దనుట గాని "కాంగ్రెస్సు మనల్ని తొక్కేసింది. వృద్ధరించలేము" అనుట గాని ముమ్మాటికిని అన్యాయము. ఏమంటారు? కాంగ్రెసు మన కోసం పుట్టలేదు. అది భారతదేశము యొక్క దాస్యవిముక్తి కోసం పుట్టింది. పెరిగింది. నెమ్మదినెమ్మదిగా పెంచాం! పెద్దదానిని చేశాం. పెద్ద దయిన తరువాత మన యిష్టం వచ్చినట్లూ వింటుందా? అనేకమార్పులు వచ్చాయి! రాక తప్పదు. కాలచక్రం రోజురోజు మారిపోవుచున్నది. వాయువేగమనోవేగములతో మారిపోతున్నది. మారిపోవడం మంచిది కాదని నే నంగీకరింపను. పెరుగుట విరుగుట కొరకే! అయితే ఆంధ్రులు కాంగ్రెస్సుమహోద్యమంలో కాను మహోజ్వాలలలో పడిపోయి తమ అభ్యుదయాభివృద్ధులకు పాటుపడుట మరచిపోయిన

మాట వాస్తవం. యీదోషం ఆంధ్రులది లేదా ఆంధ్రనాయకులది గాని కాంగ్రెస్సుది కాదు. కాంగ్రెస్సు దేశీయులలో ఎంతో ప్రబోధాన్ని కలిగించింది. జనసామాన్యములో ఎంతో కలకలమును లేవదీసింది. అంతే కాదు. స్వర్గాన్ని అరచేతిలో పిపీలకాది బ్రహ్మపర్యంతం ఆశ్చర్యపడేటట్టు, కన్పింపజేసింది! అయితే ఆస్వర్గం నివురుగప్పిన నిప్పు అయిపోవుటకు కారకులం మనం గాని కాంగ్రెస్సు కాదు! కాదు!! కాదు!!!

కాబట్టి కాంగ్రెస్సులో పనిచేయవలసిన వారు త్యాగప్రధానులు, సర్వసంగపరిత్యాగులు, సన్యాసులు, గాని గృహస్థాశ్రమమున నుండి ఆలుబిడ్డలతో సంసారకాలక్షేపము చేసుకొనువారు ఆమహాసంస్థలో పనిచేయుట కిప్పట్లో తగరు. కాగా ఆంధ్రనాయకులలో చాలమంది తమ జాత్యభివృద్ధికి పూర్వము కంటె ఎక్కువ పట్టుదలతో, మంచి విశాలోద్దేశములతో, పని చేయగలుగుటకు తగిన సమయము వచ్చినది! ఇదివరకు కాంగ్రెస్సులోనైతే నేమి ఆంధ్రోద్యమంలో అయితే నేమి పేరుకోరకు, డాబుకొరకు, వాచాలత్వమును చూపుచు పనిచేసిన దేశద్రోహులు చాలమంది బయలుదేరి ఆంధ్రుల కప్రదిష్ట తెచ్చిపెట్టియున్నారు. అట్టివారు మన కిపుడు అవసరము లేదు. యువ్వాటికిని వలదు.

మన కిపుడు కావలసినది మన జాత్యభివృద్ధి. వెంటనే మేల్కొని తోటి భారతజాతులతో సమాన మైన స్థితికైన మన ఆంధ్రజాతిని తీసుకువచ్చుట! ఇందుకు కర్తవ్య మేమి? మనోవాక్కాయకర్మలతో జాత్యభివృద్ధికి పాటుబడు యువకులు, నాయకులు, కూడ మనలో గలరు. వారిపుడు తమ దృష్టి ఆంధ్రోద్యమములో పాల్గొనుటకు మార్చునటుల మనము ప్రయత్నింపవలెను. ఇందుకు పరదూషణతో నిమిత్తము లేని పత్రికలు మన కెంతో తోడ్పడగలవు. అంతే గాక కొందరు లక్ష్మీపుత్రులు ముందుకు రావలెను. ఆలక్ష్మీపుత్రులను ముందుకు రప్పింపగలిగిన వారు కార్యశూరు లైన దరిద్రు లగు యువకులు!

ఆంధ్రయువకులారా! లెండు, నడుములు బిగింపుడు! మీజాతి అధోగతి పాలగుచున్నది. మీరు మీజాతిని మేల్కొల్పి తగిన స్థితికి తీసుకురాదగిన సమర్థులు, ముందు మీజాత్యభివృద్ధి చూచుకొని పిమ్మట అఖిలభారతజాత్యభివృద్ధికి ప్రాకులాడవలెను గాని తనకు మాలిన ధర్మము మీకు తగదు. వెంటనే ఒక ఆంధ్రమహాసభను రాజమహేంద్రవరములోనో బెజవాడలోనో జరిపి తగిన కార్యక్రమమును నిర్ణయింపుడు. ఇందుకు మన దేశోద్ధారకులు తోడ్పడక మానరు. పిఠాపురం, వెంకటగిరి, బొబ్బిలి యువరాజులు, మోతే వారు, పైడా వారు, ముత్తావారు, నాళంవారు మున్నగు లక్ష్మీపుత్రులు, ఆంధ్రకేసరి వంటి కార్యనిపుణులు తప్పక ముందుకు రాగలరు. కావున జాగు సేయవల దని ఆంధ్రయువకుల నందరిని హెచ్చరించుచున్నాను.

## కవులకూ వ్యాసకర్తలకూ విన్నపం

ప్రబుద్ధాంధ్రలో ప్రకటించడానికి ఎవరూ పద్యాలు పంపవద్దు. ఆంధ్రోద్యమమూ, చరిత్రా, సంఘాచారాలూ, మతాలూ, కళలూ, పరిశ్రమలూ, గొప్పవారి జీవితాలూ, ప్రపంచవృత్తమూ వగైరాలకు సంబంధించిన వ్యాసాలూ, కథలూ, ఏకాంకనాటకాలూ, విమర్శనాలూ వచనంలోనే కావాలి. ప్రకటించబడని రచనలు పోస్టుబిళ్లలు పంపినగాని తిరిగి పంపలేము. కర్తలకు వారిరచన పడిన సంచిక మొదలు ౧౨ సంచికలు పంపుతుంటాం. తరుచు రాసేవారికి ఎప్పుడూ పంపుతూ వుంటాము. రెవ్యూ కోసం పుస్తకాలు పంపేవారు రెండేసి ప్రతులు పంపాలి. రెవ్యూలమీద పునర్విమర్శలు ప్రకటించము.

# హిందీవల్ల తెనుక్కి జరుగుతూ వున్న అపకారం



హిందీవల్ల తెనుక్కి అపకారం జరుగుతోం దన్నందుకు కినిసి, ఆవేశపరులై హిందీప్రచారకులు నేను రాయనివి రాసినట్టూ, చెప్పనివి చెప్పినట్టూ ప్రచారం చేస్తూ తమ వాదాన్ని బలపరుచుకుంటున్నారు.

౧. ప్రస్తుతం హిందీప్రచారం చేస్తూవున్న ఆంధ్రుల వల్ల జాతికి కళంకం కలుగుతోంది. హిందీవల్ల తెనుక్కి వల్లమాలిన అపకారం జరుగుతోంది. ఉత్కృష్టఫలాలు సాధించవలసిన ప్రజల శ్రద్ధాదీక్షలూ, ఆంధ్రవాఙ్మయానికి పుష్టి కలిగించవలసిన తెనుగువారి డబ్బూ వ్యర్థమై పోవడమే కాకుండా ప్రధాన విషయానికి యెసరు పెడుతున్నాయి.

౨. అనేక జాతులూ, అసంఖ్యభాషలూ కల హిందూదేశానికి వొక సామాన్యభాష అవసరమే. హిందీకి సామాన్యభాష కాదగిన అర్హత వుండడమూ నిజమే.

౩. కాని. "హిందూదేశానికి సామాన్యభాష యేది!" అనే విషయం యింకా పరిష్కారం కాలేదు మహమ్మదీయులు హిందీని అంగీకరించడం లేదు. అయితే సమయం వచ్చే దాకా వారి ప్రతిఘటనం మనకి స్పష్టంగా కనపడదు. వారు తమ శక్తినంతా మరొక ప్రధానవిషయంమీద కేంద్రీకరించివున్నారు. నిజంగా సామాన్యభాష యేదో తేలవలసిన సమయంలో వారు భల్లూకప్పట్టు పడతారు. అప్పుడే ఏదో తేలుతుంది. ఇప్పుడు జరుగుతూ వున్న హిందీప్రచారం హిందూస్థానీలు తమ భాష కింకా మెజారిటీ సంపాదించుకోడానికి చేసేదే; గాని మరొకటి కాదు. నిజంగా మహమ్మదీయులు తలుచుకుంటే యీ పరిస్థితుల్లో మన దేశంలో మెజారిటీ, మైనారిటీలను బట్టి యేవిషయమూ పరిష్కారం కాదు.

౪. అయినా హిందీప్రచారం యిప్పుడు జరుగుతూ వున్న విధంగా అవసరం లేదు. ఇంత యెత్తునా అక్కర్లేదు. ఇప్పు డసలే పని లేదు.

ఇంతే.

సంపాదకుడు.

౧

"మనమీదికి హిందీ దాడి వెడలిం దన్నప్పటి నుండీ మీరు యెత్తిన జెండా ఆకాశాని కంటి, అన్ని దిశలను యెగురుతున్నది. ఛలు అందరు కళ్లు తెరిచారు. మీ ప్రయత్నాలకు తగిన ఫలితం తప్పకుండా వుంటుం దని నా నమ్మకము. హిందీ ప్రచారకుల కృషి అంతా స్వార్థముతో కూడు కొన్నది కాని హిందీమీద ప్రేమ వుండీ గా దని తెనుగునాడు గ్రహించింది. ముందు యిలా జరుగుతుం దని గ్రహించాడు కాబోలు, మహానుభావుడు "ఆంధ్రరత్నము" ఆంధ్రాన్ని గూర్చి వ్రాస్తూ "గాంధి కోమటి వచ్చి హిందీచే నెట్టించి, బంచెలో బెట్టింప........" అని అన్నాడు.

కర్ణపాలెం కృష్ణారావు.

౨

భారతజాతీయతకి భారతీయు లంతా ఒక్క భాష మాట్లాడడం అవసర మనిన్నీ యిదివరకే యెక్కువ మంది మాట్లాడుతూన్న హిందీనే వ్యవహారభాష చెయ్యడం సులభ మనిన్నీ చాలామంది అంగీకరించిన సంగతే. ఈ విషయంలో గాంధి మహాత్ముడు కూడా పట్టుదల చెయ్యడంవల్ల మరింత తీవ్రంగా యీ ప్రచారం సాగుతూంది. దీనికి అంతా సంతోషించవలసిందే.

కాని హిందీప్రచారం అతివ్యాప్తి పొందుతూ ఆంధ్రభాషకి అడ్డం వస్తూం దని ప్రబుద్ధాంధ్రపత్రిక ఘోష చేస్తూంది. ప్రబుద్ధాంధ్ర సంపాదకులు కూడా హిందీభాష అందరికీ తెలియడం అవసరమే నని ఒప్పుకోకపోరు. అయితే హిందీ నేర్చుకునే

వారిలో చాలామంది తెలుగు నేర్చుకోవడం లేదనిన్నీ హిందీమీద చూపేటంత మక్కువైనా తెనుగుమీద చూపడం లేదనిన్నీ అందువల్ల తెనుగుకి అపకారం జరుగుతూంది దనిన్నీ ఆపత్రికవారి అభిప్రాయమని నేననుకుంటాను.

అయితే నిజంగా హిందీప్రచారంవల్ల తెలుగుకి నష్టం కలుగుతూందా? హిందీప్రచారకులు తప్పు త్రోవలలో పడ్డారా? ఇప్పటి పద్ధతులతో నే యింకా కొంతకాలం హిందీప్రచారం సాగినట్టయితే తెలుగుభాషకి తీరని నష్టం కలుగుతుందా? ఈసంగతులన్నీ ఆలోచించవలసివుంది. అందరికి హిందీ తెలియడం అవసరమన్న విషయంలో తగువే లేదు. కనుక ఎక్కువ బాధ లేదు. హిందీప్రచారంలో తప్పుదారులుంటే మంచి దారికి మళ్ళించడానికి ప్రయత్నించవచ్చు. శాంతంతోటీ దూరదృష్టితోటీ పని చేస్తే యీ తగువు సులభంగానే తీరిపోతుంది. కాని ప్రబుద్ధాంధ్రవారికి హిందీప్రచార మంటేనే యిష్టం లేదని ప్రచారకులున్నూ హిందీప్రచారకులంతా తెలుగుకి శత్రువులే అయిపోతున్నారని ప్రబుద్ధాంధ్రవారున్నూ ఆవేశపడి పని చేస్తే యిద్దరి కోరికలూ నెరవేరవు. కలతలకి కారణా లవుతాయి. దానివల్ల దేశానికి గొప్ప నష్టం రావడానికి అడ్డం లేదు.

ఆంధ్రు లంటే ఆవేశపరులని వ్యగ్రోత్సాహులని అర్థం చెప్పవచ్చు అన్నంత హెచ్చుగావుంటుంది. కనుక దూరదృష్టి వుండవలెనని వేరే చెప్పక్కర్లేదు కదా! ఒకప్పుడు ఇంగిలీషే దేశభాషగా మారితే బాగుంటుందని కొందరు నాయకు లనుకొనే వారు అభిప్రాయపడ్డారు. అందులో ప్రసిద్ధికెక్కిన హరిసర్వోత్తమరావుగారు తెలుగువారిలో ముఖ్యులు. అప్పుడు వారు ఆంధ్రపత్రికకు ప్రధాన సంపాదకులుగా వుండేవారు కూడాను. అప్పుడు వారు తమ బంగారపు కలంతో రత్నాల భావాలలో యింగ్లీషు భాషే వ్యవహారభాషా యింటి భాషా కూడా అయితే గాని మన దేశానికి ముక్తి లేదని గట్టిగా నొక్కి వ్రాశారు. భగవంతుడి దయవల్ల ఆవెర్రి. చాలామందికి యెక్కలేదు. ఆయన ఉద్యోగాంతముతో ఆగొడవ కూడా అంత మైపోయింది.

ఇంగ్లీషు రాజభాష అవడంచేత దానితో కోర్టులలోనూ కచ్చేరీలలోనూ అవసరం కలిగింది. ముఖ్యముగా గవర్నమెంటు ఉద్యోగాలు జీవనోపాధులుగా కొంతకాలం వుండడంచేత చాలామంది ఆవ్యామోహంలో పడి యింగ్లీషు నేర్చుకున్నారు. ఉద్యోగాలు అవసరం లేని కొద్దిమంది వ్యవహారాలకి గౌరవాలకీ నేర్చుకున్నారు. ఉద్యోగలబ్ధి లేకపోయినా యిప్పుడు కూడా చాలామంది ఆడియాసలతో నేర్చుకుంటూన్నారు. కొత్తగా యింగ్లీషు నేర్చుకోవడం ఆరంభించిన మొదటి రోజులలో కొంత కాలం బాగానే నడిచింది వ్యవహారం. అంతకంతకు వారి సంఖ్య యెక్కువ కాగానే అట్టివారంతా ఒక శాఖగా మారిపోయారు. క్రమంగా వారికి తెనుగంటే రోత పుట్టింది. ఇంగిలీషు రాని చుట్టాల కయినా తెలుగులో వుత్తరాలు వ్రాయడమూ, తెలుగు పుస్తకాలు చదవడమూ తెలుగు పత్రికలు చూడడమూ చివరకి తల్లితోటీ పెళ్ళాముపిల్లలతోటీ కూడా తెలుగు మాట్లాడడమూ తెనుగువారితో కలిసి మెలిసి వుండడమూ చిన్నతనంగా కనిపించి తమ సంఘముతో తమామూ వేరైపోవడం తటస్థించింది. తమ దేశీయులకు వారు క్రమముగా చేరి చూడరాని వింతవారైనారు. ఈలాగు జనాభా లెక్కలలో చదువుకున్న వారని చెప్పబడే చాలామంది తెలుగు దేశానికి తెలుగు భాషకూ కొరగాని వారైపోయినారు. ఇందువల్ల తెలుగుకి యెంత నష్టం వచ్చిందీ లెక్క కట్టడానికి యెవరికి తర మవుతుంది? తెలుగు జనసంఖ్యకంటె మించని జనసంఖ్యమాత్రమే గల బంగాళీభాషా పత్రికలలో దినపత్రికలలో కూడా ౨౦, ౩౦, ౪౦ వేల మంది చందాదారులు గల పత్రిక లుండగా

ఆదేశంలో యింగ్లీషు చదువుకొన్న విద్యావంతులలో వేలకొలది మంది స్వభాషలో దినదినమూ దేశోపయోగకరము లైన గ్రంథాలు వ్రాసీ పత్రికలకు విజ్ఞానప్రదము లైన వ్యాసాలు వ్రాసి భాషకూ దేశానికీ తోడ్పడుతూ వుండగా ఆభాషలో జాతీయభావాలతో నిండిన పుస్తకాలు వేలకొలది నిత్యమూ బయలుదేరుతూ లక్షలకొలది ప్రతులు ఖర్చుపడుతూ ప్రజలను విజ్ఞానసంపన్నులుగానూ దేశాభిమానులుగానూ మార్చుతూ వుండగా రెండు వేలకు మించిన చందాదార్లు గల పత్రికలు గాని సంవత్సరములో వేయిప్రతులు విక్రయం కాగల పాటి భాగ్య మైనా పట్టిన పుస్తకాలు గాని తెలుగులో వుండకపోవడానికి కారణ మేమిటి? ఇంతటి అరిష్టానికీ ఇంతటి మహోపద్రవానికీ యింగ్లీషు నేర్చుకున్న మన ప్రబుద్ధులే హేతు వని తెలుసుకున్నప్పుడు ఏకొత్తభాషన్నా ఆంధ్రులు భయపడడం సహజమే అనుకుంటాను. అదీ సహజధోరణిలో అతిక్రమణం చెయ్యకపోవడం పరీక్షయకారణం అవడం కూడా సహజమే అనుకుంటాను.

అయితే హిందీప్రచారం కూడా యింగ్లీషు లాగే ఆంధ్రభాషాభివృద్ధిని అరికట్టే లాగు వుందా? అట్టి చిన్నె లేమైనా కనపడుతూన్నాయా? అని ఆలోచించి చూడవలసి వుంది. ఇప్పుడు హిందీ నేర్చుకుంటూన్నవా రంతా ఏకభాషావ్యవహారం అవసరమని గ్రహించి దేశాభివృద్ధి నేలక్ష్యంలో వుంచుకుని దేశాభిమానంతోటే నేర్చుకుంటూన్నారా అంటే లేదని గట్టిగా చెప్పవచ్చును. స్వరాజ్యోద్యమాన్ని గురించి అదివరకే తెలుసుకున్నవారూ స్వరాజ్యం కోసరం అదివరకే పాటుపడుతూన్న వారూ వీరిలో లేనే లే రని కాను. అట్టి వారు చాలా కొద్ది మంది వున్నా రనీ తక్కిన వారిలో ఎక్కువ మంది సరదా కనీ కొంతమంది నలుగురితోటి పాటూ వుండడాని కనీ నేర్చుకుంటూన్నా రంటే నిజానికి దగ్గిర కాకపోను. హిందీ నేర్చుకునే వారిలో దేశవిషయాలు తెలుసుకునే వారూ దేశాభిమానం గలవారు ఖద్దరు కట్టేవారు లేకపోయినా యేవిధంగా నైనా సరే దేశోపయోగానికి శక్తి కొద్దీ పాటుపడేవారు ఎందరుంటారో చూతామని లెక్క వేసే వారికి సంపూర్తిగా ఆశాభంగం అయి తీరుతుంది. అన్నిటికంటే తెలుగు కూడా నేర్చుకుందా మనుకునే వారు కాని తెనుగు నేర్చి హిందీ నేర్చుకోవడమే ధర్మ మనుకునేవారు గాని ఎందరున్నా రన్న మాట తలపెట్టుకున్న వారికి తలవంపు తప్పదు. ఇదివరకు ఇంగిలీషు తెనుగును బాగా కుంగదీసింది. ఇప్పుడు హిందీ చదివే వారికి అంటే వారిలో చాలామందికి అనగా నూటికి సగం మందికి పైగా తెనుగంటే అభిమానం లేదు వారు తెనుగు వార్తా పత్రికలు మానేరు. తెనుగు పుస్తకాలు చదవరు. వారికి తెలుగు పుస్తకాలు తెలియవు. దాని తియ్యదనమూ దాని మెత్తదనమూ దాని జానుతెనమూ తెలుసుకుని ఆనందింపగల మహాభాగ్యము పాపము! వారికి ప్రాప్తము లేదు! కాని వారివల్ల తెలుగు పొందవలసిన పుష్టి పొందడం లేదు. దానికి కలగవలసిన ఫలం కలగడం లేదు. తెనుగుతల్లి తన కన్న బిడ్డలు తన పట్ల చూపే నిరాదరణం చూచీ తన పిల్లల పామరత్వము చూచీ సిగ్గుపడుతూంది. విచారిస్తూంది. సంతాపపడుతూంది. పయి సంగతులు తెలుసుకున్న వారికి హిందీవల్ల కూడా తెలుగుకి దెబ్బ తగులుతూందని తోచడం తప్పు కాదు. తెలుగును గట్టిగా ప్రేమించే వారు హిందీ అంటే భయపడడం కూడా అసహజం కాదు.

అయితే ఏవుద్దేశ్యంతో నేర్చుకుంటే యేమిటి? ఎవరు నేర్చుకుంటే యేమిటి? ఏమీ నేర్చుకోకుండా వృథాగా వుండేవారు హిందీ అయినా నేర్చుకోవడం మంచిదే కాదా? వారివల్ల తెలుగు కేమి అడ్డం వస్తుంది? వారు అసలు తెనుగు చదవని వారే కదా! తెనుగు మీద అభిమానం లేని వారే కదా! తెలుగుపత్రికలకీ పుస్తకాలకీ వారివల్ల అప్పు

దూ యిప్పుడూ కూడా లాభం లేనే లేదు కదా! దీని కింత రభస చెయ్యడం యెందుకూ? అని కొంతమంది అడగవచ్చును. ఈప్రశ్న పైకి బాగానే కనపడుతుంది. ఈసంగతి నిజం లాగే తోస్తుంది. కాని ఆలోచించి చూస్తే దీన్నికూడా స్వభాషాభిమాని స్వదేశాభిమాని అయిన తెనుగువాడు సహించవలసిందీ ఉపేక్షించవలసిందీ కూడా కాదు.

ఏమంటారా! తెనుగు బాసలో ప్రవేశం లేని వారికీ దాని ఫసందు తెలియని వారికీ దాని గొప్పతనమూ దాని సౌకుమార్యమూ దాని సౌందర్యమూ దాని సారస్యమూ తెలవక పోవడం చేత దాని మీద ఎన్నటికీ వారికి మక్కువ పుట్టదు. మోజు కలగదు. అభిమానం వుండదు. అందువల్ల తమ సంతానానికీ తమఅదుపాజ్ఞలలో వున్న వారికీ తమసలహాలు వినే వారికి తమ చుట్టపక్కాలకీ తమ చుట్టుపక్కాల వారికీ కూడా హిందీ నేర్చుకోమని చెప్పడం నేర్పించడం తప్ప తల్లిభాషమీద శ్రద్ధ తీసుకోవడం తటస్థింపదు. అందువల్ల అట్టి వారి యిళ్లు క్రమంగా హిందీలోగిళ్లే అయిపోతాయి. అప్పుడు వారి యిళ్లు తెలుగుబాసకి యెడమయి పోతాయి. కొన్నాళ్లకి స్వభాషయిన తెనుగు పరాయిభాషగా మారిపోతుం దంటే ఆశ్చర్యపడవలసిన పని లేదు. ఇది భవిష్యత్తులో మాట గాని యిప్పటిది కాదు గనుక వేళాకోళపు మాటగా కనపడుతుంది.

ఇంకో సంగతి. తెలుగులో బాగా ప్రవేశం లేని వారు గాని తెలుగులో పాండిత్యం లేని వారు గాని హిందీలో గాని యితరభాషలలో గాని పండితులూ కవులూ గ్రంథకర్తలూ కాగూడదా అల్లా అవడం తప్పా? అంటే అట్టివారు స్వభాషలో కృషి చేసి కృతార్థులు కాలేక యితరభాషలలో సులభంగా ప్రవేశం పొందగలిగితే అందులో పాండిత్యం సంపాదించడం తప్పు లేదు గాని భీష్మించినట్టూ, తెనుగు నేను చదవనే చదవను అని ఒట్టు పెట్టుకున్నట్టూ స్వభాషను అంటరానివా రని తన వారినే అలుసుగా చూస్తూన్నట్టు చూడడం ఆరంభిస్తే అది గొప్ప తప్పే అవుతుంది. అంటరాని వారని దూరంగా తోసివేసిన వారిని దగ్గిరికి చేరదీస్తేనే గాని గతి లేదని పశ్చాత్తాపపడుతూన్నట్టు స్వభాషను ప్రేమిస్తేనే గాని మోక్షం లేదని తెలుసుకుని పరితాపపడే రోజులు తెలుగువారికి రాకపోవు.

మరో మాట! హిందీప్రచారకులు కూడా ముఖ్యంగా గమనించ దగ్గది. ఏమిటంటే? హిందీప్రచారకులలో గాని హిందీ వుపాధ్యాయులలో గాని పెక్కుమందికి అంటే నూటికి తొంభై మందికి పైగా తెలుగులో తగిన ప్రవేశం లేదు. అందువల్ల ప్రచారం కూడా సరిగా జరగ దనీ ఇది హిందీ అభివృద్ధికి అడ్డంకి అనీ నిజం కప్పిపుచ్చ లేని అనుభవజ్ఞు లంతా ఒప్పుకునే సంగతే. చాలమంది యింగ్లీషు పండితులు తెలుగులో ప్రవేశం లేకపోవడం చేత శిష్యులకు బాగా తెలిసేటట్టు చెప్పడం చేత కాక పోవడమూ శిష్యులు తెలిసిన దానితోటే సంతుష్టి పొందడమూ అనేకచోట్ల చూస్తూన్నాము. అల్లాగే హిందీప్రచారకులు కూడా తాము తమ భాషలో ప్రవేశం లేని వారవడంవల్ల కొన్నికొన్ని ఘట్టాలలో సరిగా అర్థం చెప్పలేకపోవడమూ నిఘంటు చూచినా తెలియకపోవడమూ, కూడా కలుగుతూంది. కాబట్టి హిందీప్రచారం బాగా సాగవలె నన్నా తెలుగువారు ముందుగా తెలుగు

నేర్చుకోవడం అవసరం అని తేలుతూంది. పరభాషయిన (ఇక్కడ పరభాషంటే యిదివరకు పరిచయం లేని భాషా కొత్త భాషా అని మా అభిప్రాయం గాని వ్యవహారభాషగా దేశమంతా వ్యాపింపవలసిం దని నమ్మిన హిందీని పరాయిదానిగానూ అగత్యం లేని దానిగానూ భావించి చెప్పడం కాదు) హిందీ నేర్చుకోవడంలో గల దీక్షలో పదోవంతు దీక్ష వుంటే మాతృభాషైన తెలుగు హిందీకంటె పదిరెట్లు త్వరగా పట్టుపడుతుంది. హిందీ నేర్చుకుంటూన్నా రంటే వచ్చే గౌరవం తెలుగు కూడా నేర్చుకుంటూన్నా రంటే తగ్గిపోదు. తెలుగు సంస్కృతాలవలె తెలుగు హిందీలు నేర్చునని ఉభయ భాషాప్రవీణు లనిపించుకోవడం గౌరవం మాత్రమే కాకుండా ఉభయతారకం కూడా అవుతుంది గనుక హిందీవిద్యార్థు లయిన ఆంధ్రు లంతా తెలుగు ముఖ్యంగా నేర్చుకుని తమ భాషాజననికి న్యాయం చేసి ఆశీస్సులు పొందడం ధర్మ మని హెచ్చరిస్తూ న్నాను.

ఇక్కడ, ప్రచారకుల ముఖ్యధర్మం ఆవశ్యకరణీయం కూడా ఒకటి వున్నది. అది యేమంటే! ఇదివరకు తెలుగు రానివారు అనగా తెలుగుబాసలో అక్షరజ్ఞానం లేనివారూ తెలుగంటే సరదా లేనివారూ దాని మీద మక్కువ లేనివారూ హిందీ నేర్చుకోవడానికి వస్తే చెప్పమంటారా వద్దంటారా? తెనుగు కూడా చదువుకో మంటే వారు వినకపోతే ఏమి చేసేది? అని వూరుకోక వారికి తెలుగులో అభిరుచి పుట్టించడానికి శక్తికొద్దీ ప్రయత్నించాలి.

దేశభాష లన్నింటిలోనూ తెలుగు బాస మృదువైనది మధురమైనది. అందమైనది. దీనిని అనేక భాషలు తెలిసిన పండితులు చాలామంది సిద్ధాంతం చేశారు. దేశభాష లందు తెలుగు లెస్స అని ఆంధ్రవిష్ణువు కలలో చెప్పినట్లు సంస్కృతకర్ణాట ఆంధ్రాది అనేక భాషలలో గొప్పపండితుడై కవియై గ్రంథరచయితయైన కృష్ణదేవరాయలే గొంతెత్తి చెప్పినాడు. పూర్వఖండములలోని భాషలలో కెల్ల ఇటాలియను బాస వంటిది తెలుగని అనేకభాషల రుచులు గ్రహించిన పాశ్చాత్యపండితు లుద్ఘోషిస్తున్నారు. తెలుగంత మధురమైన భాష వేరొకటి లేదు. తెలుగుదేశంలో పుట్టి తెలుగుసును తాగక పోవడం కంటె దురదృష్టమూ దౌర్భాగ్యము లేదు. అయ్యో! సోదరులారా! తెలుగుతల్లిని ప్రేమించి ఆమెను సేవించి పూజించి ధన్యులు కండు అని బోధించి మరల్చుడు!

తెనుగుబాసను నేర్చుకొనుడు తెనుగు రుచిని గ్రహించుడు అని తెనుగు బిడ్డలకు నేటికి బోధించవలసిన దుర్గతి కలిగినది గదా అని వాపోవుచు మిన్నకుండక హిందీప్రచారకులకూ అభ్యాసకులకూ యితరులకూ కూడా తెనుగుయొక్క గొప్పతనము తెలిసేటట్లు తెలుగుపత్రికల ద్వారానూ హిందీ పత్రికల ద్వారానూ గూడా ప్రబోధించి తెలుగు వెలుగుచే కన్నులు మిరుమిట్లు గొలిపి దాని తేజస్సును చూచి నిర్వైరపడి లోక మెల్ల దాసోహ మనునట్లు కృషి చేయుదురు గాక యని ప్రబుద్ధాంధ్రవారిని కూడా కోరుతున్నాడు. స్వస్తి!

—మంగిపూడి వేంకటశర్మ.

౧

నా మిత్రు లగు మారేమండ రామారావుగారు "ప్రబుద్ధాంధ్ర" సెప్టెంబరు సంచికయందు పై శాసనమును ప్రకటించియున్నారు. వారి వ్రాతను బట్టి చూడ నీశాసనమును గురించి యిదివరకు వారికి తెలియనటుల కాన్పించుచున్నది. కాని యీమధురపూడి శాసనము యొక్క మూలము కలనల్ మెకంజీ దొరవారిచే సంపాదింపబడి. సి. పి. బ్రౌను దొరవారిచే పునరుద్ధరింపబడిన స్థానికచరిత్రలయం దుండి చరిత్రకారు లనేకులకు తెలిసియే యున్నది.

రామారావుగారు వ్రాసినట్లు శాసన మంతయున్న పదునారు పంక్తులను తెలుగు భాషలో లేవు. ఇందలి మొదటి మూడున్నర పంక్తులును సంస్కృత శ్లోకరూపకముగను, మిగిలిన పన్నెండున్నర పంక్తులను తెలుగు వచనమందును. ఉండి, శాసన మంతయు తెలుగు లిపియందును చెక్కబడి యున్నది.

పైశాసనమున చెప్పబడిన దానమును కాటయవేముడు శా. శ. ౧౩౨౬ తారణసంవత్సర పుష్య శుద్ధ దశమీ గురువారమునాడు చేసి యుండె నని శ్రీరామారావుగారు వ్రాసి యున్నారు. ఇది తప్పు. శా. శ. ౧౩౨౬ తారణపుష్య శుద్ధ దశమి పైశాసనమున చెప్పబడి యున్న ప్రకారము మకరసంక్రమణపుణ్యదినము కాదు. పుష్యబహుళదశమినాడు మకరసంక్రమణమై యున్నది. స్థానికచరిత్రలయందుదాహృత మైన మధురపూడి శాసనమందు "స్వస్తి శ్రీ శకవరుషంబులు ౧౩౨౬ అగు నేంటి తారణ సంవత్సర పుష్య బ ౧౧ గు నేంటి మకరసంక్రాంతి పుణ్యాకాల"ము నందు అని యున్నది. ఇదియే సరియైన పాఠము కాని రామారావుగా రిచ్చిన పాఠము కాదు. శాసనమందు "సు" అని శ్రీరామారావుగా రిచ్చిన యక్షరము "బ" అని చదువుకొనవలెను. ఈ విషయమందే గాక వీరు వేరొక విషయమున గూడ పొరబడిరి. శా. శ. ౧౩౨౬ తారణ సంవత్సర పుష్యశుద్ధ దశమీ గురువారము క్రీ. శ. ౧౪౦౫ వ సంవత్సరము మార్చి ౧౫ వ తేది యగుచున్న దని గుణించిరి. ఇది తప్పు. శా. శ. ౧౩౨౬ తారణ పుష్యశుద్ధ దశమీ శనివారమునకు సరియగు హూణమానము క్రీ. శ. ౧౪౦౪ వ సంవత్సరము డిశంబరు ౧౩ వ తేదీ యగుచున్నది గాని రామారావుగా రనునటుల క్రీ. శ ౧౪౦౫ వ సంవత్సరము మార్చి ౧౫ వ తేదీ యగుట లేదు. మన శాసనకాలము శుద్ధ దశమి కాక బహుళ దశమి యగుటచే క్రీ. శ. ౧౪౦౪ సంవత్సరము డిశంబరు ౨౩ వ తేదీ యగుచున్నది.

ఈశాసనమువలన కొన్ని సమస్య లేర్పడుచున్నవని రామారావుగారు వ్రాసి యున్నారు. క్రీ. శ. ౧౪౦౫ నాటి కి కుమారగిరిరెడ్డి జీవించి యుండెనా యనున దొకటి యుట! గౌతమీతీరమున నున్న వేదాద్రి యెద్ది యనునది రెండవ సమస్య యట! కోరుకొండకు సమీపమం దున్న మధురపూడిని కాటయవేము డెట్లు దానము చేసె ననునది మూడవ సమస్య యట! ఈశాసనమువలననే యీసమస్య లేర్పడలేదు. ఈవిషయము లిదివరకే చర్చింపబడినవి. అయినను ఇందలి మొదటి సమస్య విషయమై రామారావుగారు "యీశాసనకాలమగు క్రీ. శ. ౧౪౦౫ వరకును అనగా పెదకోమటి వేముని రెండవ రాజ్యసంవత్సరమునకూడ కుమారగిరిరెడ్డి జీవించియుండె" నని యొక విపరీత సిద్ధాంతమును చేసి, యద్దానిని సమర్థించుకొనుటకై ఎన్నియో యసందర్భపు పనులను చేసి యున్నారు. అందు మొదటిది "కుమారగిరి జీవించియుండగనే యతనిని రాజ్యచ్యుతుని జేసి పెద్దకోమటి వేముడు కొండవీటి సింహాసనము నధిష్ఠించె నని శ్రీయుత చిలుకూరి వీరభద్రరావుగా రభిప్రాయపడియున్నా రని యసత్య మాడుట. చరిత్రచతురాననులును, పరమపూజ్యులును అగు శ్రీవీరభద్రరావుగారు వ్రాయని వ్రాతలను సృష్టించి వారి పేరున ప్రజ

లను మోసగింప సాహసించినందులకు రామా రావుగారి ధైర్యము నెంతయు గొనియాడవలసి యున్నది. శ్రీవీరభద్రరావుగారు తమ యాంధ్రుల చరిత్ర మూడవభాగమందు ౧౯౭ పుటయందు పై జెప్పిన యభిప్రాయమును వెల్లడించినటుల రామారావుగారు వ్రాయుచున్నారు. కాని అపుట యందలి ప్రతి యక్షరమును నేను చూచియున్నను శ్రీవీరభద్రరావుగారు పైయభిప్రాయమును వెలి బుచ్చినటుల కాన్పించలేదు. సరి గదా, ఆగ్రంథ మందే ౧౯౮ పుటయందు "కుమారగిరిరెడ్డి కొక కుమారరత్న ముండినను, ప్రోలయవేమారెడ్డి మను మడు పెదకోమటి వేమభూపాలుడు, సింహాసనా రూఢు డగుటయు, కాటయవేమారెడ్డికిని పెదకో మటివేమభూపాలునకును మనస్పర్ధ గలుగుటయుం జూడ కోమటివేమభూపాలుడు కొండవీటిరాజ్య మును బలాత్కారముగా గ్రహించె నని విశ్వసింప వలసి వచ్చుచున్నది." అని జీవించియున్న కుమార గిరిరెడ్డి దగ్గరనుండి గాక యాతని పుత్రుని యొద్ద నుండి కోమటివేమారెడ్డి రాజ్యమును గ్రహించి యుండు నని శ్రీవీరభద్రరావుగా రభిప్రాయపడి యున్నారు. మరియు "కుమారగిరిరెడ్డి భూపాలుడు క్రీ. శ. ౧౪౦౦ వఱకును బరిపాలనము చేసి యున్నట్లు గన్పట్టుచున్నది. ఇతనితో వేముని వంశ మంతరించినట్లు గన్పట్టుచున్నది. కుమారగిరిరెడ్డి కొక కుమారు డున్నట్లొకటి రెండు శాసనములవలన దెలియవచ్చినను అతని యనంతరము పెదతాత మనుమడు కోమటివేమారెడ్డి ప్రభుత్వభారము వహించెను." అని ౧౯౩ వ పుటయందును, "కుమారగిరిరెడ్డి యనంతర మక్రమముగాఁ బెద కోమటివేమభూపాలుడు కొండవీటి రాజ్యము నాక్రమించెను" అని ౨౧౧ వ పుటయందును, "కుమారగిరిరెడ్డి మరణానంతరము అనపోతరెడ్డి రాజ్యమును బొందవలసినవాడై యుండగా పెద కోమటివేమారెడ్డిరాజ్య మాక్రమించుకొని పరిపాల నము చేసినట్లు గానంబడుచున్నది" అనియు, "కొండవీటి సామ్రాజ్యము కుమారగిరి మరణముతో రెండుగా జీలిపోయిన దనుట వాస్తవము" అనియు శ్రీవీరభద్రరావుగారు తమ "శ్రీనాథకవి" అను గ్రంథమందును కుమారగిరిరెడ్డి మరణానంతరమే పెదకోమటివేముడు రాజ్యమునకు వచ్చె నని స్పష్టముగా వ్రాసియుండగా రామారావుగారు కల్పితవ్రాతలు వ్రాసి చరిత్రకారుల కండ్లయందు దుమ్ముగొట్ట జూచుట మిక్కిలి శోచనీయము. సుప్రసిద్ధ చరిత్రకారుని వ్రాతల నిష్టము వచ్చినట్లు మార్చుట అతి సాహసము.

రామారావుగారి సాహస మింతతో నాగ లేదు. బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి "శృంగారశ్రీనాథ" మను గ్రంథమందలి ౫౧ పుట నుండి "కుమారగిరి ౧౪౦౩ వరకు రాజ్య మేలెను." అని ఉదాహరించి యున్నారు. నిజమునకు ప్రభా కరశాస్త్రిగా రా పుటయందు "కొమరగిరి క్రీ. ౧౪౦౦, ౧౪౦౩ వరకు రాజ్య మేలెను" అని వ్రాసియున్నారు. తమ యసంబద్ధ వ్యాఖ్యానమును సమర్థించుకొనుటకు పైవాక్యమందలి "౧౪౦౦" అను సంఖ్యను రామారావుగారు దిగమ్రింగిరి. శ్రీప్రభాకరశాస్త్రిగారు తమ గ్రంథమును రచించు సమయమున కుమారగిరి రాజ్యము చేసిన యాఖరు సంవత్సరము క్రీ. శ. ౧౪౦౦ యైనను, లేక క్రీ. శ. ౧౪౦౩ అయిన నైయుండు నని సందియమును వెలి బుచ్చిరే గాని క్రీ. శ. ౧౪౦౩ అని నిశ్చయముగ చెప్పలేదు. మరియు "కుమారగిరి చనిపోయిన తరవాతనే పెదకోమటి వేమారెడ్డి రాజ్యమునకు వచ్చెను గాని అతడు జీవించియుండగా మాత్రము కాదు" అని యీమధ్య చెన్నపురియందు శ్రీప్రభా కరశాస్త్రిగారు నాతో చెప్పి యున్నారు.

ఇంకొక చిత్ర మేమనగా క్రీ. శ. ౧౪౦౪ లో కుమారగిరి మరణించియుండినచో మరుసటి సంవత్స

రము కొటయవేముడు కుమారగిరిని తన "స్వామి" యని పేర్కొని యతని కత్యుయసుకృతముగా మధురపూడిని దానము చేయుట పొసగనేర దట! అహో! చరిత్రపరిశోధకు లగు రామారావుగారి పోకట లెట్లున్నవో చూచితిరా! కుమారగిరి మరణానంతర మాతని కొటయవేముడు తన "స్వామి" యని పేర్కొనకూడదా? ఇటు లే శాస్త్రము చున్నది? మరణించిన వాని కత్యుయసుకృతముగా దానము చేయుట పొసగదా! పొసగ దని రామారావుగారి దయచే చరిత్రపరిశోధకు లిక తెలిసికొన వలయును గాబోలు. ఎవరి కత్యుయసుకృతముగా దాన మిచ్చెదరో రామారావుగా రిక నైన సరిగా తెలిసికొని వ్రాసెదరు గాక! క్రీ. శ. ౧౪౧౦ లో కూడ కొటయవేముడు కుమారగిరిరెడ్డి కత్యుయసుకృతముగా కలువచేరు అను గ్రామమును కుమారగిరిపురము అను పేరుతో దానము చేయలేదా? రామారావుగారి యూహాప్రకారము కుమారగిరిరెడ్డి యప్పటివరకు జీవించి యున్నట్టులేనా? కాని పై కలువచేరు గ్రామమును దానము చేసినట్టుచెప్పుచున్న అహోబలశాసనమందే కొటయవేమున కొక కుమారగిరి యను పుత్రు డున్నట్లును, మరణించిన కుమారగిరిరెడ్డి యొక్క అపరావతారమే యాకుమారగిరి యనియు చెప్పుచున్నదే!

ఇవి యన్నియు వీరి యూహాలు. ఈయూహాలకు కారణము కుమారగిరిరెడ్డి పెదకోమటివేమారెడ్డి రాజ్యమునకు వచ్చిన తరువాత కూడ జీవించి యుండె నని విపరీతసిద్ధాంతమును చేయుట కొరకే! చరిత్రవిషయములను చక్కగాపరిశీలించి విమర్శించువా రెవరును వీరివలె అవిశ్వాసమునకు పాత్రులు కాజాలరు.

మరియు కుమారగిరిరెడ్డి జీవించియుండగనే కోమటివేమారెడ్డి యాతని రాజ్యచ్యుతుని జేసి రాజ్య మాక్రమించినపుడు కొటయవేము డేమి చేయుచుండెనో రామారావుగారు చెప్పి యుండలేదు. ఎవని ప్రాపు చూచుకొని కుమారగిరిరెడ్డి రాజ్యనిర్వహణభార మంతయు విడచిపుచ్చి వసంతోత్సవాది భోగములం దేలియాడుచుండెనో, ఎవడు బంధువై, మంత్రియై, సేనానియై కొండవీటి రెడ్డి రాజ్యలక్ష్మిని తన యవక్రపరాక్రమముచేత పరులహస్తగతయు గాకుండ రక్షించెనో అట్టి కొటయవేముడు కుమారగిరి రాజ్యచ్యుతు డగుట చూచుచు చేతులు నలుపుకొనుచు కూర్చుండి యుండెనా? పోని, రాజ్యచ్యుతు డైన తన స్వామికి తన రాజ్యమున నివసించుట కింత యాశ్రయ మైన నిచ్చి యుండెడా? అందుల కేదేని నిదర్శన మున్నదా? లేక కోమటివేముడు రాజ్యమును బలాత్కారముగా గ్రహించెననుటకు ప్రమాణ మే మైన గలదా? లేదే! అట్టిచో రామారావుగా రిట్టి విపరీతసిద్ధాంతమును చేయు టెందులకో!

ఇక రెండవ సమస్య వేదాద్రి యెద్ది? అని. "కమలాద్రియు, వేదాద్రియు, పుష్పగిరియు రాజమహేంద్రపురములో తీరసము లై యున్న మిట్టలకు నామములు" అని శ్రీయుత చిలుకూరి వీరభద్రరావుగారును, పై యభిప్రాయముతో నేకీభవించుచు శ్రీయుత ప్రభాకరశాస్త్రిగారు ఎన్నియో సంవత్సరములకు పూర్వమే నిర్ణయించి యుండ మధురపూడిశాసనము వలన నీసమస్య యెందుల కేర్పడవలెనో, అర్థ మగుట లేదు. మరియు శ్రీభావరాజు వెంకటకృష్ణరావు గారు ఆంధ్రేతిహాసపరిశోధకమండలి పత్రికయందు రాజమహేంద్రవరచరిత్ర వ్రాయుచు నీకమలాద్రి, వేదాద్రి, పుష్పగిరి మున్నగువానిని గూర్చి ఆంగ్లమున వ్రాసిన వ్రాతను చిలుకపలికినటుల తెలుగున వ్రాయుచు నీ సందర్భమున శ్రీకృష్ణరావుగారి పేరైన నెత్తక స్వంతభావముల వలె వ్యాసమున వ్రాయుట మిక్కిలి శోచనీయము.

ఇక మూడవ సమస్య. కొండకొండలో నాయకవంశీయులు రాజ్యము చేయుచుండగా మధురపూడి యెట్లు దానము చేసె నని. రెండవ ముమ్మడి నాయ

కుడు కోరుకొండలో క్రీ. శ. ౧౩౯౫ వరకును రా జ్యము చేసె నని నట్లు పై కాటయ వేమారెడ్డి యీ రాజ్యము నాక్రమించి కోరుకొండ దుర్గములో కొంత సైన్యము నుంచె ననియు, రామారావు గారే వ్రాయునట్లు, కోరుకొండ కైఫీయతు వేయి నోళ్ల ఘోషించుచుండ క్రీ. శ. ౧౪౦౪ లో వేసిన మధురపూడిశాసనమును గురించి ఎందులకీ సమస్య యేర్పడవలెనో తెలియుట లేదు.

—గుండవుమీడి జానకిరామయ్య
బి. ఏ. (ఆనర్సు)

౨

శెప్టెంబరు ప్రబుద్ధాంధ్ర సంచికలోని శ్రీమారేమండ రామారావుగారి మధురపూడి శాసనము అనే వ్యాసంలో కొంచెం సందేహాలు కలగడంచేత తన్నివృత్తికోసం నా అభిప్రాయాన్ని వ్రాస్తున్నాను. శాసనములో "స్వస్తిశ్రీ శకవరుషంబులు ౧౩౨౬ అగు నేంటి తారణసంవత్సర పుష్య శు ౧౦ గు నాంటి మకరసంక్రాంతి పుణ్యకాలమందూను" అని ఉంది. దీనికి సరియైన యింగ్లీషు తేదీగా ౧౫-౩-౧౪౦౫ శ్రీరామారావుగా రిచ్చినారు. ఇది పొరబాటున పడినట్లు తోస్తుంది. ఆరోజులలో మేషరాశికి రవి రావడం మార్చి ౧౨ వ తేదీని జరుగుచుండెడిది. దానిని బట్టి చూస్తే మార్చి ౧౫వ తేదీ మీనమాసంలో పడింది గాని ఆరోజున మకరసంక్రాంతి కాలేదు. ౧౩౨౬ శకసంవత్సరం పుష్యశు ౧౦ నాడు ౧౪౦౪ క్రీస్తు శకసంవత్సరం డిశంబరు ౧౧వ తేదీ లక్ష్మివారం అవుతుందని తోస్తుంది. స్వామికన్నుపిళ్లే గారి ఇండియన్ కాలెండర్ ఆసంవత్సరం మార్గశిర బ౩౦ డిశెంబరు ౨ వ తేదీ మంగళవారము నాడు పడినట్టు చెప్తుంది. అయితే పుష్య శు ౧౦ లక్ష్మివారం నాడు మకరసంక్రాంతి అయి యుంటుందా అని. ఆరోజుల్లో డిశెంబరు ౨౧,౨౨ తేదీలలో మకర సంక్రాంతి అవుతూ వుండేది. కాబట్టి లక్ష్మివారానికి సరిపోయేటట్లు ౨౧-౧౨-౧౪౦౪ తీసుకున్నట్లయితే ఆరోజున పుష్య బ ౧౦ అవుటకు అవకాశం వుంది. అలా గయితే శాసనములోని "శు౧౦గు" అన్నది "బ౧౦గు" అనడానికి బదులు తప్పుగా అచ్చుపడ్డాదేమో అనిపిస్తుంది. "మకర సంక్రాంతి పుణ్యకాలమందూను" అన్న యిన్ని అక్షరాలు పొరబాటుపడ్డా యన్న కన్న "శు" కి బదులు "బ" అని యున్నాదేమో అనడం సబబుగా తోస్తుంది. అదీ కాక దానధర్మాలు చేయడానికి ఉత్తరాయణప్రవేశపుణ్యకాలం చాలా తగి ఉంటుంది కూడాను.

మరి యొక చిన్న సందేహం. కుమారగిరిరెడ్డి మరణించిన తరవాతనే అతని ఆత్మశాంతి కొరకు "అక్షయసుకృతంబు అవునట్టుగాను" కాటయ రెడ్డి, వేమారెడ్డి యీ మధురపూడిని కుమారగిరిరెడ్డి నామ మాచంద్రార్క-స్థాయిగా ఉండేటందుకు కుమారగిరిపుర మను పేరుతో శ్రీకరదానం చేసి యుండవచ్చును. ఎవరైనా మృతులైతే ౧౦ రోజులు అయిన తర్వాత దానాలు ధర్మాలు చెయ్యడం ఆచారం ఉంది. ఇలా ఊహించినట్లయితే కుమారగిరిరెడ్డి ౧౪౦౪ డిశెంబరులోనో, అంతకు ముందో మరణించి యుండు నని సందేహించవలసివస్తుంది. చారిత్రకులు విమర్శించి నిర్ణయింప ప్రార్థితులు.

—శ్రీపాద లక్ష్మినారాయణమూర్తి
బి. ఏ.

వారు. కొక్కొండ వేంకటరత్నంపంతులుగారును భాషాసంజీవని పత్రికను నిర్వహించి వాఙ్మయ విషయములను ప్రచురించియుండిరి. తరువాత సులభమైన భాషలో కవిజీవితములను వ్రాసి భాషాసేవ చేసిన వారు శ్రీ గురుజాడ శ్రీరామమూర్తిపంతులు గారు. తరువాత ఆంధ్ర కవుల చరిత్ర నిర్దుష్టముగ వ్రాసి ఆంధ్రలోకమునకు అర్పించిన వారు వీరేశలింగంపంతులుగారు వీరు, గద్యమున కవుల చరిత్రనే గాక స్వీయచరిత్రలును వ్యాసవాఙ్మయమును నవలలను వెలయించి 'గద్యతిక్కన' అను బిరుదు నందిరి. వీరికన్న మున్ను "శ్రీరంగరాజ చరిత్ర" అను పేరుగల వచనప్రబంధమును వెలయించి తెనుగు తోటలో నవలాంకురమును నాటినవారు నరహరి గోపాలకృష్ణమ్మశెట్టిగారు.

హేమలత, అహల్యాబాయి మున్నగు నవలలను వ్రాసి శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు మొదలయిన పలువురాంధ్ర రచయితలు వచనకావ్యములను వ్యాసములను వెలయించుచు, భాషాపోష నలంకరించుచున్నారు.

వచనరచనవలననే గాని భాష అభివృద్ధినందజాలదనియు మనుజులు జ్ఞానయుక్తులు కాజాలరనియు, శాస్త్రములు విరివిగా వ్యాపింపజాలవనియు గ్రహించినవారరుదు. అన్యభాషల నుండి విషయమును సంగ్రహించి వానిని దేశములో వ్యాప్తము చేయుటకు సాధనమైనది వచనమే! మన దేశమునందు చదివినవారు అల్పసంఖ్యాకులు. వారి కడకే రసజ్ఞులును, కవులును, పండితులు, తమ జ్ఞానజ్యోతిని తేవలయును గాని జనసామాన్యము కడ కరుగజాలరు. వచనరచనముల ద్వారా వారిని విద్యావంతుల నొనర్పవచ్చును. అట్టి రచనములు సరళములై యుండవలెను. సరళము లగు ఉత్తమవచనగ్రంథము లింకను బయలుదేరుట ఆవశ్యకమై యున్నది. అట్టి కొఱతను తీర్చుటకు బుద్ధిమంతులు యత్నించి దేశము నుద్ధరించి వాఙ్మయమునకు వైభవము నాపాదింతురు గాక!

---

# దసరా విసవిసలు

పూడిపెద్ది వెంకటరమణయ్యగారు



పదేళ్ళ క్రిందటి దాకా అవోలా గుండేవి దసరా సందళ్ళు. ఇప్పుడోలా గున్నాయి దసరా సరదాలు. అప్పుడు చెమ్కీ పనులు చేసిన మొఖమలు దుస్తులూ, చెవులకు మద్దికాయలూ చేతుల్లో రంగుల బాణాలూ, జేబులలో విడ్డ పూవులూ, చిన్నారి పెదవులలో శ్రీమద్రామాయణమో చిన్ని గోపాలపదాలో దసరావరసలతో, ధీమాగా కొంతసేపూ, దడదడా కొంతసేపూ, చదువుతూ, సరసులైన బిడ్డల తండ్రులపై పూలబాణాలు వేస్తూ తమ ఆయుధాలకు నివేదన లెమ్మంటూ పప్పుబెల్లా లిమ్మంటూ తమ్ము విద్యావంతులుగా చేసినగురువులకు కట్నా లిమ్మంటూ, అదే పాటగా అదే ఆటగా, గ్రామం అంతా కలకలా విరిసే చిన్న బొట్టెల సందడితో పలు పలుకులు పలుకుతూ ఉండేది. ఎక్కడ విన్నా చిటుక్కు చిటుక్కుమన్న బాణాల చప్పుడులే. ఎక్కడ విన్నా పసి

పాపల పాటలే. ఎక్కడ విన్నా జయజయధ్వానాలే. ఇవి ఆశ్వీజశుద్ధపాడ్యమి మొదలు విజయదశమిదాకా వినిపించేవి.

అప్పుడా పిల్లల ఆట పాటలువిని ఆనందించిన తలిదండ్రుల హృదయాలు హృదయాలు. ఆబిడ్డల చురుకుదనం ప్రదర్శించి చొక్కిపోయిన గురువుల హృదయాలు హృదయాలు. బాలుర శిక్షలో స్వేచ్ఛ—వినోదంలో విద్య—అడకువలో ఆట! ఏమి సందడి! ఏమి సరదా! క్రొత్త జిలా! క్రొత్త కళా! అప్పుడు చిన్నపిల్లలకు అక్షరాభ్యాసం చేసి, అరవతరగతి వరకూ చదువు చెప్పిన బడిపంతులే ఆబాలుర విషయమయి సర్వబాధ్యతలూ వహించేవాడు. ఆచదువు పునాదిమీదనే సబుజడ్జీ, సాహిత్యచక్రవర్తీ కూడా నిలబడేవారు. బడి పంతులు జీవితం బాగుండేది. వానికి గ్రామంలో చాలా గౌరవ ముండేది.

క్రమక్రమంగా మన విద్యాధనం బోర్డుఖజానాలలో పడిపోయింది. ప్రెసిడెంట్లకు క్రొత్త పెత్తనాలు వచ్చేయి. బడిపంతుళ్ళ నోళ్ళకు తాళాలు పడ్డాయి. "మీకు తెలిసిన విద్య పిల్లలకు నేర్పడానికి వీలు లేదు; మా సూత్రాల మీదనే వైర్వ్యక్క చేయండ"న్నారు. అందుకు పంతుళ్ళు ఒడబడ్డారు. "మీరు సంవత్సర మంతా చెప్పిన చదువును క్షణంలో తక్కడ పెట్టి తూచేసి దానికి తగిన గ్రాంటిస్తా"మన్నారు గవర్నమెంటు వారు. "మాకు నచ్చే చదువు చెపితేనే మీబడిని బడిగా అంగీకరిస్తా"మన్నారు. అన్నిటికీ తల యూచే డా గురువు. గురువులకు గురు వీ బోర్డు. పులిమీద పుట్ర. ఇంతవరకూ బాగుం దండి. ఇలాంటి కంట్రోలులలో ఏవేనా కొన్ని లాభాలుంటా యేమో దానితో ఇప్పుడు మనకు తగవు లేదు.

మున్ముందీ దసరాసరదాలకు గవర్నమెంటు బళ్ళలో కట్టడి చేసేరు. వారి సదభిప్రాయాలలో బోయేరు బోర్డువారు. ఇది ఆపీవలసిందని నల్ల చుక్కల రెక్కలు గల తెల్లపావురాలలా గెగిరేయి ఎగరవ్వా సరి? యుద్ధపు రోజులలో పావురాల వార్త లెగిరే యట కాదూ? ఇదీ యుద్ధ సన్నాహమే. యూనిఫారములూ ఆయుధధారణమూ, వ్యూహనిర్మాణమూ, బాణప్రయోగమూ, వీరపురుషస్మరణమూ ఇవే గదా బాలురకు నేర్పని దసరాలలో వాని నట్లు బాహాటంగా నేర్పరాదు. ఇక నే ముంది! కళ అంతా బోర్డువారి కలం మొనలో నిమిడిపోయింది. బాలుర దసరా సరదాలు భయంకరణాంగాలుగా తోచేయి కాబోలు లైసెన్సు లేందే ఆయుధధారణకు వీలు లేదు కాబోలు. పోనీ అలాటి యేర్పాటేదేనా ఉంటే పిల్లలముద్దూ ముచ్చటకూ కూడ లైసెన్సు కట్టుకుంటారు తలిదండ్రులు ఈ అవకాశ మేనా కలుగజేయండని బోర్డువారిని ప్రార్థించవలసి ఉంది మనం.

ఎప్పుడయినా సరే ఆడుపిల్ల మగాడి కంటె గడుసుదీ. గవర్నమెంటు గర్ల్సుస్కూళ్ళలో దసరా ఆంక్ష మొదలు పెట్టింది. చాలాకాలం క్రిందటనే. పిల్లలు తల్లులతో చెప్పుకొని యేడ్చేరు. "ఎందుకమ్మా నీకా తిరగడం, బాణాలు విరవడమూను? సత్యభామ లాగు సంగ్రామానికి వెళతావా యేమిటి? ఏదో విధంగా కళను పోషించ రాదూ? భావికళల సౌభాగ్యం బాలికల చేతుల్లో ఉంది. నేను నీకో ఉపాయం చెబుతాను విను. చిత్రకళ ఉందే అది మీకు తెలిసినట్టు మగపిల్లలకు తెలీదు. బొమ్మలతో మీ రాడుకున్నట్టు వాళ్ళాడు కోలేరు. అలాటి వాళ్ళిందరకూ చిత్రకళలోపాసన శిల్పకళలోపాసన కనబడదు. మన దేశంలో ఇప్పుడిప్పుడు చిత్రనిర్మాణకౌశలం చిగురిస్తూంది. ఈ సమయంలో నీవు దానిని పోచ్చరించి ఆయా ప్రతి

# శ్రీ నరహరితీర్థులు

మారేమండ రామారావుగారు యం. ఏ. బి. యిడి.

దక్షిణహిందూదేశ శాసనసంపుటము లలోని శ్రీ కూర్మసింహాచలశాసనము లలో గొన్నిటినుండి క్రీ. శ. ౧౩, ౧౪ శతాబ్దములలో కళింగ దేశమున వైష్ణవ మతము వ్యాపించినవిధము తెలియనగుచున్నది. ఈ మతమును ప్రచారము చేసిన వారిలో శ్రీ నరసింహ భారతి మున్నగు శ్రీవైష్ణవ గురువులును, శ్రీనరహరి తీర్థులను మాధ్వగురువులును ముఖ్యులు.

శ్రీయుత రాళ్ళబండి సుబ్బారావు ఎం. ఏ. ఎల్. టి. గారు తమ "కళింగదేశచరిత్ర" పుట. ౧౯౧. లో 'నరహరితీర్థులు: కళింగము' అను శీర్షక క్రింద వ్రాయుచు శక. ౧౧౫౨ నరసింహ మహాముని నరసింహభారతిని. నరహరితీర్థులను ప్రశంసించుశాసనములను పేర్కొనినారు. పైగ్రంథము ౧౯౨ పుటలో "పైశాసనములనుబట్టి, ఈ క్రింది మాధ్వగురుపరంపర కళింగ దేశమున వైష్ణవ మతమును వ్యాపింపజేసినట్లు తెలియుచున్నది" అని వ్రాయబడి పిమ్మట నరసింహామహాముని, నరహరి తీర్థులు. జగన్నాథతీర్థులు, వాసుదేవభారతి, రాఘవ భారతియనువారి నామములు చెప్పబడినవి. ఇవే యభిప్రాయములు J. A. H. R.S VIII-i pp. ౪౧-౪౭. లోని వారి వ్యాసమునను గాంచనగు చున్నవి. ఇందువలన ౧ నరహరితీర్థులును నరసింహభారతియు నొక్కరే ౨ పై వైష్ణవగురువులందరును మాధ్వులు ౩ క్రీ. శ. ౧౨౩౦ నుండియు నరసింహామునిచే మధ్వ మతము ప్రచారము చేయబడెను. అను నూహలు గలుగుచున్నవి.

ఈయూహలు సమంజసములు కావు. నరసింహభారతియు, నరహరితీర్థులు నొక్కరు కారు. మొదటివారు శ్రీరామానుజాచార్యులవారి సాంప్రదాయములోని శ్రీవైష్ణవగురువులు. శ్రీనరహరితీర్థులు ద్వైతగురువులు శ్రీమధ్వాచార్యులవారి ప్రత్యక్ష శిష్యులు. ద్వైతగురువులకు 'భారతి' యను బిరుద ముండదు ద్వైతగురుపరంపరలో నెచ్చటను శ్రీ సుబ్బారావుగారు పేర్కొనిన నరసింహభారతిమున్నగువారి ప్రశంస లేదు. అట్లే క్రీ. శ. ౧౨౩౦ నుండి ద్వైతమతప్రచారము జరగెననుటయు సరి కాదు. ఆమతమును స్థాపించిన శ్రీమధ్వాచార్యుల వారే క్రీ. శ. ౧౨౩౮ లో జన్మించిరి.

వాస్తవమేమన. క్రీ. శ. ౧౨౩౦ నుండియు శ్రీవైష్ణవగురువులు కొందరు కళింగదేశమున శ్రీ రామానుజాలమతమును వ్యాపింపజేయుచుండిరి. శ్రీమధ్వాచార్యులవారివలన ద్వైతసిద్ధాంతము నెరిగికొని శ్రీనరహరితీర్థులు క్రీ. శ. ౧౨౬౪-౯౩ నడుమ దాని నీదేశమున ప్రచారముజేసిరి. ఈరెండు మతములకును విశేషసామ్యముండుటచే నన్యోన్య సాహాయ్యముతో నుభయమతగురువులును వైష్ణవ మతమును వృద్ధిచేసిరి. పండితు లీవిషయమును గమనింతురుగాక!

---

మలనూ పటాలనూ సేకరించి నీయింటనే చిత్రకళా ప్రదర్శనం చెయ్యి. తోడి బాలిక లందరనూ ఈ దసరాదినాలలో పిలచి పప్పు బెల్లా లిచ్చి కళా తత్వం బోధపరచు. నృత్యగీతాలతో ఆకళాదేవత నారాధించు. ఇది మంచి పనేనా? బాగుందా? మనోజ్ఞకళను తోడ్పడుతున్నావా? మరి రేపేడు వమా! కన్ను రాత్రసుకో!" అంది అతల్లి, కన్న తల్లి.

సరే. బాగుంది ఆడుపిల్ల, కవ్వాల పరికిణీ, పువ్వుల లాల్చీ మిలమిలా మెరసే కళ్ళూ తళతళా మెరిసే నగలూ, చేతిలో కుంకుమభరిణా, చెప్ప వెళుతూంది కళాతత్వం తోడి బాలికలకు.

ఇక అమ్మక చిక్కిన మేక మగపిల్లవా డలా నిలబడిపోయాడు. బాణం లేదూ—గానం లేదూ —ప్రతిమా లేదూ—పాటా లేదు. దసరా అంతా విసవిసలతో నింపేస్తున్నాడు.

తల్లిదండ్రుడు లిక నీ కుఱ్ఱలకోరకేదేనా కళా వ్యాప్తి కనిపెట్టవలసి ఉంది కాదూ దసరాలో!

# వ్యాఖ్యానములు

## సింహావలోకనం

మళ్లీ ప్రారంభించాక ప్రబుద్ధాంధ్రకు ఈసంచికతో వొక సంపుటమూ, యీ నెలతో వొక సంవత్సరమూ పూర్తి అయినాయి.

"తెనుగు దేశంలో తెనుగువారికి తెనుగు జాతిని మళ్లీ నిర్మించుకోడానికి తగిన కార్యక్రమం యేమీ లేదు. తెనుగు జాతిని నడిపించ గల తెనుగు నాయుడు లేడు". ఈపన్నెండు మాసాల అనుభవం వల్లా "అవునా, కాదా?" అని వూగులాడుతూ వుండిన నా యీ నిశ్చయం దృఢపడింది.

మన ప్రముఖులకు చురుకు పుట్టాలంటే యితర పరగణాల నుంచి తాఖీదులు రావాలి. మన యువతులూ, యువకులూ నడుములు బిగించి ముందుకి వురకాలంటే మన ప్రముఖులకు ఆజ్ఞలు సాయించే వారు తప్పకుండా పైవారై వుండాలి.

ప్రస్తుతస్థితి యిదీ.

పెద్ద కబుర్లు చెబితే లాభం లేదు. ఇలాంటి ఆవేదనతో, ఇది పోగొట్టా లన్న ఆవేశంతో పని చేసేవారు వేలకొద్దీ తయారయితే గాని యీ జాతికి మళ్లీ నామరూపాలు కలగవు.

ప్రబుద్ధాంధ్ర చిన్న పత్రిక. ఈడుకి తగిన శక్తిన్నీ లేదు; కాని ఆవేదన కూలంకషంగానూ, ఆవేశం అతివేలంగానూ వుంది. జాతికి దీనివల్ల యెక్కించి తేనా లాభమే; గాని నష్టం లేదు.

ఈసంగతి చాలామంది పెద్దలు అంగీకరించారు.

ప్రబుద్ధాంధ్రను నడపడంలో నేను నిమిత్తమాత్రుణ్ణి, కొమ్ములు తిరిగిన వ్యాసకర్తలు ప్రబుద్ధాంధ్రను నిర్వహిస్తున్నారు.

ఏవిధమైన సత్కారమూ చెయ్యలేకపోవడం, చందా తక్కువ కావడంవల్ల పేజీలు పరిమితంగా వుండిపోవడం, గ్లేజు కాగితాలూ, చిత్రపటాలూ మొదలైన అలంకారాలు లేకపోవడం, పులిమీద పుట్ర అన్నట్టు ఇన్నింటికీ సాయం, నేను "పద్యవ్యాసాలు ప్రకటించ"నని భీష్మించుకు కూచోడం —యింకా యెన్నో యిలాంటి కారణాలవల్ల ప్రోత్సాహజనకంగా లేకపోయినా వారందరూ తమ విశిష్టరచనలతో ప్రబుద్ధాంధ్రను ప్రత్యేకత సంపాదించి పెట్టారు.

ఇంకొక్క కారణంవల్ల కూడా ప్రబుద్ధాంధ్రకు గర్వించతగ్గ పదవి లభించింది. అదేమిటంటే? అధునికాంధ్రవాఙ్మయనిర్మాతలయిన యువకవుల కందరకీ నూత్నచైతన్యం సంఘటించిన వాగనుశాసనులు, రావుసాహేబు, మహోపాధ్యాయ గిడుగు వెంకటరామమూర్తిపంతులు గారు ఆంధ్రపత్రికల సంపాదకులకు ప్రబుద్ధాంధ్ర ద్వారా వొక దివ్యసందేశం వినిపించారు. ప్రతిష్ఠను విడవలేక కొన్ని పత్రికల సంపాదకులు దాన్ని గుర్తించలేకపోయినా వొక సత్యాన్ని వెల్లడిచేసిన శోధనజ్యోతి అని ఆంధ్రవాఙ్మయచరిత్రలో అది కీర్తింపబడుతుంది. దాన్ని పురస్కరించుకునే వర్ధమానచంద్రులు గూడవిల్లి రామబ్రహ్మంచౌదరి గారు తమ ప్రజామిత్ర పత్రికలో సంపాదకీయాలు వ్యావహారికంలో ప్రకటిస్తూ తమ సేవాదీక్ష సత్యధర్మప్రేమానుబద్ధం అని ఋజువుపరుచుకున్నారు.

ప్రబుద్ధాంధ్ర చెయ్యవలసిన పని చాలా వుంది. సంకల్పమూ, ప్రయత్నమూ కూడా తక్కువగా లేవు; కాని అనుకూల్యాలు తక్కువ. సముద్రం యీదాలి. అదే చేస్తున్నాను.

ఈసంవత్సరం అంతటికీ "నేను చేశా" నని చెప్పుకో తగ్గ పని హిందీ దురాక్రమణాన్ని అడ్డుకోడం వొక్కటే. "హిందూదేశానికి సామాన్య భాషగా వుండతగ్గది హిందీ" అంటే ముందు

ఎప్పుడో ఆచరణలో పెట్టతగి వున్న అనూచనకి నేనూ తల వొగ్గుతాను; కాని అది యిప్పుడు మన ఆంధ్రులకు "జాతీయభాష" నంటూ చోరముకు వస్తోంది. ఈవిషయంలో యిప్పటికే చాలా అశ్రద్ధ జరిగింది. దీన్నింకా ముదరనివ్వడం ఆత్మహత్య చేసుకోవడమే. ఈవిపత్తు గుర్తించి భారతి, చంద్రిక, ఆంధ్రభూమి, గోల్కొండపత్రిక, ప్రజామిత్ర, ఉషస్సు, చిత్రగుప్త, రెడ్డి, సత్యవాణి, వినోదిని— ఈ పత్రికలు పూర్తిగానూ, ఆంధ్రపత్రిక, గృహలక్ష్మి—ఇవి కొంతవరకూనూ నా వాదాన్ని బలపరిచాయి. ఆధునికాంధ్రవాఙ్మయాకాశంమీద ధృవతారల లాగ ప్రకాశించగల అచ్చమైన తెనుగు బిడ్డలనేకులు యీవిషయంలో నాకంటె యెక్కువ ఆవేశంతో నడుములు బిగించుకుని యుద్ధరంగానికి దుమికారు. హిందీకి ప్రతికూలంగా వారు చేస్తూ వున్న ఆందోళనం హిందీప్రచారకులను కొన్ని తట్టి వెనక్కి తిప్పింది. మరిన్ని విజయనగరం, వాల్తేరు (ఆంధ్రయునివర్సిటీ హాస్టలు), విశాఖపట్టణం, అనకాపల్లి, బాపట్ల, ఒంగోలు, మదరాసు...ఈస్థలాల్లో నా హేతువాదం విని అనేకులు తల లూపారు వొక్క సమవర్తిని, కృష్ణాపత్రిక మాత్రం యీ విషయంలో ముభావంగా వుండిపోయాయి. అయితే; అవి రెండూ నాతరఫు వాదానికి కూడా అవకాశం యిచ్చి—యీ రూపంగా నేనా పూర్తిగా తోడుపడ్డాయి; కాని యీ సందర్భంలో జరగవలసిన పని అంతా ముందే వుంది. ఈహిందీ వ్యామోహం మనవారు కోరి తల కెక్కించుకుంటూ వున్నది; కనక దీన్ని తగ్గించడానికి చాలామంది చాలా శ్రమపడవలసి వుంది.

ప్రబుద్ధాంధ్రను మళ్లీ ప్రారంభించే టప్పటికి దేశీయు లందరూ ఆర్థికసంకటంలో యిరుక్కుని వున్నారు. ఇప్పటికి కూడా అది యేమీ తగ్గలేదు. అయినా నేను పన్నెండు మాసాలలోనూ వేయి మందికి పైగా చందాదారులను సంపాదించగలిగాను.

వీరు కాక, ఈసాహసకార్యంలో యెంతో మంది విద్వాంసులూ, జమీందార్లూ, వర్తకులూ, భూస్వాములూ—వారిలో చాలామంది వాఙ్మయం మీద ప్రీతి, కొందరు నాయెడల మైత్రీ, అందరూ ప్రబుద్ధాంధ్ర మీద ఆదరాభిమానాలూ చూపించి, వుదారాపరిమితా లైన విరాళాలు దయచేసి నాకెంతో సాయపడ్డారు. వారిలో ఆంధ్రయునివర్సిటీ వైస్ ఛాన్సెలరు సర్. సర్వేపల్లి రాధాకృష్ణయ్య పంతులుగారు విరాళం దయచెయ్యడమే కాకుండా నా ప్రయత్నం విని ఈకొత్తరూపంలో ప్రబుద్ధాంధ్ర ఆవశ్యకాన్ని నిర్దేశిస్తూ శుభచింతతో ఆశీర్వదించిన స్నేహంతో ప్రోత్సహించారు.

ఇది యిలా వుండగా: ఉత్తరసర్కారులలో గొప్ప ముద్రాపకులై వున్న సరస్వతీ పవరు ముద్రాశాలాధిపతులు అద్దేపల్లి లక్ష్మణస్వామి నాయుడుగారున్నూ, కాగితాల వ్యాపారంలో ప్రముఖులై వున్న మాదేటి సన్యాసయ్య అండు సన్సువారున్నూ ప్రబుద్ధాంధ్రపు బాధ్యత అంతా తమదిగా భావించి రెండు మూడు సందర్భాల్లో యెప్పుడూ మరుపురాని సాహాయ్యం చేశారు. నిజంగా వారు ఉభయుల అవలంబనమూ లభించి వుండకపోతే ఈ పన్నెండు సంచికలూ నేనింత సక్రమంగా ప్రకటించలేకపోయి వుందును.

మొత్తానికి ఈ సంవత్సరం అంతా నేను నెలకి నెలా చొప్పున తిరిగిన్ని చేతిసొమ్ము తగలకుండా దీన్ని నిర్వహించలేకపోయాను. అయితే ఎలాంటి పరిస్థితుల్లోనూ కూడా పురుషకారాన్ని దిగదీసే నిరుత్సాహం మాత్రం నన్ను ముసురుకోలేదు, పైగా కసి యెక్కువయింది!

అగ్గీ గాలీ కలిసినట్టు ఇంగ్లీషూ దాని కంటేనూ హెచ్చుగా హిందీ యేకమై తెనుగు దేశంలో విలయతాండవం చేస్తూ వున్న యీ రోజుల్లో తెను

గులో పత్రికాప్రకటనం—వాఙ్మయసేవ చెయ్య బూనినవాడు ఈ మాత్రం బొప్పితో బయటపడ్డం సామాన్యవిషయం కాదు.

చందాలూ, విరాళాలూ, ఇవ్వడంలో నామిత్రులనేకులు చూపించిన శ్రద్ధ నాకు రోమాంచనం కలిగిస్తోంది.

ఇలాగ సర్వవిధాలా నాకు సాయపడినవారం దరికీ నాకృతజ్ఞతను విన్నవించుకుంటున్నాను.

నా మిత్రు లందరూ మరొక సంవత్సరం కూడా యిలాగే నన్ను ప్రోద్ధిప్త చేస్తా రని ఆశించి వున్నాను.

## ఇంకా దీపం ఆరిపోలేదు

జాయింటు పార్లమెంటరీ కమిటీ వారి నివేదికను మనస్ఫూర్తిగా స్వాగతం చెప్పుకుంటున్నాను.

కర్జను ప్రభువు చేసిన బంగాళా విభజన బంగాళీలకు ఆత్మ సాక్షాత్కారం కలిగించింది. అలాగే యీ నివేదిక మన కళ్లు విప్పుతుం దని నమ్ముతున్నాను.

అయితే: బంగాళీలు, అప్పటి కప్పుడే కొంత నవీనవాఙ్మయం సృష్టించుకోడం ద్వారా ఆత్మగౌరవం అంటే యేమిటో తెలుసుకుని వున్నారు; కనక ఆసన్నివేశానికి సరిగా వారు తాళం వెయ్య గలిగారు.

మన కలాంటి దేమీ లేదు. అసలు మనకు ప్రత్యేకత అవసర మని కూడా వొకరు చెప్పవలసిన ట్టుంది.

ఈ కొరడాదెబ్బకి కూడా మేలుకోకపోతే ప్రపంచకంలో మన కిక తావు లే దన్న మాట.

కర్జను ప్రభువు బంగాళీలను విడతీశాడు; కాని కొందర్ని తీసుకుపోయి మరో జాతివారి కాళ్ళ కింద పడెయ్యలేదు. అంత మాత్రానికే వారు మిన్నూ మన్నూ యేకం చేసేశారు.

ఈ నివేదిక ఇలా కాకపోయినా, తెలుగు దేశంలో నుంచి వొక పెద్ద ముక్కని పూర్తిగా తెగ్గొట్టి మరో ఓఢ్రరాష్ట్రానికి అంటకట్టింది. కొన్ని లక్షల ఆంధ్రుల్ని సమూలంగా పెకలించి మరొక చిన్న జాతివారికి అంటగడుతోంది.

అయితే: ఏమీ చెయ్యలేమా?

మన ప్రముఖుల దృష్టి యింకా వాటిమీద లేదు. వారు సంపూర్ణస్వరాజ్యం అనే పర్వతాన్ని పూర్తిచేసుకొద్దా మని ప్రయత్నాలు చేస్తున్నారు. ఇప్పుడు వోఢ్రులతో తగాదాలు పెట్టుకుంటే అఖిలభారతజాతీయ ప్రయత్నాలు భగ్నమై పోతుం దని వారి భయం: కాని వోఢ్రులు చేస్తూన్న దదే అని వారికి బోధపడడం లేదు.

వొక్క వోఢ్రులకే కాదు, తమిళులు అందరికీ ప్రత్యేకజాతీయత ప్రధానమున్నూ, అఖిలభారతీయత అప్రధానమున్నూ. అసలు ప్రత్యేకవ్యక్తిత్వం దృఢపడితే గాని భారతీయత అనేది పుట్టదు అని వారికి తెలుసును.

మన కో? మనక ఆత్మజ్ఞానం వుంటే కదా యీ సంగతి తెలవడం!

ఓఢ్రరాష్ట్రానికి బరంపురం రాజధాని ట. సంపూర్ణస్వరాజ్యం రావడమే వస్తే అప్పటి కప్పుడే అక్కడ భవనాలూ అన్నీ పూర్తిగా తయారయిపోయి బిగుసుకుపోతుంది. సంపూర్ణస్వరాజ్యమే కాదు, దానికి పైది వచ్చినా అప్పుడు చెయ్యతగ్గది— "ఏం చేస్తాం మరి? ఇప్పు డెలా విడదీస్తామూ? భవనాలూ ఏర్పాట్లూ తల్లకిందులు చెయ్యడం ధర్మమా?" అని ధర్మపన్నాలు ఏకరువు పెట్టడం తప్ప మరేమీ వుండదు.

ఇంతకీ: సంపూర్ణస్వరాజ్యం రావడం అంటూ వుంటే అప్పుడు మన కుండే హక్కులు వోఢ్రులకు మాత్రం వుండవూ; అది లేనప్పుడే ప్రగమనశీలురై పరభూములు ఆక్రమించుకో గలిగిన వోఢ్రులు అప్పుడు మాత్రం మనకంటే హెచ్చు స్థితిలో వుండరూ?

ఏతావతా, మనకి అహంకారమమకారాలు ఎప్పుడో చచ్చిపోయాయి. కాంగ్రెస్సు ధర్మమా అని వైరాగ్యం కూడా ముదిరిపోతోంది.

క్షేత్రం యెంత మంచి దయినా, వర్షాలు కూడా అదునులోనే పడినా, విత్తనం అంటూ వుంటే కదా అక్కడ అంకురం యేర్పడడానికి?

## ఆలోచించి మరీ చెప్పండి

“ఎవరికి వారు దమ మాతృభాషను గూడ ఇతర భాషలను నేర్చు కొనునంతటి యుత్సాహముతో నేర్చుకొనగోరదము”.

ఆంధ్రపత్రిక (౧౩–౧౧-౩౮)

“అంగా దంగా త్సంభవసి” అని చెప్పాకో తగ్గ తండ్రి కూడా తల్లి యెదుట దిగాడు. సృష్టిలో తల్లికి గల పదవి మరే వస్తువుకీ లేదు.

ఎవ రేనా దేవుణ్ణీ, అమ్మనీ యెదుట నుంచో బెట్టి “నీ కెవరు కావా?” అని అడిగితే నేను “అమ్మే” అని నిక్కచ్చిగా చెబుతాను.

తల్లియొక్క మహాత్వం తెలుయ తగ్గ శక్తి యెవరికీ లేదు. తల్లి రుణం తీర్చుకో గలిగే సామర్థ్యమున్నూ లేదు.

బిడ్డని చూసుకుని తల్లి పొందే సంబరం యెలాంటిదో నిర్వచించడానికీ, యెంతటిదో పరిమితి చెప్పడానికీ యేమీ సాధనాలు లేవు. అది అవాఙ్మానసగోచరం.

ఆనందోన్మేషంతో కలకల లాడే తల్లి మొగం చూడగలవారికే రుణవిముక్తి, దాని కంత కంటే మరో దారి లేదు.

“జననీ, జన్మభూమిశ్చ” అన్న సూక్తి సత్యాన్ని ఉపదేశించడం లేదు. హృదయానికి ఉత్తేజనమున్నూ కలిగించడం లేదు. ఏమంటే! అది అసమగ్రం. దాన్ని సూచ్చిన కవి ఆవర్గంలో తల్లి భాషను చేర్చలేక పోయాడు.

అతను తన తల్లి భాషను విడిచిపెట్టి సంస్కృత భాషలో మునిగిపోయాడు. అందుచేతే అతగాడికి తల్లిభాషతో పని లేదు.

అతను మాతృద్రోహుడు. ఇంతే కాదు. ఇంకానూ.

వంటపూటమ్మ అమ్మ అవుతుందా? అసలా మెని అమ్మతో పోల్చడాని కేనా వీలుందా? ప్రతీవాడికీ ఇతరభాష అలాంటిదే.

తల్లి భాష విడిచి ఇతరభాష నేర్చుకుని వాడు, తల్లి భాషతో కాక యితరభాషతో మాట్లాడీ వాడూ, తల్లి భాషలో కాక యితరభాషలో ఆనందించీ వాడూ తల్లి లేని బిడ్డ.

ఇంటో తల్లి ఆకలితో మాడిపోతూ వుండగా వీధిలో బిచ్చకత్తెలను సృష్టి వెయ్యడం యెలాంటిదో, తల్లి భాష పోషణ లేక బిక్కూ బిక్కూ మంటూ వుండగా పరభాషా ప్రచారం చెయ్యడం అలాంటిది.

తల్లి భాష నేర్చుకునే టంతటి వుత్సాహంతో పరభాష నేర్చుకో మనడం కూడా తప్పే. అలాంటప్పుడు ఇతర భాషలను నేర్చుకునే టంతటి వుత్సాహంతో మాతృభాష నేర్చుకోమనడమా?

## చెప్పలేదూ ఉద్దేశం అదే

ఉన్నవ రాజగోపాలకృష్ణయ్యగారు ఇప్పుడు మన దేశంలో జరుగుతూ వున్న హిందీప్రచారంవల్ల మన తెనుగుభాషకి అపకారం జరగడం లేదంటున్నారు.

నిజంగా, వారలా అనకపోతేనే మనం ఆశ్చర్య పడాలి. ఏమంటే? మన దేశంలో హిందీప్రచారోద్యమం సాగిస్తూ వున్న ప్రముఖుల్లో వా రొకరుగా వున్నట్టుంది. దీనికి సాయం, మొన్న మొన్ననే వుత్తరదేశయాత్ర చేసి, హిందూస్థానీలకు తమ హిందీసేవలు నివేదించుకుని, వారి బుజ్జగింపులు గడించుకుని వచ్చి వున్నారు వారు.

చివరికి యిలా రాశారు.

"హిందీభాషాప్రచారమువలన మాతృభాషాభివృద్ధికి నిరోధము కలుగుచున్నదను విషయ్య బయలుదేరినదే గాని వాస్తవమునకు హిందీప్రచారాభివృద్ధి విమర్శింపదగినంత స్థితికి రాలేదు. ఇంకను విరివిగా ఆంధ్రదేశమందు ప్రచారము గావలసి యున్నది. ఇప్పటికిని ధారాళముగా హిందీ మాట్లాడువారు, ఉపన్యాసము లివ్వగలవారు చాల కొలదిమంది మాత్రమే కలరు. రాష్ట్రభాషాపరీక్షయందు ఉత్తీర్ణులయిన వారు సహితము పుస్తకములను జదివి అర్థము చేసికొనగలరే గాని మాట్లాడజాలకున్నారు. ఇందుకు కారణము హిందీవాతావరణము లేకుండుటయే గనుక ఆంధ్రదేశమునందు హిందీవాతావరణమును గల్పించిననే గాని భాష స్థాయిగా ప్రచారము కాజాలదు. ఈవాతావరణమును గల్పించుటకు వాగ్వర్ధినిసభలు, నాటకసమాజములు, వార్తాపత్రికలు తోడ్పడగలవు. ఈసాధనములనే హిందీప్రచారకులు భాషాభివృద్ధికి ద్విగుణితోత్సాహముతో కృషి చేయుదురు గాక"

కృష్ణాపత్రిక (౧౦-౧౧-౩౮)

హిందీప్రచారం విషయంలో యిలాంటి పరాకాష్ఠ హిందూస్థానీలకు గూడా వుంటుందని తోచదు. ఏమంటే? తెనుగు దేశంలో హిందీవాతావరణం వుండకపోవడమే సహజమని వారు తెలుసుకొనగలిగి వుంటారు. ఇంతే కాక: తమ దేశంలో హిందీవాతావరణం లేనందుకు వొక్క తెనుగువారు తప్ప మరెవ్వరూ వాపోరని కూడా వారు తెలుసుకుని వుంటారు. కనక వారేనా యిలాంటి రాతలు రాయడానికి సాహసించలేరు.

దక్షిణభారతానికీ, వుత్తరభారతానికీ సంబంధం, వుందా లేదా అన్నంతే. దక్షిణదేశభాషల కుటుంబం వేరూ, వుత్తరదేశభాషల కుటుంబం వేరూనూ, పైగా మాహమ్మదీయు లీఖండంలో లేనే లేరన్నంత తక్కువగా వున్నారు. ఉన్నవారేనా ప్రాంతీయభాషలు నేర్చుకోవలసిందే; కాని తమ వునికితో బయట నెలావణీ కాలేదు. మదరాసు బెంగళూర్లవంటి పట్టణాల్లో ప్రజ అక్కడి ప్రధానభాషల పరిసరాలనుంచి యింకా నే వున్నారు. అన్నిటికీ పైని భిన్నప్రాంతీయుల సంపర్కి యింగ్లీషు సర్వతోముఖంగా కలుస్తోంది. దానితో సకలవ్యవహారాలూ నిరాటంకంగా జరిగిపోతున్నాయి.

ఇలాగ—ఇన్ని కారణాలవల్ల దక్షిణభారతంలో హిందీప్రసక్తి లవలేశమూ లేదు.

ఇలాంటి స్థితిలో యిక్కడ—తెలుగు దేశంలో హిందీవాతావరణం కలిగించడం అంటే యేమున్నమాట?

ఇంగ్లీషు స్థానే హిందీని ప్రవేశపెడతామని హిందీప్రచారకులు ప్రజలకి ముఖపిధానం చేస్తున్నారు. మా ప్రయత్నాలు కూడా ఇంగ్లీషుని తగ్గించడానికే; కాని యిప్పుడింగ్లీషు అనుభవిస్తూ వున్న పదవి హిందీకి భుక్తపరచడానికి వల్లకాదు. ఇద్దరు తెనుగువాళ్లు ఇంగ్లీషు మాట్లాడుకోవడం తప్పంటే యీ నిషేధం హిందీకి కూడా తగిలిందే కాదూ! శాసనసభలలోనూ, న్యాయస్థానాలలోనూ, పాఠశాలలలోనూ, కళాశాలలలోనూ, కార్యస్థానాలలోనూ రాష్ట్రీయప్రభుత్వాల వ్యవహారా లన్నీ రాష్ట్రీయభాషల్లో జరగవలసినవే, ఇప్పుడివన్నీ ఇంగ్లీషులో జరుగుతూ వుండడం ఆక్షేపించి హిందీలో జరగడం ఆమోదిస్తామని యెవరూ అనుకోలేనక్కరలేదు. హిందూదేశానికి సామాన్యభాష హిందీ అయినా, మరోటయినా అది కేంద్రప్రభుత్వానికి మాత్రమే భాషగా వుండాలి.

ఇక బజార్లు. ఇప్పుడీ దేశపు బజార్లలో యెవరూ మూగలై వుండడం లేదు.

హిందీప్రచారకులు మాపగలిగిందల్లా, యిక వొక్క కాంగ్రెస్సు అయితే యిప్పుడు హిందీ

నేర్చుకుంటూ వున్న స్త్రీపురుషు లందరూ కాంగ్రెస్సును నడిపేవా రేనా?

హిందీప్రచారకులు ఇక్కడ హిందీవాతావరణం కలిగిస్తా మంటే తెనుగును చంపితేనే అది నెరవేరుతుంది. వీరు ఇంగ్లీషుని తాకడానికి కూడా— అసలా వుద్దేశమే వీరికి లేదు. వుండడమే ఐతే వీరు ఇంగ్లీషుని తగ్గించడానికీ, ఆపదవి దేశభాషలకి సంక్రమింపచెయ్యడానికీ పూనుకుని వుందురు. కాంగ్రెస్సుప్రముఖులూ, హిందీప్రచారకులూ చేస్తూ వున్న హిందీప్రచారం దక్షిణదేశభాషలను యెసరుపెట్టడానికీ, అనేక ప్రతిష్ఠానలు నడపడానికి వినియోగపడవలసిన డబ్బంతా దుర్వ్యయం కావడానికీ తప్ప రాజకీయప్రయత్నాల కేంత మాత్ర మూ సాయపడదు.

## అడుగు, ముందుకి కాదు కిందికి

అసలాంధ్రవిశ్వకళాపరిషత్తు గ్రంథరచనకి పోటీ యేర్పరచడమే బాగా లేదు. ఏమంటే? కవిత్వం ప్రోత్సహించ తగ్గది; కాని పోటీ పెట్ట తగ్గది కాదు. అనుభవించ తగ్గది; కాని పరీక్షించ తగ్గది కాదు. వొకరికి నచ్చిన కథాసరణి మరొకరికి నచ్చదు. వొకరికి జటిలంగా కనపడ్డ కథానిర్వహణం వేరొకరికి వదులు వదులుగా కనపడుతుంది. వొకరికి మృదువుగా తోచిన శైలి యింకొకరికి కటువుగా తోస్తుంది. వొకరికి మధురమధురంగా వున్న వర్ణనలు మరొకరికి చప్పచప్పగా వుంటాయి. కవిత్వం వున్న ప్రతీభాషలోనూ మొదణ్ణుంచీ వున్నదే యిదీ అంచేత యిది యిలా కాక, "తెనుగు భాషలో" ఫలానా ఫలానా తేదీలమధ్య ప్రకటించబడిన, ఫలానా ఫలానా రకాల గ్రంథాలలో మా దృష్టికి వుత్తమంగా తోచినవాటికి యింతింతేసి పారితోషికాలిస్తా" మని ప్రకటించి వుంటే నిరాక్షేపణీయంగా వుండేది. నోబుల్ బహుమానం పద్ధతి తెలిసివుండీ కూడా పరిషత్తు యీ పద్ధతి అవలంబించడం యేమంత సరసంగా లేదు.

అయినా, దేశంలో కొంతకి కొంత ప్రారంభమై వుంది కనక యీ పోటీపద్ధతి పక్షాంతరంగా అంగీకరించినా చివరికి పరిషత్తు తేల్చిన పర్యవసానం పెదవి విరవతగ్గటయిపోయింది.

తా నివ్వ తలుచుకున్న డబ్బంతా వొక్కమాటుగా నుండే యిచ్చేసినా అది నవలల మాట యెలా వుండినా శాస్త్రీయగ్రంథాల అచ్చుఖర్చులకు చాలదు. అలాంటప్పుడు అందులో సగంసగమే యివ్వడం—ఇంతే కాకుండా అసాధ్యనియమం వొకటి కల్పించి అది నెరవేరిస్తేనే తక్కిన సగమూ యిస్తాననడం గ్రంథకర్తలను బహూకరించడమూ కాదు. గౌరవించడమూ కాదు. విశ్వసించడం కానే కాదు.

పోనీ, సగం డబ్బు బిగపడితే గాని కర్తలు తమ గ్రంథాలను అచ్చువేయించి ప్రకటించ రని అనుమానించిన పరిషత్తు ఆయిచ్చిన సగ మేనా వారు అచ్చువేయించడానికే వినియోగిస్తా రని యెలా నమ్మగలిగిందీ? కర్తలు ఆగ్రంథాలు అచ్చువేయించి తనకి ఆరేసి ప్రతులు పంపితే గాని పరిషత్తు తలిమూ సగమూ యివ్వదు. సరే. అయితే యిచ్చిన సగమూ నష్టమే కాదూ!

ఆలాటి ఉద్గ్రంథాలు ప్రకటించబడకపోవడం వాఙ్మయానికీ, జాతికీ కూడా నష్టమే—అపకారం కూడా కాదూ?

ఏవో కొన్ని పుస్తకాలను ప్రకటిస్తూనే పరిషత్తు తానే పోటీ యేర్పరిచి, తానే ప్రోత్సహించి, తానే రాయించి, తానే పరిశీలించి, తానే ఉత్తమాధమత్వాలు నిర్ణయించి, తానే యోగ్యతాపత్రాలిచ్చి, తానే బహూకరించిన గ్రంథాలు తాను సొంతంగా ప్రకటించకపోవడం ప్రశంసాపాత్రం అవుతుందా?

మతానికి గొప్ప ఆశయంతో యీ పనికి పూనుకున్న పరిషత్తు సంకుచితదృష్టితో కాదు; గాని దూరాలోచన చెయ్యక చివరికి రసాభాసం చేసింది.

అయిందేదో అయిపోయింది అయితే యీ సంగతి ప్రజల కింకా బాగా తెల్లడి కాలేదు. కనక తొంటనే యింకో మాటు బాగా ఆలోచించి, ఆ గ్రంథాలను అతిశీఘ్రంగా—సొంతంగా ప్రకటించి గ్రంథకర్తల మనశ్శల్యాన్ని, సారస్వతప్రియుల అసంతృప్తినీ తొలగించడం చాలా మంచిది

## దీని కేం చెబుతారూ?

“హిందీని రాష్ట్రేతరవ్యవహారాలలోనే వాడతాం” మని “దానివల్ల తెనుక్కి అపకారం జరుగుతుం దనడం హాస్యాస్పదం” అని కాంగ్రెస్సువారూ, హిందీప్రచారకులూ చెబుతూ వుంటారు. ఈమధ్య గాంధిగారు కూడా హిందీ ప్రయోజనం అంతే అని సెల విచ్చారుట.

అయితే: ౨౪–౧౧–౩౮ తేదీని బందరు నగరీయసంఘసభలో “ఇక ముందు కౌన్సిలు మీటింగులో జరిగే చర్చలు తెలుగులో జరుపవలసినదిగా” అధ్యక్షులు ప్రతిపాదించగా, పెనుమర్తి లక్ష్మీపతి శాస్త్రిగారు “హిందీభాషలో కార్యక్రమము జరిపించవలసినదిగా” సవరణ తెచ్చారు.

ఇక్కడ “ఫలితం యేమిటి?” అని కాదు ప్రశ్న. తెనుగు దేశంలో, తెనుగు నగరంలో, తెనుగు వారు చేసే చర్చలు “తెనుగులో పనికి రాదు. హిందీలో జరిగించా” లని వొక అక్షరాలా తెనుగు పెద్దమనిషి సవరణ పెట్టడం యేమన్న మాట?

కాంగ్రెస్సువారూ, హిందీప్రచారకులూ ముఖపిధానం చెయ్యబోతే లాభం లేదు. తెనుగు వాడిలో తెనుగుతనం యింకా దృఢపడలేదు. ఇప్పుడు హిందీని నెత్తిమీద పెట్టుకుంటే తెనుక్కి నాశనం తప్పదు.

## మద్రాసులో తెనుగు......?

మనమున్న ఈ మద్రాసు [illegible] సువరాను వచ్చినప్పుడు స్త్రీలూ పురుషులూ కూడా అరవంలోనూ యింగ్లీషులోనూ వారి విన్నపత్రాలు సమర్పించారు.

తెనుగులో సమర్పించడానికి మాత్రం యెవరూ ముందుకి రాలేదు

ఏం?

ఇటీవల అసెంబ్లీ ఎన్నికల్లో సత్యమూర్తి గారిని నెగ్గించడానికి మదరాసులో వుండే తెనుగువారు చాలక, కాకినాడ మొదలు అటు అప్పటి తెనుగు పట్టణాలనుంచి కూడా కొందరు వెళ్లి వున్నారు; కాని అప్పు డెవరూ అలాంటి పని చెయ్యలే దేం?

అసలు టంగుటూరుగారిని సత్కరించాలని చెప్పినవారూ, పూనుకున్నవారూ తెనుగువారే కదా? పెట్టుబడి కూడా తెనుగువారికే యెక్కువగా పడిందే? విన్నపత్రాల్లో తెనుగుభాషకి చోటు లేకపోయిందేం?

తెనుగు భాష టంగుటూరి వారిని వినుతించడానికి పనికిరాదా? తెనుగువారి కీర్తి [illegible] యితరులకి దానాలా? [illegible] పంపలేదా!

మదరాసులో బంగాళీలు కొద్దిమంది మాత్రమే వున్నారు. అయినా వారు తమ ప్రత్యేకతను [illegible]డించుకున్నారు. అరవలు కూడా యెక్కడ వున్నా తమ వ్యక్తిత్వాన్ని నిలుపుకుంటారు. మదరాసులో [illegible] అందరికంటే తెనుగువారే యెక్కువ; కాని వారికి తెనుగు తనం......?

అదెక్కడుంది? “నేను, నాది” అనే భావాలే లేవు తెనుగువారికి.

అవును మరి. తెనుగువారు హిందీకోసం కొండలు పిండి కొడుతున్నారుగా? ఇక తెనుగెందుకూ?

ఛీ! తెనుగు ఎంత దిక్కుమాలిన స్థితిలో వుంది!